బ్రహ్మాండే, రామాయణ ఫలశ్రుతిః.

౧ చతుర్వింశ త్సహస్రీస్తు రామాయణ మతంద్రితః
యఃపఠే చ్ఛృణుయా ద్వాపి వైకుంఠ పదమశ్నుతే.

౨ రామాయణం స్తోత్రరత్నం యశ్శృణోతి పఠత్యపి
సీతా రామ ప్రసాదేన స సర్వం లభతేధ్రువమ్.

౩ రామాయణస్య మాహాత్మ్యం శృణువక్ష్యే ద్విజోత్తమ
రామాయణస్థ వర్ణస్య శ్రవణా ద్భూప్రదక్షిణమ్.

౪ కృతం సహస్రవారేణ యత్ఫలం తత్ఫలంలభేత్
ఉమాసంహితాయాం ఉమాంప్రతిశివోక్తిః.

౫ శృణ్వ న్రామాయణంభక్త్యా యఃపాదం పదమేవవా
సయాతి బ్రహ్మణస్థానం బ్రహ్మణా పూజ్యతేసదా.

౬ యఃకర్ణాంజలి సంపుటైరహరహ స్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిన్దగళితం రామాయణాఖ్యమ్మధు
జన్మవ్యాధి జరావిపత్తి మరణై రత్యన్తసోపద్రవమ్.
సంసారం సవిహాయగచ్ఛతి పుమాన్విష్ణోః పదంశాశ్వతమ్

౭ సకృద్రామాయణం శ్రుత్వా త్వపుత్రః పుత్రవా న్భవేత్.
రామాయణం పఠేద్యస్తు తస్యగేహే రమాపతిః

౮ వాచిబ్రహ్మాహ్యహం చిత్తే సత్యమేవ వసామ్యహమ్.
తస్యాక్షిణీ హరిశ్చంద్రో రోమకూపేషు దేవతాః

౯ ఏతద్వినా న్యశ్రవణం యఃకుర్వీత నరాధమః
స నారకీతివిజ్ఞేయః సత్యమేత ద్బ్రవీమితే.

౧౦ రామాయణమహాపుణ్యకథా యత్ర ప్రవర్తతే
తత్రాపి యోజనశతం పవిత్రమితి గద్యతే.

~×~×~

౫౭

# శ్రీమద్రామాయణే * యుద్ధకాండప్రారంభః.



శ్రుత్వా హనుమతో వాక్యం యథావ దభిభాషితమ్
రామః ప్రీతిసమాయుక్తో వాక్య ముత్తర మబ్రవీత్.



యశోకవనభంగాద్యమానుషకార్యంబులు గావించి, మఱలి, వచ్చిన, హనుమంతుండు, చూడామణినొసంగివిన్నవించిన సీతావృత్తాంతంబు నాలకించి, రాముండు, పరమసంతుష్టుండై, కృతకృత్యుండగుభృత్యునివిషయమయి స్వామియాచరింపవలసినపద్ధతిం దెల్పుచు, సుగ్రీవాదులకునుత్సాహంబు సేయుచుఁ, ప్రియావృత్తాంతంబుఁ దెచ్చిన హనుమంతుం గౌరవించుచున్నాఁడు.—

టీక॥ రామః = రాముఁడు; హనుమతః = హనుమంతునియొక్క; అభిభాషితం = చెప్పఁబడిన; వాక్యం = మాటను; యథావత్ = అంతయు; శ్రుత్వా = విని; ప్రీతిసమాయుక్తః = సంతోషముతోఁగూడినవాఁడై; ఉత్తరం = ప్రత్యుత్తరముగఁజెప్పవలసిన; వాక్యం = మాట అబ్రవీత్ = చెప్పెను.

రాముండు, హనుమంతుఁడు, విన్నవించినవృత్తాంతమునంతయువిని, పరమసంతుష్టుండై, పరమప్రియుఁడగు తనభృత్యునకు, చెప్పినవానికి, ఏమాటం జెప్పవలయునో, అట్టిమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము — ఈశ్లోకమునందు, "శ్రుత్వా హనుమతః" అనుస్థలమునందు "మ" అనునక్షరముచే, గాయత్రీపదమునందలియక్షరము గ్రహింపఁబడినది. పదునాలుగు వేలగ్రంథములయినవి. ఇంకఁ బదునైదవగ్రంథసహస్రం బారంభింపఁబడుచున్నది.

కృతం హనుమతా కార్యం సుమహ ద్భువి దుర్లభమ్
మనసాపి యద న్యేన న శక్యం ధరణీతలే. ౨

హనుమతా = హనుమంతునిచే | చుటకై నను; శక్యం న = అలవికాక = మిక్కిలియుగొప్పది | తత్ (అధ్యాహృతము) — అం
భూమియందు; దుర్ల



పూజితం సర్వదేవైశ్చ రాక్షసాంతం నమామ్యహమ్
అచలద్యుతి సఙ్కాశం సర్వాలఙ్కార భూషితమ్
షడక్షరస్థితం దేవం నమామి కపినాయకమ్
తప్తస్వర్ణమయం దేవం హరిద్రాభం సురార్చితమ్
సుందరం సాబ్జనయనం త్రినేత్రం తం నమామ్యహమ్
అష్టాక్షరాధిపం దేవం హీరవర్ణసముజ్జ్వలమ్.
నమామి జనతావంద్యం లఙ్కాప్రాసాదభంజనమ్
అతసీపుష్ప సఙ్కాశం దశవర్ణాత్మకం విభుమ్.
జటాధరం చతుర్బాహుం నమామి కపినాయకమ్
ద్వాదశాక్షర మంత్రస్య నాయకం కుంతధారిణమ్.
అఙ్కుశఞ్చ దధానఞ్చ కపివీరం నమామ్యహమ్
త్రయోదశాక్షరయుతం సీతాదుఃఖనివారణమ్.
పీతవర్ణం లసత్కాయం భజే సుగ్రీవమంత్రిణమ్
మాలామంత్రాత్మకం దేవం చిత్రవర్ణం చతుర్భుజమ్.
౩ పాశాఙ్కుశాభయకరం ధృతటఙ్కం నమామ్యహమ్
సురాసుర గణైస్సర్వైః స్సంస్తుతం ప్రణమామ్యహమ్.
౪ ఏవం ధ్యాయేన్నరో నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే
ప్రయాతి చింతితం కార్యం శీఘ్రమేవ న సంశయః.
అష్టమ్యాం వా చతుర్దశ్యాం మన్దవారే విశేషతః
సంధ్యాపూజాం ప్రకుర్వీత ద్వాదశ్యాఞ్చ విశేషతః.
౭ అర్కమూలేన కుర్వీత హనుమత్ప్రతిమాం సుధీః
జపేత్ తత్ర విద్వాన్ యో రక్తవస్త్రేణ వేష్టయేత్.
ప్రాణాన్ప్రజయేత్పశ్చాత్ తత్ప్రీత్యై సర్వకామదామ్
... పూజాం హనుమతస్సుధీః.
వాహ్యంతరిక్షజమ్

మాంరక్షరక్షపరితో రిపుదుఃఖపుంజాత్
వశ్యాం కురుత్రిజగతీం వసుధాధిపానామ్
మే దేహి దేహి మహతీం వసుధాంశ్రియంచ.

౨౧ ఆపద్భ్యో రక్ష సర్వత్ర ఆంజనేయ నమోస్తుతే
బంధనం ఛేదయాజస్రం కపివీర నమోస్తుతే.

౨౨ దుష్టరోగాన్ హనహన రామదూత నమోస్తుతే
ఉచ్చాటయరిపూన్ సర్వాన్ మోహనం కురుభూభుజామ్.

౨౩ విద్వేషిణో మారయత్వం త్రిమూర్త్యాత్మక సర్వదా
సంజీవపర్వతోద్ధార మనోదుఃఖం నివారయ.

౨౪ ఘోరానుపద్రవాన్ సర్వాన్ నాశయాక్షాసురాన్తక
ఏవం స్తుత్వా హనూమన్తం నరశ్శ్రద్ధా సమన్వితః.

౨౫ పుత్రపౌత్రాదిసహితో సర్వసౌఖ్య మవాప్నుయాత్

ఇత్యుమాసంహితాయాం ఆంజనేయ
స్తోత్రంసమ్పూర్ణం.



అధమభృత్యునిఁగానను; అహుః=చె
ప్పుచున్నారు.

ఎవ్వఁడు, ఎచ్చరికగలవాఁడు ను
త్సాహవంతుండును సమర్థుఁడునై
యుండియుతనకాజ్ఞాపించిన కార్యము
నైనను, చేయకుండునో, అతండు,
అధమభృత్యుండందురు.

అని, తాత్పర్యము.

తస్మిన్నియోగే నియుక్తేన కృతం కృత్యం హనూమతా
నచాత్మా లఘుతాం నీత స్సుగ్రీవశ్చాపి తోషితః. ౧౧

టీక॥నియోగే=కార్యమునందు; ని
యుక్తేన=ఆజ్ఞాపింపఁబడిన; హనూమ
తా=హనుమంతునిచేత; తత్= అట్టి;
కృత్యం=కార్యము; కృతం=చేయఁబడి
నది. ఆత్మా=తానును;లఘుతాం=చుల
కఁదనమును;ననీతః=పొందించుకొనఁబడ
లేదు. సుగ్రీవశ్చాపి= సుగ్రీవుండును;
తోషితః = సంతోషింపఁజేయఁబడి
నాఁడు.

అట్లుహనుమంతుండు,తనకాజ్ఞాపిం
చినకార్యంబుసాధించుటయె గాక, త
దనుకూలంబులగు నశోకవనభంగమున
క్షాదిసంహారము లంకాదహనము మొ
దలగు ననేకకార్యములు చేసినాఁడు ;
కావునఁ, దనకును లాఘవంబుగలిగిం
చుకొనలేదు, సుగ్రీవునకును మిక్కిలి
యుసంతోషంబు గలుగఁజేసినాఁడు.

అని, తాత్పర్యము.

అహంచ రఘువంశశ్చ లక్ష్మణశ్చ మహాబలః. ౧౨
వైదేహ్యా దర్శనేనాద్య ధర్మతః పరిరక్షితాః

టీక॥అద్య=ఇప్పుడు; అనేన(అధ్యా
హృతము)= ఈహనుమంతునిచేత;వై
దేహ్యాః=సీతయొక్క; దర్శనేన=చూ
చుటచేత;అహంచ=నేనును; రఘువంశ
శ్చ=రఘువంశమును;మహాబలః=అధిక
మయినబలముగలఁ;లక్ష్మణశ్చ = లక్ష్మ
ణుండును; ధర్మతః=ధర్మమునందు;
పరిరక్షితాః=కాపాడఁబడినాము.

ఇప్పుడీహనుమంతుండు సీతంజూచి
వచ్చుటచేత, నేనును, మహాబలుండగుల
క్ష్మణుండును, రఘువంశంబునఁబుట్టిన
వారలందఱు, ఆత్మహత్యాదోషంబు
నొందక, ధర్మంబు నొందిసుఖంబున
నుండునట్లేర్పడినది. అని,తాత్పర్యము.

ఇదంతు మమ దీనస్య మనో భూయః ప్రకర్షతి. ౧౨
యదిహాస్య ప్రియాఖ్యాతు ర్న కుర్మి సదృశం ప్రియమ్

టీక॥ఇహ = ఇప్పుడు;ప్రియాఖ్యాతుః=ప్రియంబు చెప్పునట్టి;అస్య=ఈహనుమంతునకు;సదృశం = సరియయిన; ప్రియం = సంతోషమును;నకుర్మి(కరోమి)(ఇతి)యత్=చేయకున్నాననునదియేదిగలదో;ఇదంతు = ఇదిమాత్రము;దీనస్య = దుఃఖితుండనగు;మమ=నాయొక్క;మనః = మనసును; భూయః=పలుమాఱు; ప్రకర్షతి=ఈడ్చుచున్నది.

ఇప్పు, డిట్టిప్రియవార్తం జెప్పిన యీ హనుమంతునకుందగునట్లు, ప్రియంబు సేయకున్నానేయనునదిమాత్రము, నామనంబునకుమిక్కిలియుదుఃఖంబుగలిగించుచున్నది. అని, తాత్పర్యము.

ఏష సర్వస్వభూతస్తు పరిష్వంగో హనూమతః. ౧౩
మయా కాల మిమం ప్రాప్య దత్త స్తస్య మహాత్మనః

టీక॥ మయా=నాచేత; ఇమం = ఈ; కాలం=కాలమును; ప్రాప్య = పొంది; తస్య=అట్టి; మహాత్మనః = పూజ్యమయినపరాక్రమంబుగల; హనూమతః=హనుమంతునకు; దత్తః= ఇయ్యఁబడిన; ఏషః= ఈ; పరిష్వంగస్తు=కౌఁగలియే ; సర్వస్వభూతః = సర్వస్వదానమయినది ; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక.

సీతనునన్నును మాయిద్దఱిని గాపాడిమహోపకారంబుఁ జేసినట్టిమహాపరాక్రమశాలియగు హనుమంతునకు, ఏమియొసంగిన దీరును?సర్వస్వం బొసంగినంగానితీరదు ; కావున , నిట్టికాలంబున నిమ్మహాత్మునకు , నే నొసంగు నాలింగనంబె, సర్వస్వప్రదానంబగుఁగాక. అని, రాముండు , చెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యు క్త్వా ప్రీతిహృష్టాంగో రామ స్తం పరిషస్వజే. ౧౪
హనూమంతం మహాత్మానం కృతకార్య ముపాగతమ్

టీక॥ రామః=రాముఁడు; ఇతి = ఇట్లు; ఉక్త్వా = చెప్పి; ప్రీతిహృష్టాం

స ౧

గః = సంతోషముచేగగుపాటునొందినదేహముగలవాడై; మహాత్మానం = పూజ్యమయినపరాక్రమము గలవాడును; కృతకార్యం = చేయఁబడినకార్యముగలవాడును; ఉపాగతం = వచ్చినవాడునగు; తం = ఆ; హనూమంతం = హనుమంతుని; పరిషస్వజే = కవుఁగలించుకొనెను.

రాముండిట్లు, చెప్పి, సంతోషంబుచేఁబులకాంకిత దేహుండై, సీతాదేవింజూచివచ్చినట్టి మహాపరాక్రమశాలియగు హనుమంతుం గవుఁగిలించుకొనెను. అని, తాత్పర్యము.

ధ్యాత్వా పునరువాచేదం వచనం రఘునందనః. ౧౫
హరీణామీశ్వరస్యైవ సుగ్రీవస్యోప శృణ్వతః

టీక॥ రఘునందనః = రాముండు; ధ్యాత్వా - ఆలోచించి; పునః - మఱల; హరీణాం = వానరులకు; ఈశ్వరస్య = ప్రభుండగు; సుగ్రీవస్య = సుగ్రీవుండు; ఉపశృణ్వతఏవ = వినుచుండఁగానే; ఇదం = ఈ; వచనం = మాటను; ఉవాచ = చెప్పెను.

రాముండు, కొంచెమాలోచించి, మఱల, వానరాధీశ్వరుండగు సుగ్రీవుండు వినుచుండఁగానే, యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

సర్వథా సుకృతం తావత్సీతాయాః పరిమార్గణమ్. ౧౬
సాగరం తు సమాసాద్య పునర్నష్టం మనో మమ

టీక॥ సీతాయాః = సీతయొక్క; పరిమార్గణం తావత్ = వెదకుటమాత్రము; సర్వథా = అన్నివిధములను; సుకృతం = చక్కఁగాఁ జేయఁబడినది. సాగరం = సముద్రమును; సమాసాద్యతు = పొందిమాత్రము; పునః = మఱల; మమ = నాయొక్క; మనః = మనసు; నష్టం = నశించినది.

సీతను వెదకువిషయమునందుమాత్రము, అన్నివిధంబులను, మంచిప్రయత్నమే చేసి, కార్యసాధనము నొందితిమి; సముద్రంబుదలంచినంతనె, నామనసునకు మిక్కిలియుభయంబుగలుగుచున్నది. అని, తాత్పర్యము.

కథంనామ సముద్రస్య దుష్పారస్య మహాంభసః. ౧౭
హరయో దక్షిణం పారం గమిష్యంతి సమాహితాః

టీక॥ హరయః = వానరులు; సమాహితాః = కూడినవారలయి; దుష్పారస్య = దాటఁగూడనిదియు; మహాంభసః = అధికమయినజలముగలదియయునగు; సముద్రస్య = సముద్రముయొక్క; దక్షిణం = దక్షిణపుదిక్కునందలి; పారం = గట్టును; కథంనామ = ఎట్లు; గమిష్యంతి = పొందఁగలరు?

వానరులందఱు నొక్కటిగాఁజేరి, దాటఁగూడని మహాసముద్రంబు దాఁటి, దానిదక్షిణపుగట్టునెట్లు పొందఁగలరుః అని, తాత్పర్యము.

యద్యప్యేషతు వృత్తాంతో వైదేహ్యా గదితో మమ. ౧౮
సముద్రపారగమనే హరీణాం కిమివోత్తరమ్

టీక॥ మమ = నాయొక్క; ప్రియాయాః (అధ్యాహృతము) = ప్రియురాలగు; వైదేహ్యాః = సీతకు; ఏషః = ఈ; వృత్తాంతస్తు = సమాచారమును; గదితో యద్యపి = చెప్పఁబడినదే; హరీణాం = వానరులయొక్క; సముద్రపారగమనే = సముద్రపుగట్టుపొందుటయందు; ఉత్తరం = ఉత్తరము; కిమివ = ఏమి?

నా ప్రియురాలగు సీతాదేవికి విషయమందు, సమాధానముచెప్పఁబడియే యున్నది. అయినను, వానరులు సముద్రము దాఁటుటకేమి యుపాయమున్నది? చెప్పుము అని, రాముఁడు చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా శోకసంభ్రాంతో రామ శ్శత్రునిబర్హణః. ౧౯
హనుమంతం మహాబాహు స్తతో ధ్యాన ముపాగమత్

టీక॥ శత్రునిబర్హణః = శత్రువులఁజంపువాఁడును; మహాబాహుః = పెద్దచేతులుగలవాఁడునగు; రామః = రాముఁడు; ఇతి = ఇట్లు; హనుమంతం = హనుమంతునిగూర్చి; ఉక్త్వా = చెప్పి; తతః = అటుపిమ్మట, శోకసంభ్రాంతః = దుఃఖముచేభ్రమణమునొందినవాఁడై; ధ్యానం = ఆలోచనమును; ఉపాగమత్ = పొందెను.

శత్రువులజంపువాఁడును మహాబా

హుండునగు రాముండు, హనుమంతుం జూచి, యిట్లు, చెప్పి, పరమదుఃఖితుండై, చింతింపుచుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ప్రథమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండప్రథమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

ద్వితీయసర్గప్రారంభః.

తంతు శోకపరిద్యూనం రామం దశరథాత్మజమ్
ఉవాచ వచనం శ్రీమాన్ సుగ్రీవ శ్శోకనాశనమ్. ౧

టీక॥ శ్రీమాన్ = అధికమయినసంపదగల; సుగ్రీవః = సుగ్రీవుండు; శోకపరిద్యూనం = దుఃఖముచేనుడిగినవాండును; దశరథాత్మజం = దశరథునికుమారుండునగు; తం = ఆ; రామంతు = రామునిగూర్చియె; శోకనాశనం = దుఃఖముంబోంగొట్టునట్టి; వచనం = మాటను; ఉవాచ = చెప్పెను.

అంత, శ్రీమంతుండగుసుగ్రీవుండు, దుఃఖితుండైయున్న దశరథపుత్రుండయిన రాముంజూచి, యతనిదుఃఖంబుపోవునట్లు, ఈమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

కిం త్వం సంతప్యసే వీర యథాన్యః ప్రాకృత స్తథా
మైవం భూ స్త్యజ సంతాపం కృతఘ్న ఇవ సౌహృదమ్. ౨

టీక॥ వీర = పరాక్రమశాలివగురాముండా? అన్యః = ఇతరుండగు; ప్రాకృతః = మూఢుండు; యథా = ఎట్లో; తథా = అట్లు; త్వం = నీవు; కిం =




ఎందుకు ; సంతప్యసే = పరితపించుచున్నావు? ఏవం=ఇట్లు; మాభూః=కావలదు. కృతఘ్నః = చేయఁబడినయుపకారమును మఱచువాఁడు; సౌహృదమివ=స్నేహమునువలె; సంతాపం= దుఃఖమును; త్యజ=విడువుము.

పరాక్రమ శాలివగు రామఁడా! ప్రాకృతునియట్లు, నీవును, బరితపించుచున్నావేల? ఇట్లుండవలదు; కృతఘ్నుండు, స్నేహంబును వదలునట్లు, దుఃఖంబును విడువుము. అని, తాత్పర్యము.

సంతాపస్యచ తే స్థానం నహిపశ్యామి రాఘవ
ప్రవృత్తా వుపలబ్ధాయాం జ్ఞాతేచ నిలయే రిపోః. ౩

టీక॥ రాఘవ= రామఁడా! ప్రవృత్తౌ = సమాచారము ; ఉపలబ్ధాయాం= తెలియఁబడినదగుచుండఁగా ; రిపోః=శత్రువుయొక్క; నిలయేచ — ఉనికిపట్టును ; జ్ఞాతే= తెలియఁబడినదగుచుండఁగా ; తే=నీకు ; సంతాపస్య=దుఃఖమునకు; స్థానం=కారణమును; నపశ్యామిహి=చూడను.

సీతాదేవివృత్తాంతంబును శత్రునివాసస్థలంబును దెలిసినపిదప , నీకు దుఃఖముగలుగుటకెంతమాత్రము కారణము, నాకుఁదోఁచలేదు.

అని, తాత్పర్యము.

మతిమాన్ శాస్త్రవిత్ప్రాజ్ఞో పండితశ్చాసి రాఘవ
త్యజేమాం పాపికాం బుద్ధిం కృతాత్మే వార్థదూషణీమ్. ౪

టీక॥ రాఘవ=రామఁడా! త్వం= నీవు; మతిమాన్ = భవిష్యత్సంగతి నాలోచించుశక్తిగలవాఁడవును; శాస్త్రవిత్= నీతిశాస్త్రము నెఱింగినవాఁడవును; ప్రాజ్ఞః= ఊహాపోహాలు దెలిసినవాఁడవును; పండితశ్చ= అర్థతత్వనిర్ణయముగలవాఁడవును; అసి= అగుచున్నావు. కృతాత్మా= చేయఁబడినయాత్మగల (ధ్యానింపఁబడినయాత్మగలననుట) యోగి; అర్థదూషణీం= మోక్షరూపపురుషార్థమును దూషించునట్టి; బుద్ధిం (అధ్యాహృతము) ఇవ=బుద్ధినివలె; ఇమాం=ఈ; పాపికాం=పాపిష్ఠమయిన, ఉత్సాహమును జెఱుపునట్టియను




ట; బుద్ధిం=బుద్ధిని;త్యజ=విడువుము.

నీవు,భవిష్యత్సమాచారంబునాలోచించువాఁడవు;నీతిశాస్త్రంబుఁదెలిసినవాఁడవు;ఊహాపోహలయందుసమర్థుండవు;పండితుండవు; యోగియగువాఁడు మోక్షప్రాప్తిబాధకంబగుబుద్ధిఁవిడుచునట్లు;నీవీయుత్సాహబాధకబుద్ధినివిడువవలయును. అని, తాత్పర్యము.

సముద్రం లంఘయిత్వాతు మహానక్రసమాకులమ్
లంకా మారోహయిష్యామో హనిష్యామశ్చ తే రిపుమ్. ౫

టీక॥వయం(అధ్యాహృతము)=మేము;మహానక్రసమాకులం = పెద్దమొసళ్లచేనిండిన; సముద్రం=సముద్రమును; లంఘయిత్వాతు = దాఁటియు; లంకాం = లంకాపురిని;ఆరోహయిష్యామః= ఎక్కెదము. తే=నీయొక్క; రిపుంచ = శత్రువును; హనిష్యామశ్చ= చంపెదము

మేము,మహానక్రాదులచేనిండినసముద్రంబునుదాఁటి,లంకాపురికోటలపైకెక్కి-నీశత్రువును రావణునింజంపెదము.
అని, తాత్పర్యము.

నిరుత్సాహస్య దీనస్య శోకపర్యాకులాత్మనః
సర్వార్థా వ్యవసీదంతి వ్యసనంచాధిగచ్ఛతి. ౬

టీక॥నిరుత్సాహస్య = ఉత్సాహములేనివాఁడును; దీనస్య=దైన్యము గలవాఁడును; శోకపర్యాకులాత్మనః = దుఃఖముచేఁగలఁతఁజెందిన మనసుగలవాఁడువగు పురుషునియొక్క; సర్వార్థాః=సమస్తకార్యములును; వ్యవసీదంతి= చెడుచున్నవి. సః(అధ్యాహృతము)= అతండు;వ్యసనంచ= కష్టమును; అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

ఎల్లప్పుడునుదుఃఖంబు నవలంబించియుండువానికి, దుఃఖంబువలన, దైన్యంబుగల్గి, దాననుత్సాహనాశంబును,అందువలన సమస్తకార్యహానియుఁగల్గును; అంత, వతనికిదుఃఖంబుమాత్రమెగాక, గొప్పయాపదయుసంభవించును. అని, తాత్పర్యము.

ఇమే శూరా స్సమర్థాశ్చ సర్వే నో హరియూథపాః

స ౨

త్వత్ప్రియార్థం కృతోత్సాహాః ప్రవేష్టుమపి పావకమ్. ౭

టీక॥శూరాశ్చ= యుద్ధమునందుభయములేనివారలును;సమర్థాశ్చ= సమర్థులునగు;నః=మనయొక్క;ఇమే= ఈ;హరియూథపాః= వానరసేనానాయకులు;సర్వే = అందఱును;త్వత్ప్రియార్థం=నీసంతోషముకొఱకు;పావకం=అగ్నిహోత్రమును;ప్రవేష్టుమపి= ప్రవేశించుటకైనను; కృతోత్సాహాః= చేయఁబడినయుత్సాహముగలవారలు.

శూరులును, ఉపాయంబులం బండితులునగు, మనవానరశ్రేష్ఠులందఱును, నీసంతోషంబునకై యగ్నిహోత్రముఁ జొచ్చుటకైనను,సిద్ధులైయున్నారు.

అని, తాత్పర్యము.

ఏషాం హర్షేణ జానామి తర్కశ్చాస్మిన్ దృఢో మమ

టీక॥ఏషాం=ఈవానరులయొక్క; హర్షేణ=సంతోషముచేత; జానామి= తెలుసుకొనుచున్నాను.అస్మిన్= ఈవిషయమునందు;మమ=నాయొక్క; తర్కశ్చ=ఊహయు;దృఢః=స్థిరమయినది.

ఈవానరులసంతోషంబుచూడఁగా వీరలకట్టియుత్సాహంబుగలదని,నాకుఁ దెలిసి యున్నది ; ఈవిషయమునందు నేనుజెప్పినదియథార్థము.

అని, తాత్పర్యము.

విక్రమేణ సమానేష్యే సీతాం హత్వా యథారిపుమ్. ౮
రావణం పాపకర్మాణం తథా త్వం కర్తుమర్హసి

టీక॥యథా=ఎట్లు;అహం(అధ్యాహృతము)=నేను;విక్రమేణ= పరాక్రమముచేత; రిపుం= శత్రువయిన;పాపకర్మాణం= పాపంబులగుకార్యములుగల;రావణం=రావణుని;హత్వా= చంపి;సీతాం = సీతాదేవిని;సమానేష్యే=తెత్తునో;తథా=అట్లు; త్వం=నీవు;కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

నేనుబరాక్రమంబునఁ, బాపిష్ఠుండగుశత్రువును రావణుంజంపి, సీతాదేవిందెచ్చునట్లు,నీవును, మిక్కిలియు నుత్సాహంబు నవలంబించి యుండవలయును. అని, తాత్పర్యము.

సేతు రత్ర యథా బధ్యే ద్యథా పశ్యేమ తాం పురీమ్. ౯
తస్య రాక్షసరాజస్య తథా త్వం కురు రాఘవ

టీక॥ రాఘవ= రాముఁడా! యథా=ఎట్లు; అత్ర= ఈసముద్రమునందు; సేతుః=కట్ట; బధ్యేత్(బధ్యేత)- కట్టఁబడునో; యథా=ఎట్లు; రాక్షసరాజస్య = రాక్షసేశ్వరుండగు; తస్య = ఆరావణునియొక్క; తాం = ఆ; పురీం=లంకాపట్టణమును; పశ్యేమ= చూతుమో; తథా = అట్లు; త్వం=నీవు; కురు=చేయుము.

రాముఁడా! సముద్రంబునందు, సేతువుగట్టునట్లును, మనము రాక్షసేశ్వరుండగు రావణునిలంకాపట్టణంబును జూచునట్లును, నీవాలోచింపుము.

అని, తాత్పర్యము.

దృష్ట్వాతు తాం పురీం లంకాం త్రికూటశిఖరే స్థితామ్. ౧౦
హతంచ రావణం యుద్ధే దర్శనా దుపధారయ

టీక॥ త్రికూటశిఖరే= త్రికూటపర్వతశిఖరమునందు; స్థితాం =ఉన్నట్టి; తాం=ఆ; పురీం=లంకాపట్టణమును; దృష్ట్వాతు=చూచినంతనే; దర్శనాత్= చూచుటవలన; రావణం=రావణుని; యుద్ధే=యుద్ధమునందు; హతం=చంపఁబడినవానిఁగా; ఉపధారయ= నిశ్చయించుకొనుము.

త్రికూటపర్వతశిఖరంబునఁబ్రతిష్ఠితమయియున్న యాలంకాపట్టణముఁజూచినం జాలును; అంత, రావణుండుయుద్ధంబునం జంపఁబడినట్టె నిశ్చయింపవచ్చును.

అని, తాత్పర్యము.

అబద్ధ్వా సాగరే సేతుం ఘోరే తు వరుణాలయే. ౧౧
లంకా న మర్దితుం శక్యా సేంద్రైరపి సురాసురైః

టీక॥ ఘోరే=భయంకరమయినదియు; వరుణాలయే= వరుణదేవునియునికిపట్టయిదినయునగు; సాగరే=సముద్రమునందు; సేతుం = కట్టను; అబధ్వాతు=కట్టకయే; సేంద్రైః= ఇంద్రునితోఁగూడిన; సురాసురైరపి= దేవా

సురులచేతను; లంకా=లంకాపట్టణము; మర్దితుం—మర్దించుటకు; నశక్యా= అలవికాదు.

భయంకరంబగు సముద్రంబునందు సేతువుగట్టక, దేవేంద్రసహితులగు దేవాసురులయినను, లంకాపురిం దేఱి చూడఁజాలరు. అని, తాత్పర్యము.

సేతు ర్బద్ధ స్సముద్రేచ యావ ల్లంకాసమీపతః. ౧౨
సర్వం తీర్ణంచ వై సైన్యం జిత మిత్యుపధారయ

టీక॥ యావత్=ఎంతకాలమునకు; సముద్రే-సముద్రమునందు; లంకాసమీపతః- లంకాసమీపమునందు; సేతుశ్చ=సేతువుమాత్రము; బద్ధః- కట్టబడినదో; తావత్ (అధ్యాహృతము) = అంతకాలమునకు; సర్వం = సమస్తమయిన; సైన్యం—సైన్యమును; తీర్ణం= దాఁటినది. జితంచ— జయించినదియు. ఇతి= అని; ఉపధారయ—నిశ్చయించుము.

లంకవఱకు, సముద్రంబున, సేతువుగట్టిన క్షణంబుననె, యీవానరసైన్యంబంతయు, సముద్రంబు దాఁటి, జయంబునుంబొందినదని, యెంచుకొనుము. అని, తాత్పర్యము.

ఇమే హి సమరే శూరా హరయః కామరూపిణః. ౧౩
శక్తా లంకాం సమానేతుం సముత్పాట్య సరాక్షసామ్

టీక॥ సమరే=యుద్ధమునందు; శూరాః—శూరులును; కామరూపిణః = ఇచ్ఛాధీనమగురూపముగలవారలునగు; ఇమే=ఈ; హరయః=వానరులు; సరాక్షసాం=రాక్షసులతోఁగూడిన; లంకాం— లంకాపురిని; సముత్పాట్య=పెల్లగించి; సమానేతుం—తెచ్చుటకు; శక్తాహి=సమర్థులుగదా!

యుద్ధంబునందు శూరులును గామరూపులునగు నీవానరులు, లంకాపట్టణమును రాక్షసులతోఁ గూడఁబెల్లగించి తెచ్చుటకును, శక్తులయియున్నారు.

అని, తాత్పర్యము.

తదలం విక్లబా బుద్ధీ రాజ న్సర్వార్థనాశినీ. ౧౪
పురుషస్య హి లోకేఽస్మి  ఞ్ఛోక శ్శౌర్యాపకర్షణః

టీక॥ రాజన్=రాజా! తత్=అందువలన; సర్వార్థనాశినీ= సమస్తకార్యంబులను నశింపఁజేయునట్టి; విక్లబా=దుఃఖితయగు; బుద్ధిః= బుద్ధి; అలం=వలదు. అస్మిన్=ఈ; లోకే = లోకమునందు, శోకః=దుఃఖము; పురుషస్య=పురుషునకు; శౌర్యాపకర్షణో హి = శౌర్యమును తగ్గించునదిగదా!

రాజా! అందువలన, సమస్తకార్యంబులను నశింపఁజేయునట్టి యీ దుఃఖంబును వదలుము; లోకంబునందంతటఁ బురుషుండు, దుఃఖము నొందునేని, అతని శౌర్యము నశించును.

అని, తాత్పర్యము.

యత్తు కార్యం మనుష్యేణ శౌండీర్య మవలంబతా. ౧౫
అస్మిన్ కాలే మహాప్రాజ్ఞ సత్త్వ మాతిష్ఠ తేజసా

టీక॥ మహాప్రాజ్ఞ = మహాపండితుఁడవగు రాముఁడా; శౌండీర్యం = శౌర్యమును; అవలంబతా = అవలంబించునట్టి; మనుష్యేణ= మనుష్యునిచేత; యత్తు=ఏదిమాత్రము; కార్యం= చేయఁదగినదో; అస్మిన్ = ఈ; కాలే=కాలమునందు; తత్ (అధ్యాహృతము)=అట్టి; సత్త్వం=ధైర్యమును; తేజసా=పరాక్రమముతో; ఆతిష్ఠ = అవలంబింపుము.

మహాపండితుఁడవగు రాముఁడా! శౌర్యమె ప్రధానముగాఁ గలపురుషుండు, దేనివదలకుండవలయునో, అట్టి ధైర్యంబును పరాక్రమంబును, అవలంబించియుండుము. అని, తాత్పర్యము.

శూరాణాం హి మనుష్యాణాం త్వద్విధానాం మహాత్మనామ్. ౧౬
వినష్టేవా ప్రణష్టేవా శోక స్సర్వార్థనాశనః

టీక॥ త్వద్విధానాం=నీయట్టివారలును; శూరాణాం= యుద్ధమునందు భయములేనివారలును; మహాత్మనాం = పూజ్యమయిన స్వభావముగలవారలునగు; మనుష్యాణాం= మనుష్యులకు; వినష్టే వా= అగపడకుండుదాని విషయమందుఁగాని; ప్రణష్టే వా = నశించినదాని విషయమందుఁగాని; శోకః = దుఃఖము; సర్వార్థనాశనో హి= సమస్తకార్యములనశింపఁజేయునదిగదా!

నీయట్టిశూరులును మహాత్ములునగు పురుషులు, అగపడకుండుదానివిషయముయి గాని, నశించినదాని విషయమైగాని యేవిషయమందును, ఎంతమాత్రము, దుఃఖము నొందఁగూడదు ; అట్లుదుఃఖము నొందితేని, సమస్తకార్యంబులును జెడును. అని, తాత్పర్యము.

త్వంతు బుద్ధిమతాం శ్రేష్ఠ స్సర్వశాస్త్రార్థకోవిదః. ౧౭
మద్విధై స్సచివై స్సార్ధ మరిం జేతు మిహార్హసి

టీక॥ త్వంతు=నీవును; బుద్ధిమతాం= బుద్ధిమంతులలో; శ్రేష్ఠః = ఉత్తముండవు; సర్వశాస్త్రార్థకోవిదః=సమస్తములయిన శాస్త్రార్థముల యందును బండితుండవు; మద్విధైః=నాయట్టివారలగు; సచివైస్సార్ధం = సహాయులతోఁగూడ; ఇహ= ఇప్పుడు; అరిం= శత్రువును; జేతుం= జయించుటకు ; అర్హసి=తగుదువు.

నీవు, సమస్తబుద్ధిమంతులలోను నుత్తముఁడవు; సమస్తములయిన శాస్త్రార్థమును దెలిసినవాఁడవు; మఱియు, నాయట్టి సహాయులఁగూడి, యిప్పుడు, శత్రువును వధింపుము.

అని, తాత్పర్యము,

నహి పశ్యామ్యహం కంచి త్త్రిషు లోకేషు రాఘవ. ౧౮
గృహీతధనుషో యస్తే తిష్ఠే దభిముఖో రణే

టీక॥ రాఘవ = రాముఁడా! యః= ఎవ్వఁడు; రణే = యుద్ధమునందు; గృహీతధనుషః=గ్రహింపఁబడినధనుస్సుగల; తే=నీకు; అభిముఖః= ఎదురైనవాఁడై; తిష్ఠేత్ =నిలుచునో; తం(అధ్యాహృతము)=అట్టివానిని; కంచిత్ =ఒకానొకనినైనను; త్రిషు=మూఁడైన; లోకేషు=లోకములయందును; అహం = నేను; నపశ్యామిహి=చూడనుగదా!

రాముఁడా! యుద్ధంబుననీవు ధనువుధరించియుండఁగా, నీయెదుటనిలువంజాలినవాఁడు, ముల్లోకంబులందెవ్వండును, నాకగపడలేదు.

అని, తాత్పర్యము.

వానరేషు సమాసక్తం న తే కార్యం విపత్స్యతే. ౧౯

అచిరా ద్ద్రక్ష్యసే సీతాం తీర్త్వా సాగర మక్షయమ్

టీక॥ వానరేషు = వానరులయందు; సమాసక్తం = సంబంధించియున్న; తే = నీయొక్క; కార్యం = పని; నవిపత్స్యతే = చెడదు. అక్షయం = నాశములేని; సాగరం = సముద్రమును; తీర్త్వా = దాఁటి; అచిరాత్ = శీఘ్రమున నే; సీతాం = సీతాదేవిని; ద్రక్ష్యసే = చూడఁగలవు.

వానరులపైనుంచియుండు నీకార్యము, ఎంతమాత్రము చెడదు; ఇంక, నశింపనిసముద్రంబు దాఁటి, శీఘ్రంబున నె సీతాదేవిం జూడఁగలవు.

అని, తాత్పర్యము.

త దలం శోక మాలంబ్య క్రోధ మాలంబ భూపతే. ౨౦
నిశ్చేష్టాః క్షత్రియా మందా స్సర్వే చండస్య బిభ్యతి

టీక॥ భూపతే = భూమికిఁ బ్రభుఁడవగు రాముఁడా! తత్ = అందువలన; శోకం = దుఃఖమును; ఆలంబ్య = అవలంబించి; అలం = చాలును. క్రోధం = కోపమును; ఆలంబ = అవలంబింపుము. నిశ్చేష్టాః = నిరుద్యోగులగు; క్షత్రియాః = క్షత్రియులు; మందాః = మందులు. సర్వే = అందఱును; చండస్య = భయంకరునికి; బిభ్యతి = భయపడుచున్నారు.

రాముఁడా! అట్లుకావున, ఇంతవఱకు దుఃఖంబవలంబించినది చాలును; ఇంక దుఃఖంబు విడువుము; క్రోధంబు నవలంబింపుము; క్షత్రియులు నిరుద్యోగులగుదురేని, మందభాగ్యులగుదురు; భయంకరుఁడగువాని కందఱును భయపడుదురు.

అని, తాత్పర్యము.

లంఘనార్థం చ ఘోరస్య సముద్రస్య నదీపతేః. ౨౧
సహాస్మాభి రిహోపేత స్సూక్ష్మబుద్ధి ర్విచారయ

టీక॥ నదీపతేః = నదులకుఁ బ్రభువును; ఘోరస్య = భయంకరమునగు; సముద్రస్య = సముద్రముయొక్క; లంఘనార్థం చ = దాఁటుటకొఱకును; సూక్ష్మబుద్ధిః = సూక్ష్మమగుబుద్ధిగల; త్వం = (అధ్యాహృతము) = నీవు; అస్మాభిస్సహ = మాతోఁగూడ; ఉపేతః = కూడినవాఁడవై; ఇహ = ఇచ్చట; విచారయ =

ఆలోచింపుము.

భయంకరంబగు సముద్రంబు దాఁటునుపాయంబును, సూక్ష్మబుద్ధివగునీవు, మమ్ముఁగూడి, యిచ్చట నాలోచింపుము. అని, తాత్పర్యము.

సర్వం తీర్ణం చ మే సైన్యం జిత మిత్యుపధారయ. ౨౨

టీక॥ తీర్ణం=దాఁటిన; సర్వం=సమస్తమయిన; మే=నాయొక్క; సైన్యంచ=సైన్యమును; జితం= జయించినది; ఇతి=అని; ఉపధారయ = నిశ్చయించుకొనుము.

నాసైన్యంబంతయు సముద్రంబు దాఁటిలంకంజేరునేని, సిద్ధముగా జయమునొందినట్టె యెంచుకొనుము.

అని, తాత్పర్యము.

ఇమే హి హరయ శ్శూరా స్సమరే కామరూపిణః
తా నరీ న్విధమిష్యంతి శిలాపాదపవృష్టిభిః. ౨౩

టీక॥ సమరే= యుద్ధమునందు; శూరాః= భయములేని వారలును; కామరూపిణః= ఇచ్ఛాధీనమగురూపముగలవారలునగు; ఇమే=ఈ; హరయః = వానరులు; తాన్=ఆ; అరీన్= శత్రువులను; శిలాపాదపవృష్టిభిః = ఱాళ్లయొక్కయు వృక్షములయొక్కయు వానలచేత; విధమిష్యంతిహి= చంపుదురుగదా!

యుద్ధంబునశూరులును గామరూపులునగు నీవానరులు, ఱాళ్లను వృక్షంబులనుగురిపించి, రాక్షసులనందఱను, గిటణఁగింతురు.

అని, తాత్పర్యము.

కథంచి త్సంతరిష్యామ స్తే వయం వరుణాలయమ్
హత మిత్యేవ తం మన్యే యుద్ధే సమితినందనమ్. ౨౪

టీక॥ తే=అట్టి; వయం=మనము; వరుణాలయం=సముద్రమును; కథంచిత్=ఎట్లయినను, సంతరిష్యామః= దాఁటెదము. సమితినందన= యుద్ధమునం

దుసంతోషంబు గలుగఁ జేయునట్టి రాముఁడా; తం=ఆ రావణుని; హతం=చంపఁబడినవానిఁగా; ఇత్యేవ= ఇట్లే; మన్యే= తలంచుచున్నాను.

యుద్ధోత్సుకుండ వగు రాముఁడా ! సేతువుచేతనే కాదు, మఱియే యుపాయముచేనైనను, సముద్రంబు దాఁటుదుము; రావణుండు నుహతుండవ్యానని నే, తలంచెదను.

అని, తాత్పర్యము.

కిముక్త్వా బహుధా చాపి సర్వథా విజయీ భవాన్
నిమిత్తానిచ పశ్యామి మనో మే సంప్రహృష్యతి. ౨౫

టీక॥ బహుధాచాపి=పెక్కువిధంబులను; ఉక్త్వా=చెప్పి; కిం= ఏమిప్రయోజనము? సర్వథా=అన్నివిధంబులను;భవాన్=నీవు;విజయీ=జయముగలవాఁడవు. నిమిత్తానిచ=శుభనిమిత్తములను;పశ్యామి=చూచుచున్నాను. మే=నాయొక్క; మనః=మనస్సు ; సంప్రహృష్యతి = మిక్కిలియుసంతోషించుచున్నది.

పెక్కుమాటలు చెప్పియేమిప్రయోజనము? అన్నివిధంబులనునీకవశ్యముజయమే గలుగును ; అట్లునాకుశుభనిమిత్తంబులు దోఁచుచున్నవి ; నామనంబును,మిక్కిలియుసంతోషంబు నొందియున్నది. అని,సుగ్రీవుండు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ద్వితీయస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండద్వితీయసర్గటీక ,
ముగిసినది.



౩౨

## తృతీయసర్గప్రారంభః.

సుగ్రీవస్య వచశ్శ్రుత్వా హేతుమత్పరమార్థవిత్
ప్రతిజగ్రాహ కాకుత్థ్సో హనుమంతమథాబ్రవీత్. ౧

టీక॥ పరమార్థవిత్ = పరమార్థము దెలిసిన; కాకుత్థ్సః = రాముఁడు; సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క; హేతుమత్ = కారణముగల; వచః = మాటను; శ్రుత్వా = విని; ప్రతిజగ్రాహ = అంగీకరించెను. అథ = అటుపిమ్మట; హనుమంతం = హనుమంతునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

పరమార్థవేత్తయగు రాముండు, సుగ్రీవుండుచెప్పినయుక్తియుక్తం బగు మాటనువిని దానికొప్పుకొని, యంత హనుమంతుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

తపసా సేతుబంధేన సాగరోచ్ఛోషణేన వా
సర్వథా సుసమర్థోఽస్మి సాగరస్యాస్య లంఘనే. ౨

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; తపసా = తపస్సుచేతఁగాని; సేతుబంధేన = సేతువుకట్టుటచేతగాని; సాగరోచ్ఛోషణేనవా = సముద్రంబునెండించుటచేతఁగాని; సర్వథా = అన్నివిధంబులను; అస్య = ఈ; సాగరస్య = సముద్రంబుయొక్క; లంఘనే = దాఁటుటయందు; సుసమర్థః = మిక్కిలియు సమర్థుఁడను; అస్మి = అగుచున్నాను.

తపంబుచేసిగాని, సేతుబంధంబుగావించిగాని, సముద్రంబు నెండించుటచేతఁగాని, యేవిధంబుననయినను, ఈసముద్రంబుదాఁటుటకు, మిక్కిలియుసమర్థుఁడనై యున్నాను; ఇంకనీవిషయమునం దేమియు చింతయక్కఱలేదు. అని, తాత్పర్యము.

కతి దుర్గాణి దుర్గాయా లంకాయా బ్రూహి తాని మే
జ్ఞాతుమిచ్ఛామి తత్సర్వం దర్శనాదివ వానర. ౩

బలస్య పరిమాణంచ ద్వారదుర్గక్రియామపి
గుప్తికర్మ చ లంకాయా రక్షసాం సదనాని చ. ౪

టీక॥ వానర = హనుమంతుఁడా! దుర్గాయాః = పొందనలవిగాని; లంకాయాః = లంకాపట్టణమునకు; దుర్గాణి = కోటలు; కతి = ఎన్ని? తాని = వానిని; మే = నాకొఱకు; బ్రూహి = చెప్పుము. బలస్య = సైన్యముయొక్క; పరిమాణం చ = కొలఁదిని; ద్వారదుర్గక్రియామపి = ద్వారములందలి ప్రవేశింపనలవిగాని కార్యమును; లంకాయాః = లంకయొక్క; గుప్తికర్మ చ = రక్షణకార్యమును; రక్షసాం = రాక్షసులయొక్క; సదనాని చ = గృహములను; తత్ = దానిని; సర్వం = అంతను; దర్శనాదివ = చూచుటవలనవలె; జ్ఞాతుం = తెలిసికొనుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను.

హనుమంతుఁడా! ప్రవేశింపనలవిగానట్టి లంకాపురికెన్ని దుర్గంబులున్నవి? వానిని నాకుం జెప్పుము; మఱియు, సైన్యపరిమాణంబును, ద్వారంబున నెవ్వరును బ్రవేశింపకుండునట్లుగావించియున్న రక్షణంబును, ప్రాకారాట్టాలకాది సన్నివేశంబును, రాక్షసుల గృహంబులను, వీనినంతయుఁ, బ్రత్యక్షముగాఁ గంటఁ జూచినట్లు, చక్కఁగాఁ దెలిసికొనఁ గోరుచున్నాను. అని, తాత్పర్యము.

యథాసుఖం యథావచ్చ లంకాయామసి దృష్టవాన్
సర్వమాచక్ష్వ తత్త్వేన సర్వథా కుశలోహ్యసి. ౫

టీక॥ త్వం (అధ్యాహృతము) = నీవు; యథాసుఖం = అనాయాసముగా; యథావచ్చ = చక్కఁగాను; లంకాయాం = లంకయందు; దృష్టవాన్ = చూచినవాఁడవు; అసి = అగుచున్నావు. తత్త్వేన = యాథార్థ్యముచేత; సర్వం = అంతను; ఆచక్ష్వ = చెప్పుము. సర్వథా = అన్నివిధంబులను; కుశలః = సమర్థుఁడవు; అసి = అగుచున్నావు.

నీవు, అనాయాసంబున, లంకలో నంతయుఁ జూచియున్నావు; దానినంతయు, నిప్పుడు సవిస్తరముగా, నాకుం జెప్పుము; అన్నిటికిని, నీవు సమర్థుఁడవు. అని; రాముఁడు, హనుమంతునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

స ౩

శ్రుత్వా రామస్య వచనం హనుమా న్మారుతాత్మజః
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠో రామం పున రథా బ్రవీత్. ౬

టీక॥ వాక్యవిదాం=మాటలు దెలిసినవారలలోపల; శ్రేష్ఠః=ఉత్తముఁడును; మారుతాత్మజః= వాయుదేవునికుమారుండునగు; హనుమాన్ = హనుమంతుండు; రామస్య=రామునియొక్క; వచనం=మాటను; శ్రుత్వా= విని; అథ=అటుపిమ్మట; పునః= మఱల; రామం=రామునిగూర్చి; వాక్యం= మాటను; అబ్రవీత్ — చెప్పెను.

మాటలాడం దెలిసిన వారిలోనుత్తముండును వాయుదేవుని కుమారుండునగు హనుమంతుండు, రాముండానతిచ్చినమాటను విని, రామునిం జూచి, మఱల, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రూయతాం సర్వమాఖ్యాస్యే దుర్గకర్మవిధానతః
గుప్తా పురీ యథా లంకా రక్షితాచ యథా బలైః. ౭
రాక్షసాశ్చ యథా స్నిగ్ధా రావణస్యచ తేజసా
పరాం సమృద్ధిం లంకాయా స్సాగరస్యచ భీమతామ్. ౮
విభాగంచ బలౌఘస్య నిర్దేశం వాహనస్య చ

టీక॥ లంకా=లంకయను; పురీ = పట్టణము; యథా=ఎట్లు; దుర్గకర్మవిధానతః= దుర్గకార్యసన్నివేశమువలన; గుప్తా—రక్షింపఁబడినదో; యథా— ఎట్లు; బలైః = సైన్యములచేత; రక్షితాచ=రక్షింపఁబడినదియునో; యథా=ఎట్లు; రాక్షసాశ్చ = రాక్షసులును; స్నిగ్ధాః=స్నేహముగలిగినవారలో; రావణస్య=రావణునియొక్క; తేజసా= ప్రభావముచేత; లంకాయాః = లంకయొక్క; పరాం=అధికమయిన; సమృద్ధించ=సమృద్ధిని; సాగరస్య— సముద్రముయొక్క; భీమతాంచ = భయంకరత్వమును; బలౌఘస్య= సైన్యసమూహముయొక్క; విభాగంచ= విభజనమును; వాహనస్య — వాహనముయొక్క; నిర్దేశంచ=విభాగమును; సర్వం=అంతను; ఆఖ్యాస్యే = చెప్పెదను. శ్రూయ

తాం=వినఁబడుఁగాక.

లంకాపురియందు, దుర్గవిధానంబునను సైన్యంబుల చేతను రక్షింపఁబడియుండువిధంబును, రాక్షసులకు రావణునియందుంగల స్నేహంబును, రావణుని ప్రభావంబును, లంకయందలి సర్వసమృద్ధిని, సముద్రంబు భయంకరముగానుండుటను, లంకయందు, సైన్య సంఖ్యాసన్నివేశాదిక్రమంబును, రథగజతురగాదివిభాగంబును, అంతయుం జెప్పెదను, వినుఁడు.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా కపిశ్రేష్ఠః కథయామాస తత్త్వతః. ౯

టీక॥ కపిశ్రేష్ఠః= వానరోత్తముఁడగుహనుమంతుండు ; ఏవం = ఇట్లు; ఉక్త్వా=చెప్పి;తత్త్వతః=యాథార్థ్యమువలన; కథయామాస=చెప్పెను

వానరోత్తముఁడగు హనుమంతుఁడు, ఈప్రకారము చెప్పి, యథార్థముగా, లంకాసన్నివేశక్రమంబంతయుఁ జెప్పనారంభించెను.అని, తాత్పర్యము.

హృష్టప్రముదితా లంకా మత్తద్విపసమాకులా
మహతీ రథసంపూర్ణా రక్షోగణసమాకులా. ౧౦
వాజిభిశ్చ సుసంపూర్ణా సా పురీ దుర్గమా పరైః

టీక॥ హృష్టప్రముదితా= మిక్కిలి యుసంతోషించిన జనులుగలదియు ; మత్తద్విపసమాకులా = మదించిన యేనుంగులచేనిండినదియు; మహతీ= పెద్దదియు; రథసంపూర్ణా= రథములచేనిండినదియు ; రక్షోగణసమాకులా=రాక్షససమూహములచే నిండినదియు; వాజిభిశ్చ=గుఱ్ఱములచేతను; సుసంపూర్ణా=మిక్కిలియునిండినదియునగు; సా= ఆ; లంకా=లంకయను; పురీ=పట్టణము; పరైః= శత్రువులచేత, దుర్గమా=పొందరానిది.

లంకాపురిలోని జనులందఱును మహా సంతోషముతో నున్నారు ; ఆపట్టణము మిక్కిలియు విశాలమయినది ; అందు రథంబులు నేనుఁగులు గుఱ్ఱంబులు నిండియున్నవి ; రాక్షసులు లెక్కలేకయున్నారు; శత్రువులకు దానిం బ్రవేశింపనలవిగాదు. అని, తాత్పర్యము.

దృఢబద్ధకవాటాని మహాపరిఘవంతిచ. ౧౧
ద్వారాణి విపులాన్యస్యా శ్చత్వారి సుమహాంతిచ

టీక॥ అస్యాః=ఈలంకాపట్టణము నకు; దృఢబద్ధకవాటాని= దృఢముగా బంధింపఁబడినతలుపులుగలవియు; మహాపరిఘవంతిచ = పెద్దగడియమ్రానులుగలవియును; విపులాని= విశాలములును ; సుమహాంతిచ=మిక్కిలిపెద్దవియునగు ; చత్వారి= నాలుగయిన ; ద్వారాణి= ద్వారములు; సంతి (అధ్యాహృతము)= కలవు.

లంకాపట్టణమునకు , దృఢముగా నాణులుమొదలగువానిచే బంధింపఁబడినతలుపులు గలవియు:బెద్దగడియమ్రానులుగలవియు విశాలంబులును మిక్కిలియు నున్నతంబులునగు , నాలుగు ద్వారంబులుగలవు.

అని, తాత్పర్యము.

తత్రేషూపలయంత్రాణి బలవంతి మహాంతిచ. ౧౨
ఆగతం పరసైన్యం తు తత్ర తైః ప్రతిహన్యతే

టీక॥ తత్ర=ఆద్వారములయందు; బలవంతి = అధికమయినబలముగలవియు ; మహాంతిచ=పెద్దవియునగు: ఇషూపలయంత్రాణి = బాణయంత్రములునుశిలాయంత్రములును ; సంతి (అధ్యాహృతము) = ఉన్నవి ; తత్ర తు=అచ్చటనే; ఆగతం= వచ్చిన;పరసైన్యం = శత్రుసైన్యము ; తైః=ఆయంత్రములచేత ; ప్రతిహన్యతే = కొట్టఁబడుచున్నది.

ఆద్వారంబులందు , బలిష్ఠంబులును విపులంబులునగు , బాణమోచకయంత్రంబులును , శిలామోచకయంత్రంబులును , ఉన్నవి; శత్రుసైన్యంబచ్చటకివచ్చినప్పుడు ,ఆయంత్రంబులు, బాణంబులనుశిలలనుగురిపించి , యాసైన్యంబునంతయు,నశింపఁజేయును.

అని, తాత్పర్యము.

ద్వారేషు సంస్కృతా భీమాః కాలాయసమయాశ్శిలాః. ౧౩
శతశో రచితా వీరై శ్శతఘ్న్యో రక్షసాం గణైః

టీక॥ వీరైః= పరాక్రమశాలులగు; రక్షసాం=రాక్షసులయొక్క; గణైః= సమూహములచేత; ద్వారేషు=ద్వారములయందు; సంస్కృతాః=సంస్కరింపఁబడినవియు; భీమాః= భయంకరములును; కాలాయసమయాః (కాలాయసమయ్యః)= ఇనుము వికారములయినవియునగు; శతఘ్న్యః= నూర్గురంజంపునట్టి; శిలాః=గుదియలు; శతశః= నూఱులుగా; రచితాః=చేయఁబడినవి, స్థాపింపఁబడినవి.

ఆద్వారంబులందుఁ, బరాక్రమశాలురగు రాక్షసులు, భయంకరంబులును నొక్కమాఱు ప్రయోగించిన నూర్గురం జంపునవియునగు నినుపగుదియలు, సిద్ధంబుగా, నుంచియున్నారు.

అని, తాత్పర్యము.

సౌవర్ణ శ్చ మహాం స్తస్యాః ప్రాకారో దుష్ప్రధర్షణః. ౧౪
మణివిద్రుమవైడూర్యముక్తావిరచితాంతరః

టీక॥ తస్యాః=అలంకాపురికి; సౌవర్ణః = బంగారువికారంబును; మహాన్=పెద్దదియు; దుష్ప్రధర్షణః= ఎదిరింపనలవిగానిదియు; మణివిద్రుమవైడూర్యముక్తావిరచితాంతరః = మణులచేతనుపగడములచేతను వైడూర్యములచేతనుముత్తెములచేతనుచేయఁబడినమధ్యప్రదేశములుగలదియునగు; ప్రాకారః= ప్రహరి; అస్తి(అధ్యాహృతము)=కలదు.

అలంకాపురిచుట్టును, సువర్ణమయంబును, అచ్చటచ్చట నలంకారార్థము పద్మరాగ ప్రవాళ వైడూర్యముక్తాఫలములచేనిర్మితంబులగు ప్రదేశములుగలదియు నత్యున్నతంబును, దాటఁగూడనిదియునగుప్రాకారము, గలదు.

అని, తాత్పర్యము.

సర్వత శ్చ మహాభీమా శ్శీతతోయవహా శ్శుభాః. ౧౫
అగాధా గ్రాహవత్యశ్చ పరిఖా మీనసేవితాః

టీక॥ సర్వతః=అంతటను; మహాభీమాః= మిక్కిలిభయంకరములును; శీతతోయవహాః = చల్లనినీళ్లనువహించునవియు; శుభాః=సుందరములును;




అగాధాః= అధికమయినలోఁతుగలవియు; గ్రాహవత్యశ్చ = మొసళ్లుగలవియు; మీనసేవితాః=మత్స్యములచే సేవింపఁబడినవియునగు; పరిఖాః= అగడ్తలు; సంతి(అధ్యాహృతము) = ఉన్నవి.

ఆప్రాకారముచుట్టును, మహాభయంకరములును స్పృశింపనుంగూడనలవిగాకుండునంతటిచల్లనినీళ్లుగలవియు, మిక్కిలియులోఁతుగలవియు, మొసళ్లును మహామీనంబులునుగలవియు సుందరంబులునగు, నగడ్తలున్నవి.

అని, తాత్పర్యము,

ద్వారేషు తాసాం చత్వార స్సంక్రమాః పరమాయతాః. ౧౬
యంత్రై రుపేతా బహుభి ర్మహద్భి ర్గృహపఙ్క్తిభిః

టీక॥ ద్వారేషు= ద్వారప్రదేశములందు; తాసాం = ఆయగడ్తలకు; పరమాయతాః = మిక్కిలియువిశాలములును; బహుభిః= పెక్కులయినవియు; మహద్భిః= పెద్దవియునగు; యంత్రైః= యంత్రములతోను; గృహపఙ్క్తిభిః= గృహముల సమూహములతోను; ఉపేతాః=కూడినవియునగు; సంక్రమాః= సంచారయంత్రములు; చత్వారః= నాలుగు; సంతి(అధ్యాహృతము)=ఉన్నవి.

ద్వారంబులసమీపమునందు, ఆయగడ్తలకు, నాలుగుపక్కలను నాలుగు దారునిర్మితసంచారమార్గములున్నవి; అందు, ఆపలకలనెత్తివేయవలసినప్పుడెత్తివేయుటకును, జనులు సంచరించుటకై మఱలనగడ్తలపై వేయవలసినప్పుడు వేయుటకును గొప్పయంత్రంబులును, మఱియు నచ్చటఁగావలియుండు భటులగృహంబులును, ఉన్నవి.

అని, తాత్పర్యము.

త్రాయంతే సంక్రమా స్తత్ర పరసైన్యాగమే సతి. ౧౭
యంత్రై స్తై రవకీర్యంతే పరిఖాసు సమంతతః

టీక॥ తత్ర=అచ్చట; సంక్రమాః= సంచార మార్గములు; పరసైన్యాగమే సతి = శత్రుసైన్యమురాకయగుచుండఁగా; పురీం(అధ్యాహృతము)= లంకాపట్టణమును; త్రాయంతే=రక్షించుచున్నవి. తైః = ఆ; యంత్రైః=




యంత్రములచేత; పరిఖాసు=అగడ్తల యందు; సమంతతః=అంతటను; అవకీర్యంతే=ఎత్తివేయఁబడుచున్నవి.

అచ్చట, నాదారునిర్మితసంచారమార్గములు, శత్రుసైన్యములు వచ్చినప్పుడుమాత్రము, పట్టణమును రక్షించుచున్నవి; ఎట్లనగా, నాయంత్రములు, అగడ్తల యందంతటను, ఈమార్గభూతములయి యుండు పలకలను, ఎత్తివేయుచున్నవి; అంతశత్రువులు, అగడ్తను దాఁటుటకు లేదు. అని, తాత్పర్యము.

ఏక స్త్వ కంప్యో బలవాన్ సంక్రమ స్సుమహాదృఢః. ౧౮
కాంచనై ర్బహుభి స్తమ్భై ర్వేదికాభి శ్చశోభితః

టీక॥ ఏకః=ఒక; సంక్రమస్తు=సంచారమార్గము మాత్రము; అకంప్యః=కదలింపరానిది. బలవాన్=అధికమయిన బలముగలది. సుమహాదృఢః = మిక్కిలియుదృఢమయినది. బహుభిః = పెక్కులయిన; కాంచనైః=కనకమయములగు; స్తంభైః=స్తంభములచేతను; వేదికాభిశ్చ =తిన్నెలచేతను; శోభితః=ప్రకాశించుచున్నది.

అందు, ఒకసంచారమార్గము మాత్రము, మిక్కిలిదృఢంబైబలిష్ఠంబై, పెక్కుబంగారు స్తంభములతో నుదిన్నెలతోనుంబ్రకాశించుచున్నది.

అని, తాత్పర్యము.

స్వయం ప్రకృతి మాపన్నో యుయుత్సూ రామ రావణః. ౧౯
ఉత్థిత శ్చా ప్రమత్తశ్చ బలానా మనుదర్శనే

టీక॥ రామ=రాముఁడా! రావణః=రావణుఁడు; ప్రకృతిం= స్వభావమును; ఆపన్నః=పొందినవాఁడై, చలనములేని స్వభావముగలవాఁడైయనుట; ఉత్థితశ్చ= లేచినవాఁడునై, జాగరూకుండునై యనుట; అప్రమత్తశ్చ= ఏమఱుపాటులేనివాఁడునై; స్వయం=తానే; యుయుత్సుః= యుద్ధముసేయఁగోరినవాఁడై; బలానాం=సైన్యములయొక్క; అనుదర్శనే=చూచుటయందు; తిష్ఠతి(అధ్యా

హృతము)=ఉన్నాఁడు.

రాముఁడా! రావణుండు, నిశ్చలంబగుమనంబుగల్గి, జాగరూకుండై, సేనకు, శత్రువులు లేకున్నను, శత్రువులుండునప్పుడు వలె, యుద్ధముసేయుయుత్సాహంబునఁ, బ్రతిదినంబును, సైన్యంబులం జక్కఁగాఁ జూచుకొనుచుండును.

అని, తాత్పర్యము.

లంకా పునర్నిరాలంబా దేవదుర్గా భయావహా. ౨౦
నాదేయం పార్వతం వాన్యం కృత్రిమంచ చతుర్విధమ్

టీక॥ పునః=ఇంకను; లంకా=లంకాపురి ; నిరాలంబా= ఆలంబనములేనిది. దేవదుర్గా = దేవతలచేతను బొందరానిది. భయావహా= భయముగలిగించునది. నాదేయం=నదిచేఁగలిగినదియు ; పార్వతం=పర్వతంబునం గలిగినదియు ; వాన్యం = వనసమూహంబునంగలిగినదియు ; కృత్రిమంచ= చేయఁబడినదియు ; చతుర్విధం=నాలుగువిధములుగల ; దుర్గం (అధ్యాహృతము)= దుర్గము ; అస్తి (అధ్యాహృతము)=ఉన్నది.

మఱియు, లంకాపురి, త్రికూటపర్వతంబుపైనుండుటచేఁ, బైకిఁబోవుటకాధారములేదు; అచ్చటికి వెళ్లుటకు దేవతలకైననలవిగాదు; మఱియు నాలంక చూపరులకుభయంబుగల్గించుచున్నది; జలదుర్గంబును బర్వతదుర్గంబును, వనదుర్గంబును, బ్రాకారపరిఖావృతంబగు కృత్రిమదుర్గంబును, అనునాలుగుదుర్గంబులును, లంకాపురికున్నవి.

అని, తాత్పర్యము.

స్థితా పారే సముద్రస్య దూరపారస్య రాఘవ. ౨౧
నౌపథోపిచ నాస్త్యత్ర నిరాదేశశ్చ సర్వతః

టీక॥ రాఘవ=రాముఁడా! సా(అధ్యాహృతము)=ఆలంక ; దూరపారస్య=దూరమునందుగట్టుగల; సముద్రస్య=సముద్రముయొక్క; పారే=అవలిగట్టునందు; స్థితా=ఉన్నది. అత్ర = ఈసముద్రమునందు; నౌపథోపిచ = ఓడమార్గమును ; నాస్తి=లేదు. అయం దేశః(అధ్యాహృతము)= ఈదేశము; సర్వతః=అంతటను ; నిరాదేశశ్చ=వార్తాసంచారములేనిదియు.

రాముఁడా! లంకాపట్టణము, అతివిశాలంబగుసముద్రమునావలిగట్టున, నున్నది; ఈసముద్రంబునుదాఁటుటకు, నోడమార్గంబునులేదు, మఱియు, నిచ్చటివారికి, అచ్చటివారివార్తఁదెలియునుపాయంబునులేదు; కావున, లంకకుజలదుర్గమున్నది.

అని, తాత్పర్యము.

శైలాగ్రే రచితా దుర్గా సా పూ ర్దేవపురోపమా. ౨౨
వాజివారణసంపూర్ణా లంకా పరమదుర్జయా

టీక॥ దేవపురోపమా = దేవనగరముతోఁబోలిక గలదగు; సా = ఆ; లంకా = లంకయను; పురీ = పట్టణము; శైలాగ్రే = పర్వతాగ్రమునందు; రచితా = చేయఁబడినదియు; దుర్గా = పొందనలవిగానిదియు; వాజివారణసంపూర్ణా = గుఱ్ఱములతోను ఏనుగులతోనునిండినదియు; పరమదుర్జయా = మిక్కిలియుదుర్జయంబునై; అస్తి (అధ్యాహృతము) = ఉన్నది.

దేవపురీసమానమగు, నాలంకాపట్టణము, పర్వతాగ్రంబుననున్న దై హయగజంబులచేసంపూర్ణమయి, యెవ్వరికిని జయింపనలవిగాకున్నది; పర్వతాగ్రంబుననుండుటచేఁబర్వతదుర్గంబునువనదుర్గంబునుంగలదు.

అని, తాత్పర్యము.

పరిఖాశ్చ శతఘ్న్యశ్చ యంత్రాణి వివిధాని చ. ౨౩
శోభయంతి పురీం లంకాం రావణస్య దురాత్మనః

టీక॥ పరిఖాశ్చ = అగడ్తలును; శతఘ్న్యశ్చ = శతఘ్నులును; వివిధాని = నానావిధములగు; యంత్రాణిచ = యంత్రములును; దురాత్మనః = దుష్టబుద్ధిగల; రావణస్య = రావణునియొక్క; పురీం = పట్టణమయిన, లంకాం = లంకాపట్టణమును; శోభయంతి = ప్రకాశింపఁజేయుచున్నవి.

అగడ్తలచేతనుశతఘ్నులచేతను బాణశిలామోచకాదినానావిధయంత్రములచేతను, దురాత్ముండగురావణుని లంకాపట్టణము మిక్కిలియుఁ బ్రకాశించుచున్నది. అని, తాత్పర్యము.

స ౩

అయుతం రక్షసా మత్ర పూర్వద్వారం సమాశ్రితమ్. ౨౪
శూలహస్తా దురాధర్షా స్సర్వే ఖడ్గాగ్రయోధినః

టీక॥ అత్ర=ఈలంకయందు; రక్షసాం= రాక్షసులయొక్క; అయుతం= పదివేలు; పూర్వద్వారం = తూర్పుద్వారమును; సమాశ్రితం= పొందినది. సర్వే—అందఱును; శూలహస్తాః= శూలమునుహస్తములంగలవారలు. దురాధర్షాః=ఎదిరింపనలవిగానివారలు. ఖడ్గాగ్రయోధినః= కత్తులచే ముందటయుద్ధముసేయువారలు.

ఈలంకయందుఁ, బూర్వద్వారంబున, బదివేలరాక్షసులున్నారు; వారలందఱు, శూలపాణులు; యుద్ధంబున నెదిరింపనలవిగాని వారలు; యుద్ధంబున ముందు నిలిచి, ఖడ్గంబులం బోరువారలు. అని, తాత్పర్యము.

నియుతం రక్షసా మత్ర దక్షిణద్వార మాశ్రితమ్. ౨౫
చతురంగేణ సైన్యేన యోధా స్తత్రాప్య నుత్తమాః

టీక॥ అత్ర=ఈలంకయందు; చతురంగేణ— నాలుగంగములుగల; సైన్యేన(సహ)= సైన్యముతోఁగూడ; రక్షసాం=రాక్షసులయొక్క; నియుతం= లక్ష: దక్షిణద్వారం=దక్షిణదిక్కునందలి ద్వారమును; ఆశ్రితం— పొందినది. తత్రాపి—అందును; యోధాః= భటులు; అనుత్తమాః— తనకన్నను త్తములులేనివారలు.

లంకయందుదక్షిణద్వారంబునఁజతురంగసైన్యముతోఁగూడ, లక్షమందిరాక్షసులున్నారు; వారలునుమిక్కిలియుసమర్థులు. అని, తాత్పర్యము.

ప్రయుతం రక్షసా మత్ర పశ్చిమద్వార మాశ్రితమ్. ౨౬
చర్మఖడ్గధరా స్సర్వే తథా సర్వాస్త్రకోవిదాః

టీక॥ అత్ర=ఈలంకయందు ; రక్షసాం= రాక్షసులయొక్క ; ప్రయు

తం=పదిలక్షలు; పశ్చిమద్వారం=పడమటిద్వారమును;ఆశ్రితం= పొందినది. సర్వే=అందఱును; చర్మఖడ్గధరాః=చర్మనిర్మితమగుకవచమును ఖడ్గమునుధరించువారలు. తథా = అట్లు; సర్వాస్త్రకోవిదాః = సమస్తములయినయస్త్రములందుఁబండితులు.

లంకాపశ్చిమద్వారంబునఁ, బదిలక్షలరాక్షసులున్నారు ; వారలందఱును, జర్మకవచంబులనుఖడ్గంబులనుదాల్చి , సమస్తాస్త్రంబులుందెలిసి , వెలుంగుచుందురు. అని, తాత్పర్యము.

న్యర్బుదం రక్షసా మత్ర ఉత్తరద్వార మాశ్రితమ్. ౨౭
రథినశ్చా శ్వవాహాశ్చ కులపుత్రా స్సుపూజితాః

టీక॥ అత్ర=ఈలంకయందు; రక్షసాం= రాక్షసులయొక్క; న్యర్బుదం= నూఱుకోటులు; ఉత్తరద్వారం=ఉత్తరదిక్కునందలి ద్వారమును; ఆశ్రితం= పొందినది. తే(అధ్యాహృతము)=వారలు; రథినశ్చ=రథికులును; అశ్వవాహాశ్చ=గుఱ్ఱములచేవహింపఁబడువారలును; కులపుత్రాః= మంచికులంబునఁబుట్టినవారలు. సుపూజితాః= చక్కఁగాఁబూజింపఁబడినవారలు.

లంకాపురియుత్తర ద్వారంబున , నూఱుకోటులరాక్షసులున్నారు; అందుఁ,గొందఱురథికులునుగొందఱశ్వసాదులును గొందఱుగజసాదులునుగానున్నారు; వారలు,సత్కులంబునంబుట్టినవారును, రావణునకువిశ్వాసనీయులై , రావణునిచే మిక్కిలియుగౌరవింపఁబడుచుందురు. అని, తాత్పర్యము.

శతశో థ సహస్రాణి మధ్యమం స్కంధ మాశ్రితాః. ౨౮
యాతుధానా దురాధర్షా స్సాగ్రకోటిశ్చ రక్షసామ్

టీక॥అథ=ఇంక;దురాధర్షాః=ఎదిరింపనలవిగాని; యాతుధానాః=రాక్షసులు;శతశః = నూఱునూఱులుగాను;సహస్రాణి= వేనవేలుగాను; రక్షసాం=రాక్షసులయొక్క ; సాగ్రకోటిశ్చ=సమగ్రకోటియు; మధ్యమం=నడిమిదైన ; స్కంధం=స్థానమును;ఆశ్రితాః=పొందినారు.

మఱియు, దురాధర్షులగు రాక్షసులు, నూఱునూఱులుగాను వేనవేలుగానుగోటులుగాను, పట్టణమధ్యమస్థానంబుననున్నవారు. అని తాత్పర్యము.

తే మయా సంక్రమా భగ్నాః పరిఖాశ్చా వపూరితాః. ౩౫
దగ్ధా చ నగరీ లంకా ప్రాకారాశ్చా వసాదితాః

టీక॥ మయా=నాచేత; తే=ఆ; సంక్రమాః=సంచారమార్గములు; భగ్నాః=విఱువఁబడినవి. పరిఖాశ్చ=అగడ్తలును; అవపూరితాః=పూడ్వఁబడినవి. లంకా=లంకయను; నగరీచ=పట్టణమును; దగ్ధా=దహింపఁబడినది. ప్రాకారాశ్చ=ప్రాకారములును; అవసాదితాః=విఱువఁబడినవి.

నేనాయగడ్తలమీఁది సంచార మార్గంబులను బగులఁగొట్టితిని; ఆయగడ్తలను బూడ్చివేసినాను; ఆలంకానగరినంతయు దహించితిని; ఆప్రాకారంబులను బగులఁగొట్టితిని; ఇప్పుడంతకష్టము లేదు. అని, తాత్పర్యము.

బలైకదేశః క్షపితో రాక్షసానాం మహాత్మనామ్. ౩౦

టీక॥ మయా(అధ్యాహృతము) = నాచేత; మహాత్మనాం = అధికమయినపరాక్రమముగల; రాక్షసానాం = రాక్షసులయొక్క; బలైకదేశః = సైన్యములోనొకభాగము; క్షపితః= నాశమునొందింపఁబడినది.

నేను, మఱియు, రావణుని సైన్యములోఁగొంతభాగమును, మహాపరాక్రమశాలులగు రాక్షసులం జంపియున్నాను. అని, తాత్పర్యము.

యేన కేనచ మార్గేణ తరామ వరుణాలయమ్
హతేతి నగరీ లంకా వానరై రవధార్యతామ్. ౩౧

టీక॥ యేనకేనచమార్గేణ= ఏయుపాయముచేనైనను; వరుణాలయం= సముద్రమును; తరామ=దాఁటెదము. లంకా=లంకయను; పురీ=పట్టణము;

వానరైః=వానరులచేత; హతా=కొట్టఁబడినది. ఇతి = అని ; అవధార్యతాం=నిశ్చయింపఁబడుఁగాక.

ఏయుపాయముచేనైననుసముద్రంబునుదాటవచ్చును; ఇంక , వానరులలంకానగరమును హతముగావించిరనియేనిశ్చయింపుము. అని, తత్పర్యము

అంగదో ద్వివిదో మైందో జాంబవాన్ పనసో నళః
నీల స్సేనాపతి శ్చైవ బలశేషేణ కిం తవ ౩౨

టీక॥అంగదః=అంగదుఁడును;ద్వివిదః=ద్వివిదుండును; మైందః=మైందుండును; జాంబవాన్=జాంబవంతుఁడును; పనసః=పనసుండును ; నళః=నళుండును; సేనాపతిః=సేనానాయకుండగు; నీలశ్చైవ=నీలుండును; సంతి(అధ్యాహృతము)=ఉన్నారు. తవ= నీకు; బలశేషేణ=సేనలోనిమిగతచేత; కిం=యేమిప్రయోజనము?

మిగతసేనతోమనకుఁ గార్యములేదు ; అంగదుండునుద్వివిదుండునుమైందుండునుజాంబవంతుండునుపనసుఁడునునళుండును సేనానాయకుండగునీలుండును,ఉన్నారు.వీరలేచాలును.

అని, తాత్పర్యము.

ప్లవమానా హి గత్వా తాం రావణస్య మహాపురీమ్
సపర్వతవనాం భిత్త్వా సఖాతాం సప్రతోరణామ్. ౩౩
సప్రాకారాం సభవనా మానయిష్యంతి రాఘవ

టీక॥రాఘవ=రాముఁడా! ఏతే(అధ్యాహృతము)=వీరలు;ప్లవమానాః=ఎగురుచు;గత్వా= పోయి;సపర్వతవనాం = పర్వతంబులతోనువనంబులతోనుగూడినదియు;సఖాతాం= అగడ్తలతోఁగూడినదియును;సప్రతోరణాం=బహిర్ద్వారములతోఁగూడినదియు; సప్రాకారాం=ప్రాకారములతోఁగూడినదియు; సభవనాం=ఇండ్లతోఁగూడినదియునగు;తాం=ఆ;రావణస్య=రావణునియొక్క;మహాపురీం=గొప్పపట్టణమయినలంకను:భిత్త్వా=పెల్లగించి; ఆనయిష్యంతి(ఆనేష్యంతి)=తేఁగలరు.

రాముఁడా! వీరలు , ఆకాశమా

గరంబునం బోయి, పర్వతంబులతోను వనంబులతోను అగడ్తలతోను బహిర్ద్వారములతోను ప్రాకారములతోను గృహంబులతోను లంకాపట్టణంబుం బెల్లగించి, యిచ్చటికిం దేఁగలరు.

అని, తాత్పర్యము.

ఏవ మాజ్ఞాపయ క్షిప్రం బలానాం సర్వసంగ్రహమ్. ३८
ముహూర్తేన తు యుక్తేన ప్రస్థాన మభిరోచయ

టీక॥ఏవం=ఎట్లు; బలానాం=సైన్యములలో; సర్వసంగ్రహం—అన్నిటియందును సారభూతమయిన దాని; క్షిప్రం—శీఘ్రముగా; ఆజ్ఞాపయ — ఆజ్ఞాపించుము. యుక్తేన = యోగ్యమయిన; ముహూర్తేనతు = ముహూర్తముచేతనే; ప్రస్థానం= ప్రయాణమును; అభిరోచయ—ఇచ్చింపుము.

సైన్యంబులలోనన్నింటికిని సారభూతులగునంగదాదులకు శీఘ్రముగా నట్లానతిమ్ము ; యాత్రాయోగ్యంబగు ముహూర్తంబునఁ, బయనంబగునట్లు, సంఘటింపుము. అని, హనుమంతుఁడు, రామునకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, తృతీయస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండతృతీయసర్గటీక,
ముగిసినది.

శ్రీ

చతుర్థసర్గ ప్రారంభః.

శ్రుత్వా హనుమతో వాక్యం యథావ దనుపూర్వశః
తతో బ్రవీ న్మహాతేజా రామ స్సత్యపరాక్రమః. ౧

టీక॥మహాతేజాః = అధికమయిన తేజస్సుగలవాఁడును;సత్యపరాక్రమః= సత్యమయినపరాక్రమముగలవాఁడు నగు;రామః=రాముఁడు-హనుమతః = హనుమంతునియొక్క;వాక్యం = మాటను; అనుపూర్వశః = మొదటనుండి; యథావత్=క్రమముగా;శ్రుత్వా= విని; తతః=అటుపిమ్మట; అబ్రవీత్=చెప్పెను.

మహాతేజుండును సత్యపరాక్రముండునగు రాముండు, హనుమంతుండు చెప్పినమాటనంతయుఁ గ్రమముగావిని, హనుమంతుంజూచి, ఇట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

యాం నివేదయసే లంకాం పురీం భీమస్య రక్షసః
క్షిప్ర మేనాం మథిష్యామి సత్య మేత ద్బ్రవీమి తే. ౨

టీక॥భీమస్య= భయంకరుండగు; రాక్షసః= రాక్షసుఁడైన రావణునియొక్క; యాం=ఏ;లంకాం=లంకయను; పురీం=పట్టణమును; నివేదయసే= తెల్పుచున్నావో; ఏనాం=ఈలంకాపట్టణమును; క్షిప్రం=శీఘ్రముగా ; మథిష్యామి=మంథించెదను. ఏతత్ =ఈ;సత్యం=సత్యమయినమాటను; తే=నీకు, బ్రవీమి=చెప్పుచున్నాను.

నీవిపుడుభయంకరుండగు రావణుని పట్టణమగు నేలంకం జెప్పుచున్నావో దానిశీఘ్రముగా నే హతముగావించెదను; సత్యము, నీకుంజెప్పుచున్నాను. అని, రాముండు,హనుమంతునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

అస్మి న్ముహూర్తే సుగ్రీవ ప్రయాణ మభిరోచయే
యుక్తో ముహూర్తో విజయః ప్రాప్తో మధ్యం దివాకరః. ३

టీక॥సుగ్రీవ=సుగ్రీవుఁడా!అస్మిన్=ఈ:ముహూర్తే=ముహూర్తమునందు; ప్రయాణం=పయనమును;అభికాంక్షయే = కోరుచున్నాను. ముహూర్తః=ఈ,ముహూర్తము;యుక్తః=తగినది.విజయః=విజయముగలిగించునది.దివాకరః=సూర్యుఁడు;మధ్యం=పగటిమధ్యమును; ప్రాప్తః=పొందినాఁడు.

సుగ్రీవుఁడా! ఈముహూర్తమునందే, ప్రయాణముసేయవలయునని కోరుచున్నాను; ఇప్పుడు, సూర్యుఁడు, దివామధ్యమునొందియున్నాఁడు; ఈయభిజిన్ముహూర్తము, ప్రయాణమునకుయుక్తమయినది ; జయంబుగల్గించునది. అని,తాత్పర్యము.

అస్మిన్ముహూర్తే విజయే ప్రాప్తే మధ్యం దివాకరే
సీతాం హృత్వాతు మే జాతు క్వాసౌ యాస్యతి యాస్యతః. ౪

టీక॥ దివాకరే = సూర్యుఁడు; మధ్యం= దివామధ్యమును; ప్రాప్తే = పొందఁగా; అస్మిన్= ఈ; విజయే = విజయముగల్గించునట్టి;ముహూర్తే= అభిజిన్ముహూర్తమునందు; మే= నేను; యాస్యతః= ప్రయాణముసేయఁగా; అసౌ=ఈరావణుఁడు; సీతాం= సీతను; హృత్వాతు= హరించియు ; జాతు=ఒకానొకప్పుడును; క్వ=ఎచ్చటికి; యాస్యతి=పోఁగలఁడు?

సూర్యుఁడుమధ్యంగతుఁడైయుండునప్పుడు,విజయావహంబగునీయభిజిన్ముహూర్తంబున నేనుప్రయాణమగుదునేని, సీతనపహరించిన రావణుండు, ఎచ్చటికిఁబోయి, తప్పించుకొనఁగలఁడు? అతండెచ్చటికిఁబోయిననువిడువక , వధింతును. అని, తాత్పర్యము.

సీతా శ్రుత్వా భియానం మే ఆశా మేష్యతి జీవితే
జీవితాంతేఽమృతం స్పృష్ట్వా పీత్వా విష మివా తురః. ౫

టీక॥ సీతా=సీత ; మే= నాయొక్క ; అభియానం = ప్రయాణమును; శ్రుత్వా=విని; విషం=విషమును; పీత్వా=త్రావి; ఆతురః=పీడితుఁడగువాఁడు; జీవితాంతే = ప్రాణాత్యయకాలమునందు; అమృతం=అమృత

మును; స్పృష్ట్వేవ= తాఁకినవలె; జీవితే=ప్రాణమునందు; ఆశాం=ఆశను; ఏష్యతి=పొందఁగలదు.

విషంబుఁ ద్రాఁగినవాఁడు పీడితుండై చావంబోవునంతటికాలంబున, నమృతస్పర్శనంబునొంది, కొంచెముజీవనశక్తినొందునట్లు, సీతాదేవి, నాప్రయాణంబునువిని, జీవితాశంబొందఁగలదు. అని, తాత్పర్యము.

ఉత్తరాఫల్గునీ హ్యద్య శ్వస్తు హస్తేన యోక్ష్యతే
అభిప్రయామ సుగ్రీవ సర్వానీకసమావృతాః. ౬

టీక॥ సుగ్రీవ=సుగ్రీవుఁడా! అద్య=నేఁడు; ఉత్తరాఫల్గునీహి=ఉత్తరఫల్గునీనక్షత్రముగదా! శ్వస్తు=రేపుమాత్రము; చంద్రః(అధ్యాహృతము)=చందురుఁడు; హస్తేన = హస్తనక్షత్రముతో; యోక్ష్యతే=చేరఁగలఁడు. సర్వానీకసమావృతాః=సమస్తసైన్యములచేఁబరివేష్టింపఁబడినవారలమై; అభిప్రయామ= పయనమగుదము.

సుగ్రీవుఁడా! నేఁడుత్తరఫల్గునీ నక్షత్రము; పునర్వసూనక్షత్రంబునఁ బుట్టిననాకు, ఇదిసాధన తారయగుచున్నది; రేపుహస్తనక్షత్రము, అదినాకునైధన తారయగును; కావున, సమస్తసైన్యంబులంగూడి, నేఁడేపయనమయ్యెదము.

అని, తాత్పర్యము.

నిమిత్తాని చ ధన్యాని యాని ప్రాదుర్భవంతి చ
నిహత్య రావణం సీతా మానయిష్యామి జానకీమ్. ౭

టీక॥ యాని=ఏ; నిమిత్తాని=నిమిత్తములు; ధన్యాని = శుభముగలిగించునవో; తాని(అధ్యాహృతము)చ=అవియు; ప్రాదుర్భవంతిచ=ఆవిర్భవించుచున్నవి. రావణం= రావణుని; నిహత్య=చంపి; జానకీం=జనకమహారాజుకూఁతురయిన; సీతాం=సీతను; ఆనయిష్యామి(ఆనేష్యామి)=తెచ్చెదను.

మఱియు, శుభసూచకంబులగు నిమిత్తంబులును బ్రాదుర్భవించుచున్నవి; అవశ్యము, రావణునివధించి, జనకమహారాజుకూఁతురయిన సీతం దెచ్చెదను. అని, తాత్పర్యము.

ఉపరిష్టాద్ధి నయనం స్ఫురమాణ మిదం మమ
విజయం సమనుప్రాప్తం శంసతీవ మనోరథమ్. ౮

టీక॥ ఉపరిష్టాత్=మీఁదుగా; స్ఫురమాణం=చలించుచున్న; ఇదం=ఈ; మమ=నాయొక్క; నయనం= కన్ను; మనోరథం=కోరికని; విజయం=జయమును; సమనుప్రాప్తం= పొందినదానిఁగా; శంసతీవహి= చెప్పునట్లున్నది గదా!

నానేత్రము,మీఁదుగాస్ఫురించుటం జేసి, యవశ్యము నామనోరథముసిద్ధించునని, తెల్పునట్లున్నది. అని,రాముండు,చెప్పెను. అని, తాత్పర్యము.

తతో వానరరాజేన లక్ష్మణేనచ పూజితః
ఉవాచ రామో ధర్మాత్మా పున రప్యర్థకోవిదః. ౯

టీక॥తతః=అటుపిమ్మట; అర్థకోవిదః = కార్యంబులంబండితుండును; ధర్మాత్మా= ధర్మస్వభావుండునగు; రామః=రాముఁడు; వానరరాజేనచ= వానరులకుఁ బ్రభువైనసుగ్రీవునిచేతను; లక్ష్మణేనచ = లక్ష్మణునిచేతను; పూజితః = పూజింపఁబడినవాఁడై; పునరపి=మఱలను,ఉవాచ=చెప్పెను.

అంతఁ,గార్యంబులంబండితుండును ధర్మాత్ముండునగురాముండు,వానరరాజుండగుసుగ్రీవుండును లక్ష్మణుండును,దాను జెప్పినమాటల నభినందింప, మఱల,నిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

అగ్రే యాతు బలస్యాస్య నీలో మార్గ మవేక్షితుమ్
వృత శ్శతసహస్రేణ వానరాణాం తరస్వినామ్; ౧౦

టీక॥నీలః=నీలుఁడు;తరస్వినాం=బలవంతులగు;వానరాణాం=వానరులయొక్క;శతసహస్రేణ=లక్షచేత; వృతః = పరివేష్టింపఁబడినవాఁడై; మార్గం=మార్గమును; అవేక్షితుం = చూచుటకు;అస్య=ఈ; బలస్య=సైన్యమునకు;అగ్రే=ముందట; యాతు=పోవుఁగాక.

నీలుండు, బలవంతులగులక్షవానరులంగూడి, మార్గంబుఁజూచుటకై, సేనకుముందునడచుఁగాక. అని, రాముండు, సుగ్రీవునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఫలమూలవతా నీల శీతకాననవారిణా
పథా మధుమతా చాఽఽశు సేనాం సేనాపతే నయ. ౧౧

టీక॥ సేనాపతే=సేనానాయకుఁడవగు; నీల=నీలుఁడా! ఫలమూలవతా=ఫలములనుగడ్డలనుగలదియు; శీతకాననవారిణా=చల్లనియడవులనునీళ్లనుగలదియు; మధుమతాచ= తేనెగలదియునగు; పథా=మార్గముచేత; ఆశు=శీఘ్రముగా; సేనాం=సేనను; నయ=తోడ్కొనిపొమ్ము.

సేనానాయకుండవగునీలుఁడా! అధికముగాఫలమూలంబులు గలదియుఁ, జల్లనియడవులనునీళ్లనుగలదియు మధుపూర్ణంబునగుమార్గంబున, శీఘ్రముగా, సేనందీసికొనిపొమ్ము.

అని, తాత్పర్యము.

దూషయేయు ర్దురాత్మానః పథి మూలఫలోదకమ్
రాక్షసాః పరిరక్షేథా స్తేభ్య స్త్వం నిత్య ముద్యతః. ౧౨

టీక॥ దురాత్మనః= దుష్టబుద్ధిగల; రాక్షసాః=రాక్షసులు; పథి= మార్గమునందు; మూలఫలోదకం= గడ్డలనుఫలములనుజలమును; దూషయేయుః = చెఱచుదురు. త్వం=నీవు; నిత్యం=ఎల్లప్పుడును; ఉద్యతః= సన్నద్ధుఁడవై; తేభ్యః=ఆరాక్షసులవలన; పరిరక్షేథాః (పరిరక్ష)=రక్షించుము.

దురాత్ములగురాక్షసులు, మార్గంబునమూలఫలంబులను, జలంబులను జెఱచివేయుదురు, నీవు, ఏమఱకసావధానుండవై, వారలట్లు సేయకుండునట్లురక్షింపుచుండుము. అని, తాత్పర్యము.

నిమ్నేషు వనదుర్గేషు వనేషుచ వనౌకసః
అభిప్లుత్యాభిపశ్యేయుః పరేషాం నిహితం బలమ్. ౧౩

టీక ॥ వనౌకసః=వానరులు;నిమ్నేషు=పల్లములయందును;వనదుర్గేషు-జలముచేఁబోనలవిగానిప్రదేశములందును; వనేషుచ= వనములయందును; నిహితం=ఉంచఁబడిన;పరేషాం=శత్రువులయొక్క; బలం = బలమును; అభిప్లుత్య=ఎగిరి; అభిపశ్యేయుః= చూతురుగాక.

ఒకవేళ, శత్రువులు,పల్లపు నేలలయందును,జలదుర్గస్థానంబులందును, అడవులయందును, సమయముఁ జూచి మనలంబ్రహరించుటకై సైన్యంబులుంచియుందురు;వానరులచ్చటచ్చట, నాకాశంబునకుద్గమించి,యట్టిస్థలంబులశత్రుసైన్యంబులున్నవో లేవోచూడవలయును. అని, తాత్పర్యము.

యచ్చ ఫల్గు బలం కించి త్తదత్రైవో పయుజ్యతామ్
ఏతద్ధి కృత్యం ఘోరం నో విక్రమేణ ప్రయుజ్యతామ్. ౧౪

టీక॥ఫల్గు=అసారమయిన;బలంచ=సైన్యమును;యత్=ఏది;కించిత్=కొంచెము; అస్తి(అధ్యాహృతము)= కలదో;తత్=అది;అత్రైవ=ఇచ్చటనే; ఉపయుజ్యతాం= ఉపయోగింపఁబడుఁగాక. నః=మనయొక్క; ఏతత్=ఈ; కృత్యం=కార్యము; ఘోరంహి= భయంకరముగదా! విక్రమేణ=పరాక్రమముచేత; ప్రయుజ్యతాం=ప్రయోగింపఁబడుఁగాక.

కొంచెమునిస్సారమయినబలమున్న యెడల, దానినిచ్చటనే యుపయోగార్థమునుంచుదము; మనదిగొప్పకార్యము,కావున, నందఱునుబరాక్రమంబునవలంబించియుండవలయును.

అని, తాత్పర్యము.

సాగరౌఘనిభం భీమ మగ్రానీకం మహాబలాః
కపిసింహాః ప్రకర్షంతు శతశో౽థ సహస్రశః. ౧౫

టీక॥ మహాబలాః=అధికమయినబలముగలవారలగు; కపిసింహాః=వానరశ్రేష్ఠులు; శతశః=నూఱునూఱులుగాను;అథ=ఇంకను; సహస్రశః=వేనవేలుగాను; సాగరౌఘనిభం=సముద్రప్రవాహముతోసమానమయినదియు; భీమం=భయంకరమునగు; అగ్రానీకం=ముందటిసేనను; ప్రకర్షంతు=ఈడ్చు

రుగాక.

మహాబలశాలులగు వానరశ్రేష్ఠులు నూఱునూఱులుగాను వేనవేలుగాను గుంపులుగూడి, యుగ్రసేనతోఁ గూడి, ముందునడతురుగాక.

అని, తాత్పర్యము.

గజశ్చ గిరిసంకాశో గవయశ్చ మహాబలః
గవాక్షశ్చాగ్రతో యాంతు గవాం దృప్తా ఇవర్షభాః. ౧౬

టీక॥ గిరిసంకాశః= పర్వతముతోఁ సమానుఁడైన; గజశ్చ=గజుండును; మహాబలః= అధికమయినబలముగల; గవయశ్చ=గవయుండును; గవాక్షశ్చ=గవాక్షుండును; అగ్రతః=ముందట; గవాం= గోవులయొక్క; అగ్రతః(అధ్యాహృతము)=ముందట; దృప్తాః = గర్వించిన; ఋషభా ఇవ= ఆఁబోతులువలె; యాంతు= పోవుదురుగాక.

పర్వతాకారుండగుగజుండును, మహాబలుండగుగవయుండును, గవాక్షుండును, గర్వితంబులగునాఁబోతులు, గోవుల ముందటంబోవునట్లు, సేనకుముందునడతురుగాక. అని, తాత్పర్యము.

యాతు వానరవాహిన్యా వానరః ప్లవతాం వరః
పాలయ న్దక్షిణం పార్శ్వ మృషభో వానరర్షభః. ౧౭

టీక॥ ప్లవతాం = ఎగురువారిలోపల; వరః= శ్రేష్ఠుండును; వానరర్షభః= వానరశ్రేష్ఠుండునగు; ఋషభః=ఋషభుండను; వానరః=వానరుఁడు; వానరవాహిన్యాః=వానరసేనయొక్క; దక్షిణం=కుడిదైన; పార్శ్వం= ప్రక్కను; పాలయన్=రక్షించుచు; యాతు=పోవుఁగాక.

ఎగురువారిలోనుత్తముండును, వానరశ్రేష్ఠుండునగుఋషభుండు, వానరసేన దక్షిణపార్శ్వమును పాలించుచువచ్చుఁగాక. అని, తాత్పర్యము.

గంధహస్తీవ దుర్ధర్ష స్తరస్వీ గంధమాదనః
యాతు వానరవాహిన్యా స్సవ్యం పార్శ్వ మధిష్ఠితః. ౧౮

టీక॥ గంధహస్తీవ= మత్తగజమువలె; దుర్ధర్షః= ఎదిరింపనలవిగాని

వాఁడును; తరస్వీ = బలవంతుఁడున గు; గంధమాదనః=గంధమాదనుఁడు; వానరవాహిన్యాః = వానరసేనయొక్క. సవ్యం=ఎడమదైన; పార్శ్వం= ప్రక్కను; అధిష్ఠితః= అధిష్ఠించినవాఁడై; యాతు=పోవుఁగాక.

మత్తగజముంబోలెదుర్ధర్షుండును బలవంతుండునగు గంధమాదనుండు, వానరసేనయెడమప్రక్కను బాలించుచు, వచ్చుఁగాక. అని, తాత్పర్యము.

యాస్యామి బలమధ్యేఽహం బలౌఘ మభిహర్షయన్
అధిరుహ్య హనూమంత మైరావత మివేశ్వరః. ౧౯

టీక॥ అహం=నేను; ఈశ్వరః = ఇంద్రుఁడు; ఐరావతమివ = ఐరావతమునువలె; హనూమంతం = హనుమంతుని; అధిరుహ్య=ఎక్కి; బలౌఘం= సైన్యసమూహమును ; అభిహర్షయన్=సంతసింపఁజేయుచు ; బలమధ్యే=సైన్యమునడుమను; యాస్యామి= పోయెదను.

నేను, దేవేంద్రుండైరావతమునారోహించునట్లు , హనుమంతునిపైనారోహించి , సైన్యంబులకుత్సాహంబు గల్గించుచు, సైన్యమధ్యంబునవచ్చెదను. అని, తాత్పర్యము.

అంగదే నైష సంయాతు లక్ష్మణ శ్చాంతకోపమః
సార్వభౌమేన భూతేశో ద్రవిణాధి పతిర్యథా. ౨౦

టీక॥ అంతకోపమః= యమునితోఁ బోల్కిగల; ఏషః=ఈ; లక్ష్మణశ్చ= లక్ష్మణుండును; అంగదేన= అంగదునిచేత; సార్వభౌమేన = సార్వభౌమమనునుత్తరదిగ్గజముచేత; భూతేశః= యక్షులకుఁబ్రభువైన ; ద్రవిణాధిపతిర్యథా=కుబేరుండువలె; సంయాతు= పోవుఁగాక.

యక్షనాధుండగుకుబేరుండు, సార్వభౌమంబను నుత్తరదిగ్గజంబునెక్కి పోవునట్లు, అంతకతుల్యుండగు నీలక్ష్మణుండును, అంగదునారోహించి, వచ్చునుగాక. అని, తాత్పర్యము.

జాంబవాంశ్చ సుషేణశ్చ వేగదర్శీ చ వానరః

ఋక్షరాజో మహాసత్త్వః కుక్షిం రక్షంతు తే త్రయః. ౨౧

టీక॥ ఋక్షరాజః=ఎలుఁగుగొడ్డుల కుఁబ్రభుండును; మహాసత్త్వః= అధికమయినబలముగలవాఁడునగు; జాంబవాంశ్చ=జాంబవంతుఁడును ;సుషేణశ్చ=సుషేణుండును; వేగదర్శీ = వేగదర్శియను; వానరశ్చ=వానరుండును; తే=వారలు; త్రయః=ముగ్గురును; కుక్షిం=వెనుకటిభాగమును; రక్షంతు=రక్షింతురుగాక.

ఋక్షరాజుండును మహాబలుండునగుజాంబవంతుండును సుషేణుండును వేగదర్శియు,వీరుముగ్గురును , సేనాపశ్చాద్భాగమునురక్షింతురుగాక. అని, రాముండు,చెప్పెను. అని, తాత్పర్యము

రాఘవస్య వచశ్శ్రుత్వా సుగ్రీవో వాహినీపతిః
వ్యాదిదేశ మహావీర్యాన్ వానరా న్వానరర్షభః. ౨౨

టీక॥వానరర్షభః=వానరశ్రేష్ఠుండును; వాహినీపతిః= వానరసేనకుఁ బ్రభుండునగు;సుగ్రీవః=సుగ్రీవుండు; రాఘవస్య=రామునియొక్క; వచః= మాటను;శ్రుత్వా=విని;మహావీర్యాన్=అధికమయినపరాక్రమముగల; వానరాన్= వానరులను; వ్యాదిదేశ=ఆజ్ఞాపించెను.

వానరోత్తముండును వానరసేనాధీశ్వరుండునగు సుగ్రీవుండు రాముండు చెప్పిన మాటనువిని, మహాపరాక్రమశాలులగువానరులకుఁ,బయనముకండని యాజ్ఞాపించెను. అని, తాత్పర్యము,

తే వానరగణా స్సర్వే సముత్పత్య యుయుత్సవః
గుహాభ్య శ్శిఖరేభ్యశ్చ ఆశు పుప్లువిరే తదా. ౨౩

టీక॥ తదా=అప్పుడు; తే=ఆ; వానరగణాః=వానరసమూహములు ; సర్వే=అందఱును; యుయుత్సవః=యుద్ధముసేయఁగోరినవారలై ; సముత్పత్య=ఎగిరి; ఆశు=శీఘ్రముగా; గుహాభ్యశ్చ=గుహలవలనను;శిఖరేభ్యశ్చ=పర్వతశిఖరములవలనను; పుప్లువిరే=గంతులువేసిరి.

అప్పుడువానరులందఱును, యుద్ధోత్సాహులయి,గుహలనుండియుఁ బర్వ

తశిఖరంబుల నుండియు వృక్షంబులనుం డియు, నగిరి, గంతులు వేసిరి.

అని, తాత్పర్యము,

తతో వానరరాజేన లక్ష్మణేనచ పూజితః
జగామ రామో ధర్మాత్మా ససైన్యో దక్షిణాం దిశమ్. ౨౪

టీక॥తతః=అటుపిమ్మట; ధర్మాత్మా= ధర్మస్వభావుండగు; రామః=రాముఁడు; వానరరాజేన= వానరేశ్వరుండగుసుగ్రీవునిచేతను; లక్ష్మణేనచ=లక్ష్మణునిచేతను; పూజితః=పూజింపఁబడినవాఁడై; ససైన్యః= సైన్యముతోఁగూడినవాఁడై; దక్షిణాం= దక్షిణపు; దిశం= దిక్కునుగూర్చి; జగామ= పొందెను.

అంత, ధర్మాత్ముండగు రాముండు వానర రాజుండగుసుగ్రీవుని చేలక్ష్మణుని చేఁబూజితుండై, వానరసైన్యంబుఁగూడి, దక్షిణపుదిక్కునుబట్టి, పోయెను.

అని, తాత్పర్యము.

శతైశ్శతసహస్రైశ్చ కోటిభి రయుతైరపి
వారణాభైశ్చ హరిభి ర్యయౌ పరివృత స్తదా. ౨౫

టీక॥తదా=అప్పుడు; సః (అధ్యాహృతము)=ఆరాముఁడు; వారణాభైశ్చ=ఏనుంగులతోసమానులును; శతైః=నూఱులును; శతసహస్రైశ్చ=లక్షలును; కోటిభిః=కోటులును; అయుతైరపి=పదివేలునగు; హరిభిః=వానరులచేత; పరివృతః = పరివేష్టింపఁబడినవాఁడై; యయౌ=పోయెను,

అప్పుడు, రాముండు, నూఱునూఱులుగాను, లక్షలులక్షలుగాను, కోటులు కోటులుగాను, పదివేలు పదివేలుగాను, నుండువానరులచేఁబరివేష్టితుండై, పోయెను. అని, తాత్పర్యము.

తం యాంత మనుయాతి స్మ మహతీ హరివాహినీ

టీక॥మహతీ=గొప్పదగు; హరివాహినీ=వానరసేన; యాంతం=పోవుచున్న; తం=ఆరాముని; అనుయాతిస్మ=వెంబడించినది.

అప్పుడు రాముండు, పోవుచుండఁగా, ఆయనను, గొప్పవానరసేన, వెంబడించినడచినది.

అని, తాత్పర్యము.

దృష్టాః ప్రముదితా స్సర్వే సుగ్రీవేణా భిపాలితాః. ౨౮
ఆప్లవంతః ప్లవంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః
క్ష్వేళంతో ధావమానా స్తే జగ్ము ర్వై దక్షిణాం దిశమ్. ౨౯
భక్షయంత స్సుగంధీని మధూని చ ఫలానిచ
ఉద్వహంతో మహావృక్షా న్మంజరీ పుంజధారిణః. ౩౦

టీక॥ తే=ఆ; ప్లవంగమాః=వానరులు; సర్వే=అందఱును; దృష్టాః=గర్వించినవారలై; ప్రముదితాః= మిక్కిలియు సంతసించినవారలై; సుగ్రీవేణ = సుగ్రీవునిచేత; అభిపాలితాః=పాలింపఁబడినవారలై; ఆప్లవంతః = ఎగురుచు; ప్లవంతశ్చ=గంతులు వేయుచును; గర్జంతశ్చ=అఱచుచును; క్ష్వేళంతః=సింహనాదము సేయుచు; ధావమానాః=పరుగెత్తుచు; సుగంధీని=మంచివాసనగల; మధూనిచ=తేనెలను; ఫలానిచ=పండ్లను; భక్షయంతః=భక్షించుచు; మంజరీపుంజధారిణః=పూగుత్తులసమూహములను ధరించునట్టి; మహావృక్షాన్=గొప్పవృక్షములను; ఉద్వహంతః=పట్టుకొనుచు; దక్షిణాం=దక్షిణపు; దిశం=దిక్కునుగూర్చి; జగ్ముః= పోయిరి. "వై" అనునది పాదపూరణార్థము.

ఆవానరులు, గర్వితులయి, సంతుష్టులయి, సుగ్రీవపాలితులయి, యెగురుచు, గంతులు వేయుచు, నఱచుచుసింహనాదంబులు గావించుచుఁ, బరుగులిడుచు, సుగంధిఫలంబులం దినుచుఁ, దేనియలం ద్రావుచు, విలాసార్థము, పుష్పమంజరీశోభితంబులగు పెద్దవృక్షంబులం బట్టుకొనుచు, దక్షిణదిక్కునకుం బోయిరి. అని, తాత్పర్యము.

అన్యోన్యం సహసా దృష్టా నిర్వహంతి క్షిపంతిచ
పతంతశ్చో త్పతం త్యన్యే పాత యంత్యపరే పరాన్. ౩౧

టీక॥ తే=ఆవానరులు; దృష్టాః= గర్వించినవారలయి; సహసా = బలము

చేత; అన్యోన్యం=ఒండొరులను; నిర్వహంతి=ఎత్తుచుండిరి. క్షిపంతిచ=పడవేయుచునుండిరి. అన్యే = ఇతరులు; పతంతశ్చ=పడుచును; ఆక్షిపంతి=ఆక్షేపించుచుండిరి. అపరే=మఱికొందఱు; పరాన్=ఇతరులను, పడద్రోయువారలను అట; పాతయంతి= పడద్రోయుచుండిరి.

అప్పుడు, వానరులు, గర్వితులయి, బలంబునఁగొందఱు, ఇతరులం బైకెత్తిరి; కొందఱితరులంబడఁద్రోసిరి; కొందఱు పడఁద్రోయఁబడియశక్తులు కావునఁ, బడఁద్రోసిన వారలనాక్షేపించిరి; శక్తులగువారలుకొందఱు, తమ్ముఁబడఁద్రోసిన వారలమఱలంబడఁద్రోసిరి.

అని, తాత్పర్యము.

రావణో నో నిహంతవ్య స్సర్వేచ రజనీచరాః
ఇతి గర్జంతి హరయో రాఘవస్య సమీపతః. ౩౦

టీక॥ "నః=మనకు; రావణః= రావణుఁడు; నిహంతవ్యః= చంపఁబడవలసినవాఁడు. రజనీచరాః=రాక్షసులు; సర్వేచ=అందఱును; నిహంతవ్యాః (అధ్యాహృతము)=చంపఁబడవలసిన వారలు" ఇతి=అని; హరయః = వానరులు; రాఘవస్య=రామునియొక్క; సమీపతః=సమీపమునందు; గర్జంతి=అఱచుచుండిరి.

"మనము, రావణుని రాక్షసుల నందఱను, జంపివేయవలయు" ననియిట్లువానరులు, రామునిసమీపమునందు, గర్జించుచుండిరి.

అని, తాత్పర్యము.

పురస్తా దృషభో వీరో నీలః కుముద ఏవచ
పంథానం శోధయంతి స్మ వానరై ర్బహుభి స్సహ. ౩౧

టీక॥వీరః= పరాక్రమశాలియగు; ఋషభః = ఋషభుండనువాఁడును; నీలః=నీలుండును; కుముదఏవచ = కుముదుండును; బహుభిః = పెక్కులయిన; వానరై స్సహ=వానరులతోఁగూడ; పురస్తాత్ = ముందట; పంథానం = మార్గమును; శోధయంతిస్మ=శోధింపుచుండిరి.

పరాక్రమశాలియగుఋషభుండనువాఁడునునీలుండునుగుముదుండును, పె

కుఁ-వానరులంగూడి, సేనకుముందునడచి, మార్గఱంబుశోధింపుచుండిరి. అని, తాత్పర్యము.

మధ్యేతు రాజా సుగ్రీవో రామో లక్ష్మణ ఏవచ
బహుభి ర్బలిభి ర్భీమై ర్వృతా శ్శత్రు నిబర్హణాః. ౩౨

టీక ॥ శత్రునిబర్హణాః=శత్రువులంజంపునట్టి; రాజా=రాజయిన; సుగ్రీవః=సుగ్రీవుఁడును; రామః=రాముండును; లక్ష్మణఏవచ=లక్ష్మణుండును; బలిభిః=బలవంతులును; భీమైః=భయంకరులునగు; బహుభిః= పెక్కు-వానరులచేత; వృతాః=చుట్టఁబడినవారలై; మధ్యేతు=నడుమను ; జగ్ముః(అధ్యాహృతము)=పోయిరి.

శత్రువులం జంపువారలగు, వానరరాజుసుగ్రీవుండును, రాముండును, లక్ష్మణుండును, బలవంతులును భయంకరాకారులునగు పెక్కు-వానరులచేఁబరివేష్టింపఁబడినవారలై, సేనామధ్యంబునం బోయిరి. అని, తాత్పర్యము.

హరి శ్శతవలి ర్వీరః కోటీభి ర్దశభి ర్వృతః
సర్వా మేకో హ్యవష్టభ్య రరక్ష హరివాహినీమ్. ౩౩

టీక॥వీరః=పరాక్రమశాలియగు; శతవలిః=శతవలియను; హరిః= వానరుఁడు; దశభిః=పదియగు; కోటీభిః=కోటులచేత; వృతః = చుట్టఁబడినవాఁడై; ఏకః=ఒక్కఁడే; సర్వాం= సమస్తమయిన; హరివాహినీం=వానరసేనను; అవష్టభ్య=అధిష్ఠించి; రరక్షహి = రక్షించెనుగదా!

వీరుండగు, శతవలియను వానరుండు, పదికోట్లవానరవీరులచేఁ బరివేష్టితుండై, యొక్కఁడె, వానరసేననంతయురక్షించుచుండెను.

అని, తాత్పర్యము.

కోటీశతపరీవారః కేసరీ పనసో గజః
అర్కశ్చాతిబలః పార్శ్వ మేకం తస్యాభి రక్షతి. ౩౪

టీక ॥ కోటిశతపరీవారః=నూఱుకోటులపరివారముగల; కేసరీ=కేసరియును; పనసః=పనసుండును; గజః=గజుండును; అతిబలః= అధికమయినబలముగల; అరుఁ శ్చ=అరుఁడును; తస్య= ఆవానరసైన్యముయొక్క; ఏకం=ఒకటైటయిన; పార్శ్వం=ప్రక్కను; అభిరక్షతి(అభిరక్షంతి) = రక్షించుచుండిరి.

కేసరియుఁబనసుండును గజుండును మహాబలుండునగు నరుఁడును, ఒక్కొకరు, నూఱుకోటులవానరులతోఁగూడి వానరసేన యొక పార్శ్వంబు నురక్షింపుచుండిరి.

అని, తాత్పర్యము.

సుషేణో జాంబవాంశ్చైవ ఋక్షైశ్చ బహుభి ర్వృతౌ
సుగ్రీవం పురతః కృత్వా జఘనం సంరరక్షతుః. ౩౪

టీక॥ సుషేణః= సుషేణుండును; జాంబవాంశ్చైవ = జాంబవంతుండును; బహుభిః= పెక్కులయిన; ఋక్షైశ్చ=ఎలుఁగుగొడ్డులచేతను; వృతౌ=చుట్టఁబడినవారలై; సుగ్రీవం=సుగ్రీవుని; పురతః=ముందట, కృత్వా= చేసికొని; జఘనం= పశ్చాద్భాగమును; సంరరక్షతుః=రక్షించిరి.

సుషేణుండును జాంబవంతుండును,ఋక్షసైన్యంబుచేఁబరివేష్టితులయి, సుగ్రీవునిముందటనుంచుకొని, వానరసేనపశ్చిమభాగమునురక్షింపుచుండిరి.

అని, తాత్పర్యము.

తేషాం సేనాపతి ర్వీరో నీలో వానరపుంగవః
సంపత న్పతతాం శ్రేష్ఠ స్తద్బలం పర్యపాలయత్. ౩౫

టీక॥ తేషాం=ఆవానరులకు; సేనాపతిః=సేనానాయకుండును; వీరః=పరాక్రమశాలియును; వానరపుంగవః=వానరశ్రేష్ఠుండును; పతతాం=ఎగురువారలలో; శ్రేష్ఠః=ఉత్తముండునగు; నీలః= నీలుండు; సంపతన్=అంతటను తిరుగుచు; తత్ =ఆ; బలం= సేనను; పర్యపాలయత్ =పాలించెను.

వానర సేనానాయకుండును, బరాక్రమవంతుండును, వానరోత్తముం

డను, ఉత్పతనశక్తిగలవారలలోనుత్తముండునగునీలుండు, నాలుగుప్రక్కలం దిరుగుచు, వానరసేనను, రక్షింపుచుండెను. అని, తాత్పర్యము.

దరీముఖః ప్రజంఘశ్చ రంభోథ రభసః కపిః
సర్వతశ్చ యయు ర్వీరా స్త్వరయంతః ప్లవంగమాన్. ౩౭

టీక॥ అథ=ఇంకను; వీరాః=పరాక్రమశాలులగు; దరీముఖః=దరీముఖుండును; ప్రజంఘశ్చ=ప్రజఘుండును; రంభః=రంభుండును; రభసః = రభసుడను. కపిః=వానరుండును; సర్వతశ్చ=అంతటను; ప్లవంగమాన్=వానరులను; త్వరయంతః=వేగిరపఱచుచు; యయుః=పోయిరి.

మఱియును, బరాక్రమవంతులగు, దరీముఖుండును ప్రజంఘుండును, రంభుండును రభసుండును, నాలుగుప్రక్కలం దిరుగుచు, వానరులనందఱను బొత్తాహపఱచుచును, బోయిరి.

అని, తాత్పర్యము.

ఏవం తే హరిశార్దూలా గచ్ఛంతో బలదర్పితాః
అపశ్యం స్తే గిరిశ్రేష్ఠం సహ్యం ద్రుమలతా యుతమ్. ౩౮
సరాంసిచ సుఫుల్లాని తటాకాని వనానిచ

టీక॥ఏవం=ఇట్లు; తే=ఆ; హరిశార్దూలాః=వానరశ్రేష్ఠులు; బలదర్పితాః=బలగర్వితులయి; గచ్ఛంతః=పోవుచు; తే=ఆవానరులు; ద్రుమలతాయుతం=వృక్షములతోను తీఁగెలతోనుంగూడిన; గిరిశ్రేష్ఠం=పర్వతశ్రేష్ఠమయిన; సహ్యం= సహ్యపర్వతమును; సుఫుల్లాని=చక్కఁగావికసించిన, చక్కఁగావికసించినకమలములు మొదలగు నవిగలయటుల; సరాంసిచ=సరస్సులను; తటాకాని=చెఱువులను; వనానిచ=అడవులను; అపశ్యన్=చూచిరి.

ఆవానరోత్తములు, ఇట్లు బలగర్వితులయిపోవుచు, దూరంబుననుండి, వృక్షంబులతోను లతలతోను ఒప్పుచున్న పర్వతశ్రేష్ఠంబగు సహ్యపర్వతంబును, మఱియు, ఫుల్లపద్మకల్హారంబులగు సరస్సులను దటాకంబులను వనంబులునుం, జూచిరి.

అని, తాత్పర్యము.

రామస్య శాసనం జ్ఞాత్వా భీమకోపస్య భీతవత్. ౩౯
వర్జయ న్నగరాభ్యాశాం స్తథా జనపదానపి
సాగరౌఘనిభం భీమం త ద్వానరబలం మహత్. ౪౦
ఉత్ససర్ప మహాఘోషం భీమఘోష ఇవార్ణవః

టీక॥ సాగరౌఘనిభం=సముద్రప్రవాహముతో సమానమయినదియు; భీమం=భయంకరమును;మహత్=గొప్పదియునగు;తత్=ఆ; వానరబలం=వానరసైన్యము;భీమకోపస్య= భయంకరమగుకోపముగల; రామస్య= రామునియొక్క; శాసనం=ఆజ్ఞను;జ్ఞాత్వా=తెలిసికొని; భీతవత్=భయమునొందినదై; నగరాభ్యాశాన్ = పట్టణసమీపప్రదేశములను;తథా=అట్లు; జనపదానపి=గ్రామములను;వర్జయన్= విడుచుచు; మహాఘోషం=పెద్దధ్వనిగలదై; భీమఘోషః= భయంకరమగుధ్వనిగల; అర్ణవఇవ = సముద్రమువలెఁ;ఉత్ససర్ప=పోయెను.

సముద్రంబుంబోలె ననంతంబయియున్నదియుభయంకరంబునగు నావానరసేన , భయంకరకోపుండగురామునాజ్ఞకుభయపడి, నగరంబులపైఁగాని గ్రామంబులపైఁగానిపడక , మహాధ్వనిగదుర , మహాఘోషంబగుసముద్రంబుకరణిఁ, బోయినది.

అని, తాత్పర్యము.

తస్య దాశరథేః పార్శ్వే శూరాస్తే కపికుంజరాః. ౪౧
తూర్ణ మాపుప్లువు స్సర్వే సదశ్వాఇవ చోదితాః

టీక॥తస్య=ఆ; దాశరథేః=రామునియొక్క; పార్శ్వే= ప్రక్కయందు; శూరాః= యుద్ధమునందుభయములేనట్టి; తే=ఆ; కపికుంజరాః = వానరశ్రేష్ఠులు; సర్వే = అందఱును; చోదితాః=ప్రేరేపింపఁబడిన; సదశ్వాఇవ=ఉత్తమాశ్వంబులువలె ; తూర్ణం = శీఘ్రముగా, ఆపుప్లువుః=పోయిరి-

రామునకుల్లాసంబుగల్గించుటకై , యతనిసమీపంబున , శూరులగువానరోత్తములు,చోదితంబులగునుత్తమాశ్వంబులకైవడి, శీఘ్రంబునంబరుగెత్తిరి- అని, తాత్పర్యము-

కపిభ్యా మూహ్యమానౌ తౌ శుశుభాతే నరోత్తమౌ. ౪౨
మహాద్భ్యామివ సంస్పృష్టౌ గ్రహాభ్యాం చంద్రభాస్కరౌ

టీక॥ కపిభ్యాం=హనుమదంగదులచేత; ఊహ్యమానౌ=మోయఁబడుచున్న; తౌ=ఆ; నరోత్తమౌ=పురుషశ్రేష్ఠులగు రామ లక్ష్మణులు ; మహద్భ్యాం = పూజ్యములగు ; గ్రహాభ్యాం = బృహస్పతిశుక్రులచేత; సంస్పృష్టౌ=స్పృశింపఁబడిన ; చంద్రభాస్కరౌ ఇవ=చంద్రసూర్యులువలె; శుశుభాతే=ప్రకాశించిరి-

పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు , హనుమదంగదులపైనుండుటంజేసి , బృహస్పతిశుక్రులతోసంబంధించిన, చంద్రసూర్యులుంబోలెఁ, బ్రకాశించిరి- అని, తాత్పర్యము-

తతో వానర రాజేన లక్ష్మణేనచ పూజితః. ౪౩
జగామ రామో ధర్మాత్మా ససైన్యో దక్షిణాం దిశమ్

టీక॥తతః=అంత;ధర్మాత్మా= ధర్మస్వభావుండగు;రామః = రాముఁడు;వానర రాజేన= వానరేశ్వరుండగు సుగ్రీవునిచేతను; లక్ష్మణేనచ=లక్ష్మణునిచేతను;పూజితః = పూజింపఁబడినవాఁడై;ససైన్యః= సైన్యముతోఁగూడినవాఁడై, దక్షిణాం=దక్షిణపు; దిశం= దిక్కునుగూర్చి; జగామ=పోయెను.

అట్లు , ధర్మాత్ముండగు రాముండు, వానరరాజుండగు సుగ్రీవుండును లక్ష్మణుండునుబూజింప, వానరసేనంగూడి,దక్షిణపుదిక్కునకుం బోయెను. అని, తాత్పర్యము.

త మంగదగతో రామం లక్ష్మణ శ్శుభయా గిరా. ౪౪
ఉవాచ పరిపూర్ణార్థ స్స్మృతి మాన్ప్రతి భానవాన్

టీక॥ స్మృతిమాన్=జ్ఞాపకశక్తిగలవాఁడును ; ప్రతిభానవాన్= అధికమయిన ప్రతిభగలవాఁడునగు ; అంగద గతః = అంగదునిఁ బొందియున్న ; లక్ష్మణః = లక్ష్మణుఁడు ; పరిపూర్ణార్థః = నిండిన కోర్కె

ములగలవాఁడవై; తం=ఆ; రామం= రాముని గూర్చి; శుభయా= మంగళకరమయిన; గిరా=మాటచేత; ఉవాచ= చెప్పెను.

జ్ఞాపకశక్తిగలవాఁడును, మిక్కిలియుఁబ్రతిభగలవాఁడునగు, అంగదునిపైఁగూర్చుండియున్నలక్ష్మణుఁడు, పరిపూర్ణమనోరథుండై, హనుమంతునిపైనున్నరామునింజూచి, మంగళవాక్యంబునని, ట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

హృతా మవాప్య వైదేహీం క్షిప్రం హత్వాచ రావణమ్. ౪౫
సమృద్ధార్థ స్సమృద్ధార్థా మయోధ్యాం ప్రతియాస్యసి

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; క్షిప్రం=శీఘ్రముగా; హృతాం= అపహరింపఁబడిన; వైదేహీం= సీతాదేవిని; అవాప్య=పొంది; రావణం= రావణుని; హత్వాచ = చంపియు; సమృద్ధార్థః=నిండినకోరుకులుగలవాఁడవై; సమృద్ధార్థాం= నిండినకోరుకులుగల; అయోధ్యాం ప్రతి=అయోధ్యనుగూర్చి; యాస్యసి= పోఁగలవు.

నీవు, శీఘ్రంబుగా, రావణునిఁజంపి, మఱలసీతాదేవింబొంది, సమృద్ధమనోరథుండవై, యట్లుసమృద్ధార్థంబయియున్నయయోధ్యానగరంబునకుంబోఁగలవు. అని, తాత్పర్యము.

మహాంతిచ నిమిత్తాని దివి భూమౌచ రాఘవ. ౪౬
శుభాని తవ పశ్యామి సర్వాణ్యే వార్థసిద్ధయే

టీక॥ రాఘవ=రాముఁడా! దివి=ఆకాశమునందు; భూమౌచ = భూమియందును; మహాంతి=పూజ్యములును; శుభాని=మంగళకరములునగు; నిమిత్తాని= నిమిత్తములు; యానిసంతి (అధ్యాహృతము)=ఏవిగలవో; తాని(అధ్యాహృతము)=వానిని; సర్వాణ్యేవచ=అన్నింటినే; తవ = నీయొక్క; అర్థసిద్ధయే = కార్యసిద్ధికొఱకు; ప్రాదుర్భూతాని(అధ్యాహృతము)=ప్రాదుర్భవించినవానిఁగా; పశ్యామి = చూచుచున్నాను.

రాముఁడా! ఆకాశంబునందును భూమియందును, గొప్పశుభనిమిత్తంబులేవిగలవో, అవియన్నియునిప్పుడు ప్రాదుర్భూతంబులయి, నీకార్యసిద్ధిని

సూచించుచున్నవి. అని, తాత్పర్యము.

అనువాతి శుభో వాయుస్సేనాం మృదుహిత స్సుఖః. ౪౭
పూర్ణవల్గు స్వరాశ్చేమే ప్రవదంతి మృగద్విజాః

టీక॥ శుభః=మంగళసూచకంబును; హితః=హితకరంబును; సుఖః=సుఖకరంబునగు; వాయుః = వాయువు; మృదు=మెత్తఁగా; సేనాం=సేనను; అనువాతి=అనుసరించివీచుచున్నది. ఇమే=ఈ; మృగద్విజాశ్చ = మృగంబులును బక్షులును; పూర్ణవల్గుస్వరాః= నిండిన మధురధ్వనులుగలవై; ప్రవదంతి= ధ్వనించుచున్నవి.

వాయువు, హితకరంబయి సుఖకరంబయి, భావిమంగళంబు సూచించుచు, మెల్లమెల్లఁగా, సేనవెంబడివీచుచున్నది; మృగంబులును బక్షులును, మధురంబుగా, ధ్వనించుచున్నవి.

అని, తాత్పర్యము.

ప్రసన్నాశ్చ దిశ స్సర్వా విమలశ్చ దివాకరః. ౪౮

టీక॥ దిశః=దిక్కులు; సర్వాశ్చ=అన్నియు; ప్రసన్నాః= ప్రసన్నములయి యున్నవి. దివాకరశ్చ= సూర్యుఁడును; విమలః=స్వచ్ఛుఁడైయున్నాఁడు.

దిక్కులన్నియుఁ బ్రసన్నములయి యున్నవి; సూర్యుండువిమలుండైయున్నాఁడు. అని, తాత్పర్యము.

ఉశనాశ్చ ప్రసన్నార్చి రనుత్వాం భార్గవో గతః
బ్రహ్మరాశి ర్విశుద్ధశ్చ శుద్ధాశ్చ పరమర్షయః. ౪౯
అర్చిష్మంతః ప్రకాశంతే ధ్రువం సర్వే ప్రదక్షిణమ్

టీక॥ బ్రహ్మరాశిః = వేదరాశిగలవాఁడును; విశుద్ధశ్చ=పరిశుద్ధుండునగు; భార్గవః=భృగుపుత్రుండయిన; ఉశనాశ్చ=శుక్రుండును; ప్రసన్నార్చిః= ప్రసన్నమయిన కాంతి గలవాఁడై; త్వాం=నిన్ను; అనుగతః=వెంబడించియున్నాఁడు. శుద్ధాః=పరిశుద్ధులును; అర్చిష్మంతః=అధికమయినకాంతిగల

వారలునగు; పరమర్షయశ్చ = మహర్షులును; ధ్రువం=ధ్రువునిగూర్చి; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కుర్వంతః (అధ్యాహృతము)=చేయుచు; ప్రకాశంతే=ప్రకాశించుచున్నారు-

సమస్తవేదవేత్తయుఁబరిశుద్ధుండునగుభార్గవుండుశుక్రుండు, ప్రసన్నతేజుండై, నీకు వెనుకం బ్రకాశించుచున్నాడు; మఱియుఁ, బరిశుద్ధులగు సప్తర్షులు, కాంతిమంతులయి, ధ్రువునకుఁబ్రదక్షిణంబుగాఁదిరుగుచుఁ, బ్రకాశించుచున్నారు.

అని, తాత్పర్యము.

త్రిశంకు ర్విమలో భాతి రాజర్షి స్సపురోహితః. ౫౦
పితామహవరో స్మాక మిక్ష్వాకూణా మ్మహాత్మనామ్

టీక॥ మహాత్మనాం=పూజ్యమయిన స్వభావముగల; ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకువంశమునఁబుట్టిన; అస్మాకం=మనకు; పితామహవరః=పితామహశ్రేష్ఠుఁడును, ప్రధానకూటస్థుఁడుననుట; రాజర్షిః= రాజునుఋషియునగు; త్రిశంకుః=త్రిశంకువు; సపురోహితః=పురోహితుండగు వసిష్ఠునితోఁ గూడినవాఁడై; విమలః=నిర్మలుండై; భాతి=ప్రకాశించుచున్నాఁడు.

మహాత్ములు నిక్ష్వాకువంశ్యులునగు మనకుఁ బ్రధానకూటస్థుఁడును రాజర్షియునగు త్రిశంకుమహారాజును, విశ్వామిత్రసృష్టసప్తర్షిగత వసిష్ఠునితోఁగూడి, నిర్మలుండై, ప్రకాశించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

విమలే చ ప్రకాశేతే విశాఖే నిరుపద్రవే. ౫౧
నక్షత్రవర మస్మాక మిక్ష్వాకూణా మ్మహాత్మనామ్.

టీక॥ మహాత్మనాం= పూజ్యస్వభావులగు; ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకువంశమునంబుట్టిన; అస్మాకం = మనయొక్క; నక్షత్రవరం= నక్షత్రశ్రేష్ఠమయిన; విశాఖేచ= విశాఖానక్షత్రములును; నిరుపద్రవే= ఉపద్రవములేనివై; విమలే=నిర్మలములయి; ప్రకాశేతే=ప్రకాశించుచున్నవి.

మహాత్ములగుమనయిక్ష్వాకువంశ్యులనక్షత్రమయిన విశాఖానక్షత్రమును,

దుష్టగ్రహసంబంధములేక, నిర్మలమయి, ప్రకాశించుచున్నది.

అని, తాత్పర్యము.

నైరృతం నైరృతానాంచ నక్షత్ర మభిపీడ్యతే. ౫౨
మూలో మూలవతా స్పృష్టో ధూప్యతే ధూమకేతునా

టీక ॥ నైరృతం=నిరృతియే దేవతగాఁగలదియగు; నైరృతానాం=రాక్షసులయొక్క; నక్షత్రంచ=మూలానక్షత్రమును; అభిపీడ్యతే=పీడింపఁబడుచున్నది. మూలః=మూలానక్షత్రము; మూలవతా=సామీప్యముగల; ధూమకేతునా=ధూమకేతువుచేత; స్పృష్టః=తాఁకఁబడినదై; ధూప్యతే=తపింపఁజేయఁబడుచున్నది.

ఇదిగాక, నిరృతిదైవత్యంబగు రాక్షసులనక్షత్రమయినమూలానక్షత్రము సమీపంబుననున్నధూమకేతువుచేస్పృశింపఁబడితపింపఁజేయఁబడినదై మిక్కిలియుఁబీడితమగుచున్నది.

అని, తాత్పర్యము.

సర్వం హ్యేత ద్వినాశాయ రాక్షసానా ముపస్థితమ్. ౫౩
కాలే కాలగృహీతానాం నక్షత్రం గ్రహపీడితమ్

టీక॥ ఏతత్=ఇది; సర్వంచ=అంతయు; రాక్షసానాం=రాక్షసులయొక్క; వినాశాయ=చేటుకొఱకు; ఉపస్థితం=సంభవించినది. కాలగృహీతానాం=మృత్యువుచేగ్రహింపఁబడినవారలయొక్క; నక్షత్రం=నక్షత్రము; కాలే=అంతకాలమునందు; గ్రహపీడితం=దుష్టగ్రహముచేఁబీడింపఁబడినది; భవతి (అధ్యాహృతము)=అగుచున్నది.

ఇదంతయు, రాక్షసుల వినాశంబునకేపుట్టినవి; ఏలయనఁగా, మృత్యుగ్రస్తులగువారినక్షత్రంబు, అట్టియంతకాలంబున, దుష్టగ్రహపీడితంబగును.

అని, తాత్పర్యము.

ప్రసన్నా స్సురసా శ్చాపో వనాని ఫలవంతిచ. ౫౪
ప్రవాంత్య భ్యధికం గంధాన్ యథర్తు కుసుమా ద్రుమాః

టీక॥ఆపః=నీళ్లు; ప్రసన్నాః= స్వచ్ఛములై; సురసాః= మంచి రుచిగలవై; భవంతి (అధ్యాహృతము)= అగుచున్నవి. వనానిచ=అడవులును;ఫలవంతి=మంచిపండ్లుగలవి. ద్రుమాః= వృక్షములు ; యథర్తుఃకుసుమాః=ఋతువునతిక్రమింపకపుష్పములుగలవై; అభ్యధికం=మిక్కిలియునధికముగా; గంధాన్=తావులను; ప్రవాంతి=క్రక్కుచున్నవి.

మఱియు, నీళ్లుస్వచ్ఛములయి,మంచిరుచిగలిగియున్నవి; వనంబులు, ఫలపూర్ణంబులయియున్నవి; వృక్షములన్నియు, ఋతుమర్యాదనతిక్రమింపక, చక్కఁగాఁబుష్పించి, సుగంధంబులగుబాళించుచున్నవి.

అని, తాత్పర్యము.

వ్యూఢాని కపిసైన్యాని ప్రకాశంతే ధికం ప్రభో. ౫౫
దేవానామివ సైన్యాని సంగ్రామే తారకామయే

టీక॥ప్రభో= సమర్థుఁడవగురాముఁడా!వ్యూఢాని=వ్యూహములుగాఁజేయఁబడిన; కపిసైన్యాని=వానరసైన్యములు; తారకామయే తారకామయమను,తారకాసురవధంబుగలయనుట, లేక, తారకయనుబృహస్పతిభార్యయేనిమిత్తముగాఁగలయనుట; సంగ్రామే=యుద్ధమునందు;దేవానాం = దేవతలయొక్క;సైన్యానీవ= సైన్యములువలె; అధికం=మిక్కిలియు; ప్రకాశంతే=ప్రకాశించుచున్నవి.

ప్రభుండవగురాముఁడా! వ్యూహములుగా నేర్పఱుపఁబడియున్నయీవానరసైన్యంబులు, మున్ను తారకాసురయుద్ధంబున,(లేక, చంద్రుండుబృహస్పతిభార్యను దారంగొనిపోయినప్పుడు, తన్నిమిత్తకంబగు యుద్ధంబునందు) దేవసైన్యంబులుంబోలె , మిక్కిలియుం బ్రకాశించుచున్నవి.అని,తాత్పర్యము.

ఏవ మార్య సమీక్ష్యైతాన్ ప్రీతో భవితు మర్హసి. ౫౬

టీక॥ ఆర్య=పూజ్యుఁడవగురాముఁడా! ఏవం=ఇట్లు;ఏతాన్=వీనిని; సమీ

ప్య=చూచి;ప్రీతిః= సంతసించినవాఁడ వు;భవితుం=అగుటకు;అర్హసి=తగుదువు.

పూజ్యుఁడవగు రామాఁడా! ఇట్లు, ఈశుభనిమిత్తంబులన్నింటిని జూచి, సంతోషంబు నొందియుండుము. అని, లక్ష్మణుఁడు, రామునికిం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి భ్రాతరం మాశ్వాస్య హృష్టస్సౌమిత్రి రబ్రవీత్

టీక॥సౌమిత్రిః=లక్ష్మణుఁడు; హృష్టః= సంతసించినవాఁడై; ఇతి=ఇట్లు; భ్రాతరం=అన్నను;ఆశ్వాస్య=ఊఱడించి;అబ్రవీత్=చెప్పెను-

లక్ష్మణుండు, సంతుష్టుండై, యీప్రకారను,అన్నయగు రామునాశ్వాసించెను- అని, తాత్పర్యము-

అథా వృత్య మహీం కృత్స్నాం జగామ మహతీ చమూః. ౫౭
ఋక్షవానరశార్దూలై ర్నఖదంష్ట్రాయుధై ర్వృతా

టీక॥అథ=అంత; నఖదంష్ట్రాయుధైః=గోళ్లును పండ్లును యాయుధములుగాఁగల; ఋక్షవానరశార్దూలైః=ఎలుఁగుగొడ్డులలోను వానరులలోను శ్రేష్ఠులగువారలచేత;వృతా= చుట్టఁబడిన;మహతీ=గొప్పదగు;చమూః= సేన; కృత్స్నాం= సమస్తమయిన; మహీం=భూమిని;ఆవృత్య=వ్యాపించి;జగామ=పోయెను.

అటు, నఖదంతాయుధులగు నాఋక్షవానరుల మహాసేన,భూమినంతయు,వ్యాపించి, పోవుచుండెను.

అని, తాత్పర్యము.

కరాగ్రై శ్చరణాగ్రైశ్చ వానరై రుద్ధితం రజః. ౫౮
భీమ మంతర్దధే లోకం నివార్య సవితుః ప్రభామ్

టీక॥వానరైః=వానరులచేత;కరాగ్రైః= హస్తములకొనలచేతను; చరణాగ్రైశ్చ = పాదములకొనలచేతను;ఉద్ధితం=లేచిన; రజః=దుమ్ము; స

వితుః= సూర్యునియొక్క; ప్రభాం= కాంతిని; నివార్య= అడ్డగించి, భీమం= భయంకరము గా; లోకం= లోకమును; అంతర్దధే= కప్పెను.

వానరులహస్తములచేతను పాదములచేతను రేఁగినదుమ్ము, సూర్యుఁప్రకాశమునాపరించి, యందఱకును భయముగల్గునట్లు, లోకమంతయువ్యాపించినది. అని, తాత్పర్యము.

సపర్వత వనాకాశాం దక్షిణాం హరివాహినీ. ౫౯
ఛాదయంతీ యయౌ భీమా ద్యామివాంబుద సంతతిః

టీక॥ భీమా= భయంకరమగు; హరివాహినీ= వానరసేన; అంబుదసంతతిః= మేఘసమూహము; ద్యామివ= ఆకాశమునువలె; సపర్వతవనాకాశాం= పర్వతములతోను వనంబులతోను ఆకాశముతోనుంగూడిన; దక్షిణాం= దక్షిణపుదిక్కునందలి భూమిని; ఛాదయంతీ= కప్పుచు; యయౌ= పోయినది.

భయంకరాకారయగు నావానరసేన, మేఘసమూహము ఆకాశము నావరించునట్లు, పర్వతములతోను వనంబులతోను ఆకాశంబులతోనుంగూడిన, దక్షిణ భూమినంతయు నావరించుచుం బోయెను. అని, తాత్పర్యము.

ఉత్తరంత్యాంచ సేనాయాం సతతం బహుయోజనమ్. ౬౦
నదీ స్రోతాంసి సర్వాణి సస్యందు ర్విపరీతవత్

టీక॥ సతతం= నిరంతరముగా; సేనాయాం= సేన; ఉత్తరంత్యాంచ= దాటుచుండఁగాను; నదీస్రోతాంసి= ఏటిప్రవాహములు; సర్వాణి= అన్నియు; విపరీతవత్ = విపరీతమువలె; బహుయోజనం= పెక్కుయోజనములగునట్లుగా; సస్యందుః= ప్రవహించినవి.

అప్పుడు, ఆవానరసేన, నదులను నిరంతరముగా దాఁటుచుండుటచే, నీళ్లు పోవుటకు వీలులేక నిలిచి యుండుటం జేసి, దాఁటికాఁగానే, విపరీతప్రవాహము వచ్చినట్లు బహుయోజనంబులవఱకుఁ బాఱినవి. అని, తాత్పర్యము.

సరాంసి విమలాంభాంసి ద్రుమాకీర్ణాంశ్చ పర్వతాన్. ౬౧
సమాన్ భూమి ప్రదేశాంశ్చ వనాని ఫలవంతిచ
మధ్యేనచ సమంతాచ్చ తిర్యక్చాధశ్చ సావిశత్. ౬౨

టీక॥ సా=ఆవానరసేన; విమలాంభాంసి= స్వచ్ఛమయినజలముగల; సరాంసి=సరస్సులను; ద్రుమాకీర్ణాన్=వృక్షములచేవ్యాపింపఁబడిన; పర్వతాంశ్చ=పర్వతములను; సమాన్=మిట్టపల్లములులేని; భూమి ప్రదేశాంశ్చ= భూప్రదేశములను; ఫలవంతి= అధికమయిన పండ్లుగల; వనానిచ=వనములను; మధ్యేచ=నడుమను; తిర్యక్చ=అడ్డముగాను; సమంతాచ్చ=అంతటను; అధశ్చ= క్రిందుగాను; అవిశత్=ప్రవేశించెను.

ఆవానరులుస్వచ్ఛములగునీళ్లుగలసరస్సులను, చల్లనినీళ్లుగలవిగావున, వానిలోదిగిదాఁటిరి; వృక్షబహుళంబులగు పర్వతంబులువచ్చినప్పుడు, కొంచెమడ్డముగాఁబోయిదాఁటిరి; సమభూములలో,నంతటనువ్యాపించినడచిరి; ఫలవంతంబులగువనంబులువచ్చినప్పుడు, ఫలంబులందుకొనెడినవచ్చునని, చెట్ల క్రిందుగాఁబోయిరి- అని, తాత్పర్యము.

సమావృత్య మహీం కృత్స్నాం జగామ మహతీ చమూః

టీక॥ మహతీ = గొప్పదగు; చమూః=సేన; కృత్స్నాం=సమస్తమయిన; మహీం=భూమిని; సమావృత్య=వ్యాపించి; జగామ=పోయినది.

గొప్పదగు నావానరసేన, యిట్లు భూమినంతయువ్యాపించిపోవుచుండినది. అని, తాత్పర్యము.

తే హృష్ట మనస స్సర్వే జగ్ము ర్మారుత రంహసః. ౬౩
హరయో రాఘవ స్యార్థే సమారోపిత విక్రమాః

టీక॥ మారుతరంహసః=వాయువుయొక్క-వేగమువంటివేగముగల; తే= ఆ; హరయః=వానరులు; రాఘవస్య=రామునియొక్క; అర్థే=కార్యమునిమిత్తమయి; సమారోపితవిక్రమాః = ఆరోపింపఁబడిన పరాక్రమము గలవారలై; హృష్టమనసః= సంతోషించినమనస్సుగలవారలై; జగ్ముః=పోయిరి.

వాయుదేవునకుంబోలె మహావేగం బుగలయావానరులు, రామకార్యంబుని మిత్తముగ, పరాక్రమంబు నసలంచిం చి,సంతుష్టాంతఃకరణులయి,పోయిరి.

అని, తాత్పర్యము.

హర్ష వీర్య బలోద్రేకాన్ దర్శయంతః పరస్పరమ్. ౬౪
యౌవనోత్సేకజాన్ దర్పాన్ వివిధాంశ్చక్రు రధ్వని

టీక॥ తే(అధ్యాహృతము)=ఆవానరు లు; పరస్పరం=ఒండొరులకు; హర్షవీర్యబలోద్రేకాన్= సంతోషముయొక్కయుం బరాక్రమముయొక్కయు బలము యొక్కయు నతిశయములను; దర్శయంతః=చూపుకొనుచు; వివిధాన్=నానావిధములయిన ; యౌవనోత్సేకజాన్= యౌవనాతిశయమువలనఁ గలిగిన; దర్పాన్=గర్వములను, గర్వమువలనఁగలిగినవ్యాపారములననుట ; అధ్వని= మార్గమునందు; చక్రుః=చేసిరి.

ఆవానరులు, మార్గమునందు, ఒండొరులకుఁ,దమతమసంతోషపరాక్రమ బలాతిశయములంజూపుకొనుచు, యౌవనబలంబునంగలుగునట్టి, నానావిధచేష్టలంజేసిరి. అని, తాత్పర్యము.

తత్ర కేచి ద్ద్రుతం జగ్ము రుత్పేతుశ్చ తథా పరే. ౬౫
కేచి త్కిలకిలాం చక్రు ర్వానరా వనగోచరాః

టీక॥ తత్ర = అందు; వనగోచరాః=వనములందుండునట్టి,వానరాః= వానరులు; కేచిత్ = కొందఱు; ద్రుతం=శీఘ్రముగా; జగ్ముః= పోయిరి. తథా=అట్లు; అపరే=మఱికొందఱు; ఉత్పేతుశ్చ=ఎగిరిరి. కేచిత్= కొందఱు; కిలకిలాం = కిలకిలయనుధ్వనిని;చక్రుః=చేసిరి.

అందుఁగొందఱు, వానరులు, శీఘ్రముగాఁబోయిరి; కొందఱెగిరిరి ; కొందఱు, కిలకిలయనియఱచిరి.

అని, తాత్పర్యము.

ప్రాస్ఫోటయంశ్చ పుచ్ఛాని సన్నిజఘ్నుః పదాన్యపి. ౬౬
భుజా న్విక్షిప్య శైలాంశ్చ ద్రుమా నన్యే బభంజిరే

టీక ॥ అన్యే=ఇతరులు ; పుచ్ఛాని=తోఁకలను; ప్రాస్ఫోటయంశ్చ= నేలంగొట్టిరి. పదాన్యపి=పాదములను ; సన్నిజఘ్నుః=నేలంగొట్టిరి. భుజాన్=చేతులను ; విక్షిప్య = చాఁచి ; ద్రుమాన్=వృక్షములను; శైలాంశ్చ = పర్వతములను; బభంజిరే=విఱిచిరి.

మఱికొందఱువానరులు, తోఁకలనునేలంగొట్టిరి ; కొందఱుపాదంబులనునేలంగొట్టిరి; కొందఱుచేతులుచాఁచి, వృక్షంబులను విఱిచిరి;పర్వతంబులంబగులఁగొట్టిరి. అని, తాత్పర్యము.

ఆరోహంతశ్చ శృంగాణి గిరీణాం గిరిగోచరాః. ౬౭
మహానాదాన్విముంచంతి క్ష్వేళా మన్యే ప్రచక్రిరే

టీక॥ గిరిగోచరాః= పర్వతవాసులగువానరులు; కేచిత్ (అధ్యాహృతము)=కొందఱు;గిరీణాం = పర్వతములయొక్క; శృంగాణి=శిఖరములను ; ఆరోహంతశ్చ=ఎక్కుచును; మహానాదాన్=పెద్దధ్వనులను;విముంచంతి=విడిచిరి. అన్యే=మఱికొందఱు ; క్ష్వేళాం=సింహనాదమును; ప్రచక్రిరే = చేసిరి.

పర్వతవాసులగువానరులు కొందఱు, పర్వతశిఖరంబులపైనెక్కి , పెద్దకేకలువేసిరి; కొందఱు , సింహనాదంబులుగావించిరి. అని, తాత్పర్యము.

ఊరువేగైశ్చ మమృదుర్లతాజాలాన్యనేకశః. ౬౮
జృంభమాణాశ్చ విక్రాంతా విచిక్రీడుశ్శిలాద్రుమైః

టీక॥ కేచిత్ (అధ్యాహృతము)=కొందఱు;లతాజాలాని=తీఁగెలసమూహములను; అనేకశః= పెక్కులను;ఊరువేగైశ్చ=తొడలవేగములచేత;మమృదుః=మర్దించిరి; కేచిత్ (అధ్యాహృతము)= కొందఱు; జృంభమాణాశ్చ=విజృంభించుచును;విక్రాంతాః=పరాక్రమించినవారలై ; శిలాద్రుమైః= ఱాళ్లచేతనువృక్షములచేతను; విచిక్రీడుః = క్రీడించిరి.

కొందఱు, ఊరువేగంబున, లతాసమూహంబులమర్దించిరి;మఱికొందఱు,విజృంభించి , పరాక్రమించి, వృక్షంబులను ఱాళ్లనుదీసికొని యాటలాడిరి.అని, తాత్పర్యము.

శతై శ్శతసహస్రైశ్చ కోటిభిశ్చ సహస్రశః. ౬౯
వానరాణాంతు ఘోరాణాం యూథైః పరివృతా మహీ

టీక॥ శతైః=నూఱులచేతను; శతసహస్రైశ్చ=లక్షలచేతను; సహస్రశః=వేనవేలుగా; కోటిభిశ్చ=కోటులచేతను; ఘోరాణాం=భయంకరములగు; వానరాణాం=వానరులయొక్క; యూథైః=సమూహములచేత; మహీ=భూమి; పరివృతా=ఆవరింపఁబడినది.

భయంకరాకారులగు, వానరులు, నూఱులునూఱులుగాను వేనవేలుగాను లక్షలక్షలుగాను, కోటులుకోటులుగాను,భూమిని,వ్యాపించియుండిరి. అని, తాత్పర్యము.

సా స్మయాతి దివారాత్రం మహతీ హరివాహినీ. ౭౦
హృష్టా ప్రముదితా సేనా సుగ్రీవేణాభి రక్షితా

టీక॥ సా=ఆ;మహతీ=గొప్పదగు; హరివాహినీ=వానరసేన; సేనా=ప్రభువుతోఁగూడినదై; హృష్టా=గగుర్పాటు నొందినదై; ప్రముదితా=మిక్కిలియు సంతోషంబునొందినదై; సుగ్రీవేణ=సుగ్రీవునిచేత;అభిరక్షితా=పాలింపఁబడినదై; దివారాత్రం=అహోరాత్రమును; యాతిస్మ=పోయినది.

గొప్పదగునావానరసేన, రామసహితము, పరమసంతోషంబునొంది, పులకాంకితమయి, సుగ్రీవపాలితమయి,రేయుంబవలును బయనముచేయుచుండినది.అని, తాత్పర్యము.

వానరా స్త్వరితా యాంతి సర్వే యుద్ధాభినందినః. ౭౧
ప్రమోక్షయిషవ స్సీతాం ముహూర్తం క్వాపినాసత

టీక॥వానరాః=వానరులు; సర్వే=అందఱును; యుద్ధాభినందినః=యుద్ధమునభినందించువారలయి; త్వరితం=శీఘ్రముగా; యాంతి=పోయిరి. సీతాం=సీతాదేవిని;ప్రమోక్షయిషవః=విడిపింపఁగోరువారలయి ; ముహూ

తదా=కొంచెము సేపైనను ; క్వాపి= ఎచ్చటను; నాసత=ఉండరైరి.

వానరులందఱు , యుద్ధంబునందలి యుత్సాహంబున, మిక్కిలియు శీఘ్రముగాఁబోయిరి; సీతాదేవిని, ఎప్పుడెప్పుడువిడిపింతుమోయని, కొంచెము సేపైనను, ఎచ్చటనునిలువరైరి.

అని, తాత్పర్యము.

తతః పాదప సంబాధం నానామృగసమాయుతమ్. ౭౨
సహ్యపర్వత మాసేదు ర్మలయంచ మహీధరమ్

టీక ॥ తతః=అటుపిమ్మట; తే(అధ్యాహృతము)=ఆవానరులు; పాదప సంబాధం= వృక్షములచేనిండినదియు; నానామృగసమాయుతం= నానామృగములతోఁగూడినదియునగు; సహ్యపర్వతం=సహ్యపర్వతమును; మలయం= మలయమును; మహీధరంచ=పర్వతమును; ఆసేదుః=పొందిరి.

అంత, నావానరులు, వృక్షములచే నిండినదియు నానావిధమృగసంయుతంబునగు, సహ్యపర్వతంబును, అట్లుమలయపర్వతంబును, బొందిరి.

అని, తాత్పర్యము.

కాననాని విచిత్రాణి నదీప్రస్రవణానిచ. ౭౩
పశ్య న్నతియయౌ రామ స్సహ్యస్య మలయస్యచ

టీక॥ రామః = రాముఁడు; సహ్యస్య=సహ్యపర్వతముయొక్కయు; మలయస్యచ = మలయపర్వతముయొక్కయు; విచిత్రాణి=నానావిధములయిన; కాననాని=అడవులను; నదీప్రస్రవణాని చ=ఏఱులను సెలయేఱులను; పశ్యన్=చూచుచు, అతియయౌ=పోయెను.

రాముఁడు, సహ్యమలయపర్వతంబులందలి, నానావిధవనంబులగు, ఏఱులను సెలయేఱులనుజూచుచుఁ, బోయెను. అని, తాత్పర్యము.

చంపకాం స్తిలకాం శ్చూతా నశోకా న్సింధువారకాన్. ౭౪
కరవీరాంశ్చ తిమిశా న్భజంతి స్మ ప్లవంగమాః

టీక॥ప్లవంగమాః=వానరులు; చంపకాన్=సంపెఁగచెట్లను; తిలకాన్=బొట్టుగు చెట్లను; చూతాన్ = మామిడిచెట్లను; అశోకాన్= అశోకవృక్షములను; సింధువారకాన్ = తెల్లవావిలి చెట్లను; కరవీరాంశ్చ= గన్నేరుచెట్లను;తిమిశాన్= నేమిచెట్లను; భజంతి స్మ= పొందిరి.

వానరులు, మార్గంబున, చంపక వృక్షములను, బొట్టుగు చెట్లను, మామిడిచెట్లను, అశోకవృక్షంబులను, తెల్ల వావిలిచెట్లను, గన్నేరుచెట్లను, నేమిచెట్లను,అంతనంతంజూచుచుఁబోయిరి. అని, తాత్పర్యము.

అంకోలాంశ్చ కరంజాంశ్చ ప్లక్షన్యగ్రోధతిందుకాన్. ౭౫
జంబూకామలకాన్నీపాన్ భజంతి స్మ ప్లవంగమాః

టీక॥ప్లవంగమాః=వానరులు; అంకోలాంశ్చ=ఊడుగుచెట్లను; కరంజాంశ్చ=క్రానుగుచెట్లను; ప్లక్షన్యగ్రోధతిందుకాన్= జువ్విచెట్లనుమఱ్ఱిచెట్లను తుమ్మికచెట్లను; జంబూకామలకాన్=నేరెడుచెట్లనుఉసిరికచెట్లను; నీపాన్=కదంబవృక్షములను;భజంతిస్మ=పొందిరి.

వానరులు,మార్గంబున, ఊడుగుచెట్లను, క్రానుగుచెట్లను జువ్విచెట్లనుమఱ్ఱిచెట్లను తుమ్మికచెట్లను, నేరెడుచెట్లనుఉసిరికచెట్లను, అంతనంతంజూచుచుఁబోయిరి.అని, తాత్పర్యము.

ప్రస్తరేషుచ రమ్యేషు వివిధాః కాననద్రుమాః. ౭౬
వాయువేగప్రచలితాః పుష్పైరవకిరంతి తాన్

టీక॥ రమ్యేషు=మనోహరములగు; ప్రస్తరేషుచ = ఱాళ్లయందును; వివిధాః=నానావిధములయిన; కాననద్రుమాః=అడవియందలివృక్షములు;వాయువేగప్రచలితాః=వాయువేగముచేతఁగదలినవై; తాన్ = ఆవానరులను;పుష్పైః= పూలచేత; అవకిరంతి = చల్లినవి.

రమణీయంబులగు శిలలయందున్న నానావిధవన్యవృక్షంబులు, వాయువేగంబునకుఁజలించి, యావానరులపై, పూలుగురిపించినవి.

అని, తాత్పర్యము.

స ౪

మారుత స్సుఖసంస్పర్శో వాతి చందనశీతలః. ౭౭
షట్పదై రనుకూజద్భి ర్వనేషు మధుగంధిషు

టీక॥ మధుగంధిషు = తేనెచేమంచి వాసనగల; వనేషు = అడవులయందు; సుఖస్పర్శః = సుఖకరమయిన తాఁకుటగలదియు; చందనశీతలః = చందనమువలెఁ జల్లనిదియునగు; మారుతః = గాలి; అనుకూజద్భిః = వెంబడిధ్వనించుచున్న; షట్పదైః = తుమ్మెదలతోఁ; వాతి = వీచుచుండినది.

అప్పుడు, మధుపూర్ణంబులగు సుగంధివనంబులందు, భృంగంబులు ఝుంకరించుచు వెంటందగుల, మందమారుతంబు, సుఖస్పర్శంబయి, చందనశీతలంబయి, వీచినది.

అని, తాత్పర్యము.

అధికం శైలరాజస్తు ధాతుభి స్సువిభూషితః. ౭౮

టీక॥ శైలరాజస్తు = పర్వతశ్రేష్ఠమయిన సహ్యపర్వతమును; అధికం = మిక్కిలియు, ధాతుభిః = గైరికధాతువులచేత; సువిభూషితః = మిక్కిలియలంకరింపఁబడినది.

పర్వతశ్రేష్ఠంబగు, సహ్యంబును, మిక్కిలియు; ధాతుభూషితంబయినది. అని, తాత్పర్యము.

ధాతుభ్యః ప్రస్రుతో రేణు ర్వాయువేగవిఘట్టితః
సుమహా న్వానరానీకం ఛాదయామాస సర్వతః. ౭౯

టీక॥ ధాతుభ్యః = ధాతువులవలన; ప్రస్రుతః = వెడలిన; రేణుః = పరాగము; వాయువేగవిఘట్టితః = వాయువేగముచేలేపఁబడినదై; సుమహాన్ = మిక్కిలియుగొప్పదగు; వానరానీకం = వానరసైన్యమును; సర్వతః = అంతటను; ఛాదయామాస = కప్పెను.

ఆవానరులత్రొక్కుడువలన, ధాతువులందుఁ బుట్టినపరాగము, గాలిదెబ్బకురేఁగి, యావానరసైన్యమునంతయుఁ, గప్పినది. అని, తాత్పర్యము.

గిరి ప్రస్థేషు రమ్యేషు సర్వత స్సంప్రపుష్పితాః
కేతక్య స్సింధువారాశ్చ వసంత్యశ్చ మనోరమాః. ౭౦
మాధవ్యో గంధపూర్ణాశ్చ కుందగుల్మాశ్చ పుష్పితాః
చిరిబిల్వా మధూకాశ్చ వకుళాః ప్రియకా స్తథా. ౭౧
స్ఫూర్జకా స్తిలకాశ్చైవ నాగవృక్షాశ్చ పుష్పితాః
చూతాః పాటలయ శ్చైవ కోవిదారాశ్చ పుష్పితాః. ౭౨
ముచుళిందార్జునాశ్చైవ శింశుపాః కుటజా స్తథా
ధవా శ్శాల్మలయ శ్చైవ రక్తాః కురవకా స్తథా. ౭౩
హింతాలా స్తిమిశాశ్చైవ చూర్ణకా నీపకా స్తథా
నీలా శోకాశ్చ వరణా అంకోలాః పద్మకా స్తథా. ౭౪
ప్లవమానైః ప్లవంగైస్తు సర్వే పర్యాకులీకృతాః

టీక॥ రమ్యేషు=మనోహరములయిన; గిరిప్రస్థేషు=పర్వతముల నెత్తములందు; సర్వతః = అంతటను; సంప్రపుష్పితాః = చక్కఁగాఁబుష్పించిన; కేతక్యః=మొగిలిచెట్లును; సింధువారాశ్చ= తెల్లవావిలిచెట్లును; మనోరమాః = మనోహరము లగు; వాసంత్యశ్చ = గురివెందచెట్లును; మాధవ్యః = కుసుమపూలచెట్లును; గంధపూర్ణాశ్చ= దుంప రాష్ట్రచెట్లును; పుష్పితాః = పూచిన; కుందగుల్మాశ్చ= మొల్లచెట్లును ; చిరిబిల్వాః = కానుగుమ్రాకులును; మధూకాశ్చ=ఇప్పమ్రాకులును; వకుళాః=పొగడచెట్లును; తథా = అట్లు; ప్రియకాః=వేఁగిసచెట్లును ; స్ఫూర్జకాః = తుమికిచెట్లును ; తిలకాశ్చైవ = బొట్టుగుచెట్లును; పుష్పితాః=పూచిన; నాగవృక్షాశ్చ= నాగకేసరవృక్షములును; చూతాః= మామిడిచెట్లును; పాటలయశ్చైవ= కలిగొట్టుచెట్లును; పుష్పితాః = పూచిన; కోవిదారాశ్చ=కాంచనముచెట్లును ; ముచుళిందార్జునాశ్చైవ=ఖర్జూరవృక్షములును; ఏఱుమద్దిచెట్లును; శింశుపాః = ఇరుగుడుచెట్లును; తథా=అట్లు; కుటజాః = అడవిమల్లెలును ; ధవాః= చండ్రచెట్లును ; శాల్మలయశ్చైవ=బూరుగుచెట్లును; తథా = అట్లు; రక్తాః=ఎఱ్ఱని; కురవకాః=గోరంటచెట్లును; హింతాలాః = శ్రీతాల

వృక్షములును; తిమిశాశ్చైవ=నేమిచెట్లును; చూణకాః=ఉసిరిగచెట్లును; తథా=అట్లు; నీపకాః= కదంబవృక్షములును; నీలాశోకాః = నల్లపువ్వుల యిరుగుడుచెట్లును; వరణాః=ఉలిమిరిచెట్లును; అంకోలాః=ఊడుగుమ్రాకులును; తథా = అట్లు; పద్మకాః = మెట్టతామరలును;సర్వే=అన్నియు;ప్లవమానైః=ఎగురుచున్న; ప్లవంగైస్తు=వానరులచేతను; పర్యాకులీకృతాః = కలఁచఁబడినవి.

అచ్చటఁ,గొండనెత్తములందంతటను జక్కఁగాఁబుష్పించియుండు, మొగిలిపొదలును, తెల్లవావిలిచెట్లును, మనోహరంబు లగు గురివెంద చెట్లును, మాధవీలతలును దుంపరాష్ట్ర చెట్లును మొల్లచెట్లును, కానుగుచెట్లును, ఇప్పచెట్లును, పొగడచెట్లును, వేఁగిస చెట్లును తుమికి చెట్లును , బొట్టుగ చెట్లును నాగకేసరవృక్షములును,మామిడిమ్రాకులును,కలిగొట్టుమ్రాకులును,కోవిదారంబులును,ఖర్జూరంబులునర్జునంబులును.శింశుపావృక్షంబులును, అడవిమల్లెలును,చంద్రమ్రాకులును, శాల్మలివృక్షంబులును,ఎఱ్ఱగోరంటలును , శ్రీతాళపుమ్రాకులును, నేమివృక్షంబులును, ఉసిరిగమ్రాకులును,గదంబవృక్షంబులును,నల్లపువ్వులయిరుగుడుమ్రాకులును, ఉలిమిరిమ్రాకులును, ఊడుగుమ్రాకులును ,మెట్టతామరలును, పుష్పితంబులగునీవృక్షంబులన్నియు , నావానరులకోలాహలంబునకుఁ, బర్యాకులంబులయినవి. అని, తాత్పర్యము.

వాప్యస్తస్మిన్ గిరౌ శీతాః పల్వలాని తథైవచ. ౮౪
చక్రవాకానుచరితాః కారండవ నిషేవితాః
ప్లవైః క్రౌంచైశ్చ సంకీర్ణా వరాహమృగసేవితాః. ౮౬
ఋక్షై స్తరక్షుభి స్సింహై శ్శార్దూలైశ్చ భయావహైః
వ్యాళైశ్చ బహుభి ర్భీమై స్సేవ్యమానం సమంతతః. ౮౭
పద్మై స్సౌగంధికైః ఫుల్లైః కుముదై శ్చోత్పలై స్తథా
వారిజై ర్వివిధైః పుష్పైరమ్యాస్తత్ర జలాశయాః. ౮౮

స ४

టీక॥ తస్మిన్ = ఆ; గిరౌ = సహ్యపర్వతమునందు; శీతాః = చల్లనివియు; చక్రవాకానుచరితాః = చక్రవాకపక్షులచేసంచరింపఁబడినవియు; కారండవనిషేవితాః = నీరుకోళ్లచే సేవింపఁబడినవియు; ప్లవైః = నీరుకాకులచేతను; క్రౌంచైశ్చ = క్రౌంచపక్షులచేతను; సంకీర్ణాః = వ్యాపింపఁబడినవియు; వరాహమృగసేవితాః = వరాహములు మొదలగుమృగములచేత సేవింపఁబడినవియునగు; వాప్యః = నడబావులును; తథా = అట్లు; పల్వలానిచ = నీళ్లునిలిచినపల్లములును; ఋక్షైః = ఎలుఁగుగొడ్డులచేతను; తరక్షుభిః = సివంగులచేతను; సింహైః = సింహములచేతను; భయావహైః = భయముగల్గించునట్టి, శార్దూలైశ్చ = పెద్దపులులచేతను; భీమైః = భయంకరములగు; బహుభిః = పెక్కులయిన; వ్యాళైశ్చ = దుష్టగజములచేతను; సమంతతః = అంతటను; సేవ్యమానం = సేవింపఁబడుచున్న; వనం (అధ్యాహృతము) = వనమును; ఫుల్లైః = వికసించిన; పద్మైః = కమలములచేతను; సౌగంధికైః = చెంగలువలచేతను; కుముదైశ్చ = తెల్లకలువలచేతను; తథా = అట్లు; ఉత్పలైః = నల్లకలువలచేతను; వివిధైః = నానావిధములగు; వారిజైః = నీళ్లయందుబుట్టిన; పుష్పైః = పూలచేత; రమ్యాః = మనోహరములయిన; జలాశయాః = సరస్సులును; తత్ర = అచ్చట; ప్లవంగైః (అధ్యాహృతము) = వానరులచేత; పర్యాకులీకృతాః (అధ్యాహృతము) = కలఁచఁబడినవి.

ఆసహ్యపర్వతమునందు, శీతలంబగుజలముగలవియుఁ, జక్రవాకకారండవశోభితంబులును, నీరుకాకులును క్రౌంచంబులును ఇవిమొదలగుపక్షులచే నొప్పుచున్నవియు, వరాహాదిజలగోచరమృగసేవితంబులునగునడబావులును, ఋక్షంబులును సివంగులును సింహంబులును, శార్దూలంబులును దుష్టగజంబులును మొదలగుభయంకరమృగంబులతోఁ గూడినవనంబులును, వికసించినకమలంబులును, చెంగలువలును తెల్లకలువలును నల్లకలువలును మొదలగుజలజాతపుష్పంబులతో నొప్పుచున్న జలాయశంబులును, ఇవన్నియు, నావానరులచేఁ, జెఱుపఁబడినవి. అని, తాత్పర్యము.

తస్య సానుషు కూజంతి నానాద్విజగణా స్తథా

టీక॥తథా=అట్లు;తస్య= ఆసహ్యాపర్వతముయొక్క;సానుషు=నెత్తములందు;నానాద్విజగణాః= నానావిధపక్షిసమూహములు; కూజంతి=అఱచినవి.

అప్పుడాసైన్యముంజూచి, సహ్యాపర్వతసానువులందలి నానావిధపక్షులు, కూయుచుండినవి.

అని, తాత్పర్యము.

స్నాత్వా పీత్వోదకా న్యత్ర జలే క్రీడంతి వానరాః. ౮౯
అన్యోన్యం ప్లావయంతిస్మ

టీక॥వానరాః=వానరులు; అత్ర=ఈపర్వతమునందు;జలే=జలమునందు; స్నాత్వా=స్నానముచేసి;ఉదకాని=జలములను;పీత్వా=త్రాఁగి;క్రీడంతి= క్రీడించిరి.అన్యోన్యం=ఒండొరులను; ప్లావయంతిస్మ=తడుపుకొనిరి.

వానరులు, సహ్యాపర్వతంబునందలిసరస్సులందు,స్నానంబుగావించి, నీళ్లుద్రావి, యొక్కరిపైనొకరునీళ్లుపోసుకొనుచుఁ,గ్రీడించిరి.అని,తాత్పర్యము.

శైలమారుహ్య వానరాః
ఫలాన్య మృతగంధీని మూలాని కుసుమానిచ. ౯౦
బుభుజు ర్వానరా స్తత్ర పాదపానాం మదోత్కటాః

టీక॥ వానరాః= వానరులు; శైలం=పర్వతమును;ఆరుహ్య = ఎక్కి; తత్ర=అచ్చట; వానరాః=వానరులు; మదోత్కటాః= మదముచేతమదించినవారలై; పాదపానాం= వృక్షములయొక్క; అమృతగంధీని= అమృతముయొక్క వాసనవంటివాసనగల; ఫలాని=పండ్లను;మూలాని=గడ్డలను; కుసుమానిచ=పూలను; బుభుజుః= భక్షించిరి.

వానరులంతఁబర్వతంబునారోహించి,మదమోహితులయి,అమృతంబువంటిఫలంబులను గడ్డలనుబుష్పంబులను,భుజించిరి.అని,తాత్పర్యము.

ద్రోణమాత్రప్రమాణాని లంబమానాని వానరాః. ౯౧
యయుః పిబంతో హృష్టా స్తే మధూని మధుపింగళాః

స ౪

టీక॥మధుపింగళాః= తేనెవలెగోరోచనపువన్నెగల; తే=ఆ; వానరాః= వానరులు; లంబమానాని= వ్రేలాడుచున్న; ద్రోణమాత్రప్రమాణాని = తూమెడుతేనియగల; మధూని= తేనియలను, తేనెతెట్టెలను; పిబంతః = త్రాగుచు; హృష్టాః=సంతసించినవారలై; యయుః=పోయిరి.

తేనెకుంబోలె గోరోచనపు వన్నెగలయావానరులు, అచ్చటచ్చట వ్రేలాడుచున్న తూమెడు తేనియగల తేనె తెట్టెలను యథేచ్ఛముగాఁ ద్రాగుచుఁ, బరమసంతోషంబునంబోయిరి. అని, తాత్పర్యము.

పాదపా నవభంజంతో వికర్షంతస్తథా లతాః. ౬౨
విధమంతో గిరివరాన్ ప్రయయుః ప్లవగర్షభాః

టీక॥ప్లవగర్షభాః= వానరశ్రేష్ఠులు; పాదపాన్=వృక్షములను; అవభంజంతః=విఱుచుచు; తథా=అట్లు; లతాః= తీఁగెలను; వికర్షంతః=ఆకర్షించుచు; గిరివరాన్ = పర్వతశ్రేష్ఠములను; విధమంతః=పగులఁగొట్టుచు; ప్రయయుః= పోయిరి.

వానరోత్తములు, వృక్షంబులవిఱుచుచు, లతలను ఆకర్షించుచు, గొప్పపర్వతంబులను బగులఁగొట్టుచుఁ, బోయిరి. అని, తాత్పర్యము.

వృక్షేభ్యోఽన్యే తు కపయో నదంతో మధుదర్పితాః. ౬౩
అన్యే వృక్షాన్ ప్రపద్యంతే ప్రపతంత్యపి చాఽపరే

టీక॥అన్యే=ఇతరులయిన; కపయస్తు=వానరులును; మధుదర్పితాః= తేనెచేమదించినవారలై; నదంతః=ధ్వనించుచు; వృక్షేభ్యః = వృక్షములకన్న; అన్యత్ర(అధ్యాహృతము) = ఇతరస్థలముందు; యయుః(అధ్యాహృతము)= పోయిరి. అన్యే = ఇతరులు; వృక్షాన్= వృక్షములను; ప్రపద్యంతే=పొందిరి. అపరేచాపి=ఇతరులును; ప్రపతంతి=పడిరి.

కొందఱువానరులు, తేనెద్రావుటచేమదించియఱచుచు, వృక్షంబులులేనిచోటనడచిరి; కొందఱు, వృక్షంబులనారోహించిరి; కొందఱువృక్షంబులనుండి నేలకుదుమికిరి. అని, తాత్పర్యము.

బభూవ వసుధా తైస్తు సంపూర్ణా హరియూథపైః ౯౪
యథా కలమకేదారైః పక్వైరివ వసుంధరా

టీక॥ తైః=ఆ;("తు" అనునది పాదపూరణార్థము) హరియూథపైః=వానరశ్రేష్ఠుల చేత; సంపూర్ణా=నిండిన; వసుధా=భూమి; పక్వైః=పండిన("ఇవ" అనునది వాక్యాలంకారార్థము); కలమకేదారైః=వరిపైరుల చేత; సంపూర్ణా(అధ్యాహృతము) నిండిన; వసుంధరా(అధ్యాహృతము) ఇవ=భూమివలె; బభూవ=ఉండినది.

వానరోత్తముల చేత నిండియుండు భూమి, వరిపైరుల చే నిండిన భూమివలె నొప్పుచుండినది. అని, తాత్పర్యము.

మహేంద్రమథ సంప్రాప్య రామో రాజీవలోచనః. ౯౫
అధ్యారోహన్మహాబాహు శ్శిఖరం ద్రుమభూషితమ్

టీక॥ అథ=అంత; మహాబాహుః=పెద్దచేతులుగల; రాజీవలోచనః=కమలంబులవంటికండ్లుగల; రామః=రాముఁడు; మహేంద్రం=మహేంద్రపర్వతమును; సంప్రాప్య=పొంది; ద్రుమభూషితం=వృక్షముల చేనలంకరింపఁబడిన; శిఖరం=శిఖరమును; అధ్యారోహత్=ఎక్కెను.

అంత, మహాబాహుండును కమలంబులవంటికండ్లుగలవాఁడునగు రాముండు, మహేంద్రపర్వతంబుఁ జేరి, నానావృక్షసమూహాలంకృతంబగు, దానిశిఖరంబు నారోహించెను.

అని, తాత్పర్యము.

తత శ్శిఖర మారుహ్య రామో దశరథాత్మజః. ౯౬
కూర్మమీనసమాకీర్ణ మపశ్య త్సలిలాకరమ్

టీక॥ తతః=అంత; దశరథాత్మజః=దశరథునికొడుకైన; రామః=రాముఁడు; శిఖరం=శిఖరమును; ఆరుహ్య=ఎక్కి; కూర్మమీనసమాకీర్ణం=తాఁబేళ్ల చేతను మత్స్యముల చేతను వ్యాపింపఁబడిన; సలిలాకరం=సముద్రమును; అపశ్యత్=చూచెను.

అంత, దశరథకుమారుండగు రాముండు, మహేంద్రశిఖరంబు నారోహించి, తాఁబేళ్లతోను మత్స్యంబు

లతోనునిండియున్న, సముద్రంబుఁజూచెను. అని, తాత్పర్యము.

తే సహ్యం సమతిక్రమ్య మలయం చ మహాగిరిమ్. ౯౭
ఆసేదు రానుపూర్వ్యేణ సముద్రం భీమనిస్స్వనమ్

టీక॥ తే=ఆవానరులు; సహ్యం= సహ్యపర్వతమును; మలయం = మలయమను; మహాగిరించ=పెద్దపర్వతమును; సమతిక్రమ్య = అతిక్రమించి; ఆనుపూర్వ్యేణ = క్రమముచేత; భీమనిస్స్వనం = భయంకరమగుధ్వనిగల ; సముద్రం=సముద్రమును; ఆసేదుః= సమీపించిరి.

ఆవానరులు, అట్లుసహ్యాపర్వతంబును మలయ పర్వతంబునుదాఁటి, భయంకరారావం బగుసముద్రంబు సమీపించిరి. అని, తాత్పర్యము.

అవరుహ్య జగామాశు వేలావన మనుత్తమమ్. ౯౮
రామో రమయతాం శ్రేష్ఠ స్ససుగ్రీవ స్సలక్ష్మణః

టీక॥ రమయతాం= సంతసింపఁజేయువారి లోపల ; శ్రేష్ఠః = ఉత్తముఁడైన ; రామః= రాముఁడు; ససుగ్రీవః= సుగ్రీవునితోఁగూడినవాఁడై; సలక్ష్మణః= లక్ష్మణునితోఁగూడినవాఁడై; అవరుహ్య=డిగ్గి ; ఆశు = శీఘ్రముగా; అనుత్తమం=తనకన్నశ్రేష్ఠములేనటువంటి; వేలావనం=సముద్రతీరమునందలివనమునుగూర్చి; జగామ=పోయెను.

ఇతరులకుసంతోషముగలిగించు వారలలోనుత్తముండైన రాముండు, సుగ్రీవలక్ష్మణులంగూడి, పర్వతంబుడిగ్గి , సముద్రంబుఁజూచుకౌతుకంబున , శీఘ్రముగా, సముద్రతీరవనంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

అథ ధౌతోపలతలాం తోయౌఘై స్సహసోత్థితైః. ౯౯
వేలా మాసాద్య విపులాం రామో వచన మబ్రవీత్

టీక॥ అథ=అంత; రామః=రాముఁడు; సహసా=వేగమున; ఉత్థితైః= లేచి

నదీనాం=నదులయొక్క; తోయౌఘైః= జలప్రవాహములచే తత్;ఘాతోపలతలాం= కొడఁగఁబడినఱాళ్లుగలదగు;విపులాం = విశాలమగు;వేలాం=సముద్రతీరమును;అసాధ్యా=పొంది;వచనం=మాటను;అబ్రవీత్ = చెప్పెను.

అంత, రాముండు, వేగవంతంబుల గు తరంగంబులచే ఘాతంబులగ ఱాళ్లుగల,సముద్రతీరంబుఁజేరి, సుగ్రీవునఁజూచి,యిట్లని, చెప్పెను.
అని, తాత్పర్యము.

ఏతే వయ మనుప్రాప్తాః సుగ్రీవ వరుణాలయమ్. ౧౧౦

టీక॥సుగ్రీవ = సుగ్రీవుఁడా!ఏతే= ఈ;వయం=మనము; వరుణాలయం= సముద్రమును;అనుప్రాప్తాః = పొందినాము.

సుగ్రీవుఁడా! ఇదిగో!మనముసముద్రంబునొద్దకువచ్చినాము,
అని, తాత్పర్యము.

ఇహేదానీం విచింత్యా సా యా నః పూర్వం సముత్థితా

టీక॥ యా= ఏది; నః=మనకు ; పూర్వం=మునుపు; సముత్థితా=కలిగినదో; సా=అ; విచింత్యా=ఆలోచనము; ఇహ=ఇచ్చట; ఇదానీం=ఇప్పుడు ; కర్తవ్యా (అధ్యాహృతము)= చేయఁబడవలసినది.

మనము పెంటనము కోసయుంటిమో, ఆ యాలోచనమునిప్పుడుచేయవలసినది.
అని, తాత్పర్యము.

అతః పర మతీరోఽయం సాగర స్సరితాంపతిః. ౧౧౧

టీక॥ అతఃపరం = ఇంతకుఁబిమ్మట; అయం=ఈ; సరితాం = నదులకు; పతిః = పెనిమిటియయిన; సాగరః=సముద్రము;అతీరః=గట్టులేనిది.

ఇంక , నదీపతియగుసముద్రంబెకాని, తీరంబులేదు- అని, తాత్పర్యము.

నచాయ మనుపాయేన శక్య స్తరితు మర్ణవః

టీక॥అయం=ఈ; అర్ణవః=సముద్రము; అనుపాయేన = ఉపాయములేమిచేత; తరితుం=దాఁటుటకు; శక్యశ్చ=అలవియయినదియు; న= కాదు-

ఉపాయంబులేక, యీసముద్రంబు దాఁట నలవిగాదు-

అని, తాత్పర్యము-

తదిహైవ నివేశోస్తు మంత్రః ప్రస్తూయతా మితి. ౧౦౨
యథేదం వానరబలం పరం పార మవాప్నుయాత్

టీక ॥ తత్ = అందువలన; ఇహైవ=ఇచ్చటనె; నివేశః=విడియుట; అస్తు=అగుఁగాక. యథా= ఎట్లు; ఇదం=ఈ; వానరబలం= వానరసైన్యము; పరం=అవ్వలి; పారం = గట్టును; అవాప్నుయాత్=పొందునో; ఇతి=ఇట్లు; మంత్రః=ఆలోచనము; ప్రస్తూయతాం=చేయఁబడుఁగాక.

అట్లుకావున, నిచ్చటనెవిడియుదము; ఈవానరసైన్యము, సముద్రంబునవ్వలిగట్టుచేరుసట్లాలోచనముసేయవలయును. అని, రాముండుసుగ్రీవునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇతీవ స మహాబాహు స్సీతాహరణకర్శితః. ౧౦౩
రామ స్సాగర మాసాద్య వాస మాజ్ఞాపయ త్తదా

టీక॥సీతాహరణకర్శితః= సీతాహరణముచేతఁ గృశింపఁజేయఁబడిన; మహాబాహుః= పెద్దచేతులుగల; సః= ఆ; రామః=రాముఁడు; సాగరం= సముద్రమును; ఆసాద్య=పొంది; తదా=అప్పుడు; ఇతీవ=ఇట్లు; వాసం=విడియుటను; ఆజ్ఞాపయత్=ఆజ్ఞాపించెను.

సీతాహరణంబునంబరమదుఃఖితుండైయున్న మహాబాహుండగు రాముండు, సముద్రంబుఁజేరినపిమ్మటనచ్చటవిడియుటనుగుఱించి యీప్రకారమాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

సర్వా స్సేనా నివేశ్యంతాం వేలాయాం హరిపుంగవ. ౧౦౪

టీక॥హరిపుంగవ=వానరశ్రేష్ఠుండవగుసుగ్రీవుఁడా!సర్వాః=సమస్తములయిన;సేనాః=సేనలును;వేలాయాం=సముద్రతీరమునందు;నివేశ్యంతాం=విడియఁజేయఁబడుఁగాక.

వానరశ్రేష్ఠుండవగుసుగ్రీవుఁడా!మనసేనలనన్నింటిని, సముద్రతీరంబునవిడియనియమింపుము.అని,తాత్పర్యము.

సంప్రాప్తో మంత్రకాలో న స్సాగరస్యాస్య లంఘనే

టీక॥అస్య=ఈ;సాగరస్య=సముద్రముయొక్క;లంఘనే=దాఁటునిమిత్తము;మంత్రకాలః=ఆలోచించుకాలము;నః=మనకు;సంప్రాప్తః=పొందఁబడినది.

ఈసముద్రంబు దాఁటునుపాయంబునుగుఱించియాలోచించునవసరంబు మనకుఁగలిగినది.అని,తాత్పర్యము.

స్వాంస్వాం సేనాం సముత్సృజ్య మాచకశ్చిత్కుతో వ్రజేత్.౧౦॥

టీక॥కశ్చిచ్చ = ఒకానొకఁడును; స్వాంస్వాం=తనతన;సేనాం=సేనను; సముత్సృజ్య=విడిచి;కుతః= ఎందును; మావ్రజేత్=పోఁగూడదు.

ఎవ్వఁడును దనసేననువదలియెచ్చటికిని,బోఁగూడదు.

అని, తాత్పర్యము.

గచ్ఛంతు వానరా శ్శూరా జ్ఞేయం ఛన్నం భయంచ నః

టీక॥శూరాః = యుద్ధమునందుభయములేని;వానరాః= వానరులు; గచ్ఛంతు=పోవుదురుగాక, అంతటనుదిరుగుచుందురుగాకయనుట.నః = మనయొక్క;భయం=భయనిమిత్తమయిన; ఛన్నం = దాఁచుకొనియుండునది;జ్ఞేయం=ఎఱుంగఁదగినది.

శూరులగువానరులు,అంతటనుదిరుగుచుండవలయును; ఛిద్రంబన్వేషించిమనలంబ్రహరించుటకై శత్రువులెచ్చటనైననుదాఁచుకొనియుందురు. అని, రాముండు,సుగ్రీవునితోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

రామస్య వచనం శ్రుత్వా సుగ్రీవ స్సహలక్ష్మణః. ౧౦౮
సేనాం న్యవేశయ త్తీరే సాగరస్య ద్రుమాయుతే

టీక॥ సుగ్రీవః = సుగ్రీవుఁడు; రామస్య = రాముని యొక్క; వచనం = మాటను; శ్రుత్వా = విని; సహలక్ష్మణః = లక్ష్మణునితోఁ గూడినవాఁడై; ద్రుమాయుతే = వృక్షములతోఁ గూడిన; సాగరస్య = సముద్రము యొక్క; తీరే = గట్టునందు; సేనాం = సేనను; న్యవేశయత్ = విడియఁజేసెను.

సుగ్రీవుఁడు, రాముని మాటను విని, లక్ష్మణునితోఁ గూడ, నానావృక్షసంయుతంబగు సముద్రతీరంబునందు, వానరసేనను, విడియనియమించెను. అని, తాత్పర్యము.

విరరాజ సమీపస్థం సాగరస్య చ తద్బలమ్. ౧౦౯
మధుపాండుజల శ్శ్రీమాన్ ద్వితీయ ఇవ సాగరః

టీక॥ సాగరస్య = సముద్రము యొక్క; సమీపస్థం = సమీపంబునందున్న; తత్ = ఆ; బలం చ = సైన్యమును; శ్రీమాన్ = అధికమయిన కాంతిగల; మధుపాండుజలః = తేనెవలెగోరోచనవన్నెగల జలములుగల; ద్వితీయః = రెండవదగు; సాగర ఇవ = సముద్రము వలె; విరరాజ = ప్రకాశించెను.

సముద్రసమీపంబున విడిసియున్న మధువర్ణులగు నావానరుల సేన, కాంతిమతంబగు, మధువర్ణంబయిన, రెండవ సముద్రంబుకరణిం బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

వేలావన ముపాగమ్య తత స్తే హరిపుంగవాః. ౧౧౦
వినివిష్టాః పరం పారం కాంక్షమాణా మహోదధేః

టీక॥ తే = ఆ; హరిపుంగవాః = వానరశ్రేష్ఠులు; వేలావనం = సముద్రతీరవనమును; ఉపాగమ్య = పొంది; తతః = అంత; మహోదధేః = మహాసముద్రము యొక్క; పరం = అవ్వలి; పారం = గట్టును; కాంక్షమాణాః = కోరుచు; వినివిష్టాః = విడిసిరి.

ఆవానరశ్రేష్ఠులు, సముద్రతీరవనముఁ బొంది, యంత, సముద్రంబునవ్వలి తీరంబుఁ జేరఁ గోరుచు, నచ్చటచ్చట, విడిసిరి. అని, తాత్పర్యము.

తేషాం నివిశమానానాం సైన్యసన్నాహనిస్స్వనః. ౧౦౯
అంతర్ధాయ మహానాద మర్ణవస్య ప్రశుశ్రువే

టీక॥ నివిశమానానాం = విడియుచున్న; తేషాం=ఆవానరులయొక్క; సైన్యసన్నాహనిస్స్వనః = సైన్యమువిడియఁ జేయుటయొక్క-ధ్వని; అర్ణవస్య=సముద్రముయొక్క; మహానాదం=గొప్పధ్వనిని; అంతర్ధాయ=అణఁచి; ప్రశుశ్రువే=వినఁబడినది.

అచ్చట, నావానరసేనవిడియుటవలనఁగలిగినధ్వని, సముద్రధ్వనినిగూడ నణఁచిచెలంగినది. అని, తాత్పర్యము.

సా వానరాణాం ధ్వజినీ సుగ్రీవేణాభిపాలితా. ౧౧౦
త్రిధా నివిష్టా మహతీ రామస్యార్థ పరాభవత్

టీక॥సుగ్రీవేణ=సుగ్రీవునిచేత;అభిపాలితా=పాలింపఁబడిన;మహతీ= గొప్పదగు; సా=ఆ; వానరాణాం= వానరులయొక్క, ధ్వజినీ=సేన; త్రిధా=మూడువిధములుగ;నివిష్టా=విడిసినదై;రామస్య=రామునియొక్క; అర్థపరా= ప్రయోజనమునందాసక్తిగలదై;అభవత్=ఉండినది.

సుగ్రీవపాలితంబగు నాగొప్ప వానరసేన , వానరులొకతట్టును గోలాంగూలంబలొక్క-తట్టునుభల్లూకంబలొకతట్టును గానిట్లుమూఁడుప్రకారంబులవిడిసి, రామునికార్యంబుగావింపనుద్యుక్తయయి పరమోత్సాహంబుననుండినది.అని, తాత్పర్యము.

సా మహార్ణవ మాసాద్య హృష్టా వానరవాహినీ. ౧౧౧
వాయువేగసమాధూతం పశ్యమానా మహార్ణవమ్

టీక॥సా=ఆ; వానరవాహినీ=వానరసేన; మహార్ణవం= మహాసముద్రమును; ఆసాద్య=పొంది ; వాయువేగసమాధూతం=వాయువేగముచేఁజలింపఁజేయబఁడిన; మహార్ణవం= మహాసముద్రమును ; పశ్యమానా (పశ్యంతీ)చూచుచు; హృష్టా=సంతసించినది.

ఆవానరసేన,మహాసముద్రంబుఁ బొం

ది, వాయువేగంబునకుఁ జెల్లుబ్బి తరంగంబులం జెలంగుచున్న మహాసముద్రముం జూచుచు, సంతోషంబునొందినది.

అని, తాత్పర్యము.

దూరపార మసంబాధం రక్షోగణనిషేవితమ్. ౧౧౨
పర్యంతో వరుణావాసం విషేదు హరియూధపాః
చండనక్రగ్రహం ఘోరం క్షపాదౌ దివసక్షయే. ౧౧౩
హసంత మివ ఫేనౌఘై ర్నృత్యంత మివ చోర్మిభిః
చంద్రోదయసముద్ధూతం ప్రతిచంద్రసమాకులమ్, ౧౧౪
చండానిలమహాగ్రాహైః కీర్ణం తిమితిమింగిలైః
దీప్తై ర్భోగై రివాకీర్ణం భుజంగై ర్వరుణాలయమ్. ౧౧౫
అవగాఢం మహాసత్త్వై ర్నానాశైలసమాకులం
సుదుర్గం దుర్గమార్గం త మగాధ మసురాలయమ్. ౧౧౬

టీక॥ హరియూధపాః=వానరశ్రేష్ఠులు; దూరపారం= దూరంబుననుండు గట్టుగలదియు; అసంబాధం= బాధలేనిదియు, కొలంతపెట్టఁగూడనిదియు ననుట ; రక్షోగణనిషేవితం= రాక్షసులసమూహములచే సేవింపఁబడినదియు;వరుణావాసం= వరుణునియునికిపట్టును;చండనక్రగ్రహం=భయంకరమయినమొసళ్ల చేగ్రహించుటగలదియు; క్షపాదౌ = రాత్రియారంభమునందును ; దివసక్షయే=పగటియంతమునందును, సాయంసంధ్యాసమయమునందు ననుట; ఘోరం=భయంకరంబును ; ఫేనౌఘైః = నురుగులసమూహములచేత; హసంతమివ(స్థితం)= నవ్వుచున్నట్లున్నదియు; ఊర్మిభిః= అలలచేత;నృత్యంతమివ(స్థితం)చ=నృత్తముసేయునట్లున్నదియు; చంద్రోదయసముద్ధూతం= చంద్రోదయమునందుఎగురఁగొట్టఁబడినదియు; ప్రతిచంద్రసమాకులం=ప్రతిబింబచంద్రులచేనిండినదియు; చండానిలమహాగ్రాహైః=భయంకరమయిన వాయువువంటివేగముగలగొప్పమొసళ్లచేతను;తిమితిమింగిలైః=తిమి యనునూఱుయోజనంబులపొడవుగలమత్స్యములచేతనుతిములనుదినునట్టితిమింగిలంబులను మత్స్యముల చేతను ; కీర్ణం = వ్యాపింపఁబడినదియు ;

స ౪

భోగైః = పడగలచేత; దీప్తైరివ(స్థితైః) = మండుచున్నట్లున్న; భుజంగైః=సర్పములచేత; ఆకీర్ణం=వ్యాపింపఁబడినదియు; మహాసత్త్వైః=పెద్దజంతువులచేత; అవగాఢం= ప్రవేశింపఁబడినదియు ; నానాశైలసమాకులం=నానావిధపర్వతంబులచేతనిండినదియు; సుదుర్గం=చొరరానిదియు; దుర్గమార్గం=పోరానిమార్గముగలదియు; అగాధం= మిక్కిలిలోఁతుగదియు; అసురాలయం= అసురులయునికిపట్టుగలదియునగు;వరుణాలయం= సముద్రమును;పశ్యంతః = చూచుచు; విషేదుః—దుఃఖించిరి.

దురవస్థితంబగునావలిగట్టు గలదియు, నక్షోభ్యంబును రాక్షససమూహంబుచే సేవింపఁబడినదియు,వరుణుని యునికిపట్టును,ఎట్టిప్పగంబునైనఁబట్టు కొనంజాలిన మొసళ్లుగలదియు, సంధ్యాకాలంబునందు, భయంకరంబయి చూపట్టునదియు, తెల్లనినురుఁగులచేన వ్వునట్లుదోఁచునదియుఁ,దరంగంబులన ర్తనంబు గావించునట్లు గానగుపడునదియుఁజంద్రోదయకాలంబునమఱియుం జెల్లుబ్బి, ప్రతిబింబితంబులగు చంద్రబింబంబులనొప్పుచున్నదియు,మహావాతంబునకుంబోలె వేగంబుగల మొసళ్లతో నుదిమితిమింగిలంబులతోనునిండియుండునదియు, ఫణాస్థితమణులచే వెలుంగుచున్నసర్పంబులనొప్పుచున్నదియు, మఱియుశింశుమారాది మహాజంతువులచే వ్యాపింపఁబడినదియు,జలంబులమునింగియన్ననానావిధపర్వతంబులుగలదియు జొరరానిదియుమార్గరహితంబును,మిక్కిలియులోఁతుగలదియునసురాలయంబునునగు,నాసముద్రంబును,జూచి, వానరోత్తములు,దీనినెట్లు దాటఁగలమని, దుఃఖంబునొందిరి.అని, తాత్పర్యము.

మకరైర్నాగభోగైశ్చ విగాఢా వాతలోళితాః
ఉత్పేతుశ్చ నిపేతుశ్చ ప్రవృద్ధా జలరాశయః. ౧౧౭

టీక॥మకరైః=మొసళ్లచేతను; నాగభోగైశ్చ=సర్పదేహములచేతను; విగాఢాః = ప్రవేశింపఁబడిన;జలరాశయః = తరంగములు;వాతలోళితాః= గాలిచేఁజలింపఁజేయఁబడినవై; ప్రవృద్ధాః=వృద్ధిఁబొందినవై; ఉత్పేతుశ్చ—ఎగిరినవియు.నిపేతుశ్చ=పడినవియు.

గొప్పగొప్పతరంగములు, మకరం

బులతోనుసర్పంబులతోను, వాయువేగ చలితంబులయిపెల్లుబ్బి, యత్యున్నతంబులయి,యెగిరిపడుచుండినవి.

అని, తాత్పర్యము.

అగ్నిచూర్ణమివావిద్ధం భాస్వరాంబు మహోరగమ్
సురారివిషయం ఘోరం పాతాళవిషమం సదా. ౧౧౮
సాగరం చాంబరప్రఖ్య మంబరం సాగరోపమమ్
సాగరం చాంబరంచేతి నిర్విశేష మదృశ్యత. ౧౯

టీక॥ భాస్వరాంబు= ప్రకాశించుచున్నజలముగలదియు; కావుననే; ఆవిద్ధం= కొట్టఁబడిన; అగ్నిచూర్ణమివ (స్థితం) నిప్పుల పొడివలె నున్నదియు; మహోరగం= మహానాగంబులుగలదియు;సురారివిషయ=అసురులకునివాసస్థానంబును; ఘోరం=భయంకరంబయినదియు;సదా=ఎల్లప్పుడును; పాతాళవిషమం= పాతాళమువలెగంభీరముయునదియునగు;సాగరంచ = సముద్రమును;అంబరప్రఖ్యం= ఆకాశముతో సమానమయినది. అంబరం= ఆకాశము; సాగరోపమం= సముద్రముతోఁ బోల్కిగలది. సాగరంచ= సముద్రంబును; అంబరంచ=ఆకాశంబును— ఇతి=అని; నిర్విశేషం—భేదములేనట్లు;అదృశ్యత=చూడఁబడెను.

రాత్రికాలంబునందుఁ, జంద్రకిరణసంపర్కంబునంజేసి, సముద్రంబునందలిజలబిందువులు , అగ్నికణంబులుంబోలెబ్రకాశించుచుండును ; ఆకాశంబునందును, అట్లునక్షత్రంబులు ప్రకాశించుచుండును; సముద్రంబు , మహానాగంబులుగలది; ఆకాశంబును, నాగంబులుగలదే;సముద్రంబుననసురులుందురు; ఆకాశంబునను అసురులుందురు, సముద్రంబుభయంకరంబై నదిఆకాశంబునుభయంకరంబైనది సముద్రంబుపాతాళంబువలెగంభీరంబుగనుండినది, ఆకాశంబునట్టిదెకావుననిప్పుడుసముద్రంబాకాశంబువలెనుండినది ఆకాశంబుసముద్రంబువలెనుండినది. ఇదిసముద్రంబనియునిదియాకాశంబనియు నెంతమాత్రము భేదమగపడదలేదు

అని, తాత్పర్యము.

సంపృక్తం నభసా ప్యంభ స్సంపృక్తంచ నభోంభసా

తాదృగ్రూపే స్మ దృశ్యేతే తారారత్నసమాకులే. ౧౨౦

టీక॥అంభోపి=. ..ము ను;నభసా= ఆకాశముతోఁ;సంపృక్తం=చేరినది.నభశ్చ=ఆకాశమును;అంభసా = జలముతోఁ;సంపృక్తం=చేరినది. తారారత్నసమాకులే=నక్షత్రములచేనిండినయాకాశమును రత్నములచేనిండినసముద్రంబును;తాదృగ్రూపే=అట్టిరూపముగలవై; దృశ్యేతేస్మ=చూడఁబడుచుండినవి.

సముద్రమునందలిజలము, ఆకాశమువలెనుండినది; ఆకాశంబుజలంబువలెనుండినది;కావున, నాయాకాశసముద్రంబులురెండును, ... ... ...కట భేదములేకుండనుండినవి.

అని, తాత్పర్యము.

సముత్పతితమేఘస్య వీచిమాలాకులస్యచ
విశేషో న ద్వయో రాసీ త్సాగరస్యాంబరస్యచ. ౧౨౧

టీక॥సముత్పతితమేఘస్య=మీఁదవ్యాపించియున్న మేఘంబులుగల; అంబరస్యచ=ఆకాశంబునకును;వీచిమాలాకులస్య=అలలపఙ్క్తులచేనిండిన; సాగరస్యచ= సముద్రమునకును; ద్వయోః= రెంటికిని;విశేషః= భేదము;నాసీత్= ఉండలేదు.

మేఘసమూహంబుతోఁనొప్పుచున్నయాకాశమునకు నుతరంగసంఘూకులంబగు సముద్రంబునకును ఎంతమాత్రము భేదమగపడలేదు. అని. తాత్పర్యము.

అన్యోన్యై రాహతా స్సక్తా స్సస్వను ర్భీమనిస్స్వనాః
ఊర్మయ స్సింధురాజస్య మహాభేర్య ఇవాహవే. ౧౨౨

టీక॥ అన్యోన్యైః=ఒండొరులచేత ; సక్తాః=సంబంధించినవియు;ఆహతాః = కొట్టఁబడినవియునగు; సింధురాజస్య=సముద్రముయొక్క; ఊర్మయః=అలలు; ఆహవే= యుద్ధమునందు;మహాభేర్యఇవ=గొప్పభేరులువలె; భీమనిస్స్వనాః=భయంకరమయిన ధ్వనిగలవై; సస్వనుః=ధ్వనించినవి.

సముద్రంబునందలి; యలలు,ఒకటిచేనొకటికొట్టఁబడినవై, యుద్ధంబునందు పెద్దభేరులుంబోలె, భయంకరారావంబున, ధ్వనించుచుండినవి.

అని, తాత్పర్యము.

రత్నౌఘజలసన్నాదం విషక్తమివ వాయునా
ఉత్పతంత మివ క్రుద్ధం యాదోగణసమాకులమ్. ౧౨౩
దదృశు స్తే మహోత్సాహా వాతాహతజలాశయమ్
అనిలోద్ధూత మాకాశే ప్రవల్గంత మివోర్మిభిః. ౧౨౪

టీక॥రత్నౌఘజలసన్నాదం= రత్నసమూహములయొక్కయు, జలములయొక్కయు ధ్వనిగలదియు; వాయునా=గాలిచేత; విషక్తమివ (స్థితం)= ఏకీభూతమయినట్లున్నదియు; ఉత్పతంతమివ(స్థితం)= ఎగురుచున్నట్లున్నదియు; క్రుద్ధం (ఇవస్థితం)= కోపమునొంది నట్లున్నదియు; యాదోగణసమాకులం=జలజంతువులసమూహముచే నిండినదియు; అనిలోద్ధూతం=గాలిచే నెగురఁగొట్టఁబడినదియు; ఊర్మిభిః = అలలచే; ప్రవల్గంతమివ(స్థితం)=మాటలాడు నట్లున్నదియునగు; వాతాహతజలాశయం = గాలిచేఁగొట్టఁబడిన సముద్రమును; మహోత్సాహాః= అధికమయిన యుత్సాహముగల; తే=ఆవానరులు;దదృశుః=చూచిరి.

రత్నంబులతోనుజలంబులతోను మహాధ్వనిగల్గి వాయుహతంబయి, యాకాశంబునకుద్గమించుచుకైవడి, కోపంబునొందియుండుచాడ్పునంజూపట్టుచు, జలజంతుగణసంకులంబై, వాయువేగంబునకు,లేచుతరంగంబులధ్వనిచేమాటలాడునట్లుగాన్పించుచున్న సముద్రంబును, మహోత్సాహశాలులగు నావానరులు,చూచిరి.అని,తాత్పర్యము.

తతో విస్మయ మాపన్నా దదృశు హరయ స్తదా
భ్రాంతోర్మిజలసన్నాదం ప్రలోలమివ సాగరమ్. ౨౫

టీక॥తతః=అంత;తదా=అప్పుడు; హరయః=వానరులు;విస్మయం=ఆశ్చర్యమును;ఆపన్నాః= పొందినవారలై; భ్రాంతోర్మిజలసన్నాదం= తిరుగుడు నొందినయలలుగల జలముయొక్కధ్వనిగలదియు;ప్రలోలమివ(స్థితం)=తిరుగుడునొందినట్లున్న;సాగరం=సముద్రమును;దదృశుః=చూచిరి.

అంతనప్పుడు,వానరులు;నానావిధంబుగాఁదరంగంబులుద్గమింప, మహాధ్వనిం

బొల్చుచునుద్భ్రాంతంబయినట్లు చూపట్టుచున్నసముద్రంబుఁజూచి యాశ్చర్యంబునొందిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, చతుర్థస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండచతుర్థసర్గటీక,
ముగిసినది.

---

(శ్రీ)

పంచమసర్గప్రారంభః.

సాతు నీలేన విధివ త్స్వారక్షా సుసమాహితా
సాగరస్యోత్తరే తీరే సాధు సేనా నివేశితా. ౧

టీక॥ నీలేన=నీలునిచేత; సా = ఆ; సేనాతు=సేనయు; స్వారక్షా=మంచిరక్షకులుగలదై; సుసమాహితా = మిక్కిలియునెచ్చరిక గలదై; సాగరస్య=సముద్రముయొక్క; ఉత్తరే=ఉత్తరపుదిక్కునందున్న; తీరే= గట్టునందు; సాధు=చక్కఁగా; విధివత్ = నీతిశాస్త్రప్రకారముగా, నివేశితా=విడియఁజేయఁబడినది.

వానరసేనానాయకుండగు నీలుండు జక్కఁగా రక్షకులనేర్పఱిచి, నిర్భయంబుగావించి, సముద్రోత్తరతీరంబునందు, నీతిశాస్త్రప్రకారంబునం, జక్కఁగా, సేనానివేశనంబుగావించెను అని, తాత్పర్యము.

మైందశ్చ ద్వివిద శ్చోభౌ తత్ర వానరపుంగవౌ
విచేరతుశ్చ తాం సేనాం రక్షార్థం సర్వతోదిశమ్. ౨

టీక॥ తత్ర=అచ్చట; వానరపుంగవౌ=వానరశ్రేష్ఠులగు; మైందశ్చ=మైందుఁడును; ద్వివిదశ్చ=ద్వివిదుఁడును; ఉభౌ=ఇద్దఱును; రక్షార్థం= రక్షించుటకొఱకు; దిశం(జాత్యేకవచనము,షష్ఠ్యర్థమందుద్వితీయ, దిశాం)=దిక్కులయొక్క; సర్వతః= అన్నిప్రదేశంబులందును; తాం=ఆ; సేనాం=సేనయంతయు; విచేరతుశ్చ=తిరుగుచుండిరి.

అప్పుడచ్చట,మైందుండునుద్వివిదుండునునీవానరోత్తములిర్వురును , రక్షణార్థమయి,వానరసేనయన్నిప్రక్కలను దిరుగుచుఁగాచియుండిరి.

అని, తాత్పర్యము.

నివిష్టాయాంతు సేనాయాం తీరే నదనదీపతేః
పార్శ్వస్థం లక్ష్మణం దృష్ట్వా రామో వచన మబ్రవీత్. ౩

టీక॥సేనాయాం=సేన; నదనదీపతేః=సముద్రముయొక్క; తీరే=గట్టునంగు;నివిష్టాయాంతు= విడిసినంతనే; రామః=రాముఁడు;పార్శ్వస్థం= ప్రక్కనున్న ; లక్ష్మణం=లక్ష్మణునిని; దృష్ట్వా=చూచి; వచనం = మాటను;అబ్రవీత్=చెప్పెను.

అట్లు,సైన్యమంతయు, విడిసినంతనే,రాముండు,తనపార్శ్వభాగంబునం గొలిచియున్నలక్ష్మణుంబూచి , యిట్లు,చెప్పెను.అని, తాత్పర్యము.

శోకశ్చ కిల కాలేన గచ్ఛతా హ్యపగచ్ఛతి
మమచాపశ్యతః కాంతా మహన్యహాని వర్ధతే. ౪

టీక॥శోకశ్చ= దుఃఖంబును; గచ్ఛతా=పోవుచున్న;("హి" అనునది పాదపూరణార్థము) కాలేన= కాలముచేత;అపగచ్ఛతికిల = పోవునుగదా! నశించునుగదా! కాంతాం = ప్రియురాలను; అపశ్యతః = చూడకున్న ; మమ = నాయొక్క;శోకం (అధ్యాహృతము) చ=దుఃఖముమాత్రము; అహన్యహని= దినదినమందును; వర్ధతే=వృద్ధిబొందుచున్నది.

దుఃఖముకొంతకాలముగడవగా నశించును, నాకుంబ్రియురాలుం జూడకుండుటచేఁగలిగినదుఃఖము మాత్రము, అంతంతకు,వృద్ధిబొందుచున్నది.

అని, తాత్పర్యము.

న మే దుఃఖం ప్రియా దూరే న మే దుఃఖం హృ తేతివా
ఏతదేవా నుశోచామి వయో స్యా హ్యతివర్తతే. ౫

టీక॥ ప్రియా=ప్రియురాలు; దూరే=దూరదేశమునందు ; వర్తతఇతి (అధ్యాహృతము)=ఉన్నదని; మే=నాకు; దుఃఖం=దుఃఖము; న=లేదు-హృతా=అపహరింపఁబడినది; ఇతివా = అనియయినను; మే=నాకు; దుఃఖం= దుఃఖము; న=లేదు. అస్యాః= ఈసీతయొక్క; వయః=యౌవనము ; అతివర్తతేహి= అతిక్రమించిపోవుచున్నదిగదా! ఏతదేవ=దీనినిగుఱించియే ; అనుశోచామి=దుఃఖించుచున్నాను.

ప్రియురాలు దూ నున్నదని నాకు దుఃఖము లేదు; పగొని పోయెననియయినను లేదు; ఏలయనఁగా, న యారాక్షసుఁజంపి, మఱల లింబడయవచ్చుఁగదా! అం ప్పుడు ,ఆబిడయౌవనము వ్య బోవుచున్నదే ! అనియే నాకు గలుగుచున్నది. అని, రాముఁ క్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

వాహి వాత యతః కాంతా తాం స్పృష్ట్వా మాముపి స్పృ
త్వయి మే గాత్రసంస్పర్శ శ్చంద్రే దృష్టి సమాగమః. ౬

టీక॥వాత=వాయువా! యతః = ఎచ్చట;కాంతా=ప్రియురాలు; అస్తి (అధ్యాహృతము) = ఉన్నదో;తత్ర (అధ్యాహృతము)=అచ్చట; వాహి=

రుట; చంద్రే=చంద్రునియందు.

వాయుదేవుఁడా! నా సీ దుస్థలంబున ...




అట్లు, ప్రియురాలిముఖంబువలెనుండు చంద్రుంజూచి. యురాలిమొగంబుఁ జూచినట్లుగ ంబునొందవలసియున్నదికావున, నాకుఁబ్రియురాలిముఖంబుఁజూచుట, చంద్రునియధీనముగా నున్నది.అని, తాత్పర్యము.

దహతి గాత్రాణి విషం పీత మివా శయే
ాఘేతి ప్రియా సా మాం హ్రియమాణా యద బ్రవీత్. ౭

ా=అట్టి;ప్రియా=ప్రియురా యమాణా= అపహరింపఁబ ;మాం=నన్నుఁగూర్చి; "హా ుయ్యోనాథా";ఇతి=అని;య మాటను;అబ్రవీత్= చెప్పెనో; ాది;మే=నాయొక్క;ఆశయే= మునందు;పీతం=త్రాగఁబడి ువ=విషమువలె; గాత్రాణి= వవములను;దహతి= దహించుచు ది.

సమస్తభోగంబులను బరిత్యజించి నావెంటనడవికివచ్చినట్టి ప్రియురాలు, రావణునిచేఁగొనిపోఁబడునప్పుడు, తాను బాతివ్రత్యాగ్నిచేఁతనిని నీఱుసేయ సమర్థురాలయినను, నాయందుండు భక్తిచే,నన్నేగతిగాఁదలంచి "అయ్యో? నాథుఁడా" అని, చెప్పినమాట, నాహృదయంబుననుండి, త్రాగఁబడినవిషంబు పైకివడి, దేహంబంతయుదహింపఁబడుచున్నది. అని,తాత్పర్యము.

తద్వియోగేంధనవతా తచ్చింతావిపులార్చిషా
రాత్రిం దివం శరీరం మే దహ్యతే మదనాగ్నినా. ౮

శరీరం—దేహము;

నా దేహంబంతయు, రేయుంబవలు నుదహించుచున్నది. అని, తాత్పర్యము.

అవగాహ్యార్ణవం స్వప్స్యే సౌమిత్రే భవతా వినా
కథంచి త్ప్రజ్వలన్కామ స్సమా సుప్తం జలే దహేత్. ౯

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! భవతావినా=నిన్నువిడిచి; అర్ణవం= సముద్రమును; అవగాహ్య=ప్రవేశించి ; స్వప్స్యే=పరుండెదను. ప్రజ్వలన్=మండుచున్న; సః=ఆ; కామః = మన్మథుండు; జలే=నీళ్లయందు; సుప్తం= పరుండిననన్ను; కథంచిత్=ఎట్లయినను; మాదహేత్=దహింపఁడు.

లక్ష్మణుఁడా! నేనునిన్నువిడిచి, సముద్రంబునంబడిపరుండెదను ; నేనునీళ్లలోఁబరుండియుండు నేని , ప్రజ్వలించుచున్నయీమన్మథుండు , నన్నుదహింపఁజాలఁడు, అని, తాత్పర్యము.

బహ్వేత త్కామయానస్య శక్య మేతేన జీవితుమ్
య దహం సాచ వామోరూ రేకాం ధరణి మాశ్రితౌ. ౧౦

టీక॥ అహం=నేనును; సా=ఆ; వామోరూః= సుందరములయినతొడలుగలసీతాదేవియును; ఏకాం=ఒక్కటైన; ధరణిం=భూమిని; ఆశ్రితౌ (ఇతి) యత్= పొందియున్నామనునదియేది గలదో; ఏతత్=ఇది; బహు = అధికము; కామయానస్య=విరహినగునాకు; ఏతేన=దీనిచేత; జీవితుం= బ్రతికియుండుటకు; శక్యం=అలవియగును.

నేనును, సుందరములయినతొడలుగలయాసీతయును, ఒక్కభూమియందుండుటయె యిప్పటికధికముగానున్నది; కావున, భూమియందే, మనమిద్దఱమును బ్రతికియున్నదిగదాయని, దీనిచేతమాత్రముజీవించియుండఁగలను.
అని, తాత్పర్యము.

కేదారస్యేవ కేదార స్సోదకస్య నిరూదకః
ఉపస్నేహేన జీవామి జీవంతీం యచ్ఛృణోమి తామ్. ౧౧

టీక॥ జీవంతీం = బ్రతికియున్నట్టి; తాం=ఆసీతను;శృణోమి(ఇతి)యత్ = వినుచున్నానననుదియేదిగలదో; తేన(అర్థ్యాహృతము) = దానిచేత;నిరూదకః= నీళ్లులేని;కేదారః=చేను;సోదకస్య= నీళ్లతోఁగూడిన;కేదారస్య = చేనియొక్క;ఉపస్నేహేనేవ= సమీపమునందలి తేమచేతవలె;జీవామి = బ్రతికియున్నాను.

సీతబ్రతికియున్నదని వినుచున్నాను కావున,దీనిచేత,నీళ్లులేనిచేను, నీళ్లుగలచేని తేమతాఁకుడుచే నెండకుండునట్లు, జీవించియుండును.అని,తాత్పర్యము.

కదాను ఖలు సుశ్రోణీం శతపత్రాయతేక్షణామ్
విజిత్య శత్రూన్ ద్రక్ష్యామి సీతాం స్ఫీతా మివ శ్రియమ్. ౧౨

టీక॥ కదాను = ఎప్పుడు ; శత్రూన్=శత్రువులను; విజిత్య=జయించి; సుశ్రోణీం = సుందరములయినపిఱుందులుగలదియు ; శతపత్రాయతేక్షణాం=తామరపూలువలెదీర్ఘములయినకండ్లుగలదియునగు; సీతాం = సీతను; స్ఫీతాం=ఉత్కృష్టమయిన ; శ్రియమివ= లక్ష్మినివలె; ద్రక్ష్యామి= చూడఁగలను?

నేనుశత్రువులజయించి, సుందరంబులయినపిఱుందులుగలదియుఁ, కమలంబులంబోలె విశాల సుందరంబులయిననేత్రంబులుగలదియునగు సీతను , లక్ష్మినింబోలె, నెప్పుడుచూడఁగలను? అని,తాత్పర్యము.

కదాను చారుబింబోష్ఠం తస్యాః పద్మమివాననమ్
ఈష దున్నమ్య పాస్యామి రసాయన మివాతురః. ౧౩

టీ॥కదాను=ఎప్పుడు; తస్యాః=ఆసీతయొక్క;చారుబింబోష్ఠం= సుందరములయినదొండపండ్లవంటిపెదవులుగలదియగు;పద్మమివ=కమలమువంటి; ఆననం=ముఖమును; ఈషత్ =కొంచెము; ఉన్నమ్య=పైకెత్తి;ఆతురః= రోగి,రసాయనమివ = రసాయనమునువలె; పాస్యామి=త్రాఁగుదును?

సుందరంబులగుదొండపండు వంటి పెదవులు గలదియుఁ గమలంబువంటిది యునగుసీతముఖమును గొంకెముపైకె త్తి,రోగిరసాయనంబుద్రావునటుల,న ధరామృతంబునెప్పుడుద్రావుదును?

అని, తాత్పర్యము.

తస్యాస్తు సంహతౌ పీనౌ స్తనౌ తాళఫలోపమౌ
కదాను ఖలు సోత్కంపౌ శ్లిష్యంత్యా మాం భజిష్యతః. ౧౪

టీక॥ కదాను=ఎప్పుడు; శ్లిష్యంత్యాః = కవుఁగిలించుకొనుచున్న; తస్యాః=ఆసీతయొక్క; సంహతౌ=ఒరసుకొనియున్నవియు; పీనౌ=బలిసినవియు; తాళఫలోపమౌ = తాటిపండ్లతోఁబోలికగలవియునగు; స్తనౌ=స్తనములుమాత్రము; సోత్కంపౌ=వణఁకుతోఁగూడినవై; మాం=నన్ను; భజిష్యతః=పొందఁగలవు?

సీత,నన్నుఁగవుఁగిలించుకొనఁగాఁ, బరస్పరసంహతంబులును, మాంసలంబులునుదాళఫలంబులవంటివియు నగు నాబిడ స్తనంబులు, సకంపంబు లయి, యెప్పుడు,నామేనుసోఁకఁగలవు?

అని, తాత్పర్యము.

సా నూన మసితాపాంగీ రక్షోమధ్యగతా సతీ
మన్నాథా నాథహీనేవ త్రాతారం నాధిగచ్ఛతి. ౧౫

టీక॥ అసితాపాంగీ=నల్లనికడకంట్లుగలదియు;సతీ=పతివ్రతయు;మన్నాథా= నేనునాథుండుగాఁ గలదియునగు;సా=ఆసీత; రక్షోమధ్యగతా=రాక్షసులనడుమునొందినదై; నాథహీనేవ=నాథుండులేనిదివలె;త్రాతారం=రక్షకుని; నాధిగచ్ఛతి=పొందదు. నూనం=నిశ్చయము.

నల్లని కడకంట్లుగలదియుఁ బతివ్రతయునగునాసీత, రాక్షసులచేతంజిక్కి, నాథుండను నేనుండియు,ననాథవలె, రక్షకుంగానక,పరితపించుచున్నది. నిశ్చయము. అని,తాత్పర్యము.

కథం జనకరాజస్య దుహితా సా మమ ప్రియా

రాక్షసీమధ్యగా శేతే స్నుషా దశరథస్యచ. ౧౬

టీక॥జనకరాజస్య= జనకమహారాజుయొక్క; దుహితా = కొమార్తెయు; మమ=నాయొక్క; ప్రియా = ప్రియురాలును; దశరథస్య= దశరథమహారాజుయొక్క; స్నుషాచ= కోడలునగు; సా=ఆసీత; కథం=ఎట్లు; రాక్షసీమధ్యగా = రాక్షసస్త్రీలనడుమునొందినదై; శేతే=ఉన్నది?

ఆసీతాదేవి, జనకమహారాజుకూఁతురయ్యు, నాప్రియురాలయ్యు, దశరథమహారాజు కోఁడలునయ్యు, రాక్షసస్త్రీలనడుమంజిక్కియున్నదేమి?

అని, తాత్పర్యము.

కదానువిక్షోభ్యరక్షాంసి సా విధూయో త్పతిష్యతి
విధూయ జలదాన్నీలాన్ శశిరేఖా శరత్స్వివ. ౧౭

టీక॥శరత్సు=శరత్కాలములందు; నీలాన్=నల్లని; జలదాన్=మేఘములను; విధూయ=ఎగురఁగొట్టి; శశిరేఖేవ= చంద్రరేఖవలె; సా=ఆసీత; కదా=ఎప్పుడు; అవిక్షోభ్యరక్షాంసి = కలఁతపెట్టరాని రాక్షసులను; విధూయ=ఎగురఁగొట్టి; ఉత్పతిష్యతి=ఎగురఁగలదు.

శరదృతువునందుఁ, జంద్రరేఖ, నల్లనిమేఘంబులం ద్రోసిపుచ్చి, బయలువెడలునట్లు, సీతయెప్పుడు, అక్షోభ్యులగు రాక్షసులం బాఱఁదోలి, నాయెదుట నుదయింపఁగలదు?

అని, తాత్పర్యము.

స్వభావతనుకా నూనం శోకేనానశనేనచ
భూయస్తనుతరా సీతా దేశకాలవిపర్యయాత్. ౧౮

టీక॥ స్వభావతనుకా=స్వభావముచే సన్నకృశించియున్న; సీతా=సీత; దేశకాలవిపర్యయాత్= దేశముయొక్కయుఁగాలముయొక్కయు వైపరీత్యమువలన; శోకేన=దుఃఖముచేత; అనశనేనచ=ఆహారములేమిచేతను; భూయః=మిక్కిలియు; తనుతరా=అధికముగాఁ గృశించినది. నూనం=నిశ్చయము.

స్వభావంబుననే కృశదేహయయినసీత,యిప్పుడు దేశకాల వైపరీత్యంబునంజేసి,దుఃఖంబుననుఉపవాసంబులచే తనుమఱియుమిక్కిలికృశించియుండఁగలదు. ఇది,నిశ్చయము.

అని, తాత్పర్యము.

కదాను రాక్షసేంద్రస్య నిధాయోరసి సాయకాన్
సీతాం ప్రత్యాహరిష్యామి శోక ముత్సృజ్య మానసమ్. ౧౯

టీక॥కదాను=ఎప్పుడు; రాక్షసేంద్రస్య= రాక్షసేశ్వరుండగురావణుని యొక్క;ఉరసి=ఱొమ్మునందు;సాయకాన్=బాణములను;నిధాయ=ఉంచి; మానసం=మనస్సునందలి; శోకం=దుఃఖమును;ఉత్సృజ్య=విడిచి;సీతాం=సీతను; ప్రత్యాహరిష్యామి= మఱలఁదోడ్కొనివత్తును?

నేను, రాక్షసేశ్వరుండగురావణుని వక్షస్స్థలంబున బాణంబుల నాటి, మఱలసీతంబొంది, యెప్పుడు, మనోదుఃఖంబువిడువంగలను?అని, తాత్పర్యము.

కదాను ఖలు మాం సాధ్వీ సీతా సురసుతోపమా
సోత్కంఠా కంఠ మాలంబ్య మోక్ష్య త్యానందజం పయః. ౨౦

టీక॥కదానుఖలు = ఎప్పుడు;సాధ్వీ=పతివ్రతయును;సురసుతోపమా=దేవకన్యకతోఁబోలికగలదియునగు; సీతా=సీత;సోత్కంఠా = తహతహతోఁగూడినదై;మాం=నన్ను; కంఠం=కంఠమును;ఆలంబ్య=పట్టుకొని;ఆనందజం = సంతోషమువలనంగలిగిన; పయః=జలమును; మోక్ష్యతి= విడువఁగలదు?

పతివ్రతయు దేవకన్యాసమానురాలునగుసీతాదేవి, పరమకౌతుకంబుననన్నుఁగంఠంబునం గవుఁగిలించుకొని , ఆనందబాష్పంబులనెప్పుడు విడువంగలదు? అని, తాత్పర్యము.

కదా శోక మిమం ఘోరం మైథిలీవిప్రయోగజమ్
సహసా విప్రమోక్ష్యామి వాస శ్శుక్లేతరం యథా. ౨౧

స ౫

టీక॥ కదా=ఎప్పుడు; ఘోరం = భయంకరమయిన; మైథిలీవిప్రయోగజం=సీతావిరహమువలనఁగలిగిన; ఇమం=ఈ; శోకం=దుఃఖమును; శుక్లేతరం=నల్లని; వాసోయథా=వస్త్రమునువలె; సహసా=శీఘ్రముగా; విప్రమోక్ష్యామి=విడువఁగలను?

భయంకరంబగునీ సీతావిరహదుఃఖంబును, మలినవస్త్రంబునుంబోలె, శీఘ్రంబున, నెప్పుడువిడువఁగలను? అని, రాముండువిలపించెను.

అని, తాత్పర్యము.

ఏవం విలపత స్తస్య తత్ర రామస్య ధీమతః
దినక్షయా న్మందరుచి ర్భాస్కరో స్త ముపాగమత్. ౨౨

టీక॥ తత్ర=అచ్చట; ధీమతః=బుద్ధిమంతుండగు; తస్య=ఆ; రామస్య=రాముఁడు; ఏవం=ఇట్లు; విలపతః = విలపించుచుండఁగా; భాస్కరః=సూర్యుఁడు; దినక్షయాత్=పగటినాశమువలన; మందరుచిః= తగ్గినకాంతిగలవాఁడై; అస్తం=అస్తమయమును; ఉపాగమత్=పొందెను.

అచ్చట, బుద్ధిమంతుండగురాముండట్లువిలపించుచుండఁగానే, సూర్యుండు మందకాంతియయి యస్తమించె, నంత, సంధ్యాకాలంబయ్యెను.

అని, తాత్పర్యము.

ఆశ్వాసితో లక్ష్మణేన రామ స్సంధ్యా ముపాసత
స్మరన్ కమల పత్రాక్షీం సీతాం శోకాకులీకృతః. ౨౩

టీక॥ రామః =రాముఁడు; లక్ష్మణేన= లక్ష్మణునిచేత; ఆశ్వాసితః=ఊఱడింపఁబడినవాఁడై, కమలపత్రాక్షీం= తామరపూరేకులవంటికండ్లుగల సీతాదేవిని; స్మరన్=తలంచుకొనుచు; శోకాకులీకృతః=దుఃఖముచే వ్యాకులుఁడుగాఁ జేయఁబడినవాఁడై; సంధ్యాం=సంధ్యను; ఉపాసత(ఉపాస్త)=ఉపాసించెను.

అంత, లక్ష్మణునిచే నాశ్వాసితుండై, కమలపత్రంబులుంబోలెవిశాలంబులగుకండ్లుగల సీతందలంచుచు, దుఃఖితుండై, సంధ్యావందనంబుఁ గావించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, పంచమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండపంచమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

షష్ఠసర్గప్రారంభః.

లంకాయాంతు కృతం కర్మ ఘోరం దృష్ట్వా భయావహమ్
రాక్షసేంద్రో హనుమతా శక్రేణేవ మహాత్మనా. ౧
అబ్రవీద్రాక్షసాన్ సర్వాన్ హ్రియా కించి దవాఙ్ముఖః

టీక॥ రాక్షసేంద్రః=రాక్షసనాయకుండగు రావణుండు; మహాత్మనా=అధికమయినపరాక్రమముగలవాఁడును; శక్రేణేవ (స్థితేన)=ఇంద్రుండువలెనున్నవాఁడును; హనుమతా=హనుమంతునిచేత; లంకాయాం=లంకయందు; కృతం=చేయఁబడిన; ఘోరం=చూడఁగూడనట్టి; భయావహం=భయంబుఁగలిగించునట్టి; కర్మ=కార్యమును; దృష్ట్వాతు=చూచినంతనె; హ్రియా=సిగ్గుచేత; కించిదవాఙ్ముఖః=కొంచెమువంచినముఖముఁగలవాఁడై; రాక్షసాన్=రాక్షసులను; సర్వాన్=అందఱినుగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంతనచ్చట, రాక్షసేశ్వరుండగు రావణుండు, దేవేంద్ర సదృశ మహాపరాక్రమశాలియగుహనుమంతుండు లంకయందుఁ గావించిన మహాభయంకర కార్యంబుఁజూచి, సిగ్గుచేఁగొంచెము తలవాంచి, రాక్షసులనందఱిం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ధర్షితా చ ప్రవిష్టా చ లంకా దుష్ప్రసహా పురీ. ౨

తేన వానర మాత్రేణ దృష్టా సీతాచ జానకీ

టీక॥ వానరమాత్రేణ=కోఁతియంతవాఁడైన; తేన=ఆహనుమంతునిచేత; దుష్ప్రసహా=ఓర్వఁగూడని; లంకా=లంకయను; పురీ=పట్టణము; ధర్షితా చ=తిరస్కరింపఁబడినదియు. ప్రవిష్టా చ=ప్రవేశింపఁబడినదియు; జానకీ=జనకమహారాజుకూఁతురయిన; సీతా చ=సీతయు; దృష్టా=చూడఁబడినది.

ఒకకోఁతియంతవాఁడగు హనుమంతుండు, శత్రువులకు దుష్ప్రవేశంబగు లంకాపట్టణమును, నిలక్ష్యముగాఁ బ్రవేశించి, జనకునికొమార్తెను సీతం జూచియుఁబోయినాఁడు.

అని, తాత్పర్యము.

ప్రాసాదో ధర్షితశ్చైత్యః ప్రవరా రాక్షసా హతాః. ౩
ఆవిలాచ పురీ లంకా సర్వా హనుమతా కృతా

టీక॥ హనుమతా=హనుమంతునిచేత; చైత్యః=చైత్యమనెడు; ప్రాసాదః=మేడ; ధర్షితః=తిరస్కరింపఁబడినది, పగులఁగొట్టఁబడినదనుట. ప్రవరాః=శ్రేష్ఠులగు, రాక్షసాః=రాక్షసులు; హతాః=చంపఁబడిరి. లంకా=లంకయను; పురీ చ=పట్టణమును; సర్వా=అంతయు; ఆవిలా=వ్యాకులముగా; కృతా=చేయఁబడినది.

హనుమంతుండు, చైత్యప్రాసాదంబును బగులఁగొట్టెను; ఉత్తములగు రాక్షసులఁ బెక్కండ్రం జంపెను; లంకాపట్టణంబునంతయు దహించి, వ్యాకులంబు గావించెను. అని, తాత్పర్యము.

కిం కరిష్యామి భద్రం వః కిం వా యుక్తమనంతరమ్. ౪
ఉచ్యతాం నస్సమర్థం యత్కృతంచ సుకృతం భవేత్

టీక॥ అనంతరం=ఇంకమీఁద; యుక్తం=అర్హమయినది; కింవా=ఏది? యత్=ఏది; నః=మనకు; సమర్థం=హితమో; కృతంచ=చేయఁబడినదియునై; సుకృతం=చక్కఁగాఁ జేయఁబడినది; భవేత్=అగునో; తాదృశం(అధ్యాహృతము)=అట్టిది; కిం=ఏది? ఉచ్యతాం=చెప్పఁబడుఁగాక. కరిష్యామి=

చేసెదను.వః=మీకు;భద్రం = మంగళము;అస్తు=ఉండుఁగాక.

ఇంకమనమేమిచేయవలెను;మనహితంబును, జేసినచో గార్యసిద్ధిగలిగించునదియునగునుపాయంబెద్ది? వచింపుఁడు: దానింజేసెదను;మీకుమంగళముగలుగుఁగాక. అని, తాత్పర్యము.

మంత్రమూలం హి విజయం ప్రాహురార్యా మనస్వినః। ౫
తస్మాద్వై రోచయే మంత్రం రామం ప్రతిమహాబలాః

టీక॥మహాబలాః=అధికమయినబలముగల రాక్షసులారా! మనస్వినః=మంచిమనస్సుగల;ఆర్యాః=పూజ్యులగువారలు;విజయం = గెల్పును; మంత్రమూలం= ఆలోచనమెకారణముగాఁగలదానిఁగా;ప్రాహుహి = చెప్పుచున్నారుగదా!తస్మాద్వై = అందువలననె;రామంప్రతి = రామునిగూర్చి;మంత్రం=ఆలోచనమును;రోచయే = ఇచ్ఛించుచున్నాను.

మహాబలశాలులగు రాక్షసులారా! ధీరులగుపెద్దలు, మంత్రముచేతనె జయముసిద్ధించునని, చెప్పెదరు;కావున, రామునివిషయమయి,మంత్రముసేయఁగోరుచున్నాను.అని, తాత్పర్యము.

త్రివిధాః పురుషా లోకే ఉత్తమాధమమధ్యమాః। ౬
తేషాంతు సమవేతానాం గుణదోషౌ వదామ్యహమ్

టీక॥లోకే = లోకమునందు;పురుషాః=పురుషులు ; ఉత్తమాధమమధ్యమాః=ఉత్తములు అధములుమధ్యములని; త్రివిధాః= మూఁడువిధములుగలవారలు. అహం = నేను; సమవేతానాం= భేదముదెలియనట్లుఒకరితోనొకరుకలసియున్న; తేషాం=వారలయొక్క; గుణదోషౌ= గుణదోషములనుమాత్రము ; వదామి = చెప్పుచున్నాను.

లోకంబునబురుషులు , ఉత్తములు మధ్యములునధములునని మూఁడువిధములు ; వారలభేదముతెలియుటకష్టము కాఁబట్టి, నేనువారలగుణదోషంబులఁజెప్పెదను. అని, తాత్పర్యము.

 

మంత్రిభి ర్హితసంయుక్తై స్సమర్థై ర్మంత్ర నిర్ణయే. ౭
మిత్రై ర్వాపి సమానార్థై ర్బాంధవై రపివా హితైః
సహితో మంత్రయిత్వా యః కర్మారంభా న్ప్రవర్తయేత్. ౮
దైవేచ కురుతే యత్నం తమాహుః పురుషోత్తమమ్

టీక॥ యః = ఎవ్వఁడు ; మంత్రనిర్ణయే= ఆలోచనమునిర్ణయించుటయందు; సమర్థైః= నేర్పరులగు; హితసంయుక్తైః= మేలునందాసక్తులయిన; మంత్రిభిః=మంత్రులతోఁగాని; సమానార్థైః=సమానమయినప్రయోజనముగల, సుఖదుఃఖములుసమానముగాఁగలయనుట; మిత్రైర్వాపి= స్నేహితులతోగాని; హితైః = మేలుసేయునట్టి; బాంధవైరపివా=బంధువులతోఁగాని; సహితః=కూడినవాఁడై ; మంత్రయిత్వా = ఆలోచించి ; కర్మారంభాన్ = కార్యారంభములను ; ప్రవర్తయేత్ = జరిగించునో; దైవేచ=దైవమునందును; యత్నం = ప్రయత్నమును; కురుతే = చేయునో; తం=అతని ; పురుషోత్తమం=పురుషులలోనుత్తమునిఁగా; ఆహుః= చెప్పుచున్నారు.

ఎవ్వండు , ఆలోచించుటయందుసమర్థులగు, తనహితముగోరుమంత్రులతోఁగాని, తన దుఃఖంబునకు దుఃఖించువారునుదనసుఖంబునకుసంతోషించువారునయిన యట్టిస్నేహితులతోఁగాని, తనమేలు గోరునట్టి బంధువులతోగాని, చక్కఁగానాలోచించి, శక్తివంచనలేక, కార్యంబులనారంభించుచు, దైవమునందును, భారము వేసియుండునో, అతండుత్తమపురుషుండు.

అని, తాత్పర్యము.

ఏకోర్థం విమృశే దేకో ధర్మే ప్రకురుతే మనః. ౯
ఏకః కార్యాణి కురుతే తమాహు ర్మధ్యమం నరమ్

టీక॥ యః (అధ్యాహృతము)= ఎవ్వఁడు; ఏకః=ఒక్కఁడే; అర్థం=కార్యమును; విమృశేత్ =ఆలోచించునో; ఏకః=ఒక్కఁడే; ధర్మే=ధర్మమునందు; మనః=మనస్సును; కురుతే=చేయునో; ఏకః=ఒక్కఁడె; కార్యాణి=పనుల

స ౬

ను; కురుతే=చేయునో; తం=అతని; మధ్యమం=మధ్యముఁడైన; నరః=పురుషునిఁగా; ఆహుః=చెప్పుచున్నారు.

ఎవ్వండు, తానొకఁడే, యాలోచనముచేసి, యొకఁడుగానె దైవము నాశ్రయించి, యొకఁడుగానే, కార్యంబులంజేయునో; అతండు మధ్యమపురుషుండనియందురు. అని, తాత్పర్యము.

గుణదోషా వనిశ్చిత్య త్యక్త్వా ధర్మవ్యపాశ్రయమ్. ౧౦
కరిష్యామీతి యః కార్య ముపేక్షేత్స నరాధమః

టీక॥ యః=ఎవ్వఁడు; గుణదోషౌ=మంచిచెడులను; అనిశ్చిత్య=నిశ్చయింపక; ధర్మవ్యపాశ్రయం=దైవము నాశ్రయించుటను; త్యక్త్వా=విడిచి; "కరిష్యామి=చేసెదను." ఇతి=అని; కార్యం=కార్యమును; ఉపేక్షేత్ (ఉపేక్షేత)=ఉపేక్షించునో; సః=అతండు; నరాధమః=పురుషాధముండు.

ఎవ్వండు, ఆలోచింపక, మంచిచెడులనునిశ్చయింపక, దైవమును సరకుసేయక, చేసెదనని కార్యము నారంభించి, తుదముట్టంగావింపక యుపేక్షసేయునో, అతండధమపురుషుండు.

అని, తాత్పర్యము.

యథేమే పురుషా నిత్య ముత్తమాధమమధ్యమాః. ౧౧
ఏవం మన్త్రాహి విజ్ఞేయా ఉత్తమాధమమధ్యమాః

టీక॥ యథా=ఎట్లు; ఇమే=ఈ; పురుషాః=పురుషులు; నిత్యం=ఎల్లప్పుడు; ఉత్తమాధమమధ్యమాః=ఉత్తములును మధ్యములును అధమములును; ఏవం=ఇట్లు; మన్త్రాహి = ఆలోచనములును; ఉత్తమాధమమధ్యమాః=ఉత్తమములు మధ్యమములు నధమములుగా ; విజ్ఞేయాః=ఎఱుఁగఁదగినవి.

ఎట్లుపురుషులు, ఉత్తమమధ్యమాధములని మూఁడువిధములగునట్లు, మంత్రములును, ఉత్తమ మధ్యమాధమములని మూఁడువిధములు. అని, తాత్పర్యము.

ఐకమత్య ముపాగమ్య శాస్త్రదృష్టేన చక్షుషా. ౧౨
మన్త్రిణో యత్ర నిరతా స్తమాహు ర్మన్త్రముత్తమమ్




టీక॥ యత్ర= ఏయాలోచనమునందు; మంత్రిణః= ఆలోచనముసేయువారలు, ఐకమత్యం= ఒకటేబుద్ధిగలిగియుండుటను ; ఉపాగమ్య=పొంది ; శాస్త్రదృష్టేన = చూడఁబడినశాస్త్రముగల; చక్షుషా = దృష్టితో; నిరతాః=ఆసక్తులో; తం=దానిని ; ఉత్తమం=శ్రేష్ఠమయిన; మంత్రం= ఆలోచనముగా; ఆహుః = చెప్పుదున్నారు.

మంత్రులందఱు, నైకమత్యంబునొంది శాస్త్రజ్ఞానయుక్తంబగు దృష్టితోఁబరస్పరాసక్తులయి యే మంత్రంబు సేయుదురో, అది, యుత్తమమంత్రంబందురు. అని, తాత్పర్యము.

బహ్వ్యోపి మతయో భూత్వా మంత్రిణా మర్థనిర్ణయే. ౧౩
పున ర్యత్రైకతాం ప్రాప్తా స్స మంత్రో మధ్యమ స్స్మృతః

టీక॥ యత్ర= ఏయాలోచనమునందు ; అర్థనిర్ణయే = కార్యమునిశ్చయించువిషయమయి; మంత్రిణాం=ఆలోచనముసేయువారలకు; బహ్వ్యః= పెక్కులయిన; మతయః=బుద్ధులు ; భూత్వాపి=కలిగియు; పునః=మఱల, ఏకతాం=ఐక్యమును; ప్రాప్తాః=పొందినవో; సః=ఆ; మంత్రః= ఆలోచనము; మధ్యమః=మధ్యమమంత్రముగా; స్మృతః=చెప్పబడినది.

ఏమంత్రమునందు, కార్యనిర్ణయవిషయమయి, మంత్రులకుఁబరస్పరమతభేదములుగలిగి, యాపిమ్మటఁదుదకు ఐకమత్యముంగలుగునో, అది, మధ్యమమంత్రంబందురు. అని, తాత్పర్యము.

అన్యోన్యం మత మాశ్రిత్య యత్ర సంప్రతిభాష్యతే. ౧౪
నచైకమత్యే శ్రేయో స్తి మంత్రసోఽధమ ఉచ్యతే

టీక॥ యత్ర= ఏమంత్రమునందు; మంత్రిభిః(అధ్యాహృతము)= ఆలోచనముసేయువారలచేత ; స్వాంస్వాం(అధ్యాహృతము)=తనతన; మతం= మతమును; ఆశ్రిత్య=ఆశ్రయించి; అన్యోన్యం= ఒండొరులనుగూర్చి; సం




ప్రతిభాష్యతే=వాదింపఁబడునో; ఐకమత్యే=ఒకటిబుద్ధిగలుగుటయందు; శ్రేయశ్చ=ప్రీతియును; నాస్తి=లేదో; సః=ఆ; మంత్రః=ఆలోచనము; అధమః=అధమమంత్రముగా; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

ఏమంత్రమునందు,మంత్రులు, భిన్నభిన్నాభిప్రాయంబులంబొంది,తమతమయభిప్రాయంబును వదలక, వాదింపుచుందురో, మఱియునైకమత్యంబునొందవలెనను ప్రీతియులేకయుందురో,అదియధమమంత్రంబని చెప్పఁబడుచున్నది, అని, తాత్పర్యము.

తస్మాత్సుమంత్రితం సాధు భవంతో మతిమత్తమాః. ౧౫
కార్యం సంప్రతిపద్యంతా మేత త్కృత్యం మతం మమ

టీక॥తస్మాత్=అందువలన; మతిమత్తమాః= మిక్కిలియుబుద్ధిమంతులయిన; భవంతః=మీరు;సాధు = చక్కఁగా;సుమంత్రితం= లెస్సగానాలోచింపఁబడిన;కార్యం=కార్యమును;సంప్రతిపద్యంతాం = పొందుదురుగాక. ఏతత్=ఈ;కృత్యం=పని; మమ=నాయొక్క;మతం=ఇష్టము.

అందువలన, మిగులబుద్ధిమంతులరగుమీరలు, శాస్త్రప్రకారంబుననైకమత్యంబుతోఁజక్కఁగానాలోచించి, చేయఁదగినకార్యమును నిర్ణయింపుఁడు;ఇదినాకుఁగావలసినది.అని,తాత్పర్యము.

వానరాణాంహి వీరాణాం సహస్రైః పరివారితః. ౧౬
రామోఽభ్యేతి పురీం లంకా మస్మాక ముపరోధకః

టీక॥రామః = రాముఁడు; వీరాణాం= పరాక్రమశాలులగు; వానరాణాం=వానరులయొక్క;సహస్రైః=వేలచేత; పరివారితః=పరివేష్టింపఁబడినవాఁడై;అస్మాకం = మనయొక్క;ఉపరోధకః=అడ్డగించువాఁడై; లంకాం=లంకయను;పురీం= పట్టణమునుగూర్చి; అభ్యేతిహి=వచ్చుచున్నాఁడుగదా!

రాముండు, పరాక్రమశాలులగువేలకొలఁదివానరులంగూడి, మనలబాధించుటకై,లంకాపురికివచ్చుచున్నాఁడు. అని, తాత్పర్యము.

తరిష్యతిచ సువ్యక్తం రాఘవ స్సాగరం సుఖమ్. ౧౭
తరసా యుక్తరూపేణ సానుజ స్సబలానుగః

టీక॥ రాఘవః = రాముఁడు; సానుజః=తమ్మునితోఁగూడినవాఁడై; సబలానుగః=సైన్యముతోను అనుచరులతోను గూడినవాఁడై; యుక్తరూపేణ=మిక్కిలియుయుక్తమయిన; తరసా=బలముచేత; సాగరంచ=సముద్రమునుగూడ; సుఖం=సుఖముగా; తరిష్యతి=దాఁటఁ గలఁడు. సువ్యక్తం = మిక్కిలియుస్పష్టము.

రాముఁడు, తమ్మునిసైన్యమునుసుగ్రీవాదులనుఁగూడి, తనశక్తిచే, సుఖంబుగా సముద్రంబు దాఁటఁగలఁడు; ఇది స్పష్టము. అని, తాత్పర్యము.

సముద్ర ముచ్ఛోషయతి వీర్యేణా న్యత్కరోతి వా. ౧౮

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; వీర్యేణ = పరాక్రమముచేత, సముద్రం=సముద్రమును; ఉచ్ఛోషయతి=ఎండించును. వా=లేక; అన్యత్ = ఇతరమును; కరోతి=చేయును.

రాముఁడు, పరాక్రమంబున, సముద్రమును, ఎండించినను ఎండించును; లేక, సేతుబంధాదులు గావించి యయినను దాఁటివచ్చును. అని, తాత్పర్యము.

అస్మి న్నేవం గతే కార్యే విరుద్ధే వానరై స్సహ
హితం పురేచ సైన్యేచ సర్వం సమ్మంత్ర్య తాం మమ. ౧౯

టీక॥ అస్మిన్=ఈ; కార్యే=కార్యము; ఏవం=ఇట్లు; గతే = ప్రాప్తింపఁగా; వానరై స్సహ= వానరులతోఁగూడ; విరుద్ధే=విరోధముగలుగఁగా; మమ=నాయొక్క; పురేచ=పట్టణమునందును; సైన్యేచ=సైన్యమునందును; హితం=మేలు; సర్వం=అంతయు; సమ్మంత్ర్యతాం = ఆలోచింపఁబడుఁగాక.

నేను జెప్పినట్లు రాముఁడు వానరులతో వచ్చి లంకను పరోధించు పక్షమున మనకును వానరులకును విరోధము గలుగు

ను; అప్పటికి, నాపట్టణంబునకును సైన్యంబునకును మేలుగలుగు నుపాయంబంతయు నాలోచింపుఁడు. అని, రావణుండు, రాక్షసులతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, షష్ఠస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండషష్ఠసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

సప్తమసర్గప్రారంభః.

ఇత్యుక్త్వా రాక్షసేంద్రేణ రాక్షసాస్తే మహాబలాః
ఊచుః ప్రాంజలయ స్సర్వే రావణం రాక్షసేశ్వరమ్. ౧
ద్విషత్పక్ష మవిజ్ఞాయ నీతిబాహ్య స్త్వబుద్ధయః

టీక॥ నీతిబాహ్యాః=నీతికన్న వెలుపలనుండువారలును, నీతిప్రకారము నడవనివారుననుట; అబుద్ధయః=బుద్ధిలేనివారలును; మహాబలాః=అధికమయినబలము గలవారలునగు; తే=ఆ; రాక్షసాః=రాక్షసులు; సర్వేతు = అందఱును; రాక్షసేంద్రేణ=రాక్షసనాయకుండగు రావణునిచేత; ఇతి=ఇట్లు; ఉక్తాః=చెప్పఁబడినవారలై; ద్విషత్పక్షం = శత్రుబలంబును; అవిజ్ఞాయ=ఎఱుంగక; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవారలై; రాక్షసేశ్వరం=రాక్షసులకుఁ బ్రభుండైన; రావణం=రావణునిగూర్చి; ఊచుః=చెప్పిరి.

నీతిబాహ్యులును, బుద్ధిహీనులును, మహాబలశాలులునగు నా రాక్షసులందఱు, రావణుండు చెప్పినదివిని, శత్రుబలంబు దెలియక, రాక్షసాధీశ్వరుండగు రావణుంజూచి, చేమోడ్పుగిలించి, యిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

రాజ న్పరిఘశ క్త్యృష్టి శూలపట్టిససంకులమ్. ౨
సుమహా న్నో బలం కస్మా ద్విషాదం భజతే భవాన్

టీక॥ రాజన్=రాక్షసరాజుండవగు రావణుఁడా! పరిఘశ క్త్యృష్టిశూలపట్టిససంకులం= గదలచేతను ఈఁటెలచేతను ఖడ్గములచేతను శూలములచేతను అడ్డకత్తులచేతనునిండిన; సుమహాత్=మిక్కిలియుగొప్పదగు; నః=మనయొక్క; బలం = సైన్యము; అస్తి(అధ్యాహృతము)=ఉన్నది. కస్మాత్= దేనివలన; భవాన్=నీవు; విషాదం=దుఃఖమును; భజతే=పొందుచున్నావు?

రాక్షసరాజుండవగు రావణుఁడా! గదలును ఈఁటెలును ఖడ్గంబులును శూలంబులును అడ్డకత్తులును మెండుగాఁగల యనంతంబగుమనసైన్యంబున్నదే! నీవేల దుఃఖపడుచున్నావు?

అని, తాత్పర్యము.

త్వయా భోగవతీం గత్వా నిర్జితాః పన్నగా యుధి. ౩

టీక॥ త్వయా=నీచేత; భోగవతీం= భోగవతీపురమును; గత్వా = పొంది; యుధి=యుద్ధమునందు; పన్నగాః=సర్పములు; నిర్జితాః = జయింపఁబడినవి.

నీవు, పాతాళంబున భోగవతికిం జని, యుద్ధంబునఁ బన్నగుల జయించినావు. అని, తాత్పర్యము.

కైలాస శిఖరావాసీ యక్షై ర్బహుభి రావృతః
సుమహ త్కదనం కృత్వా వశ్యస్తే ధనదః కృతః. ౪

టీక॥ కైలాసశిఖరావాసీ= కైలాసపర్వతశిఖరంబుననున్నవాఁడును; బహుభిః= పెక్కండ్రయిన; యక్షైః= యక్షులచేత; ఆవృతః = చుట్టఁబడినవాఁడునగు; ధనదః=కుబేరుఁడు; సుమహాత్= మిక్కిలియు నధికమయిన; కదనం=యుద్ధమును; కృత్వా=చేసి; తే = నీకు; వశ్యః=అధీనుఁడుగా; కృతః=చేయఁబడినాఁడు.

కైలాసపర్వతంబుననున్న యక్షరాజుండగు కుబేరుండు, అనేకయక్షులం గూడి, మహాయుద్ధంబు చేసి, తుదకు, నీకు

వక్ష్యుండవౌ. అని, తాత్పర్యము.

స మహేశ్వర సఖ్యేన శ్లాఘ్యమాన స్త్వయా విభో
నిర్జితా స్సమరే రోషా ల్లోకపాలో మహాబలః. ౫

టీక॥ విభో = ప్రభుండవగు రావణుండా! మహేశ్వరసఖ్యేన = మహేశ్వరునితోటి స్నేహముచేత; శ్లాఘ్యమానః = కొనియాడఁబడుచున్నవాఁడును; మహాబలః = అధికమయినబలముగలవాఁడును; లోకపాలః = లోకపాలుండునగు; సః = అకుబేరుండు; త్వయా = నీచేత; రోషాత్ = కోపమువలన; సమరే = యుద్ధమునందు; నిర్జితః = జయింపఁబడినాఁడు.

ప్రభుండవగు రావణుండా! ఈశ్వరునకు స్నేహితుండనివినుతికెక్కినవాఁడును మహాబలుండును లోకపాలుండునగునాకుబేరునింగూడ, నీవు, యుద్ధంబునందు, జయించినావు.

అని, తాత్పర్యము.

వినిహత్యచ యక్షౌఘా న్విక్షోభ్యచ విగృహ్య చ
త్వయా కైలాసశిఖరా ద్విమాన మిద మాహృతమ్. ౬

టీక॥ త్వయా = నీచేత; యక్షౌఘాన్ = యక్షసమూహములను; వినిహత్యచ = చంపియు; విక్షోభ్యచ = కలఁచియు; విగృహ్యచ = పట్టుకొనియు; కైలాసశిఖరాత్ = కైలాసపర్వతశిఖరమునుండి; ఇదం = ఈ; విమానం = పుష్పకవిమానము; ఆహృతం = తేఁబడినది.

నీవు, పెక్కుండ్రయక్షులంజంపియు, నానావిధంబులంగలఁచియు, బద్ధులంగావించియుఁ, గైలాసశిఖరంబుననుండి, యీపుష్పకవిమానంబుఁదెచ్చినావు. అని, తాత్పర్యము.

మయేన దానవేంద్రేణ త్వద్భయా త్సఖ్య మిచ్ఛతా
దుహితా తవ భార్యార్థే దత్తా రాక్షసపుంగవ. ౭

టీక॥ రాక్షసపుంగవ = రాక్షసశ్రేష్ఠుండవగు రావణుండా! త్వద్భయాత్ =

నీభయమువలన; సఖ్యం = స్నేహమును; ఇచ్ఛతా = కోరుచున్న; దానవేంద్రేణ = దానవనాథుండగు; మయేన = మయుని చేత; దుహితా = కూఁతురు; తవ = నీకు; భార్యార్థే = భార్యనిమిత్తమయి; దత్తా = ఇవ్వఁబడినది.

రాక్షసశ్రేష్ఠుండవగు రావణుఁడా! దానవనాథుండగు మయుండు, నీకుభయపడి, నీస్నేహంబుఁగోరి, నీకు, భార్యగాఁ, దనకూఁతురు, మందోదరినొసంగెను. అని, తాత్పర్యము.

దానవేంద్రో మధు ర్నామ వీర్యోత్సిక్తో దురాసదః
విగృహ్య వశ మానీతః కుంభీనస్యా స్సుఖావహః. ౮

టీక॥ వీర్యోత్సిక్తః = పరాక్రమముచేగర్వించినవాఁడును; దురాసదః = చెనకఁగూడని వాఁడును; కుంభీనస్యాః = కుంభీనసికి; సుఖావహః = సుఖముఁగలిగించువాఁడును, భర్తయనుట, అగు; మధుర్నామ = మధువను; దానవేంద్రః = దానవనాథుండు; విగృహ్య = యుద్ధముచేసి; వశం = అధీనతను; ఆనీతః = పొందింపఁబడినాఁడు.

పరాక్రమముచేగర్వితుండును, దురాధర్షుండును నీభగినికుంభీనసికిఁబ్రియుండునగుదానవనాథుండయినమధువును, యుద్ధంబుగావించి, వశీకరించుకొంటివి. అని, తాత్పర్యము.

నిర్జితా స్తే మహాబాహో నాగా గత్వా రసాతలమ్
వాసుకి స్తక్షక శ్శంఖో జటీచ వశ మాహృతాః. ౯

టీక॥ మహాబాహో = పెద్దచేతులుగలరావణుఁడా! తే(త్వయా) = నీచేత; రసాతలం = పాతాళమును; గత్వా = పొంది; వాసుకిః = వాసుకియును; తక్షకః = తక్షకుండును; శంఖః = శంఖుండును; జటీచ = జటియు; నాగాః = సర్పములు; నిర్జితాః = జయింపఁబడినవారలై; వశం = అధీనతను; ఆహృతాః = పొందింపఁబడినారు.

మహాబాహుండవగు రావణుఁడా! నీవు, పాతాళంబునకుఁబోయి, వాసుకినిదక్షకునిశంఖుని, జటిని, ఈనాగేంద్రులనుజయించి, వశ్యులంజేసికొనియున్నావు. అని, తాత్పర్యము.

స ౭

అక్షయా బలవంతశ్చ శూరా లబ్ధ వరాః పునః

త్వయి సంవత్సరం యుద్ధ్వా సమరే దానవా విభో. ౧౦

స్వబలం సముపాశ్రిత్య నీతా వశ మరిందమ

టీక॥ అరిందమ= శత్రువులనడఁగఁ ద్రొక్కునట్టి; విభో=ప్రభుండవగు రావణుఁడా! అక్షయాః= నాశములేనివారలును; బలవంతశ్చ = అధికమయినబలముగలవారలును; శూరాః=యుద్ధమునందు భయములేనివారలును ; లబ్ధవరాఃపునః = పొందఁబడినవరముగలవారలునగు; దానవాః=దానవులు, కాలకేయులనుట ; సమరే = యుద్ధమునందు; స్వబలం=తమబలమును;సముపాశ్రిత్య=ఆశ్రయించి; త్వయా=నీతో ; సంవత్సరం = ఒకఁసంవత్సరమంతయు; యుద్ధ్వా=జగడమాడి; వశం = అధీనతను ; నీతాః = పొందింపఁబడినారు.

శత్రువులనడఁగఁ ద్రొక్కఁజాలిన ప్రభుండవగు రావణుఁడా! చూణము గావించినను మఱల లేచునట్టినాశరహితులును బలవంతులును శూరులును,బ్రహ్మనుగూర్చి తపస్సుగావించి వరంబులువడసి యున్నవారలునునగు కాలకేయులను దానవులు, తమయాపచ్ఛక్తిని, నీతోనొకఁసంవత్సరంబు యుద్ధముచేసి,తుదకు, నీకువశ్యులయిరి.

అని, తాత్పర్యము.

మాయా శ్చాధిగతా స్తత్ర బహవో రాక్షసాధిప. ౧౧

టీక॥ రాక్షసాధిప= రాక్షసులకుఁ బ్రభుండవగు రావణుఁడా!తత్ర= వారలయొద్ద; బహవః = పెక్కులయిన ; మాయాశ్చ=మాయలును;అధిగతాః= పొందఁబడినవి.

రాక్షసేశ్వరుండవగు రావణుఁడా! మఱియు నా కాలకేయుల స్నేహమువలన , నానావిధమాయలనుంగూడ నేర్చియున్నావు. అని, తాత్పర్యము.

శూరాశ్చ బలవంతశ్చ వరుణస్య సుతా రణే

నిర్జితా స్తే మహాబాహో చతుర్విధబలానుగాః. ౧౨

టీక॥ మహాబాహో = పెద్దచేతులుగలరావణుఁడా! శూరాశ్చ = యుద్ధమునందుభయములేనివారలును; బలవన్తశ్చ = అధికమయినబలముగలవారలును; చతుర్విధబలానుగాః = నాల్గువిధములయిన సైన్యములు వెంటనడచునవిగాఁగలవారలునగు; వరుణస్య = వరుణునియొక్క; సుతాః = కొడుకులు; త్వయా = నీచేత; రణే = యుద్ధమునందు; నిర్జితాః = జయింపఁబడినారు.

మహాబాహువుండవగు రావణుఁడా! మఱియు, నీవు, శూరులును మహాబలశాలులును చతురంగసైన్యసమేతులు నగు, వరుణపుత్రులను యుద్ధంబున, జయించియున్నావు.

అని, తాత్పర్యము.

మృత్యుదండమహాగ్రాహం శాల్మలి ద్రుమ మండితమ్
కాల పాశమహావీచిం యమకింకరపన్నగమ్. ౧౩
అవగాహ్య త్వయా రాజన్ యమస్య బలసాగరమ్
జయశ్చ విపులః ప్రాప్తో మృత్యుశ్చ ప్రతిషేధితః. ౧౪

టీక॥ రాజన్ = రాక్షసరాజుండవగురావణుఁడా! త్వయా = నీచేత; మృత్యుదండమహాగ్రాహం = యమదండమే పెద్దమొసలిగాఁగలదియు; శాల్మలిద్రుమమండితం = శాల్మల్యాయుధములనువృక్షములచే నలంకరింపఁబడినదియు; కాలపాశమహావీచిం = యమపాశమె పెద్దతరంగము గాఁగలదియు; యమకింకరపన్నగం = యమకింకరులె సర్పములుగాఁగలదియునగు; యమస్య = యమునియొక్క; బలసాగరం = సైన్యసముద్రమును; అవగాహ్య = ప్రవేశించి; విపులః = అధికమయిన; జయశ్చ = గెల్పును; ప్రాప్తః = పొందఁబడినది. మృత్యుశ్చ = యముఁడును; ప్రతిషేధితః = త్రోయఁబడినాఁడు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! నీవు, యమదండంబె భయంకర మకరంబుగా, శాల్మల్యాయుధంబులెవృక్షంబులుగా, యమపాశంబె మహాతరంగంబుగా, యమకింకరులెపన్నగంబులుగా, సముద్రంబుపోల్కిఁ బొల్చునట్టి, యమసైన్యంబుఁజొచ్చి, యుద్ధంబునయముంబాఱఁదోలి, అధికంబగు విజయంబునొందినావు. అని, తాత్పర్యము.

సుయుద్ధేనచ తే సర్వే లోకా స్తత్ర విలోలితాః

టీక॥ తత్ర=అచ్చట; తే=నీయొక్క; సుయుద్ధేన=మంచియుద్ధముచేత; లోకాః=లోకములు; సర్వేచ=అన్నియు; విలోలితాః=చలింపఁజేయఁబడినవి.

అచ్చట, నీవుచేసిన యుద్ధంబునకు, లోకంబులన్నియుఁజలించినవి.
అని, తాత్పర్యము.

క్షత్త్రియై ర్బహుభి ర్వీరై శ్శక్రతుల్య పరాక్రమైః ౧౫
ఆసీ ద్వసుమతీ పూర్ణా మహద్భిరివ పాదపైః

టీక॥ వీరైః=పరాక్రమశాలులును; శక్రతుల్యపరాక్రమైః=దేవేంద్రుని (పరాక్రమము)తోసమానమయినపరాక్రమముగలవారలునగు; బహుభిః = పెక్కండ్రయిన; క్షత్త్రియైః= క్షత్త్రియులచేత; మహద్భిః = పెద్దవగు; పాదపైరివ=వృక్షములచేతంబోలె; వసుమతీ=భూమి; పూర్ణా=నిండినది; ఆసీత్=అయినది.

దేవేంద్రునకుంబోలె మహాపరాక్రమంబుగలక్షత్త్రియులు, పెక్కండ్రు, మహావృక్షంబులుంబోలె, భూమియంతయునిండియుండిరి. అని, తాత్పర్యము.

తేషాం వీర్యగుణోత్సాహై ర్నసమో రాఘవో రణే. ౧౬

టీక॥ రాఘవః=రాముఁడు; రణే=యుద్ధమునందు; వీర్యగుణోత్సాహైః=పరాక్రమముచేతనుగుణములచేతను ఉత్సాహములచేతను; తేషాం= వారలకు; సమః=సమానుఁడు; న=కాఁడు.

రాముండు, పరాక్రమగుణోత్సాహంబుల, యుద్ధంబునందు, వారలకుసమానుఁడెంతమాత్రముకాఁడు.
అని, తాత్పర్యము.

ప్రసహ్య తే త్వయా రాజన్ హతాః పరమదుర్జయాః

టీక॥ రాజన్= రాక్షసరాజుండవగు రావణుఁడా! త్వయా= నీచేత; పరమ

దుర్జయాః= ఎంతమాత్రముజయింపనలవిగానట్టి; తే = ఆరాజులు; ప్రసహ్య = బలాత్కారముగా, హతాః= చంపఁబడినారు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! అట్టిదుర్జయులగు నారాజులనేనీవువధించియున్నావే; ఇంక, రాముండునీకెంతమాత్రము. అని, తాత్పర్యము.

తిష్ఠవా కిం మహారాజ శ్రమేణ తవ వానరాన్. ౧౭
అయ మేకో మహాబాహు రింద్రజి త్క్షపయిష్యతి

టీక॥ మహారాజ= పూజ్యుఁడయినరాజవగురావణుఁడా! త్వం (అధ్యాహృతము)=నీవు ; తిష్ఠవా =ఊరకుండిసను, ఉండుము. తవ = నీయొక్క; శ్రమేణ=ఆయాసముచేత; కిం= ఏమిప్రయోజనము? మహాబాహుః= పెద్దచేతులుగల; అయం=ఈ; ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు; ఏకః =ఒకఁడె; వానరాన్=వానరులను; క్షపయిష్యతి = నశింపఁజేయఁగలఁడు.

మహారాజుండవగురావణుఁడా! నీవుఊరకయెయుండుము; నీవుశ్రమపడనేల? మహాబాహుండగు నీయింద్రజిత్తు, ఒకఁడె, వానరులనందఱనునశింపఁ జేయఁగలఁడు. అని, తాత్పర్యము.

అనేనహి మహారాజ మాహేశ్వర మనుత్తమమ్. ౧౮
ఇష్ట్వా యజ్ఞం వరో లబ్ధో లోకే పరమదుర్లభః

టీక॥ మహారాజ= మహారాజుఁడవగురావణుఁడా! అనేన=ఈయింద్రజిత్తుచేత; అనుత్తమం= తనకన్నశ్రేష్ఠములేని; మాహేశ్వరం=ఈశ్వరదేవతాకమైన ; యజ్ఞం = యాగమును; ఇష్ట్వా=చేసి; లోకే= లోకమునందు; పరమదుర్లభః = మిక్కిలియుదుర్లభమయిన ; వరః=వరము; లబ్ధోహి=పొందఁబడినదిగదా!

మహారాజుండవగురావణుఁడా! ఈయింద్రజిత్తు, మహేశ్వరుంగుఱించి, యుత్తమంబగుయాగంబుగావించి, లోకమునందు, పరమదుర్లభంబగువరంబునొందెను. అని, తాత్పర్యము.

స ౭

శక్తితోమర మీనంచ వినికీర్ణాంత్ర శైవలమ్. ౧౯
గజకచ్ఛపసంబాధ మశ్వ మండూక సంకులమ్
రుద్రాదిత్య మహాగ్రాహం మరుద్వసు మహోరగమ్. ౨౦
రథాశ్వ గజతో యౌఘం పదాతి పులినం మహత్
అనేనహి సమాసాద్య దేవానాం బలసాగరమ్. ౨౧
గృహీతో దైవతపతి ర్లంకాంచాపి ప్రవేశితః

టీక॥అనేన=ఈయింద్రజిత్తుచేత;శక్తితోమరమీనంచ=శక్తితోమరంబులనునాయుధంబులేమత్స్యంబులుగాఁగలదియు;వినికీర్ణాంత్రశైవలం=వెదచల్లఁబడినపేగులెపాఁచిగాఁగలదియు;గజకచ్ఛపసంబాధం=ఏనుంగులనుతాఁబేళ్లచే నిండినదియు ; అశ్వమండూకసంకులం = గుఱ్ఱంబులను కప్పలచేనిండినదియు ; రుద్రాదిత్యమహాగ్రాహం= రుద్రులునాదిత్యులుననేపెద్దమొసళ్లుగలదియు; మరుద్వసుమహోరగం=వాయువులునువసువులునే పెద్ద సర్పంబులుగాఁ గలదియు; రథాశ్వగజతోయౌఘం= రథంబులునుగుఱ్ఱంబులునుఏనుంగులునేజలసమూహంబులుగాగలదియు; పదాతిపులినం= కాలిబంటులె యిసుక దిబ్బలుగాగలదియు;మహత్= గొప్పదియునగు; దేవానాం=దేవతలయొక్క; బలసాగరం=సైన్యసముద్రమును ; సమాసాద్య=ప్రవేశించి;దైవతపతిః=దేవేంద్రుండు; గృహీతః= పట్టుకొనఁబడినవాఁడై; లంకాంచాపి=లంకనుగూడ ; ప్రవేశితోహి= ప్రవేశింపఁజేయఁబడినాఁడుగదా!

ఈయింద్రజిత్తు, శక్తితోమరాద్యాయుధంబులుమత్స్యంబులుగా ; ప్రేగులెశైవలంబుగానేనుంగులెతాబేళ్లుగా గుఱ్ఱంబులెకప్పలుగా, రుద్రాదిత్యులెభయంకరమకరంబులుగా,వసువాయువులెమహాగజంబులుగా, రథాశ్వగజంబులెజలసమూహంబుగాఁ, బదాతిసైన్యంబెయిసుకదిబ్బలుగా , మహాసముద్రంబుకరణినతిభయంకరంబై ప్రకాలు దేవసైన్యంబుఁజొచ్చి, దేవేంద్రుంబట్టి బంధించి, లంకకుంగొనివచ్చెఁగదా!

అని, తాత్పర్యము.

పితామహ నియోగాచ్చ ముక్తశ్శంబరవృత్రహా. ౨౨

స ౭

గతస్త్రి విష్టపం రాజన్ సర్వదేవ నమస్కృతః.

టీక॥ రాజన్=రాక్షసరాజుండవగు రావణుఁడా! శంబరవృత్రహా=శంబరాసురునివృత్రాసురునింజంపిన యింద్రుండు; పితామహనియోగాత్=బ్రహ్మదేవునాజ్ఞవలన ; ముక్తః=విడువఁబడినవాఁడునై ;సర్వదేవనమస్కృతః=సమస్తదేవతలచేతనునమస్కరింపఁబడినవాఁడై;త్రివిష్టపం=స్వర్గము ను; గతః=పొందినాఁడు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! అంత , బ్రహ్మదేవునానతింజేసి దేవేంద్రువిడిచిపుచ్చితివి; అంత, నతండు,సమస్తదేవతలుంగొలువ , దేవాలయంబునకేగెను. అని,తాత్పర్యము.

తమేవ త్వం మహారాజ విసృజేంద్రజితం సుతమ్, ౨౩
యావ ద్వా నరసేనాం తాం సరామాం నయతి క్షయం

టీక॥మహారాజ= మహారాజుండవగు రావణుఁడా!త్వం=నీవు; తం=అట్టి; సుతం=కొడుకయిన; ఇంద్రజితమేవ=ఇంద్రజిత్తునే;విసృజ=విడువుము. యావత్=ఎంతలోపల;సరామాం = రామునితోఁగూడిన;తాం = ఆ;వానరసేనాం=వానరసైన్యమును; క్షయం=నాశమును;నయతి=పొందించునో!

మహారాజుండవగు రావణుఁడా! అట్టినీకొడుకునింద్రజిత్తునేపంపుము; రామునితోఁ గూడిన నావానరసేననంతయునెంతలోపలవధించిపుచ్చునో,చూడుము. అని,తాత్పర్యము.

రాజ న్నాపదయుక్తేయ మాగతా ప్రాకృతాజ్జనాత్. ౨౪
హృదినైవ త్వయా కార్యా త్వం వధిష్యసిరాఘవమ్

టీక॥రాజన్=రాక్షసరాజుండవగు రావణుఁడా!ప్రాకృతాత్= క్షుద్రుండగు;జనాత్=జనమువలన;ఆగతా=వచ్చిన;ఇయం=ఈ;ఆపత్ = ఆపద;అయుక్తా=యుక్తముకాదు, మనకుదెలియకయున్నట్టుగానుండితటాలునవచ్చుటంజేసి, దీనివలన మనము దుర్బలులమనియెంచఁదగదనుట.త్వయా=నీచేత;

స ౮

హృది=మనస్సునందు; నైవకార్యా=చేయఁదగినదేకాదు. త్వం=నీవు; రాఘవం=రాముని; వధిష్యసి= చంపఁగలవు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! క్షుద్రుండగు నీహనుమంతునివలననసంభావితంబుగాసంభవించిన యాపదకు భయపడకుండుము; దీనిమనంబుననుంచకుము; నీవుతప్పక రామునివధింపఁగలవు. అని, రాక్షసులు, రావణునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, సప్తమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండసప్తమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

## అష్టమసర్గప్రారంభః.

తతో నీలాంబుదనిభః ప్రహస్తో నామ రాక్షసః
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం శూర స్సేనాపతి స్తదా. ౧

టీక॥ తతః= అంత; తదా=అప్పుడు; శూరః= యుద్ధమునందుభయము లేనివాఁడును, సేనాపతిః = సేనానాయకుండును; నీలాంబుదనిభః=నల్లనిమేఘంబుతోసమానుండునగు ; ప్రహస్తో నామ= ప్రహస్తుండను; రాక్షసః = రాక్షసుఁడు; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవాఁడై; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంతనప్పుడు, శూరుండును రాక్షససేనానాయకుండును నీలమేఘంబువంటి మేనుగలవాఁడునగు ప్రహస్తుండను రాక్షసుండు, రావణుంజూచి, చేమోడ్పు గీలించి, యిట్లని, విన్నవించెను.

అని, తాత్పర్యము.

దేవదానవగంధర్వాః పిశాచపతగోరగాః
నత్వాం ధర్షయితుం శక్తాః కిం పునర్వానరా రణే. ౨

టీక॥ దేవదానవగంధర్వాః=దేవతలును దానవులును గంధర్వులును; పిశాచపతగోరగాః= పిశాచములును బత్సులును సర్పములును; త్వాం = నిన్ను; రణే= యుద్ధమునందు; ధర్షయితుం= ఎదిరించుటకు; శక్తాః =సమర్థులు; న= కారు. వానరాః=వానరులు; నశక్తాఇతి (అధ్యాహృతము)=సమర్థులుకారని; కింపునః (వక్తవ్యం) = చెప్పఁబడవలయునా?

దేవతలేమి దానవులేమి గంధర్వులేమి పిశాచంబులేమి పక్షులేమి నాగంబులేమి, యుద్ధంబున, నీకెదురునిలువఁజాలరు; ఇంక, వానరులనఁగా నెంతమాత్రము? అని, తాత్పర్యము.

సర్వే ప్రమత్తా విశ్వస్తా వంచితా స్మ హనూమతా
నహి మే జీవతో గచ్ఛేజ్జీవన్ స వనగోచరః. ౩

టీక॥ ప్రమత్తాః= మదించినవారలమును; విశ్వస్తాః=నమ్మియుండినవారలమునగు; సర్వే=అందఱమును; హనూమతా = హనుమంతునిచేత; వంచితాః= మోసపుచ్చఁబడినవారలము ; స్మ (స్మః)=అగుచున్నాము. మే=నేను; జీవతః= బ్రతికియుండఁగా; సః=ఆ; వనగోచరః=వానరుఁడు; జీవన్=జీవించియున్నవాఁడై; నగచ్ఛేద్ధి=పోఁడుగదా!

మనమందఱమును, మనల నెవ్వరు, ఎదిరింపఁజాలరని, మదించి, విస్రబ్ధులమయియుంటిమి; కావున, హనుమంతుఁడు, తటాలునవచ్చి యట్టహాసముచేసిపోవుటకవకాశముగల్గెను; లేనియెడల, నేను జీవించియుండునపుడు, ఆవానరుఁడిచ్చటనుండి ప్రాణంబులతో నెట్లుపోఁగలఁడు? అని, తాత్పర్యము.

సర్వాం సాగరపర్యంతాం సశైలవనకాననామ్
కరోమ్యవానరాం భూమి మాజ్ఞాపయతు మాం భవాన్. ౪

టీక॥ సాగరపర్యంతాం = సముద్రములు అంతములందుగలదియు; సశైల

వనకాననాం= పర్వతంబులతోను వనంబులతోను కాఱడవులతోను గూడినదియునగు; భూమిం=భూమిని; సర్వాం= అంతయు; అవానరాం=వానరులులేనిదానిఁగా; కరోమి= చేసెదను. భవాన్=నీవు; మాం=నన్ను; ఆజ్ఞాపయతు=ఆజ్ఞాపింతువుగాక.

నన్నాజ్ఞాపింపుము; నాలుగుసముద్రంబులలోపలనున్న యీభూమండలమునందంతయుఁ, బర్వతంబులనేమివనంబులనేమిమహారణ్యంబులనేమి, యుండునట్టివానరుల నందఱంజంపి, ఇంక భూమిలోవానరులే లేకుండునట్లుగా వించెదను. అని, తాత్పర్యము.

రక్షాంచైవ విధాస్యామి వానరా ద్రజనీచర
నాగమిష్యతి తే దుఃఖం కించి దాత్మాపరాధజమ్. ౫

టీక॥ రజనీచర= రావణుఁడా! రక్షాంచైవ = రక్షణంబును; విధాస్యామి=చేసెదను. వానరాత్= వానరునివలన; ఆత్మాపరాధజం= నీయపరాధంబునంగలిగిన; దుఃఖం=దుఃఖము; కించిత్ = కొంచెమయినను; నాగమిష్యతి=రాదు.

రావణుఁడా! నేనునీకులంకాపురంబునురక్షించుచునుండెదను; నీవుగావించినసీతాహరణంబునకు, ఈవానరులెంతమాత్రమునీకు దుఃఖముగలుగఁజేయఁజాలరు. అని,ప్రహస్తుండురావణునికిఁజెప్పెను. అని, తాత్పర్యము.

అబ్రవీత్తు సుసంక్రుద్ధో దుర్ముఖో నామ రాక్షసః

టీక॥దుర్ముఖోనామ = దుర్ముఖుండను; రాక్షసస్తు = రాక్షసుండును; సుసంక్రుద్ధః=మిక్కిలియుఁగోపంబునొందినవాఁడై; అబ్రవీత్ =చెప్పెను.

అంత, దుర్ముఖుండను రాక్షసుండు, మహాకోపంబునొంది, యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇదం నక్షమణీయంవా సర్వేషాం నఃప్రధర్షణమ్. ౬

టీక॥ నః=మనయొక్క; సర్వేషాం = అందఱియొక్కయు; ప్రధర్ష




ణం = తిరస్కారము; నక్షమణీయం హి=ఓర్వఁదగినది కాదుగదా!

హనుమంతుండు, మనకందఱకు నిట్టియవమానంబు గావించినాఁడు;ఇది మాత్రము,క్షమింపఁదగినది కాదు.

అని, తాత్పర్యము.

అయం పరిభవో భూయః పురస్యాంతఃపురస్య చ
శ్రీమతో రాక్షసేంద్రస్య వానరేణ ప్రధర్షణమ్. ౭

టీక॥వానరేణ=వానరునిచేత;భూయః=ఇంకను; పురస్య= పట్టణముయొక్కయుఁ; అంతఃపురస్యచ= అంతఃపురముయొక్క;అయం=ఈ;పరిభవః = అవమానమును ; శ్రీమతః=లక్ష్మీసంపన్నుండగు; రాక్షసేంద్రస్య= రాక్షసేశ్వరుండగురావణునియొక్క; ప్రధర్షణం=అవమానము; ఇదంనక్షమణీయం (అధ్యాహృతము) =ఇదిక్షమింపఁదగినదికాదు.

వానరమాత్రుండొకఁడువచ్చి, మనపట్టణంబును మఱియు నంతః పురంబును అవమానించుటయు , శ్రీమంతుండగు రావణునిం గూడ నవమానించుటయు ! ఎంతమాత్రముక్షమింపరాదు. అని, తాత్పర్యము.

అస్మిన్ ముహూర్తే హత్వైకో నివర్తిష్యామి వానరాన్
ప్రవిష్టాన్ సాగరాన్ భీమ మంబరం వా రసాతలమ్. ౮

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; ఏకః=ఒక్కఁడనే ; అస్మిన్=ఈ; ముహూర్తే=ముహూర్తమునందె ; భీమం=భయంకరమగు; సాగరం=సముద్రమునుగాని; అంబరం = ఆకాశమునుగాని; రసాతలంవా= పాతాళమునుగాని ; ప్రవిష్టాన్=ప్రవేశించిన; వానరాన్=వానరులను; హత్వా = చంపి; నివర్తిష్యామి=మఱలెదను.

నేనొక్కఁడనె,యిప్పుడేపోయి, వానరులనందఱను, భయంకరంబగుసముద్రంబుఁజొచ్చినను , ఆకాశంబునకుద్ధమించినను, పాతాళంబునదాఁగినను , విడువక, వధించివచ్చెదను. అని, దుర్ముఖుండు, రావణునికిఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తతో బ్రవీ త్సుసంక్రుద్ధో వజ్రదంష్ట్రో మహాబలః




స ౮

ప్రగృహ్య పరిఘం ఘోరం మాంసశోణితరూషితమ్. ౯

టీక॥ తతః—అంత; మహాబలః = అధికమయినబలముగల; వజ్రదంష్ట్రః= వజ్రదంష్ట్రుండు; సుసంక్రుద్ధః=మిక్కిలియుఁగోపంబునొందినవాఁడై; ఘోరం= భయంకరంబును; మాంసశోణిత రూషితం=మాంసముచేతను నెత్తురు చేతను బూయఁబడినదియునగు; పరిఘం= ఇనుపగుదియను; ప్రగృహ్య=పట్టుకొని; అబ్రవీత్=చెప్పెను.

అంత, అధికబలవంతుఁడగు వజ్రదంష్ట్రుఁడుమిక్కిలియుఁ గోపమునొందినవాఁడై భయంకరంబును, మాంసముచేతను నెత్తురుచేతనుబూయఁబడినదియునగునినుపగుదియను దీసికొనిబలికెను. అని తాత్పర్యము.

కింవో హనుమతా కార్యం కృపణేన తపస్వినా
రామే తిష్ఠతి దుర్ధర్షే ససుగ్రీవే సలక్ష్మణే. ౧౦

టీక॥ససుగ్రీవే= సుగ్రీవునితోఁగూడినవాఁడును; సలక్ష్మణే= లక్ష్మణునితోఁగూడినవాఁడును; దుర్ధర్షే=ఎదిరింపనలవిగానివాఁడునగు; రామే = రాముఁడు; తిష్ఠతి=ఉండఁగా; కృపణేన=భీరువును; తపస్వినా= శోచనీయుండునగు; హనుమతా = హనుమంతునిచేత; వః=మీకు; కిం=ఏమి; కార్యం—పని?

సుగ్రీవలక్ష్మణసహితుండగుదుర్ధర్షుండయిన రాముండుండఁగా, భయంబున రాత్రికాలంబున రహస్యంబుగావచ్చిపోయిన శోచనీయుండగునీహనుమంతునితో మీకేమికార్యమున్నది? అని, తాత్పర్యము.

అద్య రామం ససుగ్రీవం పరిఘేణ సలక్ష్మణమ్
ఆగమిష్యామి హత్వైకో విక్షోభ్య హరివాహినీమ్. ౧౧

టీక॥అద్య—ఇప్పుడు; అహం—నేను; ఏకః=ఒక్కఁడనై; ససుగ్రీవం=సుగ్రీవునితోఁగూడినవాఁడును; సలక్ష్మణం = లక్ష్మణునితోఁ గూడినవాఁడునగు ; రామం=రాముని; పరిఘేణ = ఇనుపగుదియచేత; హత్వా = చంపి; హరివాహి

నీం=వానరసేనను; వితర్షోభ్య=కలంచి; ఆగమిష్యామి=వచ్చెదను.

నేనిప్పుడొక్కడనె పోయి, రాముని సుగ్రీవునితోను లక్ష్మణునితోనుంగూడ, పరిఘంబునం జంపి, వానరసేననంతయుంగలంచి, వచ్చెదను.

అని, తాత్పర్యము.

ఇదం మమాపరం వాక్యం శృణు రాజన్ యదీచ్ఛసి

టీక॥ రాజన్=రాక్షసరాజుండవగు రావణుఁడా! ఇచ్ఛసియది= కోరుదువేని; మమ= నాయొక్క; అపరం= మఱియొక; ఇదం=ఈ; వాక్యం= మాటను; శృణు=వినుము.

రాక్షసరాజుండగు రావణుఁడా? నేనుమఱియొక్క మాటంజెప్పెదను; ఇష్టముకలదేనివినుము.

అని, తాత్పర్యము,

ఉపాయకుశలో హ్యేవ జయేచ్ఛత్రూన్ నతంద్రితః. ౧౨

టీక॥ ఉపాయకుశలో హ్యేవ= ఉపాయములందు సమర్థుఁండైయె; అతంద్రితః=ఏమఱుపాటులేని వాఁడై; శత్రూన్ = శత్రువులను ; జయేత్= జయించును.

ఏమఱక యుపాయంబుననె, శత్రువులను జయింపవలెను.

అని, తాత్పర్యము.

కామరూపధరా శ్శూరా స్సుభీమా భీమదర్శనాః
రాక్షసా వా సహస్రాణి రాక్షసాధిప నిశ్చితాః. ౧౩
కాకుత్స్థముపసంగమ్య బిభ్రతో మానుషం వపుః
సర్వే హ్యసంభ్రమా భూత్వా బ్రువంతు రఘుసత్తమమ్. ౧౪

టీక॥ రాక్షసాధిప=రాక్షసరాజుండవగు రావణుఁడా! కామరూపధరాః= ఇచ్ఛాధీనమగురూపము ధరించువారలును; శూరాః=యుద్ధమునందు భయములేనివారలును; సుభీమాః= మిక్కిలియు భయంకరులును; భీమదర్శనాః=భయంకరమయినచూచుటగలవారలునగు; రాక్షసాః = రాక్షసులు ; సహస్రాణి

వా=వేనవేలును; సర్వే = అందఱును; ("హి" అనునది పాదపూరణార్థము) నిశ్చితాః=నిశ్చయించికొన్నవారలును; మానుషం = మనుష్యసంబంధియగు; వపుః=దేహమును; బిభ్రతః = ధరించినవారలయి; కాకుత్థ్సం=రాముని; ఉపసంగమ్య=పొంది; అసంభ్రమాః= తొట్రుపాటులేనివారలు; భూత్వా = అయి; రఘుసత్తమం=రామునిగూర్చి; బ్రువంతు=చెప్పుదురుగాక.

రాక్షసరాజుండవగు రావణుఁడా! కామరూపులును శూరులును భయంకరాకారులునగు రాక్షసులు, వేనవేలుగా, మనుష్యదేహముధరించి, రామునొద్దకుఁబోయి, తొట్రుపాటులేక, రామునింజూచి, యిట్లని, చెప్పవలెను.

అని, తాత్పర్యము.

ప్రేషితా భరతేన స్మ భ్రాత్రా తవ యవీయసా

టీక॥ తవ = నీయొక్క; యవీయసా=చిన్న; భ్రాత్రా= తోఁబుట్టువగు; భరతేన = భరతునిచేత; ప్రేషితాః=పంపఁబడినవారలము; స్మ (స్మః)=అగుచున్నాము.

మేము, నీతమ్ముఁడుభరతునిచేఁబంపఁబడివచ్చినాము. అని, తాత్పర్యము.

సహి సేనాం సముత్థాప్య క్షిప్ర మేవోపయాస్యతి. ౧౫

టీక॥ సః=ఆభరతుఁడు; సేనాం=సేనను; సముత్థాప్య=లేపి; క్షిప్రమేవ=శీఘ్రముగనే; ఉపయాస్యతి= రాగలఁడు.

ఆభరతుండు, సేనంబిలుచుకొని, శీఘ్రముగనే, వచ్చుచున్నాఁడు- అని, రామునితోఁజెప్పవలెను-

అని, తాత్పర్యము.

తతో వయ మిత స్తూర్ణం శూలశక్తిగదాధరాః
చాపబాణాసిహస్తాశ్చ త్వరితా స్తత్ర యామ హి. ౧౬

టీక॥తతః=అటుపిమ్మట; వయం=మేము; ఇతః=ఇచ్చటనుండి; తూర్ణం=

శీఘ్రముగా; శూలశక్తిగదాధరాః = శూలమును ఈఁటెలను గదలనుధరించుచున్నవారలై ; చాపబాణాసిహస్తాశ్చ = విండ్లనుబాణంబులనుఖడ్గములును చేతులంగలవారలయి; త్వరితాః = వేగిరపడినవారలయి; తత్ర = అచ్చటికి; యామ = పోయెదము ("హ" అనునది పాదపూరణార్థకము).

అంత, మేము, శూలశక్తిగదలను, ధనుర్బాణఖడ్గంబులను, ధరించి, యిచ్చటనుండి, శీఘ్రంబుగా నచ్చటికిఁబోయెదము. అని, తాత్పర్యము.

ఆకాశే గణశః స్థిత్వా హత్వా తాం హరివాహినీమ్
అశ్మశస్త్రమహావృష్ట్యా ప్రాపయామ యమక్షయమ్. ౧౭

టీక॥ వయం = మేము; ఆకాశే = ఆకసమునందు; గణశః = గుంపులుగుంపులుగా; స్థిత్వా = ఉండి; తాం = ఆ; హరివాహినీం = వానరసేనను; అశ్మశస్త్రమహావృష్ట్యా = రాళ్లయొక్కయు నాయుధములయొక్కయుగొప్పవర్షముచేత; యమక్షయం = యమునింటికి; ప్రాపయామ = పొందింతుము.

మేము, గుంపులుగుంపులుగానాకాశంబుననుండి; రాళ్లుఆయుధంబులును గురిపించి, ఆవానరసేననంతయు, యమలోకంబునొందించెదము.

అని, తాత్పర్యము.

ఏవంచే దుపసర్పేతామనయం రామలక్ష్మణౌ
అవశ్య మపనీతేన జహతామేవ జీవితమ్. ౧౮

టీక॥ రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు; ఏవం = ఇట్లు; అనయం = అపాయమును; ఉపసర్పేతాంచేత్ = పొందుదురేని; అపనీతేన = అపాయముచేత; జీవితం = ప్రాణమును; అవశ్యం = అవశ్యముగా; జహతామేవ = విడుతురే.

ఈప్రకారంబు, మనముసేయుదుమేని, ఇట్లు, సంకటంబునొంది, రామలక్ష్మణులు, అవశ్యము, ప్రాణంబులనువిడుతురు. అని, వజ్రదంష్ట్రుండు, చెప్పెను.

అని, తాత్పర్యము.

కౌంభకర్ణి స్తతో వీరో నికుంభో నామ వీర్యవాన్
అబ్రవీ త్పరమక్రుద్ధో రావణం లోకరావణమ్. ౧౯

టీక॥ తతః=అటుపిమ్మట; వీరః=శూరుండును; వీర్యవాన్=అధికమయిన పరాక్రమంబుగలవాఁడునగు; కౌంభకర్ణిః=కుంభకర్ణునికొడుకైన; నికుంభోనామ=నికుంభుఁడనువాఁడు; పరమక్రుద్ధః=మిక్కిలియుఁగోపము నొందినవాఁడై; లోకరావణం=లోకంబులనఱచునట్లుచేయునట్టి; రావణం=రావణుని గూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంత, శూరుండును మహాపరాక్రమశాలియునగు కుంభకర్ణపుత్త్రుండు నికుంభుండను రాక్షసుండు, పరమ కుపితుండై, లోకంబుల నేడ్పించునట్టి రావణుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

సర్వే భవంత స్తిష్ఠంతు మహారాజేన సంగతాః

టీక॥ భవంతః=మీరలు; సర్వే=అందఱును; మహారాజేన=మహారాజుండగు రావణునితో; సంగతాః=కూడినవారలయి; తిష్ఠంతు=ఉందురుగాక.

మీరలందఱు, మహారాజుండగు రావణుతోఁగూడ, నిచ్చటనే యూరక, యుందురుగాక.

అని, తాత్పర్యము.

అహ మేకో హనిష్యామి రాఘవం సహలక్ష్మణమ్. ౨౦
సుగ్రీవంచ హనూమంతం సర్వానేవచ వానరాన్

టీక॥ అహం=నేను; ఏకః=ఒక్కఁడనె; సహలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడిన; రాఘవం=రాముని; సుగ్రీవం=సుగ్రీవుని; హనూమంతం=హనుమంతుని; వానరాన్=వానరులను; సర్వానేవచ=అందఱనే; హనిష్యామి=చంపెదను.

నేనొకరుండనేపోయి, రామలక్ష్మణులను సుగ్రీవుని, హనుమంతుని, వానరులనందఱను, వధించివచ్చెదను. అని, నికుంభుండు చెప్పెను.

అని, తాత్పర్యము.

తతో వజ్రహనుర్నామ రాక్షసః పర్వతోపమః. ౨౧
క్రుద్ధః పరిలిహ న్వక్త్రం జిహ్వయా వాక్య మబ్రవీత్

టీక॥ తతః=అటుపిమ్మట; పర్వతోపమః=కొండతోఁబోలికగల; వజ్రహనుర్నామ=వజ్రహనుండనెడు; రాక్షసః=రాక్షసుఁడు; క్రుద్ధః=కోపించినవాఁడై; జిహ్వయా=నాలుకచేత; వక్త్రం=నోటిని; పరిలిహన్= అంతటనాకుచు; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంతట, పర్వతాకారుండగు వజ్రహనుండను రాక్షసుండు, కోపంబునొంది, భక్షణస్మరణంబున, నోరూర, నాలుకచే నోరంతయు నాకుకొనుచు, నీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

స్వైరం కుర్వంతు కార్యాణి భవంతో విగతజ్వరాః. ౨౨

టీక॥ భవంతః= మీరలు; విగతజ్వరాః=పోయినభయముగలవారలై; స్వైరం=యథేచ్ఛముగా; కార్యాణి=పనులను; కుర్వంతు=చేయుఁడు.

మీరలందఱు నిర్భయంబుగా, యథేచ్ఛందోఁచిన కార్యంబులు సేసికొనుఁడు. అని, తాత్పర్యము.

ఏకోఽహం భక్షయిష్యామి తాన్ సర్వా న్హరియూథపాన్

టీక॥ అహం= నేను, ఏకః= ఒకఁడనె; తాన్=ఆ; హరియూథపాన్=వానరశ్రేష్ఠులను; సర్వాన్=అందఱను; భక్షయిష్యామి=భక్షించెదను.

నేనొకఁడనె యావానరోత్తములనందఱను భక్షించి వేసెదను. అని, తాత్పర్యము.

స్వస్థాః క్రీడంతు నిశ్చింతాః పిబంతో మధువారుణీమ్. ౨౩

టీక॥ భవంతః (అధ్యాహృతము)= మీరలు; నిశ్చింతాః=చింతలేనివారలై; స్వస్థాః=సెమ్మదిగలవారలై; మధువారుణీం=మద్యమును; పిబంతః= త్రాగుచు; క్రీడంతు= క్రీడించుచుందురుగాక.

మీరలేచింతయు లేనివారలై, మ

ద్యంబుఁ ద్రాఁగుచు స్వస్థంబుగా క్రీడించుచుందురుగాక. అని, తాత్పర్యము.

అహ మేకో వధిష్యామి సుగ్రీవం సహలక్ష్మణమ్
అంగదంచ హనూమంతం రామంచ రణకుంజరమ్. ౨౪

టీక॥ అహం = నేను; ఏకః = ఒక్కఁడనై; సహలక్ష్మణం = లక్ష్మణునితోఁ గూడిన, సుగ్రీవం = సుగ్రీవుని; అంగదంచ = అంగదుని; హనుమంతం = హనుమంతుని; రణకుంజరం = యుద్ధమునందు ఏనుఁగువంటివాఁడైన; రామంచ = రాముని; వధిష్యామి = చంపెదను.

నేనొక్కండనైపోయి, సుగ్రీవునిలక్ష్మణునిఅంగదునిహనుమంతుని రణపండితుండగురాముని, అందఱనువధించివచ్చెదను. అని, వజ్రహనుండు చెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, అష్టమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండాష్టమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

నవమసర్గప్రారంభః.

తతో నికుంభో రభస స్సూర్యశత్రు మహాబలః
సుప్తఘ్నో యజ్ఞహా రక్షో మహాపార్శ్వ మహోదరః. ౧
అగ్నికేతుశ్చ దుర్ధర్షో రశ్మికేతు శ్చరాక్షసః
ఇంద్రజిచ్చ మహాతేజా బలవా న్రావణాత్మజః. ౨
ప్రహస్తో థ విరూపాక్షో వజ్రదంష్ట్రో మహాబలః
ధూమ్రాక్షశ్చా తికాయశ్చ దుర్ముఖ శ్చైవరాక్షసః. ౩




పరిఘా న్పట్టిసా న్ప్రాసాన్ శక్తిశూలపరశ్వధాన్
చాపానిచ సబాణాని ఖడ్గాంశ్చ విపులాన్ శితాన్. ౪
ప్రగృహ్య పరమక్రుద్ధా స్సముత్పత్యచ రాక్షసాః
అబ్రువ న్రావణం సర్వే ప్రదీప్తా ఇవ తేజసా. ౫

టీక॥ తతః=అటుపిమ్మట; నికుంభః=నికుంభుండును; రభసః=రభసుండును; మహాబలః=అధికమయినబలముగల; సూర్యశత్రుః=సూర్యశత్రుండును; సుప్తఘ్నః=సుప్తఘ్నుండనువాఁడును; యజ్ఞహా=యజ్ఞహుండను; రాక్షః=రాక్షసుండును; మహాపార్శ్వః=మహాపార్శ్వుండును; మహోదరః=మహోదరుండును; దుర్ధర్షః=ఎదిరింపనలవిగానట్టి; అగ్నికేతుశ్చ=అగ్నికేతుండును; రశ్మికేతుః=రశ్మికేతుండును; రాక్షసశ్చ=రాక్షసుండును; మహాతేజాః=అధికమయిన తేజస్సుగలవాఁడును; బలవాన్=అధికమయినబలముగలవాఁడును; రావణాత్మజః=రావణునికొమరుఁడగు; ఇంద్రజిచ్చ=ఇంద్రజిత్తును; అథ=ఇంక; ప్రహస్తః=ప్రహస్తుండును; విరూపాక్షః=విరూపాక్షుండును; మహాబలః=అధికమయినబలముగల; వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుండును; ధూమ్రాక్షశ్చ=ధూమ్రాక్షుండును; అతికాయశ్చ=అతికాయుండును; దుర్ముఖః=దుర్ముఖుండను; రాక్షసశ్చైవ=రాక్షసుండును; రాక్షసాః=ఈరాక్షసులు; సర్వే=అందఱును; పరిఘాన్=ఇనుపగుదియలను; పట్టిసాన్=అడ్డకత్తులను; ప్రాసాన్=ఈఁటెలను; శక్తిశూలపరశ్వధాన్=శక్తులనుశూలంబులనుగొడ్డళ్లను; సబాణాని=బాణములతోఁగూడిన; చాపానిచ=ధనుస్సులను; విపులాన్=పెద్దవియును; శితాన్=కఱుకుగలవియునగు; ఖడ్గాంశ్చ=ఖడ్గంబులను; ప్రగృహ్య=పట్టుకొని; పరమక్రుద్ధాః=మిక్కిలియుఁగోపంబునొందినవారలయి; సముత్పత్యచ=లేచియు; తేజసా=కాంతిచేత; ప్రదీప్తా ఇవ(స్థితాః)=వెలుఁగునట్లున్నవారలై; రావణం=రావణునిఁగూర్చి; అబ్రువన్=చెప్పిరి.

అంత; నికుంభుండును రభసుండును మహాబలశాలియగు సూర్యశత్రుండును సుప్తఘ్నుండును యజ్ఞహుండును మహాపార్శ్వుండును మహోదరుండును దుర్ధర్షుండగునగ్నికేతుం




దునురశ్మికేతుండును మహాతేజుండును మహాబలశాలియును రావణపుత్రుండు నగునింద్రజిత్తును బ్రహస్తుండును, విరూపాక్షుండును మహాబలుండగు వజ్రదంష్ట్రుండును, ధూమ్రాక్షుండును నతికాయుండును, దుర్ముఖుండును, వీరలందఱు, పరిఘంబులను బట్టిసంబులను బ్రాసంబులను శక్తులను శూలంబులను గండగొడ్డళ్లను ధనుర్బాణంబులను నిశితంబులగు మహాఖడ్గంబులను; ధరించి; లేచి, పరమకుపితులయి, తేజంబున వెలుంగుచు, రావణుంజూచి, యిట్లనిచెప్పిరి. అని, తాత్పర్యము.

అద్య రామం వధిష్యామ స్సుగ్రీవంచ సలక్ష్మణమ్
కృపణంచ హనూమంతం లంకా యేన ప్రధర్షితా. ౬

టీక॥ అద్య=ఇప్పుడు; రామం=రాముని; సలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడిన; సుగ్రీవం=సుగ్రీవుని; యేన=ఎవ్వనిచేత; లంకా=లంకాపట్టణము; ప్రధర్షితా=తిరస్కరింపఁబడినదో; తం(అధ్యాహృతము)=అట్టి; కృపణం=నీచుండగు; హనూమంతం చ=హనుమంతుని; వధిష్యామః=చంపెదము.

మనమిప్పుడేపోయి, రామలక్ష్మణులను, సుగ్రీవునిలంకాపురిం జెఱచిననీచుండగుహనుమంతుని వధించివచ్చెదము. అని, నికుంభాదిరాక్షసులు చెప్పిరి.

అని, తాత్పర్యము.

తా న్గృహీతాయుధా న్సర్వా న్వారయిత్వా విభీషణః
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం పునః ప్రత్యుపవేశ్య తాన్. ౭

టీక॥ విభీషణః=విభీషణుఁడు; గృహీతాయుధాన్=పట్టుకొనఁబడినయాయుధంబులుగల; తాన్=వారలను; సర్వాన్=అందఱను; వారయిత్వా=అడ్డగించి; పునః=మఱల; తాన్=వారలను; ప్రత్యుపవేశ్య=కూర్చుండఁజేసి; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవాఁడై; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, విభీషణుండు, ఆయుధధారులై ప్రయాణసన్నద్ధులైయున్న నికుంభాదిరాక్షసులనునిలిపి మఱలఁగూర్చుం

డఁబెట్టి, చేమోడ్పుగిలించి, రావణుం జూచి; యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము-

అప్యుపాయై స్త్రిభి స్తాత యో ఽర్థః ప్రాప్తుం నశక్యతే
తస్య విక్రమకాలాం స్తా న్యుక్తా నాహుర్ మనీషిణః. ౮

టీక॥ తాత=నాయనా! ఉపాయైః=సామాద్యుపాయములగు; త్రిభిరపి=మూఁడిటిచేతనుగూడ; యః=ఏ; అర్థః=కార్యము; ప్రాప్తుం = పొందుటకు; నశక్యతే= అలవికాదో; తస్య = దానికి; తాన్=ఆ; విక్రమకాలాన్=పరాక్రమసమయములను; యుక్తాన్=తగినవానిఁగా; మనీషిణః=పండితులు; ఆహుః= చెప్పుచున్నారు.

నాయనా! సామదానభేదంబులనుమూఁడుపాయంబులచేత నేదియసాధ్యమో దానివిషయమవ్వె, దండోపాయంబుఁ బ్రయోగింపవలయునని పండితులు చెప్పుచున్నారు. కాఁబట్టి, మనమిప్పుడు సామదానభేదంబులఁ బ్రయోగింపవలయుఁగాని, దండంబునకుఁ గాలముగాదు. అని, తాత్పర్యము.

ప్రమత్తేష్వ భియుక్తేషు దైవేన ప్రహృతేషుచ
విక్రమా స్తాత సిద్ధ్యంతి పరీక్ష్య విధినా కృతాః. ౯

టీక॥ తాత=నాయనా! విక్రమాః=పరాక్రమములు; ప్రమత్తేషు=ఏమఱియుండువారలయందును; అభియుక్తేషు = శత్రువులచేనాక్రమింపఁ బడిన వారలయందును; దైవేన=విధిచేత; ప్రహృతేషుచ=కొట్టఁబడినవారలందును, పరీక్ష్య=పరీక్షించి, విధినా=శాస్త్రరీతిచేత; కృతాః=చేయఁబడినవై; సిద్ధ్యంతి=సిద్ధించుచున్నవి.

విషయాసక్తులయి యేమఱియుండువారలు శత్రువులచే నాక్రాంతులు దైవంబు ప్రతికూలంబుగాఁగలవారలు. మొదలగువారలయందు, నీతిశాస్త్రోక్తప్రకారమునఁ జక్కఁగాఁబరీక్షించి ప్రయోగింపఁబడునేని, దండంబు సఫలమగును; మఱియొక్కచోఁ బ్రయోగింపఁబడిన పక్షమునందు, ఎంతమాత్రము సిద్ధింపదు- అని, తాత్పర్యము.

అప్రమత్తం కథం తంతు విజిగీషుం బలే స్థితమ్
జితరోషం దురాధర్షం ప్రధర్షయితు మిచ్ఛథ. ౧౧

టీక॥ అప్రమత్తం= ఏమఱుపాటు లేనివాఁడును;విజిగీషుం=జయింపనిచ్ఛ గలవాఁడును; బలే= బలమునందు ; స్థితం=ఉన్నవాఁడును; జితరోషం=జయింపఁబడినకోపముగలవాఁడును; దురాధర్షం="ఎదిరింపనలవిగానివాఁడు నగు; తంతు = ఆరామునింగూడ; కథం=ఎట్లు;ప్రధర్షయితుం= తిరస్కరించుటకు; ఇచ్ఛథ=కోరుచున్నారు?

రాక్షసులారా! రాముఁ... డు కాఁడు; ఎంతమాత్ర... టు లేనివాఁడు;విజిగీషుండు;... అకాలంబునఁగోపం... నువాఁడు కాఁడు; కావున,నతని,... పఁనలవిగాదు; అట్టివానింగూడ నెదిరింప,నెట్లుకోరెదరు. అని,తాత్పర్యము.

సముద్రం లంఘయిత్వాతు ఘోరం నదనదీపతిమ్
కృతం హనుమతా కర్మ దుష్కరం తర్కమేతవా. ౧౨

టీక॥ హనుమతా= హనుమంతుని చేత; ఘోరం=భయంకరంబును;నదనదీపతిం=నదంబులకునునదులకునుబ్రభువునగు;సముద్రం= సముద్రమును; లంఘయిత్వాతు = దాఁటియు; దుష్కరం= చేయనలవిగాని; కర్మ=కార్యము; కృతం=చేయఁబడినది. తర్కమేతవా =(ఎవ్వఁడైనను)మనసుననైనను దలంచునా?

హనుమంతుఁడు, భయంకరంబగు నయమ్మహాసముద్రంబును దాఁటి, ఎవ్వరికిని జేయనలవిగాని కార్యంబు జేసినాఁడే! ఇట్లు,ఎవ్వని కేనిదలంపనైనను వచ్చునా? కావున, రాముని... బు నుప్రతికూలంబుగాదు.

అని, తాత్పర్యము.

బలాన్యపరిమేయాని వీర్యాణిచ నిశాచరాః
పరేషాం సహసా వజ్ఞా నకర్తవ్యా కథంచన. ౧౩

టీక॥ నిశాచరాః= రాక్షసులారా!పరేషాం = శత్రువులయొక్క...

చ=బలములును; వీర్యాణిచ = పరాక్రమంబులును; అపరిమేయాని=కొలఁతపెట్టరానివి. సహసా = తటాలున; కథంచన=ఎట్లయినను; అవజ్ఞా=పరిభవము; నకర్తవ్యా=చేయఁబడరాదు.

రాక్షసులారా! శత్రువులబలంబులుఁబరాక్రమంబులుఁ గొలఁతలేనివి, మీరాలోచింపక, తటాలునఁదక్కువయని చెప్పవలదు.

అని, తాత్పర్యము.

కించ రాక్షసరాజస్య రామేణా పకృతం పురా
ఆజహార జనస్థానా ద్యస్య భార్యాం యశస్వినః. ౧౩

టీక॥ కించ=మఱియు; యశస్వినః=అధికమయినపరాక్రమముగల; యస్య=ఎవ్వని యొక్క; భార్యాం=భార్యను; స వః(అధ్యాహృతము)= రావణుఁడు; జనస్థానాత్ = జనస్థానంబుననుండి; ఆజహార=తెచ్చెనో; తేన(అధ్యాహృతము)=అట్టి; రామేణ= రామునిచేత; రాక్షసరాజస్య= రాక్షసప్రభుండగు రావణునకు; పురా=మున్ను; అపకృతం=అపకారముచేయఁబడినది.

మఱియు, రాముండు మున్ను రాక్షసేశ్వరుండగురావణునకు, ఖరాదులంజంపియపకారముగావించినాఁడు; కావున, రావణుండు, యశస్వియగు రాముని భార్యను, జనస్థానంబుననుండి, తెచ్చెను. అని, యందురు.

అని, తాత్పర్యము.

ఖరో యద్యతివృత్త స్తు రామేణ నిహతో రణే
అవశ్యం ప్రాణినాం ప్రాణా రక్షితవ్యా యథాబలమ్. ౧౪

టీక॥ అతివృత్తః = దుర్మార్గుఁడగు; ఖరస్తు=ఖరుఁడును; రామేణ=రాముని చేత; రణే=యుద్ధమునందు; నిహితో యది=చంపఁబడినవాఁడగునేని; కో దోషః (అధ్యాహృతము) =ఏమిదోషము. ప్రాణినాం=ప్రాణులకు; ప్రాణాః=ప్రాణములు; యథాబలం=తమబలమునతిక్రమింపక; అవశ్యం=అవశ్యము; రక్షితవ్యాః=రక్షింపఁబడవలసినది.

ఖరుని, రాముండుయుద్ధంబునఁజంపినాఁడనుటయే కదా! ఖరుండెమొదట నూరకున్నరామునింజంపఁబోయినాఁ

డు; కాననతనింజంపుటరాముని యపరాధము! తప్పుకాదు; తమశక్తికొలందిఁ దమతమ ప్రాణంబులను రక్షించుకొనవలసినదేకదా! అని, తాత్పర్యము.

అయశస్య మనాయుష్యం పరదారాభిమర్శనమ్,
అర్థక్షయకరం ఘోరం పాపస్య చ పునర్భవమ్. ౧౫

టీక ॥ పరదారాభిమర్శనం=పరభార్యలతడవుట; అయశస్యం= అపకీర్తిఁగలిగించునది. అనాయుష్యం= ఆయుస్సుదగ్గించునది. అర్థక్షయకరం= ధననాశమును జేయునది; ఘోరం=భయంకరము; పునః=ఇంకను; పాపస్య= పాపమునకు; భవంచ= ఉత్పత్తిస్థానమును.

పరదారగమనము, అపకీర్తిఁగల్గించును, ఆయుఃక్షయంబుఁజేయును; ధననాశంబుగావించును, మహాపాపంబులనుగల్గించును. అని, తాత్పర్యము.

ఏతన్నిమిత్తం వైదేహీభయం నస్సుమహ ద్భవేత్

టీక॥ ఏతన్నిమిత్తం=ఈకారణమువలన; నః=మనకు; సుమహత్ = మిక్కిలియుగొప్పదగు; వైదేహీభయం=సీతవలనభయము; భవేత్=కలుగును.

ఈకారణముచేత, మనకుసీతవలన, మహాభయంబుసంభవించును.

అని, తాత్పర్యము.

ఆహృతా సా పరిత్యాజ్యా కలహార్థే కృతేన కిమ్. ౧౬

టీక॥ ఆహృతా=తేఁబడిన; సా=ఆసీత; పరిత్యాజ్యా=విడువఁదగినది. కలహార్థే=కలహమువిషయమయి; కృతేన=చేయఁబడినకార్యముచేత; కిం= ఏమిప్రయోజనము?

సీతందెచ్చినాము; మఱలనాబిడను రాముని కీయ వలసినది; కలహంబు గల్గించునది యెంతమంచిదైనను ఏమిప్రయోజనము? అని, తాత్పర్యము.

న నః క్షమం వీర్యవతా తేన ధర్మానువర్తినా

వైరం నిరర్థకం కర్తుం దీయతా మస్య మైథిలీ. ౧౭

టీక॥ వీర్యవతా= అధికమయిన పరాక్రమము గలవాఁడును; ధర్మానువర్తినా= ధర్మమునను సరించువాఁడును నగు; తేన= ఆరామునితో; నిరర్థకం= ప్రయోజనములేని; వైరం= విరోధమును; కర్తుం= చేయుటకు; నః= మనకు; క్షమం= యుక్తమయినది; న= కాదు. అస్య= ఈరామునకు; మైథిలీ = సీత; దీయతాం= ఇవ్వఁబడుఁగాక.

మహాపరాక్రమశాలియు ధర్మంబు దప్పక నడచువాఁడును నగు నారామునితో నిష్ప్రయోజనమయిన వైరము పెట్టుకొనుట, మనకు యుక్తము కాదు; రామునకు, సీతనిచ్చివేయుము.

అని, తాత్పర్యము.

యావ న్న సగజాం సాశ్వాం బహురత్నసమాకులామ్
పురీం దారయతే బాణై ర్దీయతా మస్య మైథిలీ. ౧౮

టీక॥ యావత్ =ఎంతలోపల; సః (అధ్యాహృతము)= ఆరాముఁడు; సగజాం= ఏనుఁగులతోఁగూడినదియు; సాశ్వాం= గుఱ్ఱములతోఁగూడినదియు; బహురత్నసమాకులాం= పెక్కురత్నములచేనిండినదియును నగు; పురీం = లంకాపట్టణమును; బాణైః= బాణములచేత; న దారయతే= పగులఁగొట్టకుండునో; తావత్ (అధ్యాహృతము) = అంతలోపలనే; అస్య= ఈరామునకు; మైథిలీ=సీత; దీయతాం = ఇయ్యఁబడుఁగాక.

రాముండు; వచ్చి, ఏనుంగులతోను గుఱ్ఱంబులతోనుంగూడినదియు బహురత్నసమాకీర్ణంబునగు; లంకాపురిని, బాణంబులవిదారించుటకుమున్నె, రామునకు, సీతనొసంగుము.

అని, తాత్పర్యము.

యావ త్సుఘోరా మహతీ దుర్ధర్షా హరివాహినీ
నావస్కందతి నో లంకాం తావ త్సీతా ప్రదీయతామ్. ౧౯

టీక॥ యావత్ =ఎంతలోపల; సుఘోరా= మిక్కిలియుభయంకరమయిన

దియు; మహాత్ = గొప్పదియు; దుర్ధర్షా = ఎదిరింపనలవిగానిదియునగు; హరివాహినీ = వానరసైన్యము; నః = మనయొక్క; లంకాం = లంకను; నావరుంధతి = అడ్డగింపకుండునో; తావత్ = అంతలోపల; సీతా = సీత; ప్రదీపయతాం = ఇవ్వఁబడుఁగాక.

అతిభయంకరంబునుదురాధర్షంబునగువానరసైన్యమువచ్చి, మనలంకాపురింజుట్టుముట్టి, నిరోధించుటకుమున్నె, రామునకుసీతనిచ్చివేయుము.

అని, తాత్పర్యము.

వినశ్యేద్ధి పురీ లంకా శూరా స్సర్వే చ రాక్షసాః
రామస్య దయితా పత్నీ స్వయంచ యది దీయతే. ౨౦

టీక॥ రామస్య = రామునియొక్క; దయితా = ప్రియురాలగు; పత్నీ = భార్య; స్వయం = తనచేతనె; నదీయతే యది; ఇవ్వఁబడకుండునేని; లంకా = లంక యను; పురీ = పట్టణము; వినశ్యేద్ధి = నశించునుగదా; శూరాః = యుద్ధమునందుభయములేనట్టి; రాక్షసాః = రాక్షసులు; సర్వే = అందఱును; వినశ్యేయుః (అధ్యాహృతము) = నశింతురు.

రామునిప్రియభార్యనాయనకుమనము గానే, యివ్వమేని మనలంకాపట్టణము తయునాశముఁబొందును; మఱియు, శూరులగు రాక్షసులందఱు నాశంబు నొందుదురు.

అని, తాత్పర్యము.

ప్రసాదయే త్వాం బంధుత్వా త్కురుష్వ వచనం మమ
హితం తథ్య మహం బ్రూమి దీయతా మస్య మైథిలీ. ౨౧

టీక॥ బంధుత్వాత్ = బంధువగుటవలన; త్వాం = నిన్ను; ప్రసాదయే = వేఁడుకొనెదను. మమ = నాయొక్క; వచనం = మాటను; కురుష్వ = చేయుము. అహం = నేను; హితం = మేలుసేయునదియు; తథ్యం = యథార్థముగలదానిని; బ్రూమి (బ్రవీమి) చెప్పుచున్నాను. అస్య = ఈరామునకు; మైథిలీ = సీత; దీయతాం = ఇవ్వఁబడుఁగాక.

నీవునాకన్నవగుటవలన, నిన్నువేఁడుకొనుచున్నాను; నేనుచెప్పునట్లు చేయుము; నేను హితకరంబును యథా

ర్థంబునగు దానిం జెప్పుచున్నాఁడు. రాముని కు సీతనిచ్చి వేయుము.

అని, తాత్పర్యము.

పురా శరత్సూర్యమరీచిసన్నిభా
న్నవాగ్రపుంఖాన్ సుదృఢా న్నృపాత్మజః
సృజన్య మోఘాన్ విశిఖా న్వధాయ తే
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. ౨౨

టీక॥ నృపాత్మజః = రాజకొమరుం డగు రాముండు; శరత్సూర్యమరీచి సన్నిభాన్ = శరద్రుతుపువందలి సూర్యుని కిరణములతో సమానము యినదియు; నవాగ్రపుంఖాన్ = నూతనమయిన కొనలు ను మొదళ్లునుగలవియు; సుదృఢాన్ = మిక్కిలి దృఢంబులును; అమోఘాన్ = వ్యర్థములు గానివియునగు; విశిఖాన్ = బాణములను; తే = నీయొక్క; వధాయ = చంపుటకొఱకు; పురా = మున్ను; సృజతి = విడుచును. దాశరథాయ = రామునికొఱకు; మైథిలీ = సీత; ప్రదీయతాం = ఇయ్యఁబడుఁగాక.

రాచకొమరుండగు రాముండు, ఇంక, మీఁద, శరత్కాలసూర్యకిరణంబులుం బోలెనతితీక్ష్ణంబులును నూతనాగ్రపుంఖంబులునుమిక్కిలియు దృఢంబులును అమోఘంబులునగుబాణంబులను, నీవధంబునకై, విడువఁగలఁడు; కావున, రామునకు, సీతనొసంగుము.

అని, తాత్పర్యము.

త్యజస్వ కోపం సుఖధర్మనాశనమ్
భజస్వ ధర్మం రతికీర్తివర్ధనమ్
ప్రసీద జీవేమ సపుత్రబాంధవాః
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. ౨౩

టీక॥ సుఖధర్మనాశనం = సుఖము నుధర్మమునునశింపఁజేయునదియగు; కోపం = కోపమును; త్యజస్వ = విడువుము, రతికీర్తివర్ధనం = సంతోషమునుకీర్తినివృద్ధిఁబొందించునదియగు; ధర్మం = ధర్మమును; భజస్వ = పొందు

స ౯

ము. ప్రసీద=అనుగ్రహింపుము. సపుత్రబాంధవాః= కొడుకులతోను బంధువులతోనుగూడిన వారలమయి; జీవేమ= బ్రతికియుందుము. దాశరథాయ=రామునికొఱకు; మైథిలీ= సీత; ప్రదీయతాం=ఇయ్యఁబడుఁగాక.

కోపఁబు; సుఖంబును ధర్మంబును నశింపఁజేయును, దానివిడువుము, సంతోషంబునుగీర్తిని వృద్ధిఁబొందించునట్టి ధర్మంబునవలంబింపుము; అనుగ్రహించి నేను జెప్పినట్లుగాఁ బింపుము; అట్లు సేయుదువేని, మనము కొడుకులు బంధువులతోఁగూడ, సుఖంబుగాఁ బ్రతికియుండ వచ్చును, రామునకు, సీతనొసంగుము. అని, విభీషణుఁడు, రావణునకుం జెప్పెను. అని, తాత్పర్యము.

విభీషణవచ శ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః
విసర్జయిత్వా తాన్ సర్వాన్ ప్రవివేశ స్వకం గృహమ్. ౨౪

టీక॥ రాక్షసేశ్వరః= రాక్షసులకుఁ బ్రభుండగు; రావణః=రావణుఁడు; విభీషణవచః = విభీషణుని మాటను; శ్రుత్వా=విని; తాన్=ఆ రాక్షసులను; సర్వాన్=అందఱను; విసర్జయిత్వా (విసృజ్య)=విడిచి; స్వకం = తనదైన; గృహం=ఇంటిని; ప్రవివేశ=చొచ్చెను.

రాక్షసనాథుండగు రావణుండు, విభీషణుండు పల్కినమాటనాలకించి, యాసభికులకందఱకును సెలవిచ్చి, తానును, స్వగృహంబునకుంబోయెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, నవమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ నవమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

దశమసర్గప్రారంభః.

తతః ప్రత్యుషసి ప్రాప్తే ప్రాప్తధర్మార్థనిశ్చయః
రాక్షసాధిపతే ర్వేశ్మ భీమకర్మా విభీషణః. ౧
శైలాగ్రచయసంకాశం శైలశృంగమివోన్నతమ్
సువిభక్తమహాకక్ష్యం మహాజనపరిగ్రహమ్. ౨
మతిమద్భి ర్మహామాత్రై రనురక్తై రధిష్ఠితమ్
రాక్షసైశ్చాప్తపర్యాప్తై స్సర్వతః పరిరక్షితమ్. ౩
మత్తమాతంగనిశ్వాసై ర్వ్యాకులీకృతమారుతమ్
శంఖఘోషమహాఘోషం తూర్యనాదానునాదితమ్. ౪
ప్రమదాజనసంబాధం ప్రజల్పితమహాపథమ్
తప్తకాంచననిర్యూహం భూషణోత్తమభూషితమ్. ౫
గంధర్వాణామివావాస మాలయం మరుతామివ
రత్నసంచయసంబాధం భవనం భోగినామివ. ౬
తన్మహాభ్రమివాదిత్య స్తేజోవిస్తృతరశ్మివాన్
అగ్రజస్యాలయం వీరః ప్రవివేశ మహాద్యుతిః. ౭

టీక॥ తతః=అటుపిమ్మట; ప్రత్యుషసి=ప్రాతఃకాలము; ప్రాప్తే=రాఁగా; వీరః=పరాక్రమశాలియు; మహాద్యుతిః=అధికమయినకాంతిగలవాఁడును; భీమకర్మా=భయంకరమయినకార్యముగలవాఁడునగు; విభీషణః=విభీషణుఁడు; శైలాగ్రచయసంకాశం=పర్వతశిఖరసమూహముతోసమానమయినదియు; ఉన్నతం=ఉన్నతంబయినదియు; శైలశృంగమివ(స్థితం)= పర్వతశిఖరమువలెనున్నదియు; సువిభక్తమహాకక్ష్యం= చక్కఁగావిభజింపఁబడినపెద్దతొట్టికట్లుగలదియు; మహాజనపరిగ్రహం=గొప్పవారిచేఁబరిగ్రహింపఁబడినదియు; మతిమద్భిః= అధికమయినబుద్ధిగలవారలును; అనురక్తైః= స్వామిభక్తిగలవారలును; ఆప్తపర్యాప్తైః= కావలసిన కార్యములందు సమర్థులగు

ను; మహామాత్రైః=ప్రధానులునయిన; రాక్షసైశ్చ=రాక్షసులచేతను; అధిష్ఠితం = అధిష్ఠింపఁబడినదియు; సర్వతః = అంతటను ; పరిరక్షితం= రక్షింపఁబడినదియు; మత్తమాతంగనిశ్శ్వాసైః = మదపుటేనుంగులనిట్టూర్పులచేత; వ్యాకులీకృతమారుతం = వ్యాకులముగాఁజేయఁబడినవాయువుగలదియు, శంఖఘోషమహాఘోషం=శంఖధ్వనులచేమహాధ్వనిగలదియు; తూర్యనాదానునాదితం= వాద్యధ్వనులచేధ్వనింపఁజేయఁబడినదియు ; ప్రమదాజనసంబాధం=స్త్రీజనులచేనిండినదియు ; ప్రజల్పితమహాపథం= కలకలధ్వనిగలరాజమార్గముగలదియు ;తప్తకాంచననిర్వ్యూహం=మంచిబంగారువికారమయినమదపుటేనుంగుగలదియు; భూషణోత్తమభూషితం= భూషణశ్రేష్ఠములచేనలంకరింపఁబడినదియు; గంధర్వాణాం=గంధర్వులయొక్క ;ఆవాసమివ (స్థితం)=నివాసస్థానమువలెనున్నదియు మరుతాం=దేవతలయొక్క ; ఆలయమివ(స్థితం) = పట్టణమువలెనున్నదియు; రత్నసంచయసంబాధం= మణిసమూహములచేనిండినదియు ; భోగినాం= సర్పములయొక్క; భవనమివ (స్థితం)=లోకమువలెనున్నదియునగు ; తత్ =ఆ; రాక్షసాధిపతేః=రాక్షసేశ్వరుండగు; అగ్రజస్య=అన్నయైనరావణునియొక్క; ఆలయం=నివాసభూతమయిన; వేశ్మ=ఇంటిని ; తేజోవిస్తృతరశ్మివాన్= దేహకాంతియెయధికమయినకిరణములుగాఁగలవాఁడై ; ఆదిత్యః=సూర్యుఁడు; మహాభ్రమివ= గొప్పయాకాశమునువలె; ప్రవివేశ= ప్రవేశించెను-

అంతఁ, బ్రాతఃకాలంబయినపిమ్మటఁ,బరాక్రమవంతుండును గాంతిమంతుండగు విభీషణుండు, ధర్మార్థంబులనిశ్చయించుకొని రావణునికిహితంబుఁజెప్పటయనెడు భయంకరకార్యంబునే యందలంచి, పర్వతశిఖరంబువలెనున్న పెక్కు శిఖరంబులుగలదియుఁ, బర్వతశిఖరంబువలె నత్యున్నతంబై యున్నదియుఁ,జక్కఁగావివిక్తంబులగు పెద్దతొట్టికట్లుగలదియుఁ, బండితజనాధిష్ఠితంబును,బుద్ధిమంతులును స్వామిభక్తిగలవారలును గార్యంబుల నిర్వహించుట యందు సమర్థులునగు ప్రధానులచే నంతటను రక్షింపఁబడుచున్నదియు, మదపుటేనుంగుల నిట్టూర్పులకుఁబరుగు నొందువాయువుగలదియుఁ;బ్రా కా

లశంఖధ్వనులచేతను మృదంగాది వాద్యధ్వనులచేతను, నిబిడంబయియున్నదియు, స్త్రీలచేనిండియున్నదియుఁ, సకలభక్ష్యభోజ్యాదులంబగు రాజమార్గంబు గలదియు, మంచిబంగారముచేఁ జేయఁబడినమదపుటేనుంగుగలదియు, నుత్తమభూషణంబులచేనలంకృతంబైనదియు, గంధర్వలోకంబువలె నృత్తగీతవాద్యాదిముఖరితంబై యొప్పుచున్నదియు, దేవనగరంబుపగిది సర్వైశ్వర్యసంపన్నంబై యున్నదియు "భోగిభవనంబు భాతినానావిధంబులం బ్రకాశించుచుండునదియు, నన్నయగు రాక్షసేశ్వరుండు రావణునకునివాసస్థానంబునగు రాజగృహంబును; దేహకాంతియె కిరణంబులుగా, సూర్యుం డాకాశంబుఁ బ్రవేశించునట్లు, ప్రవేశించెను.

అని, తాత్పర్యము.

పుణ్యాన్ పుణ్యాహఘోషాంశ్చ వేదవిద్భి రుదాహృతాన్
శుశ్రావ సుమహాతేజా భ్రాతు ర్విజయసంశ్రితాన్. ౮

టీక॥ సుమహాతేజాః=మిక్కిలియు నధికమయిన తేజస్సుగల విభీషణుండు; వేదవిద్భిః= వేదవేత్తలచే; ఉదాహృతాన్ = చెప్పఁబడినవియు; భ్రాతుః= అన్నయొక్క; విజయసంశ్రితాన్= జయంబునుబొందినవియు, జయంబుగలిగించునవియుననుట; పుణ్యాన్= పవిత్రంబులునగు; పుణ్యాహఘోషాంశ్చ= పుణ్యాహమంత్రధ్వనులను; శుశ్రావ= వినెను.

మహాతేజుండగువిభీషణుండు, అచ్చట, రావణునకువిజయంబుగలుగుటకై, వేదవేత్తలగురాక్షసులుచ్చరించునట్టిపుణ్యంబులగు పుణ్యాహమంత్రంబులధ్వనిని, వినెను.

అని, తాత్పర్యము.

పూజితాన్ దధిపాత్రైశ్చ సర్పిర్భి స్సుమనోక్షతైః
మంత్రవేదవిదో విప్రాన్ దదర్శ సుమహాబలః. ౯

టీక॥సుమహాబలః=మిక్కిలియునధికమయినబలముగల విభీషణుండు; దధిపాత్రైః=పెరుఁగుపాత్రలచేతను; సర్పిర్భిః=నేతులచేత;సుమనోక్షతైః=

పుష్పముల చేతను అక్షతల చేతను; పూజితాః=పూజింపఁబడిన; మంత్రవేదవిదః=మంత్రంబులను బ్రాహ్మణంబులను ఎఱింగిన; విప్రైః= బ్రాహ్మణులను; దదర్శ=చూచెను.

మహాబలుండగు నవ్విభీషణుండు, పెరుఁగు నేయి, పుష్పములు నక్షతలు మొదలగువాని చేతఁ బూజింపఁబడిన మంత్ర బ్రాహ్మణవేత్తలగు బ్రాహ్మణులం జూచెను. అని, తాత్పర్యము.

స పూజ్యమానో రక్షోభి ర్దీప్యమాన స్స్వతేజసా
ఆసనస్థం మహాబాహు ర్వవందే ధనదానుజమ్. ౧౦

టీక॥ మహాబాహుః=పెద్దచేతులుగల; సః=ఆవిభీషణుఁడు; రక్షోభిః=రాక్షసుల చేత; పూజ్యమానః= పూజింపఁబడుచున్నవాఁడై; స్వతేజసా=తన కాంతిచేత ; దీప్యమానః= ప్రకాశించుచున్నవాఁడై; ఆసనస్థం=సింహాసనంబునందున్న; ధనదానుజం = కుబేరుని తమ్ముండగు రావణుని; వవందే=నమస్కరించెను.

మహాబాహుండగు నవ్విభీషణుండు, రాక్షసులు గొనియాడఁ , దేజంబున వెలుంగుచు, లోనికిం బోయి , సింహాసనగతుండై యున్న కుబేరానుజుండగు రావణునకు, నమస్కారంబు జేసెను. అని, తాత్పర్యము.

స రాజదృష్టిసంపన్న మాసనం హేమభూషితమ్
జగామ సముదాచారం ప్రయుజ్యా చారకోవిదః. ౧౧

టీక॥ ఆచారకోవిదః= ఆచారంబులందుఁ బండితుండగు; సః = ఆవిభీషణుఁడు; సముదాచారం = తగినయాచారమును; ప్రయుజ్య=చేసి ; రాజదృష్టిసంపన్నం=రాక్షసరాజుండగు రావణుని చూపుతోఁ గూడిన; హేమభూషితం= బంగారముచే నలంకరింపఁబడిన;ఆసనం=ఆసనమును ;జగామ=పొందెను.

విభీషణుండు,సాంప్రదాయకాచారంబులం జక్కఁగాఁ దెలిసినవాఁడు కావున,నప్పుడు తాను జేయవలసినట్లు, జయశబ్దప్రయోగంబు గావించి,రావణుండు నేత్రసంజ్ఞ చేఁజూపిన కాంచనాలంకృ

తంబగు నాసనంబునం గూచుండెను. అని, తాత్పర్యము.

స రావణం మహాత్మానం విజనే మంత్రిసన్నిధౌ
ఉవాచ హిత మత్యర్థం వచనం హేతునిశ్చితమ్. ౧౨

టీక॥ సః=ఆవిభీషణుండు; విజనే=జనులులేని స్థలంబునందు; మంత్రిసన్నిధౌ=మంత్రులసమీపంబునందు; మహాత్మానం=అధికమయిన పరాక్రమముగల; రావణం=రావణునిఁగూర్చి; అత్యర్థం=మిక్కిలియు; హితం=మేలుసేయునదియు; హేతునిశ్చితం=యుక్తులచేనిశ్చయింపఁబడినదియునగు; వచనం=మాటను; ఉవాచ=చెప్పెను.

అంత, నవ్విభీషణుండు, మంత్రులు తప్పమఱియెవ్వరును లేనప్పుడు, మహాపరాక్రమశాలియగు రావణుంజూచి, మిక్కిలియు హితకరంబును బెక్కుయుక్తులచే, సునిశ్చితంబునగు మాటం జెప్పెను. అని, తాత్పర్యము.

ప్రసాద్య భ్రాతరం జ్యేష్ఠం సాంత్వేనో పస్థితక్రమః
దేశకాలార్థసంవాదీ దృష్టలోకపరావరః. ౧౩

టీక॥ ఉపస్థితక్రమః=పొందఁబడిన క్రమముగలవాఁడును; దేశకాలార్థసంవాదీ=దేశమునకును గాలమునకునుదగిన కార్యమును జెప్పువాఁడును; దృష్టలోకపరావరః=చూడఁబడినలోకంబునందలి మంచిచెడులుగలవాఁడునగు; సః(అధ్యాహృతము)=ఆవిభీషణుండు; జ్యేష్ఠం=పెద్దవాఁడగు; భ్రాతరం=తోఁబుట్టువును; ప్రసాద్య=ప్రసన్నునింజేసి; సాంత్వేన=తిన్నఁదనముచేత; ఉవాచ(అధ్యాహృతము)=చెప్పెను.

ఎప్పటకెచ్చట నేమిచేయుటయుక్తమో దానినంతయు నెఱింగినవాఁడును లోకమునందలి మంచిచెడులు దెలిసినవాఁడునగు నవ్విభీషణుండు, స్తోత్రాదులచేఁ గ్రమంబుగా, నన్నను బ్రసన్నుంజేసికొని, తిన్నగా, నిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

యదాప్రభృతి వైదేహీ సంప్రాప్తే మాం పురీం తవ

తదాప్రభృతి దృశ్యంతే నిమిత్తాన్యశుభాని నః. ౧౪

టీక॥ యదాప్రభృతి=ఎప్పుడుమొదలు; వైదేహీ=సీత; తవ=నీయొక్క; ఇమాం=ఈ; పురీం=పట్టణమును; సంప్రాప్తా=పొందినదో; తదాప్రభృతి=అప్పుడుమొదలు; నః=మనకు; అశుభాని=అమంగళకరంబులగు; నిమిత్తాని=శకునంబులు; దృశ్యంతే=చూడఁబడుచున్నవి.

సీత, మనపట్టణంబునకువచ్చినదిమొదలు, మనకు; అశుభసూచకంబులగు పెక్కునిమిత్తంబులగుపడుచున్నవి.

అని, తాత్పర్యము.

సస్ఫులింగస్సధూమార్చిస్సధూమకలుషోదయః
మంత్రసంధుక్షితోఽప్యగ్నిర్నసమ్యగభివర్ధతే. ౧౫

టీక॥ అగ్నిః=అగ్నిహోత్రము; మంత్రసంధుక్షితోఽపి=మంత్రములతోఁబురికొల్పఁబడినదైనను; సస్ఫులింగః=కణములతోఁగూడినదై; సధూమార్చిః=పొగతోఁగూడినమంటతోఁగూడినదై; సధూమకలుషోదయః=పొగచేమందమయినయుదయించుటగలదై; సమ్యక్=చక్కఁగా; నాభివర్ధతే=వృద్ధిఁబొందకున్నది.

అగ్నిహోత్రము, సమంత్రకంబుగా వేల్వఁబడియు, నగ్నికణంబులతోఁగూడిపొగగల్గి, కొంచెముకొంచెముగా లేచుచున్నదేకాని, చక్కఁగాఁబ్రజ్వరిల్లుటలేదు. అని, తాత్పర్యము.

అగ్నిష్ఠేష్వగ్నిశాలాసు తథా బ్రహ్మస్థలీషు చ
సరీసృపాణి దృశ్యంతే హవ్యేషుచ పిపీలికాః. ౧౬

టీక॥ అగ్నిష్ఠేషు=పొయ్యిలయందును; అగ్నిశాలాసు=అగ్నిహోత్రగృహములందును; తథా=అట్లు; బ్రహ్మస్థలీషుచ=వేదాధ్యయనస్థలములయందును; సరీసృపాణి(సరీసృపాః)=పాములు; దృశ్యంతే=చూడఁబడుచున్నవి. హవ్యేషు=హవిస్సులయందును; పిపీలికాః=చీమలు; దృశ్యంతే(అధ్యాహృతము)=చూడఁబడుచున్నవి.

పొయ్యిలయందును, అగ్నిహో

త్రగృహంబులందును, వేదాధ్యయన స్థలంబులందును సర్పంబు లగుపడుచున్నవి; మఱియు హోమంబు సేయు నుంచియుండుహవిస్సులకుఁజీమలెక్కుచున్నవి. అని, తాత్పర్యము.

గవాం పయాంసి స్కన్నాని విమదా వీరకుంజరాః
దీన మశ్వాః ప్రహేషంతే న చ గ్రాసాభినందినః. ౧౭

టీక॥ గవాం = ఆవులయొక్క; పయాంసి = క్షీరములు; స్కన్నాని = ఎండిపోయినవి. వీరకుంజరాః = మదపుటేనుంగులు; విమదాః = మదములేకున్నవి. అశ్వాః = గుఱ్ఱములు; దీనం = దైన్యము కలుగునట్లుగా; ప్రహేషంతే = అఱచుచున్నవి. గ్రాసాభినందినశ్చ = ఆహారమునభినందించునదియు; న = కావు.

ఆవుల పాలు, ఎండిపోయినది; మదపుటేనుంగులు, మదహీనంబులయియున్నవి; గుఱ్ఱములు, దీనముగా నఱచుచున్నవి; ఆహారంబునుంగూడఁగొనుట లేదు. అని, తాత్పర్యము.

ఖరోష్ట్రాశ్వతరా రాజన్ భిన్నరోమాః స్రవంతి నః
న స్వభావేన తిష్ఠంతి విధానైరపి చింతితాః. ౧౮

టీక॥ రాజన్ = రాక్షసరాజుండవగు రావణుఁడా! నః = మనయొక్క; ఖరోష్ట్రాశ్వతరాః = గాడిదలును ఒంటెలునుకంచరగాడిదలును; భిన్నరోమాః (భిన్నరోమాణః) = పిగిలినవెండ్రుకలుగలవై; స్రవంతి = కన్నీళ్లుకార్చుచున్నవి. విధానైః = వైద్యవిధులచేత; చింతితా అపి = ఆలోచింపఁబడినవయ్యు, చికిత్సింపఁబడినవయ్యు; స్వభావేన = స్వభావములచేత; నతిష్ఠంతి = ఉండవు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! మనగాడిదలును ఒంటెలును కంచరగాడిదలును, రోమంబులువీడఁ, గన్నీళ్లు గాఱ రోదనంబు సేయుచున్నవి; నానావిధచికిత్సలు గావించినను, ఎప్పటియట్లు కాఁజాలకున్నవి.

అని, తాత్పర్యము.

వాయసాస్సంఘశః క్రూరా వ్యాహరంతి సమంతతః

సమవేతాశ్చ దృశ్యంతే విమానాగ్రేషు సంఘశః. ౧౯

టీక॥ క్రూరాః= భయంకరములయిన; వాయసాః=కాకులు; సంఘశః = గుంపులుగుంపులుగా; సమంతతః=అంతటను; వ్యాహరంతి=అఱచుచున్నవి; విమానాగ్రేషు = విమానశిఖరంబులయందు; సంఘశః= గుంపులుగుంపులుగా; సమవేతాః=కూడుకొన్నవై; దృశ్యంతేచ=చూడఁబడుచున్నవి-

క్రూరంబులగు కాకులు, గుంపులుగూడి ఎచ్చటఁజూచినను అఱచుచు, విమానశిఖరంబులందు గుంపులుగుంపులుగా; నగపడుచున్నవి.

అని, తాత్పర్యము.

గృధ్రాశ్చ పరిలీయంతే పురీముపరి పిండితాః
ఉపపన్నాశ్చ సంధ్యే ద్వే వ్యాహరంత్యశివం శివాః. ౨౦

టీక॥ గృధ్రాశ్చ = గద్దలును; పిండితాః=గుంపులుగట్టినవై; పురీముపరి= పట్టణముపైని; పరిలీయంతే=నిలుచుచున్నవి. శివాశ్చ=నక్కలు; ద్వే= రెండైన; సంధ్యే=సంధ్యాకాలంబులందును; ఉపపన్నాః = సమీపమునొందినవై; అశివం = అమంగళమగునట్లుగా; వ్యాహరంతి=చెప్పుచున్నవి.

గద్దలు, గుంపులుగట్టి, పట్టణంబున, నింటింటిపైనను నిలుచున్నవి; నక్కలు, సంధ్యాకాలంబుల రెంటియందును, పట్టణసమీపంబునకువచ్చి, యమంగళంబుగా నఱచుచున్నవి. అని, తాత్పర్యము,

క్రవ్యాదానాం మృగాణాంచ పురద్వారేషు సంఘశః
శ్రూయంతే విపులా ఘోషా స్సవిస్ఫూర్జథునిస్స్వనాః. ౨౧

టీక॥ పురద్వారేషు=పట్టణద్వారంబులందు; సంఘశః= గుంపులుగుంపులుగా నున్న; క్రవ్యాదానాం= మాంసమునుదినునట్టి; మృగాణాంచ= కుక్కలు మొదలగు మృగములయొక్కయు; విపులాః= అధికములయిన; ఘోషాః= ధ్వనులు; సవిస్ఫూర్జథునిస్స్వనాః= పిడుగుమ్రోతవంటిమ్రోతతోఁగూడినవై; శ్రూయం

తే=వినఁబడుచున్నవి.

మఱియు, కుక్కలు మొదలగుక్రూర మృగంబులను, బట్టణద్వారంబులందు గుంపులుగట్టి, పిడుగు మ్రోఁతవంటిధ్వనితో, నఱచుచున్నవి. అని, తాత్పర్యము.

తదేవం ప్రస్తుతే కార్యే ప్రాయశ్చిత్త మిదం క్షమమ్
రోచతే మమ వైదేహీ రాఘవాయ ప్రదీయతామ్. ౨౨

టీక॥ తత్=అందువలన; ఏవం= ఇట్లు; కార్యే=కార్యము; ప్రస్తుతే= ప్రసక్తమగుచుండఁగా; ఇదం=ఈ; ప్రాయశ్చిత్తం=ప్రాయశ్చిత్తము; క్షమం=యోగ్యముగా; రోచతే= రుచించుచున్నది. వైదేహీ=సీత; రాఘవాయ=రామునికొఱకు; ప్రదీయతాం = ఇవ్వఁబడుఁగాక.

అట్లు, కావున, దానికిఁదగినట్లు, లంకాదహనాదులుసంభవించియేయున్నవి; దానికిఁదగిన ప్రాయశ్చిత్తమునాకుఁదోఁచియున్నది: రామునకు సీతనొసంగుఁగాక. అని, తాత్పర్యము.

ఇదం చ యదివా మోహా ల్లోభా ద్వా వ్యాహృతం మయా
తత్రాపిచ మహారాజ న దోషం కర్తు మర్హసి. ౨౩

టీక॥ మహారాజ= మహారాజుండవగు రావణుఁడా! మయా=నాచేత; మోహాత్ = అజ్ఞానమువలనఁగాని; లోభాద్వా = ఆశవలనఁగాని; ఇదం=ఇది; వ్యాహృతంయదివా= చెప్పఁబడినను; తత్రాపిచ = ఆవిషయమందును; దోషం=అపరాధమును; కర్తుం=చేయుటను; నార్హసి = తగవు.

మహారాజుండవగు రావణుఁడా! నేనుదీనిని, మోహంబువలననో లేక లోభంబువలననో, చెప్పినాను; దీనదోషంబుగాఁదలంపవలదు.

అని, తాత్పర్యము.

అయం చ దోష స్సర్వస్య జనస్యా స్యో పలక్ష్యతే
రక్షసాం రాక్షసీనాంచ పురస్యాంతఃపురస్యచ. ౨౪

స ౧౦

టీక॥అయం=ఈ;దోషశ్చ= దోషమును;సర్వస్య= సమస్తమయిన ; అస్య=ఈ;జనస్య= జనమునకును; రక్షసాం= రాక్షసులకును ; రాక్షసీనాం చ=రాక్షసస్త్రీలకును; పురస్య= పట్టణంబునకును; అంతఃపురస్యచ=అంతఃపురమునకును; ఉపలక్ష్యతే= తెలియఁబడుచున్నది.

ఈదుశ్శకునాదిదోషము , సమస్త రాక్షసులకును రాక్షసస్త్రీలకును అంతఃపురస్త్రీలకును, పట్టణంబున నుండు వారలకందఱకును, తెలిసియున్నది.

అని, తాత్పర్యము.

శ్రావణే చాస్య మంత్రస్య నివృత్తా స్సర్వమంత్రిణః
అవశ్యంచ మయా వాచ్యం యద్దృష్ట మపివా శ్రుతమ్. ౨౫

టీక॥అస్య=ఈ;మంత్రస్య= ఆలోచనమునొకటి;శ్రావణే = వినిపించుటయందు;సర్వమంత్రిణశ్చ= సమస్తమంత్రులును;నివృత్తాః = మఱలినారు మయాచ= నాచేతనుమాత్రము;యత్=ఏది;దృష్టం=చూడఁబడినదో; అపివా= లేక;శ్రుతం = వినఁబడినదో;తత్(అధ్యాహృతము)=అది;అవశ్యం=అవశ్యముగా;వాచ్యం=చెప్పఁదగినది.

మంత్రులందఱు సీతనుగూర్చి నీతో [illegible] యాసంగతి చెప్పను; నేను తమ్ముండనగుట [illegible] నది, యొంతయుఁ నవశ్యము, [illegible]ను. అని, తాత్పర్యము.

సంప్రధార్య యథాన్యాయం తద్భవాన్ కర్తుమర్హతి

టీక॥భవాన్ = నీవు;యథాన్యాయం= న్యాయప్రకారము; సంప్రధార్య=నిశ్చయించి; తత్ = [illegible] తుం=చేయుటకు;అర్హతి = తగుదువు.

నీవు, న్యాయప్రకారముగ నాలోచించి,నిశ్చయించి, యీపని [illegible] యుదువు. అని,[illegible], [illegible]నితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి స్మ మంత్రిణాం మధ్యే భ్రాతా భ్రాతర [illegible]చివాన్. ౨౬

రావణం రాక్షసశ్రేష్ఠం పథ్య మేత ద్విభీషణః

టీక॥ భ్రాతా=తమ్ముఁడగు; విభీషణః=విభీషణుఁడు; భ్రాతరం=అన్నయగు; రాక్షసశ్రేష్ఠం=రాక్షసోత్తముండయిన; రావణం=రావణునిఁగూర్చి; ఇతి=ఇట్లు("స్మ" అనునదిపాదపూరణార్థము); మంత్రిణాంమధ్యే=మంత్రులనడుమ; ఏతత్=ఈ; పథ్యం=హితమును; ఊచివాన్=చెప్పినాఁడు.

తమ్ముఁడగువిభీషణుఁడు, అన్నయు రాక్షసశ్రేష్ఠుండునగురావణుంజూచి, మంత్రులనడుమ,నీప్రకారముగా, హితకరంబగుమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

హితం మహార్థం మృదు హేతుసంహితం
వ్యతీతకాలాయతిసంప్రతిక్షమమ్. ౨౭
నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః
ప్రసంగవా నుత్తర మేత దబ్రవీత్

టీక॥ సః (అధ్యాహృతము)=ఆరావణుఁడు; హితం=మెలుగలిగించునదియు; మహార్థం=అధికమైనయర్థముగలదియు; మృ[illegible]=మె[illegible]యు; హేతుసంహి[illegible]=[illegible]యుక్త[illegible]; వ్యతీతకాలాయతిసంప్రతిక్షమం=భూతకాలమునందునుభవిష్యత్కాలమునందునువర్తమానకాలమునందునుసమర్థమైనదియునగు; తత్=ఆ; వాక్యం=[illegible]టను; ఉపస్థితజ్వరః=పొందఁబడినకోపముగలవాఁడై; ప్రసంగవాన్=మిక్కిలియునభినివేశముగలవాఁడై; ఏతత్=ఈ; ఉత్తరం=బదులుమాటను; అబ్రవీత్=చెప్పెను.

ఆరావణుండు, హితకరంబునుగొప్పప్రయోజనంబుగలదియుమృదులంబును యుక్తియుక్తంబును భూతకాలంబునందును భవిష్యత్కాలంబునందును వర్తమాన కాలంబునందును మేలుగలిగించునదియునగు విభీషణుండు చెప్పినమాటనువిని, మహాకోపంబునొంది, తనపట్టువదలక,యిట్లని, బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

భయం నపశ్యామి కుతశ్చి దప్యహం

న రాఘవః ప్రాప్స్యతి జాతు మైథిలీమ్. ౩౮
సురైస్సహేంద్రై రపి సంగతః కథం
మమాగ్రత స్థాస్యతి లక్ష్మణాగ్రజః

టీక॥ అహం= నేను; కుతశ్చిదపి= దేనివలనను; భయం= భయమును; నపశ్యామి= చూడను. రాఘవః= రాముడు; జాతు= ఒకానొకప్పుడును; మైథిలీం= సీతను; నప్రాప్స్యతి= పొందఁడు. లక్ష్మణాగ్రజః= లక్ష్మణునియన్నయగు రాముండు; సహేంద్రైః= ఇంద్రునితోఁగూడిన; సురైః= దేవతలతో; సంగతోపి= కూడినవాఁడైనను; మమ= నాయొక్క; అగ్రతః= ముందట; కథం= ఎట్లు; స్థాస్యతి= ఉండఁగలఁడు?

నాకు, ఎవ్వనివలనను భయంబులేదు; నాచేఁజిక్కినసీతను, రాముండెంతమాత్రమునుఁబొందఁజాలఁడు; దేవేంద్రునితోఁగూడ దేవతలుసహాయులయితోడ్పడినను, రాముండు, యుద్ధంబున నా యెదుటనిలువఁజాలఁడు. అని, రావణుండు, విభీషణునకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతీద ముక్త్వా సురసైన్యనాశనో
మహాబల స్సంయతి చండవిక్రమః. ౩౯
దశాననో భ్రాతర మాప్తవాదినం
విసర్జయామాస తదా విభీషణమ్

టీక॥ సురసైన్యనాశనః= దేవతలసైన్యమునునశింపఁజేయువాఁడును; మహాబలః= అధికమయిన బలముగలవాఁడును; సంయతి= యుద్ధమునందు; చండవిక్రమః= భయంకరమయినపరాక్రమముగలవాఁడునగు; దశాననః= రావణుఁడు; తదా= అప్పుడు; ఇతి= అని; ఇదం= ఈమాటను; ఉక్త్వా= చెప్పి; ఆప్తవాదినం= యుక్తమును జెప్పినట్టి; భ్రాతరం= తమ్ముండగు; విభీషణం= విభీషణుని; విసర్జయామాస= పంపివేసెను.

దేవసైన్యమును నశింపఁజేయువాఁడునుమహాబలుండును యుద్ధంబున భయంకర పరాక్రముండునగు రావణుం

డు, ఈప్రకారము చెప్పి, హితవాదియు సత్యమ్మంత్రయైన విభీషణునకు, సెలవొసంగెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, దశమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ దశమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

ఏకాదశసర్గప్రారంభః.

స బభూవ కృశో రాజా మైథిలీకామమోహితః
అసమ్మానాచ్చ సుహృదాం పాపః పాపేన కర్మణా. ౧

టీక॥ మైథిలీకామమోహితః=సీతయందలి కోరికచే మోహితుండును; పాపః=పాపస్వభావుండునగు; సః=ఆ; రాజా= రాక్షసరాజుండగు రావణుండు; పాపేన= పాపముగలిగించునట్టి; కర్మణా= కార్యముచేతను; సుహృదాం=విభీషణాదులయొక్క; అసమ్మానాచ్చ=అనాదరమువలన; కృశః=కృశించినవాఁడు; బభూవ=అయ్యెను.

పాపిష్ఠుండగు నారావణుండు, సీతామోహంబునను, విభీషణాదులు, సీతనిమ్మని, యనాదరణంబు సేయుటవలనను, ప్రహస్తాదులు, విభీషణునిమాటకు నొరకుండుటవలనవారలయభిప్రాయంబును, అదేయనిమేర్పడుటవలనను. తానుజేసిన పాపకృత్యంబు వలనను, మిఱియుంగృశుండయ్యెను.
అని, తాత్పర్యము.

అతీతసమయే కాలే తస్మిన్ వై యుధి రావణః

అమాత్యైశ్చ సుహృద్భిశ్చ మంత్రకాల మమన్త్రయత్.

టీక॥ తస్మిన్ = ఆ; ("వై" అనునది పాదపూరణార్థకము) కాలే = కాలము; అతీతసమయే = కడచినయవసరము గలదగుచుండఁగా; రావణః = రావణుఁడు; యుధి = యుద్ధము విషయమయి; అమాత్యైశ్చ = మంత్రులతోను; సుహృద్భిశ్చ = స్నేహితులతోను; మంత్రకాలం = మంత్రసమయమును: అమన్త్రయత్ = ...చెను.

అట్లాదినముగడచినపిమ్మట, రావణుండు, యుద్ధ... మంత్రులతోను స్నేహితులతోను, ఆలోచించి... పం, దలంచెను-అని, తాత్పర్యము.

స హేమజాలవితతం మణివిద్రుమభూషితమ్
ఉపగమ్య వినీతాశ్వ మారురోహ మహారథః. ౩

టీక॥ మహారథః = తన్నును సారథిని గుఱ్ఱంబులనుం గాపాడుకొనుచుఁ బదునొకండువేలమంది విలుకాండ్రతోఁ బోరునట్టి; సః = ఆ రావణుండు; హేమజాలవితతం = బంగారుకిటికీలచేవ్యాపింపఁబడినదియు; మణివిద్రుమభూషితం = రత్నములచేతను పగడములచేతను అలంకరింపఁబడినదియు; వినీతాశ్వం = శిక్షింపఁబడినగుఱ్ఱంబులుగలదియునగు; రథం (అధ్యాహృతము) = రథమును; ఉపగమ్య = ప్రదక్షిణించి; ఆరురోహ = ఎక్కెను.

తన్నును సారథిని గుఱ్ఱంబులనుం గాపాడుకొనుచుఁ బదునొకండువేలమంది విలుకాండ్రతోఁ బోరంజాలినట్టి యారావణుండు, బంగారుకిటికీలుగలదియు, రత్నంబులచేతను పగడంబులచేతను అలంకృతంబును, బహుభంగుల శిక్షింపఁబడినగుఱ్ఱంబులుగలదియునగు రథంబునొంది, ప్రదక్షిణముగా వచ్చి, యారోహించెను,

అని, తాత్పర్యము.

తమాస్థాయ రథశ్రేష్ఠం మహామేఘసమస్వనమ్
ప్రయయౌ రాక్షసశ్రేష్ఠో దశగ్రీవస్సభాం ప్రతి. ౪

టీ॥ రాక్షసశ్రేష్ఠః = రాక్షసోత్తముఁడు; దశగ్రీవః = రావణుఁడు; మహామేఘసమస్వన = గొప్పమేఘంబు (ధ్వని)తో సమానమగునధ్వనిగల; తం = ఆ; రథశ్రేష్ఠం = రథోత్తమమును; అస్థాయ = అధిష్ఠించి; సభాం ప్రతి = ఆలోచన గృహమునుగూర్చి; ప్రయయౌ = పోయెను.

రాక్షసోత్తముఁడగు రావణుండు, మేఘగర్జనంబువంటిధ్వనిగల, యుత్తమంబగునారథంబునారోహించి, యాలోచనంబుసేయు గృహంబునకుఁ బోయెను. అని, తాత్పర్యము.

అసిచర్మధరా యోధా స్సర్వాయుధధరా స్తథా
రాక్షసా రాక్షసేంద్రస్య పురత స్సంప్రతస్థిరే. ౫

టీక॥ అసిచర్మధరాః = ఖడ్గమును డాలును ధరించిన; యోధాః = భటులును; తథా = అట్లు; సర్వాయుధధరాః = సమస్తాయుధంబులనుధరించిన; రాక్షసాః = రాక్షసులును; రాక్షసేంద్రస్య = రాక్షసేశ్వరుండగు రావణునియొక్క; పురతః = ముందట; సంప్రతస్థిరే = వెడలిరి.

కొందఱుడాలును గత్తియుధరించి, కొందఱునానాయుధపాణులయి, రాక్షసేశ్వరుండగు రావణునిముందునడచిరి. అని, తాత్పర్యము.

నానావికృతవేషాశ్చ నానాభూషణభూషితాః
పార్శ్వతః పృష్ఠతశ్చైనం పరివార్య యయు స్తతః. ౬

టీ॥ తతః = అంత; రాక్షసాః (అధ్యాహృతము) = రాక్షసులు; నానావికృతవేషాశ్చ = నానావిధములయినవికృతవేషములు గలవారలును; నానాభూషణభూషితాః = నానావిధములయినసొమ్ములచే నలంకరింపఁబడినవారలునై; ఏనం = ఈరావణుని; పార్శ్వతః = ప్రక్కలను; పృష్ఠతశ్చ = వెనుకను; పరివార్య = పరివేష్టించి; యయుః = పోయిరి.

అంతఁ, గొందఱు రాక్షసులు, నానావిధంబులయినవికృతవేషంబులుగలవార

లై, నానావిధభూషణాలంకృతులయి, ఈరావణుని పార్శ్వభాగంబులను వెనుకను, బరివేష్టించి, పోయిరి.

అని, తాత్పర్యము.

రథైశ్చాతిరథాశ్శీఘ్రం మత్తైశ్చ వరవారణైః
అనుత్పేతు దశగ్రీవ మాక్రీడద్భిశ్చవాజిభిః. ౭

టీక॥ అతిరథాః= పెక్కువిలుకాండ్రతోఁబోరునట్టిరాక్షసులు; శీఘ్రం=శీఘ్రముగా; రథైశ్చ= రథంబులచేతను; మత్తైః=మదించిన; వరవారణైశ్చ= ఉత్తమములగునేనుంగులచేతను; ఆక్రీడద్భిః=ఆటలాడుచున్న; వాజిభిశ్చ=గుఱ్ఱములచేతను; దశగ్రీవం=రావణుని; అనుత్పేతుః=అనుసరించిపోయిరి.

అంత, నతిరథులగు రాక్షసులు, కొందఱు రథంబుల నారోహించి, కొందఱు మదపు టేనుఁగుల నెక్కియుఁ, గొందఱు నానావిధగతులం గ్రీడించు గుఱ్ఱంబుల నారోహించియు, రావణుని వెంబడింపోయిరి. అని, తాత్పర్యము.

గదాపరిఘహస్తాశ్చ శక్తితోమరపాణయః
పరశ్వధధరాశ్చాన్యే తథాన్యే శూలపాణయః ౮

టీక॥ అన్యే=ఇతరులు; గదాపరిఘహస్తాశ్చ= గదలును ఇనుపగుదియలును చేతులంగలవారలై; అన్యే(అధ్యాహృతము)= ఇతరులు; శక్తితోమరపాణయః=శక్తులును తోమరములును హస్తములంగలవారలై; అన్యే=ఇతరులు; పరశ్వధధరాశ్చ= గండగొడ్డళ్లను ధరించినవారలునై; తథా=అట్లు; అన్యే=ఇతరులు; శూలపాణయః=శూలములు హస్తములంగలవారలై; యయుః (అధ్యాహృతము)=పోయిరి.

కొందఱు, గదలను బరిఘంబులను దాల్చియుఁ, గొందఱు శక్తితోమరంబులం గొనియుఁ, గొందఱు గండగొడ్డండ్లఁ గొనియుఁ, గొందఱు శూలంబులు ధరించియుఁ బోయిరి. అని, తాత్పర్యము.

తతస్తూర్యసహస్రాణాం సంజజ్ఞే నిస్స్వనో మహాన్

తుమల శ్శంఖశబ్దశ్చ సభాం గచ్ఛతి రావణే. ౯

టీక॥ తతః=అంత; రావణే= రావణుఁడు; సభాం=సభను; గచ్ఛతి = పొందుచుండఁగా ; తూర్యసహస్రాణాం = వాద్యములవేలయొక్క ; మహాన్=గొప్పదగు; నిస్వనః=ధ్వనియును; శంఖశబ్దశ్చ=శంఖధ్వనియును; తుములః=దొమ్మియై; సంజజ్ఞే = కలిగినది.

అంత, రావణుండు; సభకుఁబోఁగానేఁ వేలకొలఁది , వాద్యములధ్వనులును శంఖంబులశబ్దంబును, దుములంబై చెలంగినది. అని, తాత్పర్యము.

స నేమిఘోషేణ మహాన్ సహసా భినినాదయన్

రాజమార్గం శ్రియాజుష్ట మభిపేదే మహారథః. ౧౦

టీక॥సః=ఆ;మహాన్=పూజ్యమగు;మహారథః= గొప్పరథము; సహసా=తటాలున; నేమిఘోషేణ = చక్రంబులయంచులధ్వనిచేత; అభినినాదయన్= అంతటను ధ్వనింపఁ జేయుచు ; శ్రియా=కాంతితో; జుష్టం=కూడిన; రాజమార్గం=రాజమార్గమును; అభిపేదే=పొందెను.

పూజ్యంబగు నామహారథంబు, నేమిధ్వని, దిక్కులం బ్రతిధ్వనులు పిక్కటిల్లఁ, దటాలున గాంతిమంతంబగు రాజమార్గంబు బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

విమలం చాతపత్రాణాం ప్రగృహీత మశోభత

పాండరం రాక్షసేంద్రస్య పూర్ణ స్తారాధిపో యథా. ౧౧

టీక॥ప్రగృహీతం=పట్టఁబడిన;విమలం=స్వచ్ఛమును;పాండరం= తెల్లనిదియునగు; రాక్షసేంద్రస్య = రాక్షసనాయకునియొక్క; ఆతపత్రాణాం= ఛత్రము; పూర్ణః =నిండిన; తారాధిపోయథా=చంద్రుండువలె; అశోభత=ప్రకాశించెను.

అప్పుడు ఆ రాక్షసులచేఁ బట్టఁబడిన రాక్షసేశ్వరుఁడగు రావణుని స్వచ్ఛంబగు శ్వేతచ్ఛత్రంబు, నిండుచంద్రుండుం బోలె వెలుంగుచుండినది.

అని, తాత్పర్యము.

హేమమంజరిగర్భేచ శుద్ధస్ఫటికవిగ్రహే
చామరవ్యజనేచా స్య రేజతు స్సవ్యదక్షిణే. ౧౨

టీక॥ హేమమంజరిగర్భేచ= బంగారుపూగుత్తినడుమంగలవియు; శుద్ధస్ఫటికవిగ్రహే—స్వచ్ఛమయినస్ఫటికమువంటియాకారముగలవియునగు; చామరవ్యజనేచ=వింజామరలును; అస్య= ఈ రావణునియొక్క; సవ్యదక్షిణే=ఎడమకుడిపార్శ్వములయందు; రేజతుః=ప్రకాశించుచుండినవి.

బంగారుపూగుత్తినడుమంగలవియు శుద్ధస్ఫటికంబులుంబోలె స్వచ్ఛంబులునగు వింజామరలు, రావణుని, సవ్యదక్షిణ పార్శ్వంబులం బ్రకాశించుచుండినవి.

అని, తాత్పర్యము.

తే కృతాంజలయ స్సర్వే రథస్థం పృథివీస్థితాః
రాక్షసా రాక్షసశ్రేష్ఠం శిరోభి స్తం వవందిరే. ౧౩

టీక॥ తే=ఆ; రాక్షసాః=రాక్షసులు; సర్వే=అందఱును; పృథివీస్థితాః=నేలయందున్నవారలై; కృతాంజలయః = చేయఁబడినచేమోడ్పుగలవారలై; రథస్థం=రథంబుననున్న; రాక్షసశ్రేష్ఠం=రాక్షసోత్తముండగు; తం= ఆ రావణుని; శిరోభిః=తలలచేత; వవందిరే=నమస్కరించిరి.

అచ్చటరాక్షసులందఱు, క్రిందనిలుచుండి, చేతులుమొగుడ్చుకొని, రథంబుననున్న రాక్షసోత్తముండగు రావణునకునమస్కారంబుగావించిరి.

అని, తాత్పర్యము.

రాక్షసై స్తూయమాన స్సన్ జయాశీర్భి రరిందమః
ఆససాద మహాతేజా స్సభాం విరచితాం శుభామ్. ౧౪

టీక॥ అరిందమః=శత్రువులనణఁగఁద్రొక్కునట్టి; మహాతేజాః= అధికమయినప్రభావముగలరావణుఁడు ; రాక్షసైః=రాక్షసులచేత; జయాశీర్భిః=జయశబ్దంబులచేతను ఆశీర్వచనంబులచేతను; స్తూయమానః=పొగడఁబడినవాఁ

డు;సక్=అగుచు.విరచితాం= చక్కగా నేర్పఱుపఁబడిన;శుభాం =సుందరమయిన;సభాం= సభను; ఆససాద= పొందెను.

శత్రువుల నడఁగఁద్రొక్కంజాలిన మహాప్రభావుండగు రావణుండు రాక్షసులచే "జయ జయ" అను శబ్దంబులచేతను, ఆశీర్వచనంబులచేతను, గొనియాడంబడుచు, చక్కఁగా నిర్మింపఁబడిసుందరంబయియుండుసభంజేరెను. అని, తాత్పర్యము.

సువర్ణరజతస్థూణాం విశుద్ధస్ఫటికాంతరామ్
విరాజమానో వపుషా రుక్మపట్టోత్తరచ్ఛదామ్. ౧౫
తాం పిశాచశతైష్షడ్భి రభిగుప్తాం సభాం శుభామ్
ప్రవివేశ మహాతేజా స్సుకృతాం విశ్వకర్మణా. ౧౬

టీక॥ మహాతేజాః— అధికమయిన పరాక్రమముగలవాఁడగు రావణుండు; వపుషా= దేహముచేత; విరాజమానః=ప్రకాశించుచు; సువర్ణరజతస్థూణాం=బంగారుతోను వెండితోను జేయఁబడిన స్తంభములుగలదియు; విశుద్ధస్ఫటికాంతరాం—స్వచ్ఛమయిన స్ఫటికముతో నిర్మింపఁబడినమధ్యప్రదేశము గలదియు; రుక్మపట్టోత్తరచ్ఛదాం= బంగారువస్త్రమెయాస్తరణముగాఁగలదియు;విశ్వకర్మణా= విశ్వకర్మచేత; సుకృతాం=చక్కఁగాఁ జేయఁబడినదియు;షడ్భిః=ఆఱయిన;పిశాచశతైః= పిశాచంబుల నూఱ్ల చేత ; అభిగుప్తాం= కాపాడఁబడినదియు;శుభాం= సుందరంబునగు;తాం=ఆ;సభాం= సభను;ప్రవివేశ—ప్రవేశించెను.

మహాతేజుండగునారావణుండు, దేహకాంతిచేవెలుంగుచు , బంగారుతోను వెండితోనుంజేయఁబడిన స్తంభంబులుగలదియు, స్వచ్ఛస్ఫటికమయంబగు మధ్యప్రదేశంబుగలదియుఁ, గాంచనమయంబగు నాస్తరణంబుగలదియు,విశ్వకర్మచేబహుసుందరంబుగానిర్మింపఁబడినదియు, నాఱువందలపిశాచంబులచే రక్షింపఁబడుచున్నదియు , మిక్కిలియుసుందరంబునగు నాసభం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

తస్యాంతు వైడూర్యమయం ప్రియకాజినసంవృతమ్

మహ త్స్వపాశ్రయం భేజే రావణః పరమాసనమ్. ౧౭

టీక॥ రావణః= రావణుఁడు; తస్యాంతు=ఆసభయందును; వైడూర్యమయం=వైడూర్యవికారంబును; ప్రియకాజినసంవృతం= ప్రియకమను మృగముయొక్క తోలుచేఁగప్పఁబడినదియు; సోపాశ్రయం= దిండుతోఁ గూడినదియు; మహత్= గొప్పదియునగు; పరమాసనం=ఉత్తమమయిన యాసనంబుచే; భేజే=పొందెను.

రావణుండచ్చట, వైడూర్యమణితోఁ జేయఁబడినదియుఁ బ్రియకచర్మాస్తీర్ణంబునుదిండుతోఁ గూడినదియు గొప్పదియునగునుత్తమసింహాసనంబుపైఁ గూర్చుండెను. అని, తాత్పర్యము.

తత శ్శశాసే శ్వరవ ద్దూతాన్ లఘుపరాక్రమాన్
సమానయత మే క్షిప్ర మిహా తాన్ రాక్షసా నితి. ౧౮
కృత్య మస్తి మహ జ్జాతం సామర్థ్య మిహా నో భవేత్

టీక॥తతః = అటుపిమ్మట;సః(అధ్యాహృతము)=ఆరావణుఁడు; ఈశ్వరవత్=ఈశ్వరుండువలె; లఘుపరాక్రమాన్ = చులకనయగునడకగల;దూతాన్=దూతలనుగూర్చి,“మహత్= గొప్పదగు;కృత్యం=కార్యము;జాతం=కలిగినదిగా;అస్తి=ఉన్నది.ఇహా = ఇప్పుడు;నః=మనకు; సామర్థ్యం=సవర్థింపఁదగినది; భవేత్=అగును;మే=నాకొఱకు;ఇహా=ఇచ్చటికి; తాన్=ఆ; రాక్షసాన్=రాక్షసులను;క్షిప్రం= శీఘ్రముగా;సమానయత= తోడ్కొనిరండు”ఇతి=అని; శశాస = ఆజ్ఞాపించెను.

అంత,నా రావణుండు,శీఘ్రంబుగా నడవఁగలదూతలంజూచి, “మనకిప్పుడు గొప్పపనియొకటివచ్చియున్నది; దానిని ర్వహించుకొనవలెను; కావున,మీరలు, నాయొద్ద కారాక్షసులను శీఘ్రముగాఁ దోడ్కొనిరండు” అని,యాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

రాక్షసా స్తద్వచ శ్శ్రుత్వా లంకాయాం పరిచక్రముః. ౧౯
అనుగేహ మవస్థాయ విహారశయనేషుచ

ఉద్యానేషు చ రక్షాంసి చోదయంతో హ్యభీతవత్. ౨౦

టీక॥ రాక్షసాః = రాక్షసులు; తత్ = ఆ; వచః = మాటను; శ్రుత్వా=విని; విహారశయనేషుచ=క్రీడించు పాన్పులయందును; ఉద్యానేషుచ= ఉద్యానవనంబులందును; స్థితాని (అధ్యాహృతము)=ఉన్న; రక్షాంసి=రాక్షసులను; అభీతవత్—భయములేనివారలయి; చోదయంతః = ప్రేరించుచు; లంకాయాం = లంకాపురియందు; అనుగేహం=ప్రతిగృహమునందును; పరిచక్రముః=తిరిగిరి.

ఆరాక్షసులు, రావణునిమాటనువిని, నిర్భయంబుగాగృహంబులంజొచ్చి, విహారశయనంబులందునుఉద్యానవనంబులందునుబడిక్రీడించుచున్న రాక్షసులనుంగూడ, లేపి, రావణునాజ్ఞ దెలుపుచు, నిట్లు లంకయందుఁ బ్రతిగృహంబునందిరిగిరి. అని, తాత్పర్యము.

తే రథాన్ రుచిరా నేకే దృప్తా నేకే పృథ గ్ఘయాన్
నాగా నన్యే ధిరురుహు ర్జగ్ము శ్చైకే పదాతయః. ౨౧

టీక॥ తే=వారలు; ఏకే=కొందఱు; రుచిరాన్ = మనోహరంబులగు; రథాన్=రథంబులను; ఏకే=కొందఱు; పృథక్=వేఱుగా; దృప్తాన్=గర్వించిన; హయాన్=గుఱ్ఱంబులను; అన్యే—ఇతరులు; నాగాన్=ఏనుంగులను; అధిరురుహుః=ఎక్కిరి. ఏకేచ—కొందఱుమాత్రము; పదాతయః =కాల్వురుగానే; జగ్ముః=పోయిరి.

అంత, నారాక్షసులు, సూతలవలన రావణునాజ్ఞనువిని, కొందఱుసుందరంబులగురథంబులనుగొందఱుగర్వించియున్నమహావేగంబులగుగుఱ్ఱంబులను, మఱికొందఱు, గజంబులను, ఆరోహించిపోయిరి; కొందఱు, కాళ్లతోనడచిపోయిరి. అని, తాత్పర్యము.

సా పురీ పరమా కీర్ణా రథకుంజర వాజిభిః
సంపతద్భి ర్విరురుచే గరుత్మ ద్భి రివాం బరమ్. ౨౨

టీక ॥ పరమా=ఉత్తమమగు; సా=ఆ; పురీ = లంకాపట్టణము; సంపత

ద్భిః = పోవుచున్న; రథకుంజరవాజిభిః = రథంబులచేతను ఏనుంగులచేతను గుఱ్ఱంబులచేతను; ఆకీర్ణా=వ్యాపింపఁబడినదై; గరుత్మద్భిః=పక్షులచేత;ఆకీర్ణం (అధ్యాహృతము)—వ్యాపింపఁబడిన; అంబరమివ=ఆకాశమువలె; విరురుచే=ప్రకాశించినది.

ఉత్తమంబగునాలంకాపురి, యట్లు గుంపులుగుంపులుగా నిండుకొనియున్న రథంబులు నేనుంగులు గుఱ్ఱంబులుఁ గల్గియుండుటవలనఁ, బక్షిసంఘంబులతోఁ గూడినయాకాశంబుపగిదిం బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

తే వాహనా న్యవస్థాప్య యానాని వివిధానిచ
సభాం పద్భిః ప్రవివిశు స్సింహా గిరిగుహామివ. ౨౩

టీక॥ తే—ఆరాక్షసులు; వాహనాని=పల్లకీలుమొదలగు వాహనంబులను; వివిధాని—నానావిధంబులగు; యానానిచ=గుఱ్ఱంబులు మొదలగు వాహనంబులను; అవస్థాప్య=నిలిపి; సింహాః = సింహములు; గిరిగుహామివ= పర్వతగుహనువలె; సభాం=సభను; పద్భిః = పాదములచేత; ప్రవివిశుః= ప్రవేశించిరి.

అంతనారాక్షసులు, రథంబులు మొదలగువాహనంబులను, ద్వారంబుననె నిలిపి, సింహంబులుగిరిగుహం బ్రవేశించునట్లు, పాదంబులతోనే సభం బ్రవేశించిరి. అని, తాత్పర్యము.

రాజ్ఞః పాదౌ గృహీత్వాతు రాజ్ఞా తే ప్రతిపూజితాః
పీఠేష్వన్యే బ్రుసీ ష్వన్యే భూమౌ కేచి దుపావిశన్. ౨౪

టీక॥ తే—ఆరాక్షసులు; రాజ్ఞః = రావణునియొక్క; పాదౌ=పాదంబులను; గృహీత్వాతు= పట్టుకొనియు; రాజ్ఞా = రావణునిచేత; ప్రతిపూజితాః = బదులుపూజింపఁబడినవారలయి; అన్యే=కొందఱు; పీఠేషు=కాంచనాసనంబులందును; బ్రుసీషు=దర్భాసనంబులందును; కేచిత్ = కొందఱు; భూమౌ= భూమియందును; ఉపావిశన్=కూర్చుండిరి.

ఆరాక్షసులు, రాక్షసరాజుండగు రావణునిపాదంబులకునమస్కారంబు

గావించి యతనిచే బూజితులయి, కొందఱు కాంచనాసనంబులందునుగొందఱు శ్రోత్రియరాక్షసులు దర్భాసనంబునం దునుగొందఱు నేలయందును గూర్చుండిరి. అని, తాత్పర్యము-

తే సమేత్య సభాయాం వై రాక్షసా రాజశాసనాత్
యథార్హ ముపతస్థు స్తే రావణం రాక్షసాధిపమ్. ౨౫

టీక॥ తే=ఆ; రాక్షసాః= రాక్షసులు; రాజశాసనాత్ = రాజాజ్ఞవలన; సభాయాం=సభయందు; ("వై" అనుపదిపాదపూరణార్థము); సమేత్య= చేరి; తే=ఆరాక్షసులు; యథార్హం= యథాయోగ్యముగా; రాక్షసాధిపం= రాక్షసులకుఁబ్రభుండగు; రావణం = రావణుని; ఉపతస్థుః= సమీపించికూర్చుండిరి.

ఆ రాక్షసులు, అట్లు రాజాజ్ఞ వలనసభకువచ్చి, వారివారి యోగ్యతకుఁదగినట్లు, రాక్షసేశ్వరుండగు రావణుని సమీపంబునం గూర్చుండిరి.

అని, తాత్పర్యము.

మంత్రిణశ్చ యథా ముఖ్యా నిశ్చయార్థేషు పండితాః
అమాత్యాశ్చ గుణోపేతా స్సర్వజ్ఞా బుద్ధిదర్శనాః
సమేయు స్తత్ర శతశః

టీక॥ తత్ర=అచ్చట; నిశ్చయార్థేషు= నిశ్చయించుకార్యంబులందు; పండితాః=సమర్థులగు; ముఖ్యాః= ముఖ్యులయిన; మంత్రిణశ్చ= బుద్ధియందు సహాయులగు మంత్రులును; గుణోపేతాః=గుణములతోఁగూడినవారును; సర్వజ్ఞాః=సమస్తమునెఱింగినవారును ; బుద్ధిదర్శనాః= బుద్ధియెచూపుగాఁగలవారలునగు; అమాత్యాశ్చ=కార్యంబులందు సహాయులగు నమాత్యులును ; శతశః=నూఱులునూఱులుగా ; యథా= వరుసగా; సమేయుః= చేరిరి.

అచ్చటఁ, గార్యంబులు నిశ్చయించుటయందుఁ బండితులగు ముఖ్యులయిన మంత్రులును గుణవంతులునుసర్వజ్ఞులునుబుద్ధిచేనెట్టిరహస్యముఁనేని కనుంగొనువారునగు నమాత్యులును , గుంపులు గుంపులుగాఁ , గ్రమంబు నం

గూర్చుండెరి. అని, తాత్పర్యము.

శూరాశ్చ బహవ స్తదా
సభాయాం హేమవర్ణాయాం సర్వార్థస్య సుఖాయ వై. ౨౭
రమ్యాయాం రాక్షసేంద్రస్య సమేయు స్తత్ర సంఘశః

టీక॥తదా=అప్పుడు; బహవః= అనేకులయిన; శూరాశ్చ=యుద్ధమునందుభయములేనట్టి రాక్షసులును; తత్ర=అచ్చట; సర్వార్థస్య=సమస్తకార్యములయొక్కయు; సుఖాయ= క్షేమముకొఱకు; ("వై" అనునది పాదపూరణార్థము) రాక్షసేంద్రస్య=రాక్షసేశ్వరుండగు రావణునియొక్క; హేమవర్ణాయాం=బంగారుపన్నెగల; రమ్యాయాం=సుందరమయిన; సభాయాం=సభయందు; సంఘశః= గుంపులు గుంపులుగా; సమేయుః=చేరిరి.

అప్పుడు, శూరులును, అనేకులు, సమస్తకార్యంబులును జక్కఁగా నాలోచించుటకై, కాంచనవర్ణంబును, సుందరంబునగు రావణుని సభయందు, గుంపులుగుంపులు గాఁ జేరిరి.

అని, తాత్పర్యము.

తతో మహాత్మా విపులం సుయుగ్యం
వరం రథం హేమవిచిత్రితాంగమ్. ౨౮
శుభం సమాస్థాయ యయౌ యశస్వీ
విభీషణ స్సంసద మగ్రజస్య

టీక॥తతః = అటుపిమ్మట; మహాత్మా=పూజ్యమయినస్వభావముగలవాఁడును; యశస్వీ= అధికమయినకీర్తిగలవాఁడునగు; విభీషణః=విభీషణుఁడు; విపులం= విశాలంబును; సుయుగ్యం=మంచిగుఱ్ఱంబులుగలదియు; వరం=శ్రేష్ఠంబును; హేమవిచిత్రితాంగం=బంగారముచేఁజిత్రముగాఁ జేయఁబడినయవయవములుగలదియు; శుభం= సుందరంబునగు; రథం = రథమును; సమాస్థాయ=అధిష్ఠించి; అగ్రజస్య=అన్నయొక్క; సంసదం=సభను; యయౌ= పొందెను.

అంత, మహాత్ముండును మహాయశ

శ్శాలియునగువిభీషణుండు, విశాలంబునుమంచిగుఱ్ఱంబులుగట్టినదియుబంగారముచేనలంకరింపఁబడినదియు నుత్తమంబునుసుందరంబునగురథంబునారోహించి, అన్నయగు నారావణునిసభకుఁబోయెను. అని, తాత్పర్యము.

స పూర్వజాయా వరజ శ్శశంస
నామాథ పశ్చా చ్చరణౌ వవందే, ౨౯
శుకః ప్రహ స్తశ్చ తథైవ తేభ్యో
దదౌ యథార్హం పృథగాసనాని

టీక॥ అథ—అంత; సః— ఆ; అవరజః=తమ్ముఁడగువిభీషణుఁడు; పూర్వజాయ=అన్నకొఱకు; నామ=పేరును; శశంస=చెప్పెను. పశ్చాత్— వెనుక; చరణౌ=పాదములను; వవందే= నమస్కరించెను. తథైవ=అట్లే; శుకః = శుకుఁడును; ప్రహ స్తశ్చ=ప్రహస్తుఁడును;వవందాతే (అధ్యాహృతము)=నమస్కరించిరి. సః (అధ్యాహృతము) = ఆరావణుఁడు; తేభ్యః = వారలకొఱకు; పృథక్ — వేఱువేఱుగా; యథార్హం=యథాయోగ్యముగా; ఆసనాని—ఆసనములను; దదౌ=ఇచ్చెను.

అంతఁ, దమ్ముండగువిభీషణుండు, అన్నయగురావణునకుఁబ్రవరచెప్పిపాదంబులకు నమస్కరించెను; అట్లే, శుకుండునుబ్రహస్తుండునునమస్కరించిరి; అంత, రావణుండు, వారలమువ్వురకును వేర్వేఱ వారివారియోగ్యతకుఁదగునట్లు, ఆసనంబులనొసంగెను. అని, తాత్పర్యము.

సువర్ణనానామణిభూషణానాం
సువాససాం సంసది రాక్షసానామ్. ౩౦
తేషాం పరార్ధ్యాగరుచందనానాం
స్రజశ్చ గంధాశ్చ వవు స్సమంతాత్

టీక॥ సంసది= సభయందు; సువర్ణనానామణిభూషణానాం=బంగారువికారంబులును నానావిధంబులునగుసొమ్ములుగలవారలును;సువాససాం=

మంచివస్త్రములుగలవారలును; పరా ర్థ్యాః=గరుచందనానాం=శ్రేష్ఠములగు నగరువునుజందనమునుగలవారలునగు; తేషాం=ఆ; రాక్షసానాం=రాక్షసుల యొక్క; స్రజశ్చ=పుష్పమాలికలును; గంధాశ్చ=వాసనలును;సమంతాత్= అంతటను; వవుః=వీచినవి.

ఆసభయందు, నానావిధసువర్ణ భూషణంబులనుమంచి వస్త్రంబులను దాల్చినవారలునుఉత్తమంబులగునగరు చందనంబులంబూసికొనియుండువార లును నానావిధపుష్పమాలికలుధరించి యున్నవారలునగునారాక్షసుల, మేని పుష్పమాలికలునుజందనాదులును, అం తటను,సుగంధంబులుగుబాళించుచుండె నవి.అని, తాత్పర్యము-

న చుక్రుశు ర్నానృత మాహ కశ్చి
త్సభాసదో నైవ జజల్పు రుచ్చైః. ౩౧
సంసిద్ధార్థా స్సర్వ ఏవోగ్రవీర్యా
భర్తు స్సర్వే దదృశు శ్చాననం తే

టీక॥ సభాసదః= సభికులు; నచు క్రుశుః=అఱవలేదు. కశ్చిత్=ఒకానొ కఁడును; అనృతం= అబద్ధమును; నా హ=చెప్పఁడయ్యె. ఉచ్చైః=గట్టిగా; నైవజజల్పుః=మాటలాడరైరి. సర్వ ఏవ=అందఱునే; సంసిద్ధార్థాః=ఈ డేటివప్రయోజనముగలవారును; ఉగ్ర వీర్యాః= భయంకరమగుపరాక్రమము గలవారలును. తే=వారలు; సర్వే = అందఱును;భర్తుః=ప్రభువుయొక్క; ఆననం=ముఖమును;దదృశుః=చూచిరి.

సభికులు;ఎవ్వరునఱవకుండిరి;ఎవ్వం డునబద్ధమాడలేదు ; ఎవ్వరునుగట్టిగా మాటలాడలేదు; అందఱునుసిద్ధార్థు లయి మహాపరాక్రమశాలులయియుం డిరి; అప్పుడు,ప్రభుండగురావణునిము ఖంబు, అందఱునుజూడఁదగియుండె ను. అని, తాత్పర్యము.

స రావణ శ్శస్త్రభృతాం మనస్వినాం
మహాబలానాం సమితౌ మనస్వీ. ౩౨
తస్యాం సభాయాం ప్రభయా చకాశే
మధ్యే వసూనామివ వజ్రహస్తః




టీక॥ మనస్వీ = ధీరమయినమనస్సుగల; సః=ఆ; రావణః= రావణుడు; తస్యాం=ఆ; సభాయాం= సభయందు; శస్త్రభృతాం=ఆయుధధారులును; మనస్వినాం = ధీరమయినమనస్సుగల వారలును ; మహాబలానాం=అధికమయిన బలముగలవారలు నగురాక్షసులయొక్క; సమితౌ = సమూహమునందు; వసూనాం= వసువులయొక్క; మధ్యే=నడుమునందు; వజ్రహస్తఇవ= దేవేంద్రుఁడువలె; ప్రభయా=కాంతిచేత; చకాశే= ప్రకాశించెను.

ధీరమయినమనస్సుగలవాఁడగు నా రావణుండు, ఆసభయందు , ఆయుధధారులును ధీరహృదయులును బలవంతులగునారాక్షసులనడుమ వసులనడుమ దేవేంద్రుండుంబోలెఁ, దనదేహకాంతిచే, బ్రకాశించుచుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే , ఏకాదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండైకాదశసర్గటీక,
ముగిసినది.



శ్రీ

ద్వాదశసర్గప్రారంభః.

సతాం పరిషదం కృత్స్నాం సమీక్ష్య సమితింజయః
ప్రచోదయామాస తదా ప్రహస్తం వాహినీపతిమ్. ౧

టీక॥ తదా = అప్పుడు; సమితింజయః=యుద్ధమునందు జయించునట్టి ; సః-ఆ రావణుండు; కృత్స్నాం=సమస్తమయిన; తాం—ఆ; పరిషదం=సభను ; సమీక్ష్య=చూచి; వాహినీపతిం=సేనానాయకుండగు; ప్రహస్తం= ప్రహస్తుని; ప్రచోదయామాస=ఆజ్ఞాపించెను.

అప్పుడు, యుద్ధమునందు జయశాలి




యగునా రావణుండు, ఆసభ నంతయుం గని, సేనానాయకుండగు ప్రహస్తుంజూచి, యిట్లని, యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

సేనాపతే యథా తే స్యుః కృతవిద్యా శ్చతుర్విధాః
యోధా నధికరక్షాయాం తథా వ్యాదేష్టు మర్హసి. ౨
("యోధాన్నగరరక్షాయాం" ఇతి పాఠాంతరం.)

టీక॥ సేనాపతే= సేనానాయకుండగు ప్రహస్తుడా! కృతవిద్యాః= నేర్వఁబడినవిద్యలుగల; చతుర్విధాః= నాలుగువిధములుగల; తే= ఆభటులు; యథా= ఎట్లు; అధికరక్షాయాం= అధికముగా రక్షించుటయందు; పాఠాంతరపక్షమందు. నగరరక్షాయాం= పట్టణమునొక్క రక్షించుటయందు; జాగరూకాః(అధ్యాహృతము)= ఎచ్చరికగలవారలుగా; స్యుః= అగుదురో: తథా= అట్లు; యోధాన్ = భటులను; వ్యాదేష్టుం= ఆజ్ఞాపించుటకు; అర్హసి= తగుదువు.

సేనానాయకుఁడ వగు ప్రహస్తుఁడా! సమస్తాయుధవిద్యలను నేర్చిన వారలును రథికహస్తిపకసాదిపదాతి భేదంబులం జతుర్విధులునగు యోధులు పట్టణంబు నెప్పటికన్న నధికంబుగా రక్షించుటయందు జాగరూకులయి యుండు నట్లాజ్ఞాపింపుము. అని, రావణుండు, ప్రహస్తున కాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

స ప్రహస్తః ప్రణీతాత్మా చికీర్షన్ రాజశాసనమ్
వినిక్షిపద్బలం సర్వం బహిరంతశ్చ మందిరే. ౩

టీక॥ ప్రణీతాత్మా= వినయముతోఁగూడినమనస్సుగల; సః= ఆ; ప్రహస్తః= ప్రహస్తుఁడు; రాజశాసనం= రాజాజ్ఞను; చికీర్షన్= చేయఁగోరినవాఁడై; బలం= సైన్యమును; సర్వం= అంతను; మందిరే= ఇంటియందు; బహిః= వెలుపలను; అంతశ్చ= లోపలను; వినిక్షిపత్ (విన్యక్షిపత్)= ఉంచెను.

ఆ ప్రహస్తుండు, వినయంబున, రాజాజ్ఞ సేయంగోరి, సైన్యమునంతయు నాగృహంబులోపలను వెలుపలను, ఉం

చెను. అని, తాత్పర్యము.

తతో వినిక్షిప్య బలం పృథ గ్నగరగు ప్తయే
ప్రహ స్తః ప్రముఖే రాజ్ఞో నిషసాద జగాదచ. ౪

టీక॥ తతః=అటుపిమ్మట; ప్రహస్తః=ప్రహస్తుండు; పృథక్ = వేఱుగా; నగరగుప్తయే= పట్టణరక్షణంబుకొఱకు; బలం=సైన్యమును; వినిక్షిప్య= ఉంచి; రాజ్ఞః = రాజుయొక్క; ప్రముఖే= సమ్ముఖమునందు ; నిషసాద = కూర్చుండెను. జగాదచ=పలికెను.

అంతట, బట్టణరక్షణంబునకై, వేఱుగా సైన్యంబునిలిపి, ప్రహస్తుండు, రావణునిసమ్ముఖంబునకువచ్చికూర్చుండి, యిట్లని, విన్నవించెను. అని తాత్పర్యము.

నిహితం బహిరంతశ్చ బలం బలవత స్తవ
కురుష్వా విమనాః క్షిప్రం య దభిప్రేత మ స్తితే. ౫

టీక॥ బలవతః = అధికమయినబలముగల; తవ=నీయొక్క; బలం = సైన్యము; బహిః=వెలుపలను; అంతశ్చ=లోపలను; నిహితం = ఉంచఁబడినది. యత్=ఏది; తే = నీయొక్క; అభిప్రేతం=కోరఁబడినది; అస్తి=ఉన్నదో; తత్(అధ్యాహృతము)=దాని; అవిమనాః=దిగులులేనిమనస్సుగలవాఁడవై ; క్షిప్రం=శీఘ్రముగా; కురుష్వ = చేసికొనుము.

బలవంతుండవగునీసైన్యంబును లోపలను వెలుపలనుఅంతటను గావలియుంచియున్నాను; ఇంకనీకేమిసేయవలెనని యున్నదో, దాని, స్వస్థంబుగా, శీఘ్రంబునంజేసికొనుము. అని , ప్రహస్తుండు, రావణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ప్రహ స్తస్య వచ శ్శ్రుత్వా రాజా రాజ్యహితే రతః
సుఖేప్సు స్సుహృదాం మధ్యే వ్యాజహార స రావణః. ౬

టీక॥ రాజ్యహితే= రాజ్యముయొక్కమేలునందు; రతః= ఆసక్తుండగు ;

రాజా= రాజయిన; సః=ఆ; రావణః=రావణుఁడు; ప్రహస్తస్య= ప్రహస్తునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; సుఖేప్సుః=సుఖముఁగోరువాఁడై; సుహృదాం=స్నేహితులయొక్క; మధ్యే=నడుమునందు; వ్యాజహార=చెప్పెను.

రాజ్యంబునకుహితముసేయుటయందాసక్తుఁడయినరక్షసరాజుండగు రావణుండు, ప్రహస్తుండు చెప్పినమాటను విని, సుఖంబుఁగోరి, స్నేహితులనడుమ, నిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము-

ప్రియాప్రియే సుఖం దుఃఖం లాభాలాభౌ హితాహితే
ధర్మకామార్థకృచ్ఛ్రేషు యూయమర్హథ వేదితుమ్. ౭

టీక॥ యూయం=మీరలు; ధర్మకామార్థకృచ్ఛ్రేషు= ధర్మములయొక్కయుఁగామములయొక్కయు నర్థములయొక్కయు సంకటములయందు; ప్రియాప్రియే=ప్రియంబును అప్రియంబును; సుఖం=సుఖమును; దుఃఖం=దుఃఖమును; లాభాలాభౌ= లాభమును నష్టమును; హితాహితే= మేలును గీడును; వేదితుం= తెలియుటకు; అర్హథ=తగుదురు-

ధర్మకామార్థంబులలో సంకటంబుగల్గినప్పుడు, ప్రియాప్రియంబులను, సుఖదుఃఖంబులను, లాభనష్టంబులను, మంచిచెడులను దెలిసికొనుటకు; మీరుసమర్థులరు- అని, తాత్పర్యము-

సర్వకృత్యాని యుష్మాభిః సమారబ్ధాని సర్వథా
మంత్రకర్మ నియుక్తాని న జాతు విఫలాని మే. ౮

టీక॥సర్వథా= అన్నివిధంబులను; యుష్మాభిః=మీచేత; సమారబ్ధాని= చక్కఁగానారంభింపంబడిన; సర్వకృత్యాని=సమస్తకార్యంబులు; మంత్రకర్మనియుక్తాని=ఆలోచనకార్యముచే నిశ్చయింపఁబడినవై; మే=నాకు; జాతు= ఒకానొకప్పుడును; విఫలాని = నిష్ఫలములు; న=కావు.

అన్నివిధంబులను మీరలు చక్కఁగా నాలోచించి నిశ్చయించియారంభించిన కార్యమేదైనను, నాకుసఫలంబుగాకుండినదిలేదు. అని, తాత్పర్యము.

స ౧౭

ససోమగ్రహనక్షత్రై ర్మరుద్భి రివ వాసవః
భవద్భి రహ మత్యంతం వృత శ్శ్రియ మవాప్నుయామ్. ౯

టీక॥ అహం=నేను; ససోమగ్రహనక్షత్రైః= చంద్రునితోను ఇతరగ్రహములతోనునక్షత్రములతోనుంగూడిన;మరుద్భిః=దేవతలచేత;వాసవఇవ=దేవేంద్రుఁడువలె;భవద్భిః=మీచేత;వృతః=చుట్టఁబడినవాఁడనై; శ్రియం=లక్ష్మిని; అవాప్నుయాం=పొందుదును.

దేవేంద్రుండు చంద్రసూర్యగ్రహంబులతోనునక్షత్రంబులతోను దేవతలతోనుంగూడి జయలక్ష్మినొందునట్లు, నేను, మిమ్ముఁగూడి,జయలక్ష్మినొందెదను. అని, తాత్పర్యము.

అహంతు ఖలు సర్వా న్వ స్సమర్థయితు ముద్యతః
కుంభకర్ణస్యతు స్వప్నా న్నే మ మర్థ మచోదయమ్. ౧౦

టీక॥ అహంతు=నేనును;వః= మిమ్ము;సర్వాన్=అందఱను;సమర్థయితుం=తెలియునట్లుచేయుటకు;ఉద్యతః ఖలు= ప్రయత్నింపఁబడినాను గదా! కుంభకర్ణస్యతు=కుంభకర్ణునికిమాత్రము;స్వప్నాత్ =నిద్దురవలన;ఇమం= ఈ;అర్థం=అభిప్రాయమును; నాచోదయం=తెలుపనైతిని.

నేను,మీకందఱకును, ఇదివఱకే,కొంతదూరమీసంగతిం దెలిపియున్నాను ; కుంభకర్ణునకుమాత్రము , అతండునిద్రించుచుండుటవలన, నీసంగతిం జెప్పలేదు. అని; తాత్పర్యము.

అయం హి సుప్త ష్షణ్మాసాన్ కుంభకర్ణో మహాబలః
సర్వశస్త్రభృతాం ముఖ్య స్స ఇదానీ ముపస్థితః. ౧౧

టీక॥ మహాబలః= అధికమయినబలముగలవాఁడును; సర్వశస్త్రభృతాం= సమస్తాయుధధారులలోను; ముఖ్యః= మొదటివాఁడునగు;అయం=ఈ;కుంభకర్ణః= కుంభకర్ణుఁడు; షణ్మాసాన్= ఆఱుమాసములంతయు ; సుప్తోహి= నిదురించియుండినాఁడుగదా!సః= ఆ కుంభకర్ణుఁడు; ఇదానీం=ఇప్పుడు;ఉపస్థితః=వచ్చినాఁడు.

మహాబలుండును, ఆయుధధారుల




యందఱిలోను శ్రేష్ఠుండునగు, నీకుంభకర్ణుండు, ఈయాఱుమాసంబులునిదురించియుండెసాఁడుగదా! అతండిప్పుడు వచ్చియున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఇయంచ దండకారణ్యా ద్రామస్య మహిషీ ప్రియా
రక్షోభి శ్చరితా ద్దేశా దానీతా జనకాత్మజా. ౧౨

టీక॥ జనకాత్మజా=జనకమహారాజుకూఁతురును; రామస్య=రామునియొక్క; ప్రియా=ప్రియురాలయిన; మహిషీ=పట్టపుదేవియునగు; ఇయంచ= ఈ సీతయు; రక్షోభిః= రాక్షసులచేత; చరితాత్= సంచరింపఁబడిన; దేశాత్=ప్రదేశమయిన; దండకారణ్యాత్ — దండకారణ్యంబుననుండి, ఆనీతా — తేఁబడినది.

జనక మహారాజుపుత్త్రియు రామునిప్రియురాలునగునీసీతను, రాక్షసులు సంచరించునట్టి దండకారణ్యంబుననుండి, దెచ్చియున్నాను.

అని, తాత్పర్యము.

సా మే న శయ్యా మారోఢు మిచ్ఛత్య లసగామినీ
త్రిషు లోకేషు చాన్యా మే న సీతాసదృశీమతా. ౧౩

టీక॥ అలసగామినీ= తిన్నఁగానడచునట్టి: సా=ఆసీత; మే= నాయొక్క; శయ్యా=పాన్పును; ఆరోఢుం=ఎక్కుటకు; నేచ్ఛతి= కోరదు. మే=నాకు; త్రిషు= మూఁడైన; లోకేషు=లోకములయందును; సీతాసదృశీ= సీతతోసమానురాలగు; అన్యా=మఱియొక్క స్త్రీ; నమతా=సమ్మతిగాదు.

మందగామినియగునాసీత, నేనెంత ప్రార్థించినను, నాపైవలపు గొనకున్నది; ముల్లోకంబులయందును, సీతవంటిమఱియొక్క స్త్రీయేదియు లేదు.

అని, తాత్పర్యము,

రహస్యార్థము.— మే=నాయొక్క; శయ్యాం=పాన్పును; నేనుసమర్పించినపాన్పుననుట. శేషము సమానము.

అట్టిమంగళదేవత, నేలంబడియుండుటనుజూడఁజాలక, నేను, శయనంబుసమర్పించిన, దానినంగీకరింపకున్నది; ముల్లోకంబులయందును అట్టిస్త్రీ మెచ్చటనులేదు- అని, తాత్పర్యము-







తనుమధ్యా పృథుశ్రోణీ శారదేందునిభాననా
హేమబింబనిభా సౌమ్యా మాయేవ మయనిర్మితా. ౧౪

టీక॥ సా(అధ్యాహృతము)=ఆసీత, తనుమధ్యా=సన్ననినడుముగలదై; పృథుశ్రోణీ=పెద్దపిఱుందులుగలదై; శారదేందునిభాననా=శరత్కాలపుసుందరచంద్రునితో సమానమయినముఖముగలదై; హేమబింబనిభా=బంగారుప్రతిమతోఁగూడినదై; సౌమ్యా=సుందరిదై; మయనిర్మితా=మయునిచేఁజేయఁబడిన; మాయేవ=మాయవలె; స్థితా(అధ్యాహృతము)=ఉన్నది.

ఆసీత, సన్ననినడుమును బెద్దపిఱుందులును శరత్కాలచంద్రబింబంబు వంటి మోమును బంగారుప్రతిమవంటి మేనును గల్గి, సరిలేనిసౌందర్యంబున మెఱయుచు, మయనిర్మితంబగు మాయపగిది, నత్యాశ్చర్యంబుగల్గించుచున్నది-

అని, తాత్పర్యము-

సులోహితతలౌ శ్లక్ష్ణౌ చరణౌ సుప్రతిష్ఠితౌ
దృష్ట్వా తామ్రనఖౌ తస్యా దీప్యతే మే శరీరజః. ౧౫

టీక॥ తస్యాః=ఆసీతయొక్క; సులోహితతలౌ=మిక్కిలియెఱ్ఱనియడుగులుగలవియు; శ్లక్ష్ణౌ=కోమలములును; సుప్రతిష్ఠితౌ=చక్కఁగాఁబ్రతిష్ఠింపఁబడినవియు; తామ్రనఖౌ=ఎఱ్ఱనిగోళ్లుగలవియునగు; చరణౌ=పాదములను, దృష్ట్వా=చూచి; మే=నాయొక్క; శరీరజః=మన్మథుఁడు; దీప్యతే=వెలుంగుచున్నాఁడు.

మిక్కిలియెఱ్ఱనియడుగులుగలవియు మృదులంబులును సమంబులును ఎఱ్ఱనిగోళ్లుగలవియునగు నాసీతాదేవిపాదంబులంజూడఁజూడ, నాకుమన్మథబాధ, యెచ్చుచున్నది. అని, తాత్పర్యము.

హుతాగ్నేరర్చిసంకాశా మేనాం సౌరీమివ ప్రభామ్

టీక॥ హుతాగ్నేః=వ్రేల్వఁబడినయగ్నిహోత్రముయొక్క; అర్చిసంకాశాం(అర్చిస్సంకాశాం)=జ్వాలతోసమానురాలును; సౌరీం=సూర్యసంబం




ధియగు;ప్రభామివ(స్థితాం)= కాంతివలెనున్నదియునగు;ఏనాం = ఈసీతను; దృష్ట్వా(అధ్యాహృతము)=చూచి; శరీరజః,దీప్యతే(అధ్యాహృతము)=మన్మథుఁడు వెలుంగుచున్నాఁడు.

హుతాగ్నిజ్వాలవలెసూర్యకాంతియుంబోలెనున్న యీసీతఁజూడఁ జూడ,నాకు, మన్మథబాధమిక్కిలియెచ్చుగుచున్నది. అని, తాత్పర్యము.

రహస్యార్థము. ఈయొకటిన్నఱశ్లోకమునకును,శరీరజః=దేహమునంబుట్టినదుఃఖము;దీప్యతే=వెలుఁగుచున్నది. శేషముసమానము.

అతిసుందరంబులగు నాబిడ పాదంబులను, హుతాగ్నిజ్వాలవలెసూర్యప్రభయుంబోలెవెలుఁగుచున్నయాబిడదేహంబునుజూడఁజూడ, నట్టిమంగళదేవత, నేలంబరుండియుండుటను,నాదుఃఖంబుమిక్కిలియెచ్చుచున్నది.

అని, తాత్పర్యము.

ఉన్నసం వదనం వల్గు విపులం చారులోచనమ్. ౧౬
పశ్యం స్తథా వశః స్తస్యాః కామస్య వశ మేయివాన్

టీక॥తస్యాః=ఆసీతయొక్క; ఉన్నసం= ఉన్నతమయినముక్కుగలదియు; వల్గు=సుందరంబును;విపులం=విశాలంబును;చారులోచనం= సుందరంబులగు కండ్లుగలదియునగు;వదనం= ముఖమును;పశ్యన్=చూచుచు;తథా=అట్లు;అవశః=స్వాధీనతదప్పినవాఁడనై; కామస్య=మన్మథునియొక్క; వశం=అధీనతను;ఏయివాన్=పొందినాను.

ఉన్నతంబగుముక్కుగలదియు,సుందరంబునువిశాలంబును రమణీయంబులగునేత్రంబులతో నొప్పుచున్నదియునగు నాసీతాదేవిముఖంబునుజూడఁజూడ,నేను,బరవశుండనై,మన్మథునకులోఁబడుచున్నాను.అని, తాత్పర్యము.

క్రోధహర్షసమానేన దుర్వర్ణకరణేనచ.౧౭
శోకసంతాపనిత్యేన కామేన కలుషీకృతః

టీక॥క్రోధహర్షసమానేన=కోపమునందును సంతోషంబునందునుసమానుండును;దుర్వర్ణకరణేనచ = తెల్లఁబాఱుటయొక్కచేయువాఁడును; శో

సంతాపనిత్యేన= మనోవ్యథయందును శరీరబాధయందును జలనములేనివాఁడు నగు; కామేన=మన్మథునిచేత; కలుషీకృతః=కలుషుఁడుగాఁజేయఁబడినాను.

కోపంబువచ్చినను సంతోషంబుగల్గినను దుఃఖంబుసంభవించినను సంతాపంబువచ్చినను విడువక బాధించువాఁడును దేహముతెల్లఁబాఱునట్లుసేయువాఁడు నగు, మన్మథుండు, నన్నుఁగలంచుచున్నాఁడు. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— ఈ రెండుశ్లోకంబులకును. కామేన=మన్మథునిచేత; కలుషీకృతః=కలుషుఁడుగాఁజేయఁబడినవాఁడనయ్యు; తస్యాః=ఆసీతయొక్క; వదనం=ముఖమును; పశ్యన్ = చూచుచు; కామస్య = మన్మథునియొక్క; వశం=అధీనతను; ఏయువాన్(కిం)= పొందుదునా? ఎంతమాత్రమును బొందననుట.

నేను, అట్టిమన్మథపరవశుండనయ్యు, నాసీతాదేవిముఖంబుఁజూతునేని, కామబాధయంతయునశించుచున్నది.

అని, తాత్పర్యము.

సాతు సంవత్సరం కాలం మా మయాచత భామినీ. ౧౮
ప్రతీక్షమాణా భర్తారం రామ మాయతలోచనా

టీక॥ఆయతలోచనా= దీర్ఘములయినకండ్లుగల; భామినీ=స్త్రీయగు; సా తు=ఆసీతయు; భర్తారం= పెనిమిటియగు; రామం = రాముని; ప్రతీక్షమాణా=ఎదురుసూచుచు; మాం= నన్ను; సంవత్సరం=ఒక్కసంవత్సరమును; కాలం=గడువును; అయాచత=అడిగెను.

దీర్ఘములయిన కండ్లుగల యాసీతాదేవి, తనపెనిమిటి, రాముండువచ్చునోయేమోయని, నన్నొకసంవత్సరంబు గడువడిగియున్నది.

అని, తాత్పర్యము.

త న్మయా చారునేత్రాయాః ప్రతిజ్ఞాతం వచ శ్శుభమ్. ౧౯

టీక॥మయా=నాచేత; చారునేత్రాయాః=సుందరములగుకండ్లుగలసీతయొక్క; తత్=ఆ; శుభం= మంగళకరమయిన; వచః=మాట; ప్రతిజ్ఞాతం= ఒప్పుకొనఁబడినది.

సుందరాక్షియగు నా సీతచెప్పిన

యానూటకు, నేనొప్పుకొంటిని. అని, తాత్పర్యము.

క్రాంతో హం సతతం కామా ద్యాతో హయ ఇవా ధ్వని

టీక॥అధ్వని = మార్గమునందు; యాతః=పోయిన; హయఇవ=గుఱ్ఱము వలె; అహం=నేను; కామాత్ = మన్మథునివలన; క్రాంతః=అలసినాను.

మార్గంబునడచినగుఱ్ఱంబువలె, నేను, ఈమన్మథునిచేఁ బడి పడియలసియున్నాను. అని, తాత్పర్యము.

రహస్యార్థము. — ఈమన్మథుని వలనఁగలుగుసౌఖ్యంబుల ననుభవించిచి సుఖముఁజెందియున్నాను; ఇంక నాకక్కఱ లేదు; కడతేఱ నుపాయంబు వెదకుచున్నాను. అని, తాత్పర్యము.

కథం సాగర మక్షోభ్య ముత్తరంతి వనౌకసః ౨౦
బహుస త్త్వసమాకీర్ణం తౌవా దశరథాత్మజౌ

టీక॥వనౌకసః=వానరులు; కథం=ఎట్లు; అక్షోభ్యం=కలఁతపెట్టరానదియు; బహుసత్త్వసమాకీర్ణం= పెక్కుజంతువులచేవ్యాపింపఁ బడినదియునగు; సాగరం=సముద్రమును; ఉత్తరంతి=దాఁటుదురు? తౌ=ఆ; దశరథాత్మజౌవా=దశరథమహారాజుకొడుకులు గాని; కథం(అధ్యాహృతము)=ఎట్లు; ఉత్తరతః (అధ్యాహృతము)=దాటుదురు.

అక్షోభ్యంబును తిమి తిమింగిలాది మహాజంతువులతోనిండియుండునదియు నగు, మహాసముద్రంబును వానరులెట్లు దాఁటఁగలరు? ఆరామలక్ష్మణులు గాని యెట్లు దాఁటఁగలరు?

అని, తాత్పర్యము.

అథవా కపినైకేన కృతం నః కదనం మహత్. ౨౧
దుర్జ్ఞేయాః కార్యగతయో బ్రూహి యస్య యథామతిః

టీక॥అథవా=అటుకాదేని; ఏకేన=ఒక్కఁడైన; కపినా=వానరునిచేత; నః=మనకు; మహత్=గొప్పదగు; కదనం=యుద్ధము; కృతం=చేయఁబడినది. కార్యగతయః= కార్యములపోకలు; దుర్జ్ఞేయాః=తెలియఁగూడనివి. యస్య=ఎవ్వ




నికి; యథా=ఎట్లు; మతిః=బుద్ధియో; తథా (అధ్యాహృతము)= అట్లు; బ్రూత=చెప్పుఁడు.

ఒకవేళ దాఁటుదురనియే తలంతము; ఒక్క వానరుఁడంతటి వాఁడేనను తోనింతమాత్రము యుద్ధముచేసి పోవునే; కార్యగతుల నెఱుంగుట కష్టము; కావున, మీరలు, మీ మీబుద్ధికిఁ దోఁచినట్లు చెప్పుఁడు. అని, తాత్పర్యము.

మానుషాన్మే భయం నాస్తి తథాపితు విమృశ్యతామ్. ౨౨
తదా దైవాసురే యుద్ధే యుష్మాభిస్సహితోఽజయమ్
తే మే భవంతశ్చ తథా

టీక॥ తదా=అప్పుడు; దైవాసురే= దైవాసురులతోనైన; యుద్ధే=యుద్ధమునందు; యుష్మాభిః=మీతో; సహితః= కూడినవాఁడనై; అజయం= జయించితిని. మే=నాకు; తే=అట్టి; భవంతశ్చ=మీరలును; తథా = అట్లె; వర్తంతే (అధ్యాహృతము)=ఉన్నారలు. మే=నాకు; మానుషాత్ = మనుష్యునివలన; భయం=వెఱపు; నాస్తి = లేదు. తథాపి తు=అట్లయినను; విమృశ్యతాం=ఆలోచింపఁబడుఁగాక.

అప్పుడు, మీ సాహాయ్యంబున, దేవాసుర యుద్ధంబున, నేజయంబునొందినాను; అప్పుడు సహాయులయినమీరలు నట్లే యున్నారలు; కావున, నాకు మనుష్యునివలన నేమిభయము? అయినను, చక్కఁగా నాలోచింపుఁడు.

అని, తాత్పర్యము.

సుగ్రీవప్రముఖాన్ హరీన్. ౨౩
పరే పారే సముద్రస్య పురస్కృత్య నృపాత్మజౌ
సీతాయాః పదవీం ప్రాప్తౌ సంప్రాప్తౌ వరుణాలయమ్. ౨౪

టీక॥ సముద్రస్య= సముద్రముయొక్క; పరే=అవ్వలిదైన; పారే = గట్టునందు; నృపాత్మజౌ= రాచకొమరులగు రామలక్ష్మణులు ; సుగ్రీవప్రముఖాన్=సుగ్రీవుఁడు ముఖ్యుఁడుగాఁగల; హరీన్=వానరులను; పురస్కృత్య= ముందిడుకొని; సీతాయాః=సీతయొక్క; పదవీం=స్థానమును; ప్రాప్తౌ=తెలిసిన




వారలయి; వరుణాలయం = సముద్రమును; సంప్రాప్తౌ=పొందినారు.

అచ్చటసముద్రోత్తరతీరంబున, రామలక్ష్మణులు, సీతయుండుస్థలంబుఁదెలిసికొని, సుగ్రీవాదివానరులంగూడుకొని, సముద్రంబునొద్దఁజేరియున్నారు.

అని, తాత్పర్యము.

అదేయాచ యథాసీతా వధ్యౌ దశరథాత్మజౌ
భవద్భి ర్మంత్ర్యతాం మంత్ర స్సునీతం చాభిధీయతామ్. ౨౫

టీక॥ యథా=ఎట్లు; సీతాచ= సీతాదేవియు; అదేయా = ఇవ్వఁదగనిదియగునో; దశరథాత్మజౌ = దశరథునికొడుకులగు రామలక్ష్మణులు;వధ్యౌ=చంపఁదగినవారలగుదురో; తథా (అధ్యాహృతము)=అట్లు;భవద్భిః= మీచేత; మంత్రః = ఆలోచన ; మంత్ర్యతాం=ఆలోచింపఁబడుఁగాక, చేయఁబడుఁగాకయనుట సునీతంచ=చక్కఁగానిశ్చయింపఁబడినట్లుగాను ; అభిధీయతాం=చెప్పఁబడుఁగాక.

సీతాదేవినొసంగకయె, దశరథునికుమారులగు రామలక్ష్మణులంజంపునట్లు, మీరలు, చక్కఁగానాలోచించి, నిశ్చయించి , యుపాయంబువచింపుఁడు. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—— దశరథాత్మజౌ=రామలక్ష్మణులు; అవధ్యౌ=చంపఁదగనివారలగుదురో, వారలునన్నుఁజంపుదురోయనుట. శేషముసమానము

నేనుసీతాదేవినొసంగకుండునట్లును రామలక్ష్మణులచే నాకుమరణంబుగలుగునట్లును, మీరలుచక్కఁగానాలోచించి, యుపాయంబుఁజెప్పుఁడు.

అని, తాత్పర్యము.

నహి శక్తిం ప్రపశ్యామి జగత్యన్యస్య కస్యచిత్
సాగరం వానరై స్తీర్త్వా నిశ్చయేన జయో మమ. ౨౬

టీక॥వానరైః(సహ)= వానరులతోఁగూడ;సాగరం=సముద్రమును; తీర్త్వా = దాఁటి;ఆగంతుం (అధ్యాహృతము)=వచ్చుటకు;జగతి=ప్రపంచమునందు;అన్యస్య—ఇతరుండగు; కస్యచిత్=ఒకానొకనికిని; శక్తిం= సామ

స ౧౨

ర్థ్యము ను; న ప్రపశ్యమి = చూడనుగ దా! నిశ్చయేన = నిశ్చయముచేత; మమ = నాకు; జయః = జయము.

వానరులను సహాయులుగా నుంచుకొని, సముద్రంబు దాటి యిచ్చటికి వచ్చుటకుఁ, బ్రపంచంబున నెవ్వఁడును సమర్థుఁడు గాఁడు; కావున, నిశ్చయంబుగా నాకే జయంబు గల్గును అని, రావణుండు, చెప్పెను. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— అన్యస్య = రామునకన్న నితరుండగువానికి; కస్య చిత్ = ఎవ్వనికిని; శక్తిం = సామర్థ్యము ను; న ప్రపశ్యామిహి = చూడనుగ దా! మమ = నాకు; నిశ్చయేన = నిశ్చయముచేత; జయః = జయము.

రాముండుదక్క మఱి యెవ్వండును సముద్రంబు దాఁటి రాఁజాలఁడు; రాముండు సముద్రంబు దాఁటివచ్చి, నన్నువధించును గావున, నేనీసంసారంబును నిశ్చయముగ జయింపఁగలను.

అని, తాత్పర్యము.

తస్య కామపరీతస్య నిశమ్య పరిదేవితమ్
కుంభకర్ణః ప్రచుక్రోధ వచనం చేద మబ్రవీత్. ౭౭

టీక॥ కుంభకర్ణః = కుంభకర్ణుఁడు; కామపరీతస్య = మన్మథునిచేనావేశింపఁబడిన; తస్య = ఆరావణునియొక్క; పరిదేవితం = ఏడ్పును; నిశమ్య = విని; ప్రచుక్రోధ = మిక్కిలియుఁగోపంబు పొందెను- ఇదం = ఈ; వచనంచ = మాటను; అబ్రవీత్ = చెప్పెను-

అట్లు మన్మథావిష్టుండగు నారావణుండు చెప్పినమాటనువిని, కుంభకర్ణుండు, మహాకోపంబునొంది, యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము-

యదాతు రామస్య సలక్ష్మణస్య
ప్రసహ్య సీతా ఖలు సా ఇహాహృతా
సకృత్సమీక్ష్యైవ సునిశ్చితం తదా
భజేత చిత్తం యమునేవ యామునమ్. ౭౮

టీక॥ యదా = ఎప్పుడు; సకృత్ = ఒక్కమాటు; సమీక్ష్యైవ = ఆలోచించి

యే. సలక్ష్మణస్య=లక్ష్మణునితోఁగూడిన; రామస్య=రామునియొక్క; సా=ఆ; సీతా=సీత; ప్రసహ్య=బలాత్కారముగా; ఇహ=(సంధియాచనము)ఇచ్చుటకి; ఆహృతా=తేఁబడెనదో; తదాతు=అప్పుడె; చిత్తం=మనస్సు; యమునా=యమునానది; యామునమివ=యామునపర్వతమునువలె; సునిశ్చితం=చక్కనినిశ్చయమును; భజేతఖలు=పొందునుగదా!

నీవు, నీయంతనె యాలోచించి, రామునిభార్యయగుసీతను బలాత్కారముగానిచ్చుటకొఱకుఁ దేకమునుపె, మాతో నాలోచించియుండినచో, అప్పుడు యమునానదియామున పర్వతంబునొందునట్లు, మనస్సునిశ్చయంబు నొందియుండును; ఇప్పుడాలోచించుటంతయు, గతజలసేతుబంధనమువంటిది.

అని, తాత్పర్యము.

సర్వమేతన్మహారాజ కృతమప్రతిమం తవ
విధీయేత సహాస్మాభి రాదావేవాస్య కర్మణః. ౨౯

టీక॥ మహారాజ=మహారాజుండవగురావణుఁడా! తవ=నీయొక్క; ఏతత్=ఈ; కృతం=కార్యము; సర్వం=అంతయు; అస్య=ఈ; కర్మణః=సీతాహరణరూపంబగుకార్యముయొక్క; ఆదావేవ=మొదటనె; అస్మాభిస్సహ=మాతోఁగూడ; విధీయేత(యది)=చేయఁబడియుండునేని; అప్రతిమం=సరిలేనిది; స్యాత్ (అధ్యాహృతము)=అగును.

మహారాజుండవగురావణుఁడా! ఇప్పుడాలోచించుటంతయు, సీతందీసికొనవచ్చుటకు మొదటనేమాతో నాలోచించియుండువేని, మిక్కిలియుఁజక్కఁగా నుండును- అని, తాత్పర్యము.

న్యాయేన రాజకార్యాణి యః కరోతి దశానన
న స సంతప్యతే పశ్చాన్నిశ్చితార్థమతిర్నృపః- ౩౧

టీక॥ దశానన=రావణుఁడా! యః=ఎవ్వఁడు; న్యాయేన=న్యాయముచేత; రాజకార్యాణి=రాచకార్యములను; కరోతి=చేయుచున్నాఁడో; సః=అట్టి; నిశ్చితార్థమతిః=నిశ్చయింపఁబడినకార్యములందుబుద్ధిగల; నృపః=రాజు;

 

పశ్చాత్=పిమ్మట; నసంతప్యతే=పరితపింపఁడు.

రావణుఁడా! ఎవ్వండు, కార్యంబు నారంభించుటకుమున్నె, చక్కఁగా న్యాయంబు నాలోచించి, యటుపిమ్మట రాజకార్యంబులనారంభించునో, అట్టి, ప్రతికార్యంబునందును నిశ్చితబుద్ధిగల రాజు, నీయట్లు, వెనుకఁబరితాపంబు నొందఁడు. అని, తాత్పర్యము.

అనుపాయేన కర్మాణి విపరీతాని యానిచ
క్రియమాణాని దుష్యంతి హవీంష్యప్రయతేష్వివ. ౩౧

టీక॥ యాని=ఏ; విపరీతాని= విపరీతములయిన, గుణవంతములయినయనుట; కర్మాణి =కార్యములు ; అనుపాయేన = ఉపాయములేమిచేత; క్రియమాణాని = చేయఁబడుచున్నవగునో; తాని(అధ్యాహృతము)చ= అవియు; అప్రయతేషు = అపాత్రములయందు ; హవీంషీవ = అన్నములువలె; దుష్యంతి = దోషవంతములగుచున్నవి-

మంచికార్యములయినను ఉపాయముచేఁజేయకున్నచో, నిష్ఫలంబు లగుటయెగాక, అపాత్రులకుఁబెట్టినయన్నమువలె, దోషంబునుం గలుగఁజేయును- అని, తాత్పర్యము.

యః పశ్చాత్పూర్వకార్యాణి కర్మాణ్యభిచికీర్షతి
పూర్వం చాపరకార్యాణి న స వేద నయానయౌ- ౩౨

టీక॥ యః=ఎవ్వఁడు; పూర్వకార్యాణి= ముందుచేయఁదగినట్టి; కర్మాణి=కార్యములను; పశ్చాత్=వెనుకను; అపరకార్యాణి = వెనుకఁజేయఁదగినకార్యములను; పూర్వంచ=ముందును ; అభిచికీర్షతి= చేయఁగోరుచున్నాఁడో; సః= అతండు; నయానయౌ= నీతిని అనీతిని; నవేద=ఎఱుంగఁడు-

మఱియు, నెవ్వండు, వెనుకఁజేయవలసినకార్యములనుముందుచేసి, ముందుచేయవలసిన వానిని వెనుకఁజేయఁగోరునో , అతండుమంచిచెడులుతెలిసినవాఁడుకాఁడు- అని, తాత్పర్యము-

 

చపలస్య తు కృత్యేషు ప్రసమీక్ష్యాధికం బలమ్
క్షిప్ర మన్యై ప్రపద్యంతే క్రౌంచస్య ఖమివ ద్విజాః- 33

టీక॥కృత్యేషు=కార్యములయందు; చపలస్య=చంచలునియొక్క; అధికం=అధికమయిన; బలం=బలమును; ప్రసమీక్ష్య=చక్కఁగాఁజూచి; అన్యే=ఇతరులు; ద్విజాః = హంసపక్షులు; క్రౌంచస్య= క్రౌంచపర్వతముయొక్క; ఖమివ=రంధ్రమునువలె; ఖం(అధ్యాహృతము)=రంధ్రమును; ప్రపద్యంతే=పొందుచున్నారు-

చక్కఁగానాలోచింపక చపలుఁడై కార్యములు చేయువాని కధికబలమున్న యెడల, శత్రువులు, రంధ్రాన్వేషణము సేయుచుండి, వాఁడుచపలము నొందునప్పుడు, ఇదిసమయమనితటాలున, హంసలు, ఎగిరిదాఁటరాని క్రౌంచపర్వతమును దానియందు గుమారస్వామిశక్తిచేఁగావించినరంధ్రమూలముననూఁటి దాఁటి పోవునట్లువానింబరాజితునిఁజేయుదురు అని, తాత్పర్యము.

త్వయే దం మహ దారబ్ధం కార్య మప్రతిచింతితమ్
దిష్ట్యా త్వాం నావధీ ద్రామో విషమిశ్ర మివామిషమ్. 3౮

టీక॥త్వయా=నీచేత; అప్రతిచింతితం=ఆలోచింపఁబడిన; మహత్ = గొప్పదగు, అపాయకరమగు; ఇదం=ఈ; కార్యం=పనిని; ఆరబ్ధం=చేయఁబడినది. విషమిశ్రం=విషముతోఁగలసిన; ఆమిషమివ=మాంసమువలె; త్వాం= నిన్ను; దిష్ట్యా= భాగ్యముచేత; రామః= రాముడు; నావధీత్ =చంపఁడయ్యె.

నీ వెంతమాత్రంబు నాలోచింపక, మిక్కిలియును నపాయకరంబగు నీ సీతాహరణకార్యంబు గావించినావు; మాభాగ్యవశంబున, విషమిశ్రింబగు మాంసమువలె, నెవ్వరికిని దెలియనట్లు రాముండిదివఱకు నిన్నుఁజంపకున్నాడు. అని, తాత్పర్యము

తస్మా త్త్వయా సమారబ్ధం కర్మ హ్య ప్రతిమం పరైః
అహం సమీకరిష్యామి హత్వా శత్రూం స్తవా నఘ. 3౫

టీక॥ అనఘ=పాపరహితుండవగు రావణుఁడా! త్వయా= నీచేత; సమార




బ్ధం=ఆరంభింపఁబడినదియు; పరైః= ఇతరులచేత; అసాధ్యం(అధ్యాహృతము)= సాధింపఁదగనిదియు; అప్రతిమం=సరిలేనిదియునగు; కర్మ=కార్యమును; అహం= నేను; తవ=నీయొక్క; శత్రూన్= శత్రువులను; హత్వా=చంపి; సమీకరిష్యామిహి = సరిచేసెదనుగదా!

పాపరహితుండవగు రావణుఁడా! అట్లగుటంజేసి, నీవుకోరిచేసినట్టి, యసదృశంబును నేనుదక్క మఱి యెవ్వరికిని అసాధ్యంబునగు నీకార్యంబును, నేను, నీశత్రువులంజంపి, నీకుసాధించియిచ్చెదను. అని, తాత్పర్యము.

అహ ముత్పాదయిష్యామి శత్రూం స్తవ విశాంపతే

టీక॥ విశాంపతే= నరేంద్రుండవగు రావణుఁడా! అహం=నేను; తవ= నీయొక్క; శత్రూన్=శత్రువులను; ఉత్పాదయిష్యామి=చంపెదను.

రాక్షసరాజుండవగు రావణుఁడా! నేను, నీశత్రువులనందఱంజంపెదను. అని, తాత్పర్యము.

యది శక్రవివస్వంతౌ యది పావకమారుతౌ. ౩౬
తా వహం యోధయిష్యామి కుబేరవరుణావపి

టీక॥ శక్రవివస్వంతౌ యది= దేవేంద్రుండుసూర్యుండునైనను; పావక మారుతౌ యది = అగ్నివాయువులయినను; కుబేరవరుణావపి= కుబేరవరుణులయినను; తౌ = ఆరామలక్ష్మణులను; అహం=నేను; యోధయిష్యామి= జగడమాడించెదను.

వారలు, ఇంద్రసూర్యులయినను, అగ్నివాయువులయినను, కుబేరవరుణులయినను, వారలతో నేను యుద్ధముచేసెదను. అని, తాత్పర్యము.

గిరిమాత్రశరీరస్య మహాపరిఘయోధినః. ౩౭
నదతస్తీక్ష్ణదంష్ట్రస్య బిభియాద్వైపురందరః

టీక॥ గిరిమాత్రశరీరస్య = పర్వతంబంతటిదేహము గలవాఁడను; మహాపరి




ఘయోధినః= గొప్ప యినుపగుదియ తోఁబోరువాఁడును;నదంతః = అలుచువాఁడను=తీక్ష్ణదంష్ట్రస్య= కలుకుకోఱలుగలవాఁడనగు;మమ= (పంచమ్యర్థమందుఁషష్ఠి) నావలన; పురందరోపై; దేవేంద్రుండును;బిభియాత్=వెఱచును

నేను,పర్వతంబంతటిదేహంబుతో, గొప్పయినుపగుదియందాల్చి, భయంకరంబులగు కోఱలతో,సింహనాదంబులుసేయుచు, యుద్ధంబునకుఁ బోఁగా దేవేంద్రుఁడుగూడ,భయపడిపాఱిపోవును. అని,తాత్పర్యము.

పున మాఽం స ద్వితీయేన శరేణ నిహనిష్యతి. ३౮
తతో హం తస్య పాస్యామి రుధిరం కామ మాశ్వస

టీక॥ సః=ఆరాముఁడు;మాం=నన్ను;పునః=మఱల; ద్వితీయేన=రెండవదగు;శరేణ= బాణముచేత; నిహనిష్యతి=కొట్టును; తతః= అంతలోపలనే; అహం=నేను;తస్య = ఆరామునియొక్క;రుధిరం=నెత్తురును; పాస్యామి= త్రాఁగెదను.కామం= యథేచ్ఛముగా; శ్వస=ఊరడిల్లుము.

ఆరాముండు, నాపైనొకబాణమువేసి రెండవబాణంబువేయునంతలోపలనె, నేను,ఆరామునిరక్తంబుఁద్రావెదను; నీవ్రూఱడిల్లి స్వస్థంబుగానుండుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము. నిహనిష్యతి=చంపును. శేషముసమానము.

రాముండు, రెండవబాణంబుచేతనే,నన్నుఁజంపును; అటుపిమ్మటనేను నెత్తురుదాఁగవలెను(నేనతనిపై కఱుకకముస్నెనన్నతండుచంపివేయునే, నేనేమిచేయుదుననుట) ఆలోచించి కార్యములేదు; స్వస్థముగానుండుము. అని. తాత్పర్యము-

వధేన వై దాశరథే స్సుఖావహం
జయం తవా హర్తు మహం యతిష్యే. ३౯
హత్వాచ రామం సహలక్ష్మణేన
ఖాదామి సర్వాన్ హరియూధముఖ్యాన్

టీక॥అహం=నేను;దాశరథేః= రామునియొక్క; వధేన = చంపుటచేత




("వై" అనునది పాదపూరణార్థము); తవ — నీకు; సుఖావహం = సుఖముఁగలిగించునట్టి; జయం = జయమును; ఆహర్తుం = తెచ్చుటకు; యతిష్యే = ప్రయత్నించెదను. లక్ష్మణేనసహ = లక్ష్మణునితోఁగూడ; రామం = రాముని; హత్వా చ = చంపియు; హరియూథముఖ్యాన్ = వానరసమూహములలో ముఖ్యులగువారలను; సర్వాన్ = అందఱను; ఖాదామి = భక్షించెదను.

నేను, రామునిఁజంపి, నీకు, సుఖకరంబగు జయంబుగల్గునట్లు ప్రయత్నంబుఁ జేసెదను; అట్లు రామలక్ష్మణులం జంపి, వానరశ్రేష్ఠులనందఱను భక్షించెదను.

అని, తాత్పర్యము.

రహస్యార్థము. — వధేన — చచ్చుటచేత; దాశరథేః = రామునకు; తవ — నీయొక్క; జయం = జయమును; ఆహర్తుం = తెచ్చుటకు; అహం = నేను; యతిష్యే = ప్రయత్నించెదను; లక్ష్మణేనసహ = లక్ష్మణునితోఁగూడ; స్థితం (అధ్యాహృతము) = ఉన్న; రామం = రాముని; హరియూథముఖ్యాన్ — వానరశ్రేష్ఠులగు; సర్వాన్ = అందఱను; హత్వా చ = పొందియు (హన హింసాగత్యోః); ఖాదామి = భక్షింతునా? జీవింతునా? యనుట.

నేను, ముందు రామునిచే హతుండనై, రాముండు నిన్ను జయించునట్లు ప్రయత్నించెదను; యుద్ధంబున, రామలక్ష్మణులను వానరోత్తములనుం బొంది, యింకను బ్రతుకు టెక్కడిది?

అని, తాత్పర్యము.

రమస్వ కామం పిబ చాగ్ర్యవారుణీం
కురుష్వ కార్యాణి హితాని విజ్వరః. ౪౦
మయా తు రామే గమితే యమక్షయం
చిరాయ సీతా వశగా భవిష్యతి

టీక॥ త్వం (అధ్యాహృతము) — నీవు; కామం = యథేచ్ఛగా; రమస్వ — క్రీడింపుము. అగ్ర్యవారుణీం చ = శ్రేష్ఠమగు సురను; పిబ = త్రాఁగుము. విజ్వరః = పరితాపములేనివాఁడవై; హితాని = ఇష్టములగు; కార్యాణి = పనులను; కురుష్వ — చేసికొనుము. మయా = నాచేత; రామే — రాముఁడు; యమక్షయం = యమునిగృహమును; గమితే తు = పొందింపఁబడఁగానే; సీతా = సీతాదేవి; చిరాయ = బహు




కాలము; వశగా = అధీనతఁబొందినది; భవిష్యతి = కాఁగలదు.

నీవు యథేచ్ఛగాఁ గ్రీడింపుము; మంచి మద్యంబును ద్రాఁగుము; నీకిష్టములయిన కార్యంబులం జేసికొనుచుండుము; నేను బోయి రాముం జంపెదను; అంత, సీత, బహుకాలము నీ కధీనయయి యుండఁగలదు. అని, కుంభకర్ణుండు, రావణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—— మయా తు = నాచేతనే; ఇయం = ఈ; సీతా = సీత; రామే = రామునందు; అక్షయం = నాశము లేనట్లుగా; గమితా = పొందింపఁబడినదై; చిరాయ = బహుకాలము; వశగా = అధీనతఁబొందినది; భవిష్యతి = కాఁగలదు. శేషము సమానము.

నేనె, ముందు మరణంబునొంది, నిన్నును మరణంబునొందించి, సీత రామునిం బొంది, బహుకాలము, రామునితో నుండునట్లు గావించెదను; నీవు యథేచ్ఛగాఁ గ్రీడించుచుండుము. అని, కుంభకర్ణుండు, రావణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ద్వాదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ ద్వాదశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

త్రయోదశసర్గ ప్రారంభః.

రావణం క్రుద్ధ మాజ్ఞాయ మహాపార్శ్వో మహాబలః
ముహూర్త మనుసంచిత్య ప్రాంజలి ర్వాక్య మబ్రవీత్. ౧

టీక॥ మహాబలః = అధికమయినబలముగలఁ; మహాపార్శ్వః = మహాపార్శ్వుండు; రావణం = రావణుని; క్రుద్ధం = కోపించినవానిఁగా; ఆజ్ఞా

య=తెలిసికొని, ముహూర్తం=కొంచెముసేపు; అనుసంచింత్య = ఆలోచించి; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడై, వాక్యం= మాటను; అబ్రవీత్ =చెప్పెను.

మహాబలశాలియగుమహాపార్శ్వుండు, రావణుండు కుంభకర్ణునిమాటలకుఁ గోపంబునొందినాఁడని తెలిసికొని,కొంచెముసేపు, అతనిఁ బ్రసన్నుంజేయనుపాయంబాలోచించి , చేతులుమొగుడ్చుకొని, యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము-

యః ఖల్వపి వనం ప్రాప్య మృగవ్యాళ సమాకులమ్
న పిబే న్మధు సంప్రాప్తం స నరో బాలిశో భవేత్. ౨

టీక॥ యః=ఎవ్వఁడు("ఖలు" అను నదివాక్యాలంకారార్థము); మృగవ్యాళసమాకులం=మృగములచేతనుసర్పములచేతనునిండిన; వనం=అడవిని; ప్రాప్యాపి=పొందియు;సంప్రాప్తం=పొందఁబడిన; మధు= తేనియను; నపిబేత్ =త్రాఁగఁడో; సః=అ; నరః = మనుష్యుఁడు; బాలిశః=మూఢుఁడు ; భవేత్ =అగును.

ఎవ్వండు , తేనియత్రాఁగవలెనని మృగంబులతోను సర్పంబులతోను నిండియుండునడవికింబోయి , యచ్చటనెట్టకేలకుఁ దేనియసంపాదించి , దానిం ద్రాఁగకుండునో , అతండు, మూఢుండు. అట్లు,నీవు, సీతాసమాగమంబుఁగోరి , యతిప్రయాసంబున, సీతందీసికొనివచ్చియు , నూరకుండందగదు. అని,తాత్పర్యము.

ఈశ్వరస్యే శ్వరః కో స్తి తవ శత్రునిబర్హణ
రమస్వ సహ వైదేహ్యా శత్రూ నాక్రమ్య మూర్ధసు. ౩

టీక॥ శత్రునిబర్హణ=శత్రువులంజంపునట్టిరావణుఁడా! ఈశ్వరస్య=ప్రభుండవగు; తవ=నీకు; ఈశ్వరః = ప్రభుండు; కః=ఎవ్వఁడు; అస్తి= ఉన్నాఁడు? శత్రూన్ =శత్రువులను;మూర్ధసు=తలయందు; ఆక్రమ్య= త్రొక్కి;వైదేహ్యాసహ=సీతాదేవితోఁగూడ; రమస్వ=క్రీడింపుము.

శత్రువులంజంపునట్టిరావణుఁడా? నీవె యీశ్వరుండవే ; నిన్నుడుగువాఁ

డెవ్వఁడు? శత్రువులతలలఁదొక్కి, సీతంగూడ క్రీడింపుము. అని, తాత్పర్యము.

బలాత్కుక్కుట వృత్తేన వర్తస్వ సుమహాబల
ఆక్రమ్యాక్రమ్య సీతాం వై తథా భుంక్ష్వ రమస్వచ. ౪

టీక॥ సుమహాబల = మిక్కిలియధికమయినబలముగలరావణుఁడా! బలాత్ = బలాత్కారమువలన; కుక్కుటవృత్తేన = కోడివ్యాపారముచేత; వర్తస్వ = ఉండుము. తథా = అట్లు; సీతాం = సీతను; ("వై" అనునదిపాదపూరణార్థము;) ఆక్రమ్యాక్రమ్య = ఆక్రమించి యాక్రమించి; భుంక్ష్వ = భోగింపుము. రమస్వచ = సంతోషంబును బొందుము.

మహాబలుండవగు రావణుఁడా! సీతయొప్పకున్నను, కుక్కుటంబుపగిది, బలాత్కారంబున, సీతనాక్రమించి, పలుమాఱు క్రీడించి, సంతోషంబు నొందుము. అని, తాత్పర్యము.

లబ్ధ కామస్య తే పశ్చా దాగమిష్యతి యద్భయమ్
ప్రాప్త మప్రాప్త కాలం వా సర్వం ప్రతిసహిష్యసి. ౫

టీక॥ లబ్ధకామస్య = పొందఁబడినకోరికగల; తే = నీకు; పశ్చాత్ = పిమ్మట; యత్ = ఏ; భయం = భయము; ఆగమిష్యతి = రాఁగలదో; తత్ (అధ్యాహృతము) = దానిని; ప్రాప్తం = పొందఁబడినదానిగాని; అప్రాప్తకాలంవా = పొందఁబడనికాలముగలదానిఁ గాని, రాఁబోవుదానిని గానియనుట; సర్వం = అంతను; ప్రతిసహిష్యసి = ఓర్వఁగలవు.

ఇట్లునీవు, కోరికనెరవేర్చుకొన్నపిమ్మట, నీకేదైనభయము సంభవించునేని, యదివచ్చినగానిమ్ము; లేక రాఁబోవునదిగానున్న నుండనిమ్ము; నీకేదియులక్ష్యములేదు. అని, తాత్పర్యము.

కుంభకర్ణ స్సహాస్మాభి రింద్రజిచ్చ మహాబలః
ప్రతిషేధయితుం శక్తౌ సవజ్రమపి వజ్రిణమ్. ౬

టీక॥ అస్మాభిస్సహ = మాతోఁగూడ; కుంభకర్ణశ్చ = కుంభకర్ణుఁడును




ను; మహాబలః= అధికమయినబలముగల; ఇంద్రజిచ్చ = ఇంద్రజిత్తును; సవజ్రం= వజ్రాయుధముతోఁగూడిన, వజ్రిణమపి= దేవేంద్రుఁడైనను; ప్రతిషేధయితుం = కొట్టుటకు; శక్తౌ=సమర్థులు.

కుంభకర్ణుఁడును, మహాబలుండగునింద్రజిత్తును, వీరలిరువురె,మమ్ముం గూడి , వజ్రాయుధంబుధరించి దేవేంద్రుండువచ్చినను, బ్రహరింపంజాలుదురు-అని, తాత్పర్యము.

ఉపప్రదానం సాంత్వం వా భేదంవాఽకుశలైః కృతమ్
సమతిక్రమ్య దండేన సిద్ధిమర్థేషు రోచయ. ౭

టీక॥ అకుశలైః = అసమర్థులచేత , కృతం = చేయఁబడిన ; ఉపప్రదానం = ఇచ్చుటనుగాని; సాంత్వంవా= మంచిమాటనుగాని; భేదంవా=భేదోపాయమునుగాని; సమతిక్రమ్య= అతిక్రమించి; దండేన= దండోపాయముచేత; అర్థేషు=కార్యములయందు; సిద్ధిం=సిద్ధిని ; రోచయ = కోరుము.

యుద్ధంబుసేయఁజేతఁగాని వారలేర్పఱచిన దానంబునుగాని సామమునుగాని భేదంబునుగాని యీమూఁడుపాయంబులనువిడిచి , దండోపాయంబుననె, కార్యసిద్ధినొందుము.

అని, తాత్పర్యము.

ఇహ ప్రాప్తాన్ వయం సర్వాన్ శత్రూంస్తవ మహాబల
వశే శస్త్రప్రతాపేన కరిష్యామో నసంశయః. ౮

టీక॥మహాబల = అధికమయినబలముగలరావణుఁడా ! వయం=మేము; ఇహ=ఇచ్చటికి; ప్రాప్తాన్=వచ్చిన ; తవ=నీయొక్క; శత్రూన్= శత్రువులను; సర్వాన్ = అందఱను; శస్త్రప్రతాపేన= శస్త్రబలముచేత; వశే = అధీనతయందు; కరిష్యామః= చేయుదుము. సంశయః=సందేహము; న = లేదు.

మహాబలుండవగు రావణుఁడా! మేమునీశత్రువులు; ఇచ్చటికిరాఁగానే,వారలనందఱను , శస్త్రబలంబుననీకువశీ




కృతులం గావించెదము ; సందేహములేదు-అని, మహాపార్శ్వుండు రావణునితోఁ జెప్పెను-అని, తాత్పర్యము-

ఏవముక్త స్తదా రాజా మహాపార్శ్వేన రావణః
తస్య సంపూజయన్ వాక్య మిదం వచన మబ్రవీత్. ౯

టీక॥ రాజా=రాక్షసరాజుండగు; రావణః=రావణుఁడు; తదా=అప్పుడు; మహాపార్శ్వేన=మహాపార్శ్వునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై;తస్య=ఆమహాపార్శ్వునియొక్క; వాక్యం=మాటను; సంపూజయన్=పూజింపుచు; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను-

రాక్షసరాజుండగురావణుండు, అప్పుడు, మహాపార్శ్వుండుచెప్పినమాటనువిని, సంతోషించి, యతనింబొగడుచునీమాటంజెప్పెను-
అని, తాత్పర్యము-

మహాపార్శ్వ నిబోధ త్వం రహస్యం కించి దాత్మనః
చిరవృత్తం తదాఖ్యాస్యే యదవాప్తం మయా పురా. ౧౦

టీక॥ మహాపార్శ్వ = మహాపార్శ్వుఁడా!ఆత్మనః=నాయొక్క; కించిత్=ఒకానొక;రహస్యం= రహస్యమును;త్వం=నీవు; నిబోధ= ఎఱుంగుము. పురా=మునుపు; మయా = నాచేత; యత్=ఏది;అవాప్తం= పొందఁబడినదో;తత్=అట్టి;చిరవృత్తం=బహుకాలమప్పుడు జరగినసంగతిని;ఆఖ్యాస్యే=చెప్పెదను.

మహాపార్శ్వుఁడా! నాయందొక్క రహస్యంబున్నది ; నీవెఱింగి యుండుము; మున్ను నేనొకటి చేసియున్నాను; బహుకాలమయినది; చెప్పెదను వినుము. అని, తాత్పర్యము.

పితామహస్య భవనం గచ్ఛంతీం పుంజికస్థలామ్
చంచూర్యమాణా మద్రాక్ష మాకాశేగ్ని శిఖామివ. ౧౧

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; పితామహస్య = బ్రహ్మదేవునియొ




కర్తు; భవనం = ఇంటినిగూర్చి; గచ్ఛంతీం=పోవుచున్నదియు; చంచూర్యమాణాం= దాఁగిదాఁగిపోవుచున్నదియు; ఆకాశే=ఆకాశమునందు; అగ్నిశిఖామివ(స్థితాం)= అగ్నిజ్వాలయుఁబోలెనున్నదియునగు; పుంజికస్థలాం=పుంజికస్థలయనునప్సరసను; అద్రాక్షం= చూచితిని.

నేనొకప్పుడు, నాభయంబున, దాఁగిదాఁగిబ్రహ్మదేవునింటికిఁ బోవుచునాకాశంబుననగ్నిజ్వాలవలెనెలుంగుచున్న పుంజికస్థలయనునప్సరసనుమిన్నంగంటిని. అని, తాత్పర్యము.

సా ప్రసహ్య మయా భుక్తా కృతా వివసనా తతః
స్వయంభుభవనం ప్రాప్తా లోళితా నళినీ యథా. ౧౨

టీక॥తతః=అటుపిమ్మట; సా = ఆపుంజికస్థల; మయా = నాచేత; ప్రసహ్య=బలాత్కారముగా; వివసనా=దిగంబరగా; కృతా=చేయఁబడినదై; భుక్తా=భోగింపఁబడినది. లోళితా= నలపఁబడిన; నళినీయథా= తామరతీఁగవలె; స్వయంభుభవనం= బ్రహ్మదేవునింటిని; ప్రాప్తా=పొందినది.

అంత, నేనాపుంజికస్థలను బలాత్కారంబునదిగంబరఁగాఁజేసి భోగించితిని; అంత, నదివాఁడిన తామరతూఁడువలెదీనయయి బ్రహ్మదేవునొద్దకుఁ బోయినది. అని, తాత్పర్యము.

తస్య తచ్చ తదా మన్యే జ్ఞాత మాసీ న్మహాత్మనః

టీక॥తచ్చ = ఆసంగతియు; తస్య= ఆ; మహాత్మనః= అధికమయినప్రభావముగలబ్రహ్మదేవునకు; జ్ఞాతం = తెలియఁబడినది; ఆసీత్ =అయినది. ఇతి(అధ్యాహృతము)=అని; మన్యే=తలంచెదను.

మహాత్ముండగు నాబ్రహ్మదేవునకు, ఆసంగతి దెలిసినట్లుతోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

అథ సంకుపితో దేవో మా మిదం వాక్య మబ్రవీత్. ౧౩




టీక॥అథ=అంత; దేవః = బ్రహ్మదేవుఁడు; సంకుపితః= మిక్కిలియుఁగోపించినవాఁడై; మాం = నన్నుఁగూర్చి; ఇదం=ఈ; వాక్యం=మాటను; అబ్రవీత్= చెప్పెను.

అంత, బ్రహ్మదేవుండు, మహాకోపంబునొంది, నన్నుఁగూర్చి యీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

అద్య ప్ర భృతి యా మన్యాం బలా న్నారీం గమిష్యసి
తదా తే శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః ౧౪

టీక॥అద్యప్రభృతి=ఇదిమొదలు; అన్యాం=ఇతరయయిన; యాం=ఏ; నారీం=స్త్రీని; బలాత్ = బలాత్కారము వలన; గమిష్యసి; పొందుదువో; తదా= అప్పుడె; తే=నీయొక్క; మూర్ధా=తల; శతధా=నూఱువ్రయ్యలుగా; ఫలిష్యతి=పగులును. సంశయః= సందేహము; న=లేదు.

ఇదిమొదలు, నీవిట్లు పరస్త్రీని బలాత్కారంబునంబొందుదువేని, యప్పుడె, నీతలనూఱువ్రయ్యలయి పగులంగలదు, సందేహంబులేదు. అని, బ్రహ్మదేవుండుచెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యహం తస్య శాపస్య భీతః ప్రసభమేవ తామ్
నారోపయే బలా త్సీతాం వైదేహీం శయనే శుభే. ౧౫

టీక॥ అహం=నేను; ఇతి=అని; తస్య=ఆబ్రహ్మదేవునియొక్క; శాపస్య= (పంచమ్యర్థమందుషష్ఠి) శాపమువలన; ప్రసభమేవ= బలాత్కారముగానె; భీతః= భయపడినవాఁడనై; వైదేహీం= విదేహరాజుకూఁతురగు; సీతాం=సీతను; బలాత్= బలాత్కారమువలన; శుభే= సుందరంబునగు; శయనే=పాన్పునందు; నారోపయే=ఎక్కించుకొనకున్నాను.

నేను, బహుకష్టంబున నాశాపంబునకు భయపడియె, సీతనుబలాత్కారంబునంబొందకున్నాను.

అని, తాత్పర్యము.

సాగరస్యే వ మే వేగో మారుత స్యేవ మేగతిః
నైతద్దాశరథిర్వేద హ్యాసాదయతి తేన మామ్. ౧౬

స ౧౩

టీక॥ సాగరస్యేవ=సముద్రముయొక్కవలె; మే=నాయొక్క; వేగః=వేగమును; మారుతస్యేవ=వాయువుయొక్కవలె; మే=నాయొక్క; గతిః=గమనమును; ఏతత్=దీనిని; దాశరథిః=రాముండు; నవేద=ఎఱుంగఁడు; తేన=దానిచేత; మాం=నన్ను; ఆసాదయతిహి=పొందుచున్నాఁడుగదా!

సముద్రంబునకుంబోలె వేగంబును వాయువునకుంబోలె గమనంబును నాకున్నదని రామునకుఁ దెలియదు; కావున నేనాపైకి వచ్చుచున్నాఁడు.

అని, తాత్పర్యము-

యస్తు సింహ మివాసీనం సుప్తం గిరి గుహాశయే
క్రుద్ధం మృత్యు మివాసీనం ప్రబోధయితు మిచ్ఛతి. ౧౭

టీక॥ యస్తు=ఎవ్వఁడయితే; గిరిగుహాశయే=పర్వతగుహామధ్యంబునందు; సుప్తం = నిదురించిన; సింహమివాసీనం= సింహమువలెనున్నవాఁడను; సుప్తం(అధ్యాహృతము)= నిదురించిన; మృత్యుమివాసీనం=మృత్యువువలెనున్నవాఁడను; క్రుద్ధం= కోపస్వభావుండనగు; మాం=నన్ను; ప్రబోధయితుం= మేలుకొలుపుటకు; ఇచ్ఛతి=కోరుచున్నాఁడో; సఃకీదృశః(అధ్యాహృతము) = అతండెట్టివాఁడు?

ఆరాముండు, పర్వతగుహాయందు నిదురించుచున్నసింహంబును, నిద్రలేపునట్లు, నిద్రవోయియున్న మృత్యువును మేలుకొల్పునట్లు, ఊరకున్నయతికోపనుండగునన్ను కావలెనని పురికొల్పుచున్నాఁడే, అతండెట్టివాఁడు? ఏమియుఁ దెల్వి లేనివాఁడు.

అని, తాత్పర్యము-

న మత్తో నిశితాన్ బాణాన్ ద్విజిహ్వా నివ పన్నగాన్
రామః పశ్యతి సంగ్రామే తేన మా మభిగచ్ఛతి. ౧౮

టీక॥ రామః=రాముఁడు; సంగ్రామే=యుద్ధమునందు; మత్తః=నావలన; నిశితాన్ = తీక్ష్ణములయినవియు; ద్విజిహ్వాన్=రెండునాలుకలుగల; పన్నగానివ (స్థితాన్) = సర్పములువలెనున్నవియునగు; బాణాన్=బాణములను; నప

శ్యతి = చూడలేదు. తేన=అందుచేత; మాం= నన్నుఁగూర్చి; అభిగచ్ఛతి=వచ్చుచున్నాఁడు.

ఇదివఱకెన్నండును, రాముండు, యుద్ధంబున, సర్పంబులుంబోలెఁ దీక్ష్ణంబులయిన నాబాణంబులంగని యెఱుంగఁడు; కావుననే, యిప్పుడునామీఁదికి వచ్చుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

క్షిప్రం వజ్రోపమై ర్బాణై శ్శతధా కార్ముకచ్యుతైః
రామ మాదీపయిష్యామి ఉల్కాభి రివ కుంజరమ్. ౧౯

టీక॥ క్షిప్రం= శీఘ్రముగా; శతధా= నూఱునూఱులుగా; కార్ముకచ్యుతైః=ధనుస్సుననుండిజాఱిన;వజ్రోపమైః= వజ్రముతోఁబోలికగల; బాణైః=బాణములచేత; రామం=రాముని;ఉల్కాభిః=కొఱవికట్టెలచేత;కుంజరమివ=ఏనుంగునువలె; ఆదీపయిష్యామి= వెలింగించెదను.

ఇంక, శీఘ్రంబుగానే, యేనుంగులపైఁగొఱవికట్టెలువేయునట్లు, రామునిపై, వజ్రంబువంటి పెక్కు బాణంబులంబ్రయోగించెదను.

అని, తాత్పర్యము.

తచ్చాస్య బల మాదాస్యే బలేన మహతావృతః
ఉదయన్ సవితా కాలే నక్షత్రాణా మివ ప్రభామ్. ౨౦

టీక॥ అహం(అధ్యాహృతము)= నేను; మహతా = గొప్పదగు; బలేన = సైన్యముచేత; వృతః = చుట్టఁబడినవాఁడనై; ఉదయన్ = ఉదయించుచున్న. సవితా = సూర్యుఁడు;కాలే=ప్రాతఃకాలమునందు; నక్షత్రాణాం = నక్షత్రములయొక్క; ప్రభామివ=కాంతినివలె;అస్య=ఈరామునియొక్క; తత్ = ఆ;బలంచ=సైన్యమునుగూఁడ;ఆదాస్యే=ఖండించెదను.

మఱియుఁ బ్రాతఃకాలంబున నుదితుండగుసూర్యుండు, నక్షత్రంబులకాంతింబోఁగొట్టునట్లు, నేనుగొప్పసైన్యంబుంగూడి, రామునియావానరసైన్యంబునుగూడఁ,జకారాడెదను.

అని, తాత్పర్యము.

న వాసవేనాపి సహస్ర చక్షుషా
యుధా స్మి శక్యో వరుణేన వా పునః
మయాత్వియం బాహుబలేన నిర్జితా
పురీ పురా వైశ్రవణేన పాలితా. ౨౧

టీక॥ సహస్రచక్షుషా = వేయికండ్లుగల; వాసవేనాపి=ఇంద్రునిచేతను; పునః=మఱియు; వరుణేనవా=వరుణునిచేతను; యుధా = యుద్ధముచేత; శక్యః=అలవియగువాఁడను; నాస్మి=కాను. పురా=మున్ను; వైశ్రవణేన= కుబేరునిచేత; పాలితా=రక్షింపఁబడిన; ఇయం=ఈ; పురీతు = లంకాపట్టణమును; మయా=నాచేత; బాహుబలేన = భుజబలముచేత ; నిర్జితా= జయింపఁబడినది.

వేయికండ్లుగలదేవేంద్రుఁడుగానివరుణుండుగాని యుద్ధంబున, నాయెదుట, నిలుపశక్తులుగారు; మఱియు, నేనుగు బేరునింగూడజయించి, యతనిచేఁ బాలితంబగు నీలంకాపురింగొంటిని; ఇంక , మనుష్యుండగురాముండు నాకెంత మాత్రము? అని, రావణుండు మహాపార్శ్వునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, త్రయోదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండత్రయోదశసర్గటీక,
ముగిసినది.

ఓం

చతుర్దశసర్గప్రారంభః.

నిశాచరేంద్రస్య నిశమ్య వాక్యం
స కుంభకర్ణస్య చ గర్జితాని
విభీషణో రాక్షసరాజముఖ్య
మువాచ వాక్యం హిత మర్థయుక్తమ్. ౧

టీక॥ సః=ఆ=విభీషణః=విభీషణుఁడు; నిశాచరేంద్రస్య=రాక్షసేశ్వరుండగు రావణునియొక్క; వాక్యం= మాటను; కుంభకర్ణస్య= కుంభకర్ణునియొక్క; గర్జితానిచ=గర్జనలను; నిశమ్య=విని; రాక్షసరాజముఖ్యం= రాక్షసరాజులలో శ్రేష్ఠుండగు రావణునిఁ గూర్చి; హితం=మేలుగలిగించునదియు; అర్థయుక్తం = పరమార్థముతోఁ గూడినదియునగు; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

అంతవిభీషణుండు, రాక్షసేశ్వరుండగు రావణునిమాటను, కుంభకర్ణునిగర్జనలనువిని, రావణుంజూచి, హితంబునుబరమార్థసంయుతంబునగు, నీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

వృతో హి బాహ్వంతరభోగరాశి
శ్చింతావిష స్సుస్మితతీక్ష్ణదంష్ట్రః
పంచాంగుళీపంచశిరోతికాయః
సీతామహాహి స్తవ కేన రాజన్. ౨

టీక॥ రాజన్=రాక్షసరాజుండవగురావణుఁడా! బాహ్వంతరభోగరాశిః= వక్షస్థలమనుపడగగలదియు; చింతావిషః = చింతయను విషముగలదియు; సుస్మితతీక్ష్ణదంష్ట్రః=చిఱునగవను కఱకులయినకోఱలుగలదియు; పంచాంగుళీపంచశిరోతికాయః= అయిదువ్రేళ్లనుఅయిదుతలల పెద్దదేహముగలదియునగు ; సీతామహాహిః=సీతయను గొప్పసర్పము; తవ=(తృతీయార్థమం

దుష్టి) నీచేత; కేన=ఎందుచేత; వృతః=కోరఁబడినది. "హా" అనునదిపాదపూరణార్థము.

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! వక్షస్థలమును పడగగలదియుఁ జింతయనువిషంబుగలదియుఁ జిలునగవనుకఁ ఱకుకోఱలుగలదియు, దుఃఖవశంబునఁ దలగడగాఁజేయఁబడిన హస్తంబునందలి యయిదువ్రేళ్లను అయిదుతలలుగలిగినదియునగు, సీతయనుగొప్పసర్పమునేల కోరితివి?

అని, తాత్పర్యము.

యావన్న లంకాం సమభిద్రవంతి
వలీముఖాః పర్వతకూటమాత్రాః
దంష్ట్రాయుధాశ్చైవ నఖాయుధాశ్చ
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ 3

టీక॥ యావత్ = ఎంతవఱకు; దంష్ట్రాయుధాశ్చైవ= దంతములేయాయుధముగాఁగలవారలును; నఖాయుధాశ్చ=గోళ్లేయాయుధములుగాఁగలవారలును; పర్వతకూటమాత్రాః= పర్వతశిఖరంబులంతటివారలునగు; వలీముఖాః=వానరులు; లంకాం=లంకను గూర్చి; నసమభిద్రవంతి=రారో; తావత్ (అధ్యాహృతము)=అంతలోపల; మైథిలీ=సీతాదేవి; దాశరథాయ=రామునికొఱకు; ప్రదీయతాం=ఇవ్వఁబడుఁగాక.

దంతంబులునునఖంబులునెయాయుధంబులుగాఁగల పర్వతశిఖరాకారులగువానరులు, లంకకు రాకమున్నె, సీతాదేవిని రామునకొసంగుము.

అని, తాత్పర్యము.

యావన్న గృహ్ణంతి శిరాంసి బాణా
రామేరితా రాక్షసపుంగవానామ్
వజ్రోపమా వాయుసమానవేగాః
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. ౪

టీక॥ యావత్ =ఎంతవఱకు; వజ్రోపమాః=వజ్రములతోఁబోలికగలవియు;

వాయుసమానవేగాః = వాయువుయొక్క-వేగముతో సమానమైన వేగముగల:యునగు; రామేరితాః = రామునిచేఁబ్రయోగింపఁబడిన; బాణాః = బాణములు; రాక్షసపుంగవానాం = రాక్షసశ్రేష్ఠులయొక్క; శిరాంసి = తలలను; నగృహ్ణంతి = గ్రహింపవో; తావత్ (అధ్యాహృతము) = అంతలోపల; మైథిలీ = సీతాదేవి; దాశరథాయ = రామునికొఱకు; ప్రదీయతాం = ఇవ్వఁబడుఁగాక.

రాముండు, వజ్రసమానంబులును వాయువునకుంబోలె వేగంబుగలవియు నగుబాణంబులు ప్రయోగించి, రాక్షసోత్తములశిరస్సులం ద్రుంచుటకుమున్నె, సీతాదేవిని రామునికొసంగుము.

అని, తాత్పర్యము.

భిత్వా న తావ త్ప్రవిశంతి కాయం
ప్రాణాంతికా స్తేఽశనితుల్యవేగాః
శితా శ్శరా రాఘవవిప్రయుక్తాః
ప్రహస్త తేనైవ వికత్థసే త్వమ్. ౫

టీక॥ ప్రహస్త = ప్రహస్తుఁడా! ప్రాణాంతికాః = ప్రాణనాశముసేయునవియు; అశనితుల్యవేగాః = పిడుగుతోసమానమయిన వేగము గలవియు; శితాః = తీక్ష్ణములునగు; రాఘవవిప్రయుక్తాః = రామునిచేఁబ్రయోగింపఁబడిన; శరాః = బాణములు; తే = నీయొక్క; కాయం = దేహమును; భిత్వా = భేదించి; న ప్రవిశంతి = ప్రవేశింపకున్నవి ("తావత్" అనునది వాక్యాలంకారార్థము) తేనైవ = అందుచేతనే; త్వం = నీవు; వికత్థసే = పొగడుకొనుచున్నావు.

ప్రహస్తుఁడా! ప్రాణహరంబులును పిడుగువంటి వేగంబుగలవియును దీక్ష్ణంబులునగు రామునిబాణంబులు, ఇంకను, నీదేహంబు భేదింపకున్నవి; కావుననే, నీవిట్లాత్మస్తుతి చేసికొనుచున్నావు.

అని, తాత్పర్యము.

న కుంభకర్ణేంద్రజితౌ న రాజా
తథా మహాపార్శ్వ మహోదరౌ వా
నికుంభకుంభౌ చ తథాతికాయ
స్థాతుం న శక్తా యుధి రాఘవస్య. ౬

రాఘవస్య=రామునియొక్క; యుధి= యుద్ధమునందు;స్థాతుం=నిలుచుటకు;కుంభకర్ణేంద్రజితౌ = కుంభకర్ణుండునుఇంద్రజిత్తును;న(శక్తౌ)= సమర్థులు కారు. రాజా= రావణుండు; న(శక్తః) = సమర్థుండు కాఁడు. తథా=అట్లు;మహాపార్శ్వమహోదరౌ వా= మహాపార్శ్వమహోదరులును గాని;కుంభకుంభౌ చ=నికుంభుండును గుంభుండును; తథా= అట్లు; అతికాయః=అతికాయుండును;నశక్తాః= సమర్థులు కారు.

కుంభకర్ణుండు గాని యింద్రజిత్తు గాని రాక్షస రాజుండగు రావణుండు గాని,మహాపార్శ్వ మహోదరులు గానినికుంభుండుఁగుంభుండుఁగానియతికాయుండును గాని. యెవ్వరునుయుద్ధంబున రాము నెదుటనిలువంజాలరు.

అని, తాత్పర్యము.

జీవంస్తు రామస్య న మోక్ష్యసే త్వం
గుప్తస్సవిత్రా హ్యథవా మరుద్భిః
న వాసవస్యాంకగతో న మృత్యో
ర్నభో న పాతాళ మను ప్రవిష్టః. ౭

టీక॥త్వం=నీవు; జీవంస్తు = బ్రతికియున్నవాఁడవైనమాత్రము; సవిత్రా= సూర్యునిచేతను గాని;అథవా=లేక; మరుద్భిః=దేవతలచేతనుంగాని;గుప్తః= రక్షింపఁబడిన వాఁడవయ్యు ; రామస్య(రామేణ) = రామునిచేత; నమోక్ష్యసే=విడువఁబడవు; వాసవస్య=ఇంద్రునియొక్క;అంకగతః=తొడనుబొందినవాఁడవైనను;న (మోక్ష్యసే)= విడువఁబడవు. మృత్యోః= మృత్యువుయొక్క; అంకగతః (అధ్యాహృతము)= తొడనుబొందినవాఁడవైనను;న(మోక్ష్యసే)=విడువఁబడవు నభః= ఆకాశమునుగాని; పాతాళం=పాతాళమును గాని;అనుప్రవిష్టః= ప్రవేశించినవాఁడవైనను;న (మోక్ష్యసే)=విడువఁబడవు.

నీకుసూర్యుఁడుతోడువచ్చినను దేవతలందఱుఁదోడ్పడినను,నీవు , దేవేంద్రుని తొడపైఁగూర్చుండినను,మృత్యువు తొడపైఁ గూర్చుండినను, ఆకాశంబుఁ బ్రవేశించినను, పాతాళంబుఁ జొచ్చినను,రాముండు,నిన్నుఁ బ్రాణంబుతో విడువఁడు. అవశ్యముచంపును;అని,విభీషణుండుచెప్పెను. అని, తాత్పర్యము.

నిశమ్య వాక్యం తు విభీషణస్య
తతః ప్రహస్తో వచనం బభాషే

టీక॥ప్రహస్తః=ప్రహస్తుఁడు; విభీషణస్య=విభీషణునియొక్క; వాక్యం = మాటను; నిశమ్యతు=విన్నంతనే; తతః=అంత; వచనం=మాటను ; బభాషే=పలికెను.

ప్రహస్తుండు, విభీషణుండు చెప్పిన మాటను విని, యంత , నీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

న నో భయం విద్మ న దైవతేభ్యో
న దానవేభ్యో హ్యథవా కుతశ్చిత్. ౮

టీక॥నః=మాకు; భయం = భయము; దైవతేభ్యః=దేవతలవలన; న=లేదు, దానవేభ్యః= దానవులవలన; న=లేదు. అథవా = లేక; కుతశ్చిత్=ఎందును; భయం (అధ్యాహృతము) = భయమును; నవిద్మహే(విద్మః)=ఎఱుంగము. గదా!

దేవతలవలనఁగాని దానవుల వలనఁగాని యెవ్వరివలననుగాని మాకుభయంబు లేదు. అని, తాత్పర్యము.

న యక్షగంధర్వమహోరగేభ్యో
భయం న సంఖ్యే పతగోత్తమేభ్యః
కథన్ను రామాద్భవితా భయం నో
నరేంద్రపుత్రాత్సమరే కదాచిత్. ౯

టీక॥ నః=మాకు; సంఖ్యే= యుద్ధమునందు; భయం=భయము; యక్షగంధర్వమహోరగేభ్యః= యక్షులవలనను గంధర్వులవలనను పెద్దసర్పములవలనను; న=లేదు. పతగోత్తమేభ్యః=పక్షులలోనుత్తమమగువానివలనను; న= లేదు, నరేంద్రపుత్రాత్=రాజుకొడుకైన; రామాత్=రామునివలన; సమరే=యుద్ధమునందు; కదాచిత్=ఒకప్పుడైనను; భయం=భయము; కథన్ను=ఎట్లు; భవితా=కాఁగలదు?

యక్షులవలనఁగాని గంధర్వులవలనఁగాని యురగంబులవలనగాని పక్షిసంఘంబులవలనఁగాని, మాకు యుద్ధంబున




నెంతమాత్రముభయంబు లేదు; ఇంకమనుష్యుండగు రాచపిల్లకాయ రామునివలన మాకేమిభయము? అని, ప్రహస్తుండు విభీషణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము

ప్రహస్తవాక్యం త్వహితం నిశమ్య
విభీషణో రాజహితానుకాంక్షీ
తతో మహాత్మా వచనం బభాషే
ధర్మార్థకామేషు నివిష్టబుద్ధిః. ౧౦

టీక॥ మహాత్మా= పూజ్యమయిన స్వభావముగలవాఁడును; రాజహితానుకాంక్షీ = రాజుమేలునుగోరువాఁడునగు; విభీషణః=విభీషణుఁడు; అహితం= కీడుగలిగించునట్టి; ప్రహస్తవాక్యం=ప్రహస్తునిమాటను; నిశమ్యతు= విన్నంతనె; తతః=అంత; ధర్మార్థకామేషు= ధర్మమునందును అర్థమునందును కామమునందును; నివిష్టబుద్ధిః= ఉంచఁబడినబుద్ధిగలవాఁడై; వచనం=మాటను; బభాషే=చెప్పెను.

మహాత్ముండును రావణుని మేలుకోరువాఁడునగు విభీషణుండు, రాజునకుఁగీడుగలిగించునట్టి ప్రహస్తునిమాటనువిని, ధర్మార్థకామంబుల మూఁడింటినిం జక్కఁగా నాలోచించి, యీమాటం జెప్పెను. అని; తాత్పర్యము.

ప్రహస్త రాజా చ మహోదరశ్చ
త్వం కుంభకర్ణశ్చ యథార్థజాతమ్
బ్రవీథ రామం ప్రతి తన్నశక్యం
యథాగతి స్స్వర్గ మధర్మబుద్ధేః. ౧౧

టీక॥ప్రహస్త=ప్రహస్తుఁడా; రాజాచ=రాక్షసరాజుండగురావణుండును; మహోదరశ్చ=మహోదరుండును; త్వం=నీవును; కుంభకర్ణశ్చ= కుంభకర్ణుఁడును; అర్థజాతం= కార్యజాతమును; యథా=ఎట్లు; బ్రవీథ= చెప్పుచున్నారో; తత్= అది; అధర్మబుద్ధేః= అధర్మంబునందు బుద్ధిగలవానికి; స్వర్గం= స్వర్గమునుగూర్చి; గతిర్యథా = పోవుటవలె ; రామంప్రతి —




రామునిగూర్చి;నశక్యం=అలవికాదు.

ప్రహస్తుఁడా!నీవును, రావణుండును మహోదరుండునుగుంభకర్ణుఁడును,జెప్పుకార్యము, అధర్మిష్ఠునకు స్వర్గగమనంబుసిద్ధింపనట్లు, రామునివిషయమయి యెంతమాత్రము , సఫలము కానేరదు. అని; తాత్పర్యము-

వధస్తు రామస్య మయా త్వయావా
ప్రహస్త సర్వై రపి రాక్షసైర్వా
కథం భవే దర్థవిశారదస్య
మహార్ణవం తర్తు మివా ప్లవస్య. ౧౨

టీక॥ప్రహస్త=ప్రహస్తుఁడా! మయా=నాచేతఁగాని; త్వయావా=నీచేతఁగాని;సర్వైః=సమస్తులయిన;రాక్షసైరపివా = రాక్షసులచేతనుంగాని ; అర్థవిశారదస్య= కార్యములయందుఁబండితుండగు; రామస్య=రామునియొక్క; వధస్తు=చంపుటయు;అప్లవస్య=తెప్పలేనివానికి; మహార్ణవం= మహాసముద్రమును; తర్తుం=దాఁటుటకు; శక్తిః (అధ్యాహృతము)ఇవ = సామర్థ్యమువలె;కథం=ఎట్లు; భవేత్ = అగును?

ప్రహస్తుఁడా! తెప్పకోయ్యాయు ననులేనివానికిమహాసముద్రంబు దాఁటనలవిగానట్లు, నాకుఁగానినీకుఁగాని,రాక్షసులయందఱకుంగాని, కార్యదక్షుండగు రాముని వధింపనలవిగాదు.

అని, తాత్పర్యము.

ధర్మప్రధానస్య మహారథస్య
ఇక్ష్వాకువంశప్రభవస్య రాజ్ఞః
ప్రహస్త దేవాశ్చ తథావిధస్య
కృత్యేషు శక్తస్య భవంతి మూఢాః. ౧౩

టీక॥ప్రహస్త = ప్రహస్తుఁడా! ధర్మప్రధానస్య=ధర్మమెప్రధానముగాఁగలవాఁడునును;మహారథస్య= తన్నుసారథిని గుఱ్ఱంబులనురక్షించు కొను




చుఁబడునొకండు వేలమందివిలుకాండ్ర తోఁబోరు వాఁడును ; ఇక్ష్వాకువంశ ప్రభవస్య = ఇక్ష్వాకువంశమె కారణముగాఁ గలవాఁడును ; తథావిధస్య = అట్టివాఁడును ; శక్తస్య = సమర్థుఁడును ; రాజ్ఞః = జనరంజనము సేయువాఁడునగు రామునియొక్క ; కృత్యేషు= కార్యములయందు; దేవాశ్చ = దేవతలునుగూడ ; మూఢాః = మోహము నొందిన వారలు;భవంతి=అగుచున్నారు.

ప్రహస్తుఁడా! పరమ ధార్మికుండును దన్నును సారథిని గుఱ్ఱంబులనుం గాపాడుకొనుచుఁ బడునొక్కఁడు వేలమంది విలుకాండ్రతోఁ బోరంజాలినవాఁడును బరాక్రమనిధానంబగు నిక్ష్వాకువంశంబునంబుట్టినవాఁడును అట్లు విరాధుండుఁగబంధుండువాలియు మొదలగు ననేక మహావీరులనువధించినట్టిమహాపరాక్రమశాలియును మహా సమర్థుండునుజనరంజనంబు సేయువాఁడునగు రాముని యెదుట,యుద్ధంబున,దేవతలుంగూడ మోహితులగుదురు; ఇంక మన మెంతమాత్రము వారలము?

అని, తాత్పర్యము.

తీక్ష్ణా నతా య స్తవ కంకపత్రా
దురాసదా రాఘవవిప్రముక్తాః
భిత్త్వా శరీరం ప్రవిశంతి బాణాః
ప్రహ స్త తేనైవ వికత్థసే త్వమ్. ౧౪

టీక॥ప్రహ స్త=ప్రహస్తుఁడా ! తీక్ష్ణాః=కఱకుగలవియు;నతాః=వంగినవియు;కంకపత్రాః=కంకపక్షుల ఱెక్కలుగలవియు; దురాస దాః=చెనకరానివియునగు; రాఘవవిప్రముక్తాః= రామునిచేవిడువఁబడినవగు; బాణాః=బాణములు;తవ=నీయొక్క; శరీరం= దేహమును; భిత్త్వా=భేదించి; ప్రవిశంతి (ఇతి)యత్= ప్రవేశించుచున్నవనునది యేదిగలదో; తేనైవ = అందుచేతనే; త్వం=నీవు;వికత్థసే = పొగడుకొనుచున్నావు,

ప్రహస్తుఁడా! తీక్ష్ణంబులును నతపర్వంబులునుగంకపక్షి ఱెక్కలుగట్టినవియు,మహావేగంబులగుటచేదురాసదంబులునగు రామునిచేఁబ్రయోగింపఁబడిన




బాణంబులు, నీదేహంబును, భేదించి ప్రవేశింపంగలవు; కావున నే, నీవిట్లాత్మ స్తుతి జేసికొనుచున్నావు. అని తాత్పర్యము.

న రావణో నాతిబల స్త్రిశీర్షో
న కుంభకర్ణోఽస్య సుతో నికుంభః
న చేంద్రజి ద్దాశరథిం ప్రసోఢుం
త్వం వా రణే శక్రసమం సమర్థాః. ౧౫

టీక॥ రణే=యుద్ధమునందు; శక్రసమం=దేవేంద్రునితో సమానుండగు; దాశరథిం=రాముని; ప్రసోఢుం=ఓర్చుటకు; రావణః=రావణుండు; న(సమర్థః)=సమర్థుండు కాండు. అతిబలః=అధికమయినబలముకల; త్రిశీర్షః=త్రిశీర్షుఁడు; న(సమర్థః)=సమర్థుండు కాఁడు. కుంభకర్ణః=కుంభకర్ణుఁడు; న(సమర్థః)=సమర్థుండు కాఁడు; అస్య=ఈకుంభకర్ణునియొక్క; సుతః=కొడుకగు; నికుంభః=నికుంభుఁడు; న సమర్థః (అధ్యాహృతము)=సమర్థుఁడు కాఁడు ఇంద్రజిచ్చ=ఇంద్రజిత్తు గాని; త్వం వా=నీవు గాని; సర్వే (అధ్యాహృతము)=అందఱును; నసమర్థాః=సమర్థులు కారు.

రావణుండు గాని మహాబలుండగు త్రిశీర్షుండు గాని కుంభకర్ణుండు గాని యతనికొడుకు నికుంభుండు గాని యింద్రజిత్తు గాని నీవు గాని, మీరలెవ్వరును, శక్రసమానుండగు రాముని యుద్ధంబున నెదిరింప సమర్థులరు కారు.

అని, తాత్పర్యము,

దేవాంతకో వాపి నరాంతకో వా
తథా ఽతికాయో ఽతిరథో మహాత్మా
అకంపనశ్చాద్రిసమానసార
స్థాతుం నశక్తా యుధి రాఘవస్య. ౧౬

టీక॥ దేవాంతకో వా=దేవాంతకుఁడు గాని; నరాంతకో వా=నరాంతకుఁడు గాని; తథా=అట్లు; అతిరథః=పెద్ద విలుకాండ్రతో బోరువాఁడును; మహాత్మా=




అధికమైనబలముగలవాఁడునగు; అతికాయః = అతికాయుండు గాని; అద్రిసమానసారః = పర్వతముతో సమానమయిన బలముగల; అకంపనశ్చ = అకంపనుఁడుఁ గాని; రాఘవస్య = రాముని యొక్క; యుధి = యుద్ధమునందు; స్థాతుం = నిలుచుటకు; న శక్తాః = సమర్థులు కారు.

దేవాంతకుండు గాని నరాంతకుండు గాని పెక్కువిలుకాండ్రతో నేకకాలంబునఁ బోరం జాలినవాఁడును మహాబలుండునగు నతికాయుండును గాని పర్వతసమానబలుండగు నకంపనుండును గాని, యుద్ధంబున, రాము నెదుట నిలువం జాలరు. అని. తాత్పర్యము.

అయం హి రాజా వ్యసనాభిభూతో
మిత్రై రమిత్రప్రతిమై ర్భవద్భిః
అన్వాస్యతే రాక్షసనాశనార్థే
తీక్ష్ణః ప్రకృత్యా హ్య సమీక్ష్యకారీ. ౧౭

టీక॥ అసమీక్ష్యకారీ = ఆలోచింపక చేయువాఁడును ("హి" అనునది పాదపూరణార్థము); ప్రకృత్యా = స్వభావము చేత; తీక్ష్ణః = ఉగ్రుఁడును; వ్యసనాభిభూతః = సప్తవ్యసనంబుల చేలోఁగొనఁబడినవాఁడునగు; అయం = ఈ; రాజా = రాక్షసరాజుండగు రావణుఁడు; రాక్షసనాశనార్థే = రాక్షసుల నశింపఁజేయుట యను ప్రయోజనము నిమిత్తమయి; అమిత్రప్రతిమైః = శత్రువులతోఁ బోలికగల; మిత్రైః = స్నేహితులరగు; భవద్భిః = మీ చేత; అన్వాస్యతే హి = అనుసరింపఁబడుచున్నాఁడుగదా!

ఆలోచింపక చేయువాఁడును తీక్ష్ణస్వభావుఁడునగు నీ రావణుండు "వాక్పారుష్యము, దండపారుష్యము, అర్థదూషణము, పానము, స్త్రీ, వేఁట, జూదము" అను నీ సప్తవ్యసనంబులకును లోఁబడి మంచిచెడులు దెలియక, రాక్షసులకందఱకు, నాశంబు గల్గించునట్టి కార్యంబు సేయం దలంపఁగా, మీరలందఱు, స్నేహితులని పేరుపెట్టుకొని, శత్రువులపగిది, నతని యెదుట, నిచ్చకములాడుచున్నారలు. అని, తాత్పర్యము.

అనంతభోగేన సహస్రమూర్ధ్నా
నాగేన భీమేన మహాబలేన




బలాత్పరిక్షిప్తమిమం భవంతో
రాజాన ముత్క్షిప్య విమోచయంతు. ౧౮

టీక॥ భవంతః = మీరలు; అనంత భోగేన=తుదిలేనిదేహముగలదియు; సహస్రమూర్ధ్నా= వేయితలలుగలదియు; భీమేన=భయంకరంబును; మహాబలేన = అధికమయినబలముగలదియునగు; నాగేన=సర్పముచేత; బలాత్=బలాత్కారమువలన; పరిక్షిప్తం=చుట్టఁబడిన; ఇమం=ఈ; రాజానం=రాక్షసరాజుండగురావణుని; ఉత్క్షిప్య=ఎత్తి; విమోచయంతు = విడిపింతురుగాక.

రాక్షసరాజుండగురావణునిఁ,దుదిలేనిదేహంబుగలదియు, వేయితలలుగలదియుభయంకరంబును మహాబలంబునగురామవైరంబను మహాసర్పంబు చుట్టుకొనియున్నది; మీరలు,సర్వంబుఁబాఁదోలి, యితనివిడిపింపుఁడు.

అని, తాత్పర్యము.

యావద్ధి కేశగ్రహణం సుహృద్భి
స్సమేత్య సర్వైః పరిపూర్ణకామైః
నిగృహ్య రాజా పరిరక్షితవ్యో
భూతైర్యథా భీమబలైర్గృహీతః. ౧౯

టీక॥ పరిపూర్ణకామైః= నిండినకోర్కులుగలవారలగు; సుహృద్భిః = స్నేహితులచేత; సర్వైః= అందఱిచేతను ; సమేత్య = ఒకటియయి ; రాజా=రాజు; భీమబలైః= భయంకరముగుబలముగల; భూతైః= భూతములచే; గృహీతః(అధ్యాహృతము) = పట్టుకొనఁబడిన ; పురుషః(అధ్యాహృతము)యథా=పురుషుఁడువలె ; యావత్కేశగ్రహణం=వెండ్రుకలపట్టుటవఱకు;నిగృహ్య = నిగ్రహించి; పరిరక్షితవ్యః=రక్షింపఁబడవలసినవాఁడుగదా!

రాజుదుర్మార్గంబునొందునేని, రాజుచేసమస్తలాభంబులంబొందిపూర్ణకాములయినమిత్రులు, అందఱునైకమత్యంబునొంది, యతని, మహాబలంబులగుభూతంబులచేనావిష్టుండగుపురుషుంబోలె, తలవెండ్రుకలంబట్టియీడ్చి

యయినను, నిగ్రహించి,మంచిమార్గంబునకుం జేవలయును.అని, తాత్పర్యము.

సువారిణా రాఘవసాగరేణ
("సంహారిణా" ఇతిపాఠాంతరం)
ప్రచ్ఛాద్యమాన స్తరసా భవద్భిః
యుక్తస్త్వయం తారయితుం సమేత్య
కాకుత్స్థపాతాళముఖే పతన్సః. ౨౦

టీక॥ సువారిణా=మంచిసమూహముగలవాఁడును,మంచిజలముగలదియునగు; (పాఠాంతరమునందు) సంహారిణా=నశింపఁజేయునట్టి; రాఘవసాగరేణ=లక్ష్మణుఁడనుసముద్రముచేత; ప్రచ్ఛాద్యమానః= కప్పఁబడుచున్నవాఁడును; కాకుత్స్థపాతాళముఖే= రాముండనుబడబానలము యొక్క ముఖమునందు; పతన్=పడుచున్నవాఁడునగు; అయం=ఈ; సః=అట్టిరావణుండు; తరసా=శీఘ్రంబున; భవద్భిః=మీచేత; సమేత్య= ఒకటియయి; తారయితుం=దాఁటించుటకు; యుక్తస్తు=అర్హుఁడుగదా!

మీకుసమస్తసుఖంబులుఁగలిగించినట్టియీరావణుండిప్పుడువినాశంబునొందుటకై, లక్ష్మణుండనుసముద్రంబునమునింగిరాముండనుబడబానలాగ్ని ముఖంబునంబడనున్నాఁడు, కావున, మీరలందఱునైకమత్యంబున , నితనిందరింపఁ జేయవలయును. అని, తాత్పర్యము.

ఇదం పురస్యాస్య స రాక్షసస్య
రాజ్ఞశ్చ పథ్యం ససుహృజ్జనస్య
సమ్యగ్ఘివాక్యం స్వమతం బ్రవీమి
నరేంద్రపుత్రాయ దదామ పత్నీమ్. ౨౧

టీక॥ ఇదం=ఇది; అస్య= ఈ; పురస్య=పట్టణమునకును; ససుహృజ్జనస్య=స్నేహిత జనముతోఁగూడిన ; రాజ్ఞశ్చ=రావణునకును; పథ్యం= హితము. స్వమతం= నామతమయిన; వాక్యం=మాటను; సమ్యక్=చక్కఁగా; బ్రవీమిహి=చెప్పుచున్నానుగదా! నరేంద్రపుత్రాయ=రాజపుత్రుండగు రామునికొ

ఱకు; పత్నీం=భార్యను; దదామ=ఇచ్చెదము.

నేనుచెప్పునది, యీ లంకాపురమునకును రాజునకును మీకందఱకును హితంబు; నామతంబుఁజెప్పెదను జనకుఁగావినుఁడు; రాజపుత్రుండగురామునకు అతనిభార్యయగు సీతాదేవినొసంగదము. అని, తాత్పర్యము.

పరస్య వీర్యం స్వబలంచ బుద్ధ్వా
స్థానం క్షయంచైవ తథైవ వృద్ధిమ్
తథా స్వపక్షే ప్యనుమృశ్య బుద్ధ్యా
వదేత్ క్షమం స్వామిహితంచ మంత్రీ. ౨౨

టీక॥మంత్రీ=మంత్రి; పరస్య=శత్రువుయొక్క; వీర్యం= పరాక్రమమును; స్వబలంచ=తనబలమును; బుద్ధ్వా= ఎఱింగి; పరస్య(అధ్యాహృతము) = శత్రువుయొక్క; స్థానం=సామ్యమును; క్షయంచైవ=నాశమును; తథైవ= అట్లె; వృద్ధిం=వృద్ధిని; తథా=అట్లు; స్వపక్షే=తనపక్షమునందును; బుద్ధ్యా= బుద్ధిచేత; అనుమృశ్య= విమర్శించి; క్షమం=యుక్తంబుగాను; స్వామిహితంచ=రాజునకు మేలుగల్గునట్లుగాను; వదేత్=చెప్పవలయును.

మంత్రియగువాఁడు, శత్రుబలంబునుతనరాజుబలంబును, తెలిసికొని, శత్రువునకుంగలిగినసామ్యంబునువృద్ధిక్షయంబులను, ఎఱింగి, యట్లు, తనరాజువృద్ధిక్షయంబులనువిమర్శించి; యుక్తంబుగానురాజునకు మేలుగల్గునట్లుగాను, చెప్పవలయును. అని, విభీషణుండు చెప్పెను- అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, చతుర్దశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండచతుర్దశసర్గటీక,
ముగిసినది.

౩౭

పంచదశసర్గ ప్రారంభః.

బృహస్పతే స్తుల్యమతే ర్వచ స్త
న్నిశమ్య యత్నేన విభీషణస్య
తతో మహాత్మా వచనం బభాషే
తత్రేంద్రజి న్నైరృతయోధముఖ్యః. ౧

టీక॥ తత్ర=అచ్చట; నైరృతయోధముఖ్యః= రాక్షసభటులలో శ్రేష్ఠుఁడును; మహాత్మా= అధికమయినబలముగలవాఁడునగు; ఇంద్రజిత్=ఇంద్రజిత్తు; బృహస్పతేః= బృహస్పతికిఁ తుల్యమతేః=సమానమయినబుద్ధిగల ; విభీషణస్య=విభీషణునియొక్క; తత్=ఆ ; వచః= మాటను; యత్నేన=ప్రయత్నముచేత; నిశమ్య=విని; తతః=అంత ; వచనం=మాటను;బభాషే=చెప్పెను.

అంతనచ్చట , రాక్షసశ్రేష్ఠుండును మహాబలుండునగునింద్రజిత్తు , బృహస్పతివలెమహాబుద్ధిశాలియగు విభీషణుండుచెప్పినమాటనువిని, తాను , నీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

కింనామ తే తాత కనిష్ఠ వాక్య
మనర్థకంచైవ సుభీతవచ్చ
అస్మిన్ కులే యోపి భవే న్న జాత
స్సోపీ దృశం నైవ వదే న్న కుర్యాత్. ౨

టీక॥కనిష్ఠ, తాత= చిన్నాయనా! తే=నీయొక్క;అనర్థకంచైవ= నిష్ప్రయోజనంబును; సుభీతవచ్చ= మిక్కిలి యుభయంబుగలదియునగు; వాక్యం= మాట; కింనామ = ఎట్టిది? యోపి= ఎవ్వండును;అస్మిన్=ఈ;కులే=వంశమునందు;జాతః=పుట్టినవాఁడు;నభవేత్=కాఁడో;సోపి= వాఁడుగూడ ; ఈదృశం=ఇట్టిమాటను; నైవవదేత్= చెప్పనేచెప్పఁడు.నకుర్యాత్=చేయఁడు.

స ౧౫

చిన్నాయనా! నీవు, మహాభయంబునొంది, యిట్టిప్రయోజనంబగు మాటం జెప్పితివే! ఇదియెట్టిమాట? ఈ పులస్త్యవంశంబునంబుట్టినవాఁడుగూడ నిట్టినీచపుమాటం జెప్పఁడు; చేయనుం జేయఁడు; నీవు, చెప్పవచ్చునా?

అని, తాత్పర్యము.

సత్త్వేన వీర్యేణ పరాక్రమేణ
శౌర్యేణ ధైర్యేణచ తేజసాచ
ఏకః కులే స్మిన్ పురుషో విముక్తో
విభీషణ స్తాత కనిష్ఠ ఏషః. ౩

టీక॥ అస్మిన్=ఈ; కులే=వంశమునందు;ఏషః=ఈ; తాతకనిష్ఠః=చిన్నాయనయగు;విభీషణః=విభీషణుఁడు; ఏకః=ఒకఁడు పురుషః=పురుషుఁడు; సత్త్వేన=బలముచేతను; వీర్యేణ=ప్రభావముచేతను; పరాక్రమేణ=శత్రువులనాక్రమించుశక్తిచేతను;శౌర్యేణ=యుద్ధంబునందుభయములేమిచేతను; ధైర్యేణచ=స్థైర్యముచేతను; తేజసాచ=ఇతరులచేఁదిరస్కరింపనలవిగామిచేతను; విముక్తః=విడువఁబడినాఁడు.

ఈవంశమునందు, మాచిన్నాయనయగు నొకఁడు విభీషణుండుమాత్రమే, బలంబును బ్రభావంబును బరాక్రమంబును శౌర్యంబును ధైర్యమును దేజంబును, లేనివాఁడై, పిఱికియయినాఁడు.

అని, తాత్పర్యము.

కిన్నామ తౌ రాక్షస రాజపుత్రౌ
వస్మాక మేకేన హి రాక్షసేన
సుప్రాకృతేనాపి రణే నిహంతుం
శక్యౌ కుతో భీషయసేస్మ భీరో. ౪

టీక॥ రాక్షస=రాక్షసుండవగు విభీషణుఁడా! కిన్నామ=ఏమి? రాజపుత్రౌ=రాచకొమరులగు రామలక్ష్మణులు;అస్మాకం=మాలో; ఏకేన=ఒకఁడ

డైన; రాక్షసేన=రాక్షసునిచేత; సుప్రాక్కృతేనాపి= మిక్కిలియునధమునిచేనైనను;రణే=యుద్ధమునందు;నిహంతుం=చంపుటకు; శక్యో= అలవియగుదురు. భీరో=పిఱికివాఁడా! కుతః=ఎందువలన; భీషయసేత్వం= భయపఱిచినావు?

రాక్షసుండవగువిభీషణుఁడా! రాచకొమరులగునారామలక్ష్మణులను, మాలోనొక్కనీచరాక్షసుండైనను, యుద్ధంబునంజంపివేయును; పిఱికివాఁడా! నీవేలయూరకభయపఱచెదవు?

అని, తాత్పర్యము.

త్రిలోకనాథో నను దేవరాజ
శ్శక్రో మయా భూమితలే నివిష్టః
భయార్దితా శ్చాపి దిశః ప్రపన్నా
స్సర్వే తథా దేవగణా స్సమగ్రాః. ౫

టీక॥నను=ఓయి! త్రిలోకనాథః=ముల్లోకంబులకునుప్రభుండును;దేవరాజః=దేవతలకుఁబ్రభుండునగు; శక్రః=ఇంద్రుఁడు; మయా=నాచేత; భూమితలే=నేలయందు;నివిష్టః=పడినాఁడు. తథా=అట్లు; సమగ్రాః=సమస్తములగు;దేవగణాశ్చాపి=దేవసమూహములును; సర్వే=అన్నియును; భయార్దితాః = భయముచేఁ బీడింపఁబడినవై;దిశః=దిక్కులను; ప్రపన్నాః=పొందినవి.

ఓయి ! ముల్లోకంబులకునునాథుండును దేవేంద్రుండునగునింద్రుని నేను, నేలంబడఁద్రోసితిని; మఱియు దేవతలనందఱు,గుంపులుగుంపులుగా,భయంబున, దిక్కులకుంబాఱునట్లుగావించినాను.

అని, తాత్పర్యము.

ఐరావతో విషాణాగ్రై రున్నదన్ స
నిపాతితో భూమితలే మయాతు
వికృష్య దంతౌ తు మయా ప్రసహ్య
విత్రాసితా దేవగణా స్సమగ్రాః. ౬

టీక ॥ విస్వరం=అధికముగా ధ్వనిగ ల్గునట్లుగా; ఉన్నదత్= అఱచుచున్న; సః=ఆ; ఐరావతః= ఐరావతము; మయా తు=నా చేతనే; భూమితలే=నేల యందు; నిపాతితః=పడఁద్రోయఁబడినది. మయా=నాచేత; ప్రసహ్య=బలాత్కారముగా; దంతౌ=దంతములను; వికృష్య=పెఱికి; సమగ్రాః=సమస్తము లయిన; దేవగణాః=దేవసమూహము లు; విత్రాసితాః=భయపడుపఁబడినవి.

నేనుమహాధ్వనితోనఱచుచు వచ్చిన యైరావతంబుఁబట్టి నేలంబడఁద్రోసినాను; మఱియు, నాయైరావతముదంతంబులఁ బలాత్కారంబుగాఁ బెఱికి, వానిచే దేవతలనందఱను భయపెఱిచి, పాఱందోలినాను. అని, తాత్పర్యము.

సో హం సురాణా మపి దర్పహంతా
దైత్యోత్తమానా మపి శోకదాతా
కథం నరేంద్రాత్మజయో ర్న శక్తో
మనుష్యయోః ప్రాకృతయో స్సువీర్యః. ౭

టీక॥సురాణామపి=దేవతలయొక్కయు; దర్పహంతా= గర్వముపోఁగొట్టువాఁడను; దైత్యోత్తమానామపి=అసురశ్రేష్ఠులకును; శోకదాతా= దుఃఖము నొసంగువాఁడను; సువీర్యః= మంచిపరాక్రమంబుగలవాఁడనగు; సః= అట్టి; అహం= నేను; మనుష్యయోః=మనుష్యులును; ప్రాకృతయోః=నీచులును; నరేంద్రాత్మజయోః=రాచబిడ్డలునగు రామలక్ష్మణులవిషయమయి; కథం=ఎట్లు; న శక్తః=సమర్థుండనుగాను?

నావలన దేవేంద్రుండు మొదలగు సమస్తదేవతలునుగర్వంబువీడిరి; నావలన, అసురోత్తములుగూడ, దుఃఖంబునొందుదురు; అట్టిపరాక్రమశాలినగు నేను, మనుష్యులు, నీచులునగు, నీరాచపిల్లకాయలజయింపసమర్థుండఁగానా? ఇది యేమిమాట? అని, యింద్రజిత్తుచెప్పెను. అని, తాత్పర్యము.

అథేం ద్రకల్పస్య దురాసదస్య
మహౌజస స్త ద్వచనం నిశమ్య
తతో మహార్థం వచనం బభాషే
విభీషణ శ్శస్త్రభృతాం వరిష్ఠః. ౮

స ౧౫




టీక॥ అథ = అంత; శస్త్రభృతాం = ఆయుధధారులలోపల; వరిష్ఠః = శ్రేష్ఠుండగు; విభీషణః = విభీషణుఁడు; ఇంద్రకల్ప స్య = ఇంద్రునితో సమానుండును; దురాసదస్య = జెనకరానివాఁడును; మహౌజసః = అధికమయినపరాక్రమంబుగలవాఁడునగునింద్రజిత్తుయొక్క; తత్ = ఆ; వచనం = మాటను; నిశమ్య = విని; తతః = అంత; మహార్థం = అధికమయినయర్థముగల; వచనం = మాటను; బభాషే = చెప్పెను.

అంత, నాయుధధారులలోనుత్తముండగువిభీషణుండు, దేవేంద్రతుల్యుండును జెనకరాని మహాపరాక్రమంబుగలవాఁడునగునయ్యింద్రజిత్తువచనంబువిని పరమార్థయుక్తంబగునీమాటం జెప్పెను. అని, తాత్పర్యము-

న తాత మంత్రే తవ నిశ్చయో స్తి
బాల స్త్వ మద్యా ప్యవిపక్వబుద్ధిః
తస్మా త్త్వయా ప్యాత్మవినాశనాయ
వచో ర్థహీనం బహు విప్రలప్తమ్. ౯

టీక॥ తాత = నాయనా! తవ = నీకు; మంత్రే = ఆలోచనమునందు; నిశ్చయః = నిశ్చయించుశక్తి; నాస్తి = లేదు. త్వం = నీవు; బాలః = పిన్నవాఁడవు. అద్యాపి = ఇప్పటికిని; అవిపక్వబుద్ధిః = పరిపక్వముకానిబుద్ధిగలవాఁడవు. తస్మాత్ = అందువలన; త్వయా = నీచేత; ఆత్మవినాశనాయ = నీవినాశముకొఱకు; అర్థహీనం = అర్థముచేవిడువఁబడిన; వచః = మాట; బహు = అధికముగా; విప్రలప్తం హి (విప్రలపితం) = ప్రేలఁబడినది.

నాయనా! నీకుమంత్రముసేయుటయందుశక్తిలేదు; నీవుపిన్నవాఁడవు; ఇంకనునీబుద్ధిపరిపక్వముకాలేదు; కావున నే, నీకే వినాశంబుగలుగునట్లు, నిరర్థకంబులగు నీమాటలనెచ్చుగాఁ బ్రేలినావు. అని, తాత్పర్యము.

పుత్రప్రవాదేనతు రావణస్య
త్వ మింద్రజి న్మిత్రముఖో సి శత్రుః




యస్యే దృశం రాఘవతో వినాశం
నిశమ్య మోహా దనుమస్యసే త్వమ్. ౧౦

టీక॥ ఇంద్రజిత్ = ఇంద్రజిత్తా! త్వం=నీవు; యస్య=ఏ రావణునకు; ఈదృశం=ఇట్టి; రాఘవతః= రామునివలన; వినాశం=చేటును; నిశమ్య=విని; మోహాత్ = అజ్ఞానమువలన; అనుమన్యసే= ఒప్పుకొనుచున్నావో; తస్య (అధ్యాహృతము)=అట్టి; రావణస్య= రావణునకు; త్వం=నీవు; పుత్రప్రవాదేన= కొడుకనుప్రసిద్ధిచేత; మిత్రముఖః= స్నేహితునిముఖంబువంటిముఖంబుగల; శత్రుస్తు= పగవాఁడవే; అసి = అగుచున్నావు.

ఇంద్రజిత్తా! ఈ రావణునకు, రామునివలనఁ; బుత్రమిత్రకళత్రాదిసహితంబుగా, వినాశంబుగల్గుటనువినియు, నీవజ్ఞానంబున, నందుకుసమ్మతించుచున్నావు; కావున, నీవు, రావణునకుఁ, బుత్రుండనుపేరుపెట్టుకొనిమిత్రుండువలెనభినయించుశత్రుండవైతివి.

అని, తాత్పర్యము.

త్వమేవ వధ్యశ్చ సుదుర్మతిశ్చ
సచాపి వధ్యో య ఇహా నయత్త్వామ్
బాలం దృఢం సాహసికంచ యో౽ద్య
ప్రావేశయ న్మంత్రకృతాం సమీపమ్. ౧౧

టీక॥ త్వమేవ=నీవే; వధ్యశ్చ=చంపఁదగినవాఁడవును; సుదుర్మతిశ్చ= మిక్కిలియుదుర్బుద్ధిగలవాఁడవును. యః= ఎవ్వఁడు; ఇహ=ఇచ్చటికి; త్వాం= నిన్ను; ఆనయత్=తోడ్కొనివచ్చెనో; యః=ఎవ్వఁడు; బాలం = పిన్నవాఁడవును; దృఢం=బలవంతుఁడవును; సాహసికంచ= సాహసంబుసేయువాఁడవునగునిన్నుఁ; అద్య=ఇప్పుడు; మంత్రకృతాం=ఆలోచనముసేయువారల యొక్క; సమీపం= సమీపమును; ప్రావేశయత్=పొందించెనో; సచాపి=అతండును; వధ్యః=చంపఁదగినవాఁడు.

ఇట్లు, పితృవినాశంబునకిష్టపడియున్నావుకావున, నీవువధ్యుండవు; దుర్బుద్ధివైతివి; మఱియు, బాలుండవుబల

స ౧౫

వంతుండవు సాహసంబు సేయుటయం దే ప్రియంబుగలవాఁడవునగునిన్ను, ఇచ్చటికిఁగొనివచ్చి, యాలోచనసభంబ్రవేశింపఁజేసినట్టివాఁడును,వధ్యుండు.

అని, తాత్పర్యము.

మూఢః ప్రగల్భో౽వినయోపపన్న
స్తీక్ష్ణస్వభావో౽ల్పమతి ర్దురాత్మా
మూర్ఖ స్త్వ మత్యంతసుదుర్మతిశ్చ
త్వ మింద్రజి ద్బాలతయా బ్రవీషి. ౧౨

టీక॥ఇంద్రజిత్=ఇంద్రజిత్తా;త్వం=నీవు;మూఢః= తెలివిలేనివాఁడవు. ప్రగల్భః=చమత్కారివి,గర్వితుండవనుట. అవినయోపపన్నః=అణకువలేనివాఁడవు.తీక్ష్ణస్వభావః=క్రూరమయినస్వభావముగలవాఁడవు.అల్పమతిః=నీచబుద్ధిగలవాఁడవు.దురాత్మా=దుష్టస్వభావముగలవాఁడవు.మూర్ఖః= ఆలోచనలేనివాఁడవు. అత్యంతసుదుర్మతిశ్చ= మిక్కిలియునధికమయినదుర్బుద్ధిగల వాఁడవును.త్వం=నీవు;బాలతయా= పిన్నవాఁడవగుటచేత; బ్రవీషి= చెప్పుచున్నావు.

ఇంద్రజిత్తా! నీవు, తెలివిలేనివాఁడవు; గర్వితుండవు; శిక్షితుండవుకావు; క్రూరంబయిన స్వభావముగల వాఁడవు; నీచబుద్ధివి; దుష్టస్వభావుండవు;ఆలోచన తెలియనివాఁడవు; మిక్కిలియు దుర్బుద్ధివి;నీవుపిన్నవాఁడవగుటచే, నేమియుఁదెలియకప్రేలెదవు.

అని, తాత్పర్యము.

కో బ్రహ్మదండప్రతిమప్రకాశా
నర్చిష్మతః కాలనికాశరూపాన్
సహేత బాణా న్యమదండకల్పా
న్సమక్షముక్తా న్యుధి రాఘవేణ. ౧౩

టీక॥ కః=ఎవ్వఁడు; బ్రహ్మదండప్రతిమప్రకాశాన్ = బ్రహ్మదండముతోఁ

బోలిక-గల కాంతిగలవియు ; అర్చిష్మ తః=జ్వాలలుగలవియు; కాలనికాశరూపాః=మృత్యువుతో సమానమయినరూపముగలవియు; యమదండకల్పాః=యమదండముతో సమానములునగు; రాఘవేణ=రామునిచేత ; సమక్షముక్తాః=సమీపమునందువిడువఁబడిన; బాణాః=బాణంబులను; యుధి= యుద్ధమునందు; సహేత=ఓర్చును?

బ్రహ్మదండమువంటివియు జ్వాలలుగలవియుమృత్యువుంబోలెఁజూపట్టునవియు యమదండసమానంబులునగు, రామునిచేఁబ్రయోగింపఁబడినబాణంబుల, యుద్ధంబున నెవ్వఁడుసహింపఁగలఁడు?

అని, తాత్పర్యము.

ధనాని రత్నాని విభూషణాని
వాసాంసి దివ్యాని మణీంశ్చ చిత్రాన్
సీతాంచ రామాయ నివేద్య దేవీం
వసేమ రాజ న్నిహ వీతశోకాః. ౧౪

టీక॥ రాజన్=రాక్షసరాజుండవగురావణుఁడా! ధనాని=ధనములను; రత్నాని=శ్రేష్ఠవస్తువులను; విభూషణాని=సొమ్ములను; దివ్యాని = శ్రేష్ఠములగు; వాసాంసి = వస్త్రములను; చిత్రాన్=నానావిధములగు; మణీంశ్చ=రత్నములను; దేవీం = రాణియగు; సీతాంచ=సీతను; రామాయ=రామునికొఱకు; నివేద్య = సమర్పించి ; ఇహ=ఇచ్చట; వీతశోకాః=విడువఁబడిన దుఃఖముగలవారలమయి; వసేమ=ఉందుదము.

రాక్షసరాజుండవగురావణుఁడా! ధనంబులనుఅమూల్యపదార్థంబులను భూషణంబులనుదివ్యవస్త్రంబులను, నానావిధరత్నంబులను, సీతాదేవితోఁగూడ, రామునకుసమర్పించి, మనమిచ్చట, నిర్భయులమై సుఖంబుగానుండుదము. అని, విభీషణుండు చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే ,
యుద్ధకాండే , పంచదశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ పంచదశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

షోడశసర్గప్రారంభః.

సునివిష్టం హితం వాక్య ముక్తవంతం విభీషణమ్
అబ్రవీ త్పరుషం వాక్యం రావణః కాలచోదితః. ౧

టీక॥ రావణః=రావణుఁడు; సునివిష్టం = చక్కఁగా మనస్సునకుఁదగులునట్లుగా; హితం=మేలుగల్గించునట్టి; వాక్యం=మాటను; ఉక్తవంతం = చెప్పినట్టి; విభీషణం=విభీషణునిగూర్చి; కాలచోదితః= మృత్యువుచేఁ బ్రేరింపఁబడినవాఁడై; పరుషం=క్రూరమగు; వాక్యం=మాటను; అబ్రవీత్ =చెప్పెను.

అట్లు, చక్కఁగా మనస్సునకు వచ్చునట్లు, హితవాక్యంబులు చెప్పినట్టివిభీషణునింజూచి, రావణుండు, అట్టిహితంబుఁజెప్పినందుకు మిక్కిలియు గౌరవింపవలసినవాఁడయ్యు, మృత్యు ప్రేరితుండై, పరుషవాక్యంబులదూషింప నారంభించెను.

అని, తాత్పర్యము.

వసే త్సహ సపత్నేన క్రుద్ధేనా శీవిషేణ వా
న తు మిత్రప్రవాదేన సంవసే చ్ఛత్రుసేవినా. ౨

టీక॥ సపత్నేనసహ=శత్రువుతోఁగూడఁగాని; క్రుద్ధేన= కోపంబు నొందిన; ఆశీవిషేణవా= సర్పముతోఁగూడఁగాని; వసేత్ =ఉండవచ్చును. మిత్రప్రవాదేన=స్నేహితుండను ప్రసిద్ధిగల; శత్రుసేవినాతు= శత్రుఁవును సేవించువానితోమాత్రము; నసంవసేత్ =వాసము సేయఁగూడదు.

సాక్షాచ్ఛత్రుపుత్రుతోఁగాని కుపితంబగు సర్పముతోఁగాని సహవాసము సేయవచ్చును, స్నేహితవేషము ధరించియుండు శత్రుపక్షపాతితో మాత్రము నెప్పుడేని సహవాసము సేయరాదు.

అని, తాత్పర్యము,

జానామి శీలం జ్ఞాతీనాం సర్వలోకేషు రాక్షస
హృష్యంతే వ్యసనేష్వేతే జ్ఞాతీనాం జ్ఞాతయ స్సదా. ౩

టీక॥ రాక్షస=రాక్షసుఁడవగు విభీషణుఁడా! సర్వలోకేషు=సమస్తజనులయందును; జ్ఞాతీనాం=దాయాదులయొక్క; శీలం=స్వభావమును; జానామి=ఎఱుంగుదును. ఏతే=ఈ; జ్ఞాతయః= దాయాదులు; సదా = ఎల్లప్పుడు; జ్ఞాతీనాం = దాయాదులయొక్క; వ్యసనేషు= దుఃఖములయందు; హృష్యంతే= సంతోషించుచున్నారు.

రాక్షసుఁడా! సమస్తజనులలోను, ఈజ్ఞాతుల స్వభావము నాకుఁదెలియును; ఈజ్ఞాతులు, తమజ్ఞాతులకుఁగష్టము వచ్చునప్పుడంతయు, సంతోషంబునొందుదురు. అని, తాత్పర్యము.

ప్రధానం సాధనం వైద్యం ధర్మశీలంచ రాక్షస
జ్ఞాతయో హ్యవమన్యంతే శూరం పరిభవంతి చ. ౪

టీక॥ రాక్షస=రాక్షసుఁడా! జ్ఞాతయః=దాయాదులు; ప్రధానం= శ్రేష్ఠుని; సాధనం=కార్యసాధకుని; వైద్యం= పండితుని; ధర్మశీలంచ=ధర్మస్వభావుని; శూరం= యుద్ధమునందుభయము లేనివానిని; అవమన్యంతేహి= అవమానింతురుగదా! పరిభవంతిచ=తిరస్కారమును జేయుదురు.

రాక్షసుఁడా! జ్ఞాతులు, తమజాతిలోఁ బ్రధానుండగువానిని, బండితుని, ధార్మికుని, శూరుని, నవమానింతురు; మఱియుఁదిరస్కరింతురు.

అని, తాత్పర్యము.

నిత్య మన్యోన్యసంహృష్టా వ్యసనే ష్వాతతాయినః

స ౧౬

ప్రచ్ఛన్నహృదయా ఘోరా జ్ఞాతయస్తు భయావహాః. ౫

టీక॥ ప్రచ్ఛన్నహృదయాః = మూయఁబడినమనస్సుగలవారలును; నిత్యం = ఎల్లప్పుడును; అన్యోన్యసంహృష్టాః = ఒండొరులపైసంతోషంబునొందినవారలును సంతోషమునొందినట్లున్నవారలు ననుట ; వ్యసనేషు = కష్టములయందు; ఆతతాయినః = ద్రోహముసేయువారలును; ఘోరాః = భయంకరులునగు; జ్ఞాతయస్తు = దాయాదులుమాత్రము; భయావహాః = భయముగల్గించువారలు.

జ్ఞాతులు, ఇతరకాలములయందు ఒకరిపైనొకరు మహాస్నేహముగలిగియున్నట్లభినయించుచు, మనస్సులోనొకటి బయిటనొకటిగామాటలాడుచు, నెప్పుడునుగీడేతలంపుచు, నాపత్సమయంబుల ద్రోహంబుగావింతురు; కావున, జ్ఞాతులవలనభయంబవశ్యముగల్గును; వారల నమ్మరాదు. అని, తాత్పర్యము.

శ్రూయంతే హస్తిభి గీతాః శ్లోకాః పద్మవనే క్వచిత్
పాశహస్తాన్నరాన్ దృష్ట్వా శృణు తాన్ గదతో మమ. ౬

టీక॥ క్వచిత్ = ఒకానొకచోట; పద్మవనే = పద్మవనమునందు; హస్తిభిః = ఏనుంగులచేత; పాశహస్తాన్ = పాశములుహస్తములందుఁగల; నరాన్ = మనుష్యులను; దృష్ట్వా = చూచి; గీతాః = పాడఁబడిన; శ్లోకాః = శ్లోకములు; శ్రూయంతే = వినఁబడుచున్నవి. గదతః = చెప్పుచున్నట్టి ; మమ = (పంచమ్యర్థమందుషష్ఠి) నావలన; తాన్ = ఆశ్లోకములను; శృణు = వినుము.

పద్మవనంబను నొకయరణ్యంబునందు, ఏనుంగులు, తమ్ముఁబట్టుటకై పాశంబులంగొనివచ్చినపురుషులంజూచి, కొన్నిశ్లోకంబులంజెప్పినవి ; వానింజెప్పెదవినుము. అని, తాత్పర్యము.

నాగ్నిర్నాన్యాని శస్త్రాణి న నః పాశా భయావహాః
ఘోరాః స్వార్థప్రయుక్తాస్తు జ్ఞాతయో నో భయావహాః. ౭

టీక॥ నః = మనకు ; అగ్నిః = నిప్పు; న (భయావహః) = భయంబుగలిగించున

దికాదు. అన్యాని=ఇతరములయిన ; శస్త్రాణి=ఆయుధములు; న (భయావహాని)=భయంబుగలిగించునవికావు. పాశాః=త్రాళ్లును; భయావహాః=భయంబుగల్గించునవి; న= కావు. ఘోరాః=భయంకరములును; స్వార్థప్రయుక్తాః=స్వకార్యమునందుఁ బ్రయోగింపఁబడినవియునగు ; జ్ఞాతయస్తు = జ్ఞాతులుమాత్రము , మనజాతివారేనుంగులుమాత్రము;నః= మనకు ; భయావహాః=భయముఁగలిగించునవి.

మనకునిప్పువలనభయములేదు ; ఇతరాయుధంబులవలనను భయంబులేదు; ఈపాశంబులవలనను మనకెంత మాత్రముభయంబులేదు; అయితే, నిర్దయములును, స్వకార్యపరములు నగు, నీపురుషులయొద్ద నుండునట్టి మనజాతివారేనుంగులే, మనకుభయంబు గలిగించునవి అని, తాత్పర్యము.

ఉపాయ మేతే వక్ష్యంతి గ్రహణే నాత్రసంశయః

టీక॥ఏతే = ఈజ్ఞాతులయిన యేనుంగులు;గ్రహణే= పట్టుకొనుటయందు;ఉపాయం=ఉపాయమును; వక్ష్యంతి=చెప్పును.అత్ర=ఇందు; సంశయః= సందేహము;న=లేదు-

ఈ మనజ్ఞాతులె,వీరికి, మనలంబట్టుటకుపాయంబులు నేర్పునవి;ఇందుసందేహములేదు. అని; తాత్పర్యము.

కృత్స్నా ద్భయాత్ జ్ఞాతిభయం సుకష్టం విదితం వచః ౮

టీక॥ కృత్స్నాత్ = సమస్తమయిన;భయాత్ = భయముకన్నను;జ్ఞాతిభయం=జ్ఞాతులవలనిభయము; సుకష్టం= మిక్కిలియుఁగష్టమయినది. వచః= ఈమాట;విదితం=తెలియఁబడినది.

అన్నిభయంబులకన్నను, ఈజ్ఞాతులభయమెమిక్కిలియుఁగష్టతరము, ఈసంగతిసుప్రసిద్ధమే.

అని, తాత్పర్యము.

విద్యతే గోషు సంపన్నం విద్యతే బ్రాహ్మణే దమః
విద్యతే స్త్రీషు చాపల్యం విద్యతే జ్ఞాతితో భయమ్. ౯

స ౧౬

టీక॥గోషు = ఆవులయందు;సంపన్నం=సంపద;విద్యతే=కలదు. బ్రాహ్మణే=బ్రాహ్మణునియందు; దమః=ఇంద్రియనిగ్రహము;విద్యతే = ఉన్నది-స్త్రీషు=స్త్రీలయందు; చాపల్యం=చాంచల్యము;విద్యతే=ఉన్నది.జ్ఞాతితః = జ్ఞాతులయందు;భయం = భయము;విద్యతే=ఉన్నది.

ఆవులయందుసంపదయున్నది;బ్రాహ్మణులందు , ఇంద్రియ నిగ్రహము కలదు ; స్త్రీలయందుఁ జాపలంబున్నది; అట్లు, జ్ఞాతులవలననవశ్యముభయంబుకలదు.ఇట్లు , ఆమేనుంగులు, శ్లోకంబులఁబఠించినవి.

అని, తాత్పర్యము.

తతో నేష్టమిదం సౌమ్య యదహం లోకసత్కృతః
ఐశ్వర్య మభిజాతశ్చ జ్ఞాతీనాం మూర్ధ్న్యవస్థితః- ౧౦

టీక॥సౌమ్య= తిన్ననివాఁడవగు విభీషణుఁడా! తతః = అందువలన; అహం=నేను; లోకసత్కృతః= జనులచేఁబూజింపఁ బడినవాఁడనై ; ఐశ్వర్యం=ఐశ్వర్యమును;అభిజాతశ్చ=పొందినవాఁడనునై; జ్ఞాతీనాం=దాయాదులయొక్క; మూర్ధ్ని = తలయందు; అవస్థితః= ఉన్నవాఁడనై ;స్థిత ఇతి (అధ్యాహృతము)యత్= ఉన్నాననునది యేదికలదో;ఇదం=ఇది;తవ(అధ్యాహృతము)=నీకు;నేష్టం=సమ్మతముకాదు-

సౌమ్యుఁడవగు విభీషణుఁడా!అట్లు నీవుజ్ఞాతివికావున, నేను, ఇట్లులోకపూజితుండనై,పరమైశ్వర్యంబునొంది,జ్ఞాతులలోముఖ్యుండనై యుండుట , నీకు సమ్మతముకాదు.అని, తాత్పర్యము.

యథా పుష్కరపర్ణేషు పతితా స్తోయబిందవః
న శ్లేష ముపగచ్ఛంతి తథాఽనార్యేషు సంగతమ్ ౧౧

టీక॥యథా=ఎట్లు;పుష్కరపర్ణేషు=తామరాకులయందు;పతితాః=పడిన;తోయబిందవః=జలబిందువులు;శ్లేషం=ఐక్యమును; నోపగచ్ఛంతి= పొందవో;తథా=అట్లు;అనార్యేషు=దుష్టులయందు;సంగతం=సంబంధము;శ్లేషం (అధ్యాహృతము) = స్నేహసంబంధమును;నోపగచ్ఛతి(అధ్యాహృతము)=

పొందదు.

తామరాకులయందుఁబడిన జలబిందువులు, ఒకటితోనొకటి చేరనట్లు, దుష్టులతో నెన్నాళ్లు సహవాసము చేసినను, స్నేహంబు కుదురదు.

అని, తాత్పర్యము.

యథా మధుకర స్తర్షా ద్రసం విందన్న విద్యతే
తథా త్వమపి తత్రైవ తథాఽ నార్యేషు సౌహృదమ్. ౧౨

టీక॥ యథా=ఎట్లు; మధుకరః=తుమ్మెద; తర్షాత్=కోర్కెవలన; రసం=తేనియను; విందన్=పొందుచు; తత్రైవ=ఆపుష్పమునందే; నవిద్యతే= ఉండదో; త్వమపి=నీవును; తథా=అట్లు. అనార్యేషు=దుష్టులయందు; సౌహృదం-స్నేహము; తథా=అట్లు.

తుమ్మెద, పుష్పంబులనుండు తేనియం ద్రావి, యంత, నాపుష్పంబునఁ, దేనియ నిచ్చినయుపకారంబుదలఁచి, నిమిషంబైన నునిలువదుగదా! అట్లు, నీవును, నావలననమస్తసుఖంబులననుభవించి, నాకీడుకోరుచున్నావు; దుష్టులతో స్నేహము సేయుటయంతయుం దుదకు, అట్లే నిష్ఫలమగును. అని, తాత్పర్యము.

యథా పూర్వం గజః స్నాత్వా గృహ్య హస్తేన వై రజః
దూషయ త్యాత్మనో దేహం తథాఽనార్యేషు సౌహృదమ్. ౧౩

టీక॥ యథా=ఎట్లు; గజః= ఏనుగు; పూర్వం=మొదట; స్నాత్వా=స్నానముచేసి; హస్తేనవై= తొండముచేతనే; రజః = దుమ్మును; గృహ్య(గృహీత్వా)=తీసికొని; ఆత్మనః = తనయొక్క; దేహం = దేహమును; దూషయతి=చెఱచుకొనునో; అనార్యేషు=దుష్టులయందు; సౌహృదం = స్నేహము; తథా=అట్లు.

ఏనుఁగు, మొదటఁజక్కఁగా స్నానముచేసి, యంతఁ, దనతుండముచేనే దుమ్ముదీసి, దేహంబంతయుఁ బోసికొనునట్లు దుష్టులు మొదట బహుస్నేహముగానుండి, పిమ్మట, దానికివిఘాతము సేయుదురు. అని, తాత్పర్యము.

యథా శరది మేఘానాం సించతా మపి గర్జతామ్

స ౧౬

నభవ త్యంబుసంక్లేద స్తథా నార్యేషు సౌహృదమ్. ౧౪

టీక॥ యథా=ఎట్లు; శరది = శరత్కాలమునందు; సించతాం=తడుపుచున్నవియు; గర్జతామపి=గర్జించుచున్నవియునగు; మేఘానాం = (పంచమ్యర్థమందుషష్ఠి) మేఘంబులవలన; అంబుసంక్లేదః=నీళ్ల తేమ; నభవతి=కాదో; అనార్యేషు = దుష్టులయందు; సౌహృదం=స్నేహము; తథా=అట్లు.

శరదృతువునందు మేఘంబువర్షంబుగురియునట్లు ఎంతగర్జించుచుండినను, నేలయందుఁదేమయయినను గలుగకుండునట్లు, దుష్టులతో నెంత స్నేహము చేసినను, వారలుపకారము సేయునట్లభినయించుటయె కాని, యెంతమాత్రము చేయరు. అని, తాత్పర్యము.

అన్య స్త్వేవంవిధం బ్రూయా ద్వాక్య మేత న్నిశాచర
అస్మిన్ ముహూర్తే నభవే త్త్వాంతు ధిక్కులపాంసనమ్. ౧౫

టీక॥ నిశాచర= రాక్షసుఁడవగు విభీషణుఁడా! అన్యస్తు= ఇతరుఁడుమాత్రము; ఏవంవిధం=ఇట్టి; ఏతత్=ఈ; వాక్యం = మాటను; బ్రూయాత్ (చేత్)=చెప్పనేని; అస్మిన్=ఈ; ముహూర్తే=క్షణమునందే; నభవేత్= ఉండఁడు, నశించుననుట. కులపాంసనం = వంశముచెఱుపునట్టి; త్వాంతు=నిన్నుఁగూర్చిమాత్రము; ధిక్=దహింపఁబడుటయగుఁగాక.

రాక్షసుఁడవగు విభీషణుఁడా! నీవు తమ్ముఁడవనిమన్నించితిని; మఱియొకఁడిట్టిపరుషవచనంబులాడునేని, యతం డక్షణంబున నె వినాశంబు నొందునట్లు గావింతు; నీవువంశంబుఁజెఱుపం బుట్టినవాఁడవు; పో! అవతల! అని, రావణుండు, విభీషణునిగూర్చి, పరుషంబులాడెను. అని, తాత్పర్యము.

ఇత్యు క్తః పరుషం వాక్యం న్యాయవాదీ విభీషణః
ఉత్పపాత గదాపాణి శ్చతుర్భి స్సహరాక్షసైః. ౧౬

టీక॥ న్యాయవాదీ= న్యాయముఁజెప్పునట్టి; విభీషణః = విభీషణుఁడు; ఇతి=

ఇట్లు; పరుషం = కఠినమయిన; వాక్యం=మాటను; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; గదాపాణిః= గదచేతంగలవాఁడై; చతుర్భిః=నలుగురగు; రాక్షసైస్సహ= రాక్షసులతోఁగూడ; ఉత్పపాత=ఎగిరెను.

న్యాయవాదియగువిభీషణుఁడు, ఇట్లుక్రమముగా రావణునిచేఁ బరుషవచనంబులనవమానితుండై, గదచేతంబూని, నల్వురి రాక్షసులతో, నాకాశంబు నకుద్గమించెను. అని, తాత్పర్యము.

అబ్రవీచ్చ తదా వాక్యం జాతక్రోధో విభీషణః
అంతరిక్షగత శ్శ్రీమా న్భ్రాతరం రాక్షసాధిపమ్. ౧౭

టీక॥ తదా=అప్పుడు; శ్రీమాన్= కాంతిమంతుండగు; విభీషణః= విభీషణుండు;అంతరిక్షగతః = అంతరిక్షము నొందినవాఁడై;జాతక్రోధః= కలిగిన కోపముఁగలవాఁడై;భ్రాతరం=అన్నయగు;రాక్షసాధిపం=రాక్షసేశ్వరుఁడగు రావణునిగూర్చి;వాక్యం=మాటను; అబ్రవీచ్చ=చెప్పెను.

అట్లు, విభీషణుండు అంతరిక్షము నొంది,ప్రతికూలంబగురావణసహవాసంబువదలుటయు ననుకూలంబగురామసమాశ్రయంబుగోరుటయునను, నీరెంటివలనంగలిగిన పరమకాంతిచే వెలుంగుచు,అన్నయగురాక్షసేశ్వరుండగురావణునింజూచి,కుపితుండై, యీమాటంజెప్పెను. అని,తాత్పర్యము.

స త్వం భ్రాతాసి మే రాజన్ బ్రూహి మాం య ద్యదిచ్ఛసి

టీక॥ రాజన్ = రాక్షసరాజా ! సః=అట్టి; త్వం=నీవు; మే = నాయొక్క;భ్రాతా=అన్నవు;అసి= అగుచున్నావు. యత్,యత్=దేనిదేని; ఇచ్ఛసి=కోరుచున్నావో; మాం = నన్నుఁగూర్చి; తత్(అధ్యాహృతము)=దానిని; బ్రూహి=చెప్పుము.

రాక్షసరాజుండవగురావణుఁడా! నీవునాకుజ్యేష్ఠభ్రాతవు; కావున, నీకేమిచెప్పవలెనని యున్నదో , ఆమాటలన్నియుఁ జెప్పుము; నేనుబదులాడఁగూడదు. అని,తాత్పర్యము.

స ౧౬

జ్యేష్ఠో మాన్యః పితృసమో నచ ధర్మపథే స్థితః. ౧౮
ఇదం తు పరుషం వాక్యం న క్షమా మ్యనృతం తవ

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; జ్యేష్ఠః=అన్నవు. మాన్యః=పూజ్యుండవు; పితృసమః=తండ్రితోసమానుండవు. ధర్మపథే= ధర్మమార్గమునందు; స్థితశ్చ= ఉన్నవాఁడవు మాత్రము; న= కావు. తవ=నీయొక్క; అనృతం= అసత్యమయిన; ఇదం=ఈ; పరుషం= కఠినమయిన; వాక్యంతు = మాటనుమాత్రము; నక్షమామి=ఓర్వను.

నీవు, నాకు జ్యేష్ఠభ్రాతవు, తండ్రివలెఁ బూజనీయుండవు; అయితే, ధర్మమార్గంబువదలినావు; మఱియు, నామీఁద, నసత్యముగా దోషంబు మోపి, పరుషవచనంబుల దూషించినావు; దీనిని మాత్రముసహింపను.

అని, తాత్పర్యము.

సునీతం హితకామేన వాక్య ముక్తం దశానన. ౧౯
న గృహ్ణం త్యకృతాత్మానః కాలస్య వశ మాగతాః

టీక॥దశానన=రావణుఁడా! హితకామేన=మేలుగోరునట్టి; మయా= నాచేత; సునీతం=చక్కఁగానిశ్చయింపఁబడిన; వాక్యం=మాట; ఉక్తం= చెప్పఁబడినది. అకృతాత్మానః= చేయఁబడనిబుద్ధిగలవారలు, శిక్షింపఁబడనిబుద్ధిగలవారలనుట; కాలస్య=మృత్యువుయొక్క; వశం=అధీనతను; ఆగతాః=పొందినవారలయి; నగృహ్ణంతి=గ్రహింపరు.

రావణుఁడా! నేను, నీమేలుగోరి, చక్కఁగానిశ్చయించి, నీకుహితకరంబగు మాటం జెప్పితిని; అయితే, బుద్ధిహీనులు, మృత్యువశంగతులయి, హితోపదేశంబు, వినరు. అని, తాత్పర్యము.

సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః. ౨౦
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః

టీక॥ రాజన్= రాక్షసరాజుండవగు రావణుఁడా! ప్రియవాదినః=సంతోషకరంబులగుమాటలం జెప్పునట్టి; పురుషాః=పురుషులు; సతతం=ఎల్లప్పుడు

ను; సులభాః=సులభులు. అప్రియస్య = అనిష్టంబగు; పథ్యస్యచ= హితముయొక్క మాత్రము; వక్తా=చెప్పువాఁడును; శ్రోతాచ=వినువాఁడును; దుర్లభః= పొందనలవిగానివాఁడు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఎట్లయినను సంతోషంబుగల్గించు మాటలు చెప్పువారలును, వినువారలును, ఎల్లప్పుడును, గాఁవలసినంతమంది దొరకుదురు; అప్రియంబులగు, హితవచనంబులు చెప్పువాఁడును, జెప్పిన, వినువాఁడును, ఒక్కఁడైనను, దొరకఁడు.

అని, తాత్పర్యము.

బద్ధం కాలస్య పాశేన సర్వభూతాపహారిణా. ౨౧
న నశ్యంత ముపేక్షేయం ప్రదీప్తం శరణం యథా

టీక॥ సర్వభూతాపహారిణా= సమస్తప్రాణులను సంహరించునట్టి; కాలస్య = మృత్యువుయొక్క; పాశేన= త్రాటిచేత; బద్ధం=కట్టఁబడినవాఁడవు; నశ్యంతం=నశించుచున్నవాఁడవగు; త్వాం(అధ్యాహృతము)=నిన్ను; ప్రదీప్తం= మండుచున్న; శరణంయథా= గృహంబునువలె; నోపేక్షేయం (నోపేక్షేయ)- ఉపేక్షింపను.

సమస్తప్రాణిసంహారకారణంబగు మృత్యుపాశంబున బద్ధుండవై నాశంబునొందుచున్న నిన్ను మండుచున్న గృహముం బోలెఁ, జూచి, యూరకుండంజాలక, యింత దూరము చెప్పితిని. అని, తాత్పర్యము.

దీప్తపావకసంకాశైః శితైః కాంచనభూషణైః. ౨౨
న త్వా మిచ్ఛా మ్యహం ద్రష్టుం రామేణ నిహతం శరైః

టీక॥ అహం= నేను; రామేణ=రామునిచేత; దీప్తపావకసంకాశైః=మండిననిప్పుతో సమానములును; శితైః=తీక్ష్ణములును; కాంచనభూషణైః= బంగారు అలంకారముగాఁ గలవియునగు; శరైః=బాణములచేత; నిహతం=కొట్టబడిన; త్వాం=నిన్ను; ద్రష్టుం=చూచుటకు; నేచ్ఛామి=కోరను.

రాముండు, నిన్ను, మండుచున్న నిప్పువలె వెలుంగుచున్నవియుఁ దీక్ష్ణంబులు

నుగాంచనాలంకృతంబులునగు బాణం బులంగొట్టుచుండఁగాఁ, జూడ, నాకి ష్టము లేదు. అని, తాత్పర్యము.

శూరాశ్చ బలవంతశ్చ కృతాస్త్రాశ్చ రణాజిరే. ౨౩
కాలాభిపన్నా స్సీదంతి యథా వాలుకసేతవః

టీక॥ రణాజిరే=యుద్ధభూమియందు; శూరాశ్చ=యుద్ధమునందు భయము లేనివారలును ; బలవంతశ్చ=అధికమయి నబలముగలవారలును;కృతాస్త్రాశ్చ = నేర్వఁబడిన యస్త్రములు గలవారలును; కాలాభిన్నాః = మృత్యువుచేఁగ్రహింపఁబడినవారలై; వాలుకసేతవో యథా=ఇసుకనీటికట్టలువలె;సీదంతి= నశింతురు.

యుద్ధంబున శూరులును బలవంతులును అస్త్రవేత్తలునగువారలందఱు,మృత్యుగ్రస్తులయినపుడు,ఇసుకచేఁజేసిననీటి కట్టలువలె నిమిషంబున మడిసిపోవుదురు. అని, తాత్పర్యము.

త న్మర్షయతు యచ్చోక్తం గురుత్వా ద్ధిత మిచ్ఛతా. ౨౪

టీక॥ గురుత్వాత్= అన్నవగుటవలన;హితం=మేలును;ఇచ్ఛతా= కోరునట్టి;మయా=(అధ్యాహృతము)= నాచేత; యచ్చ=ఏదియు;ఉక్తం=చెప్పఁబడినదో; తత్=దాని; భవాన్ (అధ్యాహృతము)=నీవు;మర్షయతు=క్షమింపవలయును,

అన్నవగుటవలన,నీహితంబుఁగోరి నేనేమోచెప్పినాను;అందుకునీవుక్షమింపవలయును. అని, తాత్పర్యము.

ఆత్మానం సర్వథా రక్ష పురీం చే మాం స రాక్షసామ్

టీక॥ఆత్మానం=నిన్ను;సర్వథా=అన్నివిధంబులను;ఇమాం=ఈ; సరాక్షసాం=రాక్షసులతోఁగూడిన;పురీంచ= లంకాపట్టణంబును; రక్ష= కాపాడుకొనుము.

అన్నివిధంబులను,నిన్నునీవురక్షించుకొనుము;ఈరాక్షసులను ఈలంకాపట్టణంబునుంగూడరక్షించుకొనుము.

అని, తాత్పర్యము.

స్వస్తి తేస్తు గమిష్యామి సుఖీ భవ మయావినా. ౨౫

టీక॥ తే= నీకు; స్వస్తి=మంగళము; అస్తు=కలుగుఁగాక. గమిష్యామి= పోయెదను. మయావినా=నన్నువిడిచి; సుఖీ=సుఖంబుగలవాఁడవు; భవ=అగుము

నీకుమంగళంబుగలుగుఁగాక; నేను బోయెదను; నేనుబోయినపిమ్మట, నేనులేనుగదా! ఇంకనీవుసుఖంబుగ నుండుము. అని, తాత్పర్యము.

నివార్య్యమాణస్య మయా హితైషిణా
న రోచతే తే వచనం నిశాచర
పరేతకల్పాహి గతాయుషో నరా
హితం న గృహ్ణంతి సుహృద్భి రీరితమ్. ౨౬

టీక॥ నిశాచర= రాక్షసుండవగు రావణుఁడా! హితైషిణా=మేలుగోరునట్టి; మయా= నాచేత; నివార్య్యమాణస్య= నివారింపఁబడుచున్నట్టి; తే= నీకు; వచనం=మాట; నరోచతే= రుచింపకున్నది- గతాయుషః=పోయినయాయుస్సుగల; నరాః=మనుష్యులు; పరేతకల్పాహి= చచ్చినవారలతో సమానులుగదా! సుహృద్భిః=స్నేహితులచేత; ఈరితం=చెప్పఁబడిన; హితం= మేలుగలిగించునట్టిమాటను; నగృహ్ణంతి = గ్రహింపరు-

రాక్షసుఁడవగు రావణుఁడా! నేను నీహితముఁగోరియెంతచెప్పినను, నామాటయందు, నీకురుచిపుట్టకున్నది; ఆయుస్సుగడచినవారలు, చచ్చినట్టిగదా! స్నేహితులుచెప్పహితోక్తులను వారలువినరు. అనివిభీషణుండు, రావణునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, షోడశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రా
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండషోః
ముగిసినది.

శ్రీ

## సప్తదశసర్గప్రారంభః.

ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణం రావణానుజః
అజగామ ముహూర్తేన యత్ర రామస్సలక్ష్మణః. ౧

టీక॥ రావణానుజః = రావణునితమ్ముండగువిభీషణుఁడు; రావణం= రావణునిగూర్చి; ఇతి=ఇట్లు; పరుషం = కఠినమయిన; వాక్యం=మాటను; ఉక్త్వా=చెప్పి; యత్ర= ఎచ్చట; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడిన; రామః= రాముఁడు; స్థితః(అధ్యాహృతము)= ఉన్నాఁడో; తత్ర(అధ్యాహృతము)= అచ్చటికి; ముహూర్తేన=స్వల్పకాలముచేత; ఆజగామ=వచ్చెను.

రావణునితమ్ముండగువిభీషణుండు, రావణునింజూచి, యిట్లుపరుషవచనంబులాడి, యంత, ముహూర్తంబున, లక్ష్మణసహితుండగు రాముండున్న ప్రదేశంబునకువచ్చెను.

అని, నా ... క్యము.

వి.— రావణానుజః

విభీషణుండు; చి

..., జెప్పవలసి

...ని సూచిం

=పరుషవచ

నమును; మలయానిలాదులు, ప్రియురాండ్రతోఁగూడినవారలకుఁబ్రియకరములైనను, విరహిజనులకుదుఃఖకరంబులగునట్లు, విభీషణునిమాట, హితంబుకావున సంతోషకరంబుగావలసినదయ్యు, రావణుండుదుష్టుండగుటచే, నతనికిఁబరుషంబుగానేయుండినది. ఉక్త్వా=చెప్పి; "రామునకుసీతాదేవినొసంగుము" అని కర్తవ్యాంశమును, "రాముండు, కఱకుబాణంబులచే రాక్షసులశిరస్సులఖండించుటకుమున్నెయిమ్ము" అని, చేయకున్నఁగల్గుప్రత్యవాయంబును, నిశ్శేషంబుగా, హితంబుగాను, అది, నిష్ఫలంబగుటవలనఁ, బరుషంబుగాను, ఎంతవఱకుఁజెప్పినచోఁదమ్ముండుఅంతయుఁజెలిసియుఅన్నయాపదనొందుచుండఁగాఁజూచుచునూరకుండెననునపకీర్తి, తనకుఁబొసఁగకుండునో, అంతవఱకును జెప్పి; యత్ర=ఎచ్చట, ఇందుచే, "రాముండుండుటచేనాప్రదేశంబునుఖరమప్రాప్యం" బనిసూచింపఁబడినది- సలక్ష్మణః=లక్ష్మ

ణునితోఁగూడిన; ఇందు చేఁబరువ కార సాన్నిధ్యంబు దెలుపఁబడినది- రామః= రాముండు; తత్ర=అచ్చటికి; ఆజగామ= వచ్చెను-విభీషణునకు, రావణగృహంబె పరకీయగృహము; రామగోష్ఠియె స్వగృహంబుగావునఁ, బోయెనని చెప్పక వచ్చెనని చెప్పఁబడినది-ముహూర్తేన(ఆజగామ)=శీఘ్రమునవచ్చెను. అనుటచే, "వరంహుతవహజ్వాలా పంజరాంత ర్వ్యవస్థితిః, నశౌరిచింతావిముఖజన సంవాసవైశసం" (అగ్నిజ్వాలలనుపంజరంబునడుమనుండుటయెమంచిది; విష్ణుధ్యానపరాఙ్ముఖులగువారితో నుండుటమాత్రముబహుకష్టము) అనున్యాయంబుననుసరించి, నిష్పాపయింబోలె రావణునింటనిమిషంబైననునిలువంజాలక; దూడనువిడిచినంతనె, యది తల్లిస్తనంబులందాఁకుటమున్నెచ్చట నేనినిమిషంబైనజాగుసేయనట్లు, అతిశీఘ్రంబున, విభీషణుండు, రామునొద్దకుఁబోయెను- అనిసూచింపఁబడినది- ఈశ్లోకముచే, భగవద్భక్తిలేనివానిదేశంబునువిడువవలయుననియు; భగవత్సంబంధిదేశంబెపరమప్రాప్యంబనియు; (లక్ష్మణసాన్నిధ్యంబునుజెప్పఁబడుటచే) భాగవతాభిమానంబుగలదేశంబునందెయుండవలయుననియునూచింపఁబడినది-

తం మేరుశిఖరాకారం దీప్తా మివ శతహ్రదామ్
గగనస్థం మహీస్థాస్తే దదృశు స్సర్వవానరాః. ౨

టీక॥మహీస్థాః = భూమియందున్న; తే=ఆ; సర్వవానరాః= సమస్తవానరులును; గగనస్థం=ఆకాశంబుననున్న వాఁడును; మేరుశిఖరాకారం= మేరుశిఖరముయొక్క-యాకారమువంటి యాకారముగలవాఁడును; దీప్తాం=ప్రకాశించున్న; శతహ్రదామివ(స్థితం)=మేరువువలెనున్నవాఁడునగు; తం=అట్టివిభీషణుని; దదృశుః=చూచిరి.

అంత, నట్లు, అనలంబుననుండిచల్లనిసరస్సులోఁబడుటకుం బోలె నతిత్వరతో వచ్చుచున్న వాఁడును, ఔన్నత్యంబునను బలువువలనను రత్నఖచిత కాంచనాభరణంబులచేతను మేరుశిఖరంబుపగిదినున్నవాఁడును, ప్రతిపక్షులనుబరిత్యజించిస్వపక్షంబునొందుటచే, మేరుశిఖరంబునకుంబోలె స్థైర్యంబునొందిన వాఁడును అతిప్రకాశంబులోనాకాశంబునందుసంచరించుటవలనను, "రామభక్తులగువానరులునన్ను రామునొద్దకుఁ

బోనిత్తురో పోనివ్వరో, బోనివ్వకున్నచో నేనెటుజీవింతును" అను భయంబునవ ణఁకుటవలనను, మెఱపుంబోలె నున్న వాఁడునగు నాకాశగతుండైన విభీషణుని, నేలనున్నవానరులందఱుం, జూచిరి.

అని, తాత్పర్యము.

త మాత్మపంచమం దృష్ట్వా సుగ్రీవో వానరాధిపః
వానరై స్సహ దుర్ధర్ష శ్చింతయామాస బుద్ధిమాన్. ३

టీక॥ బుద్ధిమాన్ = అధికమయినబుద్ధిగలవాఁడును; దుర్ధర్షః = ఎదిరింపనలవిగానివాఁడును; వానరాధిపః = వానరేశ్వరుండునగు; సుగ్రీవః = సుగ్రీవుండు; ఆత్మపంచమం = తనచేనైదవవాఁడగు; తం = ఆవిభీషణుని; దృష్ట్వా = చూచి; వానరై స్సహ = వానరులతోఁగూడ; చింతయామాస = ఆలోచించెను.

దుర్ధర్షుండగు వానరేశ్వరుండు సుగ్రీవుండు, అట్లు, అనలశరభసంపాతిప్రఘసులనునల్వురరాక్షసులంగూడి, యతిత్వరతో నాకాశంబునవచ్చుచున్న విభీషణుంజూచి, బుద్ధిమంతుండుగావున, ఇతండు, మనరహస్యంబులనెఱుంగుటకువచ్చువాఁడో, లేక, మనలంబ్రహరింపవచ్చువాఁడోయని, వానరులతోఁగూడ, నాలోచించెను.

అని, తాత్పర్యము.

చింతయిత్వా ముహూర్తంతు వానరాం స్తానువాచ హ
హనుమత్ప్రముఖాన్ సర్వా నిదం వచన ముత్తమమ్. ४

టీక॥ సః(అధ్యాహృతము) = ఆసుగ్రీవుండు; ముహూర్తం = కొంచెముసేపు; చింతయిత్వాతు = ఆలోచించినంతనె; హనుమత్ప్రముఖాన్ = హనుమంతుండుమొదలుగాఁగల; తాన్ = ఆ; వానరాన్ = వానరులను; సర్వాన్ = అందఱినుగూర్చి; ఉత్తమం = శ్రేష్ఠమయిన; ఇదం = ఈ; వచనం = మాటను; ఉవాచ = చెప్పెను. ("హ" అనునదిపాదపూరణార్థము)

అట్లు సుగ్రీవుండు, ఎచ్చుగానాలోచించుట కవకాశము లేకుండుటవలనఁ గొంచెముసేపు, ఆలోచించి, హనుమంతుండుమున్నుగాఁగల వానరులనం

దళంబూచి యుత్తమంబగునీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

ఏష సర్వాయుధోపేత శ్చతుర్భి స్సహ రాక్షసైః
రాక్షసో భ్యేతి పశ్యధ్వ మస్మాన్ హంతుం నసంశయః. ౫

టీక॥ఏషః=ఈ; రాక్షసః=రాక్షసుఁడు; సర్వాయుధోపేతః= సమస్తాయుధములతోఁగూడినవాఁడై; చతుర్భిః=నలుగురయిన; రాక్షసైస్సహ=రాక్షసులతోఁగూడ; అస్మాన్ = మనలను; హంతుం=చంపుటకు; అభ్యేతి=వచ్చుచున్నాఁడు. పశ్యధ్వం(పశ్యత)=చూడుఁడు.

ఈరాక్షసుండు, నల్వురురాక్షసులంగూడి, సమస్తాయుధంబులు ధరించి,మనలంజంపుటకై, వచ్చుచున్నాఁడు,చూడుఁడు. అని,సుగ్రీవుండు, వానరులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

సుగ్రీవస్య వచ శ్శ్రుత్వా సర్వే తే వానరోత్తమాః
సాలా నుద్యమ్య శైలాంశ్చ ఇదం వచన మబ్రువన్. ౬

టీక॥ తే=ఆ;వానరోత్తమాః= వానరశ్రేష్ఠులు; సర్వే=అందఱును; సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క; వచః= మాటను; శ్రుత్వా=విని; సాలాన్=వృక్షములను; శైలాంశ్చ=పర్వతములను ; ఉద్యమ్య=ఎత్తికొని; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రువన్=చెప్పిరి.

ఆవానరశ్రేష్ఠులందఱు, సుగ్రీవుండు చెప్పినమాటనువిని , వృక్షంబులనుబర్వతంబులనుజేకొని, యీమాటంజెప్పిరి.

అని, తాత్పర్యము.

శీఘ్రం వ్యాదిశ నో రాజన్ వధాయైషాం దురాత్మనామ్
నిపతంతు హతా శ్చైతే ధరణ్యా మల్పతేజసః. ౭

టీక॥రాజన్= వానరరాజుండవగు సుగ్రీవుఁడా! ఏషాం = ఈ;దురాత్మనాం=దుష్టాత్ములయొక్క; వధాయ= చంపుటకొఱకు;నః=మమ్ము; శీఘ్రం=శీఘ్రముగా;వ్యాదిశ=ఆజ్ఞాపింపుము. అల్పతేజసః=కొంచెమయిన తేజస్సుగల; ఏతే=వీరలు;హతాశ్చ = చంపఁబడినవారలునై;నిపతంతు=పడుదురుగాక.

వానరరాజుండవగుసుగ్రీవుఁడా! ఈ దురాత్ములంజంప , మమ్మాజ్ఞాపింపుము; వీరలల్ప తేజస్కులు, మాకెంతమాత్రము? మేమువీరలంజంపి నేలంబడవైచెదము. అని, వానరోత్తములు, సుగ్రీవునితోఁజెప్పిరి. అని, తాత్పర్యము-

తేషాం సంభాషమాణానా మన్యోన్యం స విభీషణః
ఉత్తరం తీర మాసాద్య ఖస్థ ఏవ వ్యతిష్ఠత. ౮

టీక॥ తేషాం=ఆవానరులు; అన్యోన్యం=ఒండొరులనుగూర్చి; సంభాషమాణానాం= మాటలాడు చుండఁగానే; సః=ఆ; విభీషణః=విభీషణుఁడు; ఉత్తరం=ఉత్తరదిక్కునందలి; తీరం= గట్టును; ఆసాద్య=పొంది; ఖస్థఏవ= ఆకాశమునందున్నవాఁడై యె; వ్యతిష్ఠత=ఉండెను.

అట్లు, ఆవానరులు, పరస్పరముమాటలాడుచుండఁగానే, యవ్విభీషణుండు సముద్రోత్తరతీరంబుఁజేరి, యాకాశంబుననిలిచియుండెను.

అని, తాత్పర్యము-

విశేషార్థము.— తేషాం, సంభాషమాణానాం = అనాదరమునందుషష్ఠి. ఆవానరులట్లుమాటలాడు కొనుచుండినను, విభీషణుండు, వీరలేమిచెప్పుకొన్నను జెప్పుకొందురుగాక; రాముండు. సర్వజ్ఞుండు; పరమకారుణికుండు; సర్వలోకశరణ్యుండు ; శరణాగతుండనగునన్ను రక్షింపకమానఁడు " అని, దృఢవిశ్వాసంబునంజేసి, యావానరులమాటల సరకు సేయక , వారలుతన్నుఁబ్రహరింపంబ్రయత్నించుచుండినను, వారలకభిముఖముగాఁ బోయినిర్భయముగా, నందఱకునుదానగపడునట్లు , ఆకాశంబుననెదృఢంబుగా నిలిచియుండెను.

ఉవాచచ మహాప్రాజ్ఞ స్స్వరేణ మహతా మహాన్
సుగ్రీవం తాంశ్చ సంప్రేక్ష్య సర్వా న్వానరయూథపాన్. ౯

టీక॥ మహాప్రాజ్ఞః= మహాపండితుండును; మహాన్= పూజ్యుండునగు విభీషణుండు ; సుగ్రీవం = సుగ్రీవుని; తాన్=ఆ; వానరయూథపాన్= వానరశ్రేష్ఠులను; సర్వాంశ్చ= అందఱను; సంప్రేక్ష్య=చూచి; మహతా= అధిక

మయిన; స్వరేణ — ధ్వనిచేత; ఉవాచచ — చెప్పెను.

అట్లు, రామశరణాగతినొందఁదగిన ట్టిమహాభాగ్యశాలియగు నావిభీషణుండు,మహాపండితుండుకావున, "రాజుద యాళుండైనను,అతనికంతరంగభూతులగుపురుషులద్వారముననె, యతనికరుణఁబొందవలయును;మఱియు,నీవానరులకు,నన్నుఁగొట్టవలెననుబుద్ధి, నాయందలిద్వేషముచేఁగల్గినదికాదు; వీరలు, రామునందలిభక్తిచే, నాయందుసంశయమునొంది,యిట్లుచేయఁదలంచెదరు; ఇదియునొక్కగుణమె; మఱియు రామభక్తులగువీరలు,నన్నంగీకరింపరేని, రాముండుమాత్రమంగీకరించుటచేనాకేమి గలదు? రామాంగీకారముగల్గినను, రామభక్తాంగీకారముముఖ్యముగాఁగావలసినది;"కాఁబట్టి;వీరలమూలముననె రాముంబొందెదను." అని, యిట్లుధర్మసూక్ష్మానుసారంబునవిశ్చయించి, పరమప్రాప్యుండగు రామునకును, పురుషకారభూతులగువానరులకును, అందఱకును,దనయాతనాస్వరంబువినునట్లు, పేరెలుంగున,సుగ్రీవాదివానరోత్తములంజూచి,చెప్పెను.అని, తాత్పర్యము.

రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః
తస్యాహ మనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః. ౧౧

టీక॥ దుర్వృత్తః= దుష్టమయినయాచారముగల; రావణోనామ= రావణుండను పేరుగల; రాక్షసేశ్వరః— రాక్షసులకుఁబ్రభువైన; రాక్షసః= రాక్షసుఁడు;అస్తి (అధ్యాహృతము)=కలఁడు. అహం— నేను; తస్య= ఆరావణునియొక్క; అనుజః= వెనుకఁబుట్టిన; భ్రాతా= తోఁబుట్టువును; విభీషణఇతి= విభీషణుఁడని;శ్రుతః=వినఁబడినవాఁడను.

దురాచారుండును, రాక్షసాధీశ్వరుండునగురావణుండను రాక్షసుండొకఁడు కలఁడు; నేనతనితమ్ముండనునాపేరువిభీషణుఁడు. అని,తాత్పర్యము.

విశేషార్థము.— అందు మొదలఁ, దనయందలి దోషంబులంజెప్పుచున్నాఁడు. రావణోనామ= రావయతీతి రావణః, లోకంబుల నన్నిటినిఏడ్పించువాఁడు. పేరుచేత నేయతిక్రూరుండనుట;దుర్వృత్తః=దుష్టాచారుండు; పేరుమాత్రమేకాదు; వ్యాపారమును అతి




క్రూరము-రాక్షసః=రాక్షసుఁడు-జాతియునట్టివ్యాపారమునకుఁ దగినక్రూరజాతియేయనుట- రాక్షసేశ్వరః=రాక్షసులకుబ్రభుఁడు, దుష్టకార్యంబులు సేయువాఁడు తానుమాత్రమేకాదు, మఱియు నట్టి దుష్టులగు వారలకనేకులకుఁ బ్రభుండు. రావణుండుదుష్టుండైన నీకేమి వచ్చె నని నంజెప్పుచున్నాఁడు.— అహం, తస్య,అనుజః,భ్రాతా=నేనతనితమ్ముండను,అతనికిఁ బెద్దవాఁడనై పుట్టియుండుదునేని, కుబేరుండువలెనతనిదోషంబులసంబంధింపక, శుద్ధుండనయ్యేయుండుదును ; తమ్ముండనగుటచే,నతనియాజ్ఞకులోఁబడిన వాఁడనగుటంజేసి,యతండాజ్ఞాపించినదుష్టకార్యంబులనేకంబులంగావించి, నేనును దుష్టుండనై తిననుట.ఇందుచే,శరణాగత్యంగంబగు, గర్వహాని రూపమయిన కార్పణ్యముచెల్పఁబడినది.

తేన సీతా జనస్థానా ద్ధృతా హత్వా జటాయుషమ్
రుద్ధాచ వివశా దీనా రాక్షసీభి స్సురక్షితా. ౧౧

టీక॥ తేన=ఆరావణునిచేత; జటాయుషం = జటాయువును; హత్వా=చంపి; సీతా = సీతాదేవి ; జనస్థానాత్=జనస్థానమునుండి; హృతా=అపహరింపఁబడినది. వివశా= పరవశయు; దీనా=దుఃఖితయునగుసీత; రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత; సురక్షితా=చక్కఁగారక్షింపఁబడినదై ; రుద్ధాచ=నిరోధింపఁబడినదియు.

మఱియునారావణుండు,జటాయువునుజంపి,జనస్థానంబుననుండి,సీతంగొనివచ్చెను;అంతఁబరమదుఃఖిత యయి పరవశయయియున్న యాసీతను, రాక్షసస్త్రీలం గావలియుంచి , నిర్బంధంబుననుంచియున్నాఁడు; అట్లుఅతండు_రామునకుఁ జాలనపకారంబు గావించియున్నాఁడు ; అతనిసంబంధముచే నాకును,ఆదోషముతగిలియున్నది.

అని, తాత్పర్యము.

త మహం హేతుభి ర్వాక్యై ర్వివిధై శ్చ న్యదర్శయమ్
సాతు నిర్యాత్యతాం సీతా రామాయేతి పునఃపునః. ౧౨




టీక॥అహం=నేను; తం=ఆరావణునిగూర్చి; "సా=ఆ;సీతాతు= సీతమాత్రము ; రామాయ = రామునికొఱకు ; నిర్యాత్యతాం = ఇవ్వఁబడుగాక" ఇతి=అని; పునఃపునః=మాటిమాటికి;హేతుభిః=కారణములతోఁగూడిన; వివిధైః= నానావిధములయిన; వాక్యైః=మాటలచేత ; న్యదర్శయం=బోధించితిని.

నేనారావణునకు , "సీతనురామునకొసంగు"మని,యుక్తియుక్తంబులగు వాక్యంబులచేఁ బెక్కుమాఱులు , బోధించితిని. అని,తాత్పర్యము-

విశేషార్థము.—— ఇందువలన,భగవదనుకూల కార్యసంకల్పమను శరణాగత్యంగముదెల్పఁబడినది-

సచ న ప్రతిజగ్రాహ రావణః కాలచోదితః
ఉచ్యమానం హితం వాక్యం విపరీత ఇవౌషధమ్. ౧౩

టీక॥సః=ఆ;రావణశ్చ=రావణుఁడును;కాలచోదితః= మృత్యువుచేఁబ్రేరింపఁబడినవాఁడై;ఉచ్యమానం = చెప్పఁబడుచున్న;హితం=మేలుగలిగించునట్టి;వాక్యం=మాటను; విపరీతః=చావఁబోవువాఁడు; ఔషధమివ=మందునువలె; నప్రతిజగ్రాహ = స్వీకరింపఁడయ్యె.

ముమూర్షుండు,ఔషధమునుదీసికొననట్లుఆరావణుండు, మృత్యుపరవశుండై,నేనుజెప్పుహితవచనంబులనువినఁడయ్యె. అని,తాత్పర్యము.

సోహం పరుషిత స్తేన దాసవ చ్చావమానితః
త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః. ౧౪

టీక॥ సః=అట్టి; అహం=నేను; తేన=ఆరావణునిచేత; పరుషితః=పరుషముగాఁబలుకఁబడినవాఁడనై; దాసవత్=దాసుండువలె;అవమానితశ్చ=అవమానింపఁబడినవాఁడనై; పుత్రాంశ్చ=కొడుకులను; దారాంశ్చ=భార్యను; త్యక్త్వా=విడిచి; రాఘవం = రాముని; శరణం= రక్షకునిఁగా; గతః = పొందినాను.

అట్లునేనుజెప్పినహితవాక్యంబువినకుండుటయేగాకయారావణుండు, నన్నుఁబరుషవచనంబులదూషించి,దానునట్లు

అవమానించెను; కావున నేను బ్రయోజనాంతరవిముఖుండనై పరమపురుషార్థంబగు రామాశ్రయంబు నొందంగోరి, భార్యాపుత్రులంగూడఁబరిత్యజించి, రాముని, శరణుచొచ్చితిని.

అని- తాత్పర్యము.

విశేషార్థము.—"భార్యాపుత్రులనువిడిచి" అనుటచే, ప్రాతికూల్య వర్జనంబనునంగముసూచింపఁ బడినది- "రామునిశరణుచొచ్చినాను" అనుటచే, ఆత్మనిక్షేపంబనునంగంబు చెప్పఁబడినది.

సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే
నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్. ౧౫

టీక॥ సర్వలోకశరణ్యాయ= సమస్తలోకంబులకును రక్షకుండు గాఁదగినవాఁడును; మహాత్మనే= అధికమయినశక్తిగలవాఁడును; రాఘవాయ=రఘువంశమునందుఁబుట్టినవాఁడునగు రామునికొఱకు; విభీషణం=విభీషణుని; మాం= నన్ను; ఉపస్థితం=వచ్చినవానిఁగా; క్షిప్రం=శీఘ్రముగా; నివేదయత= తెలుపుఁడు.

సమస్త లోకశరణ్యుండును మహాత్ముండును రఘువంశంబునభక్తానుగ్రహార్థమయియవతరించియున్న వాఁడునగు రామునకు, విభీషణుండను నేను వచ్చియున్నానని, శీఘ్రముగాఁదెలుపుఁడు-అని, విభీషణుండు, సుగ్రీవాదులతోఁ జెప్పెను-

అని, తాత్పర్యము-

విశేషార్థము—— సర్వలోకశరణ్యాయ= సమస్తజాతులందుఁబుట్టినవారలకును దుష్టులకును గుణవంతులకును, అట్లు భేదము లేక, సురనరతిర్యగాది సమస్త ప్రపంచమునకు రక్షకుండైన వాఁడు, రాముండు. కావున, నతిదుష్టుండగు రావణునకును, ఇందుభాగంబున్నది; అయితే, యతనికిదీనియందుఁ బ్రారబ్ధవశంబునరుచిగలుగలేదు; నేను, వచ్చినాను కావున, నాకుమీకుంబోలె భాగంబు సిద్ధంబై యున్నదనుట. అవును. అట్టిది సులభమా? దుర్లభమా? లోష్ఠాదు లతిసులభంబులయినను, నిష్ప్రయోజనంబులు, మేరుపర్వతాదులుఉత్కృష్టంబులయ్యు దుర్లభంబులు కావున, వానింబడయఁబ్రయత్నింపరాదు - అభిలషితంబయినది, సులభం

బయి తేఁగ దా కోర్కి సఫలంబగు! దీనికిఁ
జెప్పుచున్నాఁడు. రాఘవాయ= రఘు
వంశంబున నవతరించినవాఁడు , సమ
స్తవేదాంతవేద్యంబును బరమప్రాప్యం
బునగు పరబ్రహ్మంబు , మనుష్యులకం
టెను దిర్యగ్జంతువులకునుం గూడఁ ,
గంట్లారంజూడ నలవియగునట్లు, మను
ష్యరూపంబున నవతరించుటకన్న, నేమి
సౌలభ్యంబున్నది? లేక, భూమియందెం
దఱో నరేంద్రులున్నవారలు; ఏల రాము
నొద్దకె రావలెను? అన్నచోఁ జెప్పుచు
న్నాఁడు. రాఘవాయ=రఘువంశంబు
నఁ బుట్టినవాఁడు, "కింత్వర్థినామ
ర్థితదానదీక్షాకృతవ్రతశ్లాఘ్య మిదం
కులంతత్" (ఆవంశము యాచకులకు ,
యాచింపఁ బడినవాని నొసంగుటయ
ను దీక్షచేఁ జేయఁబడిన వ్రతముచేఁ గొ
నియాడఁదగినది.) అని, చెప్పఁబడిన ప్ర
కారము యాచితదానధురంధరులని వి
నుతికెక్కిన రఘువంశంబునఁ బుట్టినవాఁ
డగుటచే, నా యాచనము తప్పక సఫల
ము కాఁగలదని వచ్చినాననుట . మహా
త్మనే=మహాప్రభావుండు , అట్లవతా
రరూపుఁడయినను, దనయొప్పటిస్వభా
వంబు విడువక , జ్ఞానశక్త్యాద్యనంత క
ల్యాణగుణ సంపూర్ణుండై యుండు
వాఁడనుట. అట్టి రామునికొఱకు ;
మాం=నన్ను, విభీషణం= విభీషణుండ
నువాని, నేను బ్రతికూలుండగు రావ
ణుండఁగాను, మఱి విభీషణుండననుట.
ఉపస్థితం= వచ్చినవానిఁగా; నేను వచ్చి
నంతనె, రాముండు నన్నంగీకరించుట
సిద్ధము; రాముండు దనయొద్దకు వచ్చు వా
నిని, అంగీకరింపక మానఁడనుట. క్షి
ప్రం=శీఘ్రముగా, శరణ్యుండగు రా
ముండు, తానెగ్రహించుటకు మున్నె మీ
రలును గొంచెము ఉపకారము చేసి పుణ్య
ముగట్టుకొనుఁడు ఏలయన? శీతలంబును
సుగంధియునగు జలంబుగల కమలాకరం
బుఁ జూచి దప్పిగొన్న వాఁడువలె, నే
ను, ఆలస్యంబు సహింపంజాలను. నివేద
యత= తెలుపుఁడు. "వాచా ధర్మమ
వాప్నుహి" (మాటచే ధర్మము నొందు
ము) అను న్యాయంబున , మాటమా
త్రము సాహాయ్యము చేసితిరేని, మీకు అ
నాయాసంబుగా నే , మహాపుణ్యంబు
ఘటిల్లును. ఈశ్లోకంబున, "సర్వలో
కశరణ్యాయ" అనుటచే, "అప్రార్థి
తో న గోపాయేదితి తత్ప్రార్థనా మ
తిః, గోపాయితా భవేత్యేవం గోప్తృ
త్వవరణం స్మృతం" (ప్రార్థింపకున్న
రక్షింపఁడు. అని, "నన్ను రక్షింపుము"
అని చేయు ప్రార్థనము, గోప్తృత్వవ
రణంబని చెప్పఁబడినది.) అని చెప్పఁబ

డిన, గోప్తృత్వవరణంబనుశరణాగత్యంగము సూచింపఁబడినది. "ఉపస్థితం" (సమీపమునొందినవానికిఁగా) అనుటచే, "రక్షిష్యత్యనుకూలాన్న ఇత్యేవంసుదృఢామతిః, సవిశ్వాసోభవేచ్ఛాత్రసర్వ దుష్కృతినాశనః" ("అనుకూలురమగుమనలరక్షించును" అనుమికిలియుదృఢమయినబుద్ధియేది గలదోఅది ఈశరణాగతియందు సమస్తపాపనాశనంబగు,విశ్వాసంబనునంగంబగును.) అన్నచొప్పున, విశ్వాసంబనునంగము సూచింపఁబడినది. రక్షించుననుదృఢవిశ్వాసంబు లేకున్నచో, సమీపంబునకుఁ బోఁడుగదా! అయితే,రఘువంశంబునంబుట్టినరాముండు, సమస్తలోక శరణ్యుండగుటమొదలగుధర్మము, రాక్షసుండగువిభీషణునకెట్లు దెలిసినది? అని,యందురు. చెప్పెదము, "పరమాపద్గతస్యాపి ధర్మేమమ మతిర్భవేత్, యాయామేజాయతే బుద్ధిర్యేషు మేష్వాశ్రమేషుచ, సాసాభవతుధర్మిష్ఠాతంతంధర్మంచపాలయే." (నేను బరమాపదనుబొందినను,నాకుధర్మంబునందెబుద్ధిగలుగవలెను. నాకు,ఏయే విషయములయందు, ఏయేబుద్ధిగలుగునో, అదంతయు,ధర్మిష్ఠంబగుఁగాక. ఆయాధర్మంబుఁబాలింపుచుండెదను) అనివరప్రదాన కాలంబునఁ, బ్రార్థించుండై, బ్రహ్మదేవుండు, "ధర్మిష్ఠస్త్వంయథావత్సతథాచైవ భవిష్యసి" (ఎట్లునీవుధర్మిష్ఠుండవు కాఁగోరితివోయదియట్లెయగును.)అని,వరంబునొసంగుటంజేసి, విభీషణునకు, రాముండు, నారాయణావతారరూపుండని తెలిసినది.

ఏతత్తు వచనం శ్రుత్వా సుగ్రీవో లఘువిక్రమః
లక్ష్మణస్యాగ్రతో రామం సంరబ్ధ మిద మబ్రవీత్. ౧౬

టీక॥లఘువిక్రమః=శీఘ్రమయిన నడతగల;సుగ్రీవః=సుగ్రీవుఁడు; ఏతత్= ఈ; వచనం=మాటను;శ్రుత్వా=విన్నంతనే; లక్ష్మణస్య= లక్ష్మణునియొక్క; అగ్రతః= ముందట; రామం= రామునిగూర్చి;సంరబ్ధం= వేగముతోఁగూడునట్లుగా;ఇదం= ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంతనీమాటనువిన్నంతనే,సుగ్రీవుండు,"రాముండుశరణాగతవత్సలుండు,

విభీషణుఁడు శరణాగతుండయ్యెనను మాటను విన్నంతనే యతని రక్షించును. ఈ విభీషణుండే మాయ యుపకారము సేయ వచ్చినవాఁడు, పరమార్థముగా శరణాగతుండు కాఁడు. కావున, ముందుగా విభీషణుని నిగ్రహింపవలయునని రామునకుఁ జెప్పవలయును" అని, నిశ్చయించి, "అతిస్నేహః పాపశంకీ" అను న్యాయంబున రాముని పై మహాస్నేహంబు గలవాఁడు కావున, విభీషణుండు పరిశుద్ధుండైనను అతనియందిట్లు సంశయించి, శీఘ్రంబుగ రాముని యొద్దకుం బోయి, లక్ష్మణుని ముందట, రామునితో నిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

రావణస్యానుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః
చతుర్భి స్సహ రక్షోభి ర్భవంతం శరణం గతః. ౧౭

టీక॥ విభీషణః=విభీషణుఁడు; ఇతి= అని; శ్రుతః=వినఁబడిన; రావణస్య=రావణుని యొక్క; భ్రాతా=తోఁబుట్టువును; అనుజః=తమ్ముండును అగువాఁడు; చతుర్భిః= నలువురయిన; రక్షోభిస్సహ= రాక్షసులతోఁగూడ; భవంతం= నిన్ను; శరణం=రక్షకునిఁగా; గతః= పొందినాఁడు.

రావణుని తమ్ముండు విభీషణుండనువాఁడు, నల్వురి రాక్షసులతో వచ్చి, నిన్ను శరణు చొచ్చినాఁడు.

అని, తాత్పర్యము.

మంత్రే వ్యూహే నయే చారే యుక్తో భవితు మర్హసి
వానరాణాంచ భద్రం తే పరేషాంచ పరంతప. ౧౮

టీక॥ పరంతప=శత్రువులఁ దపింపఁజేయునట్టి రాముఁడా! వానరాణాంచ=వానరులకును; పరేషాంచ=శత్రువులకును; మంత్రే=కార్యాకార్యవిచారమునందును; వ్యూహే=సేనాసన్నివేశమునందును; నయే= ఉపాయంబులఁ బ్రయోగించుటయందును; చారే=రహస్యపురుషులఁ బంపుటయందును; యుక్తః= ఎచ్చరిక గలవాఁడవు; భవితుం= అగుటకు; అర్హసి=తగుదువు. తే = నీకు; భద్రం = మంగళము; అస్తు(అధ్యాహృతము)=కలుగును గాక.

శత్రువులం దపింపఁజేయునట్టి రాముఁడా! వానరులకు మేలును రాక్షసులక

స ౧౭

పాయంబులుగల్గునట్లు, నీవిప్పుడు, కార్యాకార్యములనాలోచించుట, సేనాసన్నివేశనము,ఉపాయప్రయోగము,గూఢపురుషప్రేషణము,వీనియందు, జాగ్రత్తతోనుండుము;నీకుమంగళంబుగలుగుంగాక.అని, తాత్పర్యము.

అంతర్ధానగతా హ్యేతే రాక్షసాః కామరూపిణః
శూరాశ్చ నికృతిజ్ఞాశ్చ తేషు జాతు న విశ్వసేత్. ౧౯

టీక॥కామరూపిణః=ఇచ్ఛాధీనమగు రూపముగల;ఏతే=ఈ; రాక్షసాః=రాక్షసులు;అంతర్ధానగతాః=మఱుఁగుపాటునొందువారలును ; శూరాశ్చ= యుద్ధమునందు భయములేనివారలును; నికృతిజ్ఞాశ్చహి = కపటోపాయంబుల నెఱింగినవారలునుగదా! తేషు=వారలయందు;జాతు=ఒకానొకప్పుడును;నవిశ్వసేత్=నమ్మరాదు.

ఈరాక్షసులు,కామరూపులు, అంతర్ధానంబునొందిప్రహరించువారలు, శూరులు,కపటోపాయంబులంబండితులు;కావున,వారలనెంతమాత్రమునమ్మరాదు. అని, తాత్పర్యము.

ప్రణిధీ రాక్షసేంద్రస్య రావణస్య భవే దయమ్
అనుప్రవిశ్య సోస్మాసు భేదం కుర్యా న్నసంశయః. ౨౦

టీక॥ అయం=ఈవిభీషణుఁడు;రాక్షసేంద్రస్య= రాక్షసులకుఁబ్రభుండైన; రావణస్య = రావణునియొక్క; ప్రణిధిః=చారుఁడుగా; భవేత్ = ఉండును. సః = అతండు ; అస్మాసు = మనలయందు ; అనుప్రవిశ్య= చక్కఁగాఁబ్రవేశించి; భేదం = మిత్రభేదమును; కుర్యాత్=చేయును; సంశయః= సందేహము; న=లేదు.

ఈవిభీషణుండు, రాక్షసేశ్వరుండగురావణుండుపంపిన చారుండైయుండును; మనవలనంజక్కఁగానమ్మకంబునొంది,మనలకు మిత్రభేదంబుగలిగించును, సందేహములేదు.

అని, తాత్పర్యము.

అథవా స్వయమేవైష ఛిద్రమాసాద్య బుద్ధిమాన్
అనుప్రవిశ్య విశ్వస్తే కదాచి త్ప్రహరే దపి. ౨౧

టీక॥ అథవా = అటుగాదేని ; అస్మిౙ్(అధ్యాహృతము)=ఈతఁడు; విశ్వస్తే=నమ్మఁబడఁగా ; బుద్ధిమాౙ్ = అధికమయినబుద్ధిగల; ఏషః=ఇతఁడు; అనుప్రవిశ్య = చక్కఁగాఁబ్రవేశించి; ఛిద్రం=రంధ్రమును; ఆసాద్య= పొంది; కథంచిత్= ఒకానొకప్పుడు; స్వయమేవ=తానే; ప్రహరేదపి= కొట్టినుకొట్టును.

అటుగాదేని, బుద్ధిమంతుఁడగు నీవిభీషణుండు, చక్కఁగానమ్మకమునొంది, సమయంబువెదకుచుండి,కొంచెము ఛిద్రంబుదొరకినప్పుడు , తానే , ప్రహరించును. అని,తాత్పర్యము.

మిత్రాటవీబలంచైవ మౌలం భృత్యబలం తథా
సర్వమే తద్బలం గ్రాహ్యం వర్జయిత్వా ద్విషద్బలమ్. ౨౨

టీక॥ ద్విషద్బలం= శత్రుసైన్యమును; వర్జయిత్వా=విడిచి; మిత్రాటవీబలంచైవ = మిత్రసైన్యమును; మౌలం=మూలబలమును; తథా = అట్లు; భృత్యబలం = వేతనముచేతజీవించుసైన్యమును; ఏతత్=ఈ; బలం = సైన్యము; సర్వం=అంతయు ; గ్రాహ్యం=గ్రహింపఁదగినది.

మిత్రసైన్యమును, అడవియందుండుజనులబలంబును,మూలబలంబును, వేతనంబుదీసికొనిజీవించుసైన్యమును,ఈసైన్యంబులనన్నింటినిగ్రహింపవచ్చును; శత్రుబలంబుమాత్రము గ్రహింపరాదు. అని, తాత్పర్యము.

ప్రకృత్యా రాక్షసేంద్రస్య భ్రాతా౽మిత్రస్య తే ప్రభో
ఆగతశ్చ రిపోః పక్షా త్కథమస్మిౝహి విశ్వసేత్. ౨౩

టీక॥ప్రభో= నాయకుండవగురాముఁడా;అయం= ఇతఁడు;ప్రకృత్యా=స్వభావముచేత; తే=నీయొక్క; అమిత్రస్య=శత్రుండగు; రాక్షసేంద్రస్య=రాక్షసేశ్వరుండగు రావణునియొక్క; భ్రాతా=తమ్ముఁడు;రిపోః= శత్రువుయొక్క;పక్షాత్=పక్షమునుండి;ఆగతశ్చ=వచ్చినవాఁడును. అస్మిౙ్=ఇతనియందు("హి" అనునదిపాదపూరణార్థము); కథం=ఎట్లు;విశ్వసేత్= నమ్మవచ్చును?

రాముఁడా! ఈవిభీషణుండు,స్వభా

 

వంబున నే, నీశత్రువయిన రాక్షసరాజుండగు రావణునితమ్ముండు; మఱియు శత్రుపక్షంబుననుండివచ్చినాఁడు; ఈతని నెట్లునమ్మవచ్చును?

అని, తాత్పర్యము.

రావణేన ప్రణిహితం త మవేహి విభీషణమ్
తస్యాహం నిగ్రహం మన్యే క్షమం క్షమవతాం వర. ౨౪

టీక॥ క్షమవతాం= యుక్తవ్యాపారములుగలవారలలో; వర= శ్రేష్ఠుఁడవగు రాముఁడా! తం= ఆ; విభీషణం= విభీషణుని; రావణేన= రావణుని చేత; ప్రణిహితం= రహస్యముగాఁ బంపబడినవానిఁగా; అవేహి= ఎఱుంగుము. అహం= నేను; తస్య= అతనియొక్క; నిగ్రహం= నిగ్రహించుటను; మన్యే= తలంచెదను.

యుక్తవ్యాపారంబులు గలవారలలోనుత్తముఁడవగు రాముఁడా! ఈవిభీషణుండు, రావణుఁడుపంపఁగా వచ్చినచారుండని యెఱుంగుము; కావున, నితనినిగ్రహింపవలయునని తలంచెదను.

అని, తాత్పర్యము.

రాక్షసో జిహ్మయా బుద్ధ్యా సందిష్టో యముపాగతః
ప్రహర్తుం మాయయా ఛన్నో విశ్వస్తే త్వయి రాఘవ. ౨౫

టీక॥ రాఘవ= రాముఁడా! అయం= ఈ; రాక్షసః= రాక్షసుఁడు; జిహ్మయా= కుటిలమయిన; బుద్ధ్యా= బుద్ధిచేత; సందిష్టః= పంపఁబడినవాఁడై; విశ్వస్తే= నమ్మినట్టి; త్వయి= నీయందు; మాయయా= మాయచేత; ఛన్నః= కప్పఁబడినవాఁడై; ప్రహర్తుం= కొట్టుటకు; ఉపాగతః= వచ్చినాఁడు.

రాముఁడా! ఈ రాక్షసుఁడు, రావణునిచేఁ గుటిలోపాయంబునం బంపఁబడి, నీవునమ్మినపిమ్మట, మాయచేనంతర్ధానంబునొంది, మనలం బ్రహరించుటకై, వచ్చినాఁడు.

అని, తాత్పర్యము.

ప్రవిష్ట శ్శత్రుసైన్యం హి ప్రాజ్ఞ శ్శత్రు రతర్కితః
నిహన్యా దంతరం లబ్ధ్వా ఉలూక ఇవ వాయసాన్. ౨౬

 

టీక॥ ప్రాజ్ఞః = పండితుండగు;శత్రుః=శత్రువు; అతర్కితః=విచారింపఁబడనివాఁడై;శత్రుసైన్యం=శత్రువులసైన్యమును; ప్రవిష్టః=ప్రవేశించినవాఁడై; అంతరం=ఛిద్రమును;లబ్ధ్వా=పొంది;వాయసాన్=కాకులను;ఉలూక ఇవ= గుడ్లగూఁబవలె;నిహన్యాద్ధి=చంపునుగదా!

బుద్ధిమంతుండగుశత్రువు,ఎవ్వరికిని దెలియకుండునట్లు,శత్రుసైన్యంబుఁబ్రవేశించి,రంధ్రంబునన్వేషించి, పెక్కు-కాకులనుఒకగుడ్లగూఁబచంపునట్లు,తనశత్రువులనందఱుం,జంపును.అని తాత్పర్యము.

వధ్యతా మేష దండేన తీవ్రేణ సచివైస్సహ
రావణస్య నృశంసస్య భ్రాతా హ్యేష విభీషణః. ౨౭

టీక॥ఏషః=ఈవిభీషణుఁడు;సచివైస్సహ=మంత్రులతోఁగూడ;తీవ్రేణ=తీక్ష్ణమయిన;దండేన = శిక్షచేత;వధ్యతాం=చంపఁబడుఁగాక. ఏషః=ఈ;విభీషణః = విభీషణుఁడు ; నృశంసస్య=క్రూరుండగు; రావణస్య= రావణుని యొక్క ; భ్రాతాహి = తమ్ముండు గదా!

ఈవిభీషణుండు, క్రూరుండగు రావణునితమ్ముండుగదా!కావున, నితనిని, ఈతనిమంత్రులనల్వురినుంగూడఁ,దీక్ష్ణంబుగా, వధింపవలయును. అని , సుగ్రీవుండు, రామునితోఁజెప్పెను.
అని,తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు తం రామం సంరబ్ధో వాహినీపతిః
వాక్యజ్ఞో వాక్యకుశలం తతో మౌన ముపాగమత్. ౨౮

టీక॥వాక్యజ్ఞః=మాటలనెఱింగిన; వాహినీపతిః=వానరసేనానాయకుండయినసుగ్రీవుండు; సంరబ్ధః= వేగిరపడినవాఁడై; వాక్యకుశలం=మాటలయందుసమర్థుఁడగు; రామం= రామునిగూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వాతు=చెప్పినంతనే; తతః=అంత; మౌనం = ఊరకుండుటను; ఉపాగమత్ = పొందెను.

మాటలుచెప్పుటయందుఁబండితుండగువానరేశ్వరుండుసుగ్రీవుండు , అట్లు మాటలయందుసమర్థుఁడగురామునితో వేగంబునంజెప్పి , యంతనూరకుండెను. అని, తాత్పర్యము.

సుగ్రీవస్య తు త ద్వాక్యం శ్రుత్వా రామో మహాయశాః
సమీపస్థా నువాచే దం హనుమత్ప్రముఖా న్హరీన్. ౨౯

టీక॥ మహాయశాః = అధికమయినకీర్తిగల; రామః = రాముఁడు; సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క; తత్ = ఆ; వాక్యం = మాటను; శ్రుత్వాతు = విన్నంతనే; సమీపస్థాన్ = సమీపంబుననున్న; హనుమత్ప్రముఖాన్ = హనుమంతుఁడు మొదలుగాఁగల; హరీన్ = వానరులను గూర్చి; ఇదం = ఈమాటను; ఉవాచ = చెప్పెను.

మహాకీర్తిశాలియగు రాముండు, సుగ్రీవుండు చెప్పినమాటనువిని, యప్పుడుసమీపంబుననున్న, హనుమంతుండు మున్నగువానరులంబూచి, యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

య దు క్తం కపిరాజేన రావణావరజం ప్రతి
వాక్యం హేతుమ దర్థ్యంచ భవద్భిరపి త చ్ఛ్రుతమ్. ౩౦

టీక॥ కపిరాజేన = వానరరాజుండగు సుగ్రీవునిచేత; రావణావరజంప్రతి = రావణునితమ్మునిగూర్చి; యత్ = ఏది; ఉక్తం = చెప్పఁబడినదో; తత్ = ఆ; హేతుమత్ = యుక్తిగలదియు; అర్థ్యంచ = ప్రయోజనముతోఁ గూడినదియునగు; వాక్యం = మాట; భవద్భిరపి = మీచేతనుంగూడ; శ్రుతం = వినఁబడినది.

వానరరాజుండగు సుగ్రీవుండు, రావణునితమ్ముండయిన విభీషణుని గుఱించి, యుక్తియుక్తంబును సప్రయోజనంబునగుమాటంజెప్పినాఁడు; అది, మీరునువిన్నారు. అని, తాత్పర్యము.

సుహృదా హ్యర్థకృచ్ఛ్రేషు యుక్తం బుద్ధిమతా సతా
సమర్థేనా పి సందేష్టుం శాశ్వతీం భూతి మిచ్ఛతా. ౩౧

టీక॥ అర్థకృచ్ఛ్రేషు = కార్యసంకటములందు; బుద్ధిమతా = అధికమయినబుద్ధిగలవాఁడును; సతా = సత్పురుషుండును; సమర్థేన = సమర్థుండును; శాశ్వతీం = శాశ్వతమయిన; భూతిం = సంపదను; ఇచ్ఛతా = కోరుచున్న

వాఁడునగు; సుహృదాపి= స్నేహితుని చేతనుంగూడ, మఱియొక స్నేహితునిచే తనుంగూడననుట ; సందేష్టుం=ఉపదేశించుటకు; యుక్తం=ఉచితము.

ఒకమిత్రుఁడుపదేశించినపిమ్మట , మఱియొకఁడుపదేశింపఁగూడదనిలేదు ; కార్యసంకటంబువచ్చినప్పుడు , బుద్ధిమంతుండును సమర్థుండును శ్రేయస్కాముండునగుమిత్రుండెవ్వఁడైనను, ఉపదేశించుటయుక్తము; కావున, మీరలును, మీకుఁదోఁచినదిచెప్పుఁడు. అని రాముండు, హనుమదాదివానరులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యేవం పరిపృష్టాస్తే స్వంస్వం మత మతంద్రితాః
సోపచారం తదా రామ మూచు ర్హితచికీర్షవః. ౩౨

టీక॥ తే=ఆవానరులు; ఇతి = అని; ఏవం=ఇట్లు; పరిపృష్టాః= అడుగఁబడినవారలయి; తదా=అప్పుడు ; అతంద్రితాః=ఆలస్యములేనివారలయి; హితచికీర్షవః = మేలుసేయఁగోరినవారలయి; రామం=రామునిగూర్చి; సోపచారం= ఉపచారముతోఁగూడునట్లుగా; స్వంస్వం=తమతమదైన; మతం=మతమును; ఊచుః=చెప్పిరి,

ఆవానరులు, రాముండుచెప్పినమాటనువిని. యాలస్యంబుసేయక, రామహితంబుసేయఁగోరినవారయి , రామునింజూచి, యుపచారపూర్వకంబుగాఁ, దమతమమతంబులం జెప్పిరి.

అని, తాత్పర్యము.

అజ్ఞాతం నాస్తి తే కించి త్త్రిషు లోకేషు రాఘవ
ఆత్మానం పూజయ న్ జాన న్ పృచ్ఛస్య స్మాన్ సుహృత్తయా. ౩౩
( "ఆత్మానంసూచయన్" ఇతిపాఠాంతరం. )

టీక॥ రాఘవ=రాముఁడా! త్రిషు=మూఁడైన; లోకేషు=లోకములయందు; కించిత్=కొంచమయినను; తే=నీకు; అజ్ఞాతం=తెలియఁబడనిది; నాస్తి=లేదు. జానన్= ఎఱింగినవాఁడవై ; సుహృత్తయా= స్నేహితుండగుటచేత; ఆత్మానం= నిన్ను; సూచయన్= తెలియపఱచువాఁడవై ; పాఠాంతరపక్షమందు. ఆత్మానం= మాలోఁబక్కొకరిని; పూజయన్= పూజించువాఁ

డవై; అస్మాన్=మమ్ము; పృచ్ఛసి=అడుగుచున్నావు.

రాముఁడా! ముల్లోకంబులయందు నునీకుఁ దెలియనిదేదియు లేదు; "రామునకు వానరులు స్నేహితులుగా నుండిరి, అని, మాకందఱకును గీర్తిగలుగుటకును, మమ్మందఱను గౌరవింపవలెననియు, మమ్మడుగుచున్నావు.

అని, తాత్పర్యము.

త్వం హి సత్యవ్రత శ్శూరో ధార్మికో దృఢవిక్రమః
పరీక్ష్యకారీ స్మృతిమా న్నిసృష్టాత్మా సుహృత్సుచ. ౩౪

టీక॥ త్వం=నీవు; సత్యవ్రతః=సత్యమయినవ్రతముగలవాఁడవును; శూరః=యుద్ధమునందుభయము లేనివాఁడవును; ధార్మికః= ధర్మము నాచరించువాఁడవును; దృఢవిక్రమః= దృఢమయినపరాక్రమముగలవాఁడవును ; పరీక్ష్యకారీ = పరీక్షించిచేయువాఁడవును ; స్మృతిమాన్=జ్ఞప్తిగలవాఁడవును; సుహృత్సు= స్నేహితులయందు; నిసృష్టాత్మాచహి=ఉంచఁబడినమనస్సుగలవాఁడవునుగదా!

నీవు, సత్యవ్రతుఁడవు ; శూరుండవు ; ధార్మికుండవుమహాపరాక్రమశాలివి; ఏకార్యము నేనిపరీక్షించి చేయువాఁడవు; మఱపులేనివాఁడవు; మిత్రులయందు భారము లేని పరతంత్రుండవై యుండువాఁడవు. అని, తాత్పర్యము.

తస్మా దేకైకశ స్తావ ద్బ్రువంతు సచివా స్తవ
హేతుతో మతిసంపన్నా స్సమర్థాశ్చ పునఃపునః. ౩౫

టీక॥ తస్మాత్=అందువలన; మతిసంపన్నాః=బుద్ధితోఁగూడినవారలును; సమర్థాశ్చ=సమర్థులునగు; తవ=నీయొక్క; సచివాః=మంత్రులు; పునఃపునః=మాటిమాటికి; తావత్=క్రమముగా; ఏకైకశః=ఒక్కొక్కరుగా; హేతుతః=యుక్తులచేత; బ్రువంతు=చెప్పుదురుగాక.

అందువలన, బుద్ధిమంతులును సమర్థులునగునీమంత్రులు, క్రమంబున, వొక్కొక్కరుగా, యుక్తియుక్తంబుగా, వారివారియభిప్రాయంబుఁ జెప్పుదురుగాక. అని, వానరులు, రామునితోఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

ఇత్యుక్తే రాఘవాయాऽథ మతిమా నంగదోऽగ్రతః
విభీషణపరీక్షార్థ ముడాచ వచనం హరిః. ౩౮

టీక॥ఇతి=అని;ఉక్తే= చెప్పఁబడఁగా;అథ=అటుపిమ్మట; అగ్రతః=ముందఱ;మతిమాన్=బుద్ధిమంతుండగు; అంగదః=అంగదుండను ; హరిః=వానరుఁడు;విభీషణపరీక్షార్థం=విభీషణునిపరీక్షించుటకొఱకు; రాఘవాయ=రామునికొఱకు;వచనం=మాటను; ఉవాచ= చెప్పెను.

ఆవానరులిట్లుచెప్పిముగించిన వెనుక,వారలలో,మొదట,బుద్ధిమంతుండగు నంగదుండు, విభీషణునిపరీక్షించుటను గుఱించి, రామునితో,నిట్లని,చెప్పెను. అని, తాత్పర్యము.

శత్రోః సకాశా త్సంప్రాప్త స్సర్వథాశంక్య ఏవ హి
విశ్వాసయోగ్య స్సహసా నకర్తవ్యో విభీషణః. ౩౯

టీక॥శత్రోః=శత్రువుయొక్క;సకాశాత్ = సమీపంబుననుండి; సంప్రాప్తః=వచ్చినవాఁడు;సర్వథా= అన్నివిధంబునను;శంక్యఏవహి=సందేహింపఁదగినవాఁడేకదా! విభీషణః=విభీషణుఁడు;సహసా=తటాలున; విశ్వాసయోగ్యః=నమ్మకమునకుఁదగినవాఁడుగా;నకర్తవ్యః=చేయఁబడరాదు.

శత్రునియొద్దనుండివచ్చినవానిని,ఏవిధంబుననేని,నమ్మరాదు; కావున, మనము, విభీషణునిపైనాలోచింపక, నమ్మకంబుంచరాదు. అని, తాత్పర్యము.

ఛాదయిత్వాత్మభావం హి చరంతి శఠబుద్ధయః
ప్రహరంతి చ రంధ్రేషు సోऽనర్థ స్సుమహాన్ భవేత్. ౪౦

టీక॥శఠబుద్ధయః=కుటిలమయినబుద్ధిగలవారలు; ఆత్మభావం= తమయభిప్రాయమును; ఛాదయిత్వా= మూసికొని; చరంతిహి= సంచరించుచున్నారుగదా! రంధ్రేషు = ఛిద్రములయందు; ప్రహరంతిచ=కొట్టుదురు. సః= అట్టి; అనర్థః= అపాయము; సుమహాన్=మిక్కిలియుగొప్పది; భవేత్= అగును.

కుటిలబుద్ధులగువారలు; తమయభి

ప్రాయమును దాచుకొని, పైకిమంచివారలువలె నటింతురు. తుదకు, ఛిద్రంబు దొరికినప్పుడు ; ప్రహరింతురు; అట్టి గొప్పయపాయము సంభవించును. అని, తాత్పర్యము.

అర్థానర్థౌ వినిశ్చిత్య వ్యవసాయం భజేతహి
గుణత స్సంగ్రహం కుర్యా ద్దోషతస్తు విసర్జయేత్. ౩౯

టీక॥అర్థానర్థౌ= గుణదోషములను;వినిశ్చిత్య= నిశ్చయించి; వ్యవసాయం=ప్రయత్నమును;భజేత=పొందవలయును ("హి" అనునది పాదపూరణార్థము.) గుణతః= గుణంబులవలన; సంగ్రహం=అంగీకారమును; కుర్యాత్=చేయవలయును. దోషతస్తు= దోషమువలనమాత్రము ; విసర్జయేత్=విడువవలయును.

ఏవిషయంబునందేని, గుణదోషంబులవిచారించి, గుణంబులుండెనేని, యంగీకరింపవలయును; దోషంబులుండెనేని విడువ వలయును ; అట్లు, ఈవిభీషణునియందలి గుణదోషంబులనాలోచించి, యతనియందుగుణంబె యుండెనచో గ్రహింతము; దోషంబె యుండినచో విడుతము. అని, తాత్పర్యము.

యది దోషో మహాం స్తస్మిం స్త్యజ్యతా మవిశంకితమ్
గుణాన్వాపి బహూన్ జ్ఞాత్వా సంగ్రహః క్రియతాంనృప. ౪౦

టీక॥నృప= రాజవగురాముఁడా! తస్మిన్ = ఆవిభీషణునియందు ; మహాన్=గొప్పదగు; దోషోయది= దోషంబుండునేని; అవిశంకితం=సందేహములేనట్లుగా; త్యజ్యతాం= విడువఁబడుఁగాక; బహూన్=పెక్కులయిన ; గుణాన్=గుణంబులను;జ్ఞాత్వావాపి= ఎఱింగియయినను; సంగ్రహః= అంగీకారము ; క్రియతాం = చేయఁబడుఁగాక.

నరేంద్రుండవగు రాముఁడా! అయితే ఎంతమాత్రమయిన గుణంబుగాని దోషంబుగాని లేనివాఁడు ఎవ్వఁడు లేఁడే యనియందురేమో. ఈవిభీషణునియందు, గుణంబులకన్న దోషంబులెయెచ్చుగానుండినచో, నితనినిస్సందేహముగా

విడువవలసినది. అట్లులేక, దోషంబుల కన్నగుణంబులెయెచ్చుగానుండినచో, నంగీకరింపవలయును. అని, యంగదుఁడు, రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

శరభస్త్వథ నిశ్చిత్య సార్థం వచనమబ్రవీత్

టీక॥ అథ= ఆపిమ్మట; శరభస్తు= శరభుండును; నిశ్చిత్య= నిశ్చయించి; సార్థం= అర్థముతోఁగూడిన; వచనం= మాటను; అబ్రవీత్= చెప్పెను.

అంత, శరభుఁడు, చక్కఁగా నాలోచించి నిశ్చయించి. సార్థకంబగనీ మాటఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

క్షిప్రమస్మిన్నరవ్యాఘ్ర చారః ప్రతివిధీయతామ్. ౪౧

టీక॥ నరవ్యాఘ్ర= పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! అస్మిన్= ఈవిభీషణునివిషయమునందు; క్షిప్రం= శీఘ్రముగా; చారః= గూఢపురుషుఁడు; ప్రతివిధీయతాం= ఏర్పఱుపఁబడుఁగాక.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! శీఘ్రముగా నీవిభీషణునియొద్దకు, ఒకగూఢపురుషునిం బంపుము.

అని, తాత్పర్యము.

ప్రణిధాయ హి చారేణ యథావత్సూక్ష్మబుద్ధినా
పరీక్ష్య చ తతః కార్యో యథాన్యాయం పరిగ్రహః, ౪౨

టీక॥ ప్రణిధాయ= చారునిబంపి; సూక్ష్మబుద్ధినా= సూక్ష్మమయిన బుద్ధిగల; చారేణ= గూఢపురుషునిచేత; యథావత్= యథాశాస్త్రముగా; పరీక్ష్య చ= పరీక్షించియు; తతః= అటుపిమ్మట; యథాన్యాయం= న్యాయమునతిక్రమింపక; పరిగ్రహః= అంగీకారము, కార్యః= చేయఁదగినది.

(గుణదోషంబులుపరీక్షించి, గుణంబులెచ్చుగానున్ననంగీకరించుట, దోషంబులెచ్చుగానున్నఁబరిత్యజించుట, ఇదివలనుపడదు, ఏలయాన? వానిని మనలోఁ జేర్చుకొనికదా గుణదోషంబులుపరీక్షింపవలెను; చేర్చుకొన్నచో, మనకతఁ

డుకీడుగావించును కావున, అదిసరికాదు. )మనము,విభీషణునొద్దకు సూక్ష్మబుద్ధియగుచారునొకనినంపి, యతనిమాటనుజక్కగాఁబరీక్షించి; యటుపిమ్మట, నీతిశాస్త్రోక్త ప్రకారంబునఁబరిగ్రహాపరిగ్రహంబులు సేయవలయును, అని, శరభుండుచెప్పెను.

అని, తాత్పర్యము.

జాంబవాం స్త్వథ సంప్రేక్ష్య శాస్త్రబుద్ధ్యా విచక్షణః
వాక్యం విజ్ఞాపయామాస గుణవ ద్దోషవర్జితమ్. ౪౩

టీక|| అథ=అంత;విచక్షణః= పండితుండగు;జాంబవానపి= జాంబవంతుండును;శాస్త్రబుద్ధ్యా=శాస్త్రబుద్ధిచేత; సంప్రేక్ష్య=ఆలోచించి;గుణవత్=గుణంబులుగలదియు;దోషవర్జితం=దోషంబుచే విడువఁబడినదియునగు; వాక్యం=మాటను;విజ్ఞాపయామాస= మనవిచేసెను.

అంత, బండితుండగు,జాంబవంతుండు, శాస్త్రప్రకారము నాలోచించి గుణయుక్తంబును,నిర్దోషంబగునీమాటను,విన్నవించుకొనెను.

అని, తాత్పర్యము.

బద్ధవైరాచ్చ పాపాచ్చ రాక్షసేంద్రా ద్విభీషణః
అదేశకాలే సంప్రాప్త స్సర్వథా శంక్యతా మయమ్. ౪౪

టీక|| విభీషణః=విభీషణుఁడు-బద్ధవైరాచ్చ=దృఢమయినపగగలవాఁడును, పాపాచ్చ= పాపిష్ఠుండునగు; రాక్షసేంద్రాత్=రాక్షసేశ్వరుండగు రావణునివలన;అదేశకాలే= అయుక్తదేశమునందును , అయుక్త కాలమునందును ; సంప్రాప్తః= వచ్చినాఁడు; అయం=ఈతఁడు;సర్వథా=అన్నివిధంబులను; శంక్యతాం=సందేహింపఁ బడునుఁగాక.

ఈవిభీషణుఁడు, "నీయందుబద్ధవైరంబుగలవాఁడును బాపిష్ఠుండునగు రావణునియొద్దనుండివచ్చినాఁడు; అతండిప్పుడిచ్చటికివచ్చుటకుఁదగిన కారణంబునులేదు; కావున, నేవిధంబునఁజూచినను, అతనిపైసందేహమేతోఁచుచున్నది. అని,జాంబవంతుండు,చెప్పెను.

అని, తాత్పర్యము.

తతో మైందస్తు సంప్రేక్ష్య నయాపనయకోవిదః
వాక్యం వచనసంపన్నో బభాషే హేతుమత్తరమ్. ౪౫

టీక॥ తతః=అటుపిమ్మట; నయాపనయకోవిదః = న్యాయాన్యాయములం దుఁబండితుండును ; వచనసంపన్నః= మాటలతోఁ గూడినవాఁడునగు; మైందస్తు=మైందుండును; సంప్రేక్ష్య= ఆలోచించి; హేతుమత్తరం= అధికమయిన కారణముగల; వాక్యం=మాటను; బభాషె=చెప్పెను.

అంత, న్యాయాన్యాయంబులం బండితుండును జక్కఁగా మాటలాడం జాలినవాఁడునగు మైందుండును, జక్కఁగా నాలోచించి. యన్నిటికన్నను, యుక్తియుక్తంబగునీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

వచనం నామతస్యైష రావణస్య విభీషణః
పృచ్ఛ్యతాం మధురేణాయం శనైర్నరవరేశ్వర. ౪౬

టీక॥ నరవరేశ్వర=మనుష్యశ్రేష్ఠుల కుఁబ్రభుండవగు రామఁడా! అయం, ఏషః= ఈ; విభీషణః=విభీషణుఁడు; మధురేణ=తియ్యనిమాటచేత; తస్య=ఆ; రావణస్య=రావణునియొక్క; వచనం నామ=మాటయే; శనైః = తిన్నఁగా; పృచ్ఛ్యతాం=అడుగఁబడుఁగాక.

నరేంద్రోత్తముండవగు రాముఁడా! గూఢపురుషుఁడొకఁడు పోయి, రావణునిసమాచారమేమి? యని , మధురవచనంబునం దిన్నఁగా, నీవిభీషణుని, నడుగవలయును.

అని, తాత్పర్యము.

భావ మస్యతు విజ్ఞాయ తత స్తత్త్వం కరిష్యసి
యది దుష్టో న దుష్టో వా బుద్ధిపూర్వం నరర్షభ. ౪౭

టీక॥ నరర్షభ= పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! అస్య= ఈవిభీషణుని యొక్క; తత్త్వం=నిశ్చయమయిన; భావం= అభిప్రాయమును; విజ్ఞాయ తు=ఎఱింగినంతనే; తతః=అటుపిమ్మట; దుష్టో యది=దుష్టుండుగాని; దు

ష్టోనవా - దుష్టుఁడు కానివాఁడుగానిబుద్ధిపూర్వకం = ఆలోచనముముందుగల్గినట్లుగా, కరిష్యసి = సేయఁగలవు-

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! అట్లు, ఈవిభీషణుని యథార్థాభిప్రాయంబు దెలిసికొని, యతండు దుష్టుఁడో పరిశుద్ధుఁడో, అంటుఁదగినట్లుగాఁ జేయఁగలవు- అని, మైందుండు చెప్పెను.

అని, తాత్పర్యము-

అథ సంస్కారసంపన్నో హనుమాన్ సచివోత్తమః
ఉవాచ వచనం శ్లక్ష్ణ మర్థవన్మధురం లఘు- ౪౮

టీక॥ అథ = అటుపిమ్మట; సంస్కారసంపన్నః = సంస్కారముతోఁగూడినవాఁడును; సచివోత్తమః = మంత్రులలోనుత్తముండునగు; హనుమాన్ = హనుమంతుండు; శ్లక్ష్ణం = కోమలంబును; అర్థవత్ = అధికమయినయర్థముగలదియు; మధురం = ఇంపయినదియు; లఘు = విస్తృతంబుగానిదియునగు; వచనం = మాటను; ఉవాచ = చెప్పెను-

అంత, సమస్తశాస్త్రాభ్యాసజన్యసంస్కారసంపన్నుఁడును మంత్రులలో శ్రేష్ఠుఁడునగు హనుమంతుండు, కోమలంబును నధికార్థంబును మధురంబును నల్పంబునగు మాటం జెప్పెను-

అని, తాత్పర్యము-

న భవంతం మతిశ్రేష్ఠం సమర్థం వదతాం వరమ్
అతిశాయయితుం శక్తో బృహస్పతి రపి బ్రువన్. ౪౯

టీక॥ బృహస్పతిః = బృహస్పతి; బ్రువన్ అపి = మాటలాడినను; మతిశ్రేష్ఠం = బుద్ధిచేనుత్తముండవును; సమర్థం = సమర్థుండవును; వదతాం = మాటలాడువారలలో, వరం = శ్రేష్ఠుండవునగు; భవంతం = నిన్ను; అతిశాయయితుం = అతిశయించుటకు; న శక్తః = సమర్థుఁడు కాఁడు-

బృహస్పతి మాటలాడినను, బుద్ధిమంతులలోనుత్తముండవు సమర్థుండవు మిక్కిలియుఁ జక్కఁగా మాటలాడంజాలినవాఁడవునగు, నీకు, అధికుండు కాఁజాలఁడు- అని, తాత్పర్యము-

న వాదాన్నాపి సంఘర్షా న్నాధిక్యా న్నాపి కామతః

వక్ష్యామి వచనం రాజన్ యథార్థం రామగౌరవాత్. ౫౦

టీక॥ రాజన్ = రాజవగు; రామ = రాముఁడా! అహం(అధ్యాహృతము) = నేను; వచనం = మాటను; వాదాత్ = తర్క కౌశలము వలన; నవక్ష్యామి = చెప్పను. సంఘర్షాత్ = స్పర్థ వలన; న(వక్ష్యామి) = చెప్పను ఆధిక్యాత్ = అతిశయము వలన; న(వక్ష్యామి) = చెప్పను. కామతోఽపి = కోరిక వలననైనను; న(వక్ష్యామి) = చెప్పను. గౌరవాత్ = సమ్మానము వలన; యథార్థం = యథార్థమగు మాటను; వక్ష్యామి(అధ్యాహృతము) = చెప్పెదను.

రాముఁడా! నేను, దర్క కౌశలంబునం గాని, జయింపవలెనను స్పర్ధచేఁ గాని, నాకతిశయంబు గలుగవలెనని గాని, లేక, నాయిచ్ఛ వలనఁ గాని, చెప్పుటలేదు; అయితే రాముండు నాయందుంచు గౌరవంబుచే నాకుఁదోఁచినట్లు, యథార్థంబుగాఁ జెప్పెదను. అని, తాత్పర్యము.

అర్థానర్థ నిమిత్తం హి యదుక్తం సచివైస్తవ
తత్ర దోషం ప్రపశ్యామి క్రియా న హ్యుపపద్యతే. ౫౧

టీక॥ అర్థానర్థనిమిత్తం = గుణదోషంబుల నిర్ణయోపాయము; ఇతి(అధ్యాహృతము) = అని; తవ = నీయొక్క; సచివైః = మంత్రులచేత; యత్ = ఏది; యుక్తం = చెప్పఁబడినదో; తత్ర = అందు; దోషం = దోషమును; ప్రపశ్యామి = చక్కఁగాఁ జూచెదను. క్రియా = అట్టి కార్యము; నోపపద్యతేహి = ఉపపన్నము కాదు గదా!

గుణదోషంబుల నిర్ణయించియా పైని స్వీకార పరిత్యాగంబులు సేయవలెనని నిమంత్రులు చెప్పిరే! దానియందు నాకు దోషంబు గనుపడుచున్నది; ఏలయన, అట్టి కార్యము, ఉపపన్నము గాదు. అని, తాత్పర్యము.

ఋతే నియోగా త్సామర్థ్య మవబోద్ధుం నశక్యతే
సహసా వినియోగోహి దోషవా న్ప్రతిభాతి మా. ౫౨

టీక॥ నియోగాద్యృతే=వినియోగము లేక; సామర్థ్యం= గుణదోషము; అవబోద్ధుం=తెలియుటకు; నశక్యతే= అలవిగాదు. సహసా=తటాలున; వినియోగః=వినియోగము; మా=నన్నుఁగూర్చి; దోషవాక్=దోషముగలదిగా; ప్రతిభాతి=తోఁచుచున్నది.

రాచకార్యములందుఁ బ్రవేశపెట్టకున్న, గుణదోషంబులు తెలియవు; గుణదోషంబులు తెలియకయె, రాచకార్యంబులందుఁ బ్రవేశపెట్టుట, సరికాదు; అట్లు ప్రవేశపెట్టినచో, దుష్టుండయ్యేనేనిచెఱచును; కావున వినియోగముచే గుణదోషవిచారమనునంగదమతం బన్యోన్యాశ్రయదోషగ్రస్తముగానున్నది.

అని, తాత్పర్యము-

చారప్రణిహితం యుక్తం యదుక్తం సచివైస్తవ
అర్థస్యాసంభవాత్తత్ర కారణం నోపపద్యతే. ౫౩
("చారణంనోపపద్యతే" ఇతిపాఠాంతరం.)

టీక॥ చారప్రణిహితం=చారునిబంపుట; యుక్తం=ఉచితము. ఇతి(అధ్యాహృతము)=అని; తవ=నీయొక్క; సచివైః=మంత్రులచేత; యత్=ఏమాట; ఉక్తం=చెప్పఁబడినదో; తత్ర=అచ్చట; అర్థస్య= ప్రయోజనముయొక్క; అసంభవాత్=లేమివలన; కారణం=హేతువు; పాఠాంతరపక్షమందు. చారణం=చారునిబంపుట; నోపపద్యతే= ఉపపన్నముగాదు.

చారునింబంపి రహస్యముగా నతని యభిప్రాయము దెలిసికోవలయునని, శరభుండు చెప్పినాఁడే; అదియు నసంగతము; ఏలయనఁ? దూరంబుననున్న వారలయొద్దకుఁగదా రహస్యపురుషులంబంపి వారలకుఁదెలియకుండ, వారిహృదయాభిప్రాయంబుఁగనుంగొనవచ్చును! అతిసమీపగతుండై మనల నందఱను గండ్లతోఁజూచుచున్న విభీషణునొద్దకుఁజారునిబంపు టెట్లు? అని, తాత్పర్యము.

అదేశకాలే సంప్రాప్త ఇత్యయం యద్విభీషణః
వివక్షా తత్రమే స్తీయం తాం నిబోధ యథామతి. ౫౪
స ఏష దేశః కాలశ్చ భవతీతి యథా తథా

టీక॥ అయం=ఈ; విభీషణః= విభీషణుఁడు; అదేశకాలే=అనుచితదేశమునందును, అకాలమునందును; సంప్రాప్త ఇతి(యత్)=వచ్చినాఁడనునదియే. దిగలదో; తత్ర=ఆవిషయమునందు; యథా తథా=యాథాతథ్యముగా; ఏషః=ఇది; సః=అట్టి; దేశః=దేశమును; కాలశ్చ=కాలమును; భవతి=అవును. ఇతి = అని; మే = నాకు; యథామతి= బుద్ధినతిక్రమింపక; ఇయం=ఈ; వివక్షా= చెప్పనిచ్ఛ; అస్తి=కలదు. తాం=దానిని; నిబోధ=ఎఱుంగుము.

ఈవిభీషణుండు, అనుచితదేశంబునను అకాలంబునను, వచ్చినాఁడని, జాంబవంతుండు చెప్పినాఁడే; ఆవిషయమందును, నాకుఁగొంచెము చెప్పవలెననియున్నది; వినుము; ఈదేశంబును, ఈకాలంబును, విభీషణుండువచ్చుటకుఁదగినదే. సంశయములేదు. అని, తాత్పర్యము.

పురుషా త్పురుషం ప్రాప్య తథా దోషగుణావపి. ౫౫
దౌరాత్మ్యం రావణే దృష్ట్వా విక్రమంచ తథా త్వయి
యుక్త మాగమనం తస్య సదృశం తస్య బుద్ధితః. ౫౬

టీక॥ పురుషాత్=పురుషునివలన; పురుషం=పురుషుని; ప్రాప్య=పొంది; తథా=అట్లు; దోషగుణావపి=దోషంబులనుగుణంబులను; ప్రాప్య (అధ్యాహృతము)=పొంది; రావణే=రావణునియందు; దౌరాత్మ్యం=దుష్టస్వభావమును; తథా=అట్లు; త్వయి=నీయందు; విక్రమంచ=పరాక్రమమును; దృష్ట్వా= చూచి; తస్య=అతనియొక్క; బుద్ధితః=బుద్ధివలన; సదృశం=సరియైన; తస్య=అతనియొక్క; ఆగమనం=వచ్చుట; యుక్తం=ఉచితము.

విభీషణుండు, అధముండగురావణుని, ఉత్తముండవగునిన్నును, విమర్శించి, రావణునియందలిదోషంబులను నీయందలిగుణంబులను విచారించి, రావణునియందలిసీత నపహరించుటయు మఱలనాబిడనొసంగుమనియెంతచెప్పినను సమ్మతింపకుండుటయు మొదలగుదుర్గుణంబులను, నీయందు, ఖరదూషణాదిమహారాక్షససంహారము వాలినివధించిసుగ్రీవునకు రాజ్యంబునొసంగుట మొదలగు మహా పరాక్రమంబులనుఁజూచి, బుద్ధితోనాలోచించి, రావణునివిడిచి, నీయొ

ద్దకువచ్చుట, మిక్కిలియుయుక్తముగా నేయున్నది. కావున దేశకాలంబులు, యోగ్యంబులుగ నేయున్నవి. అని, తాత్పర్యము.

అజ్ఞాతరూపైః పురుషైః స్స రాజన్ పృచ్ఛ్యతామితి
యదుక్తమత్ర మే ప్రేక్షా కాచి దస్తి సమీక్షితా. ౫౭

టీక॥ రాజన్=రాముఁడా! సః=ఆవిభీషణుఁడు; అజ్ఞాతరూపైః=తెలియఁబడనిరూపముగల; పురుషైః=పురుషులచేత; పృచ్ఛ్యతాం=అడుగఁబడుఁగాక. ఇతి=అని; యత్=ఏది; ఉక్తం=చెప్పఁబడినదో; అత్ర=ఇందు. మే=నాకు; సమీక్షితా=చక్కఁగాఁజూడఁబడిన; ప్రేక్షా=బుద్ధి; కాచిత్=ఒకానొకటి; అస్తి=ఉన్నది.

రాముఁడా! తెలియనిపురుషులుకొందఱు, పోయి, విభీషణునడుగవలయునని, మైందుఁడుచెప్పినాఁడే, ఆవిషయమందును, నాకుఁగొంచెముసంశయమున్నది. అని, తాత్పర్యము.

పృచ్ఛ్యమానో విశంకేత సహసా బుద్ధిమా న్వచః
తత్ర మిత్రం ప్రదుష్యేత మిథ్యాపృష్టం సుఖాగతమ్. ౫౮

టీక॥ బుద్ధిమాన్=మంచిబుద్ధిగలవాఁడు; సహసా=తటాలున; వచః=మాటను; పృచ్ఛ్యమానః=అడుగఁబడుచున్నవాఁడై; విశంకేత=సందేహించును. తత్ర=ఆపక్షమునందు; సుఖాగతం=సుఖముగావచ్చిన; మిత్రం=స్నేహితుఁడు; మిథ్యాపృష్టం=అబద్ధముగానడుగఁబడినవాఁడై; ప్రదుష్యేత=దుష్టుండగును.

తటాలుననడిగినచో, బుద్ధిమంతుండగువాఁడు, "మనయందేమోసందేహించి, వీరలడుగుచున్నారు; ఏమిచెప్పిననేమిసంభవించునో," అని, మాటచెప్పుటకేసంశయించును; అట్లు, సంశయించియడుగుటచే, సుఖాగతుండగు మంచిమిత్రుఁడునుగూడ, దుష్టుండుగాఁదోఁచును. అని, తాత్పర్యము.

అశక్య స్సహసా రాజన్ భావో వేత్తుం పరస్య వై

అంతస్స్వభావైర్గీర్తైస్తైర్నైర్ఘృణ్యం పశ్యతా భృశమ్. ౫౯

టీక॥ రాజన్ = రాముఁడా! స్వస్మిన్(అధ్యాహృతము)= తనయందు; భృశం=మిక్కిలియు; నైర్ఘృణ్యం=సామర్థ్యమును; పశ్యతా=చూచువానిచేతను; అంతస్స్వభావైః= దాఁచఁబడినయభిప్రాయముగల; తైః=ఆ; గీర్తైః= మాటలచేత; సహసా = తటాలున; పరస్య=ఇతరునియొక్క; ("వై" అనునది పాదపూరణార్థము)భావః=అభిప్రాయము; వేత్తుం = ఎఱుంగుటకు; అశక్యః=అలవిగాదు.

రాముఁడా! అడుగఁగానే, ఒకవేళ మాటలాడినను, అతండు తన యభిప్రాయంబును దాఁచుకొనియె మాటలాడును; అందువలన, ఎంతసమర్థుఁడనకైనను,అట్టివానిహృదయాభిప్రాయం బెఱుంగనలవిగాదు. అని, తాత్పర్యము.

నత్వస్య బ్రువతో జాతు లక్ష్యతే దుష్టభావతా
ప్రసన్నం వదనంచాపి తస్మాన్మే నాస్తిసంశయః. ౬౦

టీక॥ అస్య=ఈవిభీషణుఁడు; బ్రువతః= మాటలాడుచుండఁగా;దుష్టభావతాతు = దుష్టమయినయభిప్రాయము కలుగుటమాత్రము;నలక్ష్యతే= చూడఁబడలేదు. వదనంచాపి=ముఖంబును;ప్రసన్నం = నిర్మలముగానున్నది. తస్మాత్=అందువలన;మే=నాకు;సంశయః= సందేహము; నాస్తి=లేదు.

ఈవిభీషణుండుమాటలాడుచున్నాఁడుగదా! అతనిమాటలవలన,అతనికిదుష్టాభిప్రాయంబుండునట్లునాకుఁదోఁచలేదు;మఱియునతనిముఖముప్రసన్నముగానున్నది; కావున , నతనియందెంతమాత్రముసందేహములేదు.

అని, తాత్పర్యము.

అశంకితమతి స్స్వస్థో న శఠః పరిసర్పతి
నచాస్య దుష్టా వాక్చాపి తస్మాన్నాస్తి హ సంశయః.౬౧

టీక॥ శఠః = దుష్టాభిప్రాయము గలవాఁడు;అశంకితమతిః=సందేహములేనిబుద్ధిగలవాఁడై;స్వస్థః=నిర్భయుండై;నపరిసర్పతి=రాఁడు. అస్య= ఈవిభీషణునియొక్క; వాక్చాపి= మాటయు; దుష్టా=దుష్టమయినది;నచ=కా




దు, తస్మాత్=అందువలన; ఇహ=ఇందు; సంశయః= సందేహము; న= లేదు.

దుష్టాభిప్రాయముగలవాఁడు, నిస్సందేహముగా, నిర్భయముఁగా రాఁజాలఁడు; ఈవిభీషణుఁడు, ఎంతమాత్రముసందేహములేక నిర్భయముగా నున్నాఁడు; మఱియు, నితని మాటలును, నిర్దోషంబులుగా నున్నవి; కావున, వీనియందు నాకుసందేహములేదు.

అని, తాత్పర్యము.

ఆకార శ్ఛాద్యమానోఽపి న శక్యో వినిగూహితుమ్
బలాద్ధి వివృణోత్యేవ భావ మంతర్గతం నృణామ్. ౬౨

టీక॥ఆకారః=ముఖవికారము; ఛాద్యమానః=కప్పఁబడుచున్నను; వినిగూహితుం=దాఁచుటకు; నశక్యోహి=అలవిగాదుగదా! నృణాం= మనుష్యులయొక్క; అంతర్గతం=మనసునను న్న; భావం=అభిప్రాయమును; బలాత్=బలాత్కారమువలన; వివృణోత్యేవహి=తప్పక తెలియపఱచునుగదా!

ముఖవికారము, ఎంతదాఁచినను, దాఁగియుండదు; బలాత్కారంబున, హృదయగతంబగుభావంబును, దప్పక, బయలుపఱచును. అని, తాత్పర్యము.

దేశకాలోపపన్నంచ కార్యం కార్య విదాం వర
స్వఫలం కురుతే క్షిప్రం ప్రయోగేణాభి సంహితమ్. ౬౩

టీక॥ కార్యవిదాం= కార్యముల దెలిసినవారలలో; వర= శ్రేష్ఠుఁడా! దేశకాలోపపన్నంచ= దేశముతోను గాలముతోనుంగూడినదియు; ప్రయోగేణ= ప్రయోగముతో; అభిసంహితం= కూడినదియునగు; కార్యం=కార్యము; క్షిప్రం= శీఘ్రముగా; స్వఫలం= తనఫలమును; కురుతే= చేయుచున్నది.

కార్యవేత్తలలోనుత్తముండవగు రాముఁడా! కార్యంబు దేశకాలంబుల ననుసరించి, సరియయినపురుషులయందుఁబ్రయోగింపఁబడునేని, శీఘ్రంబుగా, ఫలించును.

అని, తాత్పర్యము.

ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యా వృత్తంచ రావణమ్




వాలినశ్చ వధం శ్రుత్వా సుగ్రీవం చాభిషేచితమ్. ౬౪
రాజ్యం ప్రార్థయ మానశ్చ బుద్ధిపూర్వ మిహాగతః

టీక॥ అయం (అధ్యాహృతము)= ఈవిభీషణుఁడు; తవ=నీయొక్క; ఉద్యోగం=ప్రయత్నంబును; సంప్రేక్ష్య=చూచి; మిథ్యావృత్తం= చెడ్డయాచారము గల; రావణంచ= రావణుని; సంప్రేక్ష్య(అధ్యాహృతము)= చూచి; వాలినః=వాలియొక్క; వధంచ= చంపుటను; అభిషేచితం= అభిషేకింపఁబడిన; సుగ్రీవంచ=సుగ్రీవుని; శ్రుత్వా=విని; రాజ్యం=దొరతనమును; ప్రార్థయమానశ్చ=కోరుచు; బుద్ధిపూర్వం=బుద్ధిమంతుఁడు గల్గునట్లుగా; ఇహ=ఇచ్చటికి; ఆగతః=వచ్చినాఁడు.

ఈవిభీషణుండు, నీవు రావణుని వధింపఁజేయుప్రయత్నంబునువిని, రావణునిదురాచారంబుఁజూచి, నీవువాలిం జంపిసుగ్రీవునకువానరరాజ్యంబునొసంగుటయువిని, రాజ్యంబుఁగోరి, నీయొద్దకు వచ్చినాఁడుగాని, వేఱుగాదు.

అని, తాత్పర్యము.

ఏతావత్తు పురస్కృత్య యుజ్యతే తత్ర సంగ్రహః. ౬౫

టీక॥ఏతావత్తు=ఇంతమాత్రము; పురస్కృత్య=ముందిడికొని; తత్ర=అందు; సంగ్రహః= స్వీకారము; యుజ్యతే= యుక్తముగానున్నది.

ఇదంతయు నిట్లున్నదికావున, విభీషణుని గ్రహింపవచ్చును.

అని, తాత్పర్యము.

యథాశక్తి మయోక్తంతు రాక్షసస్యార్జవం ప్రతి

టీక॥మయాతు=నాచేతను; రాక్షసస్య=విభీషణునియొక్క; ఆర్జవంప్రతి = కపటములేమినిగూర్చి; యథాశక్తి=నాశక్తినతిక్రమింపక; ఉక్తం=చెప్పఁబడినది.

నేను,నాశక్తికొలంది, నాకుఁదోఁచినమట్టుకు, విభీషణుని యోగ్యతనుగుఱించి,చెప్పినాను. అని,తాత్పర్యము.

త్వం ప్రమాణంతు శేషస్య శ్రుత్వా బుద్ధి మతాం వర. ౬౬

టీక॥ బుద్ధిమతాం=అధికమయినబుద్ధిగలవారలలో; వర=ఉత్తముఁడవయినరాముఁడా! శ్రుత్వా = విని ; శేషస్య=మిగతదానికి; త్వంతు = నీవె; ప్రమాణం=కర్తవు.

బుద్ధిమంతులలో నుత్తముండవగు రాముఁడా! నేనుజెప్పినది విన్నావుగదా! ఇంకమిగతకార్యమునకు, నీయిచ్ఛ. అని, హనుమంతుండు, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, సప్తదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండసప్తదశసర్గటీక,
ముగిసినది.



శ్రీ

## అష్టాదశసర్గప్రారంభః.

అథ రామః ప్రసన్నాత్మా శ్రుత్వా వాయుసుతస్య హ
ప్రత్యభాషత దుర్ధర్షః శ్రుతవానాత్మని స్థితమ్. ౧

టీక॥ అథ = అటుపిమ్మట; శ్రుతవాన్=అధికమయిన శాస్త్రాభ్యాసముగలవాఁడును; దుర్ధర్షః = ఎదిరింపనలవిగానివాఁడునగు; రామః = రాముఁడు; వాయుసుతస్య=హనుమంతునియొక్క; ("హ"అనుసది పాదపూరణార్థము) వచనం (అధ్యాహృతము)=మాటను; శ్రుత్వా=విని; ప్రసన్నాత్మా= ప్రసన్నమయినమనస్సుగలవాఁడై; ఆత్మని = మనస్సునందు; స్థితం= ఉన్నదాని; ప్రత్యభాషత = చెప్పెను.

అంత, మహాపండితుండును, పూర్వపక్షంబులచేఁగలఁతపెట్ట నలవిగానివాఁడునగురాముండు, హనుమంతుండుచెప్పినమాటనువిని, ప్రసన్నుండయి, తనమనంబుననున్న యభిప్రాయముం జెప్పనారంభించెను. అని, తాత్పర్యము.

మమాపితు వివక్షాస్తి కాచిత్ ప్రతి విభీషణమ్

స ౧౮

శ్రోతు మిచ్ఛామి తత్సర్వం భవద్భి శ్శ్రేయసి స్థితైః. ౨

టీక॥మమాపితు = నాకును;విభీషణంప్రతి=విభీషణునిగూర్చి;కాచిత్ =ఒకానొక;వివక్షా=చెప్పనిచ్ఛ;అస్తి=ఉన్నది.తత్ =దానిని;సర్వం=అంతను;శ్రేయసి=మేలునందు; స్థితైః=ఉన్నట్టి; భవద్భిః=మీచేత;శ్రోతుం=వినుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

నాకును,విభీషణునిగుఱించి, కొన్నిమాటలనుజెప్పవలెననియున్నది;నాశ్రేయస్సునుగోరునట్టిమీరందఱుఁ, జకక్కఁగావినవలయునని,కోరెదను.

అని, తాత్పర్యము.





మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన
దోషోయద్యపి తస్యస్యాత్సతామేతదగర్హితమ్. ౩

టీక॥ తస్య=అతనికి;దోషః=దోషము;యద్యపిస్యాత్ = ఉండినను; మిత్రభావేన= స్నేహితభావముచేత, శరణాగతభావముచేత ననుట; సంప్రాప్తం=వచ్చినవాని;కథంచన = ఎట్లయినను;నత్యజేయం=విడువను. ఏతత్ =ఇది;సతాం=పెద్దలకు;అగర్హితం=నిందింపఁబడనిది, పూజింపఁబడిన నుట .

అతనియందెంతదోషంబుండినను,శరణాగతుండనివచ్చినవాని , నెట్లయిననువిడువఁజాలను, ఈధర్మము, సత్పురుషులకుఁబూజనీయంబగునది.అని,రాముండు, చెప్పెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—— సుగ్రీవుండు, “విభీషణుండుదుష్టుండు,ఇతని నిగ్రహింపవలయు” ననియె. అంగదాదులు, “పరీక్షించి,యదుష్టుండైనచో, గ్రహింపవచ్చు”ననిరి. హనుమంతుండు,“విభీషణుండుదుష్టుఁడుకాఁడుకావున, గ్రహింపఁదగినవాఁడే” యని, వచించె.ఇంక, రాముండు“దుష్టుండైననుశరణాగతుండగువానిగ్రహింపకతప్పదు”. అని, సుగ్రీవమతంబును,“శరణాగతునియందుదుష్టాదుష్టపరీక్షయేతగదు.” అనియంగదాదిమతంబులను“పరిగ్రహింపవలెననుట సమానంబయినను , నిర్దోషుండనుకారణంబుసరిగాదు. శరణాగతుండనుమాటచెప్పుటమాత్రమే,గ్రహించుటకుఁగారణము నిర్దోషుండైయుండవలయుననునక్కఱలేదు ” అని హనూమన్మతంబును,నిరసించితనమతంబుఁజెప్పుచున్నాఁడు.మిత్రభావేన=స్నేహితభావముచేత, నిర్దోషుండగుటచేఁగాదతనిరక్షించుట;స్నేహితభావముగలిగియుండుటచేతనెపరిగ్రహింపవలెననుట. మిత్రభావేన-వాస్తవముగామిత్రత్వములేకున్నను, మిత్రత్వంబు నభినయించుటమాత్రమెచాలుననుట. “రాఘవం శరణంగతః, శరణ్యం శరణంగతః” అని పూర్వోత్తరస్థలంబుల, శరణాగత శబ్దవ్యవహారంబుండుటచే, ఇచ్చట , మిత్రభావేన = శరణాగతభావముచేత ననియర్థము. అట్లు,ఇతర స్థలంబునందును,“విదితస్సహి ధర్మజ్ఞః శ్శరణాగతవత్సలః” అని,శరణాగతశబ్దముచే నుపక్రమించి, “తేనమైత్రీ భవతుతేయదిజీవితుమిచ్ఛసి” (నీవు, జీవింపంగోరు

దు వేని, నీకతనితో మైత్రియగుఁగాక )
అని, మైత్రీశబ్దముచేఁ బర్యవసానము
చేయఁబడియున్నది. లేక; రాముండు,
ధీరోదాత్త నాయకుండుగావున, నా
శరణాగతుండని చెప్పుటకు లజ్జించి,
విభీషణుని మిత్రశబ్దముచే సగౌరవము
గావ్యవహరించుచున్నాఁడు. మిత్రభా
వేన=మిత్రత్వముచేత, నన్నుఁగుఱించి
కొంచెమేని యాభిముఖ్యంబునొందుట
మాత్రమె నాయంగీకారంబునకుఁ గా
రణమనుట; మిత్రభావేన=మిత్రక్రియ
చేత, మిత్రునివలెనభినయించుటచేతన
నుట, మనస్సుననెట్లున్నను, నేనుమిత్రుం
డననియభినయించుటమాత్రమెచాలున
నుట. మిత్రభావేన=స్నేహితభావముచే
త, శరణాగతభావముచేనని చెప్పవలసి
యున్నను, "తన్నాశ్రయింపఁదనయొద్ద
కువచ్చుటకై కొన్నియడుగులు పెట్టిన
వాఁడుంగూడఁదనకుసమానుండు" అను
నభిప్రాయంబునఁ, గరుణాసముద్రుండ
గు రామునిచేఁజెప్పఁబడినది. అట్లు, సీ
తాదేవియు, శరణాగతినేచెప్పవలసి
నస్థలంబున, "తేనమైత్రీభవతుతే య
దిజీవితుమిచ్ఛసి" అని, యాభిముఖ్యమా
త్రంబున, నాశ్రితుని, రాముండుదన
కుసమానంబుగామన్నింపుననునభిప్రా
యంబుననె, వచించె. మిత్రభావేన=మిత్ర
త్వమనుహేతువుచేత, "సుహృదస్సర్వ
భూతానాం" (సమస్తభూతంబులకు
నుస్నేహితుండు)అని, చెప్పఁబడియుం
డుప్రకారమున, "సర్వభూతమిత్రుం
డు రాముండు, నాయందునుసహజంబు
గస్నేహంబుగలవాఁడు" అని, నా
కుంగలసహజస్నేహంబుపురస్కరించి
యనుట. మిత్రభావేన="తన్మిత్రంయత్ర
విశ్వాసః" (ఎవ్వనియందునమ్మకంబుగ
లుగునోఅతండుమిత్రుండు) అనిచెప్పఁ
బడియున్నదికావున, నమ్మకంబుగలిగి
యుండుటచేత, "రాముండవశ్యము, న
న్నురక్షించును" అని, నమ్మియనుట. సం
ప్రాప్తం=వచ్చినవాని, అతనికి, నాయం
దుఁగొంచెమేని యాభిముఖ్యమాత్రము
గలిగినంతనే, నేనెయతండుండుచోటి
కిఁబోయి రక్షింపవలసియుండఁగా, న
తఁడేయిచ్చుటకివచ్చినప్పుడేనిచెప్పవలె
నుకిఅనుట. సంప్రాప్తం= చక్కఁగావ
చ్చినవాని, ద్వారంబునంబాదుకలువిడి
చిదేవనమస్కారంబునేయునట్లు, ఇత
రపదార్థంబులమనసునుంచక, "పరిత్య
క్తామయాలంకా మిత్రాణిచధనానిచ"
(నేను, లంకనుస్నేహితులనుధనంబుల
ను, విడిచివచ్చినాను)అని, సమస్తవిరోధి
వర్గంబునుబరిత్యజించి, మదేకశరణుఁ
డైవచ్చినవానినినుట. సంప్రాప్తం=చ




కక్కుఁగావచ్చినవాని, తల్లియుఁ దండ్రియుఁదోఁబుట్టువును గృహంబును రక్షకుండును స్నేహితుండునుగతియు, రాముండేయని, సమస్తంబును బరిత్యజించి, నన్నేపొందియున్నవాని ననుట. సంప్రాప్తం= చక్కఁగావచ్చినవాని, నాయంతరంగానుచరుల మూలముగా వచ్చిన వాని ననుట. సంప్రాప్తం = చక్కఁగా వచ్చిన వాని, లంకలోనేయుండి రాముని శరణు చొచ్చితినన్నమాత్రంబుననె, నేనెయచ్చటికిఁబోయిరక్షింపవలసియున్నప్పటికిని, నడవలేనివానిమీఁద గంగా నదియేపడు నట్లు,నాకుసులభంబుగా నేనున్నచోటికిఁదానెవచ్చినవానిననుట.సంప్రాప్తం= మాయొద్దకువచ్చుటయె మాకుఁజాలును, స్తోత్రము, పూజ, ధ్యానము, నమస్కారము, ఇవేమియు నక్కఱలేదు. నత్యజేయం= విడువఁజాలను, నేనుసర్వశక్తినైనను, శరణాగతుండనను శబ్దముచెప్పువానివిడుచుటయందు, నాకెంతమాత్రము, శక్తిలేదు. సంప్రాప్తంనత్యజేయం= వచ్చినవానివిడువఁజాలను, ఎవ్వఁడెవ్వఁడువచ్చును? ఎవ్వనిరక్షింతు? అని, కాచియున్న నేను, వచ్చినవానినెట్లువిడువఁజాలుదును? ఇతనిసంబంధంబున, రావణునింగూడరక్షింపవలసిన నేను, ఇతనినేయెట్లువిడుతును? నత్యజేయం = విడువను! వచ్చుటమాత్రముననె శ్లాఘనీయుండగువానివిడుచుటెట్లు? కథంచన= ఎట్లయినను, క్రొత్తదూడనీనినయావు, మునుపటిదూడలనువిడుచునట్లు, మిమ్మునైన విడుతును, క్రొత్తగావచ్చిన విభీషణునివిడువఁ జాలననుట. కథంచన = సర్వదేశసర్వకాల సర్వావస్థలయందుననుట. కథంచన = ఎట్లయినను మాయం బ్రయోగించుట మొదలగువానిచే, నాకుమహానిష్టము గావించువాఁడైననురక్షింపకవిడువననుట. కథంచ=ఎట్లయినను, ఈతనియందు, గుణంబులు లేకున్నను, ఎచ్చుగాదోషంబులెయున్నను, ఇతనింబరిగ్రహించుటయందఱకునిష్టము గాకున్నను, అతనింబరిగ్రహించుటవలనఁ, జూడఁజూడననిష్టంబులు వేనవేలు సంభవించునట్లుండినను, అధికమేల? నాప్రాణంబెపోవునట్లయినను, ఇతనివిడువననుట. తస్యదోషోయద్యపిస్యాత్= అతనికిదోషంబుండినను, మాయభిప్రాయంబునదోషమెలేదు, లేనిపోనిభయంబులుపెట్టుకొని యుండు మీయభిప్రాయంబునదోషంబుండినను, ఉండుఁగాక. తప్పుగాదు. దోషభోగ్యత్వంబనుమహావాత్సల్యంబువహించియున్ననాకు, ఆ




శ్రితదోషంబుపాదేయమేకదా! దోషో
యద్యపిస్యాత్=దోషంబున్నను, అదిశ
రణాగతునకుదోషముగాఁజాలదు, దూ
దిపోఁచమహాగ్నిహోత్రంబునంబడిదగ్ధ
మగునట్లు, శరణాగత్యభిసంధిమాత్రము
ననమస్తదోషంబులునుదగ్ధంబులయినవి.
దోషో యద్యపిస్యాత్=దోషంబుండినను,
అది, శరణాగతియనుసిరవధికగుణంబుగ
లవానికి, దోషంబనిపించుకొనదు. లేక;
దోషో యద్యపి=అతనికిదోషంబుండినను,
అదిదోషంబుగాదు. ఆదోషమునకు, శర
ణాగతియను మహాగుణంబుగల యత
నిసంబంధంబుగలిగియున్నదిగదా! కా
వున, అది, యతనికన్ననుమాకుశ్లాఘ్య
ము. స్యాత్=ఉండునుగాక. దోషం
బుండవలయుననియె కోరుచున్నాను.
గుణవంతునిరక్షించినచో, గుణంబుం
జూచిరక్షించి నట్లగుచున్నది. దోషిని
రక్షించుటయేమాకధికములేక; దోషో
యద్యపి=దోషంబున్నను, మమ్ము వధిం
పవలయునని కోరుటయనుదోషంబున్న
ను. తస్యస్యాత్= అతనికోర్కెయగుఁ
గాక, ఆశ్రితాభీష్టసిద్ధియె మాకుముఖ్యఫ
లము. ఇది, కపోతోపాఖ్యానానుగణాభి
ప్రాయంబని శ్రీవత్సాంకమిశ్రులు వచిం
చిరి. అట్లయితే; ఈమహామంత్రులేలనిం
దింతురు? అనినంజెప్పుచున్నాఁడు. ఏత
త్=ఇది; సతాం = పెద్దలకు; అగర్హి
తం= అనిందితము. మాయందధికప్రీ
తిచే, లేనిపోనిభయంబులుశంకించునట్టిమీ
కునిందితమయియుండినను, పరమార్థజ
వేత్తలగు, సత్పురుషులకు అనిందితమను
ట. తమ్ము వధింపవచ్చినవారలంగూడఁ,
కపోతాదులురక్షించిరి. మఱియు, "దు
ష్టజనపరిగ్రహముశిష్టనిందితము, శా
స్త్రనిషిద్ధముంగావునఁ, జేయరాదు."
అని, యందురు. "దుష్టజనులనుబరిత్యజిం
పవలెను" అనుటసామాన్యవిషయము-
"వధ్యుండైననుశరణాగతుండైనచో వి
డువకరక్షింపవలయునని, బోధించువిశే
షశాస్త్రశ్రుతియుండుటవలన, దు
ష్టుండైనను, శరణాగతుని రక్షించు
టయందు, శాస్త్రవిరోధంబు లేదు-
మఱివిధియైయున్నది. కావుననే, ఎ
ట్టి మహాపాపంబు గావించినవాఁడై
నను, శరణాగతుండయినచో, విద్వాం
సులతనికిదగు ప్రాయశ్చిత్తంబు వి
ధించి పరిశుద్ధుం గావింప వలయు
ననియు, నట్లువిధింపకున్నచో, మహా
ప్రత్యవాయంబు నొందుదురనియు, శా
స్త్రంబు ఘోషించు చున్నది. శరణా
గతుండుకానివానికిఁ బ్రాయశ్చిత్తంబె
విధింపరాదనియుఁజెప్పఁబడియున్నది.
కావున, పరిత్యాగవిధి, శరణాగతేత




రవిషయము. దుష్టుఁడయినను శరణాగతునిబరిత్యజించినం బ్రత్యవాయంబు జెప్పబడి యున్నది, కావున, శరణాగతుం డెట్టి దుష్టుండైనను, అతనివిడువ రాదు. ఈధర్మసూక్ష్మము నే చెప్పుచున్నాఁడు.—ఏతత్=ఈదుష్టశరణాగతపరిగ్రహము; సతాం= సామాన్యవిశేషశాస్త్రంబులు దెలిసినసత్పురుషులకు; అగర్హితం= నిందితముగాదు, పూజనీయమనుట.

సర్వశక్తియగువానికి, ఒకానొకవిషయమునందశక్తియు, సర్వజ్ఞునకు, ఒకానొకవిషయమునందజ్ఞానంబును, "మిత్రభావేన" అనునీశ్లోకముచేఁదెలుపఁబడినదని, గోవిందయతులు, వచించిరి.

సుగ్రీవ స్త్వథ తద్వాక్య మాభాష్యచ విమృశ్యచ
తత శ్శుభతరం వాక్య ముువాచ హరిపుంగవః. ౪

టీక॥ అథ=అటుపిమ్మట; హరిపుంగవః=వానరశ్రేష్ఠుండగు; సుగ్రీవస్తు=సుగ్రీవుఁడును; తద్వాక్యం=ఆ రాముని మాటను; ఆభాష్యచ= అనువదించియు; విమృశ్యచ=ఆలోచించియు; తతః=అంత; శుభతరం= మిక్కిలియుమంగళకరమున; వాక్యం=మాటను; ఉవాచ = చెప్పెను.

అంత, వానరశ్రేష్ఠుండగుసుగ్రీవుండు, రాముండు చెప్పినమాటననువదించి, యాలోచించి, తనకు రామునందుంగల యధికపక్షపాతంబును దెలుపునట్టి, యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

సుదుష్టో వాప్యదుష్టోవా కి మేష రజనీచరః

టీక॥ ఏషః—ఈ; రజనీచరః = రాక్షసుఁడు; సుదుష్టోవాపి= మిక్కిలియుదుష్టుండుగాని; అదుష్టోవాపి= దుష్టుండు కానివాఁడుగాని; కిం=ఎందుకు?

ఈ రాక్షసుండు, దుష్టుండు గానియదుష్టుండు గాని, యతనితో మనకేమిప్రయోజనము? ఇతనినిమనమవశ్యమువిడువవలసినదే! అని, తాత్పర్యము.

ఈదృశం వ్యసనం ప్రాప్తం భ్రాతరం యః పరిత్యజేత్. ౫
కో నామ స భవే త్తస్య య మేష న పరిత్యజేత్







టీక॥ యః=ఎవ్వఁడు; ఈదృశం=ఇట్టి; వ్యసనం=కష్టమును; ప్రాప్తం=పొందినట్టి; భ్రాతరం=అన్నను; పరిత్యజేత్=విడుచునో; ఏషః=వీఁడు; యం=ఎవ్వని; నపరిత్యజేత్=విడువఁడో; సః= అట్టివాఁడు; తస్య=అతనికి; కః= ఎవ్వఁడు; భవేత్=అగును?

ఈతండు, ఇట్టిమహాకష్టంబుఁబొంది యున్నయన్ననుంగూడ విడిచివచ్చినాఁడే; ఇంక నిట్టికృతఘ్నుండు, ఎవ్వనివిడువఁడు? కాఁబట్టి యితనిఁబరిగ్రహింపఁ గూడదు. అని సుగ్రీవుండు, రాముని తోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

వానరాధిపతే ర్వాక్యం శ్రుత్వా సర్వా నుదీక్ష్యచ. ౬
ఈష దుత్స్మయమానస్తు లక్ష్మణం పుణ్యలక్షణమ్
ఇతి హోవాచ కాకుత్స్థో వాక్యం సత్యపరాక్రమః. ౭

టీక॥ సత్యపరాక్రమః= సత్యమయిన పరాక్రమముగల; కాకుత్స్థః= రాముఁడు; వానరాధిపతేః = వానరేశ్వరుండగు సుగ్రీవుని యొక్క ; వాక్యం = మాటను; శ్రుత్వా=విని; సర్వాన్ = అందఱనుగూర్చి; ఉదీక్ష్యచ = చూచియు; పుణ్యలక్షణం= మంచిలక్షణములుగల; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; ఈషత్=కొంచెము; ఉత్స్మయమానస్తు= నవ్వుచునే; ఇతి=ఇట్లని; వాక్యం=మాటను; ఉవాచ= చెప్పెను "హ" అనునది పాదపూరణార్థము.

సత్యపరాక్రముండగు రాముఁడు, వానరేశ్వరుండయిన సుగ్రీవుండు చెప్పిన మాటనువిని, వానరులనందఱంజూచి, పుణ్యలక్షణుండగు లక్ష్మణుని పైఁజెలువొప్పలయంగటాక్షంబుఁబఱపి, యీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

అనధీత్యచ శాస్త్రాణి వృద్ధా ననుపసేవ్యచ
నశక్య మీదృశం వక్తుం యదువాచ హరీశ్వరః. ౮

టీక॥ హరీశ్వరః=వానరాధిపతియగుసుగ్రీవుండు ; యత్=ఏమాటను ; ఉవాచ=చెప్పెనో; ఈదృశం= ఇట్టి మాటను; వక్తుం=చెప్పుటకు; శాస్త్రాణి=శాస్త్రములను; అనధీత్యచ=అధ్యయనింపకయు; వృద్ధాన్=పెద్దలను ;







అనుపసేవ్యచ = సేవింపకయు; సశక్యం=అలవిగాదు-

శాస్త్రాధ్యయనంబును వృద్ధసేవయు నెచ్చుగాఁగావించినవానికిఁ దక్క మతిమెఇవ్వనికిని యిప్పుడువానరేశ్వరుండగు సుగ్రీవుండు చెప్పినట్టిమాటంజెప్పనలవిగాదు- అని, తాత్పర్యము-

అస్తి సూక్ష్మతరం కించి ద్యదత్ర ప్రతిభాతి మే
ప్రత్యక్షం లౌకికంవాపి విద్యతే సర్వరాజసు- ౯

టీక॥ అత్ర=ఈవిషయమునందు; ప్రత్యక్షం=కండ్లకగపడునదియు; లౌకికం వాపి = లోకవ్యవహారసిద్ధంబునగు; యత్=ఏది; సూక్ష్మతరం = మిక్కిలియుసూక్ష్మమయినది; కించిత్=కొంచెము; అస్తి= ఉన్నదో; తత్ (అధ్యాహృతము)=అది; మే = నాకు; ప్రతిభాతి=తోఁచుచున్నది-

ఈవిషయమునందుఁ, బ్రత్యక్షంబును లౌకికంబునగు నొక్క సూక్ష్మధర్మము, సమస్తరాజులకును, గల్గియున్నది; అదినాకు స్ఫురించుచున్నది; చెప్పెదవినుండు. అని, తాత్పర్యము-

అమిత్రా స్తత్కులీనాశ్చ ప్రాతిదేశ్యాశ్చ కీర్తితాః
వ్యసనేషు ప్రహర్తార స్తస్మా దయ మిహాగతః- ౧౦

టీక॥ తత్కులీనాశ్చ= అతనిజ్ఞాతులును; ప్రాతిదేశ్యాశ్చ=ఇరుగుపొరుగు రాజులును; వ్యసనేషు= కష్టములయందు; ప్రహర్తారః=ప్రహరించువారలుగాను; అమిత్రాః=శత్రువులుగాను; కీర్తితాః=చెప్పఁబడినారు- తస్మాత్= అందువలన; అయం=ఈవిభీషణుండు; ఇహ=ఇచ్చటికి; ఆగతః=వచ్చినాఁడు-

జ్ఞాతులును, ఇరుగుపొరుగురాజులును, గష్టంబువచ్చినప్పుడు ప్రహరింపం జూతురు, కావున, శత్రువులని చెప్పఁబడినారు; అట్లు, ఈవిభీషణుఁడు; రావణునకుజ్ఞాతికావునఁ, గష్టంబువచ్చినప్పుడు, అతనింబరిత్యజించి, యిచ్చటికివచ్చినాఁడు-అని, తాత్పర్యము-




అపాపా స్తత్కులీనాశ్చ మానయంతి స్వకాన్ హితాన్
ఏష ప్రాయో నరేంద్రాణాం శంకనీయ స్తు శోభనః- ౧౧

టీక॥అపాపాః=కుటిలులుకానట్టి; తత్కులీనాః= వారికులంబునంబుట్టిన రాజులు;హితాన్= మేలుగలిగించున ట్టి;స్వకాన్ = తమజ్ఞాతులను; మాన యంతి=పూజింతురు. శోభనః= గట్టి వాఁడయిన; ఏషతు= ఈజ్ఞాతిమాత్ర ము; నరేంద్రాణాం=రాజులకు;ప్రా యః=అధికముఁగా;శంకనీయః=సందే హింపఁదగినవాఁడు,

యోగ్యులగురాజులు , తమకిష్టుల యినజ్ఞాతులను గౌరవింతురు ; అట్టి యోగ్యులగురాజులుగూడ , శౌర్యాది సంపన్నుండగుజ్ఞాతిని, ఎంతమాత్రము నమ్మరు; ఇంకఁ , బాపిష్ఠుండగురావ ణుండు, జ్ఞాతినినమ్మునా? అట్లు, ఈ విభీషణుండు,రావణునిచేశంకింపఁబడిన వాఁడై, యతనితోవిరోధించి, యిచ్చ టికి, వచ్చినాఁడుగాని,వేఱుగాదు.

అని, తాత్పర్యము.

య స్తు దోష స్త్వయా ప్రోక్తో హ్యాదానే రిబలస్య చ
తత్ర తే కీర్తయిష్యామి యథాశాస్త్ర మిదం శృణు. ౧౨

టీక॥ త్వయా=నీచేత;అరిబలస్య= శత్రుబలముయొక్క; ఆదానేచ= గ్ర హించుటయందును; యః = ఏ; దో షస్తు= దోషమును; ప్రోక్తః=చెప్పఁబ డినదో.తత్ర=ఆవిషయమునందు; తే= నీకొఱకు; యథాశాస్త్రం= శాస్త్ర మునతిక్రమింపక; కీర్తయిష్యామి = చెప్పెదను. ఇదం=ఈమాటను ; శృ ణు=వినుము.

శత్రుబలంబుసంగ్రహించుకొను వి షయమయి,నీవేదోషంబుచెప్పియున్నా వో , ఆవిషయమునందును, నీకు, య థాశాస్త్రంబుగాఁజెప్పెదను;వినుము.

అని, తాత్పర్యము.

న వయం తత్కులీనాశ్చ రాజ్యకాంక్షీచ రాక్షసః

టీక॥ వయం=మనము ; తత్కులీనాశ్చ = అతనికులంబునఁబుట్టినవారల

మును; న=కాము. రాక్షసః = విభీష ణుఁడు; రాజ్యకాంక్షీచ = రాజ్యముఁ గోరువాఁడును.

మనము రాక్షసులము కాము కావున, రాక్షసరాజ్యంబుగోరము; కాఁబట్టి, మనయందతనికిద్వేషంబుగలుగదు; మఱి యు, మనసాహాయ్యంబున, అతండు, రాజ్యంబు పొందవలయుననియున్నాఁ డు, కావున, మనలనతండువిడువఁడు.

అని, తాత్పర్యము.

పండితా హి భవిష్యంతి తస్మా ద్గ్రాహ్యో విభీషణః. ౧౩

టీక॥ రాక్షసాఅపి (అధ్యాహృత ము)=రాక్షసులును; పండితాః= పం డితులుగా; భవిష్యంతిహి=ఉందురుగ దా! తస్మాత్=అందువలన; విభీషణః= విభీషణుఁడు; గ్రాహ్యః=గ్రహింపఁద గినవాఁడు.

అయితే, రాక్షసులకింతవిమర్శ యున్నదా? అని, యాక్షేపింతురుకాఁ బోలు; అట్లుకాదు; రాక్షసులలోనుం గొందఱు పండితులుందురు; కావున, విభీషణుండట్టియభిప్రాయముతో వచ్చినవాఁడుకాఁబట్టి, యతనింబరిగ్ర హింపవచ్చును. అని, తాత్పర్యము.

అవ్యగ్రాశ్చ ప్రహృష్టాశ్చ న భవిష్యంతి సంగతాః
ప్రణాదశ్చ మహా నేష తతో స్య భయ మాగతమ్. ౧౪
("పవాదశ్చమహానేషః" ఇతిపాఠాంతరం.)
ఇతి భేదం గమిష్యంతి తస్మా ద్గ్రాహ్యో విభీషణః

టీక॥ తే(అధ్యాహృతము)= అజ్ఞా తులు; అవ్యగ్రాశ్చ=కలఁతలేనివారలు ను; ప్రహృష్టాశ్చ=సంతసించిన వార లునై; సంగతాః= కూడినవారలుగా; నభవిష్యంతి=ఉండరు. ఇతి=ఇందువల న; భేదం=పరస్పరవిరోధమును; గమి ష్యంతి=పొందుదురు. ఏషః= ఈ; ప్ర ణాదశ్చ=ధ్వనియు; మహాన్=గొప్పది గా; (పాఠాంతరపక్షమునందు) ప్ర వాదః=లోకవార్త; మహాన్= గొ ప్పదిగా; భవతి(అధ్యాహృతము) = అగుచున్నది. తతః = అందువలన; అ స్య=ఈతనికి; భయం=భయము; ఆ గతం=వచ్చినది. తస్మాత్= అందువల

న;విభీషణః= విభీషణుఁడు;గ్రాహ్యః= గ్రహింపఁదగినవాఁడు.

జ్ఞాతులు,ఎప్పటికిని, పరస్పరముగ లఁతలేకసంతుష్టులయి యొకరితోనొక రుకలసియుండరు; ఎల్లప్పుడునుపరస్పర మువిరోధముగలిగియుందురు; అట్లువిభీషణుండువిరోధించి,బలిష్ఠుండగురావణు నకుభయపడి మనయొద్దకువచ్చినట్టున్న దిగానివేఱుగాదు;అందుకుఁదగినట్లు, ఇతనికంఠధ్వనింజూచినను భయంబునొం దినట్లుకనుపడుచున్నది ; లోకవార్తయు,జ్ఞాతులు, ఒకరితోనొకరుకలహింపుచుందురనుట,సుప్రసిద్ధమయియున్న దిగదా! కావుననితండుభయపడి మన యొద్దకువచ్చినాఁడుకాబట్టి , యితనిం బరిగ్రహింపవలెను.

అని, తాత్పర్యము.

న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతోపమాః. ౧౫
మద్విధా వా పితుః పుత్రా స్సుహృదోవా భవద్విధాః

టీక॥ తాత=నాయనా; భ్రాతరః= తోఁబుట్టువులు;సర్వే=అందఱును;భరతోపమాః= భరతునితోఁబోలిక-గలవారలు;నభవంతి=కారు. పితుః=తండ్రికి; మద్విధాః=నాయట్టివారలగు; పుత్రావా=కొడుకులుగాని;నభవంతి (అధ్యాహృతము)ఉండరు.భవద్విధాః=నీయట్టివారలగు; సుహృదోవా=స్నేహితులు కాని;నభవంతి (అధ్యాహృతము) = ఉండరు.

నాయనా!తోఁబుట్టువులందఱు, భరతునివంటివారలుకాఁజాలరు; తండ్రికిఁగొడుకులును,నాయట్టివారలు, పుట్టరు; నీవంటిస్నేహితులును, కలుగఁజాలరు; కాఁబట్టి, యందఱునుమనయట్లె, పరమధార్మికులయియుందురనితలంపకుము. అని,రాముండు , సుగ్రీవాదులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ సుగ్రీవ స్సహలక్ష్మణః. ౧౬
ఉత్థాయేదం మహాప్రాజ్ఞః ప్రణతో వాక్య మబ్రవీత్

టీక॥మహాప్రాజ్ఞః=మహాపండితుండగు; సుగ్రీవః = సుగ్రీవుఁడు;సహలక్ష్మ

ణః=లక్ష్మణునితోఁ గూడినవాఁడై; ఏవం=ఇట్లు; రామేణ=రామునిచేత; ఉక్తస్తు=చెప్పఁబడిన వాఁడైనంతనె; ఉత్థాయ=లేచి; ప్రణతః= నమస్కరించినవాఁడై; ఇదం=ఈ; వాక్యం= మాటను; అబ్రవీత్=చెప్పెను.

మహాపండితుండగుసుగ్రీవుండు, రాముండుతన్నునులక్ష్మణునింజూచి చెప్పినమాటనువిని, లేచి, రామునకునమస్కరించి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

రావణేన ప్రణిహితం త మవేహి విభీషణమ్. ౧౭
తస్యా హం నిగ్రహం మన్యే క్షమం క్షమవతాం వర

టీక॥ క్షమవతాం= యుక్తవ్యాపారములుగలవారలలో; వర=శ్రేష్ఠుఁడవగు రాముఁడా! తం=ఆ; విభీషణం= విభీషణుని; రావణేన= రావణునిచేత; ప్రణిహితం=రహస్యముగాఁబంపఁబడినవానిఁగా; అవేహి=ఎఱుంగుము. అహం= నేను; తస్య=ఆవిభీషణునియొక్క; నిగ్రహం=నిగ్రహించుటను; క్షమం= యుక్తముసుగా; మన్యే=తలంచెదను.

యుక్తవ్యాపారములు గల వారలలోనుత్తముండవగు రాముఁడా! ఈవిభీషణుని రావణుండె యిచ్చటికి రహస్యముగాఁబంపి యున్నాఁడని యెఱుంగుము; కావున, నతసినిగ్రహించుట యుక్తమనితలంచెదను. అని, తాత్పర్యము.

రాక్షసో జిహ్మయా బుద్ధ్యా సందిష్టో యమిహా గతః. ౧౮
ప్రహర్తుం త్వయి విశ్వస్తే ప్రచ్ఛన్నో మయివా నఘ
లక్ష్మణేవా మహాబాహో సవధ స్సచివై స్సహ. ౧౯

టీక॥ అనఘ=పాపరహితుండవగు; మహాబాహో = పెద్దచేతులుగల రాముఁడా! అయం=ఈ; రాక్షసః=రాక్షసుఁడు; జిహ్మయా=కుటిలమయిన; బుద్ధ్యా= బుద్ధిచేత; సందిష్టః=పంపఁబడినవాఁడై; ప్రచ్ఛన్నః = కప్పఁబడినవాఁడై; విశ్వస్తే=నమ్మినట్టి; త్వయి=నీయందుఁగాని; మయి= నాయందుఁగాని; లక్ష్మణేవా = లక్ష్మణునియందుఁగాని; ప్రహర్తుం = ప్రహరించుటకు; ఇహ=ఇచ్చటికి; ఆగతః= వచ్చినాఁడు. సచివై స్సహ=మంత్రు

స ౧౮

లతోఁగూడ;సః=అ;వధః=చంపుట; భవేత్(అధ్యాహృతము)=అగును.

పాపరహితుండవు మహాబాహుండవగు రామాఁడా! ఈరాక్షసుండు, కుటిలోపాయంబున, రావణునిచేఁబంపఁబడినవాఁడై,మనమునమ్మియుండఁగాఁ, బచ్ఛన్నరూపంబున , నిన్నుఁగాని, నన్నుఁగాని, లక్ష్మణుంగాని,ప్రహరించుటకై , యిచ్చటికివచ్చినాఁడు ; అట్లు మనమందఱము,వధింపఁబడవలసివచ్చును.అని, తాత్పర్యము.

రావణస్య నృశంసస్య భ్రాతా హ్యేష విభీషణః

టీక॥ ఏషః=ఈ;విభీషణః=విభీషణుఁడు;నృశంసస్య= క్రూరుండగు ; రావణస్య=రావణునియొక్క;భ్రాతా=తమ్ముఁడుగదా!

విభీషణుఁడు, దుష్టుండగురావణుని తమ్ముండుగదా! ఇతని నెట్లునమ్మవచ్చును,అని,సుగ్రీవుండు,రామునితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

ఏవ ముక్త్వా రఘుశ్రేష్ఠం సుగ్రీవో వాహినీపతిః. ౨౦
వాక్యజ్ఞో వాక్యకుశలం తతో మౌన ముపాగమత్

టీక॥ వాహినీపతిః = వానరసైన్యమునకుఁబ్రభువును; వాక్యజ్ఞః=మాటలనెఱింగినవాఁడునగు; సుగ్రీవః= సుగ్రీవుఁడు; వాక్యకుశలం=మాటలయందుసమర్థుఁడగు; రఘుశ్రేష్ఠం= రామునిగూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వా= చెప్పి; తతః=అంత;మౌనం=ఊరకుండటను; ఉపాగమత్=పొందెను.

వానరాధీశ్వరుండును,మాటలయందుఁబండితుండునగుసుగ్రీవుండు, మాటలయందుఁబండితుండగురామునితోనీప్రకారముచెప్పి, యంత,నూరకుండెను.

అని, తాత్పర్యము.

సుగ్రీవస్య తు త ద్వాక్యం రామ శ్శ్రుత్వా విమృశ్యచ. ౨౧
తత శ్శుభరతం వాక్య మువాచ హరిపుంగవమ్

టీక॥ రామః = రాముఁడు;సుగ్రీవస్య= సుగ్రీవునియొక్క; తత్ = ఆ;వా

క్యం=మాటను;శ్రుత్వాతు= విన్నంత నే;విమృశ్యచ=ఆలోచించియు;తతః= అటుపిమ్మట; హరిపుంగవం=వానరశ్రేష్ఠుండగుసుగ్రీవునిగూర్చి; శుభతరం= మంగళమునం దాసక్తమయిన ; వాక్యం=మాటను;ఉవాచ=చెప్పెను.

రాముండు, సుగ్రీవుండుచెప్పినమాటనువిని,యాలోచించి,యంత,వానరోత్తముండగుసుగ్రీవుంజూచి , మంగళకరంబగునీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

సుదుష్టో వాప్య దుష్టోవా కి మేష రజనీచరః. ౨౨
సూక్ష్మమప్యహితం కర్తుం మమా శక్తః కథంచన

టీక॥ఏషః=ఈ;రజనీచరః= రాక్షసుండగువిభీషణుండు;సుదుష్టోవాపి= మిక్కిలియుదుష్టుండుగాని; అదుష్టోవా= దుష్టుండుకానివాండుగాని; కిం=ఏమి? మమ=నాకు;కథంచన = ఎట్లయినను; సూక్ష్మమపి=కొంచెమయినను; అహితం=కీడును;కర్తుం= చేయుటకు;అశక్తః=సమర్థుండుగాండు.

ఈవిభీషణుండు , దుష్టుండగుంగాక లేకయదుష్టుండగుంగాక; నన్నితండేమి చేయంగలండు?ఇతండేవిధంబుననైనను, కొంచెమయినను, నాకుం, గీడుచేయంజాలండు.అని, తాత్పర్యము.

పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవరాక్షసాన్. ౨౩
అంగుళ్యగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరిగణేశ్వర

టీక॥హరిగణేశ్వర= వానరసమూహములకుంబ్రభుండవగు సుగ్రీవుండా! అహం(అధ్యాహృతము) = నేను;ఇచ్ఛన్=కోరుచు;పృథివ్యాం = భూమియందు; విద్యమానాన్ (అధ్యాహృతము)=ఉన్నట్టి;రాక్షసాన్చైవ= రాక్షసులను;పిశాచాన్=పిశాచంబులను;దానవాన్=దానవులను;యక్షాన్ = యక్షులను; తాన్=వారలను; సర్వాన్(అధ్యాహృతము)= అందఱను; అంగుళ్యగ్రేణ=పెద్దవ్రేలికొనచేత; హన్యాం= చంపుదును.

వానరేశ్వరుండవగుసుగ్రీవుండా!ఈ లంకలోనిరాక్షసులను మాత్రమేకాదు;

నేనిచ్చింతునేని, ఈలోకంబుననుండు రాక్షసులనందఱను, పిశాచంబులను, దానవులను యక్షులను, వీరలనందఱుంగూడ నా పెదవ్రేలిచివరచే, వధించివుత్తును? ఈవిభీషణుండునన్నేమిచేయఁగలఁడు? అని, తాత్పర్యము.

శ్రూయతే హి కపోతేన శత్రు శ్శరణ మాగతః. ౨౪
అర్చితశ్చ యథాన్యాయం స్వైశ్చ మాంసై ర్నిమన్త్రితః

టీక॥కపోతేన=పావురముచేత; ఆత్మానం(అధ్యాహృతము)—తన్ను; శరణం=రక్షకునిఁగా; ఆగతః=పొందినట్టి; శత్రుః = శత్రువు;యథాన్యాయం= న్యాయము నతిక్రమింపక; అర్చితశ్చ= పూజింపఁబడినవాఁడునై;స్వైః=తనవైన;మాంసైః= మాంసములచేత;నిమంత్రితశ్చ= భోజనార్థముప్రార్థింపఁబడినవాఁడును.ఇతి(అధ్యాహృతము)= అని;శ్రూయతేహి= వినఁబడుచున్నది గదా!

ఒకపావురము, తనశత్రువొకండు తన్నుశరణుపొందఁగానే , యతనింజక్కఁగాఁ బూజించి, యతనికిఁదనదేహమాంసమునొసంగిభుజింపుమనెను, ఈ సంగతి యందఱుకును దెలిసనదే కదా! అని,తాత్పర్యము-

విశేషార్థము.— కపోతేన=పావురముచేత,ధర్మాధికారము లేనట్టితిర్యగ్జంతువుచేతననుట; అట్టిపక్షియొశరణాగతునిరక్షించినదే;ఇంక మేమురక్షింపవలయుననిచెప్పవలయునా?కపోతేన=పావురముచేత; ఒక్క పావురముచేత, దానికెవ్వరు సహాయములేకున్నను, చేయఁబడినది; ఇట్టి సహాయ సంపత్తితోఁ గూడి మనము రక్షింప వలయుననిచెప్పవలయునా?శత్రుః—సహజశత్రుండునుతనభార్య నపహరించుటచేఁ కృత్రిమ శత్రుండునగుబోయవాఁడు,బోయవాఁడుపావురముభార్య.నపహరించెను;అట్టిశత్రువునుంగూడ నదిరక్షించెను ; మనకు విభీషణుండు, అట్టి యపకారముచేయలేదు; మనమతని రక్షింపకున్ననింకమనపౌరుషంబెందుకు? శరణం, ఆగతః=రక్షకునిగాఁ బొందినవాఁడు; పావురముండు చెట్టుకిందికివచ్చిన వాఁడు , " సోఞ్జలిం శిరసాబద్ధ్వా వాక్యమాహవనస్పతిమ్॥ శరణం హిగతోస్మ్యద్య దేవతామిహ వాసినీమ్. " (ఆబోయవాఁడు, వృక్షమును

గూర్చి, చేమోడ్పుశిరంబునం దాల్చి, యిట్లనిచెప్పెను. "ఇచ్చటనున్న దేవతను శరణుపొందితిని") అని, యాబోయవాఁడు, వృక్షముతోఁ జెప్పినవాఁడుగాని, పావురమునుగూర్చియయినం జెప్పలేదు; అట్లయినను, అదియితని రక్షించినది; విభీషణుండు, "రాఘవం శరణంగతః" అని నన్నే శరణుపొందినట్లు స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు. ఇంకనతని, నెట్లురక్షింపకుండవచ్చును? అర్చితశ్చ=పూజింపఁబడినవాఁడును; బోయవాఁడు తనకు సహజశత్రుం డగుటవలనను, దనభార్యనపహరించుట వలనను, అతండుఆపన్నుండైనను, అతనిను పేక్షింపవలసియున్నను, అతనివధింపవలసియున్నను, అతిథియగునతని దేవునిఁగాఁదలంచి, నిప్పుదీసికొనివచ్చి, యతనిచలి దీర్చి, పూజించినది. యథాన్యాయం=న్యాయమునతిక్రమింపక; వీనోతానోయనికాదు, మంచిస్నేహితునింబోలె, మిక్కిలియునాదరంబున, నతనియాఁకలియంతయుఁదీఱునటుఁ, గొంచెమయినమనసునఁగల్మషంబుంచుకొనక, పూజించినది. స్వైశ్చమాంసైర్నిమంత్రితః= తనవైనమాంసములచేత, బయటనుండిపండ్లుఁగాయలుదీసికొనివచ్చి వానిచేఁగాని, లేకతనయొద్ద నుండు ద్రవ్యాంతరంబులచేఁగాని, యుపచరింప లేదు; మఱియజ్ఞానులచేనాత్మగా నేదలంపఁ బడినదియు. జ్ఞానులచేఁగూడ, "శరీరమాద్యం ఖలుధర్మసాధనం" (దేహము మొదటిదైనధర్మసాధనముగదా!) అని, యెంతయుంగొనియాడంబడుచున్నదియు నానాప్రయాసంబులం బోషింపఁ బడినదియునగుశరీరము నేనిప్పులో బడవైచి, భుజింపుమని ప్రార్థించెను. తిర్యగ్జంతువేయింతదూరముగావించియుండఁగా, నాయట్టివాఁడు, శరణాగతునకుఁ గేవలరిక్షణము మాత్రమె చేయకున్న, మనధర్మపౌరుషపరాక్రమంబులకేమిప్రయోజనము?

స హి తం ప్రతిజగ్రాహ భార్యాహర్తారమాగతమ్. ౨౫
కపోతో వానరశ్రేష్ఠ కిం పున ర్మద్విధో జనః

టీక॥ వానరశ్రేష్ఠ=వానరోత్తముండవగుసుగ్రీవుఁడా! సః=ఆ౹కపోతః= పావురము; ఆగతం=వచ్చినట్టి; భార్యాహర్తారం= భార్యనపహరించి

నట్టి; తం= ఆబోయవాని; ప్రతిజగ్రాహహి= ప్రతిగ్రహించెనుగదా! మద్విధః=నాయట్టి; జనః=జనము; ప్రతిగృహ్ణీయాదితి(అధ్యాహృతము)=ప్రతిగ్రహింపవలయుననని; కింపునః=చెప్పవలసినదేమియున్నది?

వానరోత్తముండవగుసుగ్రీవుఁడా! ఆపావురము, తనభార్యనపహరించినట్టి,యాబోయవాఁడు రాఁగానే యతనింబరిగ్రహించి రక్షించెనే! ఇంక, నాయట్టివాఁడుఁ రక్షింపవలయుననిచెప్పవలయునా? యేమి?

అని,తాత్పర్యము.

విశేషార్థము.—సః కపోతః=ఆపావురము, మావలె ధర్మానుష్ఠానముచేయవలసినజాతియందుఁగాని, శరణాగతరక్షకులనివినుతి కెక్కినవారి వంశంబునంగాని, పుట్టినదికాదు; అట్టి పక్షిగూడననుట.తం=అట్టి,జాతిచేతను స్వభావంబుచేతను, అతిక్రూరమయిన యాచారముగలవాఁడును, సమస్తపక్షిజాతులకును మృత్యువువంటివాఁడును, విపరీతకర్మంబులనే యనుష్ఠించువాఁడును, లేశమయినను అనుతాపములేనివాఁడును,గొంచెమేనియానుకూల్యంబులేనివాఁడును, ఉపాయాంతరశూన్యుండును,ఆకపోతమువద్దకురావలెననివచ్చినవాఁడుగాదు, ఆకస్మికముగావచ్చినవాఁడును, కావున, ఏయుపాయంబుననైనను, వధింపఁదగిన వాఁడయినను, ఆబోయవానిని, ప్రతిజగ్రాహ= ప్రతిగ్రహించి, తనదేహంబునుంగూడ విడిచి , యతనిరక్షించెను. "భార్యాహర్తారం = తనభార్యనుహరించినవాని, కేవలజాతివిరోధిమాత్రమెకాదు , తనభార్యనుంగూడ, నపహరించినట్టిమహాశత్రువనుట. ఇట్లు , నాభార్యనపహరించినట్టిరావణుండువచ్చినను, అతనినింగూడ నేను రక్షింపవలసినదేయని యభిప్రాయము. ఆగతం=వచ్చినవాని, కపోతంబతనిరక్షించుటకుఁగా, నతఁడుచేసినయుపాయంబంతయు, నాచెట్టుక్రిందికి వచ్చుటమాత్రమె. ఆబోయవాఁడు, వనస్పతిదేవతంగుఱించిచెప్పినమాటకపోతంబునకుఁదెలియదు. అది,యతండువచ్చుటనుజూచి, అతండ బడలిభయంబుఁజెందియుండుటను,ఆ[illegible] నియాకారంబులవలనంగనుంగొని, [illegible] తనిరక్షించినదిగాని , యతండు[illegible] ప్రార్థింపనుంగూడలేదనుట "స, క పోతః"(ఆపావురము)అనుటచే, శ్లో[illegible] పోతోపాఖ్యానమునందుంబోలెఁ [illegible]

పోతదేహముధరించివచ్చిన, దేవతగాని ఋషిగానికాదు; మఱిప్రాకృతకపోతమెయనిస్పష్టీకరింపఁబడినది. అయితే, ఈకపోతము, గజేంద్రాదులుంబోలెఁ, బూర్వజన్మ సంస్కారముచే ధర్మానుష్ఠాన బుద్ధినొందినది. కపోతమనుటచేఁ, దిర్యగ్జంతుత్వంబును, శాస్త్రంబుదెలియమియు,బుద్ధిహీనతయు, సూచింపఁబడినవి. వానరశ్రేష్ఠ= వానరోత్తముఁడవగు సుగ్రీవుఁడా! ఒకానొక వానరుండు, పెద్దపులింజూచి, భయపడి తానున్న చెట్టుమీఁదికి వచ్చినయొకానొకపురుషునకభయంబొసంగెను.అప్పుడావ్యాఘ్రంబును, ఆపురుషుని దఱుముకొనివచ్చి,యాచెట్టుక్రిందనుండి, చెట్టుమీఁదనిర్భయంబుగా నిద్రింపుచున్న పురుషుంగాచికొనియున్న యవ్వానరుంజూచి, "వానరుఁడా! ఈతండు, మనమృగంబులకన్నిఁటికిని శత్రువు; కావున, నీతనింజంపిన, మనకందఱకును, క్షేమంబుగలుగును; ఇతనిం బడఁద్రోసిపుణ్యంబుగట్టుకొనుము" అనియెంత ప్రార్థించినను,వానరుండు, శరణాగతరక్షణదీక్షనువిడువఁడయ్యె. అంతఁ, గ్రమంబునఁబురుషుండు మేల్కొన్నపిదప, వానరుండునిద్రించుటయు, నతనికిఁబురుషుండు కాపుండుటయుంజూచి, వ్యాఘ్రంబు, పురుషుంజేరి, "ఈవానరుండు, నేనుబోయినవెనుక, స్వస్థంబుగా నిన్నుభక్షింపనున్నాఁడు; కావున, నీవీతనింబడఁద్రోయుము; నేనితనిభక్షించి పోయెదను;అంతనీవు, సుఖంబుగాఁబోవచ్చును"అనవుడు, నాపురుషుండు,పాపస్వభావుండు,కావున, వానరుంబడఁద్రోసె. అంతం బెద్దపులి, నరమాంసలోభంబున, వానరుంజూచి, "నీవెంత కాపాడినను, చూచితివా, నీకుద్రోహంబుఁజేసె.కావున,సందేహింపక,నీవతనింబడఁద్రోయుము,మనమందఱము సుఖంబునొందఁగలము"అని,బోధించి, విడువ,నవ్వానరుండు, చెట్టుమీఁదికుఱికి భీతుండగుపురుషునకభయంబునొసంగి, యతండుతనకపకారంబుగావించినను, తానతనివిడువకరక్షించె.నీవు, వానరేశ్వరుండవై, వానరశ్రేష్ఠుండవై, సాధారణుఁడగు వానరమాత్రుండేకావించిన మహాధర్మంబునేలయవలంబింపవు?అని, "వానరశ్రేష్ఠ"అనుటచేసూచింపఁబడినది.కింపునర్మద్విధోజనః=ఇంకనాయట్టివాఁడేమిచేయవలెను?పావురమంతటిదేయట్లుచేసియుండఁగా; మద్విధః = నాయట్టివాఁడు, శరణాగతులనురక్షిం

స ౧౮

తుమనిధ్వజంబెత్తియున్నరఘువంశంబు నంబుట్టినవాఁడను, "షష్టిర్వర్ష సహస్రాణి లోకస్య చరతాహితమ్। పాండురస్యాతపత్రస్య ఛ్ఛాయాయాం జరితంమయా" (అఱువదివేలసంవత్సరములు, లోకమునకు హితమాచరించుచు, శ్వేతచ్ఛత్రమునీడను,జీర్ణ శరీరుండనైతిని) అని,లోకరక్షణదీక్షితుండగు దశరథునిపుత్త్రుండను, వసిష్ఠ విశ్వామిత్రాదిమహర్షులకు శిష్యుండను, యోగీశ్వరుండగు జనకునితో సంబంధము వొందినవాఁడను, ధర్మస్వరూపుఁడని ప్రసిద్ధుండను,అట్టినేశరణాగతుని విడువవచ్చునా?అట్టినేనే,శరణాగతునిహింసించినచో,నింకధర్మంబులాచరించువారలెవ్వరు? మఱియు, పావురంబంతటి పక్షి,తనజాతికి విరోధియయినసుదన భార్యనపహరించినవాఁడైనను, తన్ను బ్రత్యక్షముగాశరణుపొందకున్నను,దన యొద్దకువచ్చినమాత్రముచేతనేబోయ వానిరక్షించెనే; ఇంకనాయట్టివాఁడు, నాకుశత్రుండుగానివాఁడును, నాకే విధమయినయపకారంబునుంజేయనివాడును నాయొద్దకు వచ్చి శరణు శరణనిప్రార్థింపుచున్న వాఁడునగు విభీషణుని, విడువవచ్చునా?

ఋషేః కణ్వస్య పుత్త్రేణ కందునా పరమర్షిణా. ౨౬.
శృణు గాథాం పురా గీతాం ధర్మిష్ఠాం సత్యవాదినీమ్
("ధర్మిష్ఠాంసత్యవాదినా"ఇతిపాఠాంతరం.)

టీక॥ కణ్వస్య= కణ్వుండను; ఋషేః=ఋషియొక్క-పుత్త్రేణ= కొడుకును; పరమర్షిణా=శ్రేష్ఠుండగు ఋషియును-(పాఠాంతరపక్షమునందు)సత్యవాదినా= సత్యమునేచెప్పువాఁడునగు; కందునా= కందుమహాముని చేత; పురా=మున్ను; గీతాం= చెప్పఁబడినదియు,ధర్మిష్ఠాం=అధికమైనధర్మ ముగలదియు,అధికమయినధర్మమును బోధించునదియుననుట; సత్యవాదినీం= సత్యమయినయర్థమును చెప్పునదియునగు; గాథాం=శ్లోకమును; శృణు=వినుము.

కణ్వ మహాముని పుత్త్రుండును బరమర్షియును సత్యవాదియు నగు కందుమహాముని ; మున్ను, పరమధర్మబోధకంబగు నొకగాథంజెప్పియున్నాఁడు;దానింజెప్పెదనువినుము. అని, తాత్పర్యము.

విశేషార్థము.— కపోతము, తిర్యగ్జంతువు; అదియనుష్ఠించిన మాత్రముచేతనే, ధర్మముకాఁజాలదు. అని,శంకించి, దానికిశాస్త్రవిధియునున్నదనిచెప్పుచున్నాఁడు. కణ్వస్య, పుత్రేణ=కణ్వమహర్షికొడుకు, అనుటచే మహాకులప్రసూతుం డని చెప్పఁబడినది. పరమర్షిణా = "ఋషి"యనఁగా , "ఋషీగతౌ" అనుధాతువునం బుట్టినది, జ్ఞానంబుగలవాఁడు , ఉత్తముఁడగుఋషియనఁగా, సమస్తవేదవేదాంతపారంగతుండనుట ఇందుచే , పరమార్థంబెఱింగినవాఁడని సూచింపఁబడినది. సత్యవాదినా=యథార్థంబుఁజెప్పువాఁడు,అనుటచే; వేదోక్తప్రకారంబుచెప్పువాఁడని సూచితమయినది. అట్టి; కండునా= కండుమహామునిచేత; పురా=మున్ను; గీతాం= పాడఁబడిన; కండుమహాముని కల్పించినది కాదు , వేదోక్తంబునేయాయన స్మరించినాఁడనుట. ధర్మిష్ఠాం= వేదోక్త పరమ ధర్మంబు బోధించు నదియు; ఇందుచే , శరణాగతరక్షణమె పరమప్రయోజనమని చెప్పఁబడినది. సత్యవాదినీం= మహాఫలమునుగల్గించునట్టియర్థమునుజెప్పునట్టి;గాథాం=శ్లోకమును,అనేకార్థంబులను,సులభంబుగానభ్యసించుటకై, సంకోచించిశ్లోకరూపంబుగాఁజెప్పఁబడినదాని;శృణు=వినుము,ఇదివఱకు, దీనివినకుండుటచే, నీవిట్లభిప్రాయపడుచున్నావుగదా! దీనింజెప్పెదను;ఎచ్చరికతోవినుము.

బద్ధాంజలిపుటం దీనం యాచంతం శరణాగతమ్. ౨౭
న హన్యా దానృశంస్యార్థ మపి శత్రుం పరంతప

టీక॥ పరంతప = శత్రువులందపింపఁజేయునట్టివాఁడా!బద్ధాంజలిపుటం= కట్టఁబడిన చేమోడ్పునెడు దొప్పగలవానిని; దీనం=భయపడినవానిని; యాచంతం= యాచించువానిని; శరణాగతం — శరణుపొందినవానిని; శత్రుమపి=శత్రువునైననను;ఆనృశంస్యార్థం=అకార్పణ్యముకొఱకు;నహన్యాత్ — వధింపఁగూడదు.

శత్రువులఁదపింపఁ జేయునట్టివాఁడా!చేతులుమొగుడ్చికొని, దీనుండై,శరణువేఁడుచున్నశరణాగతుని,అకార్పణ్యధర్మపరిపాలనంబునకై, యెంతమాత్రమువధింపఁగూడదు- అని, తాత్పర్యము.

విశేషార్థము.— బద్ధాంజలిపుటం=చేమోడ్పుగీలించినవానిని, చేమోడ్పుగీలించినంత నేరక్షింపవలెననుట; దీనం=భయపడినవాని, చేమోడ్పుగీలించుటయు నావశ్యకము గాదు ; భయపడినట్లుండుటయే. చాలుననుట. యాచంతం=యాచించువాని ; అవేమియు లేకున్నను , మనఃపూర్వకము గాకపోయినను , యాచించుటమాత్రమే చాలుననుట. శరణాగతం = శరణుపొందినవాని,ఇక కాపాడుమని ప్రార్థించుచున్నవానిరక్షింప వలెనని చెప్పవలసిన దేమి?యట్టి,శత్రుమపి=శత్రువునైనను; న హన్యాత్=చంపఁగూడదు.ఎందుకు,అనగాఁ,జెప్పుచున్నాఁడు.ఆనృశంస్యార్థం=అక్రౌర్యము కొఱకు , దయకొఱకనుట ; మిక్కిలియుదయగలవాఁడనుకీర్తియుండుటచే, ఇతఁడుక్రూరుఁడు! అనులోకాపవాదపరిహారము. ఇదియైహికము.దయాదులచేగలుగుపుణ్యంబుపారలౌకికము, ఇట్లు రెండులోకంబులందును సుఖంబునొందుటకనుట.పరంతప" అనుటచేకందువునుఒకరాజుంగుఱించినే, యీకథంజెప్పినట్లు తెలియుచున్నది. పరంతప=పరాక్రమశాలులగు శత్రువులయందునీ పౌరుషంబుఁజూపుము; శరణాగతులయందుఁబౌరుషంబుఁజూపి యేమిప్రయోజనము?

ఆర్తో వా యదివా దృప్తః పరేషాం శరణాగతః. ౨౮
అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా

టీక॥కృతాత్మనా= పండితునిచేత; ఆర్తోవా=దుఃఖితుండుగాని; దృప్తో యదివా=గర్వితుండైనవాఁడుగాని; పరేషాం=శత్రువులలోని; శరణాగతః=శరణుపొందినట్టి;అరిః=శత్రువు; ప్రాణాన్=ప్రాణములను;పరిత్యజ్య= విడిచి; రక్షితవ్యః = రక్షింపఁబడవలసినవాఁడు.

శత్రువులలోనెవ్వఁడైన శరణాగతుండయ్యేనేని, ఆర్తుండుభీతుండుగాని, గర్వితుండుగాని,పండితుండగువాఁడతని,తన ప్రాణంబులం బోఁగొట్టుకొనియయినను రక్షింపవలయును.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—పరేషాం = శత్రువులలో,శరణాగతః=శరణుచొచ్చినవాఁడు,శరణాగతుండనుశబ్దముమాత్రముచెప్పినంజాలుననుట;అరిః=శత్రువు;

అపకారియయినను విడువఁగూడదనుట ఆర్తోవా=ఆవేగము గలవాఁడు గాని, ఎప్పుడెప్పుడు రక్షింతురో, యని యధికావేగముగలవాఁడు గాని, లేక, తాను గావించియున్న యపకారమును గుఱించి, భయపడియున్నవాఁడు గాని; దృప్తోయది వా=ఎట్లు రక్షింపరు? అని గర్వించియున్నవాఁడు గాని, లేక, అట్టియాపత్కాలమునందును, నిట్టి యపకారముగావించియున్నానేయని యెంతమాత్రము భయమునుంచక, మునుపటివలెనెంతయు గర్వించియున్నవాఁడు గాని; కృతాత్మనా= పండితుని చేత, ధర్మశాస్త్రరహస్యములు దెలిసిన వాని చేత; ప్రాణాన్; పరిత్యజ్య, రక్షితవ్యః=ప్రాణంబుల విడిచి రక్షింపఁబడవలసినవాఁడు అస్థిరంబులగు ప్రాణంబులను విడిచియయినను, స్థిరంబగు శరణాగతరక్షణరూపధర్మంబు నాచరింప వలసినది. "కృతాత్మనా" (పండితుని చేత) అనుటచే, పండితుండగువాఁడు చేయకున్న, సాధారణులకన్న నధికదోషంబునొందునని సూచింపఁబడుచున్నది.

స చేద్భయాద్వా మోహాద్వా కామాద్వాపి న రక్షతి. ౨౯
స్వయా శక్త్యా యథాసత్త్వం తత్పాపం లోకగర్హితమ్

టీక॥ సః=అతండు; భయాద్వా=భయంబువలనఁగాని; మోహాద్వా= అజ్ఞానమువలనఁగాని; కామాద్వాపి = కామమువలనఁగాని; స్వయా=తనదైన; శక్త్యా=శక్తిచేత; యథాసత్త్వం=శక్తినతిక్రమింపక; నరక్షతి చేత్=రక్షింపకుండునేని; తత్=అది; పాపం= పాపము. లోకగర్హితం= లోకముచే నిందింపఁబడినది.

భయంబుచేఁగాని యజ్ఞానంబుచేఁగాని కామంబునంగాని, యట్లు తనశక్తి వంచనలేక, రక్షింపకున్నచో, నతండు, గొప్పపాపంబునొందును, లోకంబునంనుననిందితుండగును.

విశేషార్థము.— శరణాగతరక్షణమునందు విధినిబోధించి, యింకఁ జేయకున్నంగల్గు ప్రత్యవాయముం జెప్పుచున్నాఁడు.— భయాత్=ఇతండు శత్రువు, ఇప్పుడితనిం గాపాడుదునేని, యితండు పిమ్మటనన్నే హింసించునను భ

యుంబువలనంగాని; మోహాత్=శాస్త్రార్థజ్ఞానముత లేకుండుటవలనఁగాని; కామాద్వాపి=తనయిచ్ఛవలనఁగాని, లేక, ఇదిసమయము, ఇప్పుడు, వీనివలన నేమైన నాకపేక్షింపవలయునను కోరికవలనఁగాని; స్వయా=తనదైన; శక్త్యా=సామర్థ్యముచేత; ద్రవ్యవినియోగము, పరాక్రమము, తుదకు శరీరత్యాగము, వీనిచే యథాయోగ్యముగాననుట. యథాసత్త్వం = తనశక్తినతిక్రమింపక, శక్తివంచన చేసినచో మహాదోషంబనిభా చింపఁబడినది. నరక్షతిచేత్ = రక్షింపకుండునేని; తత్ = అరక్షింపకుండుట; పాపం = పాపముగలిగించునది, పరలోకంబునందు దుఃఖంబు గలిగించు ననుట. లోకగర్హితం=లోకముచేనిందితమయినది. పరలోకంబునందు మాత్రమె కాదు , ఈలోకంబునందును , అపకీర్తిఁబొంది నిందితుండగును. ఉభయలోకంబులందును, బాధితుండగు ననుట.

వినష్టః పశ్యత స్తస్యా రక్షిణ శ్శరణాగతః. ౩౦
ఆదాయ సుకృతం తస్య సర్వం గచ్ఛే దరక్షితః

టీక॥అరక్షితః=రక్షింపఁబడనట్టి; శరణాగతః=శరణుచొచ్చినవాఁడు; వినష్టః=నశించినవాఁడై, నశించినకార్యముగలవాఁడైయనుట; తస్య = ఆ; అరక్షిణః=రక్షింపనట్టివాఁడు; పశ్యతః=చూచుచుండఁగా; తస్య=అతనియొక్క; సుకృతం=పుణ్యమును; సర్వం=అంతను; ఆదాయ=తీసికొని; గచ్ఛేత్ = పోవును.

మఱియు, శరణాగతునిరక్షింపకున్నచో, నట్లుతండు, నష్టకాముండై, రక్షించుటలేదని చెప్పినవాఁడు చూచుచుండఁగానే, యతండిదివఱకుఁగూర్చిపెట్టుకొన్నపుణ్యంబునంతయుఁదీసికొనిపోవును; అట్లుసమస్తసంచితపుణ్యనాశంబు వాటిల్లును. అని, తాత్పర్యము.

ఏవం దోషో మహానత్ర ప్రపన్నానా మరక్షణే. ౩౧
అస్వర్గ్యం చాయశస్యంచ బలవీర్య వినాశనమ్

టీక॥ అత్ర = ఇందు; ప్రపన్నానాం=శరణాగతులయొక్క; అరక్షణే=

రక్షింపకుండుటయందు; ఏవం= ఇట్లు; మహాన్=గొప్పదగు; దోషః= దోషము; అస్తి(అధ్యాహృతము)=కలదు. తత్(అధ్యాహృతము)= అది; అస్వర్గ్యంచ=నరకముగలిగించునదియు;అయశస్యంచ = అపకీర్తిగలిగించునదియు; బలవీర్యవినాశనం = బలమునుపరాక్రమమునునశింపజేయునదియు.

శరణాగతుల రక్షింపకున్నచో, నిట్లుమహాదోషంబుగలుగును; ఇందువలన , నరకంబుగలుగుటయేకాక, అపకీర్తియు, బలపరాక్రమ నాశంబును, సంభవించును. అని, తాత్పర్యము.

కరిష్యామి యథార్థంతు కండో ర్వచన ముత్తమమ్. ౩౨

టీక॥యథార్థం=సత్యమును; ఉత్తమం=శ్రేష్ఠంబునగు; కండోః= కండుమహామునియొక్క; వచనం=మాటను; కరిష్యామితు=చేసెదనే.

ఉత్కృష్టఫలప్రదంబును సమస్తశిష్ట జనాదృతంబునగు, కండుమహాముని వచనంబు నవశ్యముచేసెదను.

అని, తాత్పర్యము.

ధర్మిష్ఠంచ యశస్యంచ స్వర్గ్యం స్యాత్తు ఫలోదయమ్

టీక॥తత్(అధ్యాహృతము)=అది; ధర్మిష్ఠంచ = అధికధర్మముగలిగించునదియు; యశస్యంచ=అధికమయినకీర్తిగలిగించునదియు, స్వర్గ్యం=స్వర్గమును గలిగించునదియు ; ఫలోదయం= ఫలముయొక్కయుత్పత్తిగలదియు; స్యాత్=అగును.

అట్లాచరించుటచేఁ, బ్రత్యవాయపరిహారముమాత్రమె కాదు ; అధికధర్మంబును,మహాకీర్తియు , స్వర్గప్రాప్తియు , నిట్లుమహాభ్యుదయంబుగల్గును.అని, తాత్పర్యము.

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే. ౩౩
అభయం సర్వభూతేభ్యో దదామ్యే తద్వ్రతం మమ

టీక॥ సకృదేవ= ఒకటిమాత్రే; ప్రపన్నాయ = శరణాగతుండును;తవ

నీవాఁడను ; అస్మి = అయితిని. ఇతి చ=అనియు; యాచతే= యాచించువాఁడునగువానికొఱకు ; సర్వభూతేభ్యః=సమస్తభూతంబులవలనను; అభయం=భయములేమిని;దదామి= ఇచ్చెదను. ఏతత్ =ఇది;మమ= నాయొక్క; వ్రతం=నియమము.

ఒకసారి,"శరణాగతుండను, నీవాఁడను"అని చెప్పి యాచించు నేని, యతనికి, ఎవ్వరివలన నేమి భయంబున్నను, యాభయంబులన్నియుఁదీర్చెదను; ఇది నావ్రతము.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—"శ్రుతిస్స్మృతిస్సదాచారస్స్వస్యచ ప్రియమాత్మనః, సమ్యక్సంకల్పజః కామో ధర్మమూలమిదంస్మృతం"(వేదము,ధర్మశాస్త్రము, శిష్టాచారము, తన మనస్సంతోషము, మంచి సంకల్పమువలనం గలిగిన కామము, ఇవిధర్మప్రమాణములు) అని, యాజ్ఞవల్క్యస్మృత్యుక్త ప్రకారంబున, కండుగాధాముఖంబునస్మృతి, తన్మూలకానుమితంబగు శ్రుతియుఁ జెప్పఁబడినది. కపోతవృత్తాంతముచే, శిష్టాచారమును, దెలుపఁబడినది. ప్రతిపక్షవధోపాయత్వప్రకటనంబునను, ధర్మప్రాప్తియు, పౌరుషపరాక్రమాదిసాఫల్యంబును, మహాకీర్తియుఁ, బరలోకసౌఖ్యంబుంగలుగునని చెప్పుటవలనను, మనస్సంతోషంబు సూచింపఁబడినది. ఇంక సమ్యక్సంకల్ప పూర్వకకామరూపంబగు నైదవప్రమాణంబుం జెప్పుచున్నాఁడు,—సకృదేవ=ఒక్కమాఱే, ఇతరోపాయంబులయందు, రెండుమూఁడుమాఱులు చేయుట,యావశ్యకమయియుండునుగాని,శరణాగతి విషయమునందు మాత్రము, [illegible] వృత్తిలేదనుట. ప్రపన్నాయ=పొందినవానికొఱకు,"యేయేగత్యర్థాస్తేజ్ఞానార్థాః"("పొందుట"యనునర్థముగలవేవిగలవో, అవియన్నియు, "తెలియుట" అనునర్థముగలవి.) అనున్యాయమువలన, ప్రపన్నాయ"అనుటచే,మానసికశరణాగతిచెప్పఁబడెను. తవాస్మి ఇతి చ=నీవాఁడనై [illegible] చేవాచికశరణాగతిచెప్పఁబడినది.యాచతే=యాచించువానికొఱకు"మానసికశరణాగతి,వాచికశరణాగతి" ఈరెంటిలోనొకటినాశ్రయించిన వానినింగూడ నేను రక్షింపవలసినదే.లేక;"ప్రపన్నాయ."అనుటచేను పాదముచెప్పఁబడుచున్నది."తవాస్మీతిచ"అనుటచే,ప్రార్థనముచెప్పఁబడు

చున్నది. ఇట్టివానికొఱకు, సర్వభూతేభ్యః=సమస్తభూతంబులవలనను,ఎవ్వరెవ్వరివలనభయంబుగల్గినదో, వారియందఱివలనను, అనుట. అభయం=భయములేకుండుటను; దదామి=ఇచ్చెదను. అభయంబనఁగా మోక్షమె.అట్లు బ్రహ్మవేత్తయగువాఁడు, అభయంబునొందుననుశ్రుతి, యభయమె, బ్రహ్మజ్ఞానఫలంబనిచెప్పుచున్నది. ఇది,త్రైవర్గికఫలంబులకునుపలక్షణము. ఏతత్, మమ, వ్రతం = ఇదినాయొక్కవ్రతము. ఎట్టికాలమునందును విడువఁదగినదికాదనుట. లేక, సర్వభూతేభ్యః=సమస్తప్రాణులకొఱకు ; ఎవ్వఁడెవ్వఁడుశరణాగతుండగునో, జాతిగుణాదిభేదములేక వారలకందఱకనుట, లేక, శరణాగత సంబంధులగు భృత్యాదులకును అభయం, దదామి= అభయంబునొసంగెదను. అట్లు, "పశుర్మనుష్యః పక్షీవా యేచ వైష్ణవసంశ్రయాః, తేనైవ తేప్రయాస్యంతి తద్విష్ణోః పరమంపదం" (వైష్ణవునాశ్రయించి యున్నపశువులును మనుష్యులును పక్షులును, ఏవిగలవో అవన్నియు, అతనితోఁ బరమంబగు విష్ణుపదంబు నొందును) అని,చెప్పఁబడియున్నది.

అనయైనం హరిశ్రేష్ఠ దత్తమస్యాభయం మయా. ౩౪
విభీషణోవా సుగ్రీవ యదివా రావణ స్స్వయమ్

టీక॥హరిశ్రేష్ఠ= వానరోత్తముఁడవగు;సుగ్రీవ = సుగ్రీవుఁడా!అయం(అధ్యాహృతము) = ఈతఁడు;విభీషణోవా=విభీషణుఁడుగాని;స్వయం= తానే;రావణోయదివా= రావణుండుగాని;ఏనం=ఈవిభీషణుని;ఆనయ = తోడ్కొనిరమ్ము.మయా=నాచేత;అస్య=ఇతనికి,అభయం = భయములేమి;దత్తం=ఇయ్యఁబడినది.

వానరోత్తముఁడా! ఇతఁడుయథార్థముగావిభీషణుండో మఱియెవ్వఁడేని విభీషణవేషముతో వచ్చినాఁడోయేమోయనిసంశయింపవలదు;ఇతఁడువిభీషణుండుకాని, లేకమహాశత్రుండగు రావణుండెకాని, మఱల,నితండువిభీషణుఁడుగాఁడేయని యిచ్చటఁజెప్పరావలదు ; ఇతనికినే నభయంబొసంగితిని; తత్క్షణమేతోడ్కొనిరమ్ము. అని,సుగ్రీవునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

రామస్యతు వచ శ్శ్రుత్వా సుగ్రీవః ప్లవగేశ్వరః. ౩౫
ప్రత్యభాషత కాకుత్స్థం సౌహార్దే నాభిచోదితః

టీక॥ ప్లవగేశ్వరః=వానరులకుఁబ్రభుండగు;సుగ్రీవః=సుగ్రీవుఁడు; రామస్య=రామునియొక్క; వచః= మాటను;శ్రుత్వాతు = విన్నంతనే;సౌహార్దేన=ప్రేమచేత; అభిచోదితః=ప్రేరింపఁబడినవాఁడై;కాకుత్స్థం= రామునిఁగూర్చి;ప్రత్యభాషత = బదులుచెప్పెను.

వానరేశ్వరుండగు సుగ్రీవుండు,రాముండుచెప్పినమాటనువిని, యతనికింగలశరణాగతుల యందలి ప్రేమకచ్చెరువొంది, రామునింజూచి , యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

కిమత్ర చిత్రం ధర్మజ్ఞ లోకనాథ సుఖావహ. ౩౬
య త్త్వమార్యం ప్రభాషేథా స్సత్త్వవాన్ సత్పథే స్థితః

టీక॥ ధర్మజ్ఞ = ధర్మంబుఁదెలిసినవాఁడవు; లోకనాథ=లోకంబులకుఁబ్రభుండవు; సుఖావహ = సుఖంబుఁగలిగించువాఁడవగు రాముఁడా! సత్త్వవాన్=మంచిప్రవర్తముగలవాఁడవును; సత్పథే = సన్మార్గమునందు; స్థితః = ఉన్నవాఁడవునగు; త్వం = నీవు; ఆర్యం = పూజ్యమయిన మాటను;ప్రభాషేథాః (ఇతి) యత్ = చెప్పుచున్నావనునది యేదిగలదో ; అత్ర=ఈవిషయమునందు; చిత్రం=ఆశ్చర్యము ; కిం=ఏమి?

ధర్మజ్ఞుండవులోకనాథుండవుసర్వభూతంబులకునుసుఖంబుగలిగించు వాఁడవు దృఢవ్రతుఁడవుసన్మార్గప్రవర్తకుండవునగునీవు, ఇట్లుధర్మిష్ఠంబగుమాటం జెప్పువిషయమయి యేమియాశ్చర్యము? అని, తాత్పర్యము.

విశేషార్థము.— అట్లుసుగ్రీవుండు రామునిమాటలకచ్చెరువొంది, చెప్పనారభించి,యంతలో, రామునిస్వాభావికకల్యాణగుణంబులందలంచుకొని, రామునట్టివాఁడు, ఇట్టిధర్మిష్ఠ వచనంబులంజెప్పువిషయమయి యేమియు నాశ్చర్యములేదని, చెప్పుచున్నాఁడు.ధర్మజ్ఞ = ధర్మముఁదెలిసినవాఁడా! ధ

స ౧౮

మహాత్మ్యతత్త్వంబులు దెలిసిన నీవుధర్మానుష్ఠానంబు సేయుట యాశ్చర్యముగాదు. లోకనాథ = లోకేశ్వరుఁడా! ప్రభువు, భృత్యవర్గంబు లరక్షించుట యేమిచిత్రము? సుఖావహ = సుఖంబుగలిగించువాఁడా! నీవు అవాప్త సమస్త కాముండవు; భక్తప్రయోజనంబులు గావించుటకుబద్ధకంకణుండవు; అట్టినీవు, శరణాగతులకుసుఖంబుచేయుటయాశ్చర్యముగాదు; సత్యవాక్ = దృఢవ్రతుండవు, అట్టినీవునీవ్రతంబుపరిపాలించుకొనుటయందుఁజిత్రమేమి: సత్వవాక్ = బలవంతుఁడవు, అనంతబలశాలివగునీవు,ఆశ్రితభయంబునివారించుట; యాశ్చర్యకరముగాదు. సత్వధేస్థితః = సన్మార్గమునిమిత్తముఁడున్నవాఁడవు, ధర్మసంస్థాపనంబు కొఱకేయవతరించినట్టినీవుశరణాగతరక్షణ రూపవిశేషధర్మంబుననుష్ఠించుట వింతగాదు. శరణాగతరక్షణంబునకు,ధర్మజ్ఞత్వాదులలోనొకటి యెచాలును. ఇంకనన్నియుఁజేరియున్నచోటఁ జెప్ప వలసిన దేమి?

మమ చాప్యంతరాత్మా యం శుద్ధం వేత్తి విభీషణమ్. ౩౭
అనుమానాచ్చ భావాచ్చ సర్వత స్సుపరీక్షితః

టీక॥ అయం = ఈ; మమ = నాయొక్క; అంతరాత్మాచ = మనస్సును; విభీషణం = విభీషణుని; శుద్ధం = పరిశుద్ధునిఁగా; వేత్తి = ఎఱింగినది. అనుమానాచ్చ = యుక్తివలనను; భావాచ్చ = ఆకారమువలనను; సర్వతః = అన్నిటను; సుపరీక్షితః = చక్కఁగా బరీక్షింపఁబడినాఁడు.

విభీషణుని వధింపవలసిన దన్న నా మనస్సునకుఁగూడ, విభీషణుండుపరిశుద్ధుండని తెలిసినది; నీవునుహనుమంతుండును జెప్పినయుక్తులవలనను, అతనియాకారాదులవలనను,అన్నిటను,నిస్సందేహముగాఁబరీక్షించి, తెలిసికొంటిని.

అని, తాత్పర్యము.

తస్మాత్క్షిప్రం సహాస్మాభి స్తుల్యో భవతు రాఘవ. ౩౮
విభీషణో మహాప్రాజ్ఞ స్సఖిత్వంచా భ్యుపైతు నః

టీక॥ రాఘవ = రాముఁడా! తస్మాత్ = అందువలన ; మహాప్రా

జ్ఞః=మహాపండితుఁడగు; విభీషణః=విభీషణుఁడు; క్షిప్రం=శీఘ్రముగా; అస్మాభిస్సహ=మాతోఁగూడ; తుల్యః=సమానుఁడు; భవతు = అగుఁగాక; నః = మాకు; సఖిత్వంచ=స్నేహితుండగుటను; అభ్యుపైతు= పొందునుగాక.

రాముఁడా! అందువలన, మహాపండితుండగు విభీషణుండు, శీఘ్రంబున, నిచ్చటికివచ్చి, మాలోనొకండైయుండుఁగాక, మాకుస్నేహితుండును అగుఁగాక అని, రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— క్షిప్రం=శీఘ్రముగా, ఇదివఱకు, అజ్ఞానంబున, నేను, ఆవిభీషణుని సంగ్రహింపవలదని, చెప్పితిని; అందువలన, ఇంతయాలస్యమయినది; ఇఁకనైనను, శీఘ్రముగా నానతిమ్ము; ఇంకనేను, ఆలస్యంబుకొంచెమేని సహింపఁజాలను.

తతస్తు సుగ్రీవవచో నిశమ్య త
ద్ధరీశ్వరేణాభిహితం నరేశ్వరః. ౩౯
విభీషణేనాశు జగామ సంగమం
పతత్రిరాజేన యథా పురందరః

టీక॥ తతస్తు=అటుపిమ్మటను; నరేశ్వరః — మనుష్యులకుఁబ్రభుండగు రాముండు; తత్ — ఆ; సుగ్రీవవచః= సుగ్రీవునిమాటను; నిశమ్య=విని; హరీశ్వరేణ= వానరాధిపునిచే; అభిహితం= చెప్పఁబడిన; విభీషణేన=విభీషణునితో; సంగమం— చేరుటను; పతత్రిరాజేన— గరుత్మంతునితో; పురందరోయథా= ఇంద్రుండువలె; ఆశు=శీఘ్రముగా; జగామ=పొందెను.

అంత, నరాధీశ్వరుండగు రాముండు, సుగ్రీవుండు చెప్పినమాటను విని, యంత, సుగ్రీవుండుపోయి విభీషణునిం బిలుచుకొనిరాగా, గరుత్మంతునితో దేవేంద్రుండు, చేరునట్లు, రాముండు శీఘ్రంబున, విభీషణునితోఁ జేరెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— నరేశ్వరః సంగమం, జగామ= రాముండు, విభీషణునితో సంగమంబు నొందెను, సుగ్రీవాదులచేఁ జేయంబడిన, విలంబంబును సహింపక, తనకుఁబరమలాభ భూతుం

డగు నాశ్రితుని గ్రహించెను. విభీషణుం డుతనయొద్దకు వచ్చుటకుమున్నె రాముండు, తానెయుందు గానతని యొద్దకుంబోయెను. ఆశు= శీఘ్రముగా, ఆశ్రితసంగ్రహమునందు, రాముని కధిక త్వరయని సూచింపంబడుచున్నది.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, అష్టాదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండాష్టాదశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

ఏకోనవింశసర్గప్రారంభః.

రాఘవేణాభయే దత్తే సన్నతో రావణానుజః
విభీషణో మహాప్రాజ్ఞో భూమిం సమవలోకయత్. ౧
ఖాత్పపాతావనీం హృష్టో భక్తైరనుచరైస్సహ

టీక॥ రాఘవేణ=రామునిచేత; అభయే=అభయము; దత్తే = ఇవ్వంబడంగా; మహాప్రాజ్ఞః= మహాపండితుండును; రావణానుజః=రావణునితమ్ముండునగు; విభీషణః=విభీషణుండు; హృష్టః= సంతసించినవాండై; భక్తైః=భక్తులగు; అనుచరైస్సహ= వెంబడివచ్చినవారలతోంగూడ; సన్నతః=మిక్కిలి వినమ్రుండై; భూమిం=నేలను; సమవలోకయత్= చూచుచు; ఖాత్ = ఆకాశమునుండి; అవనీం=భూమిని; పపాత= పొందెను.

రాముండభయంబు నొసంగంగానే, మహాపండితుండగు రావణునితమ్ముండు విభీషణుండు , అభిమత సిద్ధి

స ౧౯

కై సంతుష్టుండై, స్వామిభక్తులగు ననుచరులతోఁగూడఁ, గాళ్లముందు గాదిగుట యనుచితమని, మిక్కిలియు నవనతపూర్వకాయుండై, నేలంజూచుచు, నిట్లు, ఆకాశంబుననుండి, నేలకుడిగ్గెను.

అని, తాత్పర్యము-

సతు రామస్య ధర్మాత్మా నిపపాత విభీషణః. ౨
పాదయోశ్శరణాన్వేషీ చతుర్భిస్సహ రాక్షసైః

టీక॥ ధర్మాత్మా = ధర్మస్వభావుండగు; సః = ఆ; విభీషణస్తు = విభీషణుండును; శరణాన్వేషీ = రక్షకుని వెదకువాఁడై; చతుర్భిః = నల్వురయిన; రాక్షసైస్సహ = రాక్షసులతోఁగూడ; రామస్య = రామునియొక్క; పాదయోః = పాదములయందు; నిపాత = పడెను.

ధర్మాత్ముండగు నా విభీషణుండు; రక్షణంబుఁగోరి నల్వురి రాక్షసులతోఁ గూడ, రాముని పాదంబులం బడెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— మానసిక వాచిక శరణాగతులం జెప్పి, యింకఁ, గాయిక శరణాగతిం జెప్పుచున్నాఁడు— సః = విపరీతాభిప్రాయంబును సంశయంబును విడిచి నిర్ణయింపఁబడిన సంగ్రహము గలవాఁడు- ధర్మాత్మా = ధర్మబుద్ధిగలవాఁడు, సర్వావస్థలయందును శరణాగతిధర్మమును విడువనివాఁడు, చంపబడుఁగాకయని, సందేహింపఁబడుఁగాకయని, విడువఁబడుఁగాకయని, తోడ్కొనిరమ్మని, మాతో సమానుండగుఁగాకయని, చెప్పఁబడిన యన్నియవస్థలయందును, ఎంతమాత్రము భేదము నొందక, ఏకరూపమయిన మనస్సుగలవాఁడు ననుట. ఇందుచే, విభీషణుని మహావిశ్వాసంబు చెప్పఁబడినది- రామస్య = తనయందలి పక్షపాతాతిశయంబు దెలుపు ముఖవికాసాది శుభాకారంబులుగల రామునియొక్క; పాదయోః = పాదములయందు, చంటిబిడ్డకుఁదల్లిచన్నులుం బోలెఁ దనకు శ్రీపాదంబులె భోగ్యంబులను నభిప్రాయంబున ననుట- పపాత = పడెను, ఇతరులువచ్చి దెబ్బదగిలిన యవయవంబుల సవరించి, లేవనెత్తునట్లు, భక్తిపారవశ్యంబునఁ దటాలునం బడెను- చతుర్భిః, రాక్షసైస్సహ = నల్వురి రాక్షసులతోఁగూడ, కరచరణాదులుంబోలె నత్యంతపరతంత్రులగు రాక్షసులతోఁగూడఁ బడెననుట- ఇం

 

దు "ధర్మాత్మా" అని, మహావిశ్వాసంబును, "శరణాన్వేషీ" అని, గోప్తృత్వవరణంబును, "పపాత" అని యాత్మనిక్షేపమును, అట్లు, సాంగంబగుశరణాగతి, చెప్పఁబడినది-

అబ్రవీచ్చ తదా రామం వాక్యం తత్ర విభీషణః. ౩
ధర్మయుక్తంచ యుక్తంచ సాంప్రతం సంప్రహర్షణమ్

టీక॥ తత్ర=అచ్చట; విభీషణః=విభీషణుఁడు; తదా=అప్పుడు; రామం=రామునిగూర్చి; ధర్మయుక్తంచ=ధర్మముతోఁగూడినదియు, యుక్తంచ=యోగ్యంబును; సాంప్రతం=ఇప్పుడు; సంప్రహర్షణం=సంతోషింపఁజేయునదియునగు; వాక్యం=మాటను; అబ్రవీచ్చ=చెప్పెను.

అంత, నప్పుడు, విభీషణుఁడు, రామునింజూచి, ధర్మసంయుతంబును మహాయోగ్యంబునగు, నీమాటంజెప్పెను; మున్నతఁడు, సుగ్రీవాదులతోఁ, జెప్పినప్పుడు, ఆమాట యందఱకును, శ్రుతికటువుగానుండినదిగదా! ఇప్పుడు, అదేమాట, అందఱకును శ్రవణానందకరంబుగానుండినది.

అని, తాత్పర్యము.

అనుజో రావణస్యాహం తేనచాస్మ్యవమానితః. ౪
భవంతం సర్వభూతానాం శరణ్యం శరణంగతః

టీక॥ అహం=నేను; రావణస్య=రావణునియొక్క; అనుజః=తమ్ముండను. తేన=ఆరావణునిచేత; అవమానితశ్చ=అవమానింపఁబడినవాఁడను. సర్వభూతానాం=సమస్తప్రాణులకును; శరణ్యం=రక్షకుండుగాఁదగినవాఁడవగు; భవంతం=నిన్ను; శరణం=రక్షకునిఁగా; గతః=పొందినవాఁడు.

నేను రావణునితమ్ముండను; అతండు నన్నవమానించెను; కావున, సమస్తభూతంబులకును రక్షకుండవగు నిన్ను శరణుపొందితిని.

అని, తాత్పర్యము.

 

విశేషార్థము.—అహం, రావణస్య, అనుజః = నేను రావణునితమ్ముండను, ఇందుచేఁ, దనయందున్న నైచ్యంబుఁ జెప్పఁబడినది. సర్వభూతానాం, శరణ్యం=సమస్తభూతంబులకు నురక్షకుండవు, రావణునింగూడ, శరణాగతుండైనచో, రక్షించుటకుసిద్ధుండైనట్టివాఁడవగు, భవంతం=నిన్ను; శరణంగతః=శరణుపొందినాను. ఈశ్లోకముచే, వాచికశరణాగతి చెప్పఁబడినది.

పరిత్యక్తా మయాలంకా మిత్రాణిచ ధనానిచ- ౫
భవద్గతం మేరాజ్యంచ జీవితంచ సుఖానిచ

టీక॥ మయా=నాచేత; లంకా = లంకాపురి; పరిత్యక్తా= విడువఁబడినది. మిత్రాణిచ=స్నేహితులును; పరిత్యక్తాని(అధ్యాహృతము)= విడువఁబడినారు. ధనానిచ=ధనంబులును;("వై" అనునది పాదపూరణార్థము) పరిత్యక్తాని (అధ్యాహృతము)= విడువఁబడినవి- మే = నాయొక్క; రాజ్యంచ= రాజ్యమును; జీవితంచ=ప్రాణమును, భవద్గతం = నిన్నుఁబొందినది, నీయధీనమనుట. సుఖానిచ= సుఖంబులును; భవద్గతాని (అధ్యాహృతము)=నీయధీనములు.

నేను, వాసస్థానంబయిన లంకాపట్టణంబును నాస్నేహితులను నాధనంబులనుంబరిత్యజించినీవెగతియని నీయొద్దకువచ్చినాను; ఇంక, నారాజ్యంబును, నాజీవితంబును, నాసుఖంబులును, నీయధీనములు. అని, విభీషణుండు, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా రామో వచన మబ్రవీత్- ౬
వచసా సాంత్వయిత్వైనం లోచనాభ్యాం పిబన్నివ

టీక॥ రామః=రాముఁడు; తస్య=ఆ విభీషణునియొక్క; తత్=ఆ; వచనం= మాటను; శ్రుత్వా=విని; ఏనం=ఈవిభీషణుని; వచసా = మాటచేత; సాంత్వయిత్వా=ఊఱడించి; లోచనాభ్యాం= కన్నులచేత; పిబన్నివ=త్రాఁగువాఁడువలె; వచనం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.




రాముండు, విభీషణునిమాటలువిని, యతనిమధుర వచనంబులనాశ్వాసించి, యత్యాదరంబునc, కరుణారసార్ద్రంబగు కటాక్షంబునంజూచుచు, నీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

ఆఖ్యాహి మమ తత్త్వేన రాక్షసానాం బలాబలమ్. ౭

టీక॥ తత్త్వేన=యాథార్థ్యముచేత; రాక్షసానాం= రాక్షసులయొక్క; బలాబలం = బలమునుఅబలమును; మమ=నాకు; ఆఖ్యాహి=చెప్పుము.

రాక్షసులబలాబలంబులను యథార్థముగానాకుcజెప్పుము. అని, రాముండువిభీషణునితోcజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్తదా రక్షో రామేణా క్లిష్టకర్మణా
రావణస్య బలం సర్వ మాఖ్యాతు ముపచక్రమే. ౮

టీక॥ తదా=అప్పుడు; రక్షః=రాక్షసుcడగువిభీషణుcడు; అక్లిష్టకర్మణా=దుఃఖములేనికార్యములుగల; రామేణ=రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః = చెప్పcబడినవాcడై; రావణస్య=రావణుని యొక్క; బలం=బలమును; సర్వం=అంతను; ఆఖ్యాతుం=చెప్పుటకు; ఉపచక్రమే=ఆరంభించెను.

అంత, విభీషణుండు, అక్లిష్టకర్ముcడగురాముండుచెప్పినమాటనువిని, రావణునిబలంబునంతయుంజెప్పనారంభించెను. అని, తాత్పర్యము.

అవధ్య స్సర్వదేవానాం గంధర్వాసురరక్షసామ్
రాజపుత్ర దశగ్రీవో వరదానా త్స్వయంభువః. ౯

టీక ॥ రాజపుత్ర = రాచకొమరుcడా! దశగ్రీవః = రావణుcడు; స్వయంభువః = బ్రహ్మదేవుని యొక్క; వరదానాత్= వరమునొసంగుటవలన; సర్వభూతానాం = సమస్తభూతములకును; గంధర్వాసురరక్షసాం=గంధర్వులకునుఅసురులకునురాక్షసులకును; అవధ్యః = చంపదగనివాcడు.

రాచకొమరుcడవగు రాముcడా !




రావణుండు, బ్రహ్మదేవునివరంబునం జేసి, గంధర్వులకుఁగానియసురులకుఁగాని రాక్షసులకుగాని, యట్లుసమస్తభూతంబులకును, అవధ్యుండై యొప్పుచున్నాఁడు. అని, తాత్పర్యము.

విశేషార్థము.— "రాజపుత్ర = రాచకొమరుఁడా" అనుటచే, "దేవగంధర్వాదులకువధ్యుండు గాకుండునట్లు, రావణునకువరంబున్నది, గాని, మనుష్యులచేవధ్యుండు గాకుండునట్లువరంబులేదు. కావున, నీకు, వధ్యుండగును" అని, సూచింపఁబడుచున్నది.

రావణానంతరో భ్రాతా మమ జ్యేష్ఠశ్చ వీర్యవాన్
కుంభకర్ణో మహాతేజా శ్శక్ర ప్రతిబలో యుధి. ౧౦

టీక॥ రావణానంతరః = రావణునికన్నఁబిమ్మటఁబుట్టిన; భ్రాతా=తోఁబుట్టువును; మమ=నాకు; జ్యేష్ఠశ్చ= అన్నయునగు; కుంభకర్ణః=కుంభకర్ణుఁడు; వీర్యవాన్= అధికమయినపరాక్రమముగలవాఁడు- మహాతేజాః= అధికమయినతేజస్సుగలవాఁడు. యుధి=యుద్ధమునందు; శక్రప్రతిబలః= ఇంద్రునితో సమానమగు బలముగలవాఁడు.

రావణునకుఁదమ్ముండును నాకుజ్యేష్ఠుండునగుకుంభకర్ణుఁడు, మహాపరాక్రమశాలి, మహాతేజుండు; యుద్ధంబున, దేవేంద్రునకుసరివచ్చుబలముగలవాఁడు. అని, తాత్పర్యము.

రామ సేనాపతి స్తస్య ప్రహస్తో యదివా శ్రుతః
కైలాసే యేన సంగ్రామే మాణిభద్రః పరాజితః. ౧౧

టీక॥ యేన=ఎవ్వనిచేత; కైలాసే=కైలాసపర్వతమునందు; సంగ్రామే = యుద్ధమునందు; మాణిభద్రః=మాణిభద్రుండు; పరాజితః = జయింపఁబడినాఁడో; సః(అధ్యాహృతము)— అట్టి; తస్య= ఆరావణునియొక్క; సేనాపతిః= సేనానాయకుఁడైన; ప్రహస్తః= ప్రహస్తుఁడు; శ్రుతో యదివా= వినఁబడినవాఁడేగదా!

కైలాసపర్వతంబుననున్న, కుబేరసేనానాయకుండగు, మాణిభద్రునిజయించినట్టిమహాపరాక్రమశాలియగు, రావణుని సేనాపతిం బ్రహస్తుని, హనుమంతుండు చెప్పఁగా విని యుందురు




గదా! అని, తాత్పర్యము.

బద్ధ గోధాంగుళిత్రాణ స్త్వవధ్యకవచో యుధి
ధను రాదాయ తిష్ఠన్ స అదృశ్యో భవతీంద్రజిత్. ౧౨

టీక॥ సః = ఆ; ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు మాత్రము; బద్ధగోధాంగుళిత్రాణః = కట్టఁబడిన జ్యాఘాతవారణమను అంగుళికవచమునుగలవాఁడై; అవధ్యకవచః = భేదింపరానికవచముగలవాఁడై; ధనుః = ధనువును; ఆదాయ = గ్రహించి; తిష్ఠన్ = నిలుచుచు; యుధి = యుద్ధమునందు; అదృశ్యః = చూడఁగూడనివాఁడు; భవతి = అగుచున్నాఁడు.

రావణుని కుమారుండగు నింద్రజిత్తు, యుద్ధంబున, గోధాంగులిత్రాణంబులుధరించి, యభేద్యంబగుకవచంబు దొడిగికొని, ధనువుఁదాల్చి, నిలుచుండఁగానే, యదృశ్యుండగుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

సంగ్రామే సమయవ్యూహే తర్పయిత్వా హుతాశనమ్
అంతర్ధానగత శ్శత్రూ నింద్రజి ద్ధంతి రాఘవ. ౧౩

టీక॥ రాఘవ = రాముఁడా! ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు; సంగ్రామే = యుద్ధమునందు; సమయవ్యూహే = సమయమునందలిమొగ్గరమునందు; హుతాశనం = అగ్నిహోత్రమును; తర్పయిత్వా = తృప్తిఁబొందించి; అంతర్ధానగతః = మఱుఁగుపాటునొందినవాఁడై; శత్రూన్ = శత్రువులను; హంతి = వధించుచున్నాఁడు.

రాముఁడా! యుద్ధకాలంబులందు, ఇరువాఁగునను బద్ధవ్యూహంబు లయియుండునప్పుడు, ఇంద్రజిత్తు, హోమంబులచేనగ్నిహోత్రుఁ దృప్తినొందించి, తత్ప్రభావంబున, అదృశ్యుండై, శత్రువులనువధించును. అని, తాత్పర్యము.

మహోదర మహాపార్శ్వౌ రాక్షస శ్చాప్యకంపనః
అనీకస్థాస్తు తస్యైతే లోకపాలసమా యుధి. ౧౪







టీక॥ మహోదరమహాపార్శ్వౌ= మహోదరుండును మహాపార్శ్వుండును;అకంపనః= అకంపనుండును;రాక్షసశ్చాపి=రాక్షసుండును; తస్య=ఆరావణునియొక్క;అనీకస్థాః= సేనయందున్న;ఏతే=వీరలును;యుధి=యుద్ధమునందు;లోకపాలసమాః = దిక్పాలురతోసమానులు.

మహోదరుండును మహాపార్శ్వుండును, అకంపనుండును, వీరలు మొదలగు రావణుని సేనాపతులనేకులున్నారు; వారలందఱు , యుద్ధంబున, లోకపాలురకుసరివత్తురు.

అని, తాత్పర్యము.

దశకోటిసహస్రాణి రక్షసాం కామరూపిణామ్

మాంసశోణితభక్షాణాం లంకాపురనివాసినామ్. ౧౫

టీక॥లంకాపురనివాసినాం=లంకాపురంబున నివసించువారలును; మాంసశోణితభక్షాణాం= మాంసమునెత్తురునె యాహారముగాఁగలవారు; కామరూపిణాం=ఇచ్ఛాధీనమగు రూపముగలవారునగు ; రక్షసాం = రాక్షసులయొక్క; దశకోటిసహస్రాణి=పదికోట్లువేలు, పదివేల కోట్లనుట; సంతి (అధ్యాహృతము)=ఉన్నవి.

అట్లు, మాంస శోణితాహారులును కావలసిన రూపంబులు దాల్పంజాలిన వారలునగు,ప్రధాన రాక్షసులు, లంకయందుఁ బదివేలకోటులున్నారు.

అని,తాత్పర్యము.

స తైస్తు సహితో రాజా లోకపాలా నయోధయత్

టీక॥ సః=ఆ;రాజా= రాక్షసరాజుండగు రావణుండు; తైః= ఆరాక్షసులతో; సహితస్తు= కూడినవాఁడైయె; లోకపాలాన్=దిక్పాలురను; అయోధయత్=యుద్ధముచేయించెను.

రాక్షసరాజుండగు రావణుండు, ఆ రాక్షసులంగూడియె , దిక్పాలకులతోఁ గూడ, యుద్ధంబుగావించెను.

అని,తాత్పర్యము.

సహదేవైస్తు తే భగ్నా రావణేన మహాత్మనా. ౧౬




టీక॥ మహాత్మనా= అధికమయినపరాక్రమముగల; రావణేన= రావణునిచేత; తే=ఆదిక్పాలకులు; దేవైస్సహ తు=దేవతలతోఁగూడనె; భగ్నాః=జయింపఁబడినారు.

ఆదిక్పాలకులందఱు, సమస్తదేవతలతోఁగూడ, మహాపరాక్రమశాలియగు రావణునిచేఁబరాజితులయిరి. అని, విభీషణుండు, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

విభీషణవచ శ్శ్రుత్వా రామో దృఢపరాక్రమః
అన్వీక్ష్య మనసా సర్వ మిదం వచన మబ్రవీత్. ౧౭

టీక॥ దృఢపరాక్రమః=దృఢమయినపరాక్రమముగల; రామః=రాముఁడు; విభీషణవచః=విభీషణునిమాటను; శ్రుత్వా=విని; మనసా = మనస్సుచేత; సర్వం=అంతను; అన్వీక్ష్య=ఆలోచించి; ఇదం=ఈ; వచనం = మాటను; అబ్రవీత్ =చెప్పెను.

దృఢపరాక్రమశాలియగు రాముండు, విభీషణుండు చెప్పినమాటనువిని, మనస్సున, నంతయునాలోచించి, మఱలవిభీషణుంజూచి, యీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

యాని కర్మాపదానాని రావణస్య విభీషణ
ఆఖ్యాతానిచ తత్త్వేన హ్యవగచ్ఛామి తాన్యహమ్. ౧౮

టీక॥ విభీషణ= విభీషణుఁడా! రావణస్య=రావణునియొక్క; యాని = ఏ; కర్మాపదానాని = మునుపటిశౌర్యకార్యములు; తత్త్వేన = యాథార్థ్యముచేత; ఆఖ్యాతాని= చెప్పఁబడినవో; తానిచ=వానిని; అహం= నేను; అవగచ్ఛామి = తెలిసికొన్నానుగదా!

విభీషణుఁడా! నీవిప్పుడుచెప్పిన, రావణునిమునుపటి శౌర్య కార్యంబులన్నియు, నామనస్సునకువచ్చినవి.

అని, తాత్పర్యము.

అహంహత్వా దశగ్రీవం సప్రహస్తం సబాంధవమ్
రాజానం త్వాం కరిష్యామి సత్యమేత ద్బ్రవీమితే. ౧౯

టీక॥ అహం=నేను; దశగ్రీవం=రావణుని; సప్రహస్తం = ప్రహస్తునితోఁగూడినవానిఁగాను; సబాంధవం= బంధువులతోఁగూడినవానిగాను; హత్వా= చంపి; త్వాం=నిన్ను; రాజానం=రాజునుగా; కరిష్యామి = చేసెదను. ఏతత్=ఈ; సత్యం= సత్యమును; తే= నీకొఱకు; బ్రవీమి=చెప్పుచున్నాను.

నేను, బ్రహస్తునితో, సమస్తబంధువులతోనుంగూడ, రావణునివధించి, నిన్నులంకారాజ్యంబునకురాజుంగావించెదను; ఇదిసత్యము; నీకుఁజెప్పుచున్నాను. అని, తాత్పర్యము,

రసాతలంవా ప్రవిశేత్పాతాళంవాపి రావణః
పితామహసకాశంవా న మే జీవన్ విమోక్ష్యతే. ౨౦

టీక॥ రావణః=రావణుఁడు; రసాతలంవా=రసాతలమునుగాని; పాతాళంవాపి=పాతాళలోకమునుగాని; పితామహసకాశంవా=బ్రహ్మదేవునిసమీపమునుగాని; ప్రవిశేత్=ప్రవేశించును గాక. జీవన్= బ్రతికియున్నవాఁడై; మే=నాకు, నాచేతననుట; నవిమోక్ష్యతే=విడువఁబడఁడు-

రావణుండు, రసాతలలోకంబుఁ బ్రవేశించినను, పాతాళంబుఁజొచ్చినను, బ్రహ్మలోకంబునకుబోయినను, నేనతనింబ్రాణంబులతోవిడువను- అని, తాత్పర్యము-

అహత్వా రావణం సంఖ్యే సపుత్రబలబాంధవమ్
అయోధ్యాం నప్రవేక్ష్యామి త్రిభిస్తైర్భ్రాతృభిశ్శపే- ౨౧

టీక॥ సంఖ్యే=యుద్ధమునందు; రావణం=రావణుని; సపుత్రబలబాంధవం= కొడుకులతోను సైన్యములతోను బంధువులతోనుంగూడినవానిఁగా; అహత్వా=చంపక; అయోధ్యాం= అయోధ్యాపట్టణమును; నప్రవేక్ష్యామి= ప్రవేశింపను. తైః=అట్టి; త్రిభిః= మూఁడైన; భ్రాతృభిః=తమ్ములచేత; శపే= శపథముసేయుచున్నాను.

యుద్ధంబునఁ గొడుకులతోను సైన్యంబులతోను బంధువులతోనుంగూడ, రావణునివధింపక, నయోధ్యకుఁబోను

ఇదినిశ్చయము;నాము గ్గురితమ్ములమీఁద శపథముసేయుచున్నాను. అని , రాముండు, విభీషణునితోఁజెప్పెను.

అని; తాత్పర్యము,

శ్రుత్వాతు వచనం తస్య రామస్యాక్లిష్టకర్మణః
శిరసా వంద్య ధర్మాత్మా వక్తుమేవోపచక్రమే- ౨౨

టీక॥ధర్మాత్మా=ధర్మబుద్ధిగల విభీషణుఁడు; అక్లిష్టకర్మణః= దుఃఖకరములుగానికార్యములుగల; తస్య = ఆ; రామస్య=రామునియొక్క ; వచనం=మాటను; శ్రుత్వాతు= విన్నంతనె;శిరసా=తలచే; అవంద్య = నమస్కరించి;వక్తుమేవ=చెప్పుటకే;ఉపచక్రమే=ప్రారంభించెను.

ధర్మాత్ముండగువిభీషణుండు,అందఱకునుసంతోషకరంబులయిన కార్యంబులుగలరాముండు చెప్పినమాటను విన్నంతనె, యాయనకు సాష్టాంగముగ నమస్కరించి యిట్లని,చెప్పెను- అని, తాత్పర్యము.

రాక్షసానాం వధే సాహ్యం లంకాయాశ్చ ప్రధర్షణమ్
కరిష్యామి యథాప్రాణం ప్రవేక్ష్యామి చ వాహినీమ్- ౨౩

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను;రాక్షసానాం= రాక్షసులయొక్క; వధే=చంపుటయందు; సాహ్యం=తోడ్పాటును; లంకాయాః=లంకయొక్క; ప్రధర్షణంచ=ఎదిరించుటను; యథాప్రాణం=బలమునతిక్రమింపక;కరిష్యామి=చేసెదను.వాహినీంచ= సైన్యమును;ప్రవేక్ష్యామి=ప్రవేశించెదను-

నేనును,నాశక్తికొలంది, రాక్షసులం జంపుటయందును లంకాపురధర్షణంబునందును, సాహాయ్యంబుగావించెదను;శత్రుసైన్యంబుఁజొచ్చి, యుద్ధమునుంజేసెదను-అని,విభీషణుఁడు, రామునితోఁజెప్పెను-అని, తాత్పర్యము-

ఇతి బ్రువాణం రామస్తు పరిష్వజ్య విభీషణమ్
అబ్రవీ ల్లక్ష్మణం ప్రీతః,

టీక॥ రామస్తు=రాముండును; ఇతి=ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్న; విభీషణం=విభీషణుని; పరిష్వజ్య=కవుంగిలించి; ప్రీతః=సంతుష్టుండై; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను-

రాముండు, ఈప్రకారము చెప్పుచున్న విభీషణునిం గవుంగిలించికొని, పరమప్రీతుండై, లక్ష్మణుంజూచి, యిట్లని చెప్పెను- అని, తాత్పర్యము.

సముద్రా జ్జలమానయ. ౨౪
తేనచేమం మహాప్రాజ్ఞ మభిషించ విభీషణమ్
రాజానం రక్షసాం క్షిప్రం ప్రసన్నే మయి మానద. ౨౫

టీక॥ మానద= మానంబునొసంగునట్టిలక్ష్మణుండా! సముద్రాత్=సముద్రమునుండి; జలం=నీటిని; ఆనయ=తెమ్ము. మయి= నేను; ప్రసన్నే=సంతుష్టుండనుగాంగా; తేన= ఆసముద్రజలముచేత; క్షిప్రం=శీఘ్రముగా; మహాప్రాజ్ఞం= మహాపండితుండగు; ఇమం=ఈ; విభీషణం=విభీషణుని; రక్షసాం=రాక్షసులకు; రాజానం= రాజునుగా; అభిషించచ = అభిషేకముం జేయుము.

కులమునకు గౌరవము గల్గించునట్టి, లక్ష్మణుండా! నేనుప్రసన్నుండనయితిని; నీవుసముద్రంబుననుండిజలముం దెచ్చి, యాసముద్ర జలముచే, శీఘ్రంబునం, బండితుండగు, నీవిభీషణుని, రాక్షసరాజుంగా నభిషేకింపుము. అని, రాముండులక్ష్మణునితోంజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు సౌమిత్రి రభ్యషించ ద్విభీషణమ్
మధ్యే వానరముఖ్యానాం రాజానం రాజశాసనాత్. ౨౬

టీక॥ సౌమిత్రిః = లక్ష్మణుండు; ఏవం=ఇట్లు; ఉక్తస్తు= చెప్పంబడినవాండైనంతనె; రాజశాసనాత్= రాజాజ్ఞ వలన; వానరముఖ్యానాం = వానరశ్రేష్ఠులయొక్క; మధ్యే=నడుమునందు; విభీషణం=విభీషణుని; రాజానం= రాక్షసరాజునుగా; అభ్యషించత్ = అభిషేకించెను-

అంత, లక్ష్మణుండు, రామునిమాటనువిని, రాజాజ్ఞవలన , వానరముఖ్యులనడుమ,విభీషణుని, రాక్షసరాజుగా, నభిషేకించెను.

అని, తాత్పర్యము.

తం ప్రసాదంతు రామస్య దృష్ట్వా సద్యః ప్లవంగమాః
ప్రచక్రుశు ర్మహాత్మానం సాధుసాధ్వితిచా బ్రువన్. ౨౭

టీక॥ ప్లవంగమాః=వానరులు;రామస్య=రామునియొక్క;తం=ఆ;ప్రసాదం=అనుగ్రహమును; దృష్ట్వాతు=చూచినంతనే; సద్యః=తత్క్షణమె;ప్రచుక్రుశుః=అఱచిరి. మహాత్మానం=పూజ్యమయినస్వభావముగల రామునిగూర్చి; సాధుసాధ్వితిచ= మంచిది మంచిదనియు; అబ్రువన్=చెప్పిరి.

వానరులందఱు,రాముడంతశీఘ్రంబుగావిభీషణునియందుఁ గావించినయనుగ్రహంబుఁజూచి, పరమసంతోషంబునసింహనాదంబులు సేయుచు, మహాత్ముండగురాముని, సాధు వాదంబులం బ్రశంసించిరి. అని, తాత్పర్యము.

అథా బ్రవీ ద్ధనూమాంశ్చ సుగ్రీవశ్చ విభీషణమ్

టీక॥ అథ=పిమ్మట ; హనూమాంశ్చ= హనుమంతుండును; సుగ్రీవశ్చ= సుగ్రీవుండును;విభీషణం=విభీషణునిగూర్చి; అబ్రవీచ్చ=చెప్పెను.

అంత, నేకాంతంబున, హనుమంతుండునుసుగ్రీవుండును, విభీషణునియొద్దకుంబోయి, యిట్లని,యడిగిరి.

అని, తాత్పర్యము.

కథం సాగర మక్షోభ్యం తరామ వరుణాలయమ్. ౨౮
సైన్యైః పరివృతా స్సర్వే వానరాణాం మహౌజసామ్

టీక॥ వయం (అధ్యాహృతము)=మనము;సర్వే=అందఱము ; మహౌజసాం= అధికమయినపరాక్రమముగల; వానరాణాం = వానరులయొక్క ; సైన్యైః=సైన్యములచే;పరివృతాః=చుట్టఁబడినవారలమయి; అక్షోభ్యం=కలఁ

తప్పెట్టరానిదియు; వరుణాలయం = వరుణునివాసస్థానంబునగు; సాగరం= సముద్రమును; కథం=ఎట్లు;తరామ = దాఁటుదము?

మనమందఱము, మహాపరాక్రమశాలులగు నీవానరుల సేనతోఁగూడ, నక్షోభ్యంబగునీసముద్రము నెట్లుదాఁటఁగలము? అని, తాత్పర్యము.

ఉపాయం నాధిగచ్ఛామో యథా నదనదీపతిమ్. ౨౯
తరామ తరసా సర్వే ససైన్యా వరుణాలయమ్

టీక॥యథా= ఎట్లు; వయం (అధ్యాహృతము)=మనము; సర్వే= అందఱమును; ససైన్యాః=సైన్యములతోఁ గూడినవారలమయి; నదనదీపతిం= నదములకునునదులకును(బ్రభువయిన;వరుణాలయం= సముద్రమును;తరసా=శీఘ్రంబున;తరామ=దాఁటుదుమో;తం (అధ్యాహృతము) = అట్టి ; ఉపాయం=ఉపాయమును;నాధిగచ్ఛామః= ఎఱుంగము.

మనమందఱము, సైన్యములతోఁగూడ, నీమహాసముద్రము నెట్లు దాఁటఁ గలమో, ఆయుపాయంబు మాకుఁ దెలియ లేదు; నీవె చెప్పవలయును. అని, హనుమంతుండును, సుగ్రీవుండును,విభీషణునడిగిరి. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు ధర్మజ్ఞః ప్రత్యువాచ విభీషణః. ౩౦

టీక॥ ధర్మజ్ఞః= ధర్మము నెఱింగినట్టి; విభీషణః=విభీషణుఁడు; ఏవం= ఇట్లు; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడై నంతనె ; ప్రత్యువాచ = బదులు చెప్పెను.

ధర్మజ్ఞుండగు విభీషణుండు,హనుమత్సుగ్రీవులు చెప్పినమాటనువిని,వారలకిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి

టీక॥రాజా = రాజయిన; రాఘవః=రాముఁడు; సముద్రం=సముద్రుని; శరణం=రక్షకునిగా; గంతుం=పొందుటకు;అర్హతి=తగును.

మహారాజుండగురాముండు, సముద్రుని,శరణుపొందవలెను. అని, తాత్పర్యము.

ఖానిత స్సగరేణాయ మప్రమేయో మహోదధిః. ౩౧
కర్తుమర్హతి రామస్య జ్ఞాత్వా కార్యం మహామతిః

టీక॥అయం=ఈ;అప్రమేయః=కొలందపెట్టరాని;మహోదధిః= మహాసముద్రము;సగరేణ= సగరచక్రవర్తిచే త;ఖానితః = త్రవ్వంబడినది.మహామతిః = అధికమయినబుద్ధిగల,సముద్రుండు;జ్ఞాత్వా=ఎఱింగి;రామస్య=రాముని యొక్క;కార్యం=పనిని;కర్తుం=చేయుటకు;అర్హతి=తగును.

అప్రమేయుండగు నీసముద్రుండు, రాముని కూటస్థుండయిన సగరచక్రవర్తిచే వృద్ధినొందింపఁబడినాఁడు; రాముండు, సగరవంశంబునంబుట్టినవాఁడగుటవలనఁ,గృతజ్ఞుండగునీసముద్రుండు, రామకార్యమనఁగాఁ, దప్పక కావించును.అని,విభీషణుఁడుహనుమత్సుగ్రీవులకుఁజెప్పెను.అని,తాత్పర్యము.

ఏవం విభీషణే నోక్తో రాక్షసేన విపశ్చితా. ౩౨
ఆజగామాథ సుగ్రీవో యత్ర రామ స్సలక్ష్మణః

టీక॥సుగ్రీవః=సుగ్రీవుఁడు ; విపశ్చితా=పండితుండగు; రాక్షసేన = రాక్షసుఁడయిన; విభీషణేన = విభీషణునిచేత ; ఏవం = ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; అథ=అంత;యత్ర=ఎచ్చట; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడిన ; రామః=రాముఁడు; అస్తి (అధ్యాహృతము)=ఉన్నాఁడో;తత్ర (అధ్యాహృతము) = అచ్చటికి; ఆజగామ=వచ్చెను.

సుగ్రీవుండు, పండితుండగు విభీషణుండుచెప్పినమాటనువిని, యంత, రాముండును లక్ష్మణుండును , ఉన్నస్థలంబునకు, వచ్చెను. అని,తాత్పర్యము.

తత శ్చాఖ్యాతు మారేభే విభీషణవచ శ్శుభమ్. ౩౩
సుగ్రీవో విపులగ్రీవ స్సాగర స్యోపవేశనమ్

టీక॥ తతశ్చ= అటుపిమ్మటను; విపులగ్రీవః= విశాలమగుకంఠముగల; సుగ్రీవః=సుగ్రీవుఁడు; సాగరస్య=సముద్రునియొక్క; ఉపవేశనం= ఉపాసించుటయనునట్టి; శుభం= మంగళకరంబగు; విభీషణవచః=విభీషణునిమాటను; ఆఖ్యాతుం= చెప్పుటకు; ఆరేభే=ఆరంభించెను.

అంత, విశాలకంఠుండగు సుగ్రీవుండు, రామునకు, విభీషణుండు చెప్పిన, సముద్రోపాసనంబునుగుఱించి, చెప్పనారంభించెను. అని, తాత్పర్యము.

ప్రకృత్యా ధర్మశీలస్య రాఘవస్యాప్యరోచత. ౩౪

టీక॥ తత్ (అర్థ్యాపృతము)=అది; ప్రకృత్యా=స్వభావముచేత; ధర్మశీలస్య=ధర్మస్వభావుండగు; రాఘవస్యాపి=రామునకును; అరోచత = రుచించినది-

అట్లు సముద్రంబు నుపాసించుటకు, స్వభావంబుననె పరమధార్మికుండగు రాముండును, సమ్మతించెను-

అని, తాత్పర్యము.

స లక్ష్మణం మహాతేజా స్సుగ్రీవంచ హరీశ్వరమ్

సత్క్రియార్థం క్రియాదక్షః స్మితపూర్వ మువాచ హ. ౩౫

టీక॥ మహాతేజాః = అధికమయినకాంతిగలవాఁడును; క్రియాదక్షః= కార్యములయందుసమర్థుండునగు; సః= ఆ రాముండు; సత్క్రియార్థం=గౌరవించుటకొఱకు; లక్ష్మణం= లక్ష్మణునిగూర్చియు; హరీశ్వరం= వానరనాథుండగు; సుగ్రీవంచ=సుగ్రీవునిగూర్చియు; స్మితపూర్వం = చిఱునగవుముందుగల్గునట్లుగా; ఉవాచ=చెప్పెను("హ" అనునది పాదపూరణార్థము).

మహాతేజుండును, కార్యంబులం బండితుండునగు, రాముండు, లక్ష్మణుని వానరనాథుండగు సుగ్రీవునింజూచి, వారల సమ్మానించుటకొఱకు, మొగంబునంజిఱునగవుదోఁప, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

విభీషణస్య మంత్రోఽయం మమ లక్ష్మణ రోచతే

బ్రూహి త్వం సహసుగ్రీవ స్తవాపి యది రోచతే. ౩౬

టీక ॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! అయం= ఈ; విభీషణస్య = విభీషణుని యొక్క; మంత్రః=ఆలోచనము; మమ= నాకు; రోచతే=రుచించుచున్నది. తవాపి= నీకును; రోచతేయది=రుచించునేని; త్వం=నీవు; సహసుగ్రీవః — సుగ్రీవునితోఁగూడినవాఁడవై; బ్రూహి= చెప్పుము.

లక్ష్మణుఁడా! విభీషణుండు చెప్పిన యాలోచనము, నాకుసమ్మతముగానున్నది; నీకునుసమ్మతంబగునేని, సుగ్రీవునితోనాలోచించి, నాకుంజెప్పుము.

అని, తాత్పర్యము.

సుగ్రీవః పండితో నిత్యం భవాన్ మంత్రవిచక్షణః
ఉభాభ్యాం సంప్రధార్యార్థం రోచతే య త్తదుచ్యతామ్. ౩౭

టీక॥ సుగ్రీవః=సుగ్రీవుండు; నిత్యం= ఎల్లప్పుడు; పండితః=పండితుండు. భవాన్=నీవు; మంత్రవిచక్షణః— ఆలోచనమునందుఁబండితుఁడవు. ఉభాభ్యాం= ఇద్దఱిచేతను ; అర్థం= కార్యమును; సంప్రధార్య=నిశ్చయించి; యత్= ఏది; రోచతే=రుచించుచున్నదో; తత్= అది; ఉచ్యతాం=చెప్పఁబడుఁగాక-

సుగ్రీవుండు, మిక్కిలియుఁబండితుండు; నీవునుఆలోచనంబునందు మిక్కిలియుసమర్థుఁడవు; మీరిద్దఱు నాలోచించి, నిశ్చయించి, యేదిమీకుసమ్మతమో, దానింజెప్పుఁడు. అని, రాముండు , లక్ష్మణసుగ్రీవులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తౌతు తౌ వీరౌ వుభౌ సుగ్రీవలక్ష్మణౌ
సముదాచార సంయుక్త మిదం వచన మూచతుః. ౩౮

టీక॥ వీరౌ=పరాక్రమవంతులగు; తౌ=ఆ; సుగ్రీవలక్ష్మణౌ=సుగ్రీవుఁడును లక్ష్మణుఁడును; ఉభౌ=ఇద్దఱును; ఏవం= ఇట్లు; ఉక్తౌతు=చెప్పఁబడినవారలయినంతనె; సముదాచారసంయుక్తం=ఉపచారముతోఁ గూడునట్లుగా; ఇదం=

ఈ; వచనం=మాటను; ఊచతుః = చెప్పిరి.

పరాక్రమశాలులగు నా సుగ్రీవలక్ష్మణులిద్దఱును, రాముండానతిచ్చిన మాటనువిని, చేతులుమొగిడ్చి వినయపూర్వకంబుగా, నీమాటం జెప్పిరి.

అని, తాత్పర్యము.

కిమర్థం నౌ నరవ్యాఘ్ర న రోచిష్యతి రాఘవ
విభీషణేన యచ్చోక్తమస్మిన్ కాలే సుఖావహమ్. ౩౯

టీక॥ నరవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుండవగు; రాఘవ=రాముఁడా! విభీషణేన=విభీషణునిచే; అస్మిన్=ఈ; కాలే=కాలమునందు; సుఖావహం = సుఖమును గల్గించునట్టి; యచ్చ = ఏమాటయు; ఉక్తం=చెప్పఁబడినదో; తత్ (అధ్యాహృతము)=అది; నౌ = మాకు; కిమర్థం= ఎందుకొఱకు; నరోచిష్యతి = రుచింపదు?

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఏయుపాయంబును దోఁచనికాలంబున, సుఖంబుగాఁ, గార్యసాధకంబగు విభీషణునియాలోచన, మాకెందుకుసమ్మతము గాకుండును?

అని, తాత్పర్యము.

అబద్ధ్వా సాగరే సేతుం ఘోరేఽస్మిన్ వరుణాలయే
లంకా నాసాదితుం శక్యా సేంద్రైరపి సురాసురైః. ౪౦

టీక॥ సేంద్రైః=ఇంద్రునితోఁగూడిన; సురాసురైరపి=దేవాసురులచేతనైనను; ఘోరే=భయంకరమగు; వరుణాలయే=వరుణునిస్థానమయిన; అస్మిన్=ఈ; సాగరే = సముద్రమునందు; సేతుం=సేతువును; అబద్ధ్వా=కట్టక; లంకా=లంకాపురి; ఆసాదితుం=పొందుటకు; నశక్యా=అలవిగాదు-

భయంకరంబగు, నిమ్మహాసముద్రంబున, సేతువునిర్మింపక, దేవేంద్రసహితులగు దేవాసురులకైనను, లంకాపురికింబోవుటకలవిగాదు-

అని, తాత్పర్యము.

విభీషణస్య శూరస్య యథార్థం క్రియతాం వచః

టీక॥ యథార్థం= సత్యమయిన= శూరస్య = శూరుండగు; పండితుండగుననుట ; విభీషణస్య = విభీషణుని యొక్క; వచః=మాట ; క్రియతాం= చేయఁబడుఁగాక.

పండితుండగు విభీషణుండు చెప్పిన మాటయథార్థము; ఆప్రకారము చేయుఁడు, అని, తాత్పర్యము-

అలం కాలాత్యయం కృత్వా సముద్రోఽయం నియుజ్యతామ్. ౪౧
యథా సైన్యేన గచ్ఛామ పురీం రావణపాలితామ్

టీక॥ కాలాత్యయం = కాలక్షేపమును; కృత్వా=చేసి;అలం=చాలును- యథా=ఎట్లు; సైన్యేన=సైన్యముతో; రావణపాలితాం= రావణునిచేఁబాలింపఁబడిన; పురీం = లంకాపట్టణమును;గచ్ఛామ= పొందుదుమో;తథా(అధ్యాహృతము)=అట్లు; అయం= ఈ; సముద్రః = సముద్రుఁడు; నియుజ్యతాం=ప్రార్థింపఁబడుఁగాక,

కాలక్షేపము సేయవలదు; మనమందఱముసైన్యముతోఁగూడ, రావణబాహుపాలితంబగు లంకాపురిం జేరునట్లు, సముద్రునిం బ్రార్థింపుఁడు. అనిసుగ్రీవలక్ష్మణులు , రామునకుంజెప్పిరి. అని, తాత్పర్యము-

ఏవ ముక్తః కుశాస్తీర్ణే తీరే నదనదీపతేః. ౪౨
సంవివేశ తదా రామో వేద్యామివ హుతాశనః

టీక॥ రామః= రాముఁడు;ఏవం= ఇట్లు;ఉక్తః=చెప్పఁబడినవాఁడై;తదా= అప్పుడు;నదనదీపతేః= సముద్రముయొక్క; తీరే=గట్టునందు;కుశాస్తీర్ణే= దర్భలపఱపునందు ; వేద్యాం= వేదియందు; హుతాశనఇవ= అగ్నిహోతు్రిందువలె; సంవివేశ=పరుండెను.

లక్ష్మణసుగ్రీవులు చెప్పిన మాటను విని, యంత రాముండు,సముద్రతీరంబున, దర్భలుపఱిచి,యందుపై, వేదియందగ్నిహోతు్రిందువలెఁ,శయనించెను- అని, తాత్పర్యము-

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ఏకోనవింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండైకోనవింశసర్గటీక,
ముగిసినది.



శ్రీ

వింశసర్గప్రారంభః.

తతో నివిష్టాం ధ్వజినీం సుగ్రీవేణాభిపాలితామ్
దదర్శ రాక్షసోఽభ్యేత్య శార్దూలో నామ వీర్యవాన్. ౧

టీక॥ తతః = అటుపిమ్మట; వీర్యవాన్ = పరాక్రమవంతుండగు; శార్దూలోనామ = శార్దూలుండను; రాక్షసః= రాక్షసుండు; అభ్యేత్య= వచ్చి; నివిష్టాం= విడిసిన; సుగ్రీవేణ=సుగ్రీవుని చేత; అభిపాలితాం=రక్షింపఁబడిన; ధ్వజినీం= సేనను; దదర్శ = చూచెను

అంతట, పరాక్రమవంతుండగు శార్దూలుండనునొక రాక్షసుండు, వచ్చి, సుగ్రీవబాహుపాలితంబై సమా[illegible]బు నవిడిసియున్న వానరసేననం చెను. అని, తాత్పర్యము.

చారో రాక్షసరాజస్య రావణస్య దురాత్మనః
తాం దృష్ట్వా సర్వతో వ్యగ్రం ప్రతిగమ్య స రాక్షసః. ౨
ప్రవిశ్య లంకాం వేగేన రావణం వాక్యమబ్రవీత్

టీక॥ దురాత్మనః=దుర్బుద్ధియగు; రాక్షసరాజస్య = రాక్షసులకుఁబ్రభువైన; రావణస్య = రావణుని యొక్క; చారః= వేగువాఁడైన; సః = ఆ; రాక్ష

సః=రాక్షసుఁడు;అవ్యగ్రం = ఏమఱుపాటులేనట్లుగా;తాం= ఆవానరసేనను;సర్వతః=అంతటను;దృష్ట్వా= చూచి;ప్రతిగమ్య=మఱలి;వేగేన= వేగముచేత;లంకాం=లంకాపట్టణమును; ప్రవిశ్య=ప్రవేశించి;రావణం= రావణునిగూర్చి;వాక్యం=మాటను; అబ్రవీత్= చెప్పెను.

దురాత్ముండగు రాక్షసరాజుండయినరావణుని చారుండగునాశార్దూలుండు,అట్లు, జాగ్రత్తతో నావానరసేననంతయుంగలయనవలోకించి,మఱలి,వేగంబునలంకకుంబోయి, రావణుంజూచి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

ఏష వానరఋక్షౌఘో లంకాం సమభివర్తతే. ౩
అగాధశ్చాప్రమేయశ్చ ద్వితీయ ఇవ సాగరః

టీక॥ అగాధశ్చ=ప్రవేశింపఁగూడనిదియు; అప్రమేయశ్చ = కొలఁతపెట్టరానిదియునగు; ఏషః=ఈ; వానరఋక్షౌఘః = వానరులయొక్కయుభల్లూకంబులయొక్కయుసమూహము; ద్వితీయః=రెండవదగు;సాగర ఇవ=సముద్రమువలె;లంకాం=లంకనుగూర్చి; సమభివర్తతే=వచ్చుచున్నది.

అగాధంబున ప్రమేయంబునగువానరభల్లూకసేన, రెండవ సముద్రంబుకరణి,లంకమీఁదికివచ్చుచున్నది.

అని, తాత్పర్యము.

పుత్త్రౌ దశరథస్యేమౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౪
ఉత్తమాయుధసంపన్నౌ సీతాయాః పద మాగతౌ

టీక॥ దశరథస్య= దశరథమహారాజుయొక్క; పుత్త్రౌ=కొడుకులును ; ఉత్తమాయుధసంపన్నౌ= ఉత్తమంబులగు నాయుధములతోఁ గూడిన వారలునగు; భ్రాతరౌ = అన్నదమ్ములయిన; ఇమౌ=ఈ; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు ; సీతాయాః = సీతయొక్క; పదం=స్థానమునుగూర్చి ; ఆగతౌ=వచ్చినారు.

దశరథమహారాజ పుత్త్రులయినయన్నదమ్ములురామలక్ష్మణులిద్దఱును, ఉత్తమాయుధంబులుధరించి, సీతయుం

దుస్థలంబునకు, వచ్చుటకున్నారు. అని, తాత్పర్యము.

ఏతౌ సాగర మాసాద్య సన్నివిష్టౌ మహాద్యుతీ. ౫

టీక॥ మహాద్యుతీ = అధికమయిన కాంతిగల; ఏతౌ = ఈరామలక్ష్మణులు; సాగరం=సముద్రమును; ఆసాద్య= పొంది; సన్నివిష్టౌ=విడిసినారు-

మహాతేజులగు నీరామలక్ష్మణులు, ఇప్పుడు, సముద్రంబునొద్ద, విడసియున్నారు. అని, తాత్పర్యము-

బల మాకాశ మావృత్య సర్వతో దశయోజనమ్

టీక॥ బలం=సేన; సర్వతః= అంతటను; దశయోజనం=పదియామడలుగల; ఆకాశం=అవకాశమును; ఆవృత్య= ఆవరించి; స్థితం (అధ్యాహృతము)=ఉన్నది.

వానరసేన, యెటుచూచినను, బదియామడలదూరమువఱకు, భూమినావరించి, యున్నది.

అని, తాత్పర్యము.

తత్త్వభూతం మహారాజ క్షిప్రం వేదితు మర్హసి. ౬

టీక॥ మహారాజ= మహారాజుండవగురావణుఁడా! క్షిప్రం = శీఘ్రముగా; తత్త్వభూతం=యథార్థమగునట్లు; వేదితుం=ఎఱుంగుటకు; అర్హసి=తగుదువు.

మహారాజుండవగురావణుఁడా! నేనుసామాన్యముగాఁజూచి,వచ్చినాను; శీఘ్రముగా యథార్థసంగతిం దెలిసికొనుము.అని, తాత్పర్యము-

తవ దూతా మహారాజ క్షిప్ర మర్హం త్యవేక్షితుమ్

టీక॥మహారాజ = మహారాజా!తవ=నీయొక్క;దూతాః=దూతలు; క్షిప్రం=శీఘ్రముగా;అవేక్షితుం=చూచుటకు;అర్హంతి=తగుదురు.

మహారాజుండవగురావణుఁడా! నీవు, శీఘ్రముగాదూతలంబంపి, చక్కఁ

గాఁజూచిరమ్మనియాజ్ఞాపించుము. అని, తాత్పర్యము.

ఉపప్రదానం సాంత్వం వా భేదోవాత్ర ప్రయుజ్యతామ్. ౭

టీక॥ అత్ర=ఈవిషయమునందు; ఉపప్రదానం = దానముగాని; సాంత్వం వా=మంచిమాటగాని; భేదోవా = భేదోపాయముగాని; ప్రయుజ్యతాం=ప్రయోగింపఁబడుఁగాక.

ఈవిషయమునందు, దానముగాని, మంచిమాటగాని, భేదోపాయముగాని, ప్రయోగింప బడుఁగాక. అని, శార్దూలుండు, రావణునకుం జెప్పెను. అని, తాత్పర్యము.

శార్దూలస్య వచ శ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః
ఉవాచ సహసా వ్యగ్ర స్సం ప్రధార్యార్థ మాత్మనః. ౮
శుకం నామ తదా రక్షో వాక్య మర్థవిదాం వరమ్

టీక॥ రాక్షసేశ్వరః=రాక్షసులకుఁ బ్రభుఁడైన; రావణః=రావణుఁడు; శార్దూలస్య=శార్దూలునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; తదా=అప్పుడు; సహసా=శీఘ్రముగ; అవ్యగ్రః=ఏమఱుపాటులేనివాఁడై; ఆత్మనః=తనయొక్క; అర్థం=కార్యమును; సంప్రధార్య=నిశ్చయించి; అర్థవిదాం=కార్యముదెలిసినవారలలో; వరం=శ్రేష్ఠుండగు; శుకంనామ=శుకుండనుపేరుగల; రక్షః=రాక్షసునిఁగూర్చి; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

రాక్షసనాథుండగు రావణుండు, శార్దూలుండు చెప్పినమాటనువిని, యంత నాలస్యంబు సేయక, మెచ్చరికతోఁ, జేయవలసిన కార్యంబు నిశ్చయించికొని, కార్యవేత్తలలో నుత్తముండగు శుకుండను రాక్షసుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సుగ్రీవం బ్రూహి గత్వా త్వం రాజానం వచనా న్మమ ౯
యథా సందేశ మక్లీబం శ్లక్ష్ణయా పరయా గిరా

టీక॥ త్వం=నీవు; గత్వా=పోయి; మమ=నాయొక్క; వచనాత్ = మాటవల

స ౨౦

న; రాజానం=వానర రాజుండగు; సుగ్రీవం= సుగ్రీవునిగూర్చి; యథాసందేశం=నేను జెప్పిన దానినతిక్రమింపక; అక్లీబం=ధీరము గా; పరయా= ఉత్తమంబును; శ్లక్ష్ణయా=మృదువునగు; గిరా= మాటచేత; బ్రూహి=చెప్పుము.

నీవు, పోయి, వానర రాజుండగు సుగ్రీవుంజూచి, నేను జెప్పిపంపిన మాటలనువిడువక, ధైర్యంబున, మృదులంబును శ్రావ్యంబునగు రీతిం, జెప్పుము.

అని, తాత్పర్యము.

త్వం వై మహారాజ కులప్రసూతో
మహాబల శ్చర్క్షరజ స్సుతశ్చ. ౧౧
న కశ్చి దర్థ స్తవ నాస్త్య నర్థ
స్తథాహి మే భ్రాతృ సమో హరీశ

టీక॥ హరీశ = వానరేశ్వరుండవగు; మహారాజ= మహారాజా! త్వం= నీవు; ("వై" అనునది పాదపూరణార్థము); కులప్రసూతః=సత్కులంబునంబుట్టినవాండవు. చ; మహాబలః= అధికముయిన బలముగల వాండవును. ఋక్షరజస్సుతశ్చ= ఋక్షరజసునిపుత్రుండవును. తవ=నీకు; కశ్చిత్ = ఒకానొక; అర్థః=ప్రయోజనంబును; న=లేదు. అనర్థః= అపాయమును; నాస్తి= లేదు. తథా=అట్లు; మే= నాకు; భ్రాతృసమః= తోంబుట్టువుతో సమానుండవు.

వానరమహారాజుండవగు సుగ్రీవుండా! నీవు, సత్కులంబునం బుట్టినవాండవు; నిష్కారణంబుగ వైరంబు గొనకుము; మహాబలుండవు; అల్ప బలుండగు రామునితో నీకేమి కార్యము? మఱియు బ్రహ్మపుత్రుండగు ఋక్షరజసుని పుత్రుండవు? కావున, నాకుబంధుండవైతివి; ఇది గాక నీకిందు లాభంబు లేదు, నష్టంబును లేదు; నాకును నీకున్నవాలికిని, మిక్కిలియు స్నేహము; కావున, నీవు నాతోంబుట్టువంటి వాండవైతివి; నాతో వైరంబు సేయకుము.

అని, తాత్పర్యము.

అహం యద్యహరం భార్యాం రాజపుత్రస్య ధీమతః. ౧౨
కిం తత్ర తవ సుగ్రీవ కిష్కింధాం ప్రతి గమ్యతామ్ .

టీక॥ అహం=నేను; రాజపుత్రస్య=రాచకొమరుని యొక్క; భార్యాం=భార్యను; అహరం యది=అపహరించితినేని; సుగ్రీవ=సుగ్రీవుఁడా! తత్ర=ఆవిషయమునందు; ధీమతః= బుద్ధిమంతుండవగు; తవ= నీకు; కిం= ఏమి? కిష్కింధాం ప్రతి = కిష్కింధనుగూర్చి; గమ్యతాం=పోఁబడుఁగాక.

సుగ్రీవుఁడా! నేను, రాజపుత్రుండగు రాముని భార్యను గొనివచ్చితినేని, వానరేశ్వరుండవగు, నీకేమిసంబంధము? నీవు బుద్ధిమంతుండవాలోచించుకొనుము; నీకేమియు నక్కఱలేదు; ఊరకకిష్కింధకుఁబొమ్ము. అని, తాత్పర్యము.

నహీ యం హరిభి ర్లంకా శక్యా ప్రాప్తుం కథంచన. ౧౨
దేవై రపి సగంధర్వైః కిం పున ర్నరవానరైః

టీక॥ ఇయం=ఈ; లంకా=లంకాపురి; హరిభిః=వానరులచేత; కథంచన=ఎట్లయినను; ప్రాప్తుం= పొందుటకు; నశక్యాహి= అలవిగాదుగదా! సగంధర్వైః=గంధర్వులతోఁగూడిన; దేవైరపి= దేవతలచేతనుం గూడ; నశక్యా (అధ్యాహృతము)=అలవిగాదు. నరవానరైః= మనుష్యులచేతను వానరులచేతను; నశక్యేతి (అధ్యాహృతము)= అలవిగాదని; కింపునః (వక్తవ్యం)= చెప్పవలసినదేమి?

ఈలంకాపురింబ్రవేశింప వానరులకెంతమాత్రమలవికాదు ; దేవతలును గంధర్వులునుంగూడ బ్రవేశింపంజాలరు ఇంక, మనుష్యులును వానరులును బ్రవేశింపఁజాలరని చెప్పవలసినదేమియున్నది? అని, సుగ్రీవునితోఁజెప్పుము. అని, రావణుండు, శుకునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

స తథా రాక్షసేంద్రేణ సందిష్టో రజనీచరః. ౧౩
శుకో విహంగ మో భూత్వా తూర్ణ మాప్లుత్య చాంబరమ్

టీక॥ సః=ఆ; రజనీచరః= రాక్షసుడైన; శుకః=శుకుఁడు; తథా=అట్లు; రాక్షసేంద్రేణ = రాక్షసేశ్వరుండగు రావణునిచేత; సందిష్టః=ఆజ్ఞాపింపఁబడినవాఁడై; విహంగమః=పక్షిగా ; భూత్వా=అయి; తూర్ణం= శీఘ్రముగా; అంబరం=ఆకాశమునుగూర్చి; ఆప్లుత్యచ=ఎగిరియు; ఆజగామ(అధ్యా

స౨౦

హ్యాతము)=వచ్చెను-

శుకుండట్లు రాక్షసేశ్వరుండగు రావణుండు చెప్పినమాటలువిని పక్షిరూపంబుదాల్చి, శీఘ్రంబున, నాకాశంబునకెగిరి, రామాదులున్నసముద్రోత్తరతీరంబునకువచ్చెను-అని, తాత్పర్యము

స గత్వా దూర మధ్వాన ముపర్యుపరి సాగరమ్. ౧౪
సంస్థితో హ్యంబరే వాక్యం సుగ్రీవ మిద మబ్రవీత్
సర్వ ముక్తం యథాదిష్టం రావణేన దురాత్మనా. ౧౫

టీక॥ సః=ఆశుకుఁడు; సాగరం=(షష్ఠ్యర్థమందుద్వితీయ) సముద్రమునకు; ఉపర్యుపరి= కొంచెముమీఁదుగా; దూరం = దూరమయిన; అధ్వానం= మార్గమును; గత్వా = పొంది; అంబరే=ఆకాశమునందు; సంస్థితః = ఉన్నవాఁడై; దురాత్మనా = దుష్టబుద్ధిగల; రావణేన=రావణుని చేత; ఉక్తం= చెప్పఁబడినదాని; సర్వం=అంతనుఁగూర్చి; యథాదిష్టం = చెప్పఁబడినదానినతిక్రమింపక; ఇదం=ఈ; వాక్యం=మాటను; సుగ్రీవం=సుగ్రీవునిగూర్చి; అబ్రవీద్ధి= చెప్పెనుగదా!

అట్లు, శుకుండు, కొంచెముసముద్రంబునకుమీఁదుగా నాకాశమార్గంబున, బహుదూరంబుపోయి, సుగ్రీవాదులున్నస్థలంబుఁజేరి, యాకాశంబుననె యుండి, సుగ్రీవుంజూచి, దురాత్ముండగు రావణుండుతనతోఁజెప్పిపంపినమాటలన్నియు, నొకటియయిననువిడువక, క్రమంబుగాఁజెప్పెను. అని తాత్పర్యము-

తం ప్రాపయంతం వచనం తూర్ణ మాప్లుత్య వానరాః
ప్రాపద్యంత దివం క్షిప్రం లోప్తుం హంతుంచ ముష్టిభిః. ౧౬

టీక॥ వానరాః = వానరులు; వచనం=మాటను; ప్రాపయంతం=పొందించుచున్న, వినిపించుచున్నయనుట; తం= ఆశుకుని; లోప్తుం=లోపింపఁజేయుటకును; ముష్టిభిః=పిడికిళ్లచేత; హంతుంచ= కొట్టుటకును; తూర్ణం = శీఘ్రముగా; ఆప్లుత్య=ఎగిరి; క్షిప్రం = శీఘ్రముగా; దివం=ఆకాశమును; ప్రాపద్యంత = పొం

దిరి-

అంత, నట్టిమాటలు పలుకుచున్న శుకుంజూచివానరులు, అతనిఁ, బిడికిళ్లం గొట్టి, ఱెక్కలువిడుచుటకై, శీఘ్రంబున, నాకాశంబున కుద్గమించిరి.

అని, తాత్పర్యము.

స తైః ప్లవఙ్గైః ప్రసభం నిగృహీతో నిశాచరః
గగనా ద్భూతలేచాశు పరిగృహ్య నిపాతితః. ౧౭

టీక॥ సః=ఆ; నిశాచరః=రాక్షసుఁడు; తైః=ఆ; ప్లవఙ్గైః=వానరులచేత; ప్రసభం= బలాత్కారముగా; నిగృహీతః=నిగ్రహింపఁబడినవాఁడై; పరిగృహ్య=పట్టుకొని; గగనాత్= ఆకాశమునుండి; భూతలే = నేలయందు; నిపాతితశ్చ= పడఁద్రోయఁబడినాఁడును-

ఆవానరులు, బలాత్కారముననా రాక్షసునొడిసిపట్టుకొని, యాకాశంబు ననుండి, నేలంబడఁద్రోసిరి-

అని, తాత్పర్యము.

వానరైః పీడ్యమానస్తు శుకో వచన మబ్రవీత్

టీక॥ శుకస్తు = శుకుఁడును; వానరైః=వానరులచేత; పీడ్యమానః= పీడింపఁబడినవాఁడై; వచనం = మాఁటను; అబ్రవీత్=చెప్పెను.

అట్లువానరులుతన్నుఁబీడింపఁగా, శుకుండు, రామునిఁబేరొకనియిట్లని విలపించెను. అని, తాత్పర్యము.

న దూతాన్ ఘ్నన్తి కాకుత్స్థ వార్యన్తాం సాధు వానరాః. ౧౮

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! దూతాన్ = దూతలను; నఘ్నన్తి= చంపరు; వానరాః=వానరులు; సాధు=చక్కఁగా; వార్యన్తాం=నివారింపఁబడుదురుగాక-

రాముఁడా! ధార్మికులు దూతలం జంపరు; నన్నీవానరులు చంపవలెనని పట్టియున్నారుకావున, వీరలకు, వలదనియాజ్ఞాపింపుము-

అని, తాత్పర్యము-

యస్తు హిత్వా మతం భర్తు స్స్వమతం సంప్రభాషతే
అనుక్తవాదీ దూతస్సన్ స దూతో వధ మర్హతి. ౧౯

టీక॥ యః=ఏ; దూతస్తు=దూతమాత్రము; అనుక్తవాదీసన్ = చెప్పఁబడనిదానిఁజెప్పువాఁడై; భర్తుః = ప్రభువు యొక్క; మతం=మతమును; హిత్వా=విడిచి; స్వమతం=తనమతమును; సంప్రభాషతే= చెప్పుచున్నాఁడో; సః=ఆ; దూతః=దూత; వధం = చంపుటను; అర్హతి=పొందఁదగును.

ఎవ్వఁడు, స్వామి చెప్పి పంపినమాటలను జెప్పక, స్వామిమతంబును విడిచి, స్వమతంబుఁ జెప్పునో, అట్టిదూతను మాత్రము, వధింపవలయును. అని, శుకుండు, రామునితోఁ జెప్పుకొనెను.

అని, తాత్పర్యము.

శుకస్య వచనం శ్రుత్వా రామస్తు పరిదేవితమ్
ఉవాచ మావధిష్టేతి ఘ్నతశ్శాఖా మృగర్షభాన్. ౨౦

టీక॥ రామస్తు=రాముండును; పరిదేవితం=రోదనరూపమయిన; శుకస్య=శుకునియొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; ఘ్నతః=కొట్టుచున్న; శాఖామృగర్షభాన్= వానరశ్రేష్ఠులనుగూర్చి; మావధిష్టేతి = చంపవలదని; ఉవాచ=చెప్పెను.

అంత, రాముండు, శుకుండు రోదనపూర్వకముగాఁ జెప్పుకొన్నమాటను విని, కరుణించి, శుకుంగొట్టుచున్న వానరోత్తములంజూచి, "వీని వధింపవలదు" అని, యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

సచ పత్రి లఘు ర్భూత్వా హరిభి దర్శితే భయే
అంతరిక్ష స్థితో భూత్వా పున ర్వచన మబ్రవీత్. ౨౧

టీక॥ హరిభిః = వానరులచేత; భయే=భయము; దర్శితే = చూపఁబడఁగా; సచ=ఆశుకుఁడును; పత్రలఘుః=తేలికలగు ఱెక్కలు గలవాఁడు; భూ




త్వా = అయి; అంతరిక్షస్థితః = ఆకాశంబుననున్నవాఁడు; భూత్వా = అయి; పునః = మరల; వచనం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అట్లువానరులు పీడించివదలినపిమ్మట, ఆశుకుండు, కొంతభాగమువిఱువఁబడుటం జేసి తేలికగానున్న ఱెకలతో నాకాశంబునొంది, సుగ్రీవుంబూచి, మఱల, నిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

సుగ్రీవ సత్త్వసంపన్న మహాబల పరాక్రమ
కిం మయా ఖలు వక్తవ్యో రావణో లోకరావణః. ౨౨

టీక॥ సత్త్వసంపన్న = శక్తితోఁగూడినవాఁడవును; మహాబలపరాక్రమ = గొప్పబలంబును బరాక్రమంబును గలవాఁడవునగు; సుగ్రీవ = సుగ్రీవుఁడా! మయా = నాచేత; ("ఖలు" అనునదివాక్యాలంకారార్థము) లోకరావణః = లోకంబులనేడ్పించునట్టి; రావణః = రావణుఁడు; కిం = ఏమాటను; వక్తవ్యః = చెప్పఁబడవలయును?

మహాబలపరాక్రమశాలివి శక్తిసంపన్నుఁడవునగుసుగ్రీవుఁడా! లోకంబులనేడ్పించునట్టి రావణునకు నేనేమిచెప్పవలయును? చెప్పుము. అని, శుకుండు, సుగ్రీవునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

స ఏవ ముక్తః ప్లవగాధిప స్తదా
ప్లవంగమానా మృషభో మహాబలః
ఉవాచ వాక్యం రజనీచరస్య
చారం శుకం తూర్ణ మదీనసత్త్వః. ౨౩

టీక॥ తదా = అప్పుడు; ప్లవంగమానాం = వానరులలో; ఋషభః = శ్రేష్ఠుఁడును; ప్లవగాధిపః = వానరరాజుండును; మహాబలః = అధికమయినబలముగలవాఁడును; అదీనసత్త్వః = తక్కువగానిశక్తిగలవాఁడునగు; సః = ఆసుగ్రీవుఁడు; ఏవం = ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; రజనీచరస్య = రావణునియొక్క;




చారం=చారుండగు; శుకం=శుకునిగూర్చి; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

అట్లు, వానరోత్తముండును మహాబలుండును, వానరరాజుండునగు సుగ్రీవుండు, రావణుని చారుఁడయినశుకుండు చెప్పినమాటనువిని, యతనింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

న మేసి మిత్రం న తథాను కంప్యో
న చోపకర్తాసి న మే ప్రియోసి
అరిశ్చ రామస్య సహాను బంధ
స్స మేసి వాలీవ వధార్హ వధ్యః. ౨౪

టీక॥ త్వం (అధ్యాహృతము)= నీవు; మే=నాకు; మిత్రం= స్నేహితుండవు; నాసి=కావు. తథా=అట్లు; అనుకంప్యః= కరుణింపఁబడినవాఁడవు ; న= కావు. ఉపకర్తా=చ= ఉపకారముచేసినవాఁడవును; న=కావు; మే= నాకు; ప్రియః=ఇష్టుండవు; నాసి=కావు; రామస్య=రామునికి; అరిశ్చ= శత్రుండవును; సహానుబంధః=సంబంధముతోఁగూడినవాఁడవువగు; సః=అట్టి; త్వం (అధ్యాహృతము)=నీవు; వాలీవ=వాలివలె; వధార్హవధ్యః= చంపుటకుఁ దగినవధ్యుండవు; అసి=అగుచున్నావు.

నీవు, నాకు స్నేహితుండవుకావు; కావున, నీవు, నాకుఁగరుణింపఁదగినవాఁడవుకావు; నాకు నీవేయుపకారంబును జేసినవాఁడవుంగావు, ప్రియుండవును గావు; మఱియు, నాస్నేహితుఁడగు రామునకు శత్రుండవు, కావునను, నాశత్రువగువాలికిమిత్రుఁడవుకావునను, నీవు, నాకుశత్రుండవు; వాలియుంబోలె వధ్యుండవు. అని, తాత్పర్యము.

నిహన్మ్యహం త్వాం ససుతం సబంధుం
సజ్ఞాతి వర్గం రజనీచరేశ
లంకాంచ సర్వాం మహతా బలేన
క్షిప్రం కరిష్యామి సమేత్య భస్మ. ౨౫

టీక॥ రజనీచరేశ= రాక్షసులకుఁ బ్రభుండవగు రావణుఁడా! అహం= నేను; ససుతం= కొడుకులతోఁ గూడినవాఁడవును; సబంధుం= బంధువులతోఁ గూడినవాఁడవును; సజ్ఞాతివర్గం = దాయాదుల సమూహముతోఁ గూడిన వాఁడవునగు ; త్వాం= నిన్ను; నిహన్మి = వధించెదను. క్షిప్రం= శీఘ్రముగా; సమేత్య= వచ్చి; మహతా= గొప్పదగు; బలేన= సేనచేత, లంకాం= లంకాపురిని; సర్వాంచ= అంతను; భస్మ = బూడిదనుగా; కరిష్యామి= చేసెదను.

రాక్షసాధీశ్వరుండగు రావణుఁడా! నేను, నిన్ను నీకొడుకులను నీబంధువులను నీదాయాదులను, అందఱును వధించెదను; శీఘ్రంబున, మహాసేనతో వచ్చి, లంకాపురియంతయు, నీఱుగావించెదను.

అని, తాత్పర్యము.

న మోక్ష్యసే రావణ రాఘవస్య
సురైస్సహేంద్రై రపి మూఢ గుప్తః
అంతర్హిత స్సూర్యపథం గతో వా
తథైవ పాతాళ మనుప్రవిష్టః. ౨౬

టీక॥ మూఢ= జ్ఞానహీనుండవగు ; రావణ= రావణుఁడా; త్వం (అధ్యాహృతము)= నీవు; సహేంద్రైః = దేవేంద్రునితోఁ గూడిన; సురైః= దేవతలచేత; గుప్తోపి= రక్షింపఁబడినవాఁడవైనను; అంతర్హితః= మఱుఁగుపడినవాఁడవైనను; సూర్యపథం= సూర్యద్వారమును; గతో వా = పొందినవాఁడవైనను; తథైవ= అట్లె; పాతాళం= పాతాళలోకమును; అనుప్రవిష్టః= ప్రవేశించినవాఁడవైనను; రాఘవస్య= (పంచమ్యర్థమందుషష్ఠి) రామునివలన ; నమోక్ష్యసే= విడువఁబడవు.

మూఢుండవగు రావణుఁడా! నీకు దేవేంద్రాదులుతోడు వచ్చినను, నీవంతర్ధానంబునొందిపోయినను, సూర్యద్వారంబునొందినను, పాతాళ లోకంబునకుఁబోయినను, రాముండు, నిన్ను విడువఁడు; అవశ్యమువధించును.

అని, తాత్పర్యము.

తస్య తే త్రిషు లోకేషు నపిశాచం నరాక్షసమ్
త్రాతార మనుపశ్యామి నగంధర్వం నచాసురమ్. ౨౭

టీక॥ తస్య=అట్టి; తే=నీకు; త్రిషు=మూఁడయిన; లోకేషు = లోకముల యందును; త్రాతారం=రక్షకుని; పిశాచం=పిశాచమును; నానుపశ్యామి = చూడను. రాక్షసం=రాక్షసుని; న(అనుపశ్యామి)=చూడను. గంధర్వం = గంధర్వుని; న(అనుపశ్యామి)= చూడను. అసురంచ = అసురుని; న(అనుపశ్యామి)=చూడను.

రామునిచే దండింపఁబడిననిన్ను, ముల్లోకంబులందును, పిశాచములుగాని, రాక్షసులుగాని, గంధర్వులుగాని, యసురులుగాని, రక్షింపఁజాలరు.

అని, తాత్పర్యము.

అవధీర్య జ్జరావృద్ధ మక్షమం కిం జటాయుషమ్

టీక॥ జరావృద్ధం= ముసలితనముచే వృద్ధుఁడును; అక్షమం= అసమర్థుఁడునగు; జటాయుషం= జటాయువును; అవధీః(ఇతి) యత్ = చంపినావనునది యేదిగలదో; తేన (అధ్యాహృతము)= దానిచేత; కిం= ఏమిప్రయోజనము?

నీవుజటాయువును వధించితినని నిన్నునీవె మెచ్చుకొనుచున్నావు కాఁబోలు; అతఁడు, ముసలివాఁడు, అసమర్థుఁడు, అట్టివానివధించుటయేమియధికము?

అని, తాత్పర్యము.

కిన్ను తే రామ సాన్నిధ్యే సకాశే లక్ష్మణస్యవా. ౨౮
హృతా సీతా విశాలాక్షీ యాం త్వం గృహ్య నబుధ్యసే

టీ॥ త్వం=నీవు; యాం=ఏసీతను; గృహ్య(గృహీత్వా)=గ్రహించి; నబుధ్యసే= ఎఱుంగకున్నావో; సా (అధ్యాహృతము)=అట్టి; విశాలాక్షీ= వెడల్పులగుకండ్లుగల; సీతా= సీత; తే (త్వయా)=నీచేత; రామసాన్నిధ్యే=రామునిసన్నిధానమునందుఁ గాని; లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క; సకాశేవా=సమీపమునందుఁగాని; హృతాకిన్ను= అపహరింపఁబడినదా యేమి?

నీవు, సీతం దెచ్చితిననిగదా విఱ్ఱవీఁగుచున్నావు; విశాలాక్షియగు నాసీతను, రాముఁడైనను, లక్ష్మణుండైన, నుండునప్పుడు, అపహరించితివా యే

మీకీవారలకుభయముపడి, వారలెవ్వరు నులేనప్పుడు, దొంగతనముగాఁదీసికొనివచ్చితివే. అని, తాత్పర్యము.

మహాబలం మహాత్మానం దుర్ధర్ష మమరై రపి. ౨౯
నబుధ్యసే రఘుశ్రేష్ఠం యస్తే ప్రాణాన్ హరిష్యతి

టీక॥ యః=ఎవ్వఁడు; తే = నీయొక్క; ప్రాణాన్=ప్రాణములను; హరిష్యతి=హరింపఁగలఁడో; తం (అధ్యాహృతము)=అట్టి; మహాబలం=అధికమయినబలముగలవాఁడును; మహాత్మానం=అధికమయినబుద్ధిగలవాఁడును; అమరైరపి = దేవతలచేనైనను; దుర్ధర్షం=ఎదిరింపఁనలవిగాని వాఁడునగు; రఘుశ్రేష్ఠం=రాముని; నబుధ్యసే= ఎఱుంగకున్నావు.

నీప్రాణంబులంగొనునట్టి, మహాబలుండునుమహాత్ముండును, దేవతలకేని చెనకరానివాఁడునగు రాము నెఱుంగవు. అని, సుగ్రీవుండు, రావణునితోఁ జెప్పమని, శుకునితోఁజెప్పెను.

అని; తాత్పర్యము.

తతో బ్రవీ ద్వాలిసుత స్త్వంగదో హరిస త్తమః. ౩౦

టీక॥ తతః=అటుపిమ్మట; హరిసత్తమః=వానరశ్రేష్ఠుండగు; రాజసుతః= వాలికొడుకైన; అంగదస్తు= అంగదుండును; అబ్రవీత్=చెప్పెను.

అంత, వానరశ్రేష్ఠుండును వాలికుమారుండునగు నంగదుండు, సుగ్రీవునితో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

నాయం దూతో మహారాజ చారికః ప్రతిభాతి మే
తులితంహి బలం సర్వ మనేనాత్రైవ తిష్ఠతా. ౩౧

టీక॥ మహారాజ=వానరరాజుండవగు సుగ్రీవుఁడా! అయం = ఈశుకుఁడు; దూతః=దూతకి; న=కాఁడు. చారికః= చారుఁడు. ఇతి(అధ్యాహృతము)=అని; మే=నాకు; ప్రతిభాతి= తోఁచుచున్నది. అత్రైవ=ఇచ్చటనే; తిష్ఠతా= ఉన్నట్టి;

అసేన=ఇతనిచేత;బలం=సేన;సర్వం= అంతయు; తులితంహి=కొలువఁబడిన దిగదా!

మహారాజుఁడవగుసుగ్రీవుఁడా! ఈశుకుఁడుదూతకాఁడు;ఈతండు, రావణునిచారుఁడనినాకుఁదోఁచుచున్నది;ఇతండు,మనయెదుటనున్నట్లియుండి, సేనాసన్నివేశ విధమంతయుంగనిపెంచినాఁడు. అని, తాత్పర్యము.

గృహ్యతాం మాగమ ల్లంకా మేతద్ధి మమ రోచతే

టీక॥ అయం(అధ్యాహృతము)=ఇతఁడు; గృహ్యతాం=పట్టుకొనఁబడుఁగాక.లంకాం= లంకను; మాగమత్= పొందకుండుఁగాక. ఏతత్ = ఇది;మమ=నాకు; రోచతేహి=రుచించుచున్నదిగదా!

ఇతనింబట్టిబంధింపుఁడు;ఇతనిలంకకుఁబోనియ్యరాదు;ఇదినాకుఁదోఁచుచున్నది.అని, యంగదుండు, సుగ్రీవునకుఁజెప్పెను.అని, తాత్పర్యము.

తతో రాజ్ఞా సమాదిష్టా స్సముత్ప్లుత్య వలీముఖాః. ౩౨
జగృహుశ్చ బబంధుశ్చ విలపంత మనాథవత్

టీక॥ తతః= అటుపిమ్మట; వలీముఖాః=వానరులు; రాజ్ఞా= వానరరాజుండగుసుగ్రీవునిచేత;సమాదిష్టాః= ఆజ్ఞాపింపఁబడినవారలై;సముత్ప్లుత్య=ఎగిరి;అనాథవత్= అనాథవలె;విలపంతం=ఏడ్చుచున్నశుకుని; జగృహుశ్చ=పట్టిరియు;బబంధుశ్చ=కట్టిరియు.

అంత, సుగ్రీవునియాజ్ఞచే , వానరులు,ఆకాశంబునకెగరి,యనాథయుంబోలెరోదనంబుసేయుచున్న యాశుకుంబట్టిబంధించిరి.అని, తాత్పర్యము.

శుకస్తు వానరై శ్చండై స్తత్ర తై స్సంప్రపీడితః. ౩౩
వ్యాక్రోశత మహాత్మానం రామం దశరథాత్మజమ్

టీక॥ శుకస్తు=శుకుఁడను; తత్ర=అచ్చట; చండైః=భయంకరులగు; వా

నరైః=వానరులచేత; సంప్రపీడితః = మిక్కిలియుఁబీడింపఁబడినవాఁడై; మహాత్మానం=పూజ్యమయినమనుస్సుగలవాఁడును; దశరథాత్మజం=దశరథునికొడుకువగు; రామం=రామునిగూర్చి; వ్యాక్రోశత=అఱచెను.

అంత, శుకుండు, అట్లచ్చట, భయంకరాకారులగు నావానరులచేఁబీడితుండై, మహాత్ముండును దశరథకుమారుండునగు, రాముంబేర్కొని విలపించెను అని; తాత్పర్యము.

లుప్యేతే మే బలాత్పక్షౌ భిద్యేతేచ తథాక్షిణీ. ౩౪

టీక॥ మే=నాయొక్క; పక్షౌ=ఱెక్కలు; బలాత్= బలాత్కారమువలన; లుప్యేతే = లోపించుచున్నవి. తథా=అట్లు; అక్షిణీచ=కండ్లును; భిద్యేతే=భేదింపఁబడుచున్నవి.

నా ఱెక్కలను బలాత్కారంబున విఱిచివేయుచున్నారు! నాకండ్ల బెఱికివేయుచున్నారు. అని, తాత్పర్యము.

యాంచ రాత్రిం మరిష్యామి జాయే రాత్రించ యామహమ్
ఏతస్మిన్నంతరే కాలే యన్మయాహ్యశుభం కృతమ్. ౩౫
సర్వం త్వముపపద్యేథా జహ్యాం చేద్యది జీవితమ్

టీక॥అహం (అధ్యాహృతము) = నేను; జీవితం= ప్రాణమును; జహ్యాం చేత్=విడుతునేని; అహం = నేను; యాం=ఏ; రాత్రించ=రాత్రియందును; మరిష్యామి=చత్తునో; యాం=ఏ; రాత్రించ=రాత్రియందును; జాయే= పుట్టినానో; ఏతస్మిన్=ఈ; అంతరే=మధ్యగతమగు; కాలే=కాలమునందు; మయా=నాచేత;( "హి" అనునది పాపూరణార్థము) యత్= ఏ ; అశుభం=పాపము; కృతం= చేయఁబడినదో; తత్(అధ్యాహృతము)= దానిని; సర్వం=అంతయు; త్వం=నీవు ; ఉపపద్యేథాః=పొందుదువు.

అనపరాధినిదూతనగు నేను, అన్యాయంబున, నిచ్చట వధింపఁబడుదునేని, నేనుబుట్టినది మొదలు, ఇదివఱకు, ఏమే పాపములంజేసియుందునో, అట్టిఘోరములైన నాపాపములన్నియు, నిన్నుఁ, బొందును. అని. శుకుండు, రామునింబేర్కొని, విలపించెను. అని, తాత్పర్యము.

నాఘాతయ త్తదా రామ శ్శ్రుత్వా తత్పరిదేవనమ్. ౩౬
వానరా నబ్రవీ ద్రామో ముచ్యతాం దూత ఆగతః

టీక॥తదా=అప్పుడు; రామః= రాముఁడు; తత్=ఆ; పరిదేవనం=ఏడ్పును; శ్రుత్వా=విని; నాఘాతయత్=కొట్టింపఁడయ్యె. రామః=రాముఁడు; "ఆగతః= వచ్చిన; దూతః=దూత; ముచ్యతాం= విడువఁబడుఁగాక" ఇతి (అధ్యాహృతము)=అని; వానరాన్=వానరులనుగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అప్పుడు, రాముండు, శుకునిరోదనంబునాలకించి, "దూతనువిడువుఁడు" అని, వానరుల కాజ్ఞాపించి, శుకునివిడిపించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, వింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండవింశసర్గటీక,
ముగిసినది.



శ్రీ

## ఏకవింశసర్గప్రారంభః-

తత స్సాగరవేలాయాం దర్భా నాస్తీర్య రాఘవః
అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః. ౧
బాహుం భుజగభోగాభ ముపధాయారిసూదనః

టీక॥ తతః=అటుపిమ్మట; అరిసూదనః=శత్రువులంజంపునట్టి; రాఘవః=రాముండు; సాగరవేలాయాం= సముద్రతీరమునందు; దర్భాన్=దర్భలను; ఆస్తీర్య=పఱచి; ప్రాఙ్ముఖః= తూర్పుమొగముగలవాఁడై; మహోదధేః=సముద్రమునకు; అంజలిం = చేమోడ్పును; కృత్వా = చేసి; భుజగభోగాభం= సర్పముయొక్క-శరీరముయొక్క-కాంతివంటికాంతిగల; బాహుం=భుజమును; ఉపధాయ=తలగడగాఁజేసికొని; ప్రతిశిశ్యే=ఎదుటశయనించెను.

అంత, శత్రుసంహర్తయగు రాముండు, సముద్రతీరంబున, దర్భలుపఱచికొని, తూర్పుమొగంబుగా, సముద్రంబునకుఁజేమోడ్పుగీలించి, నమస్కరించి, సర్పశరీరముంబోలె నతిమృదులంబగుబాహువుందలగడగాఁజేసికొని, సముద్రమునకెదుటఁ, బరుండెను.

అని, తాత్పర్యము.

జాతరూపమయై శ్చైవ భూషణై ర్భూషితం పురా. ౨
వరకాంచనకేయూరముక్తాప్రవరభూషణైః
భుజైః పరమనారీణా మభిమృష్ట మనేకధా. ౩
చందనాగరుభిశ్చైవ పురస్తా దధివాసితమ్
బాలసూర్యప్రతీకాశై శ్చందనై రుపశోభితమ్. ౪
శయనే చోత్తమాంగేన సీతాయా శ్శోభితం పురా
తక్షకస్యేవ సంభోగం గంగాజలనిషేవితమ్. ౫

సంయుగే యుగసంకాశం శత్రూణాం శోకవర్ధనమ్
సుహృదానందనం దీర్ఘం సాగరాంతవ్యపాశ్రయమ్. ౬
అస్యతాచ పున స్సవ్యం జ్యాఘాతవిగతత్వచమ్
దక్షిణో దక్షిణం బాహుం మహాపరిఘసన్నిభమ్. ౭
గోసహస్రప్రదాతార ముపధాయ మహద్భుజమ్
అద్య మే మరణంవా౽థ తరణం సాగరస్యవా. ౮
ఇతి రామో మతిం కృత్వా మహాబాహు ర్మహోదధిమ్
అధిశిశ్యే స విధివ త్ప్రయతో నియతో మునిః. ౯

టీక॥ దక్షిణః=సమర్థుఁడగు; మహాబాహుః=పెద్దచేతులుగల; సః=ఆ; రామః=రాముండు; పురా=మునుపు; జాతరూపమయైః=బంగారువికారములైన; భూషణైశ్చైవ=భూషణములచేతను; భూషితం=అలంకరింపఁబడినదియును; వరకాంచనకేయూరముక్తాప్రవర భూషణైః=శ్రేష్ఠములయినబంగారుబాహుపురులును శ్రేష్ఠములైనముత్తెములతోఁగూడినసొమ్ములునుగల; పరమనారీణాం=శ్రేష్ఠలయిన స్త్రీలయొక్క; భుజైః=బాహువులచేత; అనేకధా=పెక్కువిధములుగ; అభిమృష్టం=తడవఁబడినదియు; పురస్తాత్=మునుపు; చందనాగరుభిశ్చైవ=చందనాగరు గంధములచేతను; అధివాసితం=వాసనగొట్టునట్లుచేయఁబడినదియును; బాలసూర్యప్రతీకాశైః=లేఁతసూర్యునితోసమానములయిన; చందనైః=రక్తచందనములచేత; ఉపశోభితం=ప్రకాశించుచుండినదియు; పురా=మునుపు; శయనే=పాన్పునందు; సీతాయాః=సీతాదేవియొక్క; ఉత్తమాంగేన=శిరస్సుచేత; శోభితంచ=ప్రకాశించినదియు; గంగాజలనిషేవితం=గంగానదీజలములచే సేవింపఁబడిన; తక్షకస్య=తక్షకమనుసర్పముయొక్క; సంభోగమివ(స్థితం)=దేహమువలెనున్నదియు; సంయుగే=యుద్ధమునందు; యుగసంకాశం=గడియ మ్రానుతో సమానమయినదియు; శత్రూణాం=పగవారికి; శోకవర్ధనం=దుఃఖమును వృద్ధిపొందించునదియు; సుహృదానందనం=స్నేహితులనుసంతోషపఱచునదియును; దీర్ఘం=నిడుపయినదియు; సాగరాంతవ్యపాశ్రయం=సముద్రములేహద్దులుగాఁగల

భూమండలమునకుఆలంబన భూతంబును;పునః=ఇంకను; సవ్యం=ప్రదక్షిణముగునట్లుగా;అస్యతా=బాణములనువిడుచునట్టి; ఆత్మనా(అధ్యాహృతము)=తనచేత;జ్యాఘాతవిగతత్వచం = అల్లెత్రాటి దెబ్బలచే పోయిన చర్మముగలదియు;మహాపరిఘసన్నిభం=గొప్పయినుపగుదియతో సమానమయినదియు; గోసహస్రప్రదాతారం=ఆవులయొక్క వేయింటి నిచ్చునదియు; మహద్భుజం(మహాభుజం) = గొప్పబాహువునగు;దక్షిణం=కుడిదయిన; బాహుం=భజమును; ఉపధాయ=తలగడఁగాఁజేసికొని; "అద్య=ఇప్పుడు; మే=నాకు;మరణంవా = చావుగాని;అథ=ఇంక; సాగరస్య=సముద్రముయొక్క; తరణంవా = దాఁటుటగాని; భవతు(అధ్యాహృతము)=అగుఁగాక." ఇతి=అని;మతిం=బుద్ధిని;కృత్వా = చేసుకొని;ప్రయతః=పరిశుద్ధుండై; నియతః=మనోనియమముగలవాఁడై ; మునిః=మౌనముగలవాఁడై; విధిః=యథాశాస్త్రముగా;మహోదధిం= సముద్రమునుగూర్చి;అధిశిశ్యే=పరుండెను.

దాక్షిణ్యవంతుండును మహాబాహుండునగు రాముండు, మున్నుబంగారు భూషణంబులచే నలంకరింపఁబడియుండినదియు,బంగారుబాహుపురులనుముక్తామయభూషణంబులను ధరించియున్నయుత్తమవనితలభుజంబులచేఁబెక్కువిధంబులంబరామృష్టంబును, జందనాగరుప్రముఖ సుగంధిగంధంబులచేతనురక్తచందనంబులచేతను గుబాళించుచుండినదియు, హంసతూలికామయశయనంబున,సీతాదేవిశిరముచేనధిష్ఠితంబయి ఎంతయుంబ్రకాశించు చుండినదియు,గంగా జలంబుననుండు తక్షకకాయంబునకుసరివచ్చుచుండినదియు,యుద్ధరంగంబునంబగవారికిగోపురార్గళంబుంబోలెనడ్డుపడి దుర్ధర్షణంబై మహాదుఃఖంబుగలిగించునదియు , మిత్రులకు సంతోషంబుగలిగించునదియు, ఆజానులంబమానంబును , భూమండలంబునకంతయు నాలంబనభూతంబును , శత్రువులపైననవరతబాణప్రయోగంబు సేయుటచేజ్యాఘాతంబు నంగలిగినకిణంబులతోనొప్పుచున్నదియు,గొప్పయినుపగుదియువలెనున్నదియుఁ, బెక్కుమాఱులుగోసహస్రంబుల నొసంగినదియునగు దక్షిణబాహువుందలగడఁగాఁజేసికొని "ఇంకనాకుమరణంబేని, సముద్రతరణంబేనిగలుగుగాక" యనిదృఢంబుగా

సంకల్పించి, స్నానాదులచేఁ బరిశుద్ధుండయి మనోనియమంబును వాఙ్నియమంబునుంగలవాఁడై, సముద్రంబునకెదుగ నా శయనించెను. అని, తాత్పర్యము.

తస్య రామస్య సుప్తస్య కుశాస్తీర్ణే మహీతలే
నియమా దప్రమత్తస్య నిశా స్తిస్రో ఽతిచక్రముః. ౧౦

టీక॥ నియమాత్ = నియమమువలన; అప్రమత్తస్య = ఏమఱనివాఁడగు; తస్య = ఆ; రామస్య = రాముండు; కుశాస్తీర్ణే = దర్భలచేఁబఱుపఁబడిన; మహీతలే = భూమితలమునందు; సుప్తస్య = శయనించియుండఁగా; తిస్రః = మూఁడయిన; నిశాః = రాత్రులు; అతిచక్రముః = అతిక్రమించినవి.

అట్లు, నియమంబుదప్పక, రాముండు, దర్భలుపఱచిననేలపై, శయనించియుండఁగా, మూఁడురాత్రులుగడచినవి. అని, తాత్పర్యము.

స త్రిరాత్రోషిత స్తత్ర నయజ్ఞో ధర్మవత్సలః
ఉపాసత తదా రామ స్సాగరం సరితాం పతిమ్. ౧౧

టీక॥ నయజ్ఞః = నీతిదెలిసినవాఁడును; ధర్మవత్సలః = ధర్మమునందతిప్రీతిగలవాఁడునగు; సః = ఆ; రామః = రాముఁడు; తత్ర = ఆసముద్రతీరమునందు; త్రిరాత్రోషితః = మూఁడురాత్రులున్నవాఁడై; తదా = అప్పుడు; సరితాం = నదులకు; పతిం = పెనిమిటియగు; సాగరం = సముద్రుని; ఉపాసత = ఉపాసించెను.

నయజ్ఞుండు నతిధార్మికుండునగు నారాముండు, అచ్చటసముద్రతీరంబున, అట్లుమూఁడురాత్రులు శయనించియుండి, ఆమూఁడురాత్రులును, ఎడతెగక, నదీపతియగుసముద్రునారాధింపుచుండెను. అని, తాత్పర్యము.

న చ దర్శయతే మంద స్తదా రామస్య సాగరః
ప్రయతేనాపి రామేణ యథార్హ మభిపూజితః. ౧౨

టీక॥తదా = అప్పుడు; మందః = మూఢుఁడగు; సాగరః = సముద్రుఁడు; ప్రయతేన=పరిశుద్ధుఁడగు; రామేణ= రామునిచేత; యథార్హం = యథాయోగ్యముగ; అభిపూజితోపి=పూజింపఁబడినవాఁడైనను; ఆత్మానం (అధ్యాహృతము)=తన్ను; రామస్య=రామునికి; నదర్శయతే=చూపఁడయ్యె("చ"అనునది పాదపూరణార్థము.)

సముద్రుండు, మూఢుండగుటవలన, రాముండు నియమంబున నెంతయు నారాధించినను, సాక్షాత్కరింపఁడయ్యె.

అని, తాత్పర్యము.

సముద్రస్య తతః క్రుద్ధో రామో రక్తాంతలోచనః
సమీపస్థ మువాచేదం లక్ష్మణం శుభలక్షణమ్. ౧౩

టీక॥తతః=అటుపిమ్మట; రామః= రాముఁడు; సముద్రస్య=సముద్రునివిషయమయి; క్రుద్ధః=కోపించినవాఁడై; రక్తాంతలోచనః=ఎఱ్ఱనికొనలుగలకండ్లుగలవాఁడై; సమీపస్థం = సమీపముననున్న; శుభలక్షణం= మంగళకరములగులక్షణములుగల; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; ఇదం=ఈమాటను; ఉవాచ = చెప్పెను.

అంత, రాముండు, సముద్రంబుపైఁ గోపించి, కనుఁగొనలనెఱ్ఱఁదనంబు గదుర, సమీపంబుననున్న శుభలక్షణలక్షితుండగు లక్ష్మణుఁ జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అవలేప స్సముద్రస్య నదర్శయతి యత్స్వయమ్

టీక॥స్వయం=తన్ను; నదర్శయతి (ఇతి) యత్=చూపకున్నాఁడనునదియేది గలదో; అయం(అధ్యాహృతము)=ఇది; సముద్రస్య=సముద్రముయొక్క; అవలేపః=గర్వము.

సముద్రుండింకను, రాకున్నాఁడుగదా! ఇతనిగర్వంబిట్లు సేయుచున్నది.

అని, తాత్పర్యము-

ప్రశమశ్చ క్షమాచైవ ఆర్జవం ప్రియభాషితా. ౧౪
అసామర్థ్యం ఫలం త్యేతే నిర్గుణేషు సతాంగుణాః

టీక॥ ప్రశమశ్చ=శాంతియు ; క్షమాచైవ=ఓర్పును; ఆర్జవం= కౌటిల్యములేకుండుటయు ; ప్రియభాషితా=ప్రియంబులువలుకుటయు; ఏతే=ఈ; సతాం=పెద్దలయొక్క; గుణాః=గుణములు; నిర్గుణేషు= దుష్టులయందు; అసామర్థ్యం= సామర్థ్యము లేమిః; ఫలంతి=కలిగించుచున్నవి.

కోపములేకుండుట, అపరాధంబునోర్చుట,కుటిలతలేకుండుట, ప్రియంబులువలుకుట, ఇవిమొదలగు సత్పురుషులగుణములు, నిర్గుణులకు,అసామర్థ్యకృతంబులుగాఁదోఁచును.

అని,తాత్పర్యము.

ఆత్మప్రశంసినం ధృష్టం దుష్టం విపరిధావకమ్. ౧౫
సర్వత్రోత్సృష్టదండంచ లోక స్సత్కురుతే నరమ్

టీక॥లోకః=జనము ; ఆత్మప్రశంసినం=తన్నుఁబొగడుకొను వాఁడును; ధృష్టం=దయలేనివాఁడును;దుష్టం=దుష్టుండును; విపరిధావకం= పరుగెత్తువాఁడును; సర్వత్ర= అందటియందును;ఉత్సృష్టదండంచ=విడువఁబడినశిక్షగలవాఁడునగు; నరం=పురుషుని ; సత్కురుతే=పూజించుచున్నది.

లోకమునందుజనులు,ఆత్మస్తుతిపరుండును,నిర్దయుండును, దుష్టుండును,గర్వంబుననతిప్రసంగియు , మంచివారని చెడువారనివివేచనంబులేక , యందఱను దండించు వాఁడునగు పురుషుని, గౌరవింతురుగాని,శమాదులుగలసత్పురుషునిగౌరవింపరు. అని,తాత్పర్యము.

న సామ్నా శక్యతే కీర్తిః న సామ్నా శక్యతే యశః. ౧౬
ప్రాప్తుం లక్ష్మణ లోకేస్మిన్ జయోవా రణమూర్ధని

టీక॥ లక్ష్మణ= లక్ష్మణుఁడా! అస్మిన్=ఈ; లోకే = లోకమునందు; సామ్నా=మంచితనముచేత; కీర్తిః=బలవంతుఁడనకీర్తి; ప్రాప్తుం= పొందుటకు; నశక్యతే= అలవిగాదు. సామ్నా=మంచితనముచేత ; యశః=పరాక్రమవంతుఁడను యశస్సును; ప్రాప్తుం(అధ్యాహృతము)=పొందుటకు ; నశక్యతే=అలవిగాదు. రణమూర్ధని=యుద్ధశిరస్సునందు; జయోవా= గెలు

వుగాని ; సామ్నా, ప్రాప్తుం, నశక్యతే (అధ్యాహృతము)=మంచితనముచేతఁ బొందుటకలవిగాదు.

లక్ష్మణుఁడా! ఈలోకంబున, బలవంతుండను కీర్తిని గాని , పరాక్రమవంతుఁడనుయశస్సును గాని , యుద్ధరంగంబునజయంబునుగాని, మంచితనముచేఁ బొందనలవిగాదు-

అని, తాత్పర్యము,

అద్య మద్బాణనిర్భిన్నై ర్మకరై ర్మకరాలయమ్. ౧౭
నిరుద్ధతోయం సౌమిత్రే ప్లవద్భిః పశ్య సర్వతః

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! అద్య=ఇప్పుడు; మద్బాణనిర్భిన్నైః=నాబాణములచే భేదింపఁబడినవియు; సర్వతః=అంతటను; ప్లవద్భిః=తేలుచున్నవియునగు; మకరైః=మొసళ్లచేత; నిరుద్ధతోయం=అడ్డగింపఁబడిననీళ్లుగల ; మకరాలయం=సముద్రమును; పశ్య=చూడుము-

లక్ష్మణుఁడా ! ఇప్పుడు, నాబాణబులచేఁజెగియంతటం దేలుచుండు, మకరంబులచే, నీసముద్రంబావరింపఁబడియుండఁగలదు; చూడుము.

అని, తాత్పర్యము.

మహాభోగాని మత్స్యానాం కరిణాంచ కరానిహ. ౧౮
భోగినాం పశ్య నాగానాం మయా చ్ఛిన్నాని లక్ష్మణ

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఇహ=ఇచ్చట; మయా=నాచేత; ఛిన్నాని=నఱుకఁబడిన; భోగినాం= పెద్దశరీరముగల; నాగానాం = సర్పములయొక్క; మహాభోగాని= పెద్దశరీరములను; కరిణాం=ఏనుంగులయిన; మత్స్యానాం=మత్స్యములయొక్క; కరాన్=తొండములను; పశ్య=చూడుము.

లక్ష్మణుఁడా! ఇంక, శీఘ్రంబుననే, మహాకాయంబులగు సర్పంబులశరీరంబులను, గజాకారమత్స్యంబులను, నాచేఛేదింపఁబడిసముద్రజలంబులం బడియుండఁగాఁజూడఁగలవు. అని, తాత్పర్యము.

సశంఖశుక్తికాజాలం సమీనమకరం శరైః. ౧౯
అద్య యుద్ధేన మహతా సముద్రం పరిశోషయే

టీక॥ అద్య=ఇప్పుడు; శరైః=బాణంబులచేత; మహతా=గొప్పదగు; యుద్ధేన=జగడముచేత ; సశంఖశుక్తికాజాలం=శంఖములయొక్కయు ముత్తెపుచిప్పల యొక్కయు సమూహములతోఁ గూడినదియు; సమీనమకరం = మత్స్యములతోను మొసళ్లతోనుం గూడినదియునగు; సముద్రం=సముద్రమును; పరిశోషయే=ఎండించెదను.

ఇప్పుడు, నానావిధంబులగు బాణంబులు ప్రయోగించి, శంఖశుక్తికాసహితంబును మత్స్యమకరసంకులంబునగు సముద్రమునంతయు శోషిల్లంజేసెదను.

అని, తాత్పర్యము.

క్షమయాహి సమాయుక్తం మామయం మకరాలయః. ౨౦
అసమర్థం విజానాతి ధిక్ క్షమా మీదృశే జనే

టీక॥ అయం=ఈ; మకరాలయః=సముద్రుఁడు; క్షమయా= ఓర్పుతోఁ; సమాయుక్తం=కూడిన; మాం=నన్ను; అసమర్థం = సమర్థుఁడు గానివానిఁగా; విజానాతిహి=తెలిసికొన్నాఁడుగదా! ఈదృశే=ఇట్టి ; జనే=జనమునందు; క్షమాం=ఓర్పునుగూర్చి; ధిక్=దహింపఁబడుటయగుఁగాక.

నేను, ఓర్పుయుండుటచేతఁగదా యీసముద్రుండునన్ను సమర్థునిఁగాఁదలంచియుపేక్షించినాఁడు ; ఇట్టిదుష్టునివిషయమయి, ఓర్పుదగదు, ఇంకఁ గ్రోధంబునేవహింపవలయును.

అని, తాత్పర్యము.

నదర్శయతి సామ్నా మే సాగరో రూప మాత్మనః. ౨౧

టీక॥ సామ్నా=మంచితనముచేత; సాగరః=సముద్రుఁడు; ఆత్మనః=తనయొక్క; రూపం=రూపమును; మే = నాకు ; నదర్శయతి = చూపకున్నాఁడు.

సామోపాయంబెంత చేసినను, సముద్రుండు , నాకుసాక్షాత్కరింపకున్నాఁడు. అని, తాత్పర్యము.

చాప మానయ సౌమిత్రే శరాంశ్చాశీవిషోపమాన్
సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవంగమాః. ౨౨

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! చాపం = ధనుస్సును; ఆశీవిషోపమాన్= సర్పములతోఁబోలికగల; శరాంశ్చ = బాణములను; ఆనయ = తెమ్ము. సాగరం=సముద్రమును; శోషయిష్యామి= ఎండించెదను. ప్లవంగమాః = వానరులు; పద్భ్యాం=కాళ్లచేత; యాంతు=పోవుదురుగాక.

లక్ష్మణుఁడా! ధనుస్సును దీక్ష్ణబాణంబులనుం దెమ్ము ; సముద్రంబునంతయు శోషిల్లంజేసెదను; వానరులు, కాలినడక నేలంకకుఁబోవుదురుగాక.

అని, తాత్పర్యము.

అద్యా క్షోభ్యమపి క్రుద్ధః క్షోభయిష్యామి సాగరమ్

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; అద్య=ఇప్పుడు; క్రుద్ధః=కోపించినవాఁడనై; అక్షోభ్యమపి=కలఁతపెట్టఁగూడనిదైనను ; సాగరం = సముద్రమును; క్షోభయిష్యామి= కలఁతపఱచెదను.

ఇప్పుడు, అక్షోభ్యంబగుసముద్రంబును, గ్రుద్ధుండనై, క్షుభితంబుగావించెదను. అని, తాత్పర్యము.

వేలాసుకృతమర్యాదం సహసోర్మిసమాకులమ్. ౨౩
నిర్మర్యాదం కరిష్యామి సాయకైర్వరుణాలయమ్

టీక॥ వేలాసుకృతమర్యాదం= చెలియలికట్టచేఁజేయఁబడిన హద్దు గలదియు; ఊర్మిసమాకులం=అలలచేనిండినదియునగు; వరుణాలయం= సముద్రమును; సహసా=శీఘ్రముగా; సాయకైః=బాణములచేత ; నిర్మర్యాదం=హద్దులేనిదానిఁగా; కరిష్యామి=చేసెదను.

చెలియలికట్టనతిక్రమింపకుండునదియుఁ దరంగసంకులంబునగు సముద్రంబు,నింక, శీఘ్రంబున,నిర్మర్యాదంబుగా,భూమియందంతయుఁ, బ్రవహించునట్లుగావించెదను.

అని, తాత్పర్యము.

మహార్ణవం క్షోభయిష్యే మహాదానవసంకులమ్. ౨౮

టీక॥ మహాదానవసంకులం=గొప్ప దానవులచేనిండిన ; మహార్ణవం=మహాసముద్రమును; క్షోభయిష్యే= కలఁతపఱిచెదను.

సముద్రంబునందలి దానవులతోఁగూడ, సముద్రంబునంతయు , క్షుభితంబుగావించెదను. అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా ధనుష్పాణిః క్రోధవిస్ఫారితేక్షణః
బభూవ రామో దుర్ధర్షో యుగాంతాగ్నిరివ జ్వలన్. ౨౯

టీక॥ రామః=రాముఁడు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి;ధనుష్పాణిః=విల్లు చేతంగలవాఁడై ; క్రోధవిస్ఫారితేక్షణః= కోపముచేఁద్రిప్పఁబడినకండ్లుగలవాఁడై;యుగాంతాగ్నిరివ = ప్రళయకాలాగ్నిహోరా త్రుఁడువలె;జ్వలన్=మండుచు;దుర్ధర్షః= చెనకఁగూడనివాఁడు;బభూవ=ఆయెను.

ఇట్లు,లక్ష్మణునకుంజెప్పి, రాముండు,ధనుర్బాణంబులుధరించి, పరమకుపితుండై, కండ్లుగిఱగిఱంద్రిప్పుచుఁ, ప్రళయకాలానలంబుకై వడివెలుంగుచు, దుర్ధర్షుండై,యుండెను.

అని, తాత్పర్యము.

సంపీడ్యచ ధను ర్ఘోరం కంపయిత్వా శరై ర్జగత్
ముమోచ విశిఖా నుగ్రాన్ వజ్రానివ శతక్రతుః. ౩౦

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు;ఘోరం=భయంకరమయిన; ధనుః=వింటిని; సంపీడ్యచ=పీడించియు; జగత్=లోకమును;శరైః= బాణంబులచేత;కంపయిత్వా = వడఁకించి; ఉగ్రాన్=తీక్ష్ణములగు;విశిఖాన్= బాణములను;శతక్రతుః=దేవేంద్రుఁడు;వజ్రానివ=వజ్రాయుధములనువలె; ముమోచ=విడిచెను.

అంత,రాముండు, ధనువుసజ్యంబుగావించి,దృఢముష్టింబట్టి,లోకంబులుభీతంబులయి గడగడవడంక, దేవేంద్రుం

డు పెక్కు వజ్రాయుధంబులు ప్రయోగించునట్లు, తీక్ష్ణంబులగు బాణంబులం బ్రయోగించెను. అని, తాత్పర్యము.

తే జ్వలంతో మహావేగా స్తేజసా సాయకోత్తమాః
ప్రవిశంతి సముద్రస్య సలిలం త్రస్తపన్నగమ్. ౨౭

టీక॥ తే=ఆ; సాయకోత్తమాః=బాణశ్రేష్ఠములు; మహావేగాః = అధికమయిన వేగము గలవై ; తేజసా=కాంతిచేత; జ్వలంతః = వెలుంగుచు; సముద్రస్య=సముద్రంబుయొక్క; త్రస్తపన్నగం= భయపడినసర్పములుగల; సలిలం=జలమును; ప్రవిశంతి=ప్రవేశించుచున్నవి.

అంత, నాబాణంబులు, మహావేగంబులయి, తేజంబుచే జ్వలించుచు, భయపీడితంబులగుసర్పంబులతోనొప్పుచున్న సముద్రజలంబులం బ్రవేశించినవి.

అని, తాత్పర్యము.

తోయవేగ స్సముద్రస్య సనక్రమకరో మహాన్
సంబభూవ మహాఘోర స్సమారుతరవ స్తదా. ౨౮

టీక॥ తదా=అప్పుడు; సమారుతరవః=వాయుధ్వనితోఁగూడినదియు; సనక్రమకరః= మొసళ్లతోనుమత్స్యవిశేషముతోనుంగూడినదియు; మహాన్=గొప్పదియు; మహాఘోరః=మహాభయంకరమునగు; సముద్రస్య=సముద్రముయొక్క; తోయవేగః = జలవేగము; సంబభూవ=కలిగినది.

అప్పుడు, సముద్రంబునందు, తరంగవేగంబు, వాయువేగసంఘట్టితంబయి, మొసళ్లు మొదలగువానితోఁగూడి, మహాభయంకరంబయి, చూపట్టినది.

అని, తాత్పర్యము.

మహోర్మిమాలావితత శ్శంఖశుక్తి సమావృతః
సధూమపరివృత్తోర్మి స్సహసా సీన్మహోదధిః. ౨౯

టీక॥ మహోదధిః=మహాసముద్రము; సహసా= శీఘ్రముగ ; మహో

మిఃమాలావితతః = గొప్పయలలపఙ్క్తులచేవ్యాపింపఁబడినదిగాను; శంఖశుక్తిసమావృతః=శంఖములచేతనుము త్తెపుచిప్పలచేతనుగప్పఁబడినదిగాను;సధూమపరివృత్తోర్మిః= పొగతోఁగూడినవియుఁదిరుగుచున్నాఁడినవియునగు నలలుగలదిగాను; అసీత్=అయినది.

అంత, శీఘ్రంబునసముద్రం బంత యు, గొప్పగొప్ప తరంగంబులతోఁగూడినదై, తరంగంబులచేఁ బైకిఁదేఁబడినశంఖశుక్తులచేసమావృతంబై, జ్వాలాభీలంబులగు బాణంబుల సంబంధంబునంజేసి,పొగయుచుఁ, జూసరులకుభయంకరంబుగాఁజూపట్టినది.

అని, తాత్పర్యము.

వ్యథితాః పన్నగాశ్చా సన్ దీప్తాస్యా దీప్తలోచనాః
దానవాశ్చ మహావీర్యాః పాతాళతలవాసినః. ౩౦

టీక॥దీప్తాస్యాః= వెలుంగుచున్న నోరుగలవియు; దీప్తలోచనాః= వెలుంగుచున్న కండ్లుగలవియునగు; పన్నగాశ్చ=సర్పములును; వ్యథితాః=పీడితములు; ఆసన్=అయినవి. పాతాళతలవాసినః= పాతాళలోకంబుననుం డునట్టి;మహావీర్యాః=అధికమయిన పరాక్రమముగల; దానవాశ్చ=దానవులును ; వ్యథితాః ( అధ్యాహృతము)—పీడింపఁబడినారు.

సముద్రంబుననుండుసర్పములు,దీప్తలోచనంబులయి,ముఖంబులవిషంబు గ్రక్కుచు,రామబాణపీడితంబులయి, భయవిహ్వలంబులయినవి; అట్లు,పాతాళంబుననుండుమహాపరాక్రమశాలులగు దానవులును,రామబాణపీడితులయిరి.

అని, తాత్పర్యము.

ఊర్మయ స్సింధురాజస్య సనక్రమకరా స్తదా
వింధ్యమందరసంకాశా స్సముత్పేతు స్సహస్రశః. ౩౧

టీక॥ తదా=అప్పుడు ; సనక్రమకరాః=మొసళ్లతోను మత్స్యవిశేషంబులతోనుంగూడిన;సింధురాజస్య=సముద్రముయొక్క; ఊర్మయః= అలలు;

వింధ్యమందరసంకాశాః= వింధ్యమందరపర్వతములతో సమానములయి; సహస్రశః=వేనవేలుగా; సముత్పేతుః= లేచినవి.

అప్పుడు, సముద్రంబున, మొసళ్లు మొదలగుజలజంతువులతోఁగూడినవగు మహాతరంగంబులు వింధ్య మందరంబులుంబోలెనత్యున్నతంబులయి, వేనవేలుగాఁబొడమినవి.

అని, తాత్పర్యము.

ఆఘూర్ణితతరంగౌఘ స్సంభ్రాంతోరగరాక్షసః
ఉద్వర్తితమహాగ్రాహ స్సంవృత్త స్సలిలాశయః. ౩౨

టీక॥సలిలాశయః=సముద్రము; ఆఘూర్ణితతరంగౌఘః=తిరుగుడువొందినయలలసమూహముగలదిగాను; సంభ్రాంతోరగరాక్షసః= కలఁతనొందినసర్పములును రాక్షసులునుగలదిగాను; ఉద్వర్తితమహాగ్రాహః = తిరుగుడునొందినపెద్దమొసళ్లుగలదిగాను;సంవృత్తః=అయినది.

అంతఁ,దరంగంబులుతిరుగుడునొంద, సర్పంబులును రాక్షసులును సంభ్రాంతులుగా, మొసళ్లు మొదలగు జలజంతువులుభీతంబులయి సంక్షోభంబు నొంద, నమ్మహాసముద్రంబంతయుఁ, గాంతిహీనంబయియుండినది.

అని, తాత్పర్యము.

తతస్తు తం రాఘవ ముగ్రవేగం
ప్రకర్షమాణం ధను రప్రమేయమ్
సౌమిత్రి రుత్పత్య సముచ్ఛ్వసంతం
మామేతి చోక్త్వా ధను రాలలంబే. ౩౩

టీక॥తతస్తు=అటుపిమ్మటను;సౌమిత్రిః=లక్ష్మణుండు;ఉగ్రవేగం= భయంకరమయిన వేగముగలవాఁడును; అప్రమేయం=కొలఁదిలేని;ధనుః = వింటిని; ప్రకర్షమాణం= ఈడ్చుచున్నవాఁడును;సముచ్ఛ్వసంతం= నిట్టూర్పులువుచ్చుచున్నవాఁడునగు;తం = ఆ;రాఘవం=రామునిని;ఉత్పత్య=సమీపించి;మా

మా=వలదువలదు;ఇతి = అని;ఉక్త్వా చ=చెప్పియు;ధనుః = వింటిని;ఆలలంబే=పట్టుకొనెను.

అంత,లక్ష్మణుండు, కోపంబినుమడింపనిట్టూర్పులువుచ్చుచు మఱియును గ్రంబగు వేగంబు వహించియతిభయంకరంబగుశరసంధానంబుసేయందొడంగినరాముంజూచి,"యింకనుపేక్షింపరాదు,లోకంబులన్నియుదగ్ధంబులగును"అనితలంచి,రాముండగ్గఱి, "వలదు!వలదు!ఇంక,విరమింపుము!" అనిప్రార్థించియు,విరమింపకుండుటంజేసి,రాముని చేతిధనువుంబట్టుకొనెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

యుద్ధకాండే,ఏకవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండైకవింశసర్గటీక,

ముగిసినది.



(౨౨)

ద్వావింశసర్గప్రారంభః.

అథోవాచ రఘుశ్రేష్ఠ స్సాగరం దారుణం వచః

టీక॥ అథ=అటుపిమ్మట ; రఘుశ్రేష్ఠః=రాముఁడు; సాగరం= సముద్రు నిగూర్చి; దారుణం= భయంకరమగు; వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

అంత, రాముండు, అప్పటికిని సాక్షాత్కరింపకుండునట్టి సముద్రుంబూచి, భయంకరంబుగా , నీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

అద్య త్వాం శోషయిష్యామి సపాతాళం మహార్ణవ. ౧

టీక॥ మహార్ణవ= మహాసముద్రుఁడా! అద్య=ఇప్పుడు; సపాతాళం = పాతాళముతోఁ గూడు నట్లుగా ; త్వాం=నిన్ను;శోషయిష్యామి=ఎండించెదను.

సముద్రుఁడా! ఇప్పుడునిన్ను, పాతాళముతోఁగూడ, శోషిల్లునట్లు గావించెదను. అని, తాత్పర్యము.

శరనిర్దగ్ధతోయస్య పరిశుష్కస్య సాగర
మయా శోషితసత్వస్య పాంసు రుత్పద్యతే మహాన్. ౨

టీక॥ సాగర=సముద్రుఁడా! తే= నీవు; మయా=నాచేత; శరనిర్దగ్ధతోయస్య= బాణంబులచేదహింపఁబడినన నీళ్లుగలవాఁడవై ; పరిశుష్కస్య=ఎండిన వాఁడవై ; శోషితసత్వస్య= దహింపఁబడినజంతువులుగలవాఁడవుకాఁగా ;మహాన్=గొప్పదగు; పాంసుః=దుమ్ము; ఉత్పద్యతే=పుట్టఁగలదు.

సముద్రుఁడా! నాబాణంబులచేజలంబంతయు నెండిపోయి, జలజంతువులన్నియుదగ్ధంబులయినపిమ్మట, నీవున్నస్థలంబంతయు, నిసుకతోనిండియుండఁగలదు. అని, తాత్పర్యము.

మత్కార్ముకవిసృష్టేన శరవర్షేణ సాగర

పారం తే ద్య గమిష్యంతి పద్భిరేవ ప్లవంగమాః. 3

టీక॥సాగర = సముద్రుఁడా! మత్కార్ముకవర్షేణ= నాధనుస్సునుండివిడువఁబడిన;శరవిసృష్టేన=బాణవర్షముచేత; అద్య=ఇప్పుడు;ప్లవంగమాః=వానరులు;పద్భిరేవ=కాళ్లచేతనే; తే=నీయొక్క; పారం=అవలిగట్టును;గమిష్యంతి=పొందఁగలరు.

సముద్రుఁడా! నేనుబాణవర్షంబున,నిన్నుశోషిల్లంజేసినపిమ్మట, నిప్పుడు, వానరులు, కాలినడకనే, నిన్నుదాఁటిపోఁగలరు.అని,తాత్పర్యము.

విచిన్వ న్నాభిజానాసి పౌరుషంవాపి విక్రమమ్
దానవాలయ సంతాపం మత్తో నాధి గమిష్యసి. ౪

టీక॥ దానవాలయ=దానవులకునివాసస్థానమవయినసముద్రుఁడా! త్వం (అధ్యాహృతము)=నీవు; పౌరుషంవాపి=బలమునైనను; విక్రమం=పరాక్రమమునైనను; విచిన్వన్=ఆలోచించుచు; నాభిజానాసి=ఎఱుంగవు. మత్తః=నావలన;భావినం(అధ్యాహృతము)=కలుగునట్టి;సంతాపం=బాధను; నాధిగమిష్యసి=ఎఱుంగవు.

దానవులకు నివాసస్థానమవగు సముద్రుఁడా! నీవు, నాబలంబునుగానిపరాక్రమంబునుగాని, యాలోచించి, కనుంగొనఁజాలవు;మఱియు, నావలనంగలుగు బాధనుంగూడఁ దెలిసికొనకున్నావు;ఈయజ్ఞానము, దానవసహవాసదోషంబునం గలిగినదేమో తెలియదు. అని,రాముండు,సముద్రునకుంజెప్పెను. అని, తాత్పర్యము.

బ్రాహ్మే ణాస్త్రేణ సంయోజ్య బ్రహ్మదండనిభం శరమ్
సంయోజ్య ధనుషి శ్రేష్ఠే విచకర్ష మహాబలః. ౫

టీక॥ మహాబలః=అధికమయినబలముగలరాముండు; బ్రహ్మదండనిభం = బ్రహ్మదండముతోసమానమయున ; శరం=బాణమును; బ్రాహ్మేణ=బ్రహ్మసంబంధియగు; అస్త్రేణ = అస్త్రముతో; సంయోజ్య = కూర్చి ; శ్రే

ష్టే=ఉత్తమమయిన; ధనుషి =వింటియం దు; సంయోజ్య=కూర్చి; వికకర్ష=ఆకర్షించెను.

మహాబలుండగు రాముండు, బ్రహ్మ దండసమానంబగు, భయంకర శరంబుదీసి, దాని బ్రహ్మాస్త్రంబుతో నభిమంత్రించి, వింటంగూర్చి, యాకర్ణాంతము నాకర్షించెను.

అని, తాత్పర్యము.

తస్మిన్ వికృష్టే సహసా రాఘవేణ శరాసనే
రోదసీ సంపఫాలేవ పర్వతాశ్చ చకంపిరే. ౬

టీక॥ రాఘవేణ=రామునిచేత; తస్మిన్=ఆ; శరాసనే=ధనుస్సు; సహసా=శీఘ్రంబున; వికృష్టే = ఈడ్వంబడంగానే; రోదసీ=ఆకాశభూములు; సంపఫాలేవ(ఏకవచనమార్షము) = పగిలినట్లుండినవి. పర్వతాశ్చ= పర్వతములును; చకంపిరే=వడంకినవి.

అట్లు, రాముండు, ధనువునాకర్షింపంగానే, ఆకాశంబునుభూమియుంబగిలినట్లుండినవి; పర్వతంబులన్నియుభయంబున, గడగడవడంకినవి.

అని, తాత్పర్యము.

తమశ్చ లోక మావవ్రే దిశశ్చ నచకాశిరే
పరిచుక్షుభిరే చాశు సరాంసి సరిత స్తథా. ౭

టీక॥తమశ్చ=చీకటియు; లోకం=లోకమును; ఆవవ్రే=కప్పినది. దిశశ్చ=దిక్కులును; నచకాశిరే=ప్రకాశింపకుండినవి. తథా=అట్లు; సరాంసి=కొలంకులును; సరితశ్చ=నదులును; ఆశు=శీఘ్రముగా; పరిచుక్షుభిరే=కలంగినవి.

లోకంబునందంతయుంజీకటిక్రమ్మినది; దిక్కులుకాంతిహీనంబులయినవి; సరస్సులునునదులును, గలంగియుండినవి.

అని, తాత్పర్యము.

తిర్యక్చ సహనక్షత్రై స్సంగతౌ చంద్రభాస్కరౌ

టీక॥ చంద్రభాస్కరౌ=చంద్రసూర్యులు; నక్షత్రైస్సహ = నక్షత్రములతోంగూడ; తిర్యక్ = వక్రముగా; సంగతౌ=కూడినవారలయి; జగ్మతుః (అ

ధ్యావృతము)=నడచిరి.

చంద్రసూర్యులును, నక్షత్రంబులును, భయంబున, వక్రంబుగానడచినవి. అని, తాత్పర్యము.

భాస్కరాంశుభి రాదీప్తం తమసాచ సమావృతమ్. ౮
ప్రచకాశే తథాకాశ ముల్కాశత విదీపితమ్

టీక॥ తదా=అప్పుడు; భాస్కరాంశుభిః = సూర్యునికిరణములచేత; ఆదీప్తం=ప్రకాశింపఁజేయఁబడినదియు; తమసా=చీఁకటిచేత; సమావృతంచ=కప్పఁబడినదియునగు; ఆకాశం = ఆకసము; ఉల్కాశతవిదీపితం(ఇవ)=కొఱవులనూఱిటిచేఁ బ్రకాశింపఁజేయఁబడినదివలె; ప్రచకాశే=ప్రకాశించినది.

అప్పుడు, ఆకాశంబున, అధికముగాఁ జీఁకటిక్రమ్ముకొనియుండుటంజేసి, సూర్యునికిరణంబులు కొఱవులంబోలెఁగాంతిహీనంబులయిచూపట్టుచుండినవి. అని, తాత్పర్యము.

అంతరిక్షాచ్చ నిర్ఘాతా నిజగ్ముః రతులస్వనాః. ౯

టీక॥ అంతరిక్షాత్ = ఆకాశమునుండి; అతులస్వనాః=సరిలేనిధ్వనులుగల; నిర్ఘాతాశ్చ=పిడుగులును; నిజగ్ముః=వెడలినవి.

అంతరిక్షంబుననుండి, మహాధ్వనిగదురం, బిడుగులు, పడినవి. అని, తాత్పర్యము.

పుస్ఫురుశ్చ ఘనా దివ్యా దివి మారుత పఙ్క్తయః

టీక॥ దివి=ఆకాశమునందు; ఘనాః=పెద్దవియును; దివ్యాః=ఆకాశమునందుఁబుట్టినవియునగు; మారుతపఙ్క్తయః=వాయుసమూహములు; పుస్ఫురుశ్చ=సంచరించినవి.

మఱియు, నాకాశంబునం, జండమారుతంబులు, భయంకరంబుగా వీచినవి. అని, తాత్పర్యము.

బభంజచ మహావృక్షాన్ జలదా నుద్వహన్నపి. ౧౦

ఆరుజంశ్చైవ శైలాగ్రాన్ శిఖరాణి ప్రభంజనః

టీక॥ ప్రభంజనః=వాయువు ; జలదాన్=మేఘములను; ఉద్వహన్నపి=పైకివహించుచును; మహావృక్షాన్=గొప్పవృక్షములను;బభంజచ=విఱిచెను. శైలాగ్రాన్=పర్వతశిఖరములను; శిఖరాణి=ఖండపర్వతములను; ఆరుజంశ్చైవ=(బహువచనమార్షము)పీడించెను.

వాయువేగంబున,ఆకాశంబునందు, మేఘంబులువ్యాపించినవి; గొప్పవృక్షంబులు విఱిగినవి; పర్వతశిఖరంబులును ఖండపర్వతంబులును,పీడితంబులయినవి అని, తాత్పర్యము.

దివిస్పృశో మహామేఘాః సంగతాః సమహాస్వనాః. ౧౧
ముముచు ర్వైద్యుతా నగ్నీం స్తే మహాశనయ స్తదా

టీక॥ తదా = అప్పుడు; దివిస్పృశః=ఆకాశంబునంటుచున్న ; మహామేఘాః=గొప్పమేఘంబులు; సంగతాః=కూడినవై ; సమహాస్వనాః= అధికమయినధ్వనితోఁగూడినవై ;వైద్యుతాన్=మెఱపుసంబంధులయిన;అగ్నీన్ =అగ్నిహోత్రములను; ముముచుః=విడిచినవి. తే=ఆయగ్నులు;మహాశనయః=గొప్పపిడుగులు ; ఆసన్ (అధ్యాహృతము)=అయినవి.

అప్పుడు , మహామేఘంబులు , ఆకాశంబునసంగతంబులయి, మహాధ్వనిచెలంగ , వైద్యుతంబులగునగ్నులంగ్రక్కినవి; అవిపిడుగులయి నేలంబడినవి. అని, తాత్పర్యము.

యాని భూతాని దృశ్యాని చుక్రుశు శ్చాశనే స్సమమ్. ౧౨
అదృశ్యాని చభూతాని ముముచు ర్భైరవస్వనమ్

టీక॥దృశ్యాని=చూడఁదగిన; భూతాని=భూతములు; యాని(సంతి) = ఏవిగలవో; తాని (అధ్యాహృతము ) చ=అవియు; అశనేః = పిడుగునకు; సమం=సరిగా; చుక్రుశుః=అఱచినవి; అదృశ్యాని=చూడంగూడనట్టి; భూతా

నిచ=భూతములును; భైరవస్వనం = భయంకరధ్వనిని; ముముచుః=విడిచినవి.

దృశ్యంబులగుమనుష్యాది భూతంబులు, పిడుగుమ్రోంతకుసరిగామహాధ్వనిగదుర, నాక్రోశించినవి; అదృశ్యంబులగు పిశాచాదిభూతంబులును, భయంకరధ్వనింగావించినవి. అని, తాత్పర్యము.

శిశ్యిరేచాపి భూతాని సంత్రస్తాన్యుద్విజంతిచ. ౧౩
సంప్రవివ్యథిరేచాపి నచ పస్పందిరే భయాత్

టీక॥భూతాని=భూతములు; సంత్రస్తాని=భయపడినవై; శిశ్యిరేచాపి=నేలంబడినవియు. ఉద్విజంతిచ= కలంత నొందినవియు. సంప్రవివ్యథిరేచాపి=దుఃఖపడినవియు; భయాత్= భయమువలన; నపస్పందిరేచ=కదలకుండినవియు.

అంత, సమస్తభూతంబులును, భయవిహ్వలంబులయి, నేలంబడి, సంభ్రాంతంబులయి , పరమదుఃఖితంబులయి, భయంబునంజేసి, నిశ్చలంబులయియుండినవి. అని, తాత్పర్యము.

సహభూతైస్సతోయోర్మిస్సనాగస్సహరాక్షసః. ౧౪
సహసాభూత్తతో వేగాద్భీమవేగో మహోదధిః

టీక॥తతః=అంత; వేగాత్=వేగమువలన; సహసా = శీఘ్రంబున; భూతైస్సహ(స్థితః)= భూతంబులతోంగూడనున్నదియు ; సతోయోర్మిః = జలతరంగములతోఁ గూడినదియు ; సనాగః = సర్పములతోఁగూడినదియు; సహరాక్షసం = రాక్షసులతోఁగూడినదియునగు ; మహోదధిః = మహాసముద్రము; భీమవేగః= భయంకరమయినవేగముగలది; అభూత్ = అయినది.

అంత, శరసంధాన మాత్రంబున రామవేగంబునంజేసి , యాసముద్రంబు, భూతంబులతోను సర్పంబులతోను రాక్షసులతోనుంగూడ, గొప్పగొప్పతరంబులతోఁగూడినదై, భయంకరంబగు వేగంబునొందినది.

అని, తాత్పర్యము.

యోజనం వ్యతిచక్రామ వేలామన్యత్ర సంప్లవాత్

టీక॥ సః (అధ్యాహృతము) = ఆసముద్రము; సంప్లవాత్ = ప్రవాహమువలన; వేలామన్యత్ర = చెలియలికట్టనువిడిచి; యోజనం = ఆమడదూరము; వ్యతిచక్రామ = అతిక్రమించెను.

అంత సముద్రము, చెలియలికట్టనుండి, యామడదూరంబు; వెనుకకుఁ బోయెను. అని, తాత్పర్యము.

తం తదా సమతిక్రాంతం నాతిచక్రామ రాఘవః
సముద్ధత మమిత్రఘ్నో రామో నదనదీపతిమ్. ౧౬

టీక॥ తదా = అప్పుడు; అమిత్రఘ్నః = శత్రువులంజంపునట్టి; రాఘవః = రఘువంశమునందుఁబుట్టిన; రామః = రాముఁడు; సమతిక్రాంతం = అతిక్రమించిపోయిన; సముద్ధతం = గర్వితుండగు; తం = ఆసముద్రమును; నాతిచక్రామ = అతిక్రమింపఁడయ్యె.

అప్పుడు, శత్రుసంహారకుఁడయిన రాముండు, అట్లు వెనుకకుఁ దాటిపోయినసముద్రముపై, బాణప్రయోగంబు సేయఁడయ్యె. అని, తాత్పర్యము.

తతో మధ్యా త్సముద్రస్య సాగర స్స్వయ ముత్థితః
ఉదయన్ హి మహాశైలా న్మేరో రివ దివాకరః. ౧౭

టీక॥ తతః = అటుపిమ్మట; సముద్రస్య = సముద్రముయొక్క; మధ్యాత్ = మధ్యప్రదేశముననుండి; స్వయం = తానె; సాగరః = సముద్రుఁడు; మహాశైలాత్ = గొప్పపర్వతమయిన; మేరోః = మేరుపర్వతముననుండి; ఉదయన్ = ఉదయించుచున్న; దివాకరఇవ = సూర్యుఁడువలె; ఉత్థితః = లేచెను.

అంత, మేరుపర్వతంబుననుండి సూర్యుండుదయించునట్లు, సముద్రమధ్యంబుననుండి, సముద్రాభిమానిదేవతయయిన, సముద్రుండావిర్భవించెను.

అని, తాత్పర్యము.

పన్నగైస్సహ దీప్తాస్య స్సముద్రః ప్రత్యదృశ్యత

స్నిగ్ధవైడూర్యసంకాశో జాంబూనదవిభూషితః. ౧౮
రక్తమాల్యాంబరధరః పద్మపత్రనిభేక్షణః
సర్వపుష్పమయీం దివ్యాం శిరసా ధారయన్ స్రజమ్. ౧౯
జాతరూపమయైశ్చైవ తపనీయవిభూషణైః
ఆత్మజానాంచ రత్నానాం భూషితో భూషణోత్తమైః. ౨౦
ధాతుభి ర్మండిత శ్శైలో వివిధై ర్హిమవానివ
ఏకావళీమధ్యగతం తరళం పాటలప్రభం. ౨౧
విపులే నోరసా బిభ్రే త్కౌస్తుభస్య సహోదరమ్
ఆఘూర్ణితతరంగౌఘః కాళికానిలసంకులః. ౨౨

టీక॥ స్నిగ్ధవైడూర్యసంకాశః = సుందరమయిన వైడూర్యమణితోసమానుఁడును ; జాంబూనదవిభూషితః = జంబూనదియందుఁబుట్టిన బంగారముచేనలంకరింపఁ బడినవాఁడును ; రక్తమాల్యాంబరధరః = ఎఱ్ఱనిపుష్పమాలికలనువస్త్రములనుధరించినవాఁడును ; పద్మపత్రనిభేక్షణః= తామరపూఱేకులతోసమానములయినకండ్లుగలవాఁడును; సర్వపుష్పమయీం=సమస్తపుష్పవికారమయిన ;దివ్యాం=ఉత్తమమయిన; స్రజం=పుష్పమాలికను; శిరసా = తలచేత; ధారయన్ = ధరించుచున్నవాఁడును; జాతరూపమయైశ్చైవ=గనులంబుట్టినబంగారు వికారములైనసొమ్ములచేతను; తపనీయవిభూషణైః = కాఁచఁబడినబంగారు సొమ్ములచేతను; ఆత్మజానాం =తనయందుఁబుట్టిన; రత్నానాం=రత్నములయొక్క; భూషణోత్తమైః= భూషణశ్రేష్ఠములచేతను; భూషితః= అలంకరింపఁబడినవాఁడును; వివిధైః=నానావిధములయిన ; ధాతుభిః=ధాతువులచేత; మండితః= అలంకరింపఁబడిన; హిమవాన్ = హిమవంతమను;శైలఇవ(స్థితః)= పర్వతమువలెనున్నవాఁడును; కౌస్తుభస్య = కౌస్తుభమణికి; సహోదరం= తోఁబుట్టువయిన; ఏకావళీమధ్యగతం = ముక్తాహారమునడుమనున్న;పాటలప్రభం= ఎఱ్ఱని కాంతిగల ; తరళం = నాయకమణిని, పతకముననుట;విపులేన= విశాలమయిన ; ఉరసా= వక్షస్థ

లముచేత; బిభ్రత్ = ధరించుచున్నవాఁడును; ఆఘూర్ణితతరంగౌఘః = మిక్కిలియుచలితములయిన యలలసమూహముగలవాఁడును, కాళికానిలసంకులః = మేఘసమూహముచేతను వాయువుచేతను వ్యాకులుండునగు; సముద్రః = సముద్రుఁడు; దీప్తాస్యైః = వెలుంగుచున్ననోరులుగల; పన్నగైస్సహ = సర్పములతోఁగూడ; ప్రత్యదృశ్యత = చూడఁబడెను.

వైడూర్యవర్ణదేహుండును, రక్తమాల్యాంబరధరుండును, దామరపూరేకులుంబోలెనయనంబులుగలవాఁడును, నానావిధపుష్పములుగూర్చినదివ్యపుష్పమాలికనుశిరంబునఁ దాల్చినవాఁడును, జంబూనదియందుఁబుట్టిన బంగారుసొమ్ములచేనేమి, గనులందుజన్మించినబంగారుసొమ్ములచేనేమి, నానావిధామూల్యరత్నఖచితంబులగు బంగారుసొమ్ములచేనేమి యలంకృతుండును నానావిధధాతువులచేనలంకృతుండగు హిమవంతుండుంబోలెఁ దేజరిల్లుచున్నవాఁడును, కౌస్తుభంబుతోఁ బుట్టినదైన, ముక్తాహార మధ్యగతంబగు దివ్యరత్నంబును విశాలవక్షస్థలంబునందాల్చినవాఁడునగుసముద్రుండు, మహాతరంగంబులాకాశంబునంట, మేఘవాతంబులినుమడింప, దీప్తముఖంబులగు పన్నగంబులతోఁగూడఁ, జూపట్టెను.

అని, తాత్పర్యము.

ఉద్వర్తితమహాగ్రాహ స్సంభ్రాంతోరగరాక్షసః
దేవతానాం సురూపాణాం నానారూపాభి రీశ్వరః
గంగాసింధుప్రధానాభి రాపగాభి స్సమావృతః.

టీక॥ సురూపాణాం = సుందరములయినరూపములుగల; దేవతానాం = దేవతలలోపల; ఈశ్వరః = శ్రేష్ఠుండగు; సః (అధ్యాహృతము) = ఆసముద్రుండు; ఉద్వర్తితమహాగ్రాహః = తిరుగుడునొందినగొప్పమొసళ్లుగలవాఁడై; సంభ్రాంతోరగరాక్షసః = కలఁతనొందినసర్పంబులును రాక్షసులునుంగలవాఁడై; నానారూపాభిః = నానావిధరూపములు గల; గంగా సింధుప్రధానాభిః = గంగానదియు సింధునదియు మొదలుగాఁగల; ఆపగాభిః = నదులచే; సమావృతః = చుట్టఁబడినవాఁడై; ప్రత్యదృశ్యత (అధ్యాహృతము) =

చూడఁబడెను.

దేవతాశ్రేష్ఠుండగు నా సముద్రుండు, పెద్దపెద్ద మొసళ్లు సంభ్రాంతంబులయి తిరుగ, సర్పంబులును రాక్షసులును గలఁతనొంద, నానావిధరూపధరలగు గంగాసింధుప్రముఖనదులచే సేవింపఁబడినవాఁడై, సాక్షాత్కరించెను. అని, తాత్పర్యము.

విశేషార్థము.— "దేవతానాం సురూపాణాం" అనుశ్లోకంబు వ్యాఖ్యానముల నుదాహరింపఁబడలేదు కావున, నిందుఁబరిగణితంబు గాదయ్యె.

సాగర స్సముపక్రమ్య పూర్వ మా మంత్ర్య వీర్యవాన్. ౨౩
అబ్రవీత్ ప్రాంజలి ర్వాక్యం రాఘవం శరపాణినమ్

టీక॥వీర్యవాన్=అధికమయినపరాక్రమముగల; సాగరః=సముద్రుఁడు; సముపక్రమ్య=వచ్చి; పూర్వం=మున్ను; ఆమంత్ర్య=పిలిచి; ప్రాంజలిః=మంచి చేమోడ్పుగలవాఁడై; శరపాణినం=బాణము హస్తమునందుఁగల; రాఘవం=రాముని గూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

పరాక్రమవంతుండగు సముద్రుండు, రామునొద్దకుఁబోయి, తానెముందుగా రామునిఁబిలిచి, చేమోడ్పు గీలించి, బాణపాణియగు రామునిఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

పృథివీ వాయు రాకాశ మాపో జ్యోతిశ్చ రాఘవ. ౨౪
స్వభావే సౌమ్య తిష్ఠంతి శాశ్వతం మార్గ మాశ్రితాః

టీక॥సౌమ్య=ప్రసన్నుఁడవగు; రాఘవ= రాముఁడా! పృథివీ = భూమియు; వాయుః=వాయువును; ఆకాశం= ఆకాశమును; ఆపః= జలమును; జ్యోతిశ్చ=అగ్నియును; శాశ్వతం=నిత్యమగు; మార్గం=మర్యాదను. ఆశ్రితాః=పొందినవై; స్వభావే=స్వభావమునందు; తిష్ఠంతి=ఉన్నవి.

ప్రసన్నుఁడవగు రాముఁడా! భూమియు, వాయువును, ఆకాశమును, జలంబును, అగ్నియును ఈపంచభూతంబులును, శాశ్వతంబగు మర్యాదనవలంబించి, కాఠిన్యము, తిర్యగ్గమనము, అవకాశరూపత, అగాధత్వము, ఊర్ధ్వజ్వలనము,

ఈస్వస్వభావంబులనువదలకుండును. అని, తాత్పర్యము.

తత్స్వభావో మమాప్యేష యదగాధో హ మప్లవః. ౨౭
వికారస్తు భవే ద్గాధ ఏతత్తే ప్రవదామ్యహమ్

టీక॥తత్ = అందువలన; అహం= నేను; అగాధః= అధికమయినలోఁతుగలవాఁడను; అప్లవః = దాఁటఁగూడనివాఁడను ; అస్మి (అధ్యాహృతము ) యత్ = అగుచున్నానననునదియేదిగలదో; ఏషః= ఇది; మమాపి= నాయొక్కయు; స్వభావః = స్వభావము. వికారస్తు= వికారముమాత్రము; గాధః= లోఁతులేనిది; భవేత్ = అగును. అహం = నేను; తే= నీకు; ఏతత్ = దీనిని; ప్రవదామి= చెప్పుచున్నాను, చెప్పితిననుట-

అందువలన, మిక్కిలియులోఁతుగలిగి, దాఁటనలవిగాకుండుట, నాస్వభావము; నేనుదీనివదలనలవిగాదు; లోఁతులేకుండుట, నిప్పునకుఁ జల్లఁదనంబుపోలె, నాకువిరుద్ధధర్మము; ఈతత్త్వంబు నీకుఁజెప్పితిని. అని, తాత్పర్యము.

న కామా న్నచ లోభాద్వా నభయా త్పార్థివాత్మజ. ౨౮
గ్రాహనక్రాకులజలం స్తంభయేయం కథంచన

టీక॥పార్థివాత్మజ = రాచకొమరుండవగురాముఁడా! అహం(అధ్యాహృతము)= నేను; కథంచన= ఎట్లయినను; గ్రాహనక్రాకులజలం= మొసళ్లచేతను మత్స్యవిశేషములచేతను నిండినజలమున; కామాత్= అభీష్టమునుబొందునపేక్షవలనఁగాని; నస్తంభయేయం= స్తంభింపను. లోభాచ్చవా= పొందఁబడినదానివిడువనిచ్ఛలేమివలనఁ గాని; న(స్తంభయేయం)= స్తంభింపను . భయాత్ = భయమువలనఁగాని; న(స్తంభయేయం)= స్తంభింపను.

రాచకొమరుండవగురాముఁడా! నేను, కామమునంగాని, లోభంబునంగాని, భయంబునంగాని, మొసళ్లు మొదలగుజంతువులచేనిండియున్నజలంబులను, ఎంతమాత్రము స్తంభింపఁజాలను. అని, తాత్పర్యము.

విధాస్యే రామ యేనాపి విషహిష్యే హ్యహం తథా. ౨౯

గ్రాహా న ప్రహరిష్యంతి యావత్సేనా తరిష్యతి

టీక॥ రామ = రామునిడా! యేనాపి = ఏవిధముచేతమాత్రము; విషహిష్యే = శక్తుండనగుదునో; తథా = అట్లు; విధాస్యేహి = చేయుదునుగదా! యావత్ = ఎంతవఱకు; సేన = సేన; తరిష్యతి = దాఁటునో; తావత్ (అధ్యాహృతము) = అంతవఱకు; గ్రాహాః = మొసళ్లు; న ప్రహరిష్యంతి = బాధింపవు.

రామునిడా! అయితే, నాచేతనైన కార్యమునుమాత్రముగావించెదను; మీసేన, సముద్రంబుదాఁటువఱకు, గ్రాహాదిజలజంతువులు సేనను బాధింపకుండునట్లుగావించెదను.

అని, తాత్పర్యము.

హరీణాం తరణే రామ కరిష్యామి యథాస్థలమ్. ౨౮

టీక॥ రామ = రామునిడా! హరీణాం = వానరులయొక్క; తరణే = దాఁటుటవిషయమయి; యథా = ఎట్లు; స్థలం = మిట్ట; భవతి (అధ్యాహృతము) = అగునో; తథా (అధ్యాహృతము) = అట్లు; కరిష్యామి = చేసెదను.

రామునిడా! వానరులుసముద్రంబు దాఁటుటవిషయమయి, సేతుబంధము సేయుటకుఁదగిన సాహాయ్యంబుఁ గావించెదను. అనిసముద్రుండు, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తమబ్రవీత్తదా రామ ఉద్యతో హి నదీపతే
అమోఘో యం మహాబాణః కస్మిన్ దేశే నిపాత్యతామ్. ౨౯

టీక॥ తదా = అప్పుడు; రామః = రాముఁడు. తం = ఆసముద్రునిగూర్చి; "నదీపతే = నదులకుభర్తయైనసముద్రుఁడా! అమోఘః = వ్యర్థముగానట్టి; అయం = ఈ; మహాబాణః = గొప్పబాణము; ఉద్యతో హి = సంధింపఁబడినదిగదా! కస్మిన్ = ఏ; దేశే = ప్రదేశమునందు; నిపాత్యతాం = వేయఁబడుఁగాక" ఇతి (అధ్యాహృతము) = అని; అబ్రవీత్ = చెప్పెను.

అప్పుడు, రాముండు, సముద్రుంజూచి; "సముద్రుఁడా! అట్లగునేని, అమో

ఘంబగు నీమహాబాణంబును , శరాసనంబున, సంధించినానే! దీని నెచ్చట విడుతును? చెప్పుము" అని,పలికెను.

అని,తాత్పర్యము.

రామస్య వచనం శ్రుత్వా తంచ దృష్ట్వా మహాశరమ్
మహోదధి ర్మహాతేజా రాఘవం వాక్య మబ్రవీత్. ౩౦

టీక॥మహాతేజాః = అధికమయిన ప్రభావముగల; మహోదధిః = సముద్రుఁడు; రామస్య = రామునియొక్క; వచనం=మాటను;శ్రుత్వా= విని;తం=ఆ;మహాశరం=గొప్పబాణమును;దృష్ట్వాచ=చూచియు; రాఘవం= రామునిగూర్చి; వాక్యం= మాటను; అబ్రవీత్=చెప్పెను.

మహాతేజుండగు సముద్రుండు,రాముండు చెప్పినమాటనువిని, కృతసంధానంబగు మహాబాణంబునుంజూచి , రామునకు ఈమాటంజెప్పెను.

అని,తాత్పర్యము.

ఉత్తరేణా వకాశో స్తి కశ్చిత్పుణ్యతమో మమ
ద్రుమకుల్య ఇతిఖ్యాతో లోకే ఖ్యాతో యథా భవాన్. ౩౧

టీక॥ఉత్తరేణ=ఉత్తరదిక్కున సమీపముగా; భవాన్=నీవు; యథా= ఎట్లో;తథా(అధ్యాహృతము) = అట్లు;లోకే=లోకమునందు;ఖ్యాతః=ప్రసిద్ధమును; ద్రుమకుల్యఇతి=ద్రుమకుల్య మని; ఖ్యాతః=ప్రసిద్ధమును ; పుణ్యతమః=మిక్కిలియుసుందరమునగు ; మమ=నాయొక్క; కశ్చిత్=ఒకానొక; అవకాశః=ప్రదేశము; అస్తి=కలదు.

ఇచ్చటికి,సమీపముగానుత్తరదిక్కున, లోకంబునందునీవలె వినుతికెక్కిన దియుమిక్కిలియుసుందరంబునగుద్రుమకుల్యంబనునొకప్రదేశమున్నది.

అని,తాత్పర్యము.

ఉగ్రదర్శనకర్మాణో బహవ స్తత్ర దస్యవః
ఆభీరప్రముఖాః పాపాః పిబంతి సలిలం మమ. ౩౨

టీక॥ తత్ర=అచ్చట; ఉగ్రదర్శనకర్మాణః=భయంకరములయినచూచుటయుఁగార్యమునుగలవారలును; పాపాః=పాపస్వభావులునగు; ఆభీరప్రముఖాః=చెంబడివాండ్రుమొదలగు; దస్యవః=దొంగలు; బహవః = అనేకులు; మమ=నాయొక్క; సలిలం= జలమును; పిబంతి=త్రాఁగుచున్నారు.

ఆప్రదేశంబునఁ, జెంబడివాండ్రు మున్నగువారలనేకులు, దొంగలు, నాజలంబుద్రావుచు, మహాదుష్టకార్యంబులంగావించుచున్నారు.

అని, తాత్పర్యము.

తైస్తు సంస్పర్శనం పాపై ర్నసహే పాపకర్మభిః
అమోఘః క్రియతాం రామ తత్ర తేషు శరోత్తమః. 33

టీక॥ రామ=రాముఁడా! పాపకర్మభిః = పాపముగలిగించునట్టికార్యముగల; తైః=ఆ; పాపైస్తు=పాపిష్ఠులచేమాత్రము; సంస్పర్శనం= తాఁకుటను; నసహే=ఓర్వను. శరోత్తమః = బాణశ్రేష్ఠము; తత్ర=అచ్చట; తేషు=వారలయందు; అమోఘః=వ్యర్థముకానిది; క్రియతాం=చేయఁబడుఁగాక.

రాముఁడా! అట్టిపాపకర్ములగు దుష్టులస్పర్శమును నేను సహింపంజాలను; కావున, ఈయమోఘబాణంబును, వారలపైఁ, బ్రయోగింపుము. అని, సముద్రుండు, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య త ద్వచనం శ్రుత్వా సాగరస్య స రాఘవః
ముమోచ తం శరం దీప్తం వీర స్సాగరదర్శనాత్. ३८

టీక॥ వీరః=పరాక్రమశాలియగు; సః=ఆ; రాఘవః=రాముఁడు;తస్య=ఆ; సాగరస్య = సముద్రునియొక్క; తత్=ఆ;వచనం=మాటను;శ్రుత్వా=విని; సాగరదర్శనాత్=సముద్రునిమతమువలన;దీప్తం=వెలుఁగుచున్న;తం=ఆ;శరం=బాణమును; ముమోచ=విడిచెను.

పరాక్రమవంతుండగు రాముండు, ఆసముద్రుండుచెప్పినమాటనువిని,సము

ద్రుమనియుష్టప్రకారము, అమ్మహాబాణమును, ద్రుమకుల్యంబుపైవిడిచెను. అని, తాత్పర్యము.

తేన త న్మరుకాంతారం పృథివ్యాం ఖలు విశ్రుతమ్
నిపాతిత శ్శరో యత్ర దీప్తాశనిసమప్రభః. ౩౫

టీక॥ తేన = ఆరామునిచేత; యత్ర=ఏస్థలమునందు ; దీప్తాశనిసమప్రభః=మండుచున్నపిడుగుతో సమానమయినకాంతిగల; శరః=బాణము; నిపాతితః=వేయఁబడినదో; తత్ = ఆస్థలము; మరుకాంతారం(ఇతి)=మరుకాంతారమని; పృథివ్యాం=భూమియందు; విశ్రుతంఖలు= ప్రసిద్ధినొందినదిగదా!

రాముండు, ఏస్థలంబుఁపై , బిడుగుంబోలెవెలుంగుచున్న బాణముంబ్రయోగించెనో,ఆస్థలంబుమరుకాంతారమనిప్రసిద్ధినొందినది. అని,తాత్పర్యము.

ననాదచ తదా తత్ర వసుధా శరపీడితా
తస్మా ద్వ్రణముఖా త్తోయ ముత్పపాత రసాతలాత్. ౩౬

టీక॥తదా=అప్పుడు; తత్ర=అచ్చట; వసుధా=భూమి;శరపీడితా=బాణముచేఁబీడింపఁబడినదై; ననాదచ=అఱచినదియు;తస్మాత్=ఆ;వ్రణముఖాత్=దెబ్బదగిలినస్థలముననుండి; రసాతలాత్=పాతాళముననుండి;తోయం=జలము; ఉత్పపాత=ఎగిరినది.

అప్పుడు, బాణపాతంబునంజేసి , భూమిమహానాదంబు గావించినది;ఆదెబ్బదగిలినస్థలంబునఁ,బాతాళంబుననుండి, దివ్యజలంబుద్గమించినది.

అని,తాత్పర్యము.

స బభూవ తదా కూపో వ్రణఇత్యభివిశ్రుతః
సతతం చోత్థితం తోయం సముద్రస్యేవ దృశ్యతే. ౩౭

టీక॥తదా=అప్పుడు;సః=ఆ; కూపః=కూపము; వ్రణఇతి= వ్రణకూపమని; అభివిశ్రుతః=ప్రసిద్ధము;బభూవ=అయినది. తస్య ( అధ్యాహృతము)=ఆవ్రణకూపముయొక్క ; సముద్రస్యేవ=సముద్రముయొక్కవలె; ఉత్థి

తం=లేచిన; తోయం=జలము ; సతతం=ఎల్లప్పుడు; దృశ్యతే= చూడఁబడుచున్నది.

ఆకూపము వ్రణకూపమని ప్రసిద్ధి నొందినది;అందుఁ, బాతాళంబుననుండి యుద్గతంబయిన జలము , రుచ్యంబై ,సముద్రజలంబువలె, నెల్లప్పుడును నాశంబులేక,చూడఁబడుచుండును.

అని, తాత్పర్యము.

అవదారణశబ్దశ్చ దారుణ స్సమపద్యత

టీక॥ అవదారణశబ్దశ్చ=పగలుచున్నధ్వనియును;దారుణః=భయంకరముయి; సమపద్యత=కలిగినది.

అట్లు , బాణవేగంబునభూమిపగులునప్పుడు,భయంకరంబగుధ్వనిగలిగినది.అని, తాత్పర్యము.

తస్మా ద్బాణనిపాతేన త్వపః కుక్షిష్వ శోషయత్. ౩౮

టీ॥బాణనిపాతేన=బాణప్రయోగముచేత ;కుక్షిషు=పల్లములందు;స్థితాః (అధ్యాహృతము)=ఉన్న;అపస్తు= జలములనుమాత్రము; తస్మాత్=ఆద్రుమకుల్యమననుండి; అశోషయత్=ఎండించెను.

అట్లురాముండు, బాణప్రయోగంబుచే, దు]మకుల్యంబులందుఁ, బల్లపుప]దేశంబులనుండు , నాభీరాదిపాపిష్ఠులచేస్పృశింపఁబడుచున్న దుష్టజలంబుల,నశింపంజేసెను.అని,తాత్పర్యము,

విఖ్యాతం త్రిషు లోకేషు మరుకాంతారమేవ తత్

టీక॥తత్=ఆస్థలము; మరుకాంతారమేవ=మరుకాంతారమనుపేరుగలదిగానే; త్రిషు=మూఁడైన; లోకేషు =లోకములయందును; విఖ్యాతం= ప్రసిద్ధమయినది.

జలంబులంతయు నెండిపోవుటం జేసి, యాప్రదేశంబు మరుకాంతారమని,ముల్లోకంబులం బేరుఁబడసినది.

అని, తాత్పర్యము.

మోషయిత్వా తతః కుక్షిం రామో దశరథాత్మజః. ౩౯

స ౨౨

వరం తస్మై దదౌ విద్వా న్మరవేఽ మరవిక్రమః

టీక॥అమరవిక్రమః=దేవతయొక్క పరాక్రమమువంటి పరాక్రమము గలవాఁడును; విద్వాన్= పండితుండును; దశరథాత్మజః=దశరథునికొడుకునగు; రామః=రాముండు; కుక్షిం=సముద్రకుక్షిప్రదేశమును; మోక్షయిత్వా = విడిపించి; తతః=అటుపిమ్మట;తస్మై= ఆ;మరవే= మరుకాంతారముకొఱకు; వరం=వరమును;దదౌ=ఇచ్చెను.

దేవతుల్యుండునుపండితుండును, దశరథపుత్రుండునగురాముండు, అట్లు, సముద్రకుక్షిప్రదేశముననుండి, ఆభీరాదిపాపిష్ఠులనశింపంజేసి, యంతన మ్మరు కాంతారమునకు వరంబొసంగెను. అని, తాత్పర్యము.

పశవ్య శ్చా ల్పరోగశ్చ ఫలమూలరసాయుతః. ౪౦
బహుస్నేహో బహుక్షీర స్సుగంధి ర్వివిధౌషధః

టీక॥అయం (అధ్యాహృతము) = ఈమరుకాంతారము; పశవ్యః= పశువులకుహితముగాను ; అల్పరోగశ్చ= కొంచెమురోగముగలదిగాను; ఫలమూలరసాయుతః=ఫలములతోను మూలములతోను తేనియలతోను గూడినదిగాను; బహుస్నేహః= అధికమయినస్నేహముగలదిగాను; బహుక్షీరః= అధికమయినపాలుగలదిగాను;సుగంధిః= మంచివాసనగలదిగాను,వివిధౌషధః= నానావిధములయిన మూలికలు గలదిగాను; భూయాత్ (అధ్యాహృతము)= అగును గాక.

ఈమరుకాంతారము, పశువులకుఁ గావలసిన బాలతృణాదులు గలదై , యరోగమయి , ఫలమూల మధువులతోఁగూడినదై, క్షీరసమృద్ధమయి, సుగంధినానావిధమూలికలుగలదై,యుండంగలదు. అని, రాముండు, మరుకాంతారమునకువరంబొసంగెను.

అని, తాత్పర్యము.

ఏవ మేతై ర్గుణై ర్యుక్తో బహుభి స్సతతం మరుః. ౪౧
రామస్య వరదానాచ్చ శివః పంథా బభూవ హ

టీక॥ రామస్య=రామునియొక్క; వరదానాత్=వరంబునిచ్చుటవలననే; మరుః=మరుకాంతారము; ఏవం = ఇట్లు; ఏతైః=ఈ; బహుభిః=పెక్కులయిన; గుణైః=గుణములతో; సతతం=ఎల్లప్పుడును; యుక్తః= కూడినదై; శివః=మంగళకరమయిన; పంథాః = ప్రదేశము; బభూవ=అయ్యెను. "హ" అనునది పాదపూరణార్థము.

రామునివరదానప్రభావంబున, నమ్మరుకాంతారము, ఇట్లు పెక్కగుణంబులతోఁగూడినదై, యెల్లప్పుడును, మనోహరప్రదేశంబై యొప్పుచుండినది. అని, తాత్పర్యము.

తస్మిన్ దగ్ధే తదా కుక్షౌ సముద్ర స్సరితాంపతిః. ౪౨
రాఘవం సర్వశాస్త్రజ్ఞ మిదం వచన మబ్రవీత్

టీక॥ తస్మిన్=ఆ; కుక్షౌ=కుక్షి; దగ్ధే=దహింపఁబడినదికాఁగా; తదా=అప్పుడు; సరితాం=నదులకు; పతిః = పెనిమిటియగు; సముద్రః= సముద్రుఁడు; సర్వశాస్త్రజ్ఞం=సమస్తశాస్త్రంబులనెఱింగినట్టి; రాఘవం = రాముని గూర్చి; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అట్లు, ఆద్రుమకుల్యంబంతయును, దగ్ధంబయినపిమ్మట, నదీపతియగుసముద్రుండు, సమస్తశాస్త్రవేత్తయగురామునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అయం సౌమ్య నలో నామ తనుజో విశ్వకర్మణః. ౪౩
పిత్రా దత్త వర శ్శ్రీమాన్ ప్రతిమో విశ్వకర్మణా

టీక॥ సౌమ్య=సిన్ననివాఁడవగు రాముఁడా! శ్రీమాన్= కాంతిమంతుండగు; నలోనామ=నళుండనుపేరుగల; అయం = ఈవానరుండు; విశ్వకర్మణః=విశ్వకర్మయొక్క; తనుజః= కుమారుండు. పిత్రా = తండ్రిచేత; దత్తవరః = ఇయ్యఁబడినవరముగలవాఁడు. విశ్వకర్మణా = విశ్వకర్మతో; ప్రతిమః=సమానుఁడు.

సౌమ్యుఁడవగురాముఁడా! ఈన

కుండు, విశ్వకర్మకొడుకు; విశ్వకర్మ వలనవరంబునొందియున్నాఁడు; శిల్పవిద్యలందండ్రికిసమానుఁడు.
అని, తాత్పర్యము.

ఏష సేతుం మహోత్సాహః కరోతు మయి వానరః. ౪౪
త మహం ధారయిష్యామి తథా హ్యేష యథా పితా

టీక॥ మహోత్సాహః=అధికమగునయుత్సాహముగల; ఏషః=ఈ; వానరః=వానరుఁడు; మయి = నాయందు; సేతుం=సేతువును; కరోతు = చేయుఁగాక. అహం=నేను; తం=ఆ సేతువును; ధారయిష్యామి=ధరించెదను. ఏషః=ఇతండు; పితా=తండ్రి; యథా=ఎట్లో; తథాహి=అట్లుగదా!

మహోత్సాహుండగు,నీనలుండు, సముద్రంబునందు, సేతువునిర్మించుఁగాక; ఆసేతువునుమునుఁగకుండ నేను ధరించెదను; ఇతండు, తండ్రియంతటివాఁడు. అని, సముద్రుండు, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవముక్త్వో దధి ర్నష్ట స్సముత్థాయ నల స్తదా. ౪౫
అబ్రవీ ద్వానర శ్రేష్ఠో వాక్యం రామం మహాబలః

టీక॥ఉదధిః=సముద్రుఁడు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; నష్టః= పోయెను. తదా=అప్పుడు; మహాబలః= అధికమగునబలముగల; వానరశ్రేష్ఠః= వానరోత్తముఁడగు ; నలః = నలుఁడు; సముత్థాయ=లేచి; రామం= రామునిగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

సముద్రుండీప్రకారముచెప్పి,యంతనంతర్హితుండయ్యెను; అప్పుడు,వానరోత్తముండును మహాబలుండు నగు నలుండులేచి, రామునుంజూచి,యీమాటంజెప్పెను. అని,తాత్పర్యము.

అహం సేతుం కరిష్యామి విస్తీర్ణే వరుణాలయే. ౪౬
పితు స్సామర్థ్య మాస్థాయ తత్త్వమాహ మహోదధిః

టీక॥అహం=నేను;పితుః= తండ్రి యొక్క; సామర్థ్యం=శక్తిని; ఆస్థాయ=అధిష్ఠించి;విస్తీర్ణే = విశాలమయిన; వరుణాలయే= సముద్రమునందు; సేతుం=సేతువును; కరిష్యామి=చేసెదను. మహోదధిః=సముద్రుండు; తత్త్వం=యథార్థమును ; ఆహ= చెప్పుచున్నాఁడు.

నేను, నాతండ్రియొసంగిన సామర్థ్యంబునవలంబించి, విశాలంబగు సముద్రమునందు సేతువుంగట్టెదను, సముద్రుండు, యథార్థముం జెప్పినాఁడు. అని, తాత్పర్యము.

దండఏవ వరో లోకే పురుషస్యేతి మే మతిః. ४२
ధిక్ క్షమా మకృతజ్ఞేషు సాంత్వం దాన మథాపివా

టీక॥లోకే=లోకమునందు; పురుషస్య=పురుషునకు; దండఏవ=దండోపాయమె; వరః=శ్రేష్ఠము. ఇతి=అని; మే=నాయొక్క; మతిః=మతము.అకృతజ్ఞేషు= కృతజ్ఞులుగాని వారలయందు;క్షమాం= ఓర్పునుగూర్చి; సాంత్వం= సామ్యోపాయమునుగూర్చిగాని;అథ=ఇంక;దానమపివా=దానోపాయమునుగూర్చిగాని; ధిక్= దహింపఁబడుటయగుఁగాక.

లోకమునందుఁ, బురుషుండుదండోపాయమునేప్రయోగింపవలయునని నాయభిప్రాయము; కృతజ్ఞులుగానివారి విషయమై , క్షమయు, సామదానోపాయంబులునుబనికిరావు.

అని, తాత్పర్యము.

అయంహి సాగరో భీమ స్సేతుకర్మదిదృక్షయా. ४३
దదౌ దండభయా ద్గాధం రాఘవాయ మహోదధిః

టీక॥సాగరః= సగరునిచేఁద్రవ్వింపఁబడినః;భీమః=భయంకరుండగు;అయం=ఈ మహోదధిః=మహాసముద్రుఁడు,దండభయాత్=దండమువలనిభయంబువలన; సేతుకర్మదిదృక్షయా= సేతునిర్మాణమునుజూడనిచ్ఛచేత; రాఘవాయ= రామునికొఱకు; గాధం= మిట్టను; దదౌ=ఇచ్చెను.

భయంకరాకారుండగు నీసముద్రుండు, సగరునిచేవర్ధితుండయ్యుఁ

కృతజ్ఞతలేక, రాముండుదండించునను భయంబున, సేతునిర్మాణంబునకై, రామునకుస్థలంబొసంగెను.
అని, తాత్పర్యము.

మమ మాతు ర్వరో దత్తో మందరే విశ్వకర్మణా. ౪౯

టీక॥ మందరే=మందరపర్వతమునందు; విశ్వకర్మణా= విశ్వకర్మచేత; మమ=నాయొక్క; మాతుః=తల్లికి; వరః=వరము; దత్తః=ఇయ్యంబడినది.

మందరపర్వతంబున, విశ్వకర్మ నాతల్లికి, వరంబొసంగెను.
అని, తాత్పర్యము.

ఔరస స్తస్య పుత్రోహం సదృశో విశ్వకర్మణా

టీక॥ అహం=నేను; తస్య= ఆవిశ్వకర్మయొక్క; ఔరసః = ముఖ్యుండయిన; పుత్రః=కుమారుండను. విశ్వకర్మణా=విశ్వకర్మతో; సదృశః= సమానుండను.

నేనా విశ్వకర్మకౌరస పుత్రుండను; శిల్పవిద్యలందు,విశ్వకర్మకుసమానుండను. అని, తాత్పర్యము.

నచాప్యహ మనుక్తోవై ప్రబ్రూయా మాత్మనోగుణాన్, ౫౦

టీక॥ అహంచాపి=నేనును ; అనుక్తోవై=చెప్పంబడనివాండనైయే, ఆత్మనః= నాయొక్క; గుణాన్=గుణంబులను; నప్రబ్రూయాం=చెప్పను.

మఱియెవ్వరునుజెప్పువారు లేకుండునప్పుడు, నేనుమాత్రము, నాగుణంబులంజెప్పకొనువాండనుగాను.
అని, తాత్పర్యము.

సమర్థ శ్చాప్యహం సేతుం కర్తుంవై వరుణాలయే

టీక॥ అహం=నేను;వరుణాలయే= సముద్రమునందు; సేతుం = సేతువును ; కర్తుంచాపి = చేయుటకును; ("వై") (అనునది పాదపూరణార్థము)ః సమర్థః=సమర్థుండను.

నేను,సముద్రంబున, సేతువును నిర్మింపంగలను. అని,తాత్పర్యము.

స్మారితో స్మ్యహమేతేన తత్త్వమాహ మహోదధిః. ౫౧

టీక॥ అహం=నేను; ఏతేన = ఈసముద్రునిచేత; స్మారితః=జ్ఞాపకపఱుపఁబడినాను. మహోదధిః = సముద్రుఁడు; తత్త్వం=యథార్థమును; ఆహ=చెప్పుచున్నాఁడు.

సముద్రుండు, యథార్థంబుఁ జెప్పెనాఁడు; నాకును జ్ఞాపక పఱచినాఁడు. అని, తాత్పర్యము.

కామ మద్యైవ బధ్నంతు సేతుం వానరపుంగవాః

టీక॥ వానరపుంగవాః= వానరశ్రేష్ఠులు; అద్యైవ=ఇప్పుడె; కామం=యథేష్టముగా, సేతుం=సేతువును; బధ్నంతు=కట్టుదురుగాక.

ఇచ్ఛయుండునేని, యిప్పుడె, వానరులు, సేతునిర్మాణసన్నాహంబు సేయుదురుగాక. అని, నలుండు చెప్పెను. అని, తాత్పర్యము.

తతో తిసృష్టా రామేణ సర్వతో హరియూధపాః. ౫౨
అభిపేతు ర్మహారణ్యం హృష్టా శ్శతసహస్రశః

టీక॥ తతః = అంత; హరియూధపాః= వానరోత్తములు; సర్వతః= అంతటను; రామేణ=రామునిచేత; అతిసృష్టాః=నియోగింపఁబడినవారలై; హృష్టాః = సంతసించినవారలై; శతసహస్రశః=లక్షలులక్షలుగా; మహారణ్యం=మహావనమును; అభిపేతుః=పొందిరి.

అంత, వానరోత్తములు, రామనియోగంబునఁ, బరమసంతుష్టులయి, లక్షలకులుగాఁగుంపుచేరి, యడవులకుం బోయిరి. అని, తాత్పర్యము.

తే నగాన్నగసంకాశాః శాఖామృగగణర్షభాః. ౫౩
బభంజు ర్వానరా స్తత్ర ప్రచకర్షు శ్చ సాగరమ్

టీక॥ తత్ర = అచ్చట; నగసంకాశాః=పర్వతములతోసమానులును; శాఖామృగగణర్షభాః=వానరసమూహములలోశ్రేష్ఠులునగు; తే=ఆ; వానరాః=

వానరులు; నగాన్ = వృక్షములను; బభంజుః = విఱిచిరి. సాగరం = సముద్రము నిగూర్చి; ప్రచకర్షుశ్చ = ఆకర్షించిరియు.

అంతట, పర్వతాకారులగునావానరోత్తములు, అడవులందునానావిధవృక్షంబులం బెఱికి, సముద్రంబునం జేర్చిరి.

అని, తాత్పర్యము.

తే సాలైశ్చాశ్వకర్ణైశ్చ ధవైర్వంశైశ్చ వానరాః. ౫౪
కుటజై రర్జునై స్తాలై స్తిలకై స్తిమిశై రపి
బిల్వైశ్చ సప్తపర్ణైశ్చ కర్ణికారైశ్చ పుష్పితైః. ౫౫
చూతైశ్చాశోకవృక్షైశ్చ సాగరం సమపూరయన్

టీక॥ తే = ఆ; వానరాః = వానరులు; సాలైశ్చ = మద్దిచెట్లచేతను; అశ్వకర్ణైశ్చ = ఇనుమద్దిచెట్లచేతను; ధవైః = చండ్రచెట్లచేతను; వంశైశ్చ = వెదుళ్ల చేతను; కుటజైః = కొండమల్లెచెట్లచేతను; అర్జునైః = ఏఱుమద్దిచెట్లచేతను; తాలైః = తాటిచెట్లచేతను; తిలకైః = బొట్టుగుచెట్లచేతను; తిమిశైరపి = తిమిశవృక్షములచేతను; బిల్వైశ్చ = మారేడుచెట్లచేతను; సప్తపర్ణైశ్చ = ఏడాకులయరఁటిచెట్లచేతను; పుష్పితైః = పూచిన; కర్ణికారైశ్చ = కొండగోఁగుచెట్లచేతను; చూతైశ్చ = మామిడిచెట్లచేతను; అశోకవృక్షైశ్చ = అశోకవృక్షములచేతను; సాగరం = సముద్రమును; సమపూరయన్ = నిండించిరి.

ఆవానరులు, అట్లు, మద్దిచెట్లను ఇనుమద్దిచెట్లను, ఏఱుమద్దిచెట్లను, చండ్రచెట్లను, వెదుళ్లను, గొండమల్లెచెట్లను, తాటిచెట్లను, బొట్టుగుచెట్లను, తిమిశవృక్షంబులను, బిల్వవృక్షంబులను, ఏడాకులయరఁటిచెట్లను, పుష్పితంబులగుకొండగోఁగుచెట్లను, మామిడిచెట్లను, అశోకవృక్షంబులను! దీసికొనివచ్చి, సముద్రంబు నిండించిరి.

అని, తాత్పర్యము.

సమూలాంశ్చ విమూలాంశ్చ పాదపాన్ హరిసత్తమ. ౫౬
ఇంద్రకేతూ నివోద్యమ్య ప్రజహ్రు ర్హరయ స్తరూన్

టీక॥హరిసత్తమాః= వానరశ్రేష్ఠులగు; హరయః = వానరులు; సమూలాంశ్చ = వేళ్లతోఁగూడినవృక్షములను; విమూలాన్= వేళ్లులేనట్టి; పాదపాంశ్చ=వృక్షములను; ఇంద్రకేతూనివ=ఇంద్రధ్వజములనువలె; ఉద్యమ్య= ఎత్తి; తరూన్ = వృక్షములను; ప్రజహ్రుః=పడవేసిరి.

ఆవానరోత్తములు వృక్షంబులఁగొన్నిటిని సమూలంబులుగాను గొన్నిటిని విమూలంబులుగాను, పెఱికి, యింద్రధ్వజంబులంబోలెఁ బైకెత్తి, సముద్రంబునంబడవైచిరి. అని, తాత్పర్యము.

తాలాన్ దాడిమగుల్మాంశ్చ నారికేళాన్ విభీతకాన్. ౫౭
వకుళాన్ ఖదిరాన్ నింబాన్ సమాజహ్రుస్సమంతతః

టీక॥వానరాః(అధ్యాహృతము)= వానరులు, సమంతతః=అంతటను; తాలాన్=తాటిచెట్లను; దాడిమగుల్మాంశ్చ= దానిమ్మచెట్లను; నారికేళాన్= టెంకాయచెట్లను; విభీతకాన్= తాండ్రిచెట్లను; వకుళాన్= పొగడచెట్లను; ఖదిరాన్= తుమ్మచెట్లను; నింబాన్= వేఁపచెట్లను; సమాజహ్రుః= కొనివచ్చిరి.

ఆవానరులు, తాఁటిచెట్లనుదాడిమవృక్షంబులను టెంకాయచెట్లను, తాండ్రచెట్లనుబొగడచెట్లను, తుమ్మచెట్లను, నింబవృక్షంబులను, దీసికొనివచ్చి, సముద్రంబునంబడవైచిరి. అని, తాత్పర్యము.

హస్తిమాత్రాన్మహాకాయాః పాషాణాంశ్చమహాబలాః. ౫౮
పర్వతాంశ్చ సముత్పాట్య యంత్రైః పరివహంతిచ

టీక॥మహాకాయాః = గొప్పశరీరముగలవారలును; మహాబలాః= అధికమయిన బలముగల వారలునగు వానరులు; హస్తిమాత్రాన్= ఏనుఁగంతటిపరిమాణముగల ; పాషాణాంశ్చ= ఱాళ్లను; పర్వతాంశ్చ= కొండలను; సముత్పాట్య= పెల్లగించి; యంత్రైః= యంత్రంబులచేత ; పరివహంతిచ = కొనిపోయిరియు.

మహాకాయులును మహాబలులునగు




వానరులు, ఏనుంగంతటిప్రమాణముగ లత్రాళ్లనుబర్వతంబులనుంబెఱికి, యం త్రింబులచేఁగొనిపోయిరి.

అని, తాత్పర్యము.

ప్రక్షిప్యమాణై రచలై స్సహసా జలముద్ధితమ్. ౫౯
సముత్పతిత మాకాశ ముపాసర్ప త్తత స్తతః

టీక॥ప్రక్షిప్యమాణైః— వేయఁబడు చున్న; అచలైః=పర్వతములచేత; సహసా=తటాలున; జలం=నీరు; ఉద్ధితం=ఎగిరినది. సముత్పతితం— ఎగిరినదై; తత స్తతః=అంతనంత; ఆకాశం= ఆకాశమునందు; ఉపాసపఁత్=వ్యాపించినది.

సముద్రంబుఁబర్వతంబులంబడవేయుటచే, జలంబుపైకెగిరి, యాకాశంబున, నచ్చటచ్చట, వ్యాపించినది.

సముద్రం క్షోభయామాసు ర్వానరాశ్చ సమంతతః. ౬౦

టీక॥ వానరాః—వానరులు; సమంతతశ్చ=అంతటను; సముద్రం= సముద్రమును; క్షోభయామాసుః— కలఁతపెట్టిరి.

అప్పుడు, వానరులు, సముద్రంబునంతయుక్షుభితంబుగావించిరి.

అని, తాత్పర్యము.

సూత్రాణ్యన్యే ప్రగృహ్ణంతి వ్యాయతం శతయోజనమ్

టీక॥ అన్యే— మఱికొందఱు; శతయోజనం = నూఱామడలు; వ్యాయతం — ఈడ్వఁబడునట్లుగా; సూత్రాణి=దారములను; ప్రగృహ్ణంతి = పట్టుకొనిరి.

కొందఱు, ఎచ్చుతక్కువలుగలుగకుండుటకై, నూఱుయోజనంబులునిడుపయిన, సూత్రంబులంబట్టుకొనిరి.

అని, తాత్పర్యము.

దండా నన్యే ప్రగృహ్ణంతి విచిన్వంతి తథా పరే. ౬౧




టీక॥అన్యే=మఱికొందఱు ; దండాన్=కొయ్యలను; ప్రగృహ్ణంతి=పట్టుకొనిరి. తథా=అట్లు; అపరే=మఱికొందఱు; విచిన్వంతి= పరీక్షించుచుండిరి.

కొందఱు, కొలతకొయ్యలంబట్టుకొనియుండిరి; మఱికొందఱు, ఎద్దుతకుఱవలు పరీక్షించుచుండిరి.

అని, తాత్పర్యము.

దశయోజన విస్తారం శతయోజన మాయతమ్
నల శ్చక్రే మహాసేతుం మధ్యే నదనదీపతేః. ౬౨

టీక॥నలః= నలుఁడు ; నదనదీపతేః=నదములకును నదులకును ప్రభువైనసముద్రముయొక్క; మధ్యే=నడుమను; దశయోజనవిస్తారం= పదియామడలవెడల్పుగలదియు; శతయోజనం=నూఱామడలు; ఆయతం=నిడుపయినదియునగు; మహాసేతుం=గొప్పసేతువును;చక్రే=చేసెను.

అట్లు,నలుండు,సముద్రంబునడుమ, పదియోజనంబులవెడల్పుగలదియు నూఱుయోజనంబుల నిడుపుగలదియునగు మహాసేతువునునిర్మించెను.

అని, తాత్పర్యము.

వానరా శ్శతశ స్తత్ర రామస్యాజ్ఞాపురస్సరాః
మేఘాభైః పర్వతాగ్రైశ్చ తృణైః కాష్ఠై ర్బబంధిరే. ౬౩

టీక॥తత్ర=అందు;రామస్య= రామునియొక్క; ఆజ్ఞాపురస్సరాః= ఆజ్ఞయె ముందునడచునది గాఁగలవారలగు; వానరాః=వానరులు; శతశః= నూఱులునూఱులుగా ; మేఘాభైః= మేఘముయొక్క కాంతివంటికాంతిగల; పర్వతాగ్రైశ్చ=పర్వతశిఖరములచేతను;తృణైః=పచ్చికలచేతను;కాష్ఠైశ్చ=కొయ్యలచేతను;బబంధిరే=బంధించిరి.

అందు, నలునకు సహాయులయి, పెక్కువానరులు , రామునియాజ్ఞను శిరసావహించి, మేఘసమానంబులగు పర్వతశిఖరంబులచేతను తృణకాష్ఠంబులచేతను, సేతుబంధంబు గావించిరి.

అని, తాత్పర్యము.

పుష్పితాగ్రైశ్చ తరుభి స్సేతుం బధ్నంతి వానరాః

టీక॥వానరాః=వానరులు ; పుష్పితాగ్రైః=పూచినకొనలుగల; తరుభిశ్చ=వృక్షములచేతను; సేతుం= సేతువును; బధ్నంతి=కట్టిరి.

వానరులు , పుష్పితాగ్రంబులగు వృక్షంబులనుంగూడవేసి , సేతువునుని ర్మించిరి. అని, తాత్పర్యము.

పాషాణాంశ్చ గిరి ప్రఖ్యాన్ గిరీణాం శిఖరాణిచ. ౬౪
దృశ్యంతే పరిధావంతో గృహ్య వారణ సన్నిభాః

టీక॥గిరిప్రఖ్యాన్=కొండలతో సమానములయిన ; పాషాణాంశ్చ = ఱాళ్లను;గిరీణాం = పర్వతములయొక్క; శిఖరాణిచ=శిఖరములను ; గృహ్య (గృహీత్వా)=పట్టుకొని ; పరిధావంతః=పరుగెత్తుచున్న; వారణసన్నిభాః=ఏనుంగులతో సమానులయిన వానరులు; దృశ్యంతే = చూడఁబడుచుండిరి.

ఏనుంగులంతటివానరులు;కొండలంతటిఱాళ్ళను బర్వతశిఖరంబులనుంగొని,పరుగెత్తుచుఁ, జూపరుల కచ్చెరువు గలిగించుచుండిరి.అని, తాత్పర్యము.

శిలానాం క్షిప్యమాణానాం శైలానాంచ నిపాత్యతామ్. ౬౫
బభూవ తుముల శ్శబ్ద స్తదా తస్మిన్ మహోదధౌ

టీక॥తదా=అప్పుడు;తస్మిన్=ఆ; మహోదధౌ= మహాసముద్రమునందు; శిలానాం=ఱాళ్లు; క్షిప్యమాణానాం= వేయఁబడుచుండగాను ; శైలానాంచ= కొండలును;నిపాత్యతాం(నిపాత్యమానానాం) = వేయఁబడుచుండగాను; తుములః=దొమ్మియయిన;శబ్దః= ధ్వని; బభూవ=అయినది.

అప్పుడుసముద్రంబునఁబెద్దపెద్దఱాళ్లనువేయుటచేతను, బర్వతంబులంబడవేయుటచేతను,మహాధ్వనిగలిగినది. అని, తాత్పర్యము.

కృతాని ప్రథమే నాహ్ని యోజనాని చతుర్దశ. ౬౬

ప్రహృష్టై ర్గజసంకాశై స్త్వరమాణైః ప్లవంగమైః

టీక॥ ప్రహృష్టైః=మిక్కిలిసంతసించినవారలును; గజసంకాశైః=ఏనుంగులతోసమానులును ; త్వరమాణైః=వేగిర పడుచున్న వారలునగు; ప్లవంగమైః=వానరులచేత; ప్రథమేన=మొదటిదైన; అహ్నా=దినముచేత; చతుర్దశ=పదునాలుగయిన; యోజనాని= ఆమడలు; కృతాని=చేయఁబడినవి.

ఏనుంగునుంబోలె మహాకాయులగు నావానరులు, పరమసంతుష్టులయి, మహావేగంబున, మొక్కటిదినంబునఁ, బదునాలుగుయోజనంబులదూరము, సేతువును నిర్మించిరి. అని, తాత్పర్యము.

ద్వితీయేన తథా చాహ్నా యోజనానితు వింశతిః. ౬౭
కృతాని ప్లవగై స్తూర్ణం భీమకాయై ర్మహాబలైః

టీక॥ భీమకాయైః = భయంకరమయినశరీరముగలవారలును ; మహాబలైః= అధికమయినబలముగలవారలునగు; ప్లవగైః=వానరులచేత; తూర్ణం=శీఘ్రముగా; తథా=అట్లు; ద్వితీయేన=రెండవదైన; అహ్నాచ= దినముచేతను; వింశతిః=ఇరువదగు; యోజనానితు=ఆమడలుమాత్రము; కృతాని= చేయఁబడినవి.

భయంకరాకారులునుమహాబలులు నగువానరులు, రెండవదినంబున, నిరువదియోజనంబుల దూరము సేతువునునిర్మించిరి. అని, తాత్పర్యము.

అహ్నా తృతీయేన తథా యోజనాని కృతానితు. ౬౮
త్వరమాణై ర్మహాకాయై రేకవింశతి రేవచ

టీక॥ త్వరమాణైః = వేగిరపడుచున్న ; మహాకాయైః = గొప్పశరీరముగలవానరులచేత; తథా=అట్లు; తృతీయేన=మూఁడవదగు; అహ్నా=దినముచేత; ఏకవింశతిః = ఇరువదియొక్కటి; యోజనాన్యేవచ=ఆమడ

లును; కృతాని= చేయఁబడినవి "తు" అనునది పాదపూరణార్థము.

మహాకాయులగు, నావానరులు, అతివేగంబున, మూఁడవదినంబునందు, ఇరువదియొక్క యోజనంబుల దూరము, సేతువునునిర్మించిరి.

అని, తాత్పర్యము.

చతుర్థేన తథా చాహ్నా ద్వావింశతి రథాపిచ. ౬౯
యోజనాని మహావేగైః కృతాని త్వరితై స్తతైః

టీక॥అథ=అంత;తథాచ=అట్లు; మహావేగైః= అధికమయినవేగముగలవారలును;త్వరితైః= వేగిరపడినవారలునగు; తైస్తు= ఆవానరులచేతనె; చతుర్థేన = నాలవదైన; అహ్నా= దినముచేత ; ద్వావింశతిః= ఇరువదిరెండు ; యోజనాన్యపిచ= ఆమడలును; కృతాని= చేయఁబడినవి.

అంత, నాలవదినంబున, మహావేగులగునవ్వానరులు, మహావేగంబువహించి, యిరువదిరెండు యోజనంబులదూరముసేతువును నిర్మించిరి.

అని, తాత్పర్యము.

పంచమేన తథా చాహ్నా ప్లవగైః క్షిప్రకారిభిః. ౭౦
యోజనాని త్రయోవింశ త్సువేల మధికృత్యవై

టీక॥తథాచ=అట్లు;క్షిప్రకారిభిః= శీఘ్రముగాఁజేయునట్టి;ప్లవగైః=వానరులచేత; పంచమేన= ఐదవదగు; అహ్నా=దినముచేత; సువేలం= సువేలపర్వతమును;అధికృత్య= హద్దుగాఁజేసి; ("వై" అనునదిపాదపూరణార్థము) త్రయోవింశత్ (త్రయోవింశతిః)= ఇరువదిమూఁడు; యోజనాని = ఆమడలు; కృతాని (అధ్యాహృతము)= చేయఁబడినవి.

శీఘ్రకారులగునావానరులు, ఐదవదినంబునసువేలపర్వతంబువఱకు,ఇరువదిమూఁడుయోజనంబులదూరముసేతువునిర్మించి,సేతుబంధకార్యమును, సమాప్తినొందించిరి.అని, తాత్పర్యము.

స వానర వరశ్శ్రీమాన్ విశ్వకర్మాత్మజో బలీ. ౨౦
బబంధ సాగరే సేతుం యథా చాస్య పితా తథా

టీక॥అస్య=ఇతనియొక్క; పితా=తండ్రియగు విశ్వకర్మ; యథా = ఎట్లో; తథా=అట్లు; సమర్థః (అధ్యాహృతము)=సమర్థుండును; శ్రీమాన్=కాంతిమంతుండును; విశ్వకర్మాత్మజః=విశ్వకర్మకుమారుండును; బలీ=అధికమయిన బలముగల వాఁడునగు; సః=ఆ; వానరవరః= వానరశ్రేష్ఠుండగు నలుండు; సాగరే=సముద్రంబునందు; సేతుం=సేతువును; బబంధ=కట్టెను.

తండ్రియుంబోలె శిల్పవిద్యయందు మహాసమర్థుండును శ్రీమంతుండును బలవంతుండును విశ్వకర్మపుత్రుండును వానరోత్తముండునగు నలుండు, అట్లు సముద్రమధ్యంబున, మహాసేతువును నిర్మించెను. అని, తాత్పర్యము,

స నలేన కృతస్సేతు స్సాగరే మకరాలయే. ౨౧
శుశుభే సుభగ శ్శ్రీమాన్ స్వాతీపథ ఇవాంబరే

టీక॥మకరాలయే= మొసళ్ళయునికిపట్టైన; సాగరే = సముద్రమునందు; నలేన=నలునిచేత; కృతః = చేయఁబడిన; సుభగః=సుందరమును; శ్రీమాన్= కాంతిమంతంబునగు; సః=ఆ; సేతుః=సేతువు; అంబరే=ఆకాశమునందు; స్వాతీపథఇవ=స్వాతీవీధివలె; శుశుభే=ప్రకాశించెను.

మకరాలయంబగు సముద్రంబున, నలనిర్మితంబయిన, సుందరంబును శ్రీమంతంబునగు నమ్మహాసేతువు, ఆకాశంబున, సూర్యాదులమధ్యమ మార్గంబునందలిమధ్యమవీధియగు స్వాతీవీధియుంబోలెఁ, బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

తతో దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః. ౨౩
ఆగమ్య గగనే తస్థు ర్ద్రష్టుకామా స్త దద్భుతమ్

టీక॥ తతః=అంత; సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన; దేవాః= దేవతలును; సిద్ధాశ్చ=సిద్ధులును; పరమర్షయః=ఉత్తములగుఋషులును; తత్=ఆ; అద్భుతం=ఆశ్చర్యమును; ద్రష్టుకామాః=చూడఁగోరినవారలయి; ఆగమ్య=వచ్చి; గగనే=ఆకాశమునందు; తస్థుః=ఉండిరి.

అప్పుడు, దేవతలును, గంధర్వులును, సిద్ధులును, మహర్షులును, యయ్యాశ్చర్యముంజూచుటకై, యచ్చటికివచ్చి, యాకాశంబుననుండిరి. అని, తాత్పర్యము.

దశయోజన విస్తీర్ణం శతయోజన మాయతమ్. ౭౪
దదృశు ర్దేవగంధర్వా నళసేతుం సుదుష్కరమ్

టీక॥ దేవగంధర్వాః= దేవతలును గంధర్వులును; దశయోజనవిస్తీర్ణం= పదియామడల వెడల్పుగలదియు; శతయోజనం=నూఱామడలు; ఆయతం= నిడుపయినదియు; సుదుష్కరం= ఎంతమాత్రముచేయనలవిగానిదియు నగు; నలసేతుం= నలునిసేతువును; దదృశుః=చూచిరి.

దేవతలునుగంధర్వులును మున్నగువారలు, పదియోజనంబులవెడల్పును, నూఱుయోజనంబులనిడుపునుంగలయతిదుష్కరంబయిన నలనిర్మితంబగు సేతువుంజూచిరి. అని, తాత్పర్యము.

ఆప్లవంతః ప్లవంగశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః. ౭౫

టీక॥ ప్లవంగమాః=వానరులు; ఆప్లవంతః=అభిముఖముగానెగురుచు; ప్లవంతశ్చ=ఎగురుచును; గర్జంతశ్చ=బొబ్బరించుచును; ఆసన్ (అధ్యాహృతము)=ఉండిరి.

వానరులు, ఇటుఅటు, ఎగిరిపోవుచు, గర్జించుచుఁ, బరమ సంతోషంబుననుండిరి. అని, తాత్పర్యము.

త దచింత్య మసహ్యంచ అద్భుతం రోమహర్షణమ్
దదృశు స్సర్వ భూతాని సాగరే సేతుబంధనమ్. ౭౬

టీక॥సర్వభూతాని=సమస్తభూతంబులును; అచింత్యం=మనంబుననైననుఎన్నరానిదియు; అసహ్యం = సహింపరానిదియు; అద్భుతం = ఆశ్చర్యావహమును;రోమహర్షణం= వెండ్రుకలగగుర్పాటునొందునట్లు చేయునదియునగు; తత్=ఆ; సాగరే=సముద్రమునందు; సేతుబంధనం= సేతువుగట్టుటను; దదృశుః=చూచినవి.

మనంబుననైనను జింతింపనలవిగానిదియు, దుస్సహంబును నాశ్చర్యకరంబును గగుర్పాటునొందించునదియునగు; సముద్రసేతుబంధంబును, సమస్తభూతంబులు నుసందర్శించినవి.

అని, తాత్పర్యము.

తాని కోటి సహస్రాణి వానరాణాం మహౌజసామ్
బధ్నంత స్సాగరే సేతుం జగ్ముః పారం మహోదధేః. ౭౮

టీక॥ మహౌజసాం= అధికమయినపరాక్రమముగల; వానరాణాం = వానరులయొక్క ; తాని = ఆ; కోటి సహస్రాణి = కోటులయొక్క వేలు; సాగరే= సముద్రమునందు; సేతుం= సేతువును; బధ్నంతః= (లింగవ్యత్యయమార్షము)కట్టుచు; మహోదధేః=సముద్రముయొక్క; పారం = ఆవలిగట్టును; జగ్ముః=పొందిరి.

సేతుబంధంబునందు వ్యాపృతులయియుండిన,మహాపరాక్రమశాలులగు వానరులు, కోటులుకోటులుగా, ముందు, సముద్రదక్షిణపారముం జేరిరి.

అని, తాత్పర్యము.

విశాల స్సుకృత శ్శ్రీమాన్ సుభూమి స్సుసమాహితః
అశోభత మహాసేతు స్సీమంత ఇవ సాగరే. ౭౮

టీక॥విశాలః= వెడలుపైనదియు;సుకృతః=చక్కఁగాఁజేయఁబడినదియు ; సుభూమిః=మంచినేలకలదియు; సుసమాహితః=రంధ్రములులేనిదియునగు; మహాసేతుః=గొప్ప సేతువు; సాగరే=సముద్రమునందు; సీమంతఇవ=పాపటవలె; అశోభత=ప్రకాశించెను.

విశాలంబును దృఢబద్ధంబును, శ్రీమంతంబును , మిట్టపల్లములులేనిదియు రంధ్రంబులులేనిదియునగునమ్మహాసేతువు

స ౨౨

సముద్రంబునం బాపటవలెం బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

తతః పారే సముద్రస్య గదాపాణి ర్విభీషణః
పరేషా మభిఘాతార్థ మతిష్ఠ త్సచివై స్సహ. ౭౮

టీక॥ తతః=అటుపిమ్మట; విభీషణః=విభీషణుండు; గదాపాణిః=గదచేతంగలవాండై; పరేషాం=శత్రువులయొక్క; అభిఘాతార్థం=కొట్టుటకొఱకు; సచివైస్సహ=మంత్రులతోంగూడ; సముద్రస్య=సముద్రముయొక్క; పారే=దక్షిణపుగట్టునందు; అతిష్ఠత్=ఉండెను.

అంత, విభీషణుండు, గదాపాణియయి, సచివులంగూడి, శత్రువులు పైకొనినవారలసంహరించుటకై, సముద్రదక్షిణతీరంబునంగాచియుండెను.

అని, తాత్పర్యము.

సుగ్రీవస్తు తతః ప్రాహ రామం సత్యపరాక్రమమ్

టీక॥ తతః=అటుపిమ్మట; సుగ్రీవస్తు=సుగ్రీవుండుమాత్రము; సత్యపరాక్రమం=సత్యపరాక్రమముగల; రామం=రామునిగూర్చి; ప్రాహ=చెప్పచున్నాడు.

అంత, సుగ్రీవుండు, సత్యపరాక్రముండగురాముంజూచి, ఇట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

హనుమంతం త్వ మారోహ అంగదంచాపి లక్ష్మణః. ౮౦

టీక॥ త్వం=నీవు; హనుమంతం=హనుమంతుని; ఆరోహ=ఎక్కుము. లక్ష్మణశ్చాపి=లక్ష్మణుండును; అంగదం=అంగదుని; ఆరోహతు(అధ్యాహృతము)=ఎక్కుంగాక.

నీవు, హనుమంతునారోహింపుము; లక్ష్మణుండు, అంగదునారోహించుంగాక. అని, తాత్పర్యము.

అయంహి విపులో వీర సాగరో మకరాలయః

టీక॥ వీర=పరాక్రమశాలివగు రాముండా! మకరాలయః=మొసళ్లయునికిపట్టయిన; అయం=ఈ; సాగరః=సముద్రము; విపులోహి=విశాలముగదా!

పరాక్రమవంతుండవగు రాముఁడా! మకరాలయంబగు, నీసముద్రము మిక్కిలియువిశాలమయినది, కావున, మీరలునడచివచ్చుటసరిగాదు- అని, తాత్పర్యము-

వైహాయసౌ యువా మేతౌ వానరౌ తారయిష్యతః. ౮౧

టీక॥వైహాయసౌ=ఆకాశమునసంచరించునట్టి; ఏతౌ=ఈ; వానరౌ=వానరులు, యువాం=మిమ్ము; తారయిష్యతః=దాఁటింతురు-

ఈహనుమదంగదులు, మిమ్ము, నాకాశగమనంబునందీసికొనిపోయి, దాఁటింపఁగలరు- అని, సుగ్రీవుండు, రామునితోఁజెప్పెను-అని, తాత్పర్యము-

అగ్రత స్తస్య సైన్యస్య శ్రీమాన్ రామ స్సలక్ష్మణః
జగామ ధన్వీ ధర్మాత్మా సుగ్రీవేణ సమన్వితః. ౮౨

టీక॥ధన్వీ = మంచిధనుస్సుగలవాఁడును; ధర్మాత్మా = ధర్మస్వభావుండును; శ్రీమాన్=అధికమయినకాంతిగలవాఁడునగు; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడిన; రామః=రాముఁడు; సుగ్రీవేణ=సుగ్రీవునితో; సమన్వితః=కూడినవాఁడై; తస్య=ఆ; సైన్యస్య=సేనయొక్క; అగ్రతః=ముందట; జగామ=పోయెను.

ధనుర్ధరుండును ధర్మాత్ముండును శ్రీమంతుండునగు రాముండు, లక్ష్మణునిసుగ్రీవునింగూడి, యాసైన్యంబునకగ్రభాగంబుననడచెను.

అని, తాత్పర్యము.

అన్యే మధ్యేన గచ్ఛంతి పార్శ్వతో౽న్యే ప్లవంగమాః
సలిలే ప్రపతం త్యన్యే మార్గ మన్యే నలేభిరే. ౮౩

టీక॥అన్యే = మఱికొందఱు; మధ్యేన=నడుమను; గచ్ఛంతి = పోయిరి. అన్యే=ఇతరులయిన; ప్లవంగమాః=వానరులు; పార్శ్వతః=ప్రక్కలను; గచ్ఛంతి(అధ్యాహృతము)=పోయిరి. అన్యే=మఱికొందఱు; సలిలే=జలమునందు; ప్ర

పతంతి=పడిరి. అన్యే=మఱికొందఱు; మార్గం=దారిని;నలేభిరే = పొందరైరి.

అప్పుడు,కొందఱు,వానరులు, నడుమంబోయిరి; కొందఱు పార్శ్వభాగంబులనడచిరి; కొందఱునడచుటకవకాశములేక, జలంబులంబడిలేచిరి;మఱికొందఱు వానరులు,మార్గంబుచాలక, తీరంబుననెనిలిచియుండి, యటుపిమ్మటంబోయిరి.అని, తాత్పర్యము.

కేచి ద్వైహాయసగతా స్సుపర్ణా ఇవ పుప్లువుః

టీక॥ కేచిత్=కొందఱు;సుపర్ణాః ఇవ=గరుత్మంతులువలె; వైహాయసగతాః=ఆకాశమునందలి గమనముగలవారలై; పుప్లువుః=దాఁటిరి.

కొందఱు, వానరులు,గరుత్మంతులుంబోలె,నాకాశగమనంబునంబోయిరి. అని, తాత్పర్యము.

ఘోషేణ మహతా తస్య సింధోర్ఘోషం సముచ్ఛ్రితమ్. ౭౪
భీమ మంతర్దధే భీమా తరంతీ హరివాహినీ

టీక॥భీమా=భయంకరమగు; తరంతీ=దాఁటుచున్న; హరివాహినీ=వానరసేన; తస్య=ఆసేనయొక్క; మహతా=గొప్పదగు; ఘోషేణ=ధ్వనిచేత; సముచ్ఛ్రితం= అధికమయిన; సింధోః=సముద్రముయొక్క; భీమం= భయంకరమగు; ఘోషం=ధ్వనిని;అంతర్దధే=మఱుఁగుపఱిచెను.

భయంకరంబగు నావానర సేన దాఁటుటచేఁగల్గినమహాధ్వని,సముద్రఘోషంబును, అణఁగఁద్రొక్కెను. అని,తాత్పర్యము.

వానరాణాంహి సా తీర్ణా వాహినీ నళసేతునా. ౭౫
తీరే నివివిశే రాజ్ఞా బహుమూలఫలోదకే

టీక॥సా=ఆ;వానరాణాం= వానరులయొక్క; వాహినీ = సేన; రాజ్ఞా = రాజయిన సుగ్రీవునితోఁగూడ;నళసేతునా = నలునిసేతువుచేత;

తీర్ణా — దాఁటినదై; బహుమూలఫలోదకే = అధికమయినగడ్డలును ఫలములును జలమునుగల; తీరే = దక్షిణపుగట్టునందు; నివివిశేహి = విడిసినది గదా.

ఆవానరసేన, వానర రాజుండగు సుగ్రీవునితోఁగూడ, నలనిర్మితంబగు సేతువుచే, సముద్రంబుదాఁటి, అధికముగాఫలమూలములుగలసముద్రదక్షిణతీరంబునవిడిసినది. అని, తాత్పర్యము.

త దద్భుతం రాఘవకర్మ దుష్కరం
సమీక్ష్య దేవాః సహసిద్ధచారణైః. ౮౬
ఉపేత్య రామం సహసా మహర్షిభి
స్తమభ్యషించన్ సుశుభై ర్జలైః పృథక్

టీక॥ దేవాః = దేవతలు; సిద్ధచారణైస్సహ = సిద్ధులతోను జారణులతోనుంగూడ; మహర్షిభిః = మహర్షులతోఁగూడ; అద్భుతం = ఆశ్చర్యకరంబును; దుష్కరం = చేయనలవిగానిదియునగు; తత్ = ఆ; రాఘవకర్మ = రామునికార్యమును; సమీక్ష్య = చూచి; సహసా = శీఘ్రమున; రామం = రాముని; ఉపేత్య = పొంది; పృథక్ = వేఱువేఱుగా; సుశుభైః = మిక్కిలియుమంగళకరములయిన; జలైః = జలములచేత; సమభ్యషించన్ = అభిషేకించిరి.

దేవతలును సిద్ధులును జారణులును మహర్షులును, రామునికిఁదక్క మఱియెవ్వనికినిం జేయనలవిగానియాశ్చర్యకరంబగు నారామునికార్యంబుఁ జూచి, శీఘ్రంబున రామునొద్దకువచ్చి, అందఱును వేఱువేఱుగా, మంగళ జలంబుల రామునకభిషేకముగావించిరి.

అని, తాత్పర్యము.

జయ స్వశత్రూన్ నరదేవ మేదినీం
ససాగరాం పాలయ శాశ్వతీ స్సమాః. ౮౭
ఇతీవ రామం నరదేవసత్కృతం
శుభై ర్వచోభి ర్వివిధై రపూజయన్

టీక॥ "నరదేవ = మనుష్యులకుఁబ్రభుండవగు రాముఁడా! స్వశత్రూన్ = నీ

శత్రువులను; జయ= గెలువుము. శాశ్వతీః=స్థిరములయిన; సమాః=సంవత్సరములు ; ససాగరాం=సముద్రములతోఁగూడిన; మేదినీం=భూమిని; పాలయ=పాలింపుము;" ఇతీవ=ఇట్లు; తే (అధ్యాహృతము)= ఆదేవాదులు; నరదేవసత్కృతం=మనుష్యులచేతను దేవతలచేతను బూజింపఁబడిన ; రామం=రాముని; శుభైః=మంగళకరములగు; వివిధైః=నానావిధములయిన ; వచోభిః=మాటలచేత; అపూజయన్= పూజించిరి.

"నరదేవుండవగు రాముఁడా! శత్రువులనందఱనుజయింపుము ; పెద్దకాలము, సముద్రాంతంబగు భూమండలము నంతయుంబాలింపుము." అని, యిట్లు, యాదేవతలుమున్నగువారలు, మనుష్యులచేతను దేవతలచేతను బూజితుండగు రాముని , మంగళవచనంబులం బూజించిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ద్వావింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు , యుద్ధకాండద్వావింశసర్గటీక,
ముగిసినది.



(౫౨)

త్రయో వింశ సర్గ ప్రారంభః.

నిమిత్తాని నిమిత్తజ్ఞో దృష్ట్వా లక్ష్మణపూర్వజః
సౌమిత్రిం సంపరిష్వజ్య ఇదం వచన మబ్రవీత్. ౧

టీక॥నిమిత్తజ్ఞః = నిమిత్తంబులనెఱింగినట్టి; లక్ష్మణపూర్వజః= లక్ష్మణునియన్నయగు రాముండు ; నిమిత్తాని=శకునంబులను; దృష్ట్వా= చూచి; సౌమిత్రిం=లక్ష్మణుని; సంపరిష్వజ్య= కవుఁగిలించుకొని; ఇదం= ఈ; వచనం=మాటను;అబ్రవీత్ =చెప్పెను.

శుభాశుభ నిమిత్తంబులు చక్కఁగాఁదెలిసిన, లక్ష్మణాగ్రజుండగు రాముండు, కొన్నినిమిత్తంబులంజూచి, సంతోషంబునలక్ష్మణుం గవుఁగిలించుకొని,యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

పరిగృహ్యో దకం శీతం వనాని ఫలవంతిచ
బలౌఘం సం విభజ్యేమం వ్యూహ్య తిష్ఠామ లక్ష్మణ. ౨

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! శీతం= చల్లని;ఉదకం=జలమును, జలముగల ప్రదేశముననుట;ఫలవంతి=ఫలంబులు గల; వనానిచ=వనంబులను ; పరిగృహ్య=స్వీకరించి;ఇమం=ఈ;బలౌఘం= సేనాసమూహమును ; సంవిభజ్య = చక్కఁగావిభజించి; వ్యూహ్య=వ్యూహముగాఁదీర్చి;తిష్ఠామ=ఉందము.

లక్ష్మణుఁడా!మనము, శీతోదకమునను, ఫలంబులతోఁగూడిన వనంబులుగల ప్రదేశంబులనువాసస్థానంబుగా నేర్పఱచుకొని, సేనలనంతయు, విభజించి, గరుడవ్యూహంబుగాఁదీర్చి, స్వస్థంబుగానుందము. అని, తాత్పర్యము.

లోకక్షయకరం భీమం భయం పశ్యా మ్యుపస్థితమ్
నిబర్హణం ప్రవీరాణా మృక్షవానరరక్షసామ్. ౩

టీక॥ప్రవీరాణాం=మిక్కిలియుంబరాక్రమశాలులగు ; ఋక్షవానరరక్షసాం=భల్లూకంబులయొక్కయు వానరులయొక్కయు రాక్షసులయొక్కయు;నిబర్హణం=వధరూపమయిన;లోకక్షయకరం=జననాశముగలిగించునదియు; భీమం=భయంకరమునగు;భయం=భయము;ఉపస్థితం = సమీపించినదానిం గా;పశ్యామి=చూచుచున్నాను.

మహాపరాక్రమశాలులగు,భల్లూకవానరులును రాక్షసులును, అనేకులు,వధింపంబడుదురు; అట్లు జననాశకరంబగు,మహాభయంబువాటిల్లుననితోంచుచున్నది.అని, తాత్పర్యము.

వాతాశ్చ కలుషా వాంతి కంపతేచ వసుంధరా
పర్వతాగ్రాణి వేపంతే పతంతిచ మహీరుహాః. ౪

టీక॥వాతాశ్చ=వాయువులును; కలుషాః=భయంకరములయి;వాంతి=వీచుచున్నవి. వసుంధరాచ=భూమియు; కంపతే=వడంకుచున్నది. పర్వతాగ్రాణి=పర్వతశిఖరంబులు; వేపంతే=వడంకుచున్నవి. మహీరుహాశ్చ=వృక్షములును;పతంతి=పడుచున్నవి.

వాయువుభయంకరముగా వీచుచున్నది; భూమియువడంకుచున్నది;పర్వతశిఖరంబులునుగంపించుచున్నవి;వృక్షంబులాకస్మికముగావిఱిగిపడుచున్నవి.

అని, తాత్పర్యము.

మేఘాః క్రవ్యాదసంకాశాః పరుషాః పరుషస్వనాః
క్రూరాః క్రూరం ప్రవర్షంతి మిశ్రం శోణితబిందుభిః. ౫

టీక॥ క్రవ్యాదసంకాశాః = గద్దలతోసమానములయినవియు;పరుషాః=చూడఁగూడనివియు;పరుషస్వనాః=భయంకరములయినధ్వనులుగలవియు ; క్రూరాః = భయంకరములునగు; మేఘాః=మేఘములు; క్రూరం= భయంకరమగునట్లుగా ; శోణితబిందుభిః=నెత్తురుబిందువులచే; మిశ్రం=కలసినజలమును; ప్రవర్షంతి=కురియుచున్నవి.

మేఘంబులు,గృధ్రశ్యేనాదివర్ణంబులయి, పరుషంబులయి, భయంకరధ్వనులయి, భయంకరంబులయి, రక్తబిందుమిశ్రంబుగా , వర్షించుచున్నవి.

అని,తాత్పర్యము.

రక్తచందనసంకాశా సంధ్యా పరమదారుణా
జ్వలతః ప్రతపత్యేత దాదిత్యా దగ్నిమండలమ్. ౬

టీక॥సంధ్యా=సంధ్య; రక్తచందనసంకాశా=రక్తచందనముతో సమానమయి; పరమదారుణా= మిక్కిలియు భయంకరమయి; భవతి(అధ్యాహృతము)=ఉన్నది. జ్వలతః=మండుచున్న; ఆదిత్యాత్=సూర్యునివలన; ఏతత్=ఈ; అగ్నిమండలం= నిప్పులసమూహము; ప్రతపతి=కాల్చుచున్నది.

సంధ్య, రక్తచందనవర్ణంబయి, యతిభయంకరముగానున్నది;సూర్యుండు,జ్వలించుచు, నిప్పులను గురిపించుచున్నాడు.అని,తాత్పర్యము.

దీనా దీనస్వరాః క్రూరా స్సర్వతో మృగపక్షిణః
ప్రత్యాదిత్యం వినదంతి జనయంతో మహద్భయమ్. ౭

టీక॥మృగపక్షిణః=మృగంబులునుబక్షులును; దీనాః=దైన్యంబునొందినవై: దీనస్వరాః= దుఃఖితంబగుధ్వనిగలవై; క్రూరాః = భయంకరంబులయి; మహత్=అధికమయిన;భయం= భయమును;జనయంతః = కలిగించుచు;సర్వతః=అంతటను; ప్రత్యాదిత్యం= సూర్యునకెదురుగా; వినదంతి=అఱచుచున్నవి.

మృగంబులునుబక్షులును, దీనంబులయి,భయంకరంబులయి,సూర్యునకెదురునిలుచుండి, దీనస్వరంబున నఱచుచు, మహాభయంబునుసూచించుచున్నవి.
అని, తాత్పర్యము.

రజన్యా మప్రకాశస్తు సంతాపయతి చంద్రమాః

టీక॥రజన్యాం=రాత్రియందు;చంద్రమాః=చంద్రుఁడు ; అప్రకాశః= కాంతిలేనివాఁడై ; సంతాపయతి = తాపమునుగల్గించుచున్నాఁడు.

రాత్రియందుఁ, జంద్రుండు,కాంతిహీనుండై, సంతాపంబు గలిగించుచున్నాఁడు.
అని,తాత్పర్యము.

కృష్ణరక్తాంశుపర్యంతో లోకక్షయ ఇవోదితః. ౮

హ్రస్వోరూక్షో ప్రశస్తశ్చ పరివేషస్సులోహితః

టీక॥ కృష్ణరక్తాంశుపర్యంతః= నల్లనికాంతులునుఎఱ్ఱనికాంతులునుగొనలం గలదియు; సులోహితః=మిక్కిలియు నెఱ్ఱనిదియు; హ్రస్వః = చిన్నదియు; రూక్షః=భయంకరమయినదియు ; అప్రశస్తశ్చ=అప్రసిద్ధంబును ; లోకక్షయే= లోకనాశమునందు ; ఉదితఇవ (స్థితః)=ఉదయించిన పరివేషము వలెనున్నదియునగు; పరివేషః= సూర్యునకుఁజుట్టునేర్పడినమండలము, గాలిగుడి; దృశ్యతే (అధ్యాహృతము)= చూడఁబడుచున్నది.

సూర్యునిచుట్టును, అంతంబునందు నల్లనికిరణంబులుగలదియు, దానికివెనుకఁగొంచెమెఱ్ఱనికిరణములు గలదియు నడుమమిక్కిలియుఁ నెఱ్ఱగా నుండునదియు హ్రస్వంబును భయంకరంబును ఇదివఱకెన్నఁడును జూడఁబడనిదియుఁ బ్రలయకాలంబునందుఁగల్గుపరివేషము వలెనున్నదియునగు, పరివేషముచూపట్టుచున్నది. అని, తాత్పర్యము.

ఆదిత్యే విమలే నీలం లక్ష్మ లక్ష్మణ దృశ్యతే. ౯

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! విమలే=నిర్మలమయిన; ఆదిత్యే = సూర్యునియందు;నీలం=నల్లని; లక్ష్మ=చిహ్నము;దృశ్యతే=చూడఁబడుచున్నది.

లక్ష్మణుఁడా!మఱియు,నిర్మలంబగుసూర్యమండలంబునడుమ,నల్లనికళంకంబుగాన్పించుచున్నది.
అని, తాత్పర్యము.

రజసా మహతాచాపి నక్షత్రాణి హతానిచ
యుగాంతమివ లోకానాం పశ్య శంసంతి లక్ష్మణ. ౧౦

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! నక్షత్రాణిచాపి =నక్షత్రములును; మహతా=అధికమయిన; రజసా=మాలిన్యముచేత; హతానిచ = కొట్టఁబడినవియునై ; లోకానాం= లోకములయొక్క; యుగాంతం=ప్రలయమును; శంసంతీవ=చెప్పుచున్నట్లున్నవి. పశ్య = చూడుము.

లక్ష్మణుఁడా! నక్షత్రంబులును, మిక్కిలియుమలినంబులయి, కాంతిహీనంబులయి, లోకంబులకుఁబ్రళయముగల్గునట్లుసూచించుచున్నవి, చూడుము.

అని, తాత్పర్యము.

కాకా శ్శ్యేనా స్తథా గృధ్రా నీచైః పరిపతంతిచ
శివా శ్చాప్య శివా న్నాదా న్నదంతి సుమహా భయాన్. ౧౧

టీక॥ కాకాః = కాకులును; శ్యేనాః = డేగలును; తథా = అట్లు; గృధ్రాః = గద్దలును; నీచైః = నీచపక్షులచేత; పరిపతంతిచ = పడుచున్నవియు. శివాశ్చాపి = నక్కలును; సుమహాభయాన్ = మిక్కిలియునధికమయినభయముగల; అశివాన్ = అమంగళకరములయిన; నాదాన్ = ధ్వనులను; నదంతి = ధ్వనించుచున్నవి, చేయుచున్నవనుట.

కాకులును డేగలును గద్దలునుమున్నగుబలవంతంబులగుపక్షులు, దుర్బలపక్షులచేఁగూలుచున్నవి; నక్కలు, భయంకరంబులగు నమంగళధ్వనులంగా వింపుచున్నవి. అని, తాత్పర్యము.

శైలై శ్శూలైశ్చ ఖడ్గైశ్చ విసృష్టైః కపిరాక్షసైః
భవిష్యత్యావృతా భూమి ర్మాంసశోణితకర్దమా. ౧౨

టీక॥ భూమిః = భూమి; కపిరాక్షసైః = వానరులచేతను రాక్షసులచేతను; విసృష్టైః = ప్రయోగింపఁబడిన; శైలైః = పర్వతములచేతను; శూలైశ్చ = శూలములచేతను; ఖడ్గైశ్చ = కత్తులచేతను; ఆవృతా = కప్పఁబడినదై; మాంసశోణితకర్దమా = మాంసమును నెత్తురును బురదగాఁగలది; భవిష్యతి = కాఁగలదు.

భూమియంతయు, వానరరాక్షసులొండొరులపయిం బ్రయోగించుకొను పర్వతంబులచేతను శూలఖడ్గాద్యాయుధంబులచేతనుంగప్పఁబడి, రక్తమాంసపూర్ణంబు గాఁగలదు.

అని, తాత్పర్యము.

క్షిప్ర మద్యైవ దుర్ధర్షాం పురీం రావణపాలితామ్

అభియామ జవేనైవ సర్వతో హరిభి ర్వృతాః. ౧౩

టీక॥ క్షిప్రం=శీఘ్రముగా; అద్యైవ=ఇప్పుడె; సర్వతః=అంతటను; హరిభిః=వానరులచేత; వృతాః = పరివేష్టింపఁబడినవారలమయి ; జవేనైవ=వేగముచేతనె; దుర్ధర్షాం = ఎదిరింపఁనలవిగానిదియు ; రావణపాలితాం=రావణునిచేఁ బాలింపఁబడినదియునగు; పురీం= లంకాపురినిగూర్చి; అభియామ=పోవుదము.

మనమింక జాగుసేయరాదు; ఇప్పుడె, శీఘ్రఁబున, వానరులనందఱఁగూడి, వేగంబున, దుర్ధర్షంబగు రావణుని లంకాపురికింబోవుదము.అని, రాముండు, లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా ధర్మాత్మా ధన్వీ సంగ్రామహర్షణః
ప్రతస్థే పురతో రామో లంకా మభిముఖో విభుః. ౧౪

టీక॥ ధర్మాత్మా=ధర్మస్వభావుండును; ధన్వీ=మంచిధనుస్సుగలవాఁడును; సంగ్రామహర్షణః= యుద్ధమునందు సంతోషముగలవాఁడును; విభుః=సమర్థుఁడునగు; రామః=రాముఁడు; ఇతి=అని; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి ; లంకాం=లంకనుగూర్చి; అభిముఖః = ఎదురుమొగముగలవాఁడై; పురతః = ముందుగా; ప్రతస్థే=పోయెను.

ధర్మాత్ముండును యుద్ధప్రియుండును సమర్థుండునగు రాముండు, లక్ష్మణుతో నీప్రకారమునంజెప్పి, ధనుర్ధరుండై, లంకాభిముఖుండై, వానరసైన్యంబులకుముందటంబోయెను.

అని, తాత్పర్యము.

స విభీషణసుగ్రీవా స్తత స్తే వానరర్షభాః
ప్రతస్థిరే వినర్దంతో నిశ్చితా ద్విషతాం వధే. ౧౫

టీక॥ తతః= అటుపిమ్మట; సవిభీషణసుగ్రీవాః= విభీషణునితోనుసుగ్రీవుని తోనుంగూడిన; తే = ఆ; వానరర్షభాః=వానరశ్రేష్ఠులు; ద్విషతాం = శ

త్రువులయొక్క;వధే = చంపుటయందు; నిశ్చితాః=నిశ్చయముగలవారలై; వినదంతః=అఱచుచు; ప్రతస్థిరే=పోయిరి.

అంత,విభీషణుండును, సుగ్రీవుండునుమున్నుగా,వానరోత్తములందఱు,శత్రువధంబువిషయమయి, నిశ్చితహృదయులయి, సింహనాదంబులు సేయుచుం,బోయిరి. అని, తాత్పర్యము.

రాఘవస్య ప్రియార్థంతు ధృతానాం వీర్య శాలినామ్
హరీణాం కర్మచేష్టాభి స్తుతోష రఘుపుంగవః. ౧౮

టీక॥రఘుపుంగవః = రాముండు; ధృతానాం= ధైర్యవంతులును;వీర్యశాలినాం= పరాక్రమముచేఁబ్రకాశించువారలునగు; హరీణాం=వానరులయొక్క; రాఘవస్య=రామునియొక్క; ప్రియార్థంతు= సంతోషనిమిత్తమైయే; కృతాభిః(అధ్యాహృతము)= చేయఁబడిన,కర్మచేష్టాభిః=కార్యచేష్టలచేత; తుతోష=సంతోషించెను.

రామునకు సంతోషంబు గలుగవలయునని, ధైర్యవంతులును బరాక్రమవంతులునగువానరులు చేయుచున్నట్టి, తోఁకలువిసరుట మొదలగునుత్సాహచేష్టలం జూచి,రాముండు,సంతోషించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, త్రయోవింశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ త్రయోవింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

చతుర్వింశసర్గప్రారంభః.

సా వీరసమితీ రాజ్ఞా విరరాజ వ్యవస్థితా
శశినా శుభనక్షత్రా పౌర్ణమాసీవ శారదీ. ౧

టీక॥ రాజ్ఞా=రామునిచేత; వ్యవస్థితా=అధిష్ఠింపఁబడిన; సా=ఆ; వీరసమితిః=వీరసమూహము; శశినా=చంద్రునిచేత; వ్యవస్థితా (అధ్యాహృతము)=అధిష్ఠింపఁబడిన; శుభనక్షత్రా=మంగళకరమగు నక్షత్రములుగల; శారదీ=శరదృతువునందలి; పౌర్ణమాసీవ=పౌర్ణమాసివలె; విరరాజ=ప్రకాశించెను.

రామాధిష్ఠితంబయినయావానరవీరసేన, చంద్రునితోనొప్పుచున్నశుభనక్షత్రసహితంబగుశారదపౌర్ణమాసియుంబోలె, నెంతయుంబ్రకాశించినది. అని, తాత్పర్యము.

ప్రచచాలచ వేగేన త్రస్తాచైవ వసుంధరా
పీడ్యమానా బలౌఘేన తేన సాగరవర్చసా. ౨

టీక॥ వసుంధరాచ= భూమియు; సాగరవర్చసా= సముద్రముయొక్క కాంతివంటికాంతిగల; తేన=ఆ ; బలౌఘేన=సేనాసమూహముచేత; పీడ్యమానా=పీడింపఁబడుచున్నదై; త్రస్తాచైవ=శ్రమపడినదియునై; వేగేన=వేగముచేత; ప్రచచాల=చలించెను.

సముద్రముంబోలె నపరిచ్ఛిన్నమయినయావానర సైన్యముచేఁ బీడింపఁబడి, భూమి, గడగడవడంకినది. అని, తాత్పర్యము.

తత శ్శుశ్రువు రాక్రోశం లంకాయాం కాననౌకసః
భేరీమృదంగసంఘుష్టం తుములం రోమహర్షణమ్. ౩

టీక॥తతః=అటుపిమ్మట; కాననౌకసః=వానరులు; లంకాయాం=లంకయందు; తుములం= దొమ్మియయినదియు; రోమహర్షణం= వెండ్రుకలగగుపాటునొందునట్లు చేయునదియును; భేరీమృదంగసంఘుష్టం= భేరులయొక్కయు మృదంగముల యొక్కయు ధ్వనిని; ఆక్రోశం=సైనికుల యఱపును; శుశ్రువుః=వినిరి.

అంత, సేనానివేశంబయినపిమ్మట, వానరులకు, లంకలోనుండి, గగుర్పాటునొందించునదియుఁ దుములంబునగు భేరీమృదంగంబులధ్వనియు, సైనికుల యాక్రోశంబును, వినవచ్చినవి.

అని, తాత్పర్యము.

బభూవు స్తేన ఘోషేణ సంహృష్టా హరియూధపాః
అమృష్యమాణా స్తం ఘోషం వినేదు ర్ఘోషవత్తరమ్. ౪

టీక॥హరియూధపాః= వానరశ్రేష్ఠులు; తేన=ఆ; ఘోషేణ=ధ్వనిచేత;సంహృష్టాః= సంతసించినవారలు; బభూవుః=అయిరి. తం=ఆ ; ఘోషం=ధ్వనిని; అమృష్యమాణాః=ఓర్వనివారలై; ఘోషవత్తరం= అధికమయినధ్వనిగల్గునట్లుగా; వినేదుః= అఱచిరి.

వానరశ్రేష్ఠులు, లంకయందలి ధ్వనినివినిసంతుష్టులయిరి; మఱియు, నాధ్వనినిసహింపఁజాలక , యంతకన్న నెచ్చుధ్వనిగలుగునట్లుగా సింహనాదంబులు గావించిరి. అని, తాత్పర్యము.

రాక్షసాస్తు ప్లవంగానాం శుశ్రువుశ్చాపి గర్జితమ్
నర్దతామివ దృప్తానాం మేఘానా మంబరే స్వనమ్. ౫

టీక॥రాక్షసాస్తు= రాక్షసులును; దృప్తానాం=గర్వించినవారలును; నర్దతాం=అఱచుచున్నవారలునగు;ప్లవంగానాం= వానరులయొక్క ; అంబరే=ఆకాశమునందు; మేఘానాం=మేఘములయొక్క;స్వనమివ (స్థితం) = ధ్వనివలెనున్న;గర్జితంచాపి= సింహనాదమును;శుశ్రువుః=వినిరి.

రాక్షసులు, గర్వంబున మేఘంబులుంబోలె గర్జించుచున్న యావానరవీరులసింహనాదంబులనువినిరి.

అని, తాత్పర్యము.

దృష్ట్వా దాశరథి ర్లంకాం చిత్రధ్వజపతాకినీమ్
జగామ మనసా సీతాం దూయమానేన చేతసా. ౬

టీక॥ దాశరథిః= రాముఁడు; చిత్రధ్వజపతాకినీం= నానావిధములయి నచిహ్నయుక్తములగుధ్వజములును వట్టిధ్వజములునుగల; లంకాం=లంకాపట్టణమును; దృష్ట్వా=చూచి; దూయమానేన=దుఃఖించుచున్న ; చేతసా= మనస్సుతో ; యుక్తః (అధ్యాహృతము)=కూడినవాఁడై; మనసా=మనసుచేత; సీతాం=సీతాదేవిని; జగామ= పొందెను.

రాముండు , నానావిధంబులగుధ్వజపతాకలచేనొప్పుచున్న లంకాపురింజూచి, మనంబున, మిక్కిలియుదుఃఖితుండై, సీతాదేవిందలంచుకొనెను.

అని, తాత్పర్యము.

అత్ర సా మృగశాబాక్షీ రావణే నోపరుధ్యతే
అభిభూతా గ్రహేణేవ లోహితాంగేన రోహిణీ. ౭

టీక॥ అత్ర=ఈలంకాపురియందు ; మృగశాబాక్షీ = జింకపిల్లయొక్క కన్నులవంటికన్నులుగల; సా=ఆసీత; లోహితాంగేన=అంగారకుఁడను ; గ్రహేణ=దుష్టగ్రహముచేత; అభిభూతా= ఆక్రమింపఁబడిన; రోహిణీవ=రోహిణివలె; రావణేన=రావణునిచేత; ఉపరుధ్యతే=అడ్డగింపఁబడుచున్నది.

ఈలంకాపట్టణమునందె, జింకపిల్లకుంబోలె సుందరచపలనయనంబులుగలయాసీతాదేవి , దుష్టగ్రహంబగునంగారకునిచేరోహిణియుంబోలె, రావణునిచే నిరోధింపఁబడుచున్నది. అని, రాముండు,మనంబునందలంచుకొనెను.

అని, తాత్పర్యము.

దీర్ఘ ముష్ణంచ నిశ్శ్వస్య సముద్వీక్ష్యచ లక్ష్మణమ్

ఉవాచ వచనం వీర స్తత్కాలహిత మాత్మనః. ౮

టీక॥ వీరః= పరాక్రమశాలియగు రాముండు; దీర్ఘం=నిడువుగాను; ఉష్ణంచ=వేడిగాను ; నిశ్శ్వస్య=నిట్టూర్పువిడిచి; లక్ష్మణం=లక్ష్మణుని;సముద్వీక్ష్యచ=చూచియు;ఆత్మనః=తనకు ; తత్కాలహితం=ఆకాలమునందుయోగ్యమయిన; వచనం=మాటను; ఉవాచ=చెప్పెను.

పరాక్రమవంతుండగురాముండు,యుద్ధయాత్రా సమయంబునఁ బ్రియురాలిందలంచుకొనిదుఃఖించుటయనుచితంబని, యాతలంపునువిడిచి, వేఁడినిట్టూర్పులునిగుడించి, లక్ష్మణునిఁజూచి, తత్కాలహితంబగువాక్యంబున, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఆలిఖంతీమి వాకాశ ముత్థితాం పశ్య లక్ష్మణ
మనసేవ కృతాం లంకాం నగాగ్రే విశ్వకర్మణా. ౯

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఆకాశం=ఆకాశమును; ఆలిఖంతీమివ (స్థితాం)= స్పృశించుచున్నట్లున్నదియు; ఉత్థితాం = ఉన్నతమయినదియు; నగాగ్రే=పర్వతశిఖరమునందు ; విశ్వకర్మణా=విశ్వకర్మచేత ; మనసేవ=మనసుచేతవలె; కృతాం=నిర్మింపఁబడినదియునగు; లంకాం= లంకాపట్టణమును; పశ్య=చూడుము.

లక్ష్మణుఁడా!ఆకాశంబునుస్పృశించుచున్నట్లత్యున్నతంబును విశ్వకర్మచే నతిచమత్కారంబునఁద్రికూటపర్వతశిఖరంబునందు నిర్మింపఁబడినదియునగు లంకాపురింజూడుము.

అని, తాత్పర్యము.

విమానై ర్బహుభి ర్లంకా సంకీర్ణా భువి రాజతే
విష్ణోః పద మివాకాశం ఛాదితం పాండరై ర్ఘనైః.౧౦

టీక॥ బహుభిః=పెక్కులయిన; విమానైః = విమానాకారగృహములచేత; సంకీర్ణా = వ్యాపింపఁబడిన; లంకా=లంకాపురి; భువి = భూమి




యందు; పాండరైః=తెల్లనైన; ఘనైః=మేఘములచేత; ఛాదితం= కప్పఁబడిన; విష్ణోః = సూర్యునియొక్క ; పదం=స్థానమయిన; ఆకాశమివ= ఆకాశమువలె; రాజతే=ప్రకాశించుచున్నది.

ఈలంకాపురి, పెక్కు-విమానంబులచేనావృతయయి, తెల్లనిమేఘంబులతోఁగూడిన యాకాశంబుపగిది, ప్రకాశించుచున్నది.

అని, తాత్పర్యము.

పుష్పితై శ్శోభితా లంకా వనైశ్చైత్రరథోపమైః
నానాపతంగసంఘుష్టైః ఫలపుష్పోపగై శ్శుభైః. ౧౧

టీక॥లంకా=లంకాపురి; శుభైః=సుందరములును; ఫలపుష్పోపగైః= ఫలములచేతనుబూలచేతను పొందఁబడినవియు; నానాపతంగసంఘుష్టైః= నానావిధములగు పక్షులచే ధ్వనిగలవియు;పుష్పితైః=పూచినవియు; చైత్రరథోపమైః=చైత్రరథముతోఁబోలిక-గలవియునగు;వనైః=వనములచేత; శోభితా=ప్రకాశించుచున్నది.

ఈలంకాపురి , మధురంబుగాఁ గూయునానావిధపక్షులతోఁ గూడినవియు, ఫలపుష్పసంపూర్ణంబునగు చైత్రరథంబువంటి సుందర వనంబులచే నెంతయునొప్పుచున్నది.

అని, తాత్పర్యము.

పశ్య మత్తవిహంగాని ప్రలీనభ్రమరాణిచ
కోకిలాకులషండాని దోధవీతి శివోనిలః. ౧౨

టీక॥శివః=మంగళకరంబగు; అనిలః=వాయువు ; మత్తవిహంగాని = మదించినపక్షులుగలవియు; ప్రలీనభ్రమరాణిచ=అణఁగినతుమ్మెదలు గలవియు; కోకిలాకులషండాని= కోయిలలచేనిండినపుష్పసమూహములు గలవియునగు;వనాని(అధ్యాహృతము)=వనంబులను; దోధవీతి=చలింపఁజేయుచున్నది. పశ్య=చూడుము.

ఫలరసాస్వాదనంబున మదించినపక్షులుగలవియు మధుపానంబునమత్తంబులయినిశ్చలంబులయినతుమ్మెదలుగల




వియుఁ, బల్లవచర్వణాసక్తంబులగుకోకిలంబులతోఁగూడినవియునగువనంబులు, మందమారుతంబుచేఁ గదలుచున్నవి ; చూడుము. అని, రాముండు, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి దాశరథీ రామో లక్ష్మణం సమభాషత

టీక॥ఇతి=ఇట్లు; దాశరథిః= దశరథునికొడుకైన; రామః=రాముఁడు; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; సమభాషత=చెప్పెను.

ఈప్రకారంబున, దశరథకుమారుండగురాముండు, లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

బలం చ తద్వై విభజన్ శాస్త్రదృష్టేన కర్మణా. ౧౩
శశాస

టీక॥ సః(అధ్యాహృతము) = ఆరాముండు; శాస్త్రదృష్టేన= నీతిశాస్త్రమునందుఁజూడఁబడిన; కర్మణా= ప్రయోగముచేత; తత్—ఆ("వై" అనునది పాదపూరణార్థము); బలం = సైన్యమును; విభజన్= విభజించువాఁడై; శశాస=ఆజ్ఞాపించెను.

రాముండు, నీతిశాస్త్రపద్ధతిని, సైన్యంబునంతయు, వ్యూహముగాఁదీర్చుటకై, వానరవీరులకిట్లనియాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

కపిసేనాయా బల మాదాయ వీర్యవాన్
అంగద స్సహ నీలేన తిష్ఠే దురసి దుర్జయః. ౧౪

టీక॥ దుర్జయః = జయింపనలవిగానట్టి; వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగల; అంగదః = అంగదుడు; నీలేనసహ=నీలునితోఁగూడ; బలం=తనసైన్యమును; ఆదాయ= తీసికొని; కపిసేనాయాః=వానరసేనయొక్క; ఉరసి = ఱొమ్మునందు; తిష్ఠేత్=ఉండునుగాక.

శత్రువులకుదుర్జయుండును, మహాపరాక్రమశాలియునగునంగదుండు

నీలుంగూడి, తన సేనందీసికొని, వానర సేనవక్షస్స్థలముననుండును గాక.

అని, తాత్పర్యము.

తిష్ఠే ద్వానరవాహిన్యా వానరౌఘసమావృతః
ఆశ్రిత్య దక్షిణం పార్శ్వ మృషభో వానరర్షభః. ౧౫

టీక॥వానరర్షభః=వానరశ్రేష్ఠుండగు; ఋషభః= ఋషభుఁడు ; వానరౌఘసమావృతః= వానరసమూహముచేఁబరివేష్టింపఁబడినవాఁడై; వానరవాహిన్యాః=వానరసేనయొక్క; దక్షిణం=కుడిదైన; పార్శ్వం=ప్రక్కను; ఆశ్రిత్య=ఆశ్రయించి; తిష్ఠేత్= ఉండుఁగాక.

వానరశ్రేష్ఠుండగుఋషభుండు,తన వానరసమూహముంగూడి , వానరసేనాదక్షిణపార్శ్వంబునం గాచియుండుఁగాక. అని, తాత్పర్యము.

గంధహస్తీవ దుర్ధర్ష స్తరస్వీ గంధమాదనః
తిష్ఠే ద్వానరవాహిన్యా స్సవ్యం పార్శ్వం సమాశ్రితః. ౧౬

టీక॥గంధహస్తీవ= మదపుటేనుంగువలె; దుర్ధర్షః= ఎదిరింపఁనలవిగానివాఁడును; తరస్వీ= బలవంతుఁడునగు; గంధమాదనః= గంధమాదనుండు; వానరవాహిన్యాః= వానరసేనయొక్క; సవ్యం=ఎడమదైన;పార్శ్వం=ప్రక్కను; సమాశ్రితః= ఆశ్రయించినవాఁడై; తిష్ఠేత్= ఉండుఁగాక.

మదపుటేనుంగుం బోలె దుర్ధర్షుండు బలవంతుండునగు గంధమాదనుండు, తనసేనంగూడి, వానరసేనాసవ్యపార్శ్వంబుననుండుఁగాక. అని, తాత్పర్యము.

మూర్ధ్ని స్థాస్యా మ్యహం యుక్తో లక్ష్మణేన సమన్వితః

టీక॥అహం=నేను;యుక్తః= సావధానుండనై;లక్ష్మణేన= లక్ష్మణునితో; సమన్వితః = కూడినవాఁడనై; మూర్ధ్ని=తలయందు;స్థాస్యామి =

ఉండెదను.

నేనునులక్ష్మణుండును సావధానులమయి, శిరస్సునను౦డెదము.

అని, తాత్పర్యము.

జాంబవాంశ్చ సుషేణశ్చ వేగదర్శీ చ వానరః. ౧౭
ఋక్షముఖ్యా మహాత్మానః కుక్షిం రక్షంతు తే త్రయః

టీక॥ జాంబవాంశ్చ=జాంబవంతుండును; సుషేణశ్చ= సుషేణుండును; వేగదర్శీ=వేగదర్శియును; వానరశ్చ = వానరుండును; మహాత్మానః= అధికమయినబలముగల; ఋక్షముఖ్యాః = భల్లూకశ్రేష్ఠులగు; తే=ఆ; త్రయః= ముగ్గురును; కుక్షిం=కడుపును; రక్షంతు=రక్షింతురుగాక.

జాంబవంతుండును సుషేణుండును వేగదర్శియు మహాబలశాలులగు భల్లూకశ్రేష్ఠులీముగ్గురును, వానరసేనాకుక్షిస్థానమును రక్షింతురుగాక.

అని, తాత్పర్యము.

జఘనం కపిసేనాయాః కపిరాజోఽభిరక్షతు. ౧౮
పశ్చార్ధ మివ లోకస్య ప్రచేతా స్తేజసా వృతః

టీక॥ కపిరాజః= వానరరాజుండగుసుగ్రీవుఁడు; కపిసేనాయాః= వానరసేనయొక్క; జఘనం= వెనుకటిభాగమును; లోకస్య=లోకముయొక్క; పశ్చార్ధం=పశ్చిమదిక్కును; తేజసా= కాంతిచేత; వృతః=చుట్టఁబడిన; ప్రచేతా ఇవ=వరుణుఁడువలె; అభిరక్షతు= రక్షించుఁగాక.

తేజోజాలంబుచేనావృతుండగు,వరుణుండుపశ్చిమదిక్కును బాలించునట్లు, వానరరాజుండగు సుగ్రీవుండు, వానరసేనాపుచ్ఛభాగంబురక్షించుఁగాక. అని, రాముండు , వానరవీరులకాజ్ఞాపించెను.అని, తాత్పర్యము.

సువిభక్తమహావ్యూహా మహావానరరక్షితా. ౧౯
అనీకినీ సా విబభౌ యథాద్యౌ స్సాభ్రసంప్లవా




టీక॥సువిభక్తమహావ్యూహా=చక్కఁగా నేర్పఱుపఁబడినగొప్పవ్యూహముగలదియు; మహావానరరక్షితా = గొప్పవానరులచేత రక్షింపఁబడినదియునగు; సా=ఆ; అనీకినీ=వానరసేన; సాభ్రసంప్లవా=మేఘసంచారముతోఁగూడిన; ద్యౌరివ=ఆకాశమువలె; విబభౌ=ప్రకాశించినది.

ఆవానరసేన చక్కఁగా గారుడవ్యూహంబునవిభక్తంబయివానరవీరాభిరక్షితంబయి మేఘంబులతోఁ గూడిన యాకాశంబుపగిదిం బ్రకాశించుచుండిన ది. అని, తాత్పర్యము.

ప్రగృహ్య గిరిశృంగాణి మహతశ్చ మహీరుహాన్. ౨౦
ఆసేదుర్వానరా లంకాం విమర్దయిషవో రణే

టీక॥వానరాః=వానరులు; గిరిశృంగాణి= పర్వతశిఖరములను ; మహతః=గొప్పవగు; మహీరుహాంశ్చ=వృక్షములను; ప్రగృహ్య=పట్టుకొని; రణే=యుద్ధమునందు ; విమర్దయిషవః= మర్దింపనిచ్ఛించినవారలై ; లంకాం=లంకాపురిని;ఆసేదుః=పొందిరి.

వానరులు, పర్వత శిఖరంబులను గొప్పగొప్ప వృక్షంబులనుం దీసికొని, యుద్ధంబునరాక్షసుల నందఱ మర్దింపంగోరి, లంకాపురికింబోవుటకుఁ బ్రయత్నపడిరి. అని, తాత్పర్యము.

శిఖరైర్వికిరామైనాం లంకాం ముష్టిభిరేవ వా. ౨౧
ఇతి స్మ దధిరే సర్వే మనాంసి హరిసత్తమాః

టీక॥"శిఖరైః=పర్వతశిఖరములచేతఁగాని; ముష్టిభిరేవవా=పిడికిళ్లచేతఁగాని; ఏనాం=ఈ; లంకాం=లంకాపురిని; వికిరామ=చూర్ణముగావింతము." ఇతి=అని; హరిసత్తమాః=వానరశ్రేష్ఠులు;సర్వే=అందఱును; మనాంసి=మనస్సులను;దధిరే=ధరించిరి.

"పర్వతశిఖరంబులచేఁగానిపిడికిళ్లచేఁగానిలంకాపురి నంతయుఁ , జూర్ణంబుగావింతము" ఇట్లు,ఆవానరోత్తములందఱుమనంబులనిశ్చయించుకొనిరి. అని, తాత్పర్యము.




తతో రామో మహాతేజా స్సుగ్రీవ మిద మబ్రవీత్. ౨౨

టీక॥తతః=అటుపిమ్మట; మహాతేజాః= అధికమయినకాంతిగల ; రామః=రాముఁడు; సుగ్రీవం= సుగ్రీవునిఁగూర్చి; ఇదం=ఈమాటను;అబ్రవీత్=చెప్పెను

అటుపిమ్మట,మహాతేజుఁడగు రాముండు, సుగ్రీవుంజూచి,యీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

సువిభక్తాని సైన్యాని శుక ఏష విముచ్యతామ్

టీక॥సైన్యాని=సైన్యములు ;సువిభక్తాని=చక్కఁగావిభజింపఁబడెనకదా! ఏషః=ఈ; శుకః=శుకుఁడు ; విముచ్యతాం=విడువఁబడుఁగాక.

సైన్యంబుల నంతయు వ్యూహాకారంబునందీర్చినదయినదిగదా!ఇంక నీ శుకునివిడిపించుము. అని, రాముండు సుగ్రీవునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

రామస్య వచనం శ్రుత్వా వానరేంద్రో మహాబలః. ౨౩
మోచయామాస తం దూతం శుకం రామస్య శాసనాత్

టీక॥మహాబలః=అధికమయిన బలముగల; వానరేంద్రః= వానరరాజుండగుసుగ్రీవుండు; రామస్య= రామునియొక్క;వచనం= మాటను ; శ్రుత్వా=విని; రామస్య= రామునియొక్క; శాసనాత్=ఆజ్ఞవలన; తం= ఆ;దూతం=దూతయయినశుకుని;మోచయామాస=విడిపించెను.

మహాబలశాలియగువానరరాజుండగుసుగ్రీవుఁడు , రామునిమాటనువిని, రామునాజ్ఞంజేసి , రావణదూతయగుశుకునివిడిపించెను.

అని,తాత్పర్యము.

మోచితో రామవాక్యేన వానరై శ్చాభిపీడితః. ౨౪
శుకః పరమసంత్రస్తో రక్షోధిప ముపాగమత్

టీక॥ వానరైః = వానరులచేత; అభిపీడితశ్చ = చక్కఁగాఁ బీడింపఁబడినవాఁడును; పరమత్రస్తః = మిక్కిలియు భయపడినవాఁడును; రామవాక్యేన = రామునిమాటచేత; మోచితః = విడువఁబడినవాఁడునగు; శుకః = శుకుఁడు; రక్షోధిపం = రాక్షసరాజుండగు రావణుని; ఉపాగమత్ = పొందెను.

అట్లువానరులచే నానావిధంబులం బీడింపఁబడి పరమభయంబునొందియున్న శుకుఁడు, రామవాక్యంబునవిడుదలనొందినంతనె నిమిషంబైన నచ్చటనిలువక, రాక్షసరాజుండగు రావణుఁనొద్దకుఁబోయెను. అని, తాత్పర్యము.

రావణః ప్రహసన్నేవ శుకం వాక్య మభాషత. ౨౫

టీక॥ రావణః = రావణుఁడు; ప్రహసన్నేవ = నవ్వుచునే; శుకం = శుకుని గూర్చి; వాక్యం = మాటను; అభాషత = చెప్పెను.

రావణుండు, శుకుంజూచి, నవ్వుచు, నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

కి మిమౌ తే సితౌ పక్షౌ లూనపక్షశ్చ దృశ్యసే
కచ్చి న్నానేకచిత్తానాం తేషాం త్వం వశమాగతః. ౨౬

టీక॥ ఇమౌ = ఈ; తే = నీయొక్క; పక్షౌ = ఱెక్కలు; సితౌ కిం = కట్టఁబడినవా యేమి? లూనపక్షశ్చ = ఛేదింపఁబడిన ఱెక్కలుగలవాఁడవుగాను; దృశ్యసే = చూడఁబడుచున్నావు. త్వం = నీవు; అనేకచిత్తానాం = చపలమయిన మనస్సుగల; తేషాం = ఆవానరులయొక్క; వశం = అధీనతను; నాగతః కచ్చిత్ = పొందలేదుగదా?

నీఱెక్కలుబంధింపఁబడినవా యేమి? ఛేదింపఁబడినట్లు గాన్పించుచున్నవి; నీవుచపలచిత్తులగు నావానరులవశంబునఁజిక్కలేదుగదా? అని, రావణుండు. శుకునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తత స్స భయసంవిగ్న స్తథా రాజ్ఞాభిచోదితః
వచనం ప్రత్యువాచేదం రాక్షసాధిప ముత్తమమ్. ౨౭

టీక॥ తతః=అటుపిమ్మట; సః=ఆ శుకుఁడు; తథా=అట్లు; రాజ్ఞా=రాక్షసరాజుండగు రావణునిచేత; అభిచోదితః=ప్రేరింపఁబడినవాఁడై; భయసంవిగ్నః=భయముచేసంభ్రమమునొందినవాఁడై; రాక్షసాధిపం = రాక్షసులకుఁబ్రభుఁడైన రావణునిగూర్చి; ఉత్తమం=శ్రేష్ఠమయిన ; ఇదం=ఈ; వచనం=మాటను; ప్రత్యువాచ= బదులు చెప్పెను.

అంత, నాశుకుండు, అట్లు, రాక్షసరాజుండగు రావణునిచే నడుగఁబడినవాఁడై,భయంబుచేఁదొట్రుపడుచు , రావణుంజూచి, యుత్తమంబగునీమాటంజెప్పెను.అని,తాత్పర్యము.

సాగరస్యోత్తరే తీరే బ్రువంతే వచనం తథా
యథాసందేశ మక్లిష్టం సాంత్వయన్ శ్లక్ష్ణయా గిరా. ౨౮

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; సాగరస్య=సముద్రముయొక్క; ఉత్తరే=ఉత్తరపుదిక్కునందలి; తీరే= గట్టునందు; శ్లక్ష్ణయా=మృదువయిన; గిరా=మాటచేత; సాంత్వయన్= అనునయింపుచు; యథాసందేశం=నీవు చెప్పిపంపినమాటనతిక్రమింపక ; అక్లిష్టం=దుఃఖకరముగానట్లుగా; తథా=అట్లు; తే=నీయొక్క; వచనం=మాటను; అబ్రువం=చెప్పితిని.

నేను,ఇచ్చటనుండి, సముద్రోత్తరతీరంబునకుఁబోయి,యచ్చట, సుగ్రీవునింజూచి, మృదుమధురవచనంబుల ననునయింపుచు , నీవుచెప్పిన మాటలనంతయు,నించుమించులేక, స్పష్టముగాఁజెప్పితిని. అని,తాత్పర్యము.

క్రుద్ధైస్తైరహ ముత్పత్య దృష్టమాత్రైః ప్లవంగమైః
గృహీతో స్మ్యపిచా రబ్ధో హంతుం లోప్తుంచ ముష్టిభిః. ౨౯

టీక॥అహం=నేను;దృష్టమాత్రైః=చూచుటమాత్రమె గలవారలును; క్రుద్ధైః = కోపించినవారలునగు;తైః=ఆ;ప్లవంగమైః = వానరులచేత;ఉత్పత్య=ఎగిరి; గృహీతః=పట్టుకొనఁబడినవాఁడను;అస్మి=అయితిని.అపిచ=మఱియు;ముష్టిభిః=పిడికిళ్లచేత; హంతుం=కొట్టుటకును;లోప్తుంచ = నశింపఁజే

యుటకును; ఆరబ్ధాః = ఆరంభింపఁబడి నాను.

ఆవానరులు, నన్నుఁజూచినంతనే, పరమకుపితులై, ఆకాశంబునకుద్గమించి, నన్నుఁబట్టుకొని, పిడికిళ్లంగొట్టివధింప నారంభించిరి. అని, తాత్పర్యము.

నైవ సంభాషితుం శక్యా స్సంప్రశ్నోఽత్ర నవిద్యతే
ప్రకృత్యా కోపనా స్తీక్ష్ణా వానరా రాక్షసాధిప. ౩౦

టీక॥ రాక్షసాధిప = రాక్షసులకుఁ బ్రభుండగు రావణుఁడా! ఏతే (అధ్యాహృతము) = ఈవానరులు; సంభాషితుం = మాటలాడుటకు; నైవశక్యాః = అలవికానేకారు. అత్ర = వీరలయందు; సంప్రశ్నః = ప్రశ్నము; నవిద్యతే = లేదు. వానరాః = వానరులు; ప్రకృత్యా = స్వభావముచేత; కోపనాః = కోపముగలవారలు; తీక్ష్ణాః = క్రూరులు.

రాక్షసేశ్వరుండవగు రావణుఁడా! ఆవానరులతో మాటలాడుటకవకాశమే లేదు; అడుగుటకుఁగూడనలవిగాదు; ఇంకవారలవలనఁ బ్రత్యుత్తరమునొందుటెట్లు? వానరులు, స్వభావంబుననె పరమకోపనులు; అతికౄరులు.

అని, తాత్పర్యము.

స చ హంతా విరాధస్య కబంధస్య ఖరస్యచ
సుగ్రీవసహితో రామ స్సీతాయాః పద మాగతః. ౩౧

టీక॥ విరాధస్య = విరాధునియొక్కయు; కబంధస్య = కబంధునియొక్కయు; ఖరస్యచ = ఖరునియొక్కయు; హంతా = వధించినవాఁడయిన; సః = ఆ; రామశ్చ = రాముండును; సుగ్రీవసహితః = సుగ్రీవునితోఁ గూడినవాఁడై; సీతాయాః = సీతయొక్క; పదం = స్థానమును; ఆగతః = పొందినాఁడు.

విరాధునిఁ గబంధునిఖరుని, వధించినట్టి మహాపరాక్రమశాలి యగురాముండు, సుగ్రీవ సహితుండై, సీతాదేవియునికి పట్టయినలంకా ద్వీపంబునకువచ్చినాఁడు. అని, తాత్పర్యము.

స కృత్వా సాగరే సేతుం తీర్త్వాచ లవణోదధిమ్
ఏష రక్షాంసి నిర్ధూయ ధన్వీ తిష్ఠతి రాఘవః. ౩౨

టీక॥సః=అట్టి;ఏషః=ఈ; ధన్వీ=మంచిధనుస్సుగల; రాఘవః = రాముఁడు;సాగరే = సముద్రమునందు; సేతుం=సేతువును; లవణోదధిం=ఉప్పుసముద్రమును; తీర్త్వాచ=దాఁటియు; రక్షాంసి=రాక్షసులను; నిధూయ=తృణీకరించి;తిష్ఠతి=ఉన్నాఁడు.

అట్టిధనుర్ధరుండగు, రాముండు, సముద్రంబునసేతువునిర్మించి, సముద్రంబు దాఁటి, రాక్షసులందృణీకరించి, లంకాద్వారంబున,నున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఋక్షవానరసంఘానా మనీకాని సహస్రశః
గిరిమేఘనికాశానాం ఛాదయంతి వసుంధరామ్, ౩౩

టీక॥గిరిమేఘనికాశానాం= పర్వతంబులతోను మేఘంబులతోను సమానములగు;ఋక్షవానరసంఘానాం = ఎలుఁగు గొడ్డులయొక్కయు వానరులయొక్కయుసమూహములయొక్క;అనీకాని=సేనలు;సహస్రశః= వేనవేలుగా;వసుంధరాం=వసుంధరను; ఛాదయంతి=ఆవరించుచున్నవి.

పర్వతాకారులును మేఘాకారులునగుఋక్షవానరులసేనలు , వేనవేలుగా, భూమినంతయు నావరించియున్నవి. అని, తాత్పర్యము.

రాక్షసానాం బలౌఘస్య వానరేంద్రబలస్యచ
నైతయో ర్విద్యతే సంధి ర్దేవదానవయోరివ. ౩౪

టీక॥ రాక్షసానాం= రాక్షసులయొక్క; బలౌఘస్య = సేనాసమూహమునకును;వానరేంద్రబలస్యచ=వానరరాజుండగు సుగ్రీవునిసేనకును; ఏతయోః = వీనికి ; దేవదానవయోరివ= దేవతలకును దానవులకునువలె; సంధిః=సంధి; నవిద్యతే=లేదు.

రాక్షస సైనికులకును వానరసైనికులకును,వీరలయిర్వురకును,దేవదానవులకుంబోలె, నెంతమాత్రము, సంధి కుదురదు.

అని, తాత్పర్యము.

పురాప్రాకార మాయాంతి క్షిప్ర మేకతరం కురు

సీతాం వాస్మై ప్రయచ్ఛాశు సుయుద్ధంవా ప్రదీయతామ్. ౩౫

టీక॥ తే(అధ్యాహృతము)=ఆవానరులు; పురా=ముందు; ప్రాకారం=ప్రాకారమును; ఆయాంతి=పొందఁగలరు. సీతాంవా=సీతనైనను; అస్మై=ఈరామునికొఱకు; ఆశు=శీఘ్రముగా; ప్రయచ్ఛ = ఇమ్ము. సుయుద్ధంవా = మంచియుద్ధమునుగాని; ప్రదీయతాం=ఇయ్యంబడుఁగాక. క్షిప్రం=శీఘ్రముగా; ఏకతరం= రెంటిలోనొకటిని; కురు=చేయుము.

ఇదిగోవానరులు లంకాప్రాకారంబులపైకిరాఁబోవుచున్నారు ; శీఘ్రంబునసీతనైనను రామునకొసంగుము; లేక,చక్కఁగా యుద్ధంబునైనం జేయుము; ఈరెంటిలోనేదేని శీఘ్రంబునంగావింపుము. అని, శుకుండు, రావణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

శుకస్య వచనం శ్రుత్వా రావణో వాక్య మబ్రవీత్
రోషసంరక్తనయనో నిర్దహన్నివ చక్షుషా. ౩౬

టీక॥ రావణః=రావణుఁడు; శుకస్య=శుకునియొక్క; వచనం= మాటను; శ్రుత్వా = విని; రోషసంరక్తనయనః= కోపముచేనెఱ్ఱనైనకండ్లుగలవాఁడై; చక్షుషా=కంటిచేత ; నిర్దహన్నివ (స్థితః)= దహించువాఁడువలెనున్నవాఁడై; వాక్యం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

రావణుండు,శుకుఁడుచెప్పినమాటనువిని, కోపంబునఁగన్నులనెఱ్ఱఁదనంబుగదుర, నిప్పులుగ్రక్కుచు , నీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

యది మాం ప్రతి యుధ్యేరన్ దేవగంధర్వదానవాః
నైవ సీతాం ప్రయచ్ఛామి సర్వలోకభయాదపి. ౩౭

టీ॥ దేవగంధర్వదానవాః=దేవతలును గంధర్వులును దానవులును; మాం ప్రతి= నన్నుఁగూర్చి ; యుధ్యేరన్ యది= యుద్ధముసేయుదురేని; తదాపి ( అధ్యాహృతము) =అప్పుడును; సర్వలోకభయాదపి=సమస్తలోకభయంబువ

లనను; సీతాం=సీతను ; నైవప్రియచ్ఛామి=ఇవ్వనేయివ్వను.

దేవగంధర్వులును దానవులును, వీరలందఱు నాపైకియుద్ధముగావింప వచ్చినను, సమస్తలోకంబులును నన్నుభయపఱచినను, నేనెంతమాత్రము, సీతనివ్వను. అని, తాత్పర్యము.

కదానామాఽభిధావంతి రాఘవం మామకాశ్శరాః
వసంతే పుష్పితం మత్తా భ్రమరా ఇవ పాదపమ్. ౩౮

టీక॥ మామకాః=నావైన; శరాః=బాణములు; రాఘవం=రాముని; వసంతే=వసంతఋతువునందు ; పుష్పితం=పూచిన; పాదపం = వృక్షమును; మత్తాః= మదించిన ; భ్రమరాఇవ=తుమ్మెదలువలె; కదానామ=ఎప్పుడు; అభిధావంతి=పొందును?

వసంతఋతువునందుఁబుష్పితంబగు వృక్షంబును మదించినతుమ్మెదలు ముసరుకొనునట్లు, నాబాణంబులు రాముని దేహంబు నెప్పుడు పొందఁగలవు? అని, తాత్పర్యము.

కదా తూణీశయై ర్దీప్తై ర్గణశః కార్ముకచ్యుతైః
శరై రాదీపయామ్యేన ముల్కాభిరివ కుంజరమ్. ౩౯

టీక॥ కదా= ఎప్పుడు ; తూణీశయైః=అమ్ములపొదులనున్నవియు; దీప్తైః=ప్రకాశించుచున్నవియు ; గణశః=సమూహములుగా ; కార్ముకచ్యుతైః=ధనుస్సునుండి వెడలినవియునగు; శరైః= బాణములచేత ; ఉల్కాభిః=కొఱవికట్టెలచేత; కుంజరమివ=ఏనుంగునువలె; ఆదీపయామి= వెలిఁగింపఁగలను?

బహుకాలముగాయుద్ధము లేకుండుటచేనమ్ములపొదులందున్న కఱకుబాణంబులను, వేనవేలుగాఁ బ్రయోగించి, కొఱవికట్టెలచే నేనుంగును బాధించునట్లు, రాము నెప్పుడు బాధింపఁగలను? అని, తాత్పర్యము.

తచ్చాస్య బల మాదాస్యే బలేన మహతా వృతః

జ్యోతిషామివ సర్వేషాం ప్రభా ముద్యన్ దివాకరః. ౮౦

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; మహతా=గొప్పదగు; బలేన=సైన్యముచేత; వృతః= పరివారింపఁబడినవాఁడనై; అస్య=ఈ రామునియొక్క; తత్=అట్టి; బలంచ=వానరసేననుగూడ; ఉద్యన్ = ఉదయించుచున్న; దివాకరః=సూర్యుఁడు; సర్వేషాం= సమస్తములయిన; జ్యోతిషాం=చంద్రనక్షత్రములయొక్క; ప్రభామివ = కాంతినిం బోలె; ఆదాస్యే=గ్రహించెదను.

నేను, రాక్షససేనాపరివృతుండనై, ఉదితుండగు సూర్యుండు చంద్రనక్షత్రాదులకాంతిం బోఁగొట్టునట్లు, రాముని వానరసేననంతయు సంహరించెదను.

అని, తాత్పర్యము.

సాగరస్యేవ మే వేగో మారుతస్యే వ మే గతిః
నహి దాశరథి ర్వేద తేన మాం యోద్ధు మిచ్ఛతి. ౮౧

టీక॥మే=నాకు; సాగరస్యేవ= సముద్రమునకుంబోలె; వేగః=వేగము; అస్తితి(అధ్యాహృతము)= కలదనియు; మే=నాకు; మారుతస్యేవ= వాయువునకుంబోలె; గతిః=గమనము; అస్తితి(అధ్యాహృతము) = కలదనియు; దాశరథిః=రాముఁడు; నవేదహి=ఎఱుంగఁడు గదా. తేన=అందుచేత; మాం=నన్నుఁ గూర్చి; యోద్ధుం = యుద్ధముసేయుటకు; ఇచ్ఛతి=కోరుచున్నాఁడు.

నాకు, సముద్రమునకుంబోలె వేగంబును వాయువునకుంబోలె గమనంబునుం గలదని, రామునకుఁ దెలియదు కాఁబోలు; అందువలననె, నాతో యుద్ధము సేయఁగోరుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

న మే తూణీశయాన్ బాణాన్ సవిషానివ పన్నగాన్
రామః పశ్యతి సంగ్రామే తేన మాం యోద్ధు మిచ్ఛతి. ౮౨

టీక॥రామః=రాముఁడు; మే= నాయొక్క; తూణీశయాన్= అమ్ములపొదులందుండునట్టి ; సవిషాన్ = విషముతోఁగూడిన; పన్నగానివ(స్థితాన్)=

సర్పములువలెనున్న; బాణాన్=బాణములను; సంగ్రామే=యుద్ధమునందు; నపశ్యతి=చూడలేదు. తేన= అందుచేత; మాం=నన్నుఁగూర్చి; యోద్ధుం=యుద్ధముసేయుటకు; ఇచ్ఛతి= కోరుచున్నాఁడు.

రాముఁడు, తీక్ష్ణవిషంబులగు సర్పంబులవంటి నాతూణీరంబులనున్న బాణంబులను యుద్ధంబున నెప్పుడునుజూచినదిలేదు; కావుననే, నాతో యుద్ధంబు సేయవలెనని కోరుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

న జానాతి పురా వీర్యం మమ యుద్ధే స రాఘవః

టీక॥సః=ఆ; రాఘవః= రాముఁడు; పురా=మున్ను; యుద్ధే= యుద్ధమునందు; మమ=నాయొక్క ; వీర్యం=పరాక్రమమును; నజానాతి = ఎఱుంగఁడు.

రాముండు, యుద్ధంబున, నాపరాక్రమంబుసంగతి నిదివఱ కెఱుంగఁడు. అని, తాత్పర్యము.

మమ చాపమయీం వీణాం శరకోణైః ప్రణాదితామ్. ౪౩
జ్యాశబ్దతుములాం ఘోరా మార్తభీతమహాస్వనామ్
నారాచతలసన్నాదాం తాం మమాహితవాహినీమ్. ౪౪
అవగాహ్య మహారంగం వాదయిష్యా మ్యహం రణే

టీక॥అహం=నేను ; రణే=యుద్ధమునందు; తాం=ఆ;మమ= నాయొక్క; అహితవాహినీం= శత్రుసైన్యమును; మహారంగం= గొప్పరంగస్థలమును;అవగాహ్య=ప్రవేశించి; శరకోణైః=బాణములనువాదకదండములచేత;ప్రణాదితాం = ధ్వనించునదియు; జ్యాశబ్దతుములాం = అల్లెత్రాటిధ్వనియెతుములధ్వనిగాఁగలదియు ; ఘోరాం=భయంకరమయినదియు;ఆర్తభీతమహాస్వనాం=దుఃఖితులయొక్కయు భయపడినవారలయొక్కయు ధ్వనులె మహాధ్వనులుగాఁగలదియు; నారాచతలసన్నాదాం= బాణంబులయొక్కయు అస్త్రములయొక్కయు ధ్వనులెగొప్పధ్వనులుగాఁగలదియునగు; మమ= నాయొక్క; చాపమయీం =విల్లుఅనెడు;వీణాం=వీణెను; వాదయిష్యామి=

వాయించెదను.

నేను, యుద్ధంబున, శత్రుసేనం జొచ్చి, బాణకోణంబుల వాయింపఁదగినదియు, అల్లెత్రాటిధ్వనియు, దుఃఖితులును భీతులును గావించు రోదనంబును, బాణతలంబులధ్వనియు, మంద్రమధ్యమతారస్వరంబులయి చెలంగ, భయంకరంబయి యొప్పుచున్నదియునగు ధనుర్వీణం గైకొని, వాయించెదను.

అని, తాత్పర్యము.

న వాసవేనాపి సహస్ర చక్షుషా
యథాస్మి శక్యో వరుణేన వా స్వయమ్. ౪౫
యమేన వా ధర్షయితుం శరాగ్నినా
మహాహవే వైశ్రవణేన వా పునః

టీక॥ సహస్రచక్షుషా = వేయికండ్లుగల; వాసవేనాపి = ఇంద్రునిచేనైనను; స్వయం = తానేవచ్చిన; వరుణేనవా = వరుణునిచేతనైనను; యమేనవా = యమునిచేతనైనను; పునః = ఇంకను; వైశ్రవణేనవా = కుబేరునిచేతనైనను; మహాహవే = మహాయుద్ధమునందు; శరాగ్నినా = నిప్పువంటిబాణముచేత; ధర్షయితుం = ఎదిరించుటకు; నశక్యోయథా = అలవిగాకపోతినిగదా!

సహస్రాక్షుండగు దేవేంద్రుండుగాని, సాక్షాద్వరుణుండుగాని, యముండుగాని, కుబేరుండుగాని, నిప్పులవంటిబాణంబులం బ్రయోగించియు, మహాయుద్ధంబున, నాముందఱ నిలువంజాలకైరిగదా! అని, రావణుండు, శుకునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, చతుర్వింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ చతుర్వింశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

## పంచవింశసర్గప్రారంభః.

స బలే సాగరం తీర్ణే రామే దశరథాత్మజే
అమాత్యౌ రావణ శ్శ్రీమా నబ్రవీ చ్ఛుకసారణౌ. ౧

టీక॥ సబలే=సైన్యముతోఁగూడిన; దశరథాత్మజే= దశరథునికొడుకైన; రామే=రాముఁడు;సాగరం= సముద్రమును;తీర్ణే=దాఁటఁగా; శ్రీమాన్= అధికమయినకాంతిగల;రావణః= రావణుఁడు; అమాత్యౌ=మంత్రులగు;శుకసారణౌ=శుకునిసారణునింగూర్చి; అబ్రవీత్ =చెప్పెను.

దశరథకుమారుండగు రాముండు, వానరసేనతోఁగూడ, సముద్రంబుదాఁటివచ్చుటనువిని, శ్రీమంతుండగు రావణుండు, తనమంత్రుల శుకసారణులం జూచి,యిట్లని,చెప్పెను.
అని, తాత్పర్యము.

సమగ్రం సాగరం తీర్ణం దుస్తరం వానరం బలమ్
అభూతపూర్వం రామేణ సాగరే సేతుబంధనమ్. ౨

టీక॥ వానరం=వానరసంబంధియగు; బలం=సైన్యము; సమగ్రం = అంతయు; దుస్తరం = దాఁటఁగూడనట్టి; సాగరం=సముద్రమును;తీర్ణం=దాఁటినది. రామేణ = రామునిచేత; అభూతపూర్వం= ఇంతకుమున్నెప్పుడునులేని; సేతుబంధనం= సేతువుగట్టుట; కృతం(అధ్యాహృతము)= చేయఁబడినది!

వానరసైన్యమంతయు ,దుస్తరంబగుసముద్రమును దాఁటివచ్చినది! రాముఁడు సముద్రమునందింతకు మున్నెప్పుడును జూచియు వినియు నెఱుంగని సేతువును నిర్మించినాఁడు. అని, తాత్పర్యము.

సాగరే ప్రతబంధంచ నశ్రద్దధ్యాం కథంచన
అవశ్యంచాపి సంఖ్యేయం తన్మయా వానరం బలమ్. ౩




టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; కథంచన=ఎట్లయినను ; సాగరే=సముద్రమునందు; సేతుబంధంచ= సేతువుకట్టుటను; నశ్రద్దధ్యాం=నమ్మను. అపిచ = మఱియు; మయా = నాచేత; తత్=ఆ;వానరం= వానర సంబంధియగు; బలం=సైన్యము; సంఖ్యేయం=ఎఱుంగఁదగినది.

సముద్రంబున సేతుబంధంబుగావించినారనునది నాకునమ్మకములేదు; మఱియు, నాకు , ఆవానరసైన్యముప్రకారమంతయుఁదెలియవలయును.

అని, తాత్పర్యము.

భవంతౌ వానరం సైన్యం ప్రవిశ్యానుపలక్షితౌ
పరిమాణంచ వీర్యంచ యేచ ముఖ్యాః ప్లవంగమాః. ౪
మంత్రిణో యేచ రామస్య సుగ్రీవస్యచ సమ్మతాః
యే పూర్వ మభివర్తంతే యేచ శూరాః ప్లవంగమాః. ౫
సచ సేతు ర్యథా బద్ధ స్సాగరే సలిలాశయే
నివేశం యద్యథా తేషాం వానరాణాం మహాత్మనామ్. ౬
రామస్య వ్యవసాయంచ వీర్యం ప్రహరణానిచ
లక్ష్మణస్యచ వీర్యంచ తత్త్వతో జ్ఞాతు మర్హతః. ౭

టీక॥ భవంతౌ = మీరలు; వానరం=వానరసంబంధియగు ; సైన్యం= సైన్యమును; అనుపలక్షితౌ= చూడఁబడనివారలై ; ప్రవిశ్య=చొచ్చి; పరిమాణంచ=కొలఁతను; వీర్యంచ= పరాక్రమమును; ముఖ్యాః=శ్రేష్ఠులయిన;ప్లవంగమాః;వానరులు; యే=ఎవ్వరో; రామస్య = రామునియొక్కయు; సుగ్రీవస్యచ= సుగ్రీవునియొక్కయు; సమ్మతాః=ఇష్టులయిన;మంత్రిణశ్చ = మంత్రులును; యే=ఎవ్వరో; యే = ఎవ్వరు;పూర్వం=ముందు;అభివర్తంతే=ఉందురో; యే=ఏ; ప్లవంగమాశ్చ=వానరులును;శూరాః=శూరులో; సః=ఆ; సేతుశ్చ—సేతువును;సలిలాశయే=నీళ్లయునికిపట్టయిన;సాగరే = సముద్రమునందు; యథా=ఎట్లు ; బద్ధః=కట్టఁబడినదో; మహాత్మనాం = మహాబలులగు; తేషాం=ఆ; వానరాణాం=వానరులయొక్క ;నివేశం=నివా




సము; యద్యథా = ఎట్లో ; ఏతాని (అధ్యాహృతము)=వీనిని; రామస్య= రామునియొక్క; వ్యవసాయంచ=ప్రయత్నమును; వీర్యం=పరాక్రమమును; ప్రహరణానిచ=ఆయుధములను;లక్ష్మణస్యచ = లక్ష్మణునియొక్కయు;వీర్యంచ=పరాక్రమమును;తత్త్వతః= యాథార్థ్యముచేత;జ్ఞాతుం= తెలియుటకు;అర్హతః=తగుదురు.

మీరలు, వానరులకుఁదెలియకుండునట్లు రహస్యముగా వానరసైన్యంబుఁ జొచ్చి, వానరసేనాపరిమాణమును, వానరులపరాక్రమంబును,అందు, ముఖ్యులగువానరులెవ్వరైనదియు, రామునిమంత్రులును సుగ్రీవునిమంత్రులునెవ్వరైనదియు, వానరసేనయందుయుద్ధంబునకుఁదు నిలుచు శూరులెవ్వరైనదియు, అట్టిమహాసముద్రంబునసేతువునెట్లునిర్మించినదియు, మహాబలులగునవ్వానరులనివేశస్థానములును, రామునివ్యవసాయంబును బరాక్రమంబును ఆయుధంబులును లక్ష్మణునిపరాక్రమంబును,ఈసంగతులంతయు,యథార్థంబుగాఁదెలిసికొనిరండు.

అని, తాత్పర్యము.

కశ్చ సేనా పతి స్తేషాం వానరాణాం మహౌజసామ్
ఏతత్ జ్ఞాత్వా యథా తత్త్వం శీఘ్ర మాగంతు మర్హథః.౮

టీక॥ మహౌజసాం=అధికమయినపరాక్రమముగల;తేషాం=ఆ; వానరాణాం=వానరులకు; సేనాపతిశ్చ=సేనానాయకుఁడును; కః=ఎవ్వఁడు? యువాం(అధ్యాహృతము) = మీరలు; ఏతత్=దీనిని; యథాతత్త్వం = యథార్థమునతిక్రమింపక ; జ్ఞాత్వా= ఎఱింగి; శీఘ్రం=శీఘ్రముగా ; ఆగంతుం=వచ్చుటకు; అర్హథః = తగుదురు.

మహాపరాక్రమశాలులగు నవ్వానరులసేనాపతియెవ్వఁడు? మీరలు;ఈసంగతులన్నియు , యథార్థముగాఁదెలిసికొని, శీఘ్రంబునవచ్చుటకి తావలయును. అని,రావణుండు , శుకసారణులకుఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఇతి ప్రతిసమాదిష్టౌ రాక్షసౌ శుకసారణౌ
హరిరూపధరౌ వీరౌ ప్రవిష్టౌ వానరం బలమ్. ౯

టీక॥ వీరౌ=పరాక్రమశాలులగు; శుకసారణౌ=శుకసారణులను; రాక్షసౌ=రాక్షసులు; ఇతి=ఇట్లు; ప్రతిసమాదిష్టౌ = ఆజ్ఞాపింపఁబడినవారలై; హరిరూపధరౌ = వానరరూపమునుధరించినవారలై; వానరం=వానరసంబంధియగు; బలం= సైన్యమును; ప్రవిష్టౌ=పొందిరి.

పరాక్రమవంతులగునా శుకసారణులు, ఇట్లు రావణునిచేనాజ్ఞాపింపఁబడి, వానరరూపంబుధరించి, వానరసేనంజొచ్చిరి.అని, తాత్పర్యము.

తత స్త ద్వానరం సైన్య మచింత్యం రోమహర్షణమ్
సంఖ్యాతుం నాధ్యగచ్ఛేతాం తదా తౌ శుకసారణౌ. ౧౦

టీక॥ తతః=అంత; తదా= అప్పుడు; తౌ=ఆ; శుకసారణౌ=శుకుఁడును సారణుఁడును;అచింత్యం=ఎన్నరానిదియును; రోమహర్షణం=వెండ్రుకలకగుర్పాటునొందించునదియునగు; తత్=ఆ; వానరం = వానరసంబంధియయిన; సైన్యం=సైన్యమును; సంఖ్యాతుం=లెక్కపెట్టుటకు; నాధ్యగచ్ఛేతాం=ఎఱుంగరైరి.

అంత, నప్పుడు,ఆశుకసారణులు, అచింత్యంబునుబాపరులకుగగుర్పాటుగలిగించునదియునగు, నవ్వానరసేనం జూచి, యచ్చెరువునొంది,దానిలెక్కపెట్టంజాలరైరి. అని, తాత్పర్యము.

సంస్థితం పర్వతాగ్రేషు నిర్ఝరేషు గుహాసుచ
సముద్రస్య చ తీరేషు వనేషూ పవనేషు చ. ౧౧
తరమాణంచ తీర్ణంచ తర్తుకామంచ సర్వశః
నివిష్టం నివిశచ్చైవ భీమనాదం మహాబలమ్. ౧౨
త ద్బలార్ణవ మక్షోభ్యం దదృశాతే నిశాచరౌ

టీక॥నిశాచరౌ=రాక్షసులగు శుకసారణులు; పర్వతాగ్రేషు = పర్వత

శిఖరములయందును; నిర్దరేషు=పగిలియున్నపర్వతప్రదేశములయందును; గుహాసుచ=గుహలయందును; సముద్రస్య=సముద్రముయొక్క; తీరేషు చ=తీరప్రదేశములయందును; వనేషు=వనములయందును;ఉపవనేషుచ= ఉద్యానవనములయందును; సంస్థితం=ఉన్నదియు; సర్వశః=అంతటను;తరమాణంచ=దాఁటుచున్నదియు; తీర్ణంచ=దాఁటినదియు; తర్తుకామం చ=దాఁటఁగోరినదియు; నివిష్టం=విడిసినదియు; నివిశచ్చైవ=విడియుచున్నదియు; భీమనాదం=భయంకరధ్వనిగలదియు; మహాబలం=అధికమయినబలముగలదియు; అక్షోభ్యం=క్షోభింపనలవిగానిదియునగు;తత్=ఆ; బలార్ణవం=సేనాసముద్రమును; దదృశాతే=చూచిరి.

శుకసారణులు,పర్వతశిఖరంబులందునుభిన్నపర్వతప్రదేశంబులందునుగుహలయందును, సముద్రతీరంబునందునువనంబులందును ఉద్యానవనంబులందును,విడిసియున్నదియుఁ,గొంతభాగముసముద్రంబుదాఁటియుం, గొంత దాఁటుచును,గొంతవిడిసియుఁ గొంత విడియుచును, ఇట్లునానాప్రకారంబులనున్నదియు, భయంకర ధ్వనిగలదియు, మహాబలంబును, అక్షోభ్యంబునగు, సముద్రంబువంటివానరసేనం జూచిరి. అని,తాత్పర్యము.

తౌ దదర్శ మహాతేజాః ప్రచ్ఛన్నౌ చ విభీషణః. ౧౩

టీక॥మహాతేజాః= అధికమయిన కాంతిగల; విభీషణః= విభీషణుఁడు; ప్రచ్ఛన్నౌ=వానరవేషముచేఁ గప్పఁబడిన;తౌచ=ఆశుకసారణులనుం గూడ;దదర్శ=చూచెను.

ఆశుకసారణులువానరవేషంబుదాల్చియెంతప్రచ్ఛన్నులైయుండినను, మహాతేజుండగు విభీషణుండువారలం గనుంగొనెను.

అని, తాత్పర్యము.

ఆచచక్షే థ రామాయ గృహీత్వా శుకసారణౌ

టీక॥అథ=అంత;సః (అధ్యాహృతము)=ఆవిభీషణుఁడు;శుకసారణౌ=శుకసారణులను; గృహీత్వా = పట్టుకొని; రామాయ=రామునికొఱకు ;

ఆచచక్షే=చెప్పెను.

అంతనవ్విభీషణుండు, ఆశుకసారణులనిద్దఱంబట్టి రామునకుఁ దెలియఁజేసెను. అని, తాత్పర్యము.

పశ్యే మా రాక్షసేంద్రస్య మంత్రిణౌ శుకసారణౌ. ౧౪
లంకాయా స్సమనుప్రాప్తౌ చారౌ పరపురంజయ

టీక॥ పరపురంజయ = శత్రువులపట్టణంబులనుజయించునట్టి రాముఁడా! ఇమౌ=వీరలు; తస్య—ఆ; రాక్షసేంద్రస్య— రాక్షసేశ్వరుండగు రావణుని యొక్క; మంత్రిణౌ=మంత్రులు. శుకసారణౌ= శుకసారణులనుపేరుగలవారలు. లంకాయాః=లంకయందుండు; సమనుప్రాప్తౌ=వచ్చిన; చారౌ = వేగులవారలు.

శత్రుపట్టణంబులజయించునట్టి రాముఁడా! వీరలు, రాక్షసేశ్వరుండగు రావణునిమంత్రులు; శుకసారణులనంబడుదురు; లంకాపురినుండి, మనరహస్యంబులఁదెలిసికొని పోవుటకై వచ్చినవారలు. అని విభీషణుండు, రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తౌ దృష్ట్వా వ్యథితౌ రామం నిరాశౌ జీవితే తదా. ౧౫
కృతాంజలిపుటౌ భీతౌ వచనంచే ద మూచతుః

టీక॥ తదా—అప్పుడు; తౌ= ఆశుకసారణులు; రామం= రాముని; దృష్ట్వా=చూచి; వ్యథితౌ — దుఃఖితులయి; జీవితే = బ్రతుకునందు ; నిరాశౌ=ఆశలేనివారలయి; కృతాంజలిపుటౌ=చేయఁబడినదోప్పలవంటిచేమోడ్పులుగలవారలై ; భీతౌ=భయమునొందినవారలై ; ఇదం—ఈ; వచనం=మాటను; ఊచతుః=చెప్పిరి.

అప్పుడు, ఆశుకసారణులు , రాముంజూచి, పరమదుఃఖితులయి , బ్రతుకువిషయమయి యాశనువిడిచి, చేమోడ్పుగీలించి, భయంబున, నిట్లని , చెప్పిరి. అని, తాత్పర్యము.

ఆవా మిహ గతౌ సౌమ్య రావణప్రహితౌ వుభౌ. ౧౬
పరిజ్ఞాతుం బలం కృత్స్నం తవే దం రఘునందన

 

టీక॥ సౌమ్య=శాంతుండవగు; రఘునందన=రాముఁడా! ఆవాం=మేము; ఉభౌ=ఇద్దఱమును; తవ=నీయొక్క; ఇదం=ఈ; బలం=సైన్యమును; కృత్స్నం=అంతయును; పరిజ్ఞాతుం=ఎఱుంగుటకు; రావణప్రహితౌ=రావణునిచేఁ బంపఁబడినవారలమై; ఇహ=ఇచ్చటికి; ఆగతౌ=వచ్చినాము.

సౌమ్యుండవగు రాముఁడా! మేమిద్దఱమును, రావణునిచేఁ బంపఁబడి, మీ సైన్యంబులనంతయుఁ జూచుటకై యిచ్చటికి, వచ్చినాము. అని, శుకసారణులు, రామునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

తతో స్తద్వచనం శ్రుత్వా రామో దశరథాత్మజః ॥ ౧౭ ॥
అబ్రవీత్ప్రహసన్ వాక్యం సర్వభూతహితే రతః

టీక॥ సర్వభూతహితే=సమస్త భూతముల మేలునందు; రతః=ఆసక్తుఁడగు; దశరథాత్మజః=దశరథుని కొడుకైన; రామః=రాముఁడు; తయోః=ఆశుకసారణులయొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; ప్రహసన్=నవ్వుచు; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

సమస్త భూతంబులకు హితంబుఁ గోరునట్టి దశరథకుమారుఁడగు రాముండు, ఆశుకసారణులు చెప్పిన మాటను విని, నవ్వుచు, నీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

యది దృష్టం బలం కృత్స్నం వయం వా సుపరీక్షితాః ॥ ౧౮ ॥
యథోక్తం వా కృతం కార్యం ఛందతః ప్రతిగమ్యతామ్

టీక॥ కృత్స్నం=సమస్తమయిన; బలం=సైన్యము; దృష్టం యది=చూడఁబడినదగు నేని; వయం వా=మేమును; సుపరీక్షితాః (యది)=పరీక్షింపఁబడినవారలగుదుమేని; యథోక్తం=చెప్పఁబడినట్లు; కార్యం వా=పనియు; కృతం (యది)=చేయఁబడినదగు నేని; ఛందతః=ఇచ్ఛవలన; ప్రతిగమ్యతాం=మఱలిపోవుటయగుఁగాక.

మా సైన్యమునంతయుఁ జూచి, మ

 

మ్మంజక్కఁగాఁబరీక్షించి, రావణుండుచెప్పినట్లు పనియంతయునైనపిమ్మట, స్వేచ్ఛగామఱలమీలంకకుంబొండు. అని, తాత్పర్యము.

అథ కించి దదృష్టంవా భూయ స్త ద్ద్రష్టు మహార్థః. ౧౯
విభీషణోవా కార్త్స్న్యేన భూయ స్సందర్శయిష్యతి

టీక॥అథ=ఇంక; కించిత్=కొంచెము;అదృష్టంవా= చూడఁబడనిదగునేని; భూయః=మఱల;తత్= దానిని; ద్రష్టుం=చూచుటకు; అర్హథః=తగుదురు. విభీషణోవా= విభీషణుఁడైనను;కార్త్స్న్యేన=సాకల్యముచేత;భూయః=మఱల; సందర్శయిష్యతి= చూపఁగలఁడు.

మీకింకం గొంచెము చూడవలసియుండునేని, దానినింజూచుకొనుఁడు ; లేక,విభీషణుఁడే, మీకుసైన్యములనంతయుం జూపును.అని, తాత్పర్యము.

న చే దం గ్రహణం ప్రాప్య భేత్తవ్యం జీవితంప్రతి. ౨౦
న్యస్తశస్త్రౌ గృహీతౌవా న దూతౌ వధ మర్హతః

టీక॥ఇదం=ఈ;గ్రహణం=పట్టుపడుటను;ప్రాప్య=పొంది;జీవితంప్రతి= ప్రాణమునుగూర్చి;నభేత్తవ్యం=భయపడుటయక్కఱలేదు . న్యస్తశస్త్రౌ= విడువఁబడినయాయుధముగల; గృహీతౌవా = పట్టఁబడినవారలుగాని;దూతౌ=దూతలుగాని;వధం=చంపుటను; నార్హతః=పొందఁదగరు.

మీరలిప్పుడు మాచేఁబట్టుపడినారని, జీవితవిషయమయి యెంతమాత్రము భయపడవలదు;ఆయుధములేనివారలంగానిదూతలంగాని, వధింపఁగూడదు; మీరలునిరాయుధులుకావున,వధ్యులరుకారు.అని, తాత్పర్యము.

పృచ్ఛమానౌ విముంచైతౌ చారౌ రాత్రించరౌ వృథా. ౨౧
శత్రుపక్షస్య సతతం విభీషణ వికర్షణౌ

టీక॥విభీషణ=విభీషణుఁడా! పృచ్ఛమానౌ=అడుగుకొనుచున్న;సతతం =

ఎల్లప్పుడు ; శత్రుపక్షస్య = శత్రుపక్షముయొక్క; విక్షణౌ=ఆకర్షించుచునట్టి ; చారౌ=వేగులవారలైన; ఏతౌ=ఈ;రాత్రించరౌ= రాక్షసులను; ఉభౌ=ఇద్దఱను;విముంచ= విడువుము.

విభీషణుఁడా!వీరలుసామాద్యుపాయంబులశత్రుపక్షంబు నాకర్షించుచారులు , అయినను , అడుగుకొనుచున్నారుకావున , నీరక్షసులనిద్దఱు నువిడిచిపెట్టుము.అని, తాత్పర్యము.

ప్రవిశ్య నగరీం లంకాం భవద్భ్యాం ధనదానుజః. ౨౨
వక్తవ్యో రక్షసాం రాజా యథోక్తం వచనం మమ

టీక॥ భవద్భ్యాం= మీచేత; లంకాం=లంకయను ; నగరీం=పట్టణమును; ప్రవిశ్య = ప్రవేశించి; ధనదానుజః=కుబేరునితమ్ముఁడగు; రక్షసాం= రాక్షసులయొక్క; రాజా=రాజయినరావణుఁడు; మమ = నాయొక్క; వచనం=మాటను; యథోక్తం= చెప్పఁబడినమాట నతిక్రమింపక ; వక్తవ్యః=చెప్పఁబడవలసినవాఁడు.

శుకసారణులా!మీరలు, లంకాపురికిం బోయి,కుబేరునితమ్ముండును రాక్షసరాజుండునగురావణునింజూచి, నేనిప్పుడు చెప్పిపంపుమాటలన్నియు నించుమించు లేక, చెప్పవలయును.అని, తాత్పర్యము.

య ద్బలంచ సమాశ్రిత్య సీతాం మే హృతవా నసి. ౨౩
త ద్దర్శయ యథాకామం ససైన్య స్సహబాంధవః

టీక॥యత్=ఏ;బలంచ=బలమును; సమాశ్రిత్య=ఆశ్రయించి;మే=నాయొక్క;సీతాం=సీతను; హృతవాౕ = అపహరించినవాఁడవు; అసి=అగుచున్నావో; ససైన్యః= సైన్యములతోఁ గూడినవాఁడవై; సహబాంధవః=బంధువులతోఁగూడినవాఁడవై;యథాకామం=స్వేచ్ఛనతిక్రమింపక;తత్= ఆబలమును; దర్శయ=చూపుము.

నీవేబలంబునవలంబించి , నాభార్యనుసీతనపహరించితివో; ఇప్పుడునీ, సైన్యములను నీబంధువులనుం గూడి , యాబలంబునంతయుంజూపుము.
అని, తాత్పర్యము.

శ్వః కాల్యే నగరీం లంకాం సప్రాకారాం సతోరణామ్. ౨౪
రాక్షసం చ బలం పశ్య శరైర్విధ్వంసితం మయా

టీక॥ శ్వః=రేపు; కాల్యే=ప్రాతఃకాలమునందు; సప్రాకారాం=ప్రాకారములతోఁగూడినదియు; సతోరణాం=బహిర్ద్వారములతోఁగూడినదియునగు; లంకాం=లంకయను; నగరీం=పట్టణమును; రాక్షసం=రాక్షససంబంధియగు; బలంచ=సైన్యమును; మయా=నాచేత; శరైః=బాణములచేత; విధ్వంసితం=ధ్వంసము చేయఁబడినదానిఁగా; పశ్య=చూడుము.

రేపు ప్రాతఃకాలంబున, లంకాప్రాకారంబులను, బహిర్ద్వారంబులను, రాక్షససైన్యంబులను, బాణంబులచేనుగ్గుచేసెదంబాడుము. అని, తాత్పర్యము.

ఘోరం రోష మహం మోక్ష్యే బలం ధారయ రావణ. ౨౫
శ్వః కాలే వజ్రవాన్వజ్రం దానవేష్వివ వాసవః

టీక॥ రావణ=రావణుఁడా! శ్వః=రేపు; కాలే=ప్రాతఃకాలమునందు; అహం=నేను; ఘోరం=భయంకరమయిన; రోషం=కోపమును; వజ్రవాన్=వజ్రాయుధముగల; వాసవః=దేవేంద్రుఁడు; దానవేషు=దానవులయందు; వజ్రమివ=వజ్రాయుధమునువలె; మోక్ష్యే=విడువఁబోవుచున్నాను. బలం=బలమును; ధారయ=ధరింపుము.

రావణుఁడా! రేపు ప్రాతఃకాలమునందు, వజ్రాయుధధారియగునింద్రుండు, దానవులపై వజ్రాయుధముంబ్రయోగించునట్లు, మీపై, భయంకరంబగు నాకోపంబును సార్థకము చేయఁబోవుచున్నాను; జాగ్రత్తతో నుండుము. అని, రావణునితోఁజెప్పుఁడు. అని, శుకసారణులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి ప్రతిసమాదిష్టౌ రాక్షసౌ శుకసారణౌ. ౨౬
జయేతి ప్రతినంద్యైతౌ రాఘవం ధర్మవత్సలమ్
ఆగమ్య నగరీం లంకా మబ్రూతాం రాక్షసాధిపమ్

టీక॥ రాక్షసౌ=రాక్షసులయిన; ఏతౌ=ఈ; శుకసారణౌ = శుకసారణులు; ఇతి=ఇట్లు; ప్రతిసమాదిష్టౌ=అజ్ఞాపింపఁబడినవారలయి; ధర్మవత్సలం=ధర్మమునందతిప్రీతిగల; రాఘవం=రాముని; జయ=జయింపుము; ఇతి= అని ; ప్రతినంద్య = అభినందించి ; లంకాం = లంకాపురిని; ఆగమ్య=పొంది ; రాక్షసాధిపం= రాక్షసులకుఁ బ్రభుండగు రావణునిగూర్చి; అబ్రూతాం=చెప్పిరి.

ఆశుకసారణులు, రాముండు చెప్పిన మాటలనువిని, ధర్మవత్సలుండగు రాముని జయశబ్దంబులంబొగడి, లంకాపురికింబోయి, రాక్షసేశ్వరుండగు రావణునింజూచి, యిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

విభీషణగృహీతౌతు వధార్హౌ రాక్షసేశ్వర
దృష్ట్వా ధర్మాత్మనా ముక్తౌ రామేణాఽమితతేజసా. ౨౮

టీక॥ రాక్షసేశ్వర = రాక్షసనాథుండవగు రావణుఁడా ! విభీషణగృహీతౌతు=విభీషణునిచేఁ గ్రహింపఁబడినవారలము ; వధార్హౌ = చంపుటకుఁదగినవారలమునగు; ఆవాం(అధ్యాహృతము) = మేము; ధర్మాత్మనా=ధర్మస్వభావుండగు; అమితతేజసా=కొలందిలేనిప్రతాపముగల; రామేణ=రామునిచేత; దృష్ట్వా=చూచి; ముక్తౌ=విడువఁబడినాము.

రాక్షసనాథుండవగు రావణుఁడా! మేము వానరసేనం బ్రవేశించినవెనుక, మమ్ము విభీషణుండు పట్టుకొని, రాముని యొద్దకుఁదీసికొనిపోయెను ; ధర్మాత్ముండును మహానుభావుండునగు రాముండు మమ్ముఁ జూచి, దయచేవిడిచిపెట్టెను. అని, తాత్పర్యము.

ఏకస్థానగతా యత్ర చత్వారః పురుషర్షభాః
లోకపాలోపమాః శూరాః కృతాస్త్రా దృఢవిక్రమాః. ౨౯
రామో దాశరథిః శ్రీమాన్ లక్ష్మణశ్చ విభీషణః
సుగ్రీవశ్చ మహాతేజా మహేంద్రసమవిక్రమః. ౩౦

టీక॥యత్ర= ఏవానరసేనయందు; లోకపాలోపమాః = దిక్పాలురతోఁ బోల్కిగలవారలును; శూరాః= యుద్ధమునందుభయములేనివారలును; కృతాస్త్రాః = నేర్వఁబడినయస్త్రములు గలవారలును; దృఢవిక్రమాః=స్థిరమయినపరాక్రమముగలవారలును; పురుషర్షభాః=పురుషశ్రేష్ఠులనగు; దాశరథిః=దశరథునికుమారుండును; శ్రీమాన్=అందఱికన్న నధికుండయిన ; రామః=రాముండును; లక్ష్మణశ్చ = లక్ష్మణుండును; విభీషణశ్చ = విభీషణుండును; మహాతేజాః= అధికమయినకాంతిగలవాఁడును ; మహేంద్రసమవిక్రమః = దేవేంద్రునితో సమానమయిన పరాక్రమముగలవాఁడునగు; సుగ్రీవశ్చ=సుగ్రీవుండును; చత్వారః= నల్వురును; ఏకస్థానగతాః = ఒకస్థానమునొందినవారలో; సా(అధ్యాహృతము)=అట్టివానరసేన; విరాజతే(అధ్యాహృతము)=ప్రకాశించుచున్నది.

శ్రీమంతుండగు రాముండును లక్ష్మణుండును విభీషణుండును మహాతేజుండును దేవేంద్రునకుంబోలెఁ బరాక్రమముగలవాఁడునగు సుగ్రీవుండును లోకపాలురవంటివారలును, శూరులును అస్త్రవేత్తలును మహాపరాక్రమశాలులునగు పురుషశ్రేష్ఠులు, ఈనల్వురును, ఒకటఁజేరఁగూడియున్నారే! ఇంకనవ్వానరసేనకేమి తక్కువ?

అని, తాత్పర్యము.

ఏతే శక్తాః పురీం లంకాం సప్రాకారాం సతోరణామ్
ఉత్పాట్య సంక్రామయితుం సర్వే తిష్ఠంతు వానరాః. ౩౧

టీక॥వానరాః=వానరులు;సర్వే—అందఱును; తిష్ఠంతు—ఉందురుగాక. ఏతే= ఈనల్వురు; సప్రాకారాం = ప్రాకారములతోఁ గూడినదియు ; సతోరణాం=బహిర్ద్వారములతోఁగూడినదియునగు; లంకాం= లంకయను; పురీం=పట్టణమును; ఉత్పాట్య= పెల్లగించి; సంక్రామయితుం=మఱియొకచోనుంచుటకు; శక్తాః = సమర్థులు.

వానరులందఱునట్లుందురుగాక;ఈ రామలక్ష్మణవిభీషణసుగ్రీవులు,నల్వురు మాత్రమె, ప్రాకారతోరణంబులతోఁ గూడ,నీలంకాపురినంతయుం బెల్లగిం

చి,కొనిపోఁగలరు. అని, తాత్పర్యము.

యాదృశం తస్య రామస్య రూపం ప్రహరణానిచ
వధిష్యతి పురీం లంకా మేక స్తిష్ఠంతు తే త్రయః. ౩౨

టీక॥తస్య—ఆ; రామస్య=రాముని యొక్క; రూపం=ఆకారము; యాదృశం=ఎట్టిదో; ప్రహరణానిచ=ఆయుధములును; యాదృశాని (అధ్యాహృతము)=ఎట్టివో; తేషాం (అధ్యాహృతము)=వానియొక్క; అవలోకనే(అధ్యాహృతము)=చూచుటకాఁగా; తే=ఆ; త్రయః=ముగ్గురును; తిష్ఠంతు=ఉందురుగాక. ఏకః=ఒకఁడె; లంకాం=లంకయను; పురీం=పట్టణమును; వధిష్యతి—వధింపఁగలఁడు. ఇతిమన్యావహే(అధ్యాహృతము)=అని, తలంచెదము.

రామునిరూపంబును ఆయుధంబులనుంజూడఁగా, నాలక్ష్మణవిభీషణసుగ్రీవులుగూడ, ఎందుకు? రాముండొక్కఁడెలంకాపురినంతయు నశింపఁజేయఁగలఁడనితోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

రామలక్ష్మణగుప్తా సా సుగ్రీవేణచ వాహినీ
బభూవ దుర్ధర్షతరా సేంద్రైరపి సురాసురైః. ౩౩

టీక॥సా=ఆ; వాహినీ=వానరసేన; రామలక్ష్మణగుప్తా=రామలక్ష్మణులచేరక్షింపఁబడినదై; సుగ్రీవేణచ= సుగ్రీవునిచేతను; (గుప్తా) రక్షింపఁబడినదై, సేంద్రైః=ఇంద్రునితోఁగూడిన; సురాసురైరపి= దేవతలచేతను అసురులచేతను ; దుర్ధర్షతరా=ఎంతమాత్రమెదిరింప నలవిగానిది; బభూవ=అయినది.

రామలక్ష్మణులును సుగ్రీవుండునురక్షింపఁగా నావానరసేన, ఇంద్రునితోఁగూడిన దేవాసురులకైనను, ఎంతమాత్రమునెదిరింపనలవిగాకున్నది.

అని, తాత్పర్యము.

వ్యక్త స్సేతు స్తథా బద్ధో దశయోజనవిస్తృతః
శతయోజన మాయామ స్తీర్ణా సేనాచ సాగరమ్

టీక॥ తథా = అట్లు; దశయోజనవిస్తృతః = పదియోజనముల వెడల్పుగలదియు; శతయోజనం = నూఱుయోజనములు; ఆయామః = నిడుపయినదియునగు; సేతుః = సేతువు; వ్యక్తః = స్పష్టముగా; బద్ధః = కట్టఁబడినది. సేనాచ = సేనయు; సాగరం = సముద్రమును; తీర్ణా = దాఁటినది.

అట్లు, పదియోజనంబుల వెడల్పును నూఱుయోజనంబుల నిడుపునుంగల సేతువు, సముద్రంబునందు, స్పష్టముగాఁగట్టఁబడినది; వానరసేనయు, సముద్రంబు దాఁటినది. అని, తాత్పర్యము.

"వ్యక్తస్సేతుః" అనుశ్లోకము మొదలు రెండుశ్లోకములు, వ్యాఖ్యానంబులలెక్కింపఁబడనందున, ఇందును లెక్కింపఁబడవయ్యె.

నివిష్టో దక్షిణే తీరే రామ స్సచ నదీపతేః
తీర్ణస్య తరమాణస్య బలస్యాంతో న విద్యతే

టీక॥ సః = ఆ; రామశ్చ = రాముండును; నదీపతేః = సముద్రముయొక్క; దక్షిణే = దక్షిణపువైపునందలి; తీరే = గట్టున; [illegible] నివిష్టః = విడిసియున్నవాఁడు; తీర్ణస్య = దాఁటినదియును; తరమాణస్య = దాఁటుచున్నదియునగు; బలస్య = సైన్యమునకు; అంతః = తుద; నవిద్యతే = లేదు.

రాముండు, సముద్రదక్షిణతీరంబున విడిసియున్నాఁడు; సైన్యములు, కొంత దాఁటియుఁ గొంత దాఁటుచు నున్నవి; దానికంత మే లేదు.

అని, తాత్పర్యము.

ప్రహృష్టరూపా ధ్వజినీ వనౌకసాం
మహాత్మనాం సంప్రతి యోద్ధు మిచ్ఛతామ్
అలం విరోధేన శమో విధీయతాం
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. ౩౪

టీక॥ సంప్రతి = ఇప్పుడె; యోద్ధుం = యుద్ధము సేయుటకు; ఇచ్ఛతాం = కోరుచున్నవారలును; మహాత్మనాం = అధికమయినబలముగలవారలునగు; వ

నౌకసాం=వానరుల యొక్క; ధ్వజినీ=సేన; ప్రహృష్టరూపా=సంతోషంబు నొందినరూపముగలది. విరోధేన=విరోధముచేత; అలం=చాలును. శమః=శాంతి; విధీయతాం = చేయఁబడుఁగాక. దాశరథాయ= దశరథుని కొడుకైన రామునికొఱకు; మైథిలీ=సీత; ప్రదీయతాం= ఇయ్యఁబడుఁగాక.

మహాబలశాలులగు వానరవీరుల దఱు, ఇప్పుడె యుద్ధంబు సేయఁ గోరుచుఁ, బరమోత్సాహంబునను న్నవారలు; కావున, వారలతో విరోధంబు వలదు; కోపంబు విడిచి, రామునకు సీతాదేవి నొసంగుము. అని, శుకసారణులు, రావణునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

యుద్ధకాండే, పంచవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ పంచవింశసర్గటీక,

ముగిసినది.

---



శ్రీ

## షడ్వింశసర్గప్రారంభః.

తద్వచః పథ్యమక్లీబం సారణేనాభిభాషితమ్
నిశమ్య రావణో రాజా ప్రత్యభాషత సారణమ్. ౧

టీక॥ రాజా=రాక్షసరాజుండగు; రావణః=రావణుండు; సారణేన=సారణునిచేత; అభిభాషితం=చెప్పంబడిన; పథ్యం=హితంబును; అక్లీబం=నిర్భయమునగు; తత్=ఆ; వచః=మాటను; నిశమ్య=విని; సారణం=సారణునిగూర్చి; ప్రత్యభాషత=బదులుచెప్పెను.

రాక్షసరాజుండగురావణుండు, శుకసారణులు నిర్భయంబుగాఁ జెప్పిన హితంబగునామాటనువిని, సారణుం జూచి, యిట్లని, బదులుచెప్పెను.

అని, తాత్పర్యము.

యది మామభియుద్ధ్యేరన్ దేవగంధర్వదానవాః
నైవసీతాం ప్రదాస్యామి సర్వలోకభయాదపి. ౨

టీక॥ దేవగంధర్వదానవాః=దేవతలును గంధర్వులును దానవులును; మాం=నన్నుఁగూర్చి; అభియుద్ధ్యేరన్ యది=యుద్ధముసేయుదురేని; తదాపి (అధ్యాహృతము)=అప్పుడును; సర్వలోకభయాదపి=సమస్తలోకంబులవలనిభయంబువలనను; సీతాం=సీతను; నైవప్రదాస్యామి=ఇవ్వనేఇవ్వను.

దేవతలునుగంధర్వులునుదానవులును, అందఱునొకటఁబెట్టి నాపైకి యుద్ధమునకువచ్చినను, సమస్తలోకంబులును నన్నుభయపఱచినను, నేనెంతమాత్రముసీతనొసంగను.

అని, తాత్పర్యము.

త్వంతు సౌమ్య పరిత్రస్తో హరిభిర్నిర్జితో భృశమ్
ప్రతిప్రదానమద్యైవ సీతాయాః సాధు మన్యసే. ౩

టీక॥ సౌమ్యః=శాంతుండవగు సారణుఁడా!త్వంతు= నీవుమాత్రము;హరిభిః=వానరులచేత;నిర్జితః = జయింపఁబడినవాఁడవై;భృశం = మిక్కిలియు;పరిత్రస్తః= భయపడినవాఁడవై;అద్యైవ=ఇప్పుడె;సీతాయాః=సీతాదేవియొక్క; ప్రతిప్రదానం=మఱలనిచ్చుటను;సాధు=మంచిదిగా ; మన్యసే=తలంచుచున్నావు.

సారణుఁడా ! నీవుసౌమ్యుండవు, శూరుండవుకావు;వానరులచే దెబ్బలుదిని, మిక్కిలియుభయంబుఁ జెందియున్నావు,కావున, నీవు,ఇప్పుడెసీతనిచ్చివేయుటమంచిదనిచెప్పుచున్నావు.

అని, తాత్పర్యము.

**కో హి నామ సపత్నో మాం సమరే జేతు మర్హతి**

టీక॥కోహినామ = ఎవ్వఁడు;సపత్నః=శత్రువు; మాం=నన్ను;సమరే=యుద్ధమునందు;జేతుం=జయించుటకు;అర్హతి=తగును?

నన్నుయుద్ధంబున,శత్రుండెవ్వఁడు జయింపఁగలఁడు ? అని,రావణుండు, సారణునితోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణో రాక్షసాధిపః. ౪
ఆరురోహ తత శ్శ్రీమాన్ ప్రాసాదం హిమపాండరమ్
బహుతాలసముత్సేధం రావణో థ దిదృక్షయా. ౫

టీక॥ రాక్షసాధిపః=రాక్షసులకుఁ ప్రభుండగు;రావణః=రావణుండు; ఇతి=ఇట్లు;పరుషం = కఠినమయిన;వాక్యం=మాటను;ఉక్త్వా=చెప్పి; తతః=అంత;అథ=పిమ్మట; శ్రీమాన్=కాంతిమంతుండగు; రావణః=రావణుఁడు;దిదృక్షయా=చూడనిచ్ఛచేత;హిమపాండరం=మంచువలెఁదెల్లనిదియు, బహుతాలసముత్సేధం= పెక్కుతాటిచెట్లయౌన్నత్యము గలదియునగు; ప్రాసాదం=మేడను;ఆరురోహ=ఎక్కెను.

రాక్షసేశ్వరుండును శ్రీమంతుండునగు రావణుండు, ఈప్రకారంబునఁబరుషంబుగాఁజెప్పి, వానరసైన్యంబులనంతయుంజూడఁగోరి, మంచువలెఁదెల్లగానున్నపెక్కుతాటిచెట్ల యౌన్నత్యము

కలప్రాసాదంబుపైకినారోహించెను. అని, తాత్పర్యము.

తాభ్యాం చరాభ్యాం సహితో రావణః క్రోధమూర్ఛితః
పశ్యమాన స్సముద్రంచ పర్వతాంశ్చ వనానిచ. ౬
దదర్శ పృథివీదేశం సుసంపూర్ణం ప్లవంగమైః

టీక॥ రావణః=రావణుఁడు; క్రోధమూర్ఛితః=కోపముచేవ్యాపింపఁబడినవాఁడై; తాభ్యాం=ఆ; చరాభ్యాం=చారులగు; తాభ్యాం= ఆశుకసారణులతో; సహితః=కూడినవాఁడై; సముద్రంచ = సముద్రమును; పర్వతాంశ్చ=పర్వతములను; వనానిచ= అడవులను; పశ్యమానః(పశ్యన్)=చూచుచు; ప్లవంగమైః= వానరులచేత ; సుసంపూర్ణం=చక్కఁగానిండిన ; పృథివీదేశం=భూమిప్రదేశమును; దదర్శ=చూచెను.

రావణుండు , మిక్కిలియుఁగుపితుండై, యాశుకసారణులంగూడి,ప్రాసాదంబుపైనుండి , సముద్రంబునుబర్వతంబులనువనంబులనుంజూచుచు,భూమియంతయు , వానరులచేనిండియుండుటంజూచెను.అని, తాత్పర్యము.

తదపార మసంఖ్యేయం వానరాణాం మహద్బలమ్. ౭
ఆలోక్య రావణో రాజా పరిపప్రచ్ఛ సారణమ్

టీక॥ రాజా = రాజయిన; రావణః=రావణుఁడు; అపారం=తుదలేనిదియు; అసంఖ్యేయం= లెక్కపెట్టఁగూడనిదియునగు; వానరాణాం= వానరులయొక్క; మహత్=గొప్పదగు;బలం=సైన్యమును; ఆలోక్య = చూచి; సారణం=సారణుని; పరిపప్రచ్ఛ=అడిగెను.

రాక్షసరాజుండగురావణుండు, అపారంబునులెక్కపెట్టనలవిగానిదియునగునావానరసేనంజూచి, సారణుని , ఇట్లని, యడిగెను.అని, తాత్పర్యము.

ఏషాం వానరముఖ్యానాం కే శూరాః కే మహాబలాః. ౮

టీక॥ ఏషాం=ఈ ; వానరముఖ్యానాం= వానరశ్రేష్ఠులలో ; శూరాః =

యుద్ధమునందు భయములేనివారలు ; కే=ఎవ్వరు? మహాబలాః=అధికమయినబలముగలవారలు; కే=ఎవ్వరు? ఈవానరోత్తములలో, నెవ్వరు శూరులు? ఎవ్వరుబలవంతులు? అని, తాత్పర్యము.

కే పూర్వ మభివర్తంతే మహోత్సాహాః సమంతతః

టీక॥ కే=ఎవ్వరు ; మహోత్సాహాః=అధికమయినయుత్సాహముగలవారలయి; సమంతతః= అంతటను; పూర్వం=ముందుగా; అభివర్తంతే=నిలుతురు? వీరలలో, అధికోత్సాహంబున, యుద్ధంబున ముందు నిలుచు వారలెవ్వరు? అని, తాత్పర్యము.

కేషాం శృణోతి సుగ్రీవః కేవా యూథపయూథపాః. ౯

టీక॥సుగ్రీవః= సుగ్రీవుఁడు ; కేషాం=ఎవ్వరియొక్క;వచనం (అధ్యాహృతము)=మాటను;శృణోతి= వినును. కేవా=ఎవ్వరు ; యూథపయూథపాః = సేనానాయకులకునునాయకులు? సుగ్రీవుండిందెవ్వరి మాటలనువినును? మఱియువీరిలో,నగ్రసేనానాయకులెవ్వరు? అని, తాత్పర్యము.

సారణాచక్ష్వ తత్త్వేన కే ప్రధానాః ప్లవంగమాః

టీక॥ సారణ = సారణుఁడా! ప్రధానాః=ఉత్తములగు; ప్లవంగమాః=వానరులు; కే=ఎవ్వరు? తత్త్వేన = యాథార్థ్యముచేత; ఆచక్ష్వ = చెప్పుము? సారణుఁడా! వీరిలోముఖ్యులగువానరులెవ్వరు? ఈసంగతులన్నియుయథార్థంబుగా నాకుఁజెప్పుము.అని,రావణుండు, సారణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

సారణో రాక్షసేంద్రస్య వచనం పరిపృచ్ఛతః. ౧౦
ఆచచక్షేథ ముఖ్యజ్ఞో ముఖ్యాం స్తాంస్తు వనౌకసః

స ౨౬

టీక॥ ముఖ్యజ్ఞః=వానరులలో ముఖ్యులగువానరుల నెఱింగినట్టి ; సారణః=సారణుఁడు; పరిపృచ్ఛతః=అడుగుచున్న;రాక్షసేంద్రస్య= రాక్షసేశ్వరుండగురావణునియొక్క ; వచనం=మాటను;శ్రుత్వా(అధ్యాహృతము)=విని;అథ=పిమ్మట;ముఖ్యాన్= ముఖ్యులయిన; తాన్=ఆ;వనౌకసస్తు= వానరులనుమాత్రము; ఆచచక్షే = చెప్పెను.

వానరులలోముఖ్యులగువానరులందెలిసికొనివచ్చినట్టిసారణుండు , రావణునిప్రశ్ననువిని, యంత, నవ్వానరులలోముఖ్యులగువానరులను , రావణునకుఁజెప్పనారంభించెను.

అని, తాత్పర్యము.

ఏష యోభిముఖో లంకాం నదఞ్ స్తిష్ఠతి వానరః.౧౧
యూథపానాం సహస్రేణ శతేన పరివారితః
యస్యఘోషేణ మహతా స ప్రాకారా సతోరణా. ౧౨
లంకా ప్రవేపతే సర్వా సశైలవనకాననా
సర్వశాఖామృగేంద్రస్యసుగ్రీవస్య మహాత్మనః. ౧౩
బలాగ్రే తిష్ఠతే వీరో నీలోనా మైష యూథపః

టీక॥యః=ఏ; ఏషః=వీఁడు;యూథపానాం=సేనాపతులయొక్క; సహస్రేణ=వేయింటిచేతను;శతేన= నూఱింటిచేతను; పరివారితః=పరివేష్టింపఁబడినవాఁడై;లంకాం=లంకనుగూర్చి; అభిముఖః=ఎదురుమొగముగలవాఁడై; నదన్=అఱచుచు;తిష్ఠతి = ఉన్నాఁడో;యస్య=ఎవ్వనియొక్క;మహతా=అధికమయిన; ఘోషేణ=ధ్వనిచేత; సప్రాకారా= ప్రాకారములతోఁగూడినదియు; సతోరణా=బహిర్ద్వారములతోఁగూడినదియు ; సశైలవనకాననా= పర్వతములతోనువనములతోనుంగూడినదియునగు;లంకా= లంకాపురి; సర్వా=అంతయు;ప్రవేపతే=చలించుచున్నదో;యః(అధ్యాహృతము)= ఎవ్వఁడు;సర్వశాఖామృగేంద్రస్య=సమస్తవానరులకునునాథుండును; మహాత్మనః = అధికమయినబలముగలవాఁడునగు;సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క; బలాగ్రే=సేనాముఖమునందు;తిష్ఠతే (తిష్ఠతి)=ఉన్నాఁడో;వీరః=పరాక్రమశాలి

యగు; ఏషః=ఈవానరుఁడు; నీలోనామ=నీలుండను పేరుగల; యూథపః=యూథపశ్రేష్ఠుఁడు.

ఎవ్వండు, వేనవేలయూథపులంగూడి, లంకాపురాభిముఖుండై, సింహనాదంబు సేయుచున్నాఁడో, ఎవ్వనిమహానినాదంబునకు, లంకాపురి యంతయుఁబ్రాకారతోరణంబులతోను బర్వతవనంబులతోనుంగూడ గడగడవడంకుచున్నదో, ఎవ్వండు, సమస్తవానరనాథుండును మహాబలుండునగు సుగ్రీవుని, సేనయగ్రభాగంబున నున్నాఁడో, అట్టిమహాపరాక్రమశాలియగు నీ వానరోత్తముఁడు, నీలుండు; ఇతండు వానరసేనానాయకుండు. అని, తాత్పర్యము.

బాహూ ప్రగృహ్య యః పద్భ్యాం మహీం గచ్ఛతి వీర్యవాన్. ౧౪
లంకా మభిముఖః క్రోధా దభీక్ష్ణంచ విజృంభతే
గిరిశృంగప్రతీకాశః పద్మకింజల్కసన్నిభః. ౧౫
స్ఫోటయ త్యభిసంరబ్ధో లాంగూలంచ పునఃపునః
యస్య లాంగూల శబ్దేన స్వనంతి ప్రదిశో దశ. ౧౬
ఏష వానరరాజేన సుగ్రీవేణాభిషేచితః
యౌవరాజ్యం గదో నామ త్వా మాహ్వయతి సంయుగే. ౧౭
వాలిన స్సదృశః పుత్ర స్సుగ్రీవస్య సదాప్రియః
రాఘవార్థే పరాక్రాంత శ్శక్రార్థే వరుణో యథా. ౧౮

టీక॥ యః=ఏ; వీర్యవాన్=పరాక్రమవంతుఁడు; బాహూ=చేతులను; ప్రగృహ్య=పైకెత్తి; పద్భ్యాం=పాదములచేత; మహీం=భూమిని; గచ్ఛతి=పొందుచున్నాఁడో; క్రోధాత్=కోపమువలన; లంకాం=లంకాపట్టణమునుగూర్చి; అభిముఖః=ఎదురుముఖముగలవాఁడై; అభీక్ష్ణంచ=మికిలియు; విజృంభతే=విజృంభించుచున్నాఁడో; గిరిశృంగప్రతీకాశః=పర్వతశిఖరముతో సమానుఁడును; పద్మకింజల్కసన్నిభః=తామరపూల సరములతో సమానుఁడునగు; యః (అధ్యాహృతము)=ఎవ్వఁడు; అభిసంరబ్ధః=వేగముతోఁగూడినవాఁడై; పునఃపునః=మాటిమాటికి; లాంగూలంచ=తోఁ




కను;స్ఫోటయతి= కొట్టుచున్నాఁడో; యస్య=ఎవ్వనియొక్క; లాంగూలశబ్దేన=తోఁకయొక్కధ్వనిచేత; దశ = పదియగు; ప్రదిశః=దిక్కులు;స్వనంతి=ధ్వనించుచున్నవో; ఏషః= ఈవానరవీరుండు; అంగదోనామ=అంగదుండనుపేరుగలవాఁడు;వానరరాజేన= వానరనాథుండగు;సుగ్రీవేణ= సుగ్రీవునిచేత;యౌవరాజ్యే=యువరాజుదొరతనమునందు;అభిషేచితః=అభిషేకింపఁబడినవాఁడు. త్వాం=నిన్ను ; సంయుగే=యుద్ధము నిమిత్తమయి ; ఆహ్వయతి=పిలుచుచున్నాఁడు . వాలినః=వాలియొక్క; సదృశః=సమానుఁడగు; పుత్రః=కొడుకు. సుగ్రీవస్య=సుగ్రీవునికి;సదా=ఎల్లప్పుడును; ప్రియః= ఇష్టుండు. శక్రార్థే=ఇంద్రకార్యమునిమిత్తమయి;వరుణోయథా=వరుణుండువలె; రాఘవార్థే= రామకార్యనిమిత్తమయి; పరాక్రాంతః= పరాక్రమించియున్నవాఁడు.

ఎవ్వండు,చేతులుపైకెత్తి నిలుచుండియున్నాఁడో,మఱియుఁ , క్రుద్ధుండై,లంకాపురింజూచుచు, విజృంభించుచు,దశదిశలం బ్రతిధ్వనులు పిక్కటిల్ల, లాంగూలంబున నేలం గొట్టుచున్నాఁడో,అట్టి,పర్వతశిఖరాకారుండునుగమలకేసరవర్ణుండునగు నీవానరవీరుండు అంగదుఁడు;వానరరాజుండగుసుగ్రీవునిచేవానర యౌవరాజ్యంబున నభిషిక్తుండయినవాఁడు; నీతోయుద్ధంబుసేయవలెననియున్నాఁడు; ఇతండు,వాలికుమారుఁడు;వాలియంతటివాఁడు; దేవేంద్రునినిమిత్తమయివరుణుండుం బోలె, రామునినిమిత్తమయిపరాక్రమంబుఁజూపనిశ్చయించియున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఏతస్య సా మతి స్సర్వా యద్దృష్టా జనకాత్మజా
హనూమతా వేగవతా రాఘవస్య హితైషిణా. ౧౯

టీక॥ రాఘవస్య=రామునియొక్క; హితైషిణా=మేలుగోరువాఁడును; వేగవతా= అధికమయినవేగముగలవాఁడునగు;హనూమతా=హనుమంతునిచేత;జనకాత్మజా=జనకమహారాజుకూఁతురయినసీతాదేవి ; దృష్టా(ఇతి)యత్ = చూడఁబడినదియనునదియేదిగలదో;సా=ఆ;మతిః=బుద్ధి;సర్వా=అంత



యు; ఏతస్య=ఇతనిది.

రామహితంబునుగోరువాఁడును వేగవంతుండునగు హనుమంతుండు లంకకు వచ్చి సీతం జూచినాఁడే! అందుకంతయును ఇతని బుద్ధియే కారణము.

అని, తాత్పర్యము.

బహూని వానరేంద్రాణా మేష యూథాని వీర్యవాన్
పరిగృహ్యాభియాతి త్వాం స్వేనానీకేన దుర్జయః. ౨౦

టీక॥ వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగలవాఁడును; దుర్జయః=జయింపనలవిగానివాఁడునగు; ఏషః=ఈ యంగదుండు; బహూని=పెక్కులయిన; వానరేంద్రాణాం= వానరశ్రేష్ఠులయొక్క; యూథాని= గుంపులను; పరిగృహ్య=తీసికొని; స్వేన=తనదైన; అనీకేన=సైన్యముతో; సహితః (అధ్యాహృతము)=కూడినవాఁడై; త్వాం=నిన్నుఁగూర్చి; అభియాతి = వచ్చుచున్నాఁడు.

పరాక్రమవంతుండగు నీయంగదుండు, వానరోత్తముల సైన్యములనేకంబులందీసికొని, తనసైన్యంబునుంగూడి, దుర్జయుండై, నీపైకివచ్చుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

అను వాలిసుతస్యాపి బలేన మహతా వృతః
వీర స్తిష్ఠతి సంగ్రామే సేతుహేతు రయం నళః. ౨౧

టీక॥ వాలిసుతస్యాపి=వాలికుమారుండగునంగదునకును; అను=వెనుక; అయం=ఈ; సేతుహేతుః = సేతువునకుఁగారణమయిన; వీరః=పరాక్రమవంతుండగు; నలః=నలుండు; మహతా=అధికమయిన; బలేన = సైన్యముచేత; వృతః = చుట్టఁబడినవాఁడై; సంగ్రామే= యుద్ధము నిమిత్తమయి; తిష్ఠతి = ఉన్నాఁడు.

వాలికుమారుండగు నంగదునకు వెనుక, మహాబలపరివృతుండైన నలుండున్నవాఁడు; ఇతండె, సముద్రమునందు సేతువును నిర్మించినవాఁడు; మహాపరాక్రమశాలి. అని, తాత్పర్యము.

యేతు విష్టభ్య గాత్రాణి క్ష్వేళయంతి నదంతి చ

ఉత్థాయచ విజృంభంతే క్రోధేన హరిపుంగవాః. ౨౨
ఏతే దుష్ప్రసహా ఘోరా శ్చండా శ్చండపరాక్రమాః
అష్టౌ శతసహస్రాణి దశ కోటిశతానిచ. ౨౩
య ఏన మనుగచ్ఛంతి వీరా శ్చందనవాసినః

టీక॥ వీరాః = పరాక్రమవంతులును; చందనవాసినః = చందనవనమునం దుండువారలునగు; యే=ఎవ్వరు; ఏనం=ఈనలుని; అనుగచ్ఛంతి=వెంబడించుచున్నారో; యే=ఏ; హరిపుంగవాః=వానరశ్రేష్ఠులును; గాత్రాణి=దేహములను; విష్టభ్య=నిగుడ్చుకొని; క్ష్వేళయంతి = సింహనాదముసేయుచున్నారో; నదంతిచ = అఱచుచున్నారో; ఏతే =ఈ; అష్టౌ=ఎనిమిది; శతసహస్రాణి= లక్షలును; దశ=పది ; కోటిశతానిచ=నూఱుకోటులును; దుష్ప్రసహాః= సహింపనలవిగానివారలు. ఘోరాః= భయంకరులు. చండాః=క్రూరులు. చండపరాక్రమాః= భయంకరపరాక్రమముగలవారలు.

ఎవ్వరు, ఈనలునివెంబడించి యున్నారో, మఱియునే వానరోత్తములు దేహములునిగుడజేసి, సింహనాదంబుసేయుచు లేచిక్రోధంబునలంకాభిముఖులయివిజృంభించుచున్నారో; ఈపది నూఱుకోటుల నెనిమిదిలక్షల వానరులు; చందనవనంబుననుండువారు; మిక్కిలియుఁబరాక్రమవంతులు; భయంకరాకారులు; అతిక్రూరులు, వీరలజయింపనలవిగాదు. అని, తాత్పర్యము.

ఏషైవా శంసతే లంకాం స్వేనానీకేన మర్దితుమ్. ౨౪

టీక॥ ఏషైవ(ఏషఏవ)= ఈనలుఁడే; స్వేన=తనదైన; అనీకేన= సైన్యముచేత ; లంకాం= లంకను; మర్దితుం=మర్దించుటకు; ఆశంసతే=కోరుచున్నాఁడు.

ఈనలుండు, తానొక్కఁడె, తన సేనఁగూడి, లంకాపురినిమర్దింపంగోరుచున్నాఁడు.అని, తాత్పర్యము.

శ్వేతో రజతసంకాశ శ్చపలో భీమవిక్రమః
బుద్ధిమాన్ వానరో వీర స్త్రిషు లోకేషు విశ్రుతః. ౨౫

టీక॥ అయం(అధ్యాహృతము) = ఈ; వానరః=వానరుఁడు ; రజతసంకాశః= వెండితోసమానుండును ; చపలః=చంచలుండును; భీమవిక్రమః = భయంకరమయినపరాక్రమముగలవాఁడును; బుద్ధిమాన్= అధికమయినబుద్ధిగలవాఁడును; వీరః= పరాక్రమశాలియును; త్రిషు=మూఁడైన;లోకేషు=లోకములయందు;విశ్రుతః= ప్రసిద్ధుండు.నగు; శ్వేతః = శ్వేతుండనువాఁడు.

వెండివలెఁదెల్లనైన దేహముగల యీవానరుఁడు, శ్వేతుండు ; ఇతండు, మిక్కిలియు,యుద్ధచపలుండు;భయంకరంబయినపరాక్రమంబుగలవాఁడు;బుద్ధిమంతుండని, ముల్లోకంబులం బ్రసిద్ధివహించినవాఁడు.

అని, తాత్పర్యము.

తూర్ణం సుగ్రీవ మాగమ్య పునర్గచ్ఛతి సత్వరః
విభజన్ వానరీం సేనా మనీకాని ప్రహర్షయన్. ౨౬

టీక॥ అయం(అధ్యాహృతము) = ఇతఁడు; తూర్ణం=శీఘ్రముగా ; సుగ్రీవం=సుగ్రీవుని; ఆగమ్య=పొంది; సత్వరః = త్వరతోఁగూడినవాఁడై;వానరీం=వానరసంబంధియగు; సేనాం= సేనను; విభజన్=విభజించుచు ; అనీకాని=సేనలను; ప్రహర్షయన్=సంతసింపఁజేయుచు; పునః=మఱల;గచ్ఛతి=పోవుచున్నాఁడు.

శ్వేతుండు, శీఘ్రంబునసుగ్రీవునొద్దకువచ్చి,మఱల, వానరసేనలవిభజించుచు,సైనికులంబ్రోత్సాహపఱుచుచు, సత్వరుండైపోవుచున్నాఁడు, చూడుము.

అని, తాత్పర్యము.

యః పురా గోమతీతీరే రమ్యం పర్యేతి పర్వతమ్
నామ్నా సంకోచనోనామ నానానగయుతో గిరిః. ౨౭
తత్ర రాజ్యం ప్రశాస్త్యేష కుముదో నామ యూథపః

టీక॥యః(అధ్యాహృతము)=ఏ;గిరిః=పర్వతము;నామ్నా= పేరుచేత; సంకోచనోనామ= సంకోచనమనిప్రసిద్ధమో;నానానగయుతః= నానావిధములయినశిఖరములతోఁగూడినదో; తం(అధ్యాహృతము)=అట్టి;గోమతీతీరే=




గోమతీనదీతీరమునందు; స్థితః(అధ్యాహృతము)=ఉన్నట్టి; రమ్యం= సుందరమయిన; పర్వతం = సంకోచనపర్వతమును; యః=ఎవ్వఁడు; పురా=మున్ను; పర్యేతి=అధిష్ఠించియుండెనో; ఏషః=ఈ; కుముదో నామ= కుముదుండను పేరుగల; యూథపః=వానరశ్రేష్ఠుఁడు; తత్ర=ఆగోమతీతీరమునందు; రాజ్యం=వానరరాజ్యమును; ప్రశాస్తి=పాలించుచున్నాఁడు.

ఈతండు, కుముదుండనువాఁడు; ఇతండు, మున్ను, గోమతీతీరంబున రమ్యంబును నానావిధశిఖర సమన్వితంబునగు సంకోచనంబనుపర్వతంబున నుండి, వానరరాజ్యంబుఁ బాలింపుచుండిన వాఁడు. అని, తాత్పర్యము.

యోఽసౌ శతసహస్రాణాం సహస్రం పరికర్షతి. ౨౮
యస్య వాలా బహువ్యామా దీర్ఘా లాంగూల మాశ్రితాః
తామ్రాః పీతా స్సితా శ్శ్వేతాః ప్రకీర్ణా ఘోరకర్మణః. ౨౯
అదీనో రోషణ శ్చండ స్సంగ్రామ మభికాంక్షతి

టీక॥ యః=ఏ; అసౌ=ఈకుముదుఁడు; శతసహస్రాణాం = లక్షలయొక్క; సహస్రం=వేయింటిని; పరికర్షతి=ఆకర్షించుచున్నాఁడో; ఘోరకర్మణః= భయంకరమయినకార్యముగల; యస్య=ఎవ్వనియొక్క; లాంగూలం=తోఁకను; ఆశ్రితాః=పొందిన; దీర్ఘాః=నిడుపులయిన; వాలాః=రోమములు; బహువ్యామాః=పెక్కుచేతులప్రమాణముగలవై; తామ్రాః = ఎఱ్ఱనివియును; పీతాః= పసుపువన్నెగలదియు; సితాః= తెల్లనివియు; శ్వేతాః=మిక్కిలియుఁదెల్లనివియునై; ప్రకీర్ణాః=విరిసియున్నవో; సః(అధ్యాహృతము)=అట్టికుముదుండు; అదీనః=దైన్యములేనివాఁడు; రోషణః = కోపముగలవాఁడు-చండః=భయంకరుఁడు; సంగ్రామం=దుఃఖమును ; అభికాంక్షతి=కోరుచున్నాఁడు.

ఎవ్వనికిఁ, దోఁకయందలి వెంట్రుకలు, మిక్కిలియుఁ బొడవులయి, కొన్ని యెఱ్ఱనై కొన్ని పసుపువన్నెగలిగి, కొన్ని తెల్లనివై యిట్లు నానావిధవర్ణంబులతో నొప్పుచుండునో, అట్టియీకుముదుండు, వేయిలక్షల వానరులందోడ్కొనివచ్చుచున్నాఁడు; ఇతం




రుండును భయంకరంబులగు కార్యంబులం జేయువాఁడు ; ఎంతమాత్రము దైన్యములేనివాఁడు ; మిక్కిలియుఁ గోపంబు గలవాఁడు; భయంకరుండు; ఇతండును; యుద్ధంబునకుఁ గాలుద్రవ్వుచున్నాఁడు. అని, తాత్పర్యము.

ఏషోప్యాశంసతే లంకాం స్వేనా నీకేన మర్దితుమ్. ౩౦

టీక॥ ఏషోపి=ఈకుముదుండును ; లంకాం=లంకాపట్టణమును; స్వేన = తనదైన; అనీకేన= సైన్యముచేత; మర్దితుం=మర్దించుటకు; ఆశంసతే= కోరుచున్నాఁడు.

ఈకుముదుండును, తనసైన్యంబులతో, లంకాపురి మర్దింపవలెనని పరమోత్సాహంబుననున్నాఁడు.
అని, తాత్పర్యము.

యస్త్వేష సింహసంకాశః కపిలో దీర్ఘలోచనః
నిభృతః ప్రేక్షతే లంకాం దిధక్షన్నివ చక్షుషా. ౩౧
వింధ్యం కృష్ణగిరిం సహ్యం పర్వతంచ సుదర్శనమ్
రాజన్ సతత మధ్యాస్తే రంభోనా మైష యూథపః. ౩౨
శతం శతసహస్రాణాం త్రింశచ్చ హరిపుంగవాః
య మేతే వానరా శ్శూరా శ్చండా శ్చండపరాక్రమాః. ౩౩
పరివార్యానుగచ్ఛంతి లంకాం మర్దితు మోజసా

టీక॥ రాజన్= రావణుఁడా! సింహసంకాశః= సింహములతో సమానుండును; కపిలః = కపిలవర్ణుండును;దీర్ఘలోచనః= నిడువుపులయిన కండ్లుగలవాఁడునగు; యః= ఏ;ఏషతు=ఈవానరుండును; నిభృతః= నిశ్చలుండై; చక్షుషా=కంటిచేత;దిధక్షన్నివ=దహింపనిచ్ఛించువాఁడువలె;లంకాం=లంకాపట్టణమును; ప్రేక్షతే=చూచుచున్నాఁడో; శూరాః=యుద్ధమునందుభయములేనివారలును; చండాః=భయంకరులును; చండపరాక్రమాః=భయంకరమయినపరాక్రమముగలవారలును ; హరిపుంగవాః = వానరశ్రేష్ఠులునగు; ఏతే=ఈ; శతసహస్రాణాం= లక్షయొక్క; శతం=నూఱును; త్రింశచ్చ=ము

ప్పదియు; వానరాః= వానరులు; ఓజసా=పరాక్రమముచేత; లంకాం= లంకాపురిని; మర్దితుం = మర్దించుటకు; యం=ఎవ్వని; పరివార్య= పరివేష్టించి; అనుగచ్ఛంతి = వెంబడించుచున్నారో; ఏషః=ఈ; యూథపః= వానరోత్తముఁడు; రంభోనామ=రంభుఁడనువాఁడును; సతతం=ఎల్లప్పుడును; వింధ్యం= వింధ్యపర్వతమును; కృష్ణగిరిం = కృష్ణపర్వతమును; సహ్యం = సహ్యపర్వతమును; సుదర్శనం= సుదర్శనమను; పర్వతంచ=పర్వతమును; అధ్యాస్తే=అధిష్ఠించుచుండును.

రావణుఁడా! ఎవ్వఁడు, సింహములంబోలెఁ, గపిలవర్ణుండై దీర్ఘనేత్రుండై, లంకాపురినిదహించువాఁడువలెనిశ్చలదృష్టింజూచుచున్నాఁడో, మఱియుశూరులును భయంకరాకారులును భయంకరపరాక్రములునగునూటముప్పదిలక్షలమందివానరోత్తములు లంకాపురినిమర్దింపంగోరి, యెవ్వనివెంబడించివచ్చుచున్నారో, అట్టిఈవానరుఁడు, రంభుండను వాఁడు; ఈతఁడువింధ్య పర్వతంబును, కృష్ణగిరిని, సహ్యంబునుసుదర్శనంబును ఈపర్వతంబులను అధిష్ఠించి,వానరరాజ్యంబునేలుచుండును. అని, తాత్పర్యము.

యస్తు కర్ణౌ వివృణుతే జృంభతేచ పునఃపునః. ౩౪
నచసంవిజతే మృత్యోర్నచ యుద్ధాద్విధావతి
ప్రకంపతేచ రోషేణ తిర్యక్చ పునరీక్షతే. ౩౫
పశ్యన్ లాంగూల మపిచ క్ష్వేళతేచ మహాబలః
మహాబలో వీతభయో రమ్యం సాల్వేయపర్వతమ్. ౩౬
రాజన్ సతత మధ్యాస్తే శరభోనామ యూథపః

టీక॥మహాబలః= అధికమయినబలముగలు;రాజన్= రాక్షసరాజుండవగు రావణుఁడా!యస్తు= ఎవ్వఁడుమాత్రము; కర్ణౌ=చెవ్వులను;వివృణుతే= విచ్చుచున్నాఁడో;పునఃపునః= మాటిమాటికి; జృంభతేచ = ఆవలించుచున్నాఁడో; మృత్యోః=మరణమువలన; నసంవిజతేచ=భయపడఁడో ; యుద్ధాచ్చ=యుద్ధమువలనను ; నవిధావతి=పరుగెత్తఁడో; రోషేణ=కోపము

చేత; ప్రకంపతేచ=వడంకుచున్నాడో;పునఃపునః=మాటిమాటికిని; తిర్యక్=అడ్డముగా; ఈక్షతేచ= చూచుచున్నాఁడో;లాంగూలం= తోఁకను; పశ్యన్నపిచ=చూచుచును;క్ష్వేళతేచ=సింహనాదముచేయుచున్నాఁడో; ఏషః(అధ్యాహృతము)=ఈ ; మహాబలః=అధికమయినబలము గలవాఁడును; వీతభయః=విడువఁబడిన భయముగలవాఁడునునగు; శరభోనామ=శరభుండనెడు;యూథపః = వానరోత్తముఁడు;సతతం=ఎల్లప్పుడును ; రమ్యం=సుందరమయిన ; సాల్వేయపర్వతం=సాల్వేయమనుపర్వతమును ; అధ్యాస్తే=అధిష్ఠించియుండును.

రాక్షసరాజుండవగురావణుఁడా! ఎవ్వండుచెవులనిగుడఁజేయుచు మాటిమాటికావలించుచున్నాఁడో , మఱియు, గోపంబున వడంకుచుఁ దిర్యగ్దృష్టిం జూచుచుఁ, దనలాంగూలంబుఁ జూచి , సింహనాదంబులు సేయుచున్నాఁడో ; ఇతండు,శరభుండు; ఇతఁడు , మరణంబునుంగూడసరకుసేయఁడు;యుద్ధంబుననుండి వెనుదీయఁడు ; మహాబలుండు;భయములేనివాఁడు; ఇతండు, ఎల్లప్పుడును, రమ్యంబగుసాల్వేయపర్వతంబుననుండి , వానరరాజ్యంబేలును. అని,తాత్పర్యము.

ఏతస్య బలిన స్సర్వే విహారానామ యూథపాః. ౩౭
రాజ౯ శతసహస్రాణి చత్వారింశ త్తథైవచ

టీక॥ రాజ౯= రాక్షసరాజుండవగురావణుఁడా! ఏతస్య= ఈశరభునకు;విహారానామ=విహారులని ప్రసిద్ధులయిన;యూథపాః=వానరోత్తములు; తథైవచ=అట్లే; చత్వారింశత్ = నలువది;శతసహస్రాణి= లక్షలమంది; సంతి(అధ్యాహృతము)=ఉన్నారు. సర్వే=అందఱును;బలినః=బలవంతులు.

రాక్షసరాజుండవగురావణుఁడా! ఈశరభునిచేతిక్రింద , నలువది లక్షలమందివానరవీరులున్నవారలు ; వారలందఱుమిక్కిలియుబలవంతులు.

అని, తాత్పర్యము.

యస్తు మేఘఇవా కాశం మహా నావృత్య తిష్ఠతి. ౩౮

మధ్యే వానరవీరాణాం సురాణా మివ వాసవః
భేరీణా మివ సన్నాదో య స్యైష శ్రూయతే మహాన్. ౩౯
ఘోర శ్శాఖామృగేంద్రాణాం సంగ్రామ మభికాంక్షతామ్
ఏష పర్వత మధ్యాస్తే పారియాత్ర మనుత్తమమ్. ౪౦
యుద్ధే దుష్ప్రసహో నిత్యం పనసో నామ యూథపః

టీక॥మహాన్ = పెద్దశరీరముగల; యస్తు=ఎవ్వఁడుమాత్రము ; మేఘఇవ=మేఘమువలె; ఆకాశం= ఆకాశమును ; ఆవృత్య=ఆవరించి;తిష్ఠతి=ఉన్నాఁడో; యస్య = ఎవ్వనియొక్క; ఏషః=ఈ; సన్నాదః = ధ్వని; భేరీణాం=భేరులయొక్క; సన్నాదః (అధ్యాహృతము)ఇవ= ధ్వనివలె; శ్రూయతే=వినఁబడుచున్నదో ; యః (అధ్యాహృతము) = ఎవ్వఁడు; సంగ్రామం=యుద్ధమును; అభికాంక్షతాం = కోరుచున్నవారలును ; శాఖామృగేంద్రాణాం=వానరశ్రేష్ఠులునగు; వానరవీరాణాం = వానరవీరులయొక్క; మధ్యే=నడుమ;సురాణాం= దేవతలయొక్క; మధ్యే (అధ్యాహృతము)= నడుమ; వాసవఇవ = ఇంద్రుఁడువలె; వర్తతే (అధ్యాహృతము)= ఉన్నాఁడో;ఏషః=ఈ;ఘోరః= భయంకరుండును; నిత్యం=ఎల్లప్పుడును;యుద్ధే=యుద్ధమునందు;దుష్ప్రసహః=సహింపనలవిగానివాఁడునగు;పనసోనామ=పనసుఁడనెడు; యూథపః=వానరోత్తముఁడు;అనుత్తమం=తనకన్నశ్రేష్ఠముగాని;పారియాత్రం= పారియాత్రమును;పర్వతం = పర్వతమును; అధ్యాస్తే=అధిష్ఠించుచున్నాఁడు.

ఎవ్వండు, పర్వతాకారుండై, మేఘములంబోలెనాకాశమునావరించి, భేరులుంబోలెభయంకరముగాసింహనాదంబుసేయుచున్నాఁడో, మఱియుయుద్ధంబువిషయమై యత్యుత్సాహంబుతోనున్నవానరోత్తములనడుమ,దేవతలనడుమదే[వేం]ద్రునిబోలె; గూర్చుండియున్నాఁడో, ఈతండు , పనసుండనువాఁడు ; యుద్ధంబునమిక్కిలియుశూరుండు; ఇతఁడు పారి యాత్రపర్వతంబుననుండువాఁడు. అని, తాత్పర్యము.

ఏనం శతసహస్రాణాం శతార్ధం పర్యుపాసతే. ౪౧

యూథపా యూథపశ్రేష్ఠం యేషాం యూథాని భాగశః

టీక॥ యేషాం=ఎవ్వరికి; భాగశః=వేలువేలుగా; యూథాని = సైన్యములు; వర్తంతే(అధ్యాహృతము)= ఉన్నవో; తే(అధ్యాహృతము)= అట్టి; యూథపాః=వానరోత్తములు; శతసహస్రాణాం= లక్షలయొక్క; శతార్ధం=ఏబది; యూథపశ్రేష్ఠం= వానరశ్రేష్ఠులలో నుత్తముండగు; ఏనం= ఈ పనసుని; పర్యుపాసతే= ఉపాసించుచున్నది.

ఈతనిక్రింద, ఏఁబదిలక్షలమంది, వానరోత్తములున్నారు; వారలు, వేలువేలుగానధికసేనలుఁగలవారలు.

అని, తాత్పర్యము.

యస్తు భీమాం ప్రవల్గంతీం చమూం తిష్ఠతి శోభయన్. ౪౨
స్థితాం తీరే సముద్రస్య ద్వితీయ ఇవసాగరః
ఏష దర్దరసంకాశో వినతో నామ యూథపః. ౪౩
పిబం శ్చరతి పర్ణాసాం నదీనా ముత్తమాం నదీమ్

టీక॥ యస్తు= ఎవ్వఁడుమాత్రము; భీమాం=భయంకరమయిన; ప్రవల్గంతీం=మనోహరముగానున్నదియు; ద్వితీయః=రెండవదగు ; సాగర ఇవ=సముద్రమువలె; సముద్రస్య= సముద్రముయొక్క; తీరే = గట్టునందు; స్థితాం=ఉన్నదియునగు; చమూం= సేనను; శోభయన్=ప్రకాశింపఁజేయుచు ; తిష్ఠతి= ఉన్నాఁడో; దర్దర సంకాశః= దర్దరపర్వతముతోసమానుఁడగు; ఏషః=ఈ; యూథపః= వానరోత్తముఁడు; వినతోనామ=వినతుండను పేరుగలవాఁడు. నదీనాం= నదులలో; ఉత్తమాం=శ్రేష్ఠమగు; పర్ణాసాం= పర్ణాసయను; నదీం=నదిని; పిబన్=త్రాగుచు; చరతి=సంచరించుచున్నాఁడు.

ఎవ్వండు, సముద్రతీరంబున రెండవ సముద్రముం బోలె నతిభయంకరంబై యున్నవానరసేనంబ్రకాశింపఁజేయుచున్నాఁడో; ఈతండు, వినతుండనువాఁడు; ఉత్తమనదియయినపర్ణాసానదిజలంబులం ద్రావుచుఁదత్తీరంబునందుండువాఁడు.

అని, తాత్పర్యము.

షష్టి శ్శతసహస్రాణి బల మస్య ప్లవంగమాః. ౪౪

టీక॥ షష్టిః=అఱువది; శతసహస్రాణి=లక్షలమంది; ప్లవంగమాః= వానరులు; అస్య=ఈవినతునియొక్క; బలం=సేన.

ఈవినతుని, సేన, అఱువదిలక్షలమందివానరులున్నారు. అని, తాత్పర్యము.

త్వా మాహ్వయతి యుద్ధాయ క్రోధనో నామ యూథపః
విక్రాంతా బలవంతశ్చ యథా యూథాని భాగశః. ౪౫

టీక॥ క్రోధనో నామ= క్రోధనుఁడను; యూథపః = వానరోత్తముఁడు; యుద్ధాయ=యుద్ధముకొఱకు; త్వాం= నిన్ను; ఆహ్వయతి = పిలుచుచున్నాఁడు. అస్య(అధ్యాహృతము)= ఈక్రోధనునకు; యథాయూథాని (యథాయూథం) = యూథంబులనతిక్రమింపక. అన్యోన్యయూథంబులందుననుట; భాగశః=వేలువేలుగా; విక్రాంతాః=పరాక్రమవంతులును; బలవంతశ్చ=అధికమయినబలముగలవారలునగు వానరులు; సంతి (అధ్యాహృతము) = ఉన్నారు.

ఇతండు, క్రోధనుండనువాఁడు; నిన్నుయుద్ధంబునకుఁ బిలుచుచున్నాఁడు; ఇతనియొద్దను, వేలువేలుఁ, బరాక్రమవంతులునుబలవంతులునగు వానరులున్నారు. అని, తాత్పర్యము.

యస్తు గైరికవర్ణాభం వపుః పుష్యతి వానరః
అవమత్య సదా సర్వాన్ వానరాన్ బలదర్పితాన్. ౪౬
గవయో నామ తేజస్వీ త్వాం క్రోధా దభివర్తతే

టీక॥ యస్తు=ఏ ; వానరస్తు= వానరుండుమాత్రము; సదా=ఎల్లప్పుడును; బలదర్పితాన్=బలముచేగర్వించిన; వానరాన్=వానరులను; సర్వాన్= అందఱను; అవమత్య= అవమానించి; గైరికవర్ణాభం= గైరికముయొక్క వన్నెవంటివన్నెగల; వపుః = దేహమును; పుష్యతి= పెంచుచున్నాఁడో; అయం(అధ్యాహృతము)=ఇతండు; గవయో నామ=గవయుండనువాఁడు. తేజ

స్వ్య=మిక్కిలి వియుండేజస్సుగలవాండు. క్రోధాత్=కోపమువలన; త్వాం=నిన్ను గూర్చి; అభివర్తతే=వచ్చుచున్నాండు.

ఎవ్వండు, బలగర్వితులగువానరుల నందఱనుదృణీకరింపుచు, యుద్ధోత్సాహంబున, గైరికమువలెనెఱ్ఱనయినతన దేహమును బెంచుచున్నాండో, ఇతండు, గవయుండనువాండు; మిక్కిలియుండేజంబుగలవాండు; కోపంబున, నీపైకి,వచ్చుచున్నాండు. అని, తాత్పర్యము.

ఏనం శతసహస్రాణి సప్తతిః పర్యుపాసతే. ౪౭

టీక॥ఏనం = ఈవానరుని; సప్తతిః=డెబ్బది; శతసహస్రాణి= లక్షలు; పర్యుపాసతే=సేవించుచున్నవి.

ఈగవయునిచేతిక్రింద; డెబ్బదిలక్షలమందివానరులున్నారు. అని, తాత్పర్యము.

ఏషైవాశంసతే లంకాం స్వేనానీకేన మర్దితుమ్

టీక॥ఏషైవ(ఏషఏవ) = ఈగవయుండే; లంకాం=లంకాపురిని; స్వేన=తనదైన; అనీకేన=సైన్యముచేత; మర్దితుం=మర్దించుటకు; ఆశంసతే=కోరుచున్నాండు.

ఈగవయుండే, తనసేనతోవచ్చి, లంకాపురినంతయుమర్దింపంగోరుచున్నాండు. అని, తాత్పర్యము.

ఏతే దుష్ప్రసహా ఘోరా బలినః కామరూపిణః. ౪౮
యూథపా యూథపశ్రేష్ఠా ఏషాం యూథాని భాగశః

టీక॥ఏతే=ఈ; యూథపాః=వానరోత్తములు; దుష్ప్రసహాః= సహింపనలవిగానివారలు. బలినః= బలవంతులు; కామరూపిణః = ఇచ్ఛాధీనమగు రూపముగలవారలు . యూథపశ్రేష్ఠాః=యూథపోత్తములు. ఏషాం=వీరలకు; భాగశః=వేఱువేఱుగా; యూథాని=సైన్యములు; సంతి (అధ్యాహృతము)=ఉన్నవి.

వీరలు, యుద్ధంబున జయింపనలవిగానివారలు; బలవంతులు; కామరూపులు; వీరలకు, ఒక్కొక్కరికిని, గొప్పసైన్యంబులున్నవి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, షడ్వింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ షడ్వింశసర్గటీక,
ముగిసినది.

---



శ్రీ

## సప్తవింశసర్గప్రారంభః.

తాంస్తు తేహం ప్రవక్ష్యామి ప్రేక్షమాణస్య యూథపాన్
రాఘవార్థే పరాక్రాంతా యేన రక్షంతి జీవితమ్. ౧

టీక॥ యే=ఎవ్వరు; రాఘవార్థే=రామునికార్యనిమిత్తమయి; పరాక్రాంతాః= పరాక్రమించినవారలయి; జీవితం=ప్రాణమును ; నరక్షంతి=రక్షింపరో; తాన్=అట్టి; యూథపాంస్తు=యూథపులనుమాత్రము ; ప్రేక్షమాణస్య=చూచుచున్న; తే=నీకు; అహం=నేను; ప్రవక్ష్యామి=చెప్పుచున్నాను.

మఱియు, ఎవ్వరు, రామునినిమిత్తమయి , యుద్ధంబుచేయుట విషయమై ప్రాణంబులనైనను , సరకుసేయరో , అట్టిమహాపరాక్రమశాలులగు వానరయూథనాయకులం బాడుమునీకు చెప్పెదను. అని, తాత్పర్యము.

స్నిగ్ధా యస్య బహువ్యామా వాలా లాంగూలమాశ్రితాః
తామ్రాః పీతా స్సితా శ్శ్వేతాః ప్రకీర్ణా ఘోరకర్మణః. ౨
ప్రగృహీతాః ప్రకాశంతే సూర్యస్యేవ మరీచయః
పృథివ్యాం చానుకృష్యంతే హరో నామైష యూథపః. ౩

టీక॥ ఘోరకర్మణః = భయంకరమయినకార్యముగల; యస్య = ఎవ్వనియొక్క; లాంగూలం = తోఁకను; ఆశ్రితాః = పొందినట్టి; వాలాః = వెండ్రుకలును; బహువ్యామాః = పెక్కుచేతులపరిమాణముగలవై; స్నిగ్ధాః = నునుపుగలవై; తామ్రాః = ఎఱ్ఱనివై; పీతాః = పసుపువన్నెగలవై; సితాః = తెల్లనివై; శ్వేతాః = మిక్కిలియుఁదెల్లనివై; ప్రకీర్ణాః = వెదచల్లఁబడినవై; ప్రగృహీతాః = పైకెత్తఁబడినవై; సూర్యస్య = సూర్యునియొక్క; మరీచయఇవ = కిరణములువలె; పృథివ్యాం = నేలయందు; అనుకృష్యంతేచ = ఈడ్వఁబడుచున్నవో; ఏషః = ఈ; యూథపః = యూథపుఁడు; హరోనామ = హరుండనువాఁడు.

ఎవ్వని, తోఁకవెండ్రుకలు, మిక్కిలియుఁబొడవులయి, ఎఱ్ఱనివియుఁ, బసుపువన్నెగలవియు, తెల్లనివియు, నిట్లు, నానావిధవర్ణంబులయి, విరిసి, పైకెత్తఁబడి నేలంజీరాడుచు, సూర్యునికిరణంబులంబోలెఁ బ్రకాశించుచున్నవో, ఈతండు, హరుండనువాఁడు; భయంకరకర్ముండు.

అని, తాత్పర్యము.

యం పృష్ఠతో౽నుగచ్ఛంతి శతశో౽థ సహస్రశః
ద్రుమా నుద్యమ్య సహసా లంకారోహణతత్పరాః. ౪
యూథపా హరిరాజస్య కింకరా స్సముపస్థితాః

టీక॥ యం = ఏహరుని; హరిరాజస్య = వానరరాజుండగు సుగ్రీవునియొక్క; కింకరాః = కింకరులగు; యూథపాః = వానరోత్తములు; శతశః = నూఱునూఱులుగాను; అథ = ఇంక; సహస్రశః = వేనవేలుగాను; సముపస్థితాః = కూడినవారలై; ద్రుమాన్ = వృక్షములను; ఉద్యమ్య = పట్టుకొని; సహ

సా = శీఘ్రమున; లంకారోహణతత్ప రాః= లంకాపురిమెక్కుటయందాసక్తులయి; పృష్ఠతః=వెనుకనుండి; అనుగచ్ఛంతి=వెంబడించుచున్నారో.

వానరరాజుండగుసుగ్రీవునికింకరులగువానరోత్తములు, వేనవేలుగాగుంపులుగూడి, వృక్షంబులంబట్టుకొని, శీఘ్రంబున, లంకాపురినారోహింపంగోరినవారలయి, యీహరుని వెంబడించుచున్నారు; చూడుము.

అని, తాత్పర్యము.

ఏష కోటిసహస్రేణ వానరాణాం మహౌజసామ్. ౫
ఆకాంక్షతే త్వాం సంగ్రామే జేతుం పరపురంజయ

టీక॥ పరపురంజయ=శత్రుపట్టణంబునుజయించునట్టి రావణుడా! ఏషః=ఈహరుడు; మహౌజసాం=అధికమయినపరాక్రమముగల; వానరాణాం=వానరులయొక్క; కోటిసహస్రేణ=కోటులవేయింటిచేత; సంగ్రామే=యుద్ధమునందు; త్వాం=నిన్ను; జేతుం=జయించుటకు; ఆకాంక్షతే=కోరుచున్నాడు.

శత్రుపురంబులంజయించునట్టి రావణుడా! ఈహరుండు, వేయికోట్లపరిమితిగలతనసైన్యముతోవచ్చి, యుద్ధంబున, నిన్నుజయింపవలెనని కోరుచున్నాడు. అని, తాత్పర్యము.

నీలానివ మహామేఘాం స్తిష్ఠతో యాంస్తు పశ్యసి. ౬
అసితాంజనసంకాశాన్ యుద్ధే సత్యపరాక్రమాన్
అసంఖ్యేయాననిర్దేశ్యాన్ పరంపార మివోదధేః. ౭
పర్వతేషుచ యే కేచి ద్విషమేషు నదీషుచ
ఏతే త్వా మభివర్తంతే రాజన్ ఋక్షా స్సుదారుణాః. ౮

టీక॥ రాజన్ = రావణుడా!నీలాన్=నల్లనైన; మహామేఘానివ (స్థితాన్)= గొప్పమేఘములువలెనున్నవియు;తిష్ఠతః =నిలిచియున్నవియు;అసితాంజనసంకాశాన్ = నల్లనికాటుకతోసమానములును;యుద్ధే=యుద్ధమునందు;సత్యపరాక్రమాన్=సత్యమయినపరాక్రమము గలవియు ; అసంఖ్యే

యాన్ = లెక్క పెట్టఁగూడనివియు; అనిర్దేశ్యాన్ = చూపరానివియు; మహోదధేః = మహాసముద్రముయొక్క; పరం = అవ్వలి; పారమివ (స్థితాన్) = గట్టువలెనున్నవియునగు; యాంస్తు = వేనినిమాత్రము; పశ్యసి = చూచుచున్నావో; యే = ఏవి; కేచిత్ = కొన్ని; పర్వతేషు చ = పర్వతములయందును; విషమేషు = నిమ్నోన్నతప్రదేశములయందును; నదీషు చ = నదులయందును; సంతి (అధ్యాహృతము) = ఉన్నవో; ఏతే = ఈ; సుదారుణాః = మిక్కిలియుభయంకరములయిన; ఋక్షాః = ఎలుఁగుగొడ్డులు; త్వాం = నిన్నుఁగూర్చి; అభివర్తంతే = వచ్చుచున్నవి.

రావణుఁడా! నీలమేఘంబులుంబోలె నల్లని కాటుకయుంబోలెనల్లనివియు, యుద్ధంబునసత్యపరాక్రమంబులును, అసంఖ్యేయంబులును, అనిర్దేశ్యంబులును, మహాసముద్రంబువలెన నంతంబులైయున్నవియునగు, నీభల్లూకంబులంజూచుచున్నావే; ఇవి, పర్వతంబులందును విషమప్రదేశంబులందును నదీతీరంబులందును ఉండునవి; ఇవి, మిక్కిలియుభయంకరంబులు; నీపైకి, వచ్చుచున్నవి. అని, తాత్పర్యము.

ఏషాం మధ్యే స్థితో రాజన్ భీమాక్షో భీమదర్శనః
పర్జన్య ఇవ జీమూతైః సమంతా త్పరివారితః ౯
ఋక్షవంతం గిరిశ్రేష్ఠ మధ్యాస్తే నర్మదాం పిబన్
సర్వర్క్షాణా మధిపతి ర్ధూమ్రో నామైష యూథపః. ౧౦

టీక॥ రాజన్ = రావణుఁడా! యః (అధ్యాహృతము) = ఎవ్వఁడు; ఏషాం = ఈభల్లూకములయొక్క; మధ్యే = నడుమునందు; సమంతాత్ = అంతటను; జీమూతైః = మేఘములచేత; పరివారితః = పరివేష్టింపఁబడిన; పర్జన్యఇవ = వర్షాధిదేవతవలె; స్థితః = ఉన్నాఁడో; ఏషః = ఈ; యూథపః = యూథపుఁడు; ధూమ్రోనామ = ధూమ్రుఁడనువాఁడు; సర్వర్క్షాణాం = సమస్త భల్లూకములయొక్క; అధిపతిః = ప్రభువు. నర్మదాం = నర్మదానదిని; పిబన్ = త్రాఁగుచు; ఋక్షవంతం = ఋక్షవంతమను; గిరిశ్రేష్ఠం = పర్వతశ్రేష్ఠమును; అధ్యాస్తే = అధిష్ఠించియుండును.

రాక్షసరాజుండవగు రావణుఁడా!

ఎవ్వండు, మేఘంబులనడుమఁ బర్జన్యుండుండునట్లు, ఈభల్లూకంబులనడుమనున్నాఁడో ఈతండుధూమ్రుండు, ఇతండుసమస్తభల్లూకంబులకునునాథుండు ;నర్మదానదీజలంబులంద్రావుచు ఋక్షవంతంబను పర్వతంబున నుండును.

అని, తాత్పర్యము.

యవీయా నస్యతు భ్రాతా పశ్యైనం పర్వతోపమమ్
భ్రాత్రా సమానో రూపేణ విశిష్టస్తు పరాక్రమైః. ౧౧

టీక॥ పర్వతోపమం = పర్వతముతోఁబోలికగల; ఏనం=ఈతని;పశ్య= చూడుము. ఏషతు= వీఁడుమాత్రము; అస్య = ఈధూమ్రునియొక్క; యవీయాన్ = తనకన్నఁజిన్నవాఁడయిన; భ్రాతా=తోఁబుట్టువు. రూపేణ = రూపముచేత; భ్రాత్రా = అన్నతో; సమానః= సమానుఁడు. పరాక్రమైస్తు= పరాక్రమములచేతమాత్రము ; విశిష్టః=అధికుఁడు.

పర్వతాకారుండొక్కఁడున్నాఁడు; ఇతనింజూడుము ; ఇతండుధూమ్రునితమ్ముఁడు; అన్నవలెరూపంబు గలవాఁడు; పరాక్రమంబులందుమాత్రము, అన్నకంటె మిగులనధికుండు.

అని, తాత్పర్యము.

స ఏష జాంబవాన్నామ మహాయూథపయూథపః
ప్రక్రాంతో గురువర్తీచ సంప్రహారే ష్వ మర్షణః. ౧౨

టీక॥సః=అట్టి; ఏషః = ఇతండు; జాంబవాన్నామ= జాంబవంతుండను పేరుగలవాఁడు. మహాయూథపయూథపః=గొప్పయూథపులసమూహముం బాలించువాఁడు. ప్రక్రాంతః=పరాక్రమముగలవాఁడు.గురువర్తీచ = గురుశుశ్రూష చేయువాఁడును. సంప్రహారేషు=యుద్ధములందు ; అమర్షణః=ఓర్వనివాఁడు.

ఇతండు జాంబవంతుండనువాఁడు; మేటియూథపులలోముఖ్యుండు ; మహాపరాక్రమశాలి; గురుశుశ్రూషకుండు;యుద్ధంబులందు,మిక్కిలియు శూరుండు. అని, తాత్పర్యము.

ఏతేన సాహ్యం సుమహ త్కృతం శక్రస్య ధీమతా

దైవాసురే జాంబవతా లబ్ధాశ్చ బహవో వరాః. ౧౩

టీక॥ ధీమతా= బుద్ధిమంతుండగు; ఏతేన=ఈ; జాంబవంతా=జాంబవంతునిచేత; దైవాసురే=దేవాసురులయుద్ధమునందు; శక్రస్య=ఇంద్రునకు; సుమహత్=మిక్కిలియునధికమయిన; సాహ్యం=తోడ్పాటు; కృతం= చేయఁబడినది. బహవః= పెక్కులయిన; వరాశ్చ=వరములును; లబ్ధాః= పొందఁబడినవి.

బుద్ధిమంతుండగునీజాంబవంతుండు మున్ను దేవాసురులయుద్ధంబున, దేవేంద్రునకుమిక్కిలియుసాహాయ్యంబుఁగావించి, పెక్కువరంబులం బడసి యున్నాఁడు. అని, తాత్పర్యము.

ఆరుహ్య పర్వతాగ్రేభ్యో మహాభ్రవిపులాః శిలాః
ముంచంతి విపులాకారా న మృత్యో రుద్విజంతిచ. ౧४
రాక్షసానాంచ సదృశాః పిశాచానాంచ లోమశాః
ఏతస్య సైన్యా బహవో విచరంత్యగ్నితేజసః. ౧౫

టీక॥విపులాకారాః=పెద్దశరీరముగలవారలును; రాక్షసానాం= రాక్షసులకును; పిశాచానాంచ= పిశాచంబులకును; సదృశాః=సమానులును; అగ్నితేజసః = నిప్పువంటితేజస్సుగలవారలును; లోమశాః= అధికమయినవెండ్రుకలుగలవారలునగు ; ఏతస్య=ఇతనియొక్క ; సైన్యాః= సైనికులు ; బహవః=అనేకులు ; విచరంతి = తిరుగుచున్నారు. ఆరుహ్య=ఎక్కి ; పర్వతాగ్రేభ్యః=పర్వతశిఖరములనుండి; మహాభ్రవిపులాః = గొప్పమేఘంబులవలెఁబెద్దవయిన; శిలాః = ఱాళ్లను; ముంచంతి= విడుచుచున్నారు. మృత్యోః=మృత్యువువలనను ; నోద్విజంతిచ=భయపడరు.

ఈజాంబవంతునిసైనికులు, లెక్కలేక , మహారోమంబులు గలవారై, అగ్నికింబోలెఁదేజంబుగలిగి, రాక్షసులుంబోలెఁ బిశాచంబులుంబోలె నతికౄరులై , పర్వతశిఖరంబుల పైకినారోహించి యచ్చోటనుండి , మహామేఘంబులవంటిపెద్దఱాళ్లను బడఁదోయుచున్నారు; వీరలుమృత్యువునకుంగూడభయపడరు.

అని, తాత్పర్యము.

యం త్వేన మభిసంరబ్ధం ప్లవమాన మివ స్థితమ్

ప్రేక్షంతే వానరా స్సర్వే స్థితా యూథపయూథపమ్. ౧౬

ఏష రాజన్ సహస్రాక్షం పర్యుపాస్తే హరీశ్వరః

బలేన బలసంపన్నో దంభో నామైష యూథపః. ౧౭

టీక॥ రాజన్=రావణుఁడా! అభిసంరబ్ధం= మిక్కిలియుకోపముగలవాఁడును; ప్లవమానమివస్థితం= ఎగురుచున్నవాఁడువలెనున్నవాఁడునగు; యం=ఏ; యూథపయూథపంతు= యూథపుల యొక్క యూథపునిమాత్రము; స్థితాః= నిలిచియున్న; వానరాః=వానరులు; సర్వే=అందఱును; ప్రేక్షంతే=చూచుచున్నారో; ఏషః= ఈ; బలసంపన్నః=బలముతోఁగూడిన; హరీశ్వరః= వానరశ్రేష్ఠుండగు; దంభోనాము=దంభుండను పేరుగల; యూథపః=యూథపుఁడు; బలేన=బలముచేత; సహస్రాక్షం= దేవేంద్రుని; పర్యుపాస్తే=ఉపాసించినాఁడు.

ఎవ్వండు, అతికోపంబునొంది యెగురునట్లుచూపట్టుచున్నాఁడో; మఱియునెవ్వనివానరులందఱు, నాశ్చర్యంబునం జూచుచున్నారో; ఇతండు, దంభుండనువాఁడు; మిక్కిలియు బలవంతుఁడు; ఇతండు, యుద్ధంబున, దేవేంద్రునకుమిక్కిలి సాహాయ్యంబుగావించియున్నాఁడు.

అని, తాత్పర్యము.

యస్స్థితం యోజనం శైలం గచ్ఛన్ పార్శ్వేన సేవతే

ఊర్ధ్వం తథైవ కాయేన గతః ప్రాప్నోతి యోజనమ్. ౧౮

యస్మాన్న పరమం రూపం చతుష్పాదేషు విద్యతే

శ్రుత స్సన్నాదనో నామ వానరాణాం పితామహః. ౧౯

యేన యుద్ధం పురా దత్తం రణే శక్రస్య ధీమతా

పరాజయశ్చ నప్రాప్త స్సోయం యూథపయూథపః. ౨౦

టీక॥ యః=ఎవ్వఁడు; గచ్ఛన్ = పోవుచు; పార్శ్వేన = ప్రక్కచేత; యోజనే=ఆమడయందు; స్థితం = ఉన్న; శైలం=పర్వతమును; సేవతే = పొందుచున్నాఁడో; తథైవ=అట్లే; కాయేన=దేహముచేత; ఊర్ధ్వం= పై

కి; గతః=పోయినవాఁడై; యోజనం= ఆమడను; ప్రాప్నోతి=పొందునో; చతుష్పాదేషు = నాలుగుకాళ్లజంతువులందు; యస్మాత్=ఎవ్వనికన్నను; పరమం=అధికమయిన; రూపం= ఆకారము; నవిద్యతే=లేదో; ధీమతా=బుద్ధిమంతుఁడగు; యేన=ఎవ్వనిచేత; పురా=మున్ను; రణే=యుద్ధమునందు; శక్రస్య=ఇంద్రునికి; యుద్ధం= యుద్ధము; దత్తం = ఇయ్యఁబడినదో; పరాజయశ్చ= అపజయమును; నప్రాప్తః=పొందఁబడలేదో; సః = అట్టి; యూథపయూథపః = యూథపులసమూహమునుబాలించునట్టి; అయం= ఇతఁడు ; సన్నాదనోనామ=సన్నాదనుండని; శ్రుతః=వినఁబడినవాఁడు. వానరాణాం=వానరులకు; పితామహః = తాత.

ఎవ్వండు, నడచునప్పుడు, ఒకయడుగుననె, యోజనదూరంబుననుండుపర్వతంబుఁజేరునో, మఱియుఁజకబ్రఁగాలేచినిలిచినచో, నొకయోజన దూరము పొడవుగలిగియుండునో, ఈతండు, సన్నాదనుండనువాఁడు; ఈతఁడువానరులకుఁబితామహుండు; ఇతనికన్నను బెద్దశరీరముగల మృగము చతుష్పాజ్జంతువులలోనేదియు లేదు; ఇతండు, మున్ను దేవేంద్రునితోయుద్ధంబుచేసినాఁడు; అప్పు డెంతమాత్రమును బరాజయము నొందలేదు. అని, తాత్పర్యము.

యస్య విక్రమమాణస్య శక్రస్యేవ పరాక్రమః
ఏష గంధర్వకన్యాయా ముత్పన్నః కృష్ణవర్త్మనః. ౨౧

టీక॥విక్రమమాణస్య=పరాక్రమించుచున్న; యస్య=ఎవ్వనికి; శక్రస్యేవ=దేవేంద్రునకువలె; పరాక్రమః = పరాక్రమము; అస్తి (అధ్యాహృతము)=కలదో; ఏషః= ఈసన్నాదుఁడు; కృష్ణవర్త్మనః=అగ్నివలన ; గంధర్వకన్యాయాం=గంధర్వస్త్రీయందు; ఉత్పన్నః=పుట్టినాఁడు.

ఈతండు, దేవేంద్రునకుసరియయినపరాక్రమంబుగలవాఁడు ; ఇతఁడు, గంధర్వకన్యయందు, అగ్నిదేవునికిఁబుట్టినవాఁడు. అని, తాత్పర్యము.

తదా దైవాసురే యుద్ధే సాహ్యార్థం త్రిదివౌకసామ్

టీక॥ తదా=అప్పుడు; దైవాసురే= దేవాసురులకుఁగలిగిన; యుద్ధే= యుద్ధమునందు; త్రిదివౌకసాం=దేవతలకు; సాహ్యార్థం = తోడ్పాటుకొఱకు; ఉత్పాదితః(అధ్యాహృతము)=పుట్టింపఁబడినాఁడు.

దేవాసుర యుద్ధముజరగినప్పుడు, దేవతలకుసాహాయ్యార్థముమయి, ఇతనినిఁబుట్టించినారు. అని, తాత్పర్యము.

యస్య వైశ్రవణో రాజా జంబూ ముపనిషేవతే. ౨౨
యో రాజా పర్వతేంద్రాణాం బహుకిన్నరసేవినామ్
విహారసుఖదో నిత్యం భ్రాతుస్తే రాక్షసాధిప. ౨౩
తత్రైష వసతి శ్రీమాన్ బలవాన్ వానరర్షభః
యుద్ధేష్వకత్థనో నిత్యం క్రోధనో నామ యూథపః. ౨౪
వృతః కోటసహస్రేణ హరీణాం సముపస్థితః

టీక॥ రాక్షసాధిప=రాక్షసేశ్వరుండవగు రావణుఁడా! యస్య= ఏపర్వతమునకు; వైశ్రవణః = కుబేరుఁడు; రాజా=రాజో; యః(అధ్యాహృతము)= ఏపర్వతము; జంబూం= నేరెడుచెట్టును; ఉపనిషేవతే = పొందుచున్నదో; యః= ఏపర్వతము; బహుకిన్నరసేవినాం= పెక్కుకిన్నరులనుసేవించునట్టి; పర్వతేంద్రాణాం= పర్వతశ్రేష్ఠములయొక్క; రాజా=రాజో; యః(అధ్యాహృతము)=ఏది; తే = నీయొక్క; భ్రాతుః = అన్నయయినకుబేరునకు; నిత్యం=ఎల్లప్పుడు; విహారసుఖదః= క్రీడాసౌఖ్యమునిచ్చునదో; తత్ర=ఆపర్వతమునందు; ఏషః=ఈ; శ్రీమాన్=కాంతిమంతుండును; బలవాన్= అధికమయినబలముగలవాఁడును; నిత్యం=ఎల్లప్పుడును; యుద్ధేషు = యుద్ధములందు; అకత్థనః=ఆత్మస్తుతిచేసికొననివాఁడును; వానరర్షభః= వానరశ్రేష్ఠుఁడునగు; క్రోధనః=క్రోధనుండనుపేరుగల; యూథపః=యూథపుఁడు; వసతి=వసించియుండును. హరీణాం = వానరులయొక్క, కోటిసహస్రేణ = కోటివేయింటిచేత; వృతః= చుట్టఁబడినవాఁడై; ఉపస్థితః=వచ్చినాఁడు.

రాక్షస రాజుండవగు రావణుఁడా! ఈవానరోత్తముండు, నీయన్న

 

కుబేరునిచేఁబాలింపఁబడునదియు జంబూవృక్షంబుతోఁగూడినదియుఁ, బర్వతంబులకన్నింటికిని రాజును, నాకు బేరునకెల్లప్పుడునువిహారస్థానంబై యొప్పునదియునగు హిమవత్పర్వతంబుపై నుందువాఁడు; ఇతండుక్రోధనుండు; బలవంతుండు; ఆత్మస్తుతిచేసికొనఁడు; యుద్ధంబులనతిశూరుండు; ఇతండు, వేయికోట్ల వానర వీరులతో వచ్చియున్నాఁడు. అని, తాత్పర్యము.

ఏషైవా శంసతే లంకాం స్వేనా నీకేన మర్దితుమ్. ౨౫

టీక॥ ఏషైవ(ఏషఏవ)= ఈక్రోధనుఁడె;లంకాం=లంకాపురిని; స్వేన=తనదైన; అనీకేన=సైన్యముచేత ; మర్దితుం=మర్దించుటకు; ఆశంసతే=కోరుచున్నాఁడు.

ఈక్రోధనుండు,తనసైన్యముచే,లంకాపురినంతయు మర్దింపం గోరుచున్నాఁడు.అని, తాత్పర్యము.

యో గంగామను పర్యేతి త్రాసయన్ హస్తి యూథపాన్
హస్తినాం వానరాణాంచ పూర్వవైర మనుస్మరన్. ౨౬
ఏష యూథపతి ర్నేతా గచ్ఛన్ గిరిగుహాశయః
గజాన్ యోధయతే వన్యాన్ గిరీంశ్చైవ మహీరుహాన్. ౨౭

టీక॥ యః=ఎవ్వఁడు;హస్తినాం=ఏనుంగులకును; వానరాణాంచ= వానరులకును; పూర్వవైరం= మునుపటి వైరమును; అనుస్మరన్=తలంచుచు ; హస్తియూథపాన్=గజశ్రేష్ఠములను; త్రాసయన్= భయపఱచుచు; గంగామను=గంగానదినిసమీపించి; పర్యేతి= సంచరించుచుండునో;ఏషః=ఈ; యూథపతిః=యూథపుఁడు; నేతా= నాయకుఁడు. గిరిగుహాశయః=పర్వతగుహలయందునిద్రగలవాఁడు. గచ్ఛన్=పోవుచు; వన్యాన్=అడవియందుఁబుట్టిన;గజాన్=ఏనుంగులను; గిరీంశ్చైవ= పర్వతంబులను, మహీరుహాన్=వృక్షములను ; యోధయతే = యుద్ధముచేయించును.

ఇదిగో , ఇచ్చటనొకవానరోత్తముండున్నాఁడుచూడుము; ఈతండు, మున్నుహనుమంతునితండ్రి కేసరి, మునిజనబాధకుండగు గజాకారుఁడైనశం

బసాదనుండనురాక్షసుని, మునినియోగంబునంజంపిననాఁటనుండి, వానరులకునుగజంబులకును గల్గినవైరంబుదలంచి, గజంబులకంతభయంబుగలుగఁజేయుచు, గజంబులంబట్టిపర్వతంబులపైఁగొట్టుచుఁ, పర్వతంబులచేగజంబులంబ్రహరించుచు, నట్లువృక్షంబులపైగజంబులంగొట్టుచు, వృక్షంబులచేగజంబులంబ్రహరించుచు, నిట్లునానావిధంబులగజనాశంబుగావించుచు, గంగానదీసమీపంబున, సంచరించుచుండును. అని, తాత్పర్యము.

య ఏష వాహినీముఖ్యో నదీం హైమవతీ మను
ఉశీరబీజ మాశ్రిత్య పర్వతం మందరోపమమ్. ౨౮
రమతే వానరశ్రేష్ఠో దివి శక్రఇవ స్వయమ్
ఏనం శతసహస్రాణాం సహస్ర మనువర్తతే. ౨౯

టీక॥ వాహినీముఖ్యః= సేనలోముఖ్యుండును; వానరశ్రేష్ఠః=వానరోత్తముండునగు; యః=ఏ; ఏషః= ఈతఁడు; హైమవతీం = హిమవత్పర్వతమునందుఁబుట్టి; నదీమను= గంగానదినిసమీపించి; మందరోపమం= మందరముతోఁబోలికగల; ఉశీరబీజం=ఉశీరబీజమను; పర్వతం=కొండను; ఆశ్రిత్య = ఆశ్రయించి; దివి = స్వర్గమునందు; స్వయం, శక్రఇవ= సాక్షాద్దేవేంద్రుండువలె; రమతే=క్రీడించునో; ఏనం=ఇతని; శతసహస్రాణాం = లక్షలయొక్క; సహస్రం= వేయి; అనువర్తతే= వెంబడించుచున్నది.

ఈవానరోత్తముండు, గంగానదీసమీపంబున, నుశీరబీజంబనుపర్వతంబున, స్వర్గంబునదేవేంద్రుండువోలె, విహరించుచుండును; ఇతండు, సేనాముఖ్యుండు; ఇతనిక్రింద, వేయిలక్షలవానరులున్నారు. అని, తాత్పర్యము.

వీర్యవిక్రమదృప్తానాం నదతాం బలశాలినామ్
స ఏష నేతా చైతేషాం వానరాణాం తపస్వినామ్. ౩౦

టీక॥ సః=అట్టి; ఏషః=ఇతండు; వీర్యవిక్రమదృప్తానాం = ఉత్సాహముచేతను బరాక్రమముచేతను గర్వించినవారలును; నదతాం=గర్జించు

చున్నవారలును; బలశాలినాం=బలము చే బ్రకాశించుచున్నవారలును ; తరస్వినాం = అధికమయిన వేగముగల వారలునగు; ఏతేషాం = ఈవానరుల యొక్క; నేతాచ=నాయకుండును.

ఇతండు, అట్టిమహాపరాక్రమశాలులు నుత్సాహవంతులును సింహనాదంబులు సేయుచున్నవారలును బలవంతులును వేగవంతులునగునీవేయిలక్షల వానరులకునునాయకుండు.

అని, తాత్పర్యము.

స ఏష దుర్ధరో రాజన్ ప్రమాథీనామ యూథపః
వాతేనే వోద్ధతం మేఘం య మేన మను పశ్యసి. ౩౧
అనీకమపి సంరబ్ధం వానరాణాం తరస్వినామ్
ఉద్ధూత మరుణాభాసం పవనేన సమంతతః. ౩౨
వివర్తమానం బహుధా యత్రై త ద్బహుళం రజః

టీక॥ రాజన్=రాక్షసరాజుండవగురావణుఁడా! యత్ర=ఎచ్చట ; సమంతతః=అంతటను; పవనేన = వాయువుచేత; ఉద్ధూతం=ఎగురఁగొట్టఁబడిన; అరుణాభాసం=ఎఱ్ఱనికాంతిగల; బహుధా=పెక్కువిధములను; వివర్తమానం=చుట్టునున్న; ఏతత్ = ఈ; బహుళం=అధికమయిన; రజః=దుమ్ము; దృశ్యతే(అధ్యాహృతము)=చూడఁబడుచున్నదో; తత్ (అధ్యాహృతము)=అట్టి;సంరబ్ధం= వేగముతోఁగూడిన; తరస్వినాం=బలవంతులగు;వానరాణాం=వానరులయొక్క; అనీకమపి=సైన్యమును; వాతేన=వాయువుచేత; ఉద్ధతం=ఎగురఁగొట్టఁబడిన ; మేఘమివ(స్థితం) = మేఘమువలెనున్న; యం=ఏ; ఏనమను=ఇతనిసమీపించి ; పశ్యసి=చూచుచున్నావో; సః = అట్టి; ఏషః=ఈతఁడు; దుర్ధరః = సహింపనలవిగాని; ప్రమాథీనామ=ప్రమాథియనెడు; యూథపః = యూథపుఁడు.

రాక్షసరాజుండవగురావణుఁడా! ఎచ్చట, వాయువుచే రేఁగిన, యెఱ్ఱనిదియునానావిధంబులవివర్తమానంబునగుదుమ్ము,అధికముగాఁబూపట్టుచున్నదో; అట్టిబలవంతులగువానరులసేనం జూడుము ; ఇదియెంతయుసంరంభ

బుతోనున్నది; ఆసేనామధ్యంబున,వాయువుచే నెగురఁగొట్టఁబడిన మేఘంబువలెనున్నయీవానరోత్తముండు, ప్రమాథియనువాఁడు.

అని, తాత్పర్యము.

ఏతే సితముఖా ఘోరా గోలాంగూలా మహాబలాః. ౩౩
శతం శతసహస్రాణి దృష్ట్వా వై సేతుబంధనమ్
గోలాంగూలం మహావేగం గవాక్షం నామయూథపమ్. ౩౪
పరివార్యా భివర్తంతే లంకాం మర్దితు మోజసా

టీక॥సితముఖాః= తెల్లనిముఖములు గలవియు; మహాబలాః= అధికమయినబలముగలవియునగు; ఏతే=ఈ; గోలాంగూలాః=కొండముచ్చులు; శతసహస్రాణి=లక్షలు; శతం=నూఱు; సేతుబంధనం=సేతుబంధమును;దృష్ట్వా=చూచి; మహావేగం= అధికమయినవేగముగల; గోలాంగూలం= కొండముచ్చయిన; గవాక్షంనామ= గవాక్షుండను; యూథపం=యూథపుని ; పరివార్య=పరివేష్టించి; ఓజసా=బలముచేత; లంకాం=లంకాపురిని ; మర్దితుం=మర్దించుటకు; అభివర్తంతే=వచ్చుచున్నవి.

తెల్లనిముఖంబులు గలవియు భయంకరంబులునగు గోలాంగూలంబులు, నూఱులక్షలసంఖ్యగలవి , సేతుబంధముముగియుటనుజూచి , మహావేగుండును గోలాంగూలాధీశ్వరుండునగుగవాక్షునింబరివేష్టించి, పరాక్రమంబున, లంకాపురినిమర్దించుటకై, వచ్చుచున్నవి, చూడుము.

అని, తాత్పర్యము.

భ్రమరాచరితా యత్ర సర్వకామఫలద్రుమాః. ౩౫
యం సూర్య స్తుల్య వర్ణాభ మనుపర్యేతి పర్వతమ్
యస్య భాసా సదా భాంతి తద్వర్ణా మృగపక్షిణః. ౩౬
యస్య ప్రస్థం మహాత్మానో నత్యజంతి మహర్షయః
సర్వకామఫలా వృక్షా స్సదా ఫలసమన్వితాః. ౩౭

మధూనిచ మహార్హాణి యస్మిన్ పర్వతసత్తమే
తత్రైష రమతే రాజన్ రమ్యే కాంచనపర్వతే. ౨౮
ముఖ్యో వానరముఖ్యానాం కేసరీ నామ యూధపః

టీక॥ రాజన్ = రావణుఁడా! యత్ర = ఏపర్వతమునందు; భ్రమరాచరితాః = తుమ్మెదలచేఁ బొందఁబడిన; సర్వకామఫలద్రుమాః = సమస్తాభీష్టంబులనుఫలించువృక్షంబులు; సంతి (అధ్యాహృతము) = ఉన్నవో; యం = ఏ; పర్వతమను = పర్వతమును సమీపించి; సూర్యః = సూర్యుఁడు; తుల్యవర్ణాభం = సమానమయిన వన్నెయొక్క కాంతిగలుగునట్లుగా; పర్యేతి = సంచరించుచున్నాఁడో; యస్య = ఏపర్వతముయొక్క; భాసా = కాంతిచేత; సదా = ఎల్లప్పుడును; మృగపక్షిణః = మృగంబులునుబక్షులును; తద్వర్ణాః = ఆపర్వతముయొక్క వన్నెవంటివన్నెగలవై; భాంతి = ప్రకాశించుచున్నవో; యస్య = ఏపర్వతముయొక్క; ప్రస్థం = నెత్తమును; మహర్షయః = పూజ్యులగుఋషులు; నత్యజంతి = విడువరో; యస్మిన్ = ఏ; పర్వతసత్తమే = పర్వతశ్రేష్ఠమునందు; సర్వకామ ఫలాః = సమస్తములయినకోరఁదగిన ఫలములు గలవియు; సదా = ఎల్లప్పుడును; ఫలసమన్వితాః = ఫలముతోఁ గూడినవియునగు; వృక్షాః = వృక్షములును; మహార్హాణి = శ్రేష్ఠములయిన; మధూనిచ = తేనియలును; సంతి (అధ్యాహృతము) = ఉన్నవో; తత్ర = అట్టి; రమ్యే = సుందరమయిన; కాంచనపర్వతే = బంగారుకొండయయిన మేరు పర్వతమునందు; వానరముఖ్యానాం = వానరశ్రేష్ఠులలో; ముఖ్యః = మొదటివాఁడైన; ఏషః = ఈ; కేసరీనామ = కేసరియనుపేరుగల; యూధపః = యూథపుఁడు; రమతే = విహరించుచుండును.

ఏపర్వతంబునఁ, గోరినవాని నన్నింటినొసంగునవియు, నెల్లప్పుడును గంధిపుష్పంబులు గలిగి యుండుటచేఁ దుమ్మెదలతోఁ గూడినవియునగు వృక్షంబులున్నవో, ఏపర్వతసమీపంబున, సూర్యుండు ఆపర్వతముంబోలె స్వర్ణవర్ణుండైయొప్పునో, ఎచ్చటఁ, బక్షులను మృగంబులునుసమస్తజంతువులును బంగారువన్నెగలిగియుండునో, ఏపర్వతంబునందు మహర్షులు, విడువక, ఎల్లప్పుడును నివసింపుచుందురో,

ఎచ్చట నతిరుచ్యంబులగు ఫలంబుల నొసంగు నవియు నెల్లప్పుడునుఫలంబులతోఁ గూడినవియునగు వృక్షంబులును మంచి తేనియలును గలిగి యుండునో, అట్టిరమణీయమయినమేరుపర్వతంబునందు, వానర వీరులలో మొదటివాఁడైనయీ కేసరి, నివాసము సేయుచుండును. అని, తాత్పర్యము.

షష్టి గిరిసహస్రాణాం రమ్యాః కాంచనపర్వతాః. ౩౯
తేషాం మధ్యే గిరివర స్త్వ మివా నఘ రక్షసామ్

టీక|| అనఘ=పాపరహితుండవగు రావణుఁడా, రమ్యాః = సుందరములయిన; కాంచనపర్వతాః=బంగారుకొండలు; గిరిసహస్రాణాం = పర్వతముల యొక్క వేలయొక్క; షష్టిః= అఱువది; సంతి(అధ్యాహృతము) = ఉన్నవి. తేషాం=వానియొక్క; మధ్యే=నడుమను; గిరివరః=పర్వతశ్రేష్ఠము; రక్షసాం= రాక్షసులలో; త్వమివ=నీవువలె; అస్తి (అధ్యాహృతము)=ఉన్నది.

పాపరహితుండవగు రావణుఁడా! బంగారుకొండలు, అఱువదివేలున్నవి; వానినడుమ, రాక్షసులలోనీవుసర్వోత్తముండవై యుండునట్లు, ముఖ్యపర్వతంబున్నది. అని, తాత్పర్యము.

తత్రైతే కపిలా శ్శ్వేతా స్తామ్రాస్యా మధుపింగళాః. ౪౦
నివసంత్యు త్తమగిరౌ తీక్ష్ణదంష్ట్రా నఖాయుధాః
సింహాఇవ చతుర్దంష్ట్రా వ్యాఘ్రాఇవ దురాసదాః. ౪౧
సర్వే వైశ్వానరసమా జ్వలితాశీవిషోపమాః
సుదీర్ఘాంచితలాంగూలా మత్తమాతంగసన్నిభాః. ౪౨
మహాపర్వతసంకాశా మహాజీమూతనిస్స్వనాః
వృత్తపింగళరక్తాక్షా భీమభీమా గతిస్వరాః. ౪౩

టీక|| కపిలాః=నలుపుగలసినయెఱుపువన్నెగలవారలును; శ్వేతాః=తెల్లనివన్నెగలవారలును; తామ్రాస్యాః=ఎఱ్ఱనిముఖముగలవారలును; మధుపింగ

శాః= తేనెవలెగోరోచనపువన్నెగలవారలును;తీక్ష్ణదంష్ట్రాః=కఱకుకోఱలుగలవారలును; నఖాయుధాః=నఖములెయాయుధములుగా గలవారలును; చతుర్దంష్ట్రాః=నాలుగుకోఱలుగల;సింహాఇవస్థితాః= సింహములవలెనున్నవారలును;వ్యాఘ్రాఇవ=పెద్దపులులవలె;దురాసదాః= చెనకనలవిగానివారలును; సర్వే=అందఱును;వైశ్వానరసమాః=నిప్పుతోసమానులును; జ్వలితాశీవిషోపమాః= మండుచున్నసర్పములతోఁబోలికగలవారలును; సుదీర్ఘాంచితలాంగూలాః= మిక్కిలియునిడుపుయియొప్పుచున్నతోఁకలుగలవారలును; మత్తమాతంగసన్నిభాః=మదించినయేనుంగులతో సమానులును ; మహాపర్వతసంకాశాః= గొప్పపర్వతములతోసమానులయినవారలును; మహాజీమూతనిస్స్వనాః=గొప్ప మేఘములయొక్క ధ్వనివంటిధ్వనిగలవారలును; వృత్తపింగళరక్తాక్షాః= గుండ్రములయినవియు గోరోచనపువన్నెయు నెఱ్ఱఁదనములు గలవియునగుకండ్లుగలవారలును; భీమభీమాః= మిక్కిలియుభయంకరులును;గతిస్వరాః=(భయంకరమయిన) గమనమునుగంఠధ్వనియునుగలవారలునగు;ఏతే=ఈవానరులు;తత్ర=ఆ; ఉత్తమగిరౌ= ఉత్తమపర్వతమునందు; నివసంతి=వాసముసేయుచుందురు.

ఈకపిలముఖులును, ధవళముఖులునుఎఱ్ఱనిముఖముగలవారలును, పింగళవర్ణములయిన ముఖములుగలవారలును, కఱకుకోఱలుగలవారలును, నఖంబులెయాయుధంబులుగాఁగలవారలును,నాలుగుకోఱలసింహంబులుంబోలెఁబెద్దపులులుంబోలె నతిభయంకరంబుగాఁజూపట్టుచుండువారలును,నిప్పువంటివారలును,తీక్ష్ణవిషంబులగు సర్పంబులవంటివారలును,దీర్ఘములునుసుందరములునగు తోఁకలుగలవారలును, మదపుటేనుంగులుంబోలెనున్నవారలును, పర్వతాకారులును, మేఘగర్జనంబువంటి సింహనాదంబుగలవారలును, గుండ్రములును పింగళవర్ణంబులునగు నేత్రంబులుగలవారలును , భయంకరాకారులును,భయంకరంబులగు గమనంబునుగంఠధ్వనియుంగల వారలునగు నీవానరులు , ఆయఱువదివేల బంగారు కొండలలోనుత్తమంబగుపర్వతమునందు, నివసించియుందురు.అని,తాత్పర్యము.

మర్దయంతీవ తే సర్వే తస్థుర్లంకాం సమీక్ష్య తే




టీక॥ తే=వారలు; సర్వే= అందఱును; తే=నీయొక్క; లంకాం=లంకాపురిని; సమీక్ష్య=చూచి; మర్దయంతీవ (మర్దయంత ఇవ)= మర్దించువారలువలె; తస్థుః=ఉన్నారు,

వారలందఱు, నీలంకాపురింజూచి, యిప్పుడె, మర్దించునట్లున్నారు.

అని, తాత్పర్యము.

ఏషచైషా మధిపతి ర్మధ్యే తిష్ఠతి వీర్యవాన్. ౪౪
జయార్థీ నిత్య మాదిత్య ముపతిష్ఠతి బుద్ధిమాన్
నామ్నా పృథివ్యాం విఖ్యాతో రాజన్ శతవలీతి యః. ౪౫

టీక॥ రాజన్=రాక్షసరాజుండవగు రావణుఁడా! యః=ఎవ్వఁడు; పృథివ్యాం=భూమియందు; నామ్నా=పేరుచేత; శతవలీతి = శతవలియని; విఖ్యాతః=ప్రసిద్ధిఁనొందినాఁడో; సః(అధ్యాహృతము)=అట్టి; వీర్యవాన్=అధికమయిన పరాక్రమముగలవాఁడును; ఏషాం=ఈవానరులయొక్క; అధిపతిః=ప్రభుండునగు; ఏషచ=ఈతండును; మధ్యే = నడుమను; తిష్ఠతి = ఉన్నాఁడు. బుద్ధిమాన్ = అధికమయిన బుద్ధిగలశతవలి ; జయార్థీ=జయంబుఁగోరువాఁడై; నిత్యం=ఎల్లప్పుడును; ఆదిత్యం=సూర్యుని ; ఉపతిష్ఠతి (ఉపతిష్ఠతే)=స్తుతించుచున్నాఁడు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఈవానరులనాయకుండు, వీరలనడుమనున్నాఁడు, చూడుము; ఈతండు మిక్కిలియుఁ బరాక్రమంబు గలవాఁడు; ఇతనిపేరు, శతవలియనిభూమండలంబునవినుతికెక్కియున్నది ; ఇతండు, జయంబుఁగోరి, సూర్యునికెప్పుడుఁబూజగావించుచుండును.

అని, తాత్పర్యము.

ఏషైవా శంసతే లంకాం స్వేనా నీకేన మర్దితుం
విక్రాంతో బలవాన్ శూరః పౌరుషే స్వే వ్యవస్థితః. ౪౬

టీక॥ఏషైవ(ఏషఏవ) = ఇతండె; స్వేన = తనదైన; అనీకేన=సైన్యముచేత; లంకాం=లంకాపురిని; మర్దితుం=మర్దించుటకు; ఆశంసతే= కోరుచున్నాఁడు. విక్రాంతః=పరాక్రమవంతుండు; బలవాన్ = అధికమయినబలముగలవాఁ




డు. శూరః= యుద్ధమునందు భయములేనివాఁడు; స్వే=తనదైన; పౌరుషే=పౌరుషమునందు ; వ్యవస్థితః = దృఢముగానుండువాఁడు.

ఇతండొకఁడే , తనసేనంగొని, లంకాపురినంతయుమర్దింపం గోరుచున్నాఁడు; ఇతండు, పరాక్రమవంతుండు; బలవంతుండు ; శూరుండు; తన పౌరుషంబువదలనివాఁడు.

అని, తాత్పర్యము.

రామప్రియార్థం ప్రాణానాం దయాం న కురుతే హరిః

టీక॥ హరిః = శతవలి; రామప్రియార్థం = రామునిసంతోషముకొఱకు; ప్రాణానాం= ప్రాణంబులకు; దయాం=దయను; నకురుతే=చేయఁడు.

ఈశతవలి, రామసంతోషార్థమయి, తనప్రాణంబులనుంగూడ, నెంతమాత్రముసరకుసేయఁడు.

అని, తాత్పర్యము.

గజో గవాక్షో గవయో నలో నీలశ్చ వానరః. ౪౭
ఏకైక ఏవ యూథానాం కోటిభి ర్దశభి ర్వృతః

టీక॥ గజః=గజుఁడును;గవాక్షః=గవాక్షుండును ; గవయః = గవయుఁడును ; నలః=నలుఁడును; నీలః=నీలుఁడును;వానరశ్చ = వానరుఁడును; ఏతేషాం(అధ్యాహృతము)=వీరలలో; ఏకైకఏవ = ఒక్కొకఁడె ; యూథానాం=సమూహములయొక్క;దశభిః=పది; కోటిభిః=కోటులచేత; వృతః = చుట్టఁబడియున్నాఁడు.

గజుండును గవాక్షుండునుగవయుండును నలుండును నీలుండును, వీరలు, ఒక్కొకరును , పదికోట్ల సైన్యముతోఁగూడియున్నారు.

అని, తాత్పర్యము.

తథా న్యే వానరశ్రేష్ఠా వింధ్యపర్వతవాసినః. ౪౮
నశక్యంతే బహుత్వాత్తు సంఖ్యాతుం లఘువిక్రమాః

టీక॥ తథా=అట్లు ; వింధ్యపర్వతవాసినః=వింధ్యపర్వతమునందువాసముసేయువారలును; లఘువిక్రమాః=శీఘ్రమయిన నడచుటగల వారలు న

గు; అన్యే=ఇతరులయిన ; వానరశ్రేష్ఠాః = వానరోత్తములు; బహుత్వాత్తు=అనేకులగుటవలననే;సంఖ్యాతుం=లెక్క-పెట్టుటకు; నశక్యం తే= అలవిగాదు.

అట్లువిధ్యపర్వతవాసులు , మహావేగులగు వానరోత్తము లనేకులున్నారు; వారలలెక్క-పెట్టనలవిగాదు.

అని, తాత్పర్యము.

సర్వే మహారాజ మహాప్రభావా
స్సర్వే మహాశైలనికాశకాయాః. ౪౫
సర్వే సమర్థాః పృథివీం క్షణేన
కర్తుం ప్రవిధ్వస్తవికీర్ణశైలామ్

టీక॥ మహారాజ= మహారాజుండవగురావణుఁడా! ఏతే (అధ్యాహృతము)=ఈవానరులు;మహాప్రభావాః = అధికమయినప్రభావముగలవారలు. సర్వే=అందఱును; మహాశైలనికాశకాయాః = మహాపర్వతముతోసమానమయినదేహముగలవారలు. సర్వే=అందఱును; పృథివీం=భూమిని; క్షణేన= క్షణముచేత ; ప్రవిధ్వస్తవికీర్ణశైలాం=పగులఁగొట్టఁబడినవియు వెదచల్లబడినవియునగు పర్వతములుగలదానిఁగా; కర్తుం=చేయుటకు ; సమర్థాః=సమర్థులు.

మహారాజుండవగురావణుఁడా! ఈ వానరులందఱును మహాప్రభావులు; పర్వతంబులవంటిదేహముగలవారలు;క్షణమాత్రమున , భూమియందలిపర్వతంబులనన్నింటెనిజూర్ణంబుగావించి తూర్పాఱఁబెట్టఁగలరు. అని , సారణుండు, రావణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే,సప్తవింశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ సప్తవింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

అష్టవింశసర్గప్రారంభః.

సారణస్య వచ శ్శ్రుత్వా రావణం రాక్షసాధిపమ్
బల మాదిశ్య త త్సర్వం శుకో వాక్య మథా బ్రవీత్. ౧

టీక॥అథ=అటుపిమ్మట;శుకః= శుకుఁడు;సారణస్య=సారణునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని;రాక్షసాధిపం = రాక్షసేశ్వరుండగురావణునిగూర్చి; తత్=ఆ;సర్వం=సమస్తమయిన; బలం=సైన్యమును;ఆదిశ్య = చూపి;వాక్యం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంత,శుకుండు,సారణుండు చెప్పినమాటలనంతయువిని, యతండు, సాకల్యంబునంజెప్పకుండుటంజేసి, తాను రాక్షసేశ్వరుండగురావణునకు, వానరసైన్యమునంతయుంజూపి, యిట్లనిచెప్పనారంభించెను. అని,తాత్పర్యము.

స్థితాన్ పశ్యసి యా న్నేతాన్ మత్తా నివ మహాద్విపాన్
న్యగ్రోధానివ గాంగేయాన్ సాలాన్ హైమవతానివ. ౨
ఏతే దుష్ప్రసహా రాజన్ బలినః కామరూపిణః
దైత్యదానవసంకాశా యుద్ధే దేవపరాక్రమాః. ౩

టీక॥రాజన్= రాక్షసరాజుండవగురావణుఁడా! మత్తాన్=మదించిన; మహాద్విపానివస్థితాన్= ఏనుంగులువలెనున్నవారలును ; గాంగేయాన్= గంగాతీరంబులంబుట్టిన;న్యగ్రోధానివ (స్థితాన్)=మఱ్ఱిచెట్లువలెనున్న వార

లును ; హైమవతాః=హిమవత్పర్వతంబునంబుట్టిన; సాల నివ(స్థితాః)=మద్దిచెట్లువలె నున్న వారలు నగు ; యాః=ఏ; ఏతాః=వీరలను; పశ్యసి=చూచుచున్నావో; ఏతే=వీరలు ; దుష్ప్రసహాః=ఓర్వనలవిగానివారలు. బలినః= అధికమయినబలముగలవారలు; కామరూపిణః= ఇచ్ఛాధీనమగు రూపముగలవారలు ; దైత్యదానవసంకాశాః=దైత్యులతోను దానవులతోను సమానులయినవారలు; యుద్ధే= యుద్ధమునందు; దేవపరాక్రమాః = దేవతలపరాక్రమమువంటిపరాక్రమము గలవారలు.

రాక్షసరాజుండవగు రావణుఁడా. మదవు ఠేనుంగులుంబోలె, గంగాతీరంబునంబుట్టిన వటవృక్షంబులుంబోలె , హిమవత్పర్వతంబునంబుట్టిన సాలవృక్షంబులుంబోలె మహాకాయులయియున్నయీవానరలంజూచుచున్నావే ;వీరలుదుర్జయులు; బలవంతులు; కామరూపులు;దైత్యదానవులకు సరివచ్చువారలు; యుద్ధంబున దేవతలకుంబోలెం బరాక్రమంబుగలవారలు.

అని, తాత్పర్యము.

ఏషాం కోటిసహస్రాణి నవ పంచచ సప్తచ
తథా శంఖసహస్రాణి తథా బృందశతానిచ. ४

టీక॥ఏషాం=ఈవానరులయొక్క; కోటిసహస్రాణి= కోటులయొక్క వేలు; నవ=తొమ్మిదియు; పంచచ= అయిదును;సప్తచ=ఏడును; తథా = అట్లు;శంఖసహస్రాణి=శంఖముయొక్క వేలును; తథా=అట్లు ; బృందశతానిచ=బృందములయొక్క నూఱులును; సంతి(అధ్యాహృతము)=ఉన్నవి.

ఈవానరులు , తొమ్మిదివేలకోట్లును, అయిదువేలకోట్లును, ఏడువేలకోట్లును. పెక్కువేలశంఖంబులును , పెక్కునూఱులబృందంబులును,ఇట్లు, అనంతంబుగనున్నారు.

అని, తాత్పర్యము.

ఏతే సుగ్రీవసచివాః కిష్కింధానిలయాస్సదా
హరయో దేవగంధర్వై రుత్పన్నాః కామరూపిణః. ५




టీక॥ ఏతే=ఈ; హరయః= వానరులు; సుగ్రీవసచివాః=సుగ్రీవునిసహాయులు;సదా = ఎల్లప్పుడు; కిష్కింధానిలయాః=కిష్కింధయె యునికిపట్టు గాఁగలవారలు; దేవగంధర్వైః=దేవతలచేతనుగంధర్వులచేతను; కామరూపిణః=ఇచ్ఛాధీనమగు రూపముగలవారలయి;ఉత్పన్నాః=పుట్టినవారలు.

ఈవానరులు,సుగ్రీవుఁ సచివులు;ఎల్లప్పుడునుసుగ్రీవునితోఁగూడఁగిష్కింధాపురినుండువారలు; దేవగంధర్వులకుఁబుట్టినవారలు; పుట్టిననాఁటనుండి,యిచ్ఛకువచ్చినరూపంబునొందశక్తిగలవారలు. అని,తాత్పర్యము.

యౌ తౌ పశ్యసి తిష్ఠంతౌ కుమారౌ దేవరూపిణౌ
మైందశ్చ ద్వివిదశ్చోభౌ తాభ్యాం నాస్తి సమో యుధి. ౬

టీక॥ దేవ= రావణుఁడా! రూపిణౌ=మంచిరూపముగల; తిష్ఠంతౌ= ఉన్న; కుమారౌ = యౌవనవంతులగు; యౌ=ఏ; తౌ=వారలను; పశ్యసి=చూచుచున్నావో; తౌ(అధ్యాహృతము)=ఆ; ఉభౌ=ఇద్దఱును; మైందశ్చ=మైందుండును; ద్వివిదశ్చ= ద్వివిదుండును. యుధి = యుద్ధమునందు; తాభ్యాం=వారలతోఁ; సమః= సమానుఁడు; నాస్తి=లేఁడు.

రావణుఁడా! సుందరరూపులును యౌవనవంతులునగు,వీరలిద్దఱును,మైందద్వివిదులనంబడుదురు; యుద్ధంబున, వీరలకుసరివచ్చువాఁడెవ్వఁడునులేఁడు. అని,తాత్పర్యము.

బ్రహ్మణా సమనుజ్ఞాతా వమృతప్రాశినా వుభౌ
ఆశంసేతే యుధా లంకా మేతౌ మర్దితు మోజసా. ౭

టీక॥ ఏతౌ(అధ్యాహృతము)= వీరలు; ఉభౌ=ఇద్దఱును; బ్రహ్మణా = బ్రహ్మదేవుని చేత;సమనుజ్ఞాతౌ = అనుమతింపఁబడినవారలయి ; అమృతప్రాశినౌ= అమృతంబుభుజించినవారలు. ఏతౌ=వీరలు; యుధా= యుద్ధముచేత ; ఓజసా=పరాక్రమముచేత; లంకాం=లంకాపురిని; మర్దితుం =




మర్దించుటకు ; ఆశంసేతే = కోరుచున్నారు.

ఈమైందద్వివిదులు , బ్రహ్మదేవుననుజ్ఞంజేసి,యమృతంబుద్రావియున్నారు; వీరలు, తమపరాక్రమంబున,యుద్ధంబునలంకాపురినిమర్దింపంగోరుచున్నారు.అని,తాత్పర్యము.

యా వేతావేతయోః పార్శ్వే స్థితౌ పర్వతసన్నిభౌ
సుముఖో సుముఖశ్చేతి మృత్యుపుత్రౌ పితు స్సమౌ. ౮
ప్రేక్షంతౌ నగరీం లంకాం కోటిభి ర్దశభి ర్వృతౌ

టీక॥ఏతయోః = ఈమైందద్వివిదులయొక్క; పార్శ్వే = ప్రక్కయందు;పర్వతసన్నిభౌ= కొండలతోసమానులగు;యౌ=ఎవ్వరు; దశభిః = పదియయిన;కోటీభిః=కోటులచేత ; వృతౌ=చుట్టఁబడినవారలయి; లంకాం= లంకయను; నగరీం=పట్టణమును; ప్రేక్షంతౌ=చూచుచు;స్థితౌ=ఉన్నారో; ఏతౌ=వీరలు; సుముఖః = సుఖుండును; అసుముఖశ్చ = అసుముఖుఁడును.ఇతి=అని; ఉచ్యేతే (అధ్యాహృతము)=చెప్పఁబడుచున్నారు . మృత్యుపుత్రౌ=మృత్యువుయొక్క-కొడుకులు ; పితుః=తండ్రికి; సమౌ= సమానులు.

ఈమైందద్వివిదులకుఁబ్రక్కను,గొండలువలెనిద్దఱు, పదికోటులసైన్యముంగూడి,లంకాపురింజూచుచున్నారు,చూడుము. వీరలు,సుముఖుండును , దుర్ముఖుండుననంబడుదురు; మృత్యువుకొడుకులు; తండ్రివంటి పరాక్రమవంతులు. అని, తాత్పర్యము.

యంతు పశ్యసి తిష్ఠంతం ప్రభిన్నమివ కుంజరమ్. ౯
యో బలాత్క్షోభయే త్క్రుద్ధ స్సముద్రమపి వానరః
ఏషో భిగంతా లంకాయా వైదేహ్యా స్తవచ ప్రభో. ౧౦

టీక॥ప్రభో=రావణుఁడా ! ప్రభిన్నం=మదించిన;కుంజరమివ(స్థితం)=ఏనుంగువలెనున్న;తిష్ఠంతం = ఉన్న; యంతు=ఎవ్వనిమాత్రము ; పశ్యసి=

చూచుచున్నావో; యః=ఏ; వానరః=వానరుఁడు; క్రుద్ధః=కోపించినవాఁడై; సముద్రమపి=సముద్రమునైనను; క్షోభయేత్=క్షోభింపఁజేయునో; ఏషః=ఇతండు; లంకాయాః=లంకాపురియొక్కయు; వైదేహ్యాః=సీతయొక్కయు; తవచ=నీయొక్కయు; అభిగంతా=పొందినవాఁడు.

రావణుఁడా! మదపుటేనుంగు వలెనున్నయీవానరవీరుంజూచుచున్నావుగదా! ఈతండు, కోపంబునొందినచో, సముద్రంబునేని క్షోభంబు నొందించును; ఇతండె, లంకకువచ్చి, సీతంజూచి, నీతోమాటలాడిపోయినవాఁడు.

అని, తాత్పర్యము.

ఏనం పశ్య పురా దృష్టం వానరం పున రాగతమ్
జ్యేష్ఠః కేసరిణః పుత్రో వాతాత్మజ ఇతి శ్రుతః. ౧౧

టీక॥ పురా=మున్ను; దృష్టం=చూడఁబడినవాఁడును; పునః = మఱల; ఆగతం=వచ్చినవాఁడునగు; ఏనం=ఇతని; పశ్య=చూడుము. అయం(అధ్యాహృతము)=ఇతండు; జ్యేష్ఠః=మొదటివాఁడైన; కేసరిణః=కేసరియొక్క; పుత్రః=కొడుకు. వాతాత్మజః = వాయువుయొక్కకొడుకు; ఇతి=అని; శ్రుతః=వినఁబడినాఁడు.

మున్నునీవితనింజూచియున్నావు; ఇప్పుడుమఱల, వచ్చియున్నాఁడు; చూడుము; ఇతండు, కేసరికిక్షేత్రజపుత్రుండు; వాయుదేవునకుఁ బుట్టినవాఁడు. అని, తాత్పర్యము.

హనుమా నితి విఖ్యాతో లంఘితో యేన సాగరః
కామరూపీ హరిశ్రేష్ఠో బలరూపసమన్వితః. ౧౨
అనివార్యగతిశ్చైవ యథా సతతగః ప్రభుః

టీక॥ యేన=ఎవ్వనిచేత; సాగరః=సముద్రము; లంఘితః=దాఁటఁబడినదో; అయం(అధ్యాహృతము)=ఈ; హరిశ్రేష్ఠః=వానరోత్తముఁడు; హనుమాన్=హనుమంతుండు; ఇతి=అని; విఖ్యాతః=ప్రసిద్ధినొందినవాఁడు. కా

మరూపీ= ఇచ్ఛాధీనంబగురూపముగల వాఁడు. బలరూపసమన్వితః = బలముతోను రూపముతోను గూడిన వాఁడు. ప్రభుః=సర్వవ్యాపకుఁడయిన; సతతగో యథా= వాయువువలె ; అనివార్యగతిశ్చైవ=అడ్డగింప నలవిగాని గమనముగలవాఁడు.

ఇతని పేరుహనుమంతుండనియందురు; ఇతండె సముద్రంబు దాఁటిలంకకువచ్చినమహాప్రభావుండు; కామరూపి; మహాబలుండు; పర్వతాకారుండు; సర్వవ్యాపకుండగువాయువువలె , అనివార్యంబగుగమనముగలవాఁడు.

అని, తాత్పర్యము.

ఉద్యంతం భాస్కరం దృష్ట్వా బాలఃకిల పిపాసితః. ౧౩

త్రియోజనసహస్రం తు అధ్వాన మవతీర్యహి

ఆదిత్య మాహరిష్యామి న మే క్షుత్ ప్రతియాస్యతి. ౧౪

ఇతి సంచింత్య మనసా పురైష బలదర్పితః

అనాధృష్యతమం దేవ మపి దేవర్షిదానవైః. ౧౫

అనాసాద్యైవ పతితో భాస్కరోదయనే గిరౌ

టీక॥ పురా=మున్ను; ఏషః=ఈహనుమంతుండు; బాలఃకిల = బాలుఁడై యే; పిపాసితః=దప్పిగొన్నవాఁడై; ఉద్యంతం = ఉదయించుచున్న; భాస్కరం=సూర్యుని; దృష్ట్వా=చూచి; బలదర్పితః=బలముచే గర్వించినవాఁడై; "ఆదిత్యం=సూర్యుని; ఆహరిష్యామి = భక్షించెదను. మే= నాయొక్క; క్షుత్= ఆఁకలి; న ప్రతియాస్యతి=పోదు," ఇతి= అని; మనసా=మనసుచేత; సంచింత్య= ఆలోచించి; త్రియోజన సహస్రం= మూఁడైన ఆమడల వేయిగల; అధ్వానం=మార్గమును; అవతీర్య = పొంది ( "హి" అనునది పాదపూరణార్థము); దేవర్షిదానవైరపి= దేవతలచేతనుఋషులచేతను దానవులచేతను; అనాధృష్యతమం=ఎంతమాత్రముధర్షింపరాని; దేవం=దేవుఁడైనసూర్యుని; అనాసాద్యైవ=పొందకయే; భాస్కరోదయనే = సూర్యుండుదయించునట్టి; గిరౌ=పర్వతమునందు; పతితః = పడినాఁడు.

మున్ను, ఇతండు, బాల్యంబున, నొకనాఁడాఁకలిగొని, యప్పుడెయుదయిం

చుచున్నసూర్యుంజూచి,బలగర్వంబున, "నాకాఁకలిదీఱకున్నది; సూర్యునింబట్టి భక్షించెదను." అని,తలంచి, పెక్కువేల యోజనంబులు, ఆకాశంబునంబోయి, దేవర్షిదానవులకైనను జెనకరానిసూర్యునిసమీపంబునకుఁబోవంజాలక,యుదయపర్వతంబునంబడెను.
అని,తాత్పర్యము.

పతి తస్య కపే రస్య హను రేకా శిలాతలే. ౧౬
కించి ద్భిన్నా దృఢహనో ర్హనుమా నేష తేన వై

టీక॥ దృఢహనోః= దృఢములయిన చెక్కిలిమీదిభాగములుగల; శిలాతలే= అాతియందు; పతితస్య=పడిన; అస్య= ఈ; కపేః=వానరునియొక్క; ఏకా= ఒక్కటైన ; హనుః=చెక్కిలిమీఁదిభాగము; కించిత్ =కొంచెము; భిన్నా = పగిలినది. తేనవై =అందుచేతనే ; ఏషః=ఇతండు; హనుమాన్=హనుమంతుఁడు.
దృఢంబులయినచెక్కిలిమీఁదిభాగములుగలయీవానరుండు , అట్లు , ఉదయాచలంబున , శిలాతలంబుపైఁబడఁగానే, యతనిచెక్కిలిమీఁదిభాగమొక్కటి; కొంచెము భిన్నమయినది; కావుననే,యతనికిహనుమంతుఁడనిపేరువచ్చిన్నది.అని,తాత్పర్యము.

సత్య మాగమయోగేన మమైష విదితో హరిః. ౧౭

టీక॥మమ=నాకు ; ఆగమయోగేన= ఆప్తవాక్యముయొక్కసంబంధముచేత; ఏషః=ఈ;హరిః= వానరుఁడు; విదితః = తెలియఁబడినాఁడు.సత్యం=యథార్థము.
నమ్మకముగలవానరుఁ డొకఁడు చెప్పఁగా , నీహనుమంతుని సంగతియంతయు నాకుఁదెలిసినది; ఇదిసత్యము. అని,తాత్పర్యము.

నాస్య శక్యం బలం రూపం ప్రభావో వాపిభాషితుమ్

టీక॥అస్య = ఈహనుమంతునియొక్క; బలం=బలముగాని; రూపం = రూపముగాని, ప్రభావోవాపి=మహిమగాని; భాషితుం=చెప్పుటకు ; నశ

క్యం=అలవిగాదు.

ఈహనుమంతుని బలముగానియా కారముగాని ప్రభావముగాని, చెప్ప నలవిగాదు.

అని, తాత్పర్యము.

ఏష ఆశంసతే లంకా మేకో మర్దితు మోజసా. ౧౮

టీక॥ఏషః=ఈహనుమంతుఁడు, ఏకః=ఒకఁడే; ఓజసా=పరాక్రమము చేత; లంకాం= లంకాపురిని; మర్దితుం=మర్దించుటకు; ఆశంసతే=కోరుచున్నాఁడు.

ఇతండొకఁడె, పరాక్రమంబున, లంకాపురినంతయు మర్దింపవలె నని యున్నాఁడు. అని, తాత్పర్యము.

యశ్చైషో నంతర శ్శూర శ్శ్యామః పద్మనిభేక్షణః
ఇక్ష్వాకూణా మతిరథో లోకే విఖ్యాతపౌరుషః ౧౯
యస్మిన్న చలతే ధర్మో యో ధర్మం నాతివర్తతే
యోబ్రాహ్మ మస్త్రం వేదాంశ్చ వేత్తివేదవిదాం వరః. ౨౦
యోభింద్యా ద్గగనం బాణైః పర్వతానపి దారయేత్
యస్య మృత్యో రివక్రోధ శ్శక్రస్యేవ పరాక్రమః. ౨౧
యస్య భార్యా జనస్థానా త్సీతాచాపహృతా త్వయా
స ఏష రామ స్త్వాం యోద్ధుం రాజన్ సమభివర్తతే. ౨౨

టీక॥ రాజన్=రావణుఁడా! శూరః = యుద్ధమునందుభయములేనివాఁడును; శ్యామః=శ్యామలవర్ణుఁడును; పద్మనిభేక్షణః= కమలములతోసమానములయినకండ్లుగలవాఁడునగు; యః=ఏ;ఏషచ=ఈతఁడును; అనంతరః=అవకాశములేకున్నాఁడో,హనుమంతునిప్రక్కనున్నాఁడోయనుట; యః(అధ్యాహృతము) = ఎవ్వఁడు; ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకువంశంబునంబుట్టినవారలలోపల;అతిరథః=పెక్కువిలుకాండ్రతోఁబోరువాఁడో, ఉత్తముఁడోయనుట;లోకే=లోకమునందు;విఖ్యాతపౌరుషః=ప్రసిద్ధినొందిన పరాక్రమము గలవాఁడో; యస్మిన్= ఎవ్వనియందు;ధర్మః=ధర్మము; నచలతే(నచలతి)=

చలింపదో; యః=ఎవ్వఁడు; ధర్మం=ధర్మమును; నాతివర్తతే = అతిక్రమింపఁడో; వేదవిదాం= వేదము దెలిసినవారలలో; వరః=శ్రేష్ఠుండగు; యః=ఎవ్వఁడు; బ్రాహ్మం=బ్రహ్మసంబంధియగు; అస్త్రం=అస్త్రమును; వేదాంశ్చ = వేదములను; వేత్తి=ఎఱుంగునో; యః = ఎవ్వఁడు; బాణైః = బాణముల చేత; గగనం=ఆకాశమును; భింద్యాత్ =భేదించునో; పర్వతానపి= పర్వతంబులనుంగూడ; దారయేత్ =పగుల్చునో; యస్య=ఎవ్వనికి; మృత్యోరివ=మృత్యువునకుంబోలె; క్రోధః=కోపమును; శక్రస్యేవ=ఇంద్రునకుంబోలె; పరాక్రమః=పరాక్రమమును; అస్తి(అధ్యాహృతము)కలదో; యస్య=ఎవ్వనియొక్క; భార్యా=పెండ్లామయిన; సీతాచ= సీతా దేవియు; త్వయా=నీచేత; జనస్థానాత్ =జనస్థానముననుండి; అపహృతా= అపహరింపఁబడినదో; ఏషః=ఇతఁడు; సః=అట్టి; రామః=రాముఁడు. త్వాం=నిన్నుఁగూర్చి; యోద్ధుం=యుద్ధము సేయుటకు; అభివర్తతే=వచ్చుచున్నాఁడు.

రావణుఁడా! ఈహనుమంతునకు సమీపంబున, శూరుండును శ్యామలవర్ణుండును బుండరీక నయనుండునగు దివ్యపురుషుండొకఁడున్నాఁడు, చూడుము; ఈతండు ఇక్ష్వాకుకులంబునఁబుట్టినవారిలోనుత్తముండు; నీవు జనస్థానంబుననుండి యపహరించిన సీతాదేవి యితనిభార్యయె; ఇతనిధర్మంబు వదలదు; ఇతండును ధర్మంబును వదలడు; వేదవేత్తలలోనుత్తముండు; బ్రహ్మాస్త్రంబు మొదలుగా సమస్తాస్త్రంబులను దెలిసినవాఁడు; ఆకాశంబునైనను బాణంబుల భేదింపఁగలఁడు; పర్వతంబులనుంగూడఁ బగులఁజేయఁగలఁడు; మృత్యువునకుంబోలె మహాకోపంబును దేవేంద్రునకుంబోలెఁ బరాక్రమంబునుగలవాఁడు; ఈతండే రాముండు; నీతో యుద్ధంబు సేయుటకు వచ్చుచున్నాఁడు. అని, తాత్పర్యము.

యస్యైష దక్షిణే పార్శ్వే శుద్ధజాంబూనదప్రభః
విశాలవక్షాస్తామ్రాక్షో నీలకుంచితమూర్ధజః. ౨౩
ఏషోస్య లక్ష్మణో రామభ్రాతా ప్రాణసమః ప్రియః

టీక॥ యస్య= ఏరామునియొక్క; దక్షిణే= కుడిదైన; పార్శ్వే = ప్రక్క

యందు;శుద్ధజాంబూనదప్రభః = నిర్మలమయిన బంగారముయొక్క కాంతివంటి కాంతిగలవాఁడును; విశాలవక్షాః = వెడల్పయినఱొమ్ముగలవాఁడును;తామ్రాక్షః=ఎఱ్ఱనికండ్లుగలవాఁడును; నీలకుంచితమూర్ధజః=నల్లనివియు వక్రములయినవియునగు తలవెండ్రుకలుగలవాఁడునగు; యః (అధ్యాహృతము)=ఏ; ఏషః=ఈతఁడు;అస్తి (అధ్యాహృతము) = ఉన్నాఁడో,ఏషః=ఇతఁడు;లక్ష్మణోనామ = లక్ష్మణుండను పేరుగలవాఁడు. అస్య=ఈరామునియొక్క; భ్రాతా=తమ్ముఁడు. ప్రాణసమః= ప్రాణంబులతోసమానుఁడైన;ప్రియః=ఇష్టుఁడు.

ఈరాముని దక్షిణపార్శ్వంబున, బంగారువంటి మేనుగలవాఁడును విశాలవక్షుండును, కోపంబునంజేసి, ఎఱ్ఱని కండ్లుగలవాఁడును, నల్లనివియువక్రములునగు వెండ్రుకలుగలవాఁడునగు నొక్క రాజపుత్రుండున్నాఁడు; చూడుము; ఇతండు, లక్ష్మణుండు; రాముని తమ్ముండు; రామునకుఁ బ్రాణంబువంటి ప్రియుండు. అని, తాత్పర్యము.

నయే యుద్ధేచ కుశల స్సర్వశాస్త్ర విశారదః. ౨౮
అమర్షీ దుర్జయో జేతా విక్రాంతో బుద్ధిమాన్ బలీ
రామస్య దక్షిణో బాహు ర్నిత్యం ప్రాణో బహిశ్చరః. ౨౯

టీక॥ అయం(అధ్యాహృతము)= ఈ లక్ష్మణుఁడు; నయే=నీతిశాస్త్రమునందు; యుద్ధేచ=యుద్ధమునందును; కుశలః= సమర్థుఁడును ; సర్వశాస్త్రవిశారదః= సమస్తశాస్త్రంబులయందు నుబండితుండు ; అమర్షీ =అధికమయినకోపముగలవాఁడు ; దుర్జయః = జయింపనలవిగానివాఁడు; జేతా= జయించువాఁడు ; విక్రాంతః=పరాక్రమంబుగలవాఁడు; బుద్ధిమాన్= అధికమయినబుద్ధిగలవాడు; బలీ= అధికమయినబలంబుగలవాఁడు. రామస్య= రామునియొక్క; దక్షిణః= కుడిదైన;బాహుః=భుజము; నిత్యం=ఎల్లప్పుడును; బహిశ్చరః= బయిటనుండునట్టి; ప్రాణః=ప్రాణము.

ఈలక్ష్మణుండు, నీతిశాస్త్రమునందునుయుద్ధంబునందునుమిక్కిలియుసమర్థుండు;సమస్తశాస్త్రంబులును దెలిసినవాఁడు ; మహాకోపుండు ; దుర్జ



యుండు; జయశీలుండు ; పరాక్రమవంతుండు; బుద్ధిమంతుండు;బలవంతుండు; రామునికుడిభుజము ; మఱియు రామునకుం బ్రాణంబువంటివాఁడు.

అని, తాత్పర్యము.

నహ్యేష రాఘవ స్యార్థే జీవితం పరిరక్షతి
ఏష్వైవా శంసతే యుద్ధే నిహంతుం సర్వరాక్షసాన్. ౨౮

టీ॥ఏషః= ఈతఁడు; రాఘవస్య=రాముని యొక్క; అర్థే= కార్యమునిమిత్తమయి; జీవితం=ప్రాణమును; నపరిరక్షతిహి=రక్షింపఁడుగదా! ఏష్వైవ (ఏషఏవ)=ఇతఁడె; యుద్ధే= యుద్ధమునందు;సర్వరాక్షసాన్ = సమస్తరాక్షసులను; నిహంతుం= వధించుటకు; ఆశంసతే=కోరుచున్నాఁడు.

ఈలక్ష్మణుఁడు , రామునినిమిత్తమయి, ప్రాణంబుల నేనిపిడుచును;ఈతఁడొక్కఁడె,యుద్ధంబున సమస్తరాక్షసులను వధింపవలెననియున్నాఁడు.

అని, తాత్పర్యము.

యస్తు సవ్య మసౌ పక్షం రామస్యాశ్రిత్య తిష్ఠతి
రక్షోగణ పరిక్షిప్తో రాజా హ్యేష విభీషణః. ౨౯

టీక॥యస్తు = ఏ; అసౌ= ఇతఁడుమాత్రము; రక్షోగణపరిక్షిప్తః= రాక్షసులచే పరివేష్టింపఁబడినవాఁడై; రామస్య=రామునియొక్క; సవ్యం= ఎడమదైన;పక్షం=ప్రక్కను;ఆశ్రిత్య= ఆశ్రయించి; తిష్ఠతి=ఉన్నాఁడో; ఏషః=ఇతండు; రాజా=రాజయిన; విభీషణోహి=విభీషణుండుగదా!

ఎవ్వండు , నలుగురు రాక్షసులంగూడి , రామునిసవ్యపార్శ్వంబునను న్నాఁడో, ఇతండు,రాక్షస రాజుండగువిభీషణుండు. అని, తాత్పర్యము.

ఇందు , "రాజా హ్యేషవిభీషణః" అనుస్థలంబుననున్న "హ" అనునక్షరముచే, గాయత్రి పదాఱవయక్షరము గ్రహింపబడినది; పదునైదువేలగ్రంథంబులయినవి; ఇంకఁబదునాఱవగ్రంథసహస్రం బారంభింపఁబడినదని యెఱుంగునది.



శ్రీమతా రాజరాజేన లంకాయా మభిషేచితః
త్వామేవ ప్రతి సంరబ్ధో యుద్ధాయైషోభివర్తతే. ౨౮

టీక॥ శ్రీమతా — శ్రీమంతుండగు; రాజరాజేన=రాజరాజుఁడైన రాముని చేత; లంకాయాం=లంకయందు; అభిషేచితః=అభిషేకింపఁబడినట్టి; ఏషః = ఈవిభీషణుఁడు; సంరబ్ధః = సంరంభముతోఁగూడినవాఁడై; త్వాంప్రత్యేవ= నిన్నుగూర్చియె; యుద్ధాయ= యుద్ధముకొఱకు; అభివర్తతే = వచ్చుచున్నాఁడు.

శ్రీమతుండును, రాజరాజుండునగురాముండు, ఈవిభీషణుని, లంకారాజ్యంబునకురాజుగానభిషేకించినాఁడు; ఇతండు, అతిసరంభంబున, నీపైకే యుద్ధంబునకువచ్చుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

యంతు పశ్యసి తిష్ఠంతం మధ్యే గిరి మివాచలమ్
సర్వ శాఖామృగేంద్రాణాం భర్తార మపరాజితమ్. ౨౯
తేజసా యశసా బుద్ధ్యా జ్ఞానేనాభి జనేనచ
యః కపీ నతిబభ్రాజ హిమవానివ పర్వతాన్. ౩౦
కిష్కింధాం యస్సమధ్యాస్తే గుహాం స గహనద్రుమామ్
దుర్గాం పర్వతదుర్గస్థాం ప్రధానైస్సహ యూథపైః. ౩౧
యస్యైషా కాంచనీ మాలా శోభతే శతపుష్కరా
కాంతా దేవమనుష్యాణాం యస్యాం లక్ష్మీః ప్రతిష్ఠితా. ౩౨
ఏతాంచ మాలాం తారాంచ కపిరాజ్యంచ శాశ్వతమ్
సుగ్రీవో వాలినం హత్వా రామేణ ప్రతిపాదితః. ౩౩

టీక॥సర్వశాఖామృగేంద్రాణాం= సమస్తవానరులకును; భర్తారం=ప్రభుండును; అపరాజితం=జయింపఁబడనివాఁడును; మధ్యే=నడుమ; తిష్ఠంతం= ఉన్నవాఁడును; అచలం=నిశ్చలుండును; గిరిమివ(స్థితం) = పర్వతమువలెనున్నవాఁడునగు; యంతు=ఎవ్వనిని; పశ్యసి=చూచుచున్నావో; యః=ఎవ్వఁడు; తేజ

సా=కాంతిచేతను; యశసా=కీర్తిచేతను; బుధ్యా=బుద్ధిచేతను; జ్ఞానేన=జ్ఞానంబుచేతను; అభిజనేనచ=కులముచేతను; కపీన్=వానరులను; పర్వతాన్=కొండలను; హిమవానివ=హిమవత్పర్వతమువలె; అతిబభ్రాజ=అతిశయించిప్రకాశించెనో; యః=ఎవ్వఁడు; ప్రధానైః=ముఖ్యులయిన; యూథపైస్సహ=యూథపులతోఁగూడ; దుర్గాం=ప్రవేశింపనలవిగానిదియును; పర్వతదుర్గస్థాం=పర్వతరూపమయినదుర్గంబుననున్నదియు; సగహనద్రుమాం=వనవృక్షంబులతోఁగూడినదియునగు; గుహాం=గుహారూపమయిన; కిష్కింధాం=కిష్కింధను; సమధ్యాస్తే=అధిష్ఠించియుండునో; యస్యాం=దేనియందు; లక్ష్మీః=వీరలక్ష్మి; ప్రతిష్ఠితా=స్థిరమయియుండునో; సా (అధ్యాహృతము)=అట్టి; యస్య=ఎవ్వనియొక్క; ఏషా=ఈ; దేవమనుష్యాణాం=దేవతలకునుమనుష్యులకును; కాంతా=కోరఁబడినదియు; శతపుష్కరా=నూఱుకమలములుగలదియు; కాంచనీ=బంగారువికారమైనదియునగు; మాలా=మాలిక; శోభతే=ప్రకాశించుచున్నదో; సః(అధ్యాహృతము)=అట్టి; సుగ్రీవః=సుగ్రీవుఁడు; రామేణ=రామునిచేత; వాలినం=వాలిని; హత్వా=వధించి; ఏతాం=ఈ; మాలాంచ=మాలికను; తారాంచ=తారను; శాశ్వతం=స్థిరమగు; కపిరాజ్యంచ=వానరరాజ్యంబును; ప్రతిపాదితః=పొందింపఁబడినాఁడు.

ఈరామవిభీషణులనడుమఁ, బర్వతంబువలె నిశ్చలుండైయున్న సర్వవానరముఖ్యుంజూచుచున్నావుగదా! ఇతండు సర్వవానరరాజుండగుసుగ్రీవుండు; హిమవత్పర్వతము సమస్త పర్వతములనతిశయించియుండునట్లు, ఈతండు, తేజంబునను యశస్సునను బుద్ధిచేతను జ్ఞానంబుచేతను గులంబుచేతను సమస్తవానరుల నతిశయించి యున్నాఁడు; దుర్గంబునుపర్వతదుర్గ పరివేష్టితంబును జుట్టును వనంబులు గలదియునగు, గుహారూపకిష్కింధయందు, ముఖ్యులగుయూథపులం గూడి, వాసము సేయుచుండును; ఈతనివక్షస్థలంబునసూఱుకమలంబులు గల కాంచనమాలిక వెలుఁగుచున్నది, చూడుము; ఇది దేవతలకునుగూడ దుర్లభమయినది; దీనిధరించినవాఁడు, ఎప్పుడును యుద్ధంబునఁబరాజయంబునొందఁడు, రాముండు, యుద్ధంబునవాలిని వధిం

చి, సుగ్రీవునకు, ఈకాంచన మాలయుఁ దారయు శాశ్వతంబగు వానర రాజ్యంబును, సిద్ధించునట్లుగావించెను. అని, తాత్పర్యము.

శతం శత సహస్రాణాం కోటి మాహు మనీషిణః
శతం కోటిసహస్రాణాం శంఖ ఇత్యభిధీయ తే. ३४

టీక॥ శతసహస్రాణాం = లక్షలయొక్క; శతం = నూటిటిని; మనీషిణః=పండితులు;కోటిం=కోటినిగా;ఆహుః=చెప్పుచున్నారు.కోటిసహస్రాణాం=వేయికోటులయొక్క; శతం= నూఱు; శంఖఇతి = శంఖమని; అభిధీయ తే=చెప్పఁబడుచున్నది.

నూఱులక్షలు, కోటియనిచెప్పుచున్నారు; నూఱువేలకోట్లు, శంఖమనఁబడుచున్నది. అని, తాత్పర్యము.

శతం శంఖసహస్రాణాం మహాశంఖ ఇతి స్మృతః
మహాశంఖసహస్రాణాం శతం బృంద మితి స్మృతమ్. ३५

టీక॥ శంఖసహస్రాణాం=శంఖములవేలయొక్క; శతం=నూఱు ; మహాశంఖఇతి=మహాశంఖమని; స్మృతః= చెప్పఁబడినది. మహాశంఖసహస్రాణాం= మహాశంఖంబులవేలయొక్క ; శతం = నూఱు; బృందమితి=బృందమని; స్మృతం=చెప్పఁబడినది-

నూఱువేలశంఖంబులు మహాశంఖంబగుచున్నది; నూఱువేల మహాశంఖంబులుబృందమనిచెప్పఁబడుచున్నది.
అని, తాత్పర్యము.

శతం బృందసహస్రాణాం మహా బృంద మితిస్మృతమ్
మహాబృందసహస్రాణాం శతం పద్మ మితిస్మృతమ్. ३६

టీక॥బృందసహస్రాణాం= బృందములవేలయొక్క; శతం=నూఱు; మహాబృందమితి=మహాబృందమని; స్మృతం=చెప్పఁబడినది. మహాబృందసహస్రాణాం= మహాబృందములవేలయొక్క; శతం=నూఱు; పద్మమితి= పద్మమని; స్మృతం=చెప్పఁబడినది.

నూఱువేలబృందములు మహాబృంద

మని చెప్పఁబడినది; మహాబృందంబులు నూఱు వేలు, పద్మంబగుచున్నది.

అని, తాత్పర్యము.

శతం పద్మసహస్రాణాం మహాపద్మమితి స్మృతమ్
మహాపద్మసహస్రాణాం శతం ఖర్వమితి స్మృతమ్. ३६

టీక॥ పద్మసహస్రాణాం=పద్మంబులవేలయొక్క; శతం=నూఱు; మహాపద్మమితి=మహాపద్మమని; స్మృతం= చెప్పఁబడినది. మహాపద్మసహస్రాణాం= మహాపద్మములయొక్క వేలు ; శతం= నూఱు; ఖర్వమితి = ఖర్వమని; స్మృతం=చెప్పఁబడినది.

నూఱు వేలపద్మంబులు మహాపద్మంబనంబడును; మహాపద్మంబులునూఱు వేలు, ఖర్వంబనంబడును.

అని, తాత్పర్యము.

శతం ఖర్వసహస్రాణాం మహాఖర్వ మితి స్మృతమ్
మహాఖర్వసహస్రాణాం సముద్ర మభిధీయతే. ३७

టీక॥ ఖర్వసహస్రాణాం=ఖర్వములవేలయొక్క; శతం=నూఱు; మహాఖర్వమితి=మహాఖర్వమని; స్మృతం= చెప్పఁబడినది. మహాఖర్వసహస్రాణాం= మహాఖర్వముల వేలయొక్క; శతం(అధ్యాహృతము)=నూఱు; సముద్రం=సముద్రముగా; అభిధీయతే=చెప్పఁబడుచున్నది.

నూఱు వేలఖర్వంబులు మహాఖర్వంబనఁబడుచున్నది; మహాఖర్వంబులు నూఱు వేలు, సముద్రంబనంబడును.

అని, తాత్పర్యము.

శతం సముద్రసాహస్ర మోఘ ఇత్యభిధీయతే
శత మోఘసహస్రాణాం మహౌఘఇతి విశ్రుతః. ३८

టీక॥ శతం=నూఱు; సముద్రసాహస్రం=సముద్రంబుల వేలు ; ఓఘఇతి=ఓఘమని; అభిధీయతే=చెప్పఁబడుచున్నది. ఓఘసహస్రాణాం= ఓఘముల వేల

యొక్క; శతం=నూఱు; మహౌఘ ఇతి= మహౌఘమని ; విశ్రుతః=వినఁబడినది.

నూఱువేలసముద్రములు , ఓఘమని చెప్పఁబడును; నూఱువేల, యోఘములు, మహౌఘమనంబడును.

అని, తాత్పర్యము.

ఏవం కోటిసహస్రేణ శంఖానాంచ శతేనచ
మహాశంఖసహస్రేణ తథా బృందశతేనచ. ౪౦
మహాబృందసహస్రేణ తథా పద్మశతేనచ
మహాపద్మసహస్రేణ తథా ఖర్వశతేనచ. ౪౧
సముద్రేణ శతేనైవ మహౌఘేన తథైవచ
ఏవ కోటి మహౌఘేన సముద్రసదృశేనచ. ౪౨
విభీషణేన సచివై రాక్షసైః పరివారితః
సుగ్రీవో వానరేంద్ర స్త్వాం యుద్ధార్థ మభివర్తతే
మహాబలవృతో నిత్యం మహాబలపరాక్రమః. ౪౩

టీక॥ ఏవం=ఇట్లు; కోటిసహస్రేణ=కోటులవేయింటిచేతను;తథా=అట్లు; శంఖానాంచ=శంఖములయొక్కయు; శతేనచ=నూఱుచేతను; మహాశంఖసహస్రేణ = మహాశంఖములవేయింటిచేతను;తథా=అట్లు;బృందశతేనచ = బృందములయొక్కనూఱుచేతను; మహాబృందసహస్రేణ=మహాబృందములయొక్కవేయింటిచేత;తథా = అట్లు; పద్మశతేనచ=పద్మంబులనూఱుచేతను;మహాపద్మసహస్రేణ=మహాపద్మములయొక్కవేయిచేతను;తథా=అట్లు; ఖర్వశతేనచ=ఖర్వములయొక్కనూఱుచేతను; శతేన=నూఱయిన; సముద్రేణైవ=సముద్రముచేతను ; తథైవచ=అట్లే; మహౌఘేన= మహౌఘముచేతను; సముద్రసదృశేనచ= సముద్రముతోసమానమయిన; మహౌఘేనచ = కోటిమహౌఘములచేతను ; విభీషణేన=విభీషణునిచేతను; సచివైః=(అతని)మంత్రులగు; రాక్షసైః= రాక్షసులచేతను; పరివారితః= పరివేష్టింపఁబడినవాఁడును;మహాబలవృతః= గొప్పసైన్యముచేఁ జుట్టఁబడినవాఁడును ;

నిత్యం = ఎల్లప్పుడును ; మహాబలపరాక్రమః= అధికమయినబలమునుబరాక్రమమునుగలవాఁడును; వానరేంద్రః= వానరరాజుండునగు; ఏషః= ఈ; సుగ్రీవః=సుగ్రీవుఁడు; త్వాం= నిన్నుగూర్చి; యుద్ధార్థం = యుద్ధముకొఱకు; అభివర్తతే=వచ్చుచున్నాఁడు.

వేయికోటులును నూఱుశంఖంబులును వేయి మహాశంఖంబులుననూఱుబృందంబులును వేయిమహాబృందంబులును, నూఱుపద్మంబులును, వేయిమహాపద్మంబులగు నూఱుఖర్వంబులును, నూఱుసముద్రంబులునుమహౌఘంబులునుగోటి మహౌఘంబులును,ఇట్లు,సముద్రంబువలెననంతంబయినమహాసేనంగూడి, విభీషణుండునుఅతనిమంత్రులగురాక్షసులునువెంటనడవ, మహాబలపరాక్రమశాలియు,వానరరాజుండునగుసుగ్రీవుండు,నీతోయుద్ధముసేయవచ్చుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఇమాం మహారాజ సమీక్ష్య వాహినీ
ముపస్థితాం ప్రజ్వలితగ్రహోపమామ్
తతః ప్రయత్నః పరమో విధీయతాం
యథా జయస్స్యాన్న పరైః పరాజయః. ४४

టీక॥మహారాజ= మహారాజుండవగురావణుఁడా ! ప్రజ్వలితగ్రహోపమాం=జ్వలించుచున్నగ్రహముతోఁ బోలికఁగలదియు;ఉపస్థితాం = వచ్చినదియునగు;ఇమాం=ఈ; వాహినీం=సేనను;సమీక్ష్య=చూచి ; తతః=అటుపిమ్మట; యథా=ఎట్లు;జయః= జయము; స్యాత్=కలుగునో; పరైః= శత్రువులచేత; పరాజయః= అపజయము;న=కలుగదో; తథా(అధ్యాహృతము)=అట్లు;పరమః=శ్రేష్ఠమయిన;ప్రయత్నః=ప్రయత్నము. విధీయతాం= చేయఁబడుఁగాక.

మహారాజుండవగు రావణుఁడా ! క్రూరగ్రహముంబోలె వెలుంగుచున్న యిమ్మహాసేనంజూచి, యింక , మనకు, జయముగలుగునట్లును, శత్రువులచేనపజయమురాకుఁడునట్లును,జక్కఁగాఁబ్రయత్నంబుగావింపుము. అని,శుకుండు,రావణునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, అష్టావింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండాష్టావింశసర్గటీక,
ముగిసినది.

---

౨౯

ఏకోనత్రింశసర్గప్రారంభః.

శుకేనతు సమాఖ్యాతాం స్తాన్ దృష్ట్వా హరియూథపాన్
సమీపస్థాంశ్చ రామస్య భ్రాతరం స్వం విభీషణమ్. ౧
లక్ష్మణంచ మహావీర్యం భుజం రామస్య దక్షిణమ్
సర్వవానరరాజంచ సుగ్రీవం భీమవిక్రమమ్. ౨
కించిదా విగ్నహృదయో జాతక్రోధశ్చ రావణః
భర్త్సయామాస తౌ వీరౌ కథాం తే శుకసారణౌ. ౩

టీక॥ రావణః = రావణుఁడు; శుకేన = శుకునిచేత; సమాఖ్యాతాన్ = చెప్పఁబడిన; తాన్ = ఆ; హరియూథపాన్ = వానరశ్రేష్ఠులను; రామస్య = రామునియొక్క; సమీపస్థాన్ = సమీపముననున్న; స్వం = తన; భ్రాతరం = తమ్ముఁడయిన; విభీషణంచ = విభీషణుని; మహావీర్యం = అధికమయినపరాక్రమముగలవాఁడును; రామస్య = రాముని యొక్క; దక్షిణం = కుడిదైన; భుజం = బాహువునగు; లక్ష్మణంచ = లక్ష్మణుని; సర్వవానరరాజం = సమస్తవానరులకును ప్రభుండగు; భీమవిక్రమం = భయంకరమయిన పరాక్రమముగల; సుగ్రీవంచ = సుగ్రీవుని; దృష్ట్వాతు = చూచినంతనె; కించిత్ = కొంచెము;

ఆవిగ్నహృదయః = భయమునొందిన మనస్సుగలవాఁడై; జాతక్రోధశ్చ=పుట్టినకోపముగలవాఁడునై; కథాంతే = కథయొక్క తుదయందు; వీరౌ= పరాక్రమశాలులగు; తౌ= ఆ; శుకసారణౌ= శుకసారణులను ; భర్త్సయామాస= బెదరించెను.

అంత, రావణుండు , శుకుండు చెప్పినవానరయూథపులనందఱను, రామునిసమీపంబుననున్నతనతమ్ముఁడగు విభీషణుని, మహాపరాక్రమశాలియు రాముని కుడిభుజమునయిన లక్ష్మణుని, భయంకరవీర్యుండునుసమస్తవానర రాజుండునగుసుగ్రీవుని, మఱియుహనుమంతుండుమొదలగు మేటివానరవీరులనుం జూచి,మనంబునఁగొంచెము భయము నొంది, యంతంబరమకుపితుండై,పరాక్రమవంతులగునాశుకసారణులం జూచి, పరుషవచనంబులబెదరించెను.

అని, తాత్పర్యము.

అధోముఖౌ తౌ ప్రణతా వబ్రవీచ్ఛుకసారణౌ
రోషగద్గదయా వాచా సంరబ్ధః పరుషం వచః. ౪

టీక॥ సః(అధ్యాహృతము)=ఆ రావణుఁడు; సంరబ్ధః= వేగముతోఁగూడినవాఁడై; ప్రణతౌ=నమస్కరించినవారలును; అధోముఖౌ= క్రిందు మొగమయినముఖము గలవారలునగు; తౌ=ఆ; శుకసారణౌ=శుకసారణులనుగూర్చి; రోషగద్గదయా= కోపముచేడగ్గుత్తికగల; వాచా=మాటచేత; పరుషం= కఠినమయిన; వచః=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

ఆ రావణుండు, తనకునమస్కరించి, మొగంబువంచుకొనియున్న శుకసారణులంజూచి, సంరంభంబునఁ, గోపముచేడగ్గుత్తికగదురఁ, బరుషవాక్యంబున, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

న తావ త్సదృశంనామ సచివై రుపజీవిభిః
విప్రియం నృపతే ర్వక్తుం నిగ్రహే ప్రగ్రహే ప్రభోః. ౫

టీక॥ నిగ్రహే=నిగ్రహించుటయందును; ప్రగ్రహే = అనుగ్రహించుటయందును; ప్రభోః=సమర్థుఁడగు; నృపతేః=రాజునకు; ఉపజీవిభిః = ఆశ్ర

యించిజీవించునట్టి; సచివైః= మంత్రులచేత; విప్రియం=అనిష్టమయినమాటను; వక్తుం=చెప్పుటకు; తావత్=ఎంతమాత్రము; సదృశం=సరియయినది; న నామ=కాదుగదా!

నిగ్రహానుగ్రహంబులు సేయుటకు సమర్థుండగు, రాజునకు, అతనియొద్దబ్రదుకుచుండుమంత్రులు, ఇట్లు, అప్రియ వార్తలంజెప్పుట, యెంతమాత్రమును సరిగాదు. అని, తాత్పర్యము.

రిపూణాం ప్రతికూలానాం యుద్ధార్థ మభివర్తతామ్
ఉభాభ్యాం సదృశంనామ వక్తుమ ప్రస్తవే స్తవమ్. ౬

టీక॥ఉభాభ్యాం = ఇద్దఱిచేతను; అప్రస్తవే=అసమయమునందు ; ప్రతికూలానాం = ప్రతికూలురును; యుద్ధార్థం = యుద్ధముకొఱకు; అభివర్తతాం (అభివర్తమానానాం) = వచ్చుచున్నవారలునగు ; రిపూణాం= శత్రువులయొక్క ; స్తవం=స్తోత్రమును; కర్తుం = చేయుటకు; సదృశం నామ=సరియాయేమి?.

ఇట్టియుద్ధారంభసమయంబున, మనకుఁబ్రతికూలురును మనపైకి యుద్ధమునకువచ్చినవారలునగుశత్రువులను , మీరిద్దఱునిట్లుస్తోత్రము సేయుట యుక్తమా?అని, తాత్పర్యము.

ఆచార్యా గురవో వృద్ధా వృథా వాం పర్యుపాసితాః
సారం య ద్రాజశాస్త్రాణా మనుజీవ్యం న గృహ్యతే. ౭

టీక॥యత్=ఏకారణమువలన; రాజశాస్త్రాణాం= రాజనీతిశాస్త్రముల యొక్క; సారం=ముఖ్యమయిన ; అనుజీవ్యం=భృత్యకార్యము ; నగృహ్యతే=గ్రహింపఁబడలేదో;తత్ (అధ్యాహృతము)=అందువలన; వాం=(తృతీయార్థమునందుషష్ఠి ) మీచేత;ఆచార్యాః=ఆచార్యులును; గురవః= గురువులును;వృద్ధాః=వృద్ధులును; వృథా= వ్యర్థముగా; పర్యుపాసితాః = ఉపాసింపఁబడినారు.

మీరలు, రాజనీతిలోసార భూతమయిన భృత్యకార్యముదెలియకున్నారు, కావున,మీరలు, ఆచార్యులనుగురువులనువృ

ద్ధులను సేవించినదంతయువ్యర్థము. అని, తాత్పర్యము.

గృహీతో వా నవిజ్ఞాతో భారోజ్ఞానస్య వోహ్యతే

టీక॥గృహీతోవా=గ్రహింపఁబడిన దైననుఁ; నవిజ్ఞాతః=తెలియఁబడలేదు. జ్ఞానస్య=జ్ఞానముయొక్క ; భారః= భారము; ఊహ్యతేవా=మోయఁబడు చున్నదేమొ.

ఒకవేళ,మీరలు,నీతిశాస్త్రము గట్టిచేసినను; దానియర్థము తెలిసికొన లేదు;లేక అర్థము దెలిసియు, దానియ నుష్ఠానము లేకుండుటవలన , జ్ఞానభారమును,మోయుచున్నారు కాఁబోలు, అని, తాత్పర్యము.

ఈదృశైః స్సచివై ర్యుక్తో మూర్ఖై ర్దిష్ట్యా ధరామ్యహమ్

టీక॥అహం=నేను; మూర్ఖైః= మూర్ఖులగు;ఈదృశైః = ఇట్టి; సచివైః=మంత్రులతో;యుక్తః= కూడినవాఁడనై; దిష్ట్యా=అదృష్టముచేత; ధరామి=బ్రతికియున్నాను.

ఇట్టిమూర్ఖులగు మంత్రులంగూడియుండుటవలన, నేనెప్పుడోశత్రువుల చేహతుఁడైయుండవలసినవాఁడను;దైవయోగంబున, బ్రతికియున్నాను. అని, తాత్పర్యము.

కిన్ను మృత్యో ర్భయంనాస్తి వక్తుం మాం పరుషం వచః
యస్య మే శాసతో జిహ్వా ప్రయచ్ఛతి శుభాశుభమ్. ౯

టీక॥శాసతః— ఆజ్ఞాపించుచున్న; యస్య=ఏ;మే=నాయొక్క; జిహ్వా= నాలుక;శుభాశుభం= మంగళమునుఅమంగళమును; ప్రయచ్ఛతి=ఇచ్చుచున్నదో.తం(అధ్యాహృతము)=అట్టి;మాం= నన్నుఁగూర్చి;పరుషం—కఠినమయిన;వచః=మాటను;వక్తుం=చెప్పుటకు;యువయోః(అధ్యాహృతము)=మీకు; మృత్యోః=మరణమువలన;భయం — వెఱపు;నాస్తికిన్ను=లేదాయేమి?

నేనాజ్ఞాపించిన, నామాటమాత్రమువలననె, శుభముగాని యశుభము

గాని గలుగును గదా! అట్లుండఁగా, మీరు మరణంబునకుఁగూడ భయపడరా యే మి? నాయెదుటనిట్టిపరుషవచనంబులా డితిరే? అని, తాత్పర్యము.

అప్యేవ దహనం స్పృష్ట్వా వనే తిష్ఠంతి పాదపాః
రాజదోషపరామృష్టా స్తిష్ఠంతే నాపరాధినః. ౧౦

టీక॥ వనే = అడవియందు; దహనం = అగ్నిమాత్రమును; స్పృష్ట్వాపి = తాఁకియు; పాదపాః = వృక్షములు; తిష్ఠంత్యేవ = ఉండునే, రాజదోషపరామృష్టాః = రాజదోషముచేసంబంధింపఁబడిన; అపరాధినః = అపరాధులు; నతిష్ఠంతే (నతిష్ఠంతి) = ఉండరు.

అడవియందు దావానలంబుదగిలిన వృక్షంబులుగూడ క్షేమంబుననుండును; రాజకోపంబునకుఁ బాత్రులయినయపరాధులుమాత్రము, క్షేమంబునొందంజాలరు. అని, తాత్పర్యము.

హన్యా మహంత్విమా పాపౌ శత్రుపక్షప్రశంసకౌ
యది పూర్వోపకారైస్తు నక్రోధో మృదుతాం వ్రజేత్. ౧౧

టీక॥ పూర్వోపకారైస్తు = మునుపటియుపకారములచేతమాత్రము; క్రోధః = కోపము; మృదుతాం = మెత్తనగుటను; నవ్రజేద్యది = పొందకుండునేని; అహంతు = నేనుమాత్రము; శత్రుపక్షప్రశంసకౌ = శత్రుపక్షమును శ్లాఘించునట్టి; పాపౌ = పాపిష్ఠులగు; ఇమౌ = ఈ శుకసారణులను; హన్యాం = వధింపుదును.

వీరలుమున్ను నాకుఁగావించిన యుపకారములుజ్ఞప్తికివచ్చుటవలన, నాకోపముతగ్గకుండునేని, నేను, ఇప్పుడే, శత్రుపక్షంబును బ్రశంసించిన పాపిష్ఠులగు నీ శుకసారణులను వధించి యుందును. అని, తాత్పర్యము.

అపధ్వంసత గచ్ఛధ్వం సన్నికర్షా దితో మమ
నహి వాం హంతు మిచ్ఛామి స్మ రా మ్యుపకృతాని వామ్. ౧౨

టీక॥ అపధ్వంసత = స్థానముననుండి భ్రష్టులగుదురు. ఇతః = ఇచ్చటనుండి; మమ = నాయొక్క; సన్నికర్షాత్ = ప్రత్యక్షముననుండి; గచ్ఛథ్వం (గచ్ఛత) = పొందు. వాం = మిమ్ము; హంతుం = చంపుటకు; నేచ్ఛామిహి = కోరనుగదా! వాం = మీయొక్క; ఉపకృతాని = ఉపకారములను; స్మరామి = తలంచుచున్నాను.

మిమ్ము స్థానభ్రష్టులం గావించుట మంచిది; నాదగ్గిఱనుండవలదు, పొండు; మీరు మున్ను పెక్కుపకారములం గావించినవారలుకావున, మిమ్ము వధింపనొల్లను. అని, తాత్పర్యము.

హతావేవ కృతఘ్నౌ తౌ మయి స్నేహపరాఙ్ముఖౌ

టీక॥ కృతఘ్నౌ = చేయఁబడినయుపకారములనుమఱచినవారలును; మయి = నావిషయమయి; స్నేహపరాఙ్ముఖౌ = స్నేహమునకుఁ బెడమొగముగలవారలునగు; తౌ = అట్టిమీరలు; హతావేవ = చంపఁబడినవారలె.

మీరలు, కృతఘ్నులరనియు నాయందు స్నేహములేనివారలనియు, విడిచిపెట్టుటయె, మిమ్ము వధించుటయగుచున్నది. అని, రావణుండు శుకసారణులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తౌతు సవ్రీళౌ తావుభౌ శుకసారణౌ. ౧౩
రావణం జయశబ్దేన ప్రతినంద్యాభి నిస్సృతౌ

టీక॥ తౌ = ఆ; శుకసారణౌ = శుకసారణులు; ఏవం = ఇట్లు; ఉక్తౌతు = చెప్పఁబడినవారలయినంతనె; సవ్రీళౌ = సిగ్గుతోఁగూడినవారలయి; రావణం = రావణుని; జయశబ్దేన = "జయ" యనుశబ్దముచేత; ప్రతినంద్య = పొగడి; అభినిస్సృతౌ = పోయిరి.

ఆశుకసారణులిర్వురును, రావణుని మాటనువిని, లజ్జనొందినవారలయి, రావణునిజయశబ్దంబునఁ బొగడి, యంతంబోయిరి. అని, తాత్పర్యము.

అబ్రవీత్తు దశగ్రీవ స్సమీపస్థం మహోదరమ్. ౧౪

టీక॥ దశగ్రీవః = రావణుండు; సమీపస్థం = సమీపంబుననున్న; మహోదరంతు = మహోదరునిగూర్చియు; అబ్రవీత్ = చెప్పెను.

అంత, రావణుండు, తనసమీపంబుననున్నమహోదరుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఉపస్థాపయ మే శీఘ్రం చారా న్నీతివిశారదాన్

టీక॥ మే = నాకొఱకు; నీతివిశారదాన్ = రాజనీతియందుఁబండితులయిన; చారాన్ = వేగులవాండ్రను; ఉపస్థాపయ = రావింపుము.

రాజనీతియందు మిక్కిలియుఁబండితులయినచారులను నాయొద్దకుఁదీసికొనిరమ్ము. అని, రావణుఁడు, మహోదరునకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

మహోదర స్తథో క్తస్తు శీఘ్ర మాజ్ఞాపయ చ్చరాన్. ౧౫

టీక॥ మహోదరః = మహోదరుఁడు; తథా = అట్లు; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడైనంతనె; శీఘ్రం = శీఘ్రముగా; చరాన్ = వేగులవాండ్రను; ఆజ్ఞాపయత్ = ఆజ్ఞాపించెను.

మహోదరుండు, రావణునియాజ్ఞచొప్పున, వేగులవాండ్రనురావణునియొద్దకురమ్మనియాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

తత శ్చారా స్సంత్వరితాః ప్రాప్తాః పార్థివశాసనాత్
ఉపస్థితాః ప్రాంజలయో వర్ధయిత్వా జయాశిషా. ౧౬

టీక॥ తతః = అంత; చారాః = వేగులవాండ్రు; పార్థివశాసనాత్ = రాజాజ్ఞవలన; సంత్వరితాః = వేగిరపడినవారలయి; ప్రాప్తాః = వచ్చినవారలయి; ప్రాంజలయః = మంచిచేమోడ్పుగలవారలయి; జయాశిషా = జయప్రతిపాదకమయిన యాశీర్వచనముచేత; వర్ధయిత్వా = దీవించి; ఉపస్థితాః = సేవింపుచుండిరి.

అంతం జారపురుషులు, రాజాజ్ఞ

చెప్పిన, వేగంబునవచ్చి, చేమోడ్పు గీలించి, "జయజయ" యనియాశీర్వాదముగావించి, కొలిచియుండిరి.

అని, తాత్పర్యము.

తా నబ్రవీ త్తతో వాక్యం రావణో రాక్షసాధిపః
చారాన్ ప్రత్యాయితాన్ శూరా న్భక్తాన్ విగతసాధ్వసాన్. ౧౭

టీక॥ తతః=అంత; రాక్షసాధిపః=రాక్షసులకుఁబ్రభుఁడయిన; రావణః=రావణుఁడు; ప్రత్యాయితాన్= నమ్మకముంచఁదగినవారలును; శూరాన్=యుద్ధమునందుభయములేనివారలును; భక్తాన్=రాజభక్తిగలవారలును; విగతసాధ్వసాన్= పోయినశత్రుభయముగలవారలునగు; తాన్=ఆ; చారాన్=వేగులవాండ్రనుగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, రాక్షసేశ్వరుండగు రావణుండు, విశ్వసనీయులును శూరులును శత్రుభయములేనివారలు రాజభక్తిగలవారలునగు నాచారులంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇతో గచ్ఛత రామస్య వ్యవసాయం పరీక్షథ
మంత్రి ష్వభ్యంతరా యేస్య ప్రీత్యా తేన సమాగతాః. ౧౮

టీక॥ ఇతః=ఇచ్చటనుండి; గచ్ఛత=పొండు. రామస్య=రామునియొక్క; వ్యవసాయం=ప్రయత్నమును; పరీక్షథ(పరీక్షధ్వం)=పరీక్షింపుఁడు. మంత్రిషు=మంత్రులయందు; యే=ఎవ్వరు; అస్య=ఈరామునికి; అభ్యంతరాః= అంతరంగభూతులో; తేన=అతనితో; ప్రీత్యా=స్నేహముచేత; సమాగతాః=చేరినవారలో; తానపి (అధ్యాహృతము)=వారలనుగూడ; పరీక్షధ్వం (అధ్యాహృతము)=పరీక్షింపుఁడు.

మీరలిచ్చటనుండి, రామునొద్దకుఁబోయి, యతనివ్యవసాయంబెట్టిదైనదియు, నతనికంతరంగభూతులును బ్రియులునగుమంత్రులెవ్వరైనదియుఁ బరీక్షించిరండు. అని, తాత్పర్యము.

కథం స్వపితి జాగర్తి కి మన్యచ్చ కరిష్యతి

విజ్ఞాయ నిపుణం సర్వ మాగంతవ్య మశేషతః. ౧౯

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు;కథం=ఎట్లు;స్వపితి= నిదురించుచున్నాఁడు?జాగర్తి= మేలుకొనుచున్నాఁడు?అన్యచ్చ= ఇతరమును; కిం=దేనిని;కరిష్యతి=చేయును?సర్వం= సమస్తమును;నిపుణం= సామర్థ్యము దోఁచునట్లుగా ; అశేషతః=నిశ్శేషముగా;విజ్ఞాయ=తెలిసికొని ; ఆగంతవ్యం=వచ్చుటకావలసినది.

రాముండు,ఎట్లునిదురించును? ఎట్లుమేలుకొనును?మఱియేమేమికార్యము సేయఁదలంచియున్నాఁడు? ఈసంగతుల నన్నింటిని సామర్థ్యంబునం జక్కఁగాఁ దెలిసికొని,రావలయును.అని,తా.

చారేణ విదిత శ్శత్రుః పండితై ర్వసుధాధిపైః
యుద్ధే స్వల్పేన యత్నేన సమాసాద్య నిరస్యతే. ౨౦

టీక॥పండితైః = బుద్ధిమంతులగు; వసుధాధిపైః = రాజులచేత; చారేణ=వేగులవానిచేత; విదితః = తెలిసికొనఁబడిన; శత్రుః= శత్రువు; యుద్ధే=యుద్ధమునందు; సమాసాద్య = పొంది ; స్వల్పేన=కొంచెమయిన;యత్నేన=ప్రయత్నముచేత;నిరస్యతే=జయింపఁబడుచున్నాఁడు.

బుద్ధిమంతులగు రాజులు, చారునివలన, శత్రువుతెఱఁగంతయు నెఱింగి, యుద్ధంబున ననాయాసంబుగా శత్రువును జయింతురు. అని రావణుఁడు చారులతోఁజెప్పెను.అని, తాత్పర్యము.

చారాస్తు తే తథే త్యుక్త్వా ప్రహృష్టా రాక్షసేశ్వరమ్
శార్దూల మగ్రతః కృత్వా తత శ్చక్రుః ప్రదక్షిణమ్. ౨౧

టీక॥ తతః=అంత; తే=ఆ;చారాస్తు=వేగులవాండ్రును; తథేతి=అట్లే; యని; ఉక్త్వా=చెప్పి; ప్రహృష్టాః = మిక్కిలియుసంతసించినవారలయి;శార్దూలం=శార్దూలుని; అగ్రతః = ముందట; కృత్వా= చేసికొని; రాక్షసేశ్వరం= రాక్షసులకుఁ బ్రభుఁడైన రావణునింగూర్చి;ప్రదక్షిణం=ప్రదక్షి

ణమును; చక్రుః=చేసిరి.

అంతనాచారులు, రావణుని మాటనువిని, యట్లేయనియొప్పుకొని, పరమసంతుష్టులయి, శార్దూలుసింహరస్వారించుకొని, రాక్షసేశ్వరుండగు రావణునకుఁ బ్రదక్షిణంబుగావించిరి.

అని, తాత్పర్యము.

తత స్తే త మ్మహోత్సాహం చారా రాక్షసస త్తమమ్
కృత్వా ప్రదక్షిణం జగ్ము ర్యత్ర రామ స్సలక్ష్మణః. ౨౨

టీక॥ తతః=అంత ; తే=ఆ; చారాః=వేగులవాండ్రు ; మహోత్సాహం=అధికమయినపరాక్రమముగల ; తం=ఆ; రాక్షససత్తమం= రాక్షసశ్రేష్ఠుండగు రావణునిగూర్చి; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా=చేసి; యత్ర= ఎచ్చట; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడిన; రామః=రాముఁడు; అస్తి (అధ్యాహృతము) =ఉన్నాఁడో; తత్ర (అధ్యాహృతము)= అచ్చటికి ; జగ్ముః=పోయిరి.

అట్లు, ఆచారులు, మహాపరాక్రమశాలియగు నా రావణునకుఁ బ్రదక్షిణించి, తత్క్షణంబ రామలక్ష్మణులుండుస్థలంబునకుఁబోయిరి. అని, తాత్పర్యము.

తే సువేలస్య శైలస్య సమీపే రామలక్ష్మణౌ
ప్రచ్ఛన్నా దదృశు ర్గత్వా ససుగ్రీవవిభీషణౌ. ౨౩

టీక॥ తే=ఆచారులు; గత్వా=పోయి; సువేలస్య=సువేలమను; శైలస్య=పర్వతముయొక్క; సమీపే=సమీపమునందు ; ప్రచ్ఛన్నాః=కప్పఁబడినవారలయి, వేషాంతరధారులయియనుట; ససుగ్రీవవిభీషణౌ= సుగ్రీవునితోను విభీషణునితోనుంగూడిన ; రామలక్ష్మణౌ= రామలక్ష్మణులను ; దదృశుః= చూచిరి.

ఆచారులు, పోయి, మఱియొకరూపముధరించి, సువేలపర్వతసమీపంబున, సుగ్రీవవిభీషణసహితులయియున్న రామలక్ష్మణులంజూచిరి.

అని, తాత్పర్యము.

ప్రేక్షమాణా శ్చమూం తాంచ బభూవుర్భయవిక్లబాః

టీక॥ తే (అధ్యాహృతము)= ఆచారులు; తాం=ఆ; చమూంచ= సేనను; ప్రేక్షమాణాశ్చ=చూచుచును; భయవిక్లబాః= భయముచేఁబీడింపఁబడినవారలు; బభూవుః=అయిరి.

ఆచారులు, రామలక్ష్మణులను, ఆవానరసేననుంజూచినంతనె, మిక్కిలి యుభయంబునొందిరి.

అని, తాత్పర్యము.

తేతు ధర్మాత్మనా దృష్టా రాక్షసేంద్రేణ రాక్షసాః. ౨౪

టీక॥ తే=ఆ; రాక్షసాస్తు= చారులయినరాక్షసులును; ధర్మాత్మనా=ధర్మస్వభావుఁడగు; రాక్షసేంద్రేణ= రాక్షసరాజుండగువిభీషణునిచే; దృష్టాః=చూడఁబడినారు.

ధర్మాత్ముండగువిభీషణుండు, ఆచారులంగనుంగొనెను.

అని, తాత్పర్యము.

విభీషణేన తత్రస్థా నిగృహీతా యదృచ్ఛయా

టీక॥ తత్రస్థాః= ఆసేనయందున్న చారులు; యదృచ్ఛయా=డబ్బాటుచేత; విభీషణేన= విభీషణునచేత; నిగృహీతాః=పట్టువడినారు.

ఆచారులు, ఆసేనయందుఁదిరుగుచుండి, ఆకస్మికముగావిభీషణునిచేఁబట్టుకొనఁబడిరి. అని, తాత్పర్యము.

శార్దూలో గ్రాహిత స్త్వేకః పాపోయ మితి రాక్షసః. ౨౫

టీక॥ శార్దూలః= శార్దూలుండను; రాక్షసః=రాక్షసుఁడు; అయం= ఈతఁడు; పాపః=దుష్టుఁడు. ఇతి=అని; గ్రాహితః=పట్టియివ్వఁబడెను.

అంతు, శార్దూలుండుమిక్కిలియదుష్టుండని, విభీషణుండతనివానరులచేతికింబట్టియిచ్చెను. అని, తాత్పర్యము.

మోచిత స్సోపి రామేణ వధ్యమానః ప్లవంగమైః




టీక॥ప్లవంగమైః= వానరులచేత; వధ్యమానః= వధింపఁబడుచున్న; సోపి=ఆశార్దూలుండును; రామేణ = రామునిచేత; మోచితః=విడిపింపఁబడినాఁడు.

వానరులాశార్దూలుని వధింపఁబూన,రాముండు వానివిడిపించెను. అని, తాత్పర్యము.

అనృశంస్యేన రామస్య మోచితా రాక్షసాః పరే. ౨౬

టీక॥రామస్య= రామునియొక్క; అనృశంస్యేన=దయచేత;పరే= ఇతరులయిన; రాక్షసాః=రాక్షసులు;మోచితాః=విడిపింపఁబడినారు.

మఱియు,రాముండు దయచే,నితరచారులనుంగూడ,విడిపించెను. అని, తాత్పర్యము.

వానరై రర్దితా స్తేతు విక్రాంతై ర్లఘువిక్రమైః
పునర్లంకా మనుప్రాప్తా శ్శ్వసంతో నష్టచేతసః. ౨౭

టీ॥తేతు=ఆచారులును;విక్రాంతైః=పరాక్రమముగలవారలును; లఘువిక్రమైః= శీఘ్రమయినపరాక్రమముగలవారలునగు; వానరైః=వానరులచేత; అర్దితాః=పీడింపఁబడినవారలయి; శ్వసంతః= ఊర్పులువుచ్చుచు; నష్టచేతసః= పోయినమనస్సు గలవారలయి; పునః=మఱల;లంకాం=లంకాపురిని;అనుప్రాప్తాః=పొందినారు.

ఆచారులు, అట్లుపరాక్రమవంతులునుశీఘ్రవిక్రములునగువానరులచేఁదెబ్బలుదిని,నిట్టూర్పులువుచ్చుచు, విమనస్కులయి,మఱల,నెట్టకేలకు,లంకంజేరిరి. అని, తాత్పర్యము.

తతో దశగ్రీవ ముపస్థితా స్తు తే
చారా బహిర్నిత్యచరా నిశాచరాః
గిరే స్సువేలస్య సమీపవాసినం
న్యవేదయ న్భీమబలం మహాబలాః. ౨౮




టీక॥ తతః= అటుపిమ్మట; బహిర్నిత్యచరాః= బయటసెల్లప్పుడును దిరుగుచుండువారలును; మహాబలాః = అధికమయినబలము గలవారలునగు; నిశాచరాః=రాక్షసులయిన; తే=ఆచారులు; దశగ్రీవం=రావణుని; ఉపస్థితాస్తు=పొందినవారలయినంతనె; సువేలస్య= సువేలమను; గిరేః= పర్వతము యొక్క; సమీపవాసినం=సమీపమున నుండునట్టి; భీమబలం= భయంకరమయినబలముగలరాముని; న్యవేదయన్ = తెలిపిరి.

అంతట, బయట నెల్లప్పుడు సంచరించువారలును మహాబలశాలులునగు నాచారులు, రావణుని యొద్దకుఁబోయి, భయంకరబలుండగు రాముండు సువేలాద్రిసమీపంబునను న్నాఁడని, విన్నవించిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ఏకోనత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండైకోనత్రింశసర్గటీక, ముగిసినది.

---

త్రింశసర్గప్రారంభః.

తతస్తమక్షోభ్యబలం లంకాధిపతయే చరాః
సువేలే రాఘవం శైలే నివిష్టం ప్రత్యవేదయన్. ౧

టీక॥ తతః=అంత; చరాః= చారులు; లంకాధిపతయే=లంకాప్రభుండగు రావణునికొఱకు; సువేలే=సువేలమను; శైలే=పర్వతమునందు; నివిష్టం=విడిసిన; అక్షోభ్యబలం=కలఁతపెట్టరాని సేనగల; తం=ఆ; రాఘవం= రాముని;

ప్రత్యవేదయన్ — విన్నవించిరి.

అంత, నా శార్దూలాదిచారులు, రాముండు లెక్కలేనివానరసేనతోసువేలపర్వతప్రాంతంబున విడిసియున్నాండని రావణునకుం జెప్పిరి.

అని, తాత్పర్యము.

చారాణాం రావణ శ్శ్రుత్వా ప్రాప్తం రామం మహాబలమ్
జాతోద్వేగోఽభవ త్కించి చ్ఛార్దూలం వాక్య మబ్రవీత్. ౨

టీక॥ రావణః = రావణుండు; చారాణాం = (పంచమ్యర్థమందుషష్ఠి) చారులవలన; మహాబలం = అధికమయినబలముగల; రామం = రాముని; ప్రాప్తం = వచ్చినవానింగా; శ్రుత్వా = విని; కించిత్ = కొంచెము; జాతోద్వేగః = కలిగిన భయముగలవాండు; అభవత్ = ఆయెను. శార్దూలం = శార్దూలునిగూర్చి; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

రావణుండు, చారులమాటలవలన, మహాబలుండగు రాముండువచ్చినాండని విని, కొంచెము భయమునొంది, శార్దూలుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అయథావ చ్చ తే వర్ణో దీనశ్చాసి నిశాచర
నాసి కచ్చి దమిత్రాణాం క్రుద్ధానాం వశ మాగతః. ౩

టీక॥ నిశాచర = రాక్షసుండా! తే = నీయొక్క; వర్ణశ్చ = రంగును; అయథావత్ = ఎప్పటివంటిది గాదు. దీనశ్చ = దుఃఖితుండవును; అసి = అగుచున్నావు. క్రుద్ధానాం = కోపమునొందిన; అమిత్రాణాం = శత్రువులయొక్క; వశం = అధీనతను; అగతః = పొందినవాండవు; నాసి కచ్చిత్ = కావుగదా?

శార్దూలుండా! నీముఖకాంతి యెప్పటివలెలేదు; మిక్కిలియు దీనుండవై యున్నావు; శత్రువులు క్రుద్ధులయి నిన్నేమియుం జేయలేదుగదా! అని, రావణుండు, శార్దూలునితోం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి తేనానుశిష్టస్తు వాచం మంద ముదీరయత్

తదా రాక్షసశార్దూలం శార్దూలో భయవిహ్వలః. ౪

టీక॥ తదా= అప్పుడు; శార్దూలః=శార్దూలుఁడు; ఇతి= ఇట్లు; తేన=ఆరావణునిచేత;అనుశిష్టస్తు= ఆడుగఁబడినవాఁడైనంతనె;భయవిహ్వలః=భయముచే నవయవములస్వాధీనతదప్పినవాఁడై; రాక్షసశార్దూలం=రాక్షసశ్రేష్ఠుండగురావణునిగూర్చి; మందం=తిన్నఁగా; వాచం=మాటను; ఉదీరయత్=చెప్పెను.

అంత, శార్దూలుండు, రావణునిమాటనువిని, పరమభీతుండై, రాక్షసోత్తముఁడగు రావణునింజూచి , మందవచనంబుననిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

న తే చారయితుం శక్యా రాజన్ వానరపుంగవాః

టీక॥ రాజన్=రాక్షసరాజుండవగురావణుఁడా! తే=ఆ ; వానరపుంగవాః = వానరోత్తములు ; చారయితుం= వేగులవాండ్రిచేఁగనుంగొనుటకు; శక్యాః = అలవియయినవారలు; న=కారు.

రాక్షసరాజుండవగురావణుఁడా! ఆవానరోత్తములువేగులవాండ్రకుసాధ్యులుకారు.అని, తాత్పర్యము.

విక్రాంతా బలవంతశ్చ రాఘవేణచ రక్షితాః. ౫

నాపి సంభాషితుం శక్యా స్సంప్రశ్నోఽత్ర న లభ్యతే

టీక॥ విక్రాంతాః=పరాక్రమముగలవారలును; బలవంతశ్చ=అధికమయినబలముగలవారలును; రాఘవేణ=రామునిచేత ; రక్షితాశ్చ= రక్షింపఁబడినవారలునగు; తే(అధ్యాహృతము)= ఆవానరులు; సంభాషితుమపి= మాటలాడుటకైనను; నశక్యాః = అలవియయినవారలుకారు. అత్ర=వీరివిషయమందు; సంప్రశ్నః=పరీక్షించుట ; న లభ్యతే=పొందఁబడదు.

వానరులు , మహాపరాక్రమశాలులుమహాబలశాలులు రామరక్షితులుంగావున, వారితోమాటలాడుటయునశక్యముగానున్నది; వారలఁబరీక్షించుట

యెంతమాత్రముసాధ్యముగాదు. అని, తాత్పర్యము.

సర్వతో రక్ష్యతే పంథా వానరైః పర్వతోపమైః. ౬.
ప్రవిష్టమాత్రే జ్ఞాతో హం బలే తస్మి న్నచారితే

టీక॥ సర్వతః = అంతటను; పంథాః=మార్గము; పర్వతోపమైః=పర్వతములతోఁబోల్కిగల; వానరైః= వానరులచేత; రక్ష్యతే=రక్షింపఁబడుచున్నది. అహం=నేను; తస్మిన్=ఆ; బలే=సైన్యము; ప్రవిష్టమాత్రే= ప్రవేశింపఁబడినంతనె; అచారితే=సంచరింపఁబడకుండఁగానే;జ్ఞాతః= తెలియఁబడినాను.

ఎటుచూచినను బర్వతాకారులగు వానరులు మార్గంబులం గావలియున్నారు; నేనాసైన్యంబుఁజొచ్చితిని;ఇంక నెచ్చటనుజూడంగూడలేదు; ఇంతలో పలనె, నన్నుఁగనుంగొనిరి.

అని, తాత్పర్యము.

బలా ద్గృహీతో రక్షోభి ర్బహుధా స్మి విచాలితః. ౭

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; రక్షోభిః = రాక్షసులచేత; బలాత్ =బలిమివలన; గృహీతః= పట్టుకొనఁబడినవాఁడనై ; బహుధా= పెక్కువిధములను; విచాలితః=త్రిప్పఁబడినవాఁడను; అస్మి=అయితిని.

విభీషణసచివులగు రాక్షసులునన్ను బలాత్కారంబునంబట్టిబహువిధంబుల నేలంబొరలించిరి. అని, తాత్పర్యము.

జానుభి ర్ముష్టిభి ర్దంతై స్తలైశ్చాభిహతో భృశమ్
పరిణీతో స్మి హరిభి ర్బలవద్భి రమర్షణైః. ౮

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను;భృశం=మిక్కిలియు;అమర్షణైః=కోపముగలవారలును;బలవద్భిః=అధికమయినబలముగలవారలునగు ; హరిభిః=వానరులచేత; జానుభిః= మోఁకాళ్లచేతను; ముష్టిభిః = పిడికిళ్లచే

తను; దంతైః=పండ్లచేతను; తలైశ్చ=అఱచేతులచేతను; అభిహతః= కొట్టఁబడినవాఁడనై; పరిణీతః=అంతటనుఁదీసికొనఁబడినవాఁడను; అస్మి=అయితిని.

అంత, బలవంతులగునవ్వానరులు, కుపితులయి, నన్నునానావిధంబులఁ, బిడికిళ్లంబొడిచియు, దంతంబులంగఱచియునఱచేతులంజఱచియుఁ,బీడించి, యాసైన్యంబంతయు, నన్నుఁదీసికొని చుట్టించిరి. అని, తాత్పర్యము.

పరిణీయచ సర్వత్ర నీతోఽహం రామసంసదమ్
రుధిరాదిగ్ధసర్వాంగో విహ్వల శ్చలితేంద్రియః. ౯
హరిభి ర్వధ్యమానశ్చ యాచమానః కృతాంజలిః

టీక॥ సర్వత్ర=అంతటను; పరిణీయచ=త్రిప్పియు; రుధిరాదిగ్ధసర్వాంగః=నెత్తురుచేఁబూయఁబడిన సమస్తావయవములునుగలవాఁడను; విహ్వలః=అవయవములస్వాధీనతదప్పినవాఁడను; చలితేంద్రియః = చలించినయింద్రియములుగలవాఁడను; హరిభిః= వానరులచేత; వధ్యమానశ్చ= చంపఁబడుచున్నవాఁడను; యాచమానః=ప్రార్థించుచున్నవాఁడను; కృతాంజలిః = చేయఁబడిన చేమోడ్పుగలవాఁడనగు; అహం=నేను; రామసంసదం= రామసదస్సును; నీతః=పొందింపఁబడినాను.

అట్లు, అవ్వానరులు, నన్నంతటం ద్రిప్పి, నెత్తుటందడిసిన దేహముగలవాఁడనై, మూర్ఛితుండనై, ఇంద్రియంబుల స్వాధీనతదప్పి, యవ్వానరుల చేవధింపఁబడుచుశరణంబువేఁడుచుఁజేతులుమొగుడ్చుకొనియున్ననన్ను, రాముని యొద్దకుంగొనిపోయిరి.

అని, తాత్పర్యము.

రాఘవేణ పరిత్రాతో జీవామీ తి యదృచ్ఛయా. ౧౦

టీక॥ రాఘవేణ=రామునిచేత; పరిత్రాతః=రక్షింపఁబడినాను. ఇతి=ఇట్లు; యదృచ్ఛయా=దబ్బాటుచేత; జీవామి=బ్రతికియున్నాను.

అంత, రాముండునన్నుఁగాపాడెను; ఇట్లు, అదృష్టవశంబునఁబ్రతికివచ్చినాను. అని, తాత్పర్యము.

ఏష శైలే శిలాభిశ్చ పూరయిత్వా మహార్ణవమ్
ద్వార మాశ్రిత్య లంకాయా రామ స్తిష్ఠతి సాయుధః. ౧౧

టీక॥ ఏషః=ఈ; రామః= రాముఁడు; శిలాభిః=ఱాళ్లచేతను; మహార్ణవం=మహాసముద్రమును; పూరయిత్వా=నిండించి; లంకాయాః= లంకాపురియొక్క; ద్వారం= వాకిలిని; ఆశ్రిత్య=ఆశ్రయించి; శైలే= సువేలపర్వతమునందు; సాయుధః= ఆయుధముతోఁగూడినవాఁడై; తిష్ఠతి=ఉన్నాఁడు.

ఇదిగో రాముఁడు, ఱాళ్లచే మహాసముద్రంబునకుఁ గట్టఁ గట్టి, దాఁటి వచ్చి, సువేలపర్వతంబున సాయుధుండై యున్నాఁడు; ఇంక శీఘ్రంబున లంకాద్వారంబుఁ జేరఁగలఁడు.

అని, తాత్పర్యము.

గరుడవ్యూహ మాస్థాయ సర్వతో హరిభి ర్వృతః
మాం విసృజ్య మహాతేజా లంకా మేవాభివర్తతే. ౧౨

టీక॥మహాతేజాః = అధికమయిన కాంతిగలరాముఁడు; మాం=నన్ను; విసృజ్య = విడిచిపెట్టి; గరుడవ్యూహం=గరుడవ్యూహమును; ఆస్థాయ = అవలంబించి; సర్వతః=అంతటను; హరిభిః=వానరులచేత; వృతః= చుట్టఁబడినవాఁడై; లంకామేవ=లంకాపురిఁగూర్చియె; అభివర్తతే = వచ్చుచున్నాఁడు.

మహాతేజుండగు రాముఁడు, నన్ను విడిచిపెట్టి పిమ్మట, గరుడవ్యూహమునుబన్ని, సమస్త వానరసమేతుండై, యీలంకాపురికై వచ్చు ప్రయత్నంబున నుండెను. అని, తాత్పర్యము.

పురా ప్రాకార మాయాతి క్షిప్ర మేకతరం కురు
సీతాం వాస్మై ప్రయచ్ఛాశు సుయుద్ధం వా ప్రదీయతామ్. ౧౩

టీక॥రామః (అధ్యాహృతము)= రాముఁడు; పురా=ముందు; ప్రాకారం=ప్రహరిని; ఆయాతి= పొందఁగలఁడు. క్షిప్రం=శీఘ్రముగా; ఏకతరం=






రెంట నొకటిని; కురు = చేయుము. అస్మై = ఈ రామునికొఱకు; సీతాం వా = సీతాదేవినైనను; ఆశు = శీఘ్రముగా; ప్రయచ్ఛ = ఇమ్ము. సుయుద్ధం వా = మంచి యుద్ధమయినను; ప్రదీయతాం = ఇవ్వఁబడుఁగాక.

రాముండు, ఇంక స్వల్పకాలంబున నీ ప్రాకారంబు నావరించును; నీవు, శీఘ్రమున, నీ రెంట నొకటినే దేనిం జేయుము; రామునకు సీతాదేవినే నియొసంగుము; లేక, చక్కఁగా యుద్ధమైనను గావింపుము. అని, శార్దూలుండు రావణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

మనసా తం తదా ప్రేక్ష్య తచ్ఛ్రుత్వా రాక్షసాధిపః
శార్దూలం సుమహ ద్వాక్య మథో వాచ స రావణః. ౧౪

టీక॥ అథ = అంత; రాక్షసాధిపః = రాక్షసరాజుండగు; సః = ఆ; రావణః = రావణుఁడు; తదా = అప్పుడు; తత్ = ఆమాటను; శ్రుత్వా = విని; మనసా = మనస్సుచేత; ప్రేక్ష్య = ఆలోచించి; తం = ఆ; శార్దూలం = శార్దూలుని గూర్చి; సుమహత్ = మిక్కిలియుగొప్పదగు; వాక్యం = మాటను; ఉవాచ = చెప్పెను.

అంత నా రావణుండు, శార్దూలుని మాటను విని, మనసున నాలోచించి, యా శార్దూలుం జూచి, గొప్పమాటం జెప్పెను. అని; తాత్పర్యము.

యది మాం ప్రతి యుధ్యేరన్ దేవగంధర్వదానవాః
నైవ సీతాం ప్రదాస్యామి సర్వలోకభయాదపి. ౧౫

టీక॥ మాం ప్రతి = నన్నుఁగూర్చి; దేవగంధర్వదానవాః = దేవతలును గంధర్వులును దానవులును; యుధ్యేరన్ యది = యుద్ధము సేయుదురేని; తదాపి (అధ్యాహృతము) = అప్పుడును; సర్వలోకభయాదపి = సమస్తలోకంబులవలని భయమువలనను; సీతాం = సీతాదేవిని; నైవ ప్రదాస్యామి = ఇవ్వనే యివ్వను.

దేవతలును గంధర్వులును దానవులును ఒక్కుమ్మడి నాపైకి యుద్ధమునకు వచ్చినను, నాకు సమస్తలోకం




బలవలనను భయంబు వాటిల్లినను, నేను, రామునకుసీతనివ్వను. అని, రావణుండు, శార్దూలునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాతేజా రావణః పున రబ్రవీత్

టీక॥ మహాతేజాః= అధికమయిన పరాక్రమముగల; రావణః=రావణుఁడు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; పునః=మఱల; అబ్రవీత్=చెప్పెను.

మహాతేజుండగురావణుండు, ఈ ప్రకారమునశార్దూలునితోఁజెప్పి, మఱలనిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

చారితా భవతా సేనా కేత్ర శూరాః ప్లవంగమాః. ౧౬

టీక॥భవతా=నీచేత; సేనా=వానరసేన; చారితా=సంచరింపఁబడినది. అత్ర=ఇందు; శూరాః=యుద్ధమునందు భయములేనట్టి; ప్లవంగమాః=వానరులు; కే=ఎవ్వరు?

నీవు వానరసేనయంతయుఁ జూచి నావుగదా! అందు, శూరులగువానరులెవ్వరు? చెప్పుము. అని, తాత్పర్యము.

కీదృశాః కింప్రభా స్సౌమ్య వానరా యే దురాసదాః
కస్య పుత్రాశ్చ పౌత్రాశ్చ తత్త్వ మాఖ్యాహి రాక్షస. ౧౭

టీక॥సౌమ్య=శాంతుఁడవగు; రాక్షస=శార్దూలుఁడా! యే = ఏ;వానరాః=వానరులు;దురాసదాః=కెనకఁగూడనివారలో; తే (అధ్యాహృతము)=వారలు; కీదృశాః=ఎట్టివారలు? కింప్రభాః = ఏమిప్రభావముగలవారలు?కస్య=ఎవ్వనియొక్క; పుత్రాశ్చ=కొడుకులును?పౌత్రాశ్చ = మనుమలును?తత్త్వం= యథార్థమును;ఆఖ్యాహి=చెప్పుము.

సౌమ్యుండవగు శార్దూలుఁడా! అందుమహాపరాక్రమశాలులగువానరులు, ఎట్టివారలు? వారిప్రభావమెట్టిది? వారలెవ్వరి కొడుకులు? ఎవ్వరిమనుమలు? ఈసంగతియంతయుఁజక్కఁగాఁజెప్పుము.అని, తాత్పర్యము.

తథా త్ర ప్రతిపత్స్యామి జ్ఞాత్వా తేషాం బలాబలమ్
అవశ్యం బలసంఖ్యానం కర్తవ్యం యుద్ధ మిచ్ఛతామ్. ౧౮

టీక॥ తథా = అట్లు; తేషాం = ఆవానరులయొక్క; బలాబలం = బలాబలమును; జ్ఞాత్వా = ఎఱింగి; అత్ర = వీరివిషయమయి; ప్రతిపత్స్యామి = తెలిసికొనెదను. యుద్ధం = పోరును; ఇచ్ఛతాం = కోరుచున్నవారలకు; అవశ్యం = అవశ్యముగా; బలసంఖ్యానం = బలముయొక్క యెఱుంగుట; కర్తవ్యం = చేయఁబడవలసినది.

అట్లు, నీవలననవ్వానరుల బలాబలంబులెఱింగి, వారలవిషయమయి చేయవలసినదానిం దెలిసికొనెదను; యుద్ధము సేయువారలు, అవశ్యము, శత్రుబలంబుఁ దెలుసుకొనవలయును. అని, రావణుండు, శార్దూలునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

అథైవ ముక్త శ్శార్దూలో రావణే నోత్తమ శ్చరః
ఇదం వచన మారేభే వక్తుం రావణసన్నిధౌ. ౧౯

టీ॥ అథ = అంత; ఉత్తమః = శ్రేష్ఠుండగు; చరః = వేగులవాఁడైన; శార్దూలః = శార్దూలుఁడు; రావణేన = రావణునిచేత; ఏవం = ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; రావణసన్నిధౌ = రావణునిసమీపమునందు; ఇదం = ఈ; వచనం = మాటను; వక్తుం = చెప్పుటకు; ఆరేభే = ఆరంభించెను.

అంత, నుత్తమచారుండగు శార్దూలుండు, ఇట్లు రావణుండు చెప్పినమాటనువిని, రావణునకిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అథ ఋక్షరజసః పుత్రో యుధి రాజా సుదుర్జయః
గద్గదస్యాథ పుత్రో త్ర జాంబవానితి విశ్రుతః. ౨౦

టీక॥ అథ = ఇంక; ఋక్షరజసః = ఋక్షరజునియొక్క; పుత్రః = కొడుకైన; రాజా = వానరరాజుండగు సుగ్రీవుఁడు; యుధి = యుద్ధమునందు; సుదుర్జయః = జయింపనలవిగానివాఁడు. అథ = మఱియు; అత్ర = ఇందు; గద్గదస్య =

గద్గదునియొక్క; పుత్రః=కొడుకు; జాంబవానితి=జాంబవంతుండని; విశ్రుతః=ప్రసిద్ధుఁడు.

ఋక్షరజునికొడుకు వానరరాజుం డగుసుగ్రీవుఁడు , యుద్ధంబునమిక్కిలి దుర్జయుఁడు; జాంబవంతుండను వాఁడుగద్గదునికొడుకు.

అని, తాత్పర్యము.

గద్గదస్యైవ పుత్రోఽన్యో గురుపుత్ర శ్శతక్రతోః
కదనం యస్య పుత్రేణ కృత మేకేన రక్షసామ్. ౨౧

టీక॥ అన్యః=మఱియొక్కఁడు, ధూమ్రుఁడనుట; గద్గదస్య= గద్గదునియొక్క; పుత్రఏవ=కొడుకే. యస్య=ఎవ్వనియొక్క; పుత్రేణ=కొడుకైన హనుమంతునిచేత; ఏకేన = ఒక్కనిచేతనే; రక్షసాం=రాక్షసులయొక్క; కదనం=చంపుట; కృతం = చేయఁబడినదో; సః(అధ్యాహృతము)=అతండు; శతక్రతోః=ఇంద్రునియొక్క ; గురుపుత్రః=ఆచార్యుఁడైనబృహస్పతియొక్క కొడుకు.

గద్గదునికొడుకుమఱియొకండుధూమ్రుండనువాఁడున్నాఁడు, ఎవ్వండు , ఒక్కఁడే, యుద్ధంబుననక్షాదిరాక్షసులఁబెక్కండ్రఁజంపెనో , అట్టిహనుమంతునితండ్రి, కేసరియనువాఁడు,బృహస్పతిపుత్రుండు.

అని,తాత్పర్యము.

సుషేణశ్చాపి ధర్మాత్మా పుత్రో ధర్మస్య వీర్యవాన్
సౌమ్య స్సోమాత్మజ శ్చాత్ర రాజన్ దధిముఖః కపిః. ౨౨

టీక॥ రాజన్= రాక్షసరాజుండవగు రావణుఁడా! వీర్యవాన్= అధికమయినపరాక్రమముగలవాఁడును; ధర్మాత్మా=ధర్మస్వభావుండునగు; సుషేణశ్చాపి=సుషేణుఁడును;ధర్మస్య=వరుణునియొక్క; పుత్రః=కొడుకు . అత్ర=ఇందు; సౌమ్యః=తిన్ననివాఁడగు; దధిముఖః=దధిముఖుండను; కపిశ్చ = వానరుండును; సోమాత్మజః= చంద్రునికొడుకు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! మహాపరాక్రమశాలియు ధర్మాత్ముండునగుసుషేణుండనువాఁడు , వరుణునిపుత్రుండు ; సౌమ్యుండగుదధిముఖుం

డుచంద్రునిపుత్రుండు. అని, తాత్పర్యము.

సుముఖో దుర్ముఖ శ్చాత్ర వేగదర్శీ చ వానరః
మృత్యు ర్వానరరూపేణ నూనం సృష్ట స్స్వయంభువా. ౨౩

టీక॥అత్ర= ఈసేనయందు;సుముఖః=సుముఖుండును;దుర్ముఖశ్చ= దుర్ముఖుండును;వేగదర్శీ= వేగదర్శియను;వానరశ్చ=వానరుండును; స్వయంభువా=బ్రహ్మదేవునిచేత;వానరరూపేణ=వానరరూపముచేత;సృష్టః=సృజింపఁబడిన; మృత్యుః=మృత్యువు . నూనం=నిశ్చయము.

సుముఖుండును దుర్ముఖుండును వేగదర్శియును వీరలోకోఁకరును, మృత్యువెయీవానరరూపంబున బ్రహ్మదేవునిచేసృజింపఁబడియెఁ గాఁబోలునని యనందగియొప్పుదురు.

అని, తాత్పర్యము.

పుత్రో హుతవహస్యాథ నీల స్సేనాపతి స్స్వయమ్
అనిలస్య చపుత్రో త్ర హనుమానితి విశ్రుతః. ౨౪

టీక॥అథ=మఱియు; సేనాపతిః= సేనానాయకుండగు; నీలః= నీలుఁడు; స్వయం=తాను; హుతవహస్య= అగ్నిహోత్రునియొక్క; పుత్రః=కొడుకు. అత్ర=ఇందు; అనిలస్య=వాయువుయొక్క;పుత్రశ్చ=కొడుకును; హనుమానితి=హనుమంతుండని; విశ్రుతః= ప్రసిద్ధుఁడు.

మఱియు,వానరసేనానాయకుండగునీలుండు , అగ్నిహోత్రునికొడుకు; మున్ను కేసరిపుత్రుండనిచెప్పఁబడిన హనుమంతుండు, వాయుదేవునిబీజంబునఁ బుట్టినవాఁడు.అని, తాత్పర్యము.

నప్తా శక్రస్య దుర్ధర్షో బలవా నంగదో యువా
మైందశ్చ ద్వివిదశ్చోభౌ బలినా వశ్విసంభవౌ. ౨౫

టీక॥దుర్ధర్షః= ఎదిరింపనలవిగానివాఁడును;యువా= యౌవనవంతుండునగు; అంగదః=అంగదుఁడు; శక్రస్య=ఇంద్రునియొక్క; నప్తా=మను

మఁడు. బలినౌ= బలవంతులగు; మైంద శ్చ= మైందుండును; ద్వివిదశ్చ= ద్వివిదుండును; ఉభౌ=ఇద్దఱును; అశ్విసంభవౌ= అశ్వినీదేవతలవలనఁబుట్టినవారలు.

దుర్ధర్షుఁడగు సంగదుండు, దేవేంద్రుని మనుమఁడు ; బలవంతులగు మైందద్వివిదులు, అశ్వినీదేవతల కొడుకులు. అని, తాత్పర్యము.

పుత్రా వైవస్వతస్యాత్ర పంచ కాలాంతకోపమాః
గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః. ౨౮

టీక॥ అత్ర=ఇందు; గజః= గజుండును; గవాక్షః = గవాక్షుండును ; గవయః = గవయుండును; శరభః= శరభుండును ; గంధమాదనః=గంధమాదనుండును; కాలాంతకోపమాః= ప్రళయ కాలమునందలి యమునితోఁ బోలికగల ;పంచ=ఈయయిదుగురు; వైవస్వతస్య= యమునియొక్క ; పుత్రాః=కొడుకులు.

గజుండునుగవాక్షుండునుగవయుండును శరభుండును, గంధమాదనుండును, ఈయయిదుగురును ప్రలయ కాలాంతకునకు సాటివచ్చువారలు ; వీరలు,యమునికొడుకులు.

అని, తాత్పర్యము.

దశ వానరకోట్యశ్చ శూరాణాం యుద్ధకాంక్షిణామ్
శ్రీమతాం దేవపుత్రాణాం శేషం నా ఖ్యాతు ముత్సహే. ౨౯

టీక॥శ్రీమతాం=అధికమయినకాంతిగలవారలును; దేవపుత్రాణాం=దేవతల కొడుకులును ; యుద్ధకాంక్షిణాం = యుద్ధమునుగోరువారలును; శూరాణాం = యుద్ధమునందుభయములేనివారలునగు; వానర (వానరాణాం)=వానరులయొక్క; దశ= పది; కోట్యః=కోటులు; సంతి(అధ్యాహృతము)=ఉన్నవి. శేషం= మిగిలినదానిని; ఆఖ్యాతుం= జెప్పుటకు; నోత్సహే=చాలను.

ఇట్లు,శ్రీమంతులును దేవతలకుఁబు

ట్టినవారలును యుద్ధంబునందు భయములేనివారలును యుద్ధంబు గోరుచుండువారలునగు వానరులుపదికోటు లున్నారు; వీరలపేళ్లు మొదలగువానిం జెప్పనాకలవిగాదు-అని, తాత్పర్యము.

పుత్రో దశరథస్యైష సింహసంహననో యువా
దూషణో నిహతో యేన ఖరశ్చ త్రిశిరా స్తథా. ౨౮

టీక॥ యేన = ఎవ్వనిచేత; దూషణః=దూషణుఁడును; ఖరశ్చ=ఖరుండును; తథా=అట్లు; త్రిశిరాః=త్రిశిరుండును; నిహతః= చంపఁబడినాఁడో; ఏషః=ఈ; దశరథస్య= దశరథునియొక్క; పుత్రః= కొడుకయినరాముఁడు; సింహసంహననః=సుందరములయినయవయవములుగలవాఁడు.యువా=యౌవనవంతుఁడు.

ఎవ్వండు, ఖరునిదూషణుని త్రిశిరునింజంపినాఁడో, అట్టిదశరథపుత్రుఁడు రాముండుమిక్కిలియుసుందరవిగ్రహుఁడు; యౌవనవంతుఁడు.

అని, తాత్పర్యము.

నాస్తి రామస్య సదృశో విక్రమే భువి కశ్చన
విరాధో నిహతో యేన కబంధశ్చాంతకోపమః. ౨౯

టీక॥ యేన = ఎవ్వనిచేత; విరాధః=విరాధుండును; అంతకోపమః = యమునితోఁబోల్కిగల; కబంధశ్చ=కబంధుండును; నిహతః=చంపఁబడినాఁడో; తస్య(అధ్యాహృతము) = అట్టి; రామస్య=రామునకు; విక్రమే=పరాక్రమమునందు; సదృశః= సరియయినవాఁడు; భువి=భూమియందు ; కశ్చన=ఒకానొకఁడును; నాస్తి=లేఁడు.

విరాధునియమునింబోలుకబంధునింగూడవధించినట్టి మహాపరాక్రమశాలియగురామునకుఁ బరాక్రమంబునసాటివచ్చువాఁడు, భూలోకంబున నెవ్వఁడునులేఁడు. అని, తాత్పర్యము.

వక్తుం న శక్తో రామస్య నరః కశ్చిద్గుణాన్ క్షితౌ
జనస్థానగతా యేన యావంతో రాక్షసా హతాః. ౩౦

టీక॥ యేన=ఎవ్వనిచేత ; జనస్థానగతాః=జనస్థానమునుబొందిన; రాక్షసాః=రాక్షసులు; యావంతః= అందఱును; హతాః = చంపఁబడినారో; తస్య(అధ్యాహృతము)= అట్టి ; రామస్య=రామునియొక్క; గుణాన్=గుణములను ; వక్తుం=చెప్పుటకు; క్షితౌ= భూమియందు; నరః = మనుష్యుఁడు; కశ్చిత్ = ఒకానొకఁడును; నశక్తః= చాలఁడు.

జనస్థానంబుననున్న రాక్షసులనందఱినొక్కఁడెవధించినట్టి మహావీరుండగు రామునిగుణంబులవర్ణింప, భూమియందెవరికినిశక్యంబుగాదు.

అని, తాత్పర్యము,

లక్ష్మణశ్చాత్ర ధర్మాత్మా మాతంగానా మివర్షభః
యస్య బాణపథం ప్రాప్య నజీవే దపి వాసవః. ౩౧

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; బాణపథం=బాణమార్గమును;ప్రాప్య=పొంది; వాసవోపి=ఇంద్రుండైనను; నజీవేత్=బ్రతుకఁడో; అత్ర = ఇందు ; సః(అధ్యాహృతము)=అట్టి; ధర్మాత్మా = ధర్మస్వభావుఁడగు; లక్ష్మణశ్చాపి= లక్ష్మణుఁడును ; మాతంగానాం=ఏనుంగులలో ; ఋషభఇవ = శ్రేష్ఠమయిన యేనుంగువంటివాఁడు.

ధర్మాత్ముండగులక్ష్మణుండును, మదపుటేనుంగువంటివాఁడు ; ఇతనిబాణంబుసోఁకిన దేవేంద్రుండేనిజీవింపంజాలఁడు. అని, తాత్పర్యము.

శ్వేతో జ్యోతిర్ముఖశ్చాత్ర భాస్కరస్యాత్మసంభవౌ
వరుణస్య చ పుత్రో న్యో హేమకూటః ప్లవంగమః. ౩౨

టీక॥ అత్ర=ఇందు; శ్వేతః= శ్వేతుండును; జ్యోతిర్ముఖశ్చ= జ్యోతిర్ముఖుండును;భాస్కరస్య= సూర్యునియొక్క;ఆత్మసంభవౌ= కొడుకులు. వరుణస్య=వరుణునియొక్క; అన్యః= మఱియొక;పుత్రః=కొడుకు; హేమకూటః=హేమకూటుఁడను; ప్లవంగమః= వానరుఁడు.

శ్వేతుండును జ్యోతిర్ముఖుండును నునీయిర్వురును సూర్యపుత్రులు; వరుణునకు హేమకూటుండనుమఱియొకరి పుత్త్రుండున్నాఁడు. అని, తాత్పర్యము.

విశ్వకర్మసుతో వీరో నళః ప్లవగసత్తమః
విక్రాంతో బలవా నత్ర వసుపుత్త్ర స్స దుర్ధరః. ౩౩

టీక॥ అత్ర=ఇందు; వీరః= పరాక్రమవంతుండగు; నళః=నళుఁడును; ప్లవగసత్తమః=వానరశ్రేష్ఠుఁడు; విశ్వకర్మసుతః=విశ్వకర్మయొక్క కొడుకు. విక్రాంతః=పరాక్రమము గలవాఁడును; బలవాన్=అధికమయినబలముగలవాఁడునగు; సః=ఆ; దుర్ధరః= దుర్ధరుఁడు; వసుపుత్రః=వసువుకొడుకు.

పరాక్రమవంతుండగునలుండు విశ్వకర్మకుఁబుట్టినవాఁడు ; మహాపరాక్రమశాలియు బలవంతుండునగుదుర్ధరుండు వసుపుత్త్రుఁడు.

అని, తాత్పర్యము.

రాక్షసానాం వరిష్ఠశ్చ తవ భ్రాతా విభీషణః
పరిగృహ్య పురీం లంకాం రాఘవస్య హితే రతః. ౩౪

టీక॥ రాక్షసానాం=రాక్షసులలో; వరిష్ఠః= శ్రేష్ఠుండును; తవ=నీయొక్క; భ్రాతా= తమ్ముండునగు; విభీషణః=విభీషణుఁడు; లంకాం=లంకయను; పురీం=పట్టణమును; పరిగృహ్య= పుచ్చుకొని; రాఘవస్య = రామునియొక్క ; హితే=మేలునందు; రతః = ఆసక్తుఁడయి; అస్తి (అధ్యాహృతము) = ఉన్నాఁడు.

రాక్షసశ్రేష్ఠుండునీతమ్ముండువిభీషణుఁడు, రామునివలన లంకారాజ్యాధిపత్యంబునొంది, రామునకు హితంబుసేయుచుండియున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఇతి సర్వం సమాఖ్యాతం తవే దం వానరం బలమ్
సువేలే ధిష్ఠితం శైలే శేషకార్యే భవాన్ గతిః- ౩౫

టీక॥ఇతి=ఇట్లు; సువేలే=సువేలమను; శైలె=పర్వతమునందు; అధిష్ఠితం=విడిసియున్న; వానరం=వానరసంబంధియగు; ఇదం=ఈ; బలం=సైన్యము; సర్వం= అంతయు; తవ=నీకు; సమాఖ్యాతం=చెప్పబడినది; శేషకార్యే= మిగిలినకార్యమునందు; భవాన్= నీవు; గతిః=కర్తవ్యు.

సువేలపర్వత ప్రాంతంబున విడిసియున్న వానరసైన్యంబు తెలియ గంతయునీకెఱింగించితిఁగదా! ఇంకఁ, జేయవలసిన కార్యములవిషయమయి నీయిష్టము. అనిశార్దూలుండు రావణునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండత్రింశసర్గటీక ,
ముగిసినది.

---

(౩౧)

ఏకత్రింశసర్గప్రారంభః.

తత స్తమక్షోభ్యబలం లంకాధిపతయే చరాః
సువేలే రాఘవం శైలే నివిష్టం ప్రత్యవేదయన్. ౧

టీక॥తతః=అంత; చరాః= చారులు; లంకాధిపతయే = లంకాపురికిఁబ్రభువైనరావణునికొఱకు; సువేలే=సువేలమను; శైలే=పర్వతమునందు ; నివిష్టం=విడిసిన; అక్షోభ్యబలం= కలఁతపెట్టరానిసైన్యముగల; రాఘవం=రాముని; ప్రత్యవేదయన్=చెప్పిరి.

అట్లు, శార్దూలాదిచారులు, రాముండనంతవానరసేనతో సువేలశైలప్రాంతంబునవిడిసియున్నాఁడని , లంకారాజుండగు రావణునకుంజెప్పిరి.

అని, తాత్పర్యము.

స ౩౧

చారాణాం రావణ శ్శ్రుత్వా ప్రాప్తం రామం మహాబలమ్
జాతోద్వేగో భవ త్కించి త్సచివా నిద మబ్రవీత్. ౨

టీక॥ రావణః=రావణుఁడు; చారాణాం=(పంచమ్యర్థమందుషష్ఠి)చారులవలన; మహాబలం=అధికమయినబలముగల; రామం=రాముని; ప్రాప్తం=వచ్చినవానిఁగా; శ్రుత్వా=విని; కించిత్=కొంచెము; జాతోద్వేగః=కలిగినభయముగలవాఁడు; అభవత్=అయ్యెను. సచివాన్=మంత్రులనుగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

రావణుండు, మహాబలుండగు రాముండువచ్చియున్నాడని చారులవలనవిని, కొంచెముభయమునొంది, మంత్రులనుజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

మంత్రిణ శ్శీఘ్ర మాయాంతు సర్వేవై సుసమాహితాః
అయం నో మంత్రకాలోహి సంప్రాప్త ఇతి రాక్షసాః. ౩

టీక॥ నః=మనకు; అయం=ఈ; మంత్రకాలః=ఆలోచనచేయవలసినసమయము; సంప్రాప్తోహి=వచ్చినదికదా! ఇతి=ఇందువలన-రాక్షసాః=రాక్షసులయిన; మంత్రిణః=మంత్రులు; సర్వేవై=అందఱునే; సుసమాహితాః=మిక్కిలియునెచ్చరికగలవారలయి; సమాయాంతు=వత్తురుగాక.

మనమాలోచింపవలసినసమయము వచ్చినది; కావున, మంత్రులందఱు, శీఘ్రమునవెచ్చరికతో, నిచ్చటికివత్తురుగాక. అని, రావణుండాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

తస్య తచ్ఛాసనం శ్రుత్వా మంత్రిణో భ్యాగమన్ ద్రుతమ్

టీక॥ మంత్రిణః=మంత్రులు; తస్య=ఆరావణునియొక్క; తత్=ఆ; శాసనం=ఆజ్ఞను; శ్రుత్వా=విని; ద్రుతం=శీఘ్రముగా; అభ్యాగమన్=వచ్చిరి.

ఆరావణునాజ్ఞనువిని, మంత్రులందఱుశీఘ్రమున, నతనిసన్నిధికివచ్చిరి.

అని, తాత్పర్యము.

తత స్స మంత్రయామాస సచివై రాక్షసై స్సహ. ౪

టీక॥ తతః=అంత; సః= ఆరావణుండు; రాక్షసైః=రాక్షసులయిన; సచివైః స్సహ=మంత్రులతోఁగూడ; మంత్రయామాస=ఆలోచించెను.

అంత, నారావణుండు, మంత్రులతోఁగూడఁజక్కఁగానాలోచించెను.

అని, తాత్పర్యము.

మంత్రయిత్వా స దుర్ధర్షః క్షమం య త్సమనంతరమ్
విసర్జయిత్వా సచివా౯ ప్రవివేశ స్వ మాలయమ్. ౫

టీక॥ దుర్ధర్షః=ఎదిరింపఁగూడనట్టి; సః=ఆరావణుఁడు; సమనంతరం=వెనుక; యత్=ఏది; క్షమం=తగినదో; తత్(అధ్యాహృతము)=దాని; మంత్రయిత్వా = ఆలోచించి; సచివా౯=మంత్రులను; విసర్జయిత్వా(విసర్జ్య)=విడిచి; స్వం=తనదైన; ఆలయం=ఇంటిని; ప్రవివేశ=ప్రవేశించెను.

దుర్ధర్షుండగునారావణుండు, ఆవలంజేయవలసినదానిఁగుఱించి, చక్కఁగానాలోచించి, మంత్రులంబొండని, తనగృహంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తతో రాక్షస మాహూయ విద్యుజ్జిహ్వం మహాబలమ్
మాయావిదం మహామాయః ప్రావిశ ద్యత్ర మైథిలీ. ౬

టీక॥ తతః=అంత; మహామాయః=అధికమయినమాయ గలరావణుండు; మహాబలం = అధికమయినబలముగలవాఁడును; మాయావిదం = మాయలఁదెలిసిన వాఁడునగు; విద్యుజ్జిహ్వం=విద్యుజ్జిహ్వుండను; రాక్షసం=రాక్షసుని; సమాహూయ=పిలిచి; యత్ర=ఎచ్చట; మైథిలీ = సీతాదేవి; అస్తి(అధ్యాహృతము) = ఉన్నదో; తత్ర(అధ్యాహృతము)=అచ్చటికి; ప్రావిశత్=ప్రవేశించెను.

అంత, మహామాయుండగునారావణుండు, మాయలంబండితుండును మహాబలుండునగువిద్యుజ్జిహ్వుండను రా

క్షసుంబిలిచి, యితండు వెంటరా, సీతా దేవియుండుస్థలంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

విద్యుజ్జిహ్వంచ మాయాజ్ఞ మబ్రవీ ద్రాక్షసాధిపః

టీక॥ రాక్షసాధిపః= రాక్షసులకుఁ బ్రభుండగు రావణుఁడు; మాయాజ్ఞం= మాయలఁదెలిసిన; విద్యుజ్జిహ్వంచ= విద్యుజ్జిహ్వునిగూర్చియు; అబ్రవీత్= చెప్పెను.

రాక్షసరాజుండగు రావణుండు, మాయలు దెలిసినవిద్యుజ్జిహ్వుంజూచి, యిట్లని, చెప్పెను, అని, తాత్పర్యము.

మోహయిష్యావహే సీతాం మాయయా జనకాత్మజామ్. ౭

టీక॥ మాయయా= మాయచేత; జనకాత్మజాం= జనకమహారాజుకూఁతురయిన; సీతాం = సీతను; మోహయిష్యావహే= మోసపుచ్చెదము.

మనము మాయచేసి, సీతాదేవిని మోసపుత్తము. అని, తాత్పర్యము.

శిరో మాయామయం గృహ్య రాఘవస్య నిశాచర
త్వం మాం సముపతిష్ఠస్వ మహచ్చ సశరం ధనుః. ౮

టీక॥ నిశాచర = రాక్షసుఁడా! త్వం= నీవు; మాయామయం= మాయావికారమయిన; రాఘవస్య = రాముని యొక్క; శిరః= తలను; సశరం= బాణముతోఁగూడిన; మహత్= గొప్పదగు; ధనుశ్చ = ధనువును; గృహ్య (గృహీత్వా= తీసికొని; మాం= నన్ను; సముపతిష్ఠస్వ= సేవింపుము.

విద్యుజ్జిహ్వుఁడా! నీవు, మాయచేరాముని తలనొకటికల్పించి, దానిని, బాణసహితంబగు మహాధనుస్సునుందీసికొని, నావెంటరమ్ము. అని, రావణుండు, విద్యుజ్జిహ్వునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్తథే త్యాహ విద్యుజ్జిహ్వో నిశాచరః
తస్య తుష్టో భవ ద్రాజా ప్రదదౌ చ విభూషణమ్. ౯

టీక॥విద్యుజ్జిహ్వః= విద్యుజ్జిహ్వుండను; నిశాచరః=రాక్షసుఁడు;ఏవం= ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తథేతి=అట్లేయని;ఆహ=చెప్పుచున్నాఁడు,చెప్పెననుట. రాజా=రాక్షసరాజుండగు రావణుఁడు; తుష్టః=సంతసించినవాఁడు;అభవత్=ఆయెను. విభూషణంచ=సొమ్మును;ప్రదదౌ=ఇచ్చెను.

అంత,విద్యుజ్జిహ్వుండు, రావణునిమాటనువిని, యట్లేయనియియ్యకొనెను; అందుకురాక్షసరాజుండగురావణుండు, సంతుష్టుండై,యతనికిఁ,గొప్పవిలువగల భూషణంబొకటియొసంగెను. అని,తాత్పర్యము.

అశోకవనికాయాంతు సీతా దర్శనలాలసః
నైరృతానా మధిపతి స్సంవివేశ మహాబలః. ౧౦

టీక॥మహాబలః= అధికమయినబలముగలవాఁడును; నైరృతానాం= రాక్షసులయొక్క; అధిపతిః= రాజునగు రావణుఁడు ; సీతాదర్శనలాలసః= సీతాదేవిదర్శనమునందధికమయినయభిలాషగలవాఁడై; అశోకవనికాయాంతు= అశోకవనికయందే; సంవివేశ= ప్రవేశించెను.

మహాబలశాలియగురాక్షస రాజుండునగురావణుండు, సీతం జూడఁగోరి,యయ్యశోకవనంబునకేపోయెను. అని, తాత్పర్యము.

తతో దీనా మ దైన్యార్హాం దదర్శ ధనదానుజః
అధోముఖీం శోకపరా ముపవిష్టాం మహీతలే. ౧౧
భర్తారమేవ ధ్యాయంతీ మశోకవనికాం గతామ్
ఉపాస్యమానాం ఘోరాభీ రాక్షసీభి రితస్తతః. ౧౨

టీక॥ తతః=అంత; ధనదానుజః= కుబేరుని తమ్ముండగురావణుండు ; దీనాం=దుఃఖితయు; అదైన్యార్హాం= దైన్యమునకుఁ దగనిదియు ; అధోముఖీం= క్రిందుమొగమయిన ముఖముగలదియు; శోకపరాం=దుఃఖాధీనయును; మహీతలే=భూతలమునందు ; ఉపవిష్టాం = కూర్చుండియున్నదియు; భ

ర్తారమేవ= పెనిమిటినే; ధ్యాయంతీం= ధ్యానించుచున్నదియు; అశోకవనికాం= అశోకవనమును; గతాం= పొందినదియు; ఇతస్తతః = ఇచ్చటచ్చట; ఘోరాభిః= భయంకరులయిన; రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత; ఉపాస్యమానాం = సేవింపఁబడుచున్నదియునగు సీతాదేవిని; దదర్శ= చూచెను.

అంతఁ, గుబేరునితమ్ముండగు రావణుండు, దుఃఖము నొందినదియునట్లు దుఃఖమునొందఁదగనిదియు, నేలం గూర్చుండి ముఖంబువాంచి, పరమ దుఃఖితయయి మనంబున భర్తయగు రామునేధ్యానించుచున్నదియు, భయంకరాకారలగు రాక్షసస్త్రీలచేత రక్షింపఁబడుచున్నదియు నగు దాని నశోకవనికయందున్నదాని సీతాదేవిం జూచెను. అని, తాత్పర్యము.

ఉపసృత్య తత స్సీతాం ప్రహర్షం నామ కీర్తయన్
ఇదంచ వచనం దుష్ట మువాచ జనకాత్మజామ్. ౧౩

టీక॥ తతః= అంత; రావణః (అధ్యాహృతము)= రావణుఁడు; సీతాం = సీతాదేవిని; ఉపసృత్య= సమీపించి; ప్రహర్షం = సంతోషమును; కీర్తయన్నామ= చెప్పువాఁడువలె; దుష్టం= దోషముగల్గునట్లుగా; జనకాత్మజాం= సీతాదేవినిగూర్చి; ఇదం= ఈ; వచనంచ= మాటను; ఉవాచ= చెప్పెను.

అంత, రావణుఁడు, సీతాదేవిసమీపంబునకుఁబోయి , మహాసంతోషవార్తనుజెప్పువాఁడువలెనభినయించుచు, నాబిడంజూచి, దుష్టమగు, నీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

సాంత్వ్యమానా మయా భద్రే య ముపాశ్రిత్య వల్గసే
ఖరహంతా స తే భర్తా రాఘవ స్సమరే హతః. ౧౪

టీక॥ భద్రే= మంగళరూపిణివగు సీతాదేవీ! త్వం= నీవు; మయా= నాచేత; సాంత్వ్యమానా= అనునయింపఁబడుచున్నదానవై ; యం= ఎవ్వని ; ఉపాశ్రిత్య = ఆశ్రయించి; వల్గసే= నిక్కుచుంటివో; సః= అట్టి; ఖరహంతా= ఖరునిచంపిన; తే= నీయొక్క; భర్తా= పెనిమిటియగు; రాఘవః= రాముఁడు;

సమరే=యుద్ధమునందు; హతః= చంపఁబడినాఁడు.

మంగళరూపిణివగుసీతా! నేనెంత వేఁడినను,నీవెవ్వనియందలి మక్కువచే నొప్పుకొనకుంటివో , అట్టి,ఖరునింజంపినవాఁడు నీపెనిమిటిరాముండు యుద్ధంబునహతుండయ్యె.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— యం=ఎవ్వని; ఉపాశ్రిత్య=ఆశ్రయించి; వల్గసే=ఉబ్బియుంటివో;సః=అట్టి; రాఘవః=రాముఁడు ; సమరే=యుద్ధమునందు; హతః(కిం)=చంపఁబడినాఁడాయేమి? (శేషముసమానము)

నాకైంకర్యమంగీకరింపుమని నేనెంత వేఁడుకొన్నను, నీవెవ్వనిరాకఁగోరి, నామనవియంగీకరింపకుంటివో , అట్టి ఖరాదులవధించినమహాపరాక్రమశాలి యగురాముండిప్పుడుహతుండయ్యెనా యేమి? సుఖంబునున్నాఁడు; నీవుదుఃఖింపవలదు. అని, తాత్పర్యము.

ఛిన్నం తే సర్వతో మూలం దర్ప స్తే నిహతో మయా
వ్యసనే నాత్మన స్సీతే మమ భార్యా భవిష్యసి. ౧౫

టీక॥ సీతే=సీతా! తే=నీయొక్క; మూలం=మూలము; సర్వతః=అంతయు; ఛిన్నం= నఱకఁబడినది. తే=నీయొక్క; దర్పః = గర్వము; మయా=నాచేత;నిహతః=కొట్టఁబడినది. ఆత్మనః=నీయొక్క; వ్యసనేన=దుఃఖముచేత; మమ=నాయొక్క; భార్యా=భార్యవు; గమిష్యసి=పొందఁగలవు.

సీతా!నీగర్వమునకుండిన యాధారమునంతయుఛేదించితిని;నీగర్వంబునంతయుఁబోఁగొట్టితిని;ఇంక,నాప్రార్థనయుఁగూడనెంతమాత్రము నక్కఱలేదు;నీదుఃఖంబున నేనీవు నాభార్యవు కాఁగలవు.అని, తాత్పర్యము.

రహస్యార్థము.— తే = నీకొఱకు;మూలం=నాసంపదమూలము; ఛిన్నం=నఱుకఁబడినది. తే=నీకొఱకు; మయా=నాచేత;దర్పః = గర్వము;నిహతః=కొట్టఁబడినది.ఆత్మనః = నాయొక్క;వ్యసనేన= దుఃఖముచేత;మమ=నాకు;భార్యా= భరింపఁదగినదానవు; భవిష్యసి=కాఁగలవు.

సీతాదేవీ! నీకొఱకునాగర్వమునంతయువిడిచితిని; నాసంపదకుమూలము

యినదానినింగూడఁ బోఁగొట్టుకొంటి ని; వాదుఃఖంబుచూచియుయినను, దయ యుంచి, నాకావించు సేవనంగీకరింపుము. అని, తాత్పర్యము.

విస్పృజే మాం మతిం మూఢే కిం మృతేన కరిష్యసి
భవస్వ భద్రే భార్యాణాం సర్వాసా మీశ్వరీ మమ. ౧౬

టీక॥ మూఢే=మూఢురాలవగుసీతా! ఇమాం=ఈ; మతిం=బుద్ధిని; విసృజ= విడువుము. మృతేన = మృతిఁ బొందినవానితో. కిం=దేనిని; కరిష్యసి= చేసెదవు? భద్రే = మంగళకరివగుసీతాదేవీ! మమ=నాయొక్క; భార్యాణాం=భార్యలకు; సర్వాసాం=అందఱికిని; ఈశ్వరీ=ప్రభురాలవు ; భవస్వ(భవ)=అగుము.

మూఢురాలవగుసీతా! నీవింకనీబుద్ధినివిడువుము ; చనిపోయినవానితో నీకేమికార్యము ? మంగళరూపిణివగుసీతా! నాభార్యలకందఱకునునీవీశ్వరివై యుండుము. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—ఇమాం=ఈ; మతిం=బుద్ధిని; విస్పృజ = విడువు. మూఢే=మూఢుండనగు నేను; మృతే = మృతిఁబొందఁగా ; నకరిష్యసికిం= చేయవా యేమి? మమ=నాయొక్క; భార్యాణాం=భార్యలకు; సర్వాసాం=అందఱకును; ఈశ్వరీ=అధిపతివి; భవస్వ = అగుము.

ఈయుపేక్షనువిడువుము; మూఢుండనగు నేనుమృతుండనైనను, నాపైదయ యుంచవా యేమి? నేనుగావించుశుశ్రూషనుమాత్రమె కాదు; నాభార్యలందఱు గావించు శుశ్రూషనుంగూడఁ బరిగ్రహించి, వారలనుంగూడఁగృతార్థలంగావింపవలయును.

అని, తాత్పర్యము.

అల్పపుణ్యే నివృత్తార్థే మూఢే పండితమానిని
శృణు భర్తృవధం సీతే ఘోరం వృత్ర వధం యథా- ౧౭

టీక॥ అల్పపుణ్యే= కొంచెమయినపుణ్యముగలదానవు; నివృత్తార్థే=విడిచినపురుషార్థముగలదానవు; మూఢే=బుద్ధిహీనురాలవు; పండితమానిని=

పండితురాలనని తలంచుకొను దానవునగు; సీతే=సీతాదేవీ! ఘోరం = భయంకరమయిన;వృత్రవధంయథా= వృత్రాసురునిచంపుటనువలె ; భర్తృవధం=పెనిమిటియొక్కచంపుటను;శృణు=వినుము.

అల్పపుణ్యురాలవుపురుషార్థరహితురాలవుబుద్ధిహీనురాలవుఏమియుఁదెలియకపోయినప్పటికిని సమస్తముఁదెలిసినట్లు గర్వించియున్నదానవు నగు సీతా!వృత్రాసురుండుచచ్చినట్లు , నీభర్తరాముండుచచ్చెను;వినుము.

అని,తాత్పర్యము.

రహస్యార్థము.— సీతే=సీతాదేవీ!అల్పపుణ్యే= కొంచెమయినపుణ్యముగలవాఁడను;నివృత్తార్థే= విడిచినపురుషార్థముగలవాఁడను; మూఢే=బుద్ధిహీనుండగు;పండితమానిని = పండితుండనని తలంచుకొనువాఁడనునగునాయందు;భర్తృవధం=పెనిమిటిచేఁగలిగినవధమును; ఘోరం = భయంకరమయిన;వృత్రవధంయథా= వృత్రాసురునియందలివధమునువలె; శృణు = వినుము.

అల్పపుణ్యుండను బురుషార్థరహితుం డను మూఢుండను ఏమియుఁదెలియక పోయినప్పటికిని బండితుండననియహంకరించియుండువాఁడ నగు నన్ను,నీభర్తరాముండు, ఇంకశీఘ్రంబుననె, యింద్రుండు వృత్రాసురుంబోలె, భయంకరంబుగ వధించునని, యెఱుంగుము. అని,తాత్పర్యము.

సమాయాత స్సముద్రాంతం మాం హంతుం కిలరాఘవః
వానరేంద్ర ప్రణీతేన బలేన మహతా వృతః. ౧౮

టీక॥రాఘవః=రాముఁడు; మాం= నన్ను; హంతుం=వధించుటకు; వానరేంద్రప్రణీతేన=వానరరాజుండగు సుగ్రీవునిచేఁదేఁబడిన; మహతా= గొప్పదగు;బలేన=సైన్యముచేత;వృతః=చుట్టఁబడినవాఁడై;సముద్రాంతం= సముద్రతీరమును; సమాయాతఃకిల= పొందినాఁడుగదా!

రాముండు , నన్నువధించుటకై, వానరరాజుండగుసుగ్రీవుండు గొప్పసేనతో వెంబడింప, సముద్రతీరంబు నొద్దకువచ్చినాఁడు. అని,తాత్పర్యము.

సన్నివిష్ట స్సముద్రస్య పీడ్య తీర మథోత్తరమ్
బలేన మహతా రామో వ్రజ త్యస్తం దివాకరే. ౧౯

టీక॥ అథ=అంత; రామః=రాముఁడు; దివాకరే=సూర్యుఁడు; అస్తం=అస్తమయమును; వ్రజతిసతి=పొందుచుండఁగా; మహతా=గొప్పదగు; బలేన=సైన్యముచేత; సముద్రస్య=సముద్రముయొక్క; ఉత్తరం=ఉత్తరపుదిక్కునందలి; తీరం=గట్టును; పీడ్య(పీడయిత్వా)- పీడించి; సన్నివిష్టః= విడిసినాఁడు.

అంత, రాముఁడు, సూర్యాస్తమయసమయంబునందు, సముద్రోత్తరతీరంబున; మహాసైన్యంబుతోఁగూడ, విడిసియుండెను. అని, తాత్పర్యము.

అథాధ్వని పరిశ్రాంత మర్ధరాత్రే స్థితం బలమ్
సుఖసంసుప్త మాసాద్య చారితం ప్రథమం చరైః. ౨౦

టీక॥ అథ = అటుపిమ్మట; అధ్వని=మార్గమునందు; పరిశ్రాంతం=అలసినదియు; అర్ధరాత్రే= నడిరేయియందు; స్థితం=ఉన్నదియు; సుఖసంసుప్తం= సుఖముగానిద్రించియున్నదియునగు; బలం=సైన్యమును; ఆసాద్య=పొంది; ప్రథమం=మొదట; చరైః= చారులచేత; చారితం=జాడ తెలుసుకొనునట్లు చేయఁబడినది.

అంత, నాసైన్యమంతయు, దారినడచుటచేనలసి, యర్ధరాత్రంబునసుఖనిద్రం జెందియుండునప్పుడు, మొదలఁజారులంబంపియందలిజాడలన్నియుఁగనుఁగొంటిమి. అని, తాత్పర్యము.

తత్ప్రహ స్తప్రణీతేన బలేన మహతా మమ
బల మస్య హతం రాత్రౌ యత్ర రామ స్సలక్ష్మణః. ౨౧

టీక॥ యత్ర=ఎచ్చట; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడిన; రామః=రాముడు; స్థితః(అధ్యాహృతము)=ఉన్నాఁడో; తత్=అట్టి; అస్య = ఈరాముని యొక్క; బలం=సైన్యము; రాత్రౌ= రాత్రియందు; ప్రహస్తప్రణీతేన=ప్ర

హస్తునిచేఁ దేఁబడిన; మహతా=గొప్ప దగు; మమ=నాయొక్క; బలేన= సైన్యముచేత; హతం=చంపఁబడినది.

ఎందు రామలక్ష్మణులున్నారో, అట్టియీవానరసేననంతయుఁ, బ్రహస్తుండుగొప్పదగు నారాక్షససేనందీసి కొని, వధించిపుచ్చెను.

అని, తాత్పర్యము.

పట్టిసాన్ పరిఘాం శ్చక్రాన్ దండాన్ ఖడ్గాన్ మహాయసాన్
బాణజాలాని శూలాని భాస్వరాన్ కూటముద్గరాన్. ౨౨
యష్టీశ్చ తోమరాన్ శక్తీ శ్చక్రాణి ముసలానిచ
ఉద్యమ్యోద్యమ్య రక్షోభి ర్వానరేషు నిపాతితాః. ౨౩

టీక॥ రక్షోభిః=రాక్షసులచేత; పట్టిసాన్=అడ్డకత్తులను; పరిఘాన్=గదలను; చక్రాన్=చిన్నచక్రాయుధములను; మహాయసాన్ = అధికమయిన యినుముతోఁ జేయఁబడిన; దండాన్= దండములను; ఖడ్గాన్=కత్తులను; బాణజాలాని = బాణసమూహములను; శూలాని=శూలములను; భాస్వరాన్= ప్రకాశించుచున్న; కూటముద్గరాన్= సమ్మెటలను ఇనుపగుదియలను; యష్టీశ్చ=కఱ్ఱలను; తోమరాన్=కొనలయందుస్థూలములయినగదలను; శక్తీశ్చ = ఈటెలను; చక్రాణి= పెద్దచక్రాయుధములను; ముసలానిచ= రోఁకళ్లను; ఉద్యమ్యోద్యమ్య= ఎత్తియెత్తి; వానరేషు=వానరులయందు; నిపాతితాః= వేయఁబడినవి.

రాక్షసులు, అడ్డకత్తులనుగదలను జిన్నచక్రంబులను బెద్దచక్రంబులనుబెద్దయినుపదండములను ఖడ్గంబులను బెక్కుబాణంబులను శూలంబులను సమ్మెటలను ఇనుపగుదియలను కఱ్ఱలను స్థూలాగ్రంబులగుగదలను ఈటెలనుముసలంబులను, వానరులపైఁవేనవేలంబ్రయోగించిరి. అని, తాత్పర్యము.

అథ సుప్తస్య రామస్య ప్రహస్తేన ప్రమాథినా
అసక్తం కృతహస్తేన శిర శ్ఛిన్నం మహాసినా. ౨౪

టీక॥అథ=అంత ; ప్రమాథినా=ప్రహారించునట్టి;కృతహస్తేన = శిక్షింపఁబడినహస్తముగల ; ప్రహస్తేన=ప్రహస్తునిచేత; అసక్తం= జాగులేనట్లుగా; సుప్తస్య=నిదురించిన; రామస్య=రామునియొక్క; శిరః=తల; మహాసినా=మహాఖడ్గముచేత; ఛిన్నం=నఱకఁబడినది.

అంత,యుద్ధంబులం బ్రహరించువాఁడును నేర్పరియునగు ప్రహస్తుండు, ఎంతమాత్రమును జాగు సేయక , మహాఖడ్గంబున,నిదురించుచున్న రామునిశిరంబును.నఱకెను. అని,తాత్పర్యము.

విభీషణ స్సముత్పత్య నిగృహీతో యదృచ్ఛయా
దిశః ప్రవ్రాజిత స్సర్వై లక్ష్మణః ప్లవగై స్సహ. ౨౫

టీక॥విభీషణః=విభీషణుఁడు; సముత్పత్య=ఎగిరి ; స్థితోపి (అధ్యాహృతము)=ఉన్నవాఁడైనను;యదృచ్ఛయా=డబ్బాటుచేత; నిగృహీతః= పట్టుకొనఁబడినాఁడు. లక్ష్మణః=లక్ష్మణుఁడు; ప్లవగైః=వానరులతో; సర్వైస్సహ= అందఱితోనుంగూడ;దిశః= దిక్కులనుగూర్చి;ప్రవ్రాజితః=పఱగెత్తెను.

విభీషణుండాకాశంబున కుద్గమించి పోనుద్యమింప , నదృష్టవశంబునవాఁడిసిపట్టుకొనిరి; లక్ష్మణుండును ఇతరవానరులందఱును, దిక్కులకుం బాఱిరి.

అని,తాత్పర్యము.

సుగ్రీవో గ్రీవయా సీతే భగ్నయా ప్లవగాధిపః
నిరస్తహనుక శ్శేతే హనుమాన్ రాక్షసై ర్హతః. ౨౬

టీక॥సీతే=సీతా! ప్లవగాధిపః=వానరరాజుండగు; సుగ్రీవః=సుగ్రీవుఁడు; భగ్నయా=విఱిగిన;గ్రీవయా=కంఠముతో; శేతే(అధ్యాహృతము)=పడియున్నాఁడు. హనుమాన్=హనుమంతుండు; రాక్షసైః=రాక్షసులచేత;హతః=చంపఁబడినవాఁడై ; నిరస్తహనుకః=పగులఁగొట్టఁబడినచెక్కిలి మీఁదిభాగముగలవాఁడై; శేతే=పడియున్నాఁడు.

సీతా! ఇప్పుడు, వానరరాజుండ

గునుగ్రీవుఁడు, కంఠమువిఱిగిపడియు న్నాఁడు; హనుమంతుండు హానువుప గిలి రాక్షసుల చేహతుండై పడియున్నాఁడు. అని, తాత్పర్యము.

జాంబవా నథ జానుభ్యా ముత్పత న్నిహతో యుధి
పట్టిసై ర్బహుభి శ్ఛిన్నో నికృత్తః పాదపో యథా. ౨౭

టీక॥ అథ = మఱియు; జాంబవాన్=జాంబవంతుఁడు; యుధి=యుద్ధమునందు; జానుభ్యాం=మోఁకాళ్లచే; ఉత్పతన్=ఎగురుచు; నిహతః = కొట్టఁబడినవాఁడై; బహుభిః=పెక్కులయిన; పట్టిసైః= అడ్డకత్తులచేత; ఛిన్నః=నఱకఁబడినవాఁడై; నికృత్తః = ఛేదింపఁబడిన; పాదపోయథా=వృక్షమువలె; వర్తతే(అధ్యాహృతము)= ఉన్నాఁడు.

మఱియు, జాంబవంతుండు, మోఁకాళ్లనుద్గమింపుఁడు రాక్షసులతనిం బట్టి పెక్కు-పట్టిసంబులచే ఖండించివధించిరి; అతండిప్పుడు నఱకఁబడి నేలంగూలిన వృక్షంబుపగిది నున్నాఁడు.

అని, తాత్పర్యము.

మైందశ్చ ద్వివిద శ్చోభౌ నిహతౌ వానరర్షభౌ
నిశ్శ్వసంతౌ రుదంతౌచ రుధిరేణ పరిప్లుతౌ. ౨౮
అసినా వ్యాయతౌ చ్ఛిన్నౌ మధ్యే హ్యరి నిషూదనౌ

టీక॥వ్యాయతౌ= దీర్ఘమయినదేహముగలవారలును; అరినిషూదనౌ = శత్రువులంజంపు వారలునగు; వానరర్షభౌ= వానరశ్రేష్ఠులయిన ; మైందశ్చ=మైందుండును; ద్వివిదశ్చ = ద్వివిదుండును; ఉభౌ=ఇద్దఱును; మధ్యే = నడుమునందు; అసినా=ఖడ్గముచేత ; ఛిన్నౌ = నఱకఁబడినవారలయి;రుధిరేణ=నెత్తురుచేత; పరిప్లుతౌ=తడుపఁబడినవారలయి; నిశ్శ్వసంతౌ=నిట్టూర్పులువుచ్చుచు; రుదంతౌచ= ఏడ్చుచును; నిహతౌ=చంపఁబడినారు.

దీర్ఘదేహులును శత్రువులం జంపువారలునగు మైంద ద్వివిదులను వానరోత్తములనిద్దఱును, రాక్షసులుకటిప్రదేశంబున, ఖడ్గంబుచే ఖండింప,వారలు నెత్తుటందోఁగుచు నిట్టూర్పులువుచ్చుచు, రోదనంబు సేయుచుఁ బ్రాణం

బులు విడిచిరి. అని, తాత్పర్యము.

అనుతిష్ఠతి మేదిన్యాం పనసః పనసో యథా. ౨౯

టీక॥ పనసః=పనసుఁడు ; పనసో యథా=పనసపండువలె; మేదిన్యాం=భూమియందు; అనుతిష్ఠతి = పడియున్నాఁడు.

పనసుండు , పనసుపండువలెఁ జిత్రవిధంబుగా ఖండింపఁబడి, నేలంబడియున్నాఁడు.
అని, తాత్పర్యము.

నారాచై ర్బహుభి శ్ఛిన్న శ్శేతే దర్యాం దరీముఖః
కుముదస్తు మహాతేజా నిష్కూజ స్సాయకైః కృతః. ౩౦

టీక॥ దరీముఖః= దరీముఖుఁడు; బహుభిః=పెక్కులయిన ;నారాచైః = బాణములచేత; ఛిన్నః=ఛేదింపఁబడినవాఁడై; దర్యాం = గుహయందు; శేతే = పరుండియున్నాఁడు. మహాతేజాః= అధికమయినపరాక్రమముగల; కుముదస్తు = కుముదుఁడును; సాయకైః=బాణములచేత; నిష్కూజః= నిశ్శబ్దుండుగా ; కృతః = చేయఁబడినాఁడు.

దరీముఖుండను వానరుండు , పెక్కుబాణంబులచే వధింపఁ బడి యొక గుహంబడియున్నాఁడు; మహాపరాక్రమశాలియగు కుముదుండు బాణంబులచే గతప్రాణుండై నిశ్శబ్దంబుగా నున్నాఁడు. అని, తాత్పర్యము.

అంగదో బహుభి శ్ఛిన్న శ్శరై రాసాద్య రాక్షసైః
పతితో రుధిరోద్గారీ క్షితౌ నిపతితాంగదః. ౩౧

టీక॥ అంగదః=అంగదుఁడు;రాక్షసైః=రాక్షసులచేత; ఆసాద్య= పొంది; బహుభిః=పెక్కులయిన; శరైః=బాణములచేత; ఛిన్నః= నఱకఁబడినవాఁడై; రుధిరోద్గారీ=నెత్తురుగ్రక్కుచు; నిపతితాంగదః= పడినబాహుపురులుగలవాఁడై; క్షితౌ=నేలయందు ; పతితః=పడినాఁడు.

అంగదుండు, రాక్షసులచేఁ బెక్కుబాణంబులం బ్రహరింపఁబడి, నెత్తుటం దోఁగి, బాహువురులువీడిపడ, మృతుండై నేలంబడెను. అని, తాత్పర్యము.

హరయో మథితా నాగై రథ జాలై స్తథా పరే
శాయితా మృదితా శ్చా శ్వైర్వాయువేగై రివాంబుదాః. ३२

టీక॥ శాయితాః= పరుండియున్న; హరయః=వానరులు; నాగైః= ఏనుంగులచేత; మథితాః=త్రొక్కఁబడిరి. అథ=మఱియు; జాలైః= కపటములచేత; మథితాః(అధ్యాహృతము)=చంపఁబడినారు. తథా=అట్లు; అపరే= ఇతరులు; వాయువేగైః= వాయువేగములచేత; అంబుదాఇవ= మేఘంబులువలె; అశ్వైశ్చ= గుఱ్ఱములచేతను; మృదితాః=త్రొక్కఁబడిరి-

పరుండి సుఖంబుగా నిదురించుచున్న వానరులు, కొందఱు, ఏనుంగులచేఁ ద్రొక్కఁబడిమృతులయిరి; కొందఱు కపటంబున వధింపఁబడిరి ; కొందఱు , వాయువేగంబుల మేఘంబులువలె, గుఱ్ఱంబులచేఁ ద్రొక్కఁబడిమృతిఁ బొందిరి. అని, తాత్పర్యము.

ప్రహృతా శ్చాపరే త్రస్తా హన్యమానా జఘన్యతః
అభిద్రుతాస్తు రక్షోభి స్సింహై రివ మహాద్విపాః. ३३

టీక॥ అపరేచ= మఱికొందఱును; త్రస్తాః=భయపడినవారలయి; అభిద్రుతాస్తు=పరుగెత్తినవారలయ్యు ; సింహైః=సింహములచేత ; మహాద్విపా ఇవ=పెద్దయేనుంగులువలె; రక్షోభిః= రాక్షసులచేత; జఘన్యతః= పృష్ఠభాగంబున; హన్యమానాః= కొట్టఁబడుచున్నవారలయి; ప్రహృతాః=చంపఁబడిరి.

మఱికొందఱుభయంబునం బరుగెత్తుదు, రాక్షసులు, సింహంబులు మహాగజంబులం బోలె , వారివెంటందగిలి ప్రహరించివధించిరి.

అని, తాత్పర్యము.

సాగరే పతితాః కేచి త్కేచి ద్గగన మాశ్రితాః




ఋక్షా వృక్షా నుపారూఢా వానరీం వృత్తి మాశ్రితాః. ౩౪

టీక॥ కేచిత్=కొందఱు; సాగరే=సముద్రమునందు; పతితాః=పడిరి. కేచిత్=కొందఱు; గగనం=ఆకాశమును; ఆశ్రితాః=పొందిరి. ఋక్షాః=ఎలుఁగుబంటులు; వానరీం=వానరసంబంధినియగు; వృత్తిం=స్వభావమును; ఆశ్రితాః=పొందినవై; వృక్షాన్=చెట్లను; ఉపారూఢాః=ఎక్కినవి.

కొందఱువానరులు, సముద్రంబునం బడిరి; కొందఱాకాశంబున కెగసి తప్పించుకొనిరి; భల్లూకంబులు కొన్ని నిజంబగువానరస్వభావంబు నవలంబించి, వృక్షంబులనారోహించినవి.

అని, తాత్పర్యము.

సాగరస్యచ తీరేషు శైలేషుచ వనేషుచ
పింగళా స్తే విరూపాక్షై ర్బహుభి ర్బహవో హతాః. ౩౫

టీక॥ సాగరస్య=సముద్రముయొక్క; తీరేషుచ=తీరములయందును; శైలేషుచ=పర్వతములయందును; వనేషుచ=అడవులయందును; తే=ఆ; పింగళాః=గోరోచనపువన్నెగల వానరులు; బహవః=పెక్కండ్రు; విరూపాక్షైః=రాక్షసులచేత; బహుభిః=పెక్కండ్రచేత; హతాః=చంపఁబడినారు.

మఱియుఁ, బెక్కండ్రు రాక్షసులు సముద్రతీరప్రదేశంబునను, బర్వతంబులయందునువనంబులయందును, వెదకివెదకి, పెక్కండ్రవానరులఁజంపిరి.

అని, తాత్పర్యము.

ఏవం తవ హతో భర్తా ససైన్యో మమ సేనయా
క్షతజార్ద్రం రజోధ్వస్త మిదం చాస్యాహృతం శిరః. ౩౬

టీక॥ ఏవం=ఇట్లు; మమ=నాయొక్క; సేనయా=సేనచేత; ససైన్యః=సైన్యముతోఁగూడిన; సః=అట్టి; తే=నీయొక్క; భర్తా=పెనిమిటి; హతః=చంపఁబడినాఁడు. క్షతజార్ద్రం=నెత్తురుచేఁదడిసినదియు; రజోధ్వస్తం=దుమ్ముచేఁజెడినదియునగు; అస్య=ఈరామునియొక్క; ఇదం=ఈ; శిరశ్చ=




తలయును; ఆహృతం= తేఁబడినది.

ఇట్లు, నాసైనికులు, నీభర్తను అతనిసైన్యమునుంజంపిరి; నెత్తుటందడిసి, దుమ్ము చేఁగప్పఁబడియున్న రామునిశిరస్సునుగూడఁదెచ్చియున్నారు.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.—హతః (కిం)= చంపఁబడినాఁడా యేమిః (శేషము, సమానము.)

అట్టిమహాపరాక్రమశాలియగునీపెనిమిటిని రామునిత్యద్రులగునాసైనికులు వధించిరనుటయెంతమాత్రమైనన్యమ్ము దగినదా? ఇదిఁ బద్ధము సందేహము లేదు; అయితే, రాక్షసులు నన్ను వంచించుటకై, మాయాబలంబునఁగల్పించి, రామశిరస్సునొకటిఁదీసికొని వచ్చియున్నారు; నమ్మకుము.

అని, తాత్పర్యము.

తతః పరమదుర్ధర్షో రావణో రాక్షసాధిపః
సీతాయా ముపశృణ్వంత్యాం రాక్షసీ మిద మబ్రవీత్. ౩౭

టీక॥ తతః= అటుపిమ్మట; పరమదుర్ధర్షః= ఎంతమాత్రము ఎదిరింపఁగూడనట్టి; రాక్షసాధిపః= రాక్షసులకుఁబ్రభుండైన; రావణః= రావణుఁడు; సీతాయాం= సీతాదేవి; ఉపశృణ్వంత్యాం= వినుచుండఁగా; రాక్షసీం = రాక్షసస్త్రీనిగూర్చి; ఇదం= ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంతఁబరమదుర్ధర్షుండగు రాక్షసరాజుండు రావణుండు, సీతాదేవివినుచుండ, సమీపంబుననున్నయొకరాక్షసినిజూచి, యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

రాక్షసం క్రూరకర్మాణం విద్యుజ్జిహ్వం త్వ మానయ
యేన త ద్రాఘవశిర స్సంగ్రామా త్స్వయ మాహృతమ్. ౩౮

టీక॥ యేన= ఎవ్వనిచేత; సంగ్రామాత్ = యుద్ధమునసుండి; స్వయం= తానె; తత్ = ఆ; రాఘవశిరః= రామునితలః ఆహృతం= తేఁబడినదో; తం(అధ్యాహృతము)= అట్టి; క్రూరకర్మాణం= క్రూరములయినకార్యములుగల;

రాక్షసం= రాక్షసుఁడైన ; విద్యుజ్జిహ్వం=విద్యుజ్జిహ్వునిః; త్వం=నీవు; ఆనయ=తోడ్కొ-నిరమ్ము.

యుద్ధరంగంబుననుండి , రాముని శిరస్సిచ్చటికిఁ దెచ్చిన క్రూరకర్ముండగు రాక్షసుని విద్యుజ్జిహ్వుం దోడ్కొ-నిరమ్ము. అని, రావణుండు , రాక్షసితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— "క్రూరకర్ముండగు రాక్షసుండు" అనుటచే, సీతాదేవికి, నమ్మవలదని చెప్పినట్లు, సూచింపఁబడినది.

విద్యుజ్జిహ్వ స్తతో గృహ్య శిర స్తత్సశరాసనమ్
ప్రణామం శిరసా కృత్వా రావణస్యాగ్రత స్స్థితః. ౩౯

టీక॥ తతః=అంత; విద్యుజ్జిహ్వః=విద్యుజ్జిహ్వుఁడు; సశరాసనం= విల్లుతోఁగూడిన; తత్=ఆ; శిరః= తలను; గృహ్య (గృహీత్వా)=తీసికొని ; శిరసా=తలచేత; ప్రణామం=నమస్కారమును; కృత్వా = చేసి ; రావణస్య=రావణునియొక్క;అగ్రతః=ముందట; స్థితః=ఉన్నాఁడు.

అంత, విద్యుజ్జిహ్వుండు, ఆరామశిరస్సునుధనుస్సునుందీసికొనివచ్చి, సాష్టాంగముగనమస్కరించి, రావణుని యెదుటనిలుచుండెను.

అని,తాత్పర్యము.

తమబ్రవీ త్తతో రాజా రావణో రాక్షసం స్థితమ్
విద్యుజ్జిహ్వం మహాజిహ్వం సమీపపరివర్తినమ్. ౪౦

టీక॥ తతః=అంత; రాజా= రాక్షసరాజుండగు; రావణః= రావణుఁడు ; మహాజిహ్వం = పెద్దనాలుకగలవాఁడును; సమీపపరివర్తినం = సమీపంబుననున్నవాఁడును; స్థితం=నిలుచున్నవాఁడునగు; రాక్షసం=రాక్షసుఁడైన; తం=ఆ;విద్యుజ్జిహ్వం=విద్యుజ్జిహ్వునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంత,రాక్షసరాజుండగురావణుండు,పెద్దనాలుకగలదన సమీపంబుననున్న విద్యుజ్జిహ్వుంబూచి, యిట్లని , చెప్పెను.అని,తాత్పర్యము.

అగ్రతః కురు సీతాయాః శీఘ్రం దాశరథే శ్శిరః
అవస్థాం పశ్చిమాం భర్తుః కృపణా సాధు పశ్యతు. ౪౧

టీక॥ దాశరథేః=రామునియొక్క; శిరః=తలను; శీఘ్రం=శీఘ్రముగా; సీతాయాః=సీతయొక్క; అగ్రతః = ముందట; కురు = చేయుము. కృపణా=దరిద్రురాలగుసీత; భర్తుః= పెనిమిటియొక్క; పశ్చిమాం=కడపటిదైన; అవస్థాం=అవస్థను; సాధు=చక్కఁగా; పశ్యతు=చూచుఁగాక.

శీఘ్రంబుననా రామశిరస్సును, సీత ముందఱనుంచుము; ఈదరిద్రురాలు, తనపెనిమిటికిఁ గడపటనెట్టియవస్థ వచ్చినదో చక్కఁగాఁజూచుఁగాక. అని, రావణుండు విద్యుజ్జిహ్వునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తంతు తద్రక్ష శ్శిర స్తత్ప్రియదర్శనమ్
ఉప నిక్షిప్య సీతాయాః క్షిప్ర మంతరధీయత. ౪౨

టీక॥ తత్= ఆ; రక్షః = విద్యుజ్జిహ్వుఁడు; ఏవం=ఇట్లు; ఉక్తంతు=చెప్పఁబడినంతనే; తత్= ఆ; ప్రియదర్శనం=సంతోషకరంబగు చూచుటగల; శిరః=తలను; సీతాయాః = సీతయొక్క; ఉప=సమీపమునందు; నిక్షిప్య=ఉంచి; క్షిప్రం= శీఘ్రముగా; అంతరధీయత=మఱుఁగు పడెను.

ఆవిద్యుజ్జిహ్వుండు, రావణునిమాటనువిని, చూపరులకుఁబ్రియంబుగల్గించునట్టి యారామశిరంబును సీతాదేవి ముందఱనుంచి, శీఘ్రంబుననావలికిం బోయెను. అని, తాత్పర్యము.

రావణశ్చాపి చిక్షేప భాస్వరం కార్ముకం మహత్
త్రిషు లోకేషు విఖ్యాతం సీతా మిద మువాచ సః. ౪౩

టీక॥ సః=ఆ; రావణశ్చాపి=రావణుండును; త్రిషు=మూఁడైన; లోకేషు=లోకములయందు; విఖ్యాతం = ప్రసిద్ధమయినదియు; భాస్వరం= ప్రకాశించుచున్నదియు; మహత్=గొప్పదియునగు; కార్ముకం=ధనుస్సును;

చిక్షేప=ఈడ్చెను. సీతాం=సీతాదేవిని; ఇదం=ఈమాటను; ఉవాచ=చెప్పెను.

అంత, రావణుండు, ముల్లోకంబులం బ్రసిద్ధంబును తేజోవంతంబు నగు నామహాధనుస్సును,విద్యుజ్జిహ్వునిచేత నుండితీసికొని, సీతాదేవింజూచి, యిట్లనిచెప్పెను.అని,తాత్పర్యము.

ఇదంతు తవ రామస్య కార్ముకం జ్యాసమాయుతమ్
ఇహ ప్రహస్తేనా నీతం హత్వా తం నిశి మానుషమ్. ౪౪

టీక॥తవ=నీయొక్క; రామస్య=రామునియొక్క; జ్యాసమాయుతం=అల్లెత్రాటితోఁగూడిన; ఇదం=ఈ; కార్ముకంతు=ధనుస్సును; ప్రహస్తేన=ప్రహస్తునిచేత; నిశి=రాత్రియందు;తం=ఆ;మానుషం=మనుష్యుని; హత్వా=చంపి;ఇహ=ఇచ్చటికి;ఆనీతం=తేఁబడినది.

మఱియుఁబ్రహస్తుండురాత్రికాలంబున,మనుష్యుండగు నీరామునివధించి , యల్లెత్రాటితోఁగూడిన యతనిధనుస్సునుగూడనిచ్చటికిఁదెచ్చినాఁడు ; ఇదిగో చూడుము. అని,రావణుండు సీతాదేవితోఁజెప్పెను.అని,తాత్పర్యము.

స విద్యుజ్జిహ్వేన సహైవ తచ్ఛిరో
ధనుశ్చ భూమౌ వినికీర్య రావణః
విదేహరాజస్య సుతాం యశస్వినీం
తతో బ్రవీత్తాం భవ మే వశానుగా. ౪౫

టీక॥సః=ఆ;రావణః= రావణుఁడు; విద్యుజ్జిహ్వేనసహైవ (విద్యుజ్జిహ్వేనసహైవ)= విద్యుజ్జిహ్వునితోఁగూడనె; తత్=ఆ;శిరః=తలను; ధనుశ్చ=విల్లును; భూమౌ=నేలయందు; వికీర్య=పడవైచి;తతః=అంత; యశస్వినీం=అధికమయినకీర్తిగల;తాం=ఆ;విదేహరాజస్య= జనకమహారాజుయొక్క; సుతాం = కొమార్తెయయినసీతాదేవినిగూర్చి;"మే=నాయొక్క;వశానుగా= అధీనతననుసరించుదానవు;భవ=అగుము." ఇతి(అధ్యా

హృతము)—అని;అబ్రవీత్ — చెప్పెను.

ఆరావణుండు, విద్యుజ్జిహ్వుండు నుందానును, ఆరామునిశిరస్సును ధనుస్సును నేలంబడవైచి,యశస్వినియగు సీతాదేవింబూచి, "ఇంకనీవు నాయధీనురాలవగు" మని,చెప్పెను.

అని,తాత్పర్యము.

రహస్యార్థము.—మే= లక్ష్మీదేవీ!అవశానుగా,అ = విష్ణుదేవునియొక్క,వశానుగా= అధీనతనను సరించుదానవు; భవ=అగుము. (శేషము,సమానము).

లక్ష్మీదేవీ! నీవు రామావతారరూపుండగు రామునిం జేరంగలవు. అని,రావణుండుచెప్పెను.

అని,తాత్పర్యము.

ఇచ్చట, ఈభావమునకు విరుద్ధములయినయంశంబులు, రావణునిచే నితరరాక్షసమోహనార్థమయి చెప్పంబడినవిగాం దెలియునది.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ఏకత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండైకత్రింశసర్గటీక,
ముగిసినది.

---

౩౨

ద్వాత్రింశసర్గప్రారంభః.

సా సీతా తచ్ఛిరో దృష్ట్వా తచ్చ కార్ముక ముత్తమమ్
సుగ్రీవప్రీతిసంసర్గ మాఖ్యాతంచ హనూమతా. ౧
నయనే ముఖవర్ణంచ భర్తు స్తత్సదృశం ముఖమ్
కేశాన్ కేశాంతదేశంచ తంచ చూడామణిం శుభమ్. ౨
ఏతైః సర్వై రభిజ్ఞానై రభిజ్ఞాయ సుదుఃఖితా
విజగర్హేథ కైకేయీం క్రోశంతీ కురరీయథా. ౩




టీక॥ అథ=అంత; సా=ఆ; సీతా= సీతాదేవి=తత్=ఆ; శిరః=తలను; తత్=ఆ; ఉత్తమం=శ్రేష్ఠమయిన; కార్ముకంచ= ధనుస్సును; హనూమతా=హనుమంతునిచేత; ఆఖ్యాతం= చెప్పఁబడిన; సుగ్రీవప్రీతిసంసర్గం=సుగ్రీవునితో స్నేహసంబంధమును; దృష్ట్వా=చూచి; నయనే=కండ్లను; ముఖవర్ణంచ= ముఖముయొక్క-రంగును; కేశాన్=వెండ్రుకలను; కేశాంతదేశంచ=లలాటమును; తం=ఆ; శుభం= సుందరమయిన; చూడామణించ; చూడామణిని; దృష్ట్వా(అధ్యాహృతము)= చూచి; ఏతైః=ఈ; అభిజ్ఞానైః=గుఱుతులచేత; సర్వైః=అన్నిఁటిచేతను; తత్= దాని; భర్తుః=పెనిమిటియొక్క-; ముఖేన(అధ్యాహృతము)= ముఖముతో; సదృశం=సరియయిన; ముఖం= మొగమునుగా; అభిజ్ఞాయ=తెలిసికొని; సుదుఃఖితా= మిక్కి-లియుదుఃఖమునొందినదై; కురరీయథా=లేడివలె; క్రోశంతీ=అఱచుచు; కైకేయీం=కైకేయిని; విజగర్హే=నిందించెను.

అంత, నాసీతాదేవి, ఆశిరస్సును ఉత్తమంబగు నాధనుస్సునుంజూచి, హనుమంతుండు చెప్పిన రామసుగ్రీవుల సఖ్యంబునుండలంచుకొని, ఆకండ్లను ఆముఖవర్ణంబును, ఆవెండ్రుకలను ఆనెత్తిని ఆచూడామణినింజూచి, యాగుఱుతుల చేనది రామునితలవలెనే యున్నదని తెలిసికొని, పరమదుఃఖితయయి, లేడియుంబోలె నుచ్చైస్స్వరంబున రోదనంబు సేయుచుఁ, గైకేయినినిందించెను. అని, తాత్పర్యము.

స కామా భవ కైకేయి హతోఽయం కులనందనః
కుల ముత్సాదితం సర్వం త్వయా కలహశీలయా. ౮

టీక॥ కైకేయి= కైకేయీ! అయం=ఈ; కులనందనః = రాముఁడు; హతః=చంపఁబడినాఁడు. సకామా= కోర్కెతోఁగూడినదానవు; భవ= అగుము. కలహశీలయా = కలహస్వభావురాలవగు; త్వయా=నీచేత; కులం=రఘువంశము; సర్వం = అంతయు; ఉత్సాదితం=నశింపఁజేయఁబడినది.

కైకేయీ! నీకోరిక-యీడేఱినది; కులనందనుండగు రాముండు హతుండయ్యె; కలహకారిణివగు నీవు, రఘువంశమునంతయు నాశమునొందిం




చితివి ; ఇంకభరతాదులు నవశ్యము మృతులగుదురు. అని, తాత్పర్యము.

ఆర్యేణ కింతే కైకేయి కృతం రామేణ విప్రియమ్
యన్మయా చీరవసన స్త్వయా ప్రస్థాపితో వనమ్. ౫

టీక॥ కైకేయి=కైకేయీ! యత్=ఏకారణమువలన; త్వయా=నీచేత; రామః(అధ్యాహృతము)=రాముఁడు; మయా(సహ)=నాతోఁగూడ ; చీరవసనః = నారచీరలువస్త్రములుగాఁగల వాఁడై; వనం=అడవినిగూర్చి; ప్రస్థాపితః=పంపఁబడెనో; తత్ (అధ్యాహృతము)=అట్టి; విప్రియం=అపకారము; కిం=ఏమి; ఆర్యేణ=పూజ్యుఁడగు; రామేణ=రామునిచేత; తే=నీకు; కృతం=చేయఁబడినది?

కైకేయీ! నీవు, రాముని, నారచీరలుకట్టుకొనవాసంగి, నాతోఁగూడనడవి కింబంపితివే; సర్వలోకప్రియకారియగు రాముండునీకట్టి యపకారమునేమి గావించెను? అని , సీతాదేవివిలపించెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు వైదేహీ వేపమానా తపస్వినీ
జగామ జగతీం బాలా ఛిన్నాతు కదళీ యథా. ౬

టీక॥ తపస్వినీ= శోచనీయయు; బాలా=చిన్నదియునగు; వైదేహీ= సీతాదేవి; ఏవం=ఇట్లు; ఉక్త్వాతు= చెప్పినంతనె; వేపమానా=వడఁకుచు ; ఛిన్నా=నఱకఁబడిన; కదళీయథాతు=అరఁటిచెట్టువలెనె; జగతీం = భూమిని; జగామ=పొందెను.

శోచనీయయుబాలయునగు సీతాదేవి, యిట్లువిలపించి, దుఃఖభయంబులవలన, గడగడవడంకుచు, ఛేదింపఁబడిన యరఁటిచెట్టువలె నేలంబడెను.

అని, తాత్పర్యము.

సా ముహూర్తా త్సమాశ్వస్య ప్రతిలభ్యచ చేతనామ్
తచ్ఛిర స్సముపాఘ్రాయ విలలాపాఽఽయతేక్షణా. ౭

౧౬॥ ఆయతేక్షణా= నిడువులయి [illegible]; సా = ఆసీతాదేవి; ముహూర్తాత్= స్వల్పకాలమువలన; స[illegible]=ఊరటిల్లి; చేతనాం= సంజ్ఞను; ప్రతిలభ్యచ=పొందియు; తత్ = ఆ; శిరః=తలను; సముపాఘ్రాయ = మూరొ్కని; విలలాప=విలపించెను.

విశాలంబులగు కండ్లుగలయాసీతాదేవి, యంతంగొంతవడికిc దేతి సంజ్ఞcబొంది, యారామశిరస్సును మూర్కొనియిట్లని విలపించెను.

అని, తాత్పర్యము.

హా హతాస్మి మహాబాహూ వీరవ్రత మనువ్రత
ఇమాం తే పశ్చిమావస్థాం గతాస్మి విధవా కృతా. ౧౮

టీక॥ హా = అయ్యో! మహాబాహూ=గొప్పచేతులుగలవాcడా! వీరవ్రతం=వీరవ్రతమును, శత్రువుంజంపకపెనుదీయుననువ్రతమునను; అనువ్రత=అనుసరించినవాcడా! హతా=చంపcబడినదానను; అస్మి = అయితిని. తే=నీయొక్క; ఇమాం=ఈ; పశ్చిమావస్థాం=మరణసంబంధియగుదశను; గతా=తెలిసికొన్నదానను; అస్మి=అయితిని. విధవా=విధవను; కృతా=చేయcబడినాను.

అయ్యో! మహాబాహుcడా! వీరవ్రతమునవలంబించియున్నవాcడా! హతనైతిని; నీమరణావస్థంబాడబ్రతికియుంటినే; విధవనైతిని.

అని, తాత్పర్యము.

ప్రథమం మరణం నార్యా భర్తుర్వైగుణ్య ముచ్యతే
సువృత్త స్సాధువృత్తాయా స్సంవృత్త స్త్వం మమాగ్రతః. ౧౯

టీక॥సువృత్త= మంచియాచారముగలరాముcడా! ప్రథమం=మొదట; భర్తుః=పెనిమిటియొక్క; మరణం=చావు; నార్యాః=స్త్రీయొక్క; వైగుణ్యం= దుర్గుణముగా, దుర్గుణమువలనcగలిగినదిగానను; ఉచ్యతే=చెప్పcబడుచున్నది. త్వం=నీవు; సాధువృత్తాయాః= మంచియాచారముగల; మమ=నాయొక్క; అగ్రతః=ముందట; సువృత్తః=మృతిcబొందినావు.

సదాచారసంపన్నుండవగు రాముఁడా! స్త్రీదోషంబున, భర్తమ్ముందుమరణంబునొందునని చెప్పఁబడియున్నది; అట్లుగూడలేదే; సదాచార సంపన్నను గనామ్ముందటనీవుమృతిఁబొందితివే; దీనికేమికారణము? అని, తాత్పర్యము.

దుఃఖా ద్దుఃఖం ప్రపన్నాయా మగ్నాయా శ్శోకసాగరే
యో హి మా ముద్యత స్త్రాతుం సో౽పి త్వం వినిపాతితః. ౧౦

టీక॥మమ(అధ్యాహృతము)= నేను; దుఃఖాత్=దుఃఖముననుండి; దుఃఖం=దుఃఖమును; ప్రపన్నాయాః=పొందినదాననై; శోకసాగరే= దుఃఖసముద్రమునందు; మగ్నాయాః= మునిఁగియుండఁగా; యః=ఎవ్వఁడవు; మాం = నన్ను; త్రాతుం=రక్షించుటకు; ఉద్యతః=ప్రయత్నించితివో; సః=అట్టి; త్వమపి=నీవును; వినిపాతితో హి= చంపఁబడినావుగదా!

నేను, దుఃఖమునొందిదుఃఖసముద్రంబునమునింగియుండఁగా, నిట్టిసమయంబున, నన్నుఁగాపాడవచ్చినట్టినీవుగూడ హతుండవైతివే! అని, తాత్పర్యము.

సా శ్వశ్రూ ర్మమ కౌసల్యా త్వయా పుత్రేణ రాఘవ
వత్సేనేవ యథా ధేను ర్వివత్సా వత్సలా కృతా. ౧౧

టీక॥ రాఘవ=రాముఁడా! మమ= నాయొక్క; శ్వశ్రూః = అత్తయయిన; సా=ఆ; కౌసల్యా=కౌసల్య; వత్సలా = దూడయందుప్రేమగల; ధేనుః యథా= ఆవువలె; హతేన(అధ్యాహృతము)=చంపఁబడిన; పుత్రేణ=కొడుకవయిన; త్వయా=నీచేత; వత్సేనేవ=దూడచేతవలె; వివత్సా= బిడ్డలేనిదిగా; కృతా=చేయఁబడినది.

రాముఁడా! నాయత్తకౌసల్య, దూడయందతిప్రేమగల యావుదూడమృతిఁబొందుటవలన మహా దుఃఖంబు నొందునట్లు, పుత్రుండవునీవుమృతిఁ బొందుటవలనఁ, బరమదుఃఖంబుఁబొందునట్లు, గావింపఁబడినది.

అని, తాత్పర్యము.

ఆదిష్టం దీర్ఘ మాయుస్తే యై రచింత్యపరాక్రమ

అనృతం వచనం తేషా మల్పాయు రసి రాఘవ. ౧౨

టీక॥ అచింత్యపరాక్రమ = ఎన్నరానిపరాక్రమముగల ; రాఘవ = రాముఁడా! యైః = యెవ్వరిచేత ; తే=నీకు; దీర్ఘం=దీర్ఘమయిన; ఆయుః=ఆయుస్సు; ఆదిష్టం=చెప్పఁబడినదో; తేషాం=వారలయొక్క ; వచనం=మాట ; అనృతం=దబ్బఱ. అల్పాయుః=కొంచెమయినయాయుస్సు కలవాఁడవు; అసి=అయితివి.

అపరిమేయంబగుపరాక్రమముగల రాముఁడా! మున్నునీవు , బహుకాలము జీవింతువనిచెప్పిన, జ్యోతిషికులమాటయిప్పుడసత్యమయినది ; నీవల్పాయుష్కుఁడవయితివి.అని, తాత్పర్యము.

అథవా నశ్యతి ప్రజ్ఞా ప్రాజ్ఞస్యాపి సత స్తవ
పచ త్యేవం యథా కాలో భూతానాం ప్రభవో హ్యయమ్. ౧౩

టీక॥అథవా=అటుకాదేని;కాలః=కాలము; యథా=ఎట్లు; ఏనం= ఈనిన్ను; పచతి=పాకమునొందించునో;తథా(అధ్యాహృతము)=అట్లు ; తవ=నీవిషయమునందు; ప్రాజ్ఞస్యాపి=పండితుండైనను; సతః=సత్పురుషునికి; ప్రజ్ఞా=బుద్ధి;నశ్యతి=నశించును.అయం = ఈకాలము;భూతానాం=ప్రాణులకు; ప్రభవోహి=కారణముగదా!

అటుగాదేని, కాలము, నీకువిరుద్ధముగానుండుటంజేసి,అదియెజ్యోతిశ్శాస్త్రమునందుఁబండితులయినవారును , నీవిషయమయి , బుద్ధిభ్రంశమునొందునట్లుగావించియుండును; కాలముసమస్తభూతంబులకును గారణంబుగదా! అదియేమిచేసినను జేయవచ్చును.

అని, తాత్పర్యము.

అదృష్టం మృత్యు మాపన్నః కస్మా త్త్వం నయశాస్త్రవిత్
వ్యసనానా ముపాయజ్ఞః కుశలో హ్యసి వర్జనే. ౧౪

టీక॥ నయశాస్త్రవిత్ = నీతిశాస్త్రముదెలిసిన;త్వం=నీవు; కస్మాత్= ఎందువలన;అదృష్టం = తెలియనట్లుగా;మృత్యుం=మరణమును; ఆపన్నః=

పొందినావు? ఉపాయజ్ఞః= ఉపాయంబులఁదెలిసిననీవు ; వ్యసనానాం=కష్టములయొక్క ; వజానే=పోఁగొట్టుకొనుటయందు; కుశలః= సమర్థుఁడవు ; అసిహి=అగుదువుగదా!

నీవు సమస్తోపాయంబులు దెలిసినవాఁడవు ! నీతిశాస్త్రజ్ఞుండవు; ఎట్టియపాయంబులనేని, తొలఁగించుకొనసమర్థుండవే; ఈవిధంబున, నేమఱుపాటున నెట్లుహతుండవైతివి? అని, తాత్పర్యము

తథా త్వం సంపరిష్వజ్య రౌద్రయా తినృశంసయా
కాళరాత్ర్యా మయాఽచ్ఛిద్య హృతః కమలలోచన. ౧౫

టీక॥ కమలలోచన= తామరపూలవంటికండ్లుగలరాముఁడా ! మయా= నాచేత; త్వం=నీవు; రౌద్రయా= భయంకరయును; అతినృశంసయా=మిక్కిలియుఁగ్రూరురాలునగు ; కాళరాత్ర్యా=కాళరాత్రిచేత ; ఆచ్ఛిద్య= బలాత్కరించి; హృతః= అపహరింపఁబడినావు.

తామరపూలవంటి కండ్లుగల రాముఁడా! నేనువిధవనుగావలసినదానను గావున, నానిమిత్తమయి, భయంకరాకారయునతిక్రూరయునగు కాళరాత్రి నిన్నుహరించియుండును.
అని, తాత్పర్యము.

ఉపశేషే మహాబాహో మాం విహాయ తపస్వినీమ్
ప్రియామివ సమాశ్లిష్య పృథివీం పురుషర్షభ. ౧౬

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుండవును; మహాబాహో= పెద్దచేతులుగలవాఁడవునగు రాముఁడా! తపస్వినీం=శోచనీయనగు; మాం=నన్ను; విహాయ=విడిచి; పృథివీం=భూమిని; ప్రియామివ= ప్రియురాలినివలె; సమాశ్లిష్య=కవుఁగిలించుకొని; ఉపశేషే= పరుండియున్నావు.

మహాబాహుండవుపురుషశ్రేష్ఠుండవుగురాముఁడా! దిక్కులేనిదాననగునన్నువిడిచి భూమినిం బ్రియురాలింబోలెఁ గవుఁగిలించుకొని పరుండెదవు
అని, తాత్పర్యము.

అర్చితం సతతం యత్త ద్గంధమాల్యై ర్మయా తవ
ఇదం తే మత్ప్రియం వీర ధనుః కాంచనభూషణమ్. ౧౭

టీక॥ వీర=పరాక్రమశాలివగు రాముఁడా! యత్=ఏది; మయాసహ=నాతోఁగూడ; తవ(త్వయా)=నీచేత; గంధమాల్యైః = గంధముల చేతను బుష్పముల చేతను; అర్చితం= పూజింపఁబడినదో; తత్=అట్టి; మత్ప్రియం= నాకుఁబ్రియంబును; కాంచనభూషణం= బంగారమలంకారముగాఁ గలదియగు; ధనుః=విల్లు; ఇదం=ఇట్టిది ; జాతం(అధ్యాహృతము)=అయినది.

పరాక్రమశాలివగు రాముఁడా! నీచేతను నాచేతనుంగూడ గంధమాల్యంబులభక్తి మెయింబూజింపఁబడుచుండిన, నాకుఁబ్రియంబును గాంచనాలంకృతంబునగు ధనుస్సు, ఇప్పుడిట్లయినదే!

అని, తాత్పర్యము.

పిత్రా దశరథేన త్వం శ్వశురేణ మమా నఘ
సర్వైశ్చ పితృభి స్సార్ధం నూనం స్వర్గే సమాగతః. ౧౮

టీక॥అనఘ= పాపరహితుండవగు రాముఁడా! త్వం=నీవు; స్వర్గే=స్వర్గమునందు; మమ=నాయొక్క; శ్వశురేణ=మామయగు ; పిత్రా=తండ్రియగు; దశరథేన = దశరథమహారాజుతోను; పితృభిః=తండ్రులతో; సర్వైశ్చసార్ధం=అందఱితోనుం గూడ; సమాగతః=చేరితివి. నూనం= నిశ్చయము.

పాపరహితుండవగు రాముఁడా నీవు, స్వర్గంబున, నామామయునీతండ్రియునగు దశరథమహారాజుతోను, ఇంకనునీ తాతలు మొదలగునందఱి పితరులతోనుం జేరియున్నావు; ఇదినిశ్చయము.

అని, తాత్పర్యము.

దివి నక్షత్రభూత స్త్వం మహత్కర్మ కృతాం ప్రియమ్
పుణ్యం రాజర్షివంశం త్వ మాత్మన స్సముపేక్షసే. ౧౯

టీక॥త్వం=నీవు ; దివి=స్వర్గమునందు; నక్షత్రభూతః= నక్షత్రరూపుఁ

డవై; త్వం=నీవు; మహాత్మకర్మకృతాం(మహాకర్మకృతాం)=గొప్పకార్యములఁజేయునట్టివారలకు; ప్రియం=సంతోషకరంబును; పుణ్యం=పవిత్రమునగు; ఆత్మనః=నీయొక్క; రాజర్షివంశం=రాజర్షులవంశమును, సముపేక్షసే=చూచుచుందువు.

నీవు, స్వర్గంబునవిమానగతుండవై, ఇంతకుమున్నె స్వర్గమునొందినవారలునుగొప్పకార్యములుసేయువారికిఁబ్రియులునగునీవంశంబునం బుట్టిన, యిక్ష్వాకువుమున్నగుపుణ్యపురుషులం జూచుచుందువు. అని, తాత్పర్యము.

కిం మాం న ప్రేక్షసే రాజన్ కిం మాం న ప్రతిభాషసే
బాలాం బాల్యేన సంప్రాప్తాం భార్యాం మాం సహచారిణీమ్. ౨౦

టీక॥ రాజన్ = రాముఁడా! బాలాం=చిన్నదానను; బాల్యేన=చిన్నతనముచేతనె; సంప్రాప్తాం=పొందఁబడినదానను; భార్యాం=భార్యను; సహచారిణీం = కూడనుండు దాననగు; మాం=నన్ను; మాం=నన్ను; కిం = ఎందుకు; నప్రేక్షసే=చూడవు? మాం= నన్నుఁగూర్చి; కిం=ఎందుకు; నప్రతిభాషసే=మాటలాడవు?

రాముఁడా! చిన్నదానను జిన్నతనంబుననుండియెనీయొద్దకు వచ్చినదానను భార్యను నిన్నువిడువకనీతోఁగూడనున్నదానను, అట్టినేను, ఇట్లు, పెనువగలం బొందియుండఁగా, నన్నేలకన్నెత్తిచూడవు? నాతో నేలమాటలాడవు?

అని, తాత్పర్యము-

సంశ్రుతం గృహ్ణతా పాణిం చరిష్యామీతి యత్త్వయా
స్మర తన్మమ కాకుత్స్థ నయ మామపి దుఃఖితామ్. ౨౧

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! మమ=నాయొక్క; పాణిం=హస్తమును; గృహ్ణతా=గ్రహించునట్టి; త్వయా=నీచేత; (సహ) చరిష్యామీతి=కూడనుండెదనని; యత్=ఏది; సంశ్రుతం=ప్రతిజ్ఞచేయఁబడినదో; తత్=దాని;

స్మరణతలఁపుము. దుఃఖితాం = దుఃఖముఁబొందిన; మామపి = నన్నుఁగూడ; నయ = తోడ్కొనిపొమ్ము.

రాముఁడా! నీవు వివాహంబున, నా హస్తంబు గ్రహించునపుడు, నాతోఁగూడనుండెదనని ప్రతిజ్ఞ చేసితివే; దానిని స్వధర్మప్రతిజ్ఞ దెచ్చుకొనుము; దుఃఖితనగు నన్నుఁదీసికొనిపొమ్ము.

అని, తాత్పర్యము.

కస్మాన్మా మపహాయ త్వం గతో గతిమతాం వర
అస్మా ల్లోకా దముం లోకం త్యక్త్వా మా మపి దుఃఖితామ్. ౨౨

టీక॥ గతిమతాం = మంచిగతిగలవారలలో; వర = ఉత్తముఁడవగు రాముఁడా! త్వం = నీవు; త్వాం (అధ్యాహృతము) = నిన్ను; త్యక్త్వా = విడిచి; దుఃఖితాం = దుఃఖమునొందిన; మామపి = నన్నునుగూడ, మిక్కిలి యు ప్రియురాలననుట; మాం = నన్ను; అపహాయ = విడిచి; కస్మాత్ = ఎందువలన; అస్మాత్ = ఈ; లోకాత్ = లోకమునుండి; అముం = ఈ; లోకం = లోకమును; గతః = పొందినావు?

ఉత్తమగతిగలవారలలో నుత్తముఁడవగు రాముఁడా! నిన్ను విడిచియుండుటచేఁ బరమదుఃఖితనై యున్న పరమప్రియునగు నన్నును, ఎట్లు విడిచి, యీలోకంబుననుండి, పరలోకంబునకుఁ బోతివి.

అని, తాత్పర్యము.

కల్యాణై రుచితం యత్త త్పరిష్వక్తం మ్మయైవ తు
క్రవ్యాదై స్త చ్ఛరీరం తే నూనం విపరికృష్యతే. ౨౩

టీక॥ కల్యాణైః = మంగళపదార్థములచేత; ఉచితం = తగియున్న; యత్ = ఏదేహము; మయైవతు = నాచేతనె; పరిష్వక్తం = కవుఁగిలింపఁబడినదో; తత్ = అట్టి; తే = నీయొక్క; శరీరం = దేహము; క్రవ్యాదైః = క్రూరమృగములచేత; విపరికృష్యతే = ఈడ్వఁబడుచున్నది. నూనం = నిశ్చయము.

నేను మున్ను మంగళద్రవ్యంబులగు చందనాదులతో నలంకరించి యేశరీరమునుగవుఁగిలించుకొనుచుంటినో, అట్టినీశరీరమిప్పుడు నక్కలు మొదలగు

వానిచే నాకర్షింపఁబడుచున్నది! అని, తాత్పర్యము.

అగ్నిష్టోమాదిభి ర్యజ్ఞై రిష్టవా నాప్త దక్షిణైః
అగ్నిహోత్రేణ సంస్కారం కేన త్వంతు నలప్స్యసే. ౨౪

టీక॥ కేన=ఎందుచేత; త్వంతు=నీవుమాత్రము; ఆప్తదక్షిణైః=చాలిన దక్షిణలుగల; అగ్నిష్టోమాదిభిః=అగ్నిష్టోమము మొదలగాఁగల; యజ్ఞైః=యాగములచేత; ఇష్టవాన్=యజించినవాఁడవై; అగ్నిహోత్రేణ=యాగీయాగ్నిచేత; సంస్కారం=సంస్కారమును; నలప్స్యసే=పొందవు?

పూర్ణదక్షిణలతో నగ్నిష్టోదియాగంబులుగావించి యాగీయంబగునగ్నిహోత్రంబుచే సంస్కారంబునొందఁదగిననీవు, ఇట్లు, ఏయాగంబును జేయకమున్నె వ్యర్థముగా మృతినొందుటకేమికారణము? అని, తాత్పర్యము.

ప్రవ్రజ్యా ముపపన్నానాం త్రయాణా మేక మాగతమ్
పరిప్రక్ష్యతి కౌసల్యా లక్ష్మణం శోకలాలసా. ౨౫

టీక॥ ప్రవ్రజ్యాం = ప్రవాసమును; ఉపపన్నానాం=పొందిన; త్రయాణాం=ముగ్గురిలో; ఆగతం= వచ్చిన; ఏకం=ఒకఁడయిన; లక్ష్మణం = లక్ష్మణుని; కౌసల్యా=కౌసల్య; శోకలాలసా=దుఃఖమునన తిచపలయయి; పరిప్రక్ష్యతి=అడుగఁగలదు.

ప్రవాసమునొందినముగ్గురిలోను, లక్ష్మణుండొక్కఁడెవచ్చుటంజూచి, కౌసల్యాదేవి, పరమదుఃఖితయయి, లక్ష్మణుని, "సీతా రాములెక్కడ?" అనియడుగఁగలదు.

అని, తాత్పర్యము.

స తస్యాః పరిపృచ్ఛంత్యా వధం మిత్రబలస్య తే
తవ చాఖ్యా స్యతే నూనం నిశాయాం రాక్షసై ర్వధమ్. ౨౬

టీ॥ సః=ఆలక్ష్మణుఁడు ; పరిప్లవంత్యాః=అడుగుచున్న; తస్యాః=ఆ కౌసల్యాదేవికి; నిశాయాం=రాత్రియందు; రాక్షసైః=రాక్షసులచేత; తే=నీయొక్క; మిత్రబలస్య= మిత్రసైన్యముయొక్క; వధం=చంపుటను; తవ=నీయొక్క; వధంచ=చంపుటను ; ఆఖ్యాస్యతే=చెప్పఁగలఁడు . నూనం = నిశ్చయము.

ఆలక్ష్మణుఁడు, అట్లడుగుచున్నకౌసల్యాదేవికి, రాత్రికాలంబున రాక్షసులువచ్చినిన్నునమిత్రసైన్యంబునువధించిపోయిరని చెప్పఁగలఁడు.

అని, తాత్పర్యము.

సా త్వాం సుప్తం హతంశ్రుత్వా మాంచ రక్షోగృహంగతామ్
హృదయేన విదీర్ణేన న భవిష్యతి రాఘవ. ౨౭

టీక॥ రాఘవ=రాముఁడా! సా=ఆకౌసల్య;సుప్తం= నిదురించినవాఁడవును; హతం= చంపఁబడినవాఁడవునగు;త్వాం=నిన్నును;రక్షోగృహం=రాక్షసగృహమును; గతాం = పొందిన; మాంచ=నన్నును; శ్రుత్వా=విని ; విదీర్ణేన=పగిలిన; హృదయేన=గుండెతో; నభవిష్యతి=జీవింపఁజాలదు.

రాముఁడా! ఆకౌసల్యాదేవి, నీవు నిదురించియుండునప్పుడు హతుండవగుటను నేను రాక్షసగృహంబునం జిక్కియుండుటనువిని, హృదయంబుపగిలి , మృతిఁబొందును ; ఎంతమాత్రముజీవింజాలదు. అని, తాత్పర్యము.

మమహేతో రనార్యాయా హ్యనర్హః పార్థివాత్మజః
రామ స్సాగర ముత్తీర్య సత్త్వవాన్ గోష్పదే హతః. ౨౮

టీక॥ అనార్యాయాః= దుష్టురాలనగు; మమహేతోః=నానిమిత్తమయి; అనర్హః= ఇట్టిపగమునకుఁదగనివాఁడును; పార్థివాత్మజః= రాచకొమరుండును; సత్త్వవాన్= బలవంతుండునగు; రామః = రాముఁడు; సాగరం=సముద్రమును; ఉత్తీర్య=దాఁటి; గోష్పదే= గోవుయొక్కపాదమంతటిస్థలమునందు;హతః=చంపఁబడినాఁడు.

దుష్టురాలనగునానిమిత్తమయి ,

యిట్టిదుష్టవధంబునకుఁ దగనివాఁడును మహాబలశాలియు రాజపుత్రుండునగు రాముండు, ఖరాదిభయంకర రాక్షసులనందఱఁజంపి, అల్పుండును దుర్బలుండునగు, ప్రహస్తునిచేఁజచ్చినాఁడు. అని, తాత్పర్యము.

అహం దాశరథే నోఢా మోహాత్స్వకులపాంసనీ
ఆర్యపుత్రస్య రామస్య భార్యా మృత్యురజాయత. ౨౯

టీక॥ దాశరథేన= రామునిచేత; స్వకులపాంసనీ= తనకులమును జెఱుపునట్టి; అహం= నేను; మోహాత్ = అజ్ఞానమువలన; ఊఢా=వివాహముచేసికొనఁబడినాను. ఆర్యపుత్రస్య=పూజ్యుఁడగుదశరథునికొడుకైన; రామస్య = రామునికి ; భార్యా= పెండ్లాము; మృత్యుః=మరణముకలిగించునది; అజాయత=అయినది.

రాముండు; తనకులమునకునాశంబుగల్గించుదానని యెఱుంగక యజ్ఞానంబున, నన్నువివాహమాడెను; అట్లు రామునకు, భార్యయైమృత్యువయ్యెను. అని, తాత్పర్యము.

నూన మన్యాం మయా జాతిం వారితం దాన ముత్తమమ్
యాహ మద్యేహ శోచామి భార్యా సర్వాతిథే రపి. ౩౦

టీక॥ యా=ఏ; అహం= నేను ; సర్వాతిథేః=అందఱును అతిథులు గాఁగల రామునియొక్క; భార్యాపి= భార్యనయినను; అద్య=ఇప్పుడు; ఇహ= ఈవిషయమయి; శోచామి = దుఃఖించుచున్నానో; తయా (అధ్యాహృతము)= అట్టి; మయా=నాచేత; అన్యాం=ఇతరమయిన; జాతిం=జన్మమునందు; ఉత్తమం= శ్రేష్ఠమయిన; దానం= కన్యాదానము; వారితం=అడ్డగింపఁబడినది.

నేనుబూర్వజన్మంబున, నెవ్వరో కన్యాదానము సేయఁదలంచినప్పుడు, దానికి విఘ్నముగావించియుందును; కావుననే, ఇట్టిపరమధర్మాత్ముండగు రామునకుభార్యనయ్యు, నీభోగకాలంబుననిట్లు రామవిరహంబునొంది, దుఃఖించుచున్నాను.

అని, తాత్పర్యము.

సాధు పాతయ మాం క్షిప్రం రామస్యో పరి రావణ
సమానయ పతిం పత్న్యా కురు కల్యాణ ముత్తమమ్. ౩౧

టీక॥ రావణ=రావణుఁడా ; క్షిప్రం=శీఘ్రముగా; మాం=నన్ను; రామస్య=రామునియొక్క ; ఉపరి=మీఁదుగా; సాధు=చక్కఁగా; పాతయ=పడవేయుము. పతిం=పెనిమిటిని ; పత్న్యా=భార్యతో; సమానయ= చేర్పుము. ఉత్తమం=శ్రేష్ఠమయిన; కల్యాణం=మంగళమును; కురు=చేయుము.

రావణుఁడా! ఇంక శీఘ్రుంబున , నన్నును, రామునిపైఁబడవేయుము ; ఇట్లు , దంపతుల , నొకచోటిగాఁజేర్చి, యుత్తమంబగుమంగళముగావింపుము. అని, తాత్పర్యము.

శిరసా మే శిరశ్చాస్య కాయం కాయేన యోజయ
రావణా ను గమిష్యామి గతిం భర్తు ర్మహాత్మనః. ౩౨

టీక॥ రావణ=రావణుఁడా! అస్య=ఈ; శిరసా=తలతో; మే=నాయొక్క; శిరశ్చ=తలను; కాయేన=దేహముతో; కాయం=దేహమును; యోజయ=చేర్పుము. మహాత్మనః= పూజ్యమయినస్వభావముగల; భర్తుః= పెనిమిటియొక్క; గతిం=పోకను; అనుగమిష్యామి=వెంబడించెదను.

రావణుఁడా ! రాముని శిరస్సుతో నాశిరస్సునుఅతని దేహముతో నా దేహమును జేర్పుము; మహాత్ముండగుపెనిమిటితో ననుగమనంబు గావించెదను. అని, సీతాదేవి విలపించెను.

అని, తాత్పర్యము.

ఇతి సా దుఃఖ సంతప్తా విలలా పాయతేక్షణా
భర్తు శ్శిరో ధను స్తత్ర సమీక్ష్యచ పునఃపునః. ౩౩

టీక॥ ఇతి=ఇట్లు ; ఆయతేక్షణా=నిడుపులయినకండ్లుగల ; సా=ఆసీతాదేవి; తత్ర=అచ్చట; భర్తుః= పెనిమిటియొక్క; శిరః=తలను; ధనుః = విల్లును; పునఃపునశ్చ=మాటిమాటికిని; సమీక్ష్య=చూచి; దుఃఖసంతప్తా=దుఃఖముచే

మిక్కిలియుఁ దపింపఁజేయఁ బడినదై; విలలాప=విలపించెను.

ఇట్లు, విశాలంబగుకండ్లుగల యాసీతాదేవి, పెనిమిటిశిరస్సును ధనుస్సునుం జూచి, పరమదుఃఖితయయి, విలపించినది. అని, తాత్పర్యము.

ఏవం లాలప్యమానాయాం సీతాయాం తత్ర రాక్షసః
అభిచక్రామ భర్తారమనీకస్థః కృతాంజలిః. ౩౪

టీక॥ తత్ర=అచ్చట; ఏవం = ఇట్లు; సీతాయాం=సీతాదేవి ; లాలప్యమానాయాం = మిక్కిలియువిలపించు చుండఁగా;అనీకస్థః=ద్వారపాలకుండగు; రాక్షసః = రాక్షసుఁడు;కృతాంజలిః = చేయఁబడినచేమోడ్పుగలవాఁడై; భర్తారం=ప్రభువుగూర్చి;అభిచక్రామ=పోయెను.

అప్పుడు, సీతాదేవియిట్లువిలపించు చుండఁగా, ద్వారపాలకుండగురాక్షసుఁడు , చేమోడ్పుకలిగించి, రావణునొద్దకువచ్చెను. అని, తాత్పర్యము.

విజయస్వార్యపుత్రేతి సోభివాద్య ప్రసాద్య చ
న్యవేదయ దనుప్రాప్తం ప్రహస్తం వాహినీపతిమ్. ౩౫

టీక॥ సః=ఆరాక్షసుఁడు; ఆర్యపుత్ర=రావణుఁడా! విజయస్వ=జయము నొందుము" ఇతి=అని; ఉక్త్వా(అధ్యాహృతము)=చెప్పి; అభివాద్య=నమస్కరించి ; ప్రసాద్యచ = సంతోషపఱచియు; అనుప్రాప్తం=వచ్చిన ; వాహినీపతిం= సేనానాయకుఁడగు; ప్రహస్తం= ప్రహస్తుని; న్యవేదయత్ = విన్నవించెను,

అంత, నారాక్షసుండు , "జ[illegible]యు" యనినమస్కరించి, [illegible]గా, సేనానాయకుండగు ప్రహస్తుఁడు వచ్చియున్నాఁడనిచెప్పెను.

అని, తాత్పర్యము.

అమాత్యైస్సహిత స్సర్వైః ప్రహస్త స్సముపస్థితః
తేన దర్శనకామేన వయం ప్రస్థాపితాః ప్రభో. ౩౬

టీక॥ ప్రభో=నాయకుండవగు రావణుఁడా! ప్రహస్తః=ప్రహస్తుఁడు ; అమాత్యైః=మంత్రులతో; సర్వైః=అందఱితో; సహితః=కూడినవాఁడై; సముపస్థితః=వచ్చినాఁడు. దర్శనకామేన=దర్శనమునుగోరునట్టి; తేన=ఆప్రహస్తునిచేత ; వయం=మేము ; ప్రస్థాపితాః=పంపఁబడినాము.

రాక్షస రాజుండవగు రావణుఁడా ! ప్రహస్తుండుమంత్రులనందఱం గూడి, వచ్చియున్నాఁడు; అతఁడుమీదర్శనంబుఁగోరి నన్నుఁబంపినాఁడు.

అని, తాత్పర్యము.

నూన మస్తి మహారాజ రాజభావా త్క్షమాన్వితమ్
కించి దాత్యయికం కార్యం తేషాం త్వం దర్శనం కురు. ౩౭

టీక॥ మహారాజ = మహారాజా! రాజభావాత్ = రాజగుట వలన ; క్షమాన్వితం=ఓర్పుతోఁగూడిన ; కించిత్=కొంచెము ; ఆత్యయికం=కష్టమయిన; కార్యం=పని; అస్తి= కలదు. నూనం=నిశ్చయము . త్వం=నీవు; తేషాం=వారలయొక్క; దర్శనం= చూచుటను; కురు=చేయుము.

మహారాజుండవగురావణుఁడా ! గొప్పకార్యమొకటియున్నది; అదియప్పుడెచేయఁదగినదైనను, మీయాజ్ఞకొఱకుఁ గనిపెట్టియున్నారు; నీవువారలకు దర్శనంబొసంగుము. అని, యారాక్షసుండు రావణునకుంజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏత చ్ఛ్రుత్వా దశగ్రీవో రాక్షసప్రతివేదితమ్
అశోకవనికాం త్యక్త్వా మంత్రిణాం దర్శనం యయౌ. ౩౮

టీక॥దశగ్రీవః=రావణుఁడు ; ఏతత్=ఈ; రాక్షసప్రతివేదితం= రాక్షసులచేఁజెప్పఁబడినమాటను; శ్రుత్వా=విని; అశోకవనికాం= అశోకవనమును; త్యక్త్వా=విడిచి; మంత్రిణాం=మంత్రులయొక్క; దర్శనం=చూచుటను; యయౌ=పొందెను.

రావణుండు, ఆరాక్షసుఁడుచెప్పిన

మాటనువిని, యశోకవనంబును విడిచి,మంత్రులంజూడఁబోయెను.

అని, తాత్పర్యము.

సతు సర్వం సమర్థ్యైవ మంత్రిభిః కృత్య మాత్మనః
సభాం ప్రవిశ్య విదధే విదిత్వా రామవిక్రమమ్. ౩౯

టీక॥సతు=ఆరావణుండును;రామవిక్రమం=రామునిపరాక్రమమును; విదిత్వా=తెలిసికొని; సభాం= సభను; ప్రవిశ్య=చొచ్చి; మంత్రిభిః= మంత్రులతో;సమర్థ్యైవ= నిశ్చయించియె; ఆత్మనః=తనయొక్క; కృత్యం= కార్యమును; సర్వం=అంతయును ; విదధే=చేసెను.

ఆరావణుండు, రామపరాక్రమంబుఁదెలిసికొని, సభంబ్రవేశించి, మంత్రులతోఁజక్కఁగానాలోచించి, నిశ్చయించి, కార్యమునంతయుఁగావించెను. అని,తాత్పర్యము.

అంతర్ధానంతు తచ్ఛీర్షం తచ్చ కార్ముక ముత్తమమ్
జగామ రావణస్యైవ నిర్యాణసమనంతరమ్. ౪౦

రావణస్య=రావణునియొక్క; నిర్యాణసమనంతరమేవ = పోవుటకుఁబిమ్మటనె; తత్=ఆ; శీర్షం = తలయును;తత్=ఆ;ఉత్తమం=శ్రేష్ఠమయిన; కార్ముకంచ=విల్లును;అంతర్ధానంతు=మఱుఁగుపాటును; జగామ = పొందెను.

రావణుండుపోయినంతనె, ఆరామునితలయును ఆధనుస్సును , అంతర్ధానంబుఁబొందినవి.

అని, తాత్పర్యము.

రాక్షసేంద్రస్తు తైస్సార్ధం మంత్రిభి ర్భీమవిక్రమైః
సమర్థయామాస తదా రామకార్యవినిశ్చయమ్. ౪౧

టీక॥తదా=అప్పుడు; రాక్షసేంద్రస్తు = రాక్షసరాజుండగు రావణుండు

ను; భీమవిక్రమైః = భయంకరములైన పరాక్రమములుగల; తైః = ఆ; మంత్రిభిస్సార్ధం = మంత్రులతోఁగూడ; రామకార్యవినిశ్చయం = రామునింగుఱించి చేయఁదగిన కార్యముయొక్క నిశ్చయమును; సమర్థయామాస = నిశ్చయించెను.

అప్పుడు, రాక్షసేశ్వరుండగు రావణుండు, భయంకర పరాక్రములగు మంత్రులతోఁగూడ నాలోచించి, రామునింగుఱించి చేయవలసిన కార్యమును నిశ్చయించెను. అని, తాత్పర్యము.

అభ్యాసస్థితాన్ సర్వాన్ బలాధ్యక్షాన్ హితైషిణః
అబ్రవీత్కాలసదృశో రావణో రాక్షసాధిపః. ౪౨

టీక॥ కాలసదృశః = మృత్యువుతోసమానుఁడగు; రాక్షసాధిపః = రాక్షసులకుఁ బ్రభుఁడయిన; రావణః = రావణుఁడు; అభ్యాసస్థితాన్ = సమీపమునను్న; హితైషిణః = మేలుఁగోరునట్టి; బలాధ్యక్షాన్ = సేనాధ్యక్షులను; సర్వాన్ = అందఱినిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

మృత్యుసమానుండును రాక్షసేశ్వరుండునగు రావణుఁడు, తనసమీపంబుననున్న తన మేలుగోరునట్టి సేనాధ్యక్షులంటూచి, యిట్లని, చెప్పెను.
అని, తాత్పర్యము.

శీఘ్రం భేరీనినాదేన స్ఫుటకోణాహతేన మే
సమానయధ్వం సైన్యాని వక్తవ్యంచ న కారణమ్. ౪౩

టీక॥ స్ఫుటకోణాహతేన = స్ఫుటముగా దండముచేఁగొట్టఁబడిన; భేరీనినాదేన = భేరీధ్వనిచేత; శీఘ్రం = శీఘ్రముగా; మే = నాయొక్క; సైన్యాని = సైన్యములను; సమానయధ్వం = రావింపుఁడు; కారణంచ = కారణమును; నవక్తవ్యం = చెప్పఁబడఁగూడదు.

దృఢమయినదండముచే భేరివాయించి నాసైన్యముల నన్నింటిని రావింపుఁడు; కారణమేదియుఁజెప్పవలదు. అని రావణుండు, సేనాధ్యక్షులతోఁజెప్పెను.
అని, తాత్పర్యము.

తత స్తథేతి ప్రతిగృహ్య తద్వచో
బలాధిపా స్తే మహ దాత్మనో బలమ్
సమానయంశ్చైవ సమాగమంచ తే
న్యవేదయన్ భర్తరి యుద్ధ కాంక్షిణి. ౪౪

టీక॥ తతః=అంత; తే=ఆ; బలాధిపాః=సేనానాయకులు; తథేతి=అట్లే యని; తత్=ఆ; వచః=మాటను; ప్రతిగృహ్య=అంగీకరించి; ఆత్మనః= తమయొక్క; మహత్=గొప్పదగు; బలం = సైన్యమును; సమానయంశ్చైవ= రావించియు. తే=ఆసేనానాయకులు; యుద్ధకాంక్షిణి=యుద్ధమునుగోరునట్టి; భర్తరి=రాజునందు; సమాగమం=వచ్చుటను; న్యవేదయంశ్చ=చెప్పిరియు.

అంత, నాసేనానాయకులు, అట్లే యని రావణునిమాటకియ్యకొని, తమవశంబుననుండిన మహాసైన్యంబులరావించిరి; అట్లుసైన్యంబులన్నియు సన్నద్ధములయివచ్చియుండుటను, యుద్ధకాముండగురావణునకుంజెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, యుద్ధకాండే, ద్వాత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండద్వాత్రింశసర్గటీక, ముగిసినది.

౫౨

త్రయస్త్రింశసర్గప్రారంభః.

సీతాంతు మోహితాం దృష్ట్వా సరమానామ రాక్షసీ
ఆససాదాథ వైదేహీం ప్రియాం ప్రణయినీం సఖీమ్. ౧

టీక॥అథ=అంత; సరమానామ=సరమయనెడు; రాక్షసీ=రాక్షసస్త్రీ; మోహితాం=మోహమునొందిన; సీతాం=సీతను;దృష్ట్వాతు= చూచినంతనె;ప్రియాం=ప్రియురాలును;ప్రణయినీం=స్నేహముగలదియు;సఖీం=చెలికత్తెయునగు;వైదేహీం=సీతాదేవిని;ఆససాద=చేరెను.

అంత,విభీషణభార్యయగుసరమయను రాక్షసి, సీతాదేవి మోహితయగుటంజూచి,తనప్రియురాలును స్నేహితయును జెలికత్తెయునగు సీతాదేవియొద్దకుంబోయెను. అని, తాత్పర్యము.

మోహితాం రాక్షసేంద్రేణ సీతాం పరమదుఃఖితామ్
ఆశ్వాసయామాస తదా సరమా మృదుభాషిణీ. ౨

టీక॥తదా=అప్పుడు; మృదుభాషిణీ=మెత్తగామాటలాడునట్టి; సరమా=సరమ;రాక్షసేంద్రేణ=రాక్షసేశ్వరుండగు రావణునిచేత ; మోహితాం=మోహమునొందునట్లుచేయఁబడినదియు;పరమదుఃఖితాం= మిక్కిలియుదుఃఖము నొందినదియునగు ; సీతాం=సీతాదేవిని ; ఆశ్వాసయామాస=ఊఱడించెను.

సరమ,రాక్షసేశ్వరుండగు రావణునిచే మోసపుచ్చఁబడి పరమదుఃఖితయయియున్నసీతాదేవిని, మెత్తనిమాటలనిట్లనియూఱడించెను.

అని, తాత్పర్యము.

సాహి తత్ర కృతా మిత్రం సీతయా రక్ష్యమాణయా
రక్షంతీ రావణాదిష్టా సానుక్రోశా దృఢవ్రతా. ౩

టీక॥తత్ర=అచ్చట;సానుక్రోశా=దయతోఁగూడినదియు ; దృఢవ్రతా=దృఢమైనవ్రతముగలదియునగు;సా=ఆసరమ;రావణాదిష్టా=రావణునిచేనాజ్ఞాపింపఁబడినదై; రక్షంతీ=రక్షించుచు; రక్ష్యమాణయా=రక్షింపఁబడుచున్న; సీతయా= సీతాదేవిచేత ; మిత్రం=స్నేహితురాలుగా;కృతాహి = చేయఁబడినదిగదా!

ఆసరమ,దయగలదియు దృఢవ్రతయుఁగావున,రావణాజ్ఞచే, సీతాదేవి నిరక్షించుచు, నాసీతాదేవి గుణంబులవలన, నాబిడయందుమిక్కిలియుస్నేహముగలదయ్యెను. అని,తాత్పర్యము.

సా దదర్శ తత స్సీతాం సరమా నష్టచేతనామ్
ఉపావృత్యోత్థితాం ధ్వస్తాం బడబామివ పాంసులామ్.౪

టీక॥ తతః=అంత;సా=ఆ ; సరమా=సరమ;నష్టచేతనాం= పోయినబుద్ధిగలదియు;ఉపావృత్య=పొరలి; ఉత్థితాం=లేచిన;ధ్వస్తాం=చెడిన; పాంసులాం=దుమ్ముతోఁగూడిన ; బడబామివ (స్థితాం)= ఆఁడుగుఱ్ఱమువలెనున్నదియునగు;సీతాం=సీతాదేవిని; దదర్శ=చూచెను.

అంత,నాసరమ, శ్రమనివారణార్థమయినేలంబొరలిదుమ్ముచేఁ గప్పఁబడియున్న యాఁడుగుఱ్ఱమువలె నున్నదియు,నష్టసంజ్ఞయునగుసీతంజూచెను. అని,తాత్పర్యము.

తాం సమాశ్వాసయామాస సఖీస్నేహేన సువ్రతా

టీక॥ సువ్రతా= మంచివ్రతముగలసరమ ; తాం=ఆసీతాదేవిని; సఖీస్నేహేన = చెలికత్తెయందలిస్నేహముచేత;సమాశ్వాసయామాస= ఊఱడించెను.

మంచివ్రతములుగల యాసరమ , సఖీస్నేహంబున , నాసీతాదేవినూఱడించెను. అని,తాత్పర్యము.

సమాశ్వసిహి వైదేహి మాభూత్తే మనసోవ్యథా. ౫

టీక॥ వైదేహి=సీతాదేవీ! సమాశ్వసిహి=ఊఱడిల్లుము. తే=నీయొక్క; మనసః=మనస్సునకు; వ్యథా = దుఃఖము; మాభూత్=కలుగరాదు.

సీతాదేవీ! ఊఱటనొందుము; మనంబునకు దుఃఖంబు దెచ్చుకొనవలదు.

అని, తాత్పర్యము.

ఉక్తా యద్రావణేన త్వం ప్రత్యుక్తశ్చ స్వయం త్వయా
సఖీస్నేహేన తద్భీరు మయా సర్వం ప్రతిశ్రుతమ్. ౬
లీనయా గహనే శూన్యే భయ ముత్సృజ్య రావణాత్
తవ హేతో ర్విశాలాక్షి నహి మే జీవితం ప్రియమ్. ౭

టీక॥ విశాలాక్షి= వెడల్పులయిన కండ్లుగల; భీరు= భయముగలసీతాదేవీ! త్వం=నీవు; యత్=దేనిని ; రావణేన=రావణుని చేత; ఉక్తా=చెప్పఁబడినావో; స్వయంచ=తానును; త్వయా=నీచేత; ప్రత్యుక్తశ్చ= బదులు చెప్పఁబడినాఁడో; తత్=అది; సర్వం = అంతయు; సఖీస్నేహేన= చెలికత్తెయందలి స్నేహంబు చేత; రావణాత్= రావణుని వలన; భయం=భయమును; ఉత్సృజ్య=విడిచి; శూన్యే=నిర్జనమయిన; గహనే=రహస్యప్రదేశమునందు; లీనయా=డాఁగిన; మయా=నా చేత; ప్రతిశ్రుతం=వినఁబడినది . తవహేతోః=నీనిమిత్తమయి; మే=నాకు ; జీవితం=ప్రాణము ; ప్రియం=ఇష్టము; నహి=కాదుగదా!

విశాలంబులగు కండ్లుగలదానవు భయపడు స్వభావము గలదానవునగు సీతాదేవీ! నీతో రావణుం డేమి చెప్పినాఁడో, అందుకు బదులు రావణునితో నీ వేమి చెప్పితివో, అదంతయు , నీమై స్నేహంబున, రావణు భయంబునుంగూడ విడిచి, నేనొకరహస్యప్రదేశంబున డాఁగియుండి, వింటిని ; నీనిమిత్తము నేను బ్రాణంబులనైనను సరకుసేయను.

అని, తాత్పర్యము.

స సంభ్రాంతశ్చ నిష్క్రాంతో యత్కృతే రాక్షసాధిపః
తచ్చ మే విదితం సర్వ మభినిష్క్రమ్య మైథిలి. ౮

టీక॥ మైథిలి=సీతాదేవీ! యత్కృతే= దేనినిమిత్తమయి; సః= ఆ; రాక్షసాధిపః=రాక్షసరాజుండగు రావణుఁడును; సంభ్రాంతః= వేగిరపాటునొందినవాఁడై; నిష్క్రాంతః=పోయినాఁడో; తచ్చ= అదియును; మే(మయా)=నాచేత; అభినిష్క్రమ్య=వెడలిపోయి; విదితం= తెలియఁబడినది.

సీతాదేవీ! మఱియు, దేనినిమిత్తమయి, రాక్షసరాజుండగు నా రావణుండు, వేగిరపాటునం బోయెనో, ఆకారణమును గూడ నేను దెలిసికొనివచ్చినాను. అని, తాత్పర్యము.

న శక్యం సౌప్తికం కర్మ రామస్య విదితాత్మనః
వధశ్చ పురుషవ్యాఘ్రే తస్మిన్నైవోపపద్యతే. ౯

టీక॥ విదితాత్మనః= తెలియఁబడిన యాత్మగల; రామస్య = రామునియొక్క; సౌప్తికం=నిద్రయందుఁజేయఁబడిన; కర్మ=కార్యము, వధమనుట; న శక్యం=అలవిగాదు. పురుషవ్యాఘ్రే= పురుషశ్రేష్ఠుండగు; తస్మిన్=ఆరామునియందు; వధశ్చ=చంపుటయును; నైవోపపద్యతే=సంగతమేకాదు.

రాముండు సమస్తంబుదెలిసినవాఁడు; అతని నిద్రాసమయంబున మోసముచేఁ జంపనలవికాదు; మఱియుఁ బురుషశ్రేష్ఠుండగు నతని వధించుటయె యసంభావితము. అని, తాత్పర్యము.

న త్వేవ వానరా హంతుం శక్యాః పాదపయోధినః
సురా దేవర్షభేణేవ రామేణ హి సురక్షితాః. ౧౦

టీక॥ పాదపయోధినః= వృక్షములచేఁబోరువారలును; దేవర్షభేణ = దేవేంద్రునిచేత; సురాఇవ= దేవతలువలె; రామేణ=రామునిచేత; సురక్షితాః= చక్కఁగా రక్షింపఁబడినవారలునగు; వానరాః= వానరులు; హంతుం=చంపుటకు; న శక్యాఏవతు= అలవిమేకారు.

దేవేంద్రునిచేత దేవతలుంబోలె రామునిచేఁ జక్కఁగా రక్షింపఁబడు

చున్నవారలు ననువృత్తంబులం బోరునట్టి మహాబలశాలులునగు వానరులం జంప నెంతమాత్రము శక్యము కాదు.

అని, తాత్పర్యము.

దీర్ఘవృత్తభుజ శ్శ్రీమాన్ మహోరస్కః ప్రతాపవాన్
ధన్వీ సంహననోపేతో ధర్మాత్మా భువి విశ్రుతః. ౧౧
విక్రాంతో రక్షితా నిత్య మాత్మనశ్చ పరస్యచ
లక్ష్మణేన సహ భ్రాత్రా కుశలీ నయశాస్త్రవిత్. ౧౨
హంతా పరబలౌఘానా మచింత్యబలపౌరుషః
న హతో రాఘవ శ్శ్రీమాన్ సీతే శత్రునిబర్హణః. ౧౩

టీక॥ సీతే=సీతాదేవీ! దీర్ఘవృత్తభుజః= నిడుపులునుగుండ్రములునగు జేతులుగలవాఁడును; శ్రీమాన్= అధికమయినకాంతిగలవాఁడును ; మహోరస్కః=పెద్దఱొమ్ముగలవాఁడును; ప్రతాపవాన్ = అధికమయినపరాక్రమముగలవాఁడును, ధన్వీ= గొప్పవిల్లుగలవాఁడును; సంహననోపేతః= సుందరములయిన యవయవములతోఁగూడినవాఁడును; ధర్మాత్మా= ధర్మస్వభావుండును; భువి=భూమియందు; విశ్రుతః= ప్రసిద్ధుండును; విక్రాంతః= పరాక్రమించియున్నవాఁడును; నిత్యం = ఎల్లప్పుడును; భ్రాత్రా= తమ్ముఁడయిన; లక్ష్మణేన=లక్ష్మణునితో; ఆత్మనశ్చ= తనయొక్కయు ; పరస్యచ=ఇతరునియొక్కయు; రక్షితా=రక్షించువాఁడును; కుశలీ = క్షేమముగలవాఁడును; నయశాస్త్రవిత్= నీతిశాస్త్రము దెలిసినవాఁడును; పరబలౌఘానాం = శత్రుసైన్యములసమూహములయొక్క; హంతా=చంపువాఁడును; అచింత్యబలపౌరుషః= ఎన్నరానిబలమును బౌరుషమునుగలవాఁడును; శత్రునిబర్హణః= శత్రువులంజంపువాఁడును ; శ్రీమాన్= జయలక్ష్మిగలవాఁడునగు ; రాఘవః= రాముఁడు; నహతః=చంపఁబడలేదు.

సీతాదేవీ ! దీర్ఘంబులునుగుండ్రములునగుభుజములుగలవాఁడును శ్రీమంతుండును విశాలవక్షుండును మహాపరాక్రమశాలియు ధనుర్ధరుండును శోభనావయవసన్నివేశుండును ధర్మాత్ముండును గీర్తిమంతుండును బరాక్రమవంతుండును దమ్ముండగు లక్ష్మణునిం

గూడి సర్వకాల సర్వావస్థలయం.. నుదన్నురక్షిందుకొనియితరులనుంగూడ రక్షించువాఁడును క్షేమవంతుండును నీతిశాస్త్రంబుఁ జక్కఁగాఁదెలిసినవాఁడును శత్రుసైన్యంబు లెంతయయినను నరకుసేయక వధించువాఁడును అమేయంబులగుబలపౌరుషంబులు గలవాఁడును,శత్రుసంహర్తయు జయలక్ష్మీవిరాజమానుండునగు,రాముఁడు, హతుఁడుకాలేదు ; అతనినెవ్వరునువధింపఁజాలరు.

అని, తాత్పర్యము.

అయుక్తబుద్ధికృత్యేన సర్వభూతవిరోధినా
ఇయం ప్రయుక్తా రౌద్రేణ మాయా మాయావిదా త్వయి. ౧౪

టీక॥ అయుక్తబుద్ధికృత్యేన=అయోగ్యమగు బుద్ధివ్యాపారము గల వాఁడును; సర్వభూతవిరోధినా = సమస్తభూతములకు శత్రువును ; మాయావిదా=మాయఁదెలిసినవాఁడును;రౌద్రేణ= భయంకరుండునగు రావణునిచేత; ఇయం=ఈ; మాయా= మాయ; త్వయి = నీయందు; ప్రయుక్తా=ప్రయోగింపఁబడినది.

దుష్టబుద్ధియు సమస్తభూత విరోధియు మాయలం బండితుండును రౌద్రుండునగు రావణుండు , నిన్నుభయపఱచుటకై యీమాయం గావించినాఁడు. అని, తాత్పర్యము.

శోక స్తే విగత స్సర్వః కల్యాణం త్వా ముపస్థితమ్
ధ్రువం త్వాం భజతే లక్ష్మీః ప్రియం ప్రీతికరం శృణు. ౧౫

టీక॥ తే=నీయొక్క; శోకః= దుఃఖము; సర్వః=అంతయు; విగతః=పోయినది. త్వాం=నిన్ను; కల్యాణం = మంగళము; ఉపస్థితం= పొందినది. లక్ష్మీః=లక్ష్మి; త్వాం=నిన్ను; భజతే = పొందును. ధ్రువం= నిశ్చయము. ప్రీతికరం=సంతోషకరమయిన; ప్రియం=ప్రియవాక్యమును; శృణు= వినుము.

నీదుఃఖంబంతయుఁ బోయినది ; మంగళమునిన్నుఁ బొందఁబోవు చున్నది; నీవింకలక్ష్మిం బొందఁగలవు; ఇది నిశ్చయము; సంతోష కరంబగు నాప్రియవార్త నాలకింపుము.

అని, తాత్పర్యము.

స 33

ఉత్తీర్య సాగరం రామ స్సహ వానరసేనయా
సన్నివిష్ట స్సముద్రస్య తీర మాసాద్య దక్షిణమ్. ౧౬

టీక॥ రామః=రాముఁడు ; వానరసేనయాసహ = వానరసైన్యముతోఁ గూడ; సాగరం=సముద్రమును; ఉత్తీర్య=దాఁటి; సముద్రస్య= సముద్రము యొక్క; దక్షిణం= దక్షిణదిక్కునను న్న; తీరం=గట్టును; ఆసాద్య=పొంది; సన్నివిష్టః=ఉన్నాఁడు.

రాముండు, వానర సేనతోఁగూడ సముద్రంబు దాఁటివచ్చి, సముద్ర దక్షిణతీరంబుననున్నాఁడు.

అని, తాత్పర్యము.

దృష్టో మే పరిపూర్ణార్థః కాకుత్స్థ స్సహలక్ష్మణః
సహితై స్సాగరాంతస్థై ర్బలై స్తిష్ఠతి రక్షితః. ౧౭

టీక॥ పరిపూర్ణార్థః= నిండిన ప్రయోజనముగలవాఁడును;సహలక్ష్మణః= లక్ష్మణునితోఁ గూడిన వాఁడును గు; కాకుత్స్థః= రాముఁడు; మే(మయా)=నాచేత; దృష్టః = చూడఁబడినాఁడు. సః=ఆ; సాగరాంతస్థైః= సముద్రతీరంబుననున్న; బలైః=సైన్యములచేత;రక్షితః=రక్షింపఁబడినవాఁడై; తిష్ఠతిహి=ఉన్నాఁడుగదా!

పూర్ణకాముండగు రాముని లక్ష్మణునితోఁగూడ, నేనుజూచినాను ; అతండుసముద్రతీరంబునవానరసైన్యంబులచేసురక్షితుండైయున్నాఁడు.

అని, తాత్పర్యము.

అనేన ప్రేషితా యేచ రాక్షసా లఘువిక్రమాః
రాఘవ స్తీర్ణ ఇత్యేవ ప్రవృత్తి స్తై రిహాహృతా. ౧౮

టీక॥అనేన=ఈరావణునిచేత; లఘువిక్రమాః=శీఘ్రమయిన నడకగల ; యేచ=ఏ; రాక్షసాః= రాక్షసులును; ప్రేషితాః=పంపఁబడినారో ; తైః=వారలచేత; రాఘవః=రాముఁడు; తీర్ణఇత్యేవ= దాఁటినాఁడనియే; ప్రవృత్తిః=సమాచారము; ఇహ= ఇచ్చటికి;ఆహృతా= తేఁబడినది.

ఈరావణుండు, పంపినశీఘ్రగాములగునా రాక్షసులును, రాముఁడుసముద్రంబుదాఁటివచ్చినాఁడని యేయుచ్చటకీసమాచారముఁదెచ్చినారు.

అని, తాత్పర్యము.

స తాం శ్రుత్వా విశాలాక్షి ప్రవృత్తిం రాక్షసాధిపః
ఏష మంత్రయతే సర్వై స్సచివై స్సహ రావణః. ౧౯

టీక॥విశాలాక్షి=వెడల్పులయిన కన్నులుగలసీతాదేవీ! రాక్షసాధిపః=రాక్షసులకుఁబ్రభువైన; సః=ఆ; ఏషః=ఈ; రావణః=రావణుఁడు; తాం=ఆ; ప్రవృత్తిం=సమాచారమును; శ్రుత్వా=విని; సచివైః=మంత్రులతో; సర్వైః=అందఱితోను; మంత్రయతే=ఆలోచించుచున్నాఁడు.

విశాలంబులగుకన్నులుగలసీతాదేవి! రాక్షసేశ్వరుఁడగునీ రావణుండు, ఆసమాచారంబువినివె, యిప్పుడు, మంత్రులయందఱితోను, నాలోచించుచున్నాఁడు. అని, సరమ, సీతతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి బ్రువాణా సరమా రాక్షసీ సీతయా సహ
సర్వోద్యోగేన సైన్యానాం శబ్దం శుశ్రావ భైరవమ్. ౨౦

టీక॥ఇతి=ఇట్లు; బ్రువాణా=చెప్పుచున్న; సరమా=సరమయను; రాక్షసీ=రాక్షసస్త్రీ; సీతయాసహ=సీతతోఁగూడ; సైన్యానాం=సైనికులయొక్క; సర్వోద్యోగేన=సమస్తప్రయత్నముచేత; జనితం(అధ్యాహృతము)=కలిగిన; భైరవం=భయంకరమయిన; శబ్దం=ధ్వనిని; శుశ్రావ=వినెను.

సరమయాప్రకారంబునంజెప్పుచుండునప్పుడె, సీతతోఁగూడ, సైనికులు సేయుప్రయత్నంబులంగలిగిన భయంకరధ్వనిని, వినెను. అని, తాత్పర్యము.

దండనిఘాతవాదిన్యా శ్శ్రుత్వా భేర్యా మహాస్వనమ్
ఉవాచ సరమా సీతా మిదం మధురభాషిణీ- ౨౧

టీక॥ మధురభాషిణీ = మనోహరముగా మాటలాడునట్టి; సరమా = సరమ; దండఘాతవాదిన్యాః = దండమునఁగొట్టుటచేధ్వనించుచున్న; భేర్యాః = భేరియొక్క; మహాస్వనం = మహాధ్వనిని; శ్రుత్వా = విని ; సీతాం = సీతనుగూర్చి; ఇదం = ఈమాటను; ఉవాచ = చెప్పెను.

అంత, సరమ , దండ ఘాతంబున మోగుచున్న భేరీమహాధ్వనిని విని , సీతాదేవింజూచి, మధురవచనంబుల, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సన్నాహజననీ హ్యేషా భైరవా భీరు భేరికా
భేరీనాదంచ గంభీరం శృణు తోయదనిస్వనమ్. ౨౨

టీక॥ భీరు = భయపడుస్వభావము గలసీతాదేవి! ఏషా = ఈ; భైరవా = భయంకరమయిన; భేరికా = భేరి; సన్నాహజననీహి = సన్నాహంబుగల్గించునదిగదా! గంభీరం = గంభీరమును ; తోయదనిస్వనం = మేఘముయొక్క ధ్వనివంటిధ్వనిగలదియునగు ; భేరీనాదంచ = భేరీధ్వనిని; శృణు = వినుము.

భయపడుస్వభావముగల సీతాదేవీ! భయంకరముగా భేరిని వాయించుట సైనికులసన్నద్ధులఁగావించుటకుఁగదా! అట్లుగంభీరంబుగా మేఘగర్జనంబువలెధ్వనిగల్గునట్లు భేరివాయింపఁబడుచున్నది ; వినుము.

అని, తాత్పర్యము.

కల్ప్యంతే మత్తమాతంగా యుజ్యంతే రథవాజినః
హృష్యంతే తురగారూఢాః ప్రాసహస్తాస్సహస్రశః. ౨౩

టీక॥ మత్తమాతంగాః = మదించిన యేనుంగులు; కల్ప్యంతే = ఏర్పఱుపబడుచున్నవి. రథవాజినః = రథములును గుఱ్ఱములును; యుజ్యంతే = కూర్పఁబడుచున్నవి. సహస్రశః = వేనవేలుగా; ప్రాసహస్తాః = ఈటెలు చేతులంగల; తురగారూఢాః = గుఱ్ఱములనెక్కినవారలు ; హృష్యంతే = సంతోషించుచున్నారు.

మదపుటేనుంగుల నలంకరించుచు

న్నారు ; రథంబులకుగుఱ్ఱంబులంగూ ర్చుచున్నారు; గుఱ్ఱపువారలుప్రాసహస్తులయి వేసవేలుగా , సంతోషంబునవిజృంభించుచున్నారు. అని, తాత్పర్యము.

తత్రతత్ర చ సన్నద్ధా స్సంపతంతి పదాతయః

టీక॥ తత్రతత్ర=అచ్చటచ్చట; పదాతయశ్చ=కాలిబంటులును ; సన్నద్ధాః= కవచమునుధరించినవారలయి; సంపతంతి=గుంపుచేరుచున్నారు.

అచ్చటచ్చటఁ, బదాతిసైన్యంబులునుసన్నద్ధంబులయిగుంపులు చేరుచున్నవి , చూడుము.

అని, తాత్పర్యము.

ఆపూర్యంతే రాజమార్గా స్సైన్యై రద్భుతదర్శనైః ౪౨
వేగవద్భి ర్నదద్భిశ్చ తోయౌఘైరివ సాగరః

టీక॥ రాజమార్గాః= రాజమార్గములు; వేగవద్భిః = వేగముగలవియు;నదద్భిశ్చ= ధ్వనించుచున్నవియు; అద్భుతదర్శనైః = ఆశ్చర్యకరమగుచూచుటగలవియునగు;సైన్యైః=సైన్యములచేత;తోయౌఘైః=జలసమూహములచేత;సాగరఇవ = సముద్రమువలె ; ఆపూర్యంతే = నిండింపఁబడుచున్నవి.

వేగవంతంబులునుసింహనాదంబులుసేయుచున్నవియుఁ జూపరుల కాశ్చర్యంబుగలిగించునవియునగు సైన్యంబులచే, జలసమూహంబులసముద్రంబువలె, రాజమార్గంబులునిండియున్నవి.

అని, తాత్పర్యము.

శస్త్రాణాంచ ప్రసన్నానాం చర్మణాం వర్మణాం తథా. ౪౫
రథవాజిగజానాంచ భూషితానాంచ రక్షసామ్
ప్రభాం విస్సృజతాం పశ్య నానావర్ణాం సముత్థితామ్. ౪౬
వనం నిర్దహతో ఘర్మే యథా రూపం విభావసోః

టీక॥ ప్రభాం = కాంతిని; విస్సృజతాం=విడుచుచున్న; ప్రసన్నానాం= నిర్మలములయిన; శస్త్రాణాంచ=ఆయుధములయొక్కయు; చర్మణాం=

డాలువాలులయొక్క; తథా=అట్లు; వర్మణాం=కవచములయొక్కయు; రథవాజిగజానాంచ= రథములయొక్కయు గుఱ్ఱములయొక్కయు నేనుంగుల యొక్కయు; భూషితానాం=అలంకరింపఁబడిన; రక్షసాంచ = రాక్షసుల యొక్కయు; సముత్థితం=లేచిన; నానావర్ణం=నానావిధములయినరంగులుగలకాంతిని; ఘర్మే=ఎండకాలము నందు; వనం=అడవిని; నిర్దహతః = దహించుచున్న ; విభావసోః= అగ్నిహోత్రముయొక్క; రూపంయథా=రూపమునువలె; పశ్య=చూడుము.

నిర్మలంబులగునాయుధంబులు డాలువాలులుఁ గవచంబులు రథంబులు గుఱ్ఱంబులు నేనుంగులు రాక్షసులభూషణంబులు, ఇవి, యెంతయుఁగాంతితో వెలుంగుచున్నవి ; వీనికాంతినానావర్ణమయి, యెండకాలంబుననడవినిదహించుకార్చిచ్చుకాంతియుంబోలె నున్నది. అని, తాత్పర్యము.

ఘంటానాం శృణు నిర్ఘోషం రథానాం శృణు నిస్స్వనమ్. ౨౭
హయానాం హేషమాణానాం శృణు తూర్యధ్వనిం యథా

టీక॥ఘంటానాం = ఘంటలయొక్క; నిర్ఘోషం=ధ్వనిని; శృణు= వినుము. రథానాం=రథములయొక్క; నిస్స్వనం=ధ్వనిని; శృణు=వినుము. హేషమాణానాం=అఱచుచున్న; హయానాం= గుఱ్ఱములయొక్క; తూర్యధ్వనిం యథా(స్థితం)=వాద్యధ్వనివలె నున్నట్టి; హేషం(హేషాం)=ధ్వనిని; శృణు= వినుము.

ఏనుంగులకుఁగట్టిన ఘంటలు మ్రోఁగుచున్నవి; రథంబులుపోవుటచేఁ గలుగుశబ్దమునువినుము; వాద్యధ్వనివలెనున్నగుఱ్ఱములయఱపునువినుము.

అని, తాత్పర్యము.

ఉద్యతాయుధహస్తానాం రాక్షసేంద్రానుయాయినామ్. ౨౮
సంభ్రమో రక్షసా మేష తుములో రోమహర్షణః

టీక॥ఉద్యతాయుధహస్తానాం = ఎత్తిపట్టఁబడినయాయుధములు హస్తములందుఁగలవారలును; రాక్షసేంద్రానుయాయినాం= రాక్షసరాజుండగు

రావణుని వెంబడించునట్టివారలునగు; రక్షసాం= రాక్షసులయొక్క; ఏషః= ఈ; తుములః= దట్టమును; రోమహర్షణః= వెండ్రుకలగగుర్పాటు నొందించునదియునగు; సంభ్రమః= సన్నాహము; దృశ్యతే ( అధ్యాహృతము)= చూడఁబడుచున్నది.

రాక్షసరాజుండగు రావణుని భటులీ రాక్షసులు, ఆయుధంబులఁబైకెత్తిపట్టుకొని, తుములంబుగనుజూపరులకుఁ గగుర్పాటుగల్గునట్లును, సన్నాహంబుగావించుచున్నారుచూడుము.

అని, తాత్పర్యము.

శ్రీస్త్వాం భజతి శోకఘ్నీ రక్షసాం భయమాగతమ్. ౨౯

టీక॥ శోకఘ్నీ= దుఃఖమునుబోఁగొట్టునట్టి; శ్రీః= లక్ష్మీ; త్వాం= నిన్ను; భజతి= పొందఁగలదు. రక్షసాం= రాక్షసులకు; భయం= భయము; ఆగతం= వచ్చినది.

ఇంక, నీదుఃఖంబుపోయినీకుజయలక్ష్మీ గలుగును; రాక్షసులకుభయంబు వచ్చినది. అని, తాత్పర్యము.

రామః కమలపత్రాక్షో దైత్యానామివ వాసవః
వినిర్జిత్య జితక్రోధ స్త్వా మచింత్యపరాక్రమః. ౩౦
రావణం సమరే హత్వా భర్తా త్వాధిగమిష్యతి

టీక॥ కమలపత్రాక్షః = తామరపూరేకులవంటికన్నులుగలవాఁడును; జితక్రోధః= జయింపఁబడినకోపముగలవాఁడును; అచింత్యపరాక్రమః= ఎన్నరాని పరాక్రమముగలవాఁడును; భర్తా= పెనిమిటియునగు; రామః= రాముఁడు; సమరే= యుద్ధమునందు; దైత్యానాం(దైత్యాన్)= దైత్యులను; వాసవఇవ= దేవేంద్రుఁడువలె; రావణం= రావణుని; హత్వా= చంపి; వినిర్జిత్య= జయించి; త్వాం= నిన్ను; అధిగమిష్యతితు= తప్పకపొందును.

తామరపూరేకులంబోలె విశాల సుందరంబులగు కన్నులుగలవాఁడును జితక్రోధుండునుఅచింత్య పరాక్రముండునగురాముండు దైత్యులదేవేంద్రుం

దుంబోలె, యుద్ధంబున రావణుంజంపి, నిన్నుఁబొందఁగలఁడు; సందేహములే దు. అని, తాత్పర్యము.

విక్రమిష్యతి రక్షస్సు భర్తా తే సహలక్ష్మణః. 30
యథా శత్రుషు శత్రుఘ్నో విష్ణునా సహ వాసవః

టీక॥ సహలక్ష్మణః = లక్ష్మణునితోఁగూడిన; తే=నీయొక్క; భర్తా= పెనిమిటియగు రాముఁడు; రక్షస్సు=రాక్షసులయందు; శత్రుషు=శత్రువులయందు; విష్ణునాసహ = విష్ణువుతోఁగూడ; వాసవో యథా= దేవేంద్రుఁడువలె; విక్రమిష్యతి=పరాక్రమింపఁగలఁడు.

దేవేంద్రుండు విష్ణువుంగూడి, శత్రువులయందుఁబరాక్రమించునట్లు, నీపెనిమిటిరాముండు లక్ష్మణుంగూడి రాక్షసులయందుఁబరాక్రమింపఁగలఁడు.

అని, తాత్పర్యము.

ఆగతస్య హి రామస్య క్షిప్ర మంకగతాం సతీమ్. 32
అహం ద్రక్ష్యామి సిద్ధార్థాం త్వాం శత్రౌ వినిపాతితే

టీక॥ శత్రౌ=శత్రువు ; వినిపాతితే=చంపఁబడినవాఁడగుచుండఁగా; ఆగతస్య=వచ్చిన ; రామస్య=రాముని యొక్క; అంకగతాం= తొడనుబొందినదానవును; సతీం=పతివ్రతవును ; సిద్ధార్థాం= ఈడేఱినప్రయోజనము గలదానవునగు; త్వాం=నిన్ను; అహం= నేను; క్షిప్రం=శీఘ్రముగా ; ద్రక్ష్యామి హి=చూడఁగలనుగదా.

శత్రువువధింపఁబడినవెనుక, నీవుసిద్ధార్థురాలవై రామునియంకంబునొందియున్ననిన్ను , నేనింక శీఘ్రంబునం జూడఁగలను.

అని, తాత్పర్యము.

అస్రూణ్యా నందజాని త్వం వర్తయిష్యసి శోభనే. 33
సమాగమ్య పరిష్వజ్య తస్యో రసి మహోరసః

టీక॥శోభనే= మంగళరూపిణివగుసీతాదేవీ!త్వం=నీవు ; సమాగమ్య =

చేరి; పరిష్వజ్య=కవుఁగిలించుకొని; స్థితస్య(అధ్యాహృతము)=ఉన్న; మహోరసః=విశాలమగుఱొమ్ముగల; తస్య=ఆరామునియొక్క; ఉరసి=ఱొమ్మునందు; ఆనందజాని=సంతోషమువలనంగలిగిన; అశ్రూణి=కన్నీళ్లను; వర్తయిష్యతి=విడువఁగలవు.

మంగళరూపిణివగుసీతాదేవీ! నీవింకశీఘ్రంబుననె, నీతోఁజేరినిన్నుఁ గవుఁగిలించుకొనియుండు విశాలవక్షుండగు రామునివక్షస్థ్సలంబున నానంద బాష్పంబులవిడువఁగలవు.

అని, తాత్పర్యము.

అచిరా న్మోక్ష్యతే సీతే దేవి తే జఘనం గతామ్. ౩౪
ధృతా నేతాన్ బహూన్ మాసాన్ వేణీం రామో మహాబలః

టీక॥ దేవి=రాణివగు; సీతే=సీతా! మహాబలః=అధికమయిన బలముగల; రామః=రాముఁడు; ఏతాన్=ఈ; బహూన్=పెక్కులయిన; మాసాన్=మాసములను; ధృతాన్=ధరింపఁబడినదియు; తే=నీయొక్క; జఘనం=పిఱుఁదును; గతాం=పొందినదియునగు; వేణీం=జడను; అచిరాత్=శీఘ్రముగా; మోక్ష్యతే(మోక్షయిష్యతి)=విడిపింపఁగలఁడు.

సీతాదేవీ! మహాబలుండగు రాముండు, పెక్కుమాసంబులనుండి నీవుధరించియున్న నీవెనుకవ్రేలాడుచుండు నీతలజడను, ఇంకశీఘ్రంబుననె విడిపించును.

అని, తాత్పర్యము.

తస్య దృష్ట్వా ముఖం దేవి పూర్ణచంద్ర మివోదితమ్. ౩౫
మోక్ష్యసే శోకజం వారి నిర్మోక మివ పన్నగీ

టీక॥ దేవి=సీతాదేవీ! ఉదితం=ఉదయించిన; పూర్ణచంద్రమివ(స్థితం)=నిండుచంద్రుండువలెనున్న; తస్య=ఆరామునియొక్క; ముఖం=మొగమును; దృష్ట్వా=చూచి; శోకజం=దుఃఖమువలనంగలిగిన; వారి=జలమును; పన్నగీ=ఆఁడుసర్పము; నిర్మోకమివ=కుబుసమువలె; మోక్ష్యసే=విడువఁగలవు.

సీతాదేవీ! ఉదితంబగు పూర్ణచంద్రుంబోలినట్టి యారాముని ముఖంబుఁ జూచినంతనె, నీవు, సర్పము కుబుసను

విడుచునట్లు , దుఃఖమునువిడువఁగలవు. అని, తాత్పర్యము.

రావణం సమరే హత్వా నచిరాదేవ మైథిలి. ౩౬
త్వయా సమగ్రః ప్రియయా సుఖార్హో లప్స్యతే సుఖమ్

టీక॥ మైథిలి=సీతాదేవీ ! సుఖార్హః= సుఖమునకుఁదగినరాముఁడు; నచిరాదేవ=శీఘ్రముననె ; సమరే= యుద్ధమునందు ; రావణం=రావణుని;హత్వా=చంపి;సమగ్రః= పూర్ణమనోరథుండై;ప్రియయా= ప్రియురాలవగు;త్వయా=నీతోఁ; సుఖం=సుఖమును;లప్స్యతే=పొందఁగలఁడు.

సీతాదేవీ ! సుఖార్హుండగురాముండు,ఇంకశీఘ్రంబుననె,యుద్ధంబున రావణునివధించి, సంపూర్ణమనోరథుండై, ప్రియురాలవగునిన్నుంగూడి, సుఖంబునొందఁగలఁడు.

అని, తాత్పర్యము.

సమాగతా త్వం వీర్యేణ మోదిష్యసి మహాత్మనా. ౩౭
సువర్షేణ సమాయుక్తా యథా సస్యేన మేదినీ

టీక॥త్వం=నీవు;మహాత్మనా= అధికమయినపరాక్రమముగల; రామేణ= రామునితోఁ;సమాగతా= చేరినదానవై; వీర్యేణ=పరాక్రమముచేత ; సస్యేన=పైరుతోఁ;సమాయుక్తా=కూడిన;మేదినీ= భూమి ; సువర్షేణయథా=మంచివర్షముచేతంబోలె; మోదిష్యసి=సంతోషింపఁగలవు.

సస్యముతోఁగూడినభూమిమంచివర్షముచేనుల్లసిల్లునట్లు,నీవు , మహాత్ముండగురామునింగూడి, యతనిపరాక్రమంబు చేనెంతయు సంతోషింపఁగలవు. అని, తాత్పర్యము.

గిరివర మభితోనువర్తమానో
హయఇవ మండల మాశు యః కరోతి. ౩౮
త మిహ శరణ మభ్యుపైహి దేవం
దివసకరం ప్రభవో హ్యయం ప్రజానామ్

టీక॥యః=ఎవ్వఁడు;గిరివరం= మేరుపర్వతముయొక్క; అభితః= చుట్టును;అనువర్తమానః=తిరుగుచు ; హయఇవ=గుఱ్ఱమువలె; మండలం=మండలగతిని ; తనోతి= చేయుచున్నాఁడో; తం=అట్టి;దేవం=దేవుఁడయిన; దివసకరం=సూర్యుని;శరణం= రక్షకునిఁగా;ఆశు= శీఘ్రముగ ; అభ్యుపైహి=పొందుము.అయం=ఇతఁడు; ప్రజానాం=ప్రజలకు;ప్రభవోహి= కారణముగదా!

ఎవ్వఁడు,పర్వతోత్తమమగు మేరుపర్వతముచుట్టునుదిరుగుచు, గుఱ్ఱముంబోలెమండలగతింజేయుచున్నాఁడో , అట్టిసూర్యునిప్పుడుశీఘ్రముగాశరణుపొందుము;ఈదేవుండు సమస్త ప్రజలకును గారణభూతుండుకావున, సమస్తశుభంబులనొసంగును.అనిసరమ,సీతాదేవితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, త్రయస్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండత్రయస్త్రింశసర్గటీక ,

ముగిసినది.

---

౩౪

చతుస్త్రింశసర్గప్రారంభః.

అథ తాం జాతసంతాపాం తేన వాక్యేన మోహితామ్
సరమా హ్లాదయామాస పృథివీం ద్యౌరివాంభసా. ౧

టీక॥ అథ=అంత ; జాతసంతాపాం = పుట్టినసంతాపముగలదియు;

 

మోహితాం = మోహమునొందినదియునగు ; తాం = ఆసీతాదేవిని ; సరమా = సరమ ; తైః = ఆ ; వాక్యైః = మాటచేత ; ద్యౌః = ఆకాశము ; పృథివీం = భూమిని ; అంభసేవ = జలముచేతవలె ; ఆహ్లాదయామాస = సంతోషపఱచెను.

అట్లు, సంతాపంబునొందినదియు మోహితయునగు సీతాదేవిని, సరమ, మధురవచనంబులచే, నాకాశము భూమినిఁ జలంబులచేతఁ జల్లఁజేయునట్లు, సంతోషపఱచెను. అని, తాత్పర్యము.

తత స్తస్యా హితం సఖ్యం చికీర్షంతీ సఖీవచః
ఉవాచ కాలే కాలజ్ఞా స్మితపూర్వాభిభాషిణీ. ౨

టీక॥ తతః = అంత ; కాలజ్ఞా = కాలము నెఱింగినదియు ; స్మితపూర్వాభిభాషిణీ = చిఱునగవుముందు గాఁగల్గునట్లు మాటలాడునదియునగు ; సఖీ = చెలియయినసరమ ; తస్యాః = ఆసీతాదేవికి ; హితం = మేలయిన ; సఖ్యం = స్నేహకార్యమును ; చికీర్షంతీ = చేయఁగోరుచు ; కాలే = కాలమునందు ; వచః = మాటను ; ఉవాచ = చెప్పెను.

అంత, నేకాలంబున నేదిచేయవలయునో, అదంతయుఁ జక్కఁగాఁ దెలిసినదగు నాసరమ, సీతాదేవికి మిక్కిలియు సంతోషముగల్గునట్లుచేసి తనస్నేహంబుఁ జూపంగోరి, చిఱునగవు మొగంబునందోఁప, సీతాదేవితో నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఉత్సహేయ మహం గత్వా త్వద్వాక్య మసితేక్షణె
నివేద్య కుశలం రామే ప్రతిచ్ఛన్నా నివర్తితుమ్. ౩

టీక॥ అసితేక్షణే నల్లనికండ్లుగల సీతాదేవీ! అహం = నేను ; ప్రతిచ్ఛన్నా = కప్పఁబడినదాననై ; గత్వా = పోయి ; కుశలం = క్షేమమును దెలుపునట్టి ; త్వద్వాక్యం = నీమాటను ; రామే = రామునియందు ; నివేద్య = తెలిపి ; నివర్తితుం = మఱలుటకు ; ఉత్సహేయం = కోరుదును.

నల్లనికండ్లుగల సీతాదేవీ నేను, ఎవ్వరికిని దెలియకుండునట్లు ; రాముని

 

యొద్దకుంబోయి, నీవుక్షేమంబుఁ జెప్ప మన్నావనిరామునకుంజెప్పి, రావలెనని కోరెదను. అని, తాత్పర్యము.

నహి మే క్రమమాణాయా నిరాలంబే విహాయసి
సమర్థో గతిమన్వేతుం పవనో గరుడోపివా. ౪

టీక॥ నిరాలంబే=ఆధారములేని ; విహాయసి=ఆకాశమునందు; క్రమమాణాయాః=పోవుచున్న; మే = నాయొక్క; గతిం=గమనమును; అన్వేతుం=వెంబడించుటకు; పవనః = వాయువుగాని; గరుడోపివా= గరుత్మంతుఁడుగాని; నసమర్థోహి= సమర్థుఁడుకాఁడుగదా!

నిరాధారంబగు నాకాశంబు నందు నేనుబోవుచుండఁగా నాతో సరిగా నడచుటకు , వాయుగరుత్మంతులేనియు,సమర్థులు కారు. అని, సరమసీతతోఁజెప్పెను. అని,తాత్పర్యము.

ఏవం బ్రువాణాం తాం సీతా సరమాం పునరబ్రవీత్
మధురం శ్లక్ష్ణయా వాచా పూర్వం శోకాభిపన్నయా. ౫

టీక॥ సీతా=సీతాదేవి;ఏవం= ఇట్లు;బ్రువాణాం=చెప్పుచున్న;తాం=ఆ; సరమాం= సరమనుగూర్చి ; పూర్వం=మున్ను ; శోకాభిపన్నయా= దుఃఖముతోఁగూడినదియు; శ్లక్ష్ణయా= మనోహరమునగు ; వాచా=మాటచేత;మధురం=ఇంపగునట్లుగా; పునః= మరల=అబ్రవీత్=చెప్పెను.

సీతాదేవి, ఇట్లుచెప్పుచున్నయాసరమంజూచి,మున్నుదుఃఖంబునందొట్రుపడుచుండియిప్పుడు మనోహరంబయి యొప్పదునున్నవచనంబున, నిట్లనిచెప్పెను. అని,తాత్పర్యము.

సమర్థా గగనం గంతు మపి వా త్వం రసాతలమ్
అవగచ్ఛామ్య కర్తవ్యం కర్తవ్యం తె మదంతరే. ౬

టీక॥ త్వం=నీవు; గగనం=ఆకాశమునుగాని; రసాతలమపివా= పాతాళమునైనఁగాని; గంతుం=పోవుటకు; సమర్థా=శక్తురాలవు. మదంతరే=

నావిషయమందు; అకర్తవ్యం = చేయరానిదానిని; కర్తవ్యం= చేయఁదగినదానిని; అవగచ్ఛామి = ఎఱుంగుదును.

నీవు, ఆకాశంబునకుఁగానిపాతాళంబునకుంగాని పోఁగలవు; సందియములేదు; నావిషయమయిమఱియెవ్వరికినింజేయనలవిగానిదానినింగూడ నీవు చేయఁగలవనినాకుందెలియును.

అని, తాత్పర్యము.

మత్ప్రియం యదికర్తవ్యం యదిబుద్ధి స్థిరా తవ
జ్ఞాతు మిచ్ఛామి తం గత్వా కింకరోతీతి రావణః. ౭

టీక॥ మత్ప్రియం=నాయిష్టము; కర్తవ్యంయది= చేయఁబడవలసినదగునేని; తవ=నీకు; బుద్ధిః = ఈతలంపు; స్థిరాయది=నిలుకడయగునేని; తం = ఆరావణుని; గత్వా=పొంది; రావణః= రావణుఁడు; కిం=దేనిని; కరోతి=చేయుచున్నాఁడు? ఇతి=అని; జ్ఞాతుం= ఎఱుంగుటకు; ఇచ్ఛామి= కోరుచున్నాఁడను.

నీవు, నాకోర్కె నెఱవేర్పవలెనని తలంపుస్థిరముగాఁగలదేని, నీవు రావణునియొద్దఁబోయి, యితండేమిసేయుచున్నాఁడో తెలిసికొనిరమ్ము.

అని, తాత్పర్యము.

సహి మాయాబలః క్రూరో రావణ శ్శత్రురావణః
మాం మోహయతి దుష్టాత్మా పీతమాత్రేవ వారుణీ. ౮

టీక॥ మాయాబలః=మాయయెబలముగాఁగలవాఁడును; క్రూరః= దయలేనివాఁడును; శత్రురావణః= శత్రువుల నేడ్పించువాఁడును; దుష్టాత్మా=దుష్టబుద్ధిగలవాఁడునగు; సః=ఆ; రావణః= రావణుఁడు; మాం= నన్ను; పీతమాత్రా=త్రాఁగఁబడినదిమాత్రమెయయిన; వారుణీవ=మద్యమువలె; మోహయతి=మోహింపఁజేయుచున్నాఁడు.

మాయాబలంబుగలవాఁడునునిర్దయుండునుశత్రువులనేడ్పించువాఁడును దుష్టాత్ముండునగు నారావణుండు, త్రాఁగఁబడిన మద్యంబువలె, నాకు మాటిమాటికి మోహంబు గల్గించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

తర్జాపయతి మాం నిత్యం భర్త్సాపయతి చాసకృత్
రాక్షసీభి స్సుఘోరాభి ర్యా మాం రక్షంతి నిత్యశః. ౯

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరావణుఁడు; యాః=ఎవ్వరు; నిత్యశః = ఎల్లప్పుడును; మాం=నన్ను; రక్షంతి= రక్షించుచున్నారో; తాభిః(అధ్యాహృతము)=అ; సుఘోరాభిః=మిక్కిలియు భయంకరలయిన; రాక్షసీభిః= రాక్షసస్త్రీలచేత; మాం=నన్ను; నిత్యం= ఎల్లప్పుడును; తర్జాపయతి= భయపడునట్లు చేయుచున్నాఁడు. అసకృత్ - పలుమాఱు; భర్త్సాపయతి= బెదరించునట్లు చేయుచున్నాఁడు.

ఆ రావణుఁడు, నాకుఁగావలియుండు రాక్షసస్త్రీలునన్ను భయంకరంబులగు నానావిధచేష్టలచేతను మాటలచేతను భయపడునట్లు చేయుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఉద్విగ్నా శంకితా చాస్మి న స్వస్థంచ మనో మమ
తద్భయాచ్చాఽహ ముద్విగ్నా అశోకవనికాం గతా. ౧౦

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; ఉద్విగ్నా = భయమునొందినదానను; శంకితాచ=సందేహమునొందినదానను; అస్మి =అగుచున్నాను. మమ=నాయొక్క; మనశ్చ=మనస్సును; స్వస్థం=నెమ్మదియయినది; న= కాదు. అశోకవనికాం = అశోకవనమును; గతా=పొందిన; అహం=నేను; తద్భయాచ్చ=అతనివలనిభయమువలననే; ఉద్విగ్నా = భయమునొందినాను.

నేనుమిక్కిలియు భయంబు నొంది ప్రాణసంశయమునుంబొంది యున్నాను; నామనస్సునను నెమ్మది లేదు ; ఈ యశోకవనంబున, నా రావణుని వలన నెపరమభీతయయియున్నాను.

అని, తాత్పర్యము.

యదినామ కథా తస్య నిశ్చితం వాపి యద్భవేత్
నివేదయేథా స్సర్వం తత్ పరో మే స్యా దనుగ్రహః. ౧౧

టీక॥ తస్య = అతనియొక్క; కథాయదినామ = వృత్తాంతముండు నేని ;

యత్=ఏది; నిశ్చితంవాపి = నిశ్చయింపఁబడినదియు; భవేత్=అగునో; తత్=దాని; సర్వం=అంతయు; నివేదయేథాః(యది)= తెల్పుదువేని; మే=నాకు; పరః= అధికమయిన; అనుగ్రహః=అనుగ్రహము; స్యాత్ = కలుగును.

ఆరావణుండేమిసేయనిశ్చయించునో, ఆవృత్తాంతమంతయునాకువచ్చిచెప్పుదువేని, నీయందునాకుమిక్కిలియుఁగృతజ్ఞతగలుగును. అని, సీతాదేవి, సరమతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

సా త్వేవం బ్రువతీం సీతాం సరమా వల్గుభాషిణీ
ఉవాచ వదనం తస్యా స్స్పృశంతీ బాష్పవిక్లబమ్. ౧౨

టీక॥ వల్గుభాషిణీ= మధురముగా మాటలాడునట్టి; సా = ఆ; సరమాతు = సరమమాత్రము; ఏవం=ఇట్లు; బ్రువతీం=చెప్పుచున్న; సీతాం= సీతాదేవినిగూర్చి; తస్యాః = ఆసీతాదేవియొక్క; బాష్పవిక్లబం=కన్నీళ్లచేఁగలఁతనొందిన; వదనం = ముఖమును; స్పృశంతీ = తాఁకుచు; ఉవాచ= చెప్పెను.

మధురభాషిణియగునాసరమ, ఇట్లుచెప్పుచున్నసీతాదేవింజూచి, కన్నీళ్లుగాఱుచున్నయాబిడ మొగమునుదడవుచు, నిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

ఏష తే యద్యభిప్రాయ స్తదా గచ్ఛామి జానకి
గృహ్య శత్రో రభిప్రాయ ముపావృత్తాంచ పశ్య మామ్. ౧౩

టీక॥ జానకి=సీతాదేవీ! ఏషః=ఇది; తే=నీయొక్క; అభిప్రాయోయది=అభిప్రాయమగునేని; తదా=అప్పుడు; గచ్ఛామి= పోవుచున్నాను. శత్రోః= శత్రువుయొక్క; అభిప్రాయం= అభిప్రాయమును; గృహ్య(గృహీత్వా)= తెలిసికొని; ఉపావృత్తాం = వచ్చిన; మాంచ=నన్నును; పశ్య=చూడుము.

సీతాదేవీ! ఇదినీయభిప్రాయమగునేని, నేనిప్పుడెపోయెదను; శత్రువుని యభిప్రాయంబుదెలిసికొని శీఘ్రంబున వచ్చెదంజూడుము. అని, సరమ, సీతాదేవితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా తతో గత్వా సమీపం తస్య రక్షసః
శుశ్రావ కథితం తస్య రావణస్య సమంత్రిణః. ౧౪

టీక॥సా(అధ్యాహృతము)=ఆసరమ;ఏవం=ఇట్లు;ఉక్త్వా=చెప్పి; తతః=అంత;తస్య=ఆ;రక్షసః=రాక్షసుఁడగు రావణునియొక్క; సమీపం= సమీపమును;గత్వా=పొంది ; సమంత్రిణః=మంత్రులతోఁగూడిన;తస్య=ఆ; రావణస్య=రావణునియొక్క;కథితం= మాటను;శుశ్రావ=వినెను.

ఆసరమసీతాదేవితో నాప్రకారమునం జెప్పి,యా రావణు సమీపంబునకుఁబోయి,యతండునుమంత్రులును మాటలాడుకొనినమాటలనన్నింటినివినెను.

అని, తాత్పర్యము.

సా శ్రుత్వా నిశ్చయం తస్య నిశ్చయజ్ఞా దురాత్మనః
పునరేవా గమత్ క్షిప్ర మశోకవనికాం తదా. ౧౫

టీక॥నిశ్చయజ్ఞా=నిశ్చయమునెఱింగినట్టి;సా=ఆసరమ;తదా= అప్పుడు; దురాత్మనః=దుష్టబుద్ధిగల;తస్య = ఆ రావణునియొక్క; నిశ్చయం=నిశ్చయమును; శ్రుత్వా=విని;పునరేవ= మఱలనే;క్షిప్రం=శీఘ్రముగా ; అశోకవనికాం=అశోకవనమునుగూర్చి; ఆగమత్= వచ్చినది.

నిశ్చయంబునెఱుంగుటయందుసమర్థురాలగునాసరమ, దురాత్ముండగు నారావణుండు గావించుకొన్న నిశ్చయంబుఁదెలిసికొని , మఱలశీఘ్రంబుననశోకవనంబునకువచ్చెను.

అని, తాత్పర్యము.

సా ప్రవిష్టా పున స్తత్ర దదర్శ జనకాత్మజామ్
ప్రతీక్షమాణాం స్వామేవ భ్రష్టపద్మా మివ శ్రియమ్. ౧౬

టీక॥సా=ఆసరమ;ప్రవిష్టా=ప్రవేశించినదై;పునః=మఱల;తత్ర=అచ్చట; స్వామేవ=తన్నే; ప్రతీక్షమాణాం=ఎదురు చూచుచున్నదియు ; భ్రష్టపద్మాం=వదలినకమలముగల; శ్రియమివ (స్థితాం)=లక్ష్మివలె నున్నదియునగు;




జనకాత్మజాం= జనకమహారాజుకూఁతురయినసీతాదేవిని;దదర్శ=చూచెను.

ఆసరమయిట్లశోకవనంబుఁ బ్రవేశించి,తనరాకకెదురుచూచుచున్నదియుఁబద్మరూపమయినయాసనమును విడిచినమహాలక్ష్మివలె నున్నదియునగు జనకమహారాజపుత్రిసీతాదేవిం జూచెను. అని,తాత్పర్యము.

తాంతు సీతా పునః ప్రాప్తాం సరమాం వల్గుభాషిణీమ్
పరిష్వజ్యచ సుస్నిగ్ధం దదౌచ స్వయ మాసనమ్. ౧౭

టీక॥ సీతా=సీతాదేవి;పునః=మఱల; ప్రాప్తాం=వచ్చిన;వల్గుభాషిణీం= మధురముగామాటలాడునట్టి; తాం=ఆ; సరమాంతు=సరమను;సుస్నిగ్ధం= మిక్కిలియు స్నేహముతోఁ గూడునట్లుగా;పరిష్వజ్యచ = కవుఁగిలించుకొనియు;స్వయంచ=తానె;ఆసనం= ఆసనమును;దదౌ=ఇచ్చెను.

సీతాదేవి, మధురభాషిణియగునా సరమవచ్చుటంజూచి , పరమసంతోషంబునొంది, సస్నేహంబుగానాబిడం గవుఁగిలించుకొని, తానెసాదరంబుగా నాసనంబొసంగెను.

అని,తాత్పర్యము.

ఇహాసీనా సుఖం సర్వ మాఖ్యాహి మమ తత్త్వతః
క్రూరస్య నిశ్చయం తస్య రావణస్య దురాత్మనః. ౧౮

టీక॥ త్వం (అధ్యాహృతము)= నీవు;ఇహ=ఇచ్చట;సుఖం= సుఖముగా; ఆసీనా = కూచుండినదానవయి ; క్రూరస్య=దయలేనివాఁడును; దురాత్మనః=దుష్టబుద్ధిగలవాఁడునగు ; తస్య=ఆ ; రావణస్య=రావణునియొక్క;నిశ్చయం=నిశ్చయమును,సర్వం= అంతను ; మమ=నాకు; తత్త్వతః= యాథార్థ్యముచేత ; ఆఖ్యాహి=చెప్పుము.

నీవిచ్చటసుఖంబుగాఁ, గూచుండి, నిర్దయుండునుదురాత్ముండునగు రావణునినిశ్చయంబంతయునాకు యథార్థంబుగాఁజెప్పుము . అని , సీతాదేవిసరమతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.




ఏవ ముక్తాతు సరమా సీతయా వేపమానయా
కథితం సర్వ మాచష్టే రావణస్య సమంత్రిణః. ౧౯

టీక॥ సరమా=సరమ; వేపమానయా=వడంకుచున్న; సీతయా=సీతాదేవిచేత; ఏవం=ఇట్లు; ఉక్తాతు=చెప్పఁబడినదైనంతనె; సమంత్రిణః = మంత్రులతోఁగూడిన; రావణస్య= రావణునియొక్క; కథితం=మాటను; సర్వం=అంతయు; ఆచష్టే=చెప్పెను.

సరమయిట్లు భీతయగుసీతాదేవిచెప్పినమాటనువిని, రావణుండునుఅతనిమంత్రులును మాటలాడుకొనినమాటలనంతయుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

జనన్యా రాక్షసేంద్రో వై త్వన్మోక్షార్థం బృహద్వచః
అవిద్ధేనచ వైదేహి మంత్రివృద్ధేన బోధితః. ౨౦

టీక॥ వైదేహి=సీతాదేవీ! రాక్షసేంద్రః= రాక్షసనాయకుండగు రావణుండు; ("వై" అనునది పాతపూరణార్థము); జనన్యా=తల్లి చేతను; మంత్రివృద్ధేన=ముసలిమంత్రియగు; అవిద్ధేనచ=అవిద్ధుని చేతను; త్వన్మోక్షార్థం=నీవిడుదలకొఱకు; బృహత్=గొప్పదగు; వచః=మాటను; బోధితః=బోధింపఁబడినాఁడు.

సీతాదేవీ! రావణునితల్లికైకసియు, అవిద్ధుఁడనువృద్ధమంత్రియు, నిన్నువిడుచుటకై, రాక్షసేశ్వరుండగు రావణునికిఁ, జాలదూరము బోధించినారు. అని, తాత్పర్యము.

దీయతా మభిసత్కృత్య మనుజేంద్రాయ మైథిలీ
నిదర్శనం తే పర్యాప్తం జనస్థానే య దద్భుతమ్. ౨౧

టీక॥ అభిసత్కృత్య = పూజించి; మనుజేంద్రాయ = నరేంద్రుండగు రామునికొఱకు; మైథిలీ=సీతాదేవి; దీయతాం=ఇవ్వఁబడుఁగాక. జనస్థానే=జనస్థానమునందు; అద్భుతం= ఆశ్చర్యకరమయినది; యత్ (అస్తి)=ఏదిగలదో; తత్ (అధ్యాహృతము)= అది; నిదర్శనం=దృష్టాంతము; తే=నీకు; పర్యా

ప్తం=చాలినది.

నీవు, రామునకుసత్కారపూర్వకముగసీతాదేవినొసంగుము ; అట్లివ్వవేని,నీకు నాశముగలుగుననుటకు , జనస్థానమునందు రాముండుఖరాదిసమస్తరాక్షసులంజంపుటయేనిదర్శనము.

అని, తాత్పర్యము.

లంఘనంచ సముద్రస్య దర్శనంచ హనూమతః
వధంచ రక్షసాం యుద్ధే కః కుర్యాన్మానుషో భువి. ౨౨

టీక॥హనూమతః = హనుమంతుని యొక్క;సముద్రస్య= సముద్రముయొక్క;లంఘనంచ=దాఁటుటను; దర్శనంచ=సీతాదర్శనమును;యుద్ధే=యుద్ధమునందు; రక్షసాం= రాక్షసులయొక్క;వధంచ=చంపుటను;భువి=భూమియందు;కః=ఏ;మానుషః = పురుషుఁడు;కుర్యాత్= చేయును?

సముద్రంబుదాఁటుటయులంకయందుసీతాదేవినింబాచుటయుయుద్ధంబున నొక్కండెపెక్కురాక్షసులం జంపుటయు,నీకార్యములను, హనుమంతుండొక్కఁడుగావించినాఁడుగదా! భూమండలంబున, మఱియేపురుషుండుచేయఁగలఁడు?అని,తల్లియునవిద్ధుండును రావణునకుబోధించిరి.

అని, తాత్పర్యము.

ఏవం స మంత్రివృద్ధైశ్చ విద్ధేన బహుభాషితః
న త్వా ముత్సహతే మోక్తు మర్థ మర్థపరో యథా. ౨౩

టీక॥ సః=ఆరావణుఁడు; మంత్రివృద్ధైః=(బహువచనము పూజార్థకము) ముసలిమంత్రియుగు;అవిద్ధేనచ=అవిద్ధునిచేతను;ఏవం=ఇట్లు; బహు=అధికముగా; భాషితః= చెప్పఁబడినవాఁడై; త్వాం=నిన్ను;అర్థం= ధనమును;అర్థపరోయథా= ధనమునందాసక్తిగలవాఁడువలె;మోక్తుం=విడుచుటకు;నోత్సహతే= సమ్మతింపఁడు.

ఇట్లు , తల్లియుమంత్రివృద్ధుండగున విద్ధుండును పెక్కుభంగుల బోధించినను, ఆరావణుండు, ధనలుబ్ధుండుధనమునువిడువనట్లు , నిన్నువిడువనొల్లఁడయ్యె.అని, తాత్పర్యము.

నోత్సహ త్యమృతో మోక్తుం యుద్ధే త్వామితి మైథిలి
సామాత్యస్య నృశంసస్య నిశ్చయో హ్యేష వర్తతే. ౨౪

టీక॥ మైథిలి= సీతాదేవీ! సః(అధ్యాహృతము)=ఆరావణుఁడు ; యుద్ధే=యుద్ధమునందు;అమృతః= మృతిఁబొందనివాఁడై ; త్వాం=నిన్ను; మోక్తుం=విడుచుటకు; నోత్సహతి=కోరఁడు. సామాత్యస్య=మంత్రులతోఁగూడిన; నృశంసస్య=క్రూరుఁడగు రావణునికి; ఇతి=అని; ఏషః=ఈ; నిశ్చయః=నిశ్చయము;వర్తతేహి=ఉన్నదిగదా!

సీతాదేవీ! యుద్ధంబునమృతిఁబొందినంగాని, రావణుండునిన్ను విడువఁడు; ఇది, రావణుండునుఅతనిమంత్రులునుజేసికొన్ననిశ్చయము.

అని, తాత్పర్యము.

తదేషా నిశ్చితా బుద్ధి మృత్యులోభా దుపస్థితా

టీక॥ తత్=అందువలన ; ఏషా=ఈ;నిశ్చితా=నిశ్చయింపఁబడిన ; బుద్ధిః=బుద్ధి; మృత్యులోభాత్=చావునందలియాశవలన ; ఉపస్థితా = కలిగినది.

ఆరావణునకీబుద్ధి , మరణముగలుగుటకేకలిగినదిగానివేఱుగాదు.

అని, తాత్పర్యము.

భయాన్న శక్త స్త్వాం మోక్తు మనిర స్తస్తు సంయుగే. ౨౫
రాక్షసానాంచ సర్వేషా మాత్మనశ్చ వధేన హి

టీక॥ అయం (అధ్యాహృతము)=ఈరావణుఁడు; సంయుగే=యుద్ధమునందు; రాక్షసానాం=రాక్షసులయొక్క;సర్వేషాం= అందఱియొక్కయు; ఆత్మనశ్చ=తనయొక్కయు; వధేన=చంపుటచేత ; అనిర స్తస్తు=నిరాకరింపఁబడనివాఁడైయు;భయాత్=భయమువలన;త్వాం=నిన్ను;మోక్తుం=విడుచుటకు;నశక్తోహి=చాలఁడుగదా!

ఈరావణుండు, తానునురాక్షసులందఱును మరణంబునొందకమునుపు, కేవలభయంబున , నిన్నువిడువనొల్లకున్నాఁడు. అని, తాత్పర్యము.

నిహత్య రావణం సంఖ్యే సర్వధా నిశితై శ్శరైః. ౨౬
ప్రతినేష్యతి రామ స్త్వా మయోధ్యా మసితేక్షణె

టీక॥ అసితేక్షణే=నల్లనికండ్లుగలసీతాదేవీ! రామః=రాముఁడు; సర్వధా=అన్నివిధంబులను; రావణం= రావణుని; సంఖ్యే=యుద్ధమునందు; నిశితైః=కఱకులయిన; శరైః= బాణముల చేత; నిహత్య=వధించి; త్వాం= నిన్ను; అయోధ్యాం = అయోధ్యాపట్టణమును; ప్రతినేష్యతి=పొందింపఁగలఁడు.

నల్లనికండ్లుగలసీతాదేవీ! రాముండు, తప్పకయుద్ధంబున తీక్ష్ణబాణంబుల రావణునివధించి, నిన్నయోధ్యకుఁ దోడ్కొనిపోవును. అని, సరమ, సీతాదేవికిఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏతస్మి న్నంతరే శబ్దో భేరీశంఖసమాకులః. ౨౭
శ్రుతో వానరసైన్యానాం కంపయన్ ధరణీతలమ్

టీక॥ ఏతస్మిన్ అంతరే= ఈనడుమను; వానరసైన్యానాం= వానరసైన్యములయొక్క; భేరీశంఖసమాకులః=భేరీధ్వనులచేతను శంఖధ్వనులచేతనునిండిన; ధరణీతలం=భూమిని; కంపయన్= కదలించుచున్న; శబ్దః=ధ్వని; శ్రుతః= వినఁబడినది.

ఇట్లుసరమసీతాదేవితోఁ జెప్పుచుండఁగానె, భేరీశంఖధ్వని సమన్వితంబగు వానరసైన్యంబులసింహనాదము, భూమింజలనంబునొందించుచు నతిభీకరంబయివినంబడినది. అని, తాత్పర్యము.

శ్రుత్వాతు తద్వానర సైన్యశబ్దం
లంకాగతా రాక్షసరాజభృత్యాః. ౨౮
నష్టౌజసో దైన్యపరీతచేష్టా
శ్శ్రేయో న పశ్యంతి నృపస్య దోషైః

టీక॥ లంకాగతాః = లంకాపురిని బొందిన; రాక్షసరాజభృత్యాః= రాక్షసేశ్వరుండగు రావణునిభృత్యులు; తద్వానరసైన్యశబ్దం=ఆవానరసైన్యముల

ధ్వనిని; శ్రుత్వాతు= విన్నంతనే; నష్టౌజసః = నశించినకాంతిగల వారలయి; దైన్యపరీతచేష్టాః= దైన్యముచేత వ్యాపింపఁబడినచేష్టలుగలవారలయి; నృపస్య= రాజైనరావణునియొక్క; దోషైః=దోషములచేత; శ్రేయః= మేలును; నపశ్యంతి=చూడరైరి-

లంకయందుండు రావణునిసైనికులు, వానరసైన్య సింహనాదంబులువిని, రావణునిదోషంబులచే మనకుమరణంబుగలుగును గాని మేలుగలుగదని, నిశ్చయించి, భయంబుననష్టతేజులయిదీనులయియుండిరి.అని, తాత్పర్యము-

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే , చతుస్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు , యుద్ధకాండచతుస్త్రింశసర్గటీక,
ముగిసినది.

---

౩౫

పంచత్రింశసర్గప్రారంభః.

తేన శంఖవిమిశ్రేణ భేరీశబ్దేన రాఘవః
ఉపయాతి మహాబాహూ రామః పరపురంజయః. ౧

టీక॥మహాబాహుః= పెద్దచేతులుగలవాఁడును; పరపురంజయః= శత్రువులపట్టణమునుజయించువాఁడును; రాఘవః=రఘువంశమునందుఁ బుట్టినవాఁడునగు; రామః= రాముఁడు; తేన = ఆ; శంఖవిమిశ్రేణ=శంఖధ్వనితోఁ గూడిన; భేరీశబ్దేన = భేరీధ్వనిచేత; ఉపయాతి(ఉపాయాయౌ)= వచ్చినాఁడు.

అప్పుడుమహాబాహుఁడును శత్రుపట్టణంబులజయించువాఁడునురఘువంశమున నుద్భవించినవాఁడు నగు రాముండు, అట్లు శంఖధ్వనులతోను భేరీ

ఘాంకారములతోనులంకాపురికే తెంచెను. అని, తాత్పర్యము.

తం నినాదం నిశమ్యాథ రావణో రాక్షసేశ్వరః
ముహూర్తం ధ్యాన మాస్థాయ సచివా నభ్యుదైక్షత. ౨

టీక॥ అథ=అంత; రాక్షసేశ్వరః= రాక్షసులకుఁ బ్రభువైన; రావణః= రావణుఁడు; తం=ఆ; నినాదం= ధ్వనిని; నిశమ్య=విని; ముహూర్తం=కొంచెము సేపు; ధ్యానం=ధ్యానమును; ఆస్థాయ=అవలంబించి; సచివాన్ = మంత్రులను; అభ్యుదైక్షత=చూచెను.

అంత, రాక్షసనాథుండగు రావణుండు, ఆరామసైన్యధ్వనినివిని, కొంచెము సేపు ఆలోచించి, మంత్రులంజూచెను. అని, తాత్పర్యము.

అథ తాన్ సచివాం స్తత్ర సర్వా నాభాష్య రావణః
సభాం సన్నాదయన్ సర్వా మిత్యువాచ మహాబలః. ౩
జగత్సంతాపనః క్రూరో గర్హయ న్రాక్షసేశ్వరః

టీక॥ అథ=అంత; తత్ర=అచ్చట; మహాబలః=అధికమయిన బలముగలవాఁడును; జగత్సంతాపనః=జగత్తును మిక్కిలియుఁ దపింపఁజేయువాఁడును; క్రూరః=దయలేనివాఁడును; రాక్షసేశ్వరః=రాక్షసులకుఁ బ్రభుండునగు; రావణః=రావణుఁడు; గర్హయన్ = నిందించుచు; సర్వాం=సమస్తమయిన; సభాం=సభను; సన్నాదయన్= ధ్వనింపఁజేయుచు; సచివాన్= మంత్రులను; ఆభాష్య=పిలిచి; ఇతి=ఇట్లని; ఉవాచ=చెప్పెను.

అంత, మహాబలశాలియు లోకంబులఁదపింపఁజేయువాఁడును నిర్దయుండును రాక్షసనాథుండు నగు రావణుండు, మంత్రులనందఱుంబిలిచి, నానావిధంబులనిందించుచు, సభ యంతయుఁ బ్రతిధ్వనిచెలంగ, నిట్లనిచెప్పెను.
అని, తాత్పర్యము.

తరణం సాగరస్యాపి విక్రమం బలసంచయమ్. ౪

యదుక్తవంతో రామస్య భవంతస్తన్మయా శ్రుతమ్

టీక॥ భవంతః = మీరలు; రామస్య=రామునియొక్క; యత్=ఏ;సాగరస్య=సముద్రముయొక్క; తరణమపి=దాఁటుటను; విక్రమం = పరాక్రమమును; బలసంచయం=సైన్యసమూహమును; ఉక్తవంతః = చెప్పినారో; తత్=అది; మయా=నాచేత;శ్రుతం=వినఁబడినది.

మీరలు, రామునిదూతహనుమంతుండుగావించినసముద్రతరణంబునుబరాక్రమంబునురామునిసైన్యంబును, చక్కఁగానుగ్గడించి, చెప్పినారు; అదంయువిన్నాను. అని, తాత్పర్యము.

భవతశ్చాప్యహం వేద్మి యుద్ధే సత్యపరాక్రమాన్. ౫
తూష్ణీం కా నీక్షతోఽన్యోన్యం విదిత్వా రామవిక్రమమ్

టీక॥ అహం=నేను; యుద్ధే=యుద్ధమునందు; సత్యపరాక్రమాన్=సత్యపరాక్రమములుగలవారలును ; రామవిక్రమం=రామునిపరాక్రమమును; విదిత్వా=తెలిసి; అన్యోన్యం=ఒండొరులను; ఈక్షతః=చూచుచున్నవారలును ; తూష్ణీకాన్=ఊరకున్నవారలునగు;భవతశ్చాపి=మిమ్మునుగూడ; వేద్మి= ఎఱుంగుదును.

యుద్ధంబునసత్యపరాక్రముల రయ్యు రామునిపరాక్రమంబువిని, యొండొరులంజూచుకొనుచు నిరుత్సాహుల రయియున్నమిమ్ముఁగూడ నెఱుంగుదును. అని,రావణుండుచెప్పెను.

అని, తాత్పర్యము.

తతస్తు సుమహాప్రాజ్ఞో మాల్యవాన్నామ రాక్షసః. ౬
రావణస్య వచ శ్శ్రుత్వా మాతుః పైతామహోఽబ్రవీత్

టీక॥ తతస్తు=అంతను; మాతుః=తల్లి యొక్క; పైతామహః=తాతకొడుకైనవాఁడును,పినతండ్రియైనవాఁడునట; సుమహాప్రాజ్ఞః= మిక్కిలి యుఁబండితుండునగు; మాల్యవాన్నామ=మాల్యవంతుండనుపేరుగల ; రా

క్షసః=రాక్షసుఁడును; రావణస్య= రావణునియొక్క; వచః= మాటను; శ్రుత్వా=విని; అబ్రవీత్=చెప్పెను.

అంత ; రావణునితల్లికిఁబినతండ్రియునుమహాపండితుండునగుమాల్యవంతుండనురాక్షసుండు, రావణునిమాటలువిని,యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

విద్యా స్వభివినీతో యో రాజా రాజ న్నయానుగః । ౭
స శాస్తి చిర మైశ్వర్య మరీంశ్చ కురుతే వశే

టీక॥రాజన్= రాక్షసరాజుండవగురావణుఁడా!యః=ఏ;రాజా= రాజు;విద్యాసు=ఆన్వీక్షకీత్రయీవార్తాదండనీతులను విద్యలయందు ; అభివినీతః=శిక్షితుండును; నయానుగః= నీతిశాస్త్రమునననుసరించువాఁడునో; సః=ఆరాజు;చిరం=బహుకాలము ; ఐశ్వర్యం=దొరతనమును;శాస్తి=పాలించును.అరీంశ్చ=శత్రువులను;వశే=అధీనతయందు; కురుతే=చేయును.

రాక్షసరాజుండవగురావణుఁడా! ఏరాజు,ఆన్వీక్షకీత్రయీవార్తా దండనీతులనువిద్యలనునేర్చిన నీతిశాస్త్రముననుసరించినడచునో,అతండే,బహుకాలమురాజ్యముఁబాలించును;అతండె, శత్రువులనందఱనుజయించును.

అని, తాత్పర్యము.

సందధానో హి కాలేన విగృహ్ణం శ్చారిభిః సహ । ౮
స్వపక్షవర్ధనం కుర్వ న్మహ దైశ్వర్య మశ్నుతే

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాజు;కాలేన=కాలముచేత;అరిభిస్సహ=శత్రువులతోఁగూడ; సందధానః= సంధిచేయుచు;విగృహ్ణంశ్చ= యుద్ధముసేయుచును; స్వపక్షవర్ధనం= తనపక్షమునువృద్ధిఁబొందించుటను; కుర్వన్=చేయుచును;మహత్=గొప్పదగు;ఐశ్వర్యం=సంపదను;అశ్నుతే= అనుభవించును.

అట్టినీతిశాస్త్రానువర్తియగు రాజు,కాలముననుసరించి,తనకుదౌర్బల్యముగలుగుకాలంబున శత్రువులతోసంధిచేయుచుఁ,దనకుఁబ్రాబల్యంబును శత్రునకుదౌర్బల్యంబునుంగలుగుకాలం

బునయుద్ధంబుసేయుచు, ఇట్లుస్వపక్షం బువృద్ధిఁబొందించుచు, బహుకాలము అపరిమితంబగునైశ్వర్యంబు ననుభవించును. అని, తాత్పర్యము.

హీయమానేన కర్తవ్యో రాజ్ఞా సంధి స్సమేన చ. ౯
స శత్రు మవమన్యేత జ్యాయాన్ కుర్వీత విగ్రహమ్

టీక॥ హీయమానేన= క్షీణించుచున్న బలముగల; రాజ్ఞా= రాజుచేత ; సమేన= సమబలుఁడగుశత్రువుతోఁ; ("చ" అనునది పాదపూరణార్థము) సంధిః = సంధానము; కర్తవ్యః= చేయఁబడవలసినది. సః= ఆ; జ్యాయాన్= అధికుఁడగువాఁడు; శత్రుం= శత్రువును ; అవమన్యేత= తిరస్కరింపవలయును; విగ్రహం= యుద్ధమును; కుర్వీత= చేయవలయును.

తనబలముక్షీణించుచుండునప్పుడు, తనకుసమబలుండగుశత్రువుతోఁ సంధిసేయవలయును; తానుశత్రువుకన్ననధికబలుండగునేని, శత్రువుందిరస్కరించి యతనితోఁ యుద్ధముసేయవలయును.
అని, తాత్పర్యము.

తన్మహ్యం రోచతే సంధి స్సహ రామేణ రావణ. ౧౦
యదర్థ మభి యుక్తా స్స్మ సీతా తస్మై ప్రదీయతామ్

టీక॥ రావణ= రావణుఁడా! తత్= అందువలన; రామేణసహ= రామునితోఁగూడ; మహ్యం= నాకొఱకు; సంధిః= సంధి; రోచతే= రుచించుచున్నది. యదర్థం= ఎవ్వతెకొఱకు ; అభియుక్తాః= విరోధమునుపొందినవారలము; స్మ(స్మః) = అగుచున్నామో ; సా(అధ్యాహృతము)= ఆ; సీతా= సీతాదేవి; తస్మై= ఆరామునికొఱకు ; ప్రదీయతాం= ఇవ్వఁబడుఁగాత.

రావణుఁడా! అట్లునీతిశాస్త్రము నుడువుటంజేసి, బలవంతుఁడగురామునితోఁసంధిగావించుటనాయిష్టము ; రామునకుమనయందు విరోధముగలుగుటకుఁగారణభూతయయినసీతను , రామునకిచ్చివేయుదము.
అని, తాత్పర్యము.

తస్య దేవర్షయ స్సర్వే గంధర్వాశ్చ జయైషిణః. ౧౧
విరోధం మాగమ స్తేన సంధి స్తే తేన రోచతామ్

టీక॥ దేవర్షయః=దేవర్షులు ; గంధర్వాశ్చ=గంధర్వులును; సర్వే = అందఱును; తస్య= ఆరామునియొక్క; జయైషిణః= జయముఁగోరువారలు. తేన= అతనితో; విరోధం= పగను; మాగమః=పొందకుము. తేన= అతనితో; తే=నీకు; సంధిః=సంధానము; రోచతాం=రుచించుఁగాక.

దేవర్షులు గంధర్వులు మున్నగు వారలందఱును రామునకుజయంబు గలుగవలెనని కోరుచున్నారు; కావున, నీవతనితో విరోధంబుపెట్టుకొనకుము; సంధిగావింపనియ్యకొనుము.

అని, తాత్పర్యము.

అసృజ ద్భగవాన్ పక్షౌ ద్వావేవ హి పితామహః. ౧౨
సురాణా మసురాణాంచ ధర్మా ధర్మౌ తదాశ్రయౌ

టీక॥భగవాన్= అధికమయినమాహాత్మ్యముగల; పితామహః=బ్రహ్మదేవుఁడు; సురాణాం=దేవతలకును ; అసురాణాంచ=అసురులకును; ద్వౌ= రెండయిన; పక్షౌ వేవ=పక్షములనె ; అసృజత్ హి=సృజించెనుగదా! ధర్మాధర్మౌ=ధర్మాధర్మములు; తదాశ్రయౌ = సురాసురులాశ్రయస్థానముగాఁగలవి.

భగవంతుండగుబ్రహ్మదేవుండు , సురలకును అసురులకును , రెండుపక్షములంగల్పించెను. అట్లుధర్మమునుఅధర్మమును, సురలను అసురులను, ఆశ్రయించియుండును.

అని, తాత్పర్యము.

ధర్మోహి శ్రూయతే పక్షో హ్యమరాణాం మహాత్మనామ్. ౧౩
అధర్మో రక్షసాం పక్షో హ్యసురాణాం చ రావణ

టీక॥రావణ= రావణుఁడా ! ధర్మః=ధర్మము; మహాత్మనాం= పూజ్యమయిన స్వభావముగల ; అమరాణాం=దేవతలయొక్క; పక్షః = పక్ష

ముగా("హి" అనునది పాదపూరణార్థము); శ్రూయతేహి=వినఁబడుచున్నదిగదా. అధర్మః=అధర్మము;రక్షసాం=రాక్షసులయొక్క-యు; అసురాణాంచ=అసురులయొక్క-యు; పక్షః హి=పక్షముగదా!

రావణుఁడా!అందు,మహాత్ములగు దేవతలపక్షముధర్మము; అసురరాక్షసులపక్షమధర్మము.

అని, తాత్పర్యము.

ధర్మో వై గ్రసతే౽ధర్మం తతః కృత మభూద్యుగమ్. ౧౪
అధర్మో గ్రసతే ధర్మం తత స్తిష్యః ప్రవర్తతే

టీక॥యదా(అధ్యాహృతము)=ఎప్పుడు;ధర్మః=ధర్మము("వై" అనునది పాదపూరణార్థము); అధర్మం=అధర్మమును;గ్రసతే= మ్రింగుచున్నదో; తతః=అప్పుడు;కృతం = కృతమను ; యుగం=యుగము;అభూత్=అగును. యదా(అధ్యాహృతము)=ఎప్పుడు;అధర్మః=అధర్మము;ధర్మం=ధర్మమును;గ్రసతే=మ్రింగుచున్నదో ; తతః=అప్పుడు; తిష్యః= కలియుగము; ప్రవర్తతే=కలుగును.

ఎప్పుడు,ధర్మమువలనఅధర్మమునకుఁబరాజయముగలుగునో,అప్పుఁడుకృతయుగమందురు;ఎప్పుడుఅధర్మమువలనధర్మమునకుఁబరాజయము గల్గునో,అప్పుడు,కలియుగమనిచెప్పుదురు.

అని, తాత్పర్యము.

తత్త్వయా చరతా లోకాన్ ధర్మో వినిహతో మహాన్. ౧౫
అధర్మః ప్రగృహీతశ్చ తేనాస్మ ద్బలినః పరే

టీక॥ తత్= అందువలన ; లోకాన్=లోకములనుగూర్చి;చరతా=సంచరించుచున్న; త్వయా=నీచేత;మహాన్=పూజ్యమయిన;ధర్మః=ధర్మము; వినిహతః=కొట్టఁబడినది . అధర్మశ్చ= అధర్మమును ; ప్రగృహీతః=స్వీకరింపఁబడినది. తేన=అందుచేత; పరే=శత్రువులు ; అస్మత్=మనకన్నను ; బలినః= అధికమయినబలముగలవారలు.

నీవు దిగ్విజయార్థమయిలోకంబులన్నియుఁదిరుగునప్పుడు , ధర్మంబు

నువిడిచి, యధర్మంబునుబరిగ్రహించితివి; అందువలన, ధార్మికుఁడగు రాముఁడు, మనకన్నబలవంతుఁడు.

అని, తాత్పర్యము.

స ప్రమాదా ద్వివృద్ధ స్తే ధర్మోఽభిగ్రసతే హి నః. ౧౬
వివర్ధయతి పక్షంచ సురాణాం సురభావనః

టీక॥ సః=ఆయధర్మము; తే=నీయొక్క; ప్రమాదాత్=ఏమఱుపాటువలన; వివృద్ధః=వృద్ధిఁబొందినది. ధర్మః=ధర్మము; నః=మనలను; అభిగ్రసతేహి=మ్రింగుచున్నదిగదా! సురభావనః=దేవతలకనుకూలమయినధర్మము; సురాణాం=దేవతలయొక్క; పక్షం=పక్షమును; వివర్ధయతిచ=వృద్ధిఁబొందించుచున్నదియు.

ఆయధర్మమును, నీవు, ప్రమాదంబునవృద్ధిఁబొందించుకొంటివి; కావున, ధర్మముమనలనశింపఁజేయుచున్నది, మఱియునాధర్మముదేవతలకనుకూలమయినదికావున, వారలపక్షమునకుబలమునుగలిగించుచున్నది.

అని, తాత్పర్యము.

విషయేషు ప్రసక్తేన యత్కించిత్కారణా త్త్వయా. ౧౭
ఋషీణా మగ్నికల్పానా ముద్వేగో జనితో మహాన్

టీక॥ యత్కించిత్కారణాత్=ఏదోయొకకారణమువలన; విషయేషు=విషయములయందు; ప్రసక్తేన=ఆసక్తుఁడవయిన; త్వయా=నీచేత; అగ్నికల్పానాం=నిప్పువంటివారలయిన; ఋషీణాం=ఋషులకు; మహాన్=గొప్పదగు; ఉద్వేగః=మనస్తాపము; జనితః=కలిగింపఁబడినది.

నీవు, దేనివలననో, విషయాసక్తుండవై, నిప్పువంటిమహర్షులకు, మిక్కిలియుమనస్తాపంబుగావించితివి; అదంతయు దేవతలకుబలమయినది.

అని, తాత్పర్యము.

తేషాం ప్రభావో దుర్ధర్షః ప్రదీప్తఇవ పావకః. ౧౮

టీక॥ తేషాం=వారలయొక్క; ప్రభావోపి=మహిమయు; ప్రదీప్తః=మండుచున్న; పావక ఇవ=నిప్పువలె; దుర్ధర్షః=ఎదిరింప నలవిగానిది.

ఆమహర్షులప్రభావము మండుచున్న నిప్పువంటిది; దాని కెదురులేదు.

అని, తాత్పర్యము.

తపసా భావితాత్మానో ధర్మస్యానుగ్రహే రతాః
ముఖ్యై ర్యజ్ఞై ర్యజంత్యే తే నిత్యం తై స్తై ర్ద్విజాతయః. ౧౯

టీక॥ ఏ తే=ఈ; ద్విజాతయః= బ్రాహ్మణులు; తపసా=తపస్సుచేత; భావితాత్మానః= ధ్యానింపఁబడిన యాత్మ గలవారలై; ధర్మస్య= ధర్మముయొక్క; అనుగ్రహే= వృద్ధిఁబొందించుట యందు; రతాః=ఆసక్తులయి; నిత్యం= ఎల్లప్పుడును; ముఖ్యైః= ఉత్తమములయిన; తైస్తైః=ఆయా; యజ్ఞైః= యాగములచేత; యజంతి= దేవతలఁ బూజింతురు.

ఈఋషులు, ఎల్లప్పుడును దపస్సుగావించుచుఁ బరమాత్మను ధ్యానించుచు, ధర్మవృద్ధియందాసక్తులయి, నానావిధోత్తమయాగంబులచే దేవతలం బూజింపుచుండెదరు. అని, తాత్పర్యము.

జుహ్వ త్యగ్నీంశ్చ విధివ ద్వేదాంశ్చో చ్చై రధీయతే
అభిభూయచ రక్షాంసి బ్రహ్మఘోషా నుదీరయన్. ౨౦

టీక॥ ఏ తే(అధ్యాహృతము)=ఈఋషులు; విధివత్=యథాశాస్త్రముగా; అగ్నీంశ్చ=అగ్నులను; జుహ్వతి= వేల్చుచున్నారు. వేదాంశ్చ=వేదములను; ఉచ్చైః=గట్టిగా; అధీయతే=పఠింతురు. రక్షాంసి=రాక్షసులను; అభిభూయ చ = తిరస్కరించియు; బ్రహ్మఘోషాన్=వేదధ్వనులను; ఉదీరయన్ (ఉదీరయంతి)=చెప్పుచున్నారు.

మఱియునీఋషులు, యథావిధిన గ్నులహోమము సేయుచుండెదరు; వేదంబులంబఠింపుచుండెదరు; రాక్షసులందఱుఁబాఱిపోవునట్లు, గట్టిగా వేదపారాయణము సేయుచుండెదరు.

అని, తాత్పర్యము.

దిశో విప్రద్రుతా స్సర్వే స్తనయిత్ను రివోష్ణగే

టీక॥ సర్వే=రాక్షసులందఱును;ఉష్ణగే= గ్రీష్మకాలమునందు; స్తనయిత్నురివ=మేఘమువలె; దిశః=దిక్కులను గూర్చి;విప్రద్రుతాః=పాఱిపోయిరి.

రాక్షసులందఱు,గ్రీష్మకాలంబునందు మేఘంబులుంబోలెభయంబున , దిక్కులకుఁబాఱుచున్నారు.

అని, తాత్పర్యము.

ఋషీణా మగ్నికల్పానా మగ్నిహోత్రసముత్థితః. ౨౧
ఆదత్తే రక్షసాం తేజో ధూమో వ్యాప్య దిశో దశ

టీక॥ అగ్నికల్పానాం= నిప్పువంటి వారలగు; ఋషీణాం = ఋషులయొక్క; అగ్నిహోత్రసముత్థితః= అగ్నిహోత్రములనుండిలేచిన; ధూమః= పొగ; దశ=పదియయిన ; దిశః = దిక్కులను; వ్యాప్య = వ్యాపించి; రక్షసాం=రాక్షసులయొక్క; తేజః=తేజస్సును; ఆదత్తే = గ్రహించుచున్నది.

మహాతపస్కులగుఋషులయగ్నిహోత్రములనుండివెడలినధూమము, దశదిశలువ్యాపించి , రాక్షసుల తేజస్సును నశింపఁజేయుచున్నది.

అని, తాత్పర్యము.

తేషు తేషుచ దేశేషు పుణ్యేష్వేవ దృఢవ్రతైః. ౨౨
చర్యమాణం తప స్తీవ్రం సంతాపయతి రాక్షసాన్

టీక॥ తేషు తేషు=ఆయా;పుణ్యేషు= పవిత్రములయిన; దేశేషు=ప్రదేశములయందు; దృఢవ్రతైః= దృఢమయిన నియమములుగలఋషులచేత;చర్యమాణం=చేయఁబడుచున్న; తీవ్రం= తీక్ష్ణమయిన;తపఏవచ=తపస్సునె ; రాక్షసాన్=రాక్షసులను; సంతాపయతి= మిక్కిలియుఁదపింపఁజేయుచున్నది.

ఆయాపుణ్యస్థలములయందు, ఋషులుదృఢనియమంబునం గావించు నట్టితీవ్రతపస్సులవలనరాక్షసులు మిక్కిలియుఁదపించుచున్నారు.

అని, తాత్పర్యము.

దేవదానవయక్షేభ్యో గృహీతశ్చ వరస్త్వయా. ౨౩

టీక॥త్వయా=నీచేత; దేవదానవయక్షేభ్యశ్చ=దేవతలవలనను దానవులవలనను యక్షులవలనను నై;వరః=వరము;గృహీతః=పుచ్చుకొనఁబడినది.

నీవు,దేవదానవయక్షులు మున్నగువారలవలన మరణము లేదని వరముఁ బొందినావు. అని,తాత్పర్యము.

మానుషా వానరా ఋక్షా గోలాంగూలా మహాబలాః
బలవంత ఇహాగమ్య గర్జంతి దృఢవిక్రమాః. ౨౪

టీక॥మహాబలాః= అధికమయినసేనగలవారలును;బలవంతః=అధికమయినబలిమిగలవారలును; దృఢవిక్రమాః= దృఢమయిన పరాక్రమముగలవారలునగు;మానుషాః=మనుష్యులును ; వానరాః=వానరులును; ఋక్షాః= ఎలుఁగుగొడ్డులును; గోలాంగూలాః=కొండముచ్చులును;ఇహ=ఇచ్చటికి ; ఆగమ్య=వచ్చి;గర్జంతి= అఱచుచున్నారు.

ఇప్పుడు,బలవంతులును మహాపరాక్రమశాలులునగుమనుష్యులును వానరులునుఎలుఁగుగొడ్డులును కొండముచ్చులునులంకకువచ్చి గర్జించుచున్నారు! నీకువీరివలనఁజావులేనట్లు , వరంబులేదు. అని,తాత్పర్యము.

ఉత్పాతాన్ వివిధాన్ దృష్ట్వా ఘోరాన్ బహువిధాంస్తథా
వినాశ మనుపశ్యామి సర్వేషాం రక్షసా మహమ్. ౨౫

టీక॥అహం=నేను; ఘోరాన్ = భయంకరములును;వివిధాన్=దివ్యాంతరిక్షభౌమభేదములు గలదియు ; తథా=అట్లు; బహువిధాన్ = పెక్కువిధములయినవియునగు;ఉత్పాతాన్ = ఉత్పాతములను; దృష్ట్వా= చూచి; రక్షసాం = రాక్షసులయొక్క ; సర్వేషాం=అందఱియొక్కయు;వినాశం= నాశమును; అనుపశ్యామి= ఊహించుచున్నాను.

నానావిధంబులగుదివ్యాంతరిక్షభౌమోత్పాతంబులుపొడముటంజూడ,రా

తుసులకందఱకునాశంబుగలుగుననితోఁచుచున్నది. అని, తాత్పర్యము.

ఖరాభిస్తనితా ఘోరా మేఘాః ప్రతిభయంకరాః
శోణితేనాభి వర్షంతి లంకా ముష్ణేన సర్వతః. ౨౮

టీ॥ ఖరాభిస్తనితాః=తీక్ష్ణములయినధ్వని గలవియు; ఘోరాః=విరూపములును; ప్రతిభయంకరాః= భయంకరములునగు; మేఘాః=మబ్బులు; లంకాం=లంకను, లంకయందనుట; సర్వతః=అంతటను; ఉష్ణేన=వేఁడియయిన; శోణితేన=నెత్తురుచేత; అభివర్షంతి=కురియుచున్నవి.

వికృతరూపములును భయంకరములునగు మేఘములు, అత్యుగ్రంబుగా గర్జించుచు, లంకయంతయు, వేఁడినెత్తురునుగురియుచున్నవి.

అని, తాత్పర్యము.

రుదతాం వాహనానాంచ ప్రపతం త్యాస్రబిందవః
ధ్వజా ధ్వస్తా వివర్ణాశ్చ న ప్రభాంతి యథాపురా. ౨౯

టీక॥ రుదతాం=ఏడ్చుచున్న; వాహనానాం =గుఱ్ఱములుమున్నగువానియొక్క ; అస్రబిందవశ్చ=నెత్తురుబిందువులును ; ప్రపతంతి=పడుచున్నవి. ధ్వజాః=టెక్కెములు ; ధ్వస్తాః=దుమ్ముదగిలినవై; వివర్ణాశ్చ= రంగుచెడినవియునై; పురా యథా = మునుపువలెనై; నప్రభాంతి=ప్రకాశింపకున్నవి.

గుఱ్ఱములునేనుంగులును, రోదనంబు సేయుచుఁ గన్నీళ్లు విడుచుచున్నవి; ధ్వజంబులన్నియుం దుమ్ముదగిలివివర్ణంబులయి మునుపటివలెఁ బ్రకాశింపకున్నవి. అని, తాత్పర్యము.

వ్యాళా గోమాయవో గృధ్రా వాశ్యంతిచ సుభైరవమ్
ప్రవిశ్య లంకా మనిశం సమవాయాంశ్చ కుర్వతే. ౩౦

టీక॥ వ్యాళాః= దుష్టములయిన; గోమాయవః=నక్కలును; గృధ్రాః=గద్దలును; లంకాం= లంకాపట్టణమును; ప్రవిశ్య=చొచ్చి; అనిశం=ఎల్లప్పుడును;

సుభైరవం = మిక్కిలియు భయంకరముగా; వాశ్యంతిచ=అఱచుచున్నవియు.సమవాయాంశ్చ= గుంపులను; కుర్వతే=చేయుచున్నవి.

దుష్టములగు నక్కలును గద్దలును, లంకాపురింబ్రవేశించి, యెల్లప్పుడును, గుంపులుగుంపులుగాఁజేరి, భయంకరముగానఱచుచున్నవి. అని, తాత్పర్యము.

కాళికాః పాండరై ర్దంతైః ప్రహసం త్యగ్రతః స్థితాః
స్త్రియ స్స్వప్నేషు ముష్ణంత్యో గృహాణి ప్రతిభాష్యచ. ౨౯

టీక॥ స్వప్నేషు=కలయందు; కాళికాః=నల్లని; స్త్రియః=స్త్రీలు; ప్రతిభాష్యచ= ప్రతికూలముగా మాటలాడియు; గృహాణి= ఇండ్లను, ఇండ్లనుండుపదార్థములననుట ;ముష్ణంత్యః = దొంగిలించుచు; అగ్రతః=ఎదుట ; స్థితాః=నిలిచినవారలయి; పాండరైః=తెల్లని; దంతైః=పండ్లతో ; ప్రహసంతి=నవ్వుచున్నారు.

నల్లనిస్త్రీలు , బెదరింపుమాటలు చెప్పచు , ఇండ్లనుండుపదార్థంబుల దొంగిలించునట్లును, మఱియునెదుటనిలిచి, తెల్లనిపండ్లు చేటపడఁ , పకపక నవ్వునట్లును , స్వప్నములుగలుగుచున్నవి. అని, తాత్పర్యము.

గృహాణాం బలికర్మాణి శ్వానః పర్యుపభుంజతే
ఖరా గోషు ప్రజాయంతే మూషికా నకులై స్సహ. ౩౦

టీక॥గృహాణాం=ఇండ్లయొక్క; బలికర్మాణి = పూజాకార్యములను , పూజార్థమయియుంచియుండు హవిస్సులను;శ్వానః=కుక్కలు;పర్యుపభుంజతే=తినుచున్నవి; గోషు=ఆవులయందు; ఖరాః = గాడిదలు ;ప్రజాయంతే=పుట్టుచున్నవి. మూషికాః=పందికొక్కులు; నకులై స్సహ= ముంగిసలతోఁగూడ ; వర్తంతే (అధ్యాహృతము)=ఉన్నవి,

పూజార్థమయి యిండ్లయందుండు హవిస్సునుకుక్కలువచ్చితినిపోవుచున్నవి ; ఆవులయందుగాడిదలుపుట్టుచున్నవి;పందికొక్కులుముంగిసలతోఁగూడఁదిరుగుచున్నవి. అని,తాత్పర్యము.

మార్జారా ద్వీపిభి స్సార్ధం సూకరా శ్శునకై స్సహ
కిన్నరా రాక్షసై శ్చాపి సమీయు ర్మానుషై స్సహ. ౩౧

టీక॥ మార్జారాః=పిల్లులు; ద్వీపిభిస్సార్ధం=పులులతోఁగూడను; సూకరాః=ఊరఁబందులు; శునకైస్సహ=కుక్కలతోఁగూడను; సమీయుః(అధ్యాహృతము)=చేరుచున్నవి. కిన్నరాః=కిన్నరులు; రాక్షసైశ్చాపి= రాక్షసులతోను; మానుషైస్సహ = మనుష్యులతోఁగూడను; సమీయుః (అధ్యాహృతము)=చేరుచున్నారు.

మార్జారములు పులులతోఁ జేరియున్నవి; ఊరఁబందులుకుక్కలతోఁజేరుచున్నవి; కిన్నరులును రాక్షసులును మనుష్యులునుఒక్కటిగానున్నారు. అని, తాత్పర్యము.

పాండురారక్తపాదాశ్చ విహంగాః కాలచోదితాః
రాక్షసానాం వినాశాయ కపోతా విచరంతి చ. ౩౨

టీక॥ పాండురారక్తపాదాః=తెల్లనివియునెఱ్ఱనివియునైన పాదములుగల; కపోతాః = పావురములును; విహంగాశ్చ= పక్షులును ; కాలచోదితాః = దైవముచేఁబ్రేరింపఁబడినవై, రాక్షసానాం=రాక్షసులయొక్క; వినాశాయ=నాశముకొఱకు; విచరంతిచ=తిరుగుచున్నవియు.

తెలుపునెఱుపునుగలసిన రంగుగల పాదములతోఁగూడినపావురములు, దైవప్రేరితములయి , రాక్షసులవినాశంబుగలుగుననిసూచింపుచుఁ , దిరుగుచున్నవి. అని, తాత్పర్యము.

చీచీకూచీతి వాశ్యంత్య శ్శారికా వేశ్మసు స్థితాః

టీక॥ వేశ్మసు=ఇండ్లయందు ; స్థితాః=ఉన్న ; శారికాః=గోరువంకపిట్టలు; చీచీకూచీతి = చీచీకూచియని; వాశ్యంత్యః=అఱచుచు; వర్తంతే (అధ్యాహృతము)=ఉన్నవి.

ఇండ్లయందు మధురసల్లాపార్థము యిపెంపఁబడినగోరువంకలు , మధురముగాఁగూయుటనువిడిచి, యిప్పుడు

వీచీకూచియని, క్రూరధ్వనులంజేయుచున్నవి. అని, తాత్పర్యము.

పతంతి గ్రథితా శ్చాపి నిర్జితాః కలహైషిణః. ౩౩
పక్షిణశ్చ మృగా స్సర్వే ప్రత్యాదిత్యం రుదంతిచ

టీక|| పక్షిణః= కాకులు మొదలగు పక్షులును; మృగాశ్చ=మృగములును; సర్వే=అన్నియు; నిర్జితాశ్చాపి= జయింపఁబడినవైనను; కలహైషిణః= కలహముగోరినవై; గ్రథితాః= గుంపులుగట్టినవై; పతంతి =పరుగెత్తుచున్నవి. ఆదిత్యంప్రతి = సూర్యునిగూర్చి; రుదంతిచ=ఏడ్చుచున్నవియు.

పక్షులునుమృగంబులును, ఒండొంటితోఁబోరుచు, సోలియు, మఱలఁగలహంబుఁగోరి, యొండొంటిపైకింబరుగెత్తుచున్నవి; మఱియు, సూర్యునింజూచిరోదనంబుఁజేయుచున్నవి.
అని, తాత్పర్యము.

కరాళో వికలో ముండః పురుషః కృష్ణపింగళః. ౩౪
కాలో గృహాణి సర్వేషాం కాలేకాలే న్వవేక్షతే

టీక||కరాళః= భయంకరుఁడును; వికలః= హీనాంగుండును; ముండః= జుట్టులేనివాఁడును; కృష్ణపింగళః=నలుపునుగోరోజనమువంటి వన్నెయుఁగలవాఁడునగు;పురుషః= పురుషరూపుఁడయిన;కాలః=మృత్యువు; సర్వేషాం= అందఱియొక్క;గృహాణి=ఇండ్లను;కాలేకాలే=అన్యోన్యకాలమునందు ; అన్వవేక్షతే=చూచుచున్నాఁడు.

భయంకరా కారుండును ముండితశిరస్కుండును కృష్ణపింగళుండునగుపురుషనిరూపముధరించి, మృత్యువు, రాక్షసుల గృహములన్నియుఁ, బ్రాతస్సాయంకాలములయందుఁజూచుచున్నాఁడు. అని, తాత్పర్యము.

ఏతా న్యన్యాని దుష్టాని నిమిత్తా న్యుత్పతంతిచ. ౩౫
జ్ఞాత్వా ప్రధార్య కార్యాణి క్రియతా మాయతిక్షమమ్

టీక||ఏతాని=ఇవియు;అన్యాని= ఇతరములయిన;దుష్టాని= దుష్టములయిన; నిమిత్తానిచ=నిమిత్తములును;ఉత్పతంతి=పుట్టుచున్నవి,జ్ఞాత్వా= తెలిసి;

కార్యాణి=పనులను;ప్రధార్య = నిశ్చయించి;ఆయతిక్షమం=ముందు కనుకూలమగునట్లు;క్రియతాం= చేయఁబడుఁగాక.

ఇవియు,నింకను దుష్టనిమిత్తములనేకంబులును, బుట్టుచున్నవి; కాఁబట్టి చక్కఁగానాలోచించి , నిశ్చయించి, ముందుకు బాధగలుగకుండునట్లు , చేయుము. అని,మాల్యవంతుఁడు రావణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇదం వచ స్తత్ర నిశమ్య మాల్యవాన్
పరీక్ష్య రక్షోధిపతే ర్మనః పునః. ౩౬
అనుత్తమే షూత్తమపౌరుషో బలీ
బభూవ తూష్ణీం సమవేక్ష్య రావణమ్

టీక॥అనుత్తమేషు=తమకన్నశ్రేష్ఠులులేనివారియందు; ఉత్తమపౌరుషః=శ్రేష్ఠమయినపౌరుషము గలవాఁడును; బలీ=అధికమయిన బలముగలవాఁడునగు;మాల్యవాన్=మాల్యవంతుండు; తత్ర=అచ్చట;ఇదం=ఈ;వచః= మాటను;నిశమ్య=వినిపించి; రావణం= రావణుని;సమవేక్ష్య=చూచి;పునః = మఱల;రక్షోధిపతేః= రాక్షసనాయకుండగు రావణునియొక్క;మనః = మనస్సును;పరీక్ష్య=పరీక్షించి;తూష్ణీం= ఊరక;బభూవ=అయ్యెను.

ఉత్తములలో నుత్తమపౌరుషుండును బలవంతుండునగు నామాల్యవంతుండు,ఇట్లు రావణునకుఁజెప్పి, యతని మొగంబుఁజూచి, యతనిమనంబుంజక్కఁగాఁబరీక్షించి, యతనికిఁదనమాటయనిష్టముగాఁదోఁచుటం దెలిసికొని,యంత నూరకుండెను. అని,తాత్పర్యము.

ఇత్యార్షే,శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే , పంచత్రింశస్సర్గః .
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు , యుద్ధకాండపంచత్రింశసర్గటీక ,
ముగిసినది.

౩౬

షట్త్రింశసర్గప్రారంభః.

తత్తు మాల్యవతో వాక్యం హిత ముక్తం దశాననః
న మర్షయతి దుష్టాత్మా కాలస్య వశ మాగతః. ౧

టీక॥దుష్టాత్మా=దుష్టబుద్ధిగల ; దశాననః=రావణుఁడు ; కాలస్య=మృత్యువుయొక్క;వశం=అధీనతను; ఆగతః=పొందినవాఁడై;మాల్యవతః=మాల్యవంతునియొక్క;ఉక్తం= చెప్పఁబడిన;హితం=మేలుగల్గించునట్టి;వాక్యం=మాటను;నమర్షయతి=ఓర్వఁడయ్యె.

దుష్టాత్ముండగురావణుండు, మృత్యువశంగతుండై, మాల్యవంతుండుచెప్పినహితవాక్యంబునుసహింపఁడయ్యె. అని, తాత్పర్యము-

స బద్ధ్వా భ్రుకుటిం వక్త్రే క్రోధస్య వశ మాగతః
అమర్షా త్పరివృత్తాక్షో మాల్యవంత మథా బ్రవీత్. ౨

టీక॥అథ=అంత;సః= ఆరావణుఁడు; క్రోధస్య= కోపముయొక్క; వశం=అధీనతను;ఆగతః= పొందినవాఁడై;అమర్షాత్=కోపమువలన;వక్త్రే=మొగమునందు;భ్రుకటీం=బొమముడిని;బద్ధ్వా= కట్టి;పరివృత్తాక్షః=తిరుగుచున్నకండ్లుగలవాఁడై;మాల్యవంతం=మాల్యవంతునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అంత,నారావణుండు, పరమకుపితుండై,కోపంబుచేముఖంబునబొమముడివడ,గ్రుడ్లుగిఱగిఱందిరుగ , నామాల్యవంతుంబూచి,యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము,

హితబుద్ధ్యా య దహితం వచః పరుష ముచ్యతే
పరపక్షం ప్రవిశ్యైవ నైత చ్ఛ్రోత్రం గతం మమ. ౩

టీక॥పరపక్షం=శత్రుపక్షమును ; ప్రవిశ్యైవ=ప్రవేశించియే; హితబుద్ధ్యా= మేలనితెలిసికొనుననుబుద్ధిచేత; అహితం= కీడుగల్గించునదియు; పరు

వం=కఠినంబునగు; యత్=ఏ;వచః=మాట; ఉచ్యతే = చెప్పఁబడుచున్న దో; ఏతత్=ఈమాట; మమ=నాయొక్క; శ్రోత్రం=చెవిని ; నగతం=పొందినదికాదు.

శత్రువులపై స్నేహంబుచేత, నితని నెల్లెడ నహితంబుఁజెప్పినట్లు చెప్పి మోస పుచ్చవలయునని , యహితంబునుబరుషంబునగుమాటంజెప్పినావు ; అయినను నేనుదానినివినను- అని, తాత్పర్యము.

మానుషం కృపణం రామ మేకం శాఖామృగాశ్రయమ్
సమర్థం మన్యసే కేన త్యక్తం పిత్రా వనాలయమ్. ౪

టీక॥మానుషం=మనుష్యుఁడును ; కృపణం=హీనుఁడును; ఏకం= ఏకాకియును; శాఖామృగాశ్రయం=కోఁతులేయాశ్రయముగాఁ గలవాఁడును; పితా=తండ్రిచేత; త్యక్తం=విడువఁ బడినవాఁడును; వనాలయం= అడవియె యునికిపట్టుగాఁగలవాఁడు నగు ; రామం=రాముని; కేన=దేనిచేత; సమర్థం=సమర్థునిఁగా; మన్యసే= తలంపుచున్నావు?

మనుష్యుఁడును నీచుండును ఏకాకియునుగోఁతులు సహాయులుగాఁ గలవాఁడును దండ్రిచేవిడువఁబడిన వాఁడును వనచరుండునగు రాముండు సమర్థుండనిచెప్పినావే ; అందు కేమికారణము? అని, తాత్పర్యము.

రక్షసా మీశ్వరం మాంచ దేవతానాం భయంకరమ్
హీనం మాం మన్యసే కేన హ్యహీనం సర్వవిక్రమైః. ౫

టీక॥ రక్షసాం=రాక్షసులకు; ఈశ్వరం=ప్రభుండను ; దేవతానాం=దేవతలకు;భయంకరం= భయముసేయువాఁడను;సర్వవిక్రమైః= సమస్తపరాక్రమములచేత;అహీనం= తక్కువకానివాఁడనగు;మాం=నన్ను; మాంచ=నన్నును;హీనం = తక్కువయినవానిఁగా;కేనహి = ఎందుచేత ; మన్యసే=తలంచుచున్నావు?

సమస్తరాక్షసులకుఁ బ్రభుండను సమస్తదేవతలకును భయంబు గల్గించువాఁడనుమహాపరాక్రమశాలినగు నేను దక్కువయనిచెప్పినావే;దేనిచేత? అని, తాత్పర్యము.

వీరద్వేషేణ వా శంకే పక్షపాతేన వా రిపోః
త్వయాహం పరుషా ణ్యుక్తః పరప్రోత్సాహనేన వా. ౬

టీక॥ వీరద్వేషేణ=పరాక్రమవంతునియందలిద్వేషముచేతనో; రిపోః=శత్రువుయొక్క; పక్షపాతేనవా = పక్షమువొందుటచేతనో; పరప్రోత్సాహనేనవా= శత్రువుయొక్క ప్రోత్సాహపఱచుటచేతనో; త్వయా = నీచేత; అహం= నేను; పరుషాణి= కఠినవచనములను; ఉక్తః=చెప్పఁబడినాను. ఇతి (అధ్యాహృతము) = అని; శంకే=తలంచెదను.

సజాతీయులలో వీరుండుండుటను సహింపఁజాలమిచేతనో, శత్రుపక్షపాతముచేతనో, లేక, శత్రువులుప్రోత్సాహపఱచుటచేతనో, నీవునన్నట్లుపరుషవచనంబులాడితివిగాని, దానికివేఱేకారణములేదు.

అని, తాత్పర్యము.

ప్రభవంతం పదస్థం హి పరుషం కోభిధాస్యతి
పండిత శ్శాస్త్రతత్త్వజ్ఞో వినా ప్రోత్సాహనా ద్రిపోః. ౭

టీక॥ రిపోః=శత్రువుయొక్క; ప్రోత్సాహనాద్వినా= ప్రోత్సాహపఱచుటలేక; పండితః=పండితుఁడును; శాస్త్రతత్త్వజ్ఞః = శాస్త్రసిద్ధాంతములఁదెలిసినవాఁడునగు; కః= ఎవ్వఁడు; ప్రభవంతం = ప్రభావముగలవాఁడును; పదస్థం= రాజ్యపదంబుననున్నవాఁడునగువానిఁగూర్చి ; పరుషం =కఠినవచనమును ; అభిధాస్యతిహి=చెప్పును?

శత్రుప్రోత్సాహములేకున్నచోఁ, బండితుండును శాస్త్రంబులు దెలిసినవాఁడునగువాఁడెవ్వండు, రాజ్యాధికారంబుననున్నవాఁడును నిగ్రహానుగ్రహసమర్థుఁడునగురాజునుగూర్చి, పరుషవచనంబులాడును?

అని, తాత్పర్యము.

ఆనీయచ వనా త్సీతాం పద్మహీనా మివ శ్రియమ్
కిమర్థం ప్రతిదాస్యామి రాఘవస్య భయా దహమ్. ౮




టీక॥ అహం=నేను; వనాత్=అడవినుండి; పద్మహీనాం = కమలములేని; శ్రియమివ (స్థితాం)= లక్ష్మివలెనున్న; సీతాం=సీతాదేవిని ; ఆనీయచ= తెచ్చియు; రాఘవస్య = రామునియొక్క; భయాత్=భయమువలన ; కిమర్థం=ఎందుకొఱకు; ప్రతిదాస్యామి=మఱలనిత్తును.

నేను, బద్మాసనంబులేనిలక్ష్మీదేవివలెనున్న సీతాదేవిని వనంబునుండి తెచ్చి , మఱలరామునకు భయపడి నేనేలయిత్తును.

అని, తాత్పర్యము.

వృతం వానరకోటీభి స్ససుగ్రీవం సలక్ష్మణమ్
పశ్య కై శ్చిదహోభి స్త్వం రాఘవం నిహతం మయా. ౯

టీక॥ త్వం=నీవు; వానరకోటీభిః= వానరులకోటులచేత; వృతం = చుట్టఁబడినవాఁడును; ససుగ్రీవం = సుగ్రీవునితోఁగూడినవాఁడును; సలక్ష్మణం = లక్ష్మణునితోఁగూడినవాఁడునగు; రాఘవం=రాముని; మయా=నాచేత; కైశ్చిత్=కొన్ని; అహోభిః= దినములచేత; నిహతం=చంపఁబడినవానిఁగా ; పశ్య=చూడుము.

ఇంకఁగొన్నిదినంబులలోనే, సమస్తవానరసేనాసమేతుండగు రామునిసుగ్రీవలక్ష్మణులతోఁగూడ నేను వధించుటంజూడఁగలవు. అని, తాత్పర్యము.

రహస్యార్థము.—మయా= నాచేత; నిహతం=(హనహింసాగత్యోఃఅను ధాతువునం బుట్టినది) వచ్చిన; రాఘవం=రాముని; పశ్య=చూడుము. శేషముసమానము.

ఇంకంగొన్ని దినంబులలోఁ నాకుఁగా, సమస్తవానరవాహినీ సమేతంబుగా సుగ్రీవలక్ష్మణ సహితుండై వచ్చిన రాముంజూడఁగలవు.

అని, తాత్పర్యము.

ద్వంద్వే యస్య నతిష్ఠంతి దైవతాన్యపి సంయుగే
స కస్మా ద్రావణో యుద్ధే భయ మాహారయిష్యతి. ౧౦

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; ద్వంద్వే=ద్వంద్వమను; సంయుగే= యుద్ధ




మునందు; దైవతాన్యపి= దేవతలయి
నను;నతిష్ఠంతి=నిలువరో;సః = అట్టి;
రావణః=రావణుఁడు;కస్మాత్=ఎందు
వలన;యుద్ధే=యుద్ధమునందు ; భ
యం=భయమును ; ఆహరయిష్యతి=
పొందఁగలఁడు?

ఎవ్వనితో దేవతలు గూడద్వంద్వయు
ద్ధము సేయఁజాలరో, అట్టి రావణుఁడు,
రామయుద్ధంబున, నేలభయపడును?
అని, తాత్పర్యము.

ద్విధా భజ్యేయ మప్యేవం న నమేయంతు కస్యచిత్
ఏష మే సహజో దోష స్స్వభావో దురతిక్రమః. ౧౧

టీక॥ద్విధా=రెండువిధముల;భజ్యే
యమపి=భగ్నుఁడనైననగుదును; ఏవం=
ఇట్లు; కస్యచిత్=ఒకానొకనికైనను;
ననమేయంతు=వంగనుమాత్రమువంగ
ను.ఏషః=ఇది; మే=నాయొక్క; సహ
జః=స్వాభావికమయిన; దోషః=దోష
ము. స్వభావః=స్వభావము ; దురతి
క్రమః=అతిక్రమింప నలవిగానిది.

రాముండు బలవంతుండె యయిన
ను,అతనిచేశిరశ్ఛేదమయినను బొందు
దునుగాని , నేనెట్టివానికినివంగను;ఇది
స్వభావమునంగల్గినదోషము; స్వభావ
మునువిడువనలవిగాదు.
అని, తాత్పర్యము.

యది తావ త్సముద్రేతు సేతు ర్బద్ధో యదృచ్ఛయా
రామేణ విస్మయః కోత్ర యేనతే భయ మాగతమ్. ౧౨

టీక॥ రామేణ=రామునిచే ; సము
ద్రే తావత్=స్వల్పమయిన సముద్రము
నందు; యదృచ్ఛయా=దబ్బాటుచేత;
సేతుః=కట్ట; బద్ధోయది=కట్టఁబడెనద
గునేని; యేన=దేనిచేత; తే = నీకు;
భయం=భయము;ఆగతం = వచ్చిన
దో; అత్ర=ఈవిషయమునందు; విస్మ
యః=ఆశ్చర్యము;కః=ఏది?

రాముండుసముద్రమునందు సేతు
వుకట్టినాఁడనిగదానీవు భయముఁబొం
దినావు! ఒకవేళనీస్వల్పసముద్రమునం
దు దబ్బాటునరాముండు సేతువు గట్టి
నను, అదియేమియాశ్చర్యము?
అని, తాత్పర్యము.

సతు తీర్త్వార్ణవం రామ స్సహ వానరసేనయా
ప్రతిజానామి తే సత్యం న జీవ న్ప్రతియాస్యతి. ౧౩

టీక॥సః=ఆ; రామస్తు=రాముండు మాత్రము; వానరసేనయాసహ= వానరసేనతోఁగూడ; అర్ణవం= సముద్రమును; తీర్త్వా=దాఁటి;జీవన్ = బ్రతికియున్నవాఁడై;నప్రతియాస్యతి= మఱలిపోఁడు, తే=నీకొఱకు; సత్యం= సత్యముగా;ప్రతిజానామి=ప్రతిజ్ఞ చేసెదను.

రాముండుమాత్రము, వానరసేనతోసముద్రంబుదాఁటివచ్చి , మఱలఁ బ్రాణంబుతోఁబోఁబోవుటలేదు ; ఇది వాస్తవము; సత్యముచేశపథముచేసెదను. అని,రావణుండు మాల్యవంతునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

రహస్యార్థము.—జీవన్= బ్రతికియున్నవాఁడై; ప్రతియాస్యతి= పోవును.సత్యం=సత్యము.న(సందేహః)= సందేహములేదు. తే=నీకొఱకు; ప్రతిజానామి=ప్రతిజ్ఞ చేసెదను.

రాముండువానరసేనా సమేతంబుగసముద్రంబుదాఁటివచ్చి,మఱలసుఖంబుననేపోవును; సత్యము; ఇందుకుసందేహములేదు. అని,రావణుండు మాల్యవంతునితోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఏవం బ్రువాణం సంరబ్ధం రుష్టం విజ్ఞాయ రావణమ్
వ్రీడితో మాల్యవా న్వాక్యం నోత్తరం ప్రత్యపద్యత. ౧౪

టీక॥ మాల్యవాన్ = మాల్యవంతుండు;ఏవం=ఇట్లు;బ్రువాణం = చెప్పుచున్న;సంరబ్ధం= వేగవంతుండగు; రావణం=రావణుని;రుష్టం = కోపించినవానిఁగా;విజ్ఞాయ=ఎఱింగి; వ్రీడితః=సిగ్గుపడినవాఁడై;ఉత్తరం= బదులయిన;వాక్యం=మాటను;నప్రత్యపద్యత=పొందఁడయ్యె.

మాల్యవంతుండు , ఇట్లతిసంరంభంబునం జెప్పుచున్న రావణుంజూచి యితండు కుపితుండయినాఁడని తెలిసికొని , లజ్జితుండై , బదులుచెప్పఁడయ్యె. అని, తాత్పర్యము.

స ౩౬

జయాశిషాచ రాజానం వర్ధయిత్వా యథోచితమ్
మాల్యవా నభ్యనుజ్ఞాతో జగామ స్వం నివేశనమ్. ౧౫

టీక॥ మాల్యవాన్ = మాల్యవంతుండు; యథోచితం = యథాయోగ్యముగా; జయాశిషా= "జయ" అను నాశీర్వచనముచేత; రాజానం= రాక్షసరాజుండగు రావణుని; వర్ధయిత్వాచ= దీవించియు; అభ్యనుజ్ఞాతః = అనుజ్ఞ వొందినవాఁడై; స్వం=తనదైన; నివేశనం = గృహమును; జగామ=పోందెను.

మాల్యవంతుండు, యథాయోగ్యంబుగా, రావణునకు, జయంబుగలుగునని యాశీర్వదించి , తనయింటికిం బోయెను. అని, తాత్పర్యము.

రావణస్తు సహామాత్యో మంత్రయిత్వా విమృశ్యచ
లంకాయా మతులాం గుప్తిం కారయామాస రాక్షసః. ౧౬

టీక॥ రాక్షసః = రాక్షసుఁడగు; రావణస్తు=రావణుండుమాత్రము; సహామాత్యః= మంత్రులతోఁగూడినవాఁడై; మంత్రయిత్వా=ఆలోచించి ; విమృశ్యచ = విచారించియు ; లంకాయాం=లంకాపురియందు; అతులాం= సరిలేని; గుప్తిం=రక్షణమును; కారయామాస=చేయించెను.

అంత, రావణుండు, మంత్రులతోఁగూడవిమర్శపూర్వకంబుగా నాలోచించి, లంకాపురికి, అసమానంబగుగుప్తికార్యంబుగావించెను.

అని, తాత్పర్యము.

స వ్యాదిదేశ పూర్వస్యాం ప్రహస్తం ద్వారి రాక్షసమ్
దక్షిణస్యాం మహావీర్యౌ మహాపార్శ్వ మహోదరౌ. ౧౭

టీక॥ సః=ఆరావణుండు; పూర్వస్యాం = తూర్పుదిక్కుననుండునట్టి ; ద్వారి=ద్వారమునందు; ప్రహస్తం= ప్రహస్తుండను ; రాక్షసం = రాక్షసుని; వ్యాదిదేశ=ఆజ్ఞాపించెను. దక్షిణస్యాం=దక్షిణదిక్కునందలిద్వారము

నందు; మహావీర్యా= అధికమయినపరాక్రమముగల; మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వునిమహోదరుని; వ్యాదిదేశ(అధ్యాహృతము) = ఆజ్ఞాపించెను.

ఆరావణుండు, తూర్పువాకిలియందు బ్రహస్తుంగాచియుండ నాజ్ఞాపించెను; దక్షిణపువాకిలియందు, మహాపరాక్రమశాలులగు మహోదర మహాపార్శ్వులనుండ నానతిచ్చెను.

అని, తాత్పర్యము.

పశ్చిమాయా మధో ద్వారి పుత్ర మింద్రజితం తథా
వ్యాదిదేశ మహామాయం బహుభీ రాక్షసై ర్వృతమ్. ౧౮

టీక॥ అథో=అంత;తథా=అట్లు; పశ్చిమాయాం = పడమటనుండునట్టి; ద్వారి=వాకిలియందు;మహామాయం= అధికమయినమాయగలవాఁడును; బహుభిః=పెక్కండ్రయిన; రాక్షసైః= రాక్షసులచేత; వృతం=చుట్టఁబడినవాడును; పుత్రం=కొడుకునగు ; ఇంద్రజితం=ఇంద్రజిత్తును; వ్యాదిదేశ= ఆజ్ఞాపించెను.

పశ్చిమద్వారంబున , మహామాయుండును అనేకరాక్షస పరివేష్టితుండునగుతనకొడుకు నింద్రజిత్తునుగావలియుండనాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఉత్తరస్యాం పుర ద్వారి వ్యాదిశ్య శుకసారణౌ
స్వయం చాత్ర భవిష్యామి మంత్రిణ స్తా నువాచ హ. ౧౯

టీక॥సః(అధ్యాహృతము)= ఆరావణుఁడు;ఉత్తరస్యాం = ఉత్తరపుదిక్కునసుండునట్టి;పురద్వారి = పట్టణద్వారమునందు; శుకసారణౌ= శుకసారణులను;వ్యాదిశ్య=ఆజ్ఞాపించి; అత్ర=ఈయుత్తరద్వారమునందు; స్వయంచ=నేనును;భవిష్యామి = ఉండెదను. ఇతి(అధ్యాహృతము) = అని; తాన్=ఆ;మంత్రిణః= మంత్రులనుగూర్చి;ఉవాచ=చెప్పెను("హ"అనునది పాదపూరణార్థము).

ఆరావణుండు,ఉత్తరదిక్కునందలి

ద్వారంబునందు, శుకసారణులనుండు(డనియాజ్ఞాపించి తాను ను అచ్చటనుండెదనని, మంత్రులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

రాక్షసంతు విరూపాక్షం మహావీర్యపరాక్రమమ్
మధ్యమే స్థాపయ ద్గుల్మే బహుభి స్సహ రాక్షసైః. ౨౦

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ రావణుండు; మధ్యమే=నడిమిదైన; గుల్మే=సేనాప్రదేశమునందు ; మహావీర్యపరాక్రమం = అధికమయినబలమునుబరాక్రమమునుగల; విరూపాక్షం= విరూపాక్షుఁడను; రాక్షసంతు = రాక్షసుని; బహుభిః= పెక్కండ్రయిన; రాక్షసైస్సహ=రాక్షసులతోఁగూడ ; అస్థాపయత్ =ఉంచెను.

అట్లుపట్టణమధ్యంబున , మహాబలపరాక్రమశాలియగువిరూపాక్షుండను రాక్షసుని బహురాక్షససమేతంబుగానుంచెను. అసి, తాత్పర్యము.

ఏవం విధానం లంకాయాః కృత్వా రాక్షసపుంగవః
కృతకృత్య మివాఽఽత్మానం మన్యతే కాలచోదితః. ౨౧

టీక॥ రాక్షసపుంగవః = రాక్షసశ్రేష్ఠుండగురావణుండు; ఏవం=ఇట్లు; లంకాయాః = లంకాపురికి ; విధానం= ఏర్పాటును; కృత్వా=చేసి; కాలచోదితః=మృత్యుప్రేరితుఁడై; ఆత్మానం=తన్ను; కృతకృత్యమివ=కృతార్థునివలె; మన్యతే= తలంచుచున్నాఁడు.

రాక్షసశ్రేష్ఠుండగు రావణుండు, ఇట్లు, లంకాపురికి గుప్తికమ్ముసంవిధానంబుగావించి, మృత్యుచోదితుండై , తానంతవఱకుఁగృతార్థుఁడైనట్లు, తలంచుకొనియుండెను.

అని, తాత్పర్యము.

విసర్జయామాస తత స్సమంత్రిణో
విధాన మాజ్ఞాప్య పురస్య పుష్కలమ్

స ౩౬

జయాశిషా మంత్రిగణేన పూజితో
వివేశ చాంతః పుర మృద్ధిమ న్మహత్. ౨౨

టీక॥ సః=ఆరావణుఁడు; పురస్య=పట్టణమునకు; పుష్కలం = సమగ్రమయిన; విధానం = రక్షణకార్యమును; ఆజ్ఞాప్య=ఆజ్ఞాపించి; తతః = అంత; మంత్రిణః= మంత్రులను; విసర్జయామాస=విడిచెను. మంత్రిగణేన= మంత్రిసమూహముచేత ; జయాశిషా "జయింపు" మనునాశీర్వచనముచేత; పూజితః = పూజింపఁబడినవాఁడై; ఋద్ధిమత్ = సంపదగలదియు; మహత్=గొప్పదియునగు; అంతఃపురంచ= అంతఃపురమును; వివేశ=ప్రవేశించెను.

అంతనారావణుండు , లంకానగరంబునకుసమగ్రంబుగారక్షణసంవిధానంబుసేయనాజ్ఞాపించి , మంత్రులకు సెలవీయ, వారలు "జయజయ" యని రావణునకాశీర్వాదంబునొసంగి , తమయిండ్లకుంబోయిరి; రావణుండును , నానావిధలక్ష్మీ విరాజమానంబగు నంతఃపురంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే , షట్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు , యుద్ధకాండషట్త్రింశసర్గటీక,
ముగిసినది.



శ్రీః

## సప్తత్రింశ సర్గ ప్రారంభః.

నరవానరరాజౌ తౌ సచ వాయు సుతః కపిః
జాంబవా నృక్షరాజశ్చ రాక్షసశ్చ విభీషణః. ౧
అంగదో వాలిపుత్రశ్చ సౌమిత్రి శ్శరభః కపిః
సుషేణ స్సహదాయాదో మైందో ద్వివిద ఏవచ. ౨
గజో గవాక్షః కుముదో నలోథ పనసస్తథా
అమిత్ర విషయం ప్రాప్తా స్సమవేతా స్సమర్థయన్. ౩

టీక॥తౌ=ఆ; నరవానరరాజౌ = మానుషేశ్వరుండగు రాముండును వానరేశ్వరుండగు సుగ్రీవుండును; సః=ఆ; వాయుసుతః= వాయుపుకొడుకైన ; కపిశ్చ=హనుమంతుండును; ఋక్షరాజః=ఎలుఁగుగొడ్డులకు రాజయిన; జాంబవాంశ్చ=జాంబవంతుండును ; రాక్షసః=రాక్షసుండయిన; విభీషణశ్చ= విభీషణుండును ; వాలిపుత్రః= వాలికొడుకైన; అంగదశ్చ= అంగదుండును; సౌమిత్రిః=లక్ష్మణుండును; శరభః = శరభుండను ; కపిః=వానరుండును;సహదాయాదః= బంధువులతోఁగూడిన; సుషేణః=సుషేణుండును; మైందః = మైందుండును;ద్వివిదఏవచ= ద్వివిదుండును; గజః=గజుండును; గవాక్షః = గవాక్షుండును; కుముదః=కుముదుండును; నలః=నలుండును;అథ=ఇంక; పనసః=పనసుండును; తథా=అట్లు; అమిత్రవిషయం = శత్రుదేశమును; ప్రాప్తాః = పొందినవారలయి ; సమవేతాః=చేరినవారలయి; సమర్థయన్= ఆలోచించిరి.

రామలక్ష్మణులును వానరరాజుండగు సుగ్రీవుండును వాయు పుత్రుండగు హనుమంతుఁడును ఋక్ష రాజుండగు జాంబవంతుండును విభీషణుండును వాలి కుమారుండగు నంగదుండును శరభుండును బంధు సహితుండగు సుషేణుండును మైందుండును ద్వివిదుండును గజుండును గవాక్షుండును గుముదుండునునలుండును బనసుండునువీరలుము

న్నగువానరవీరులు లంకాద్వీపంబుఁజేరి నపిమ్మట, నందఱుంగూడియిట్లని యాలోచించిరి. అని, తాత్పర్యము.

ఇయం సా లక్ష్యతే లంకా పురీ రావణపాలితా
సాసురోరగగంధర్వై రమరైరపి దుర్జయా. ౪

టీక॥ రావణపాలితా= రావణునిచేఁబాలింపఁబడిన; ఇయం=ఈ; సా= ఆ; లంకా=లంకాపురి; లక్ష్యతే=చూడఁబడుచున్నది. సా=ఆలంక; అసురోరగగంధర్వైః = అసురులచేతనుసర్పములచేతను గంధర్వులచేతను ; అమరైరపి=దేవతలచేతను; దుర్జయా= జయింపనలవిగానిది.

ఇదిగో, రావణబాహుపాలితంబగులంకాపురియగపడుచున్నది , ఆపట్టణము, సురాసురోరగగంధర్వులకైననుజయింపనలవిగానిది.

అని, తాత్పర్యము.

కార్యసిద్ధిం పురస్కృత్య మంత్రయధ్వం వినిర్ణయే
నిత్యం సన్నిహితో హ్యత్ర రావణో రాక్షసాధిపః. ౫

టీక॥ అత్ర=ఈలంకాపురియందు; రాక్షసాధిపః= రాక్షసులకుఁబ్రభుండగు; రావణః=రావణుఁడు; నిత్యం =ఎల్లప్పుడును; సన్నిహితోహి= ఉన్నాఁడుగదా! కార్యసిద్ధిం= కార్యముయొక్క సిద్ధించుటను; పురస్కృత్య= ముందిడుకొని; వినిర్ణయే=నిశ్చయనిమిత్తము; మంత్రయధ్వం = ఆలోచింపుఁడు.

ఇందు , రాక్షసేశ్వరుండగురావణుండు విడువక సన్నిహితుండై యున్నాఁడు; కాఁబట్టి,మనకుం గార్యసిద్ధియగునట్లు , చక్కఁగా నాలోచింపుఁడు. అని, తాత్పర్యము.

తథా తేషు బ్రువాణేషు రావణావరజోఽబ్రవీత్
వాక్య మగ్రామ్యపదవ త్పుష్కలార్థం విభీషణః. ౬

టీక॥ తథా=అట్లు; తేషు = వారలు; బ్రువాణేషు=చెప్పుచుండఁగా; రావ

| | |
|---|---|
| నౌవరజః= రావణునితమ్ముఁడయిన; విభీషణః=విభీషణుఁడు; అగ్రామ్యపదవత్= గ్రామ్యములుగానిపదములుగలదియు;పుష్కలార్థం= అధికమయినయర్థముగలదియునగు ; వాక్యం = మాటను;అబ్రవీత్=చెప్పెను. | అట్లు , వారలందఱుమాటలాడుచుండఁగా , రావణునితమ్ముండగువిభీషణుండు,వారలంజూచి, యగ్రామ్యంబులగుపదంబులుగలదియునధికార్థంబునగునీమాటంజెప్పెను. అని,తాత్పర్యము. |

అనల శ్శరభ శ్చైవ సంపాతిః ప్రఘస స్తథా
గత్వా లంకాం మమామాత్యాః పురీం పున రిహాగతాః. ౭

| | |
|---|---|
| టీక॥ మమ=నాయొక్క ; అమాత్యాః=మంత్రులయిన; అనలః = అనలుండును;శరభశ్చైవ = శరభుండును;సంపాతిః= సంపాతియును ; తథా=అట్లు;ప్రఘసః= ప్రఘసుండును; లంకాం=లంకయను ; పురీం= పట్టణమునుగూర్చి ; గత్వా=పోయి; పునః=మఱల;ఇహ=ఇచ్చటికి;ఆగతాః=వచ్చినారు. | నామంత్రులయిన యనలశరభసంపాతిప్రఘసులునల్వురును, ఇప్పుడులంకాపురికింబోయి,చూచివచ్చినారు. అని, తాత్పర్యము. |

భూత్వా శకునయ స్సర్వే ప్రవిష్టాశ్చ రిపో ర్బలమ్
విధానం విహితం యచ్చ తద్దృష్ట్వా సముపాగతాః. ౮

| | |
|---|---|
| టీ॥ తే(అధ్యాహృతము)=ఆమంత్రులు; సర్వే=అందఱును;శకునయః= పక్షులు; భూత్వా=అయి;రిపోః= శత్రువుయొక్క;బలం=సైన్యమును;ప్రవిష్టాశ్చ=ప్రవేశించినవారలునై; యత్=ఏ; విధానం=ఏపాటు;విహితం= చేయఁబడినదో;తత్=దానిని;దృష్ట్వా= చూచి; సముపాగతాః=వచ్చినారు. | ఆయనలశరభసంపాతి ప్రఘసులు, అందఱు,పక్షిరూపంబుదాల్చి,శత్రుసైన్యంబులుచొచ్చి, యందుఁ జేయఁబడియుండునేపాటులన్నియుం జూచివచ్చినారు. అని, తాత్పర్యము. |

సంవిధానం యదా హుస్తే రావణస్య దురాత్మనః
రామ తద్బ్రువత స్సర్వం యథా తత్త్వేన మే శృణు. ౯

టీక॥ రామ=రాముఁడా! తే=ఆయనలశరభసంపాతిప్రఘసులు; యత్=ఏ; దురాత్మనః=దుష్టబుద్ధిగల; రావణస్య=రావణునియొక్క; సంవిధానం=ఏపాటును; ఆహుః=చెప్పుచున్నారో; తత్=దానిని; సర్వం=అంతయు; యథాతత్త్వేన=యాథార్థ్యముచేత; బ్రువతః=చెప్పుచున్న; మే(మత్)=నావలన; శృణు=వినుము.

రాముఁడా! వారలు, దురాత్ముండగు రావణునిరక్షణసంవిధానం బంతయుఁజెప్పినారు; ఆసంగతియంతయుం జెప్పెదనువినుము. అని, తాత్పర్యము.

పూర్వం ప్రహస్త స్సబలో ద్వార మాసాద్య తిష్ఠతి
దక్షిణంచ మహావీర్యౌ మహాపార్శ్వమహోదరౌ. ౧౦

టీక॥ ప్రహస్తః=ప్రహస్తుఁడు; సబలః=సైన్యముతోఁగూడినవాఁడై; పూర్వం=తూర్పుదిక్కునందలి; ద్వారం=వాకిలిని; ఆసాద్య=పొంది; తిష్ఠతి=ఉన్నాఁడు. దక్షిణంచ=దక్షిణపువాకిలిని; మహావీర్యౌ=అధికమయినపరాక్రమముగల; మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వుండును మహోదరుండును; ఆసాద్యతిష్ఠతః(అధ్యాహృతము)=పొందియున్నారు.

ప్రహస్తుండు సైన్యసమేతుండై తూర్పుద్వారంబుననున్నాఁడు; మహాపరాక్రమశాలులగు మహోదర మహాపార్శ్వులు, దక్షిణద్వారంబునం గాచియున్నారు. అని, తాత్పర్యము.

ఇంద్రజి త్పశ్చిమద్వారం రాక్షసై ర్బహుభి ర్వృతః
పట్టిసాసిధను ష్మద్భి శ్శూలముద్గరపాణిభిః. ౧౧
నానాప్రహరణై శ్శూరై రావృతో రావణాత్మజః

టీక॥ రావణాత్మజః=రావణునికొడుకైన; ఇంద్రజిత్=ఇంద్రజిత్తు; పట్టిసాసిధనుష్మద్భిః=అడ్డకత్తులును ఖడ్గములును ధనుస్సులునుగలవారలును; శూ

లముద్గరపాణిభిః = శూలములును ఇనుపగుదియలును జేతులంగలవారలు నగు; రాక్షసైః = ప్రధానరాక్షసుల చేత; బహుభిః = పెక్కండ్ర చేత; వృతః = చుట్టబఁడినవాఁడై; నానాప్రహరణైః = నానావిధములయిన యాయుధములు గలవారలును; శూరైః = యుద్ధమునందు భయములేనివారలునగు రాక్షసుల చేత; ఆవృతః = చుట్టఁబడినవాఁడై; పశ్చిమద్వారం = పడమటివాకిలిని; ఆసాద్యాతిష్ఠతి (అధ్యాహృతము) = పొందియున్నాఁడు.

రావణపుత్రుండగు నింద్రజిత్తు, అడ్డకత్తి ఖడ్గము ధనుస్సు శూలము ముద్గరము మొదలగు నాయుధములం దాల్చిన ప్రధానరాక్షసుల పెక్కండ్రతోను నానావిధాయుధపాణులును శూరులు నగు రాక్షసభటులతోనుం గూడి, పశ్చిమద్వారంబున నున్నాఁడు.

అని, తాత్పర్యము.

రాక్షసానాం సహస్రైస్తు బహుభి శ్శస్త్రపాణిభిః. ౧౨
యుక్తః పర మసంవిగ్నో రాక్షసై ర్బహుభి ర్వృతః
ఉత్తరం నగరద్వారం రావణ స్స్వయ మాస్థితః. ౧౩

టీక॥ రావణః = రావణుఁడు; పరం = మిక్కిలియు; అసంవిగ్నః = నిర్భయుఁడై; శస్త్రపాణిభిః = ఆయుధములుచేతులంగల; బహుభిః = పెక్కులయిన; రాక్షసానాం = రాక్షసులయొక్క; సహస్రైస్తు = వేలతోను; యుక్తః = కూడినవాఁడై; బహుభిః = పెక్కండ్రయిన; రాక్షసైః = ప్రధానరాక్షసుల చేత; వృతః = చుట్టఁబడినవాఁడై; స్వయం = తానె; ఉత్తరం = ఉత్తరదిక్కునందున్న; నగరద్వారం = పట్టణద్వారమును; ఆస్థితః = అధిష్ఠించినాఁడు.

రావణుండు, నిర్భయుండై, యాయాయుధపాణులగు పెక్కువేల రాక్షసభటులును, పెక్కండ్రు ప్రధానరాక్షసులునుం గొలువఁ, దానె లంకయుత్తరద్వారంబున నున్నాఁడు. అని, తాత్పర్యము.

విరూపాక్షస్తు మహతా శూలఖడ్గధనుష్మతా
బలేన రాక్షసై స్సార్ధం మధ్యమం గుల్మ మాస్థితః. ౧౪




టీక॥ విరూపాక్షస్తు = విరూపాక్షుండును; మహతా=గొప్పదగు;శూలఖడ్గధనుష్మతా = శూలములునుఖడ్గములునుధనుస్సులునుగల ; బలేన=సైన్యముతో; రాక్షసైస్సార్థం = ప్రధానరాక్షసులతోఁగూడ; మధ్యమం=నడిమిదైన; గుల్మం= సేనాప్రదేశమును; ఆస్థితః=అధిష్ఠించినాఁడు.

విరూపాక్షుండు , శూలంబులును ఖడ్గంబులునుధనుస్సులును ధరించియుండుగొప్పసైన్యంబుతోఁగూడి , పెక్కురాక్షసులుగొలువ , మధ్యమగుల్మంబుననున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఏతా న్నేవంవిధాన్ గుల్మాన్ లంకాయాం సముదీక్ష్య తే
మామకా స్సచివా స్సర్వే పున శ్శీఘ్ర మిహాగతాః. ౧౫

టీక॥ మామకాః=నావారలయిన; తే=ఆ; సచివాః=మంత్రులు;సర్వే=అందఱును; లంకాయాం = లంకయందు; ఏతాన్=ఈ; ఏవంవిధాన్ = ఇట్టి; గుల్మాన్=సేనలను;సముదీక్ష్య = చూచి; పునః=మఱల; శీఘ్రం= శీఘ్రముగా; ఇహ=ఇచ్చటికి; ఆగతాః = వచ్చినారు.

నామంత్రులు , అనలశరభసంపాతిప్రఘసులు, లంకయందు, ఇట్లుసంవిధానంబునొందియున్నసేనలంజూచి , మఱలశీఘ్రంబుననిచ్చటికివచ్చినారు.

అని, తాత్పర్యము.

గజానాంచ సహస్రంచ రథానా మయుతం పురే
హయానా మయుతే ద్వేచ సాగ్రకోటీచ రక్షసామ్. ౧౬
విక్రాంతా బలవంత శ్చ సంయుగే ష్వాతతాయినః
ఇష్టా రాక్షసరాజస్య నిత్య మేతే నిశాచరాః. ౧౭

టీక॥ పురే=లంకాపట్టణమునందు; గజానాం= ఏనుంగులయొక్క; సహస్రంచ=వేయియును; రథానాం= రథములయొక్క; అయుతం= పదివేలును; హయానాం=గుఱ్ఱములయొక్క ; ద్వే=రెండైన; అయుతేచ= పదివేలును, ఇరువదివేలుననుట; రక్షసాం=రాక్షసులయొక్క; సాగ్రకోటీచ=సమగ్ర




మయిన కోటియు ; విక్రాంతాః = పరాక్రమించినవారలును ; బలవంతశ్చ=అధికమయినబలముగలవారలును; సంయుగేషు=యుద్ధములందు; ఆతతాయినః=క్రూరులునగు; ఏతే=ఈ; నిశాచరాః=రాక్షసులు; నిత్యం= ఎల్లప్పుడును; రాక్షసరాజస్య= రాక్షసేశ్వరుండగు రావణునకు; ఇష్టాః = ప్రియులు.

గజయోధులు వేవురును, రథికులు పదివేవురును, గుఱ్ఱపువారలిరువది వేవురును, కాల్బురుకోటిమందియు, బరాక్రమవంతులును బలవంతులును యుద్ధంబులం గ్రూరులునగు నీరాక్షసులు, రాక్షసరాజుండగు రావణున కెల్లప్పుడును సమీపంబుననుండి సేవసేయుచుఁ బ్రియులై యుండువారలు.

అని, తాత్పర్యము.

ఏకైకస్యాత్ర యుద్ధార్థే రాక్షసస్య విశాంపతే
పరివార స్సహస్రాణాం సహస్ర ముపతిష్ఠతే. ౧౭

టీక॥విశాం=మనుష్యులకు; పతే=ప్రభువయిన రామునఁడా! అత్ర= ఈరాక్షసులయందు; ఏకైకస్య=ఒక్కొక; రాక్షసస్య= రాక్షసునియొక్కయు; యుద్ధార్థే=యుద్ధమునిమిత్తమయి; పరివారః=పరిజనము;సహస్రాణాం= వేలయొక్క, సహస్రం=వేయి, పదిలక్షలనుట;ఉపతిష్ఠతే=ఉన్నది.

నరేంద్రుండవగు రామునఁడా! ఈరాక్షసులలో నొక్కొక రాక్షసునకు, యుద్ధము కొఱకుఁ బదిలక్షలరాక్షసులు పరిజనులున్నారు. అని,విభీషణుండు, రామునకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏతాం ప్రవృత్తిం లంకాయాం మంత్రిప్రోక్తాం విభీషణః
ఏవ ముక్త్వా మహాబాహూ రాక్షసాం స్తా నదర్శయత్. ౧౮

టీక॥మహాబాహుః= పెద్దచేతులుగల; విభీషణః=విభీషణుఁడు; మంత్రిప్రోక్తాం=మంత్రులచేఁ జెప్పఁబడిన;లంకాయాం=లంకయందు (గల);ఏతాం=ఈ;ప్రవృత్తిం=సమాచారమును;ఏవం=ఇట్లు;ఉక్త్వా=చెప్పి; తాన్=ఆ; రాక్ష

సాన్=రాక్షసులను; అదర్శయత్=చూపెను.

మహాబాహుండగువిభీషణుండు; తనకుమంత్రులుచెప్పినలంకా వృత్తాంతమంతయు రామునకుఁజెప్పి, యంతనా మంత్రులంజూపెను. అని, తాత్పర్యము.

లంకాయాం సచివై స్సర్వాం రామాయ ప్రత్యవేదయత్

టీక॥సః(అధ్యాహృతము)= ఆవిభీషణుఁడు; సచివైః=మంత్రులచేత; లంకాయాం=లంకయందుఁ ( గల ); సర్వాం=అంతసమాచారమును; రామాయ=రామునికొఱకు ; ప్రత్యవేదయత్=చెప్పించెను.

అంత, నవ్విభీషణుండు; తనమంత్రులచేతనుంగూడనాలంకావృత్తాంతమంతయు రామునియెదుటఁజెప్పించెను.

అని, తాత్పర్యము.

రామం కమలపత్రాక్ష మిద ముత్తర మబ్రవీత్. ౨౦
రావణావరజ శ్శ్రీమాన్ రామప్రియ చికీర్షయా

టీక॥శ్రీమాన్=అధికమయిన కాంతిగల; రావణావరజః=రావణుని తమ్ముండగువిభీషణుఁడు ; రామప్రియచికీర్షయా=రామునకుఁబ్రియంబు సేయనిచ్ఛచేత ; కమలపత్రాక్షం= తామరపూరేకులవంటి కండ్లుగల ; రామం=రామునిగూర్చి; ఇదం=ఈ ; ఉత్తరం=పైఁజెప్పవలసినమాటను; అబ్రవీత్=చెప్పెను.

మఱల, శ్రీమంతుండగురావణానుజుండు, విభీషణుండు, తామరపూరేకులంబోలెవిశాలసుందరంబులగు నేత్రంబులుగలరాముంజూచి, యాపైఁజెప్పవలసినమాటనిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

కుబేరంతు యదా రామ రావణః ప్రత్యయుధ్యత. ౨౧
షష్టి శ్శతసహస్రాణి తదా నిర్యాంతి రాక్షసాః
పరాక్రమేణ వీర్యేణ తేజసా సత్త్వగౌరవాత్. ౨౨
సదృశా య్యేత్ర దర్పేణ రావణస్య దురాత్మనః

టీక॥రామ= రామునఁడా ! రావణః=రావణుఁడు;యదా=ఎప్పుడు; కుబేరంతం=కుబేరునిగూర్చియు; ప్రత్యయుధ్యత=యుద్ధముచేసెనో; తదా= అప్పుడు; అత్ర = ఈరాక్షసులందు; యే=ఏరాక్షసులు;పరాక్రమేణ = పరాక్రమముచేతను;వీర్యేణ= బలముచేత; తేజసా=కాంతిచేతను ; సత్త్వగౌరవాత్ =ధైర్యాతిశయమువలనను; దర్పేణ=గర్వముచేతను;దురాత్మనః= దుష్టబుద్ధిగల;రావణస్య= రావణునికి; సదృశాః = సమానులో; తే (అధ్యాహృతము)= అట్టి;రాక్షసాః= రాక్షసులు ; షష్టిః=అఱువది; శతసహస్రాణి = లక్షలు;నిర్యాంతి=బయలువెడలిరి.

రామునఁడా! మున్నురావణుండు, కుబేరునితో యుద్ధముసేయఁబోయినప్పుడు,పరాక్రమంబునను బలంబునను తేజంబునను ధైర్యంబునను దర్పంబునను దురాత్ముండగు రావణునకు సమానులయిన రాక్షసులఱువదిలక్షలమంది పోయిరి. అని,తాత్పర్యము.

అత్ర మన్యుర్నకర్తవ్యో రోషయే త్వాం నభీషయే. ౨౩
సమర్థో హ్యసి వీర్యేణ సురాణామపి నిగ్రహే

టీక॥అత్ర=ఈవిషయమునందు; మన్యుః= కోపము;నకర్తవ్యః=చేయఁబడవలసినదికాదు. త్వాం=నిన్ను ; రోషయే= కోపమునొందించుచున్నాను. నభీషయే = భయమునొందింపలేదు. త్వం (అధ్యాహృతము)= నీవు; వీర్యేణ = పరాక్రమముచేత; సురాణామపి=దేవతలయొక్కయు; నిగ్రహేపి= నిగ్రహించుటయందును; సమర్థః=సమర్థుఁడవు; అసిహి=అగుచున్నావుగదా!

ఈవిషయమునందు నామీఁదఁగోపముసేయవలదు; నీకురోషముగలుగుటకుఁజెప్పుచున్నానుగానిభయముగలుగుటకుఁగాదు; నీవుపరాక్రమంబునదేవతలనైననునిగ్రహింపఁజాలినవాఁడవు.
అని,తాత్పర్యము.

తద్భవాం శ్చతురంగేణ బలేన మహతా వృతః. ౨౪
వ్యూహ్యే దం వానరానీకం నిమర్ధిష్యసి రావణమ్

టీక॥ తత్ = అందువలన; భవాన్ = నీవు; చతురంగేణ = నాలుగంగములుగల; మహతా = గొప్పదగు; బలేన = సైన్యముచేత; వృతః = చుట్టఁబడినవాఁడవు. ఇదం = ఈ; వానరానీకం = వానరసైన్యమును; వ్యూహ్య = వ్యూహములుగాఁదీర్చి; రావణం = రావణుని; నిమథిష్యసి = మథింపఁగలవు.

నీవును, అనంతంబగుచతురంగబలంబుతోఁగూడియున్నావు; కావున, నీవానరసైన్యమును ఉచిత వ్యూహంబులంబన్ని, రావణుంబరిమార్పుము. అని విభీషణుండు, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

రావణావరజే వాక్య మేవం బ్రువతి రాఘవః। ౨౫
శత్రూణాం ప్రతిఘాతార్థ మిదం వచన మబ్రవీత్

టీక॥ రావణావరజే = రావణునితమ్ముఁడగువిభీషణుఁడు; ఏవం = ఇట్లు; బ్రువతి = చెప్పుచుండఁగా; రాఘవః = రాముఁడు; శత్రూణాం = శత్రువులయొక్క; ప్రతిఘాతార్థం = చంపుటకొఱకు; ఇదం = ఈ; వచనం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

రావణునితమ్ముండగువిభీషణుండు, ఈప్రకారంబునం జెప్పుచుండగానే, రాముండు, శత్రువధంబుఁబొంటె, నిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

పూర్వద్వారేతు లంకాయా నీలో వానరపుంగవః। ౨౬
ప్రహస్తప్రతియోద్ధా స్యా ద్వానరై ర్బహుభి ర్వృతః

టీక॥ వానరపుంగవః = వానరశ్రేష్ఠుఁడగు; నీలః = నీలుండు; బహుభిః = పెక్కండ్రయిన; వానరైః = వానరులచేత; వృతః = చుట్టఁబడినవాఁడై; లంకాయాః = లంకాపురియొక్క; పూర్వద్వారేతు = తూర్పువాకిలియందు; ప్రహస్తప్రతియోద్ధా = ప్రహస్తునితోయుద్ధముసేయువాఁడు; స్యాత్ = అగును.

వానరశ్రేష్ఠుండగునీలుండు, పెక్కండ్ర వానరులంగూడి, లంకతూర్పువాకిలియందుండి, ప్రహస్తునకుయుద్ధంబొసంగును. అని, తాత్పర్యము.

అంగదో వాలిపుత్రస్తు బలేన మహతావృతః. ౨౭
దక్షిణే బాధతాం ద్వారే మహాపార్శ్వమహోదరౌ

టీక॥ వాలిపుత్రః=వాలికుమారుండగు; అంగదస్తు=అంగదుండును; మహతా=గొప్పదగు; బలేన= సైన్యముచేత; వృతః = చుట్టఁబడినవాఁడై; దక్షిణే=దక్షిణపుదిక్కునందున్న; ద్వారే= వాకిలియందు; మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వుని మహోదరుని ; బాధతాం=బాధించుఁగాక.

వాలికుమారుండగు నంగదుండు , గొప్పసైన్యంబుఁగూడి, దక్షిణద్వారంబుననుండి, మహాపార్శ్వమహోదరులతో యుద్ధంబుసేయుఁగాక.

అని, తాత్పర్యము.

హనుమాన్ పశ్చిమద్వారం నిపీడ్య పవనాత్మజః. ౨౮
ప్రవిశత్వప్రమేయాత్మా బహుభిః కపిభిర్వృతః

టీక॥ అప్రమేయాత్మా= కొలఁదిలేనిబలముగల; పవనాత్మజః= వాయుకుమారుండగు; హనుమాన్= హనుమంతుఁడు; బహుభిః= పెక్కండ్రయిన; కపిభిః=వానరులచేత; వృతః= చుట్టఁబడినవాఁడై; పశ్చిమద్వారం= పడమటివాకిలిని; నిపీడ్య= పీడించి; ప్రవిశతు=ప్రవేశించుఁగాక.

అప్రమేయబలసమన్వితుండగు వాయుపుత్రుండయిన హనుమంతుండు, పశ్చిమద్వారంబుననుండి, యుద్ధము చేయుఁగాక. అని, తాత్పర్యము.

దైత్యదానవసంఘానా మృషీణాంచ మహాత్మనామ్. ౨౯
విప్రకారప్రియః క్షుద్రో వరదానబలాన్వితః
పరిక్రామతి యస్సర్వాన్ లోకాన్ సంతాపయన్ప్రజాః. ౩౦
తస్యాఽహం రాక్షసేంద్రస్య స్వయమేవ వధే ధృతః

టీక॥ యః=ఎవ్వఁడు; దైత్యదానవసంఘానాం=దైత్యులయొక్కయు దానవులయొక్కయు సమూహములకును; మహాత్మనాం=పూజ్యమయిన స్వభావ

ముగల; ఋషీణాంచ=ఋషులకును; విప్రకారప్రియః= అపకారమునందుఁ బ్రీతిగలవాఁడై; క్షుద్రః=దుష్టుఁడై;వరదానబలాన్వితః=వరదానముచేఁ గలిగినబలముతోఁగూడినవాఁడై; ప్రజాః=ప్రజలను;సంతాపయన్= తపింపఁజేయుచు;సర్వాన్= సమస్తములయిన; లోకాన్=లోకములను; పరిక్రామతి=సంచరించుచున్నాఁడో; తస్య= అట్టి; రాక్షసేంద్రస్య= రాక్షసేశ్వరుండగు రావణునియొక్క;వధే= చంపుటయం దు;అహం= నేను;స్వయమేవ=నేనే;ధృతః=నిశ్చయించినాను.

ఎవ్వఁడు దైత్యులకును దానవులకును మహాత్ములగుఋషులకును అపకారము సేయుచుక్షుద్రవృత్తినవలంబించి వరబలగర్వితుండై, జనులంబీడించుచు, సమస్తలోకంబులందిరుగుచున్నాఁడో, అట్టి రాక్షసరాజుండగురావణుని , నేనెవధింపనిశ్చయించినాను.

అని, తాత్పర్యము.

ఉత్తరం నగరద్వార మహం సౌమిత్రిణా సహ. ౩౧
నిపీడ్యాభి ప్రవేక్ష్యామి సబలో యత్ర రావణః

టీక॥అహం=నేను; సౌమిత్రిణాసహ=లక్ష్మణునితోఁగూడ;యత్ర=ఎచ్చట;సబలః=సైన్యముతోఁగూడిన; రావణః=రావణుఁడు; వర్తతే ( అధ్యాహృతము)=ఉన్నాఁడో;తత్ (అధ్యాహృతము)=అట్టి;ఉత్తరం = ఉత్తరదిక్కునందున్న;నగరద్వారం = పట్టణద్వారమును; నిపీడ్య=పీడించి; అభిప్రవేక్ష్యామి=చొచ్చెదను.

అట్టిరావణుండు సైన్య సమేతుండై యెచ్చటనున్నాఁడో ,ఆయుత్తరద్వారంబున,నేనునులక్ష్మణుండును, ఉండి, యుద్ధముగావించెదము.

అని, తాత్పర్యము.

వానరేంద్రశ్చ బలవా నృక్షరాజశ్చ వీర్యవాన్. ౩౨
రాక్షసేంద్రా నుజశ్చైవ గుల్మో భవతు మధ్యమః

టీక॥ బలవాన్= అధికమయినబలముగల;వానరేంద్రశ్చ= వానరరాజుండగుసుగ్రీవుండును;వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగల ; ఋక్షరాజ

శ్చ= ఎలుఁగుగొడ్డులరాజయినజాంబవంతుఁడును; రాక్షసేంద్రానుజశ్చైవ = రాక్షసరాజుండగు రావణునితమ్ముఁడయినవిభీషణుండును; మధ్యమః= నడిమిదైన; గుల్మః = సైన్యము ; భవతు=అగుఁగాక.

బలవంతుండగుసుగ్రీవుండును మహాపరాక్రమశాలియగు జాంబవంతుండును రావణానుజుండగువిభీషణుండును , మధ్యమగుల్మంబునలంకరింతురుగాక.

అని, తాత్పర్యము.

నచైవం మానుషం రూపం కార్యం హరిభి రాహవే. ౩౩

టీక॥ హరిభిః=వానరులచేత; ఆహవే=యుద్ధమునందు; ఏవం=ఇట్లు; మానుషం=మనుష్యసంబంధియగు ; రూపం-రూపము; కార్యంచ= చేయఁదగినదియుఁగాదు.

వానరులు, ఇప్పుడుండునట్లు, యుద్ధంబునందు, మనుష్యరూపంబుధరించియుండరాదు. అని, తాత్పర్యము.

ఏషా భవతు సంజ్ఞా నో యుద్ధేఽస్మిన్ వానరే బలే
వానరా ఏవ న శ్చిహ్నం స్వజనే స్మిన్ భవిష్యతి. ౩౪

టీ॥ యుద్ధే=యుద్ధమునందు; అస్మిన్= ఈ; వానరే=వానరసంబంధియగు; బలే= సేనయందు; ఏషా=ఈ; సంజ్ఞా= గుఱుతు; భవతు=ఉండుఁగాక. స్వజనే=మనజనమునందు ; వానరాఏవ= వానరులె; నః= మనకు; చిహ్నం= గుఱుతు; భవిష్యతి=కాఁగలదు.

యుద్ధమునందు, మనవానరసైన్యంబునందీసంకేతముండవలయును ; మనజనముఅని తెలియుటకుమనకువానరులె గుఱుతుగనుందురుగాక.

అని, తాత్పర్యము.

వయంతు మానుషేణైవ సప్తయోత్స్యామహే పరాన్
అహ మేవ సహభ్రాత్రా లక్ష్మణేన మహౌజసా. ౩౫

ఆత్మనా పంచమశ్చాయం సఖా మమ విభీషణః

టీక॥ మహౌజసా= అధికమయిన పరాక్రమముగల; భ్రాత్రా= తమ్ముఁడయిన; లక్ష్మణేనసహ= లక్ష్మణునితోఁగూడ; ఏషః=ఈ, అహం= నేనును; ఆత్మనా=తనచేత; పంచమః=ఐదవవాఁడైన; మమ=నాయొక్క; సఖా=స్నేహితుఁడైన; అయం=ఈ; విభీషణశ్చ= విభీషణుఁడును; వయం = మేము; సప్త తు=ఏడుగురముమాత్రము; మానుషేణైవ = మనుష్యరూపముచేతనె; పరాన్=శత్రువులనుగూర్చి; యోత్స్యామహే=యుద్ధముచేసెదము.

మహాపరాక్రమశాలియగు నాతమ్ముండు లక్ష్మణుండును నేనును, నీలాంగదహనుమత్సుగ్రీవులును, నాస్నేహితుండువిభీషణుండును, మేమేడ్వురము మాత్రము, మనుష్యదేహంబుననెశత్రువులతో యుద్ధముచేసెదము. అని, రాముండుచెప్పెను. అని, తాత్పర్యము.

స రామః కృత్యసిద్ధ్యర్థ మేవ ముక్త్వా విభీషణమ్. ౩౬

సువేలారోహణే బుద్ధి శ్చకార మతిమాన్ మతిమ్

రమణీయతరం దృష్ట్వా సువేలస్య గిరే స్తటమ్. ౩౭

టీక॥ మతిమాన్=అధికమయినబుద్ధిగల; సః=ఆ; రామః= రాముఁడు; కృత్యసిద్ధ్యర్థం = కార్యసిద్ధికొఱకు; విభీషణం=విభీషణునిగూర్చి; ఏవం= ఇట్లు; ఉక్త్వా=చెప్పి; రమణీయతరం= మిక్కిలియు సుందరమయిన; సువేలస్య=సువేలమను; గిరేః= పర్వతము యొక్క; తటం=చఱియను; దృష్ట్వా= చూచి; సువేలారోహణేబుద్ధిః = సువేలపర్వతముయొక్క యెక్కుట యందు బుద్ధిగలవాఁడై; మతిం=బుద్ధిని; చకార=చేసెను.

బుద్ధిమంతుండగు రాముండిట్లు కార్యసిద్ధియగునట్లు, విభీషణునితోఁ జెప్పి, సువేలపర్వతతటంబుమిక్కిలియుసుందరంబుగానుండుటంజూచి, యప్పర్వతంబుపైనారోహింపందలంచెను.

అని, తాత్పర్యము.

తతస్తు రామో మహతా బలేన
ప్రచ్ఛాద్య సర్వాం పృథివీం మహాత్మా
ప్రహృష్టరూపోఽభిజగామ లంకాం
కృత్వా మతిం సోఽరివధే మహాత్మా. ౩౮

టీక॥ తతస్తు = అంతను; మహాత్మా = అధికమయినబుద్ధిగలవాఁడును; మహాత్మా = అధికమయినధైర్యముగలవాఁడునగు; సః = ఆ రాముఁడు; ప్రహృష్టరూపః = అధికముగా సంతోషించినవాఁడై; మహతా = గొప్పదగు; బలేన = సైన్యముచేత; సర్వాం = సమస్తమయిన; పృథివీం = భూమిని; ప్రచ్ఛాద్య = కప్పి; లంకాం = లంకనుగూర్చి; అభిజగామ = పోయెను.

అంత, మహాబుద్ధిశాలియు మహాధైర్యశాలియునగు రాముఁడు, పరమసంతోషంబునొంది, అనంతంబగు వానరసైన్యంబు సువేలప్రాంతభూమియంతయు వ్యాపించి వెంబడింప, లంకమీఁదికిం బోయెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, సప్తత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండసప్తత్రింశసర్గటీక,
ముగిసినది.

శ్రీః.

అష్టత్రింశ సర్గ ప్రారంభః.

సతు కృత్వా సువేలస్య బుద్ధి మారోహణం ప్రతి
లక్ష్మణానుగతో రామ స్సుగ్రీవ మిద మబ్రవీత్. ౧
విభీషణంచ ధర్మజ్ఞ మనురక్తం నిశాచరమ్
మంత్రజ్ఞంచ విధిజ్ఞంచ శ్లక్ష్ణయా పరయా గిరా. ౨

టీక॥ లక్ష్మణానుగతః= లక్ష్మణుని చేత వెంబడింపఁబడిన; సః=ఆ; రామః= రాముఁడు; సువేలస్య= సువేలపర్వతముయొక్క; ఆరోహణంప్రతి= ఎక్కుటనుగూర్చి; బుద్ధిం = బుద్ధిని; కృత్వాతు=చేసినంతనె; సుగ్రీవం = సుగ్రీవునిగూర్చియు; ధర్మజ్ఞం= ధర్మము దెలిసినవాఁడును; అనురక్తం= అనురాగముగలవాఁడును; మంత్రజ్ఞంచ = ఆలోచన దెలిసినవాఁడును; విధిజ్ఞంచ= కార్యములఁ దెలిసిన వాఁడును ; నిశాచరం=రాక్షసుండునగు; విభీషణంచ=విభీషణునిగూర్చియు; శ్లక్ష్ణయా= మధురమయిన; పరయా=ఉత్తమమగు ; గిరా=మాటచేత; ఇదం=దీని; అబ్రవీత్= చెప్పెను.

లక్ష్మణసహితుండగు రాముండు , అట్లు సువేలపర్వతంబు నారోహింపం దలంచి, సుగ్రీవుని, ధర్మవేత్తయు, దనయందను రాగముగలవాఁడును ఆలోచన దెలిసినవాఁడును గార్యంబుల సమర్థుండును రాక్షసుండగుటచే నచ్చటిఛిద్రంబులఁ దెలిసినవాఁడునగు విభీషణునింజూచి, మధురవచనంబుననిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

సువేలం సాధుశైలేంద్ర మిమం ధాతుశతైశ్చితమ్
అధ్యారోహామహే సర్వే వత్స్యామోఽత్ర నిశా మిమామ్. ౩

టీక॥ వయం (అధ్యాహృతము)= మనము; సర్వే=అందఱము; సాధుశైలేంద్రం=మంచిపర్వతములలో శ్రేష్ఠంబును; ధాతుశతైః= ధాతువులనూఱుల

చేత; చితం= వ్యాపింపఁబడినదియయిన గు; ఇమం=ఈ; సువేలం=సువేలపర్వతమును; అధ్యారోహామహే= ఎక్కుదము. అత్ర=ఈపర్వతమునందు; ఇమాం=ఈ; నిశాం=రాత్రియంతయు; వత్స్యామః=ఉందము.

మనమందఱమును, నానావిధధాతువులచేనలంకృతమయిపర్వతోత్తమమయియున్నయీసువేలపర్వతమునారోహించి, యీరాత్రియంతయునిందునివసింతము. అని, తాత్పర్యము.

లంకాం చాలోక యిష్యామో నిలయం తస్య రక్షసః
యేన మే మరణాంతాయ హృతా భార్యా దురాత్మనా. ౪
యేన ధర్మో న విజ్ఞాతో న తద్వృత్తం కులం తథా
రాక్షస్యా నీచయా బుద్ధ్యా యేన తద్గర్హితం కృతమ్. ౫

టీక॥ దురాత్మనా=దుష్టబుద్ధిగల; యేన=ఎవ్వనిచేత; మరణాంతాయ=మరణరూపములయిన ఫలముకొఱకు; మే=నాయొక్క; భార్యా = భార్య; హృతా= అపహరింపఁబడినదో; యేన=ఎవ్వనిచేత; ధర్మః = ధర్మము; నవిజ్ఞాతః=తెలియఁబడలేదో; తత్= ఆ; వృత్తం=ఆచారము;న(విజ్ఞాతం)=తెలియఁబడలేదో; తథా= అట్లు; కులం=వంశము; నవిజ్ఞాతం (అధ్యాహృతము)=తెలియఁబడలేదో; యేన=ఎవ్వనిచేత; రాక్షస్యా= రాక్షససంబంధియగు; నీచయా=నీచమయిన; బుద్ధ్యా=బుద్ధిచేత; గర్హితం=నిందింపఁబడిన; తత్=ఆకార్యము; కృతం=చేయఁబడినదో; తస్య=అట్టి; రక్షసః=రాక్షసుఁడైనరావణునియొక్క; నిలయం= ఉనికిపట్టయిన; లంకాంచ=లంకాపురిని;ఆలోకయిష్యామః=చూతము.

ఏదురాత్ముండుమరణంబు వొందుటకై నాభార్యనపహరించెనో, ఎవ్వండుధర్మంబు దెలియక సదాచారంబు విచారింపక కులంబుగణింపక, రాక్షససాధారణమయిననీచ బుద్ధిచే,నిందితంబగుపరభార్యాపహరణంబు గావించెనో,అట్టిరావణుని నివాసస్థానమయిన లంకాపురింగూడఁజూతము.

అని, తాత్పర్యము.

స ౩౮

తస్మిన్ మే వర్తతే రోషః కీర్తితే రాక్షసాధమే
యస్యాపరాధా న్నీచస్య వధం ద్రక్ష్యామి రక్షసామ్. ౬

టీక॥ యస్య=ఏ; నీచస్య=నీచునియొక్క; అపరాధాత్=తప్పువలన; రక్షసాం=రాక్షసులయొక్క; వధం=చంపుటను; ద్రక్ష్యామి=చూతునో; తస్మిన్=ఆ; రాక్షసాధమే= రాక్షసులలోఁ దక్కువయయినరావణునందు; కీర్తితే= చెప్పఁబడఁగా; మే=నాకు; రోషః= కోపము; వర్తతే=కలుగుచున్నది.

రాక్షసాధముండగు నారావణుని పేరుచెప్పిన, నాకుమిక్కిలియురోషము పుట్టుచున్నది; అతనియొక్కని యపరాధమువలన, నిప్పుడు రాక్షసులనందఱంజంపవలసియున్నది.

అని, తాత్పర్యము.

ఏకోహి కురుతే పాపం కాలపాశవశం గతః
నీచే నాత్మాపచారేణ కులం తేన వినశ్యతి. ౭

టీక॥ ఏకోహి=ఒక్కఁడె; కాలపాశవశంగతః=మృత్యువుయొక్క త్రాటియధీనతనుబొందినవాఁడై; పాపం=అకార్యమును; కురుతే=చేయుచున్నాఁడు. నీచేన=నీచుండగు; తేన= అతనిచేత; ఆత్మాపచారేణ= తనయపరాధముచేత; కులం=కులము; వినశ్యతి= నశించుచున్నది.

ఒక్కఁడుమాత్రమే, మృత్యువశంగతుండై, యకార్యంబుగావించును; నీచుండగునతనియపరాధంబుచే, నతనికులంబునంబుట్టినవారలందఱు, నాశంబు నొందుదురు. అని, రాముండు చెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం సమ్మంత్రయన్నేవ సక్రోధో రావణంప్రతి
రామ స్స్వేలం వాసాయ చిత్రసాను ముపారుహత్. ౮

టీక॥ రామః=రాముఁడు; ఏవం=ఇట్లు; సమ్మంత్రయన్నేవ = చెప్పుచునే; రావణంప్రతి=రావణునిగూర్చి ; సక్రోధః= కోపముతోఁగూడినవాఁడై ; వాసాయ = నివాసముకొఱకు; చిత్రసానుం= . నానావిధములయినచఱియ

లుగల; సువేలం = సువేలపర్వతముఁ; శైలం = ఎక్కెను. | డై, చిత్రసానువగుసువేలపర్వతంబునారోహించెను.

రాముండట్లుచెప్పచునే, రావణుని పైఁగలిగిన కోపముతోఁగూడినవాఁడై, చిత్రసానువగుసువేలపర్వతంబునారోహించెను.

అని, తాత్పర్యము.

పృష్ఠతో లక్ష్మణశ్చైన మన్వగచ్ఛ త్సమాహితః
సశరం చాప ముద్యమ్య సుమహ ద్విక్రమే రతః. ౯

టీక॥ లక్ష్మణశ్చ= లక్ష్మణుండును; సమాహితః=ఎచ్చరికగలవాఁడై; విక్రమే=పరాక్రమమునందు; రతః = ఆసక్తుఁడై; సుమహత్ = మిక్కిలియుగొప్పదగు; సశరం= బాణముతోఁగూడిన; చాపం=విల్లును; ఉద్యమ్య= పట్టుకొని: ఏనం=ఈరామును; పృష్ఠతః=వెనుకనుండి; అన్వగచ్ఛత్ =వెంబడించెను.

లక్ష్మణుండును, బరాక్రమంబునవలంబించి, బాణంబునుమహాధనుస్సుంబట్టుకొని, యెచ్చరికగలవాఁడై, రాముని వెంబడింపోయెను.

అని, తాత్పర్యము.

త మన్వరోహ త్సుగ్రీవ స్సామాత్య స్స విభీషణః

టీక॥ సామాత్యః= మంత్రులతోఁగూడినవాఁడును; సవిభీషణః = విభీషణునితోఁగూడినవాఁడునగు; సుగ్రీవః= సుగ్రీవుండు; తం=ఆలక్ష్మణుని ; అన్వరోహత్ = వెంబడించియారోహించెను.

అంత, సుగ్రీవుండునుదనమంత్రులనువిభీషణునింగూడి, లక్ష్మణునివెంబడించియారోహించెను.

అని, తాత్పర్యము.

హనుమా నంగదో నీలో మైందో ద్వివిద ఏవచ. ౧౦
గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః
పనసః కుముదశ్చైవ హరో రంభశ్చ యూథపః. ౧౧
జాంబవాంశ్చ సుషేణశ్చ ఋషభశ్చ మహామతిః

దుర్ముఖశ్చ మహాతేజా స్తథా శతవలిః కపిః. ౧౨
ఏతే చాన్యేచ బహవో వానరా శ్శీఘ్రగామినః
తే వాయువేగప్రవణా స్తం గిరిం గిరిచారిణః. ౧౩
అధ్యారోహంత శతశ స్సువేలం యత్ర రాఘవః

టీక॥హనూమాన్ = హనుమంతుండును; అంగదః=అంగదుండును; నీలః= నీలుండును; మైందః= మైందుండును; ద్వివిద ఏవచ=ద్వివిదుండును; గజః=గజుండును; గవాక్షః=గవాక్షుండును; గవయః=గవయుండును; శరభః=శరభుండును; గంధమాదనః=గంధమాదనుండును; పనసః=పనసుండును; కుముదశ్చైవ=కుముదుండును; హరః = హరుండును ; రంభః = రంభుండను ; యూథపశ్చ = సేనా పతియును ; జాంబవాంశ్చ=జాంబవంతుండును; సుషేణశ్చ=సుషేణుండును; మహామతిః= అధికమయినబుద్ధిగల; ఋషభశ్చ= ఋషభుండును; మహాతేజాః = అధికమయినపరాక్రమముగల; దుర్ముఖశ్చ= దుర్ముఖుండును; తథా=అట్లు; శతవలిః=శతవలియును ; కపిః=వానరుండును; ఏతేచ=వీరలును; శీఘ్రగామినః= శీఘ్రముగాఁబోవువారలగు; అన్యే= ఇతరులయిన; వానరాశ్చ= వానరులును; బహవః=పెక్కండ్రును; తే=ఆ; వాయువేగప్రవణాః=వాయువుయొక్క వేగంబువంటి వేగంబుగలగమనముగల ; గిరిచారిణః=వానరులు; శతశః = నూఱు నూఱులుగా; యత్ర=ఎచ్చట; రాఘవః= రాముండు; ఆరురోహ (అధ్యారూఢము)=ఎక్కెనో; తం=ఆ; సువేలం= సువేలమును; గిరిం=పర్వతమును; అధ్యారోహంత=ఎక్కిరి.

హనుమంతుండునంగదుండు నీలుండు మైందుండుద్వివిదుండు గజుండు గవాక్షుండు గవయుండుశరభుండు గంధమాదనుండుఁబనసుండుఁ గుముదుండు హరుండురంభుండుజాంబవంతుండుసుషేణుండుబుద్ధిమంతుండగు ఋషభుండుమహాతేజుండగుదుర్ముఖుండుశతవలియు,వీరలును,ఇంకనితరులు పెక్కండ్రును,వాయువేగులగునావానరులందఱు,రాముని వెంట,నాసువేలపర్వతంబునారోహించిరి. అని,తాత్పర్యము.

తే త్వదీర్ఘేణ కాలేన గిరి మారుహ్య సర్వతః. ౧౪
దదృశు శ్శిఖరే తస్య విషక్తా మివ ఖే పురీమ్

టీక॥ తేతు=ఆరామాదులును; అదీర్ఘేణ=శీఘ్రమయిన; కాలేన= కాలముచేత; గిరిం=సువేలపర్వతమును; సర్వతః=అంతయు; ఆరుహ్య = ఆరోహించి; తస్య = ఆత్రికూటపర్వతముయొక్క; శిఖరే=శిఖరమునందు; ఖే= ఆకాశమునందు; విషక్తామివ(స్థితాం)= అంటుకొనియున్నట్లున్న; పురీం= లంకాపట్టణమును; దదృశుః=చూచిరి.

అంతనా రామాదులు, శీఘ్రంబునను, యాసువేలపర్వతశిఖరంబు నారోహించి, త్రికూటశిఖరాగ్రంబున నాకాశంబునవ్రేలాడునట్లున్నలంకాపురిం జూచిరి. అని, తాత్పర్యము.

తాం శుభాం ప్రవరద్వారాం ప్రాకారపరిశోభితామ్. ౧౫
లంకాం రాక్షససంపూర్ణాం దదృశు హరియూథపాః

టీక॥ హరియూథపాః = వానరయూథపులు ; శుభాం=సుందరమయినదియు; ప్రవరద్వారాం= శ్రేష్ఠములయినద్వారములుగలదియు ; ప్రాకారపరిశోభితాం=ప్రాకారములచేఁబ్రకాశించుచున్నదియు ; రాక్షస సంపూర్ణాం = రాక్షసులచేనిండినదియునగు; తాం=ఆ; లంకాం= లంకాపురిని; దదృశుః=చూచిరి.

వానరవీరులందఱు , సుందరంబును సుందరద్వారంబును బ్రాకారాలంకృతంబును రాక్షసులచే నిండినదియు నగు లంకాపురింజూచిరి. అని, తాత్పర్యము.

ప్రాకారచయసంస్థైశ్చ తదా నీలై ర్నిశాచరైః. ౧౬
దదృశు స్తే హరిశ్రేష్ఠాః ప్రాకార మపరం కృతం

టీక॥ తే=ఆ; హరిశ్రేష్ఠాః= వానరోత్తములు; తదా=అప్పుడు; ప్రాకారచయసంస్థైః= కోటకొఱడులయందున్న; నీలైః=నల్లని ; నిశాచరైశ్చ= రాక్షసులచేతను; కృతం = చేయఁబడిన; అపరం= ఇతరమయిన ; ప్రాకా

రం=కోటను; దదృశుః= చూచిరి.

అప్పుడు, నల్లని రాక్షసులు, కోట కొలఁదులనుండుటవలన, రెండవప్రాకారమువలెనున్న యారాక్షసపఙ్క్తినిం గూడ, నవ్వానరోత్తములు చూచిరి.

అని, తాత్పర్యము.

తే దృష్ట్వా వానరా స్సర్వే రాక్షసాన్ యుద్ధకాంక్షిణః. ౧౭
ముముచు ర్వివిధా న్నాదాం స్తత్ర రామస్య పశ్యతః

టీక॥ తత్ర=అచ్చట; తే=ఆ; వానరాః=వానరులు; సర్వే = అందఱును; రాక్షసాన్=రాక్షసులను; దృష్ట్వా=చూచి; యుద్ధకాంక్షిణః=యుద్ధముగోరువారలయి; రామస్య = రాముండు; పశ్యతః = చూచుచుండఁగా ; వివిధాన్= నానావిధములయిన ; నాదాన్=ధ్వనులను ; ముముచుః= విడిచిరి.

అచ్చట, నావానరులందఱు, నారాక్షసులంజూచి, యుద్ధంబుసేయనుత్సుకులయి , రాముండు చూచుచుండఁగానే, నానావిధంబులసింహనాదంబులు గావించిరి. అని, తాత్పర్యము.

తతో స్త మగమ త్సూర్య స్సంధ్యయా ప్రతిరంజితః. ౧౮
పూర్ణచంద్ర ప్రదీప్తా చ క్షపా సమభివర్తతే

టీక॥తతః=అంత; సూర్యః= సూర్యుఁడు; సంధ్యయా=సంధ్యచేత; ప్రతిరంజితః= ఎఱ్ఱఁగాఁజేయఁబడినవాఁడై; అస్తం=అస్తమయమును ; అగమత్=పొందెను. పూర్ణచంద్ర ప్రదీప్తా=నిండుచంద్రునిచేఁ బ్రకాశించుచున్న; క్షపా చ=రాత్రియు; సమభివర్తతే=వచ్చినది.

అంత, సూర్యుండు, సంధ్యారాగంబునంబుల్లవితుండై యస్తమించెను ; రాత్రియుఁ, బూర్ణచంద్రాలంకృతయయిపొడసూపినది.

అని, తాత్పర్యము.

తత స్సరామో హరివాహినీపతి
ర్విభీషణేన ప్రతినంద్య సత్కృతః. ౧౯

సలక్ష్మణో యూథపయూథసంవృత
స్సువేలపృష్ఠే న్యవస ద్యథాసుఖమ్

టీక॥ తతః=అంత ; హరివాహినీపతిః=వానరసేనానాయకుండగు;సః=ఆ; రామః=రాముండు; విభీషణేన = విభీషణునిచేత; ప్రతినంద్య=పొగడి;సత్కృతః=పూజింపఁబడినవాఁడై; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడినవాఁడై ; సువేలపృష్ఠే= సువేలపర్వతాగ్రమునందు; యథాసుఖం=సుఖముగనతిక్రమింపక; న్యవసత్=ఉండెను.

అంత,వానరసేనా నాయకత్వంబు నొందినయారాముండు, విభీషణుండు నానావిధంబులంబూజింప,లక్ష్మణునింగూడి,వానరవీరసమూహపరివేష్టితుండై,యారాత్రి, సువేల పర్వతాగ్రంబునసుఖంబుగానివసించియుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే , అష్టత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు , యుద్ధకాండాష్టత్రింశసర్గటీక ,
ముగిసినది.

---

౩౯

ఏకోనత్రింశసర్గప్రారంభః.

తాం రాత్రి ముషితా స్తత్ర సువేలే హరిపుంగవాః
లంకాయాం దదృశు ర్వీరా వనా న్యుపవనానిచ. ౧

టీక॥వీరాః=పరాక్రమముగల;హరిపుంగవాః=వానరశ్రేష్ఠులు;తత్ర= ఆ సువేలాగ్రమునందు;తాం= ఆ ; రాత్రిం=రాత్రియంతయు;ఉషితాః = వ

 

సించినవారలయి;లంకాయాం= లంకయందు (గల); వనాని= వనములను; ఉపవనానిచ=ఉద్యానవనములను ; దదృశుః=చూచిరి.

పరాక్రమవంతులగు నావానరశ్రేష్ఠులట్లు రాత్రియంతయు నాసువేలాగ్రంబుననుండి, తెల్లవాఱినవెనుక , లంకయందలివనంబుల నుద్యానవనంబులం జూచిరి. అని, తాత్పర్యము.

సమసౌమ్యాని రమ్యాణి విశాలా న్యాయతాని చ
దృష్టిరమ్యాణి తే దృష్ట్వా బభూవు ర్జాతవిస్మయాః. ౨

టీక॥ తే=ఆవానరులు ; సమసౌమ్యాని = ఎచ్చుతక్కువలులేనివియు శాంతిగలవియు;రమ్యాణి= రమణీయములును;విశాలాని= వెడల్పులయినవియు;ఆయతానిచ = నిడుపులయినవియు;దృష్టిరమ్యాణి= కన్నులకురమణీయములునగు; వనానిఉపవనానిచ(అధ్యాహృతము)= వనంబులనుఉపవనంబులను;దృష్ట్వా= చూచి ; జాతవిస్మయాః = కలిగినయాశ్చర్యముగలవారలు;బభూవుః=అయిరి.

ఆవానరులు , మిట్టపల్లములులేనివియుఁగ్రూరమృగంబులులేనివియు విశాలంబులు నాయతంబులును గన్నులకుఁ బండువుగలిగించునవియురమణీయంబులునగు నాలంకయందలి వనంబులనుపవనంబులనుం జూచి యాశ్చర్యంబునొందిరి. అని, తాత్పర్యము.

చంపకాశోక పున్నాగసాలతాలసమాకులా
తమాలవనసంఛన్నా నాగమాలాసమావృతా. ౩
హింతాలై రర్జునై ర్నీపై స్సప్తపర్ణైశ్చ పుష్పితైః
తిలకైః కర్ణికారైశ్చ పాటలైశ్చ సమంతతః. ౪
శుశుభే పుష్పితాగ్రైశ్చ లతాపరిగతై ర్ద్రుమైః
లంకాం బహువిధై ర్దివ్యై ర్యథేంద్ర స్యామరావతీ. ౫
విచిత్రకుసుమోపేతై రక్తకోమలపల్లవైః
శాద్వలైశ్చ తథా నీలై శ్చిత్రాభి ర్వనరాజిభిః. ౬

 

టీక॥లంకా=లంకాపురి; చంపకాశోకపున్నాగసాలతాలసమాకులా = సంపెఁగచెట్లచేతను అశోకవృక్షములచేతను సురపొన్నచెట్లచేతను మద్దిచెట్లచేతను తాటిచెట్లచేతను నిండినదై ; తమాలవనసంఛన్నా=చీఁకటిచెట్లవనముచేఁగప్పఁబడినదై; నాగమాలాసమావృతా=నాగకేసర వృక్షములయొక్క పఙ్క్తులచేఁగప్పఁబడినదై; సమంతతః=అంతట;హింతాలైః=గిఱకతాటిచెట్లచేతను; అర్జునైః= ఏఱుమద్దిచెట్లచేతను; నీపైః=మంకెనచెట్లచేతను; పుష్పితైః=పూచిన; సప్తపర్ణైశ్చ= ఏడాకులరఁటిచెట్లచేతను; తిలకైః=బొట్టుగుచెట్లచేతను ; కర్ణికారైశ్చ= కొండగోఁగుచెట్లచేతను; పాటలైశ్చ= కలిగొట్టుచెట్లచేతను; పుష్పితాగ్రైః= పూచినకొనలుగలవియు ; లతాపరిగతైః=తీఁగెలచేతఁజుట్టఁబడినవియు; బహువిధైః=పెక్కు విధములును ; దివ్యైః=శ్రేష్ఠములును;విచిత్రకుసుమోపేతైః=నానావిధములయిన పుష్పములతోఁగూడినవియు ; రక్తకోమలపల్లవైః=ఎఱ్ఱనివియు లేఁతవియునగు చిగుళ్లుగలవియునగు;ద్రుమైః= వృక్షములచేతను;శాద్వలైః= పచ్చికనేలలచేతను;తథా=అట్లు; నీపైః= జలప్రాయప్రదేశములచేతను; చిత్రాభిః= ఆశ్చర్యకరములయిన; వనరాజిభిః = వనసమూహములచేతను; ఇంద్రస్య= దేవేంద్రునియొక్క; అమరావతీవ= అమరావతీపురమువలె;శుశుభే= ప్రకాశించెను.

ఆలంకాపురి,సంపెఁగచెట్లునుఅశోకవృక్షములునుపున్నాగ వృక్షములును మద్దిచెట్లునుదాటిచెట్లునుదమాల వృక్షములును ఏఱుమద్దిచెట్లును పుష్పితంబులగు నేడాకులరఁటిచెట్లును బొట్టుగుచెట్లునుగొండగోఁగుచెట్లునుగలిగొట్టుచెట్లును, విచిత్రంబులగు పుష్పంబులుగల శిఖరంబులతోఁగూడినవియు లతావేష్టితంబులును దివ్యంబులును ఎఱ్ఱని కోమలంబులగు పల్లవంబులు గలవియునగు నానావిధ వృక్షంబులును , పచ్చికభూములును జలప్రాయ ప్రదేశంబులును,చిత్రంబులగు వనరాజులునుంగల్గి ,దేవేంద్రునియమరావతీ పురంబుంబోలెఁ బ్రకాశించుచుండినది.

అని, తాత్పర్యము.

గంధాఢ్యాన్యభిరమ్యాణి పుష్పాణి ఫలవంతిచ

ధారయం త్యగమా స్తత్ర భూషణానీవ మానవాః. ౭

టీక॥ తత్ర=ఆవనంబులందు; మానవాః=మనుష్యులు ; భూషణానీవ=సొమ్ములంబోలె;అగమాః= వృక్షమును;గంధాఢ్యాని = మంచివాసనతోఁగూడినవియు;అభిరమ్యాణి = మిక్కిలియురమణీయంబులును;ఫలవంతిచ= ఫలములుగలవియునగు;పుష్పాణి= పూలను ; ధారయంతి = ధరించుచుండినవి.

ఆవనంబునందలివృక్షములు, మనుష్యులుభూషణంబులుధరించునట్లు, మంచివాసనగలవియు రమణీయంబులు నగు పుష్పంబులను ఫలంబులను ధరించియుండినవి. అని, తాత్పర్యము.

త చ్చైత్ర రథసంకాశం మనోజ్ఞం నందనోపమమ్
వనం సర్వర్తుకం రమ్యం శుశుభే షట్పదాయతమ్. ౮

టీక॥ సర్వర్తుకం=సమస్తములయినఋతువులుగలదియు;రమ్యం=సుందరమును;మనోజ్ఞం = మనోహరమైనదియు;షట్పదాయతం = తుమ్మెదలతోఁగూడినదియునగు;తత్=ఆ;వనం= వనము;చైత్రరథసంకాశం= చైత్రరథవనముతోఁ సమానమయినదిగాను ; నందనోపమం= నందనవనముతోఁబోల్కిగలదిగాను;శుశుభే=ప్రకాశించినది.

సమస్త ఋతుధర్మంబులతోనుం గూడినదియురమణీయంబును దుమ్మెదలతోనొప్పుచున్నదియు నగు , నాలంకయందలివనము , కుబేరునిచైత్రరథవనంబుమాడ్కిఁ దేవేంద్రునినందనవనంబుకైవడింబ్రకాశించెను.

అని, తాత్పర్యము.

నత్యూహకోయష్టిమకై ర్నృత్యమానైశ్చ బర్హిభిః
రుతం పరభృతానాంచ శుశ్రువు ర్వననిర్ఝరే. ౯

టీక॥ తే (అధ్యాహృతము)= ఆ వానరులు;వననిర్ఝరే= వనమునందలిసెలయేటియందు ; నత్యూహకోయష్టిమకైః=నీరుకోళ్లతోను,జీకుఁగోళ్లతోను; నృత్యమానైః = ఆడుచున్న;బర్హిభిశ్చ=నెమిళ్లతోను ; యు

తానాం (అధ్యాహృతము)= కూడిన
ట్టి;పరభృతానాం = కోయిలలయొ
క్క;రుతం = ధ్వనిని ; శుశ్రువుః=
వినిరి.

ఆవానరులు , వనసిర్ఝరంబులం
దు, నీరుకోడులునుజీకుంగొక్కెరలును
నర్తనము సేయుచుండు నెమిళ్లునుగో
యిలలునుమధురముగాc గూయుచుం
డ,నాధ్వనులవినిరి.

అని, తాత్పర్యము.

నిత్యమత్తవిహంగాని భ్రమరాచరితానిచ
కోకిలాకులషండాని విహగాభిరుతానిచ. ౧౦
భృంగరాజాభిగీతాని భ్రమరైస్సేవితానిచ
కోణాలకవిఘుష్టాని సారసాభిరుతానిచ. ౧౧
వివిశుస్తే తతస్తాని వనాన్యుపవనానిచ
హృష్టాః ప్రముదితా వీరా హరయః కామరూపిణః. ౧౨

టీక॥ తతః=అంత; వీరాః= పరా
క్రమశాలులును; కామరూపిణః = ఇ
చ్ఛాధీనమగురూపముగలవారలునగు ;
తే=ఆ; హరయః= వానరులు; హృ
ష్టాః=గగుపాటునొందినవారలయి;
ప్రముదితాః=సంతసించినవారలయి;ని
త్యమత్తవిహంగాని= ఎల్లప్పుడునుమ
దించినపక్షులుగలవియు; భ్రమరాచరి
తానిచ=తుమ్మెదలచేసంచరింపcబడిన
వియు; కోకిలాకులషండాని= కోయిల
లచేనిండినవృక్షసమూహములు గలవి
యు ; విహగాభిరుతానిచ=పక్షులధ్వ
నులుగలవియు;భృంగరాజాభిగీతాని=
తుమ్మెదలలో నుత్తమములగువానియొ
క్క-గానములుగలవియు; భ్రమరైః=
తుమ్మెదలచేత; సేవితానిచ=సేవింపc
బడినవియు;కోణాలకవిఘుష్టాని= మం
దపిచ్చుకలధ్వనులుగలవియు ; సారసా
భిరుతానిచ= బెగ్గురుపక్షులధ్వనులుగల
వియునగు; తాని=ఆ; వనాని=వనము
లను; ఉపవనానిచ= ఉద్యానవనముల
ను; వివిశుః=ప్రవేశించిరి.

అంతc, బరాక్రమవంతులునుగామ
రూపులునగునావానరులు,పరమసంతు
ష్టులయి,మేనంబులకలువొడమ , నెల్ల
ప్పుడును మదించియుండు పక్షులతోc
గూడినవియుcగోయిలలచేనిండిన వృక్ష
ములుగలవియు , మధురంబుగాcగూ

యుచుండునట్టిభృంగములును మందపిచ్చుకలును జెగ్గురుపక్షులను మొదలగు పక్షులతో నొప్పుచుండునవియునగు, నా లంకాపురిసమీపంబుననుండు వనంబుల నుపవనంబులం బ్రవేశించిరి.

అని, తాత్పర్యము.

తేషాం ప్రవిశతాం తత్ర వానరాణాం మహౌజసామ్
పుష్పసంసర్గసురభి ర్వవౌ ఘ్రాణసుఖోఽనిలః. ౧౩

టీక॥తత్ర=అచ్చట; ప్రవిశతాం= ప్రవేశించుచున్న; మహౌజసాం= అధికమయినపరాక్రమముగల; తేషాం= ఆ; వానరాణాం=వానరులకు; ఘ్రాణసుఖః= ఘ్రాణేంద్రియమునకుసుఖకరమయిన; పుష్పసంసర్గసురభిః= పూలసంబంధముచే మంచివాసనగల; అనిలః=గాలి; వవౌ=వీచెను.

అప్పుడు మహాపరాక్రమశాలులగు నా వానరు లావనంబులం బ్రవేశించు నప్పుడు, పుష్పసంబంధంబునం జేసి, సురభిలంబగు వాయువు, వారలపై వీచెను.

అని, తాత్పర్యము.

అన్యేతు హరివీరాణాం యూథా న్నిష్క్రమ్య యూథపాః
సుగ్రీవేణా భ్యనుజ్ఞాతా లంకాం జగ్ముః పతాకినీమ్. ౧౪

టీక॥అన్యే=ఇతరులయిన ; యూథపాస్తు=వానరులయూథపులుమాత్రము; హరివీరాణాం=వానరవీరులయొక్క; యూథాత్= సమూహమునుండి; నిష్క్రమ్య=వెలువడి; సుగ్రీవేణ= సుగ్రీవునిచేత; అభ్యనుజ్ఞాతాః= అనుమతింపఁబడినవారలై; పతాకినీం=టెక్కెములుగల; లంకాం=లంకాపురిని గూర్చి; జగ్ముః=పోయిరి.

మఱికొందఱా వానరవీరులుమాత్రము, సుగ్రీవునియనుమతినొంది, వానరసేననుండి బయలుదేఱి, పతాకాశోభితంబగులంకకుఁబోయిరి.

అని, తాత్పర్యము.

విత్రాసయంతో విహగాం స్త్రాసయంతో మృగద్విపాన్
కంపయంతశ్చ తాం లంకాం నాదై స్తే నదతాం వరాః. ౧౫

టీక॥నదతాం=అఱచువారలలో ; వరాః=శ్రేష్ఠులయిన; తే= ఆవానరులు; నాదైః = అఱుపులచేత; విహగాన్=పక్షులను; విత్రాసయంతః = భయపఱచుచు; మృగద్విపాన్=జింకలనుఏనుంగులను; త్రాసయంతః= భయపఱుచుచు;తాం=ఆ;లంకాం= లంకాపురిని;కంపయంతశ్చ= కదలించుచును;జగ్ముః(అధ్యాహృతము)=పోయిరి.

కట్టిగానఱవఁగలవారలలో నుత్తములగునావానరులు, సింహనాదంబులచేఁ, బక్షులనుమృగంబులనేనుంగులనుభయపఱచుచు,లంకాపురినంతయుఁ జలింపంజేయుచుఁ,బోయిరి.

అని, తాత్పర్యము.

కుర్వంత స్తే మహావేగా మహీం చరణపీడితామ్

టీక॥మహావేగాః=అధికమయిన వేగముగల; తే=ఆవానరులు ; మహీం= భూమిని;చరణపీడితాం = పాదములచేఁబీడింపఁబడినదానిఁగా;కుర్వంతః= చేయుచు;జగ్ముః (అధ్యాహృతము)= పోయిరి.

మహావేగులగునావానరులు, తమపాదాఘాత వేగంబున భూమింబీడించుచుఁబోయిరి. అని, తాత్పర్యము.

రజశ్చ సహసైవోర్ధ్వం జగామ చరణోత్థితమ్. ౧౬

టీక॥సహసైవ=శీఘ్రముననే; చరణోత్థితం=పాదములచే లేచిన;రజశ్చ= పరాగమును;ఊర్ధ్వం=పైకి;జగామ= పొందినది.

అంత,నవ్వానరులచరణాఘాతంబునంజేసి, నిమేషమాత్రంబున,నాకాశంబంతయుఁబరాగావృతంబయ్యె.

అని,తాత్పర్యము.

ఋక్షా స్సింహా వరాహాశ్చ మహిషా వారణా మృగాః
తేన శబ్దేన విత్రస్తా జగ్ముః భీతా దిశో దశ. ౧౭

టీక॥ఋక్షాః=ఎలుఁగుబంటులును; సింహాః=సింహములును; వరాహాశ్చ= పందులును; మహిషాః = ఎనుబోతులును; వారణాః=ఏనుంగులును ; మృ

గాః=జింకలును; భీతాః= భయపడినవై; తేన=ఆ;శబ్దేన=ధ్వనిచేత;విత్రస్తాః=మిక్కిలియుభయపడినవై;దశ=పదియయిన;దిశః= దిక్కులనుగూర్చి; జగ్మః=పోయినవి.

లంకావనంబులనుండునట్టి, మెలుఁగుబంటులునుసింహంబులునువరాహంబులును మహిషంబులును గజంబులును జింకలును,అవ్వానరుల భీకరాకారంబులంజూచుటచే భయపడియున్నవిగావున,వారలసింహనాదంబులు విన్నంతనె మఱియుభయపడి,దశదిశలకుంబాఱినవి. అని,తాత్పర్యము.

శిఖరం త త్త్రికూటస్య ప్రాంశుచైకం దివిస్పృశమ్
సమంతా త్పుష్పసంఛన్నం మహారజతసన్నిభమ్. ౧౮
శతయోజనవిస్తీర్ణం విమలం చారుదర్శనమ్
శ్లక్ష్ణం శ్రీమ న్మహచ్చైవ దుష్ప్రాపం శకునైరపి. ౧౯
మనసాపి దురారోహం కిం పునః కర్మణా జనైః

టీక॥ ప్రాంశుచ= ఉన్నతంబును;ఏకం=ఒక్కటియును; దివిస్పృశం= ఆకాశంబుఁ దాఁకు నదియు ; సమంతాత్=అంతటను; పుష్పసంఛన్నం = పూలచేఁగప్పఁబడినదియు; మహారజతసన్నిభం = బంగారముతోసమానమయినదియు; శతయోజనవిస్తీర్ణం = నూఱుయోజనముల వెడల్పుగలదియు;విమలం=నిర్మలమయినదియు ; చారుదర్శనం = సుందరమయినచూచుటగలదియు ; శ్లక్ష్ణం=రమణీయంబును ; శ్రీమత్-అధికమయినకాంతిగలదియు;మహచ్చైవ=గొప్పదియును;శకునైరపి= పక్షులచేతనుంగూడ;దుష్ప్రాపం=పొందఁగూడనదియును;త్రికూటస్య=త్రికూటముయొక్క;తత్ =ఆ;శిఖరం=శిఖరము; జనైః=జనులచేత;మనసాపి= మనస్సుచేతనుంగూడ;దురారోహం= ఎక్కఁగూడనిది.కర్మణా = కార్యముచేత; దురారోహమితి (అధ్యాహృతము)= ఎక్కనలవిగానిదని ; కింపునః (వక్తవ్యం)=చెప్పవలయునా యేమి?

ఉన్నతంబునుమధ్యమంబును నాకాశంబుస్పృశించుచున్నట్లున్నదియునంతటనుబుష్పావృతమయియుండునదియు బంగారమువన్నెగలదియు నూఱుయో

జనంబులవైశాల్యముగలదియు, నిర్మలంబునుసుందరంబును శ్రీమంతంబును బతులకైనఁ బొందనలవిగానిదియు నగు నా త్రికూటశిఖరమును, జనులకుమనస్సు చేనైనఁబొందనలవిగాదు; ఇంకనడచి పోలేరని చెప్పనేల?

అని, తాత్పర్యము.

నివిష్టా తత్ర శిఖరే లంకా రావణపాలితా. ౨౦
శతయోజనవిస్తీర్ణా త్రింశద్యోజన మాయతా

టీక॥ రావణపాలితా=రావణుని చేతఁబాలింపఁబడినదై; శతయోజనవిస్తీర్ణా= నూఱుయోజనములవెడల్పు గలదియు ; త్రింశద్యోజనం= ముప్పది యోజములు; ఆయతా= నిడుపుగలది యునగు; లంకా= లంకాపురము; తత్ర=ఆ; శిఖరే=శృంగమునందు ; నివిష్టా=ఉన్నది.

రావణబాహుపాలితంబున నూఱు యోజనంబులనిడుపును ముప్పదియోజనంబులవెడలుపునుగలదియౌనగు లంకాపురియాత్రికూటశిఖరంబునున్నది.

అని, తాత్పర్యము.

సా పురీ గోపురై రుచ్చైః పాండురాంబుదసన్నిభైః. ౨౧
కాంచనేనచ సాలేన రాజతేనచ శోభితా

టీక॥ సా=ఆ; పురీ= లంకాపురి; పాండురాంబుదసన్నిభైః = తెల్లనిమేఘంబులతోసమానమయిన; ఉచ్చైః= ఉన్నతములగు; గోపురైః= పురద్వారములచేతను; కాంచనేన= బంగారువికారమయిన; సాలేన= ప్రాకారముచేత; రాజతేనచ= వెండివికారమయినప్రాకారముచేతను; శోభితా= ప్రకాశించుచుండినది.

ఆలంకాపురి, తెల్లనిమేఘంబులవంటియత్యున్నతంబులగు పురద్వారంబులును గాంచనమయంబగు ప్రాకారంబును రాజతంబగుప్రాకారంబునుం గల్గి యెంతయునొప్పుచుండినది.

అని, తాత్పర్యము.

ప్రాసాదైశ్చ విమానైశ్చ లంకా పరమభూషితా. ౨౨

ఘనై రివాఽతపాపాయే మధ్యమం వైష్ణవం పదమ్

టీక॥ లంకా=లంకాపురి; ప్రాసాదైశ్చ=రాజగృహములచేతను; విమానైశ్చ=విమానాకార గృహములచేతను; ఆతపాపాయే = వర్షాకాలమునందు; ఘనైః=మేఘములచేత ; మధ్యమం=నడిమిదైన; వైష్ణవం=విష్ణుసంబంధియగు ; పదమివ= స్థానమయిన యాకాశమువలె; పరమభూషితా=మిక్కిలియును అలంకృతమయినది.

వర్షాకాలంబున మేఘంబులచేనాకాశంబువలె , రాజగృహంబుల చేతను విమానాకారగృహంబులచేతను ఆలంకాపురియెంతయుం బ్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

యస్యాం స్తంభసహస్రేణ ప్రాసాద స్సమలం కృతః. ౨౩
కైలాసశిఖరాకారో దృశ్యతే ఖ మివోల్లిఖన్

టీక॥యస్యాం(తస్యాం)=ఆలంకాపురియందు ; స్తంభసహస్రేణ= స్తంభములవేయింటిచేత; సమలంకృతః = అలంకరింపఁబడినదియు; కైలాస శిఖరాకారః = కైలాసపర్వతశృంగము యొక్క యాకారమువంటి యాకారముగలదియునగు; ప్రాసాదః= చైత్య ప్రాసాదము; ఖం=ఆకాశమును; ఉల్లిఖన్నివ==ఒరయుచున్నట్లు; దృశ్యతే=చూడఁబడుచున్నది.

ఆలంకాపురియందు, వేయి స్తంభములచేనలంకరింపఁ బడినదియుఁ గైలాసశిఖరంబువలె నత్యున్నతంబు నగు చైత్యప్రాసాద మొకటి యాకాశంబునొరయునట్లుచూపట్టుచుండినది.

అని, తాత్పర్యము.

చైత్య స్స రాక్షసేంద్రస్య బభూవ పురభూషణమ్. ౨౪
శతేన రక్షసాం నిత్యం యః స్సమగ్రేణ రక్ష్యతే

టీక॥యః=ఏది; నిత్యం=ఎల్లప్పుడును; సమగ్రేణ= సంపూర్ణమయిన ; రక్షసాం=రాక్షసులయొక్క; శతేన=నూటిచేత; రక్ష్యతే=రక్షింపఁబడుచున్నదో; సః=ఆ; రాక్షసేంద్రస్య = రాక్షసరాజుండగు రావణునియొక్క;

చైత్యః = పట్టణమధ్యముననుండు ప్రాసాదము; పురభూషణం= పట్టణమునకలంకారము; బభూవ= అయినది.

దేని, నెల్లప్పుడును నూఱుగురు రాక్షసులు గావలియుండి రక్షింపుచుండురో, అట్టి రాక్షసరాజుండగు రావణుని చైత్యప్రాసాదము, లంకాపురంబునకంతయుభూషణమయి వెలుంగుచుండినది. అని, తాత్పర్యము.

మనోజ్ఞాం కాననవతీం పర్వతై రుపశోభితామ్. ౨౫
నానాధాతువిచిత్రైశ్చ ఉద్యానై రుపశోభితామ్
నానావిహగసంఘుష్టాం నానామృగనిషేవితామ్. ౨౬
నానాకాననసంతానాం నానారాక్షససేవితామ్
తాం సమృద్ధాం సమృద్ధార్థాం లక్ష్మీవాన్ లక్ష్మణాగ్రజః. ౨౭
రావణస్య పురీం రామో దదర్శ సహవానరైః

టీక॥ లక్ష్మీవాన్=శ్రీమంతుండును; లక్ష్మణాగ్రజః=లక్ష్మణునియన్నయునగు; రామః= రాముఁడు; వానరైస్సహ=వానరులతోఁగూడ; మనోజ్ఞాం= మనోహరమయినదియు; కాననవతీం= మంచియడవులుగలదియు; నానాధాతువిచిత్రైః=నానావిధములయిన గైరిక ధాతువులచే నానావర్ణములయిన; పర్వతైశ్చ=కొండలచేతను; ఉపశోభితాం=ప్రకాశించుచున్నదియు; ఉద్యానైః=ఉపవనములచేత; ఉపశోభితాం=ప్రకాశించుచున్నదియు; నానావిహగసంఘుష్టాం= నానావిధపక్షుల యొక్క ధ్వనులుగలదియు; నానామృగనిషేవితాం = నానావిధమృగములచే సేవింపఁబడినదియు; నానాకాననసంతానాం=నానావిధములయిన యడవులసమూహములు గలదియు; నానారాక్షససేవితాం= నానావిధరాక్షసులచేత సేవింపఁబడినదియు; సమృద్ధాం= ఉన్నతమును; సమృద్ధార్థాం=సమృద్ధములయినద్రవ్యములు గలదియునగు; తాం=ఆ; రావణస్య = రావణునియొక్క; పురీం=లంకాపురిని; దదర్శ=చూచెను.

శ్రీమంతుండును లక్ష్మణుని యన్నయునగురాముండు, వానరులతోఁగూడ, మనోహరంబును నానావిధధాతు

మండితంబులగుపర్వతంబులుగలదియు, నుద్యానవనాలంకృతంబును మధురంబుగాఁగూయుచుండునానావిధ పక్షులుగలదియునానావిధ మృగసేవితంబునునానావిధములయినయడవులు గలదియు, నానావిధాకారులగురాక్షసులచేనిండినదియు, నత్యున్నతంబునుసమృద్ధార్థంబునగునారావణుని లంకాపురింజూచెను. అని, తాత్పర్యము.

తాం మహాగృహసంబాధాం దృష్ట్వా లక్ష్మణపూర్వజః. ౨౮
నగరీ మమర ప్రఖ్యో విస్మయం ప్రాప్య వీర్యవాన్

టీక॥ వీర్యవాన్= అధికమయినపరాక్రమముగల; అమరప్రఖ్యః= దేవతతోసమానుఁడగు; లక్ష్మణపూర్వజః = లక్ష్మణునియన్నయయినరాముండు; మహాగృహసంబాధాం= పెద్దయిండ్లచేతనిబిడ్డైన; తాం=ఆ; నగరీం= లంకాపురమును; దృష్ట్వా=చూచి; విస్మయం = ఆశ్చర్యమును ; ప్రాప = పొందెను.

పరాక్రమవంతుండును దేవసదృశుండునులక్ష్మణాగ్రజుండునగురాముండు, ఉత్తమంబులగుగృహంబులచేనిండియున్నయాలంకాపురింజూచి, యాశ్చర్యంబునొందెను. అని, తాత్పర్యము.

తాం రత్నపూర్ణాం బహుసంవిధానాం
ప్రాసాదమాలాభి రలంకృతాంచ. ౨౯
పురీం మహాయంత్ర కవాట ముఖ్యాం
దదర్శ రామో మహతా బలేన

టీక॥ రామః=రాముఁడు ; మహతా=గొప్పదగు; బలేన= సైన్యముతో; సహితః(అధ్యాహృతము) = కూడినవాఁడై; రత్నపూర్ణాం= శ్రేష్ఠవస్తువులచేనిండినదియు ; బహుసంవిధానాం = అధికమయినరక్షణము గలదియు; ప్రాసాదమాలాభిః= రాజగృములయొక్కపఙ్క్తులచేత ; అలంకృతాంచ=అలంకరింపఁబడినదియు ; మహాయంత్రకవాటముఖ్యాం = గొప్ప

యంత్రములతోఁగూడినతలుపులలో సుత్తమములుగలదియునగు ; తాం=ఆ; పురీం=లంకాపట్టణమును ; దదర్శ= చూచెను.

రాముండు, అనంతవానరసేనాపరివృతుండై, శ్రేష్ఠవస్తు పూర్ణంబును నానావిధ మయిన రక్షణంబు గలదియుఁ, బెక్కుప్రాసాదములచే నలంకృతమును గొప్పయంత్ర కవాటంబులతోఁగూడినదియునగు నాలంకా నగరముంజూచెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ఏకోనచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండైకోనచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

చత్వారింశ సర్గ ప్రారంభః.

తతో రామ స్సువేలాగ్రం యోజనద్వయమండలమ్
ఆరురోహ ససుగ్రీవో హరియూథపసంవృతః. ౧

టీక॥ తతః=అంత; రామః= రాముఁడు; ససుగ్రీవః = సుగ్రీవునితోఁగూడినవాఁడై; హరియూథపసంవృతః=వానరయూథపులచేఁజుట్టఁబడినవాఁడై; యోజనద్వయమండలం = ఆమడలరెండిటి వ్యాయామముగలప్రదేశముగల; సువేలాగ్రం = సువేలపర్వతశిఖరమును; ఆరురోహ=ఎక్కెను.

అంత, రాముండు, సుగ్రీవుని, వానరయూథపులనుం గూడి, రెండు యోజన

ములవైశాల్యముగలసువేలపర్వత శిఖరంబునారోహించెను. అని, తాత్పర్యము.

స్థిత్వా ముహూర్తం తత్రైవ దిశో దశ విలోకయన్
త్రికూటశిఖరే రమ్యే నిర్మితాం విశ్వకర్మణా. ౨
దదర్శ లంకాం సున్యస్తాం రమ్యకాననశోభితామ్

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముండు; తత్రైవ = అచ్చటనే; ముహూర్తం = కొంచెముసేపు; స్థిత్వా = ఉండి; దశ = పదియైన; దిశః = దిక్కులను; విలోకయన్ = చూచుచు; విశ్వకర్మణా = విశ్వకర్మచేత; రమ్యే = సుందరమైన; త్రికూటశిఖరే = త్రికూటపర్వతశిఖరమునందు; నిర్మితాం = నిర్మింపఁబడినదియు; సున్యస్తాం = చక్కఁగానుంచఁబడినదియు; రమ్యకాననశోభితాం = సుందరములగునడవులచేతఁ బ్రకాశించుచున్నదియు నగు; లంకాం = లంకాపురమును; దదర్శ = చూచెను.

రాముండు, సువేల శిఖరంబుననె కొంచెముసేపుండి, దశదిశలం జూచుచు సుందరమయిన త్రికూటపర్వత శిఖరంబున విశ్వకర్మచే దృఢంబుగా నిర్మితంబును రమణీయంబులగువనంబులతోఁగూడినదియునగు లంకాపురముం జూచెను. అని, తాత్పర్యము.

తస్యాం గోపురశృంగస్థం రాక్షసేంద్రం దురాసదమ్. ౩
శ్వేతచామరపర్యంతం విజయచ్ఛత్రశోభితమ్
రక్తచందనసంలిప్తం రత్నాభరణభూషితమ్. ౪
నీలజీమూతసంకాశం హేమసంఛాదితాంబరమ్
ఐరావతవిషాణాగ్రైరుత్కృష్టకిణవక్షసమ్. ౫
శశలోహితరాగేణ సంవీతం రక్తవాససా
సంధ్యాతపేన సంవీతం మేఘరాశిమివాంబరే. ౬

టీక॥ రామః(అధ్యాహృతము) = రాముండు; తస్యాం=ఆలంకాపురియందు; గోపురశృంగస్థం = గోపురశిఖరమునందున్నవాఁడును; దురాసదం = కెనకఁగూడనివాఁడును ; శ్వేతచామరపర్యంతం= తెల్లనివింజామరలుపార్శ్వములందుగలవాఁడును; విజయచ్ఛత్రశోభితం=జయసూచకమయినగొడుగుచేఁ బ్రకాశించుచున్నవాఁడును ; రక్తచందనసంలిప్తం=ఎఱ్ఱనిచందనముచేతఁబూయఁబడినవాఁడును; రత్నాభరణభూషితం= రత్నమయములయినసొమ్ములచేతనలంకరింపఁబడినవాఁడును ; నీలజీమూతసంకాశం=నల్లనిమేఘంబుతోసమానుఁడును ; హేమసంఛాదితాంబరం= బంగారముచేఁగప్పఁబడినవస్త్రముగలవాఁడును ; ఐరావతవిషాణాగ్రైః=ఐరావతముయొక్కకొమ్ములకొనలచేత; ఉత్కృష్టకిణవక్షసం= గీఱఁబడుటయొక్కకాయలుగలఱొమ్ముగలవాఁడును;శశలోహితరాగేణ= కుందేటినెత్తురుయొక్కయెఱ్ఱఁదనమువంటియెఱ్ఱఁదనముగల; రక్తవాససా= ఎఱ్ఱనివస్త్రముచేత; సంవీతం= చుట్టఁబడినవాఁడును; అంబరే=ఆకాశమునందు ; సంధ్యాతపేన = సంధ్యాకాలమునందలియెండచేత;సంవీతం=చుట్టఁబడిన; మేఘరాశిమివ(స్థితం) = మేఘసమూహమువలెనున్నవాఁడునగు; రాక్షసేంద్రం= రాక్షసేశ్వరుండగురావణుని ; దదర్శ(అధ్యాహృతము)= చూచెను.

అంత, రాముండు, ఆలంకాపురి గోపురశిఖరంబుననుండిన, దురాసదుండును దెల్లనివింజామరలచేనిరుగెలంకుల వీవఁబడుచున్నవాఁడును జయసూచకంబగుశ్వేతచ్ఛత్రముతోఁ గూడినవాఁడును రక్తచందనాలంకృతుండును రత్నమయంబులగుసొమ్ములం దొడుగుకొన్నవాఁడును, నూతనమేఘంబువలెనల్లనిమేనివాఁడును, బలుమాఱుఐరావతగజంబుతోయుద్ధముచేసియుండుటవలనదానిదంతంబులపోటులచేఁగలిగిన కాయలతోనొప్పుచున్నవక్షస్థలంబుగల వాఁడునుగుందేటిరక్తంబువలె మిక్కిలియు నెఱ్ఱనైనబంగారుజరీవలువలంగట్టుకొన్నవాఁడగుటచే, సంధ్యారాగావృతంబగుమేఘసమూహముంబోలెఁ జూపట్టుచున్నవాఁడునగు, రాక్షసనాథుని రావణునింగనెను. అని, తాత్పర్యము.

పశ్యతాం వానరేంద్రాణాం రాఘవస్యాపి పశ్యతః

దర్శనాద్రాక్షసేంద్రస్య సుగ్రీవ స్సహసోత్థితః. ౭
క్రోధవేగేన సంయుక్త స్సత్త్వేనచ బలేనచ
అచలాగ్రాదథోత్థాయ పుప్లువే గోపురస్థలే. ౮

టీక॥ అథ=అంత ; వానరేంద్రాణాం=వానరశ్రేష్ఠులు;పశ్యతాం=చూచుచుండఁగా;రాఘవస్యాపి= రాముండును;పశ్యతః=చూచుచుండఁగా; సుగ్రీవః= సుగ్రీవుఁడు; రాక్షసేంద్రస్య=రాక్షసేశ్వరుండగు రావణునియొక్క ; దర్శనాత్=చూచుటవలన; క్రోధవేగేన=కోపవేగముతోను;సత్త్వేనచ= ధైర్యముతోను;బలేనచ= బలముతోను ; సంయుక్తః=కూడినవాఁడై ; అచలాగ్రాత్=పర్వతశిఖరముననుండి; సహసా=తటాలున;ఉత్థితః=లేచినవాఁడై; ఉత్థాయ=లేచి;గోపురస్థలే = గోపురప్రదేశమునందు;పుప్లువే=ఎగిరెను.

అంత,వానరశ్రేష్ఠులునురాముండును జూచుచుండఁగానే , సుగ్రీవుండు, రాక్షసరాజుండగురావణుంజూచుటవలనఁ,బరమకోపంబునొంది,బలధైర్యసమన్వితుండై, సువేలపర్వతశిఖరంబుననుండి,తత్క్షణంబున , యారావణుండున్నగోపురంబుపైకెగిరెను.

అని,తాత్పర్యము.

స్థిత్వా ముహూర్తం సంప్రేక్ష్య నిర్భయే నాంతరాత్మనా
తృణీకృత్యచ తద్రక్ష స్సోఽబ్రవీ త్పరుషం వచః. ౯

టీక॥ సః=ఆసుగ్రీవుఁడు;ముహూర్తం=కొంచెముసేపు;స్థిత్వా = ఉండి;సంప్రేక్ష్య=చూచి;నిర్భయేన= భయములేని;అంతరాత్మనా = మనస్సుతో;తత్=ఆ;రక్షః = రాక్షసుండగు రావణుని;తృణీకృత్యచ= తృణముగా నెంచియు;పరుషం=కఠినమయిన ; వచః = మాటను ; అబ్రవీత్ = చెప్పెను.

ఆసుగ్రీవుండు, కొంచెముసేపు రావణుంజూచుచుండి , నిర్భయంబుగా, నా రావణుం దృణీకరించి, పరుషవచనమునని ట్లని చెప్పెను.

అని,తాత్పర్యము.

లోకనాథస్య రామస్య సఖా దాసోఽస్మి రాక్షస

న మయా మోక్ష్యసేఽ ద్యత్వం పార్థివేంద్రస్య తేజసా. ౧౧

టీక॥ రాక్షస=రాక్షసుఁడవగు రావణుఁడా! అహం(అధ్యాహృతము)= నేను; లోకనాథస్య= లోకంబులకుఁ బ్రభుండగు ; రామస్య = రామునియొక్క; సఖా=స్నేహితుండను; దాసః= దాసుండను; అస్మి=అగుచున్నాను. అద్య=ఇప్పుడు; త్వం=నీవు; పార్థివేంద్రస్య= రాజశ్రేష్ఠుండగు రామునియొక్క; తేజసా=పరాక్రమముచేత; మయా = నాచేత; న మోక్ష్యసే విడువఁబడవు.

రావణుఁడా! నేను, లోకనాథుండగు రాముని స్నేహితుండను దాసుండను; రాజశ్రేష్ఠుండగు రాముని తేజోబలంబున, నిన్నిప్పుడు నేనువిడువను. అని, సుగ్రీవుండు రావణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా సహసో త్పత్య పుప్లువే తస్య చోపరి
ఆకృష్య మకుటం చిత్రం పాతయిత్వా పత ద్భువి. ౧౧

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ సుగ్రీవుఁడు; ఇతి=ఇట్లు; ఉక్త్వా= చెప్పి; సహసా=వేగంబున; ఉత్పత్య= ఎగిరి; తస్య=ఆరావణునియొక్క; ఉపరిచ= మైకిని; పుప్లువే=ఎగిరెను; చిత్రం = నానావర్ణమయిన; మకుటం = కిరీటమును; ఆకృష్య=ఊడ్చి; పాతయిత్వా= పడఁద్రోసి; భువి=నేలయందు ; అపతత్ =వ్రాలెను.

ఆసుగ్రీవుండిట్లు, రావణుతోఁ జెప్పి, తటాలునఁ బైకెగిరి, యతనికిరీటంబు నేలంబడఁద్రోసి, క్రిందికి వ్రాలెను.

అని, తాత్పర్యము.

సమీక్ష్య తూర్ణ మాయాంత మాబభాషే నిశాచరః

టీక॥ నిశాచరః= రాక్షసుఁడయిన రావణుఁడు; తూర్ణం= శీఘ్రముగా; ఆయాంతం=వచ్చుచున్న; తం= ఆసుగ్రీవుని; సమీక్ష్య=చూచి; ఆబభాషే= చెప్పెను.

రావణుండు , అతివేగంబునఁ దన

మీఁదికెడురుచున్న సుగ్రీవుంజూచి , యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సుగ్రీవ స్త్వం పరోక్షం మే హీనగ్రీవో భవిష్యసి. ౧౨

టీక॥ త్వం=నీవు; మే=నాయొక్క; పరోక్షం=మఱుఁగునను; సుగ్రీవః= సుందరమయినకంఠముగలవాఁడవు. హీనగ్రీవః=విడువఁబడినకంఠముగలవాఁడవు; భవిష్యసి=కాఁగలవు.

నీవునాపరోక్షంబున, సుందరమగు కంఠముగలిగియుంటివి ; ఇప్పుడునాసమక్షమునకువచ్చినావుకావున , నింకఁ గంఠములేనివాఁడవవుదువు.అని , రావణుండు,సుగ్రీవునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వో త్థాయ తం క్షిప్రం బాహుభ్యా మాక్షిప త్తలే
కందుకవ త్తం సముత్థాయ బాహుభ్యా మాక్షిప ద్ధరిః. ౧౩

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ రావణుఁడు; ఇతి=ఇట్లు; ఉక్త్వా = చెప్పి; ఉత్థాయ=లేచి; క్షిప్రం= శీఘ్రమునను; బాహుభ్యాం=చేతులచేత ; తం= ఆసుగ్రీవుని; తలే = గోపురప్రదేశమునందు; ఆక్షిపత్=త్రోసెను . హరిః= సుగ్రీవుఁడు; కందుకవత్ = చెండువలె; సముత్థాయ=ఎగిరి ; బాహుభ్యాం= చేతులచేత; తం=ఆరావణుని; ఆక్షిపత్=త్రోసెను.

ఆరావణుఁడు,ఇట్లుచెప్పి , శీఘ్రంబునలేచి,యాసుగ్రీవునిఁ జేతులతో నేలంబడఁద్రోసెను ; అంతనాసుగ్రీవుఁడు, చెండువలెఁదటాలుననెగిరి, రెండుచేతులచేతను, ఆరావణుంబడఁద్రోసెను.

అని, తాత్పర్యము.

పరస్పరం స్వేదవిదగ్ధ గాత్రౌ
పరస్పరం శోణితదిగ్ధదేహౌ
పరస్పరం శ్లిష్టనిరుద్ధచేష్టౌ
పరస్పరం శాల్మలికింశుకౌ యథా. ౧౪

టీక॥ తౌ(అధ్యాహృతము)=ఆసుగ్రీవరావణులు; పరస్పరం= ఒండొరు

లును; స్వేదవిదగ్ధగాత్రౌ= చెమటచేఁదడుపఁబడినదేహముగలవారలయి; పరస్పరం=ఒండొరులును ; శోణితదిగ్ధదేహౌ= నెత్తురుచేతఁ బూయఁబడినదేహముగలవారలయి;పరస్పరం=ఒండొరులును;శ్లిష్టనిరుద్ధచేష్టౌ= ఆలింగనములచేతనడ్డగింపఁబడినకదలుటలు గలవారలయి;పరస్పరం=ఒండొరులును; శాల్మలికింశుకావివ = బూరుగుచెట్టును మోదుగుచెట్టునువలె; రేజతుః(అధ్యాహృతము)=ప్రకాశించిరి.

ఆరావణసుగ్రీవులు , దేహమంతయుఁజెమటగాఁ, దేహమంతయు నెత్తురు జాల్గువలుగా, యుద్ధము సేయుచుఁ, గొంతదడవుపరస్పర దృఢాలింగనంబునని శ్లేష్టులయి, యంత విడివడుచుఁ బుష్పితంబులగు శాల్మలికింశుకవృక్షంబులుంబోలెఁబ్రకాశించుచుండిరి. అని, తాత్పర్యము.

ముష్టిప్రహారైశ్చ తలప్రహారై
రరత్నిఘాతైశ్చ కరాగ్రఘాతైః
తౌ చక్రతు ర్యుద్ధ మసహ్యరూపం
మహాబలౌ వానర రాక్షసేంద్రౌ

టీక॥మహాబలౌ= అధికమయినబలముగల; తౌ=ఆ;వానరరాక్షసేంద్రౌ= వానరరాజుండగుసుగ్రీవుండును రాక్షసరాజుండగురావణుండును; ముష్టిప్రహారైశ్చ= పిడికిలిదెబ్బలచేతను; తలప్రహారైః=అఱచేతిదెబ్బలచేతను; అరత్నిఘాతైశ్చ= మోఁచేయిదెబ్బలచేతను; కరాగ్రఘాతైః= గోళ్లగీఱుటలచేతను; అసహ్యరూపం=మిక్కిలియు నసహ్యమయిన; యుద్ధం= యుద్ధమును; చక్రతుః=చేసిరి.

మహాబలశాలులగు నాసుగ్రీవరావణులు ఒండొరులఁబిడికిళ్ల గ్రుద్దుకొనియు, నఱచేతులం బడుకొనియు ; మోచేతులం బొడుచుకొనియు గోళ్ల గీఱుకొనియు, నిట్లునానావిధంబును , భయంకర ప్రకారంబునగు యుద్ధంబు గావించిరి. అని, తాత్పర్యము.

కృత్వా నియుద్ధం భృశ ముగ్రవేగౌ

కాలం చిరం గోపురవేదిమధ్యే
ఉత్క్షిప్య చాక్షిప్య వినమ్య దేహౌ
పాదక్రమా ద్గోపురవేదిలగ్నౌ. ౧౫
అన్యోన్య మావిధ్య విలగ్నదేహౌ
తౌ పేతతు స్సాలనిఖాతమధ్యే

టీక॥ ఉగ్రవేగౌ=భయంకరమగు సవేగముగలయాసుగ్రీవరావణులు; గోపురవేదిమధ్యే= గోపురమునందలితిన్నెలనడుమను; చిరం=అధికమయిన; కాలం=కాలమునందు; భృశం= మిక్కిలియు; నియుద్ధం = బాహుయుద్ధమును; కృత్వా=చేసి; ఉత్క్షిప్య= ఎగురఁగొట్టుకొని; ఆక్షిప్య=ఈడ్చుకొని; దేహౌ= దేహములను; వినమ్య=వంచుకొని; పాదక్రమాత్=పాదన్యాసమువలన; గోపురవేదిలగ్నౌ=గోపురమునందలితిన్నెలతోసంబంధించినవారలయి ; అన్యోన్యం=ఒండొరులను; ఆవిధ్య=కొట్టుకొనియు; విలగ్నదేహౌ= సంబంధించిన దేహములుగలవారలయి; సాలనిఖాతమధ్యే= ప్రాకారముయొక్కయునగడ్తలయొక్కయునడుమ ; పేతతుః= పడిరి.

భయంకరవేగులగు నాసుగ్రీవరావణులు, గోపురవేదిమధ్యంబున, బహుకాలము బాహుయుద్ధము గావించి, యొకరినొకరు దోసికొనుచును ఈడ్చుకొనుచు వంచుకొనుచు గోపురవేదికలయందుండి యొకరిపైనొకరుపడికొట్టుకొనుచు నొక్కరినొకరుదృఢంబుగాఁ గవుఁగిలించుకొని, ప్రాకారపరిఖలనడుమఁబడిరి. అని, తాత్పర్యము.

ఉత్పేతతు ర్భూతల మస్పృశంతౌ
స్థిత్వా ముహూర్తం త్వభినిశ్శ్వసంతౌ. ౧౬
ఆలింగ్య చాపీడ్య చ బాహుయోక్త్రై
స్సంయోజయామాసతు రాహవే తౌ

టీక॥ తౌ=ఆసుగ్రీవరావణులు; ఆహవే=యుద్ధమునందు ; భూతలం =

నేలను, అప్లుత్యంతౌ= తాఁకనివార లయి; ఉత్పేతతుః=ఎగిరిరి . ముహూర్తం=కొంచెముసేపు; స్థిత్వా=ఉండి; అభినిశ్శ్వసంతౌ= నిట్టూర్పులువుచ్చుచు; ఆలింగ్య=కవుఁగిలించుకొనియు; ఆవల్గ్యచ=ఎగిరియు; బాహుయోక్త్రైః=చేతులనెడుపాశములచేత; సంయోజయామాసతుః=చుట్టుకొనిరి.

యుద్ధంబున, వాసుగ్రీవరావణులు, నేలనుండి యాకాశంబున కుద్గమించి యందుఁగొంతదడవుండి, నిట్టూర్పులు వుచ్చుచు, వొకరినొకరుకవుఁగిలించుకొని మెగురుచు, బాహుపాశంబులఁబరస్పరముబంధించుకొనిరి.

అని, తాత్పర్యము.

సంరంభశిక్షాబలసంప్రయుక్తౌ
సంచేరతు స్సంప్రతి యుద్ధమార్గైః. ౧౭
శార్దూలసింహావివ జాతదర్పౌ
గజేంద్రపోతావివ సంప్రయుక్తౌ

టీక॥సంప్రతి = అప్పుడు; తౌ(అధ్యాహృతము)= ఆసుగ్రీవరావణులు; సంరంభశిక్షాబలసంప్రయుక్తౌ= అభినివేశముతోను అభ్యాసముతోను బలముతోను గూడినవారలయి; జాతదర్పౌ= కలిగినగర్వములుగల; శార్దూలసింహావివ=పెద్దపులులలోను త్తమములగు నవివలె; గజేంద్రపోతావివ= ఏనుంగుగున్నలువలె; సంప్రయుక్తౌ= సంబంధించినవారలయి; యుద్ధమార్గైః=యుద్ధమార్గములచేత; సంచేరతుః=సంచరించిరి.

అప్పుడు, ఆసుగ్రీవరావణులు, అభినివేశంబునను అభ్యాసంబునను బలంబునను, బెబ్బులులువలె ఏనుంగుపిల్లలుంబోలె, నానావిధ యుద్ధమార్గంబులం జెనంగిరి. అని, తాత్పర్యము.

సంహృత్య చాపీడ్యచ తౌ భుజాభ్యాం
నిపేతతు ర్వై యుగప ద్ధరణ్యామ్. ౧౮
ఉద్యమ్య చాన్యోన్య మధిక్షిపంతౌ
సంచక్రమాతే బహుయుద్ధమార్గైః

టీక॥ తౌ = ఆసుగ్రీవరావణులు; సంహత్య=కవుఁగిలించుకొనియు; ఉరోభ్యాం=వక్షస్థలములచేత; ఆపీడ్య చ = కొట్టుకొని; యుగపత్=ఏకకాలంబున; ధరణ్యాం=భూమియందు; నిపేతతుః= పడిరి. ("వై" అనునది పాదపూరణార్థము). ఉద్యమ్య=పట్టుకొనియు; అన్యోన్యం=ఒండొరులను; అధిక్షిపంతౌ=ఆక్షేపించుచు; బహుయుద్ధమార్గైః= పెక్కుయుద్ధమార్గములచేత; సంచక్రమాతే=సంచరించిరి.

ఆసుగ్రీవరావణులు, ఒకరినొకరు కవుఁగలించుకొని, ఱొమ్ములచేఁగొట్టుకొని యిద్దఱు నేకకాలంబున నేలంబడి; అంత నొకరినొకరు పట్టుకొని యాక్షేపించికొనుచు, నిట్లు నానావిధంబులుగ యుద్ధంబు గావించిరి.

అని, తాత్పర్యము.

వ్యాయామశిక్షాబలసంప్రయుక్తౌ
క్లమం న తౌ జగ్మతు రాశు వీరౌ. ౧౯
బాహూత్తమై ర్వారణవారణాభై
ర్నివారయంతౌ వరవారణాభౌ

టీక॥ వ్యాయామశిక్షాబలసంప్రయుక్తౌ = సాముయొక్క యభ్యాసముచేఁగలిగినబలముతోఁగూడినవారలును; వీరౌ=పరాక్రమశాలులును; వరవారణాభౌ = శ్రేష్ఠములయినయేనుంగులయొక్క కాంతివంటి కాంతిగలవారలు నగు; తౌ=ఆసుగ్రీవరావణులు; వారణవారణాభైః= ఏనుంగులకట్టుస్తంభములయొక్క కాంతివంటికాంతిగల; బాహూత్తమైః = చేతులలోనుత్తమములగువానిచేత; నివారయంతౌ = అడ్డగించుకొనుచును; ఆశు = శీఘ్రముగా; క్లమం=అలసటను; నజగ్మతుః= పొందరైరి.

చక్కఁగా సాముచేసి యున్నవారలు కావున, పరాక్రమవంతులును మదపుటేనుంగులవంటివారలు నగు నాసుగ్రీవరావణులు, ఏనుంగులంగట్టు స్తంభంబులవంటి బాహువుల నొండొరులం గొట్టుకొనుచున్నను, అలసట నొందరైరి. అని, తాత్పర్యము.

చిరేణ కాలేనతు సంప్రయుక్తౌ
సంచేరతు ర్మండలమార్గ మాశు. ౨౦

టీక॥ చిరేణ=అధికమయిన; కాలేన తు=కాలముచేతనె; సంప్రయుక్తౌ=కలసినసుగ్రీవరావణులు; ఆశు=శీఘ్రముగా; మండలమార్గం=చక్రాకారమార్గమును; చేరతుః=పొందిరి.

ఆసుగ్రీవరావణులు, ఇట్లు, బహుకాలముయుద్ధముసేయుచుండి, యంత, మండలాదినానావిధమార్గంబులఁ, దమతమయుద్ధక్రమసాధన చమత్కారంబు తేటపడ, యుద్ధంబుగావించిరి.

అని, తాత్పర్యము.

తౌ పరస్పర మాసాద్య యత్తా వన్యోన్యసూదనే
మార్జాలావివ భక్ష్యార్థే వితస్థాతే ముహుర్ముహుః. ౨౧

టీక॥ తౌ=ఆసుగ్రీవరావణులు; పరస్పరం=ఒండొరులను; ఆసాద్య=పొంది; అన్యోన్యసూదనే=ఒండొరులచంపుటయందు; యత్తౌ=ఆసక్తులయి; భక్ష్యార్థే=ఆహారనిమిత్తము; మార్జాలావివ=పిల్లులవలె; ముహుర్ముహుః=పలుమారు; వితస్థాతే=ఉండిరి.

ఆసుగ్రీవరావణులు, ఒకరినొకరువధింపనాసక్తులయి, యాహారమునకైపొంచియుండుపిల్లులవలె, నప్పడప్పుడు, ఒకరిఛిద్రంబునొకరువెదకుచుండిరి.

అని, తాత్పర్యము.

మండలాని విచిత్రాణి స్థానాని వివిధానిచ
గోమూత్రికాణి చిత్రాణి గతప్రత్యాగతానిచ. ౨౨
తిరశ్చీనగతాన్యేవ తథా వక్రగతానిచ
పరిమోక్షం ప్రహారాణాం వర్జనం పరిధావనమ్. ౨౩
అభిద్రవణ మాప్లావ మాస్థానంచ సవిగ్రహమ్
పరావృత్త మపావృత్త మవద్రుత మవప్లుతమ్. ౨౪
ఉపన్యస్త మపన్యస్తం యుద్ధమార్గ విశారదౌ
తౌ సంచేరతు రన్యోన్యం వానరేంద్రశ్చ రావణః. ౨౫

టీక॥ యుద్ధమార్గవిశారదౌ=యుద్ధమార్గములందుఁ బండితులయిన; తౌ=ఆ; వానరేంద్రశ్చ=సుగ్రీవుఁడును; రావణశ్చ=రావణుండు

నుః విచిత్రాణి=నానావిధములగు; మండలాని = చక్రాకారగతులను ; వివిధాని=నానావిధములయిన; స్థానాని చ= వైష్ణవ వైశాఖమండలప్రత్యాలీఢాలీఢములను స్థానములను ; చిత్రాణి=నానావిధములయిన; గోమూత్రికాణి=గోమూత్రమువంటి కుటిలగమనములను; గతప్రత్యాగతానిచ=దగ్గఱకుఁబోవుటలను వెనుకకుఁబోవుటలను; తిరశ్చీనగతాన్యేవ = తిర్యగ్గమనములను ; తథా=అట్లు ; వక్రగతానిచ = సవ్యాపసవ్యసంచారములను ; ప్రహారాణాం = దెబ్బల యొక్క ; పరిమోక్షం=తప్పించుకొనుటను ; వర్జనం=విడుచుటను; పరిధావనం = చుట్టుదిరుగుటను; అభిద్రవణం=అభిముఖముగాఁబోవుటను; ఆప్లావం=కొంచెముపోవుటను; సవిగ్రహం= నిర్భయతతోఁగూడిన; ఆస్థానం= ఉండుటను; పరావృత్తం= పరాఙ్ముఖుఁడైపోవుటను ; అపావృత్తం= వెనుకకుఁబోవుటను; అవద్రుతం = శరీరమును సంకోచించివంగిపోవుటను ; అవప్లుతం = అధోముఖముగాఁ బోవుటను; ఉపన్యస్తం = ఎదిరిచేయిపట్టుకొనుటకై తనచెయ్యిఁబట్టుకొనుటను; అపన్యస్తం = ఎదిరికిఁబట్టీవ్వకుండుటకై తనచేతినిముడుచుకొనుటను; అన్యోన్యం=ఒండొరులనుగూర్చి ; సంచేరతుః=చేసిరి.

యుద్ధమార్గంబులం బండితులగు నా సుగ్రీవరావణులు, చక్రాకారగమనంబులును వైష్ణవ వైశాఖ మండలప్రత్యాలీఢాలీఢములను స్థానములును, గోమూత్రమువంటికుటిలగమనములును ఉపసర్పణాపసర్పణములునుదిర్యగ్గమనములును సవ్యాపసవ్యవక్రగమనములును ఎదిరిదెబ్బలదప్పించుకొనుట తనదెబ్బనుదప్పించుకొనునెదిరికిఁదెలిసినప్పుడు దెబ్బనుపసంహరించుట ఎదిరినిలుచుండఁగా నతని చుట్టుఁ దిరుగుట అభిముఖగమనము ఈషద్గమనము ధైర్యమున నెదిరిని నిగ్రహించి స్థిరంబుగా నుండుట పరాఙ్ముఖ గమనంబు నిలుచున్నట్లే యుండి వెనుకకుఁ బోవుట శరీరసంకోచంబున నెదిరిపట్టున నుండి తప్పించుకొనుట ఎదిరిని గాలం దన్నుటకై యధోముఖంబుగా నెగురుట , ఎదిరిచేయిఁబట్టుకొనుటకై తనచేయి చాఁచుట , ఎదిరితనచేయిఁబట్టుకొన యత్నించినప్పుడుతనచేయినిముడుచు కొనుట , ఈమార్గములన్నియుఁ బ్రయోగించుచు, యుద్ధంబు గావించిరి.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరే రక్షో మాయాబల మథాత్మనః
ఆరబ్ధు ముపసంపేదే

టీక॥ అథ=అంత ; ఏతస్మిన్ అంతరే=ఈమధ్యమునందు; రక్షః= రాక్షసుఁడగు రావణుఁడు;ఆత్మనః=తనయొక్క;మాయాబలం = మాయాబలమును; ఆరబ్ధుం=చేయుటకు ; ఉపసంపేదే=ఆరంభించెను.

అంత,నట్లుపోరుచుండునప్పుడు,రావణుండుసొలితనమాయాబలంబుఁజూపనారంభించెను. అని,తాత్పర్యము.

జ్ఞాత్వా తం వానరాధిపః. ౨౬
ఉత్పపాత తదాకాశం జితకాశీ జితక్లమః

టీక॥జితకాశీ=జయముచేఁ బ్రకాశించుచున్నవాఁడును;జితక్లమః = జయింపఁబడినయలసటగలవాఁడును;వానరాధిపః= వానరరాజుండునగుసుగ్రీవుండు;తం=ఆరావణుని;జ్ఞాత్వా= ఎఱింగి;తదా=అప్పుడు;ఆకాశం= ఆకసమునుగూర్చి; ఉత్పపాత=ఎగిరెను.

జయశాలియు శ్రమములేనివాఁడునగుసుగ్రీవుండు,ఆరావణునితలంపెఱింగి, తటాలుననాకాశంబునకెగసెను. అని, తాత్పర్యము.

రావణ స్థ్సిత ఏవాత్ర హరిరాజేన వంచితః. ౨౭

టీక॥ రావణః=రావణుఁడు; హరిరాజేన= వానరేశ్వరుఁడగుసుగ్రీవునిచేత; వంచితః= మోసపుచ్చఁబడినవాఁడై; అత్రైవ = ఇచ్చటనె; స్థితః = ఉండెను.

రావణుండు , సుగ్రీవుండు మఱలవచ్చునని మోసపోయియచ్చటనెయుండెను. అని, తాత్పర్యము.

అథ హరివరనాథః ప్రాప్య సంగ్రామకీర్తిం
నిశిచరపతి మాజౌ యోజయిత్వా శ్రమేణ

గగన మతివిశాలం లంఘయిత్వా రకసూను
హరివరగణమధ్యే రామపార్శ్వం జగామ. ౭౮

టీక॥అథ=అంత;అర్కసూనుః = సూర్యునికొడుకైన; హరివరనాథః=వానరవరులకుఁబ్రభువగు సుగ్రీవుఁడు; సంగ్రామకీర్తిం=యుద్ధముచేఁ గలిగిన కీర్తిని;ప్రాప్య=పొంది;ఆజౌ= యుద్ధమునందు;నిశిచరపతిం= రాక్షసనాయకుండగురావణుని;శ్రమేణ = అలసటతో; యోజయిత్వా=కూడునట్లుచేసి; అతివిశాలం=మిక్కిలియు విశాలమయిన;గగనం= ఆకాశమును ; లంఘయిత్వా=దాఁటి;హరివరగణమధ్యే= వానరశ్రేష్ఠులసమూహమునడుమ; రామపార్శ్వం=రామునిప్రక్కను ; జగామ=పొందెను.

అంత, సూర్యపుత్రుండగుసుగ్రీవుండు, యుద్ధంబున, రాక్షసేశ్వరుండగు రావణునిసోలించికీర్తినొంది, యతివిశాలంబగునాకాశంబునకు లంఘించి, వానరమధ్యంబున,రామునిపార్శ్వభాగంబుఁజేరెను. అని,తాత్పర్యము.

ఇతి స సవితృసూను స్తత్ర తత్కర్మ కృత్వా
పవనగతి రనీకం ప్రావిశ త్సంప్రహృష్టః
రఘువరనృపసూనో ర్వర్ధయన్ యుద్ధహర్షం
తరుమృగగణ ముఖ్యైః పూజ్యమానో హరీంద్రః. ౭౯

టీక॥సవితృసూనుః=సూర్యపుత్రుండగు;సః=ఆ; హరీంద్రః=వానరాధిపతియయినసుగ్రీవుఁడు; ఇతి=ఇట్లు; తత్ర=అచ్చట; తత్ =ఆ; కర్మ= కార్యమును; కృత్వా= చేసి; సంప్రహృష్టః=మిక్కిలియుసంతసించినవాఁడై ; రఘువరనృపసూనోః=రఘువంశమునందుఁబుట్టినవారలలో శ్రేష్ఠుఁడగుదశరథమహారాజుకొడుకైన రామునికి;యుద్ధహర్షం = యుద్ధసంతోషమును; వర్ధయన్=వృద్ధిఁబొందించుచు ; తరుమృగగణముఖ్యైః=వానరసమూహములోముఖ్యులయినవానరులచేత; పూజ్యమానః=పూజింపఁబడుచు;పవనగతిః=వాయువుయొక్కగమనమువంటిగమనముగలవాఁడై; అనీకం=సేనను; ప్రావిశత్ =ప్రవేశించెను.

సూర్యకుమారుండగునా సుగ్రీవుం

దు,అట్లు,రావణునితో యుద్ధంబు గావించి,పరమసంతుష్టుండై, శ్రీరామునకుయుద్ధోత్సాహంబు వృద్ధిఁబొందించుచు,వానరవీరులచేఁబూజ్యమానుండై' వాయువేగంబున,వానరసేనం బ్రవేశించెను.అని,తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
యుద్ధకాండే , చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,యుద్ధకాండ చత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

౪౧

ఏకచత్వారింశసర్గ ప్రారంభః.

అథ తస్మి న్నిమిత్తాని దృష్ట్వా లక్ష్మణపూర్వజః
సుగ్రీవం సంపరిష్వజ్య తదా వచన మబ్రవీత్. ౧

టీక॥అథ=అంత;తదా= అప్పుడు; లక్ష్మణపూర్వజః=లక్ష్మణుని యన్నయగు రాముండు;తస్మిన్=ఆసుగ్రీవునియందు;నిమిత్తాని= చిహ్నములను ; దృష్ట్వా=చూచి;సుగ్రీవం=సుగ్రీవుని;సంపరిష్వజ్య=కవుఁగిలించుకొని; వచనం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

అంత,నప్పుడు,లక్ష్మణాగ్రజుండగు రాముండు,సుగ్రీవునియందు, యుద్ధచిహ్నంబులంజూచి , యతనింగవుఁగిలించుకొని,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము,

అసమ్మంత్ర్య మయాసార్థం తదిదం సాహసం కృతం
ఏవం సాహస కర్మాణి న కుర్వంతి జనేశ్వరాః. ౨

టీ॥త్వయా(అధ్యాహృతము)-నీచేత;మయాసార్థం=నాతోఁగూడ;అసమ్మంత్ర్య-




ఆలోచింపక; తత్=అట్టి; ఇదం=ఈ; సాహసం=తెగువపని; కృతం=చేయఁబడినది. జనేశ్వరాః=రాజులు; ఏవం=ఇట్లు; సాహసకర్మాణి=తెగువపనులను; నకుర్వంతి=చేయరు.

నీవు, నాతో నాలోచింపక, గొప్ప సాహసము గావించినావు; రాజులు, ఇట్లింతమాత్రము సాహస కార్యములం జేయరు. అని, తాత్పర్యము.

సంశయే స్థాప్య మాంచేదం బలంచ స విభీషణమ్
కష్టం కృతమిదం వీర సాహసం సాహసప్రియ. ౩

టీక॥ సాహసప్రియ=సాహసమిష్టముగాఁగల; వీర=పరాక్రమశాలివగు రాముఁడా! త్వయా (అధ్యాహృతము)=నీచేత; మాంచ=నన్నును; సవిభీషణం=విభీషణునితోఁగూడిన; ఇదం=ఈ; బలంచ=సైన్యమును; సంశయే=సందేహమునందు; స్థాప్య (స్థాపయిత్వా)=ఉంచి; కష్టం=కష్టమయిన; ఇదం=ఈ; సాహసం=తెగువ; కృతం=చేయఁబడినది.

సాహసప్రియుండవు వీరుండవునగు సుగ్రీవుఁడా! నీవు, నాకును విభీషణునకును ఈ వానర సైన్యమునకంతయు గొప్పసందేహము గల్గునట్లు చేసి, యపాయకరమయిన యీ సాహస కార్యము గావించినావు. అని, తాత్పర్యము.

ఇదానీం మాకృథా వీర ఏవం విధ మచింతితమ్

టీక॥ వీర=పరాక్రమశాలివగు సుగ్రీవుఁడా! ఇదానీం=ఇప్పుడు; ఏవంవిధం=ఇట్టిదానిని; అచింతితం=ఆలోచింపఁబడకుండునట్లుగా; మాకృథాః=చేయకుము.

వీరుండవగు సుగ్రీవుఁడా! ఇంక నైననిట్టి కార్యమును, ఆలోచింపక, గావింపకుము. అని, తాత్పర్యము.

త్వయి కించి త్సమాపన్నే కిం కార్యం సీతయా మమ. ౪
భరతేన మహాబాహో లక్ష్మణేన యవీయసా
శత్రుఘ్నేనచ శత్రుఘ్న స్వశరీరేణవా పునః. ౫




టీక॥ మహాబాహో = పెద్దచేతులు గలవాఁడవు; శత్రుఘ్న = శత్రువులఁజంపునట్టివాఁడవునగుసుగ్రీవుఁడా! త్వయి = నీవు; కించిత్ = ఁజేసినైనను ; సమాపన్నే = పొందినవాఁడవుకాఁగా; మమ = నాకు; సీతయా = సీతచేఁగాని ; భరతేన = భరతునిచేత గాఁని; యవీయసా = తమ్ముఁడైన; లక్ష్మణేన = లక్ష్మణునిచేతఁగాని; శత్రుఘ్నేనచ = శత్రుఘ్నునిచేత నుంగాని; పునః = ఇంక; స్వశరీరేణవా = నాదేహముచేతనుంగాని; కార్యం = పని; కిం = ఏమి?

మహాబాహుండవు శత్రువుల వధించువాఁడవునగుసుగ్రీవుఁడా! నీకు, ఏమైన హానిగలుగునెడ, సీతతోఁగాని భరతునితోఁగాని లక్ష్మణునితోఁగాని శత్రుఘ్నునితోఁగాని నాదేహముతోఁగాని, నాకేమికార్యము? అని, తాత్పర్యము.

త్వయిచా నాగతే పూర్వమితి మే నిశ్చితామతిః
జానతశ్చాపి తే వీర్యం మహేంద్ర వరుణోపమ. ౬

టీక॥ మహేంద్రవరుణోపమ = దేవేంద్రునితోను వరుణునితోనుబోలిక గలసుగ్రీవుఁడా! త్వయిచ = నీవును; అనాగతే = రానివాఁడవయియుండఁగా; పూర్వం = మున్ను; తే = నీయొక్క; వీర్యం = పరాక్రమమును; జానతశ్చాపి = తెలిసినవాఁడనైనను; మే = నాకు; మతిః = బుద్ధి; ఇతి = ఇట్లు; నిశ్చితా = నిశ్చయమునొందినది.

దేవేంద్రవరుణుల పరాక్రమము వంటిపరాక్రమముగలసుగ్రీవుఁడా! నీవు రాకమునుపు, నాకునీపరాక్రమముతెలిసియున్నను, ఈప్రకారము నిశ్చయించియుంటిని. అని, తాత్పర్యము.

హత్వాహం రావణం యుద్ధే సపుత్ర బలవాహనమ్
అభిషిచ్యచ లంకాయాం విభీషణ మథాపిచ. ౭
భరతే రాజ్యమావేశ్య త్యక్ష్యే దేహం మహాబల

టీక॥ మహాబల = అధికమయినబలముగలసుగ్రీవుఁడా! అహం = నేను; యుద్ధే = యుద్ధమునందు; సపుత్రబలవాహనం = కొడుకులతోను సైన్యముతోను గు

ట్టములతోనుగూడుకొనిన; రావణం=రావణుని;హత్వా= చంపి ; లంకాయాం=లంకాపురియందు; విభీషణం=విభీషణుని;అభిషిచ్యచ = అభిషేకించియు;అథాపిచ=అటుపిమ్మటను ; భరతే=భరతునియందు;రాజ్యం= రాజ్యమును;ఆవేశ్య=ఉంచి;దేహం = దేహమును;త్యక్ష్యే=విడువఁగలను.

మహాబలుండవగు సుగ్రీవుఁడా! నేనుయుద్ధంబున రావణునిపుత్రబంధు సైన్యసమేతంబుగావధించి, లంకయందు విభీషణుఁబట్టాభిషిక్తుంగావించి , యయోధ్యకుఁబోయి రాజ్యమును భరతునియధీనముఁజేసి, దేహంబువిడిచెదను. అని,యిట్లునిశ్చయించుకొని యుంటిని. అని,రాముండుసుగ్రీవునితోఁ జెప్పెను.

అని. తాత్పర్యము.

తమేవం వాదినం రామం సుగ్రీవః ప్రత్యభాషత. ౮

టీక॥ సుగ్రీవః=సుగ్రీవుఁడు; ఏవం వాదినం=ఇట్లుచెప్పుచున్న; తం=ఆ ; రామం= రామునిగూర్చి; ప్రత్యభాషత=బదులుచెప్పెను.

సుగ్రీవుఁడు, రాముండట్లుచెప్పినమాటనువిని, ఇట్లని,బదులుచెప్పెను.

అని, తాత్పర్యము.

తవ భార్యాప హర్తారం దృష్ట్వా రాఘవ రావణమ్
మర్షయామి కథం వీర జానన్ పౌరుష మాత్మనః. ౯

టీక॥వీర=పరాక్రమశాలివగు; రాఘవ=రాముఁడా!తవ=నీయొక్క; భార్యాపహర్తారం=భార్యనపహరించినట్టి;రావణం=రావణుని ; దృష్ట్వా=చూచి;ఆత్మనః=నాయొక్క ; పౌరుషం=పౌరుషమును;కథం=ఎట్లు ; మర్షయామి=సహింతును?

పరాక్రమ వంతుండవగు రాముఁడా!నీభార్యనపహరించినట్టి దుష్టుఁడగురావణునిజూచి నేను పౌరుషంబుగలవాఁడనై యుండి,యెట్లుసహింతును? అని,సుగ్రీవుండు రామునితోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఇత్యేవం వాదినం వీర మభినంద్య స రాఘవః
లక్ష్మణం లక్ష్మిసంపన్న మిదంవచన మబ్రవీత్. ౧౦

టీక॥ సః=ఆ; రాఘవః= రాముఁడు; ఇత్యేవంవాదినం=అనియిట్లుచెప్పుచున్నట్టి; వీరం= పరాక్రమశాలియగు సుగ్రీవుని; అభినంద్య= పొగడి; లక్ష్మిసంపన్నం=కాంతితోఁగూడిన ; లక్ష్మణం=లక్ష్మణునిఁగూర్చి; ఇదం=ఈ;వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత,రాముండు, సుగ్రీవునిమాటనువిని, కాంతిమంతుండగు లక్ష్మణుంజూచి, యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

పరిగృహ్యోదకం శీతం వనాని ఫలవంతిచ
బలౌఘం సంవిభజ్యేమం వ్యూహ్య తిష్ఠేమ లక్ష్మణ. ౧౧

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా!శీతం=చల్లని;ఉదకం=జలమును;ఫలవంతి=ఫలములుగల;వనానిచ=వనములను; పరిగృహ్య=గ్రహించి;ఇమం=ఈ; బలౌఘం=సేనాసమూహమును ; సంవిభజ్య=చక్కఁగానేర్పఱచి; వ్యూహ్య=వ్యూహంబులుగాఁదీర్చి;తిష్ఠేమ=ఉందము.

లక్ష్మణుఁడా!మనము, చల్లనిజలంబునుమంచిఫలంబులతోఁగూడిన వనంబులుంగల ప్రదేశంబుఁజేరి, సైన్యంబులఁజక్కఁగావిభజించివ్యూహంబులుగాఁదీర్చుకొనియుందము.

అని, తాత్పర్యము.

లోకక్షయకరం భీమం భయం పశ్యా మ్యుపస్థితమ్
నిబర్హణం ప్రవీరాణా మృక్షవానర రక్షసామ్. ౧౨

టీక॥ లోకక్షయకరం= లోకనాశమునుజేయునదియు; భీమం = భయంకరమయినదియునగు; ప్రవీరాణాం = మిక్కిలియువీరులగు ; ఋక్షవానరరక్షసాం = ఎలుఁగుగొడ్డులయొక్కయు వానరులయొక్కయు రాక్షసులయొక్కయు. నిబర్హణం=వధమును ; భయం=భయమును; ఉపస్థితం=సమీపించినదానిఁగా ; పశ్యామి = చూచుచున్నాను.

స ౪౧

లోకనాశకరంబును భయంకరంబు నునగుభయంబొకటివాటిల్లి, ఋక్షవానరవీరులను రాక్షసవీరులను బెకరించుట్రిహాతులగుదురనితోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

వాతాశ్చ పరుషా వాంతి కంపతేచ వసుంధరా
పర్వతాగ్రాణి వేపంతే పతంతి ధరణీరుహాః. ౧౩

టీక॥ వాతాశ్చ=వాయువులును; పరుషాః=కఠినములుగా; వాంతి= వీచుచున్నవి. వసుంధరాచ=భూమియు; కంపతే=వడఁకుచున్నది. పర్వతాగ్రాణి=పర్వతశిఖరంబులు; వేపంతే=వడఁకుచున్నవి. ధరణీరుహాః=వృక్షములు; పతంతి=పడుచున్నవి.

వాయువులు పరుషముగా వీచుచున్నవి; భూమికదలుచున్నది; పర్వతశిఖరంబులు వడంకుచున్నవి; వృక్షంబులువిఱిగి పడుచున్నవి.

అని, తాత్పర్యము.

మేఘాః క్రవ్యాదసంకాశాః పరుషాః పరుషస్వనాః
క్రూరాః క్రూరం ప్రవర్షంతి మిశ్రం శోణితబిందుభిః. ౧౪

టీక॥ మేఘాః= మేఘములు; క్రవ్యాదసంకాశాః=మాంసభక్షకములగు డేగమొదలగుపక్షులతోసమానములయి; పరుషాః=కఠినములయిన; పరుషస్వనాః=భయంకరమయిన ధ్వనిగలవై; క్రూరాః=భయంకరములయి; క్రూరం=భయంకరముగా; శోణితబిందుభిః=నెత్తురుబిందువులతో; మిశ్రం=కలసినట్లుగా; ప్రవర్షంతి = కురియుచున్నవి.

మేఘములు, క్రూరపక్షులుంబోలెఁజూపట్టుచు, భయంకరంబుగా గర్జించుచుభయంకరంబులయి, మహాభయసూచకంబగునట్లుగా, నెత్తురు బిందువులతోవానగురియుచున్నవి.

అని, తాత్పర్యము.

రక్తచందన సంకాశా సంధ్యాపరమదారుణా
జ్వలచ్చ నిపతత్యేత దాదిత్యా దగ్నిమండలమ్. ౧౫

టీక॥ సంధ్యా=సంధ్య; రక్తచందనసంకాశా= ఎఱ్ఱనిచందనముతోసమానమయి;పరమదారుణా= మిక్కిలియు భయంకరమయి; వర్తతే(అధ్యాహృతము)=ఉన్నది. ఆదిత్యాత్ = సూర్యునివలన; ఏతత్=ఈ; జ్వలత్= మండుచున్న; అగ్నిమండలంచ=అగ్నిసమూహమును; నిపతతి=పడుచున్నది.

సంధ్య,ఎఱ్ఱనిచందనంబుంబోలెఁ గ్రాలుచుమిక్కిలియుభయంకరంబయియున్నది; ఇదిగో,సూర్యమండలంబుననుండి,మండుచున్నయగ్నిఖండంబులు పడుచున్నవి. అని, తాత్పర్యము.

ఆదిత్య మభివాశ్యంతి జనయంతో మహద్భయమ్
దీనా దీనస్వరా ఘోరా అప్రశస్తా మృగద్విజాః. ౧౬

టీక॥ అప్రశస్తాః= మంచివికానివియు; ఘోరాః=భయంకరములునగు; మృగద్విజాః=మృగములునుపక్షులును; దీనాః=దీనములయి; దీనస్వరాః=దీనమయినధ్వనిగలవై; మహత్=అధికమయిన; భయం=భయమును; జనయంతః=కలిగించుచు;ఆదిత్యమ్=సూర్యునికెదురుగా ; వాశ్యంతి = అఱచుచున్నవి.

అమంగళకరంబులును భయంకరంబులునగుమృగపక్షులు, దీనంబులయి , మహాభయంబుగలుగఁజేయుచు , దీనరంబున, సూర్యునకెదురునిలుచుండి యఱచుచున్నవి. అని, తాత్పర్యము.

రజన్యా మప్రకాశశ్చ సంతాప యతి చంద్రమాః
కృష్ణరక్తాంశు పర్యంతో యథా లోకస్య సంక్షయే. ౧౭

టీక॥ రజన్యాం=రాత్రియందు;చంద్రమాః=చంద్రుఁడు;లోకస్య= లోకముయొక్క;సంక్షయేయథా= వినాశమునందువలె;అప్రకాశః= కాంతిలేనివాఁడై;కృష్ణరక్తాంశుపర్యంతః= నల్లనివియు నెఱ్ఱనివియుఁగిరణంబులు కొనలయందుఁగలవాఁడై;సంతాపయతి= తపింపఁజేయుచున్నాఁడు.

ప్రలయకాలమునందుంబోలె, రాత్రికాలంబునఁజంద్రుండుకాంతిహీనుండై,నలుపునెఱ్ఱఁదనంబునుకొనయందుఁగలవాఁడై, సంతాపంబు గలిగించుచు




న్నాఁడు. అని, తాత్పర్యము.

హ్రస్వో రూక్షో ప్రశస్తశ్చ పరివేషస్సులోహితః

టీక॥ పరివేషః = గాలిగుడి; (హ్రస్వః=కురుచదిగాను; అప్రశస్తశ్చ= అశుభకరముగాను; రూక్షః= భయంకరముగాను; సులోహితః=మిక్కిలియునెఱ్ఱనిదిగాను; వర్తతే (అధ్యాహృతము)= ఉన్నది.

చంద్రునిపరివేషము, హ్రస్వముగాను భయంకరముగాను రక్తవర్ణముగాను జూపట్టుచున్నది. అని, తాత్పర్యము.

ఆదిత్య మండలే నీలం లక్ష్మ లక్ష్మణ దృశ్యతే. ౧౮

టీక॥ లక్ష్మణ= లక్ష్మణుఁడా! ఆదిత్యమండలే=సూర్యమండలమునందు; నీలం=నల్లని; లక్ష్మ=చిహ్నము; దృశ్యతే=చూడఁబడుచున్నది.

లక్ష్మణుఁడా! సూర్యమండలంబున నల్లనికలంకంబు కనుపట్టుచున్నది. అని, తాత్పర్యము.

దృశ్యంతే న యథావచ్చ నక్షత్రాణ్యభి వర్తతే
యుగాంతమివ లోకస్య పశ్య లక్ష్మణ శంసతి. ౧౯

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! నక్షత్రాణిచ= నక్షత్రములును; యథావత్=ఎప్పటియట్లు; నదృశ్యంతే=చూడఁబడవు. లోకస్య=లోకముయొక్క; యుగాంతం=ప్రలయమును; శంసతీవ=చెప్పుచున్నట్లు; అభివర్తతే=ఉన్నది. పశ్య=చూడుము.

లక్ష్మణుఁడా! నక్షత్రంబులునుమలినంబులయియున్నవి; ఈదుర్నిమిత్తంబులన్నియు, లోకవినాశంబుఁ జెల్పుచున్నవి. అని, తాత్పర్యము.

కాకా శ్శ్యేనా స్తథా గృధ్రా నీచైః పరిపతంతిచ
శివాశ్చా ప్య శివావాచః ప్రవదంతి మహాస్వనాః. ౨౦




టీక॥కాకాః=కాకులును; శ్యేనాః=డేగలును; తథా=అట్లు; గృధ్రాః=గద్దలును; నీచైః= నీచపక్షులతో; పరిపతంతిచ = చేరుచున్నవియు. శివాశ్చాపి=నక్కలును; మహాస్వనాః= గొప్పధ్వనిగలవై ; అశివాః=అమంగళకరములగు;వాచః=మాటలను;ప్రవదంతి=చెప్పుచున్నవి.

కాకులును డేగలును గద్దలును నీచపక్షులతోఁ జేరియున్నవి;నక్కలును, పేరెలుంగుననమంగళధ్వనులు సేయుచున్నవి. అని,తాత్పర్యము.

క్షిప్ర మద్య దురాధర్షాం లంకాం రావణపాలితామ్
అభియామ జవేనైవ సర్వతో హరిభి ర్వృతాః. ౨౧

టీక॥క్షిప్రం= శీఘ్రముగా; సర్వతః=అంతటను; హరిభిః=వానరులచేత;వృతాః=చుట్టఁబడినవారలమయి;అద్యైవ=ఇప్పుడె; జవేన= వేగముచేత; దురాధర్షాం= ఎదిరింపనలవిగానిదియు; రావణపాలితాం= రావణునిచేఁ బాలింపఁబడినదియు నగు; లంకాం=లంకాపురినిగూర్చి; అభియామ=పోవుదము.

ఇంక,మనము , సమస్తవానరులం గూడి,యిప్పుడె,దురాధర్షంబును రావణబాహురక్షితంబునగులంకాపురికిశీఘ్రంబునంబోవుదము.అని, రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను.

అని,తాత్పర్యము.

ఇత్యేవం సంవదన్ వీరో లక్ష్మణం లక్ష్మణాగ్రజః
తస్మా దవాతర చ్ఛీఘ్రం పర్వతాగ్రా న్మహాబలః. ౨౨

టీక॥మహాబలః= అధికమయినబలముగల;లక్ష్మణాగ్రజః= లక్ష్మణునియన్నయగు;వీరః= పరాక్రమశాలియయిన రాముండు;ఇతి=అని;ఏవం=ఇట్లు; లక్ష్మణం=లక్ష్మణుని గూర్చి ; సంవదన్=చెప్పుచు;శీఘ్రం=శీఘ్రముగా;తస్మాత్=ఆ;పర్వతాగ్రాత్=పర్వతశిఖరమునసుండి;అవాతరత్=దిగెను.

అట్లు మహాబలుండును లక్ష్మణుని యన్నయునగు రాముండు , లక్ష్మణుని

తోఁజెప్పుచు,శీఘ్రింబున, నాపర్వతశిఖరంబుననుండి,దిగెను.

అని,తాత్పర్యము.

అవతీర్యచ ధర్మాత్మా తస్మాచ్ఛైలాత్స రాఘవః
పరైః పరమదుర్ధర్షం దదర్శ బల మాత్మనః. ౨౩

టీక॥ధర్మాత్మా=ధర్మస్వభావుఁడగు;సః=ఆ;రాఘవః=రాముఁడు;తస్మాత్=ఆ;శైలాత్=పర్వతముననుండి; అవతీర్యచ=డిగ్గియు;పరైః=శత్రువులచేత;పరమదుర్ధర్షం=ఎంతమాత్రమునెదిరింపనలవిగానట్టి;ఆత్మనః=తనయొక్క;బలం=సైన్యమును;దదర్శ= చూచెను.

ధర్మాత్ముఁడగునారాముండు, ఆపర్వతశిఖరంబుననుండిదిగి శత్రువులకుదుర్ధర్షంబయివెలయుచున్న తనవానరసైన్యముంజూచెను.

అని, తాత్పర్యము.

సన్నహ్యాతు ససుగ్రీవః కపిరాజ బలం మహత్
కాలజ్ఞో రాఘవః కాలే సంయుగా యాభ్యచోదయత్. ౨౪

టీక॥కాలజ్ఞః=కాలముఁదెలిసిన ; రాఘవః=రాముఁడు;ససుగ్రీవః=సుగ్రీవునితోఁగూడినవాఁడై;మహత్= గొప్పదియగు;కపిరాజబలం = వానరరాజుండగుసుగ్రీవునిసేనను; సన్నహ్యాతు=ప్రోత్సాహపఱచియు; కాలే=యుక్తకాలమునందు; సంయుగాయ=యుద్ధముకొఱకు; అభ్యచోదయత్=ప్రేరించెను.

ఏదియేకాలంబునం జేయవలయునోయావివరంబునంతయుంజక్కఁగాఁదెలిసినట్టిరాముండు, సుగ్రీవునితోఁగూడ,నవ్వానరసేననంతయుంబ్రోత్సాహపఱచి,యుక్తకాలంబున, యుద్ధంబునకాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

తతః కాలే మహాబాహు ర్బలేన మహతావృతః
ప్రస్థితః పురతోధన్వీ లంకా మభిముఖః పురీమ్. ౨౫

టీక॥తతః=అంత;కాలే= ప్రాతఃకాలమునందు;మహాబాహుః= పెద్దచేతులుగల;ధన్వీ=గొప్పధనుస్సుగల రాముండు;మహాత్మా=గొప్పదగు;బలేన=సైన్యముచేత;వృతః= చుట్టఁబడినవాఁడై;లంకాం=లంకయను;పురీం=పట్టణమునుగూర్చి;పురతః=ముందఱ; ప్రస్థితః=బయలుదేరెను.

అంతఁబ్రాతఃకాలంబున, మహాబాహుండగు రాముండు, ధనుర్ధరుండై, యసంఖ్యాసైన్యంబు వెంబడింప,లంకానగరాభిముఖుండై,పోయెను.

అని, తాత్పర్యము.

తం విభీషణసుగ్రీవౌ హనుమాన్ జాంబవాన్నళః
ఋక్షరాజ స్తథా నీలో లక్ష్మణశ్చాన్వయు స్తదా. ౨౬

టీక॥తదా=అప్పుడు;తం = ఆ రామును; విభీషణసుగ్రీవౌ= విభీషణుండును సుగ్రీవుండును; హనుమాన్= హనుమంతుండును; జాంబవాన్=జాంబవంతుండును; నలః = నలుండును; తథా=అట్లు;ఋక్షరాజః = సుషేణుండును; నీలః=నీలుండును; లక్ష్మణశ్చ= లక్ష్మణుండును; అన్వయుః= వెంబడించిరి.

అప్పుడు,విభీషణుండును, సుగ్రీవుండును హనుమంతుండును జాంబవంతుండును నలుండును సుషేణుండును నీలుండును, లక్ష్మణుండును,రాముని వెంబడించిపోయిరి. అని, తాత్పర్యము,

తతః పశ్చాత్సుమహతీ పృతనర్క్షవనౌకసాం
ప్రచ్ఛాద్య మహతీం భూమి మనుయాతి స్మ రాఘవమ్. ౨౭

టీక॥తతః పశ్చాత్=అటుపిమ్మట ; సుమహతీ=మిక్కిలియుగొప్పదగు;ఋక్షవనౌకసాం = ఎలుఁగుగొడ్డులయొక్కయు వానరులయొక్కయు; పృతనా=సేన; మహతీం=అధికమయిన ; భూమిం=భూమిని; ప్రచ్ఛాద్య=కప్పి; రాఘవం=రాముని; అనుయాతిస్మ = వెంబడించినది.

అంత,ననంతంబగుఋక్షవానరసేన, యతివిస్తీర్ణంబుగాభూమినాచ్ఛాదించి, రాముని వెంబడించిపోయినది.

అని, తాత్పర్యము.

శైలశృంగాణి శతశః ప్రవృద్ధాంశ్చ మహీరుహాన్
జగృహుః కుంజరప్రఖ్యా వానరాః పరవారణాః. ౨౮

టీక॥ కుంజరప్రఖ్యాః = ఏనుంగులతో సమానులును; పరవారణాః = శత్రువులనడ్డగించువారలునగు; వానరాః = వానరులు; శతశః = నూఱులునూఱులుగా; శైలశృంగాణి = పర్వతశిఖరములను; ప్రవృద్ధాన్ = మిక్కిలియెదిగిన; మహీరుహాంశ్చ = వృక్షములను; జగృహుః = పట్టుకొనిరి.

ఏనుంగులంతటి దేహంబుగలవారలును శత్రువులవారింపంజాలినవారలునగు వానరులు, వేలకొలఁది పర్వతశిఖరంబులనుగొప్పవృక్షంబులనుధరించిరి.

అని, తాత్పర్యము.

తౌ తు దీర్ఘేణ కాలేన భ్రాతరౌ రామలక్ష్మణౌ
రావణస్య పురీం లంకా మాసేదతు రరిందమౌ. ౨౯

టీక॥ అరిందమౌ = శత్రువులనడఁగఁద్రొక్కునట్టి; భ్రాతరౌ = తోఁబుట్టువులగు; తౌ = ఆ; రామలక్ష్మణౌ తు = రామలక్ష్మణులును; దీర్ఘేణ = నిడుపైన; కాలేన = కాలముచేత; రావణస్య = రావణునియొక్క; పురీం = పట్టణమయిన; లంకాం = లంకను; ఆసేదతుః = పొందిరి.

శత్రువులనడఁగఁద్రొక్కఁజాలినట్టియారామలక్ష్మణులు, అట్లు, సేనాసహితులయిపోవుచు, దీర్ఘకాలంబునకు, రావణునిలంకాపురింజేరిరి.

అని, తాత్పర్యము.

పతాకమాలినీం రమ్యా ముద్యానవరశోభితామ్
చిత్రవప్రాం సుదుష్ప్రాపా ముచ్చైఃప్రాకారతోరణామ్. ౩౦
తాం సురైరపి దుర్ధర్షాం రామవాక్యప్రచోదితాః
యథానివేశం సంపీడ్య న్యవిశంత వనౌకసః. ౩౧

టీక॥ వనౌకసః = వానరులు; రామవాక్యప్రచోదితాః = రామునిమాటచేఁ ప్రేరింపఁబడినవారలయి; పతాకమాలినీం = ధ్వజములయొక్క పఙ్క్తిగలది

యు;రమ్యాం=రమణీయమును;ఉద్యానవరశోభితాం=ఉద్యానశ్రేష్ఠములచేఁ బ్రకాశించుచున్నదియు; చిత్రవప్రాం=నానావిధమయినకోటగలదియు;సుదుష్ప్రాపాం=పొందఁగూడనిదియు;ఉచ్చైః ప్రాకారతోరణాం=ఉన్నతములయిన ప్రాకారములును బహిర్ద్వారములును గలదియు;సురైరపి=దేవతలచే నైనను;దుర్ధర్షాం=ఎదిరింపసలవి గానిదియునగు;తాం=ఆలంకాపురిని ; యథానివేశం= తమతమస్థానముల నతిక్రమింపక;సంపీడ్య=పీడించి; న్యవిశంత=విడిసిరి.

అంతనావానరులు, రామునియాజ్ఞం జేసి,ధ్వజసమూహాలంకృతంబును, రమణీయంబునుఉద్యానవనంబుల నొప్పుచున్నదియునానావిధమయిన కోటగలదియు,శత్రువులకుఁ బొందఁగూడ నిదియు,ఉన్నతప్రాకారతోరణంబులు గలదియు,దేవతలకేనియెదిరింపసలవిగానిదియునగునాలంకాపురిని , దమతమస్థానంబులనిరోధించి,విడిసిరి.

అని,తాత్పర్యము.

లంకాయా స్తూ త్తరద్వారం శైలశృంగ మివోన్నతమ్
రామ స్సహానుజో ధన్వీ జుగోపచ రురోధచ. ౩౨

టీక॥ధన్వీ=గొప్పధనస్సుగల; రామః=రాముండు; సహానుజః=తమ్మునితోఁగూడినవాఁడై ; శైలశృంగ మివ (స్థితం)=పర్వతశిఖరమువలెనున్న; ఉన్నతం= పొడవయిన; లంకాయాః=లంకయొక్క; ఉత్తరద్వారంతు = ఉత్తరవువాకిలిని; జుగోపచ= రక్షించెను;రురోధచ=అడ్డగించెను.

రాముండునులక్ష్మణసహితుండై , పర్వత శిఖరముం బోలె నత్యున్నతం బయినలంకాపురి యుత్తర ద్వారంబును, నిరోధించెను. అని,తాత్పర్యము.

లంకా ముపనివిష్టశ్చ రామో దశరథాత్మజః
లక్ష్మణానుచరో వీరః పురీం రావణ పాలితామ్. ౩౩
ఉత్తరద్వార మాసాద్య యత్ర తిష్ఠతి రావణః

టీక॥ వీరః=పరాక్రమశాలియు; లక్ష్మణానుచరః = లక్ష్మణుఁడువెంబ




డించువాఁడు గాఁగలవాఁడును ; దశరథాత్మజః= దశరథమహారాజుకొడుకునగు; రామః=రాముండు; యత్ర=ఎచ్చట, రావణః=రావణుఁడు; తిష్ఠతి= ఉన్నాఁడో; తత్ (అధ్యాహృతము)= అట్టి ఉత్తరద్వారం=ఉత్తరపువాకిలిని; ఆసాద్య=పొంది; రావణపాలితాం= రావణునిచేఁబాలింపఁబడిన; లంకాం= లంకయను; పురీం=పట్టణమును ;ఉపనివిష్టశ్చ=సమీపించివిడిసెను.

పరాక్రమవంతుండును దశరథ మహారాజుపుత్రుండునగు రాముండు లక్ష్మణసహితుండై, రావణుండెచ్చట నున్నాఁడో, అట్టిలంకాపురి యుత్తర ద్వారంబున నెనిరోధించియుండెను.

అని, తాత్పర్యము.

నాన్యో రామాద్ధి తద్ద్వారం సమర్థః పరిరక్షితుమ్. ౩౪
రావణాధిష్ఠితం భీమం వరుణేనేవ సాగరమ్
సాయుధై రాక్షసై ర్భీమై రభిగుప్తం సమంతతః. ౩౫
లఘూనాం త్రాసజననం పాతాళమివ దానవైః

టీ॥ రావణాధిష్ఠితం=రావణునిచేనధిష్ఠింపఁబడినదియు;వరుణేన= వరుణునిచేత; అధిష్ఠితం ( అధ్యాహృతము)=అధిష్ఠింపఁబడిన;సాగరమివ (స్థితం)=సముద్రమువలెనున్నదియు ; భీమం=భయంకరమయినదియు;సమంతతః=అంతటను;సాయుధైః= ఆయుధములతోఁగూడినవారలును; భీమైః= భయంకరులునగు; రాక్షసైః= రాక్షసులచేత;అభిగుప్తం=రక్షింపఁబడినదియు; దానవైః=దానవులచేత;అభిగుప్తం(అధ్యాహృతము)=రక్షింపఁబడిన ; పాతాళమివ(స్థితం)= పాతాళమువలెనున్నదియు;లఘూనాం=అల్పులకు;త్రాసజననం=భయమును బుట్టించునదియునగు;తత్=ఆ;ద్వారం= ఉత్తరద్వారమును;పరిరక్షితుం = రక్షించుటకు; రామాత్=రామునికన్న;అన్యః= ఇతరుఁడు;నసమర్థోహి= సమర్థుఁడుండు గాఁడుగదా!

సాక్షాద్రావణాధిష్ఠితంబును వరుణాధిష్ఠితంబగుసముద్రంబువలె నున్నదియు,భయంకరాకారంబును, భయంకరాకారులును ఆయుధధారులునగు రాక్షసులచేసురక్షితంబును దానవరక్షితంబగు పాతాళంబువలెనున్నదియు,




నల్పులకుభయంకరంబునగు , నాయుత్తరద్వారంబు నిరోధించుటకు , రాముండుదకర్మతి యెవ్వండును సమర్థుండుగాండు. అని, తాత్పర్యము.

విన్యస్తాని చ యోధానాం బహూని వివిధానిచ. ౩౬
దదర్శా యుధజాలాని తత్రైవ కవచానిచ

టీక॥ రామః(అధ్యాహృతము) = రాముండు; తత్రైవ=అచ్చటనే; విన్యస్తాని=ఉంచఁబడిన;యోధానాం= భటులయొక్క; బహూని= అనేకములును; వివిధానిచ=నానావిధములునగు; ఆయుధజాలానిచ = ఆయుధసమూహములను; కవచానిచ=కవచములను; దదర్శ=చూచెను.

రాముండాయుత్తరద్వారంబున , రాక్షసయోధులుంచుకొనిన, నానావిధంబులగు పెక్కు-యుధసమూహములను గవచంబులనుంజూచెను.

అని, తాత్పర్యము.

పూర్వంతు ద్వారమాసాద్య నీలో హరిచమూపతిః. ౩౭
అతిష్ఠ త్సహమైందేన ద్వివిదేనచ వీర్యవాన్

టీక॥ వీర్యవాన్= అధికమయినపరాక్రమముగల; హరిచమూపతిః=వానరసేనానాయకుఁడగు; నీలః= నీలుఁడు; పూర్వం= తూర్పుదిక్కునందున్నట్టి;ద్వారంతు=వాకిలినే;ఆసాద్య = పొంది; మైందేన= మైందునితోను; ద్వివిదేనచసహ=ద్వివిదునితోనుంగూడ ; అతిష్ఠత్=ఉండెను.

పరాక్రమవంతుండగువానరసేనానాయకుండునీలుండు, పూర్వద్వారంబున, మైందద్వివిదసహితుండై, నిలిచియుండెను.అని,తాత్పర్యము.

అంగదో దక్షిణ ద్వారం జగ్రాహ సుమహాబలః. ౩౮
ఋషభేణ గవాక్షేణ గజేన గవయేనచ

టీక॥ సుమహాబలః= మిక్కిలియధికమయినబలముగల; అంగదః=అంగదుఁడు; ఋషభేణ=ఋషభునితోను ; గవాక్షేణ=గవాక్షునితోను ; గజేన—

గజునితోను; గవయేనచ = గవయునితోను; సహితః=కూడినవాఁడై; దక్షిణద్వారం=దక్షిణపువాకిలిని;జగ్రాహ=గ్రహించెను.

మహాబలుండగునంగదుండు, ఋషభగవాక్షులను, గజగవయులనుంగూడి, దక్షిణద్వారంబున గాఁవలియుండెను. అని, తాత్పర్యము.

హనూమాన్ పశ్చిమద్వారం రరక్ష బలవాన్ కపిః. ౩౯
ప్రమాథి ప్రఘసాభ్యాంచ వీరై రన్యైశ్చ సంగతః

టీక॥బలవాన్ = అధికమయినబలముగల;హనుమాన్= హనుమంతుఁడను;కపిః=వానరుఁడు;ప్రమాథిప్రఘసాభ్యాంచ=ప్రమాథితోను ప్రఘసునితోను; అన్యైః=ఇతరులయిన;వీరైశ్చ=వానరవీరులతోను;సంగతః = కూడినవాఁడై;పశ్చిమద్వారం= పడమటివాకిలిని; రరక్ష=రక్షించెను.

బలవంతుండగుహనుమంతుండు,ప్రమాథిప్రఘసులుమున్నగువానర వీరులతోఁగూడి,పడమటివాకిలినిరక్షింపుచుండెను, అని, తాత్పర్యము.

మధ్యమే చ స్వయం గుల్మే సుగ్రీవ స్సమతిష్ఠత. ౪౦
సహసర్వై ర్హరిశ్రేష్ఠై స్సుపర్ణశ్వసనోపమైః

టీక॥సుగ్రీవః= సుగ్రీవుఁడు ; స్వయం=తాను;సుపర్ణశ్వసనోపమైః= గరుత్మంతునితోనువాయువుతోనుంబోలిక-గల;హరిశ్రేష్ఠైః= వానరశ్రేష్ఠులతో;సర్వైస్సహ= అందఱితోనుంగూడ;మధ్యమే=నడుమనుండునట్టి;గుల్మే= సేనాభాగమునందు; సమతిష్ఠత=ఉండెను.

సుగ్రీవుండు,గరుడానిల సమానులగువానరశ్రేష్ఠులంగూడి, బలవంతులగు రావణేంద్రజిత్తులతోఁబోరు, రామహనుమంతుల కిర్వురకును గాకాక్షిన్యాయంబున సాహాయ్యంబు గావింపటకై, యుత్తరపశ్చిమద్వారంబులనడుమనుండెను. అని, తాత్పర్యము.

వానరాణాంతు షట్త్రింశ త్కోట్యః ప్రఖ్యాతయూథపాః. ౪౧

నిపీడ్యో పనివిష్టాశ్చ సుగ్రీవో యత్ర వానరః

టీక॥యత్ర=ఎచ్చట; సుగ్రీవః=సుగ్రీవుఁడను; వానరః=వానరుఁడు; అవతిష్ఠత (అధ్యాహృతము)=ఉండెనో; తత్ర(అధ్యాహృతము)=అచ్చట; ప్రఖ్యాతయూథపాః=ప్రసిద్ధులగు యూథపతులుగల; వానరాణాం= వానరులయొక్క; షట్త్రింశత్కోట్యస్తు=ముప్పదియాఱుకోటులుమాత్రము ; నిపీడ్య=పీడించి; ఉపనివిష్టాశ్చ = విడిసినవియు.

సుప్రసిద్ధులగు యూథపతులతోఁగూడిన,ముప్పదియాఱుకోటులు వానరులు, లంకాపురినినిరోధించి,సుగ్రీవుండున్నస్థలంబుననుండిరి.

అని, తాత్పర్యము

శాసనేనతు రామస్య లక్ష్మణ స్సవిభీషణః. ౪౨
ద్వారేద్వారే హరీణాంతు కోటింకోటిం న్యవేశయత్

టీక॥రామస్య=రామునియొక్క ; శాసనేనతు=ఆజ్ఞ చేతనే;సవిభీషణః=విభీషణునితోఁగూడిన; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ద్వారేద్వారే=ప్రతిద్వారమునందు; హరీణాం=వానరులయొక్క ; కోటింకోటింతు = కోటినికోటినిమాత్రము; న్యవేశయత్ =ఉంచెను.

రామునియానతింజేసి , లక్ష్మణుండునువిభీషణుండును, ప్రతిద్వారంబునను, గోటికోటివానరులవంతుననిలిపిరి.

అని, తాత్పర్యము.

పశ్చిమేనతు రామస్య సుగ్రీవ స్సహ జాంబవాన్. ౪౩
అదూరా న్మధ్యమే గుల్మే తస్థౌ బహు బలానుగః

టీక॥ రామస్య=రామునియొక్క;పశ్చిమేనతు=పశ్చిమపార్శ్వమువనె; అదూరాత్ =సమీపమున;మధ్యమే= నడిమిదైన;గుల్మే= సేనాప్రదేశమునందు; సహజాంబవాన్=జాంబవంతునితోఁగూడిన;సుగ్రీవః=సుగ్రీవుఁడు;బహుబలానుగః=అధికమయినసైన్యము వెంబడించునదిగాఁగలవాఁడై;తస్థౌ=ఉండెను.

రామునకుఁ బశ్చిమపార్శ్వంబున, సమీపంబుననె, సుగ్రీవుండు జాంబవంతుంగూడి, బహుసైన్యసహితుండై, మధ్యగుల్మంబుననుండెను.

అని, తాత్పర్యము.

తేతు వానరశార్దూలా శ్శార్దూలా ఇవ దంష్ట్రిణః. ౪౪
గృహీత్వా ద్రుమశైలాగ్రాన్ హృష్టాయుద్ధాయతస్థిరే

టీక॥ దంష్ట్రిణః=కోఱలుగల; శార్దూలాఇవ(స్థితాః)=పెద్దపులులువలెనున్న; తే=ఆ; వానరశార్దూలాస్తు=వానరశ్రేష్ఠులును; హృష్టాః=సంతసించినవారలయి; ద్రుమశైలాగ్రాన్ (ద్రుమశైలాగ్రాణి)=వృక్షములనుబర్వత శిఖరములను; గృహీత్వా=పట్టుకొని; యుద్ధాయ=యుద్ధముకొఱకు; తస్థిరే=ఉండిరి.

ఆవానరశ్రేష్ఠులు, పెద్దపులులుంబోలె, వృక్షంబులనుబర్వత శిఖరంబులనుంబట్టుకొని, పరమసంతోషంబునయుద్ధంబునకుఁగాచియుండిరి.

అని, తాత్పర్యము.

సర్వే వికృతలాంగూలా స్సర్వే దంష్ట్రానఖాయుధాః. ౪౫
సర్వే వికృతచిత్రాంగా స్సర్వేచ వికృతాననాః

టీక॥ తే(అధ్యాహృతము)=ఆవానరులు; సర్వే=అందఱును; వికృతలాంగూలాః=పైకెత్తఁబడిన తోఁకలు గలవారలును; సర్వే=అందఱును; దంష్ట్రానఖాయుధాః= దంతములును నఖములునెయాయుధములుగాఁ గలవారలును; సర్వే=అందఱును; వికృతచిత్రాంగాః= కోపవికారముచే నానావర్ణములయినయవయవములు గలవారలును; సర్వే=అందఱును; వికృతాననాశ్చ=వికారమునొందిన ముఖములు గలవారలునుగా; అవతస్థిరే (అధ్యాహృతము)=ఉండిరి.

ఆవానరులుఅందఱును దోఁకలంబైకినెత్తుకొని యుండువారలును అందఱును దంతనఖంబులెయాయుధంబులుగాఁ గలవారలుగాను అందఱును గోపవికారంబున నానావర్ణములయినయవయవములుగలవారలుగాను అందఱును వికృతంబులగు ముఖములుగలవారలుగాను, ఉండిరి. అని, తాత్పర్యము.

దశనాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః. ౪౬
కేచి న్నాగసహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః

టీక॥ కేచిత్=కొందఱు వానరులు; దశనాగబలాః = పదియేనుంగులబలముగలవారలును; కేచిత్=కొందఱు; దశగుణోత్తరాః=పదియంతలచేనధికులును, నూఱేనుంగులబలముగలవారలుననుట; కేచిత్=కొందఱు; నాగసహస్రస్య=ఏనుంగులవేయింటికి; తుల్యవిక్రమాః= సమానమయినపరాక్రమముగలవారలునుగా; బభూవుః=ఉండిరి.

ఆవానరులలోఁగొందఱు పదియేనుంగులబలముగలవారలును గొందఱు నూఱేనుంగులబలము గలవారలును, గొందఱు వేయేనుంగుల బలము గలవారలును గానుండిరి. అని, తాత్పర్యము.

సంతిచౌఘ బలాః కేచి త్కేచి చ్ఛత గుణోత్తరాః. ౪౭
అప్రమేయ బలాశ్చాన్యే తత్రాసన్ హరియూథపాః

టీక॥తత్ర=అచ్చట;కేచిత్=కొందఱు;హరియూథపాః= వానరయూథపులు;ఓఘబలాః= ఓఘసంఖ్యగల యేనుంగులబలముగలవారలు;సంతి = ఉన్నారు. కేచిత్=కొందఱు; శతగుణోత్తరాః=అందుకునూఱింతలచే నధికులు గాను;అన్యే=ఇతరులు;అప్రమేయబలాశ్చ=కొలఁదిలేనిబలము గలవారలు గాను;ఆసన్=ఉండిరి.

అవ్వానరసేనయందు,కొందఱువానరవీరులు,ఓఘసంఖ్యాకములగు నేనుంగులబలముగలవారలు గాను, గొందఱందుకునూఱింతలు బలముగలవారలును కొందఱప్రమేయంబగుబలముగలవారలు గానుఉండిరి.

అని, తాత్పర్యము.

అద్భుతశ్చ విచిత్రశ్చ తేషా మాసీ త్సమాగమః. ౪౮
తత్ర వానరసైన్యానాం శలభానా మివోద్యమః

టీక॥ తత్ర=అచ్చట; వానరసైన్యానాం=వానరసైనికులయొక్క; సమాగమః=కూడిక; శలభానాం= మిడుతలయొక్క; ఉద్యమఇవ= ప్రయత్నమువ

లై; అద్భుతశ్చ=ఆశ్చర్యకరముగాను; విచిత్రశ్చ=నానావిధముగాను; ఆసీత్=ఉండెను.

అచ్చట, వవ్వానరసైనికులు, ఒకగుంపుగానుండుట, మిడుతలుగుంపుగట్టినట్లు, ఆశ్చర్యకరముగానువిచిత్రముగాను ఉండినది.

అని, తాత్పర్యము.

పరిపూర్ణ మివాకాశం సంఛన్నేవచ మేదినీ. ౪౯
లంకా ముపనివిష్టైశ్చ సంపతద్భిశ్చ వానరైః

టీక॥ లంకాం = లంకను; ఉపనివిష్టైః=సమీపించివిడిసినవారలును; సంపతద్భిశ్చ=వచ్చుచున్నవారలునగు; వానరైః=వానరులచేత; ఆకాశం= ఆకసము; పరిపూర్ణమివ(స్థితం)= నిండినట్లుండినది. మేదినీచ = భూమియు; సంఛన్నేవ(స్థితా) = కప్పఁబడినట్లుండినది.

లంకచుట్టునువిడిసియున్న వారలును విడియనే తెంచుచున్న వారలునగువానరులచేత, భూమ్యాకాశంబులు రెండును, నిండినట్లుండినవి.

అని, తాత్పర్యము.

శతం శత సహస్రాణాం పృథగృక్ష వనౌకసామ్. ౫౦
లంకాద్వారా ణ్యుపాజగ్ము రన్యేయోద్ధుం సమంతతః

టీక॥ పృథక్ =వేఱుగా; ఋక్షవనౌకసాం=ఎలుఁగుగోఁడ్డుల యొక్కయు వానరులయొక్కయు; శతసహస్రాణాం= లక్షలయొక్క; శతం=నూఱు; లంకాద్వారాణి = లంకాద్వారములను; ఉపాజగామ (అధ్యాహృతము)= పొందినది. అన్యే=ఇతరులు; యోద్ధుం=పోరుటకు; సమంతతః=అంతటను; ఉపాజగ్ముః=పొందిరి.

మునువుంచినసైన్యముగాక, కోటిఋక్షవానరులు, ప్రతిలంకాద్వారంబునందునుంజేరియుండిరి; మఱియునితరులు, అచ్చటచ్చటివారలసాహాయ్యమునకై, యంతటనుంగాచియుండిరి.

అని, తాత్పర్యము.

ఆవృతస్స గిరి స్సర్వై స్తైస్సమంతా త్ప్లవంగమైః. ౫౧

టీక॥సః=ఆ; గిరిః=త్రికూటపర్వతము; సమంతాత్=అంతటను; తైః= ఆ; ప్లవంగమైః=వానరులచేత; ఆవృతః=కప్పఁబడినది.

ఆవానరులచే, నాత్రికూటపర్వతమంతయు నాచ్ఛాదితమయియుండినది. అని, తాత్పర్యము.

అయుతానాం సహస్రించ పురింతామభ్యవర్తత

టీక॥అయుతానాం= పదివేలయొక్క; సహస్రించ=వేయియు; తం=ఆ; పురీం=లంకాపురిని; అభ్యవర్తత=చుట్టియుండినది.

మఱియు, గోటివానరులు, లంకాపురిచుట్టుంబరివేష్టించియుండిరి. అని, తాత్పర్యము.

వానరై ర్బలవద్భిశ్చ బభూవ ద్రుమపాణిభిః. ౫౨
సంవృతాసర్వతో లంకా దుష్ప్రవేశాపి వాయునా

టీక॥లంకా=లంకాపురి; సర్వతః=అంతటను; బలవద్భిశ్చ=అధికమయిన బలముగలవారలును; ద్రుమపాణిభిః=వృక్షములు చేతులందుఁగలవారలునగు; వానరైః=వానరులచేత; సంవృతా=చుట్టఁబడినదై; వాయునాపి=వాయువుచేతఁగూడ; దుష్ప్రవేశా=ప్రవేశింపనలవిగానిది; బభూవ=అయినది.

అట్లు, బలవంతులగు వానరులు వృక్షహస్తులయి లంకాపురిచుట్టును ముట్టడించుటవలన, వాయువునకేనియు నా లంకాపురిం బ్రవేశింప నలవి గాకుండినది. అని, తాత్పర్యము.

రాక్షసావిస్మయం జగ్ము స్సహసాభి నిపీడితాః. ౫౩
వానరై ర్మేఘసంకాశై శ్శక్రతుల్య పరాక్రమైః

టీక॥రాక్షసాః=రాక్షసులు; శక్రతుల్యపరాక్రమైః = దేవేంద్రుని పరా

క్రమముతో సమానమయిన పరాక్రమ ముగలవారలును ; మేఘసంకాశైః = మేఘముతో సమానులునగు; వానరైః= వానరులచేత; సహసా=శీఘ్రమున ; అభినిపీడితాః = పీడింపఁబడినవారలయి; విస్మయం=ఆశ్చర్యమును; జగ్ముః= పొందిరి,

అట్లు, మేఘంబులంతటి దేహములుగలవారలును దేవేంద్రునంతటి పరాక్రమంబుగలవారలునగు వానరులు, అతిశీఘ్రంబునవచ్చిముట్టడించినందుకు, రాక్షసులాశ్చర్యంబునొందిరి. అని, తా.

మహాన్ శబ్దో భవ త్తత్ర బలౌఘస్యాభి వర్తతః. ౫౪
సాగరస్యేవ భిన్నస్య యథాస్యా త్సలిలస్వనః

టీక॥ తత్ర=అచ్చట; భిన్నస్య=తెంచుకొనిన; సాగరస్యేవ=సముద్రముయొక్కవలె; అభివర్తతః (అభివర్తమానస్య)=వచ్చుచున్న; బలౌఘస్య=సేనాసమూహముయొక్క; సలిలస్వనః=జలధ్వని; యథా=ఎట్లు; స్యాత్=అగునో; తథా(అధ్యాహృతము)=అట్లు; మహాన్=గొప్పదగు; శబ్దః=ధ్వని; అభవత్=కలిగినది.

అప్పుడచ్చట, ఆవానరసేన వచ్చుచుండఁగా, సముద్రంబుతెంచుకొని ప్రవహించునప్పుడుంబోలె మహాధ్వనిగలిగినది. అని, తాత్పర్యము.

తేన శబ్దేన మహతా సప్రాకారా సతోరణా. ౫౫
లంకా ప్రచలితా సర్వా సశైల వనకాననా

టీక॥ మహతా=గొప్పదగు; తేన=ఆః శబ్దేన=ధ్వనిచేత ; సప్రాకారా=ప్రాకారములతోఁగూడినదియు; సతోరణా=బహిర్ద్వారములతోఁ గూడినదియు; సశైలవనకాననా=పర్వతములతోను వనములతోను అడవులతోనుంగూడినదియునగు; లంకా=లంకాపురి ; సర్వా=అంతయు; ప్రచలితా = చలించినది.

ఆమహాధ్వనికి , లంకాపురియంతయుఁ, బ్రాకారతోరణపర్వతకానన సహితంబుగాఁజలించినది.

అని, తాత్పర్యము.

రామలక్ష్మణగుప్తా సా సుగ్రీవేణ చ వాహినీ. ౫౬
బభూవ దుర్ధర్షతరా సర్వైరపి సురాసురైః

టీక॥ రామలక్ష్మణగుప్తా= రామలక్ష్మణులచేరక్షింపఁబడినదియు; సుగ్రీవేణచ=సుగ్రీవునిచేతను;గుప్తా(అధ్యాహృతము)= రక్షింపఁబడినదియునగు; సా=ఆ; వాహినీ = సేన; సురాసురైః=దేవాసురులచేత; సర్వైరపి = అందఱిచేతను; దుర్ధర్షతరా= ఎంతమాత్రమెదిరింపనలవిగానిది; బభూవ=అయినది.

రామలక్ష్మణులచేతను సుగ్రీవునిచేతనురక్షింపఁబడుచున్నయావానరసేన సమస్త దేవాసురులకేని దేఱిచూడనలవిగాకుండినది.అని,తాత్పర్యము.

రాఘవ స్సన్నివేశ్యైవ సైన్యం స్వం రక్షసాం వధే. ౫౭
సమ్మంత్ర్య మంత్రిభిస్సార్ధం నిశ్చిత్య చ పునఃపునః
ఆనంతర్య మభిప్రేప్సుః క్రమయోగార్థ తత్త్వవిత్. ౫౮
విభీషణస్యా నుమతే రాజధర్మ మనుస్మరన్
అంగదం వాలితనయం సమాహూయేద మబ్రవీత్. ౫౯

టీక॥ క్రమయోగార్థతత్త్వవిత్= క్రమముతోఁగూడిన సామాద్యుపాయములయాథార్థ్యముఁదెలిసినట్టి ; రాఘవః=రాముఁడు;రక్షసాం = రాక్షసులయొక్క; వధే = చంపుటనిమిత్తమయి;స్వం=తనదైన;సైన్యం = సేనను;సన్నివేశ్యైవ=విడిసినంతనే;ఆనంతర్యం=అవలఁజేయవలసినదాని ; అభిప్రేప్సుః=పొందఁగోరినవాఁడై ; మంత్రిభిస్సార్థం = మంత్రులతోఁగూడ;సమ్మంత్ర్య=ఆలోచించి ; పునఃపునః= మాటిమాటికి;నిశ్చిత్యచ= నిశ్చయించియు;రాజధర్మం = రాజధర్మమును;అనుస్మరన్=తలంచుచు ; విభీషణస్య=విభీషణునియొక్క ; అనుమతే= అనుజ్ఞ కాఁగా;వాలితనయం = వాలికుమారుఁడగు;అంగదం= అంగదుని; సమాహూయ=పిలిచి; ఇదం = ఈ మాటను;అబ్రవీత్=చెప్పెను.

అవ్వెంకాలంబునఁజేయవలసిన సామాద్యుపాయంబులక్రమంబు దెలిసినట్టిరాముఁడు , రాక్షసవధనిమిత్తమ

స ౪౧

 

యి, వానరసైన్యమంతయు యుక్త క్రమంబునవిడియనియమించి, యంతన నంతరకర్తవ్యంబుఁజేయఁగోరి, మంత్రులతోఁజక్కఁగానాలోచించి, నిశ్చయించి, రాజధర్మంబుదలంచి, విభీషణానుమతంబున, వాలిపుత్రుండగు నంగదుంబిలిచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

గత్వా సౌమ్య దశగ్రీవం బ్రూహి మద్వచనా త్కపే
లంఘయిత్వా పురీం లంకాం భయం త్యక్త్వా గతవ్యథః. ౬౦

టీక॥ సౌమ్య= శాంతుండవగు; కపే=అంగదుఁడా! గతవ్యథః= పోయినశ్రమముగలవాఁడవై; భయం = భయమును; త్యక్త్వా=విడిచి;లంకాం= లంకయను; పురీం= పట్టణమును; లంఘయిత్వా= దాఁటి; దశగ్రీవం=రావణుని; గత్వా=పొంది; మద్వచనాత్= నామాటవలన; బ్రూహి= చెప్పుము.

శాంతుండవగునంగదుఁడా! నీవుగతశ్రముండవై భయంబువిడిచి, లంకాప్రాకారంబుదాఁటి, రావణునొద్దకుఁబోయి, నేనుజెప్పినట్లీ ప్రకారంబునంజెప్పుము. అని, తాత్పర్యము.

భ్రష్టశ్రీక గతైశ్వర్య ముమూర్షో నష్టచేతన
ఋషీణాం దేవతానాంచ గంధర్వాప్సరసాం తథా. ౬౧
నాగానా మథ యక్షాణాం రాజ్ఞాంచ రజనీచర
యచ్చ పాపం కృతం మోహా దవలిప్తేన రాక్షస. ౬౨
నూన మద్య గతో దర్ప స్స్వయంభువర దానజః
యస్య దండధర స్తేహం దారాహరణకర్శితః. ౬౩
దండం ధారయమాణస్తు లంకాద్వారే వ్యవస్థితః

టీక॥భ్రష్టశ్రీక= నశించినసంపదగలవాఁడవు; గతైశ్వర్య=పోయినప్రభుత్వముగలవాఁడవు; ముమూర్షో = చావఁబోవువాఁడవు; నష్టచేతన= పోయినతెలివిగలవాఁడవునగు;రజనీచర = రాక్షసుఁడవగు; రాక్షస= రావణుఁడా! అవలిప్తేన= గర్వితుండవగు;త్వయా(అధ్యాహృతము)=నీచేత ; ఋ



షీణాం= ఋషులకును; దేవతానాం చ=దేవతలకును; తథా=అట్లు; గంధర్వాప్సరసాం=గంధర్వులకును అప్సరసలకును ; నాగానాం= సర్పములకును; అథ=మఱియు; యక్షాణాం=యక్షులకును; రాజ్ఞాంచ=రాజులకును ; మోహాత్=అజ్ఞానమువలన;యత్=ఏ; పాపంచ=పాపమును;కృతం= చేయఁబడినదో;తస్యకారణభూతః (అధ్యాహృతము)=దానికిఁగారణమయిన;స్వయంభువరదానజః= బ్రహ్మదేవునివరదానమువలనంగలిగిన;దర్పః = గర్వము;అద్య=ఇప్పుడు;గతః = పోయినది.నూనం=నిశ్చయము. యస్య = ఏ; తే= నీకు; దండధరః = శిక్షనుధరించునట్టి, శిక్షఁజేయునట్టియనుట ; అహం=నేను; దారాపహరణకర్శితః= భార్యాపహరణముచేఁ గృశింపఁజేయఁబడినవాఁడనై;దండం = శిక్షను; ధారయమాణస్తు = చేయువాఁడనై యె;లంకాద్వారే = లంకానగరము యొక్క-వాకిలియందు;వ్యవస్థితః = ఉన్నానో.

నశించినసంపదగలవాఁడవు నష్టైశ్వర్యుండవు మరణంబునొందఁ బోవువాఁడవునష్టజ్ఞానుండవునగు రావణుఁడా!నీవు,గర్వంబున,ఋషులకును దేవతలకునుగంధర్వులకునుఅప్సరలకునునాగంబులకును:యక్షులకును రాజులకును, ఏమియపకారంబుగావించినావో, దానికంతయుంతయుఁగారణమయినబ్రహ్మవరగర్వమంతయునిప్పుడు నశించినది ; వాస్తవము;ఏలయన,దండధరుండనగు నేను,భార్యాపహరణకుపితుండనై, నిన్నుశిక్షించుటకు, లంకాద్వారంబునంగనిపెట్టియున్నానే!అని,తాత్పర్యము.

పదవీం దేవతానాంచ మహర్షీణాంచ రాక్షస. ౬౪
రాజర్షీణాంచ సర్వేషాం గమిష్యసి మయా హతః

టీక॥ రాక్షస=రావణుఁడా!త్వం (అధ్యాహృతము)=నీవు ; మయా = నాచేత;హతః=చంపఁబడినవాఁడవై ; దేవతానాంచ= దేవతలయొక్కయు; మహర్షీణాంచ= మహర్షులయొక్కయు; రాజర్షీణాంచ = రాజర్షులయొక్కయు; సర్వేషాం = అందఱియొక్కయు; పదవీం=లోకమును; గమిష్యసి=పొందఁగలవు.

రావణుఁడా! నీవునాచేహతుఁడ

వై, గతపాపుఁడవై, దేవతలునుమహ షులును రాజషులునుం బొందులోక ముంబొందఁగలవు.

అని, తాత్పర్యము.

బలేన యేన వై సీతాం మాయయా రాక్షసాధమ. ౬౫
మా మతిక్రామయిత్వా త్వం హృతవాం స్తద్విదర్శయ

టీక॥ రాక్షసాధమ = రాక్షసుల లోనధముఁడవగు రావణుఁడా! త్వం= నీవు; యేన = ఏ; ("వై" అనునది పాద పూరణార్థము) బలేన = బలముచే త; మాయయా=మాయచేత; మాం= నన్ను; అతిక్రామయిత్వా = ఆవలికిఁ బోనిచ్చి; సీతాం = సీతాదేవిని; హృ తవాన్=అపహరించితివో; తత్=ఆ బలమును; విదర్శయ=చూపుము.

రాక్షసాధముఁడవగు రాముఁడా! నీవు, ఏబలంబున, మాయచేనన్ను మోస పుచ్చి, సీతనుహరించినావో, ఆబలమం తయునిప్పుడుచూపుము.

అని, తాత్పర్యము.

అరాక్షస మిమం లోకం కర్తాస్మి నిశితై శ్శరైః. ౬౬
నచే చ్ఛరణ మభ్యేషి మా ముపాదాయ మైథిలీమ్

టీక॥ త్వం=నీవు; మైథిలీం=సీతను; ఉపాదాయ=తీసికొనివచ్చి; మాం = నన్ను; శరణం=రక్షకునిఁగా ; నాభ్యే షి చేత్=పొందవేని ; నిశితైః= తీక్ష్ణ ములగు; శరైః = బాణములచేత; ఇ మం=ఈ; లోకం=లోకమును; అరా క్షసం= రాక్షసుఁడులేనిదానిఁగా ; క ర్తాస్మి=చేసెదను.

నీవు సీతనుదీసికొనివచ్చి సమర్పిం చి , నన్నుశరణుపొందవేని, కఱకుబా ణంబులనీలోకంబునంతయునరాక్షసం బుగావించెదను. అని, తాత్పర్యము.

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోయం విభీషణః. ౬౭
లంకై శ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నో త్యకంటకమ్

టీక॥ధర్మాత్మా = ధర్మస్వభా వుండును; రక్షసాం=రాక్షసులలో; శ్రే ష్ఠః=ఉత్తముఁడునగు; అయం=ఈ; వి భీషణః=విభీషణుఁడు; సంప్రాప్తః =

పొందినాఁడు. శ్రీమాన్ = కాంతిమంతుండగు; అయం = ఈతండు; అకంటకం = శత్రువులు లేని; లంకైశ్వర్యం = లంకాధిపత్యమును; ప్రాప్తః = పొందినాఁడు; ధ్రువం = నిశ్చయము.

ధర్మస్వభావుండును రాక్షస శ్రేష్ఠుండునగు నీవిభీషణుఁడు నన్ను శరణుచొచ్చినాఁడు; శ్రీమంతుండగు నీవిభీషణుఁడు, అకంటకంబగు లంకాధిపత్యంబు నొందఁగలఁడు; సందేహము లేదు.

అని, తాత్పర్యము.

నహి రాజ్యమధర్మేణ భోక్తుం క్షణమపి త్వయా. ౬౮
శక్యం మూర్ఖసహాయేన పాపేనావిదితాత్మనా

టీక॥ మూర్ఖసహాయేన = మూర్ఖులు సహాయులు గాఁగలవాఁడవును; అవిదితాత్మనా = తెలియఁబడనిమనస్సుగలవాఁడవును; పాపేన = పాపస్వభావుండవును; అధర్మేణ = ధర్మరహితుండవునగు; త్వయా = నీచేత; రాజ్యం = రాజ్యమును; భోక్తుం = భుజించుటకు; క్షణమపి = క్షణమయినను; నశక్యంహి = అలవిగాదుగదా!

మూర్ఖులను సహాయులుగా నుంచుకొన్నవాఁడవుఁ బాపిష్ఠుండవు స్వాధీనము గానిమనస్సుగలవాఁడవు ధర్మరహితుండవునగు నీకు క్షణమయినను, రాజ్యంబు ననుభవింపనలవి గాదు.

అని, తాత్పర్యము.

యుధ్యస్వ వా ధృతిం కృత్వా శౌర్యమాలంబ్య రాక్షస. ౬౯
మచ్ఛరైస్త్వం రణే శాంతస్తతః పూతో భవిష్యసి

టీక॥ రాక్షస = రావణుఁడా! ధృతిం = ధైర్యమును; కృత్వా = చేసి; శౌర్యం = శౌర్యమును; ఆలంబ్య = అవలంబించి; యుధ్యస్వవా = యుద్ధము చేసినను జేయుము. త్వం = నీవు; రణే = యుద్ధమునందు; మచ్ఛరైః = నాబాణములచేత; శాంతః = చల్లాఱినవాఁడవై; తతః = అంత; పూతః = పరిశుద్ధుండవు; భవిష్యసి = కాఁగలవు.

రావణుఁడా! ధైర్యశౌర్యములనవలంబించి వచ్చి యుద్ధము చేసినను జేయుము; నీవు, యుద్ధంబున, నాబాణంబుల

మృతుండవై గతపాపుఁడవై పరిశుద్ధుండవు కాఁగలవు. అని, తాత్పర్యము.

యద్వా విశసి లోకాంస్త్రీన్ పక్షిభూతో మనోజవః. ౨౦
మమ చక్షుష్పథం ప్రాప్య న జీవన్ ప్రతియాస్యసి

టీక॥ యద్వా=లేక; త్వం(అధ్యాహృతము)=నీవు; పక్షిభూతః= పక్షియయినవాఁడవై; మనోజవః= మనోవేగముగలవాఁడవై; త్రీన్ = మూఁడైన; లోకాన్=లోకములను; విశసి=పొందుదువు. మమ = నాయొక్క; చక్షుష్పథం=నేత్రమార్గమును; ప్రాప్య=పొంది; జీవన్=బ్రతికినవాఁడవై; నప్రతియాస్యసి=మఱలిపోఁజాలవు.

అట్లుగాక, నీవుపక్షివై, మనోవేగంబున ముల్లోకంబులకుఁ బోయినను, నాయెదుటం బడిన పిమ్మట బ్రతికి పోఁజాలవు. అని, తాత్పర్యము.

బ్రవీమి త్వాం హితం వాక్యం క్రియతా మౌర్ధ్వదైహికమ్. ౧౨
సుదృష్టా క్రియతాం లంకా జీవితం తే మయి స్థితమ్

టీక॥ త్వాం=నిన్నుఁగూర్చి; హితం = మేలుకలిగించునట్టి; వాక్యం=మాటను; బ్రవీమి = చెప్పుచున్నాను. ఔర్ధ్వదైహికం = ఊర్ధ్వదేహక్రియ; క్రియతాం = చేయఁబడుఁగాక. లంకా = లంకాపురి; సుదృష్టా= చక్కఁగాఁజూడఁబడినదిగా; క్రియతాం= చేయఁబడుఁగాక. తే = నీయొక్క; జీవితం=ప్రాణము; మయి = నాయందు; స్థితం=ఉన్నది.

నీకుహితంబుఁ జెప్పెదను వినుము; ఇంక లోకంబరాక్షసంబు కాఁగలదుగావున, నిప్పుడె, నీకునీవె యుపరక్రియంగావించుకొనుము; నీవింకఁజూడఁబోవునది లేదు కావున, నిప్పుడె, లంక నంతయుఁ జక్కఁగాఁ జూచుకొనుము; నీప్రాణంబులు నాచేతనున్నది. ఇట్లు రావణునితోఁ జెప్పుము. అని, రాముండు, అంగదునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త స్సతు తారేయో రామేణాక్లిష్టకర్మణా. ౨౨
జగామాకాశ మావిశ్య మూర్తిమానివ హవ్యవాట్




టీక॥ సః=ఆ; తారేయస్తు = తారాపుత్రుండగునంగదుండును ; అక్లిష్టకర్మణా = దుఃఖములేనికార్యములుగల; రామేణ=రామునిచేత; ఇతి = ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; ఆకాశం=ఆకాశమును; ఆవిశ్య = ప్రవేశించి; మూర్తిమాన్ = ఆకారముగల; హవ్యవాడివ= అగ్నిహోత్రుఁడువలె; జగామ=పోయెను.

తారాపుత్రుండగు నంగదుండు, రాముండు చెప్పినమాటనువిని, యాకాశంబునకెగసి కరచరణాద్యవయవవిశిష్టంబగుశరీరంబునొందిన యగ్నిహోత్రుండుంబోలెఁ, బోయెను.

అని, తాత్పర్యము.

సోఽతిపత్య ముహూర్తేన శ్రీమాన్ రావణమందిరమ్. ౭౩
దదర్శాసీన మవ్యగ్రం రావణం సచివై స్సహ

టీక॥ శ్రీమాన్ = కాంతిమంతుండగు; సః = ఆయంగదుండు; ముహూర్తేన=అల్పకాలముచేత; రావణమందిరం=రావణునిగృహమును; అతిపత్య=పొంది; సచివైస్సహ= మంత్రులతోఁగూడ; ఆసీనం=కూర్చుండినవాఁడును ; అవ్యగ్రం=ఏమఱుపాటులేనివాఁడు నగు; రావణం=రావణుని; దదర్శ=చూచెను.

శ్రీమంతుండగు నాయంగదుండు, ముహూర్తకాలంబున రావణు గృహంబునొంది, యచ్చట, జాగరూకుండును మంత్రులతోఁ గూర్చుండియున్న వాఁడునగు రావణుంజూచెను.

అని, తాత్పర్యము-

తత స్తస్యా విదూరే స నిపత్య హరిపుంగవః. ౭౪
దీప్తాగ్నిసదృశ స్తస్థా వంగదః కనకాంగదః

టీక॥ తతః=అంత; కనకాంగదః= బంగారుబాహుపురులు గలవాఁడును; హరిపుంగవః=వానరశ్రేష్ఠుండునగు ; సః=ఆ; అంగదః=అంగదుఁడు; తస్య= ఆరావణునకు; అవిదూరే=సమీపమునందు; నిపత్య=వ్రాలి; దీప్తాగ్నిసదృ




స ౪౧

శః = మండుచున్నయగ్నితోసమానుఁడై; తస్థౌ=నిలిచెను.

అంత, బంగారుబాహుపురులుధరించియుండువానరోత్తముండగునంగదుండు, ఆరావణునకుసమీపంబునఁబ్రావలి, మండుచున్నయగ్నికైవడి, నిలుచుండెను. అని, తాత్పర్యము.



తద్రామ వచనం సర్వ మన్యూనాధిక ముత్తమమ్. ౭౫
సామాత్యం శ్రావయామాస నివేద్యా త్మాన మాత్మనా

టీక॥ సః(అధ్యాహృతము) = ఆయంగదుఁడు; ఆత్మనా=తనచేత; ఆత్మానం=తన్ను; నివేద్య=తెలిపి; సామాత్యం=మంత్రులతోఁగూడినరావణుని; ఉత్తమం=శ్రేష్ఠమయినదియు; తత్ = ఆ; రామవచనం = రామునిమాటను; సర్వం=అంతను;అన్యూనాధికం=తక్కువయునెచ్చునులేనట్లుగా ; శ్రావయామాస=వినునట్లుచేసెను.

ఆయంగదుండు , మొదలందనపేరునూరుండెల్పి , యంతమంత్రిసహితుండగురావణునకు , రాముండుచెప్పినమాటల నన్నియు నెచ్చుతక్కువలెంతమాత్రములేకుండునట్లుచెప్పెను.

అని, తాత్పర్యము.

దూతోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః ౭౬
వాలిపుత్రోఽంగదో నామ యది తే శ్రోత్ర మాగతః

టీక॥ అహం= నేను; కోసలేంద్రస్య=కోసలదేశాధిపతియు;అక్లిష్టకర్మణః=దుఃఖకరములుకానికార్యములుగలవాఁడునగు;రామస్య=రామునియొక్క; దూతః=దూతను. వాలిపుత్రః= వాలికొడుకును. అంగదోనామ=అంగదుఁడనుపేరుగలవాఁడను. తే=నీయొక్క; శ్రోత్రం=చెవిని; ఆగతోయది= పొంది నానామేమి.

నేను, గోసలదేశాధిపతియునుబరులకుదుఃఖకరములు కానికార్యములుగలవాఁడునగురామునిదూతను; వాలికుమారుండను ; అంగదుఁడని నాపేరు;నీవునువినియుందువు.

అని, తాత్పర్యము.

ఆహ త్వాం రాఘవో రామః కౌసల్యానందవర్ధనః. ౭౭

టీక॥ కౌసల్యానందవర్ధనః= కౌసల్యయొక్క-సంతోషమును వృద్ధిఁబొందించువాఁడును; రాఘవః= రఘువంశమునందుఁబుట్టినవాఁడునగు; రామః= రాముండు; త్వాం=నిన్నుఁగూర్చి;ఆహ=చెప్పుచున్నాఁడు.

కౌసల్యాపుత్రుండును రఘువంశంబునఁబుట్టినవాఁడునగురాముండునీతోఁజెప్పుమన్నాఁడు.అని, తాత్పర్యము.

నిష్పత్య ప్రతియుధ్యస్వ నృశంస పురుషో భవ

టీక॥ నృశంస= క్రూరుండవగురావణుఁడా! నిష్పత్య= వెడలివచ్చి; ప్రతియుధ్యస్వ= ఎదిరించియుద్ధముసేయుము. పురుషః=పురుషుండవు; భవ=అగుము.

క్రూరుండవగు రావణుఁడా! పట్టణంబుననుండి వెడలివచ్చి యెదురునిలిచి, యుద్ధముసేయుము , పౌరుషంబువహింపుము.అని, తాత్పర్యము.

హంతాస్మి త్వాం సహామాత్యం సపుత్రజ్ఞాతిబాంధవమ్. ౭౮




టీక॥ సహామాత్యం= మంత్రులతోఁ గూడినవాఁడవును; సపుత్రజ్ఞాతిబాంధవం=కొడుకులతోను జ్ఞాతులతోను బంధువులతోనుం గూడిన వాఁడవు నగు, త్వాం=నిన్ను; హంతాస్మి = వధించెదను.

నిన్ను నీకొడుకులను దాయాదులను బంధువులను నీమంత్రులను, అందఱను, వధించెదను.

అని, తాత్పర్యము.

నిరుద్విగ్నా స్త్రయో లోకా భవిష్యంతి హతే త్వయి

టీక॥ త్వయి=నీవు; హతే=చంపఁబడఁగా; త్రయః = మూఁడైన; లోకాః=లోకములు; నిరుద్విగ్నాః = భయములేనివి; భవిష్యంతి=కాఁగలవు.

నిన్ను వధించినపిదప, ముల్లోకంబులును నిర్భయంబులయి, సుఖంబునొందును.

అని, తాత్పర్యము.

దేవదానవయక్షాణాం గంధర్వోరగరక్షసామ్. ౪౯
శత్రుమద్యోద్ధరిష్యామి త్వా మృషీణాం చ కంటకమ్

టీక॥ దేవదానవయక్షాణాం= దేవతలకును దానవులకును యక్షులకును; గంధర్వోరగరక్షసాం = గంధర్వులకును సర్పములకును రాక్షసులకును; శత్రుం=శత్రుండవును; ఋషీణాం= ఋషులకు; కంటకంచ = శత్రుండవునగు; త్వాం=నిన్ను; ఉద్ధరిష్యామి = ఛేదించెదను.

దేవతలకును దానవులకును యక్షులకును గంధర్వులకును ఉరగములకును రాక్షసులకును శత్రుండవు ఋషిబాధకుండవునగు నిన్నిప్పుడు వధించెదను.

అని, తాత్పర్యము.

విభీషణస్య చైశ్వర్యం భవిష్యతి హతే త్వయి. ౫౦
న చే త్సత్కృత్య వైదేహీం ప్రణిపత్య ప్రదాస్యసి

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; సత్కృత్య=పూజించి; ప్రణిపత్య= నమస్కరించి; వైదేహీం=సీతాదేవిని; న ప్రదాస్యసి చేత్ =ఇవ్వవేని; త్వయి=నీ




వు; హతే = చంపఁబడఁగా; విభీషణస్య=విభీషణునకు; ఐశ్వర్యంచ= ప్రభుత్వమును; భవిష్యతి=కాఁగలదు.

నీవు,పూజించి, సీతనుసమర్పించి, నాపాదంబులంబడవేసి,నిన్నువధించి, విభీషణునకు లంకాధిపత్యంబునొసంగెదను. అని, రాముండు చెప్పుమన్నాఁడు. అనియంగదుండు రావణునితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

ఇత్యేవం పరుషం వాక్యం బ్రువాణే హరిపుంగవే. ౮౧
అమర్షవశ మాపన్నో నిశాచరగణేశ్వరః

టీక॥ ఇత్యేవం= అనియిట్లు; హరిపుంగవే= వానరశ్రేష్ఠుండగునంగదుండు;పరుషం=కఠినమయిన; వాక్యం= మాటను; బ్రువాణే=చెప్పుచుండఁగా; నిశాచరగణేశ్వరః= రాక్షససమూహనాయకుండగురావణుండు ; అమర్షవశం = కోపాధీనతను ; ఆపన్నః = పొందినాఁడు.

వానరశ్రేష్ఠుండగునంగదుండు , ఇట్లుపరుషవాక్యంబులాడ,రావణుండు, కోపవివశుండయ్యెను.

అని, తాత్పర్యము.

తత స్సరోషతామ్రాక్ష శ్శశాస సచివాం స్తథా. ౮౨
గృహ్యతా మేష దుర్మేధా వధ్యతామితి చాసకృత్

టీక॥తతః=అంత;తదా=అప్పుడు; సః = ఆరావణుఁడు; రోషతామ్రాక్షః=కోపముచే నెఱ్ఱనయిన కండ్లుగలవాఁడై; సచివాన్=మంత్రులను ; దుర్మేధాః=దుర్బుద్ధియగు; ఏషః= ఈతండు; గృహ్యతాం = పట్టుకొనఁబడుఁగాక. వధ్యతాం=చంపఁబడుఁగాక." ఇతిచ=అనియు;అసకృత్=పలుమాఱు;శశాస=ఆజ్ఞాపించెను.

అంత,నారావణుండు , కోపంబునఁ గన్నులనెఱ్ఱఁదనంబుగదుర,మంత్రులంజూచి,"దుర్బుద్ధియగునీయంగదుం బట్టివధింపుఁడు" అని,పలుమాఱు, ఆజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

రావణస్య వచ శ్శ్రుత్వా దీప్తాగ్ని సమ తేజసః. ౮౩
జగృహు స్తం తతో ఘోరా శ్చత్వారో రజనీచరాః

టీక॥ రావణస్య = రావణునియొక్క; వచః = మాటను; శ్రుత్వా = విని; తతః = అంత; దీప్తాగ్నిసమతేజసః = మండుచున్నయగ్నితోసమానమయిన కాంతిగల; ఘోరాః = భయంకరులయిన; రజనీచరాః = రాక్షసులు; చత్వారః = నల్వురు; తం = ఆయంగదుని; జగృహుః = పట్టుకొనిరి.

ఆ రావణునాజ్ఞనువిని, మండుచున్నయగ్నిచొప్పానముంతటి భయంకరాకారులగునలువురు రాక్షసులు, ఆయంగదుంబట్టుకొనిరి. అని, తాత్పర్యము.

గ్రాహయామాస తారేయ స్స్వయమాత్మాన మాత్మవాన్. ౮౪
బలం దర్శయితుం వీరో యాతుధానగణే తదా

టీక॥ తదా = అప్పుడు; ఆత్మవాన్ = ధైర్యవంతుండును; వీరః = పరాక్రమశాలియునగు; తారేయః = అంగదుఁడు; యాతుధానగణే = రాక్షససమూహమునందు; బలం = బలమును; దర్శయితుం = చూపుటకు; స్వయం = తానే; ఆత్మానం = తన్ను; గ్రాహయామాస = పట్టించుకొనెను; పట్టుపడెననుట.

అప్పుడు, ధైర్యవంతుండును బరాక్రమవంతుండునగునంగదుండు, రాక్షసులకుఁదనబలంబుఁజూపుటకై, తానే, యారాక్షసులు తన్నుఁబట్టుకొనుటకియ్యకొనెను. అని, తాత్పర్యము.

స తాన్ బాహుద్వయే సక్తా నాదాయ పతగానివ. ౮౫
ప్రాసాదం శైలసంకాశ ముత్పపాతాం గద స్తదా

టీక॥ తదా = అప్పుడు; సః = ఆ; అంగదః = అంగదుఁడు; బాహుద్వయే = చేతులరెండిటియందు; సక్తాన్ = అంటుకొనిన; తాన్ = ఆరాక్షసులను; పతగానివ = పక్షులనుంబోలె; ఆదాయ = తీసికొని; శైలసంకాశం = పర్వతముతో సమానమయిన; ప్రాసాదం = మేడనుగూర్చి; ఉత్ప

పాత=ఎగిరెను.

అప్పుడు, ఆయంగదుండు, ఆరాక్షసులను బకులంబోలె, రెండుచేతులనిఱికించుకొని, పర్వతాకారంబగుప్రాసాదంబుపై కెగసెను. అని, తాత్పర్యము.

తేంతరిక్షా ద్వినిర్ధూతా స్తస్య వేగేన రాక్షసాః. ౮౬
భూమౌ నిపతితా స్సర్వే రాక్షసేంద్రస్య పశ్యతః

టీక॥ తే=ఆ; రాక్షసాః=రాక్షసులు; సర్వే=అందఱును; రాక్షసేంద్రస్య=రాక్షసేశ్వరుండగురావణుండు; పశ్యతః=చూచుచుండఁగా; తస్య=ఆయంగదునియొక్క; వేగేన=వేగముచేత; అంతరిక్షాత్=ఆకాశముననుండి; నిర్ధూతాః = విదిలింపఁబడినవారలయి; భూమౌ=నేలయందు; నిపతితాః=పడిరి.

ఆరాక్షసులందఱు, రాక్షసేశ్వరుండగు రావణుండు చూచుచుండఁగానే, ఆయంగదునివేగంబునను, ఆకాశంబుననుండి నేలంబడిరి. అని, తాత్పర్యము.

తతః ప్రాసాదశిఖరం శైలశృంగ మివోన్నతమ్. ౮౭
దదర్శ రాక్షసేంద్రస్య వాలిపుత్రః ప్రతాపవాన్

టీక॥ తతః=అంత; ప్రతాపవాన్=అధికమయినపరాక్రమముగల; వాలిపుత్రః= వాలికుమారుండగునంగదుండు; రాక్షసేంద్రస్య= రాక్షసేశ్వరుండగురావణునియొక్క; శైలశృంగమివ=పర్వతశిఖరమువలె; ఉన్నతం = పొడవైన; ప్రాసాదశిఖరం = రాజగృహముయొక్క-శిఖరమును; దదర్శ=చూచెను.

అంత మహాపరాక్రమ శాలియగు వాలిపుత్రుఁడయినయంగదుండు, పర్వత శిఖరముంబోలె నత్యున్నతంబయినరావణుని ప్రాసాదశిఖరముం జూచెను. అని, తాత్పర్యము.

తత్పపాల పదాక్రాంతం దశగ్రీవస్య పశ్యతః. ౮౮
పురా హిమవత శ్శృంగం వజ్రిణేవ విదారితమ్




టీక॥ దశగ్రీవస్య = రావణుఁడు; పశ్యతః = చూచుచుండఁగా; పురా = మున్ను; వజ్రిణా = ఇంద్రునిచేత; విదారితం = పగులఁగొట్టఁబడిన; హిమవతః = హిమవత్పర్వతముయొక్క; శృంగమివ = శిఖరమువలె; పదాక్రాంతం = కాలిచేఁద్రొక్కఁబడిన; తత్ = ఆప్రాసాదశిఖరము; పఫాల = పగిలెను.

రావణుఁడు చూచుచుండఁగానే, మున్నింద్రునిచేఁ బగులఁ గొట్టఁబడిన హిమవచ్ఛిఖరముంబోలె, నాయంగదునిపాదాఘాతంబున, నాప్రాసాదశిఖరంబు పగిలెను. అని, తాత్పర్యము.

భఙ్క్త్వా ప్రాసాదశిఖరం నామ విశ్రావ్య చాత్మనః ౮౯
వినద్య సుమహానాద ముత్పపాత విహాయసమ్

టీక॥ సః (అధ్యాహృతము) = ఆయంగదుఁడు; ప్రాసాదశిఖరం = ప్రాసాదశృంగమును; భఙ్క్త్వా = విఱిచి; ఆత్మనః = తనయొక్క; నామ = పేరును; విశ్రావ్య చ = వినిపించియు; సుమహానాదం = మిక్కిలియు నధికమయిన ధ్వని కలుగునట్లుగా; వినద్య = అఱచి; విహాయసం = ఆకాశమును గూర్చి; ఉత్పపాత = ఎగిరెను.

ఆయంగదుఁడు, అట్లు ప్రాసాదశిఖరమును బగులఁగొట్టి, తన పేరందఱకుం దెలియునట్లు చేసి, మహాధ్వని గల్గునట్లు సింహనాదంబు గావించి, యాకాశంబున కెగరెను.

అని, తాత్పర్యము.

వ్యథయన్ రాక్షసా న్సర్వాన్ హర్షయంశ్చాపి వానరాన్ ౯౦
స వానరాణాం మధ్యేతు రామపార్శ్వ ముపాగతః

టీక॥ సః = ఆయంగదుఁడు; రాక్షసాన్ = రాక్షసులను; సర్వాన్ = అందఱను; వ్యథయన్ = దుఃఖింపఁజేయుచు; వానరాన్ = వానరులను; హర్షయంశ్చాపి = సంతోషింపఁజేయుచును; వానరాణాం = వానరులయొక్క; మధ్యేతు = నడుమను; రామపార్శ్వం = రామునిప్రక్కను; ఉపాగ




తః=పొందినాఁడు.

ఆయంగదుఁడు, అట్లు రాక్షసుల కందఱకునుదుఃఖంబుగలుగఁజేయుచు, వానరులను సంతోషింపఁ జేయుచు, వానరమధ్యంబున, రామపార్శ్వంబుఁజేరెను.

అని, తాత్పర్యము.

రావణస్తు పరం చక్రే క్రోధం ప్రాసాదధర్షణాత్. ౯౧
వినాశం చాత్మనః పశ్యన్నిశ్వాసపరమో భవత్

టీక॥ రావణస్తు= రావణుండును ; ప్రాసాదధర్షణాత్ = ప్రాసాదంబు [illegible]చుటవలన; పరం=అధికమయిన ; క్రోధం=కోపమును; చక్రే= చేసెను. ఆత్మనః=తనయొక్క; వినాశంచ= కీడును; పశ్యన్=చూచుచు ; నిశ్వాసపరమః=అధికమయిన నిట్టూర్పు గలవాఁడు; అభవత్=ఆయెను.

రావణుండును, దన ప్రాసాదంబు నుబగులఁగొట్టుటకుఁ బరమ కోపంబునొంది,అందువలనఁదనకుఁజేటుగలుగునని సూచింపఁబడుటంగని, వేడి నిట్టూర్పులువిడుచుచుండెను.

అని, తాత్పర్యము.

రామస్తు బహుభి హృష్టైః నినదద్భిః ప్లవంగమైః. ౯౨
వృతో రిపువధాకాంక్షీ యుద్ధాయై వాభ్యవర్తత

టీక॥ రామస్తు=రాముండును; హృష్టైః=సంతసించినవారలును ; నినదద్భిః=ధ్వనించుచున్నవారలునగు ; బహుభిః= పెక్కండ్రయిన ; ప్లవంగమైః=వానరులచేత;వృతః=చుట్టఁబడినవాఁడై;రిపువధాకాంక్షీ = శత్రువధమునుగోరువాఁడై;యుద్ధాయైవ=యుద్ధముకొఱకే; అభ్యవర్తత = కాచియుండెను.

రాముండును,సంతుష్టులయి సింహనాదంబులుసేయుచుండునట్టి పెక్కండ్రువానరవీరులచేఁబరివేష్టితుండై , శత్రువధంబుగోరుచుయుద్ధంబు కొఱకుఁ గాచియుండెను.

అని, తాత్పర్యము.

సుషేణస్తు మహావీర్యో గిరికూటోపమో హరిః. ౯౩
బహుభి స్సంవృత స్తత్ర వానరైః కామరూపిభిః

టీక॥ మహావీర్యః = అధికమయినపరాక్రమముగలవాఁడును; గిరికూటోపమః = పర్వతశిఖరంబుతోఁబోలిక గలవాఁడునగు; సుషేణః = సుషేణుఁడను; హరిస్తు = వానరుఁడును; తత్ర = అచ్చట; కామరూపిభిః = ఇచ్ఛాధీనమగు రూపముగల; బహుభిః = పెక్కండ్రయిన; వానరైః = వానరులచేత; సంవృతః = పరివేష్టితుఁడై; అభూత్ (అధ్యాహృతము) = ఉండెను.

అప్పుడచ్చట, మహాపరాక్రమశాలియుఁ బర్వతాకారుండునగు సుషేణుండు, కామరూపులగు పెక్కండ్ర వానరులచేఁ బరివేష్టితుండై, యుండెను.

అని, తాత్పర్యము.

చతుర్ద్వారాణి సర్వాణి సుగ్రీవవచనాత్కపిః. ౯౪
పర్యక్రామత దుర్ధర్షో నక్షత్రాణీవ చంద్రమాః

టీక॥ దుర్ధర్షః = ఎదిరింపనలవిగానట్టి; కపిః = సుషేణుండు; సుగ్రీవవచనాత్ = సుగ్రీవునిమాటవలన; చతుర్ద్వారాణి = నాలుగుద్వారంబులను; సర్వాణి = అన్నియు; నక్షత్రాణి = నక్షత్రములను; చంద్రమా ఇవ = చంద్రుఁడువలె; పర్యక్రామత = తిరుగుచుండెను.

దుర్ధర్షుండగు సుషేణుండు, సుగ్రీవునానతిం జేసి, చంద్రుండు నక్షత్రంబులందిరుగుచుండునట్లు, లంకాద్వారంబుల నాలుగింటను విడువక తిరుగుచుండెను. అని, తాత్పర్యము.

తేషా మక్షౌహిణీశతం సమవేక్ష్య వనౌకసామ్. ౯౫
లంకా ముపనివిష్టానాం సాగరం చాతివర్తతామ్
రాక్షసా విస్మయం జగ్ము స్త్రాసం జగ్ము స్తథాపరే. ౯౬
అపరే సమరోద్ధర్షా ద్ధర్షమేవ ప్రపేదిరే

టీక॥ లంకాం=లంకాపురిని; ఉపనివిష్టానాం = సమీపించివిడిసినవారలును;సాగరంచ = సముద్రమునుగూడ;అతివర్తితాం= అతిక్రమించినవారలునగు; తేషాం = ఆ;వనౌకసాం= వానరులయొక్క; అక్షౌహిణీశతం= అక్షౌహిణులనూఱిటిని ; దృష్ట్వా = చూచి;రాక్షసాః = రాక్షసులు; కేచిత్ (అధ్యాహృతము)= కొందఱు; విస్మయం=ఆశ్చర్యమును;జగ్ముః= పొందిరి.తథా=అట్లు;అపరే = మఱికొందఱు;త్రాసం=భయమును ; జగ్ముః= పొందిరి.అపరే=మఱికొందఱు ; సమరోద్ధర్షాత్ = యుద్ధోత్సాహమువలన;హర్షమేవ = సంతోషమునే;ప్రపేదిరే=పొందిరి.

అట్లు లంకాపురిసమీపంబునవిడిసి సముద్రంబునుంగూడనతిక్రమించియుండు, నూఱక్షౌహిణులవానరసేనంజూచి, రాక్షసులుకొందఱు , ఆశ్చర్యంబునొందిరి,కొందఱుభయపడిరి ; శూరులగుమఱికొందఱు యుద్ధోత్సాహంబునంజేసి,సంతోషంబునొందిరి. అని, తాత్పర్యము.

కృత్స్నంహి కపిభిర్వ్యాప్తం ప్రాకారపరిఖాంతరమ్. ౯౭
దదృశూ రాక్షసా దీనాః ప్రాకారం వానరీకృతమ్

టీక॥రాక్షసాః = రాక్షసులు; దీనాః=దుఃఖితులయి; కపిభిః= వానరులచేత; వ్యాప్తం=వ్యాపింపఁబడిన; కృత్స్నం = సమస్తమయిన ; వానరీకృతం=వానరమయముగాఁ జేయఁబడిన; పా్రకారం=ప్రాకారముగాను; ప్రాకారపరిఖాంతరం= ప్రాకారముయొక్కయునగడ్తయొక్కయుమధ్య ప్రదేశమును; దదృశుః=చూచిరి.

రాక్షసులందఱు, దీనులయి, ప్రాకారపరిఖలమధ్యప్రదేశంబునసంతయు వానరులు వ్యాపించియుండుటంజేసి , వానరమయప్రాకారంబుగాఁజూపట్టుచున్న యాప్రాకారపరిఖమధ్యప్రదేశముంజూచిరి. అని, తాత్పర్యము.

హాహాకారం ప్రకుర్వంతి రాక్షసా భయమోహితాః. ౯౮

టీక॥ రాక్షసాః = రాక్షసులు; భయమోహితాః= భయముచే మోహ

మనొందినవారలయి; హాహాకారం = హాహాయనుటను; ప్రకుర్వంతి = చేయుచుండిరి.

రాక్షసులందఱు, భయంబున, వొడలు తెలియక, హాహాకారంబులు గావించుచుండిరి. అని, తాత్పర్యము.

తస్మిన్ మహాభీషణకే ప్రవృత్తే
కోలాహలే రాక్షస రాజధాన్యామ్
ప్రగృహ్య రక్షాంసి మహాయుధాని
యుగాంతవాతా ఇవ సంవిచేరుః. ౯౯

టీ॥ రాక్షస రాజధాన్యాం = రాక్షసుల యొక్క - రాజధానియందు; మహాభీషణకే = గొప్పభయంకరమయిన; తస్మిన్ = ఆ; కోలాహలే = కోలాహలము; ప్రవృత్తే = కలుగఁగా; రక్షాంసి = రాక్షసులు; మహాయుధాని = గొప్పయాయుధములను; ప్రగృహ్య = పట్టుకొని; యుగాంతవాతా ఇవ = ప్రళయకాలవాయువులుంబోలె; సంవిచేరుః = సంచరించిరి.

రాక్షసుల రాజధానియగు లంకాపురియందు, అట్టిమిక్కిలి భయంకరమయిన కోలాహలంబున, శూరులగు రాక్షసులు, మహాయుధంబులు ధరించి, ప్రళయకాలవాయువులుంబోలె, సంచరించుచుండిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ఏకచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండైక చత్వారింశసర్గటీక, ముగిసినది.

---

౪౨

## ద్విచత్వారింశసర్గప్రారంభః.

తతస్తే రాక్షసా స్తత్ర గత్వా రావణమందిరమ్
న్యవేదయ న్పురీం రుద్ధాం రామేణ సహ వానరైః. ౧

టీక॥ తతః=అంత; తే=ఆ; రాక్షసాః=రాక్షసులు; తత్ర=అప్పుడు; రావణమందిరం=రావణుని గృహంబును; గత్వా=పొంది; పురీం = లంకాపురిని; రామేణ=రామునిచేత; వానరైస్సహ=వానరులతోఁగూడ; రుద్ధాం=అడ్డగింపఁబడినదానిఁగా; న్యవేదయన్= తెలిపిరి.

అంతనప్పుడారాక్షసులు, రావణునిగృహంబునకుఁబోయి, రాముండువానరులతోలంకాపురినంతయు ముట్టడించియున్నాఁడని, రావణునకుందెల్పిరి. అని, తాత్పర్యము.

రుద్ధాంతు నగరీం శ్రుత్వా జాతక్రోధో నిశాచరః
విధానం ద్విగుణం కృత్వా ప్రాసాదం సోధ్యరోహత. ౨

టీక॥ సః=ఆ; నిశాచరః = రాక్షసుఁడగు రావణుఁడు; నగరీం = లంకాపట్టణమును; రుద్ధాం= ముట్టడింపఁబడినదానిఁగా; శ్రుత్వాతు= విన్నంతనె; జాతక్రోధః = పుట్టినకోపముగలవాఁడై; ద్విగుణం = రెండింతలయిన; విధానం=ఏపాటును; కృత్వా= చేసి; ప్రాసాదం = మేడను; అధ్యరోహత=ఎక్కెను.

ఆరావణుండు, లంకానగరమును వానరులుముట్టడించుటనువిని, పరమకోపమునొంది, రెండింతలుగానగరరక్షణసంవిధానంబుగావించి, ప్రాసాదంబుపైకెక్కెను. అని, తాత్పర్యము.

స దదర్శావృతాం లంకాం సశైలవనకాననామ్
అసంఖ్యేయై ర్హరిగణై స్సర్వతో యుద్ధకాంక్షిభిః. ౩

టీక॥ సః=ఆరావణుఁడు; యుద్ధకాంక్షిభిః = యుద్ధమునుగోరునవియు




ను;అసంఖ్యైయైః = లెక్కపెట్టనలవిగానట్టివియునగు;హరిగణైః = వానరసమూహములచేత;సర్వతః= అంతటను;ఆవృతాం = ఆవరింపఁబడినదియు;సశైలవనకాననాం= పర్వతములతోను వనములతోను అడవులతోనుం గూడినదియునగు;లంకాం = లంకాపురిని;దదర్శ=చూచెను.

అంత,రావణుండు , ప్రాసాదంబుపైనుండి , యుద్ధకాంక్షులగులెక్కలేనివానరులచే నంతటనుటరివేష్టితంబయియున్న,లంకాపురింజూచెను.

అని, తాత్పర్యము.

స దృష్ట్వా వానరై స్సర్వాం వసుధాం కబలీకృతామ్
కథం క్షపయితవ్యా స్స్యు రితి చింతా పరోభవత్. ౪

టీక॥ సః=ఆరావణుఁడు ; వానరైః = వానరులచేత;కబలీకృతాం=కప్పఁబడిన;సర్వాం= సమస్తమయిన;వసుధాం=భూమిని=దృష్ట్వా= చూచి; కథం=ఎట్లు;క్షపయితవ్యాః= నశింపఁజేయఁబడవలసినవారలు?ఇతి = అని; చింతాపరః=చింతాధీనుఁడు ; అభవత్ =ఆయెను.

ఆరావణుండు,వానరులు, భూమినంతయు నాచ్ఛాదించియుండుటంబూచి,వీరలనెట్లువధింతునని, చింతనొందెను. అని, తాత్పర్యము.

స చింతయిత్వా సుచిరం ధైర్య మాలంబ్య రావణః
రాఘవం హరియూథాంశ్చ దదర్శా యతలోచనః. ౫

టీక॥సః=ఆ;రావణః= రావణుఁడు; సుచిరం=బహుకాలము;చింతయిత్వా=ఆలోచించి; ధైర్యం=ధైర్యమును; ఆలంబ్య= అవలంబించి; ఆయతలోచనః=నిడుపులయినకండ్లు గలవాఁడై; రాఘవం=రాముని ; హరియూథాంశ్చ=వానరసమూహములను; దదర్శ=చూచెను.

ఆరావణుండట్లుబహుకాలము చింతించి ధైర్యంబవలంబించి, యాశ్చర్యంబున దీర్ఘములయినకండ్లతో, రామునివానరసమూహములనుం జూచెను.

అని, తాత్పర్యము.




రాఘవ స్సహసైన్యేన ముదితో నామ పుప్లువే
లంకాం దదర్శ గుప్తాం వై సర్వతో రాక్షసై ర్వృతామ్. ౬

టీక॥ రాఘవః= రాముఁడు; ముదితః=సంతుష్టుఁడై, ("నామ" యనునది వాక్యాలంకారార్థము ;) సైన్యేన సహ=సైన్యముతోఁగూడ; పుప్లువే = వేగమునఁబోయెను. సర్వతః = అంతటను; రాక్షసైః=రాక్షసులచేత ; వృతాం=చుట్టఁబడినదియు; గుప్తాం=రక్షింపబడినదియునగు ("వై" అనునది పాదపూరణార్థము;) లంకాం=లంకాపురిని; దదర్శ=చూచెను,

రాముండు, సంతుష్టుండై, సైన్యంబుతోఁగూడ వేగంబునఁ బ్రాకార సమీపంబునకుఁబోయి, సమస్తభాగంబుల రాక్షసులచేఁ బరివృతంబయి, సురక్షితంబై యున్న లంకాపురిం జూచెను. అని, తాత్పర్యము.

దృష్ట్వా దాశరథి ర్లంకాం చిత్రధ్వజపతాకినీమ్
జగామ సహసా సీతాం దూయమానేన చేతసా. ౭

టీక॥ దాశరథిః=రాముఁడు; చిత్రధ్వజపతాకినీం = నానావర్ణములగు వట్టిపెకెక్కెములును రాజచిహ్నములతోఁగూడిన పెకెక్కెములునుంగల ; లంకాం=లంకాపురిని; దృష్ట్వా=చూచి ; సహసా=శీఘ్రంబున ; దూయమానేన=పరితపించుచున్న; చేతసా = మనస్సుచేత;సీతాం=సీతాదేవిని;జగామ=పొందెను.

రాముండు, చిత్రధ్వజంబులతో నొప్పుచున్న యాలంకానగరముంజూచి, మనంబున సీతాదేవిం దలంచి, మిక్కిలియు దుఃఖితుండయ్యెను.

అని, తాత్పర్యము.

అత్ర సా మృగశాబాక్షీ మత్కృతే జనకాత్మజా
పీడ్యతే శోకసంతప్తా కృశా స్థండిలశాయినీ. ౮

టీక॥ అత్ర= ఈలంకానగరమునందు; మృగశాబాక్షీ= జింకపిల్లలయొక్క కండ్లవంటికండ్లుగలదియు; జనకాత్మజా = జనకమహారాజుకూఁతురున

గు; సా=ఆసీతాదేవి;మత్కృతే=నానిమిత్తమయి; శోకసంతప్తా= దుఃఖముచేమిక్కిలియుఁ దపింపఁజేయఁబడినదై; కృశా=కృశించినదై ; స్థండిలశాయినీ=నేలయందుఁబరుండినదై ; పీడ్యతే=పీడింపఁబడుచున్నది.

ఈలంకానగరంబుననేకదా! జింకపిల్లలకంఠ్లవంటికండ్లుగలదియు జనకమహారాజుకూఁతురువైన యాసీతాదేవి,రాక్షసపీడితయయి , నానిమిత్తము పరమదుఃఖితయై యుపవాసంబులచేఁగృశించి, నానావిధంబుగాఁగష్టపడుచున్నది.అని,రాముండుదుఃఖించెను.

అని,తాత్పర్యము.

పీడ్యమానాం స ధర్మాత్మా వైదేహీ మనుచింతయన్
క్షిప్ర మాజ్ఞాపయామాస వానరాన్ ద్విషతాం వధే. ౯

టీక॥ ధర్మాత్మా= ధర్మస్వభావుండగు;సః=ఆరాముఁడు ; పీడ్యమానాం=పీడింపఁబడుచున్న; వైదేహీం=సీతను;అనుచింతయన్ = చింతించుచు;ద్విషతాం = శత్రువులయొక్క;వధే=చంపుటనిమిత్తమయి;వానరాన్=వానరులను;క్షిప్రం = శీఘ్రముగా;ఆజ్ఞాపయామాస=ఆజ్ఞాపించెను.

ధర్మాత్ముండగునారాముండు,అట్లురాక్షసులచేఁబీడింపఁ బడుచున్న సీతాదేవిందలంచుకొని,రోషంబినుమడింపఁగా, వానరులశీఘ్రంబునశత్రువధంబుగావింపుఁడనియాజ్ఞాపించెను.

అని,తాత్పర్యము.

ఏవ ముక్తేతు వచనే రామేణా క్లిష్టకర్మణా
సంఘర్షమాణాః ప్లవగా స్సింహానాదై రనాదయన్. ౧౦

టీక॥అక్లిష్టకర్మణా = దుఃఖకరములుకానికార్యములుగల; రామేణ=రామునిచేత;ఏవం=ఇట్లు;వచనే=మాట;ఉక్తేతు= చెప్పఁబడినదికాఁగానే;ప్లవగాః=వానరులు;సంఘర్షమాణాః=ఒకరితోనొకరుపోటిగలవారలయి; సింహానాదైః=సింహానాదములచేత ; అనాదయన్=ధ్వనింపఁజేసిరి.

పరులకుదుఃఖకరంబులుకానికార్యములుగల రాముం డట్లాజ్ఞాపింపఁగా

నే, వానరులొకరిముందొకరు పోటితో యుద్ధసన్నద్ధులయి, సింహనాదంబులు గావించిరి. అని, తాత్పర్యము.

శిఖరై ర్వికిరామైనాం లంకాం ముష్టిభిరేవ వా
ఇతి స్మ దధిరే సర్వే మనాంసి హరియూథపాః. ౧౧

టీక॥హరియూథపాః= వానరశ్రేష్ఠులు; సర్వే=అందఱును; "ఏనాం=ఈ; లంకాం=లంకను; శిఖరైః= పర్వతశిఖరముల చేతఁగాని; ముష్టిభిరేవవా=పిడికిళ్ల చేతఁగాని; వికిరామ = చూర్ణముగావించెదము" ఇతి=అని; ("స్మ" అనునది పాదపూరణార్థము) మనాంసి=తలంపులను; దధిరే=ధరించిరి.

వానరశ్రేష్ఠులు, "ఈలంకను బర్వత శిఖరంబుల చేఁ గానిపిడికిళ్ల చేఁగానిచూర్ణముగావింతము" అని, తలంపుగొనిరి. అని, తాత్పర్యము.

ఉద్యమ్య గిరిశృంగాణి శిఖరాణి మహాంతిచ
తరూంశ్చో త్పాట్య వివిధాం స్తిష్ఠంతి హరియూథపాః. ౧౨

టీక॥హరియూథపాః= వానరశ్రేష్ఠులు; గిరిశృంగాణి= పర్వతశిఖరములను; మహాంతి=గొప్పవగు; శిఖరాణిచ= పర్వతఖండములను; ఉద్యమ్య=ఎత్తుకొని; వివిధాన్=నానావిధములయిన; తరూంశ్చ=వృక్షములను; ఉత్పాట్య= పెఱికి; తిష్ఠంతి=ఉండిరి.

వానరశ్రేష్ఠులు, పర్వతశిఖరంబులను బర్వతఖండములను నానావిధ వృక్షంబులనుం బట్టుకొని యుద్ధ సన్నద్ధులయి యుండిరి. అని, తాత్పర్యము.

ప్రేక్షతో రాక్షసేంద్రస్య తాన్యనీకాని భాగశః
రాఘవప్రియకామార్థం లంకా మారురుహు స్తదా. ౧౩

టీక॥తదా=అప్పుడు; తాని=ఆ; అనీకాని=సైన్యములు; రాక్షసేంద్రస్య= రాక్షసేశ్వరుండగు రావణుండు; ప్రేక్షతః(ప్రేక్షమాణస్య)=చూచుచుండఁ

గా; రాఘవప్రియకామార్థం = రాముని సంతోషంబను కోరిక నిమిత్తమయి; భాగశః=భాగములు భాగములుగా; లంకాం=లంకను ; ఆరురుహుః= ఎక్కిరి.

అప్పుడు, రాక్షసాధిపతియగు రావణుండు చూచుచుండఁగానే, యావానర సైన్యంబులంతయు, రామునకు సంతోషంబుగలుగుటకై, భాగంబులు భాగంబులుగా, లంకాప్రాకారంబు నారోహించిరి. అని, తాత్పర్యము.

తే తామ్రవక్త్రా హేమాభా రామార్థే త్యక్తజీవితాః
లఙ్కా మే వాభ్యవర్తన్త సాలతాల శిలాయుధాః. ౧౪

టీక॥ తామ్రవక్త్రాః= ఎఱ్ఱనిముఖములుగలవారలును; హేమాభాః = బంగారముయొక్క కాంతివంటికాంతిగలవారలును; రామార్థే= రామునినిమిత్తమయి; త్యక్తజీవితాః = విడువఁబడిన ప్రాణములుగలవారలునగు; తే= ఆ వానరులు; సాలతాలశిలాయుధాః= సాలవృక్షములును తాటిచెట్లును ఱాళ్లును ఆయుధములుగాఁగలవారలయి; లంకామేవ = లంకాపురినిగూర్చియె; అభ్యవర్తన్త=ఎదురొత్తిపోయిరి.

ఎఱ్ఱని మొగంబులుగలవారలును రామునిమిత్తమయి ప్రాణంబులనైనను విడువనిశ్చయించినవారలునగు నావానరులు , సాలవృక్షంబులను దాలవృక్షంబులను శిలలను, ఆయుధంబులుగాఁగొని, లంకాపురిపైకిఁబోయిరి.

అని, తాత్పర్యము.

తే ద్రుమైః పర్వతాగ్రైశ్చ ముష్టిభిశ్చ ప్లవంగమాః
ప్రాకారాగ్రా ణ్యరణ్యాని మమంథు స్తోరణానిచ. ౧౫

టీక॥ తే=ఆ; ప్లవంగమాః= వానరులు; ద్రుమైః=వృక్షముల చేతను; పర్వతాగ్రైశ్చ=పర్వతశిఖరముల చేతను; ముష్టిభిశ్చ=పిడికిళ్ల చేతను; ప్రాకారాగ్రాణి=ప్రాకారశిఖరములను; అరణ్యాని= అడవులను; తోరణానిచ= బహిర్ద్వారములను; మమంథుః= నలియఁగొట్టిరి.

ఆవానరులు , పర్వతశిఖరములతో గొట్టియుఁబిడికిళ్లంబొడిచియు, నాలంకాప్రాకారంబులను అరణ్యంబులను

పురద్వారంబులను జూర్ణంబుగావింపసాగిరి. అని, తాత్పర్యము.

పరిఖాః పూరయంతి స్మ ప్రసన్నసలిలాయుతాః
పాంసుభిః పర్వతాగ్రైశ్చ తృణైః కాష్ఠైశ్చ వానరాః. ౧౬

టీక॥ వానరాః=వానరులు; పాంసుభిః=పరాగంబులచేతను; పర్వతాగ్రైశ్చ=పర్వతశిఖరములచేతను; తృణైః=పచ్చికలచేతను; కాష్ఠైశ్చ=కట్టెలచేతను; ప్రసన్నసలిలాయుతాః=నిర్మలమయినజలముతోఁగూడిన; పరిఖాః=అగడ్తలను; పూరయంతిస్మ=నిండించిరి.

వానరులు, మట్టిపోసియుఁబర్వతశిఖరంబులనుదృణకాష్ఠంబులనువైచియు నిర్మలజలంబులతోఁగూడిన యగడ్తలను,బూడ్చిరి. అని, తాత్పర్యము.

తత స్సహస్రయూథాశ్చ కోటియూథాశ్చ వానరాః
కోటీశతయుతాశ్చాన్యే లంకా మారురుహు స్తదా. ౧౭

టీక॥ తతః=అంత; తదా=అప్పుడు; సహస్రయూథాశ్చ=వేయువానరులగుంపుగలవారలును; కోటియూథాశ్చ=కోటివానరులగుంపుగలవారలునగు; వానరాః=వానరులును; కోటీశతయుతాః=నూఱుకోటులతోఁగూడిన; అన్యేచ=ఇతరులును; లంకాం=లంకను; ఆరురుహుః=ఎక్కిరి.

అంత, వానరులుకొందఱువేయిమందివానరులతోనుగొందఱు కోటివానరులతోనుమఱికొందఱు నూఱుకోటులవానరులతోనుంగూడి, లంకాప్రాకారమునారోహించిరి.

అని, తాత్పర్యము.

కాంచనాని ప్రమథ్నంత స్తోరణాని ప్లవంగమాః
కైలాసశిఖరాభాని గోపురాణి ప్రమథ్యచ. ౧౮
ఆప్లవంతః ప్లవంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః
లంకాం తా మభిధావంతి మహావారణసన్నిభాః. ౧౯

స ౪౨




టీక॥ ప్లవంగమాః = వానరులు; కాంచనాని = బంగారువికారములయిన; తోరణాని = ద్వారములను; ప్రమథ్నంతః = విఱుచుచును; కైలాసశిఖరాభాని = కైలాసపర్వతముయొక్కశిఖరకాంతివంటికాంతిగల; గోపురాణి = గోపురములను; ప్రమథ్య చ = విఱిచియు; ఆప్లవంతః = వచ్చుచును; ప్లవంతశ్చ = పోవుచును; గర్జంతశ్చ = అఱచుచును; మహావారణసన్నిభాః = పెద్దయేనుంగులతోసమానులగు; ప్లవంగమాః = వానరులు; తాం = ఆ; లంకాం = లంకాపురినిగూర్చి; అభిధావంతి = పరుగెత్తిరి.

మత్తగజంబులంతటివానరులు, బంగారు పురద్వారంబులం బగులఁగొట్టుచు, కైలాసశిఖరంబువంటిగోపురంబులఁ జూర్ణంబు సేయుచు, నిటునటుగంతులు వేయుచు, సింహనాదంబులు సేయుచు, లంకపైకిఁబోయిరి.

అని, తాత్పర్యము.

జయత్యతి బలో రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః. ౨౦

టీక॥ అతిబలః = అధికమయినబలముగల; రామః = రాముఁడు; జయతి = సర్వోత్కర్షంబుననున్నాఁడు. మహాబలః = అధికమయినబలముగల; లక్ష్మణశ్చ = లక్ష్మణుఁడును; జయతి (అధ్యాహృతము) = సర్వోత్కృష్టుఁడైయున్నాఁడు. రాజా = రాజయిన; సుగ్రీవః = సుగ్రీవుఁడు; రాఘవేణ = రామునిచేత; అభిపాలితః = పాలింపఁబడినవాఁడై; జయతి = సర్వోత్కృష్టుఁడైయున్నాఁడు.

మహాబలుండగు రాముండును బలవంతుండగు లక్ష్మణుండును సర్వోత్కర్షంబుననున్నారు! వానర రాజుండగు సుగ్రీవుండు, రామునిచేసురక్షితుండై, సర్వోత్కర్షంబున నున్నాఁడు!

అని, తాత్పర్యము.

ఇత్యేవం ఘోషయంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః
అభ్యధావంత లంకాయాః ప్రాకారం కామరూపిణః. ౨౧




టీ॥ కామరూపిణః=ఇచ్ఛాధీనమగురూపముగల; ప్లవంగమాః=వానరులు; ఇత్యేవం=అనియిట్లు; ఘోషయంతశ్చ=అఱచుచును; గర్జంతశ్చ=సింహ నాదముసేయుచును; లంకాయాః= లంక యొక్క; ప్రాకారం = ప్రహరినిగూర్చి; అభ్యధావంత=పరుగెత్తిరి.

కామరూపులగు వానరులు, ఇట్లు ఘోషించుచు సింహనాదంబు సేయుచు, లంకాప్రాకారంబు మీఁదికిఁబోయిరి. అని, తాత్పర్యము.

వీరబాహు స్సుబాహుశ్చ నలశ్చ వనగోచరః
నిపీడ్యోపనివిష్టా స్తే ప్రాకారం హరియూధపాః. ౨౨

టీక॥ వీరబాహుః = వీరబాహువును; సుబాహుశ్చ= సుబాహువును; నలః=నలుఁడను; వనగోచరశ్చ= వానరుఁడును; తే=ఆప్రసిద్ధులగు; హరియూధపాః=వానరయూధపులు; ప్రాకారం=ప్రాకారమును; నిపీడ్య=నిరోధించి; ఉపనివిష్టాః=విడిసిరి.

అందు, వీరబాహువును సుబాహువును నలుండును నీవానరోత్తములు, లంకాప్రాకారంబును పీడింపుచు, విడిసిరి. అని, తాత్పర్యము.

ఏతస్మి న్నంతరే చక్రు స్స్కంధావారనివేశనమ్

టీక॥ ఏతస్మిన్ అంతరే = ఈమధ్యమునందు; స్కంధావారనివేశనం=దండుయొక్క విడియఁజేయుటను; చక్రుః= చేసిరి.

ఈమధ్యంబున, దండునుదగిన స్థలంబున, విడియఁజేసికొనిరి.

అని, తాత్పర్యము.

పూర్వద్వారంతు కుముదః కోటీభి ర్దశభి ర్వృతః. ౨౩
ఆవృత్య బలవాం స్తస్థౌ హరిభి ర్జితకాశిభిః

టీక॥ బలవాన్= అధికమయినబలముగల; కుముదః=కుముదుఁడు; జితకాశిభిః=జయముచేఁబ్రకాశించునట్టి; హరిభిః=వానరులచేత; దశభిః= పదియయి

న; కోటీభిః=కోటులచేత; వృతః= చుట్టఁబడినవాఁడై ; పూర్వద్వారంతు= తూర్పువాకిలినిమాత్రము; ఆవృత్య= ఆవరించి; తస్థౌ=ఉండెను.

బలవంతుండగుకుముదుండు, జయశాలులగుపదికోటులవానరులచేఁ బరివృతుండై, యాస్కంధావారమునందలితూర్పుద్వారంబుననుండెను.

అని, తాత్పర్యము.

సాహాయ్యార్థంతు తస్యైవ నివిష్టః ప్రఘసో హరిః. ౨౪
పనసశ్చ మహాబాహు ర్వానరై ర్బహుభి ర్వృతః

టీక॥ప్రఘసః=ప్రఘసుఁడను ; హరిః=వానరుఁడును; మహాబాహుః= పెద్దచేతులుగల; పనసశ్చ= పనసుండును; బహుభిః=పెక్కండ్రయిన; వానరైః= వానరులచే; వృతః=చుట్టఁబడినవాఁడై; తస్య= ఆకుముదునియొక్క ; సాహాయ్యార్థమేవ=తోడ్పాటుకొఱకే; నివిష్టః=విడిసినాఁడు.

ప్రఘసుండునుమహాబాహుండగుపనసుండును, పెక్కువానరులం గూడి , యాకుముదునకిసహాయులయి, పూర్వద్వారంబుననే, యుండిరి.

అని, తాత్పర్యము.

దక్షిణద్వార మాగత్య వీర శ్శతవలిః కపిః. ౨౫
ఆవృత్య బలవాం స్తస్థౌ వింశత్యా కోటిభి ర్వృతః

టీక॥బలవాన్=అధికమయిన బలముగల; వీరః = పరాక్రమశాలియగు; శతవలిః=శతవలియను; కపిః=వానరుఁడు; వింశత్యా=ఇరువదియయిన; కోటిభిః=కోటులచేత; వృతః = చుట్టఁబడినవాఁడై; దక్షిణద్వారం=దక్షిణపువాకిలిని; ఆగత్య=పొంది; ఆవృత్య=ఆవరించి; తస్థౌ=నిలిచెను.

మహాబలపరాక్రమశాలియగు శతవలి, ఇరువదికోటులవానరులతోఁ గూడినవాఁడై, యాస్కంధావార దక్షిణద్వారంబునావరించినిలిచెను.

అని, తాత్పర్యము.

సుషేణః పశ్చిమద్వారం గత స్తారాపితా హరిః. ౨౬

ఆవృత్య బలవాం స్తస్థౌ షష్టికోటిభి రావృతః

టీక॥బలవాన్ = అధికమయినబలముగల; తారాపితా = తారయొక్క తండ్రియగు; సుషేణః = సుషేణుఁడను; హరిః = వానరుఁడు; షష్టికోటిభిః = అఱువదికోటులచేత; ఆవృతః = చుట్టఁబడినవాఁడై; పశ్చిమ ద్వారం = పడమటివాకిలిని; గతః = పొందినవాఁడై; ఆవృత్య = ఆవరించి; తస్థౌ = నిలిచెను.

బలవంతుండగు తారాజనకుండయిన సుషేణుండు, అఱువదికోటుల వానరులతోఁగూడి, స్కంధావార పశ్చిమ ద్వారంబునావరించినిలిచెను.

అని, తాత్పర్యము.

ఉత్తరం ద్వార మాసాద్య రామ స్సౌమిత్రిణా సహ. ౨౮
ఆవృత్య బలవాం స్తస్థౌ సుగ్రీవశ్చ హరీశ్వరః

టీక॥బలవాన్ = అధికమయిన బలముగల; రామః = రాముఁడు; సౌమిత్రిణాసహ = లక్ష్మణునితోఁ గూడినవాఁడై; ఉత్తరం = ఉత్తరదిక్కుననుండు; ద్వారం = వాకిలిని; ఆసాద్య = పొంది; ఆవృత్య = ఆవరించి; తస్థౌ = నిలిచెను. హరీశ్వరః = వానరరాజుండగు; సుగ్రీవశ్చ = సుగ్రీవుండును; తస్థౌ (అధ్యాహృతము) = నిలిచెను.

బలవంతుండగు రాముండు, లక్ష్మణసహితుండై, స్కంధావారోత్తర ద్వారంబుననుండెను; వానరరాజుండగు సుగ్రీవుండునందెయుండెను.

అని, తాత్పర్యము.

గోలాంగూలో మహాకాయో గవాక్షో భీమదర్శనః. ౨౯
వృతః కోట్యా మహావీర్య స్తస్థౌ రామస్య పార్శ్వతః

టీక ॥ మహాకాయః = గొప్పదేహముగలవాఁడును ; భీమదర్శనః = భయంకరమయిన చూపుటగలవాఁడును; మహావీర్యః = అధికమయినపరాక్రమముగలవాఁడునగు; గవాక్షః = గవాక్షుఁడను; గోలాంగూలః = కొండముచ్చు; కోట్యా = కోటిచేత; వృతః = చుట్టఁబడినవాఁడై; రామస్య = రాముని

యొక్క; పార్శ్వతః = ప్రక్కను; తస్థౌ=నిలిచెను.

మహాకాయుండును జూపరులకుభయంబు గలిగించువాఁడును మహాపరాక్రమశాలియునగు గవాక్షుండు, కోటి గోలాంగూలంబులచేఁ బరివృతుండై, రామునిపార్శ్వభాగంబుననిలిచెను.

అని, తాత్పర్యము.

ఋక్షాణాం భీమవేగానాం ధూమ్ర శ్శత్రునిబర్హణః. ౨౯
వృతః కోట్యా మహావీర్య స్తస్థౌ రామస్య పార్శ్వతః

టీక॥ మహావీర్యః= అధికమయిన పరాక్రమముగలవాఁడును ; శత్రునిబర్హణః = శత్రువులఁజంపువాఁడునగు; ధూమ్రః = ధూమ్రుఁడు; భీమవేగానాం= భయంకరమయినవేగముగల; ఋక్షాణాం = ఎలుఁగుగొడ్డులయొక్క; కోట్యా = కోటిచేత; వృతః=చుట్టఁబడినవాఁడై; రామస్య = రాముని యొక్క; పార్శ్వతః = ప్రక్కను; తస్థౌ=నిలిచెను.

మహాపరాక్రమశాలియుశత్రుధ్వంసకుండునగుధూమ్రుఁడు, కోటిభల్లూకంబులంగూడి , రాముని పార్శ్వభాగంబుననుండెను.

అని, తాత్పర్యము.

సన్నద్ధస్తు మహావీర్యో గదాపాణి ర్విభీషణః. ౩౦
వృతో యుక్తైస్తు సచివై స్తస్థౌ తత్ర మహాబలః

టీక॥మహావీర్యః= అధికమయినపరాక్రమముగలవాఁడును; మహాబలః= అధికమయినబలముగలవాఁడునగు; విభీషణస్తు=విభీషణుఁడును; సన్నద్ధః=కవచముగలవాఁడై; గదాపాణిః=గదచేతంగలవాఁడై; యుక్తైః=సిద్ధులయిన; సచివైస్తు=మంత్రులతోను; వృతః=చుట్టఁబడినవాఁడై; తత్ర = అచ్చట; తస్థౌ=ఉండెను.

మహాపరాక్రమశాలియు మహాబలుండునగు విభీషణుండు, కవచంబుదొడిగి, గదాపాణియయి, యున్నద్ధసన్నద్ధులయినమంత్రులంగూడి, రామునితోఁ గూడనుండెను. అని, తాత్పర్యము.

గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః. ౩౧
సమంతా త్పరిధావంతో రరక్షు హరివాహినీమ్

టీక॥ గజః=గజుండును; గవాక్షః=గవాక్షుండును; శరభః=శరభుఁడును; గంధమాదనః = గంధమాదనుఁడును; సమంతాత్ = అంతటను; పరిధావంతః= తిరుగుచు ; హరివాహినీం=వానరసేనను; రరక్షుః=రక్షించిరి.

గజుండును గవయుఁడును గవాక్షుండును శరభుండును గంధమాదనుండును, సమస్తప్రదేశంబులందిరుగుచు, వానరసేననంతయురక్షింపు చుండిరి. అని, తాత్పర్యము.

తతః కోపపరీతాత్మా రావణో రాక్షసేశ్వరః. ౩౨
నిర్యాణం సర్వసైన్యానాం ద్రుత మాజ్ఞాపయ త్తదా

టీక॥ తతః=అంత ; తదా=అప్పుడు; రాక్షసేశ్వరః= రాక్షసులకుఁ ప్రభుండగు; రావణః=రావణుండు; కోపపరీతాత్మా= కోపముచేవ్యాపింపఁబడినమనస్సుగలవాఁడై; ద్రుతం= శీఘ్రముగా; సర్వసైన్యానాం=సమస్తసైన్యములయొక్క; నిర్యాణం= బయలువెడలుటను; ఆజ్ఞాపయత్= ఆజ్ఞాపించెను.

అంత,రాక్షసరాజుండగురావణుండు , వానరసేనాసన్నివేశ క్రమంబంతయుంజూచి, పరమకుపితుండై, తనసేనలన్నియు యుద్ధంబునకు వెడలనాజ్ఞాపించెను.అని, తాత్పర్యము.

ఏత చ్ఛ్రుత్వా తతో వాక్యం రావణస్య ముఖోద్గతమ్. ౩౩
సహసా భీమనిర్ఘోష ముద్ఘుష్టం రజనీచరైః

టీక॥ రావణస్య = రావణునియొక్క;ముఖోద్గతం=నోటనుండివెడలిన; ఏతత్=ఈ;వాక్యం=మాటను ; శ్రుత్వా=విని;తతః=అంత; రజనీచరైః=రాక్షసులచేత;సహసా=శీఘ్రంబున;భీమనిర్ఘోషం=భయంకరమయినధ్వనిగలుగునట్లు;ఉద్ఘుష్టం=అఱచుటయయినది.

రావణునిముఖంబుననుండి వెడలిన యాజ్ఞనువిన్నంతనే, రాక్షసులందఱు, భయంకరధ్వనిగలుగునట్లు, సింహనాదంబులుగావించిరి. అని, తాత్పర్యము.

తతః ప్రచోదితా భేర్య శ్చంద్రపాండరపుష్కరాః. ౩౪
హేమకోణాహతా భీమా రాక్షసానాం సమంతతః

టీక॥ తతః=అంతటను; సమంతతః= అంతటను; భీమాః = భయంకరములయిన; చంద్రపాండరపుష్కరాః= చంద్రునివలెఁదెల్లనైనముఖములుగల; రాక్షసానాం= రాక్షసులయొక్క; భేర్యః=భేరులు; ప్రచోదితాః= ప్రేరింపఁబడినవై; హేమకోణాహతాః=బంగారువాదనదండముచేఁగొట్టఁబడినవి.

అంతఁ, జంద్రబింబమువలె శుభ్రములయినముఖములుగల భయంకరధ్వనులగుభేరులను, బంగారుదండములచే వాయించిరి. అని, తాత్పర్యము.

వినేదుశ్చ మహాఘోషా శ్శంఖా శ్శతసహస్రశః. ౩౫
రాక్షసానాం సుఘోరాణాం ముఖమారుతపూరితాః

టీక॥ శతసహస్రశః= లక్షలులక్షలుగా; మహాఘోషాః= అధికమయినధ్వనిగల; శంఖాశ్చ= శంఖములును; సుఘోరాణాం = మిక్కిలియుభయంకరులగు; రాక్షసానాం= రాక్షసులయొక్క; ముఖమారుతపూరితాః = నోటిగాలిచేనూఁదఁబడినవై; వినేదుః= ధ్వనించిరి.

భయంకరాకారులగురాక్షసులు, లక్షలులక్షలుగా, మహాధ్వనులగు, శంఖంబులఁబూరించిరి.

అని, తాత్పర్యము.

తే బభు శ్శుభనీలాంగా స్సశంఖా రజనీచరాః. ౩౬
విద్యున్మండలసన్నద్ధా స్సబలాకా ఇవాంబుదాః

టీక॥ శుభనీలాంగాః = మంగళకరమయిననల్లనిదేహముగలవారలును; సశంఖాః = శంఖముతోఁగూడినవారలునగు; తే=ఆ; రజనీచరాః = రాక్ష

సులు; విద్యున్మండలసన్నద్ధాః = మెఱుపులసమూహములతోఁగూడినవియు; సబలాకాః = కొంగలతోఁ గూడినవియునగు; అంబుదాఇవ = మేఘములువలె; బభుః=ప్రకాశించిరి.

ఆభరణభూషితులై నల్లని దేహముతో శంఖంబులుధరించియున్న యారాక్షసులు మెఱుపులతోఁగూడినమేఘంబులవలెవడిం బ్రకాశించిరి.

అని, తాత్పర్యము.

నిష్పతంతి తతస్సైన్యా హృష్టారావణ చోదితాః. ౩౭
సమయే పూర్యమాణస్య వేగాఇవ మహోదధేః

టీక॥తతః = అంత; రావణచోదితాః=రావణునిచే నాజ్ఞాపింపఁబడిన; సైన్యాః=సైనికులు; హృష్టాః= సంతసించినవారలయి; సమయే= ప్రళయకాలమునందు; పూర్యమాణస్య= నింపఁబడుచున్న; మహోదధేః= మహాసముద్రముయొక్క; వేగాఇవ=ప్రవాహములువలె; నిష్పతంతి=వెడలిరి.

అంత, రావణుని పనుపున, సైనికులుసంతుష్టులయి, ప్రళయ కాలంబున మహాసముద్ర ప్రవాహంబులుం బోలె బయలు దేఱిరి. అని, తాత్పర్యము.

తతో వానరసైన్యేన ముక్తో నాద స్సమంతతః. ౩౮
మలయః పూరితో యేన ససానుప్రస్థకందరః

టీక॥తతః=అంత; యేన = దేనిచేత; ససానుప్రస్థకందరః=చఱియలతోను నెత్తములతోను గుహాల తోనుం గూడిన; మలయః=త్రికూటపర్వతము; పూరితః=నింపఁబడినదో; సః(అధ్యాహృతము)=అట్టి; నాదః=సింహనాదము; సమంతతః=అంతటను; వానరసైన్యేన=వానరసేనచేత; ముక్తః=విడువఁబడినది.

అంత,వానరులు, త్రికూట పర్వతమునంతయువ్యాపించునట్లు, భయంకరమయిన, సింహనాదంబు గావించిరి.

అని, తాత్పర్యము.

శంఖదుందుభిసంఘుష్ట స్సింహనాద స్తరస్వినామ్. ౩౯

పృథివీం చాంతరిక్షంచ సాగరం చైవ నాదయన్

టీక॥శంఖదుందుభిసంఘుష్టః=శంఖములయొక్కయు భేరులయొక్కయు ధ్వనితోఁగూడిన; తరస్వినాం=బలవంతులయొక్క; సింహనాదః= సింహనాదము; పృథివీం=భూమిని; అంతరిక్షంచ= ఆకాశమును; నాదయన్= ధ్వనింపఁజేయుచు; ఉదభూత్ (అధ్యాహృతము)= పుట్టెను.

బలవంతులగు వానర రాక్షసుల సింహనాదంబు, శంఖదుందుభిధ్వనులతోఁ గూడి, భూమ్యాకాశంబుల నంతయు వ్యాపించినది. అని, తాత్పర్యము.

గజానాం బృంహితైస్సార్ధం హయానాం హేషితైరపి. ౪౦
రథానాం నేమిఘోషైశ్చ రక్షసాం నదనస్వనః

టీక॥రక్షసాం=రాక్షసులయొక్క; నదనస్వనః = సింహనాదధ్వని; గజానాం=ఏనుంగులయొక్క; బృంహితైః= అఱపులతోను; హయానాం= గుఱ్ఱంబులయొక్క; హేషితైరపి= అఱపులతోను; రథానాం=రథములయొక్క; నేమిఘోషైశ్చసార్ధం= కడకంటికమ్ముల ధ్వనులతోనుంగూడ; రేజే(అధ్యాహృతము)=ప్రకాశించెను.

రాక్షసులసింహనాదములును గజబృంహితంబులును గుఱ్ఱంబుల హేషాధ్వనులునురథంబులనేమిధ్వనులును,ఒండొంటింగలసి,చెలంగుచుండినవి.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరేఘోర స్సంగ్రామ స్సమవర్తత. ౪౧
రక్షసాం వానరాణాంచ యథా దేవాసురే పురా

టీక॥ఏతస్మిన్ అంతరే = ఈమధ్యమునందు; పురా=మున్ను; దేవాసురే యథా=దేవాసుర విరోధమునందు వలె; రక్షసాం= రాక్షసులకును; వానరాణాంచ=వానరులకును; ఘోరః = భయంకరమగు; సంగ్రామః = యుద్ధము; సమవర్తత=కలిగెను.

ఇంతలో మున్ను దేవాసురులకుం బోలె, రాక్షసులకును వానరులకును భయంకరంబగు యుద్ధంబు, ఆరబ్ధ మ

యినది. అని, తాత్పర్యము.

తే గదాభిః ప్రదీప్తాభి శ్శక్తిశూలపరశ్వథైః. ౪౨
నిజఘ్ను ర్వానరాన్ ఘోరాః కథయంత స్స్వవిక్రమాన్

టీక॥ ఘోరాః = భయంకరులగు; తే = ఆరాక్షసులు; స్వవిక్రమాన్ = తమపరాక్రమములను; కథయంతః = చెప్పుచు; ప్రదీప్తాభిః = ప్రకాశించుచున్న; గదాభిః = గదలచేతను; శక్తిశూలపరశ్వథైః = ఈటెలచేతను శూలముల చేతను గొడ్డళ్లచేతను; వానరాన్ = వానరులను; నిజఘ్నుః = కొట్టిరి.

భయంకరాకారులగు రాక్షసులు, తమపరాక్రమంబుల నుగ్గడించుకొనుచు, గదలచేతను శక్తులచేతను, శూలంబులచేతను గొడ్డళ్లచేతను, వానరులం బ్రహరించిరి. అని, తాత్పర్యము.

రాజా జయతి సుగ్రీవ ఇతి శబ్దో మహా నభూత్. ౪౩

టీక॥ "రాజా = రాజయిన; సుగ్రీవః = సుగ్రీవుఁడు; జయతి = సర్వోత్కర్షంబుననున్నాఁడు" ఇతి = అను; మహాన్ = గొప్పదగు; శబ్దః = ధ్వని; అభూత్ = కలిగినది.

"వానరరాజుండగు సుగ్రీవుండు, సర్వోత్కృష్టుఁడైయున్నాఁడు" అని మహాధ్వని, వానరసేనలోఁ జెలంగుచుండినది.

అని, తాత్పర్యము.

రాజన్ జయజయే త్యుక్త్వా స్వస్వనామ కథాం తతః
తథా వృక్షై ర్మహాకాయాః పర్వతాగ్రై శ్చ వానరాః. ౪౪
నిజఘ్ను స్తాని రక్షాంసి నఖై ర్దంతై శ్చ వేగితాః

టీక॥ మహాకాయాః = పెద్దదేహము గల; వానరాః = వానరులు; వేగితాః = వేగముగలవారలయి; "రాజన్ = వానరరాజుఁడవగుసుగ్రీవుఁడా! జయజయ = సర్వోత్కృష్టుఁడవై యుండుముసర్వోత్కృష్టుఁడవైయుండుము." ఇతి = అని;

ఉక్త్వా=చెప్పి=తతః=అంత; స్వస్వనామకథాం=తమతమపేరును వృత్తాంతమును; ఉక్త్వా=చెప్పి=తథా= అట్లు; వృక్షైః=వృక్షములచేతను ; పర్వతాగ్రైశ్చ=పర్వతశిఖరములచేతను ; నఖైః=గోళ్లచేతను; దంతైశ్చ= దంతములచేతను; తాని=ఆ; రక్షాంసి=రాక్షసులను; నిజఘ్నుః=కొట్టిరి.

మహాకాయులగువానరులు, "వానరరాజా! సర్వోత్కర్షణంబున నుండుము" అనియుద్ఘోషింపుచు, తమతమవృత్తాంతంబులనుగ్గడింపుచు, వృక్షంబులచేతనుబర్వతశిఖరంబులచేతను దంతంబులచేతనునఖంబులచేతను రాక్షసులం బ్రహరించిరి. అని, తాత్పర్యము.

రాక్షసాస్త్వ పరే భీమాః ప్రాకారస్థా మహీంగతాన్. ౪౫
భిండివాలైశ్చ ఖడ్గైశ్చ శూలైశ్చైవ వ్యదారయన్

టీక॥ భీమాః = భయంకరులును; ప్రాకారస్థాః=ప్రాకారంబున నున్నవారలునగు; అపరే=ఇతరులయిన; రాక్షసాస్తు= రాక్షసులును ; మహీంగతాన్= భూమినిబొందినట్టి వానరులను; భిండివాలైశ్చ= విడిచివాటుగుదియలచేతను; ఖడ్గైశ్చ=కత్తులచేతను; శూలైశ్చైవ=శూలములచేతను; వ్యదారయన్=ఛేదించిరి.

భయంకరులగుమఱికొందఱురాక్షసులుప్రాకారంబుపైనుండి, భిండివాలంబులచేతనుఖడ్గంబులచేతనునేలనున్నవానరులంబ్రహరించిరి. అని, తాత్పర్యము.

వానరాశ్చాపి సంక్రుద్ధాః ప్రాకారస్థాన్ మహీంగతాః. ౪౬
రాక్షసాన్ పాతయామాసు స్సమాప్లుత్య ప్లవంగమాః

టీక॥మహీంగతాః=భూమిని బొందినట్టి; ప్లవంగమాః=ఎగురుటచేఁ బోవునట్టి; వానరాశ్చాపి=వానరులును; సంక్రుద్ధాః=కోపంబునొందినవారలయి; సమాప్లుత్య=ఎగిరి ; ప్రాకారస్థాన్= ప్రాకారముననున్న; రాక్షసాన్=రాక్షసులను; పాతయామాసుః=పడఁద్రోసిరి.

క్రిందనున్నవానరులు, క్రుద్ధులయి, పైకెగిరి ప్రాకారంబుపైనున్న రాక్షసులంబడఁద్రోసిరి. అని, తాత్పర్యము.

స సంప్రహారస్తుములో మాంసశోణితకర్దమః ౪౩
రక్షసాం వానరాణాంచ సంబభూవాద్భుతోపమః

టీక॥సః=ఆ;రక్షసాం=రాక్షసుల యొక్కయు;వానరాణాంచ=వానరులయొక్కయు,తుములః=దొమ్మియైన;సంప్రహారః=యుద్ధము; మాంసశోణితకర్దమః=నెత్తురును మాంసమును బురదగాఁగలదియు; అద్భుతోపమః= ఆశ్చర్యకరముతోఁ బోలికఁగలదియు: సంబభూవ=అయినది.

అప్పుడు రాక్షసవానరులకుం గలిగిన దొమ్మియుద్ధము నెత్తురును మాంసమును బురదగా, నెంతయునాశ్చర్యకరంబయి యుండినది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
యుద్ధకాండే, ద్విచత్వారింశస్సర్గః.
ఇది, స్వస్త్యర్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,యుద్ధకాండ ద్విచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

## త్రిచత్వారింశస్సర్గప్రారంభః.

యుధ్యతాంతు తత స్తేషాం వానరాణాం మహాత్మనామ్
రక్షసాం సంబభూవాథ బలకోప స్సుదారుణః. ౧

టీక॥ తతః=అంత;మహాత్మనాం=అధికమయినబలముగలవారలగు ; తేషాం=ఆ;వానరాణాం = వానరులు; యుధ్యతాం = యుద్ధముసేయుచుండఁగా;అథ=అంత;రక్షసాం = రాక్షసులయొక్క; బల (బలస్య)= సేనకు; సుదారుణః = మిక్కిలియు భయంకరమగు;కోపః=కోపము; సంబభూవ=కలిగినది.

అంత, మహాబలశాలులగువానరులళ్లెమురులేక యుద్ధంబుసేయుచుండుటంజూచి, రాక్షసులుసహింపంజాలక, మిక్కిలియుఁగోపంబునొందిరి.

అని, తాత్పర్యము.

తే హయైః కాంచనాపీడై ర్ధ్వజైశ్చాగ్ని శిఖోపమైః
రథై శ్చాదిత్యసంకాశైః కవచైశ్చ మనోరమైః. ౨
నిర్యయూ రాక్షసవ్యాఘ్రా నాదయంతో దిశోదశ
రాక్షసా భీమకర్మాణో రావణస్య జయైషిణః. ౩

టీక॥ రావణస్య = రావణునియొక్క;జయైషిణః= జయంబుగోరువారలును;భీమకర్మాణః = భయంకరమయినకార్యముగలవారలును ; రాక్షసవ్యాఘ్రాః= రాక్షసశ్రేష్ఠులునగు; తే= ఆ; రాక్షసాః= రాక్షసులు; కాంచనాపీడైః = బంగారుశిరోభూషణముగలు;హయైః=గుఱ్ఱములతోను ; అగ్నిశిఖోపమైః = నిప్పుజ్వాలలతోఁబోలికగలు;ధ్వజైశ్చ = టెక్కెములతోను;ఆదిత్యసంకాశైః= సూర్యునితోసమానములగు;రథైశ్చ = రథములతోను;మనోరమైః=సుందరములగు ; కవచైః= కవచములతోను; సహితాః (అధ్యాహృతము)= కూడినవారలై;దశ=పదియయిన;దిశః= దిక్కులను; నాదయం

తః= ధ్వనింపఁజేయుచు; నిర్యయుః= వెడలిరి.

రావణునకు జయంబుఁ గోరువారలు నుభయంకరకర్ములునగు రాక్షసోత్తములు, బంగారు శేఖరంబులతో నొప్పుచున్నగుఱ్ఱంబులను అగ్నిజ్వాలలంబోలె వెలుంగుచుండు ధ్వజంబులతోను, సూర్యబింబమువలెఁ దేజరిల్లుచుండు రథంబులతోను సుందరంబులగు కవచంబులతోనుంగూడి , దశదిశలునునిండునట్లు సింహనాదంబులు సేయుచు, యుద్ధంబునకు వెడలిరి. అని, తాత్పర్యము.

వానరాణా మపి చమూ బృహతీ జయమిచ్ఛతామ్
అభ్యధావత తాం సేనాం రక్షసాం కామరూపిణామ్. ౪

టీక॥ వానరాణాం= వానరులయొక్క; బృహతీ = గొప్పదగు; చమూరపి= సేనయు; జయం= గెల్పును; ఇచ్ఛతాం= కోరుచున్న; కామరూపిణాం= ఇచ్ఛాధీనమగు రూపముగల ; రక్షసాం= రాక్షసులయొక్క; తాం= ఆ; సేనాం= సేనను; అభ్యధావత= ఎదురొక్కనిపరుగెత్తినది.

అంతవానరులు, జయంబుఁ గోరి వచ్చిన కామరూపులగు రాక్షసులపైకి, యుద్ధోత్సాహంబుననడరిరి.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరే తేషా మన్యోన్య మభిధావతామ్
రక్షసాం వానరాణాంచ ద్వంద్వయుద్ధ మవర్తత. ౫

టీక। ఏతస్మిన్ అంతరే= ఈమధ్యమునందు; అన్యోన్యం= ఒండొరులను; అభిధావతాం= ఎదురొక్కని పరుగెత్తుచున్న; తేషాం= ఆ; రక్షసాం= రాక్షసులకును; వానరాణాంచ = వానరులకును; ద్వంద్వయుద్ధం= ఇద్దఱొకరితో నొకరు చేయుయుద్ధము; అవర్తత= కలిగినది.

ఇంతలోనట్లు, రాక్షసులును వానరులును ; ఒండొరులమీఁదికిం గవియుచు, నప్పుడిరుగెలంకులవారికిని ద్వంద్వయుద్ధంబుగలిగినది. అని, తాత్పర్యము.

అంగదేనేంద్రజిత్సార్ధం వాలిపుత్రేణ రాక్షసః

అయుధ్యత మహాతేజా స్త్ర్యంబకేణ యథాంతకః. ౬

టీక॥ మహాతేజాః = అధికమయినపరాక్రమముగల ; రాక్షసః = రాక్షసుఁడైన; ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు; వాలిపుత్రేణ = వాలికొడుకైన; అంగదేన సార్ధం = అంగదునితోఁగూడ; త్ర్యంబకేణ = ఈశ్వరునితో, అంతకో యథా = మృత్యువువలె; అయుధ్యత = యుద్ధము చేసెను.

మహాతేజుండగు నింద్రజిత్తు, వాలికుమారుండగు నంగదునితో, ముక్కంటితో మృత్యువుపోరునట్లు, యుద్ధముఁ గావించెను. అని, తాత్పర్యము.

ప్రజంఘేనచ సంపాతి ర్నిత్యం దుర్మర్షణో రణే
జంబుమాలిన మారబ్ధో హనుమానపి వానరః. ౭

టీక॥ నిత్యం = ఎల్లప్పుడును; రణే = యుద్ధమునందు; దుర్మర్షణః = సహింపనలవిగానివాఁడగు ; సంపాతిశ్చ = సంపాతియు; ప్రజంఘేన = ప్రజంఘునితో; అయుధ్యత (అధ్యాహృతము) = పోరెను. వానరః = వానరుఁడైన; హనుమానపి = హనుమంతుఁడును; జంబుమాలినం = జంబుమాలియను రాక్షసునిగూడ; యోద్ధుం (అధ్యాహృతము) = పోరుటకు; ఆరబ్ధః = ఆరంభించినాఁడు.

యుద్ధంబున, శత్రువులకు సహింపనలవిగానట్టి విభీషణసచివుండగు సంపాతి, ప్రజంఘునితోఁ బోరెను ; హనుమంతుండు జంబుమాలితో యుద్ధంబు గావించెను. అని, తాత్పర్యము.

సంగత స్సుమహాక్రోధో రాక్షసో రావణానుజః
సమరే తీక్ష్ణవేగేన మిత్రఘ్నేన విభీషణః. ౮

టీక॥ సుమహాక్రోధః = మిక్కిలియు నధికమయినకోపముగలవాఁడును; రావణానుజః = రావణుని తమ్ముఁడును; రాక్షసః = రాక్షసుఁడునగు; విభీషణః = విభీషణుఁడు; సమరే = యుద్ధమునందు; తీక్ష్ణవేగేన = అధికమయిన వేగముగల; మిత్రఘ్నేన = మిత్రఘ్నునితో ; సంగతః = సంబంధించెను.

స ౮౩

మహాకోపుండగు రావణునితమ్ముఁడు విభీషణుండు, మహావేగుఁడయిన మిత్రఘ్నుఁడను రాక్షసునితో యుద్ధముచేసెను. అని, తాత్పర్యము.

తపనేన గజస్సార్ధం రాక్షసేన మహాబలః
నికుంభేన మహాతేజా నీలోపి సమయుధ్యత. ౯

టీక॥ మహాబలః= అధికమయినబలముగల; గజః=గజుఁడు; తపనేన= తపనుఁడను; రాక్షసేన=రాక్షసునితో; అయుధ్యత (అధ్యాహృతము)= యుద్ధముచేసెను. మహాతేజాః = అధికమయినపరాక్రమముగల; నీలోపి= నీలుండును; నికుంభేన = నికుంభునితో; సమయుధ్యత=పోరెను.

మహాబలుండగు గజుండు, తపనుఁడను రాక్షసునితోఁబోరెను; మహాతేజుండగు నీలుండు, నికుంభునితోఁగూడ యుద్ధము గావించెను. అని, తాత్పర్యము.

వానరేంద్రస్తు సుగ్రీవః ప్రఘసేన సమాగతః
సంగత స్సమరే శ్రీమాన్ విరూపాక్షేణ లక్ష్మణః. ౧౦

టీక॥ వానరేంద్రః= వానరరాజుండగు; సుగ్రీవస్తు = సుగ్రీవుండును; ప్రఘసేన=ప్రఘసునితో; సమాగతః= సంబంధించెను. శ్రీమాన్=కాంతిమంతుండగు; లక్ష్మణః=లక్ష్మణుఁడు; సమరే= యుద్ధమునందు; విరూపాక్షేణ = విరూపాక్షునితో; సంగతః= సంబంధించెను.

వానరరాజుండగుసుగ్రీవుండు, ప్రఘసుండనురాక్షసుపైకడరెను ; శ్రీమంతుండగులక్ష్మణుండు , విరూపాక్షునితోయుద్ధముగావించెను.

అని, తాత్పర్యము.

అగ్నికేతుశ్చ దుర్ధర్షో రశ్మికేతుశ్చ రాక్షసః
సుప్తఘ్నో యజ్ఞకోపశ్చ రామేణ సహ సంగతాః. ౧౧

టీక॥ దుర్ధర్షః = ఎదిరింపనలవిగాని; అగ్నికేతుశ్చ=అగ్నికేతుండును; రశ్మికేతుః = రశ్మికేతువను; రాక్షసశ్చ=రాక్షసుండును; సుప్తఘ్నః= సు

ష్టఘ్నుండును; యజ్ఞకోపశ్చ= యజ్ఞకోపుడును; రామేణసహ= రామునితోఁగూడ; సంగతాః=సంబంధించిరి.

దుర్ధర్షుఁడగునగ్నికేతుండును రశ్మికేతుండును సుప్తఘ్నుండును యజ్ఞకోపుండును, రామునితో యుద్ధంబు గావించిరి. అని, తాత్పర్యము.

వజ్రముష్టిస్తు మైందేన ద్వివిదే నాశనిప్రభః
రాక్షసాభ్యాం సుఘోరాభ్యాం కపిముఖ్యా సమాగతౌ. ౧౨

టీక॥వజ్రముష్టిస్తు=వజ్రముష్టియు; మైందేన=మైందునితోను; అశనిప్రభః=అశనిప్రభుఁడు; ద్వివిదేన=ద్వివిదునితోను; ఏవం(అధ్యాహృతము)=ఇట్లు; సుఘోరాభ్యాం=మిక్కిలియు భయంకరులయిన; రాక్షసాభ్యాం=రాక్షసులు; కపిముఖ్యా = వానరశ్రేష్ఠులు; సమాగతౌ=సంబంధించినారు.

వజ్రముష్టియను రాక్షసుండు మైందునితోను అశనిప్రభుండనువాఁడు ద్వివిదునితోను, ఇట్లు మైందద్వివిదులు , భయంకరాకారులగు సద్దతి రాక్షసులతోఁబోరిరి. అని, తాత్పర్యము.

వీరః ప్రతపనో ఘోరో రాక్షసో రణదుర్ధరః
సమరే తీక్ష్ణవేగేన నలేన సమయుధ్యత. ౧౩

టీక॥వీరః = పరాక్రమశాలియు; ఘోరః = భయంకరుండును; రణదుర్ధరః=యుద్ధమునందునిగ్రహింపనలవిగానివాఁడునగు; ప్రతపనః= ప్రతపనుండను; రాక్షసః=రాక్షసుఁడు; సమరే=యుద్ధమునందు; తీక్ష్ణవేగేన=తీవ్రమయినవేగముగల ; నలేన = నలునితో; సమయుధ్యత=పోరెను,

పరాక్రమవంతుండును భయంకరాకారుండును యుద్ధంబున నెదిరింప నలవిగానివాఁడునగు ప్రతపనుండను వాఁడు, యుద్ధమునఁదీక్ష్ణప్రతాపుఁడగునలునితో యుద్ధము గావించెను.

అని, తాత్పర్యము.

ధర్మస్య పుత్రో బలవాన్ సుషేణఇతి విశ్రుతః

సవిద్యున్మాలినా సార్ధ మయుధ్యత మహాకపిః. ౧౪

టీక॥బలవాన్ = అధికమయినబలముగలవాఁడును; ధర్మస్య = ధర్మునియొక్క; పుత్రః = కొడుకునగు; సః=ఆ; సుషేణఇతి=సుషేణుఁడని; విశ్రుతః=ప్రసిద్ధుఁడైన; మహాకపిః = పెద్దవానరుఁడు; విద్యున్మాలినా సార్ధం=విద్యున్మాలితోఁగూడ; అయుధ్యత=పోరెను.

బలవంతుండగు ధర్మపుత్రుండైన సుషేణుండను వానరశ్రేష్ఠుండు, విద్యున్మాలితో యుద్ధముగావించెను.

అని, తాత్పర్యము.

వానరా శ్చాపరే భీమా రాక్షసై రపరై స్సహ
ద్వంద్వం సమీయు ర్బహుధా యుద్ధాయ బహుభి స్సహ. ౧౫

టీక॥ భీమాః=భయంకరులగు; అపరే=ఇతరులయిన; వానరాశ్చ= వానరులును; అపరైః=ఇతరులయిన; రాక్షసైస్సహ = రాక్షసులతోఁగూడ; బహుభిస్సహ= పెక్కండ్రతోఁగూడ; బహుధా=పెక్కువిధములుగా; యుద్ధాయ=పోరుటకొఱకు; ద్వంద్వం = ద్వంద్వయుద్ధమును; సమీయుః= పొందిరి.

ఇంక, భయంకరాకారులగు వానరులు పెక్కండ్రు, రాక్షసుల పెక్కండ్రతో, నానావిధంబుల, ద్వంద్వయుద్ధంబుగావించిరి.

అని, తాత్పర్యము.

తత్రాసీ త్సుమహ ద్యుద్ధం తుములం రోమహర్షణమ్
రక్షసాం వానరాణాంచ వీరాణాం జయ మిచ్ఛతామ్. ౧౬

టీక॥తత్ర=అప్పుడు;వీరాణాం=పరాక్రమశాలులును; జయం= గెలుపును,ఇచ్ఛతాం = కోరుచున్నవారలునగు;రక్షసాం=రాక్షసులకును; వానరాణాంచ=వానరులకును ; సుమహత్=మిక్కిలియుగొప్పదియు; రోమహర్షణం=వెండ్రుకలనిక్కపొడుచునట్టి(?) భయంకరమయినదియు; తుములం= దొమ్మియునగు;యుద్ధం=యుద్ధము;అసీత్ = కలిగినది.

అప్పుడు, మహాపరాక్రమశాలులు నుజయంబుగోరువారలునగు, నారాక్షసులకును వానరులకును, రోమహర్షణంబగుతుములయుద్ధముగలిగినది.

అని, తాత్పర్యము.

హరిరాక్షసదేహేభ్యః ప్రభూతాః కేశశాద్వలాః
శరీరసంఘాటవహాః ప్రసుస్రుః శోణితాపగాః. ౧౪

టీక॥హరిరాక్షసదేహేభ్యః= వానరులయొక్కయు రాక్షసులయొక్కయు దేహములనుండి; ప్రభూతాః= విస్తీర్ణములును; కేశశాద్వలాః = వెండ్రుకలెపచ్చికలుగాఁ గలవియు; శరీరసంఘాటవహాః= దేహములెకాష్ఠసంచయములుగాఁగలవియునగు; శోణితాపగాః= నెత్తురుటేఱులు; ప్రసుస్రుః= ప్రవహించినవి.

ఆయుద్ధంబున, వానరరాక్షసదేహంబులనుండి, వెండ్రుకలె పచ్చికలుగాఁగలవియు దేహావయవములె కాష్ఠములుగాఁగలవియునగువిస్తీర్ణంబులయినరక్తనదులు, ప్రవహించినవి.

అని, తాత్పర్యము.

ఆజఘానేంద్రజిత్క్రుద్ధో వజ్రేణేవ శతక్రతుః
అంగదం గదయా వీరం శత్రుసైన్యవిదారణమ్. ౧౫

టీక॥ఇంద్రజిత్=ఇంద్రజిత్తు; క్రుద్ధః= కోపించినవాఁడై; గదయా= గదచేత; శతక్రతుః= దేవేంద్రుండు; వజ్రేణేవ= వజ్రాయుధముచేతవలె; వీరం= పరాక్రమశాలియు; శత్రుసైన్యవిదారణం= శత్రుసైన్యములఁ భేదించునట్టి; అంగదం= అంగదుని; ఆజఘాన= కొట్టెను.

ఇంద్రజిత్తు, క్రుద్ధుండై, దేవేంద్రుని వజ్రాయుధంబుతో సమానంబయినగదచేఁ, బరాక్రమవంతుండును శత్రుసైన్యంబులసంహరించువాఁడునగు నంగదుం బ్రహరించెను. అని, తాత్పర్యము.

తస్య కాంచనచిత్రాంగం రథం సాశ్వం ససారథిమ్
జఘాన సమరే శ్రీమా నంగదో వేగవా న్కపిః. ౧౬

టీక॥శ్రీమాన్ = కాంతిమంతుండును; వేగవాన్ = అధికమయిన వేగముగలవాఁడునగు; కపిః = వానరుఁడైన; అంగదః = అంగదుండు; సమరే = యుద్ధమునందు; తస్య = ఆయింద్రజిత్తుయొక్క; కాంచనచిత్రాంగం = బంగారముచేఁ జిత్రములైన యవయవములుగలదియు; సాశ్వం = గుఱ్ఱములతోఁ గూడినదియు; సారథి = సారథితోఁ గూడినదియునగు; రథం = రథమును; జఘాన = కొట్టెను.

అంత, శ్రీమంతుఁడును మహావేగంబుగలవాఁడునగు నంగదుండు; కాంచనాలంకృతంబగు నాయింద్రజిత్తు రథంబును, సారథితోను గుఱ్ఱంబులతోనుఁ గూడ నుగ్గుగావించెను. అని, తాత్పర్యము.

సంపాతిస్తు త్రిభి ర్బాణైః ప్రజంఘేన సమాహతః
నిజఘానాశ్వకర్ణేన ప్రజంఘం రణమూర్ధని. ౨౦

టీక॥సంపాతిస్తు = సంపాతియు; త్రిభిః = మూఁడైన; బాణైః = బాణములచేత; ప్రజంఘేన = ప్రజంఘునిచేత; సమాహతః = కొట్టఁబడినవాఁడై; రణమూర్ధని = యుద్ధముశిరస్సునందు; అశ్వకర్ణేన = ఇనుమద్దిచెట్టుచేత; ప్రజంఘం = ప్రజంఘుని; నిజఘాన = వధించెను.

ప్రజంఘుండు, సంపాతిని, మూఁడమ్ములనొప్పింప, నాతఁడు, యుద్ధమధ్యంబున, నశ్వకర్ణవృక్షంబుచేఁ, బ్రజంఘునివధించెను. అని, తాత్పర్యము;

జంబుమాలీ రథస్థస్తు రథశక్త్యా మహాబలః
బిభేద సమరే క్రుద్ధో హనూమన్తం స్తనాన్తరే. ౨౧

టీక॥ మహాబలః = అధికమయిన బలముగల; జంబుమాలీచ = జంబుమాలియు; రథస్థః = రథంబుననున్నవాఁడై; సమరే = యుద్ధమునందు; క్రుద్ధః = కోపించినవాఁడై; రథశక్త్యా = రథమునందుండు శక్తిచేత; హనూమన్తం = హనుమంతుని; స్తనాన్తరే = వక్షఃస్థలమునందు; బిభేద = భేదించెను.

మహాబలుండగు జంబుమాలి రథస్థుండై, యుద్ధంబునఁ గోపించి, రథ

శక్తిఁగొని, హనుమంతునివక్షస్స్థలంబునం బ్రహరించెను. అని, తాత్పర్యము.

తస్య తం రథమాస్థాయ హనూమా న్మారుతాత్మజః
ప్రమమాథ తలేనాశు సహ తేనైవ రక్షసా. ౨౨

టీక॥ మారుతాత్మజః = వాయుదేవునికుమారుండగు; హనూమాన్ = హనుమంతుండు; తేన = ఆ; రక్షసా సహైవ = జంబుమాలితోఁగూడనే; తస్య = ఆజంబుమాలియొక్క; తం = ఆ; రథం = రథమును; ఆస్థాయ = అధిష్ఠించి; ఆశు = శీఘ్రముగా; తలేన = అఱచేతిచేత; ప్రమమాథ = చఱచెను.

వాయు కుమారుండగు హనుమంతుండు, శీఘ్రంబున, నాజంబుమాలి రథంబుమీఁదికుఱికి, యతనినఱచేతంజఱచెను. అని, తాత్పర్యము.

నదన్ ప్రతపనో ఘోరో నళం సో ప్యన్వధావత

టీక॥ ఘోరః = భయంకరుండగు; సః = ఆ; ప్రతపనోఽపి = ప్రతపనుండును; నదన్ = గర్జించుచు; నళం = నళుని; అన్వధావత = తఱిమెను.

భయంకరాకారుండగు నాప్రతపనుండు, గర్జించుచు, నళునిపైకిఁ గవిసెను. అని, తాత్పర్యము.

నళః ప్రతపనస్యాశు పాతయామాస చక్షుషీ. ౨౩
భిన్నగాత్ర శ్శరై స్తీక్ష్ణైః క్షిప్రహస్తేన రక్షసా

టీక॥ నళః = నళుండు; క్షిప్రహస్తేన = శీఘ్రముగఁజేయునట్టి చేతులుగల; రక్షసా = ప్రతపనునిచేత; తీక్ష్ణైః = కఱకులయిన; శరైః = బాణములచేత; భిన్నగాత్రః = భేదింపఁబడిన దేహముగలవాఁడై; ఆశు = శీఘ్రముగా; ప్రతపనస్య = ప్రతపనునియొక్క; చక్షుషీ = కన్నులను; పాతయామాస = పడఁద్రోసెను.

అతిశీఘ్రంబుగా బాణంబులు ప్రయోగించునట్టిప్రతపనుండు, నలునిదీ

క్ష్ణబాణంబులవొంప, నవ్వానరవీరుండు, ప్రతపసుని కన్నులం బెటికిపైచెను.

అని, తాత్పర్యము.

గ్రసంత మివ సైన్యాని ప్రఘసం వానరాధిపః. ౨౪
సుగ్రీవ స్సప్తపర్ణేన నిర్బిభేద జఘానచ

టీక॥వానరాధిపః= వానరరాజుండగు; సుగ్రీవః = సుగ్రీవుఁడు; సైన్యాని = సైన్యములను; గ్రసంతమివ (స్థితం)=మ్రింగుచున్నట్లున్న; ప్రఘసం = ప్రఘసుని; సప్తపర్ణేన = ఏడాకుల యరఁటిచెట్టుచేత; నిర్బిభేద=భేదించెను; జఘానచ=వధించెను.

వానరరాజుండగు సుగ్రీవుఁడు, సైన్యంబునంతయు మ్రింగునట్లు నోరు దెఱచుకొనివచ్చుచున్న ప్రఘసుని, సప్తపర్ణవృక్షంబునం బ్రహరించివధించెను.

అని, తాత్పర్యము.

అగ్నికేతుశ్చ దుర్ధర్షో రశ్మికేతుశ్చ రాక్షసః. ౨౫
సుప్తఘ్నో యజ్ఞకోపశ్చ రామం నిర్బిభిదు శ్శరైః

టీక॥దుర్ధర్షః = ఎదిరింపనలవిగానట్టి; అగ్నికేతుశ్చ = అగ్నికేతువును; రశ్మికేతుః=రశ్మికేతుండును; రాక్షసశ్చ=రాక్షసుండును; సుప్తఘ్నః = సుప్తఘ్నుండును; యజ్ఞకోపశ్చ = యజ్ఞకోపుఁడును; రామం=రాముని; శరైః=బాణములచేత; నిర్బిభిదుః = భేదించిరి.

దుర్ధర్షుండగు నగ్నికేతుండును రశ్మికేతుండును సుప్తఘ్నుండును యజ్ఞకోపుండును, రామునిపై, నానావిధబాణంబులం బ్రయోగించిరి.

అని, తాత్పర్యము.

తేషాం చతుర్ణాం రామస్తు శిరాంసి నిశితై శ్శరైః. ౨౬
క్రుద్ధ శ్చతుర్భి శ్చిచ్ఛేద ఘోరై రగ్నిశిఖోపమైః

టీక॥రామస్తు=రాముండును; ఘోరైః=భయంకరములును; అగ్నిశిఖోపమైః= నిప్పుజ్వాలలతోఁ బోల్కిఁగలవియునగు; చతుర్భిః=నాలుగయిన; ని

శితైః=తీక్ష్ణములగు; శరైః= బాణములచేత; తేషాం=ఆ; చతుర్ణాం=నలుగురియొక్క; శిరాంసి=తలలను; చిచ్ఛేద=నఱికెను.

రాముండు, అగ్నిజ్వాలలవంటి నాఁడుగుకలుకుబాణంబుల, అనల్వురిరాక్షసులశిరస్సులంద్రుంచెను.

అని, తాత్పర్యము.

వజ్రముష్టిస్తు మైందేన ముష్టినా నిహతో రణే. ౨౭
పపాత సరథ స్సాశ్వః పురాట్టఇవ భూతలే

టీక॥ వజ్రముష్టిస్తు=వజ్రముష్టియు; రణే=యుద్ధమునందు; మైందేన= మైందునిచేత; ముష్టినా=పిడికిలిచేత; నిహతః=చంపఁబడినవాఁడై; సరథః= రథముతోఁగూడినవాఁడై; సాశ్వః = గుఱ్ఱములతోఁగూడినవాఁడై; పురాట్టఇవ=పట్టణముయొక్క కోటబురుజువలె; భూతలే=నేలయందు, పపాత=పడెను.

వజ్రముష్టి, యుద్ధంబున మైందునిచేఁబిడికిటంబొడువఁబడినవాఁడై, రథాశ్వంబులతోఁగూడఁ, గోటబురుజుకైవడి నేలంగూలెను. అని, తాత్పర్యము.

నికుంభస్తు రణే నీలం నీలాంజనచయప్రభమ్. ౨౮
నిర్బిభేద శరై స్తీక్ష్ణైః కరై ర్మేఘ మివాంశుమాన్

టీక॥ నికుంభస్తు = నికుంభుండును; రణే=యుద్ధమునందు; నీలాంజనచయప్రభం=నల్లనికాటుకలసమూహముయొక్క కాంతివంటికాంతిగల; నీలం= నీలుని; తీక్ష్ణైః = కఱకులయిన; శరైః= బాణములచేత; కరైః = కిరణములచేత; అంశుమాన్=సూర్యుండు; మేఘమివ=మేఘమునువలె; నిర్బిభేద = భేదించెను.

సూర్యుండుకిరణంబుల మేఘంబును భేదించునట్లు, నికుంభుండు, కాటుకవలెనల్లనైననీలుని, కఱకుబాణంబుల నొంచెను. అని, తాత్పర్యము.

పున శ్శరశతేనాథ క్షిప్రహస్తో నిశాచరః. ౨౯
బిభేద సమరే నీలం నికుంభః ప్రజహాసచ

టీక॥ క్షిప్రహస్తః= శీఘ్రముగాఁజేయునట్టిచేతులుగల; నిశాచరః= రాక్షసుఁడగు; నికుంభః = నికుంభుఁడు; అథ=అంత; పునః=మఱల; సమరే= యుద్ధమునందు; శరశతేన= బాణములనూఱిఁటిచేత ; నీలం = నీలుని ; బిభేద = భేదించెను . ప్రజహాసచ=నవ్వెను.

శీఘ్రముగాబాణంబులు ప్రయోగించునట్టినికుంభుండు, మఱల, నూఱుబాణంబులనీలుంబ్రహరించి, నవ్వెను.

అని, తాత్పర్యము.

తస్యైవ రథచక్రేణ నీలోవిష్ణు రివాహవే. ౩౦
శిర శ్చిచ్ఛేద సమరే నికుంభస్యచ సారథేః

టీక॥ నీలః = నీలుఁడు; ఆహవే= యుద్ధమునందు; విష్ణురివ = విష్ణుదేవుఁడువలె; తస్య = ఆనికుంభునియొక్క; రథచక్రేణ=రథచక్రముచేత; సమరే= యుద్ధమునందు; నికుంభస్య= నికుంభునియొక్క ; ("చ"అనునది పాదపూరణార్థము) సారథేః = సారథియొక్క; శిరః=తలను; చిచ్ఛేద=ఛేదించెను.

నీలుండు, యుద్ధంబున, విష్ణుదేవుండుంబోలె, ఆనికుంభునిరథచక్రముం గొని, సారథిశిరంబుదెగవేసెను.

అని, తాత్పర్యము.

వజ్రాశనిసమస్పర్శో ద్వివిదో ప్యశనిప్రభమ్. ౩౧
జఘాన గిరిశృంగేణ మిషతాం సర్వ రక్షసామ్

టీక॥ వజ్రాశనిసమస్పర్శః = వజ్రముతోను పిడుగుతోను సమానమయినతాఁకుటగల ; ద్వివిదోపి = ద్వివిదుండును; సర్వరక్షసాం= సమస్తరాక్షసులును; మిషతాం= చూచుచుండఁగా; అశనిప్రభం=అశనిప్రభుని ; గిరిశృంగేణ=పర్వతశిఖరముచేత ; జఘాన=కొట్టెను.

వజ్రాశనులతోసమానమైనదేహముగలద్వివిదుండును, రాక్షసులందఱుచూచుచుండగా, యుద్ధంబున, నశనిప్రభునిఁబర్వతశిఖరంబునంబ్రహరించెను.

అని, తాత్పర్యము.

స ౪౩

ద్వివిదం వానరేంద్రంతు నగయోధిన మాహవే. ౩౨
శరై రశని సంకాశై స్సవివ్యాధా శనిప్రభః

టీక॥ సః=అ; అశనిప్రభస్తు=అశనిప్రభుఁడును; ఆహవే= యుద్ధమునందు; నగయోధినం=పర్వతముల చేయుద్ధము సేయునట్టి; వానరేంద్రం=వానరశ్రేష్ఠుఁడయిన; ద్వివిదం=ద్వివిదుని; అశనిసంకాశైః=పిడుగుతో సమానములయిన; శరైః=బాణములచేత ; వివ్యాధ=కొట్టెను.

అశనిప్రభుండు, పర్వతంబులచేఁ బోరుచున్నవానరోత్తముఁడగుద్వివిదు నిబిడుగులంబోనిక౦ుకు బాణంబులనాం చెను. అని, తాత్పర్యము.

స శరైరతి విద్ధాంగో ద్వివిదః క్రోధమూర్ఛితః. ౩౩
సాలేన స రథం సాశ్వం నిజఘానా శనిప్రభమ్

టీక॥సః=అ;ద్వివిదః= ద్వివిదుఁడు; శరైః = బాణములచేత; అతివిద్ధాంగః=మిక్కిలియు నొచ్చినదేహముగలవాఁడై; క్రోధమూర్ఛితః= కోపముచే వ్యాపింపఁబడినవాఁడై; సాలేన=మద్దిచెట్టుచేత; సరథం=రథముతోఁ గూడినవాఁడును; సాశ్వం= గుఱ్ఱంబులతోఁ గూడినవాఁడునగు; అశనిప్రభం= అశనిప్రభుని; నిజఘాన=వధించెను.

ఆద్వివిదుండు, బాణంబులచేమిక్కిలియు నొచ్చి పరమకుపితుండై, సాలవృక్షంబున, నాయశని ప్రభుని రథాశ్వంబులతోఁగూడవధించెను.

అని, తాత్పర్యము.

విద్యున్మాలీ రథస్థస్తు శరైఃకాంచన భూషణైః. ౩౪
సుషేణం తాడయామాస ననాదచ ముహుర్ముహుః

టీక॥రథస్థః=రథంబుననున్న; విద్యున్మాలీతు=విద్యున్మాలియు; కాంచనభూషణైః=బంగారుఅలంకారముగాఁగల; శరైః=బాణములచేత; సుషేణం= సుషేణుని; తాడయామాస= కొట్టెను. ముహుర్ముహుః=పలుమాఱు; ననాదచ=అఱచెను.

విద్యున్మాలి, రథగతుండై, కాంచ

నాలంకృతంబులగు బాణంబులసుషే|ణుంబ్రహరించి పలుమాఱుసిఁహనా దంబులుగావించెను.

అని, తాత్పర్యము.

తం రథస్థ మథోదృష్ట్వా సుషేణో వానరోత్తమః. ౩౫
గిరిశృంగేణ మహతా రథమాశు న్యపాతయత్

టీక॥అథో=అంత ; వానరోత్తమః=వానరశ్రేష్ఠుండగు;సుషేణః= సుషేణుండు;రథస్థః = రథమునయున్న; తం=ఆవిద్యున్మాలిని;దృష్ట్వా= చూచి; మహతా=గొప్పదగు;గిరిశృంగేణ=పర్వతశిఖరముచేత;రథం=రథమును; ఆశు=శీఘ్రముగా;న్యపాతయత్= పడఁదోసెను.

అంత,వానరశ్రేష్ఠుండగుసుషేణుండు, తానుక్రిందనుండుటయు జంబుమాలిరథంబుపైనుండుటయుంజూచి, పెద్ద పర్వతంబువేసి , శీఘ్రంబునరథంబును నుగ్గుగావించెను. అని, తాత్పర్యము.

లాఘవేనతు సంయుక్తో విద్యున్మాలీ నిశాచరః. ౩౬
అపక్రమ్య రథాత్తూర్ణం గదాపాణిః క్షితౌస్థితః

టీక॥ లాఘవేన=చులుకనతో; సంయుక్తః = కూడినవాఁడగు; నిశాచరః=రాక్షసుఁడయిన; విద్యున్మాలీతు= విద్యున్మాలియు;తూర్ణం = శీఘ్రముగా;రథాత్ = రథమునుండి;అపక్రమ్య=డిగ్గి;గదాపాణిః =గదహస్తమునంగలవాఁడై;క్షితౌ = నేలయందు;స్థితః=నిలిచినాఁడు.

ఆవిద్యున్మాలిమిక్కిలియు లాఘవంబుగలవాడు , కావున , గదచేతంగొని , రథంబునుండి , శీఘ్రంబున నేలకు లంఘించెను.

అని, తాత్పర్యము.

తతః క్రోధ సమావిష్ట స్సుషేణో హరిపుంగవః. ౩౭
శిలాం సుమహతీం గృహ్య నిశాచర మభిద్రవత్

టీక॥ తతః=అంత; హరిపుంగవః=వానరశ్రేష్ఠుండగు; సుషేణః= సుషేణుఁడు; క్రోధసమావిష్టః=కోపముచే నావేశింపఁబడినవాఁడై; సుమహతీం=మిక్కిలియుఁగొప్పదగు; శిలాం = ఱాయిని; గృహ్య(గృహీత్వా)=తీసికొని; నిశాచరం=రాక్షసుఁడైనవిద్యున్మాలిని; అభిద్రవత్(అభ్యద్రవత్)= తఱిమెను.

అంత, వానరశ్రేష్ఠుండగుసుషేణుండు, కుపితుండై, పెద్దఱాయియొకటి గ్రహించి, విద్యున్మాలిందఱిమెను.

అని, తాత్పర్యము.

తమాపతంతం గదయా విద్యున్మాలీ నిశాచరః। ౩౫
వక్షస్యభి జఘానాశు సుషేణం హరిసత్తమం

టీక॥ నిశాచరః= రాక్షసుఁడైన; విద్యున్మాలీ= విద్యున్మాలి; ఆపతంతం=వచ్చుచున్న; తం=ఆ; హరిసత్తమం= వానరశ్రేష్ఠుండగు; సుషేణం = సుషేణుని; ఆశు = శీఘ్రముగా; గదయా = గదచేత ; వక్షసి = ఱొమ్మునందు; అభిజఘాన= కొట్టెను.

అంత, విద్యున్మాలి , వానరశ్రేష్ఠుండగు సుషేణుండు పెనఱాయిచేతంగొనివచ్చుటంజూచి , యతనిఱొమ్ముపైఁగదచేఁగొట్టెను.

అని, తాత్పర్యము.

గదాప్రహారం తం ఘోర మచింత్య ప్లవగోత్తమః। ౩౬
తాం శిలాం పాతయామాస తస్యోరసి మహామృధే

టీక॥ప్లవగోత్తమః= వానరశ్రేష్ఠుండగుసుషేణుండు; తం=ఆ ; ఘోరం= భయంకరమయిన; గదాప్రహారం=గదచేతనయినదెబ్బను; అచింత్య( అచింతయిత్వా)=సరకుసేయక ; మహామృధే=మహాయుద్ధమునందు; తస్య=ఆవిద్యున్మాలియొక్క; ఉరసి= ఱొమ్మునందు; తాం=ఆ; శిలాం= ఱాయిని ; పాతయామాస=పడవేసెను.

వానరశ్రేష్ఠుండగునాసుషేణుండు ఆగదాప్రహారమునుసరకుసేయక , విద్యున్మాలివక్షస్థలంబుపై, నాశిలంబడవేసెను. అని, తాత్పర్యము.

శిలాప్రహారాభిహతో విద్యున్మాలీ నిశాచరః. ౪౦
నిష్పిష్టహృదయో భూమౌ గతాసు ర్నిపపాత హ

టీక॥ విద్యున్మాలీ=విద్యున్మాలియను, నిశాచరః=రాక్షసుఁడు; శిలాప్రహారాభిహతః=ఱాతిదెబ్బచేఁ గొట్టఁబడినవాఁడై; నిష్పిష్టహృదయః=పిసుకఁబడిన ఱొమ్ము గలవాఁడై; భూమౌ = నేలయందు; గతాసుః= పోయినప్రాణము లుగలవాఁడై; నిపపాత = పడెను. "హ" అనునది పాదపూరణార్థము.

విద్యున్మాలి, యాశిలాప్రహారంబున, వక్షస్స్థలమంతయుఁ జూర్ణముగా, గతప్రాణుండై, నేలం బడెను. అని, తాత్పర్యము.

ఏవం తైర్వానరై శ్శూరై శ్శూరా స్తే రజనీచరాః. ౪౧
ద్వంద్వే విమృదితా స్తత్ర దైత్యా ఇవ దివౌకసైః

టీక॥ ఏవం=ఇట్లు; శూరైః=శూరులగు; తైః=ఆ; వానరైః= వానరుల చేత; శూరాః=శూరులగు; తే=ఆ; రజనీచరాః= రాక్షసులు; తత్ర=ఆ; ద్వంద్వే = ద్వంద్వయుద్ధమునందు; దివౌకసైః(దివౌకోభిః)= దేవతలచేత; దైత్యాఇవ=అసురులువలె ; విమృదితాః=నలపఁబడిరి.

ఇట్లు, శూరులగు వానరులు, శూరులగు నారాక్షసులను , దేవతలసురులంబోలె, నాద్వంద్వయుద్ధంబునవధించిరి. అని, తాత్పర్యము.

భగ్నైః ఖడ్గై ర్గదాభిశ్చ శక్తితోమర పట్టిసైః. ౪౨
అపవిద్ధైశ్చ భిన్నైశ్చ రథై స్సాంగ్రామికై ర్హయైః
నిహతైః కుంజరై ర్మత్తై స్తథా వానర రాక్షసైః. ౪౩
చక్రాక్షయుగ దండైశ్చ భగ్నై ర్ధరణి సంశ్రితైః
బభూవా యోధనం ఘోరం గోమాయు గణసంకులమ్. ౪౪

టీక॥ ఆయోధనం= యుద్ధము; భగ్నైః=విఱిగిన; ఖడ్గైః=కత్తులచేతను;

గదాభిశ్చ=గదలచేతను; శక్తితోమరపట్టిసైః= శక్తులచేతను తోమరములచేతను అడ్డకత్తులచేతను; అపవిద్ధైః = విఱిగిన; రథైశ్చ= రథములచేతను; భిన్నైః = విఱిగిన ; సాంగ్రామికైః= యుద్ధమునందుసమర్థములగు ; హయైః=గుఱ్ఱములచేతను; నిహతైః = చంపఁబడిన; మత్తైః=మదించిన; కుంజరైః=ఏనుంగులచేతను; తథా= అట్లు; వానర రాక్షసైః=వానరులచేతను రాక్షసుల చేతను ; భగ్నైః = విఱిగినవియు ; ధరణీ సంశ్రితైః = భూమినిబొందినవియునగు ; చక్రాక్షయుగదండైశ్చ= చక్రములచేతను బండికన్నులచేతను కాఁడులచేతను; ఘోరం=భయంకరముగాను; గోమాయుగణసంకులం= నక్కలసమూహముచే నిండినదిగాను; బభూవ=అయినది.

అప్పుడుయుద్ధభూమి, తునిసిపడిన ఖడ్గంబులచేతనుగదలచేతను శక్తులచేతనుదోమరంబులచేతను పట్టిసంబులచేతను, విఱిగిపడినరథంబులచేతను యుద్ధయోగ్యంబులగుగుఱ్ఱంబులచేతను, నిహతంబులగుమత్తగజంబులచేతను హతులగువానర రాక్షసులచేతను , విఱిగి నేలంబడినబండిచక్రంబులచేతను గన్నులచేతను గాఁడులచేతను భయంకరంబై భక్షణార్థమయి సంచరించు నక్కలతోఁగూడినదై,యుండినది.

అని, తాత్పర్యము.

కబంధాని సముత్పేతు ర్దిక్షు వానరరక్షసామ్
విమర్దే తుములే తస్మిన్ దేవాసురరణోపమే. ౪౫

టీక॥ దేవాసురరణోపమే=దేవాసురయుద్ధముతోఁ బోలికగల; తస్మిన్= ఆ; తుములే = దొమ్మియయిన; విమర్దే= యుద్ధమునందు ; వానరరక్షసాం= వానరులయొక్కయు రాక్షసుల యొక్కయు; కబంధాని= మొండెములు; దిక్షు= దిక్కులయందు; సముత్పేతుః=ఎగిరినవి.

దేవాసురయుద్ధంబుతోసమాన మయినయాదొమ్మియుద్ధమునందు, వానరరాక్షసులమొండెములుదిక్కులం జెదరించుచుండినవి. అని, తాత్పర్యము.

విదార్యమాణా హరిపుంగవై స్తదా
నిశాచరా శ్శోణితదిగ్ధగాత్రాః

పునస్సుయుద్ధం తరసా సమాస్థితా
దివాకరస్యాస్తమయాభి కాంక్షిణః. ౪౨

టీక॥ తదా = అప్పుడు; నిశాచరాః=రాక్షసులు; హరిపుంగవైః= వానరశ్రేష్ఠులచేత ; విదార్యమాణాః= చీల్పఁబడుచున్నవారలయి; శోణితదిగ్ధగాత్రాః = నెత్తురుచేఁబూయఁబడిన దేహముగలవారలయి ; దివాకరస్య= సూర్యునియొక్క ; అస్తమయాభికాంక్షిణః= అస్తమయమునుగోరువారలై; పునః=మఱల; తరసా = బలముచేత; సుయుద్ధం=మంచియుద్ధమును ; సమాస్థితాః=పొందిరి.

అప్పుడు, రాక్షసులు , వానరవీరులచేవధింపఁబడి , నెత్తురువెల్లువలయిన దేహముగలవారలయ్యు , తమకుబలకరంబగు సూర్యాస్తమయంబు రాఁగోరి, బలంబునవలంబించి , యుద్ధంబు సేయుచుండిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, త్రిచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండ త్రిచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

చతుశ్చత్వారింశసర్గప్రారంభః.

యుధ్యతామేవ తేషాంతు తదా వానరరక్షసామ్
రవిరస్తం గతో రాత్రిః ప్రవృత్తా ప్రాణహారిణీ. ౧

టీక॥ తదా=అప్పుడు; తేషాం=ఆ; వానరరక్షసాం= వానరులును రాక్ష




లును; యుధ్యతాంతు (యుధ్యమానానాం)=యుద్ధము సేయుచుండఁగానే; రవిః=సూర్యుఁడు; అస్తం=అస్తమయమును; గతః=పొందినాఁడు. ప్రాణహారిణీ=ప్రాణంబులహరించునట్టి ; రాత్రిః=రాత్రి; ప్రవృత్తా = సంభవించినది.

అప్పుడు, ఆవానరరాక్షసులు , అట్లుయుద్ధము సేయుచుండఁగానే, సూర్యుండస్తంగతుండయ్యె; అంతవానరప్రాణహారిణియగురాత్రియువచ్చినది.

అని, తాత్పర్యము.

అన్యోన్యం బద్ధవైరాణాం ఘోరాణాం జయ మిచ్ఛతామ్
సంప్రవృత్తం నిశాయుద్ధం తదా వానరరాక్షసామ్. ౨

టీక॥ తదా=అప్పుడు; అన్యోన్యం=పరస్పరము ; బద్ధవైరాణాం=కట్టఁబడిన వైరముగలవారలును ; ఘోరాణాం=భయంకరులును; జయం = గెలుపును; ఇచ్ఛతాం= కోరుచున్నవారలునగు ; వానరరక్షసాం= వానరులకును రాక్షసులకును ; నిశాయుద్ధం = రాత్రియుద్ధము; సంప్రవృత్తం=జరగినది.

అప్పుడు , పరస్పరముబద్ధవైరులును భయంకరాకారులును జయాభిలాషులనగు నావానరరాక్షసులకు, రాత్రియుద్ధంబు,గలిగినది.

అని, తాత్పర్యము.

రాక్షసో సీతి హరయో హరిశ్చా సీతి రాక్షసాః
అన్యోన్యం సమరే జఘ్నుస్తస్మింస్తమసిదారుణే. ౩

టీక॥ దారుణే=భయంకరమయిన; తస్మిన్=ఆ; తమసి=చీఁకటియందు; సమరే=యుద్ధమునందు; హరయః= వానరులు; రాక్షసః=రాక్షసుఁడవు; అసీతి=అగుచున్నావనియు ; రాక్షసాః=రాక్షసులు; హరిః=వానరుఁడవు; అసీతి అగుచున్నావనియు; అన్యోన్యం=ఒండొరులను; జఘ్నుః=కొట్టిరి.

భయంకరంబగునాయంధకారంబునందు, వానరులు, రాక్షసుండని వానరుని, రాక్షసులువానరుండని రాక్షసుని, ఇట్లుగన్నుదెలియక, ఒండొరులం గొట్టుకొనిరి. అని, తాత్పర్యము.



జహి దారయ చైహీతి కథం విద్రవ సీతిచ
ఏవం సుతుములశ్శబ్ద స్తస్మిం స్తమసి శుశ్రువే. ౪

టీక॥ జహి= వధింపుము;ఇతి (అధ్యాహృతము)= అనియు;దారయ= చీల్చుము. ఇతి (అధ్యాహృతము)చ= అనియు;ఏహి=రమ్ము.ఇతి = అనియు; కథం=ఎట్లు;విద్రవసి = పరుగెత్తుచున్నావు?ఇతిచ=అనియు;ఏవం= ఇట్లు; సుతుములః = మిక్కిలియుదొమ్మియైయున;శబ్దః=ధ్వని;తస్మిన్ = ఆ;తమసి=చీఁకటియందు;శుశ్రువే= వినఁబడినది.

వధింపుము;చీల్చివేయుము ; పోవలదురమ్ము ; ఏలపరుగెత్తెదవు; ఇట్లు, ఆయంధకారమునందుఁ , దుములంబుగామహాధ్వనివినంబడినది.

అని, తాత్పర్యము.

కాళాః కాంచనసన్నాహా స్తస్మిం స్తమసి రాక్షసాః
సంప్రాదృశ్యంత శైలేంద్రా దీప్తౌషధివనా ఇవ. ౫

టీక॥ తస్మిన్=ఆ;తమసి= చీఁకటియందు;కాలాః = నల్లనివాండ్రును; కాంచనసన్నాహాః = బంగారుకవచముగలవారలునగు;రాక్షసాః= రాక్షసులు; దీప్తౌషధివనాః = జ్వలించుచున్నయోషధులవనముగల ; శైలేంద్రా ఇవ=పర్వతశ్రేష్ఠములువలె; సంప్రాదృశ్యంత=చూడఁబడిరి.

...కారంబున , నల్లనిమేనుగలవారలును, బంగారుకవచంబుఁదొడుగుకొనియున్నవారలునగు రాక్షసులు, రాత్రికాలంబునజ్వలించునట్లుప్రకాశించుచుండునోషధుల వనముగలమహాపర్వతంబులచాడ్పునఁ బొడకట్టుచుండిరి.

అని, తాత్పర్యము.

తస్మిం స్తమసి దుష్పారే రాక్షసాః క్రోధమూర్ఛితాః
పరిపేతు ర్మహావేగా భక్షయంతః ప్లవంగమాన్. ౬

టీక॥దుష్పారే= దాఁటనలవిగానట్టి;తస్మిన్=ఆ;తమసి=చీఁకటియం...

స ౪౪

రాక్షసాః=రాక్షసులు; క్రోధమూర్ఛితాః=కోపముచే వ్యాపింపఁబడినవారలయి; మహావేగాః= అధికమయినబలముగలవారలయి; ప్లవంగమాన్ = వానరులను; భక్షయంతః=భక్షింపుచు; పరిపేతుః=సంచరించిరి.

అనంతంబగునాయంధకారంబున, రాక్షసులు, పరమకుపితులయి మహావేగంబున, వానరులభక్షించుచు, యుద్ధభూమినివిహరింపుచుండిరి.

అని, తాత్పర్యము.

తే హయాన్ కాంచనాపీడాన్ ధ్వజాం శ్చాగ్నిశిఖోపమాన్
ఆప్లుత్య దశనై స్తీక్ష్ణై ర్భీమకోపా వ్యదారయన్. ౭

టీక॥ తే=ఆవానరులు ; భీమకోపాః= భయంకరమగుకోపము గలవారలయి; ఆప్లుత్య=ఎగిరి ; ...పీ డాన్=బంగారు శిరోభు... గల; హయాన్=గుఱ్ఱములు ...శి ఖోపమాన్=నిప్పుజ్వాలలతోఁ బోలిక గల; ధ్వజాంశ్చ=టెక్కెములను ; తీక్ష్ణైః=కఱకులయిన; దశనైః=దంతములచేత; వ్యదారయన్=చీల్చిరి.

ఆవానరులు, మహాకోపంబునొంది, యాకాశంబునకుద్గమించి, తీక్ష్ణదంతంబుల, బంగారుశిరోభూషణంబులు గల గుఱ్ఱంబులను, అగ్నిజ్వాలలువలెఁ బ్రకాశించుచున్నధ్వజంబులను, జీలిచివేసిరి.

అని, తాత్పర్యము.

వానరా బలినో యుద్ధే క్షోభయన్ రాక్షసీంచమూమ్

టీక॥ బలినః=అధికమయినబలముగల; వానరాః=వానరులు; యుద్ధే = యుద్ధమునందు; రాక్షసీం=రాక్షససంబంధినియగు; చమూం=సేనను; అక్షోభయన్=కలఁతపెట్టిరి.

బలవంతులగు వానరులు, యుద్ధంబున రాక్షససేనను నానావిధంబులఁగలంచిరి. అని, తాత్పర్యము.

కుంజరాన్ కుంజరారూఢాన్ పతాకాధ్వజినో రథాన్. ౮
చకర్షుశ్చ దదంశుశ్చ దశనైః క్రోధమూర్ఛితాః

టీక॥ తే(అధ్యాహృతము)= ఆవానరులు; క్రోధమూర్ఛితాః= కోపముచేవ్యాపింపఁబడిన వారలయి; కుంజరాన్=ఏనుంగులను;కుంజరారూఢాన్=ఏనుంగులనారోహించినవారలను; పతాకాధ్వజినః= చిహ్నములువ్రాసిన టెక్కెములునువట్టిటెక్కెములును గల; రథాన్ = రథములను; చకర్షుః= ఆకర్షించిరియు. దదంశుశ్చ = కొఱికిరియు.

వానరులు, క్రోధమూర్ఛితులయి, యేనుంగులను ఏనుంగులపైఁగూర్చుండినవారలను ధ్వజములుగట్టియున్నరథంబులను, ఈడ్చివేసి,దంతంబులం గొఱికి, నాశంబునొందించిరి.

అని, తాత్పర్యము.

లక్ష్మణశ్చాపి రామశ్చ శరై రాశీవిషోపమైః ౯
దృశ్యాదృశ్యాని రక్షాంసి ప్రవరాణి నిజఘ్నతుః

టీక॥ లక్ష్మణశ్చాపి= లక్ష్మణుండును; రామశ్చ=రాముండును; ఆశీవిషోపమైః= క్రూరసర్పములతోఁ బోలికగల;శరైః=బాణములచేత; ప్రవరాణి = ఉత్తములగు; దృశ్యాదృశ్యాని=చూడఁదగినవారలును జూడఁదగనివారలునగు;రక్షాంసి = రాక్షసులను;నిజఘ్నతుః=వధించిరి.

రాముండునులక్ష్మణుండును, అప్పుడు, గశ్యులయియున్నవారలును అదృశ్యు ' వారలునగు రాక్షసులఁ బెక్కండ్రఁ, దీక్ష్ణబాణంబులవధించిరి. అని, తాత్పర్యము.

తురంగఖురవిధ్వస్తం రథనేమిసముత్థితమ్. ౧౦
రురోధ కర్ణనేత్రాణి యుధ్యతాం ధరణీరజః

టీక॥తురంగఖురవిధ్వస్తం = గుఱ్ఱంబులయొక్క గిట్టలచేఁ జూర్ణితంబును;రథనేమిసముత్థితం=రథములచక్రములయంచులచేలేచినదియు నగు; ధరణీరజః = భూమిపరాగము;యుధ్యతాం = యుద్ధముసేయు వారలయొక్క;కర్ణనేత్రాణి = చెవులనుకన్నులను;రురోధ = అడ్డగించెను.

అప్పుడు, గుఱ్ఱంబులత్రొక్కు' జూర్ణితంబయి, రథచక్ర

పైకిలేచినపరాగము, యుద్ధము సేయు వారలచెవులను గన్నులను నావరించినది. అని, తాత్పర్యము.

వర్తమానే మహాఘోరే సంగ్రామే రోమహర్షణే. ౧౧
రుధిరోదా మహాఘోరా నద్య స్తత్ర ప్రసుస్రువుః

టీక॥ మహాఘోరే= మహాభయంకరమును; రోమహర్షణే=వెండ్రుకలు గగుర్పాటునొందించునదియునగు; సంగ్రామే=యుద్ధము; వర్తమానే= జరగుచుండఁగా; తత్ర = ఆయుద్ధభూమియందు; మహాఘోరాః= మహాభయంకరములయిన; రుధిరోదాః= నెత్తురె జలముగాఁగల; నద్యః=నదులు; ప్రసుస్రువుః=ప్రవహించినవి.

అట్లుచూపరులకు రోమహర్షణంబుగా మహాభయంకరంబుగా, యుద్ధముజరగుచుండఁగా, నాయుద్ధభూమియందు, మహాభయంకరములగు రక్తనదులు ప్రవహించినవి.

అని, తాత్పర్యము.

తతో భేరీ మృదంగానాం పణవానాంచ నిస్వనః. ౧౨
శంఖవేణుస్వనోన్మిశ్రః స్సంబభూవా ద్భుతోపమః

టీక॥ తతః=అంత; శంఖవేణుస్వనోన్మిశ్రః=శంఖములయొక్కయుఁబిల్లంగ్రోవులయొక్కయు ధ్వనులతోఁగలసిన; భేరీమృదంగానాం=భేరులయొక్కయు మృదంగంబులయొక్కయు; పణవానాంచ=పణవములనువాద్యవిశేషములయొక్కయు; నిస్వనః=ధ్వని; అద్భుతోపమః=ఆశ్చర్యముతోఁబోలిక గలదిగా; సంబభూవ=కలిగినది.

అంత, భేరీమృదంగపణవధ్వనులును శంఖవేణురావంబులునుబక్కటిగాఁగలసి, యాశ్చర్యకరంబుగా వినవచ్చినవి.

అని, తాత్పర్యము.

హతానాం స్తనమానానాం రాక్షసానాంచ నిస్స్వనః. ౧౩

శస్త్రానాం వానరాణాంచ సంబభూవా తిదారుణః

టీక॥ హతానాం=కొట్టఁబడినవారలును; స్తనమానానాం=గర్జించుచున్నవారలునగు; రాక్షసానాంచ=రాక్షసులయొక్కయు; శస్త్రానాం= హింసింపఁబడినవారలును; స్తనమానానాం (అధ్యాహృతము) = గర్జించుచున్నవారలునగు; వానరాణాంచ=వానరులయొక్కయు; నిస్స్వనః=ధ్వని; అతిదారుణః=మిక్కిలియు భయంకరము; సంబభూవ=అయినది.

ఒండొరులం జక్కఁగాఁ బ్రహరించుకొని, గర్జించుచున్న వానర రాక్షసుల గర్జాధ్వనులు, అతిభయంకరంబుగా వినవచ్చుచుండినవి.

అని, తాత్పర్యము.

హతైర్వానరవీరైశ్చ శక్తిశూలపరశ్వథైః. ౧౪
నిహతైః పర్వతాగ్రైశ్చ రాక్షసైః కామరూపిభిః
శస్త్రపుష్పోపహారాచ తత్రాసీద్యుద్ధమేదినీ. ౧౫
దుర్జ్ఞేయా దుర్నివేశాచ శోణితాస్రావ కర్దమా

టీక॥ శక్తిశూలపరశ్వథైః= శక్తులచేతను శూలములచేతను గొడ్డళ్లచేతను; హతైః=చంపఁబడిన; వానరవీరైశ్చ = వానరవీరులచేతను; పర్వతాగ్రైః=పర్వతశిఖరములచేత; నిహతైః=వధింపఁబడిన; కామరూపిభిః = ఇచ్ఛాధీనమగురూపముగల; రాక్షసైః= రాక్షసులచేతను; తత్ర=అప్పుడు; యుద్ధమేదినీ=యుద్ధభూమి; శస్త్రపుష్పోపహారాచ = ఆయుధములును బూలునై బలిగాఁగలదియు; దుర్జ్ఞేయా = ఎఱుంగనలవిగానిదియు; దుర్నివేశాచ= ప్రవేశింపఁగూడనిదియు; శోణితాస్రావకర్దమా= నెత్తురుకాలుటచే బురదగలదియు; ఆసీత్=అయినది.

అచ్చటనప్పుడు వానరవీరులు శక్తిశూలపరశ్వథాద్యాయుధంబుల హతులగుటవలనను రాక్షసులు పర్వతశిఖరంబుల హతులగుటవలనను, ఆయుద్ధభూమి, యయ్యాయుధంబులచేతను బర్వతశిఖరంబులనుండి రాలిన పుష్పంబులచేతను ఆచ్ఛాదితమయి నెత్తురుచేఁ దడుపఁబడెబురదగానుండుటచేత దుష్ప్రవేశమయియుండినది. అని, తాత్పర్యము.

సా బభూవ నిశా ఘోరా హరిరాక్షసహారిణీ. ౧౬
కాళరాత్రీవ భూతానాం సర్వేషాం దురతిక్రమా

టీక॥ ఘోరా=భయంకరమును; హరిరాక్షసహారిణీ=వానరులను రాక్షసులనుహరించునదియునగు; సా=ఆ; నిశా=రాత్రి; కాళరాత్రీవ = కాళరాత్రివలె; సర్వేషాం= సమస్తములయిన; భూతానాం=ప్రాణులకును; దురతిక్రమా. =దాటనలవిగానిది ; బభూవ=అయినది.

భయంకరమును, వానరరాక్షసుల ప్రాణంబులు హరించునదియునగు నారాత్రి, కాళరాత్రియుంబోలె, సమస్తభూతంబులకును, ఇంకనెట్లు తెల్లవారుననునట్లు, భయంబుగల్గించినది. అని, తాత్పర్యము.

తత స్తే రాక్షసా స్తత్ర తస్మిం స్తమసి దారుణే. ౧౭
రామమేవాభ్య వర్తంత సంసృష్టా శ్శరవృష్టిభిః

టీక॥ తతః= అంత; తత్ర=అప్పుడు; దారుణే=భయంకరమయిన; తస్మిన్=ఆ; తమసి=చీకటియందు; తే=ఆ; రాక్షసాః=రాక్షసులు; శరవృష్టిభిః= బాణవర్షములతో; సంసృష్టాః=చేరినవారలై; రామమేవ= రాముని గూర్చియె; అభ్యవర్తంత = వచ్చిరి.

అంతనప్పుడుభయంకరంబగు నాయంధకారంబున, నామేటిరాక్షసులు, బాణవర్షంబులు గురిపించుచు, రాముని పైకడరిరి. అని, తాత్పర్యము.

తేషా మాపతతాం శబ్దః క్రుద్ధానా మపి గర్జతామ్. ౧౮
ఉద్వర్త ఇవ సప్తానాం సముద్రాణాం ప్రశుశ్రువే

టీక॥ ఆపతతాం=వచ్చుచున్నవారలును; క్రుద్ధానామపి=కోపించినవారలును; గర్జతాం=గర్జించుచున్న వారలునగు; తేషాం= ఆరాక్షసులయొక్క; శబ్దః=ధ్వని; ఉద్వర్తే= ప్రళయమునందు; సప్తానాం= ఏడైన ; సముద్రాణామివ=సముద్రములయొక్కవలె; ప్రశుశ్రువే=వినఁబడినది.

ఆరాక్షసులుక్రుద్ధులయి గర్జించుచు రామునిపైకడరఁగా, నాధ్వని, మహా

ప్రళయంబునను వొంగు సప్తసముద్రంబుల శబ్దముంబోలె, భయంకరంబై, వినవచ్చినది. అని, తాత్పర్యము.

తేషాం రామశ్శరైష్షడ్భిష్షడ్జఘాన నిశాచరాన్. ౧౯
నిమేషాంతరమాత్రేణ శితైరగ్నిశిఖోపమైః

టీక॥ రామః=రాముఁడు; నిమేషాంతరమాత్రేణ=ఱెప్పపాటంత మాత్రముచేతనె; తేషాం= ఆరాక్షసులలో; నిశాచరాన్=రాక్షసులను; షట్= ఆఱుగురను; శితైః=తీక్ష్ణములగు; అగ్నిశిఖోపమైః=నిప్పుజ్వాలలతోఁబోలికగల; షడ్భిః=ఆఱయిన; శరైః= బాణములచేత; జఘాన=కొట్టెను.

రాముఁడు, ఒక్క ఱెప్పపాటున, ఆరాక్షసులలో నాఱుగురను, తీక్ష్ణములగు నగ్నిజ్వాలలవంటి యాఱు బాణంబుల, నొప్పించెను. అని, తాత్పర్యము.

యమశత్రుశ్చ దుర్ధర్షో మహాపార్శ్వ మహోదరౌ. ౨౦
వజ్రదంష్ట్రో మహాకాయ స్తావుభౌ శుకసారణౌ
తేతు రామేణ బాణౌఘై స్సర్వే మర్మసు తాడితాః. ౨౧
యుద్ధాదపసృతా స్తత్ర సావశేషాయుషోఽభవన్

టీక॥ దుర్ధర్షః = ఎదిరింపనలవిగాని; యమశత్రుశ్చ= యమశత్రుఁడును; మహాపార్శ్వమహోదరౌ=మహాపార్శ్వుండును మహోదరుండును; మహాకాయః=పెద్దదేహముగల; వజ్రదంష్ట్రః=వజ్రదంష్ట్రుండును; తౌ=ఆ; శుకసారణౌ=శుకుండును సారణుఁడును; ఉభౌచ= ఇద్దఱును; తేతు=ఆరాక్షసులుమాత్రము; సర్వే=అందఱును; రామేణ=రామునిచేత; మర్మసు=జీవస్థానములయందు; బాణౌఘైః=బాణములచేత; తాడితాః= కొట్టఁబడినవారలై; తత్ర=అప్పుడు; యుద్ధాత్ =యుద్ధంబుననుండి; అపసృతాః=తొలఁగిన వారలయి; సావశేషాయుషః=మిగతతోఁగూడినయాయుస్సుగలవారలు; అభవన్= అయిరి.

దుర్ధర్షుండగుయమశత్రుండును

మహాపార్శ్వుఁడును మహోదరుండు నుమహాకాయుండగు వజ్రదంష్ట్రుండు నుఆరావణునిచేను త్తరద్వార రక్షణార్థమయినియుక్తులగు నాశుకసారణులిద్దఱును, ఈరాక్షసులాఱుగురును, రామునిచేతజీవస్థానంబులందుఁ, దీక్ష్ణబాణంబులం దాడితులయి, యంతయుద్ధంబునుండిదొలంగి, కొంతయాయుయుష్యునుదక్కించుకొనిరి.

అని, తాత్పర్యము.

తత్ర కాంచనచిత్రాంగై శ్శరై రగ్నిశిఖోపమైః. ౨౨
దిశ శ్చకార విమలాః ప్రదిశశ్చ మహాబలః

టీ॥ మహాబలః=అధికమయినబలముగలరాముఁడు ; తత్ర = అప్పుడు; కాంచనచిత్రాంగైః=బంగారముచేఁ జిత్రములయినయాకారముగలవియు. అగ్నిశిఖోపమైః=అగ్నిజ్వాలలతోఁబోలికగలవియునగు; శరైః=బాణములచేత; దిశః=దిక్కులను ; ప్రదిశశ్చ=ప్రదిక్కులను; విమలాః = స్వచ్ఛములనుగా; చకార=చేసెను.

మహాబలుండగు రాముండు, అంధకారంబునఁ, గాంచనాలంకృతంబులగు నగ్నిజ్వాలలవంటిబాణంబులచే దిక్కులందును విదిక్కులందును వెలుతురుగలుగఁజేసెను. అని, తాత్పర్యము.

యేత్వన్యే రాక్షసా భీమా రామస్యాభిముఖే స్థితాః. ౨౩
తేపి నష్టా స్సమాసాద్య పతంగా ఇవ పావకమ్

టీ॥ అన్యే = ఇతరులయిన; భీమాః=భయంకరులగు; యే = ఏ; రాక్షసాః=రాక్షసులు; రామస్య = రామునియొక్క; అభిముఖే = ఎదుటను; స్థితాః=నిలిచినారో; తేపి = వారలును; పావకం = అగ్నిహోత్రమును; సమాసాద్య = పొంది; పతంగా ఇవ= మిడుతలువలె; నష్టాః=నశించినారు.

మఱియునింకనుభయంకరాకారులగు రాక్షసులెవ్వరెవ్వరు రామునకభిముఖంబుగానిలిచిరో, వారలందఱు, నగ్నిహోత్రంబునంబడినమిడుతలమాఱ్కి, నాశంబునొందిరి.

అని, తాత్పర్యము.

సువర్ణపుంఖై ర్విశిఖై స్సంపతద్భి స్సహస్రశః. ౨౪
బభూవ రజనీ చిత్రా ఖద్యోతై రివ శారదీ

టీక॥ సహస్రశః=వేనవేలుగా; సంపతద్భిః= వచ్చుచున్న; సువర్ణపుంఖైః=బంగారువికారములయినపింజలుగల ; విశిఖైః=బాణములచేత; రజనీ=రాత్రి; ఖద్యోతైః= మిణుఁగుఱుఁబురువులచేత; శారదీవ= శరదృతువునందలిరాత్రివలె; చిత్రా=చిత్రవర్ణమయినది; బభూవ=అయినది.

వేనవేలుగాబంగారు పింజలుగల బాణములు ప్రయోగింపఁబడుచుండుటంజేసి , మిణుఁగుఱుఁబురువులతోఁ గూడినశరద్రాత్రికైవడి , నారాత్రి యెంతయునొప్పుచుండినది.

అని, తాత్పర్యము.

రాక్షసానాంచ నినదై ర్హరీణాం చాపి నిస్స్వనైః. ౨౫
సా బభూవ నిశా ఘోరా భూయో ఘోరతరా తదా

టీక॥ ఘోరా = భయంకరమయిన; సా=ఆ; నిశా= రాత్రి; రాక్షసానాం=రాక్షసులయొక్క; నినదైశ్చ = ధ్వనులచేతను; హరీణాం= వానరులయొక్క;నిస్స్వనై శ్చాపి=ధ్వనులచేతను; భూయః=మఱియు; ఘోరతరా= మిక్కిలియుభయంకరమయినది;బభూవ=అయినది.

మొదలె భయంకరముయయుండు నారాత్రి , వానరరాక్షసులు సేయుచుండుసింహనాదంబులచే , మఱియు భయంకరముగానుండినది.

అని, తాత్పర్యము.

తేనశబ్దేన మహతా ప్రవృద్ధేన సమంతతః. ౨౬
త్రికూటః కందరాకీర్ణః ప్రవ్యాహర దివాచలః

టీక॥ మహతా= గొప్పదియు;సమంతతః=అంతటను;ప్రవృద్ధేన= వృద్ధిఁబొందినదియునగు;తేన = ఆ;శబ్దేన=ధ్వనిచేత;కందరాకీర్ణః = గుహలచేవ్యాప్తమయిన;త్రికూటః= త్రికూటమను;అచలః=పర్వతము ; ప్రవ్యా

హారదివ=మాటలాడునట్లుండినది. అంతటను వ్యాపించి వృద్ధిఁబొందిన యాధ్వనిచేతఁ, జెరువు గుహలతోఁగూడిన త్రికూటపర్వతము, ప్రతిధ్వనులు సేయుచు, మాటలాడినట్లు చూపట్టినది. అని, తాత్పర్యము.

గోలాంగూలా మహాకాయా స్తమసా తుల్యవర్చసః. ౨౭
సంపరిష్వజ్య బాహుభ్యాం భక్షయన్ రజనీచరాన్

టీక॥ మహాకాయాః=పెద్దశరీరము గలవారలును; తమసా=చీఁకటితో; తుల్యవర్చసః=సమానమయినకాంతిగలవారలును; గోలాంగూలాః=కొండముచ్చులు; రజనీచరాన్ = రాక్షసులను; బాహుభ్యాం=చేతులచేత; సంపరిష్వజ్య=కవుఁగిలించుకొని; భక్షయన్(అభక్షయన్)=భక్షించిరి.

మహాకాయులును, అంధకారంబువలెనల్లని మేనుగలవారలునగుగోలాంగూలంబులు, రాక్షసులఁజేతులం గవుఁగిలించికొని, భక్షింపసాగిరి. అని, తాత్పర్యము.

అంగదస్తు రణే శత్రుం నిహంతుం సముపస్థితః. ౨౮
రావణించ జఘానాశు సారథించ హయా నపి

టీక॥ అంగదస్తు=అంగదుఁడును; రణే=యుద్ధమునందు; శత్రుం=శత్రువైన; రావణించ= రావణునికొడుకైన యింద్రజిత్తును; నిహంతుం=వధించుటకు; సముపస్థితః= ఉపక్రమించినవాఁడై; ఆశు=శీఘ్రముగా; సారథించ=సారథిని; హయానపి= గుఱ్ఱములనుంగూడ; నిజఘాన=చంపెను.

అంగదుండు, యుద్ధంబునఁదనప్రతివీరుండగునింద్రజిత్తును వధింపఁదలంపుగొని, సారథినిగుఱ్ఱంబులనుంగూడవధించెను. అని, తాత్పర్యము.

వర్తమానే తదా ఘోరే సంగ్రామే భృశదారుణే. ౨౯
ఇంద్రజిత్తు రథం త్యక్త్వా హతాశ్వో హతసారథిః
అంగదేన మహాకాయ స్తత్రై వాంతర ధీయత. ౩౦

టీక॥ తదా=అప్పుడు; ఘోరే=భయంకరమును; భృశదారుణే= మిక్కిలియుభయంకరమునగు; సంగ్రామే= యుద్ధము;వర్తమానే= జరుగుచుండగా; మహాకాయః=పెద్దశరీరముగల ; ఇంద్రజిత్తు=ఇంద్రజిత్తుమాత్రము; అంగదేన=అంగదునిచేత; హతాశ్వః = చంపఁబడినసారథిగలవాఁడై; రథం= రథమును; త్యక్త్వా=విడిచి; తత్రైవ= అచ్చటనె ; అంతరధీయత = మఱుఁగుపాటునొందెను.

అప్పుడట్లు, మహాభయంకరంబుగ యుద్ధంబు జరగుచుండఁగానేమహాకాయుఁడగునింద్రజిత్తుమాత్రము , అంగదుండుగుఱ్ఱంబులనుసారథినింజంపినందున,రథంబునువిడిచి , యచ్చటనెయంతర్ధానంబునొందెను. అని, తాత్పర్యము.

తతః కర్మ వాలిపుత్రస్య సర్వే దేవా స్సహర్షిభిః
తుష్టువుః పూజ నార్హస్య తౌచోభౌ రామలక్ష్మణౌ. ౩౧

టీక॥ ఋషిభిస్సహ= ఋషులతోఁగూడ;దేవాః = దేవతలు; సర్వాః= అందఱును;తౌ = ఆ;రామలక్ష్మణౌ= రామలక్ష్మణులు;ఉభౌచ= ఇద్దఱును; పూజనార్హస్య = పూజించుటకుఁదగిన;వాలిపుత్రస్య = వాలికొడుకైనయంగదునియొక్క;తత్= ఆ;కర్మ= కార్యమును;తుష్టువుః=పొగడిరి.

దేవతలునుఋషులును రామలక్ష్మణులిద్దఱును , బూజార్హుఁడగునంగదుండు గావించిన యాకార్యమునకు మెచ్చుకొనిప్రస్తుతించిరి.

అని, తాత్పర్యము.

ప్రభావం సర్వభూతాని విదు రింద్ర జితో యుధి
తేనతే తం మహాత్మానం తుష్టా దృష్ట్వా ప్రధర్షితమ్. ౩౨

టీక॥ సర్వభూతాని = సమస్తప్రాణులును;యుధి= యుద్ధమునందు; ఇంద్రజితః=ఇంద్రజిత్తుయొక్క; ప్రభావం=పరాక్రమమును;విదుః = ఎఱుంగుదురు. తేన=అందుచేత; తే = వారలు;తం=ఆ;మహాత్మానం= మహాపరాక్రమశాలియగునింద్రజిత్తును; ప్రధర్షితం = జయింపఁబడినవానిఁగా; దృ

ష్ట్వా = చూచి; తుష్టాః = సంతోషించిరి.

సమస్తభూతంబులకును, యుద్ధంబుననింద్రజిత్తుప్రభావంబు తెలియును; కావున, వారలు, అట్టిమహాపరాక్రమశాలియగు నింద్రజిత్తు యుద్ధంబునఁ బరాజయంబునొందుటంజూచి, సంతోషమునొందిరి. అని, తాత్పర్యము.

తతః ప్రహృష్టాః కపయ స్ససుగ్రీవవిభీషణాః
సాధుసాధ్వితి నేదుశ్చ దృష్ట్వా శత్రుం ప్రధర్షితమ్. ౩౩

టీక॥ తతః = అంత; శత్రుం = శత్రువైనయింద్రజిత్తును; ప్రధర్షితం = జయింపఁబడినవానిగా; దృష్ట్వా = చూచి; ససుగ్రీవవిభీషణాః = సుగ్రీవునితోను విభీషణునితోను గూడిన; కపయః = వానరులు; ప్రహృష్టాః = సంతసించిరి. సాధుసాధ్వితి = బలేబలేయని; నేదుశ్చ = అఱచిరియు.

అంత, సుగ్రీవుండును విభీషణుండును వానరులును, ఇంద్రజిత్తుపరాజయంబు నొందుటంజూచి, పరమసంతోషంబునొంది, యంగదుని సాధువాదంబులం బ్రశంసించిరి.

అని, తాత్పర్యము.

ఇంద్రజిత్తు తదా తేన నిర్జితో భీమకర్మణా
సంయుగే వాలిపుత్రేణ క్రోధం చక్రే సుదారుణమ్. ౩౪

టీక॥ ఇంద్రజిత్తు = ఇంద్రజిత్తును; తదా = అప్పుడు; సంయుగే = యుద్ధమునందు; భీమకర్మణా = భయంకరమయినకార్యముగల; తేన = ఆ; వాలిపుత్రేణ = వాలికొడుకయిన యంగదునిచేత; నిర్జితః = జయింపఁబడినవాఁడై; సుదారుణం = మిక్కిలియు భయంకరమగు; క్రోధం = కోపమును; చక్రే = చేసెను.

అంత, నింద్రజిత్తు, అట్లుభయంకరపరాక్రముండగునంగదునిచే యుద్ధంబునఁ బరాజయంబునొంది, దారుణంబగుకోపంబునవలంబించెను.

అని, తాత్పర్యము.

ఏతస్మి న్నంతరే రామో వానరా న్వాక్యమబ్రవీత్

టీక॥ఏతస్మిన్నంతరే= ఈమధ్యము నందు; రామః=రాముఁడు; వానరాన్= వానరులనుగూర్చి; వాక్యం = మాట ను; అబ్రవీత్ = చెప్పెను.

ఈమధ్యమున , రాముండువానరులంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

సర్వే భవంత స్తిష్ఠంతు కపిరాజేన సంగతాః. ౩౫

టీక॥భవంతః=మీరలు; సర్వే=అందఱును; కపిరాజేన= వానరేశ్వరుఁడగు సుగ్రీవునితో; సంగతాః= చేరినవారలయి; తిష్ఠంతు=ఉండుఁడు.

మీరలందఱు వానర రాజుండగు సుగ్రీవునితోఁగూడ జాగ్రత్తతో నుండుఁడు. అని, తాత్పర్యము.

స బ్రహ్మణాద త్తవర స్త్రైలోక్యం బాధతే భృశమ్
భవతా మర్థసిద్ధ్యర్థం కాలేన స సమాగతః. ౩౬

టీక॥సః=ఆయింద్రజిత్తు ; బ్రహ్మణా=బ్రహ్మదేవునిచేత; దత్తవరః= ఇవ్వఁబడినవరముగలవాఁడై ; త్రైలోక్యం=ముల్లోకంబులను; భృశం= మిక్కిలియును; బాధతే= బాధించుచున్నాఁడు. సః=ఆయింద్రజిత్తు; భవతాం=మీయొక్క; అర్థసిద్ధ్యర్థం=కార్యసిద్ధికొఱకు; కాలేన = మృత్యువుచేత; సమాగతః=వచ్చినాఁడు.

ఆయింద్రజిత్తు బ్రహ్మవలనవరంబునొందిముల్లోకంబులనుమిక్కిలియు బాధింపుచుండు; ఇప్పుడతనికిమృత్యుసన్నిహితమగుటవలన,నతనివధించుటయను మీకార్యముసిద్ధించుటకై వచ్చినాఁడు.

అని, తాత్పర్యము.

అద్యైవ క్షమితవ్యం మే భవంతో విగతజ్వరాః

టీక॥ అద్యైవ=ఇప్పుడే; మే=నాకొఱకు; క్షమితవ్యం=ఓర్వఁబడవలసినది. భవంతః=మీరలు; విగతజ్వరాః= పోయినజ్వరముగలవారలు.

ఇప్పుడుమాత్రము, మీరునాకుఁగా నోఁచియుండవలసినది; మీకేమిభయములేదు; అని, తాత్పర్యము.

సోంతర్ధానగతః పాపో రావణీ రణకర్కశః. ౩౭
అదృశ్యో నిశితాన్ బాణాన్ ముమోచాఽశనివర్చసః

టీక॥ పాపః=పాపాత్ముండును; రణకర్కశః=యుద్ధంబునందుగట్టివాఁడునగు; రావణిః=రావణునికొడుకైన; సః=ఆయింద్రజిత్తు; అంతర్ధానగతః=అంతర్ధానవిద్యనుబొందినవాఁడై; అదృశ్యః=చూడఁదగనివాఁడై; అశనివర్చసః=పిడుగుయొక్క కాంతివంటికాంతిగలవియు; నిశితాన్=తీక్ష్ణములునగు; బాణాన్=బాణములను; ముమోచ=విడిచెను.

పాపాత్ముండును యుద్ధమునందు సమర్థుండునగునాయింద్రజిత్తు, అంతర్ధానవిద్యచేనదృశ్యుండై, పిడుగులవంటితీక్ష్ణబాణంబులఁబ్రయోగించెను. అని, తాత్పర్యము.

స రామం లక్ష్మణంచైవ ఘోరై ర్నాగమయై శ్శరైః. ౩౮
బిభేద సమరే క్రుద్ధ స్సర్వగాత్రేషు రాక్షసః

టీక॥ సః=ఆ; రాక్షసః= ఇంద్రజిత్తు; సమరే=యుద్ధమునందు; క్రుద్ధః=కోపించినవాఁడై; రామం= రాముని; లక్ష్మణంచైవ=లక్ష్మణుని; సర్వగాత్రేషు=సమస్తావయవములందును; ఘోరైః=భయంకరములగు; నాగమయైః=సర్పాకారములయిన; శరైః=బాణములచేత; బిభేద=భేదించెను.

ఆయింద్రజిత్తు, యుద్ధంబునంగోపించి, రామలక్ష్మణులపైనాపాదమస్తకంబు, భయంకరంబులగు, నాగమయబాణంబులంబ్రయోగించెను. అని, తాత్పర్యము.

మాయయా సంవృత స్తత్ర మోహయన్ రాఘవౌ యుధి. ౩౯
అదృశ్య స్సర్వభూతానాం కూటయోధీ నిశాచరః
బబంధ శరబంధేన భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౪౦




టీక॥ తత్ర=అప్పుడు ; కూటయోధీ = కపటముచేఁబోరునట్టి; నిశాచరః=రాక్షసుఁడు;యుధి = యుద్ధమునందు;మాయయా=మాయచేత; సంవృతః=కప్పఁబడినవాఁడై; సర్వభూతానాం = సమస్తభూతంబులకును; అదృశ్యః=చూడఁగూడనివాఁడై; మోహయన్ = మోహమునొందఁజేయుచు;రాఘవౌ= రఘువంశమునందుఁబుట్టిన,భ్రాతరౌ = అన్నదమ్ములయిన; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను; శరబంధేన= బాణములనుత్రాటిచేత; బబంధ=కట్టెను.

అప్పుడు , కపటమునయుద్ధముసేయునట్టియాయింద్రజిత్తు , మాయనవలంబించి , సమస్తభూతంబులకునదృశ్యుండై , వానరులనందఱమోహంబునొందించుచు , రామలక్ష్మణులనిద్దఱను,నాబాణంబులచేబంధించెను. అని,తాత్పర్యము.

తౌ తేన పురుషవ్యాఘ్రౌ క్రుద్ధేనాశీవిషైః శరైః
సహసా నిహతౌ వీరౌ తదా ప్రైక్షంత వానరాః. ౪౧

టీక॥ వానరాః = వానరులు; తదా=అప్పుడు;క్రుద్ధేన= కోపమునొందిన; తేన=ఆయింద్రజిత్తుచేత ; ఆశీవిషైః=సర్పరూపములయిన ; శరైః= బాణములచేత;సహసా = శీఘ్రమున;నిహతౌ=కొట్టఁబడిన;వీరౌ= పరాక్రమశాలులగు;పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులయిన;తౌ= ఆరామలక్ష్మణులను;ప్రైక్షంత=చూచిరి.

అంత , నట్లుక్రుద్ధుండగు నింద్రజిత్తుచే నాగబాణంబుల బంధింపబడిపరవశులయి యున్న పురుషశ్రేష్ఠులును వీరులునగు, రామలక్ష్మణులను, వానరులుచూచిరి. అని,తాత్పర్యము.

ప్రకాశరూపస్తు యదా నశక్త
స్తౌ బాధితుం రాక్షసరాజపుత్రః
మాయాం ప్రయోక్తుం సముపాజగామ
బబంధ తౌ రాజసుతౌ మహాత్మా. ౪౨




టీక॥ మహౌజాః = అధికమయిన పరాక్రమముగల; రాక్షసరాజపుత్రః = రాక్షస రాజుండగు రావణునికొడుకైనయింద్రజిత్తు ; యదా = ఎప్పుడు; ప్రకాశరూపస్తు= ఎదుటనున్న రూపముగలవాఁడయ్యె; తౌ= ఆ రామలక్ష్మణులను; బాధితుం = బాధించుటకు; నశక్తః=సమర్థుఁడు కాఁడయ్యెనో; తదా(అధ్యాహృతము)=అప్పుడు; మాయాం=మాయను; ప్రయోక్తుం= ప్రయోగించుటకు; సముపాజగామ = ఆరంభించెను. తౌ=ఆ; రాజసుతౌ= రాచకొమరులగు రామలక్ష్మణులను; బబంధ=కట్టెను.

మహాపరాక్రమశాలియగు, రాక్షసేశ్వరసుతుండింద్రజిత్తు, స్పష్టముగా యెదుటనిలిచి రామలక్ష్మణుల బాధింపనశక్తుండయ్యెఁ గావునమాయ నవలంబించి, యదృశ్యరూపుండైయుండి,యా రామలక్ష్మణులనాగబాణంబులబంధించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
యుద్ధకాండే,చతుశ్చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు,యుద్ధకాండచతుశ్చత్వారింశసర్గటీక,
ముగిసినది.



శ్రీః

పంచచత్వారింశ సర్గ ప్రారంభః.

సతస్య గతి మన్విచ్ఛన్ రాజపుత్రః ప్రతాపవాన్
దిదేశా తిబలో రామో దశ వానరయూథపాన్. ౧

టీక॥ రాజపుత్రః=రాచకొమరుండును; ప్రతాపవాన్=అధికమయినపరాక్రమముగలవాఁడును; అతిబలః=అధికమయినబలముగలవాఁడునగు; సః=ఆ; రామః=రాముఁడు; తస్య=ఆయింద్రజిత్తుయొక్క; గతిం=స్థానమును; అన్విచ్ఛన్=కోరినవాఁడై; వానరయూథపాన్=వానరశ్రేష్ఠులను; దశ=పదిమందిని; దిదేశ=ఆజ్ఞాపించెను.

రాచకొమరుండును మహాపరాక్రమశాలియుమహాబలుండునగు రాముండు, ఆయింద్రజిత్తెందున్నాఁడో తెలియఁగోరి, పదుగురవానరయూథపుల కాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

ద్వౌ సుషేణస్య దాయాదౌ నీలంచ ప్లవగర్షభమ్
అంగదం వాలిపుత్రంచ శరభంచ తరస్వినమ్. ౨
వినతం జాంబవంతంచ సానుప్రస్థం మహాబలమ్
ఋషభం చర్షభస్కంధ మాదిదేశ పరంతపః. ౩

టీక॥ పరంతపః=శత్రువులఁదపింపఁజేయునట్టిరాముండు; సుషేణస్య=సుషేణునియొక్క; దాయాదౌ=కొడుకులను; ద్వౌ=ఇద్దఱను; ప్లవగర్షభం=వానరశ్రేష్ఠుండగు; నీలంచ=నీలుని; వాలిపుత్రం=వాలికొడుకైన; అంగదంచ=అంగదుని; తరస్వినం=బలవంతుండగు; శరభంచ=శరభుని; వినతం=వినతుని; జాంబవంతంచ=జాంబవంతుని; మహాబలం=అధికమయినబలముగల; సానుప్రస్థంచ=సానుప్రస్థుని; ఋషభం=ఋషభుని; ఋషభస్కంధం=ఋషభస్కంధుని; ఆదిదేశ=ఆజ్ఞాపించెను.

శత్రువులఁ దపింపఁ జేయునట్టి రాముండు, సుషేణుని కొడుకులిద్ద

ఱును వానరోత్తముండగు నీలుండునం గదుండును బలవంతుండగుశరభుండును వినతుండునుజాంబవంతుండును మహా బలశాలియగు సానుప్రస్థుండును ఋషభుండును ఋషభస్కంధుండును నీపదిమందిని, ఇంద్రజిత్తుస్థానంబారసి రండనియాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

తే సంప్రహృష్టా హరయో భీమా నుద్యమ్య పాదపాన్
ఆకాశం వివిశు స్సర్వే మార్గమాణా దిశో దశ. ౪

టీక॥ తే=ఆ;హరయః = వానరులు;సర్వే=అందఱును;భీమాన్ = భయంకరములయిన;పాదపాన్ = వృక్షములను;ఉద్యమ్య=పట్టుకొని; దశ=పదియయిన;దిశః = దిక్కులను;మార్గమాణాః = వెదకుచు;ఆకాశం= ఆకాశమును ; వివిశుః = ప్రవేశించిరి.

ఆవానరులందఱును బరమ సంతోషంబునొంది , మహావృక్షంబులం గొని, దశదిశలందునింద్రజిత్తును వెదకుచు, నాకాశంబునకుద్గమించిరి.

అని, తాత్పర్యము.

తేషాం వేగవతాం వేగ మిషుభి ర్వేగవత్తరైః
అస్త్రవి త్పరమాస్త్రేణ వారయామాస రావణిః. ౫

టీక॥అస్త్రవిత్=అస్త్రంబులఁదెలిసిన;రావణిః=ఇంద్రజిత్తు;పరమాస్త్రేణ=బ్రహ్మాస్త్రముచేత; వేగవత్తరైః= మిక్కిలియధికమయినవేగముగల;ఇషుభిః=బాణములచేత;వేగవతాం=అధికమయినవేగముగల; తేషాం=ఆవానరులయొక్క; వేగం=వేగమును ; వారయామాస=అడ్డగించెను.

పరమాస్త్రవేత్తయగునింద్రజిత్తు, బ్రహ్మాస్త్రాభిమంత్రితంబులగు బాణంబుల, వేగవంతులగునావానరులవేగంబు నివారించెను.అని, తాత్పర్యము.

తం భీమవేగా హరయో నారాచైః క్షతవిగ్రహాః
అంధకారే న దదృశు ర్మేఘైః సూర్య మివావృతమ్. ౬

టీక॥భీమవేగాః= భయంకరమయినవేగముగల; హరయః=వానరులు; నారాచైః= బాణములచేత ; క్షతవిగ్రహాః=గాయములుచేయఁబడినశరీరములుగలవారలయి; అంధకారే=అంధకారమునందు; తం=అయింద్రజిత్తును; మేఘైః=మేఘములచేత; ఆవృతం= కప్పఁబడిన; సూర్యమివ=సూర్యునిఁబోలె; నదదృశుః=చూడరైరి.

భయంకరవేగులగు నావానరులు, బాణంబులభిన్నగాత్రులయి , మేఘావృతుండగుసూర్యుండుంబోలె నంధకారంబుననున్నయింద్రజిత్తుంగానరైరి.

అని, తాత్పర్యము.

రామలక్ష్మణయో రేవ సర్వదేహభిద శ్శరాన్
భృశ మావేశయామాస రావణి స్సమితింజయః. ౭

టీక॥సమితింజయః= యుద్ధమునందుజయించునట్టి; రావణిః = రావణునికొడుకైనయింద్రజిత్తు ; రామలక్ష్మణయోరేవ=రామలక్ష్మణులయందే; సర్వదేహభిదః=సమస్తదేహమునుభేదించునట్టి; శరాన్=బాణములను; భృశం=మిక్కిలియు; ఆవేశయామాస=ఉంచెను

జయశాలియగునాయింద్రజిత్తు, సమస్తావయవంబులనుభేదించునట్టికోలలను బాణంబులమీఁదనా రామలక్ష్మణులనె, మెచ్చుగాఁబ్రయోగించెను.

అని, తాత్పర్యము.

నిరంతరశరీరౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ
క్రుద్ధే నేంద్రజితా వీరౌ పన్నగై శ్శరతాం గతైః. ౮

టీక॥క్రుద్ధేన=కోపించిన ; ఇంద్రజితా=ఇంద్రజిత్తుచేత; శరతాం = బాణత్వమును; గతైః=పొందిన; పన్నగైః=సర్పములచేత; వీరౌ= పరాక్రమశాలులును; భ్రాతరౌ= అన్నదమ్ములునగు; తౌ=ఆ; రామలక్ష్మణౌ= రామలక్ష్మణులు; నిరంతరశరీరౌ=సందులేని దేహముగలవారుగా ; కృతౌ (అధ్యాహృతము)=చేయఁబడినారు.

అట్లింద్రజిత్తుక్రుద్ధుండై, పరాక్రమవంతులగు నారామలక్ష్మణులపై, బాణాకారములగు సర్పములను, దేహము

లందుసూది మోపనైన నవకాశములేన ట్లు, ప్రయోగించెను.

అని, తాత్పర్యము.

తయోః క్షతజమార్గేణ సుస్రావ రుధిరం బహు
తా వుభౌచ ప్రకాశేతే పుష్పితా వివ కింశుకౌ. ౯

టీక॥ తయోః= ఆరామలక్ష్మణుల యందు; క్షతజమార్గేణ= గాయము చేఁగలిగినమార్గముచేత; బహు= అధికమయిన; రుధిరం=నెత్తురు; సుస్రావ=కాఱెను. తౌ= ఆరామలక్ష్మణులు; ఉభౌచ=ఇద్దఱును; పుష్పితౌ=పూచిన; కింశుకావివ = మోదుగుచెట్లువలె; ప్రకాశేతే=ప్రకాశింపుచుండిరి.

ఆరామలక్ష్మణుల దేహంబు లందుండి, యధికముగా నెత్తురు గాఱినది; అప్పుడు వారలిరువురు, పుష్పితంబులగు పలాశవృక్షముల మాడ్కిఁ బ్రకాశించిరి. అని, తాత్పర్యము.

తతః పర్యంతరక్తాక్షో భిన్నాంజనచయోపమః
రావణి ర్భ్రాతరౌ వాక్య మంతర్ధానగతోఽబ్రవీత్. ౧౦

టీక॥ తతః=అంత; పర్యంతరక్తాక్షః= కొనలయందెఱ్ఱనైన కన్నులుగలవాఁడును; భిన్నాంజనచయోపమః= పగిలినకాటుకల సమూహముతోఁబోలికగలవాఁడునగు; రావణిః = ఇంద్రజిత్తు; అంతర్ధానగతః = మఱుఁగుపాటునుబొందినవాఁడై; భ్రాతరౌ= అన్నదమ్ములగు రామలక్ష్మణులనుగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

అంతఁ, గాటుకరాశియుంబోలె నీలవర్ణుండగునాయింద్రజిత్తు, అంతర్ధానగతుండైయె, కోపంబునఁ గనుంగొనలనెఱ్ఱఁదనంబుగదుర, రామలక్ష్మణులంజూచి, యిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

యుధ్యమాన మనాలక్ష్యం శక్రోఽపి త్రిదశేశ్వరః
ద్రష్టు మాసాదితుం వాపి నశక్తః కిం పున ర్యువామ్. ౧౧

టీక॥ అనాలక్ష్యః=అంతర్ధానమునుబొంది; యుధ్యమానం=పోరుచున్న; మాం(అధ్యాహృతము)= నన్ను; ద్రష్టుం=చూచుటకుఁగాని; ఆసాదితుంవాపి=సమీపించుటకుఁగాని; త్రిదశేశ్వరః= దేవతలకుఁబ్రభుఁడైన; శక్రోపి = ఇంద్రుండైనను; నశక్తః = సమర్థుఁడు గాఁడు. యువాం=మీరు; కింపునః = చెప్ప నేల?

నేనంతర్ధానముఁబొంది యుద్ధము సేయుచుండఁగా, దేవనాథుండగు నింద్రుఁడుగూడ, నన్నుఁజూచుటకుఁగాని సమీపించుటకుఁగాని, శక్తుండుగాఁడు; ఇంకమీసంగతిచెప్ప నేల?

అని, తాత్పర్యము.

ప్రావృతౌ విషుజాలేన రాఘవౌ కంకపత్రిణా
ఏష రోషపరీతాత్మా నయామి యమసాదనమ్. ౧౨

టీక ॥ రాఘవౌ = రామలక్ష్మణులారా! కంకపత్రిణా= కంకపక్షిఱెక్కలుగల; ఇషుజాలేన= బాణసమూహముచేత; ప్రావృతౌ = కప్పఁబడిన; యువాం(అధ్యాహృతము)= మిమ్ము; రోషపరీతాత్మా=కోపముచేత వ్యాపింపఁబడినమనస్సుగల; ఏషః=ఈనేను; యమసాదనం=యమునిగృహమును ; నయామి=పొందించెదను.

రామలక్ష్మణులారా! ఇప్పుడుమీరలు, కంకపత్రవంతములగు బాణంబులచే పాదమస్తకము నావృతులై యున్నారుగదా! ఇంకనిప్పుడె, మిమ్ములయముపురికింబంపెదను; నాకోపమువ్యర్థము గాదు. అనియింద్రజిత్తు, రామలక్ష్మణులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు ధర్మజ్ఞౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ
నిర్బిభేద శితై ర్బాణైః ప్రజహర్ష ననాదచ. ౧౩

టీక॥సః (అధ్యాహృతము) = ఆయింద్రజిత్తు; ఏవం=ఇట్లు; ఉక్త్వాతు= చెప్పినంతనె; ధర్మజ్ఞౌ=ధర్మము దెలిసిన; భ్రాతరౌ=అన్నదమ్ములగు; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను; శితైః= తీక్ష్ణములగు; బాణైః=బాణములచేత;

నిర్బిభేద=భేదించెను. ప్రజహర్షచ= సంతోషించెను.ననాదచ=అఱచెను.

ఆయింద్రజిత్తు,ఈప్రకారమునంజెప్పి, ధర్మజ్ఞులగు నారామ లక్ష్మణులను దీక్ష్ణబాణంబుల నొప్పించి, సంతోషంబున, సింహనాదంబు గావించెను. అని,తాత్పర్యము.

భిన్నాంజనచయశ్యామో విస్ఫార్య విపులం ధనుః
భూయోభూయ శ్శరాన్ ఘోరాన్ విససర్జ మహామృధే. ౧౪

టీక॥భిన్నాంజనచయశ్యామః=పగిలినకాటుకవలె నల్లనైన యింద్రజిత్తు; మహామృధే=మహాయుద్ధంబునందు; విపులం=విశాలమగు; ధనుః=వింటిని; విస్ఫార్య= సారించి ; భూయో భూయః=మాటిమాటికి; ఘోరాన్=భయంకరములయిన; శరాన్= బాణంబులను; విససర్జ=విడిచెను.

పగిలినకాటుకరాశివలె నల్లనైన యింద్రజిత్తు, అమ్మహాయుద్ధంబున, విశాలంబగు ధనువునుసారించి , మాటిమాటికి, తీక్ష్ణంబులగుబాణంబులం బ్రయోగించెను. అని,తాత్పర్యము.

తతో మర్మసు మర్మజ్ఞో మజ్జయన్ నిశితాన్ శరాన్
రామలక్ష్మణయోర్వీరో ననాదచ ముహుర్ముహుః. ౧౫

టీక॥ తతః=అంత;వీరః = పరాక్రమశాలియు; మర్మజ్ఞః = జీవస్థానంబులుదెలిసినవాఁడునగు నింద్రజిత్తు; రామలక్ష్మణయోః = రామలక్ష్మణులయొక్క;మర్మసు = జీవస్థానములయందు; నిశితాన్ = తీక్ష్ణములయిన; బాణాన్=బాణములను; మజ్జయన్= మునిఁగించుచు ; ముహుర్ముహుః= మాటిమాటికి;ననాదచ=అఱచెను.

అంతఁ, బరాక్రమవంతుండుసుజీవస్థానంబులు చక్కఁగాఁ దెలిసినవాఁడునగు నింద్రజిత్తు , రామలక్ష్మణుల మర్మస్థానములఁదీక్ష్ణబాణంబులు చొప్పించి,మాటిమాటికిసింహనాదంబులు గావించెను. అని,తాత్పర్యము.

స ౪౫

బద్ధౌతు శరబంధేన తౌ వుభౌ రణమూర్ధని
నిమేషాంతరమాత్రేణ న శేకతు రుదీక్షితుమ్. ౧౬

టీక॥ తౌ= ఆ రామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును; రణమూర్ధని= యుద్ధాగ్రమునందు; శరబంధేన=బాణబంధము చేత; బద్ధౌతు= కట్టఁబడినవారలయినంతనే; నిమేషాంతరమాత్రేణ=నిమేషావకాశమాత్రము చేతనే; ఉదీక్షితుం=చూచుటకు; న శేకతుః=చాలరైరి.

ఆ రామలక్ష్మణులు, అట్లు శరబంధంబున బద్ధులయి, క్షణమాత్రంబునఁ, జూచుటకుఁగూడ నశక్తులయిరి.

అని, తాత్పర్యము.

తతో విభిన్నసర్వాంగౌ శరశల్యాచితౌ వుభౌ
ధ్వజావివ మహేంద్రస్య రజ్జుముక్తౌ ప్రకంపితౌ. ౧౭
తౌ సంప్రచలితౌ వీరౌ మర్మభేదేన కర్శితౌ
నిపేతతు ర్మహేష్వాసౌ జగత్యాం జగతీపతీ. ౧౮

టీక॥ తతః=అంత; వీరౌ=పరాక్రమశాలులును; జగతీపతీ=భూమికిఁ బ్రభువులును; మహేష్వాసౌ=పెద్దవిల్లుగలవారలునగు; తౌ=ఆ రామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును; విభిన్నసర్వాంగౌ= భేదింపఁబడినసమస్తములయిన యవయవములుగలవారలయి; శరశల్యాచితౌ=బాణంబుల మేకులచే వ్యాపింపఁబడినవారలయి; సంప్రచలితౌ= చలించినవారలయి; మర్మభేదేన=జీవస్థానంబుల భేదించుటచేత; కర్శితౌ=కృశింపఁజేయఁబడినవారలై; రజ్జుముక్తౌ= త్రాటిచే విడువఁబడినవియు; ప్రకంపితౌ=కదలింపఁ బడినవియు నగు; మహేంద్రస్య=ఇంద్రుని యొక్క; ధ్వజావివ=టెక్కెములువలె; జగత్యాం= భూమియందు; నిపేతతుః=పడిరి.

అంత, మహాధనుర్ధరులును మహావీరులును భూపతులునగు నా రామలక్ష్మణులిర్వురును, భిన్నసర్వావయవులై, బాణపూర్ణదేహులయి, మర్మస్థానంబులభిన్నులగుటం జేసి మిక్కిలియు నొచ్చి, చలనంబునొంది, రజ్జుముక్తంబులగు నింద్రధ్వజంబులకైవడి, నేలంబడిరి.

అని, తాత్పర్యము.

తౌ వీరశయనే వీరౌ శయానౌ రుధిరోక్షితౌ
శరవేష్టితసర్వాంగా వార్తౌ పరమపీడితౌ. ౧౯

టీక॥వీరౌ = పరాక్రమశాలులగు; తౌ = ఆ రామలక్ష్మణులు; వీరశయనే = యుద్ధభూమియందు; శయానౌ = పరుండియున్నవారలయి ; రుధిరోక్షితౌ = నెత్తురుచేఁదడుపఁబడినవారలయి; శరవేష్టితసర్వాంగౌ = బాణములచేఁగప్పఁ బడిన సమస్తావయవములు గలవారలై ;ఆర్తౌ = దుఃఖితులయి; పరమపీడితౌ = మిక్కిలియుఁబీడింపఁబడినవారలయి;ఆసక్ (అధ్యాహృతము)=ఉండిరి.

పరాక్రమవంతులగునా రామలక్ష్మణులు, నెత్తుటందోఁగుచు , సమస్తావయవంబులందును బాణంబుల బద్ధులయి , పరమపీడితులయి యాతురులయి , యుద్ధభూమియందుశయనించియుండిరి. అని, తాత్పర్యము.

న హ్యవిద్ధం తయో ర్గాత్రే బభూ వాంగుళ మంతరమ్
నానిర్భిన్నం న చా స్తబ్ధ మాకరాగ్రా దజిహ్మగైః. ౨౦

టీక॥ఆకరాగ్రాత్ = చేతులకొనమొదలుకొని;తయోః= ఆ రామలక్ష్మణులయొక్క; గాత్రే= దేహమునందు; అంగుళం= అంగుళప్రమాణమయిన; అంతరం=అవకాశమును;అజిహ్మగైః= బాణములచేత;అవిద్ధం = కొట్టఁబడనిది;నబభూవహి=లేదుగదా! అనిర్భిన్నం= భేదింపఁబడనిది; న = లేదు. అస్తబ్ధంచ=నిశ్చలముకానిదియు; న= లేదు.

ఆ రామలక్ష్మణుల దేహమునందు, ఆపాదమస్తకము,బాణంబుల విద్ధంబుగానిదియుభిన్నంబుగానిదియునిశ్చలముగానిదియు,నంగుళప్రమాణప్రదేశంబునులేదు. అని, తాత్పర్యము.

తౌతు క్రూరేణ నిహతౌ రక్షసా కామరూపిణా
అసృక్ సుస్రువతు స్తీవ్రం జలం ప్రస్రవణావివ. ౨౧

టీక॥ తౌతు = ఆ రామలక్ష్మణులును; కామరూపిణా = ఇచ్ఛాధీనమగు రూపము గలవాఁడును; క్రూరేణ = కఠినుఁడు నగు; రక్షసా = ఇంద్రజిత్తుచేత ; నిహతౌ = కొట్టఁబడినవారలై; తీవ్రం = తీక్ష్ణముగా; అసృక్ = రక్తమును; ప్రస్రవణౌ = సెలయేఱులు; జలమివ = జలమునువలె; సుస్రవతుః = స్రవించిరి.

అట్లు కామరూపియు క్రూరుండును నగు నింద్రజిత్తుచేఁ గొట్టఁబడిన రామలక్ష్మణుల దేహంబులనుండి, సెలయేఱుల నుండి జలము గా ఉనట్లు, ఎఱ్ఱగా నెత్తురుగాఱినది. అని, తాత్పర్యము.

పపాత ప్రథమం రామో విద్ధో మర్మసు మార్గణైః
క్రోధా దింద్రజితా యేన పురా శక్రో వినిర్జితః. ౨౨

టీక॥ రామః = రాముఁడు; యేన = ఎవ్వనిచేత; పురా = మున్ను; శక్రః = ఇంద్రుఁడు; వినిర్జితః = జయింపఁబడినాఁడో; తేన (అధ్యాహృతము) = అట్టి; ఇంద్రజితా = ఇంద్రజిత్తుచేత; క్రోధాత్ = కోపమువలన; మార్గణైః = బాణములచేత; మర్మసు = జీవస్థానములయందు; విద్ధః = కొట్టఁబడినవాఁడై ; ప్రథమం = మొదట; రామః = రాముఁడు ; పపాత = పడెను.

మును దేవేంద్రునిం గూడ జయించినట్టి మహాపరాక్రమశాలియగు నింద్రజిత్తుచేఁ గోపంబున, బాణంబులచే జీవస్థానంబులందు విద్ధుండై, మొదట, రాముఁడు నేలంబడెను.

అని, తాత్పర్యము.

రుక్మపుంఖైః ప్రసన్నాగ్రై రజోగతిభి రాశుగైః
నారాచై రర్ధనారాచై ర్భల్లై రంజలికై రపి. ౨౩
వివ్యాధ వత్సదంతైశ్చ సింహదంష్ట్రై శ్చరై స్తథా

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ యింద్రజిత్తు; రుక్మపుంఖైః = బంగారుపింజలుగలవియు ; ప్రసన్నాగ్రైః = నిర్మలములయిన కొనలు గలవియు; రజోగతిభిః = దుమ్ముయొక్క గతివంటి గతిగలవియునగు; ఆశుగైః = బాణ




ములచేతను; నారాచైః = వంకరలేక గుండ్రములైన కొనలుగల బాణములచేతను; భల్లైః = గొడ్డలివంటికొనగలబాణములచేతను; అంజలికైరపి = చేమోడ్పువంటి యగ్రములుగల బాణములచేతను; వత్సదంతైశ్చ = వత్సదంతములనుబాణములచేతను; సింహదంష్ట్రైః = సింహములకోఱలవంటిబాణములచేతను; తథా = అట్లు; క్షురైః = అర్ధచంద్రాకారములగు బాణములచేతను; వివ్యాధ = నొప్పించెను.

ఆయింద్రజిత్తు, బంగారుపింజలు గలవియు స్వచ్ఛములగు కొనలుగలవియు వాయువేగోద్ధూతంబగు దుమ్ముకైవడిసాంద్రముగాఁ బఱతెంచునవియు నగు నారాచంబులును అర్ధనారాచంబులును భల్లంబులును అంజలికంబులును, వత్సదంతములును, సింహదంష్ట్రంబులును అర్ధచంద్రాకారబాణంబులును మొదలగు నానావిధబాణంబుల, రాముని నొప్పించెను.

అని, తాత్పర్యము.

స వీరశయనే శిశ్యే విజ్యమాదాయ కార్ముకమ్. ౨౪
భిన్నముష్టిపరీణాహం త్రిణతం రుక్మభూషితమ్

టీక॥ సః = ఆ రాముఁడు; భిన్నముష్టిపరీణాహం = భేదిల్లినపిడికిలివిస్తారముగలదియు; త్రిణతం = మూడిటవంగినదియు; రుక్మభూషితం = బంగారముచేనలంకరింపఁబడినదియు; విజ్యం = నారిలేనిదియునగు; కార్ముకం = ధనుస్సును; ఆదాయ = గ్రహించి; వీరశయనే = యుద్ధభూమియందు; శిశ్యే = పరుండెను.

ఆరాముండు, శిథిలముష్టిబంధంబును మధ్యంబునను బాహ్యంబులనువంగినదియుఁ గాంచనాలంకృతంబునగుధనువునవలంబించి, యుద్ధభూమింబరుండెను. అని, తాత్పర్యము.

బాణపాతాంతరే రామం పతితం పురుషర్షభమ్. ౨౫
స తత్ర లక్ష్మణో దృష్ట్వా నిరాశో జీవితేఽభవత్

టీక॥ తత్ర = అచ్చట; సః = ఆ; లక్ష్మణః = లక్ష్మణుఁడు; బాణపాతాంతరే = బాణశయ్యనడుమ; పతితం = పడిన; పురుషర్షభం = పురుషశ్రేష్ఠుండగు; రా




మం=రాముని; దృష్ట్వా=చూచి; జీవితే=బ్రతుకునందు; నిరాశః= ఆశలేనివాఁడు; అభవత్=అయ్యెను.

అంత, నయ్యుద్ధభూమియందు, బాణమయతల్పంబునం బరుండినపురుషోత్తముఁడగు రామునిఁజూచి, లక్ష్మణుఁడు బ్రతుకుపై నాసవిడిచెను.

అని, తాత్పర్యము.

రామం కమలపత్రాక్షం శరబంధపరిక్షతమ్. ౨౬
శుశోచ భ్రాతరం దృష్ట్వా పతితం ధరణీతలే

టీక॥సః(అధ్యాహృతము) = ఆలక్ష్మణుఁడు; శరబంధపరిక్షతం= బాణబంధముచేగాసిలినవాఁడును; ధరణీతలే=భూతలమునందు; పతితం= పడినవాఁడునగు; కమలపత్రాక్షం=తామరపూఱేకులవంటి కన్నులుగల; భ్రాతరం=అన్నయగు; రామం = రాముని; దృష్ట్వా=చూచి; శుశోచ=దుఃఖించెను.

లక్ష్మణుఁడు, అట్లు తనయన్నకమలపత్రాక్షుండగు రాముండు, బాణబంధంబునఁ జిక్కి, భూమింబడుటను జూచి, మిక్కిలియు దుఃఖము నొందెను.

అని, తాత్పర్యము.

హరయశ్చాపి తం దృష్ట్వా సంతాపం పరమం గతాః. ౨౭

టీక॥హరయశ్చాపి= వానరులును; తం=ఆరాముని; దృష్ట్వా=చూచి; పరమం= మిక్కిలియు నధికమయిన; సంతాపం=దుఃఖమును; గతాః= పొందినారు.

వానరులును, అట్లు రాముండు నేలంబడియుండుటను జూచి, పరమ దుఃఖితులయిరి. అని, తాత్పర్యము.

బద్ధౌతు వీరౌ పతితౌ శయానౌ
తౌ వానరాస్సంపరివార్య తస్థుః
సమాగతా వాయుసుతప్రముఖ్యా
విషాద మార్తాః పరమంచ జగ్ముః. ౨౮

టీక॥ వాయుసుతప్రముఖ్యాః= హనుమంతుఁడు మొదలుగాఁగల ; వానరాః=వానరులు; సమాగతాః=వచ్చినవారలయి; బద్ధౌతు= నాగపాశములచేఁగట్టఁబడినవారలును; పతితౌ=పడినవారలును; శయానౌ=పరుండియున్నవారలునగు; వీరౌ= పరాక్రమవంతులయిన; తౌ=ఆ రామలక్ష్మణులను ; సంపరివార్య=చుట్టుకొని; తస్థుః=నిలిచిరి. ఆర్తాః=పీడితులలయి; పరమం=మిక్కిలియునధికమైన ; విషాదం=దుఃఖమును; జగ్ముశ్చ=పొందిరియు.

హనుమంతుఁడు మొదలుగాఁగల యావానరులందఱుంజేరి, అట్లు నాగపాశబద్ధులయి నేలంబడిపరుండియున్న రామలక్ష్మణులం బరివేష్టించినిలుచుండి , యార్తులయి, మిక్కిలియుదుఃఖంబు నొందిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, పంచచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండపంచచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---



౭౭

షట్చత్వారింశస్సర్గ ప్రారంభః.

తతో ద్యాం పృథివీం చైవ వీక్షమాణా వనౌకసః
దదృశు స్సంతతౌ బాణై ర్భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧

టీక॥తతః=అంత; వనౌకసః=వానరులు; ద్యాం=ఆకాశమును; పృథివీం చైవ=భూమిని; వీక్షమాణాః=చూచుచు; బాణైః=బాణములచేత; సంతతౌ=వ్యాపింపబడిన; భ్రాతరౌ=అన్నదమ్ములగు; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను; దదృశుః=చూచిరి.

అంత, వానరులు, ఆకాశంబున భూమియందుఁజూచుచు, నట్లు, బాణంబులచేఁ గప్పఁబడి నేలం బడియుండియున్న రామలక్ష్మణులం గనిరి. అని, తాత్పర్యము.

వృష్ట్వేవోపరతే దేవే కృతకర్మణి రాక్షసే
ఆజగామాథ తం దేశం ససుగ్రీవో విభీషణః. ౨

టీక॥వృష్ట్వా=వర్షించి; దేవఇవ=మేఘమువలె; కృతకర్మణి=చేయఁబడిన కర్మముగల; రాక్షసే=ఇంద్రజిత్తు; ఉపరతే=విరమింపఁగా; అథ=అంత; ససుగ్రీవః=సుగ్రీవునితోఁగూడిన; విభీషణః=విభీషణుఁడు; తం=ఆ; దేశం=ప్రదేశమును; ఆజగామ=వచ్చెను.

వర్షించి నిలుచు మేఘంబుకైవడి, నాయింద్రజిత్తు కార్యంబు గావించి, యుపరమించిన వెనుక, రాముండున్న స్థలంబునకు విభీషణుండు, సుగ్రీవునితోఁ గూడవచ్చెను. అని, తాత్పర్యము.

నీలద్వివిద మైందాశ్చ సుషేణకుముదాంగదాః
తూర్ణం హనుమతా సార్థ మన్వశోచంత రాఘవౌ. ౩

టీక॥నీలద్వివిదమైందాశ్చ=నీలుండును ద్వివిదుండును మైందుండును; సుషేణకుముదాంగదాః=సుషేణుండును కుముదుండును అంగదుండును; హనుమతా

సార్ధం=హనుమంతునితోఁగూడ; తూర్ణం=శీఘ్రముగా; రాఘవౌ=రామలక్ష్మణులనుగూర్చి; అన్వశోచంత=దుఃఖించిరి.

హనుమంతుండును నీలుండును ద్వివిదుండును మైందుండును సుషేణుండును గుముదుండును నంగదుండును రామలక్ష్మణులంజూచి, మిక్కిలియు దుఃఖించిరి. అని, తాత్పర్యము.

అచేష్టౌ మందనిశ్శ్వాసౌ శోణితౌఘపరిప్లుతౌ
శరజాలాచితౌ స్తబ్ధౌ శయానౌ శరతల్పయోః. ౪
నిశ్శ్వసంతౌ యథా సర్పౌ నిశ్చేష్టౌ మందవిక్రమౌ
రుధిరస్రావదిగ్ధాంగౌ తాపనీయా వివ ధ్వజౌ. ౫

టీక॥ తౌ (అధ్యాహృతము)= ఆ రామలక్ష్మణులు; అచేష్టౌ = చేష్టలు లేనివారలయి ; మందనిశ్శ్వాసౌ = కొంచెమునిట్టూర్పులు గలవారలయి; శోణితౌఘపరిప్లుతౌ = నెత్తురువెల్లువచేఁదడుపఁబడినవారలయి; శరజాలాచితౌ = బాణసమూహముచేవ్యాపింపఁబడినవారలయి; స్తబ్ధౌ =నిశ్చలులయి; శరతల్పయోః = బాణములపాన్పులందు; శయానౌ = పరుండినవారలయి; సర్పౌయథా = సర్పములవలె; నిశ్శ్వసంతౌ = నిట్టూర్పులువుచ్చుచున్నవారలయి; నిశ్చేష్టౌ = చేష్టలులేనివారలయి ; మందవిక్రమౌ= స్వల్పమయిన పరాక్రమముగల వారలయి; రుధిరస్రావదిగ్ధాంగౌ = నెత్తురు కాఱుటచేఁ బూయఁబడిన దేహముగలవారలయి; తాపనీయౌ = బంగారువికారములయిన ; ధ్వజావివ= టెక్కెములువలె, ఆస్తాం (అధ్యాహృతము)=ఉండిరి.

ఆ రామలక్ష్మణులు, నిశ్చేష్టులయి, కొంతసేపు మెల్లఁగానిట్టూర్పులు వుచ్చుచు, నెత్తురుచేఁదడుపఁబడి , బాణసమూహావృతదేహులయి , నిశ్చలులయి బాణతల్పంబులంబరుండి , కొంతసేపు సర్పములుంబోలె వేఁడినిట్టూర్పులువుచ్చుచుఁ, బరాక్రమ హీనులయి , బంగారుధ్వజంబుల కైవడిఁ, జూపట్టు చుండిరి.

అని, తాత్పర్యము.

స ౪౬

తౌ వీరశయనే వీరౌ శయానౌ మందచేష్టితౌ
యూథపైస్తైః పరివృతౌ బాష్పవ్యాకులలోచనైః. ౬
రాఘవౌ పతితౌ దృష్ట్వా శరజాలసమావృతౌ
బభూవు ర్వ్యథితా స్సర్వే వానరా స్సవిభీషణాః. ౭

టీక॥ వీరశయనే = యుద్ధభూమియందు; శయానౌ = పరుండియున్నవారలును; వీరౌ = పరాక్రమవంతులును; మందచేష్టితౌ = స్వల్పములగు చేష్టలుగలవారలును; బాష్పవ్యాకులలోచనైః = కన్నీళ్లచే నిండిన కన్నులుగల; తైః = ఆ; యూథపైః = వానరయూథనాయకులచేత; పరివృతౌ = చుట్టఁబడినవారలును; పతితౌ = పడినవారలును; శరజాలసమావృతౌ = బాణసమూహముచేఁజుట్టఁబడినవారలునగు; తౌ = ఆ; రాఘవౌ = రామలక్ష్మణులను; దృష్ట్వా = చూచి; సవిభీషణాః = విభీషణునితోఁగూడిన; వానరాః = వానరులు; సర్వే = అందఱును; వ్యథితాః = దుఃఖితులు; బభూవుః = అయిరి.

యుద్ధభూమియందు శయనించియున్నవారలును పరాక్రమశాలులును స్వల్పముగాఁగాళ్లుఁజేతులాడించువారలును, గన్నులనిండఁగన్నీళ్లతో నున్న వానరయూథపులచేఁబరివేష్టితులును బాణసమూహముచేఁగప్పఁబడియున్నవారలునగు రామలక్ష్మణులంజూచి, విభీషణుండును వానరులునందఱును దుఃఖితులైరి. అని, తాత్పర్యము.

అంతరిక్షం నిరీక్షంతో దిశ స్సర్వాశ్చ వానరాః
నచైనం మాయయా చ్ఛన్నం దదృశూ రావణిం రణే. ౮

టీక॥ రణే = యుద్ధమునందు; వానరాః = వానరులు; అంతరిక్షం = ఆకాశమును; సర్వాః = సమస్తములయిన; దిశః = దిక్కులను; నిరీక్షంతః = చూచుచు; మాయయా = మాయచేత; ఛన్నం = కప్పఁబడిన; ఏనం = ఈ; రావణిం = ఇంద్రజిత్తును; నదదృశుశ్చ = చూడనేలేము.

యుద్ధంబున, నావానరులు, ఆకాశంబును సమస్తదిక్కులను వెదకినను, మాయా సహితుండగు నింద్ర జిత్తుం జూడఁజాలరైరి. అని, తాత్పర్యము.

తం తు మాయాప్రతిచ్ఛన్నం మాయయైవ విభీషణః
వీక్షమాణో దదర్శాథ భ్రాతుః పుత్ర మవస్థితమ్. ౯

టీ॥ అథ=అంతట; విభీషణః=విభీషణుఁడు; మాయయైవ=మాయచేతనే; వీక్షమాణః=చూచుచు; మాయాప్రతిచ్ఛన్నం=మాయచేతఁగప్పఁబడినవాఁడును; అవస్థితం = ఉన్నవాఁడునగు; భ్రాతుః=అన్నయొక్క; పుత్రం= కొడుకైన; తంతు=అయింద్రజిత్తును; దదర్శ=చూచెను.

అంత, విభీషణుండు, మాయాతిరోహితులం గనుంగొనునట్టిమాయను వలంబించిచూచి, మాయాచ్ఛాదితుండగునయ్యింద్రజిత్తుం జూచెను.

అని, తాత్పర్యము.

త మప్రతిమకర్మాణ మప్రతిద్వంద్వ మాహవే
దదర్శాంతర్హితం వీరం వరదానా ద్విభీషణః. ౧౦
తేజసా యశసా చైవ విక్రమేణచ సంయుతమ్

టీ॥ విభీషణః=విభీషణుఁడు; అప్రతిమకర్మాణం= సరిలేనికార్యములుగలవాఁడును; ఆహవే=యుద్ధమునందు; వరదానాత్=వరదానమువలన; అంతర్హితం=మఱుఁగుపడినవాఁడును; వీరం=పరాక్రమశాలియు; తేజసా= తేజస్సుతోను; యశసా చైవ=కీర్తితోను; విక్రమేణచ=పరాక్రమముతోను; సంయుతం=కూడినవాఁడునగు; తం = ఆయింద్రజిత్తును; దదర్శ=చూచెను.

విభీషణుఁడు, అప్రతిమకర్ముఁడును యుద్ధంబున నెదురులేనివాఁడును వరదానమహిమవలన నంతర్హితుండును బరాక్రమవంతుండును దేజంబుతోను గీర్తితోను బరాక్రమంబుతోనుంగూడినవాఁడునగునాయింద్రజిత్తుం జూచెను.

అని, తాత్పర్యము.

ఇంద్రజి త్త్వాత్మనః కర్మ తౌ శయానౌ సమీక్ష్య చ. ౧౧
ఉవాచ పరమప్రీతో హర్షయన్ సర్వనైరృతాన్

టీక॥ ఇంద్రజిత్తు = ఇంద్రజిత్తును; ఆత్మనః = తనయొక్క ; కర్మ = కార్యమును; శయానౌ = పరుండియున్న; తౌ చ = ఆ రామలక్ష్మణులను ; సమీక్ష్యచ = చూచియు; పరమప్రీతః = మిక్కిలియు సంతుష్టుండై ; సర్వాన్నైర్‌ఋతాన్ = సమస్తరాక్షసులను ; హర్షయన్ = సంతోషింపఁజేయుచు ; ఉవాచ = చెప్పెను.

ఇంద్రజిత్తు, తనప్రభావంబుననా రామలక్ష్మణులట్లు, పరుండియుండుటం జూచి, పరమసంతుష్టుండై , సమస్తరాక్షసుల సంతోషింపఁజేయుచు , నిట్లని , చెప్పెను.

అని, తాత్పర్యము.

దూషణస్యచ హంతారౌ ఖరస్యచ మహాబలౌ. ౧౨
సాదితౌ మామకైర్బాణైః భ్రాతరౌ రామలక్ష్మణౌ

టీక॥ దూషణస్యచ = దూషణునియొక్కయు; ఖరస్యచ = ఖరునియొక్కయు; హంతారౌ = చంపినవారలును; మహాబలౌ = అధికమయినబలముగలవారలునగు; భ్రాతరౌ = అన్నదమ్ములయిన; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు; మామకైః = నాదైన ; బాణైః = బాణములచేత; సాదితౌ = నాశంబునొందింపఁబడినారు.

దూషణుని ఖరుని వధించిన వారలును మహాబలశాలులునగు రామలక్ష్మణులు, నా బాణంబుల నాశంబునొందినారు; చూడుఁడు. అని, తాత్పర్యము.

నేమౌ మోక్షయితుం శక్యౌ ఏతస్మాదిషుబంధనాత్. ౧౩
సర్వైరపి సమాగమ్య సర్షిసంఘైస్సురాసురైః

టీక ॥ సర్షిసంఘైః = ఋషిసమూహములతోఁ గూడిన ; సురాసురైః = సురాసురులచేత ; సర్వైరపి = అందఱిచేతను; సమాగమ్య = వచ్చి; ఇమౌ = ఈ రామలక్ష్మణులు; ఏతస్మాత్ = ఈ; ఇషుబంధనాత్ = బాణబంధమునుండి; మోక్షయితుం = విడిపించుటకు; నశక్యౌ = అలవియయినవారల్లు కారు.

ఋషులును దేవతలును నసురులునంద

ము నొకకోటిగా వచ్చినను, ఈ రామలక్ష్మణులను, నాగపాశబంధమునను డివిడిపింపనలవిగాదు.

అని, తాత్పర్యము.

యత్కృతే చింతయానస్య శోకార్తస్య పితు ర్మమ. ౧౪
అస్పృష్ట్వా శయనం గాత్రై స్త్రియామా యాతి శర్వరీ

టీక॥ యత్కృతే = ఎవ్వనినిమిత్తమయి; చింతయానస్య = ఆలోచించుచున్నట్టి; శోకార్తస్య = దుఃఖపీడితుండగు; మమ = నాయొక్క; పితుః = తండ్రికి; గాత్రైః = అవయవములచేత; శయనం = పాన్పును; అస్పృష్ట్వా = తాఁకక; త్రియామా = మూఁడుజాములుగల; శర్వరీ = రాత్రి; యాతి = కడచుచున్నదో.

ఏ రామునినిమిత్తమయి నాతండ్రి రావణుండు, చింతించుచు, దుఃఖపీడితుండై, ప్రతిరాత్రియందును, నిత్యకృత్యంబుల నొకజాముగడచిపోఁగాఁ, దక్కిన మూఁడుజాముల నొకప్పుడును శయనంబు దాఁకకయె, చింతాక్రాంతుండై ప్రొద్దుగడపునో.

అని, తాత్పర్యము.

కృత్స్నేయం యత్కృతే లంకా నదీ వర్షా స్వివాకులా. ౧౫
సోయం మూలహరో నర్థ స్సర్వేషాం నిహతో మయా

టీక॥ యత్కృతే = ఎవ్వనినిమిత్తమయి; కృత్స్నా = సమస్తమయిన; ఇయం = ఈ; లంకా = లంకాపురి; వర్షాసు = వర్షర్తువునందు; నదీవ = నదివలె; ఆకులా = కలఁగినదో, దుఃఖితమయ్యెనో; సః = అట్టి; అయం = ఈ; సర్వేషాం = అందఱియొక్కయు; మూలహరః = మూలమును హరించునట్టి; అనర్థః = అనర్థకరుండగు రాముండు; మయా = నాచేత; నిహతః = వధింపఁబడినాఁడు.

మఱియు నెవ్వనినిమిత్తమయి, యీ లంకాపురి యందలి జనంబులన్నియు, వర్షర్తువునందు నదీజలంబులుంబోలె నాకులంబులయ్యెనో, అట్టి మనకం దఱకును మూలతో నాశంబు గలిగించు

ననర్థమునకుఁ గారణంబగురాముని, నేనిప్పుడు వధించినాను.

అని, తాత్పర్యము.

రామస్య లక్ష్మణస్యాపి సర్వేషాంచ వనౌకసామ్. ౧౬
విక్రమా నిష్ఫలా స్సర్వే యథా శరది తోయదాః

టీక॥ రామస్య = రామునియొక్కయు; లక్ష్మణస్యాపి = లక్ష్మణునియొక్కయు; వనౌకసాం= వానరులయొక్క; సర్వేషాంచ = అందఱియొక్కయు; విక్రమాః=పరాక్రమములు; సర్వే=అన్నియు; శరది=శరదృతువునందు; తోయదాయథా= మేఘములువలె; నిష్ఫలాః=వ్యర్థములు.

ఇప్పుడు, రాముని, పరాక్రమంబును లక్ష్మణునివిక్రమంబునుసమస్తవానరుల వీర్యంబులునుశరత్కాలంబున మేఘంబులుంబోలెవ్యర్థములయినవి. అనియింద్రజిత్తురాక్షసులతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు తాన్ సర్వాన్ రాక్షసాన్ పరిపార్శ్వతః. ౧౭
యూథపానపి తాన్ సర్వాం స్తాడయామాస రావణిః

టీక॥ రావణిః= రావణునికొడుకైనయింద్రజిత్తు; పరిపార్శ్వతః=సమీపంబున ; స్థితాన్ (అధ్యాహృతము) = ఉన్నట్టి; తాన్=ఆ; రాక్షసాన్= రాక్షసులను; సర్వాన్=అందఱనుగూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వాతు = చెప్పినంతనె; తాన్=ఆ; యూథపాన్= వానరయూథపులను; సర్వాన్= అందఱను; తాడయామాస=కొట్టెను.

ఇంద్రజిత్తు, ఇట్లుతనసమీపంబుననున్న రాక్షసులతోఁజెప్పి , యంతనావానరయూథపులనందఱనొప్పించెను.

అని, తాత్పర్యము.

నీలం నవభి రాహత్య మైందంచ ద్వివిదం తథా. ౧౮
త్రిభి స్త్రిభి రమిత్రఘ్న స్తతాప ప్రవరేషుభిః

టీక॥ అమిత్రఘ్నః= శత్రువులంజంపునట్టియుంద్రజిత్తు; నీలం=నీలుని; నవభిః=తొమ్మిదింటిచేత; ఆహత్య= కొట్టి; తథా=అట్లు; మైందంచ=మైందుని; ద్వివిదంచ=ద్వివిదుని; త్రిభిస్త్రిభిః= మూఁడుమూఁడు; ప్రవరేషుభిః=ఉత్తమబాణములచేత; తతాప= తపింపఁజేసెను.

శత్రుసంహారకుఁడయగునింద్రజిత్తు, నీలునిదొమ్మిదిబాణంబులనొప్పించి, మైందద్వివిదులవేర్వేఱమూఁడుమూఁడుకలకుబాణంబులనొప్పించెను.

అని, తాత్పర్యము.

జాంబవంతం మహేష్వాసో విధ్వా బాణేన వక్షసి. ౧౯
హనూమతో వేగవతో విససర్జ శరాన్ దశ

టీక॥ మహేష్వాసః=పెద్దవిల్లుగలయింద్రజిత్తు; జాంబవంతం = జాంబవంతుని; బాణేన=ఒకబాణముచేత ; వక్షసి=ఱొమ్మునందు; విధ్వా= కొట్టి; వేగవతః=అధికమయినవేగముగల; హనూమతః=హనుమంతునకు; దశ=పది ; శరాన్=బాణములను ; విససర్జ=విడిచెను.

మహాధనుర్ధరుండగు నింద్రజిత్తు, జాంబవంతుని నొకట బాణంబున నేసి, వేగవంతుండగు హనుమంతునిపైఁబదిబాణంబులఁ బ్రయోగించెను.

అని, తాత్పర్యము.

గవాక్షం శరభం చైవ ద్వావప్యమితతేజసౌ. ౨౦
ద్వాభ్యాం ద్వాభ్యాం మహావేగో వివ్యాధ యుధి రావణిః

టీక॥యుధి=యుద్ధంబునందు ; మహావేగః=అధికమయినవేగముగల; రావణిః=ఇంద్రజిత్తు;అమితతేజసౌ= కొలఁదిలేనిపరాక్రమముగల; గవాక్షంచైవ=గవాక్షుని;శరభంచైవ= శరభుని; ద్వావపి=ఇద్దఱను ; ద్వాభ్యాం ద్వాభ్యాం=రెండురెండు ; శరాభ్యాం=బాణములచేత;వివ్యాధ=కొట్టెను.

యుద్ధంబున , మహావేగుండగు నింద్రజిత్తు,అమితపరాక్రమశాలులగు గవాక్షశరభులనిద్దఱను, రెండేసిబాణంబులనొప్పించెను. అని,తాత్పర్యము.

గోలాంగూలేశ్వరం చైవ వాలిపుత్ర మథాంగదమ్. ౨౧
వివ్యాధ బహుభి ర్బాణై స్త్వరమాణో ఽథ రావణిః

టీక॥ అథ = అంతట; రావణిః = ఇంద్రజిత్తు; త్వరమాణః = వేగిరపడుచు; గోలాంగూలేశ్వరం చైవ = కొండముచ్చులకు ప్రభుఁడైనగవాక్షుని; అథ = అంతట; వాలిపుత్రం = వాలికొడుకయిన; అంగదం = అంగదుని; బహుభిః = పెక్కులయిన; బాణైః = బాణములచేత; వివ్యాధ = కొట్టెను.

అంత, ఇంద్రజిత్తు, వేగంబున, మఱియు గోలాంగూలేశ్వరుండగు గవాక్షుని వాలిపుత్రుండగు నంగదునిఁ, బెక్కుబాణంబుల నొప్పించెను.

అని, తాత్పర్యము.

తాన్ వానరవరాన్ భిత్త్వా శరై రగ్నిశిఖోపమైః. ౨౨
ననాద బలవాం స్తత్ర మహాసత్త్వ స్స రావణిః

టీక॥ మహాసత్త్వః = అధికమయిన పరాక్రమముగల వాఁడును; బలవాన్ = అధికమయినబలముగలవాఁడునగు; సః = ఆ; రావణిః = ఇంద్రజిత్తు; తత్ర = ఆయుద్ధమునందు; తాన్ = ఆ; వానరాన్ = వానరశ్రేష్ఠులను, అగ్నిశిఖోపమైః = అగ్నిజ్వాలలతోఁబోలికగల; శరైః = బాణములచేత; భిత్త్వా = భేదించి; ననాద = అఱచెను.

మహాపరాక్రమశాలియు మహాబలుండునగు నాయింద్రజిత్తు, ఆట్లాయుద్ధంబున, నవ్వానరవీరుల నెల్ల, నగ్నిజ్వాలలవంటికఱకుబాణంబుల నొప్పించి, సింహనాదంబు గావించెను.

అని, తాత్పర్యము.

తా నర్దయిత్వా బాణౌఘై స్త్రాసయిత్వా చ వానరాన్. ౨౩
ప్రజహాస మహాబాహు ర్వచనం చేద మబ్రవీత్

టీక॥ మహాబాహుః = పెద్దచేతులుగలయింద్రజిత్తు; తాన్ = ఆ; వానరాన్ = వానరులను; బాణౌఘైః = బాణసమూహములచేత; అర్దయి

త్వా= పీడించి ; త్రాసయిత్వాచ= భయపఱిచియు; ప్రజహాస = నవ్వెను.ఇదం=ఈ;వచనంచ = మాటను; అబ్రవీత్ =చెప్పెను.

మహాబాహుండగునింద్రజిత్తు , అట్లు వానరవీరుల బాణంబులనొప్పించి యందఱును భయపడునట్లు గావించి, సంతోషాతిశయంబునం బకపక నవ్వుచుఁదోడిరాక్షసులంజూచి, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

శరబంధేన ఘోరేణ మయా బద్ధే చమూముఖే. ౨౪
సహితౌ భ్రాతరౌ నిశామయత రాక్షసాః

టీక॥రాక్షసాః = రాక్షసులారా! చమూముఖే= సేనాముఖమునందు ; మయా=నాచేత; ఘోరేణ=భయంకరమయిన;శరబంధేన= బాణబంధముచేత;బద్ధౌ=కట్టఁబడిన;సహితౌ= కూడిన;ఏతౌ=ఈ;భ్రాతరౌ=అన్నదమ్ములగు రామలక్ష్మణులను ; నిశామయత= చూడుఁడు.

రాక్షసులారా! సైనికులందఱుఁజూచుచుండ,భయంకరంబగు బాణపాశంబుననాచేబంధింపఁబడియీ రామలక్ష్మణులు నేలంబడియున్నారుచూడుఁడు. అని,యింద్రజిత్తురాక్షసులతోఁ జెప్పెను.అని, తాత్పర్యము.

ఏవ ముక్తాస్తు తే సర్వే రాక్షసాః కూటయోధినః. ౨౫
పరం విస్మయ మాజగ్ముః కర్మణా తేన హర్షితాః

టీక॥కూటయోధినః= కపటముచేతఁబోరునట్టి; తే=ఆ; రాక్షసాః= రాక్షసులు;సర్వే= అందఱును;ఏవం= ఇట్లు;ఉక్తాస్తు=చెప్పఁబడినవారలయినంతనె; తేన=ఆ;కర్మణా= కార్యముచేత;హర్షితాః=సంతోషింపఁజేయఁబడినవారలయి;పరం= అధికమయిన; విస్మయం=ఆశ్చర్యమును ; ఆజగ్ముః= పొందిరి.

కపటయోధులగు నారాక్షసులందఱును,ఇంద్రజిత్తుమాటనువిని, యింద్రజిత్తు గావించినకార్యమునకుఁబరమసంతుష్టులయి, మిక్కిలియు నాశ్చర్యంబునొందిరి. అని, తాత్పర్యము.

వినేదుశ్చ మహానాదాన్ సర్వతో జలదోపమాః. ౨౬
హతో రామ ఇతి జ్ఞాత్వా రావణిం సమపూజయన్

టీక॥ జలదోపమాః = మేఘముల తోఁబోలిక-గలరాక్షసులు; రామః = రాముఁడు; హతః= వధింపఁబడినాఁడు. ఇతి=అని; జ్ఞాత్వా = తెలిసికొని; సర్వతః = అంతటను; మహానాదాన్= పెద్దధ్వనులను; వినేదుశ్చ= అఱచిరియు; చేసిరనుట. రావణిం=ఇంద్రజిత్తును; సమపూజయన్= పూజించిరి.

మేఘాకారులగు నా రాక్షసులు, రాముండు హతుండయ్యెనని తలంచుకొని, యంతటను మహాధ్వనిగలుగునట్లు సింహనాదంబులు సేయుచు, నింద్రజిత్తుం బూజించిరి. అని, తాత్పర్యము.

నిష్పందౌ తు తదా దృష్ట్వా తౌ వుభౌ రామలక్ష్మణౌ. ౨౭
వసుధాయాం నిరుచ్ఛ్వాసౌ హతా వి త్యన్వమన్యత

టీక॥ తదా=అప్పుడు; సః (అధ్యాహృతము)= ఆయింద్రజిత్తు; వసుధాయాం=భూమియందు; నిష్పందౌ= నిశ్చలులును; నిరుచ్ఛ్వాసౌ= నిట్టూర్పులు లేనివారలునగు; తౌ=ఆ ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను; ఉభౌ = ఇద్దఱను; దృష్ట్వా=చూచి ; హతావితి=వధింపఁబడినారని; అన్వమన్యత= తలంచుకొనెను.

అప్పుడా యింద్రజిత్తు, నిశ్చలులయి నిట్టూర్పులు విడువక, భూమిం బడియున్న రామలక్ష్మణుల నిద్దఱం జూచి, మృతిఁబొందిరని తలంచుకొనెను. అని, తాత్పర్యము.

హర్షేణ తు సమావిష్ట ఇంద్రజి త్సమితింజయః. ౨౮
ప్రవివేశ పురీం లంకాం హర్షయన్ సర్వ రాక్షసాన్

టీక॥ సమితింజయః = యుద్ధంబునందు జయించునట్టి; ఇంద్రజిత్తు= ఇంద్రజిత్తును; హర్షేణ= సంతోషము చేత; సమావిష్టః= ఆవేశింపఁబడినవాఁడై; సర్వరాక్షసాన్=సమస్తరాక్షసులను; హర్షయన్= సంతోషింపఁజే

యుడు; లంకాం=లంకయను; పురీం=పట్టమును; ప్రవివేశ=ప్రవేశించెను.

యుద్ధంబునబలశాలియగు నింద్రజిత్తును, పరమసంతోషంబునొంది, రాఘవులకందఱకును సంతోషంబు గలిగించుచు, లంకాపురింబ్రవేశించెను. అని, తాత్పర్యము.

రామ లక్ష్మణయో ర్దృష్ట్వా శరీరే సాయకై శ్చితే. ౨౯
సర్వాణి చాంగోపాంగాని సుగ్రీవం భయ మావిశత్

టీక॥ రామలక్ష్మణయోః=రామలక్ష్మణులయొక్క; సాయకైః=బాణములచేత; చితే=వ్యాపింపఁబడిన; శరీరే=దేహములను; సాయకైఃచితాని (అధ్యాహృతము)=బాణములచే వ్యాపింపఁబడిన; సర్వాణి=సమస్తములయిన; అంగోపాంగానిచ=అంగములను ఉపాంగంబులను; దృష్ట్వా=చూచి; సుగ్రీవం=సుగ్రీవుని; భయం=భయము; ఆవిశత్=పొందెను.

రామలక్ష్మణుల దేహములు ఆపాదమస్తకమును, బాణమయములుగా నుండుటంజూచి, సుగ్రీవుండు భయము నొందెను. అని, తాత్పర్యము.

త మువాచ పరిత్రస్తం వానరేంద్రం విభీషణః. ౩౦
సబాష్పవదనం దీనం శోకవ్యాకులలోచనమ్

టీక॥ విభీషణః=విభీషణుఁడు; పరిత్రస్తం=భయమునొందినవాఁడును; సబాష్పవదనం=కన్నీళ్లతోఁగూడిన మొగముగలవాఁడును; దీనం=గర్వంబుడిగినవాఁడును; శోకవ్యాకులలోచనం=దుఃఖముచేఁగలంగినకన్నులుగలవాఁడునగు; తం=ఆ; వానరేంద్రం=వానరనాథుండగు సుగ్రీవునిగూర్చి; ఉవాచ=చెప్పెను.

భీతుండై దుఃఖితుండై కన్నులనీళ్లుగాఱ వెలవెలంబోవుచున్న వానరరాజుండగు సుగ్రీవుంజూచి, విభీషణుం, డిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అలం త్రాసేన సుగ్రీవ బాష్పవేగో నిగృహ్యతామ్. ౩౧

ఏవంప్రాయాణి యుద్ధాని విజయో నాస్తి నైష్ఠికః

టీక॥ సుగ్రీవ=సుగ్రీవుఁడా! త్రాసేన=భయముచేత; అలం = చాలును. బాష్పవేగః = కన్నీళ్లవేగము; నిగృహ్యతాం=నిలుపఁబడుఁగాక. యుద్ధాని=యుద్ధములు; ఏవంప్రాయాణి= ఇట్టివి. నైష్ఠికః = నియతమయిన; విజయః=గెల్పు; నాస్తి=లేదు.

సుగ్రీవుఁడా! భయంబువదలుము; కన్నీళ్లువిడువకుము; యుద్ధంబులన్నియు నిట్టివె; సర్వకాలంబులందునుజయమే కలుగదు. అని, తాత్పర్యము.

సశేషభాగ్యతాస్మాకం యది వీర భవిష్యతి. ౩౨
మోహమేతౌ ప్రహాస్యేతే మహాత్మానౌ మహాబలౌ

టీక॥ వీర=పరాక్రమశాలివగు సుగ్రీవుఁడా! అస్మాకం= మనకు; సశేషభాగ్యతా = మిగతతోఁగూడినభాగ్యముగలుగుట; భవిష్యతియది=కలదేని; మహాత్మానౌ=అధికమయినప్రభావముగలవారలును; మహాబలౌ = అధికమయినబలముగలవారలునగు; ఏతౌ=ఈ రామలక్ష్మణులు; మోహం= మూర్ఛను; ప్రహాస్యేతే=విడువఁగలరు.

వీరుండవగుసుగ్రీవుఁడా! మనకు భాగ్యశేషంబుగలదేని, మహాత్ములునుమహాబలశాలులునగునీరామలక్ష్మణులు, మూర్ఛదేఱఁగలరు.

అని, తాత్పర్యము.

పర్యవస్థాపయాత్మాన మనాథం మాంచ వానర. ౩౩
సత్యధర్మాభియుక్తానాం నాస్తి మృత్యుకృతం భయమ్

టీక॥ వానర= సుగ్రీవుఁడా! ఆత్మానం=నిన్నును; అనాథం= నాథుండులేని; మాంచ = నన్నును; పర్యవస్థాపయ= నిశ్చలునిగాఁజేసికొనుము. సత్యధర్మాభియుక్తానాం= సత్యముతోను ధర్మముతోనుంగూడినవారలకు; మృత్యుకృతం=మృత్యువుచేఁజేయఁబడిన; భయం=భయము; నాస్తి=లేదు.

సుగ్రీవుఁడా! నీవుధైర్యంబువహించి, నాకునుధైర్యంబుగలిగింపుము; స

త్యంబును ధర్మమార్గంబును నవలంబించియు న్ననుమహాత్ములకు మృత్యుభయంబుగలుగదు. అని; విభీషణుండు సుగ్రీవునకుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా తత స్తస్య జలక్లిన్నేన పాణినా. ౩౪
సుగ్రీవస్య శుభే నేత్రే ప్రమమార్జ విభీషణః

టీక॥ విభీషణః= విభీషణుఁడు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; తతః=అంత; జలక్లిన్నేన=నీటిచేఁ దడుపఁబడిన; పాణినా=హస్తముచేత; తస్య=ఆ; సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క; శుభే=మంగళకరములగు; నేత్రే=కన్నులను; ప్రమమార్జ=తుడిచెను.

విభీషణుండిట్లు సుగ్రీవునకుఁ జెప్పి, యంతఁ జేత నీళ్లు దీసికొని, యాసుగ్రీవుని కన్నులందుడిచెను. అని, తాత్పర్యము.

తత స్సలిల మాదాయ విద్యయా పరిజప్య చ. ౩౫
సుగ్రీవ నేత్రే ధర్మాత్మా స మమార్జ విభీషణః

టీక॥ తతః=అంత; సః=ఆ; ధర్మాత్మా=ధర్మస్వభావుఁడగు; విభీషణః=విభీషణుఁడు; సలిలం=జలమును; ఆదాయ=గ్రహించి; విద్యయా=మంత్రముచేత; పరిజప్య చ=జపించినదియు; సుగ్రీవ నేత్రే= సుగ్రీవునికన్నులను ; మమార్జ=తుడిచెను.

అంత ధర్మాత్ముండగు విభీషణుండు, సలిలజలంబు దీసికొని , మాయామోహనివారకంబగు విద్యచేసభిమంత్రించి, దానిచే సుగ్రీవునికన్నులందుడిచెను.

అని, తాత్పర్యము.

ప్రమృజ్య వదనం తస్య కపిరాజస్య ధీమతః. ౩౬
అబ్రవీ త్కాలసంప్రాప్త మసంభ్రమ మిదం వచః

టీక॥ సః(అధ్యాహృతము)= ఆవిభీషణుఁడు; ధీమతః=అధికమయిన బుద్ధిగల; తస్య=ఆ; కపిరాజస్య=వానరేశ్వరుండగు సుగ్రీవునియొక్క; వదనం=ముఖమును; ప్రమృజ్య=తుడిచి; కాలసంప్రాప్తం=కాలముచేతఁ బొందఁబడిన; ఇదం=ఈ; వచః=మాటను ; అసంభ్రమం= తొట్రుపాటులేనట్లుగా; అబ్ర

పీత్=చెప్పెను.

ఆవిభీషణుఁడు, ఇట్లు బుద్ధిమంతుండగు వానరరాజుఁడైన సుగ్రీవుని ముఖంబు నుదుడిచి, యకాలంబున కుఁదగినట్లు గాఁ, దొట్రుపడక, దృఢంబులగు వాక్యంబులనిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

న కాలః కపిరాజేంద్ర వైక్లబ్య మనువర్తితుమ్. ౩౭
అతిస్నేహోప్యకాలేస్మిన్ మరణాయోపకల్పతే

టీక॥కపిరాజేంద్ర=వానరరాజశ్రేష్ఠుఁడా! వైక్లబ్యం=అధైర్యమును; అనువర్తితుం=అనుసరించుటకు; అయం (అధ్యాహృతము)=ఇది; కాలః= కాలము; న=కాదు. అస్మిన్=ఈ;అకాలే=అసమయమునందు; అతిస్నేహాపి=అధికస్నేహమును; మరణాయ = చావుకొఱకు; ఉపకల్పతే = అగుచున్నది.

వానరరాజుండవగు సుగ్రీవుఁడా! అధైర్యపడుటకిది కాలము కాదు; ఇట్టికాలంబులనధిక స్నేహంబును నుంచుకొనరాదు ; అదిగూడ మరణమునకు కారణమగును. అని, తాత్పర్యము.

తస్మాదుత్సృజ్య వైక్లబ్యం సర్వకార్యవినాశనమ్. ౩౮
హితం రామపురోగాణాం సైన్యానా మనుచింత్యతామ్

టీక॥తస్మాత్=అందువలన; సర్వకార్యవినాశనం = సమస్తకార్యముల నశింపఁజేయునట్టి; వైక్లబ్యం=అధైర్యమును; ఉత్సృజ్య=విడిచి; రామపురోగాణాం = రాముఁడుముందు నడచువాఁడుగాఁగల; సైన్యానాం= సైన్యములయొక్క;హితం=మేలు; అనుచింత్యతాం=ఆలోచింపఁబడుఁగాక.

అందువలన సమస్తకార్యములను జెఱచునట్టి, యధైర్యంబును విడిచి, రాముని వెంబడివచ్చిన వానర సైన్యంబులకు మేలుగలుగునాలోచనంజేయుము.

అని, తాత్పర్యము.

అథవా రక్ష్యతాం రామో యావత్సంజ్ఞావిపర్యయః. ౩౯

లబ్ధసంజ్ఞౌహి కాకుత్స్థౌ భయం నో వ్యపనేష్యతః

టీక॥అథవా=అటుగాదేని ; రామః=రాముఁడు;యావత్=ఎంతవఱకు; సంజ్ఞావిపర్యయః=తెలివిలేమియో;తావత్(అధ్యాహృతము)=అంతవఱకు ; రక్ష్యతాం= రక్షింపఁబడుఁగాక. కాకుత్స్థౌ=రామలక్ష్మణులు; లబ్ధసంజ్ఞౌ=పొందఁబడిన తెలివిగలవారలయి;నః = మనయొక్క; భయం= భయమును ; వ్యపనేష్యతః=పోఁగొట్టఁగలరు.

అటుగాదేని, రాముండు మూర్ఛదేఱువఱకు, నతనిరక్షింపుఁడు; రామలక్ష్మణులు, మూర్ఛదేఱినంతనె మనభయముంబోఁగొట్టఁగలరు.

అని, తాత్పర్యము.

నైతత్కించన రామస్య న చ రామో ముమూర్షతి.౮౦
న హ్యేనం హాస్యతే లక్ష్మీ ర్దుర్లభా యా గతాయుషామ్

టీక॥ఏతత్=ఇది;రామస్య=రామునికి;నకించన=కొంచమేనిగాదు . రామః=రాముఁడు;నముమూర్షతి= చావఁడు.యా=ఏది;గతాయుషాం= పోయినయాయుస్సుగలవారలకు; దుర్లభా=పొందఁగూడనిదో; సా (అధ్యాహృతము)=ఆ;లక్ష్మీః=కాంతి; ఏనం= ఈ రాముని; నహాస్యతేహి= విడువదుగదా!

దీనివలనరామునకేమియపాయము లేదు; రామునకుఁబ్రాణభయము నెంతమాత్రములేదు; ఏదిచావఁబోవువారలకుండదో అట్టికాంతి రాముని విడువకున్నది; చూడుము.

అని, తాత్పర్యము.

తస్మా దాశ్వాసయా త్మానం బలం చాశ్వాసయ స్వకమ్.౮౧
యావ త్కార్యాణి సర్వాణి పున స్సంస్థాపయామ్యహమ్

టీక॥తస్మాత్=అందువలన; యావత్=ఎంతలోపల; అహం=నేను; సర్వాణి = సమస్తములయిన; కార్యాణి=పనులను; పునః=మఱల ; సంస్థాపయామి=స్థాపించుచున్నానో ; తావత్(అధ్యాహృతము)=అంతలోపల;

ఆత్మానం=నిన్నును; ఆశ్వాసయ=ఊఱడించుకొనుము; స్వకం=నీదైన; బలంచ=సైన్యమును; ఆశ్వాసయ = ఊఱడింపుము.

అందువలన, నేను జేయవలసిన దానిసెల్ల మఱలఁజక్క పఱుచునంతలోపల, నీవు, ధైర్యంబు దెచ్చుకొని, నీసైన్యంబును నాశ్వాసింపుము.

అని, తాత్పర్యము.

ఏతే హి ఫుల్లనయనా స్త్రాసా దాగతసాధ్వసాః. ౪౨
కర్ణేకర్ణే ప్రకథితా హరయో హరిసత్తమ

టీక॥ హరిసత్తమ= వానరశ్రేష్ఠుఁడవగు సుగ్రీవుఁడా! ఏతే= ఈ; హరయః=వానరులు; త్రాసాత్=భయమువలన; ఫుల్లనయనాః = వికసించిన కన్నులుగల ; సాధ్వసాః= పొందఁబడిన భయవికారముగలవారలయి ; కర్ణేకర్ణే = ప్రతిచెవియందును; ప్రకథితాః=చెప్పుకొనుచున్నారుగదా!

ఈవానరులు, భయంబున వెడల్పులయి నకన్నులతో వికృతాంగులయి, పాఱిపోదమనియొకరిచెవిలో నొకరు గుసగుసలాడుకొనుచున్నారు; చూడుము. అని, తాత్పర్యము.

మాంతు దృష్ట్వా ప్రధావంత మనీకం సంప్రహర్షితుమ్. ౪౩
త్యజంతు హరయ స్త్రాసం భుక్తపూర్వా మివ స్రజమ్

టీక॥హరయః=వానరులు;అనీకం=సైన్యమును;సంప్రహర్షితుం= సంతోషపఱుచుటకు;ప్రధావంతం=పరుగెత్తుచున్న;మాం=నన్ను;దృష్ట్వాతు=చూచినంతనే;త్రాసం=భయమును ; భుక్తపూర్వాం=మున్ననుభవింపఁబడిన;స్రజమివ=పువ్వుమాలికనువలె;త్యజంతు=విడుతురుగాక.

నేను,నలుప్రక్కలం దిరుగుచు సైన్యమును సంతోషపఱుప , వానరులందఱు,తొలినాఁడు ధరించిన పువ్వుమాలికను బాఱవైచునట్లు భయమును విడుతురుగాక. అని, విభీషణుండు సుగ్రీవునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

సమాశ్వాస్యతు సుగ్రీవం రాక్షసేంద్రో విభీషణః. ౪౪
విద్రుతం వానరానీకం తత్సమాశ్వాసయత్పునః

టీక॥ రాక్షసేంద్రః = రాక్షసులకుఁ బ్రభుఁడగు ; విభీషణః = విభీషణుఁడు; సుగ్రీవం = సుగ్రీవుని; సమాశ్వాస్యతు=ఊఱడించినంతనే; పునః= మఱల; విద్రుతం= పాఱిన; తత్= ఆ; వానరానీకం = వానర సైన్యమును; సమాశ్వాసయత్=ఊఱడించెను.

రాక్షసరాజుండగు విభీషణుండు, అట్లుసుగ్రీవునాశ్వాసించి, యంత, భయంబున నఱుదుచున్న వానరసైన్యము నాశ్వాసించెను. అని, తాత్పర్యము.

ఇంద్రజిత్తు మహామాయ స్సర్వసైన్యసమావృతః. ౪౫
వివేశ నగరీం లంకాం పితరంచాభ్యుపాగమత్

టీక॥ మహామాయః = అధికమయినమాయగల; ఇంద్రజిత్తు = ఇంద్రజిత్తును; సర్వసైన్యసమావృతః = సమస్తసైన్యములచేతను జుట్టఁబడినవాఁడై; లంకాం=లంకయను; నగరీం = పట్టణమును; వివేశ = ప్రవేశించెను. పితరంచ=తండ్రిని ; అభ్యుపాగమత్= పొందెను.

మహామాయుండగునింద్రజిత్తు, సమస్తసైన్యంబులఁగూడి, లంకాపురిం బ్రవేశించి, తండ్రి సమ్ముఖమునకుఁ బోయెను. అని, తాత్పర్యము.

తత్రరావణ మాసీన మభివాద్య కృతాంజలిః. ౪౬
ఆచచక్షే ప్రియం పిత్రే నిహతౌ రామలక్ష్మణౌ

టీక॥ సః (అధ్యాహృతము)= ఆయింద్రజిత్తు; తత్ర = అచ్చట; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; ఆసీనం = కూర్చుండియున్న; రావణం=రావణుని; అభివాద్య = నమస్కరించి; పిత్రే = తండ్రికొఱకు; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు ; నిహతౌ= వధింపఁబడినారు. ప్రియం= సంతోషకరంబగునీమాటను ; ఆచచక్షే=చెప్పెను.

అంత నయ్యింద్రజిత్తు, సభయందుఁగూర్చుండియున్న తండ్రికినమస్క-

రించి, చేతులు మొగిడ్చుకొని, "రామలక్ష్మణుల వధించితిని" అనుసీ ప్రియవార్తం జెప్పెను. అని, తాత్పర్యము.

ఉత్పపాత తతో హృష్టః పుత్రంచ పరిషస్వజే. ౪౭
రావణో రక్షసాం మధ్యే శ్రుత్వా శత్రూ నిపాతితౌ.

టీక॥ రావణః=రావణుఁడు; రక్షసాం=రాక్షసులయొక్క; మధ్యే=నడుమ; శత్రూ=శత్రువులను; నిపాతితౌ=వధింపఁబడినవారలనుగా; శ్రుత్వా=విని; తతః=అంత; హృష్టః=సంతోషించినవాఁడై; ఉత్పపాత=లేచెను. పుత్రం=కొడుకును; పరిషస్వజేచ=కవుఁగిలించుకొనెను.

రావణుఁడు, రాక్షసమధ్యంబునఁ, దనశత్రువులయిన రామలక్ష్మణులు హతులయి రనువార్తనువిని, పరమ సంతుష్టుండై, యాసనంబుననుండి లేచి, కొడుకును కవుఁగిలించుకొనెను- అని, తాత్పర్యము.

ఉపాఘ్రాయ స మూర్ధ్న్యేనం పప్రచ్ఛ ప్రీతమానసః. ౪౮

టీక॥ సః = ఆరావణుఁడు; ప్రీతమానసః = సంతోషించినమనస్సుగలవాఁడై; మూర్ధ్ని=తలయందు; ఏనం=ఈయింద్రజిత్తును; ఉపాఘ్రాయ=మూరొని; పప్రచ్ఛ=అడిగెను.

అంత రావణుండు, సంతుష్టుండై, యింద్రజిత్తునుశిరంబున మూరొని, రామలక్ష్మణులు హతులయినవిధంబు నంతయునడిగెను. అని, తాత్పర్యము.

పృచ్ఛతేచ యథావృత్తం పిత్రే సర్వం న్యవేదయత్
యథా తౌ శరబంధేన నిశ్చేష్టౌ నిష్ప్రభౌ కృతౌ. ౪౯

టీక॥ సః(అధ్యాహృతము) = ఆయింద్రజిత్తు; పృచ్ఛతే=అడుగుచున్న; పిత్రే=తండ్రికొఱకు; యథా=ఎట్లు; తౌ=ఆరామలక్ష్మణులు; శరబంధేన=బాణబంధముచేత; నిశ్చేష్టౌ= చేష్టలులేనివారలుగాను; నిష్ప్రభౌ=కాంతిలే

నివారలునుగాను; కృతౌ= చేయఁబడినాఁగో; తథా(అధ్యాహృతము)= అట్లు; యథావృత్తం= జరగినదానినతిక్రమింపక; సర్వంచ=సమస్తమును; న్యవేదయత్= చెప్పెను.

ఆయింద్రజిత్తు, తాను రామలక్ష్మణులబాణపాశంబుల బంధించి, నిశ్చేష్టులుగాను నిష్ప్రభులుగాను జేసినది మొదలుగా జరగినసమాచారమునంతయుఁ దండ్రికిఁ జెప్పెను. అని, తాత్పర్యము.

స హర్షవేగానుగతాంతరాత్మా
శ్రుత్వా వచస్తస్య మహారథస్య
జహౌ జ్వరం దాశరథేస్సముత్థితం
ప్రహృష్య వాచాభిననంద పుత్రమ్. ౫౦

టీక॥ సః= ఆరావణుఁడు; మహారథస్య= తన్నునుసారథిని గుఱ్ఱంబులను గాపాడుకొనుచుఁ బదునొకండు వేలమంది విలుకాండ్రతోఁ బోరునట్టి; తస్య= ఆయింద్రజిత్తుయొక్క; వచః= మాటను; శ్రుత్వా= విని; హర్షవేగానుగతాంతరాత్మా= సంతోషాతిశయముచేతఁ బొందఁబడినమనస్సుగలవాఁడై; దాశరథేః= రామునివలన; సముత్థితం= పుట్టిన; జ్వరం= సంతాపమును; జహౌ= విడిచెను. ప్రహృష్య= సంతోషించి; వాచా= మాటచేత; పుత్రం= కొడుకును; అభిననంద= పొగడెను.

ఆరావణుఁడు, తన్నును సారథిని గుఱ్ఱంబులనుగా పాడుకొనుచుఁ బదునొకండు వేలమందివిలుకాండ్రతోఁ బోరంజాలినయింద్రజిత్తు చెప్పిన మాటనువిని, సంతుష్టుండై రామభయంబువలనంగలిగినసంతాపమును విడిచి, కొడుకును ఎంతయు మెచ్చుకొనెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, షట్చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండషట్చత్వారింశసర్గటీక,
ముగిసినది.

౩౭

స ప్త చ త్వా రిం శ స ర్గ ప్రా రం భః.

ప్రతిప్రవిష్టే లంకాంతు కృతార్థే రావణాత్మజే
రాఘవం పరివార్యార్తా రరక్షు ర్వానరర్షభాః. ౧
హనుమా నంగదో నీల స్సుషేణః కుముదో నలః
గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః. ౨
జాంబవా నృషభస్కంధో రంభ శ్శతవలిః పృథుః

టీక॥ కృతార్థే= తీరేతినప్రయోజనముగల; రావణాత్మజే=రావణుని కొడుకై నయింద్రజిత్తు; లంకాం=లంకాపట్టణమును; ప్రతిప్రవిష్టేతు= మఱలఁబ్రవేశింపఁగానే; హనుమాన్=హనుమంతుండును; అంగదః= అంగదుఁడును; నీలః=నీలుఁడును; సుషేణః=సుషేణుఁడును; కుముదః= కుముదుఁడును; నలః=నలుఁడును;గజః= గజుండును; గవాక్షః = గవాక్షుఁడును; గవయః=గవయుఁడును;శరభః= శరభుఁడును; గంధమాదనః=గంధమాదనుండును; జాంబవాన్=జాంబవంతుండును; ఋషభస్కంధః= ఋషభస్కంధుఁడును; రంభః=రంభుండును ; శతవలిః=శతవలియును; పృథుః= పృథుఁడును; వానరర్షభాః = శ్రేష్ఠవానరోత్తములు; ఆర్తాః = దుఃఖితులయి; రాఘవం=రాముని; పరివార్య=చుట్టుకొని; రరక్షుః=రక్షించిరి.

అట్లింద్రజిత్తుకృతార్థుఁడయి మఱలలంకాపురింబ్రవేశించినవెనుక, హనుమంతుండునునంగదుండును నీలుండును సుషేణుండును కుముదుండును నలుండును గజుండును గవాక్షుండును గవయుండును శరభుండును గంధమాదనుండును జాంబవంతుఁడును ఋషభస్కంధుండును రంభుండును శతవలియుఁబృథువుననునీవానరోత్తములు , దుఃఖితులయి రామునింబరివేష్టించి, కాచియుండిరి. అని,తాత్పర్యము.

వ్యూఢానీకాశ్చ యత్తాశ్చ ద్రుమా నాదాయ సర్వతః. ౩

స ౪౭

వీక్షమాణా దిశ స్సర్వా స్తిర్య గూర్ధ్వంచ వానరాః
తృణేష్వపిచ చేష్టత్సు రాక్షసా ఇతి మేనిరే. ౪

టీక॥వానరాః= వానరులు ; ద్రుమాన్=వృక్షములను;ఆదాయ = గ్రహించి;సర్వతః=అంతటను; వ్యూఢానీకాశ్చ=వ్యూహములుగాఁ దీర్పఁబడిన సైన్యములుగలవారలునై;యత్తాశ్చ=సిద్ధులునై;సర్వాః= సమస్తములయిన; దిశః=దిక్కులను; తిర్యక్= అడ్డముగాను;ఊర్ధ్వంచ= పైగాను ; వీక్షమాణాః=చూచుచు;తృణేషు= గడ్డిపోఁచలు;చేష్టత్స్వపిచ=కదలినను; రాక్షసాఇతి= రాక్షసులని;మేనిరే=తలంచిరి.

ఆవానరులు, వృక్షములు చేతంబూని, సేనలనువ్యూహంబుగాఁదీర్చి, సిద్ధులయి, నాలుగుప్రక్కలను నిలుచుండి, సమస్తదిక్కులను దిర్యగూర్ధ్వ ప్రదేశములనుం జూచుచుఁ, తృణంబు గదలినను, రాక్షసులువచ్చిరని, తలంచుచు, జాగ్రత్తతో నుండిరి. అని, తాత్పర్యము.

రావణశ్చాపి సంహృష్టో విసృజ్యేంద్రజితం సుతమ్
ఆజుహావ తత స్సీతారక్షిణీ రాక్షసీ స్తదా. ౫

టీక॥తతః=అంత; రావణశ్చాపి= రావణుఁడును; సంహృష్టః = సంతోషించినవాఁడై; సుతం=కొడుకైన ; ఇంద్రజితం=ఇంద్రజిత్తును; విసృజ్య=విడిచి;తదా=అప్పుడు; సీతారక్షిణీః= సీతనురక్షించుచున్న; రాక్షసీః=రాక్షసస్త్రీలను; ఆజుహావ=పిలిచెను.

అంత,నప్పుడు, రావణుఁడు సంతోషంబున,ఇంద్రజిత్తునుబంపి, సీతకుఁ గావలియున్న రాక్షసులంబిలిపించెను.

అని, తాత్పర్యము.

రాక్షస్య స్త్రిజటా చైవ శాసనా త్సముప స్థితాః

టీక ॥ రాక్షస్యః = రాక్షసస్త్రీలును; త్రిజటాచైవ = త్రిజటయును; శాసనాత్ = ఆజ్ఞవలన ; సముపస్థితాః=వచ్చినారు.

అంతట, త్రిజట మొదలుగా నా రాక్షసస్త్రీలందఱు, రావణునాజ్ఞ మేర కు, వచ్చిరి. అని, తాత్పర్యము.

తా ఉవాచ తతో హృష్టో రాక్షసీ రాక్షసాధిపః. ౬

టీక॥ తతః = అంత; రాక్షసాధిపః = రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు; హృష్టః = సంతోషించినవాఁడై; తాః = ఆ; రాక్షసీః = రాక్షసస్త్రీలనుగూర్చి; ఉవాచ = చెప్పెను.

అంత, రాక్షసరాజుండగు రావణుండు, సంతోషంబున, నారాక్షసస్త్రీలంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

హతా విన్ద్రజితా ఖ్యాత వైదేహ్యా రామలక్ష్మణౌ
పుష్పకంచ సమారోప్య దర్శయధ్వం హతౌ రణే. ౭

టీక॥ వైదేహ్యాః = సీతకు; ఇంద్రజితా = ఇంద్రజిత్తుచేత; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులును; హతౌ = చంపఁబడినవారలనుగా; ఆఖ్యాత = చెప్పుఁడు. పుష్పకంచ = పుష్పకవిమానమును; సమారోప్య = ఎక్కించి; రణే = యుద్ధమునందు; హతౌ = చంపఁబడిన రామలక్ష్మణులను; దర్శయధ్వం = చూపుఁడు.

ఇంద్రజిత్తుచే రామలక్ష్మణులు హతులయిరని సీతాదేవికిం జెప్పుఁడు; ఆవిడను బుష్పకంబుపై నెక్కించుకొని పోయి, యుద్ధంబున హతులయి పడియున్న రామలక్ష్మణులం జూపుఁడు. అని, తాత్పర్యము.

యదాశ్రయా దవష్టబ్ధా నేయం మా ముపతిష్ఠతి
సో౽స్యా భర్తా సహభ్రాత్రా నిహతో రణమూర్ధని. ౮

టీక॥ యదాశ్రయాత్ = ఎవ్వనిప్రాపువలన; ఇయం = ఈసీత; అవష్టబ్ధా = గర్వించినదై; మాం = నన్ను; నోపతిష్ఠతి = పొందకున్నదో; సః = అట్టి; అస్యాః =




ఈసీతయొక్క= భర్తా= పెనిమిటియగు రాముఁడు; రణమూర్ధని= యుద్ధాగ్రమునందు; నిహతః= వధింపఁబడినాఁడు.

ఎవ్వనియాశ్రయంబున, నీసీత గర్వితయయినాను వశ్యగాకుండినదో, అట్టి యాబిడ పెనిమిటియగు రాముండు, యుద్ధంబున నిహతుండయ్యె.

అని, తాత్పర్యము.

నిర్విశంకా నిరుద్విగ్నా నిరపేక్షా చ మైథిలీ
మా ముపస్థాస్యతే సీతా సర్వాభరణభూషితా. ౯

టీక॥ మైథిలీ = మిథిలయందుఁబుట్టిన; సీతా= సీత; నిర్విశంకా = విచారములేనిదై; నిరుద్విగ్నా = దుఃఖములేనిదై; నిరపేక్షా= ఆశలేనిదై; సర్వాభరణభూషితా = సమస్త భూషణముల చేతను అలంకరింపఁ బడినదై; మాం= నన్ను; ఉపస్థాస్యతే = పొందఁగలదు.

ఇంక, సీత, నిర్విచారయయి, దుఃఖమునువిడిచి, రాముండు వచ్చునను నాశనుంగూడవదలి, సమస్తాభరణంబులును దాల్చి, నన్నుఁబొందఁగలదు. అని, తాత్పర్యము.

అద్య కాలవశం ప్రాప్తం రణే రామం సలక్ష్మణమ్
అవేక్ష్య వినివృత్తాశా నాన్యాంగతి మపశ్యతీ. ౧౦
నిరపేక్షా విశాలాక్షీ మా ముపస్థాస్యతే స్వయమ్

టీక॥ అన్యాం= నాకన్న నితరమయిన; గతిం= ప్రాప్యస్థానమయిన రాముని; నాపశ్యతీ= చూడకుండనట్టి; విశాలాక్షీ= వెడల్పులయినకన్నులుగలసీత; అద్య= ఇప్పుడు; రణే = యుద్ధమునందు; కాలవశం = మృత్యువుయొక్క యధీనతను; ప్రాప్తం= పొందిన; సలక్ష్మణం= లక్ష్మణునితోఁగూడియున్న; రామం= రాముని; అవేక్ష్య= చూచి; వినివృత్తాశా= విడిచినయాశగలదై; నిరపేక్షా= వేఱేయపేక్షలేనిదై; స్వయం= తానె; మాం= నన్ను; ఉపస్థాస్యతే= పొందఁగలదు.

నన్నుఁగన్నెత్తిచూడక రామునేయా




శ్రయించియుండువిశాలాక్షియగుసీత; యిప్పుడుయుద్ధంబునలక్ష్మణునితోఁగూడనిహతుండైనరామునింజూచి, యాశ వదలి, ఇతరాపేక్షవిడిచి, తనకుఁదాసన్నాఁబొందఁగలదు, అని, రావణుండు, రాక్షసస్త్రీలతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య త ద్వచనం శ్రుత్వా రావణస్య దురాత్మనః ౧౧
రాక్షస్య స్తా స్తథేత్యుక్త్వా జగ్ము ర్వై యత్ర పుష్పకమ్

టీక॥తాః=ఆ; రాక్షస్యః= రాక్షసస్త్రీలు; దురాత్మనః=దుష్టబుద్ధిగల; తస్య=ఆ; రావణస్య = రావణునియొక్క; వచనం=మాటను; శ్రుత్వా= విని; తథేతి=అట్లేయని; యత్ర= ఎచ్చట; పుష్పకం=పుష్పకవిమానమో; తత్ర(అధ్యాహృతము)=అచ్చటికి; జగ్ముః = పోయిరి ("వై" అనునది పాదపూరణార్థకము).

ఆ రాక్షసస్త్రీలు, దురాత్ముండగు రావణునాజ్ఞనువిని, అట్లేయనిచెప్పి, పుష్పకవిమానంబున్నచోటికిం బోయిరి.

అని, తాత్పర్యము.

తతః పుష్పక మాదాయ రాక్షస్యో రావణాజ్ఞయా. ౧౨
అశోకవనికాస్థాం తాం మైథిలీం సముపానయన్

టీ॥తతః=అంత; రాక్షస్యః=రాక్షసస్త్రీలు; రావణాజ్ఞయా=రావణునియాజ్ఞచేత; పుష్పకం=పుష్పకవిమానమును; ఆదాయ = గ్రహించి ; అశోకవనికాస్థాం=అశోకవనమునందున్న; తాం= ఆ; మైథిలీం=సీతను; సముపానయన్ =పొందించిరి.

అంత, రాక్షసస్త్రీలు, రావణుని నియోగంబున , బుష్పకవిమానంబుఁదీసికొని, యశోకవనంబుననున్న సీతయొద్దకుంబోయిరి.

అని, తాత్పర్యము,

తా మాదాయ తు రాక్షస్యో భర్తృశోకపరాజితామ్. ౧౩
సీతా మారోపయామాసు ర్విమానం పుష్పకం తదా

టీక॥తదా= అప్పుడు; రాక్షస్యః= రాక్షసస్త్రీలు; భర్తృశోక పరాజితాం=పెనిమిటిదుఃఖముచే లోఁగొనఁబడిన; తాం=ఆ; సీతాం= సీతను; ఆదాయతు= తీసికొనినంతనె; పుష్పకం=పుష్పకమను; విమానం=విమానమును; ఆరోపయామాసుః = ఎక్కించిరి.

అప్పుడు, రాక్షసస్త్రీలు, భర్తృదుఃఖంబునఁగృశించియున్నసీతను,బట్టి, యాపుష్పకవిమానంబుపై నెక్కించిరి.

అని, తాత్పర్యము.

తతః పుష్పక మారోప్య సీతాం త్రిజటయా సహ. ౧౪
జగ్ము ర్దర్శయితుం తస్యై రాక్షస్యో రామలక్ష్మణౌ

టీక॥తతః=అంత; రాక్షస్యః=రాక్షసస్త్రీలు; సీతాం= సీతను; త్రిజటయాసహ = త్రిజటతోఁగూడ; పుష్పకం=పుష్పకవిమానమును; ఆరోప్య= ఎక్కించి; తస్యై=ఆసీతకొఱకు; రామలక్ష్మణౌ= రామలక్ష్మణులను;దర్శయితుం=చూపుటకు;జగ్ముః=పోయిరి.

అంతనారాక్షసాంగనలట్లు సీతనుత్రిజటతోఁగూడఁ బుష్పకంబుపై నెక్కించి , యాబిడకు రామలక్ష్మణులంజూపుటకై,తీసికొనిపోయిరి.

అని, తాత్పర్యము.

రావణోకారయ ల్లంకాం పతాకా ధ్వజమాలినీమ్ ౧౫

టీక॥ రావణః= రావణుఁడు;లంకాం = లంకను; పతాకాధ్వజమాలినీం = రాజచిహ్నములు వ్రాసినబెక్కెములయొక్కయు వట్టిబెక్కెములయొక్కయుపఙ్క్తిగలదానిఁగా; అకారయత్ = చేయించెను.

రావణుఁడు,సంతోషంబున , లంకయంతయు,ధ్వజంబునెత్తించి , యలంకారముగావించెను.

అని, తాత్పర్యము.

ప్రాఘోషయత హృష్టశ్చ లంకాయాం రాక్షసేశ్వరః

టీక॥రాక్షసేశ్వరః = రాక్షసులకుఁబ్రభువైనరావణుఁడు ; హృష్టః=

సంతోషించినవాఁడై; లంకాయాం=లంకయందు;ప్రాఘోషయత = చాటించెను.

రాక్షస రాజుండగు రావణుండు, సంతోషాతిశయంబున , లంకయంత యునిట్లని,చాటించెను.

అని,తాత్పర్యము.

రాఘవో లక్ష్మణశ్చైవ హతా వింద్రజితా రణే. ౧౬

టీక॥ రాఘవః=రాముఁడును;లక్ష్మణశ్చైవ=లక్ష్మణుఁడును;రణే= యుద్ధమునందు;ఇంద్రజితా=ఇంద్రజిత్తుచేత;హతౌ=చంపఁబడినారు.

ఇంద్రజిత్తు రామలక్ష్మణుల నిద్దఱను యుద్ధంబునవధించెను.

అని, తాత్పర్యము.

విమానేనాపి సీతా తు గత్వా త్రిజటయాసహ
దదర్శ వానరాణాంతు సర్వం సైన్యం నిపాతితమ్. ౧౭

టీక॥సీతాపితు=సీతయు;విమానేన=విమానముచేత;త్రిజటయాసహ= త్రిజటతోఁగూడ;గత్వా=పోయి;నిపాతితం=వధింపఁబడిన;సర్వం = సమస్తమయిన;వానరాణాం=వానరులయొక్క ; సైన్యంతు=సైన్యమును.దదర్శ = చూచెను.

సీతత్రిజటతోఁగూడ , నప్పుష్పకవిమానంబునారోహించిపోయి , నేలంబడియున్న వానర సైన్యమునంతయుఁ జూచెను. అని,తాత్పర్యము.

ప్రహృష్ట మనసశ్చాపి దదర్శ పిశితాశనాన్
వానరాంశ్చాపి దుఃఖార్తాన్ రామలక్ష్మణపార్శ్వతః. ౧౮

టీక॥ సా(అధ్యాహృతము)= ఆసీత;ప్రహృష్టమనసః= సంతోషమునొందినమనస్సుగల;పిశితాశనాంశ్చాపి=రాక్షసులను;రామలక్ష్మణపార్శ్వతః=రామలక్ష్మణుల పార్శ్వంబున ; దుఃఖార్తాన్ = దుఃఖముచేఁబీడింపఁబడిన;వానరాంశ్చాపి=వానరులను; దదర్శ=చూచెను.

ఆసీత, రాక్షసులు పరమసంతోషంబునొందియుండుటయు, వానరులు రామలక్ష్మణులసమీపంబున దుఃఖాతురులయియుండుటయుం గనెను.

అని, తాత్పర్యము-

తతస్సీతా దదర్శోభౌ శయానౌ శరతల్పయోః
లక్ష్మణం చాపి రామంచ విసంజ్ఞౌ శరపీడితౌ. ౧౯
విధ్వస్తకవచౌ వీరౌ విప్రవిద్ధశరాసనౌ
సాయకైశ్ఛిన్నసర్వాంగౌ శరస్తంబమయౌ క్షితౌ. ౨౦

టీక॥ తతః=అంత; సీతా=సీత; క్షితౌ=భూమియందు; శరతల్పయోః=బాణముల పాన్పునందు; శయానౌ=పరుండినవారలును; విసంజ్ఞౌ = తెలివిలేనివారలును; శరపీడితౌ = బాణములచే పీడింపఁబడినవారలును; విధ్వస్తకవచౌ = నాశమునొందిన కవచములుగలవారలును; వీరౌ = పరాక్రమశాలులును; సాయకైః = బాణములచేత; భిన్నసర్వాంగౌ = భేదింపఁబడిన సమస్తావయవములును గలవారలును; శరస్తంబమయౌ= బాణసమూహమయులునగు; లక్ష్మణంచాపి=లక్ష్మణుని; రామంచ=రాముని; ఉభౌ = ఇద్దఱను; దదర్శ=చూచెను.

అంత, సీతాదేవి, భూమియందు బాణతల్పంబులంబరుండియున్నవారలును, మూర్ఛనొందియున్నవారలును, బాణపీడితులును, చినిఁగిపోయినకవచములుగలవారలును, ధనుస్సులువిడిచియున్నవారలును, బాణంబుచేసర్వావయవములందును గాయములుగలిగియున్నవారలును, బాణమయదేహులయి చూపట్టుచున్నవారలును, పరాక్రమవంతులునగు రామలక్ష్మణులనిద్దఱనుం జూచెను- అని, తాత్పర్యము-

తౌ దృష్ట్వా భ్రాతరౌ తత్ర వీరౌ సా పురుషర్షభౌ
శయానౌ పుండరీకాక్షౌ కుమారావివ పావకీ. ౨౧
శరతల్పగతౌ వీరౌ తథాభూతౌ నరర్షభౌ
దుఃఖార్తా సుభృశం సీతా సుచిరం విలలాప హ- ౨౨

సా బాష్పశోకాభిహతా సమీక్ష్య
తౌ భ్రాతరౌ దేవసమప్రభావౌ
వితర్కయంతీ నిధనం తయో స్సా
దుఃఖాయితా వాక్య మిదం జగాద. ౨౭

టీక॥ సా = ఆసీత; బాష్పశోకాభిహతా = కన్నీళ్లచేతనుదుఃఖముచేతను గొట్టఁబడినదై ; దేవసమప్రభావౌ = దేవతలతోసమానమయినప్రభావముగలు;తౌ = ఆ;భ్రాతరౌ=అన్నదమ్ములగు రామలక్ష్మణులను ; సమీక్ష్య=చూచి;సా = ఆసీతాదేవి;తయోః = ఆరామలక్ష్మణులయొక్క; నిధనం=చావును;వితర్కయంతీ = ఊహించుచు; దుఃఖాయితా = దుఃఖించినదై;ఇదం=ఈ; వాక్యం = మాటను;జగాద=పలికెను.

ఆసీత, కన్నులనీళ్లుగాఱ , దేవతలుంబోలెమహాప్రభావులగు నారామలక్ష్మణులంజూచి , మృతిఁబొందిరని తలంచి , పరమదుఃఖితయయి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
యుద్ధకాండే,సప్తచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండసప్తచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---



శ్రీః

## అష్టచత్వారింశసర్గప్రారంభః.

భర్తారం నిహతం దృష్ట్వా లక్ష్మణంచ మహాబలమ్
విలలాప భృశం సీతా కరుణం శోకకర్శితా. ౧

టీక॥ సీతా = సీత; భర్తారం = పెనిమిటిని; మహాబలం = అధికమయినబలముగల; లక్ష్మణంచ = లక్ష్మణుని; నిహతం = వధింపఁబడినవానిఁగా; దృష్ట్వా = చూచి; శోకకర్శితా = దుఃఖముచేఁగృశింపఁబడినదై, భృశం = మిక్కిలియు; కరుణం = దుఃఖముగలుగునట్లుగా; విలలాప = విలపించెను.

సీత, తన పెనిమిటియు మహాబలుండగులక్ష్మణుండును నిహతులయియుండుటంజూచి, పరమ దుఃఖితయయి, శోకావేశంబున, నిట్లని, విలపించెను. అని, తాత్పర్యము.

ఊచు ర్లక్షణినో యే మాం పుత్త్రిణ్యవిధవేతి చ
తే ద్య సర్వే హతే రామే జ్ఞానినోఽనృతవాదినః. ౨

టీక॥ లక్షణినః = సాముద్రికలక్షణముగల; సాముద్రికలక్షణముఁ దెలిసినట్టియుచుట; యే = ఎవ్వరు; మాం = నన్ను; పుత్త్రిణీ = కొడుకుగలదనియు; అవిధవేతిచ = విధవగానిదనియు; ఊచుః = చెప్పిరో; తే = ఆ; జ్ఞానినః = లక్షణజ్ఞానముగలవారలు; సర్వే = అందఱును; అద్య = ఇప్పుడు; రామే = రాముఁడు; హతే = వధింపఁబడగా; అనృతవాదినః = అబద్ధముఁజెప్పువారలు.

సాముద్రికలక్షణము దెలిసినవారలెవ్వరు, మున్ను నన్నుఁ బుత్త్రవతి యనియు విధవగానిదనియుఁ జెప్పిరో వారలందఱిప్పుడు రాముండు నిహతుండు గాఁగా నబద్ధముఁ జెప్పువారలయిరి. అని, తాత్పర్యము.

యజ్వనో మహిషీం యే మా మాహుః పత్నీంచ సత్త్రిణః

రాజునకు భార్యవనియు; ధన్యేతిచ=పుణ్యవంతురాలవనియు; మాం=నన్ను; విదుః=ఎటింగిరో; తే=ఆ; జ్ఞానినః=జ్యోతిశ్శాస్త్రజ్ఞానముగలవారలు; సర్వే=అందఱును; అద్య=ఇప్పుడు; రామే=రాముఁడు; హతే=వధింపఁబడఁగా; అనృతవాదినః=అబద్ధముఁజెప్పువారలు.

ఎవ్వరు, నన్నుఁజూచి, నీవు మహాప్రాక్రమశాలియగు రాజునకు భార్యవుగాఁగలవనియు ధన్యురాలవనియుం జెప్పిరో, ఆజ్యోతిశ్శాస్త్రవేత్తలందఱు నిప్పుడు, రాముండు హతుం డగుటవలన, నబద్ధములు జెప్పువారలయిరి.

అని, తాత్పర్యము.

ఇమాని ఖలు పద్మాని పాదయో ర్యైః కిల స్త్రియః
అధిరాజ్యే భిషిచ్యంతే నరేంద్రైః పతిభి స్సహ. ౬

టీక॥ యైః=ఏపద్మములతో; సహితాః (అధ్యాహృతము)=కూడిన; స్త్రియః=స్త్రీలు; నరేంద్రైః=మనుష్యకులశ్రేష్ఠులయిన; పతిభిస్సహ=భర్తలతోఁగూడ; అధిరాజ్యే=సామ్రాజ్యమునందు; అభిషిచ్యంతే=అభిషేకింపఁబడుదురో; తాని (అధ్యాహృతము)=అట్టి; ఇమాని=ఈ; పద్మాని=రేఖలు; పాదయోః=పాదములయందు; దృశ్యంతే (అధ్యాహృతము)=ఖలు=చూడఁబడుచున్నవిగదా!

ఏవియున్నచో స్త్రీలు మహారాజులగు పెనిమిటులతోఁగూడ సామ్రాజ్యపట్టాభిషిక్తులగుదురో, అట్టిపద్మరేఖలు, నా పాదంబుల స్పష్టముగాఁజూపట్టుచున్నవి. అని, తాత్పర్యము.

వైధవ్యం యాంతి యైర్నార్యో లక్షణై ర్భాగ్యదుర్లభాః
నాత్మన స్తాని పశ్యామి పశ్యంతీ హతలక్షణా. ౭

టీక॥ నార్యః=స్త్రీలు; యైః=ఏ; లక్షణైః=లక్షణములచేత; భాగ్యదుర్లభాః=దుర్లభమయినభాగ్యముగలవారలయి; వైధవ్యం=విధవాత్వమును; యాంతి=పొందుచున్నారో, హతలక్షణా=కొట్టఁబడినలక్షణములుగల; అహం (అధ్యాహృతము)=నేను; పశ్యంతీ=చూచుచున్నదాననై; ఆత్మనః=నాకు; తాని=ఆలక్షణములను; నపశ్యామి=చూడను.

స ౪౮

ఏలక్షణంబులున్న స్త్రీలుసభాగ్యలయి వైధవ్యంబునొందుదురో, అట్టి దుష్టలక్షణంబు లెంత వెదకినను నాకు లేవు, అయితే, నాకుంగలశుభలక్షణములన్నియు, వ్యర్థములయినవి.

అని, తాత్పర్యము.

సత్యనామాని పద్మాని స్త్రీణాం ముక్తాని లక్షణైః
తాన్యద్య నిహతే రామే వితథాని భవంతి మే. ౮

టీక॥ స్త్రీణాం = స్త్రీలకు; పద్మాని = పద్మరేఖలు; సత్యనామాని = అమోఘములైనఫలములుగలవిగా; లక్షణైః = శాస్త్రములచేత; ఉక్తాని = చెప్పఁబడినవి. తాని = అవి; అద్య = ఇప్పుడు; రామే = రాముఁడు; నిహతే = చంపఁబడఁగా; మే = నాకు; వితథాని = వ్యర్థములు; భవంతి = అగుచున్నవి.

పద్మాకారరేఖలు, స్త్రీలకు దప్పకమహాఫలంబులుగల్గించునని శాస్త్రంబులఁజెప్పఁబడియున్నది; ఇప్పుడు రాముఁడు హతుఁడగుటవలన, నాకుమాత్రమవి నిష్ఫలములయినవి.

అని, తాత్పర్యము.

కేశాస్సూక్ష్మా స్సమా నీలా భ్రువౌ చాసంగతే మమ
వృత్తే చారోమశే జంఘే దంతా శ్చావిరళా మమ. ౯

టీక॥ మమ = నాయొక్క; కేశాః = వెండ్రుకలు; సూక్ష్మాః = సన్నవియును; సమాః = ఎచ్చుతక్కువలులేనివియు; నీలాః = నల్లనివియు; భ్రువౌచ = కనుబొమలును; అసంగతే = సంబంధించినవికావు. మమ = నాయొక్క; జంఘే = పిక్కలు; వృత్తే = గుండ్రములును; అరోమశేచ = వెండ్రుకలులేనివియు; దంతాశ్చ = దంతములును; అవిరళాః = సందుగలవికావు.

నాతలవెండ్రుకలు సూక్ష్మములయి సమములయినల్లఁగానున్నవి; నాకనుబొమలుజంటొంటితో సంబంధింపకున్నవి; నాపిక్కలునుగుండ్రములయి వెండ్రుకలులేకున్నవి; నాపండ్లువిరళములుగాకదట్టముగా నొండొంటిం గలసి యున్నవి. అని, తాత్పర్యము.

శంఖే నేత్రే కరౌ పాదౌ గుల్ఫావూరూచ మే చితౌ
అనువృత్తనఖా స్స్నిగ్ధా స్సమా శ్చాంగులయో మమ. ౧౦

టీక॥ మే=నాయొక్క; శంఖే=కన్నులకుసమీపముననున్న లలాటప్రదేశములును ; చితే(అధ్యాహృతము)=బలిసియున్నవి; నేత్రే=కన్నులు; చితే(అధ్యాహృతము) = బలిసియున్నవి. కరౌ=చేతులు;చితౌ(అధ్యాహృతము)= బలిసియున్నవి. పాదౌ=అడుగులు ; చితౌ(అధ్యాహృతము)=బలిసియున్నవి. గుల్ఫౌ=చీలమండలును; చితౌ (అధ్యాహృతము)= బలిసియున్నవి. ఊరూచ=తొడలును; చితౌ= బలిసియున్నవి. మమ = నాయొక్క; అంగుళయః=వ్రేళ్లు; అనువృత్తనఖాః= గుండ్రములయినగోళ్లుగలవియు; స్నిగ్ధాః=నునుపుగలవియు; సమాశ్చ=హస్తమునకనురూపములయినవియు.

నాకన్నులకుబార్శ్వభాగంబుననుండు, లలాట ప్రదేశంబులును నేత్రంబులును హస్తములును పాదములును జీలమండలునుదొడలును బలిసియున్నవి; నాయుంగుళులును;గుండ్రములయిననఖములతో నొప్పుచుస్నిగ్ధంబులయి సమంబులయియున్నవి.అని, తాత్పర్యము,

స్తనౌ చావిరలౌ పీనౌ మమేమౌ మగ్నచూచుకౌ
మగ్నా చోత్సంగినీ నాభిః పార్శ్వోరస్కాశ్చ మే చితాః. ౧౧

టీక॥మమ=నాయొక్క ; ఇమౌ=ఈ; స్తనౌచ= స్తనములును;అవిరళౌ=సందులేనివియు;పీనౌ= బలిసినవియు; మగ్నచూచుకౌ = మునిఁగినయగ్రములుగలవియు. నాభిశ్చ=బొడ్డును; మగ్నా=లోఁతైనదియు;ఉత్సంగినీచ= ఉన్నతములయిన పార్శ్వములు గలదియు;మే=నాయొక్క;పార్శ్వోరస్కాశ్చ=ప్రక్కలును ఱొమ్మును; చితాః= బలిసినవి.

నా స్తనంబులు ఒండొంటి నొరసికొనికొంచెముసల్లములుగాను నగ్రములుగ లిగినక్కఁగాబలిసియున్నవి ; నానాభియుమిక్కిలియులోఁతుగలిగి యున్నతములగు పార్శ్వములతో నొప్పుచున్నది ; నాపార్శ్వములును ఱొమ్మును

మాంసలములుగానున్నవి. అని, తాత్పర్యము.

మమ వర్ణో మణినిభో మృదూన్యంగరుహాణిచ
ప్రతిష్ఠితాం ద్వాదశభి ర్మా ముాచు శ్శుభలక్షణామ్. ౧౨

టీక॥ మమ=నాయొక్క; వర్ణః=రంగు; మణినిభః = రత్నముతో సమానమయినది. అంగరుహాణిచ=వెంట్రుకలును; మృదూని=మెత్తనివి. మాం=నన్ను; ద్వాదశభిః=పండ్రెండిటి చేత; ప్రతిష్ఠితాం=భూమియందానినదానిగాను; శుభలక్షణాం= మంగళకరములయినలక్షణములుగలదానిగాను; ఊచుః=చెప్పిరి.

నామేనిరంగురత్నమంబోలె స్నిగ్ధముగానున్నది; నామేనివెంట్రుకలు మృదులములుగానున్నవి; శాస్త్రజ్ఞులు, నీపాదంబులపదివ్రేళ్లు రెండు పాదతలంబులును నేలనానియుండుటవలన, నన్ను శుభలక్షణములుగలదానిగా జెప్పిరి. అని, తాత్పర్యము.

సమగ్రయవ మచ్ఛిద్రం పాణిపాదంచ వర్ణవత్
మందస్మితే త్యేవ చ మాం కన్యాలక్షణినో ద్విజాః. ౧౩

టీక ॥ మమ (అధ్యాహృతము)= నాయొక్క; పాణిపాదంచ = అఱచేతులును అఱకాళ్లును; సమగ్రయవం= తక్కువలేని యవాకారరేఖగలవియు; అచ్ఛిద్రం = వ్రేళ్లసందులేనివియు; వర్ణవత్= కాంతిగలవియు. కన్యాలక్షణినః = కన్యాలక్షణములు దెలిసిన; ద్విజాః=బ్రాహ్మణులు; మాం= నన్ను; మందస్మితేత్యేవచ= చిఱునగవుగలదానవనని యె; ఊచుః (అధ్యాహృతము)= చెప్పిరి.

నా హస్తంబులును పాదంబులును బూర్ణమయిన యవాకారరేఖతో నొప్పుచు వ్రేళ్లనెంతమాత్రము సందులేనివై కాంతిమంతంబులయి యున్నవి; కన్యాలక్షణము దెలిసిన బ్రాహ్మణులు, నన్నెల్లప్పుడును జిఱునవ్వుగలదానవని, చెప్పిరి-అని, తాత్పర్యము.

అధిరాజ్యే౽భిషేకో మే బ్రాహ్మణైః పతినా సహ
కృతాంతకుశలై రుక్తం తత్సర్వం వితథీకృతమ్. ౧౪

టీక॥కృతాంతకుశలైః=జ్యోతిశ్శాస్త్రమునందు సమర్థులు అయిన; బ్రాహ్మణైః=బ్రాహ్మణులచేత; మే=నాకు; పతినా(పత్యా) సహ= పెనిమిటితోఁగూడ; అధిరాజ్యే = సామ్రాజ్యమునందు; అభిషేకః = పట్టాభిషేకము; ఇతి(అధ్యాహృతము)=అని ; ఉక్తం=చెప్పఁబడినది. తత్=అది ; సర్వం=అంతయు; వితథీకృతం=వ్యర్థముగాఁజేయఁబడినది.

జ్యోతిశ్శాస్త్రమునందు సమర్థులగు బ్రాహ్మణులు, నాకుఁ బెనిమిటితోఁ గూడ, సామ్రాజ్యపట్టాభిషేకంబు గలుగునని చెప్పిరి;ఇప్పుడదంతయు వ్యర్థమయినది. అని, తాత్పర్యము.

శోధయిత్వా జనస్థానం ప్రవృత్తి ముపలభ్య చ
తీర్త్వా సాగర మక్షోభ్యం భ్రాతరౌ గోష్పదే హతౌ. ౧౫

టీక॥భ్రాతరౌ=అన్నదమ్ములగు రామలక్ష్మణులు;జనస్థానం=జనస్థానమును; శోధయిత్వా=వెదకి;ప్రవృత్తిం=సమాచారమును; ఉపలభ్య చ=పొందియు ; అక్షోభ్యం= కలఁతపెట్టరాని; సాగరం=సముద్రమును; తీర్త్వా=దాఁటి; గోష్పదే = ఎద్దుకాలియంతమాత్రమునందు;హతౌ=వధింపఁబడినారు.

అన్నదమ్ములగు రామలక్ష్మణులు, జనస్థానమునంతయు వెదకి, తుదకు నా సమాచారమునుం దెలిసికొని, యక్షోభ్యంబగు మహాసముద్రమునుం గూడ దాఁటివచ్చి, యెద్దుకాలి యంతమాత్రమయిన యీ యింద్రజిన్మాయచే హతులయిరి. అని, తాత్పర్యము.

నను వారుణ మాగ్నేయ మైంద్రం వాయవ్య మేవ చ
అస్త్రం బ్రహ్మశిరశ్చైవ రాఘవౌ ప్రత్యపద్యతామ్. ౧౬

టీక॥రాఘవౌ=రామలక్ష్మణులు ;వారుణం= వారుణాస్త్రమును; ఆగ్నే

టీక॥ సా = ఆకౌసల్య; సమాప్తవ్రతం = ముగింపఁబడిన వ్రతముగలవాఁడును; ఆగతం = వచ్చినవాఁడునగు; స రాఘవం = రామునితోఁగూడిన; లక్ష్మణంచ = లక్ష్మణునిని; సీతాంచ = సీతను; కదా = ఎప్పుడు; ద్రక్ష్యామి = చూడఁగలను; ఇతి (అధ్యాహృతము) = అని; అను చింతయతే = తలంచుచుండును.

ఆకౌసల్య "పదునాలుగు సంవత్సరంబులను వనంబునం గడపి సీతాలక్ష్మణ సహితుండయి వచ్చినరాముని, ఎప్పుడు, చూచెదను?" అని, యెల్లప్పుడును గోరుచుండును, అని సీత, విలపించినది. అని, తాత్పర్యము.

పరిదేవయమానాం తాం రాక్షసీ త్రిజటాఽబ్రవీత్

టీక॥ త్రిజటా = త్రిజటయను; రాక్షసీ = రాక్షసి; పరిదేవయమానాం = దుఃఖించుచున్న; తాం = ఆసీతనుగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

అట్లువిలపించుచున్న సీతంజూచి, త్రిజటయను రాక్షసి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

మా విషాదం కృథా దేవి భర్తాఽయం తవ జీవతి. ౨౨

టీక॥ దేవి = అమ్మా! విషాదం = దుఃఖమును; మాకృథాః = చేయవలదు. అయం = ఈ; తవ = నీయొక్క; భర్తా = పెనిమిటి; జీవతి = బతికియున్నాఁడు.

అమ్మా! నీవుదుఃఖింపవలదు; నీభర్త బ్రతికియున్నాఁడు. అని, తాత్పర్యము.

కారణాని చ పశ్యామి మహాంతి సదృశాని చ
యథేమౌ జీవతో దేవి భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౨౩

టీక॥ దేవి = అమ్మా! యథా = ఎట్లు; ఇమౌ = ఈ; భ్రాతరౌ = అన్నదమ్ములయినట్టి; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు; జీవతః = బ్రతికియున్నా

రో; తథా(అధ్యాహృతము)=అట్లు; మహాంతి=గొప్పవియు; సదృశానిచ=అనురూపములునగు; కారణానిచ=కారణములనుగూడ; పశ్యామి = చూచుచున్నాను.

అమ్మా! ఈ రామలక్ష్మణులు లిద్దఱు నుఁబ్రతికియున్నారనుటకుఁ దగినకారణంబులుగూడ నాకగపడుచున్నవి.

అని, తాత్పర్యము.

న హి కోపపరీతాని హర్షపర్యుత్సుకానిచ
భవంతి యుధి యోధానాం ముఖాని నిహతే పతౌ. ౨౪

టీక॥పతౌ(పత్యౌ)=నాయకుఁడు; నిహతే=వధింపఁబడఁగా; యుధి= యుద్ధమునందు; యోధానాం=యోధులయొక్క; ముఖాని=ముఖములు; కోపపరీతాని; కోపముచేత వ్యాపింపఁబడినవియు; హర్షపర్యుత్సుకానిచ= సంతోషముచేఁబ్రసన్నములైనవియు; నభవంతి= కావుగదా!

నాయకుఁడు హతుఁడగుచో, యుద్ధమునందు యోధులముఖములు, ఇట్లు, కోపంబుతోఁ గూడినవిగాఁగాని సంతుష్టములుగాఁగాని, కాఁజాలవు.

అని, తాత్పర్యము.

ఇదం విమానం వైదేహి పుష్పకం నామ నామతః
దివ్యం త్వాం ధారయే న్నైవం యద్యేతౌ గతజీవితౌ. ౨౫

టీక॥ వైదేహి = సీతాదేవీ! ఏతౌ = ఈ రామలక్ష్మణులు; గతజీవితౌయది = పోయినప్రాణముగలవారలగుదురేని; నామతః= పేరుచేత; పుష్పకంనామ = పుష్పకమని ప్రసిద్ధమయిన; దివ్యం = స్వర్గమునందుఁబుట్టిన; ఇదం = ఈ; విమానం = విమానము; ఏవం=ఇట్లు, త్వాం=నిన్ను; నధారయేత్=ధరింపదు.

సీతాదేవీ! మఱియు నీ రామలక్ష్మణులు మృతిఁబొందియున్నచో, స్వర్గంబునం బుట్టిన యీపుష్పకవిమానము, నిన్నిట్లువహింపదు.

అని, తాత్పర్యము.

హతవీరప్రధానా హి హతోత్సాహా నిరుద్యమా
సేనా భ్రమతి సంఖ్యేషు హతకర్ణేవ నౌ ర్జలే. ౨౬

టీక॥ హతవీరప్రధానా = చంపఁబడినప్రధానవీరులుగల; సేనా = సేన; హతోత్సాహా = కొట్టఁబడిన యుత్సాహముగలదై; నిరుద్యమా = ప్రయత్నము లేనిదై; సంఖ్యేషు = యుద్ధములందు; జలే = జలమునందు; హతకర్ణా = చంపఁబడినయోడనడపువాఁడుగల; నౌరివ = ఓడవలె; భ్రమతి = భ్రమించుచుండును.

సేనానాయకుఁడు చంపఁబడునేని, యట్టిసైన్యము నిరుత్సాహమును బ్రయత్నంబులేనిదియునై, జలంబులకర్ణధారుండు లేనియోడపగిది, యుద్ధంబుల దిక్కులేకతిరుగుచునొందియుండును. అని, తాత్పర్యము.

ఇయం పున రసంభ్రాంతా నిరుద్విగ్నా తరస్వినీ
సేనా రక్షతి కాకుత్స్థౌ మయా ప్రీత్యా నివేదితౌ. ౨౭

టీక॥ ఇయం = ఈ; సేనా పునః = వానరసేనయో; అసంభ్రాంతా = తొట్రుపాటులేనిదై; నిరుద్విగ్నా = భయము లేనిదై; తరస్వినీ = బలముగలదై; ప్రీత్యా = సంతోషముచేత; మయా = నాచేత; నివేదితౌ = చెప్పఁబడిన; కాకుత్స్థౌ = రామలక్ష్మణులను; రక్షతి = రక్షించుచున్నది.

ఈవానరసేన యట్లు లేదు; ఇది, తొట్రుపడక భయమునొందక, నేను బ్రతికియున్నారని చెప్పిన యీరామలక్ష్మణులను, సంతోషంబున జాగ్రత్తతో రక్షించుచున్నది. అని, తాత్పర్యము.

సా త్వం భవ సువిస్రబ్ధా అనుమానై స్సుఖోదయైః
అహతౌ పశ్య కాకుత్స్థౌ స్నేహా దేత ద్బ్రవీమి తే. ౨౮

టీక॥ సా = అట్టి; త్వం = నీవు; సుఖోదయైః = సుఖకరములయినవుట్టుకగల; అనుమానైః = చిహ్నములచేత; సువిస్రబ్ధా = మిక్కిలియు నమ్మకము

గలదానవు;భవ=అగుము. అహతౌ=వధింపఁబడకున్నట్టి;కాకుత్స్థౌ = రామలక్ష్మణులను; పశ్య = చూడుము. స్నేహాత్=చెలిమివలన;ఏతత్ = దీని; తే=నీకు;బ్రవీమి=చెప్పెదను.

అట్లు, అనాయాసముగాఁ జెలియఁదగినయాచిహ్నములచేత , నీవు రామలక్ష్మణులు జీవించి యున్నారని స్వస్థముగా నుండుము ; రామలక్ష్మణులు బ్రతికియున్నారు చూడుము ; నీయందలి స్నేహంబున , నీకింతదూరము చెప్పుచున్నాను.

అని, తాత్పర్యము.

అనృతం నోక్తపూర్వం మే నచ వక్ష్యే కదాచన
చారిత్రసుఖశీలత్వాత్ ప్రవిష్టాసి మనో మమ. ౨౯

టీక॥ మే(మయా)=నాచేత ; అనృతం=అబద్ధము;నోక్తపూర్వం=మునుపు చెప్పఁబడినదిగాదు.కదాచన = ఎన్నఁడొకప్పుడును; నవక్ష్యేచ=చెప్పను.చారిత్రసుఖశీలత్వాత్= పాతివ్రత్యముచే సుఖకరమయినస్వభావము గలుగుటవలన;మమ=నాయొక్క;మనః=మనస్సును;ప్రవిష్టా=ప్రవేశించినదానవు; అసి-అగుచున్నావు.

నేనిదివఱకునీతో నబద్ధముఁ జెప్పినది లేదు;ఇంకనుం జెప్పను;నీవుపాతివ్రత్యంబుతో నొప్పుచున్న స్వభావంబుగలదానవగుటచేత,నీయందు నాకుమిక్కిలియును మక్కువగలిగినది. అని, తాత్పర్యము.

నేమౌ శక్యౌ రణే జేతుం సేన్ద్రైరపి సురాసురైః

టీక॥ఇమౌ=ఈరామలక్ష్మణులు ; రణే=యుద్ధమునందు; సేంద్రైః= ఇంద్రునితోఁగూడిన;సురాసురైరపి= సురలచేతనునసురులచేతను ; జేతుం=జయించుటకు;నశక్యౌ=అలవిగారు.

యుద్ధంబున దేవేంద్రునితోఁ గూడినసురాసురులకైనను, రామలక్ష్మణులుఁ జయింపనలవిగాను.

అని, తాత్పర్యము.

తాదృశం దర్శనం దృష్ట్వా మయా చావేదితం తవ. ౩౦

టీక॥ తాదృశం=అట్టి; దర్శనం = చూపును; దృష్ట్వా=చూచి; మయా=నాచేత; తవ=నీకును; ఆవేదితం= తెల్పఁబడినది.

బ్రతికియుండుటకు సూచకంబు లగు లక్షణంబులం జూచి, నీకుఁ జెప్పితిని.

అని, తాత్పర్యము.

ఇదంచ సుమహచ్చిహ్నం శనైః పశ్యస్వ మైథిలి

టీక॥ మైథిలి=సీతా! సుమహత్=మిక్కిలియు గొప్పదగు; ఇదం= ఈ; చిహ్నం చ=గుఱుతును; శనైః = మెల్లఁగా; పశ్యస్వ=చూడుము.

సీతాదేవీ! గొప్పదియిది యొక్కటి యున్నది; ఈచిహ్నముం జూడుము.

అని, తాత్పర్యము.

నిస్సంజ్ఞావప్యుభావేతౌ నైవ లక్ష్మ్యా వియుజ్యతే. ౩౧

టీక॥ ఏతౌ = ఈ రామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును; నిస్సంజ్ఞావపి= తెలివిలేనివారలయినను; లక్ష్మ్యా=కాంతి; నైవ వియుజ్యతే=విడువకనేయున్నది.

ఈ రామలక్ష్మణులు, మూర్ఛనొంది యున్నను, వీరలముఖకాంతి యొంతమాత్రము తఱుగకున్నది.

అని, తాత్పర్యము.

ప్రాయేణ గతసత్త్వానాం పురుషాణాం గతాయుషామ్
దృశ్యమానేషు వక్త్రేషు పరం భవతి వైకృతమ్. ౩౨

టీక॥ ప్రాయేణ = తఱచుగా; గతాయుషాం = పోయినయాయుస్సు గలవారలును; గతసత్త్వానాం= పోయినప్రాణములుగలవారలునగు ; పురుషాణాం=పురుషులయొక్క ; వక్త్రేషు= ముఖములు ; దృశ్యమానేషు= చూడఁబడుచుండఁగా; పరం = అధికమయిన; వైకృతం=వికారము; భవతి= అగుచున్నది.

తఱచుగా , మృతిఁబొందినవారల ముఖములం జూడఁగా, నవిమిక్కిలియు వికారముగలిగియుండును.

అని, తాత్పర్యము.

త్యజ శోకంచ మోహంచ దుఃఖంచ జనకాత్మజే
రామలక్ష్మణయో రర్థే నాద్య శక్య మజీవితుమ్. ౩౩

టీక॥ జనకాత్మజే=సీతాదేవీ! అద్య=ఇప్పుడు; రామలక్ష్మణయోః=రామలక్ష్మణులయొక్క; అర్థే=నిమిత్తమయి; శోకంచ=దుఃఖవికారమును; మోహంచ=మూర్ఛను; దుఃఖంచ=మనోవ్యథను; త్యజ=విడువుము. అజీవితుం=బ్రతుకకుండుటకు; నశక్యం=అలవిగాదు.

సీతాదేవీ! నీవు రామలక్ష్మణులనిమిత్తమయి, యిట్లు మూర్ఛనొందుచు దుఃఖింపకుము; రామలక్ష్మణులు బ్రతికియున్నారనుటకు సందియము లేదు. అని, త్రిజట, సీతతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రుత్వాతు వచనం తస్యా స్సీతా సురసుతోపమా
కృతాంజలి రువాచేద మేవ మస్త్వితి మైథిలీ. ౩౪

టీక॥ సురసుతోపమా=దేవకన్యకతోఁబోలిక-గల; మైథిలీ=మిథిలయందుఁ బుట్టిన; సీతా=సీత; తస్యాః=ఆత్రిజటయొక్క; వచనం=మాటను; శ్రుత్వాతు=విన్నదియై; కృతాంజలిః=చేయఁబడినచేమోడ్పుగలదై; ఏవం=ఇట్లు; అస్తు=అగుఁగాక; ఇతి=అని; ఇదం=ఈమాటను; ఉవాచ=చెప్పెను.

దేవకన్యా సమానుగాలగు సీతాదేవి, యాత్రిజటచెప్పినమాటను విని, చేమోడ్పుగేలించి, నీవుచెప్పినట్లు, రామలక్ష్మణులు జీవించియుండుదురుఁగాక, యనిచెప్పెను. అని, తాత్పర్యము.

విమానం పుష్పకం తత్తు సన్నివర్త్య మనోజవమ్
దీనా త్రిజటయా సీతా లంకామేవ ప్రవేశితా. ౩౫

టీక॥ త్రిజటయా=త్రిజటచేత; తత్=ఆ; మనోజవం=మనోవేగముగల; పుష్పకం=పుష్పకమను; విమానం=విమానమును; సన్నివర్త్య=తు=

మఱలించియు; దీనా= దుఃఖితురాలగు; సీతా=సీతాదేవి; లంకామేవ = లంకాపురినే; ప్రవేశితా=ప్రవేశింపఁజేయఁబడినది.

అంతట త్రిజట, మనోవేగంబుతోఁ గూడియున్న యాపుష్పకవిమానంబును మఱలించి, దీనురాలగు సీతాదేవినిలంకాపురికిం దీసికొనిపోయెను.

అని, తాత్పర్యము.

తత స్త్రిజటయా సార్ధం పుష్పకా దవరుహ్య సా
అశోకవనికా మేవ రాక్షసీభిః ప్రవేశితా. ౩౬

టీక॥ తతః=అంత; సా = ఆసీత; త్రిజటయా సార్ధం = త్రిజటతోఁగూడ; పుష్పకాత్ = పుష్పకవిమానంబుననుండి; అవరుహ్య = డిగ్గి; రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత; అశోకవనికామేవ=అశోకవనమునే ; ప్రవేశితా= ప్రవేశింపఁజేయఁబడినది.

అంత, రాక్షసస్త్రీలు , సీతను త్రిజటతోఁగూడ , పుష్పకవిమానంబుననుండిదింపి, యశోకవనముఁ జేర్చిరి.

అని, తాత్పర్యము.

ప్రవిశ్య సీతా బహువృక్షషండాం
తాం రాక్షసేంద్రస్య విహారభూమిమ్
సంప్రేక్ష్య సంచింత్య చ రాజపుత్రీ
పరం విషాదం సముపాజగామ. ౩౭

టీక॥ సీతా = సీతాదేవి; బహువృక్షషండాం = అధికమయినవృక్షసమూహములుగల ; రాక్షసేంద్రస్య= రాక్షసేశ్వరుఁడగు రావణాసురునియొక్క; విహారభూమిం= విహారస్థానమయిన; తాం = ఆయశోకవనికను; ప్రవిశ్య= ప్రవేశించి; రాజపుత్రీ = రాచకొమరులగు రామలక్ష్మణులను ; సంప్రేక్ష్య=చూచియు; సంచింత్యచ = తలంచియు; పరం = అధికమయిన; విషాదం=దుఃఖమును ; సముపాజగామ= పొందెను.

సీతాదేవి , పెక్కువృక్షములతోఁ గూడినదియు రాక్షసరాజుండగు రావ

ణుని విహారస్థానమునగు నశోకవనికను ప్రవేశించి, రాచకొమరులగు రామలక్ష్మణులం దలంచుకొని, పరమ దుఃఖంబునొందినది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, అష్టచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికావ్యాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండాష్టచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

ఏకోనపంచాశస్సర్గప్రారంభః.

ఘోరేణ శరబంధేన బద్ధౌ దశరథాత్మజౌ
నిశ్శ్వసంతౌ యథా నాగౌ శయానౌ రుధిరోక్షితౌ. ౧
సర్వే తే వానరశ్రేష్ఠాః ససుగ్రీవా మహాబలాః
పరివార్య మహాత్మానౌ తస్థుః శోకపరిప్లుతాః. ౨

టీక॥ మహాబలాః = అధికమయినబలముగల; ససుగ్రీవాః = సుగ్రీవునితో గూడిన; తే = ఆ; వానరశ్రేష్ఠాః = వానరోత్తములు; సర్వే = అందఱును; ఘోరేణ = భయంకరమయిన; శరబంధేన = బాణబంధముచేత; బద్ధౌ = బంధింపఁబడినవారలును; నాగౌ యథా = సర్పములువలె; నిశ్శ్వసంతౌ = నిట్టూర్పులువుచ్చుచున్నవారలును; శయానౌ = పరుండియున్నవారలును; రుధిరోక్షితౌ = నెత్తురుచేఁదడుపఁబడినవారలును; మహాత్మానౌ = అధికమయినప్రభావముగలవారలునగు; దశరథాత్మజౌ = దశరథునికొడుకులయిన రామల

త్మ్ణులను; పరివార్య=పరివేష్టించి; శోకపరిప్లుతాః=దుఃఖముచేఁ గలంచినవారలయి; తస్థుః=ఉండిరి.

సుగ్రీవుఁడు మొదలుగాఁ గల మహాబలశాలులగు వానరోత్తములందఱును, భయంకరంబగు నాగపాశంబుచే బద్ధులును, సపర్ణములుంబోలె నిట్టూర్పులు పుచ్చుచున్నవారలును, నెత్తుటం దోఁగి భూమిం బడియుండియున్నవారలు నగు మహాత్ములనా రామలక్ష్మణులం బరివేష్టించి, దుఃఖితులయియుండిరి.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరే రామః ప్రత్యబుధ్యత వీర్యవాన్
స్థిరత్వాత్సత్త్వయోగాచ్చ శరైస్సందానితోపి సన్. ౩

టీక॥ ఏతస్మిన్నంతరే=ఈనడుమను; వీర్యవాన్=అధికమయినపరాక్రమముగల; రామః=రాముఁడు; శరైః=బాణములచేత; సందానితస్సన్నపి=బద్ధుఁడైనను; స్థిరత్వాత్=ధీరుఁడగుటవలనను; సత్త్వయోగాచ్చ=బలముతోడిసంబంధమువలనను; ప్రత్యబుధ్యత=మేలుకొనెను.

ఇంతలో, వీర్యవంతుఁడగు రాముండు, బాణపాశంబులం బద్ధుండైయున్నను, ధీరుండగుటవలనను బలవంతుండగుటవలనను, మూర్ఛ దేఱెను.

అని, తాత్పర్యము.

తతో దృష్ట్వా సరుధిరం విషణ్ణం గాఢమర్పితమ్
భ్రాతరం దీనవదనం పర్యదేవయ దాతురః. ౪

టీక॥ తతః=అంత; సః(అధ్యాహృతము)=ఆ రాముఁడు; సరుధిరం=నెత్తురుతోఁ గూడినవాఁడును; విషణ్ణం=దుఃఖితుండును; గాఢం=గట్టిగా; అర్పితం=బాణములచేఁ బొడువబడినవాఁడును; దీనవదనం=గవఱముడిగిన ముఖముగలవాఁడు నగు; భ్రాతరం=తమ్మునిని; దృష్ట్వా=చూచి; ఆతురః=దుఃఖితుండై; పర్యదేవయత్=విలపించెను.

అంత, నా రాముండు, నెత్తురుగాఱ దుఃఖితుండై గాఢంబుగా బాణములచే బాధితుండై దీనవదనుండై యున్న తమ్మునిలక్ష్మణుం జూచి, దుఃఖించుచు, నిట్లని, విలపించెను. అని, తాత్పర్యము.

కిన్ను మే సీతయా కార్యం కిం కార్యం జీవితేన వా
శయానం యోద్య పశ్యామి భ్రాతరం యుధి నిర్జితమ్. ౫

టీక॥యః=ఎవ్వఁడను; అద్య= ఇప్పుడు; యుధి=యుద్ధమునందు; నిర్జితః= జయింపఁబడినవాఁడును; శయానం= పరుండియున్నవాఁడునగు; భ్రాతరం= తమ్మునిని; పశ్యామి= చూచుచున్నానో; తస్య(అధ్యాహృతము)=అట్టి; మే=నాకు; సీతయా=సీతచేత; కిన్నుకార్యం=ఏమికార్యము? జీవితేనవా=ప్రాణముచేతఁగాని; కిం కార్యం=ఏమికార్యము?

నా తమ్ముఁడు, యుద్ధంబున నిర్జితుండై నేలంబడిపొరలుచుండుటం జూడఁగంటినే. యింక, నాకు సీతతో నేమి కార్యము? నా ప్రాణముతోఁగాని నాకేమి ప్రయోజనము?

అని, తాత్పర్యము.

శక్యా సీతాసమా నారీ మర్త్యలోకే విచిన్వతా
న లక్ష్మణసమో భ్రాతా సచివః సాంపరాయికః. ౬

టీక॥మర్త్యలోకే= భూలోకమునందు; విచిన్వతా= వెదకుచున్న; మయా(అధ్యాహృతము)= నాచేత; సీతాసమా= సీతతో సమానమయిన; నారీ=స్త్రీ; ప్రాప్తుం (అధ్యాహృతము)=పొందుటకు; శక్యా= అలవియగును. సచివః= సహాయుఁడును; సాంపరాయికః= యుద్ధంబునసమర్థుఁడును నగు; లక్ష్మణసమః= లక్ష్మణునితో సమానుఁడైన; భ్రాతా=తమ్ముఁడు; న (శక్యః)=అలవిగాఁడు.

భూలోకంబున వెదకినచో, సీతకు సరియయిన వనితనుసంపాదింపవచ్చును; యుద్ధంబునసమర్థుఁడును సహాయుఁడునగు లక్ష్మణునితో సమానుఁడగు తమ్మునిమాత్రము పొందనలవిగాదు.

అని, తాత్పర్యము.

పరిత్యక్ష్యామ్యహం ప్రాణం వానరాణాంతు పశ్యతామ్
యది పఞ్చత్వ మాపన్నః సుమిత్రానందవర్ధనః. ౭




టీక॥ సుమిత్రానందవర్ధనః= సుమిత్రయొక్క-సంతోషమునువృద్ధిఁబొందించునట్టి,లక్ష్మణుండు; పంచత్వం = మరణమును; ఆపన్నోయది= పొందినవాఁడగునేని; అహం=నేను; వానరాణాం=వానరులు; పశ్యతాంతు=చూచుచుండఁగానే; ప్రాణం= ప్రాణమును; పరిత్యక్ష్యామి=విడిచెదను.

సుమిత్రకుమారుఁడగులక్ష్మణుండు, మరణముఁబొందునేని, నేను, ఈవానరులుచూచుచుండగానే, ప్రాణంబులువిడిచెదను.

అని, తాత్పర్యము.

కిన్ను వక్ష్యామి కౌసల్యాం మాతరం కిన్ను కైకేయీమ్

టీక॥ మాతరం=తల్లి యగునట్టి; కౌసల్యాం=కౌసల్యనుగూర్చి; కిన్ను=ఏమి; వక్ష్యామి = చెప్పఁగలను? కైకేయీం=కైకేయినిగూర్చి; కిన్ను (వక్ష్యామి)=ఏమిచెప్పఁగలను?

నేనిక ఆమోహ్యగుండయ్యు, తల్లి కౌసల్యకేమి చెప్పుదును? కైకేయి కేమి చెప్పుదును. అని, తాత్పర్యము.

కథ మంబాం సుమిత్రాం చ పుత్రదర్శనలాలసామ్ ।
వివత్సాం వేపమానాం చ క్రోశన్తీం కురరీ మివ
కథ మాశ్వాసయిష్యామి యది యాస్యామి తం వినా ॥

టీక॥తంవినా= ఆలక్ష్మణుండులేక; యాస్యామియది=పోవుదునేని;కథం=ఎట్లు;పుత్రదర్శనలాలసాం=కొడుకును చూడుటయందధికేచ్ఛగలదియును;వివత్సాం=విడిచినదూడగలదియు ; వేపమానాంచ = వడంకుచున్నదియు ; కురరీమివ=లేడివలె;క్రోశంతీం= విలపించుచున్నదియునగు;అంబాం= తల్లియగు;సుమిత్రాం=సుమిత్రను; కథం=ఎట్లు=ఆశ్వాసయిష్యామి=ఓదార్పఁగలను?

లక్ష్మణుండు,లేక , నేనుమాత్రమయోధ్యకుఁబోదునేని, పుత్రదర్శనలాలసయుదూడనువిడచినలేడివలె విలపించుచున్నదియునగు తల్లియగు సుమిత్రనెట్లులాశ్వాసింపఁగలను?

అని, తాత్పర్యము.




కథం వక్ష్యామి శత్రుఘ్నం భరతంచ యశస్వినమ్

టీక॥ శత్రుఘ్నం= శత్రుఘ్ననగూచిఁయు; యశస్వినం= అధికమయినకీర్తిఁగల; భరతంచ = భరతునిఁగూచిఁయు; కథం=ఎట్లు; వక్ష్యామి=చెప్పఁగలను?

శత్రుఘ్నునితో మహాయశుండగుభరతునితోనుఏమిచెప్పుదును? అని, తాత్పర్యము.

మయా సహ వనం యాతో వినా తేనా గతః పునః. ౧౦
ఉపాలంభం న శక్ష్యామి సోఢుం బత సుమిత్రయా

టీక॥యః (అధ్యాహృతము)= ఎవ్వఁడు; మయాసహ = నాతోఁగూడ; వనం=అడవిని; యాతః = పొందినాఁడో; తేనవినా = అతనివిడిచి; పునః=మరల; ఆగతః = వచ్చినాఁడవు. ఇతి (అధ్యాహృతము)= అని; సుమిత్రయా=సుమిత్రచేత; కృతం (అధ్యాహృతము)= చేయఁబడిన; ఉపాలంభం=నిందను; సోఢుం = సహించుటకు; నశక్ష్యామి= చాలను. బత=అయ్యో!

"నీతోఁగూడ వనంబునకు వచ్చినవాని లక్ష్మణుని విడిచివచ్చినావు" అని సుమిత్రనన్నుదప్పఁబెప్పును; అయ్యో! దాని నేనుసహింపఁజాలను. అని, తాత్పర్యము.

ఇహైవ దేహం త్యక్ష్యామి నహి జీవితు ముత్సహే. ౧౧

టీక॥ ఇహైవ = ఇచ్చటనె; దేహం=దేహమును; త్యక్ష్యామి = విడిచెదను. జీవితుం = బ్రతుకుటకు; నోత్సహేహి=కోరనుగదా!

నేనింకబ్రతుకఁజాలను; ఇచ్చటనె ప్రాణంబులువిడిచెదను. అని, తాత్పర్యము.

ధిఙ్మాం దుష్కృతకర్మాణ మనార్యం యత్కృతే హ్యసౌ
లక్ష్మణః పతిత శ్శేతే శరతల్పే గతాసువత్. ౧౨

టీక॥ యత్కృతేహి = ఎవ్వనినిమిత్తమయ్యే = అసౌ = ఈ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; శరతల్పే = బాణములపాన్పునందు; పతితః= పడినవాఁ

దై; గతాసువత్ = పోయినప్రాణములుగలవాఁడువలె; శేతే = పరుండియున్నాఁడో ; తం (అధ్యాహృతము)= అట్టి; దుష్కృతకర్మాణం= పాపకర్ముఁడను;అనార్యం= దుష్టుండనగు;మాం=నన్నుఁగూర్చి;ధిక్ = దహింపఁబడుటయగుఁగాక.

ఎవ్వనినిమిత్తమయి, యీలక్ష్మణుండు ; బాణతల్పంబున చచ్చినట్లుపడియున్నాఁడో , అట్టి పాపకర్ముఁడనుదుష్టుండనగునేనుదహింపఁబడుదునుగాక. అని, తాత్పర్యము,

త్వం నిత్యం సవిషణ్ణం మా మాశ్వాసయసి లక్ష్మణ
గతాసు ర్నాద్య శక్నోషి మా మార్త మభిభాషితుమ్. ౧౩

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! సః= అట్టి; త్వం=నీవు; విషణ్ణం=దుఃఖితుండనగు; మాం=నన్ను; ఆశ్వాసయసి= ఊఱడింతువు. అద్య=ఇప్పుడు; గతాసుః=పోయినప్రాణముగలవాఁడవై ; ఆర్తం=దుఃఖితుండగు;మాం=నన్నుఁగూర్చి; అభిభాషితుం=చెప్పుటకు ; నశక్నోషి=చాలవు.

లక్ష్మణుఁడా! నేనుదుఃఖితుండనగుదు నేని , నీవునన్నాశ్వాసింపుచుందువు; ఇంక నీవు,మరణంబునొందినపిదప, నే నెంత దుఃఖితుండనైనను , నన్నాశ్వాసింపఁజాలవుగదా!

అని, తాత్పర్యము.

యే నాద్య నిహతా యుద్ధే రాక్షసా వినిపాతితాః
తస్యా మేవ క్షితౌ వీర స్స శేతే నిహతః పరైః. ౧౪

టీక॥ అద్య=ఇప్పుడు; యేన=ఎవ్వనిచేత; యుద్ధే=యుద్ధమునందు; రాక్షసాః=రాక్షసులు; నిహతాః=చంపఁబడినవారలయి;వినిపాతితాః=పడఁద్రోయఁబడినారో; సః=అట్టి;వీరః=పరాక్రమశాలియగులక్ష్మణుఁడు;తస్యాం = ఆ; క్షితౌ ఏవ=భూమియందే;పరైః= శత్రువులచేత; నిహతః=వధింపఁబడినవాఁడై; శేతే=పరుండియున్నాఁడు.

ఎవ్వఁడు, ఇప్పుడు , యుద్ధంబున రాక్షసులవధించిపడఁద్రోసెనో, అట్టి వీరుండగులక్ష్మణుఁడు, అచ్చట నేశత్రువులచే నిహతుండై ; పరుండి యున్నాఁడు! అని, తాత్పర్యము.

శయాన శ్శరతల్పేస్మిన్ స్వశోణితపరిప్లుతః
శరజాలైశ్చితో భాతి భాస్కరోస్తమివ వ్రజన్. ౧౫

టీక॥ అస్మిన్=ఈ; శరతల్పే= బాణములపాన్పునందు; శయానః=పరుండియున్నవాఁడును ; స్వశోణితపరిప్లుతః=తన నెత్తురుచేఁదడుపఁబడినవాఁడును; శరజాలైః= బాణసమూహములచేత; చితః= వ్యాపింపఁబడినవాఁడునగు; అయం(అధ్యాహృతము)= ఈలక్ష్మణుఁడు; అస్తం = అస్తమయమును; వ్రజన్=పొందుచున్న; భాస్కర ఇవ=సూర్యుఁడువలెఁ; భాతి= ప్రకాశించుచున్నాఁడు.

ఈలక్ష్మణుండిట్లు , బాణములపాన్పునంబరుండి, నెత్తురు వెల్లువలుగాఁగాఱ, బాణములు దేహమంతయుఁ గుచ్చుకొనియుండ, విసంజ్ఞుండైయుండుటంజేసి, అస్తమయమునొందు సూర్యునిపగిది శాంతుండైయున్నాఁడు.

అని, తాత్పర్యము.

బాణాభిహతమర్మత్వా న్నశక్నో త్యభిభాషితుమ్
రుజా చాబ్రువతో ప్యస్య దృష్టిరాగేణ సూచ్యతే. ౧౬

టీక॥ అయం (అధ్యాహృతము) = ఈలక్ష్మణుఁడు; బాణాభిహత మర్మత్వాత్=బాణములచేఁగొట్టఁబడిన జీవస్థానములుగలవాఁడగుటవలన ; అభిభాషితుం=మాటలాడుటకు; నశక్నోతి=చాలఁడు. అబ్రువతోపి=చెప్పనివాఁడైనను;అస్య=ఈలక్ష్మణునియొక్క; రుజా చ=బాధయు;దృష్టిరాగేణ=చూపుసందలిప్రేమచేత; సూచ్యతే=తెలుపఁబడుచున్నది.

జీవస్థానంబులందంతటను బాణంబులంబ్రహరింపఁబడియుండుటవలన , నీలక్ష్మణుండు మాటలాడఁజాలకున్నాఁడు; ఇతండు చెప్పకపోయినను , ఇతనిచూపువలననె, యితనిబాధ తెలియవచ్చుచున్నది. అని, తాత్పర్యము.

యథైవ మాం వనం యాంత మనుయాతో మహాద్యుతిః
అహ మప్యను యాస్యామి తథైవైనం యమక్షయమ్. ౧౭




టీక॥ యత్రైవ = ఎక్కడ; మహాద్యుతిః=అధికమయినకాంతిగల లక్ష్మణుఁడు; వనం=అడవిని; యాంతం=పొందుచున్న; మాం=నన్ను; అనుయాతః = వెంబడించినాఁడో; తత్రైవ=అక్కడ; అహమపి=నేనును; యమక్షయం= యమునిగృహమును; యాంతం (అధ్యాహృతము)=పొందుచున్న; ఏనం= ఈ లక్ష్మణుని; అనుయాస్యామి=వెంబడించెదను.

మహాతేజుండగు నీలక్ష్మణుండు నేను వనంబునకువచ్చు నప్పుడు నన్నెట్లు వెంబడించివచ్చినాఁడో, అట్లే, నేను, యమునియొద్దకుఁబోవు నీలక్ష్మణుని వెంబడించిపోయెదను.

అని, తాత్పర్యము.

ఇష్టబంధుజనో నిత్యం మాంచ నిత్య మనువ్రతః
ఇమా మద్య గతోఽవస్థా మమాఽ నార్యస్య దుర్ణయైః. ౧౮

టీక॥ నిత్యం= ఎల్లప్పుడును ; ఇష్టబంధుజనః=ప్రియులయినబంధుజనులుగలవాఁడును;నిత్యం = ఎల్లప్పుడును; మాంచ=నన్నును;అనువ్రతః= అనుసరించినవాఁడునగు;అయం(అధ్యాహృతము)=ఈలక్ష్మణుఁడు; అనార్యస్య= దుష్టుఁడనగు;మమ=నాయొక్క ; దుర్ణయైః=అక్రమములచేత;అద్య=ఇప్పుడు;ఇమాం=ఈ;అవస్థాం= అవస్థను; గతః=పొందినాఁడు.

ఎల్లప్పుడును బంధుజనులయందుఁబ్రీతిగలవాఁడును ఎల్లప్పుడును నన్ననుసరించియుండువాఁడు నగు నీలక్ష్మణుండు, దుష్టుఁడనగు నాయక్రమములచేత, నిప్పుడీదురవస్థంబొందినాఁడు.

అని, తాత్పర్యము.

సురుష్టేనాపి వీరేణ లక్ష్మణేన న సంస్మరే
పరుషం విప్రియం వాపి శ్రావితం న కదాచన. ౧౯

టీక॥సురుష్టేనాపి= మిక్కిలియుఁగోపించినవాఁడైనను;వీరేణ= పరాక్రమవంతుఁడగు;లక్ష్మణేన=లక్ష్మణునిచేత;పరుషం=కఠినవచనముగాని ; విప్రియం వాపి=అప్రియమయినమాటగాని; న శ్రావితం=వినిపింపఁబడినదిగాదు. న సంస్మరే=స్మరింపను.

వీరుండగునీలక్ష్మణుండెంతకోపము




నొందినను, నాయెదుటం, బరుషముగాం గానియప్రియముగాంగాని పలికినదిలేదు; అట్లుపలికినట్లునాకుజ్ఞప్తియులేదు. అని, తాత్పర్యము.

విససర్జైకవేగేన పంచబాణశతాని యః
ఇష్వస్త్రేష్వధికస్తస్మా త్కార్తవీర్యాచ్చ లక్ష్మణః. ౨౦

టీక॥ యః=ఎవ్వఁడు; ఏకవేగేన=ఒకటేవేగముచేత; పంచ=అయిదైన; బాణశతాని=బాణములనూఱును; విససర్జ= విడిచెనో; ఇష్వస్త్రేషు = బాణాస్త్రములయందు; తస్మాత్=ఆ; కార్తవీర్యాచ్చ=కార్తవీర్యునికన్నను; లక్ష్మణః=లక్ష్మణుఁడు; అధికః = ఎచ్చైనవాఁడు.

ఎవ్వండు, వేయిచేతులుగలవాఁడగుటచే, నేకప్రయత్నంబున నయిదువందలబాణంబులఁబ్రయోగించునో, అట్టికార్తవీర్యునికన్నను, బాణములువిడుచుటయందు, లక్ష్మణుండధికుఁడు; లక్ష్మణుండు రెండు చేతులుగలవాఁడైనను, వేయిచేతులుగలకార్తవీర్యుం డయిదువందల బాణంబులవిడుచునంతకాలములోనంతకన్నహెచ్చుబాణంబుల విడుచును. అని, తాత్పర్యము.

అస్త్రైరస్త్రాణి యో హన్యా చ్ఛక్రస్యాపి మహాత్మనః
సోయ ముర్వ్యాం హత శ్శేతే మహార్హశయనోచితః. ౨౧

టీక॥ యః=ఎవ్వఁడు; అస్త్రైః = బాణములచేత; మహాత్మనః= అధికమయినపరాక్రమముగల; శక్రస్య = ఇంద్రునియొక్క ; అస్త్రాణ్యపి= ఆయుధములనైనను; హన్యాత్ =కొట్టఁజాలునో; సః=అట్టి; మహార్హశయనోచితః=శ్రేష్ఠమయినపాన్పునకుఁదగిన; అయం=ఈలక్ష్మణుఁడు; హతః=కొట్టఁబడినవాఁడై; ఉర్వ్యాం=భూమియందు; శేతే=పరుండియున్నాఁడు.

ఎవ్వండు, బాణంబుల, మహాపరాక్రమశాలియగు నింద్రునిబాణంబులనుగూడ వ్యర్థములుసేయఁజాలునో, అట్టియుత్తమశయనంబునం బరుండఁదగినయీ లక్ష్మణుండు, హతుండై, నేలంబరుండియున్నాఁడు. అని, తాత్పర్యము.

యన్మయా నకృతో రాజా రాక్షసానాం విభీషణః
తచ్చ మిథ్యా ప్రలప్తం మాం ప్రధక్ష్యతి న సంశయః. ౨౨

టీక॥ మయా=నాచేత; విభీషణః= విభీషణుఁడు; రాక్షసానాం= రాక్షసులకు; రాజా=రాజుగా; నకృత(ఇతి) యత్ = చేయఁబడలేదనునది యేదిగలదో; తత్=ఆ; మిథ్యాప్రలప్తంచ=అబద్ధపుమాటయును; మాం = నన్ను; ప్రధక్ష్యతి=దహింపఁగలదు.సంశయః= సందేహము; న=లేదు.

నేను, విభీషణుని రాక్షసరాజుఁగా జేయనైతినిగదా! మున్ను నేనతనికి, నిన్ను రాక్షసరాజుఁగా వించెదనని చెప్పిన యసత్యవచనముగూడ నన్ను దహింపఁగలదు; ఇందుకు సందియములేదు.

అని, తాత్పర్యము.

అస్మిన్ మహూర్తే సుగ్రీవ ప్రతియాతు మితో౽ర్హసి
మత్వాహీనం మయా రాజన్ రావణో౽భిద్రవేద్బలీ. ౨౩

టీక॥సుగ్రీవ=సుగ్రీవుఁడా!త్వం (అధ్యాహృతము)=నీవు;అస్మిన్=ఈ;ముహూర్తే=ముహూర్తమునందు; ఇతః=ఇచ్చటనుండి;ప్రతియాతుం= మఱలుటకు;అర్హసి=తగుదువు.రాజన్= వానరరాజుండవగు సుగ్రీవుఁడా! బలీ= అధికమయినబలముగల ; రావణః = రావణుఁడు; త్వాం ( అధ్యాహృతము)=నిన్ను;మయా=నాచేత;హీనం= విడువఁబడినవానిఁగా;మత్వా = తలఁచి;అభిద్రవేత్=తఱుమును.

వానరరాజుండవగు సుగ్రీవుఁడా! నీవిప్పుడె యిచ్చటనుండికిష్కింధకుఁ బొమ్ము; నేను లేకుండుటను బూచి , బలవంతుండగు రావణుండు,నిన్నుఁ దఱిమికొట్టును- అని, తాత్పర్యము.

అంగదంతు పురస్కృత్య ససైన్య స్ససుహృజ్జనః
సాగరం తర సుగ్రీవ నీలేనచ నలేనచ- ౨౪

టీక॥సుగ్రీవ=సుగ్రీవుఁడా!అంగదంతు=అంగదుని;పురస్కృత్య= మున్నిడికొని;ససైన్యః = సైన్యముతోఁగూడినవాఁడవై ;ససుహృజ్జనః= స్నేహితుల

తోఁగూడినవాఁడవై ;నీలేనచ= నీలునితోను;నలేనచ(సహ) = నలునితోనుఁగూడ;సాగరం=సముద్రమును; తర= దాఁటుము.

సుగ్రీవుఁడా!నీవంగదునిఁ దోడ్తోనిజసైన్యంబులతోను స్నేహితులతోనుంగూడి,నీలుండు నలుండు మున్నగువానరవీరులు గొలువ,సముద్రంబుదాఁటుము.

అని, తాత్పర్యము.

కృతం హనుమతా కార్యం య దన్యై ర్దుష్కరం రణే
ఋక్షరాజేన తుష్యామి గోలాంగూలాధిపేన చ. ౨౫

టీక॥ యత్=ఏది; అన్యైః=ఇతరులచేత; దుష్కరం= చేయనలవిగానిదో; తత్(అధ్యాహృతము) = అట్టి; కార్యం=పని; రణే=యుద్ధమునందు ; హనుమతా = హనుమంతునిచేత; కృతం=చేయఁబడినది . ఋక్షరాజేన= ఎలుఁగుబంటులకుఁ బ్రభువయినజాంబవంతునిచేతను ; గోలాంగూలాధిపేనచ=కొండముచ్చులకుఁబ్రభువైన గవాక్షునిచేతను; తుష్యామి = సంతసించెదను.

హనుమంతుండు, యుద్ధంబున,నితరులకుఁజేయనలవిగాని కార్యముఁ గావించినాఁడు; ఋక్షరాజుండగు జాంబవంతుండును గోలాంగూల నాథుండగు గవాక్షుండును జక్కఁగా యుద్ధముగావించినందుకు సంతోషించి నాను. అని, తాత్పర్యము.

అంగదేన కృతం కర్మ మైందేన ద్వివిదేనచ
యుద్ధం కేసరిణా సంఖ్యే ఘోరం సంపాతినా కృతమ్. ౨౬

టీక॥సంఖ్యే=యుద్ధమునందు; అంగదేన=అంగదునిచేతను; మైందేన = మైందునిచేతను ; ద్వివిదేనచ=ద్వివిదునిచేతను; కర్మ=కార్యము; కృతం= చేయఁబడినది. కేసరిణా= కేసరిచేతను;సంపాతినా=సంపాతిచేతను;ఘోరం=భయంకరమయిన ; యుద్ధం = యుద్ధము; కృతం=చేయఁబడినది.

అంగదుండును మైందుండును ద్వివిదుండును యుద్ధంబునమిక్కిలియుఁ గష్టపడిరి; కేసరియుసంపాతియుననువానరవీరులును, భయంకరముగా యుద్ధ

ముగావించిరి. అని, తాత్పర్యము.

గవయేన గవాక్షేణ శరభేణ గజేనచ
అన్యైశ్చ హరిభి ర్యుద్ధం మదర్థే త్యక్తజీవితైః. ౨౫

టీక॥ మదర్థే= నానిమిత్తమయి; త్యక్తజీవితైః=విడువఁబడిన ప్రాణములుగల; గవయేన=గవయునిచేతను; గవాక్షేణ=గవాక్షునిచేతను; శరభేణ=శరభునిచేతను; గజేనచ= గజునిచేతను; అన్యైః=ఇతరులయిన; హరిభిశ్చ=వానరులచేతను; యుద్ధం = యుద్ధము; కృతం(అధ్యాహృతము)= చేయఁబడినది.

గవయుండును గవాక్షుండును శరభుండును గజుండును మఱియు నితరులగు వానరవీరులును నానిమిత్తమయి ప్రాణములయందాసవిడిచి, చక్కఁగా యుద్ధంబుగావించిరి. అని, తాత్పర్యము.

న చాతిక్రమితుం శక్యం దైవం సుగ్రీవ మానుషైః

టీక॥ సుగ్రీవ = సుగ్రీవుఁడా! మానుషైః=మనుష్యులచేత; దైవం=దైవము; అతిక్రమితుం= దాఁటుటకు; నశక్యంచ= అలవిగానేకాదు.

సుగ్రీవుఁడా! ఎంతప్రయత్నము చేసిననేమి? మనుష్యులకు, దైవమునతిక్రమింపనలవిగాదుగదా!
అని, తాత్పర్యము.

యత్తు శక్యం వయస్యేన సుహృదాచ పరంతప. ౨౮
కృతం సుగ్రీవ తత్సర్వం భవతాఽధర్మభీరుణా

టీక॥ పరంతప=శత్రువులందపింపఁజేయునట్టి; సుగ్రీవ=సుగ్రీవుఁడా! వయస్యేన=మిత్రుఁడును; సుహృదాచ= మంచిమనస్సుగలవాఁడునగు వానిచేత; యత్తు=ఎంత మాత్రము; కర్తుం(అధ్యాహృతము)=చేయుటకు; శక్యం = అలవియగునో; అధర్మభీరుణా = అధర్మమువలనభయపడునట్టి; భవతా= నీచేత; తత్=అది; సర్వం= అంతయు; కృతం=చేయఁబడినది.

శత్రువులందపింపఁజేయునట్టి సుగ్రీవుఁడా! స్నేహితుండును సుహృదుం

డునగువానిచే నెంతమాత్రముచేయశక్యముగునో,నీవుధార్మికుండవుకావున నధర్మమునకుభయపడి, యదంతయు శక్తివంచనలేకగావించినావు.
అని, తాత్పర్యము.

మిత్రకార్యం కృత మిదం భవద్భి ర్వానరర్షభాః. ౨౯
అనుజ్ఞాతా మయా సర్వే యథేష్టం గంతు మర్హథ

టీక॥ వానరర్షభాః= వానరశ్రేష్ఠులారా! భవద్భిః=మీచేత;ఇదం = ఈ; మిత్రకార్యం= స్నేహితునికార్యము; కృతం=చేయఁబడినది. మయా= నాచేత;యూయం(అధ్యాహృతము)= మీరలు; సర్వే = అందఱును;అనుజ్ఞాతాః= అనుమతింపఁబడినారు. యథేష్టం=కోరినట్లు; గంతుం=పోవుటకు; అర్హథ=తగుదురు.

వానరశ్రేష్ఠులారా! మీరుశక్తివంచనలేక , మీస్నేహితునికార్యముగావించినారు ; ఇంకమీకుఁబోననుజ్ఞనొసంగితిని;యథేష్టముగాఁబొండు. అని, రాముండు, చెప్పెను.
అని, తాత్పర్యము.

శుశ్రువు స్తస్య తే సర్వే వానరాః పరిదేవనమ్. ౩౦
వర్తయాంచక్రు రశ్రూణి నేత్రైః కృష్ణేతరేక్షణాః

టీక॥ తే=ఆ;వానరాః = వానరులు;సర్వే=అందఱును;తస్య = ఆరాముని యొక్క;పరిదేవనం = ఏడ్పును; శుశ్రువుః=వినిరి. కృష్ణేతరేక్షణాః= ఎఱ్ఱనికన్నులుగలవారలై ; నేత్రైః= కన్నులచేత; అశ్రూణి = కన్నీళ్లను; వర్తయాంచక్రుః= ప్రవర్తింపఁజేసిరి.

ఆవానరు లందఱును , రామునివిలాపంబువిని , దుఃఖంబునఁగన్నులనెఱ్ఱఁదనంబుగదురఁ,గన్నీళ్లుగార్చిరి.
అని,తాత్పర్యము.

తత స్సర్వాణ్య నీకాని స్థాపయిత్వా విభీషణః. ౩౧
ఆజగామ గదాపాణి స్త్వరితో యత్ర రాఘవః

టీక॥ తతః = అంత; విభీషణః = విభీషణుఁడు; గదాపాణిః = గదచేతంగలవాఁడై; సర్వాణి = సమస్తములయిన; అనీకాని = సైన్యములను; స్థాపయిత్వా = నిలిపి; రాఘవః = రాముఁడు; యత్ర = ఎచ్చటనో; తత్ర (అధ్యాహృతము) = అచ్చటికి; త్వరితః = వేగిరపడినవాఁడై; ఆజగామ = వచ్చెను.

అంత, విభీషణుండు, గదాపాణియై, వానరసైన్యంబుల నన్నింటిని నిలువరించి, వేగంబున రాముండున్నచోటికివచ్చెను.

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా త్వరితం యాంతం నీలాంజనచయోపమమ్. ౩౨
వానరా దుద్రువు స్సర్వే మన్యమానాస్తు రావణిమ్

టీక॥ వానరాః = వానరులు; సర్వే = అందఱును; త్వరితం = వేగముగా; యాంతం = పోవుచున్న; నీలాంజనచయోపమం = నల్లనికాటుకరాసితోఁబోలిక గల; తం = ఆవిభీషణుని; దృష్ట్వా = చూచి; రావణిం = ఇంద్రజిత్తునుగా; మన్యమానాస్తు = తలంచినవారలై యె; దుద్రువుః = పాఱిరి.

వానరులందఱు, నట్లుగదాపాణియయివచ్చుచున్న కాటుకవలెనల్లనిదేహముగలవిభీషణునింజూచి, యింద్రజిత్తనితలంచి, భయంబునంబాఱిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, యుద్ధకాండే, ఏకోనపంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండైకోనపంచాశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

పంచాశస్సర్గప్రారంభః.

అథోవాచ మహాతేజా హరిరాజో మహాబలః
కి మియం వ్యథితా సేనా మూఢవాతేవ నౌ జలే. ౧

టీక॥ అథ=అంత; మహాతేజాః = అధికమయిన పరాక్రమము గలవాఁడు ను; మహాబలః=అధికమయినబలముగ లవాఁడునగు; హరిరాజః = వానరుల కుఁబ్రభువయినసుగ్రీవుఁడు; "కిం=ఎం దుకు; ఇయం=ఈ; సేనా=దండు; జలే=జలమునందు; మూఢవాతా=విరుద్ధమయిన గాలిగల; నౌరివ=ఓడవలె; వ్యథితా=ఆకులమయినది? ఇతి(అధ్యాహృతము)=అని;" ఉవాచ= చెప్పెను.

అంత, మహాతేజుండునుమహాబలశాలియునగువానరరాజుండు సుగ్రీవుండు, వానరులంజూచి, "జలంబులనెదురుగాలిచేఁగొట్టఁబడిన యోడపగిదినీసేనవ్యాకులమయియున్న దేల?" అని, యడిగెను. అని, తాత్పర్యము.

సుగ్రీవస్య వచశ్శ్రుత్వా వాలిపుత్రోఙ్గదోఽబ్రవీత్

టీక॥ సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; వాలిపుత్రః=వాలికుమారుండగు;అంగదః= అంగదుఁడు; అబ్రవీత్=చెప్పెను.

సుగ్రీవుండుచెప్పినదివిని,వాలికుమారుఁడగునంగదుం,డిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

న త్వం పశ్యసి రామంచ లక్ష్మణంచ మహాబలమ్. ౨
శరజాలాచితౌ వీరా వుభౌ దశరథాత్మజౌ
శరతల్పే మహాత్మానౌ శయానౌ రుధిరోక్షితౌ. ౩

టీక॥ త్వం=నీవు;శరజాలాచితౌ= బాణములసమూహములచే వ్యాపింపఁ బడినవారలును; వీరౌ= పరాక్రమవంతులును; శరతల్పే= బాణములపాన్పు

నందు; శయానౌ = పరుండియున్నవారలును; రుధిరోక్షితౌ = నెత్తురుచేఁదడుపఁబడినవారలును; దశరథాత్మజౌ = దశరథునికొడుకులునగు; రామం = రామునిని; మహాబలం = అధికమయినబలముగల; లక్ష్మణంచ = లక్ష్మణునిని; ఉభౌ = ఇద్దఱను; నపశ్యసి = చూడకున్నావా యేమి?

దశరథపుత్రులగుమహాత్ములు రామలక్ష్మణులిద్దఱును, దేహమంతయుబాణంబులుగ్రుచ్చుకొని, బాణతల్పంబునం బరుండి నెత్తుటందోఁగుచున్నారే; నీవు చూడకున్నావా యేమి?

అని, తాత్పర్యము.

అథాబ్రవీ ద్వానరేంద్ర స్సుగ్రీవః పుత్ర మంగదమ్

టీక॥అథ = అంత; వానరేంద్రః = వానరేశ్వరుఁడగు; సుగ్రీవః = సుగ్రీవుఁడు; పుత్రం = కొడుకైన; అంగదం = అంగదునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

అంత, వానరరాజుండగు సుగ్రీవుండు, తనపుత్రుండయిన యంగదుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

నానిమిత్త మిదం మన్యే భవితవ్యం భయేన తు. ౪

టీక॥ఇదం = దీని; అనిమిత్తం = కారణముకానిదానిఁగా; నమన్యే = తలంపను. భయేనతు = మఱియొకభయము చేతను; భవితవ్యం = ఉండుటకావలసినది.

ఇట్లు రామలక్ష్మణులు పడియుండుటయుఁగారణమె; ఇప్పుడుగలిగిన భయమునకుమఱియొక కారణము గూడ నుండవలయును.

అని, తాత్పర్యము.

విషణ్ణ వదనా హ్యేతే త్యక్తప్రహరణా దిశః
ప్రపలాయంతి హరయ స్త్రాసా దుత్ఫుల్లలోచనాః. ౫

టీక॥ఏతే = ఈ; హరయః = వానరులు; విషణ్ణవదనాః = దుఃఖమునొందిన ముఖములుగలవారలయి; త్యక్తప్రహరణాః = విడువఁబడినయాయుధములు గలవారలయి; త్రాసాత్ = భయమువలన; ఉత్ఫుల్లలోచనాః = వికసించినకన్నులు

గలవారలయి ; దిశః = దిక్కులను గూర్చి; ప్రపలాయంతిహి= పరుగెత్తుచున్నారుగదా!

ఈవానరులు, పరమదుఃఖితులయి, భయంబునఁగన్నులు వికసింప, [illegible] వంబులు [illegible] త్తుచున్నారు [illegible].

అని, తాత్పర్యము.

అన్యోన్యస్య న లజ్జంతే ననిరీక్షంతి పృష్ఠతః
విప్రకర్షంతి చాన్యోన్యం పతితం లంఘయంతి చ. ౬

టీక॥ ఏతే(అధ్యాహృతము)= ఈ వానరులు; అన్యోన్యస్య(అన్యోన్యం)= ఒండొరులంగూర్చి; నలజ్జంతే=సిగ్గుపడరు. పృష్ఠతః= వెనుకను; ననిరీక్షంతి= చూడరు. అన్యోన్యం= ఒండొరులను; విప్రకర్షంతిచ = ఈడ్చుకొనుచు నున్నారు. పతితం=పడినవాని ; లంఘయంతిచ=దాఁటుచున్నారును.

ఈవానరులు, ఒకరినిజూచి యొకరైనను సిగ్గుపడక, వెనుకకుఁ దిరిగిచూడక, శీఘ్రముగాఁబోవుటకై యొండొరుల లాగికొనుచు, నేలంబడినవానిలంఘించుచుఁ, బాఱుచున్నారు; చూడుము. అని, సుగ్రీవుండంగదునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరే వీరో గదాపాణి ర్విభీషణః
సుగ్రీవం వర్ధయామాస రాఘవంచ నిరైక్షత. ౭

టీక॥ ఏతస్మిన్నంతరే = ఈమధ్యమునందు; వీరః = పరాక్రమశాలియు; గదాపాణిః = గదచేతంగలవాఁడునగు; విభీషణః = విభీషణుఁడు; సుగ్రీవం=సుగ్రీవుని; వర్ధయామాస= ఆశీర్వదించెను. రాఘవంచ= రామునిని; నిరైక్షత=చూచెను.

ఇంతలోపల, మహాపరాక్రమశాలి యగువిభీషణుండు గదాపాణియయి వచ్చి, సుగ్రీవునాశీర్వదించి, రాముంజూచెను. అని, తాత్పర్యము.

విభీషణం తం సుగ్రీవో దృష్ట్వా వానరభీషణమ్
ఋక్షరాజం సమీపస్థం జాంబవంత మువాచహ. ౮




టీక॥ సుగ్రీవః=సుగ్రీవుఁడు; తం = ఆ; విభీషణం=విభీషణుని ; వానర భీషణం=వానరులకుభయము గలిగించు వానిఁగా; దృష్ట్వా = చూచి; సమీపస్థం=సమీపముననున్న; ఋక్షరాజం= ఎలుఁగుబంటులకుఁ బ్రభువయిన జాంబవంతునిగూర్చి; ఉవాచ = చెప్పెను. ("హ" అనునది పాదపూరణార్థము.)

సుగ్రీవుండు, విభీషణుం జూచియె వానరులట్లుభయపడు చున్నారని తెలిసికొని, తనచెంగటనున్న భల్లూకరాజుండగుజాంబవంతుంజూచి , యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

విభీషణోయం సంప్రాప్తో యం దృష్ట్వా వానరర్షభాః
విద్రవంతి పరిత్రస్తా రావణాత్మజశంకయా. ౯

టీక॥ వానరర్షభాః= వానరశ్రేష్ఠులు; యం=ఎవ్వని; దృష్ట్వా= చూచి; రావణాత్మజశంకయా= రావణునికొడుకైన యింద్రజిత్తనుసందేహము చేత; పరిత్రస్తాః = భయపడినవారలయి; విద్రవంతి= పరుగెత్తుచున్నారో; అయం=ఈ; విభీషణః=విభీషణుఁడు ; సంప్రాప్తః=వచ్చినాఁడు.

ఇదిగో విభీషణుండువచ్చినాఁడు; వానరవీరులు, ఇతనిఁజూచియె యింద్రజిత్తనిసందేహించి, భయముపడి, పరుగెత్తుచున్నారు. అని, తాత్పర్యము.

శీఘ్రమేతాన్ సుసంత్రస్తాన్ బహుధా విప్రధావితాన్
పర్యవస్థాపయాఖ్యాహి విభీషణ ముపస్థితమ్. ౧౦

టీక॥ సుసంత్రస్తాన్= మిక్కిలియు భయపడినవారలును; బహుధా= పెక్కువిధములను; విప్రధావితాన్= పరుగెత్తుచున్నవారలునగు; ఏతాన్=ఈ వానరవీరులను; శీఘ్రం=శీఘ్రముగా; పర్యవస్థాపయ= నిలువరింపుము. విభీషణం=విభీషణుని; ఉపస్థితం=వచ్చినవానిఁగా; ఆఖ్యాహి=చెప్పుము.

నీవు, పరమభీతులయి నానావిధములం బరుగెత్తుచున్న యీవానరవీరులనందఱను, శీఘ్రముగానిలువరించి, "విభీషణుండువచ్చినాఁడు. ఇంద్రజిత్తుగాఁడని




వీరలకుఁ జెప్పుము. అని,సుగ్రీవుండు, జాంబవంతునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము,

సుగ్రీవేణైవ ముక్తస్తు జాంబవా నృక్షపార్థివః
వానరా౯ సాంత్వయామాస సన్నిరుధ్య ప్రధావతః. ౧౧

టీక॥ ఋక్షపార్థివః= ఎలుఁగుబంటులకు రాజయిన; జాంబవా౯= జాంబవంతుండు; సుగ్రీవేణ = సుగ్రీవునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు= చెప్పఁబడినవాఁడైనంతనె; ప్రధావతః= పరుగెత్తుచున్న; వానరా౯=వానరులను; సన్నిరుధ్య=అడ్డగించి; సాంత్వయామాస=ఊరడించెను.

భల్లూకరాజుండగు జాంబవంతుండు, సుగ్రీవునిమాటనువిని, పరుగెత్తుచున్నవానరులనుమఱలించి,వారలనందఱ నాశ్వాసించెను. అని, తాత్పర్యము.

తే నివృత్తాః పునస్సర్వే వానరా స్త్యక్తసంభ్రమాః
ఋక్షరాజవచ శ్శ్రుత్వా తంచ దృష్ట్వా విభీషణమ్. ౧౨

టీక॥ తే=ఆ; వానరాః= వానరులు; ఋక్షరాజవచః= ఎలుఁగుబంటులకుఁ బ్రభువయినజాంబవంతుని మాటను; శ్రుత్వా=విని; తం=ఆ; విభీషణంచ= విభీషణుని; దృష్ట్వా=చూచి; పునః=మఱల; త్యక్తసంభ్రమాః= విడువఁబడిన తొట్రుపాటుగలవారలయి; నివృత్తాః= మరలినారు.

ఆ వానరులందఱునుభల్లూకరాజుండగుజాంబవంతునిమాటనువిని విభీషణుని జూచి, మఱలభయమునువిడిచి, మఱలి వచ్చిరి. అని, తాత్పర్యము.

విభీషణస్తు రామస్య దృష్ట్వా గాత్రం శరైశ్చితమ్
లక్ష్మణస్యచ ధర్మాత్మా బభూవ వ్యథితేంద్రియః. ౧౩

టీక॥ ధర్మాత్మా= ధర్మస్వభావుఁడగు; విభీషణస్తు=విభీషణుఁడును; రామస్య = రాముని యొక్కయు; లక్ష్మణస్యచ = లక్ష్మణుని యొక్కయు;

గాత్రం = దేహమును; శరైః = బాణములచేత; చితం = వ్యాపింపఁబడినదానిఁగా; దృష్ట్వా = చూచి; వ్యథితేంద్రియః = దుఃఖితములయినయింద్రియములుగలవాఁడు; బభూవ = అయ్యెను.

ధర్మాత్ముండగువిభీషణుండు, రామలక్ష్మణులదేహములంతయును బాణంబులుగ్రుచ్చుకొనియుండుటనుజూచి, పరమదుఃఖితుండయ్యెను.

అని, తాత్పర్యము.

జలక్లిన్నేన హస్తేన తయో ర్నేత్రే ప్రమృజ్యచ
శోకసంపీడితమనా రురోద విలలాపచ. ౧౪

టీక॥ సః(అధ్యాహృతము) = ఆవిభీషణుఁడు; జలక్లిన్నేన = నీటిచేఁదడిసిన; హస్తేన = చేతిచేత; తయోః = ఆరామలక్ష్మణులయొక్క; నేత్రే = కన్నులను; ప్రమృజ్యచ = తుడిచియు; శోకసంపీడితమనాః = దుఃఖముచేతఁ బీడింపఁబడినమనస్సుగలవాఁడయి; రురోద = ఏడ్చెను; విలలాపచ = విలపించెను.

అంత, విభీషణుండు, చేతనీళ్లు దీసికొని, యారామలక్ష్మణులకన్నులం దుడిచి, పరమదుఃఖితుండై, రోదనంబు సేయుచు నిట్లని విలపించెను.

అని, తాత్పర్యము.

ఇమౌ తౌ సత్త్వసంపన్నౌ విక్రాంతౌ ప్రియసంయుగౌ
ఇమా మవస్థాం గమితౌ రాక్షసైః కూటయోధిభిః. ౧౫

టీక॥ సత్త్వసంపన్నౌ = బలముతోఁ గూడినవారలును; విక్రాంతౌ = పరాక్రమముగలవారలును; ప్రియసంయుగౌ = ఇష్టమయినయుద్ధముగల వారలునగు; తౌ = ఆ; ఇమౌ = ఈరామలక్ష్మణులు; కూటయోధిభిః = కపటముచేఁబోరునట్టి; రాక్షసైః = రాక్షసులచేత; ఇమాం = ఈ. అవస్థాం = అవస్థను; గమితౌ = పొందింపఁబడినారు.

ఈరామలక్ష్మణులు, బలవంతులును బరాక్రమవంతులును యుద్ధప్రియులును అయినను, ఈరాక్షసులుకపటముతోయుద్ధముసేయువారలు, కావున, నిట్టిదురవస్థంబొందిరి.

అని, తాత్పర్యము.

భ్రాతుః పుత్రేణ మే తేన దుష్పుత్రేణ దురాత్మనా
రాక్షస్యా జిహ్మయా బుద్ధ్యా ఛలితా వృజువిక్రమౌ. ౧౬

టీక॥ ఋజువిక్రమౌ = కపటములేనిపరాక్రమముగల రామలక్ష్మణులు; మే = నాయొక్క; భ్రాతుః = అన్నయొక్క; పుత్రేణ = కొడుకును; దుష్పుత్రేణ = దుష్టపుత్రుండును; దురాత్మనా = దుష్టబుద్ధిగలవాఁడునగు; తేన = ఆయింద్రజిత్తుచేత; రాక్షస్యా = రాక్షససంబంధియయిన; జిహ్మయా = కుటిలమయిన; బుద్ధ్యా = బుద్ధిచేత; ఛలితౌ = మోసపుచ్చఁబడిరి.

నిష్కపటముగా యుద్ధముసేయునట్టియీ రామలక్ష్మణులను, దుష్టుఁగుఁడును దల్లికడుపు చెడఁబుట్టినవాఁడును నాయన్నకొడుకునగు నింద్రజిత్తు, రాక్షససాధారణమయిన కుటిలబుద్ధిచే, మోసపుచ్చెను. అని, తాత్పర్యము.

శరైరిమౌ వలం విద్ధౌ రుధిరేణ సముక్షితౌ
వసుధాయామిమౌ సుప్తౌ దృశ్యేతే శల్యకావివ. ౧౭

టీక॥ ఇమౌ = ఈరామలక్ష్మణులు; శరైః = బాణములచేత; అలం = చక్కఁగా; విద్ధౌ = కొట్టఁబడినవారలయి; రుధిరేణ = నెత్తురుచేత; సముక్షితౌ = తడుపఁబడినవారలయి; స్తః (అధ్యాహృతము) = ఉన్నారు. ఇమౌ = ఈరామలక్ష్మణులు; వసుధాయాం = భూమియందు; సుప్తౌ = నిదురించిన; శల్యకావివ = ముండ్లపందులవలె; దృశ్యేతే = చూడఁబడుచున్నారు.

నెత్తుటం దోఁగుచు భూమింబరుండియున్న ఈరామలక్ష్మణులు, దేహమంతయు బాణములు గ్రుచ్చుకొని నిండియుండుటంజేసి, నేలపైనిదురించుచుండు ముండ్లపందులుంబోలెఁ జూపట్టుచున్నారు. అని, తాత్పర్యము.

యయోర్వీర్యముపాశ్రిత్య ప్రతిష్ఠాకాంక్షితా మయా
తావుభౌ దేహనాశాయ ప్రసుప్తౌ పురుషర్షభౌ. ౧౮

టీక॥ యయోః= ఎవ్వరియొక్క; వీర్యం = పరాక్రమమును; ఆశ్రిత్య= ఆశ్రయించి;మయా = నాచేత; ప్రతిష్ఠా=ప్రతిష్ఠ; కాంక్షితా = కోరఁబడినదో;తౌ=అట్టి; పురుషర్షభౌ= పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు ; ఉభౌ=ఇద్దఱును;దేహనాశాయ = దేహమునశించుటకొఱకు;ప్రసుప్తౌ= నిదురించినారు.

నేనెవ్వరిపరాక్రమంబు నాశ్రయించి ప్రతిష్ఠఁబొందవలయునని యుంటినో, అట్టిపురుషోత్తములగు రామలక్ష్మణులిద్దఱు , నేలంబరుండి , మృతిఁబొందునట్లున్నారు.

అని, తాత్పర్యము.

జీవ న్నద్య విపన్నోస్మి నష్ట రాజ్యమనోరథః
ప్రాప్త ప్రతిజ్ఞ శ్చ రిపు స్సకామో రావణః కృతః. ౧౯

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; నష్టరాజ్యమనోరథః = పోయినరాజ్యమునందలి కోరిక గలవాఁడనై; జీవన్ = బ్రతికియున్నవాఁడనై ; అద్య=ఇప్పుడు;విపన్నః= ఆపదనుబొందినవాఁడను;అస్మి = అగుచున్నాను. రిపుః=శత్రువయిన; రావణః = రావణుఁడు; ప్రాప్తప్రతిజ్ఞః = పొందఁబడినప్రతినగలవాఁడును ; సకామః= కోర్కెతోఁగూడినవాఁడునుగా;కృతః= చేయఁబడినాఁడు.

నాకు , రాజ్యంబునొందవలెనను కోర్కెయుఁ బోయినది ; ఇంకబ్రతికియున్న, మిక్కిలియు నాపదగలుగును; నాశత్రువు రావణుండు , తనప్రతినను గోర్కెని నెఱవేచుకొనెను , అని,విభీషణుండువిలపించెను.

అని, తాత్పర్యము.

ఏవం విలపమానం తం పరిష్వజ్య విభీషణమ్
సుగ్రీవ స్సత్వసంపన్నో హరిరాజో బ్రవీ దిదమ్. ౨౦

టీక॥ సత్త్వసంపన్నః= అధికమయినధైర్యముగలవాఁడును ; హరిరాజః=వానరరాజుండునగు; సుగ్రీవః = సుగ్రీవుఁడు; ఏవం= ఇట్లు; విలపమానం= విలపించుచున్న; తం=ఆ;విభీషణం=విభీషణుని;పరిష్వజ్య=కవుఁగిలించు

కొని; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

ధైర్యశాలియగువానరరాజుండును గ్రీవుండు, ఇట్లు, విలపించుచున్న విభీషణునిం గవుఁగిలించుకొని, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రాజ్యం ప్రాప్స్యసి ధర్మజ్ఞ లంకాయాం నాత్రసంశయః
రావణ స్సహపుత్రేణ సహ కామ మవాప్స్యతే. ౨౧

టీక॥ ధర్మజ్ఞ=ధర్మము నెఱింగినవాఁడవగు విభీషణుఁడా! లంకాయాం=లంకాపురియందు; రాజ్యం=దొరతనమును; ప్రాప్స్యసి=పొందఁగలవు. అత్ర=ఈవిషయమునందు; సంశయః=సందేహము; న=లేదు. ఇహ=ఇప్పుడు; రావణః=రావణుఁడు; పుత్రేణసహ=కొడుకుతోఁగూడ; కామం=కోరికని; నావాప్స్యతే=పొందఁజాలఁడు.

ధర్మవేత్తవగువిభీషణుఁడా! నీవు లంకారాజ్యంబునొందఁగలవు; ఈవిషయమునందుసందేహములేదు; రావణుండును అతని కొడుకును, కృతకృత్యులుకాఁజాలరు. అని, తాత్పర్యము.

న రుజాపీడితా వేతా వుభౌ రాఘవలక్ష్మణౌ
త్యక్త్వా మోహం వధిష్యే తే సగణం రావణం రణే. ౨౨

టీక॥ఏతౌ=ఈ; రాఘవలక్ష్మణౌ=రామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును; రుజాపీడితౌ=రోగముచే బీడింపఁబడినవారలు; న=కారు. మోహం=మూర్ఛను; త్యక్త్వా=విడిచి; రణే=యుద్ధమునందు; సగణం=సమూహముతోఁగూడిన; రావణం=రావణుని; వధిష్యేతే=చంపఁగలరు.

ఈరామలక్ష్మణులకుదీనివలనఁబాధ ణపఃణనిగలుగదు; వీరలు, మూర్ఛఁజేఁటి, యుద్ధంబునరాక్షససమేతంబుగా రావణునివధింపఁగలరు. అని, సుగ్రీవుండువిభీషణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తమేవం సాంత్వయిత్వాతు సమాశ్వాస్యచ రాక్షసమ్

సుషేణం శ్వశురం పార్శ్వే సుగ్రీవ స్త ముచవాచహ. ౨౩

టీక॥సుగ్రీవః=సుగ్రీవుఁడు; తం=అ; రాక్షసం = రాక్షసుఁడైనవిభీషణునిఁ;ఏవం = ఇట్లు;సాంత్వయిత్వాతు=ఊఱడించియు;సమాశ్వాస్యతు = అశ్వాసించియు; పార్శ్వే= ప్రక్కను; శ్వశురం=మామయగు;తం = అ;సుషేణం = సుషేణునిగూర్చి; ఉవాచ=చెప్పెను "హ" అనునది పాదపూరణార్థము.

సుగ్రీవుండు, ఇట్లువిభీషణుని మృదువచనంబులనాశ్వాసించి , తనసమీపంబుననున్నమామనుసుషేణుంజూచి, యిట్లని,చెప్పెను- అని,తాత్పర్యము.

సహ శూరై ర్హరిగణై ర్లబ్ధసంజ్ఞా వరిందమా
గచ్ఛత్వం భ్రాతరౌగృహ్య కిష్కింధాం రామలక్ష్మణౌ. ౨౪

టీక॥ త్వం=నీవు; శూరైః=యుద్ధమునందుభయములేనట్టి ; హరిగణైస్సహ= వానరసమూహములతోఁగూడ; లబ్ధసంజ్ఞా=పొందఁబడిన తెలివిగల; అరిందమౌ=శత్రువులనడఁగఁదొక్కునట్టి; భ్రాతరౌ=అన్నదమ్ములగు;రామలక్ష్మణౌ =రామలక్ష్మణులను ; గృహ్య(గృహీత్వా)=తీసికొని ; కిష్కింధాం= కిష్కింధనుగూర్చి; గచ్ఛ=పొమ్ము.

నీవు,శత్రువులనడంగఁద్రొక్కంజాలినయీ రామలక్ష్మణులుమూర్ఛదేఱినపిదపవీరలందీసికొని, శూరులగువానరవీరుల కొందఱితోఁగూడఁగిష్కింధకుఁబొమ్ము.అని,తాత్పర్యము.

అహంతు రావణంహత్వా సహపుత్రం సబాంధవమ్
మైథిలీ మానయిష్యామి శక్రో నష్టామివ శ్రియమ్. ౨౫

టీక॥ అహంతు= నేనుమాత్రము; సహపుత్రం = కొడుకులతోఁ గూడినవాఁడును; సబాంధవం = బంధువులతోఁగూడినవాఁడునగు ; రావణం=రావణుని;హత్వా= చంపి;మైథిలీం=సీతాదేవిని;శక్రః = ఇంద్రుఁడు ; న

ష్టాం=పోయిన; శ్రియమివ = రాజ్యలక్ష్మినివలె; ఆనయిష్యామి = తెచ్చెదను.

నేను , బుత్రబంధుసమేతంబుగా రావణునివధించి , దేవేంద్రుండునశించినరాజ్యలక్ష్మింబోలె, సీతాదేవిని దెచ్చెదను. అని, తాత్పర్యము.

శ్రుత్వైత ద్వానరేంద్రస్య సుషేణో వాక్య మబ్రవీత్

టీక ॥ సుషేణః = సుషేణుఁడు; వానరేంద్రస్య= వానరనాథుండగుసుగ్రీవునియొక్క; ఏతత్ = ఈమాటను; శ్రుత్వా=విని;వాక్యం = మాటను;అబ్రవీత్=చెప్పెను.

సుషేణుండువానరరాజుండగు సుగ్రీవుండు చెప్పినమాటనువిని , యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

దైవాసురం మహద్యుద్ధ మనుభూతం సుదారుణమ్. ౨౬

టీక॥ దైవాసురం = దేవాసురసంబంధియగు; సుదారుణం = మిక్కిలియుభయంకరమగు; మహత్ = గొప్పదగు;యుద్ధం=యుద్ధము ; మయా (అధ్యాహృతము)= నాచేత;అనుభూతం=అనుభవింపఁబడినది.

మున్ను మహాభయంకరమగు దేవాసుర యుద్ధంబును నేను జూచియున్నాను. అని, తాత్పర్యము.

తదా స్మ దానవా దేవాన్ శరసంస్పర్శకోవిదాః
నిజఘ్నుశ్శస్త్రవిదుష శ్ఛాదయంతో ముహుర్ముహుః. ౨౭

టీక॥ తదా=అప్పుడు("స్మ" అనునదిపాదపూరణార్థము); శరసంస్పర్శకోవిదాః=బాణములప్రయోగించుటయందుఁబండితులును;శస్త్రవిదుషః= ఆయుధములయందుఁబండితులునగు ; దానవాః= దానవులు; ముహుర్ముహుః=మాటిమాటికి; ఛాదయంతః= కప్పుచు;దేవాన్=దేవతలను;నిజఘ్నుః= కొట్టిరి.

అప్పుడు, బాణములప్రయోగించు

టయందుఁబండితులును, ఆయుధవిద్యాకుశలులునగు నసురులు, మాయచేసి, దేవతలనుజక్కఁగాఁబ్రహరించిరి.

అని, తాత్పర్యము.

తా న్నార్తా న్నష్టసంజ్ఞాంశ్చ పరాసూంశ్చ బృహస్పతిః
విద్యాభి ర్మంత్రయుక్తాభి రోషధీభి శ్చికిత్సతి. ౨౫

టీక॥ బృహస్పతిః=బృహస్పతి; ఆర్తాన్=పీడితులును; నష్టసంజ్ఞాంశ్చ=పోయినతెలివిగలవారలును; పరాసూంశ్చ=పోయినప్రాణములుగల వారలును; తాన్=ఆ దేవతలను; మంత్రయుక్తాభిః=మంత్రములతోఁగూడిన; విద్యాభిః=విద్యలచేతను; ఓషధీభిశ్చ=మూలికలచేతను; చికిత్సతి=చికిత్సచేసెను.

అట్లు దేవతలు, కొందఱుబాణపీడితులునుగొందఱుమూర్ఛితులునుగొందఱుమృతులునై యుండ, బృహస్పతిమృతసంజీవనిమున్నగువిద్యలచేతనుమూలికలచేతను వారలకుఁజికిత్సచేసెను.

అని, తాత్పర్యము.

తా న్యౌషధా న్యానయితుం క్షీరోదం యాంతు సాగరమ్
జవేన వానరా శ్శీఘ్రం సంపాతిపనసాదయః. ౨౬

టీక॥ సంపాతిపనసాదయః=సంపాతియుఁబనసుఁడును మొదలు గాఁగల; వానరాః=వానరులు; జవేన=వేగముచేత; శీఘ్రం=శీఘ్రముగా; తాని=ఆ; ఔషధాని=ఔషధములను; ఆనయితుం(ఆనేతుం)=తోడ్కొనివచ్చుటకు; క్షీరోదం=పాలెజలముగాఁగల; సాగరం=సముద్రమునుగూర్చి; యాంతు=పోవుదురు గాక.

ఆయౌషధంబులందెచ్చుటకై, సంపాతియుఁబనసుండును మున్నగువానరులు, వేగంబునక్షీరసముద్రంబునకుఁబోవుదురు గాక. అని, తాత్పర్యము.

హరయస్తు విజానంతి పార్వతీ స్తా మహౌషధీః

టీక॥ హరయస్తు=వానరులుమాత్రము; పార్వతీః=కొండలందుఁబుట్టిన; తాః=ఆ; మహౌషధీః=మహామూలికలను; విజానంతి=ఎఱుంగుదురు.

వానరులకుమాత్రము, పర్వతంబుల నంటుకట్టి యామహౌషధుల తెలియును. అని, తాత్పర్యము.

సంజీవకరణీం దివ్యాం విశల్యాం దేవనిర్మితామ్. ౩౦

టీక॥ దివ్యాం= స్వర్గమునందుఁ బుట్టిన; సంజీవకరణీం = సంజీవకరణియనుమూలికను; దేవనిర్మితాం= దేవతలచేనిర్మింపఁబడిన; విశల్యాం= విశల్యకరణియనుమూలికను; ఆనయంతు (అధ్యాహృతము) = తెత్తురుగాక.

దేవతలచే నిర్మింపబడినవగు సంజీవకరణి విశల్యకరణి యను నీరెండు మూలికలం దేవఁ దెయును.

అని, తాత్పర్యము.

చంద్రశ్చ నామ ద్రోణశ్చ క్షీరోదే సాగరోత్తమే
అమృతం యత్ర మథితం తత్ర తే పరమౌషధీ. ౩౧

టీక॥ సాగరోత్తమే= సముద్రశ్రేష్ఠమగు; క్షీరోదే= క్షీరసముద్రమునందు; యత్ర=ఎచ్చట; అమృతం= అమృతము; మథితం= చిలుకఁబడినదో; తత్ర (అధ్యాహృతము)=అచ్చట; చంద్రశ్చ = చంద్రపర్వతమనియు; ద్రోణశ్చనామ=ద్రోణపర్వతమనియు; స్తః (అధ్యాహృతము)=కలవు. తత్ర=ఆపర్వతములందు; తే=ఆ; పరమౌషధీ= ఉత్తమములగుమూలిక లయిన సంజీవ కరణియు విశల్యకరణియు; స్తః(అధ్యాహృతము)=ఉన్నవి.

సముద్రశ్రేష్ఠమగు క్షీరసముద్రమునందు, మున్ను దేవతలమృతము మథించిన స్థలంబునఁ, జంద్రపర్వతమనియు ద్రోణపర్వతమనియు రెండుపర్వతంబు లున్నవి; ఆపర్వతములందు, సంజీవకరణియు విశల్యకరణియునను నామహౌషధులున్నవి.

అని, తాత్పర్యము.

తే తత్ర నిహితే దేవైః పర్వతే పరమౌషధీ

టీక॥ తే=ఆ; పరమౌషధీ=ఉత్త మములయినయోషధులు; తత్ర=అచంద్రద్రోణపర్వతములయందు; దేవైః=దేవతలచేత; నిహితే=ఉంచఁబడినవి.

ఉత్తమములయిన మూలికలగుసంజీవకరణియువిశల్యాకరణియునాచంద్రద్రోణపర్వతములయందు, దేవతలచేనుంచఁబడినవి. అని, తాత్పర్యము.

అయం వాయుసుతో రాజన్ హనుమాం స్తత్ర గచ్ఛతు. ౩౨

టీక॥ రాజన్= వానరరాజుండవగుసుగ్రీవుఁడా! వాయుసుతః=వాయుకుమారుండగు; అయం=ఈ; హనుమాన్=హనుమంతుండు; తత్ర=అచ్చటికి; గచ్ఛతు=పోవునుగాక.

వానరరాజుండవగు సుగ్రీవుఁడా! వాయుదేవునికుమారుండగు హనుమంతుని, నాచంద్రద్రోణ పర్వతంబులయొద్దకుఁబంపుము. అని, సుషేణుండు, సుగ్రీవునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏతస్మిన్నంతరే వాయు ర్మేఘాంశ్చాపి సవిద్యుతః
పర్యస్య సాగరే తోయం కంపయన్నివ మేదినీమ్. ౩౩

టీక॥ ఏతస్మిన్నంతరే = ఈమధ్యమునందు; వాయుః=గాలి; సవిద్యుతః=మెఱుపులతోఁగూడిన; మేఘాంశ్చాపి=మేఘములను; సాగరే=సముద్రమునందు; తోయం=జలమును; పర్యస్య = త్రిప్పి; మేదినీం= భూమిని; కంపయన్నివ=కదలించునదివలె; వవౌ= (అధ్యాహృతము)=వీచెను.

ఇంతలో, మెఱుపులతోఁగూడమేఘంబులనెగురఁగొట్టుచు, సముద్రజలంబులంగలంచుచు భూమింగదలించునట్లు పెనుగాలియొకటివీచెను.

అని, తాత్పర్యము.

మహతా పక్షవాతేన సర్వే ద్వీపమహాద్రుమాః
నిపేతు ర్భగ్నవిటపా స్సమూలా లవణాంభసి. ౩౪

టీక॥ ద్వీపమహాద్రుమాః = ద్వీపమునందలిపెద్దవృక్షములు ; సర్వే=

అన్నియు; మహతా = గొప్పదగు; పక్షవాతేన = తెక్కలగాలిచేత; భగ్నవిటపాః= విఱిగినకొమ్మలుగలవై; సమూలాః= వేళ్లతోఁగూడినవై; లవణాంభసి=ఉప్పుసముద్రమునందు; నిపేతుః=పడినవి.

లంకా ద్వీపమునందలి మహావృక్షములన్నియుఁ, బక్షవాతంబునఁ గొమ్మలువిఱిగి, వేళ్లతోఁగూడ సముద్రంబునం బడినవి.

అని, తాత్పర్యము.

అథవన్ పన్నగా స్త్రస్తా భోగిన స్తత్రవాసినః
శీఘ్రం సర్వాణి యాదాంసి జగ్ముశ్చ లవణార్ణవమ్. ౩౫

టీక॥ తత్రవాసినః= ఆసముద్రమునందుండునట్టి; భోగినః = ప్రశస్తమయినశరీరములుగల ; పన్నగాః= సర్పములు; త్రస్తాః = భయపడినవి; అథవన్=అయినవి. సర్వాణి= సమస్తములయిన; యాదాంసిచ = జలజంతువులును; శీఘ్రం = శీఘ్రముగా; లవణార్ణవం = ఉప్పుసముద్రమును; జగ్ముః=పొందినవి.

ఆసముద్రంబున నుండునట్టి సర్పములన్నియు భయంబునొందినవి ; జలజంతువు లన్నియు భయంబునొంది సముద్రములోనికిం జొచ్చినవి.

అని, తాత్పర్యము.

తతో ముహూర్తా ద్గరుడం వైనతేయం మహాబలమ్
వానరా దదృశు స్సర్వే జ్వలంత మివ పావకమ్. ౩౬

టీక॥తతః=అంత ; ముహూర్తాత్=స్వల్పకాలంబువలన ; వానరాః= వానరులు; సర్వే=అందఱును; వైనతేయం=వినతకొడుకును; మహాబలం= అధికమయినబలముగలవాఁడును; జ్వలంతం=మండుచున్న ; పావకమివ (స్థితం)=అగ్నిహోత్రుఁడువలెనున్నవాఁడునగు; గరుడం=గరుత్మంతుని ; దదృశుః=చూచిరి.

అంత, మఱికొంతసేపునకు, వానరులందఱు, మహాబలుండును జ్వలించుచున్న యగ్నికైవడిఁ దేజరిల్లుచున్నవాఁడునగు గరుత్మంతునింబొడగనిరి.

అని, తాత్పర్యము.

తమాగత మభిప్రేక్ష్య నాగా స్తే విప్రదుద్రువుః
యైస్తౌ సత్పురుషౌ బద్ధౌ శరభూతై ర్మహాబలౌ. ౩౭

టీక॥ శరభూతైః= బాణములయి నట్టి; యైః=ఏసర్పములచేత ; మహాబలౌ=అధికమయినబలముగల; తౌ=ఆ; సత్పురుషౌ= రామలక్ష్మణులు; బద్ధౌ= బంధింపఁబడిరో; తే=ఆ; నాగాః= సర్పములు; ఆగతం=వచ్చిన; తం= ఆ గరుత్మంతుని; అభిప్రేక్ష్య=చూచి; విప్రదుద్రువుః= పాఱినవి.

ఇంద్రజిత్తు బాణరూపము లయిన యేసర్పములచే మహాబలశాలులగు రామలక్ష్మణులను బంధించెనో, ఆసర్పములన్నియు, గరుత్మంతుండు వచ్చుటం జూచి, భయంబునం బాఱినవి.

అని, తాత్పర్యము.

తత స్సుపర్ణః కాకుత్స్థౌ దృష్ట్వా ప్రత్యభినందితః
విమమర్శ చ పాణిభ్యాం ముఖే చంద్రసమప్రభే ౩౮

టీక॥ తతః=అంత; సుపర్ణః= గరుత్మంతుఁడు; కాకుత్స్థౌ= రామలక్ష్మణులను; దృష్ట్వా=చూచి ; ప్రత్యభినందితః=పూజింపఁబడినవాఁడై ; పాణిభ్యాం=చేతులచేత; చంద్రసమప్రభే= చంద్రునితో సమానమయినకాంతిగల ; ముఖే=ముఖములను; విమమర్శ చ = తడవెను.

అంత, గరుత్మంతుండు , రామలక్ష్మణులం జూచి, వారలచేఁబూజితుండై, తనరెండుచేతులతోను, జంద్రబింబసమానంబులగు వారలముఖంబులం దడవెను. అని, తాత్పర్యము.

వైనతేయేన సంస్పృష్టా స్తయో స్సంరురుహు ర్వ్రణాః
సువర్ణే చ తనూ స్నిగ్ధే తయో రాశు బభూవతుః. ౩౯

టీక॥ తయోః = ఆ రామలక్ష్మణులయొక్క; వ్రణాః = గాయములు; వైనతేయేన=గరుత్మంతునిచేత ; సంస్పృష్టాః = తాఁకఁబడినవై; సంరురుహుః = మొలిచినవి, సరియయినవనుట. తయోః = ఆరామలక్ష్మణులయొక్క; తనూచ=దేహములును ; ఆశు= శీఘ్రముగా; సువర్ణే చ= మంచిరంగు

గలవియు;స్నిగ్ధే = నునుపైనవియు ; బభూవతుః=అయ్యెను.

గరుత్మంతుండు , హస్తంబులం దడవుటచే , నారామలక్ష్మణులదేహమునందలి గాయములన్నియు మాసినవి ; వారలదేహములును , శీఘ్రంబున,మంచిరంగుగలవియు స్నిగ్ధంబులు నయినవి. అని, తాత్పర్యము.

తేజో వీర్యం బలం చౌజ ఉత్సాహశ్చ మహాగుణః
ప్రదర్శనంచ బుద్ధిశ్చ స్మృతిశ్చ ద్విగుణం తయోః. ౪౦

టీక॥తయోః = ఆరామలక్ష్మణులయొక్క ; తేజః = పరులనోడించుశక్తియు;వీర్యం=పరాక్రమమును;బలంచ=బలమును;ఓజశ్చ=కాంతియు; మహాగుణః=అధికమయినగుణముగల ; ఉత్సాహశ్చ=ఉత్సాహమును;ప్రదర్శనంచ=సూక్ష్మార్థమునుజూచుశక్తియు ; బుద్ధిశ్చ= వివేకమును;స్మృతిశ్చ=జ్ఞప్తియును; సర్వం(అధ్యాహృతము) = అంతయు; ద్విగుణం=రెండింతలు;ఆసీత్(అసీత్(అధ్యాహృతము)=అయినది.

అంత, నారామలక్ష్మణులకు, దేజస్సునుబరాక్రమంబును బలంబునుగాంతియునుత్సాహంబునసూక్ష్మార్థపరిజ్ఞానంబునుబుద్ధియుస్మృతియు,మున్నున్నదానికన్న రెండింతలయినవి.

అని, తాత్పర్యము.

ఈశ్లోకంబున , "ప్రదర్శనంచబుద్ధిశ్చ" అనుస్థలంబుననుండునట్టి,"ధి"అనునక్షరముచే, గాయత్రిపదునేడవయక్షరము గ్రహింపంబడినది.పదియాఱువేలశ్లోకంబు లయినవి. ఇంకంబదునేడవశ్లోకసహస్రంబారంభింపంబడినది.

తావుత్థాప్య మహావీర్యౌ గరుడో వాసవోపమౌ
ఉభౌ తౌ సస్వజే హృష్టో రామ శ్చైన మువాచ హ. ౪౧

టీక॥ గరుడః=గరుత్మంతుఁడు; మహావీర్యౌ= అధికమయినపరాక్రమము గలవారలును; వాసవోపమౌ=ఇంద్రునితోఁబోలిక-గలవారలునగు; తౌ=ఆరామలక్ష్మణులను;ఉత్థాప్య=లేపి;హృష్టః=సంతసించిన; తౌ=ఆరామలక్ష్మణులను; ఉభౌ=ఇద్దఱను ; సస్వజే=కవుఁగిలించికొనెను. రామశ్చ=రాముం

దును ; ఏనం=ఈగరుత్మంతునిగూర్చి: ఉవాచ=చెప్పెను ("హ" అనునది పాదపూరణార్థము).

గరుత్మంతుండు, మహాపరాక్రమశాలులును దేవేంద్రసమానులునగు నారా మలక్ష్మణులను లేవనెత్తి, పరమసంతుష్టులయియున్న వారలం గవుఁగిలించుకొనెను; అంత, రాముండు, గరుత్మంతుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

భవత్ప్రసాదా ద్వ్యసనం రావణిప్రభవం మహత్
ఆవా మిహ వ్యతిక్రాంతౌ పూర్వవ ద్బలినౌ కృతౌ. ౪౨

టీ॥ ఆవాం = మేము; భవత్ప్రసాదాత్ = నీయనుగ్రహము వలన; రావణిప్రభవం = ఇంద్రజిత్తుకారణముగాఁగల; మహత్ = గొప్పదగు; వ్యసనం=కష్టమును;ఇహ = ఇప్పుడు; వ్యతిక్రాంతౌ=కడచినాము . పూర్వవత్ =మున్నువలె;బలినౌ = అధికమయినబలముగలవారలమును;కృతౌ=చేయఁబడినాము.

మీయనుగ్రహంబున, మాకిప్పుడింద్రజిత్తువలనం గలిగిన మహావ్యసనంబు గడచినది ; మఱియుమునుపటివలె బలవంతులము నైతిమి. అని, తాత్పర్యము.

యథా తాతం దశరథం యథాజం చ పితామహమ్
తథా భవంత మాసాద్య హృదయం మే ప్రసీదతి. ౪౩

టీ॥ తాతం = తండ్రియగు;దశరథం=దశరథుని ; ఆసాద్య (అధ్యాహృతము)= పొంది;యథా= ఎట్లో; పితామహం=తాతయగు ; అజంచ= అజుని; ఆసాద్య (అధ్యాహృతము)= పొంది;యథా=ఎట్లో;భవంతం = నిన్ను;ఆసాద్య=పొంది;తథా = అట్లు; మే=నాయొక్క; హృదయం = మనస్సు;ప్రసీదతి=ప్రసన్నమగుచున్నది.

నాతండ్రియగు దశరథ మహారాజును నాతాతయగు నజమహారాజును జూచినట్లు, నిన్నుఁజూడఁగా, నా మనస్సు మిక్కిలియుఁ బ్రసన్నమగుచున్నది. అని, తాత్పర్యము.

కో భవాన్ రూపసంపన్నో దివ్యస్రగనులేపనః

వసానో విరజే వస్త్రే దివ్యాభరణభూషితః. ౪౩

టీక॥ రూపసంపన్నః= రూపముతోఁగూడినవాఁడవును ; దివ్యస్రగనులేపనః = శ్రేష్ఠములయినపుష్పమాలికలును మైపూఁతయు గలవాఁడవును; విరజే = నిర్మలములయిన; వస్త్రే= వస్త్రములను;వసానః = కట్టుకొన్నవాఁడవును ; దివ్యాభరణభూషితః= శ్రేష్ఠములయినయాభరణములచే నలంకరింపఁబడినవాఁడవునగు ; భవాన్= నీవు;కః=ఎవ్వఁడవు?

రూపవంతుండవై దివ్యంబులగు పుష్పమాలికలు దాల్చి సుగంధానులేపనంబుఁ బూసికొని , నిర్మలంబులగు వస్త్రంబులంగట్టుకొని, దివ్యాభరణంబులుధరించి, చూపరులకెంతయు నాశ్చర్యంబు గలిగించుచున్నావు ; నీవెవ్వండవు ? అని , రాముండు గరుత్మంతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

త ముహాచ మహాతేజా వైనతేయో మహాబలః
పతత్రిరాజః ప్రీతాత్మా హర్షపర్యాకులేక్షణః. ౪౫

టీక॥మహాతేజాః = అధికమయినకాంతిగలవాఁడును;మహాబలః= అధికమయినబలముగలవాఁడును; పతత్రిరాజః=పక్షులకుఁబ్రభుండునగు; వైనతేయః=గరుత్మంతుండు;ప్రీతాత్మా=సంతసించినమనస్సుగలవాఁడై; హర్షపర్యాకులేక్షణః=సంతోషంబునంగలంగినకన్నులుగలవాఁడై;తం= ఆరాముని గూర్చి;ఉవాచ=చెప్పెను.

మహాతేజుండును మహాబలుండునగు పక్షిరాజుఁడైనగరుత్మంతుఁడు , రాముంజూచి, పరమసంతుష్టుండై, కన్నుల నానందబాష్పంబులు గార,నిట్లని, చెప్పెను. అని,తాత్పర్యము.

అహం సఖా తే కాకుత్స్థ ప్రియః ప్రాణో బహిశ్చరః
గరుత్మా నిహ సంప్రాప్తో యువాభ్యాం సాహ్యకారణాత్. ౪౬

టీక॥కాకుత్స్థ= రాముఁడా ! అహం=నేను; తే=నీయొక్క;సఖా= స్నే

హితుండను. ప్రియః=ఇష్టుండను. బహిశ్చరః=బయటందిరుగునట్టి; ప్రాణః=ప్రాణమును; గరుత్మాన్=గరుత్మంతుండను; యువాభ్యాం=మీకొఱకు; సాహ్యకారణాత్=సాహాయ్యమునిమిత్తమయి, సంప్రాప్తః=వచ్చినాను.

రాముఁడా! నేనునీకు స్నేహితుండను ప్రియుండను బహిశ్చరంబగుప్రాణంబువంటివాఁడను; నాపేరు గరుత్మంతుండందురు; మీకుసాహాయ్యంబుసేయుటకై యిచ్చటికివచ్చినాను.

అని, తాత్పర్యము.

అసురా వా మహావీర్యా దానవా వా మహాబలాః
సురాశ్చాపి సగంధర్వాః పురస్కృత్య శతక్రతుమ్. ౪౭
నేమం మోక్షయితుం శక్తా శ్శరబంధం సుదారుణమ్
మాయాబలా దింద్రజితా నిర్మితం క్రూరకర్మణా. ౪౮

టీక॥ మహావీర్యాః=అధికమయినపరాక్రమముగల; అసురావా=అసురులుగాని; మహాబలాః=అధికమయినబలముగల; దానవావా=దానవులుగాని; శతక్రతుం=దేవేంద్రుని; పురస్కృత్య=ముందిడికొని; సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన; సురాశ్చాపి=దేవతలునుగాని; క్రూరకర్మణా=క్రూరమయిన కార్యముగల; ఇంద్రజితా=ఇంద్రజిత్తుచేత; మాయాబలాత్=మాయాబలమువలన; నిర్మితం=నిర్మింపఁబడినదియు; సుదారుణం=మిక్కిలియు భయంకరమునగు; ఇమం=ఈ; శరబంధం=బాణబంధమును; మోక్షయితుం=విడిపించుటకు; నశక్తాః=చాలినవారలుకారు.

క్రూరకర్ముండగు నింద్రజిత్తుచే నిర్మింపఁబడిన మహాభయంకరంబయిన యీబాణపాశంబుల విడిపించుటకు, మహాపరాక్రమశాలులగు నసురులచేఁగాని మహాబలశాలులగు దానవులచేఁగాని, మహేంద్రసహితులగు దేవగంధర్వులచేఁగాని, యలవిగాదు.

అని, తాత్పర్యము.

ఏతే నాగాః కాద్రవేయా స్తీక్ష్ణదంష్ట్రా విషోల్బణాః
రక్షోమాయాప్రభావేన శరా భూత్వా త్వదాశ్రితాః. ౪౯

టీక॥ ఏతే=ఇవి; తీక్ష్ణదంష్ట్రాః = కఠినములయినకోఱలుగలవియు ; విషోల్బణాః=విషముచేనతిశయించినవియు నగు; కాద్రవేయాః= కద్రువకొడుకులగు;నాగాః= సర్పములు;రక్షోమాయాప్రభావేన= రాక్షసుండగునింద్రజిత్తుయొక్క-మాయాప్రభావముచేత; శరాః=బాణములుగా; భూత్వా = అయి;త్వాం శ్రితాః=నిన్నుఁబొందినవి.

ఇవి, తీక్ష్ణదంష్ట్రములును మహావిషములునగుకద్రువకుఁబుట్టినసర్పములు; ఇంద్రజిత్తుమాయాప్రభావంబునం జేసి,బాణరూపంబునొంది,నిన్నుఁబొందినవి. అని, తాత్పర్యము.

సభాగ్యశ్చాసి ధర్మజ్ఞ రామ సత్యపరాక్రమ
లక్ష్మణేన సహభ్రాత్రా సమరే రిపుఘాతినా. ౫౦

టీక॥ ధర్మజ్ఞ=ధర్మము నెఱింగినవాఁడవును; సత్యపరాక్రమ=ఎట్టికాలమునందును వ్యర్థముకాని పరాక్రమముగలవాఁడవునగు; రామ= రాముఁడా! సమరే=యుద్ధమునందు ; రిపుఘాతినా=శత్రువునుజంపునట్టి ; భ్రాత్రా=తమ్ముఁడయిన;లక్ష్మణేనసహ= లక్ష్మణునితోఁగూడ; త్వం (అధ్యాహృతము)=నీవు; సభాగ్యశ్చ= భాగ్యముతోఁగూడినవాఁడవును; అసి = అగుచున్నావు.

ధర్మజ్ఞుండవు,సత్యపరాక్రముఁడవునగు రాముఁడా! యుద్ధంబునశత్రువును వధించునట్టితమ్ముండగులక్ష్మణుండును నీవును భాగ్యవంతులరు, కావున మీకేమియుభయములేదు. అని, తాత్పర్యము.

ఇమం శ్రుత్వాతు వృత్తాంతం త్వరమాణో ఽహ మాగతః
సహసా యువయోస్స్నేహా త్సఖిత్వ మనుపాలయన్. ౫౧

టీక॥ అహం=నేను; ఇమం=ఈ ; వృత్తాంతం = సమాచారమును; శ్రుత్వాతు=విన్నంతనె;త్వరమాణః=వేగిరపడుచున్నవాఁడనై ; యువయోః = మీయొక్క; స్నేహాత్=స్నేహమువలన; సఖిత్వం=స్నేహితుండగుటను; అనుపాలయన్ = పాలించుచు ; సహసా=వేగంబున; ఆగతః= వచ్చినాను.

నేను, ఇట్లుమీరలింద్రజిత్తుచే నాగపాశంబులబంధింపఁబడియుండుటను వి

న్నంతనె, మీయందలిస్నేహంబున, మిత్రధర్మంబేర్పడ, వేగంబుననిచ్చటికివచ్చితిని. అని, తాత్పర్యము.

మోక్షితౌ చ మహాఘోరా దస్మా త్సాయకబంధనాత్
అప్రమాదశ్చ కర్తవ్యో యువాభ్యాం నిత్యమేవహి. ౫౨

టీక॥ మయా(అధ్యాహృతము) = నాచేత; యువాం(అధ్యాహృతము)= మీరలు; మహాఘోరాత్ = మహాభయంకరమయిన; అస్మాత్ = ఈ ; సాయకబంధనాత్ = బాణబంధముననుండి; మోక్షితౌచ = విడిపింపఁబడినవారలును. యువాభ్యాం = మీచేత; నిత్యమేవ = ఎల్లప్పుడునే; అప్రమాదశ్చ = ఏమఱుపాటులేమియు; కర్తవ్యః = చేయఁబడవలసినది.

అట్లు, మహాభయంకరంబగునాగపాశబంధంబుననుండి, మిమ్ము విడిపించితిని; మీరలీయుద్ధంబున నెంతమాత్రమేనియేమఱుపాటు నొందఁగూడదు.

అని, తాత్పర్యము.

ప్రకృత్యా రాక్షసా స్సర్వే సంగ్రామే కూటయోధినః
శూరాణాం శుద్ధభావానాం భవతా మార్జవం బలమ్. ౫౩

టీక॥ రాక్షసాః = రాక్షసులు; సర్వే = అందఱును; ప్రకృత్యా = స్వభావముచేత; సంగ్రామే = యుద్ధమునందు; కూటయోధినః = కపటముచేఁబోరువారలు. శూరాణాం = యుద్ధమునందుభయములేనట్టి ; శుద్ధభావానాం = పరిశుద్ధమయినహృదయముకల; భవతాం = మీకు; ఆర్జవం = కపటములేకుండుట; బలం = బలము.

రాక్షసులందఱు, యుద్ధంబునఁగపటముగాఁబోరువారలు ; వారలస్వభావమేయది; శూరులరునునిర్మలమయిన మనస్సుగలవారలునగు మీరు, ఎంతమాత్రము కపటము లేనివారలు; అదియెమీకుబలము. అని, తాత్పర్యము.

త న్నవిశ్వసితవ్యం వో రాక్షసానాం రణాజిరే
ఏతేనై వోపమానేన నిత్యం జిహ్మా హి రాక్షసాః. ౫౪

టీక॥ తత్=అందువలన ; రణాజిరే=యుద్ధభూమియందు ; రాక్షసానాం=రాక్షసులవిషయమయి ; వః=మీరు; నవిశ్వసితవ్యం=నమ్మటకూడదు.ఏతేన=ఈ ; ఉపమానేనైవ=నిదర్శనముచేతనే;నిత్యం = ఎల్లప్పుడును;రాక్షసాః=రాక్షసులు ; జిహ్మాః=కుటిలులుగదా!

అందువలన, మీరలు, యుద్ధంబున, రాక్షసులనెంతమాత్రము నమ్మవలదు ; ఈనిదర్శనముచేతనే రాక్షసుల నమ్మరాదని తెలియవచ్చినది గదా ! అని , గరుత్మంతుండు, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవముక్త్వా తతో రామం సుపర్ణ స్సుమహాబలః
పరిష్వజ్య సుహృత్ స్నిగ్ధ మాప్రష్టు ముపచక్రమే. ౫౫

టీక॥ సుమహాబలః= మిక్కిలియు నధికమయినబలముగలవాఁడును ; సుహృత్ = స్నేహితుండునగు; సుపర్ణః=గరుత్మంతుండు;రామం= రామునిగూర్చి;ఏవం=ఇట్లు ; ఉక్త్వా=చెప్పి;తతః=అంత;స్నిగ్ధం= స్నేహంబుతోఁగూడునట్లుగా; పరిష్వజ్య = కవుఁగిలించుకొని; ఆప్రష్టుం = పీడుకొనుటకు;ఉపచక్రమే=ఆరంభించెను.

మహాబలశాలియగు గరుత్మంతుండు,రామునితోనీప్రకారముచెప్పి, రాముని సస్నేహంబుగాఁ గవుఁగిలించుకొని , యంతఁబోయివచ్చెదనని చెప్పనారంభించెను. అని, తాత్పర్యము.

సఖే రాఘవ ధర్మజ్ఞ రిపూణా మపి వత్సల
అభ్యనుజ్ఞాతు మిచ్ఛామి గమిష్యామి యథా గతమ్. ౫౬

టీక॥ సఖే= చెలికాఁడవును; ధర్మజ్ఞ = ధర్మమునెఱింగినవాఁడవును; రిపూణామపి = శత్రువులవిషయమయిగూడ; వత్సల= అధికప్రేమగలవాఁడవునగు; రాఘవ=రాముఁడా!అభ్యనుజ్ఞాతుం=అనుమతించుటకు;ఇచ్ఛామి=కోరుచున్నాను. యథాగతం=వచ్చినట్లు ; గమిష్యామి=పోయెదను.

నాచెలికాఁడవుధర్మంబుఁదెలిసినవాఁడవుశత్రువులయందుఁగూడనధికము

గాఁ బ్రేమగలవాఁడవునగు రామునఁడా! నాకనుమతియొసంగుము; నేనుబోవల యును. అని, తాత్పర్యము.

నచ కౌతూహలం కార్యం సఖిత్వంప్రతి రాఘవ
కృతకర్మా రణే వీర సఖిత్వ మను వేత్స్యసి. ౫౭

టీక॥ రాఘవ = రామునఁడా! సఖిత్వంప్రతి = చెలిమినిగూర్చి ; కౌతూహలంచ = తెలియువేడుకయు; నకార్యం = చేయఁదగినదికాదు. వీర = పరాక్రమశాలివగురామునఁడా! రణే = యుద్ధమునందు; కృతకర్మా = చేయఁబడినకార్యముగలవాఁడవై; సఖిత్వం = చెలికాఁడగుటను; అనువేత్స్యసి = తెలియఁగలవు.

పరాక్రమశాలివగు రామునఁడా! నేనునీకెట్లుస్నేహితుఁడనై తిననియిప్పుడడుగవలదు; యుద్ధంబునఁగృతకృత్యుండవై చెలిమిగలిగినసంగతిం దెలిసికొనఁగలవు. అని, తాత్పర్యము.

బాలవృద్ధావశేషాంతు లంకాం కృత్వా శరోర్మిభిః
రావణంచ రిపుంహత్వా సీతాం సముపలప్స్యసే. ౫౮

టీక॥ శరోర్మిభిః = బాణపరంపరలచేత; లంకాం = లంకను; బాలవృద్ధావశేషాంతు = బాలురునుముసలివారలునేమిగతగాఁ గలదానిఁగా ; కృత్వాతు = చేసియు; రిపుం = శత్రువయిన; రావణం = రావణం = రావణుని; హత్వాచ = చంపియు; సీతాం = సీతాదేవిని; సముపలప్స్యసే = పొందఁగలవు.

బాణపరంపరలచేలంకయందుబాలవృద్ధులుమాత్రముమిగులునట్లుచేసి, శత్రుండగు రావణునివధించి, సీతంబొందఁగలవు. అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా వచనం సుపర్ణః శ్శీఘ్రవిక్రమః
రామంచ విరుజం కృత్వా మధ్యే తేషాం వనౌకసామ్. ౫౯
ప్రదక్షిణం తతః కృత్వా పరిష్వజ్యచ వీర్యవాన్
జగామాకాశ మావిశ్య సుపర్ణః పవనో యథా. ౬౦

టీక॥ వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగల; శీఘ్రవిక్రమః = శీఘ్రమయిననడకగల; సుపర్ణః = గరుత్మంతుండు; ఇత్యేవం = అనియిట్లు; వచనం = మాటను; ఉక్త్వా = చెప్పి; రామం చ = రామునిఁ; విరుజం = బాధలేనివానిఁగా; కృత్వా = చేసి; తతః = అంత; తేషాం = ఆ; వనౌకసాం = వానరులయొక్క; మధ్యే = నడుమను; ప్రదక్షిణం = ప్రదక్షిణమును; కృత్వా = చేసి; పరిష్వజ్య చ = కవుఁగిలించుకొనియు; సుపర్ణః = గరుత్మంతుఁడు; పవనో యథా = వాయువువలె; ఆకాశం = ఆకాశమును; ఆవిశ్య = ప్రవేశించి; జగామ = పోయెను.

మహాపరాక్రమశాలియు శీఘ్రమున నడచువాఁడునగు గరుత్మంతుండు, ఈప్రకారమునం జెప్పి, రామలక్ష్మణుల నీరోగులుగాఁ జేసి, ఆవానరులనడుమనా రామలక్ష్మణులకుఁ బ్రదక్షిణంబుగావించి, వారలం గవుఁగిలించుకొని, వాయువుంబోలె, నాకాశమార్గంబునం బోయెను.

అని, తాత్పర్యము.

విరుజౌ రాఘవౌ దృష్ట్వా తతో వానరయూథపాః
సింహనాదాం స్తదా నేదు ర్లాంగూలాన్ దుధువు స్తదా.౬౧

టీక॥ తతః = అంత; తదా = అప్పుడు; వానరయూథపాః = వానరశ్రేష్ఠులు; విరుజౌ = రోగములేనట్టి; రాఘవౌ = రామలక్ష్మణులను; దృష్ట్వా = చూచి; తదా = అప్పుడు; సింహనాదాన్ = సింహనాదంబులను; నేదుః = అఱచిరి. లాంగూలాన్ = తోఁకలను; దుధువుః = విదిలించిరి

అంతనప్పుడు, వానరవీరులు, రామలక్ష్మణులేమియు శ్రమంబులేక సుఖశరీరులుగా నుండుటం జూచి, పరమసంతోషంబున, సింహనాదంబులు సేయుచు, లాంగూలంబులువిదిలించిరి.

అని, తాత్పర్యము.

తతో భేరీ స్సమాజఘ్ను ర్మృదంగాం శ్చా ప్యనాదయన్
దధ్ము శ్శంఖాన్ సంప్రహృష్టాః క్ష్వేళంత్యపి యథా పురమ్.౬౨

టీక॥ తతః = అంత ; వానరాః (అధ్యాహృతము) = వానరులు; యథాపు

స ౫౦

తం=మును పటివలె; సంప్రహృష్టాః= సంతోషించినవారలయి; భేరీః= భేరులు; సమాజఘ్నుః= కొట్టిరి. మృదంగాంశ్చాపి=మద్దెళలను; అనాదయన్= వాయించిరి. శంఖాన్=శంఖములను; దధ్ముః=ఊదిరి. క్ష్వేళంత్యపి=సింహనాదంబులును జేసిరి.

అంత, వానరు, లెప్పటియట్లు, సంతుష్టులయి భేరులువాయించిరి; మృదంగంబులను వాయించిరి; శంఖంబులం బూరించిరి; సింహనాదంబులుగావించిరి. అని, తాత్పర్యము.

ఆస్ఫోట్యాస్ఫోట్య విక్రాంతా వానరా నగయోధినః
ద్రుమా నుత్పాట్య వివిధాం స్తస్థు శ్శతసహస్రశః. ౬౩

టీక॥ నగయోధినః= వృక్షములచేఁ బోరునట్టి; వానరాః = వానరులు; విక్రాంతాః = పరాక్రమించినవారలై; ఆస్ఫోట్యాస్ఫోట్య = భుజంబుఁజఱచి చఱచి; వివిధాన్= నానావిధములయి; ద్రుమాన్ = వృక్షములను; ఉత్పాట్య= పెల్లగించి; శతసహస్రశః = లక్షలులక్షలుగా; తస్థుః=నిలిచిరి.

వృక్షములం బోరునట్టి వానరులు, పరాక్రమగర్వితులయి, మాటిమాటికి భుజంబుల నాస్ఫాలించుచు, నానావిధంబులగు వృక్షంబులం బెకలించి, వానిం జేతనిడుకొని యుద్ధంబునకు సన్నద్ధులయి నిలిచిరి. అని, తాత్పర్యము.

విసృజంతో మహానాదాం స్త్రాసయంతో నిశాచరాన్
లంకాద్వారా ణ్యుపాజగ్ము ర్యోద్ధుకామాః ప్లవంగమాః. ౬౪

టీ॥ ప్లవంగమాః = వానరులు; మహానాదాన్ = మహాధ్వనులను; విసృజంతః=విడుచుచు; నిశాచరాన్= రాక్షసులను; త్రాసయంతః = భయపఱచుచు; యోద్ధుకామాః = యుద్ధంబు సేయఁగోరువారలయి; లంకాద్వారాణి= లంకాపట్టణద్వారములను; ఉపాజగ్ముః=పొందిరి.

వానరులు మహాధ్వని గలుగునట్లు సింహనాదంబులు సేయుచు, రాక్షసులకు భయంబుగలిగించుచు; యుద్ధంబు సేయనుత్సాహంబు సెలంగ, లంకాద్వారంబులనరికట్టిరి.

అని, తాత్పర్యము.

తతస్తు భీమ స్తుములో నినాదో
బభూవ శాఖామృగయూథపానామ్
క్షయే నిదాఘస్య యథా ఘనానాం
నాద స్సుభీమో నదతాం నిశీథే. ౬౫

టీక॥ తతస్తు=అంతను; నిశీథే=అర్ధరాత్రమునందు ; నదతాం=అఱచుచున్న; శాఖామృగయూథపానాం = వానరశ్రేష్ఠులయొక్క; నినాదః= ధ్వని; నిదాఘస్య=గ్రీష్మర్తువుయొక్క ; క్షయే=నాశమునందు;ఘనానాం=మేఘములయొక్క; సుభీమః=మిక్కిలియు భయంకరమయిన; నాదోయథా=ధ్వనివలె; భీమః=భయంకరముగాను; తుములః = దొమ్మిగాను; బభూవ = ఉండెనది.

అంత, నర్ధరాత్రంబున , సింహనాదంబులు సేయుచుండు వానరవీరులధ్వని, వర్షర్తువునందు గర్జించుచున్నట్టి మేఘంబులమహాధ్వనివలె , నతిభయంకరంబుగా,వినవచ్చుచుండెనది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
యుద్ధకాండే, పంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండపంచాశసర్గటీక,
ముగిసినది.



శ్రీః

ఏకపంచాశస్సర్గప్రారంభః.

తేషాం సుతుములం శబ్దం వానరాణాం తరస్వినామ్
నదతాం రాక్షసై స్సార్ధం తదా శుశ్రావ రావణిః. ౧

టీక॥ తదా=అప్పుడు; రావణిః= రావణుఁడు; రాక్షసైస్సార్ధం= రాక్షసులతోఁగూడ; నదతాం= అఱచుచున్న; తరస్వినాం=అధికమయినబలముగల; తేషాం=ఆ;వానరాణాం= వానరులయొక్క; సుతుములం=మిక్కిలియుదొమ్మియయిన; శబ్దం=ధ్వనిని; శుశ్రావ=వినెను.

అప్పుడు, బలవంతులగునావానరులట్లుసింహనాదంబులు సేయుచుండనాధ్వనిని, రావణుండును రాక్షసులునువినిరి. అని, తాత్పర్యము.

స్నిగ్ధగంభీరనిర్ఘోషం శ్రుత్వా స నినదం భృశమ్
సచివానాం తత స్తేషాం మధ్యే వచన మబ్రవీత్. ౨

టీక॥సః=ఆరావణుఁడు; భృశం=మిక్కిలియు; స్నిగ్ధగంభీరనిర్ఘోషం = నునుపైనదియు గంభీరమయినదియు నగు ధ్వనిగల; నినదం= సింహనాదంబును; శ్రుత్వా=విని; తతః=అంత ; తేషాం=ఆ;సచివానాం= మంత్రులయొక్క; మధ్యే=నడుమునందు;వచనం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

ఆరావణుండు, స్నిగ్ధంబును గంభీరంబునగు నాధ్వనినివిని, మంత్రులనడుమ, వారలంజూచి,యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

యథా సౌ సంప్రహృష్టానాం వానరాణాం సముత్థితః
బహూనాం సుమహానాదో మేఘానామివ గర్జతామ్. ౩
వ్యక్తం సుమహతీ ప్రీతి రేతేషాం నాత్ర సంశయః

టీక॥యథా=ఎట్లు; సంప్రహృష్టానాం = మిక్కిలియు సంతసించిన; బహూనాం=పెక్కండ్రైన ; వానరాణాం = వానరులయొక్క; అసౌ = ఈ; సుమహానాదః= మిక్కిలియు గొప్పదగుధ్వని;గర్జతాం= గర్జించుచున్న; మేఘానామివ = మేఘములయొక్కవలె; సముత్థితః=లేచినదో; తథా (అధ్యాహృతము)=అట్లు; వీతేషాం= వీరలకు;సమహతీ = మిక్కిలియునధికమయిన; ప్రీతిః=సంతోషము ; ఆసీత్ (అధ్యాహృతము) = కలిగినది . వ్యక్తం=స్పష్టము. అత్ర= ఈవిషయమునందు; సంశయః=సందేహము; న= లేదు.

ఈవానరులుపెక్కండ్రుచేరి, మహామేఘంబులు గర్జించునట్లు, సింహనాదంబులు సేయుచున్నారుకావున, వీరలకుఁ బరమసంతోషంబుగలిగినట్లున్నది; ఇదిస్పష్టము; ఇందువుసందేహము లేదు. అని, తాత్పర్యము.

తథాహి విపులై ర్నాదై శ్చుక్షుభే వరుణాలయః. ౪

టీక॥తథాహి=అదియుక్తమె.విపులైః=పెద్దవగు; నాదైః=ధ్వనులచేత; వరుణాలయః=సముద్రము;చుక్షుభే= కలంగినది.

అదియుక్తమె;అమ్మహా ధ్వనులచేతనె సముద్రంబునుక్షోభంబు నొందినది; చూడుఁడు. అని, తాత్పర్యము.

తౌతు బద్ధౌ శరై స్తీక్ష్ణై ర్భ్రాతరౌ రామలక్ష్మణౌ
అయంచ సుమహాన్నాద శ్శంకాం జనయతీవ మే. ౫

టీక॥భ్రాతరౌ= అన్నదమ్ములగు; తౌ=ఆ; రామలక్ష్మణౌతు=రామలక్ష్మణులును;తీక్ష్ణైః=కఱకులయిన; శరైః= బాణములచేత;బద్ధౌ= కట్టఁబడినారు. అయం=ఈ;సుమహాన్= మిక్కిలియు గొప్పదగు;నాదశ్చ=ధ్వనియును;శ్రూయతే(అధ్యాహృతము)= వినఁబడుచున్నది. మే=నాకు;శంకాం = సందేహమును;జనయతి=కలిగించుచున్నది. "ఇవ"అనునదివాక్యాలంకారార్థకము.

అప్పుట, నారామలక్ష్మణులును దీక్ష్ణబాణంబులబద్ధులయియున్నారు; ఈమ

షాధ్వనియువినవచ్చుచున్నది; కావున, నాకుసందేహముగానున్నది. అని, తాత్పర్యము.

ఏతత్తు వచనం చోక్త్వా మంత్రిణో రాక్షసేశ్వరః
ఉవాచ నైరృతాం స్తత్ర సమీపపరివర్తినః. ౬

టీక॥ రాక్షసేశ్వరః = రాక్షసులకుఁబ్రభుఁడగు రావణుఁడు ; మంత్రిణః = మంత్రులనుగూర్చి ; ఏతత్ = ఈ ; వచనంతు = మాటనుమాత్రము ; ఉక్త్వాతు = చెప్పినంతనే ; తత్ర = అచ్చట ; సమీపపరివర్తినః = సమీపంబుననుండునట్టి ; నైరృతాన్ = రాక్షసులనుగూర్చి ; ఉవాచ = చెప్పెను.

రాక్షసరాజుండగు రావణుఁడు, ఈప్రకారమునమంత్రులతోఁజెప్పి, యచ్చట సమీపంబునఁగాచియుండు రాక్షసులంజూచి, యిట్లని, యాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

జ్ఞాయతాం తూర్ణ మేతేషాం సర్వేషాం వనచారిణామ్
శోకకాలే సముత్పన్నే హర్షకారణ ముత్థితమ్. ౭

టీక॥ ఏతేషాం = ఈ ; వనచారిణాం = వానరులకు ; సర్వేషాం = అందఱకును ; శోకకాలే = దుఃఖకాలము ; సముత్పన్నే = పుట్టినదైయుండఁగా ; ఉత్థితం = లేచిన ; హర్షకారణం = సంతోషకారణము ; తూర్ణం = శీఘ్రముగా ; జ్ఞాయతాం = తెలియఁబడుఁగాక.

ఇప్పుడు దుఃఖంబునకుఁ గాలముగా నుండఁగా, నీవానరులందఱు సంతోషంబుతో నుండుటకుఁ గారణమేమో శీఘ్రంబున నారసిరండు. అని, రావణుండు రాక్షసులకాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

తథోక్తా స్తేన సంభ్రాంతాః ప్రాకార మధిరుహ్య తే
దదృశుః పాలితాం సేనాం సుగ్రీవేణ మహాత్మనా. ౮

టీక॥ తే = ఆరాక్షసులు ; తేన = ఆరావణునిచేత ; తథా = అట్లు ; ఉక్తాః =

చెప్పఁబడినవారలయి; సంభ్రాంతాః= తొట్రుపడినవారలయి; ప్రాకారం= ప్రాకారిని; అధిరుహ్య= ఎక్కి ; మహాత్మనా= అధికమయిన పరాక్రమముగల; సుగ్రీవేణ= సుగ్రీవునిచేత; పాలితాం= పాలింపఁబడిన; సేనాం = వానరసేనను; దదృశుః= చూచిరి.

ఆ రాక్షసులు, రావణుని యాజ్ఞను విని, సంభ్రాంతులయి, ప్రాకారంబు నారోహించి, మహాత్ముఁడగు సుగ్రీవుని చేఁబరిపాలితంబగు వానరసేనం జూచిరి అని, తాత్పర్యము.

తౌ చ ముక్తౌ సుఘోరేణ శరబంధేన రాఘవౌ
సముత్థితౌ మహాభాగౌ విషేదుః ప్రేక్ష్య రాక్షసాః. ౯

టీక॥ రాక్షసాః= రాక్షసులు ; సుఘోరేణ = మిక్కిలియు భయంకరమయిన; శరబంధేన= బాణబంధము చేత ; ముక్తౌ= విడువఁబడినవారలును; సముత్థితౌ= లేచినవారలును ; మహాభాగౌ= పూజ్యమయిన భాగ్యముగలవారలు నగు; తౌ= ఆ; రాఘవౌ చ = రామలక్ష్మణులను; ప్రేక్ష్య= చూచి; విషేదుః= దుఃఖించిరి.

రాక్షసులు, మహాభయంకరంబగు బాణపాశబంధంబు వదలి సుఖంబున నున్న మహాభాగులగు రామలక్ష్మణులను జూచి, దుఃఖంబునొందిరి. అని, తాత్పర్యము.

సంత్రస్తహృదయాః సర్వే ప్రాకారాదవరుహ్య తే
విషణ్ణవదనా ఘోరా రాక్షసేంద్రముపస్థితాః. ౧౦

టీక॥ ఘోరాః= భయంకరులగు ; తే= ఆ రాక్షసులు; సర్వే= అందఱును; సంత్రస్తహృదయాః = భయమునొందిన మనస్సుగలవారలయి; ప్రాకారాత్= ప్రాకారమునుండి; అవరుహ్య= దిగ్గి; విషణ్ణవదనాః = దుఃఖమునొందిన మనస్సుగలవారలయి ; రాక్షసేంద్రం= రాక్షసరాజుఁడగు రావణుని; ఉపస్థితాః= పొందిరి.

భయంకరాకారులగు నారాక్షసులు, భయంబునొంది, ప్రాకారంబున నుండి దిగి, ముఖంబులు వెలవెలంబోవ, రాక్షసరాజుండగు రావణునొద్దకుం బోయిరి. అని, తాత్పర్యము.

తదప్రియం దీనముఖా రావణస్య నిశాచరాః
కృత్స్నం నివేదయామాసు ర్యథావ ద్వాక్యకోవిదాః. ౧౧

టీక॥ వాక్యకోవిదాః=మాటలయందుఁబండితులగు; నిశాచరాః = రాక్షసులు; దీనముఖాః= దుఃఖముపొందిన ముఖముగలవారలయి ; తత్=ఆ; అప్రియం=అనిష్టమును; కృత్స్నం=సమస్తమును; యథావత్= యథాక్రమముగా; రావణస్య=రావణునకు; నివేదయామాసుః=చెప్పిరి.

మాటలయందుఁబండితులగు నారాక్షసులు, అట్లు రామలక్ష్మణులు నాగపాశబంధము క్తులయియుండు సమాచారమునంతయు, రావణునకుఁ దెల్పిరి.

అని, తాత్పర్యము.

యౌ తా వింద్రజితా యుద్ధే భ్రాతరౌ రామలక్ష్మణౌ
నిబద్ధౌ శరబంధేన నిష్ప్రకంపభుజౌ కృతౌ. ౧౨
విముక్తౌ శరబంధేన తౌ దృశ్యేతే రణాజిరే
పాశానివ గజౌ ఛిత్వా గజేంద్రసమవిక్రమౌ. ౧౩

టీక॥ యౌ=ఏ; భ్రాతరౌ= అన్నదమ్ములయిన; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు; యుద్ధే= యుద్ధమునందు; ఇంద్రజితా=ఇంద్రజిత్తుచేత ; శరబంధేన=బాణబంధముచేత; నిబద్ధౌ = కట్టఁబడినవారలయి ; నిష్ప్రకంపభుజౌ= కదలనిభుజములుగలవారలుగా; కృతౌ=చేయఁబడినారో; గజేంద్రసమవిక్రమౌ= గజశ్రేష్ఠములతో సమానమైనపరాక్రమముగల; తౌ= ఆ రామలక్ష్మణులు; రణాజిరే=యుద్ధభూమియందు; శరబంధేన=బాణబంధముచేత; విముక్తౌ = విడువఁబడినవారలయి ; పాశాన్=త్రాళ్లను; ఛిత్వా = తెంపుకొని; స్థితౌ(అధ్యాహృతము) = ఉన్న; గజౌఇవ=ఏనుంగులువలె; దృశ్యేతే=చూడఁబడుచున్నారు.

ఇంద్రజిత్తు, ఎవ్వరిని, యుద్ధంబున నాగపాశంబులబంధించి, ఇటునటుఁజేతులఁ గదలింపఁజాలనట్లుగావించినాఁడో, యారామలక్ష్మణులిప్పుడు ఆనాగపాశబంధంబుల వదలించుకొని, కట్టుత్రాళ్లంద్రెంచుకొన్న మదపుటేనుంగుల పగిది , యుద్ధభూమి యందు

వెలుంగుచున్నారు. అని, రాక్షసులు రావణునితోఁజెప్పిరి. అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా వచనం తేషాం రాక్షసేంద్రో మహాబలః
చింతాశోకసమాక్రాంతో విషణ్ణవదనోఽబ్రవీత్. ౧౪

టీక॥ మహాబలః= అధికమయినబలముగల; రాక్షసేంద్రః= రాక్షసేశ్వరుండగు రావణుండు; తేషాం=ఆరాక్షసులయొక్క; తత్=ఆ; వచనం = మాటను; శ్రుత్వా=విని ; చింతాశోకసమాక్రాంతః=చింతచేతను దుఃఖముచేతను ఆక్రమింపఁబడినవాఁడై ; విషణ్ణవదనః = వెలవెలఁబోయినముఖముగలవాఁడై; అబ్రవీత్ = చెప్పెను.

మహాబలశాలియగు రాక్షసరాజుఁడైన రావణుండు , ఆరాక్షసులమాటనువిని , పరమదుఃఖితుండై , ముఖంబువెలవెలంబోవ, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఘోరైర్దత్తవరైర్బద్ధౌ శరైరాశీవిషోపమైః
అమోఘైస్సూర్యసంకాశైః ప్రమథ్యేంద్రజితా యుధి. ౧౫

టీక॥ ఇంద్రజితా = ఇంద్రజిత్తుచేత; యుధి=యుద్ధమునందు; ఘోరైః= భయంకరములును; దత్తవరైః = ఇవ్వఁబడినవరములుగలవియును ; ఆశీవిషోపమైః = సర్పములతోఁబోలికగలవియు; అమోఘైః = వ్యర్థములు కానివియు ; సూర్యసంకాశైః= సూర్యునితోసమానములునగు; శరైః= బాణములచేత; ప్రమథ్య = బలాత్కరించి; తౌ (అధ్యాహృతము)= ఆరామలక్ష్మణులు; బద్ధౌ = బంధింపబడినారు.

ఇంద్రజిత్తు, యుద్ధంబున , భయంకరంబులును వరబలంబున సంపాదింపఁబడినవియు తీక్ష్ణవిషంబులగు సర్పములవంటివియు , నమోఘంబులును సూర్య సమానములునగు బాణంబుల, నా రామలక్ష్మణులబంధించినాఁడు. అని, తాత్పర్యము.

తదస్త్రబంధమాసాద్య యది ముక్తౌ రిపూ మమ

సంశయస్థ మిదం సర్వ మనుపశ్యా మ్యహం బలమ్. ౧౬

టీక॥మమ=నాయొక్క;రిపూ= శత్రువులయిన రామలక్ష్మణులు;తత్=అట్టి;అస్త్రబంధం=బాణబంధమున; ఆసాద్య=పొంది;ముక్తాయది= విడువఁబడినవారలగుదు రేని;అహం=నేను ; ఇదం=ఈ;బలం=సైన్యమును; సర్వం=అంతను;సంశయస్థం= సందేహమున నున్నదానిఁగా;అనుపశ్యామి=ఊహించుచున్నాను.

నాశత్రువులయిన యారామలక్ష్మణులు,అట్టిబాణబంధమునుబొందియువిముక్తులయినయెడ , నీరాక్షసేనకంతయుఁబ్రాణసంశయముగలిగినట్లు, నాకుఁదోఁచుచున్నది. అని, తాత్పర్యము.

నిష్ఫలాః ఖలు సంవృత్తా శ్శరా వాసుకి తేజసః
ఆదత్తం యైస్తు సంగ్రామే రిపూణాం మమ జీవితమ్. ౧౭

టీక॥యైస్తు= ఏబాణములచేత నే; సంగ్రామే=యుద్ధంబునందు ; మమ=నాయొక్క;రిపూణాం=శత్రువులయొక్క;జీవితం=ప్రాణము;ఆదత్తం= గ్రహింపఁబడినదో; తే ( అధ్యాహృతము)=అట్టి;వాసుకి తేజసః= వాసుకియొక్క తేజస్సువంటి తేజస్సుగల; శరాః=బాణములు;నిష్ఫలాః=ఫలములేనివిగా; సంవృత్తాః ఖలు=అయినవిగదా!

మున్ను పెక్కుమాఱు లీ యుద్ధంబున నాశత్రువులప్రాణంబులుగొన్నట్టివాసుకిసమాన తేజంబులగుబాణంబులు, నిష్ఫలంబులయినవిగదా! అని, రావణుండు,చెప్పెను. అని,తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు సంక్రుద్ధో నిశ్శ్వస న్నురగో యథా
అబ్రవీ ద్రక్షసాం మధ్యే ధూమ్రాక్షం నామ రాక్షసమ్. ౧౮

టీక॥సః(అధ్యాహృతము)= ఆరావణుఁడు; ఏవం=ఇట్లు; ఉక్త్వాతు=చెప్పినంతనే;సంక్రుద్ధః = కోపించినవాఁడై; ఉరగోయథా= సర్పమువలె; నిశ్శ్వసన్=నిట్టూర్పులువుచ్చుచు; రక్షసాం=రాక్షసులయొక్క; మధ్యే= నడుమునందు; ధూమ్రాక్షంనామ=ధూమ్రాక్షుండని ప్రసిద్ధుఁడయిన; రాక్ష

సం=రాక్షసునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

రావణుండు, ఈప్రకారమునం జెప్పి, పరమకుపితుండై, సర్పముంబోలె వేఁడినిట్టూర్పులువుచ్చుచు, రాక్షస మధ్యంబున, ధూమ్రాక్షుండను రాక్షసుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

బలేన మహతా యుక్తో రక్షసాం భీమవిక్రమ
త్వం వధాయాభినిర్యాహి రామస్య సహ వానరైః. ౧౯

టీ॥ భీమవిక్రమ= భయంకరమయినపరాక్రమముగల ధూమ్రాక్షుఁడా! త్వం=నీవు; మహతా=గొప్పదగు; రక్షసాం=రాక్షసులయొక్క; బలేన = సైన్యముతో; యుక్తః=కూడినవాఁడవై; వానరైస్సహ=వానరులతోఁగూడ; రామస్య=రామునియొక్క; వధాయ=చంపుటకొఱకు; అభినిర్యాహి=వెడలుము.

భయంకర పరాక్రముఁడవగు ధూమ్రాక్షుఁడా! నీవుగొప్పరాక్షససేనం గూడి, వానరరులతోఁగూడ రామునివధింపంబొమ్ము. అని, రావణుండు, ధూమ్రాక్షున కాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు ధూమ్రాక్షో రాక్షసేంద్రేణ ధీమతా
కృత్వా ప్రణామం సంహృష్టో నిర్జగామ నృపాలయాత్. ౨౦

టీక॥ధూమ్రాక్షః=ధూమ్రాక్షుఁడు; ధీమతా=బుద్ధిమంతుండగు; రాక్షసేంద్రేణ=రాక్షసేశ్వరుండగు రావణునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడై; ప్రణామం=నమస్కారమును; కృత్వా=చేసి; నృపాలయాత్ = రాజగృహముననుండి; నిర్జగామ = వెడలెను.

ధూమ్రాక్షుండు బుద్ధిమంతుండగు రాక్షసరాజుండైన రావణునియాజ్ఞనువిని, పరమసంతుష్టుండై, రావణునకునమస్కరించి , రాజసదనంబుననుండివెడలెను. అని, తాత్పర్యము.

అభినిష్క్రమ్య తద్ద్వారం బలాధ్యక్ష ముహాచ హ

త్వరయస్వ బలం తూర్ణం కిం చిరేణ యుయుత్సతః. ౨౧

టీక॥ సః(అధ్యాహృతము)=ఆధూమ్రాక్షుఁడు; తద్ద్వారం = ఆరాజగృహముయొక్క ద్వారమును; అభినిష్క్రమ్య=వెడలి; బలాధ్యక్షం = సేనాధ్యక్షునిగూర్చి; యుయుత్సతః = యుద్ధముసేయఁగోరిన; మమ (అధ్యాహృతము)=నాయొక్క; బలం= సేనను; త్వరయస్వ=వేగిరపఱుపుము. చిరేణ = ఆలస్యముచేత; కిం=ఎందుకు; ఇతి(అధ్యాహృతము)=అని; ఉవాచ= చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

"నేనుయుద్ధంబు సేయఁ గోరియున్నాను; నాసైన్యమునంతయు శీఘ్రంబున నాయత్తంబుగావింపుము ; ఆలస్యంబుసేయఁబలదు" అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ధూమ్రాక్షవచనం శ్రుత్వా బలాధ్యక్షో బలానుగః
బల ముద్యోజయామాస రావణస్యాజ్ఞయా ద్రుతమ్. ౨౨

టీక॥ బలానుగః = సైన్యమునువెంబడించునట్టి; బలాధ్యక్షః=సేనాధ్యక్షుఁడు; రావణస్య = రావణునియొక్క; ఆజ్ఞయా =ఆజ్ఞచేత ; ధూమ్రాక్షవచనం = ధూమ్రాక్షునిమాటను; శ్రుత్వా=విని; ద్రుతం= శీఘ్రముగా; బలం=సేనను; ఉద్యోజయామాస=కూర్చెను.

సైన్యమువెంబడి నుండునట్టి సేనాధ్యక్షుండు,ధూమ్రాక్షుఁడు రావణునియాజ్ఞ చొప్పునం జెప్పినమాటనువిని, శీఘ్రంబునసైన్యంబు నంతయు నాయత్తంబుగావించెను.

అని, తాత్పర్యము.

తే బద్ధఘంటా బలినో ఘోరరూపా నిశాచరాః
వినర్దమానా స్సంహృష్టా ధూమ్రాక్షం పర్యవారయన్. ౨౩
వివిధాయుధహస్తాశ్చ శూలముద్గరపాణయః

టీక ॥ బద్ధఘంటాః = కట్టఁబడిన గంటలు గలవారలును ; ఘోరరూపాః = భయంకరమయినయాకారముగలవారలునగు; తే = ఆ; నిశాచ

రాః = రాక్షసులు; వివిధాయుధహస్తాశ్చ=నానావిధములయినయాయుధములు చేతులం గలవారలునై; శూలముద్గరపాణయః = శూలములనుముద్గరములను జేతులం గలవారలై ; విగర్జమానాః = గర్జించుచున్నవారలయి; సంహృష్టాః = మిక్కిలియు సంతసించినవారలై; ధూమ్రాక్షం= ధూమ్రాక్షుని; పర్యవారయన్ = చుట్టిరి.

శౌర్యాతిశయ జ్ఞాపనార్థమయి నడుమునగంటలు కట్టుకొని యుండువారలును భయంకరాకారులునగు నా రాక్షసులు, శూలంబులు ముద్గరంబులు మున్నగు నానావిధాయుధంబులు దాల్చి, పరమసంతోషంబున గర్జించుచు, ధూమ్రాక్షుం బరివేష్టించిరి.

అని, తాత్పర్యము.

గదాభిః పట్టిసై ర్దండై రాయసై ర్ముసలై ర్భృశమ్. ౨౪
పరిఘై ర్భిండివాలైశ్చ భల్లైః ప్రాసైః పరశ్వధైః
నిర్యయూ రాక్షసా దిగ్భ్యో నదన్తో జలదా యథా. ౨౫

టీక॥ రాక్షసాః = రాక్షసులు; గదాభిః=గదలతోను; ఆయసైః = ఇనుముతోఁజేయఁబడిన; దండైః = కఱ్ఱలతోను; ముసలైః = రోకళ్లతోను; పరిఘైః=ఇనుపగుదియలతోను ; భిండివాలైశ్చ= విడిచివాటుగుదియలతోను; భల్లైః = బల్లెములతోను; ప్రాసైః=ఈఁటెలతోను; పరశ్వధైః= గొడ్డళ్లతోను ; యుక్తాః (అధ్యాహృతము)= కూడినవారలయి; దిగ్భ్యః= దిక్కులనుండి; జలదా యథా = మేఘంబులుంబోలె; భృశం = మిక్కిలియు; నదన్తః=అఱచుచు; నిర్యయుః = వెడలిరి.

రాక్షసులు, గదలుఁబట్టిసంబులు నాయసదండములు ముసలంబులుఁబరిఘంబులు భిండివాలంబులు బల్లెములు ఈటెలు గొడ్డళ్లు మున్నగు నాయుధంబుల ధరించి, మేఘంబులుంబోలె గర్జించుచు, నలుదిక్కులనుండియు, వెడలిరి.

అని, తాత్పర్యము.

రథైః కవచిన స్త్వన్యే ధ్వజైశ్చ సమలంకృతైః
సువర్ణజాలవిహితైః ఖరైశ్చ వివిధాననైః. ౨౬

టీక॥ అన్యేతు=ఇతరులయిన రాక్షసులు; కవచినః=కవచములు గలవారలై; ధ్వజైః= టెక్కెములచేతను; వివిధానైః=నానావిధములయినముఖములుగల; ఖరైశ్చ=గాడిదలచేతను; సమలంకృతైః=అలంకరింపఁబడినవియు; సువర్ణజాలవిహితైః= బంగారుకిటికీలతోఁగూడినవియునగు; రథైః=రథములచేత; నిర్యయుః(అధ్యాహృతము) = వెడలిరి.

మఱికొందఱు రాక్షసులు, కవచధారులయి, ధ్వజాలంకృతంబులును నానావిధముఖంబులుగల గాడిదలతోఁగూడినవియు బంగారుకిటికీలతో నొప్పుచున్నవియునగు రథంబులపై, వెడలిరి.

అని, తాత్పర్యము.

హయైః పరమశీఘ్రైశ్చ గజేంద్రైశ్చ మదోత్కటైః
నిర్యయూ రాక్షసవ్యాఘ్రా వ్యాఘ్రా ఇవ దురాసదాః. ౨౭

టీక॥ వ్యాఘ్రాఇవ =పెద్దపులులువలె; దురాసదాః = చెనకనలవిగానట్టి; రాక్షసవ్యాఘ్రాః = రాక్షసశ్రేష్ఠులు; పరమశీఘ్రైః=మిక్కిలియుశీఘ్రముగాఁబోవునట్టి; హయైః = గుఱ్ఱములచేతను; మదోత్కటైః = మదముచేఁబట్టనలవిగానట్టి; గజేంద్రైశ్చ = గజశ్రేష్ఠములచేతను; నిర్యయుః = వెడలిరి.

పెద్దపులులుం బోలెఁ, జెనకరాని రాక్షసోత్తములు ,మహావేగంబులగు గుఱ్ఱంబుల నారోహించి గొందఱును, కొందఱు మదపుటేనుంగుల నారోహించియు, వెడలిరి. అని, తాత్పర్యము.

వృకసింహముఖై ర్యుక్తం ఖరైః కనకభూషణైః
ఆరురోహ రథం దివ్యం ధూమ్రాక్షః ఖరనిస్వనః. ౨౮

టీక॥ ఖరనిస్వనః= ఉగ్రమయినకంఠధ్వనిగల; ధూమ్రాక్షః = ధూమ్రాక్షుఁడు; కనకభూషణైః= బంగారలంకారముగల; వృకసింహముఖైః=తోఁడేళ్లయొక్కయు సింహములయొక్కయు ముఖమువంటిముఖగల; ఖరైః = గాడిదలతోఁ; యుక్తం= కూడిన; దివ్యం=శ్రేష్ఠమగు; రథం = రథమును; ఆరురోహ=ఎక్కెను.

భయంకరమయిన ధ్వనిగలధూ

మాక్షుండు, బంగారుతో నలంకరింపఁబడిన తోఁడేళ్లవంటిముఖంబులునుసింహముల వంటిముఖంబులును గలగాడిదలు గట్టిన దివ్యంబగురథమునారోహించెను. అని, తాత్పర్యము.

స నిర్యాతో మహావీర్యో ధూమ్రాక్షో రాక్షసై ర్వృతః
ప్రహస న్పశ్చిమద్వారం హనుమా న్యత్ర యూథపః. ౨౯
రథప్రవర మాస్థాయ ఖరయుక్తం ఖరస్వనమ్

టీక॥ మహావీర్యః= అధికమయిన పరాక్రమముగల; సః = ఆ; ధూమ్రాక్షః=ధూమ్రాక్షుఁడు; ఖరయుక్తం= గాడిదలతోఁగూడినదియు; ఖరస్వనం= భయంకరమయినధ్వనిగలదియునగు ; రథప్రవరం = రథశ్రేష్ఠమును; ఆస్థాయ=అధిష్ఠించి; రాక్షసైః=రాక్షసులచేత; వృతః=చుట్టఁబడినవాఁడై ; ప్రహసన్=నవ్వుచు; యూథపః= యూథనాథుండగు; హనుమాన్=హనుమంతుండు; యత్ర=ఎచ్చటనో; తత్ (అధ్యాహృతము) = అట్టి; పశ్చిమద్వారం = పడమటివాకిలిఁగూర్చి; నిర్యాతః=వెడలెను.

మహాపరాక్రమశాలియగు నాధూమ్రాక్షుండు , భయంకరంబగు ధ్వనిగలదియుగాడిదలు గట్టినదియునగు దివ్యరథంబునారోహించి, రాక్షస పరివృతుండై, పకపకనవ్వుచు, హనుమంతుండుండునట్టి, లంకాపశ్చిమ ద్వారంబునకుఁబోయెను. అని, తాత్పర్యము.

ప్రయాంతం తు మహాఘోరం రాక్షసం భీమవిక్రమమ్. ౩౦
అంతరిక్షగతా ఘోరా శ్శకునాః ప్రత్యవారయన్

టీక॥ ప్రయాంతం= పోవుచున్న; మహాఘోరం = మహాభయంకరుండును; భీమవిక్రమమ్ = భయంకరమయినపరాక్రమముగలవాఁడునగు ; రాక్షసంతు=రాక్షసునింగూడః; అంతరిక్షగతాః=అంతరిక్షమునుపొందిన ; ఘోరాః=భయంకరములయిన; శకునాః= పక్షులు;ప్రత్యవారయన్ = అడ్డగించినవి.

అట్లుబయలుదేఱిపోవుచున్న మహాభయంకరుండును భయంకర పరాక్రముఁడునగు ధూమ్రాక్షుని రథంబునక

ద్ధముగా, దుర్నిమిత్తసూచకంబుల గుభయంకరపక్షులుగిలిచినవి.

అని, తాత్పర్యము.

రథశీర్షే మహాభీమో గృధ్రశ్చ నిపపాత హ. ౩౧
ధ్వజాగ్రే గ్రథితాశ్చైవ నిపేతుః కుణపాశనాః

టీక॥ మహాభీమః= మహాభయంకరముగు; గృధ్రశ్చ= గద్దయును; రథశీర్షే=రథశిరస్సునందు; నిపపాత= పడెను. ("హ" అనునది పాదపూరణార్థము) కుణపాశనాః= శవములె యాహారముగాఁగలపక్షులు; ధ్వజాగ్రే= జెండాముయొక్క కొనయందు; గ్రథితాశ్చైవ=వ్రాలినవియు నై; నిపేతుః= పడినవి.

రథశిరస్సునందు మహాభయంకరంబగు గృధ్రం బొకటివ్రాలినది, శవములం దినునట్టిభయంకరపక్షులు, ధ్వజంబు పైవ్రాలియచ్చోనుండి నేలపైఁబడినవి.

అని, తాత్పర్యము.

రుధిరార్ద్రో మహాశ్వేతః కబంధః పతితో భువి. ౩౨
విస్వరం చోత్సృజన్నాదం ధూమ్రాక్షస్య సమీపతః

టీక। ధూమ్రాక్షస్య= ధూమ్రాక్షునియొక్క; సమీపతః=సమీపమునందు; రుధిరార్ద్రః= నెత్తురుచేఁదడిసినదియు; మహాన్= గొప్పదియు; శ్వేతః= తెల్లనిదియునగు; కబంధః= మొండెము; విస్వరం=వికృతధ్వనిగలుగునట్లుగా; నాదం=ధ్వనిని; ఉత్సృజన్=విడుచుచు; భువి = నేలయందు; పతితః = పడెను.

నెత్తుటం దడిసినదియుఁ దెల్లనిదియు నగుగొప్పమొండె మొకటి, వికృతధ్వనిగా రోదనంబు సేయుచు, ధూమ్రాక్షునకు సమీపంబుగా నేలంబడినది.

అని, తాత్పర్యము.

వవర్ష రుధిరం దేవ స్సంచచాల చ మేదినీ. ౩౩
ప్రతిలోమం వవౌ వాయు ర్నిర్ఘాతసమనిస్స్వనః

టీక॥ దేవః=మేఘము; రుధిరం=నెత్తురును; వవర్ష=కురిసెను. మేదినీచ=భూమియు; సంచచాల=చలించినది. వాయుః=గాలి; నిర్ఘాతసమనిస్వనః=పిడుగుతోసమానమయినధ్వనిగలదై; ప్రతిలోమం = విరుద్ధముగా; వవౌ=వీచెను.

మేఘము, నెత్తురువానఁగురిసినది; భూమిచలనంబునొందినది; పిడుగు పడునట్లుమహాధ్వనిగదుర, మహావేగంబున నెదురు గాలివీచెను.

అని, తాత్పర్యము.

తిమిరౌఘావృతా స్తత్ర దిశశ్చ న చకాశిరే. ౩౪

టీక॥ తత్ర=అప్పుడు; దిశశ్చ=దిక్కులును; తిమిరౌఘావృతాః=చీఁకట్ల సమూహముచేఁ జుట్టఁబడినవై; నచకాశిరే=ప్రకాశింపవయ్యె.

మఱియు నప్పుడు, దిక్కులన్నియుఁ, జీకట్లుక్రమ్ముటం జేసి, యెంతమాత్రము ప్రకాశము లేకుండినవి.

అని, తాత్పర్యము.

స తూత్పాతాం స్తదా దృష్ట్వా రాక్షసానాం భయావహాన్
ప్రాదుర్భూతాం స్సుఘోరాంశ్చ ధూమ్రాక్షో వ్యథితో౽భవత్. ౩౫

టీక॥ సః=ఆ; ధూమ్రాక్షస్తు = ధూమ్రాక్షుఁడును; తదా=అప్పుడు; రాక్షసానాం=రాక్షసులకు; భయావహాన్=భయంబుగలిగించునవియు; సుఘోరాంశ్చ = మిక్కిలియుభయంకరములును; ప్రాదుర్భూతాన్= పుట్టినవియునగు; ఉత్పాతాన్=ఉత్పాతములను; దృష్ట్వా=చూచి; వ్యథితః= దుఃఖితుండు; అభవత్=అయ్యెను.

ఆధూమ్రాక్షుండు, రాక్షసభయంకరంబులును మహాఘోరంబులునగు నాయుత్పాతంబులుగనుపట్టుటం జూచి, దుఃఖితుం డయ్యెను.

అని, తాత్పర్యము.

ముముహూ రాక్షసా స్సర్వే ధూమ్రాక్షస్య పురస్సరాః

టీక॥ ధూమ్రాక్షస్య= ధూమ్రాక్షునియొక్క; పురస్సరాః= ముందునడచునట్టి; రాక్షసాః=రాక్షసులు; సర్వే=అందఱును; ముముహుః=మూ

ర్ఘనాందిరి.

ధూమ్రాక్షునితోఁగూడవచ్చిన రాక్షసులందఱును దుఃఖంబునమూర్ఛితులయిరి. అని, తాత్పర్యము.

తత స్సుభీమో బహుభి ర్నిశాచరై
ర్వృతో౽భినిష్క్రమ్య రణోత్సుకో బలీ. ౩౬
దదర్శ తాం రాఘవబాహుపాలితాం
మహౌఘకల్పాం బహువానరీం చమూమ్

టీక॥ తతః=అంత; సుభీమః= మిక్కిలియుభయంకరుండును; బలీ= అధికమయినబలము గలవాఁడునగు ధూమ్రాక్షుండు; బహుభిః=పెక్కండ్రగు; నిశాచరైః=రాక్షసులచేత; వృతః=చుట్టఁబడినవాఁడై; రణోత్సుకః=యుద్ధంబునందుత్సాహముగలవాఁడై; అభినిష్క్రమ్య= వెడలి; రాఘవబాహుపాలితాం=రాముని భుజముచే రక్షింపఁబడినదియు; మహౌఘకల్పాం=మహాప్రవాహముతోసమానమయినదియు; బహువానరీం= పెక్కండ్రువానరులుగలదియునగు; తాం=ఆ; చమూం=సేనను; దదర్శ=చూచెను.

అంత, భయంకరాకారుండును బలవంతుండునగు ధూమ్రాక్షుండు, ఆయుత్పాతంబులు సరకుసేయక, పెక్కురాక్షసులంగూడి, యుద్ధోత్సాహంబునఁ బురంబు వెడలి, రామబాహుపాలితంబయి మహాసముద్రంబుపగిదినలరుచున్నయవ్వానరసేనం జూచెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, ఏకపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండైకపంచాశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

ద్విపంచాశస్సర్గ ప్రారంభః.

ధూమ్రాక్షం ప్రేక్ష్య నిర్యాంతం రాక్షసం భీమవిక్రమమ్
వినేదు ర్వానరా స్సర్వే ప్రహృష్టా యుద్ధకాంక్షిణః. ౧

టీక॥ యుద్ధకాంక్షిణః = యుద్ధంబుఁగోరునట్టి; వానరాః = వానరులు; సర్వే = అందఱును; భీమవిక్రమం = భయంకరమయినపరాక్రమముగల; ధూమ్రాక్షం = ధూమ్రాక్షుండను; రాక్షసం = రాక్షసుని; నిర్యాంతం = వెడలుచున్నవానిఁగా; ప్రేక్ష్య = చూచి; ప్రహృష్టాః = మిక్కిలియు సంతోషించినవారలయి; వినేదుః = అఱచిరి.

యుద్ధంబుఁగోరుచున్న యవ్వానరులందఱు, భయంకరపరాక్రముఁడగు ధూమ్రాక్షుండువచ్చుటఁజూచి, పరమసంతుష్టులయి, సింహనాదంబులుగావించిరి. అని, తాత్పర్యము.

తేషాం సుతుములం యుద్ధం సంజజ్ఞే హరిరక్షసామ్

టీక॥ తేషాం = ఆ; హరిరక్షసాం = వానరరాక్షసులకు; సుతుములం = మిక్కిలియుదొమ్మియయిన; యుద్ధం = పోరు; సంజజ్ఞే = కలిగినది.

అప్పుడు, వానరులకును రాక్షసులకును దుముంలంబుగా మహాయుద్ధంబయినది. అని, తాత్పర్యము.

అన్యోన్యం పాదపై ర్ఘోరం నిఘ్నతాం శూలముద్గరైః. ౨
ఘోరైశ్చ పరిఘై శ్చిత్రై స్త్రిశూలై శ్చాపి సంహతైః

టీక॥ పాదపైః = వృక్షములచేతను; శూలముద్గరైః = శూలములచేతను ముద్గరములచేతను; ఘోరైః = భయంకరములగు; పరిఘైశ్చ = ఇనుపగుదియలచేతను; సంహతైః = కూడినవియు; చిత్రైః = నానావర్ణములునగు; త్రిశూలైశ్చాపి = త్రిశూలములచేతను; ఘోరం = భయంకరముగా; అన్యోన్యం =

ఒండొరులను; నిఘ్నతాం = కొట్టుకొనుచున్న; తేషాం (అధ్యాహృతము) = ఆవానరరాక్షసులకు ; తుములం (అధ్యాహృతము) = దొమ్మియుద్ధము ; సంజజ్ఞే (అధ్యాహృతము) = కలిగినది.

వానరులును రాక్షసులును, వృక్షంబులచేతను శూలముద్గరపరిఘ త్రిశూలాద్యాయుధములచేతను ఒండొరులం బ్రహరించుకొనుచు, భయంకరంబుగాఁ బోరిరి. అని, తాత్పర్యము.

రాక్షసై ర్వానరా ఘోరై ర్వినికృత్తా స్సమంతతః. ౩
వానరై రాక్షసాశ్చాపి ద్రుమై ర్భూమౌ సమీకృతాః

టీక॥ ఘోరైః = భయంకరులగు; రాక్షసైః = రాక్షసులచేత; సమంతతః = అంతటను; వానరాః = వానరులు; వినికృత్తాః = ఛేదింపఁబడినారు. వానరైశ్చాపి = వానరులచేతను; రాక్షసాః = రాక్షసులు; ద్రుమైః = వృక్షములచేత, భూమౌ = నేలయందు; సమీకృతాః = సరిగాఁ జేయఁబడినారు.

భయంకరాకారులగు రాక్షసులు, పెక్కండ్రవానరులను వధించిరి ; వానరులు, రాక్షసులఁ బెక్కండ్ర, వృక్షములచేఁ జూర్ణము గావించిరి.

అని, తాత్పర్యము.

రాక్షసాశ్చాపి సంక్రుద్ధా వానరా న్నిశితై శ్శరైః. ౪
వివ్యధు ర్ఘోరసంకాశైః కంకపత్రై రజిహ్మగైః

టీక॥ రాక్షసాశ్చాపి = రాక్షసులును; సంక్రుద్ధాః = మిక్కిలి యుఁగోపించినవారలయి ; ఘోరసంకాశైః = భయంకరములుగానున్నవియు ; కంకపత్రైః = రాపులుఁగుఱెక్కలుగలవియు; అజిహ్మగైః = వంకరగాఁబోనివియు; నిశితైః = కఱకులయినవియునగు; శరైః = బాణములచేత ; వానరాన్ = వానరులను; వివ్యధుః = కొట్టిరి.

రాక్షసులును, పరమకుపితులయి, భయంకరంబులును గంకపక్షి ఱెక్కలుగట్టినవియు నగు కఱకుబాణంబుల, వానరులం బ్రహరించిరి.

అని, తాత్పర్యము.

తే గదాభిశ్చ భీమాభిః పట్టిసైః కూటముద్గరైః. ౫
విదార్యమాణా రక్షోభి ర్వానరాస్తే మహాబలాః
అమర్షాజ్జనితోద్ధర్షా శ్చక్రుః కర్మాణ్యభీతవత్. ౬

టీక॥ తే=ప్రసిద్ధులయిన; తే= ఆ; మహాబలాః= అధికమయినబలముగల; వానరాః=వానరులు; రక్షోభిః = రాక్షసులచేత; భీమాభిః = భయంకరములయిన; గదాభిశ్చ = గదలచేతను; పట్టిసైః=అడ్డకత్తులచేతను ; కూటముద్గరైః = సంపెటలచేతను గుదియలచేతను; విదార్యమాణాః = చీల్పంబడుచున్నవారలయి; అమర్షాత్ = కోపమువలన; జనితోద్ధర్షాః= కలిగినయుత్సాహము గలవారలయి; అభీతవత్ = భయపడనివారలయి; కర్మాణి= కార్యములను; చక్రుః=చేసిరి.

మహాబలశాలులగు నవ్వానరులు రాక్షసులచే భయంకరంబులగు గదాపట్టిసకూటముద్గరాద్యాయుధంబుల విదారితులయ్యు, రోషంబున, మహోత్సాహులయి, యొంతమాత్రము వెనుదీయక, పోరుచుండిరి.

అని, తాత్పర్యము.

శరనిర్భిన్నగాత్రా స్తే శూలనిర్భిన్నదేహినః
జగృహు స్తే ద్రుమాం స్తత్ర శిలాశ్చ హరియూథపాః. ౭

టీక॥ తే=ఆ; హరియూథపాః=వానరశ్రేష్ఠులు; తత్ర=అచ్చట ; శరనిర్భిన్నగాత్రాః=బాణంబులచే భేదింపఁబడిన దేహములుగలవారలయి; శూలనిర్భిన్నదేహినః=శూలములచే భేదింపఁబడిన దేహములు గల వారలయి; ద్రుమాన్=వృక్షములను; శిలాశ్చ= ఱాళ్లను; జగృహుః=గ్రహించిరి.

అట్లప్పుడా వానరవీరులు, బాణంబులచేతను శూలంబులచేతను, భిన్నదేహులయి, మహారోషంబున, వృక్షంబులను బెనుఱాళ్లనుం జేకొనిరి.

అని, తాత్పర్యము.

తే భీమవేగా హరయో నర్దమానా స్తత స్తతః
మమంథూ రాక్షసాన్ భీమా న్నామానిచ బభాషిరే. ౮




టీక॥ భీమవేగాః = భయంకరమయిన వేగముగల; తే = ఆ; హరయః = వానరులు; తత స్తతః = అంతనంత; నదమానాః = అఱచుచు; భీమాన్ = భయంకరులయిన; రాక్షసాన్ = రాక్షసులను; మమంధుః = నలియఁగొట్టిరి. నాదమానానిచ = పేళ్లను; బభాషిరే = పలికిరి.

అవ్వానరవీరులు, అంతకంతకు, భయంకరవేగంబున, సింహనాదంబులు సేయుచుఁదమతమపేళులఁగ్రహించుకొనుచు, భయంకరాకారులగు రాక్షసులంబ్రహరించిరి. అని, తాత్పర్యము.

తద్బభూవాద్భుతం ఘోరం యుద్ధం వానరరక్షసామ్
శిలాభి ర్వివిధాభిశ్చ బహుభి శ్చైవ పాదపైః. ౯

టీక॥ వానరరక్షసాం = వానరులకును రాక్షసులకును; వివిధాభిః = నానావిధములయిన; శిలాభిశ్చ = ఱాళ్ల చేతను; బహుభిః = పెక్కులయిన; పాదపైశ్చ = వృక్షములచేతను; తత్ = ఆ; యుద్ధం = పోరు; అద్భుతం = ఆశ్చర్యకరంబును; ఘోరం = భయంకరంబును; బభూవ = అయినది.

అప్పుడు, వానరరాక్షసులు, నానావిధశిలావృక్షంబులచేతను. నానావిధాయుధంబులచేతను నొండొరులపైకడర, నాయుద్ధంబాశ్చర్యకరంబు భయంకరంబునై చూపట్టినది.

అని, తాత్పర్యము.

రాక్షసా మథితాః కేచి ద్వానరై ర్జితకాశిభిః
వవము రుధిరం కేచి న్ముఖై రుధిరభోజనాః. ౧౦

టీక॥ జితకాశిభిః = జయముచేఁబ్రకాశించునట్టి; వానరైః = వానరులచేత; కేచిత్ = కొందఱు; రాక్షసాః = రాక్షసులు; మథితాః = మథింపఁబడిరి; రుధిరభోజనాః = నెత్తురె యాహారముగాఁగల రాక్షసులు; కేచిత్ = కొందఱు; ముఖైః = నోళ్ల చేత; రుధిరం = నెత్తురును; వవముః = క్రక్కిరి.

జయశీలురగు వానరులు, కొందఱు రాక్షసులంగొట్టి ముద్దగావించిరి; కొందఱు రాక్షసులు వానరులప్రహారంబున, నోట నెత్తురు గ్రక్కుకొనిరి.

అని, తాత్పర్యము.

పార్శ్వేషు దారితాః కేచి త్కేచి ద్రాశీకృతా ద్రుమైః
శిలాభి శ్చూర్ణితాః కేచి త్కేచి ద్దంతై ర్విదారితాః. ౧౧

టీక॥ కేచిత్ = కొందఱు రాక్షసులు; పార్శ్వేషు=ప్రక్కలయందు; దారితాః= చీల్పఁబడినారు. కేచిత్=కొందఱు; ద్రుమైః=వృక్షములచేత ; రాశీకృతాః= రాశిగాఁజేయఁబడినారు. కేచిత్ =కొందఱు;శిలాభిః=ఱాళ్లచేత; చూర్ణితాః= చూర్ణముగాఁజేయఁబడిరి. కేచిత్ =కొందఱు; దంతైః= దంతములచేత ; విదారితాః = చీల్పఁబడినారు.

వానరులు, రాక్షసులంగొందఱఁ, బ్రక్కలంబట్టిరెండుగాఁజీల్చిరి; కొందఱ అవృక్షంబులనలియఁగొట్టికుప్పగా వేసిరి; కొందఱశిలలచేఁజూర్ణముగావించిరి;కొందఱదంతంబులంగొఱికిరి.

అని, తాత్పర్యము.

ధ్వజై ర్విమథితై ర్భగ్నైః ఖరైశ్చ వినిపాతితైః
రథై ర్విధ్వంసితై శ్చాపి పతితై రజనీచరైః. ౧౨
గజేంద్రైః పర్వతాకారైః పర్వతాగ్రై ర్వనౌకసామ్
మథితై ర్వాజిభిః కీర్ణం సారోహై ర్వసుధాతలమ్. ౧౩

టీక॥వనౌకసాం = వానరులయొక్క;పర్వతాగ్రైః= పర్వతశిఖరములచేత; విమథితైః=నలియఁగొట్టఁబడినవియు; భగ్నైః= విఱిగినవియునగు; ధ్వజైః=టెక్కెములచేతను ; వినిపాతితైః=చంపఁబడిన; ఖరైశ్చ=గాడిదలచేతను; విధ్వంసితైః = నుగ్గుగాఁజేయఁబడిన; రథైశ్చాపి= రథములచేతను; పతితైః=పడిన ; రజనీచరైః = రాక్షసులచేతను; పర్వతాకారైః = కొండలయాకారమువంటియాకారముగల ; గజేంద్రైః=గజశ్రేష్ఠములచేతను; మథితైః=నలియఁగొట్టఁబడిన;సారోహైః= ఎక్కినవారలతోఁగూడిన; వాజిభిః= గుఱ్ఱములచేతను;వసుధాతలం=భూమి ; కీర్ణం = వ్యాపింపఁబడినది.

వానరులుప్రయోగించు పర్వతశిఖరంబులచే , విఱిగినధ్వజంబులునుహతములయినగాడిదలునువిధ్వంసితములైన రథంబులునుబతితంబులగు రాక్షసకళేబరంబులును పర్వతాకారంబులగు నే

సుంగులును సాదిసహితంబుగా నలియం గొట్టఁబడినగుఱ్ఱంబులును, ఆయుద్ధభూమియంతయునిండియుండినవి.

అని, తాత్పర్యము.

వానరై ర్భీమవిక్రాన్తై రాప్లుత్యాప్లుత్య వేగితైః
రాక్షసాః కరజై స్తీక్ష్ణైః ముఖేషు వినికర్తితాః. ౧౪
వివర్ణవదనా భూయో విప్రకీర్ణశిరోరుహాః
మూఢాః శోణితగన్ధేన నిపేతు ర్ధరణీతలే. ౧౫

[illegible] రాక్షసాః = రాక్షసులు; భీమవి[illegible] = భయంకరమయినప రాక్ర[illegible]వారలును; ఆప్లుత్యాప్లుత్య=ఎ[illegible]; వేగితైః = వేగము నొందినవా[illegible]వానరైః = వానరులచేత; తీక్ష్ణ[illegible]లయిన; కరజైః=నఖముల[illegible] = ముఖములయందు; వినిక[illegible] = ఛేదింపఁబడినవారలయి; భూ[illegible] = మిక్కిలియు; వివర్ణవదనాః = [illegible]నముఖముగలవారలయి; వి[illegible]శిరోరుహాః= విరిసినవెంట్రుకలు గలయి; శోణితగన్ధేన= నెత్తురువాసనతోడ; మూఢాః = మూర్ఛితులలయి; ధరణీతలే= భూమియందు; నిపేతుః= పడిరి.

భయంకరపరాక్రములగు వానరులు, మహావేగంబున నెగసి యెగసి, తీక్ష్ణంబులగునఖంబులచే రాక్షసులముఖంబులువిదారింప, నారాక్షసులు తలవెంట్రుకలువిరిసియాడ, నెత్తుటం దోఁగుచు, మూర్ఛిల్లి, భూతలంబునంబడిరి.

అని, తాత్పర్యము.

అన్యే పరమస[illegible] భీమనిస్స్వనాః
తలై రేవాభిధావ[illegible] వజ్రస్పర్శసమై ర్హరీన్. ౧౬

టీక॥ అన్యే=ఇతరులయిన; రాక్షసాః=రాక్షసులు; పరమసంక్రుద్ధాః= మిక్కిలియుఁగోపించినవారలయి; భీమనిస్స్వనాః= భయంకరమయినధ్వనిగలవారలయి; వజ్రస్పర్శసమైః= వజ్రాయుధస్పర్శసమానమయిన;

తలైరేవ = అఱచేతుల చేతనె; హరీన్ = వానరులను; అభిధావంతి = తఱిమిరి.

మఱికొందఱు రాక్షసులు, పరమకుపితులయి, భయంకరంబుగా గర్జించుచు, వజ్రసమంబులగు నఱచేతులతో, వానరులందఱిమిరి. అని, తాత్పర్యము.

వానరై రాపతంత స్తే వేగితా వేగవత్తరైః
ముష్టిభి శ్చరణై ర్దంతైః పాదపై శ్చా వపోథితాః. ౧౭

టీక॥ వేగితాః = వేగముగలవారలును; ఆపతంతః = పైఁబడుచున్నవారలునగు; తే = ఆ రాక్షసులు; వేగవత్తరైః = అంతకన్నను వేగముగల; వానరైః = వానరులచేత; ముష్టిభిః = పిడికిళ్ల చేతను; చరణైః = పాదముల చేతను; దంతైః = పండ్లచేతను; పాదపైశ్చ = వృక్షములచేతను; అవపోథితాః = హింసింపఁబడిరి.

అట్లుమహావేగులగు నారాక్షసులు పైఁబడ, వానరులు, అంతకన్నను వేగముగలవారలగుటచే, నారాక్షసులను బిడికిళ్లంబొడిచియు పాదంబులం దన్నియు దంతంబులం గొఱికియు వృక్షంబులం బ్రహరించియు హింసించిరి.

అని, తాత్పర్యము.

వానరై ర్హన్యమానా స్తే రాక్షసా విప్రదుద్రువుః

టీక॥ వానరైః = వానరులచేత; హన్యమానాః = కొట్టఁబడుచున్న; తే = ఆ; రాక్షసాః = రాక్షసులు; విప్రదుద్రువుః = పాఱినారు.

అట్లువానరులచేఁబ్రహరింపఁబడిన వారలయినిలువఁజాలక, యారాక్షసులుపరుగెత్తిరి. అని, తాత్పర్యము.

సైన్యం తు విద్రుతం దృష్ట్వా ధూమ్రాక్షో రాక్షసర్షభః. ౧౯
క్రోధేన కదనం చక్రే వానరాణాం యుయుత్సతామ్

టీక॥ రాక్షసర్షభః = రాక్షసశ్రేష్ఠుండగు; ధూమ్రాక్షః = ధూమ్రాక్షుఁడు; సైన్యం = సైన్యమును; విద్రుతం = పాఱినదానిఁగా; దృష్ట్వాతు = చూచినంతనే; క్రోధేన = కోపముచేత; యుయుత్సతాం = యుద్ధముసేయఁగోరు

చుండునట్టి; వానరాణాం= వానరుల యొక్క; కదనం=హింసించుటను; చక్రే=చేసెను.

రాక్షసశ్రేష్ఠుండగు ధూమ్రాక్షుండు, అట్లు, రాక్షససైన్యంబంతయుఁబాఱుటంజూచి, కుపితుండై, యుద్ధంబుసేయనుత్సుకులయియున్న వానరులహింసింపనారంభించెను.

అని, తాత్పర్యము.

ప్రాసైః ప్రమథితాః కేచి ద్వానరా శ్శోణితస్రవాః. ౧౯
ముద్గరై రాహతాః కేచి త్పతితా ధరణీతలే

టీక॥ కేచిత్ = కొందఱు; వానరాః=వానరులు; ప్రాసైః = ఈటెలచేత; ప్రమథితాః= కొట్టఁబడినవారలయి; శోణితస్రవాః = నెత్తురుగాఱుచున్నవారలయి; కేచిత్ = కొందఱు; ముద్గరైః=గుదియలచేత; ఆహతాః= కొట్టఁబడినవారలయి; ధరణీతలే = భూతలమునందు; పతితాః=పడినారు.

వానరులు కొందఱు రాక్షసులచేఁబ్రాసంబులం బ్రహరింపఁబడి నెత్తురుగాఱుచుఁ, గొందఱుముద్గరంబులందాడితులయి, నేలంబడిరి.

అని, తాత్పర్యము.

పరిఘై ర్మథితాః కేచి ద్భిండివాలై ర్విదారితాః. ౨౦
పట్టిసై రాహతాః కేచి ద్విహ్వాలంతో గతాసవః

టీక॥ కేచిత్ = కొందఱు; పరిఘైః=ఇనుపగుదియలచేత; మథితాః= కొట్టఁబడినారు. కేచిత్ (అధ్యాహృతము)= కొందఱు; భిండివాలైః= విడిచివాటుగుదియలచేత ; విదారితాః= చీల్వఁబడినారు. కేచిత్ = కొందఱు. పట్టిసైః=అడ్డకత్తులచేత; ఆహతాః= కొట్టఁబడినవారలయి; విహ్వాలంతః= అవయవముల స్వాధీనత దప్పినవారలయి; గతాసవః= పోయినప్రాణములుగలవారలు; ఆసన్ (అధ్యాహృతము)= అయిరి.

కొందఱువానరులు, రాక్షసులచేఁబరిఘంబులందాడితులయిరి; కొందఱు భిండివాలంబుల వధింపఁబడిరి; కొందఱడ్డకత్తులనఱకంబడిమృతిఁబొందిరి.

అని, తాత్పర్యము.

కేచి ద్వినిహతా శ్శూలై రుధిరార్ద్రా వనౌకసః. ౨౧
కేచి ద్విద్రావితా నష్టా స్సబలై రాక్షసై ర్యుధి

టీక॥ కేచిత్= కొందఱు; వనౌకసః=వానరులు; శూలైః= శూలములచేత; వినిహతాః = కొట్టఁబడినవారలయి; రుధిరార్ద్రాః= నెత్తుటం దడిసినవారలయిరి. కేచిత్=కొందఱు; యుధి=యుద్ధమునందు ; సబలైః= బలముతోఁగూడిన; రాక్షసైః= రాక్షసులచేత; విద్రావితాః = తఱుమఁ బడిన వారలయి; నష్టాః=అగపడకపోయిరి.

కొందఱు వానరులు, రాక్షసులచే శూలంబులం బాడితులయి నెత్తుటం దోఁగియుండిరి; కొందఱు యుద్ధంబున బలవంతులగు రాక్షసులనోర్వం జాలక పాఱిపోయిరి.

అని, తాత్పర్యము.

విభిన్నహృదయాః కేచి దేకపార్శ్వేన తాడితాః. ౨౨
విదారితా స్త్రిశూలై శ్చ కేచి దాంత్రై ర్వినిస్సృతాః

టీక॥ కేచిత్ = కొందఱు;ఏకపార్శ్వేన= ఒకటొకప్రక్కచేత ; తాడితాః=కొట్టఁబడినవారలయి ; విభిన్నహృదయాః= పగిలినగుండెలుగలవారలయిరి. కేచిత్=కొందఱు ; త్రిశూలైశ్చ = త్రిశూలములచేతను ; విదారితాః = చీల్పఁబడినవారలయి; ఆంత్రైః=ప్రేగులచేత;వినిస్సృతాః= పీకివేయఁబడినారు.

కొందఱికిఁ , బ్రక్కపాటునఁగొట్టుటచే గుండెకాయలు పగిలినవి ; కొందఱు , త్రిశూలంబులం బొడువఁబడిప్రేగులువెలికివచ్చునట్లు పీకి చీల్పఁబడిరి. అని,తాత్పర్యము.

త త్సుభీమం మహాయుద్ధం హరిరాక్షససంకులమ్. ౨౩
ప్రబభౌ శబ్దబహుళం శిలాపాదపసంకులమ్

టీక॥ సుభీమం=మిక్కిలి భయంకరంబును; హరిరాక్షససంకులం= వానరరాక్షసులచేనిండినదియు; శబ్దబహుళం=అధికమయినధ్వనిగలదియు; శిలా

పాదపసంకులం=తాళ్లచేతను వృక్షము లచేతనునిండినదియునగు; తత్=అ;మహాయుద్ధం=గొప్పయుద్ధము;ప్రబభౌ=ప్రకాశించినది.

అట్లు, వానరరాక్షసులు,మహాఘోషంబున, శిలాపాదపాయుధంబులచేఁ బెనంగుచు, నమ్మహాయుద్ధంబతి భయంకరంబయి యొప్పినది.

అని, తాత్పర్యము.

ధనుర్జ్యాతంత్రిమధురం హిక్కాతాళసమన్వితమ్. ౨౪
మందస్తనితసంగీతం యుద్ధగాంధర్వమాబభౌ

టీక॥ ధనుర్జ్యాతంత్రిమధురం=వింటియల్లెత్రాడనువీణచేమనోహరమయినదియు;హిక్కాతాళసమన్వితం=ఎక్కిళ్లనుతాళములతోఁగూడినదియు;మంద స్తనితసంగీతం=తిన్ననిమాటలను సంగీతము గలదియునగు ; యుద్ధగాంధర్వం= యుద్ధమనుగంధర్వవిద్య ; ఆబభౌ=ప్రకాశించెను.

అల్లెత్రాళ్ల ధ్వనులె వీణాధ్వనులుగా,నాయాసంబునం గలుగు నెక్కిళ్లె తాళంబులుగా, మందవచనంబులె గానంబుగా , నాయుద్ధగాంధర్వంబెంతయుఁబ్రకాశించినది.అని, తాత్పర్యము.

ధూమ్రాక్షస్తు ధనుష్పాణి ర్వానరాన్ రణమూర్ధని. ౨౫
హసన్విద్రావయామాస దిశస్తు శరవృష్టిభిః

టీక॥ ధూమ్రాక్షస్తు = ధూమ్రాక్షుండు మాత్రము ; రణమూర్ధని= యుద్ధశిరస్సునందు;ధనుష్పాణిః = ధనుస్సుచేతఁగలవాఁడై; హసన్ = నవ్వుచు;శరవృష్టిభిః = బాణవర్షములచేత;వానరాన్=వానరులను; దిశస్తు= దిక్కులనుగూర్చియె ; విద్రావయామాస=తఱిమెను.

అప్పుడు,ధూమ్రాక్షుండు , యుద్ధాగ్రంబునధనుర్ధరుండై, వీర్యోత్సేకంబునఁబకపకనవ్వుచు, బాణవర్షంబులుగురిపించి, వానరులనుదిక్కులకుం దఱిమెను. అని,తాత్పర్యము.

ధూమ్రాక్షేణార్దితం సైన్యం వ్యథితం దృశ్య మారుతిః. ౨౬
అభ్యవర్తత సంక్రుద్ధః ప్రగృహ్య విపులాం శిలామ్

టీక॥ మారుతిః=వాయుపుత్రుఁడైనహనుమంతుఁడు; ధూమ్రాక్షేణ=ధూమ్రాక్షునిచేత; అర్దితం= పీడింపఁబడినదియు; వ్యథితం=దుఃఖితమునగు; సైన్యం=సైన్యమును; దృశ్య (దృష్ట్వా) = చూచి; సంక్రుద్ధః=మిక్కిలియుఁ గోపించినవాఁడై; విపులాం=విశాలమగు; శిలాం=ఱాతిని ; ప్రగృహ్య=తీసికొని; అభ్యవర్తత=ఎదిరించెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు, ధూమ్రాక్షునిచేఁ దఱుమఁబడివిహ్వలంబయిపోవుచున్న వానరసేనంజూచి, పరమకుపితుండై, విశాలంబగుశిలంజేకొని, ధూమ్రాక్షునిపైకిఁబోయెను. అని, తాత్పర్యము.

క్రోధాద్ద్విగుణతామ్రాక్షః పితృతుల్యపరాక్రమః. ౨౭
శిలాం తాం పాతయామాస ధూమ్రాక్షస్య రథం ప్రతి

టీక॥ పితృతుల్యపరాక్రమః= తండ్రితోసమానమయిన పరాక్రమముగల; సః(అధ్యాహృతము) = ఆహనుమంతుండు; క్రోధాత్=కోపమువలన; ద్విగుణతామ్రాక్షః=రెండింతలెఱ్ఱనైనకన్నులుగలవాఁడై; తాం=ఆ; శిలాం=ఱాయిని; ధూమ్రాక్షస్య = ధూమ్రాక్షునియొక్క; రథంప్రతి = రథమునుగూర్చి; పాతయామాస= పడవేసెను.

తండ్రియగు వాయుదేవునితో సమానమయిన పరాక్రమము గల యా హనుమంతుండు, కోపంబునఁ గన్నుఁగొనలరెండింతలెఱ్ఱఁదనంబుగదుర, నాశిలను ధూమ్రాక్షుని రథంబుపైఁబడవేసెను. అని, తాత్పర్యము.

ఆపతంతీం శిలాం దృష్ట్వా గదా ముద్యమ్య సంభ్రమాత్. ౨౮
రథాదాప్లుత్య వేగేన వసుధాయాం వ్యతిష్ఠత

టీక॥ సః(అధ్యాహృతము)=ఆధూమ్రాక్షుఁడు; ఆపతంతీం=వచ్చుచున్న; శిలాం=ఱాయిని; దృష్ట్వా=చూచి ; సంభ్రమాత్=తొట్రుపాటువలన; గ

దాం=గదను; ఉద్యమ్య=పట్టుకొని; వేగేన=వేగముచేత; రథాత్= రథమునందుండి; ఆప్లుత్య=దుమికి ; వసుధాయాం=భూమియందు; వ్యతిష్ఠత= నిలిచెను.

అధూమ్రాక్షుండు, తనపైకి నమ్మహాశిలవచ్చుటంజూచి, తత్క్షణంబున గదచేతంగొని, వేగంబున, రథమున నుండి, నేలకులంఘించి నిలుచుండెను.

అని, తాత్పర్యము.

సా ప్రమథ్య రథం తస్య నిపపాత శిలా భువి. ౨౯
సచక్రకూబరం సాశ్వం సధ్వజం సశరాసనమ్

టీక॥సా=ఆ; శిలా = ఱాయి;సచక్రకూబరం = చక్రములతోను నొగతోనుంగూడినదియు;సాశ్వం = గుఱ్ఱములతోఁగూడినదియు;సధ్వజం = టెక్కెముతోఁగూడినదియు ; సశరాసనం=వింటితోఁగూడినదియునగు;తస్య=ఆధూమ్రాక్షునియొక్క;రథం = రథమును;ప్రమథ్య=నుగ్గుచేసి;భువి= నేలయందు;పపాత=పడెను.

ఆపెనుఱాయి , ధూమ్రాక్షునిరథంబును జక్రకూబరంబులతోను గుఱ్ఱంబులతోను ధ్వజంబుతోను విల్లుతోనుం గూడ,నుగ్గు గావించినది.

అని, తాత్పర్యము.

స భఙ్క్త్వాతు రథం తస్య హనుమా న్మారుతాత్మజః. ౩౦
రక్షసాం కదనం చక్రే సస్కంధవిటపై ర్ద్రుమైః

టీక॥ మారుతాత్మజః= వాయువుకొడుకైన; సః=ఆ; హనుమాన్ = హనుమంతుండు; తస్య= అధూమ్రాక్షునియొక్క; రథం = రథమును; భఙ్క్త్వాతు=విఱిచినంతనె; సస్కంధవిటపైః=బోదెలతోనుకొమ్మలతోనుంగూడిన;ద్రుమైః= వృక్షముచేలత ; రక్షసాం= రాక్షసులయొక్క ; కదనం=హింసించుటను;చక్రే=చేసెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు , అట్లు ధూమ్రాక్షునిరథంబునునుగ్గుగావించి,యంత, బోదెలతోనుగొమ్మలతోనుంగూడిన మహావృక్షంబులచే, రాక్షసులవధింప సాగెను.

అని, తాత్పర్యము.

విభిన్నశిరసో భూత్వా రాక్షసా శ్శోణితోక్షితాః. ౩౧
ద్రుమైః ప్రవ్యథితా శ్చాన్యే నిపేతు ర్ధరణీతలే

టీక॥ అన్యే=ఇతరులయిన; రాక్షసాశ్చ=రాక్షసులును;ద్రుమైః= వృక్షములచేత;విభిన్నశిరసః = పగిలినతలలుగలవారలు;భూత్వా = అయి;శోణితోక్షితాః = నెత్తురుచేఁదడుపఁబడినవారలయి;ప్రవ్యథితాః = బాధితులయి;ధరణీతలే – భూతలమునందు;నిపేతుః= పడిరి.

మఱికొందఱు రాక్షసులు, వృక్షంబులచేఁగొట్టఁబడి, తలలుపగిలి , నెత్తురుగాఱ,విహ్వలులయి నేలఁబడిరి. అని, తాత్పర్యము.

విద్రావ్య రాక్షసం సైన్యం హనుమా న్మారుతాత్మజః. ౩౨
గిరే శ్శిఖర మాదాయ ధూమ్రాక్ష మభిదుద్రువే

టీక॥మారుతాత్మజః = వాయువుకొడుకైన;హనుమాన్=హనుమంతుఁడు;రాక్షసం= రాక్షససంబంధియగు;సైన్యం=సైన్యమును;విద్రావ్య=పాఱఁదోలి;గిరేః=పర్వతముయొక్క ; శిఖరం=శృంగమును;ఆదాయ= తీసికొని;ధూమ్రాక్షం=ధూమ్రాక్షుని; అభిదుద్రువే=తఱిమెను.

వాయుదేవునికుమారుఁడగు హనుమంతుండు,అట్లు రాక్షససైన్యంబుల నన్నింటినిం బాఱఁదోలి, పర్వతశిఖరంబునొకటిం జేకొని,ధూమ్రాక్షునిమీఁది కుఱికెను.అని, తాత్పర్యము.

త మాపతంతం ధూమ్రాక్షో గదా ముద్యమ్య వీర్యవాన్. 33
వినదమాన స్సహసా హనుమంత మభిద్రవత్

టీక॥ వీర్యవాన్= అధికమయినపరాక్రమంబుగల;ధూమ్రాక్షః = ధూమ్రాక్షుఁడు;గదాం = గదను; ఉద్యమ్య=పట్టుకొని;వినదమానః– అఱచుచు;సహసా = వేగమున; ఆపతంతం=వచ్చుచున్న;తం = ఆ;హనుమం

తం=హనుమంతుని ; అభిద్రవత్ (అభ్యద్రవత్)= ఎదుర్కొ-సి పరుగెత్తెను.

మహా పరాక్రమశాలియగు ధూమ్రాక్షుండు , అప్డుహనుమంతుండు, తనమీఁదికిఁగవియుటంజూచి , గదచేతంగొని , సింహనాదంబు గావించుచు, వేగంబున, నాహనుమంతునిమీఁదికడరెను. అని, తాత్పర్యము.

తతః క్రుద్ధస్తు వేగేన గదాం తాం బహుకంటకామ్. ౩౪
పాతయామాస ధూమ్రాక్షో మస్తకే తు హనూమతః

టీ॥ తతః = అంత ; ధూమ్రాక్షస్తు= ధూమ్రాక్షుఁడును; క్రుద్ధః= కోపించినవాఁడైయే; వేగేన= వేగముచేత; బహుకంటకాం=పెక్కు-చీలలుగల; తాం=ఆ; గదాం=గదను; హనూమతః = హనుమంతునియొక్క; మస్తకే తు=తలయందే; పాతయామాస=పడవేసెను.

అంత, ధూమ్రాక్షుఁడు, కోపించి, పెక్కు-మేకులతోఁగూడినయాగదను, వేగంబున, హనుమంతునితలపైఁ బడవైచెను. అని, తాత్పర్యము.

తాడితస్స తయా తత్ర గదయా భీమరూపయా. ౩౫

టీ॥ తత్ర=అప్పుడు; సః= ఆహనుమంతుఁడు; భీమరూపయా= భయంకరమయినయాకారముగల; తయా= ఆ; గదయా=గదచేత; తాడితః= కొట్టఁబడెను.

భయంకరంబగు నాగద, యప్పుడు, హనుమంతునితలపైఁబడినది.
అని, తాత్పర్యము.

స కపి ర్మారుతబల స్తం ప్రహార మచింతయన్
ధూమ్రాక్షస్య శిరోమధ్యే గిరిశృంగ మపాతయత్. ౩౬

టీ॥ సః=ఆ; మారుతబలః= వాయువుయొక్క-బలమువంటిబలముగల ; కపిః=హనుమంతుఁడు; తం=ఆ; ప్రహారం=దెబ్బను; అచింతయన్=తలంపనివాఁడై; ధూమ్రాక్షస్య= ధూమ్రాక్షునియొక్క-; శిరోమధ్యే=తలనడుమ;

గిరిశృంగం=పర్వతశిఖరమును; అపాతయత్=పడవేసెను.

వాయుసమానబలుండగు హనుమంతుండు, ఆదెబ్బను సరకుసేయక ధూమ్రాక్షునిశిరంబుపై, నాపర్వతశిఖరంబుపడవైచెను.

అని, తాత్పర్యము.

స విహ్వలితసర్వాంగో గిరిశృంగేణ తాడితః
పపాత సహసా భూమౌ వికీర్ణ ఇవ పర్వతః. ౩౭

టీక॥ సః=ఆధూమ్రాక్షుఁడు; గిరిశృంగేణ=పర్వతశిఖరముచేత; తాడితః=కొట్టఁబడినవాఁడై; విహ్వలితసర్వాంగః = వివశములుగాఁజేయఁబడినసమస్తావయవములును గలవాఁడై; వికీర్ణః=వెదచల్లఁబడిన; పర్వతఇవ=కొండవలె; సహసా = తటాలున; భూమౌ=నేలయందు; పపాత= పడెను.

ఆధూమ్రాక్షుండు, పర్వతశిఖరంబుచేఁదాడితుండై, సమస్తావయవంబులునువివశంబులుగా, భిన్నపక్షంబగుపర్వతంబుకరణినేలంగూలెను.

అని, తాత్పర్యము.

ధూమ్రాక్షం నిహతం దృష్ట్వా హతశేషా నిశాచరాః
త్రస్తాః ప్రవివిశు ర్లంకాం వధ్యమానాః ప్లవంగమైః. ౩౮

టీక॥ ధూమ్రాక్షం=ధూమ్రాక్షుని; నిహతం=చంపఁబడినవానిఁగా; దృష్ట్వా=చూచి; హతశేషాః=చంపఁబడఁగామిగిలిన; నిశాచరాః= రాక్షసులు; ప్లవంగమైః=వానరులచే; వధ్యమానాః=వధింపఁబడుచున్నవారలయి; త్రస్తాః=భయపడినవారలయి; లంకాం=లంకను; ప్రవివిశుః=చొచ్చిరి.

అంత, హతశేషులగురాక్షసులు, ధూమ్రాక్షుండునిహతుండగుటను జూచి, వానరులుమఱియు నుక్కుమిగిలి పైఁబడ, నోర్వఁజాలక, భయంబున లంకకుంబాఱిరి.

అని, తాత్పర్యము.

స తు పవనసుతో నిహత్య శత్రుం

స ౫౨

క్షతజవహాః స్సరితశ్చ సన్నికీర్య
రిపువధజనితశ్రమో మహాత్మా
ముద మగమ త్కపిభిశ్చ పూజ్యమానః. ౩౮

**టీక॥** మహాత్మా = అధికమయినపరాక్రమముగల; పవ నసుతః = వాయుపుత్రుఁడు నైన; సతు = ఆహనుమంతుఁడు; శత్రుం = శత్రువును; నిహత్య = వధించి; క్షతజవహాః = నెత్తురుప్రవహించునట్టి; సరితశ్చ = నదులను; సన్నికీర్య = పఱపి; రిపువధజనితశ్రమః = శత్రువులను వధించుటచేఁగలిగిన యాయాసముగలవాఁడై; కపిభిః = వానరులచేత; పూజ్యమానశ్చ = పూజింపఁబడుచున్నవాఁడు నై; ముదం = సంతోషమును; అగమత్ = పొందెను.

మహాత్ముండును వాయుదేవకుమారుండు నగు నాహనుమంతుండు అట్లు, ధూమ్రాక్షుని వధించి, యుద్ధభూమియందు రక్తనదులం ప్రవహింపఁజేసి, వానరులచేఁబూజితుండై, సంతోషంబునొందెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, యుద్ధకాండే, ద్విపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండద్విపంచాశసర్గటీక, ముగిసినది.

---



శ్రీః

త్రిపంచాశస్సర్గ ప్రారంభః.

ధూమ్రాక్షం నిహతం శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః
క్రోధేన మహతావిష్ట ఉ నిశ్శ్వసన్నురగో యథా. ౧

టీక॥ రాక్షసేశ్వరః= రాక్షసులకుఁ బ్రభుండగు; రావణః = రావణుఁడు, ధూమ్రాక్షం = ధూమ్రాక్షుని; నిహతం=చంపఁబడినవానిఁగా; శ్రుత్వా= విని; ఉరగోయథా= సర్పమువలె; నిశ్శ్వసన్=నిట్టూర్పులువుచ్చుచు; మహతా=అధికమయిన; క్రోధేన=కోపముచేత; ఆవిష్టః=ఆవేశింపఁబడినవాఁడు; అభూత్(అధ్యాహృతము=)ఆయెను.

రాక్షసరాజుండగు రావణుండు, ధూమ్రాక్షుండువధింపఁబడుటను విని సర్పమువలె నిట్టూర్పులువుచ్చుచుఁ, బరమకోపంబునొందెను,

అని, తాత్పర్యము.

దీర్ఘ ముష్ణంచ నిశ్శ్వస్య క్రోధేన కలుషీకృతః
అబ్రవీ ద్రాక్షసం శూరం వజ్రదంష్ట్రం మహాబలమ్. ౨

టీక॥ సః(అధ్యాహృతము)= ఆ రావణుఁడు; దీర్ఘం= నిడుపుగాను; ఉష్ణంచ=వేఁడిగాను; నిశ్శ్వస్య= నిట్టూర్పులు వుచ్చి; క్రోధేన=కోపముచేత ; కలుషీకృతః= కలంగినవాఁడుగాఁ జేయఁబడినవాఁడై; శూరం =యుద్ధంబునభయములేనివాఁడును ; మహాబలం= అధికమయినబలముగలవాఁడునగు; వజ్రదంష్ట్రం= వజ్రదంష్ట్రుండను; రాక్షసం= రాక్షసునిగూర్చి; అబ్రవీత్= చెప్పెను.

ఆ రావణుండు, కోపంబున నొడలు దెలియక, వేఁడినిట్టూర్పులు వుచ్చుచు, శూరుండును మహాబలుండు నగు వజ్రదంష్ట్రుఁజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

గచ్ఛ త్వం వీర నిర్యాహి రాక్షసైః పరివారితః
జహి దాశరథిం రామం సుగ్రీవం వానరై స్సహ. ౩

టీక॥ వీర= పరాక్రమశాలివగువ వజ్రదంష్ట్రుడా! త్వం=నీవు; గచ్ఛ = పొమ్ము. రాక్షసైః=రాక్షసులచేత ; పరివారితః =చుట్టఁబడినవాఁడవై; నిర్యాణ=వెడలుము. దాశరథిం = దశరథుని కొడుకైన; రామం = రామునిని; సుగ్రీవం=సుగ్రీవుని; వానరైస్సహ= వానరులతోఁగూడ; జహి=వధింపుము.

పరాక్రమశాలివగు వజ్రదంష్ట్రుఁడా! నీవిప్పుడు , రాక్షససేనంగూడి పోయి, దశరథపుత్రుండగు రాముని సుగ్రీవునివానరులనందఱను వధింపుము. అని, రావణుండు, వజ్రదంష్ట్రునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తథేత్యుక్త్వా ద్రుతతరం మాయావీ రాక్షసేశ్వరమ్
నిర్జగామ బలై స్సార్ధం బహుభిః పరివారితః. ౪

టీక॥ మాయావీ= మాయలవాఁడగు వజ్రదంష్ట్రుఁడు; రాక్షసేశ్వరం= రాక్షసులకుఁబ్రభుండగు రావణునిగూర్చి; తథేతి=అట్లేయని; ఉక్త్వా = చెప్పి; బహుభిః = పెక్కండ్ర రాక్షసులచేత; పరివారితః= చుట్టఁబడినవాఁడై; బలైస్సార్ధం= సైన్యములతోఁగూడ; నిర్జగామ=బయలువెడలెను.

మాయావియగునా వజ్రదంష్ట్రుండు, రాక్షసరాజుండగు రావణునింజూచి యట్లేయనిచెప్పి, పెక్కు రాక్షసులం గూడి, సైన్యములతోఁగూడ, బయలుదేఱెను. అని, తాత్పర్యము.

నాగై రశ్వైః ఖరై రుష్ట్రై స్సంయుక్త స్సుసమాహితః
పతాకాధ్వజచిత్రైశ్చ రథైశ్చ సమలంకృతః. ౫
తతో విచిత్రకేయూరమకుటైశ్చ విభూషితః
తనుత్రాణిచ సంయుక్య సధను ర్నిర్యయౌ ద్రుతమ్. ౬

టీక॥ తతః=అంత; సః(అధ్యాహృతము)=ఆవజ్రదంష్ట్రుఁడు; నాగైః = ఏనుంగులతోను; అశ్వైః= గుఱ్ఱములతోను; ఖరైః=గాడిదలతోను; ఉష్ట్రైః=ఒంటెలతోను; సంయుక్తః = కూడినవాఁడై; సుసమాహితః=మిక్కిలియు నెచ్చ

రికగలవాండ్రై; పతాకాధ్వజచిత్రైః= రాజచిహ్నములు వ్రాసిన టెక్కెము లచేతను వట్టి టెక్కెములచేతను నానావర్ణములయిన;రథైశ్చ= రథముల చేతను;సమలంకృతః=మిక్కిలియునలంకరింపఁబడినవాండ్రై;విచిత్రకేయూరమకుటైశ్చ= నానావిధములయినబాహుపురులచేతను;గిరీటముచేతను ;విభూషితః=అలంకరింపఁబడినవాండ్రై;తనుత్రాణిచ=కవచములను;సంయుధ్య=కట్టుకొని;సధనుః=విల్లుతోఁగూడినవాండ్రై;దుర్తం=శీఘ్రముగా;నిర్యయా= వెడలెను.

అంత,నావజ్రదంష్ట్రుండు, ఏనుంగులనుగుఱ్ఱంబులనుగాడిదలను నొంటెలను, నానావిధధ్వజాలంకృతంబు లగు రథంబులనుఁగూడి, బాహుపురులు కిరీటంబు మన్నగుభూషణంబులుదాల్చి, కవచంబులు దొడుగుకొని, ధనుర్ధరుండై, మెచ్చరికతో , శీఘ్రంబునం బోయెను అని. తాత్పర్యము.

పతాకాలంకృతం దీప్తం తప్తకాంచనభూషణమ్
రథం ప్రదక్షిణం కృత్వా సమారోహ చ్చమూపతిః. ౭

టీ॥చమూపతిః=సేనానాయకుఁడగు వజ్రదంష్ట్రుఁడు; పతాకాలంకృతం=ధ్వజములచే నలంకరింపఁ బడినదియు;దీప్తం=ప్రకాశించుచున్నదియు ; తప్తకాంచనభూషణం= కాఁచఁబడిన బంగారమె యలంకారముగాఁ గలదియునగు; రథం=రథమునుగూర్చి; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా= చేసి; సమారోహాత్=ఎక్కెను.

సేనాపతియగువజ్రదంష్ట్రుండు,ధ్వజంబులచే నలంకృతంబునుబంగారముతో నలంకరింపఁబడినదియునగు రథంబునకుఁ బ్రదక్షిణంబు గావించి దానినారోహించెను. అని,తాత్పర్యము.

యష్టిభి స్తోమరై శ్చిత్రైశ్శూలైశ్చ ముసలైరపి
భిండిపాలైశ్చ పాశైశ్చ శక్తిభిః పట్టిసైరపి. ౮
ఖడ్గై శ్చక్రై ర్గదాభిశ్చ నిశితైశ్చ పరశ్వధైః
పదాతయశ్చ నిర్యాంతి వివిధా శ్శస్త్రపాణయః. ౯

టీక॥ వివిధాః=నానావిధములగు; పదాతయశ్చ=కాల్బలరును ; యష్టిభిః=కొయ్యలతోను; తోమరైః=తోమరములనునాయుధములతోను; చిత్రైః=నానావర్ణములగు; శూలైశ్చ= శూలములతోను; ముసలైరపి=రోకళ్లతోను; భిండిపాలైశ్చ= విడిచివాటు గుదియలతోను; పాశైశ్చ=త్రాళ్లతోను; శక్తిభిః=శక్తులతోను; పట్టిసైరపి= అడ్డకత్తులతోను; ఖడ్గైః=కత్తులతోను; చక్రైః= చక్రములతోను; గదాభిశ్చ= గదలతోను; నిశితైః=తీక్ష్ణములగు; పరశ్వధైః= గొడ్డళ్లతోను ; యుక్తాః (అధ్యాహృతము)= కూడినవారలయి; శస్త్రపాణయః=ఆయుధములు చేతులం గలవారలయి; నిర్యాంతి=వెడలిరి.

అంతఁ గాల్బలరును, యష్టులుఁ దోమరంబులుఁ జిత్రంబులగు శూలంబులు ముసలంబులు భిండిపాలంబులుఁ బాశంబులు శక్తులుఁ బట్టిసంబులు ఖడ్గంబులుఁ జక్రంబులు గదలుఁ దీక్ష్ణంబులగు పరశ్వధంబులు మున్నగు నాయుధంబులం జేకొని, వెడలిరి. అని, తాత్పర్యము.

విచిత్రవాససస్సర్వే దీప్తా రాక్షసపుంగవాః

టీక॥ తే(అధ్యాహృతము)=ఆ; రాక్షసపుంగవాః= రాక్షసశ్రేష్ఠులు ; సర్వే=అందఱును; విచిత్రవాససః= నానావిధములగు నవస్త్రములు గలవారలయి; దీప్తాః=ప్రకాశించుచుండిరి.

ఆ రాక్షసవీరులందఱు, మంచిమంచి వస్త్రంబులం దాల్చి మెంతయుఁ బ్రకాశించుచుండిరి. అని, తాత్పర్యము.

గజా మదోత్కటా శ్శూరా శ్చలంత ఇవ పర్వతాః. ౧౦
తే యుద్ధకుశలై రూఢా స్తోమరాంకుశపాణిభిః

టీక॥ మదోత్కటాః=మదము పేఁబట్టరానివియు, శూరాః= యుద్ధమునందుభయములేనివియు; చలంతః= కదలుచున్న; పర్వతాఇవ(స్థితాః)=కొండలువలెనున్నవియునగు; తే = ప్రసిద్ధములయిన; గజాః= ఏనుంగులు ; యుద్ధకుశలైః=యుద్ధమునందు సమర్థులును ; తోమరాంకుశపాణిభిః=తోమరంబులును అంకుశంబులును జేతులం గలవారలు నగువారలచేత; రూఢాః= ఎక్కఁబడి

నవి.

యుద్ధంబునసమర్థులగు రాక్షసవీరులు తోమరంబులునంకుశంబులుఁ జేతులంబూని,మదోత్కటంబులును ఎట్టి యుద్ధంబునందును భయము లేనివియు సంచరించుపర్వతంబులకరణి నొప్పుచున్నవియునగునేనుంగుల నారోహించి పోయిరి. అని, తాత్పర్యము.

అన్యే లక్షణసంయుక్తా శ్శూరా రూఢా మహాబలాః. ౧౧

టీక॥ లక్షణసంయుక్తాః= మంచిలక్షణములతోఁగూడినవియు; శూరాః= యుద్ధంబునభయములేనివియు; మహాబలాః=అధికమయినబలము గలవియునగు;అన్యే= ఇతరములయిన యేనుంగులు;రూఢాః=ఎక్కఁబడినవి.

మఱికొందఱు పెక్కిరాక్షసులు, శుభలక్షణయుక్తంబులును మహాబలంబులునుయుద్ధంబుల భయంబులేనివియు నగు మహాగజంబుల నారోహించి పోయిరి. అని, తాత్పర్యము.

తద్రాక్షసబలం ఘోరం విప్రస్థిత మశోభత
ప్రావృట్కాలే యథా మేఘా నర్దమానా స్సవిద్యుతః. ౧౨

టీక॥ విప్రస్థితం=బయలుదేఱిన;ఘోరం=భయంకరమయిన; తత్=ఆ;రాక్షసబలం=రాక్షససైన్యము; ప్రావృట్కాలే=వర్షర్తువునందు; నర్దమానాః=గర్జించుచున్నవియు; సవిద్యుతః= మెఱపులతోఁగూడినవియునగు; మేఘాయథా= మేఘములవలె;అశోభత=ప్రకాశించెను.

అప్పుడట్లుయుద్ధంబునకై వెడలిననీలదేహులును గాంచనాలంకృతులును సింహనాదంబులు సేయుచుండువారలునగునా రాక్షసవీరులు,వర్షాకాలంబున మెఱుపులతోఁగూడిగర్జించుచున్న మేఘంబులుంబోలెనొప్పుచుండిరి.

అని, తాత్పర్యము.

నిస్సృతా దక్షిణద్వారా దంగదో యత్ర యూథపః
తేషాం నిష్క్రమమాణానా మశుభం సమజాయత. ౧౩

టీక॥ తే(అధ్యాహృతము) = ఆ రాక్షసులు ; యూథపః = వానర యూథ నాథుండైన ; అంగదః= అంగదుండు ; యత్ర = ఎచ్చటనో ; తస్మాత్ (అధ్యాహృతము)= ఆ; దక్షిణద్వారాత్ = దక్షిణపువాకిట నుండి; నిస్సృతాః= వెడలిరి. తేషాం = వారలు;నిష్క్రమమాణానాం= బయలు వెడలుచుండఁగా;అశుభం=అమంగళము; సమజాయత=కలిగెను.

ఆ రాక్షసులు,అంగదుండుండునట్టిలంకాదక్షిణద్వారంబున వెడలిరి; వారలు వెడలుచుండఁగానే,యశుభనిమిత్తంబులుపొడసూపినవి. అని,తాత్పర్యము.

ఆకాశాద్విఘనాత్తీవ్రా ఉల్కాశ్చాభ్యపతం స్తదా
వమంత్యః పావకజ్వాలాః శివా ఘోరం వవాశిరే. ౧౪

టీక॥తదా=అప్పుడు; విఘనాత్= మేఘములేని;ఆకాశాత్= ఆకాశమున నుండి;తీవ్రాః=తీక్ష్ణములయిన; ఉల్కాశ్చ=కొఱవులును;అభ్యపతన్= పడినవి.శివాః=నక్కలు; పావకజ్వాలాః= అగ్నిహోత్రజ్వాలలను;వమంత్యః=క్రక్కుచు;ఘోరం=భయంకరముగా;వవాశిరే=అఱచినవి.

అప్పుడు, మేఘశూన్యంబగు నాకాశంబుననుండి,తీవ్రంబులగుకొఱవులు పడినవి;నక్కలు , అగ్నిజ్వాలలుగ్రక్కుచు,భయంకరంబుగానఱచెను.

అని, తాత్పర్యము.

వ్యాహరంతి మృగా ఘోరా రక్షసాం నిధనం తదా
సమాపతంతో యోధాస్తు ప్రాస్ఖలన్ భయమోహితాః . ౧౫

టీక॥ తదా=అప్పుడు; ఘోరాః= భయంకరములగు;మృగాః= మృగములు;రక్షసాం=రాక్షసులయొక్క ; నిధనం=చావును;వ్యాహరంతి= చెప్పుచుండినవి.యోధాః=భటులు; సమాపతంతస్తు=వచ్చుచునె;భయమోహితాః= భయముచే మోహము నొందింపఁబడినవారలయి;ప్రాస్ఖలన్=తడఁబడిరి.

అప్పుడు , భయంకరంబులగుక్రూరమృగంబులు, రాక్షసుల మరణంబును సూచించెను;రాక్షసవీరులును, పోవుచప్పుడుభయమోహితులయి, నేలంబడిరి. అని,తాత్పర్యము.

ఏతా నౌత్పాతికాన్ దృష్ట్వా వజ్రదంష్ట్రో మహాబలః
ధైర్య మాలంబ్య తేజస్వీ నిర్జగామ రణోత్సుకః. ౧౬

టీక॥ తేజస్వీ=అధికమయినపరాక్రమముగలవాఁడును; మహాబలః=అధికమయినబలముగలవాఁడునగు; వజ్రదంష్ట్రః = వజ్రదంష్ట్రుఁడు; ఏతాన్= ఈ; ఔత్పాతికాన్ = ఉత్పాతంబులను; దృష్ట్వా=చూచి; ధైర్యం=ధైర్యమును; ఆలంబ్య=అవలంబించి; రణోత్సుకః=యుద్ధంబునందుత్సాహముఁగలవాఁడై; నిర్జగామ=వెడలెను.

మహాపరాక్రమశాలియు మహాబలుండునగువజ్రదంష్ట్రుండు, ఈయుత్పాతంబులన్నియుఁ జూచి, యెట్టకేలకు ధైర్యంబునవలంబించి, యుద్ధోత్సుకుండై, వెడలెను. అని, తాత్పర్యము.

తాంస్తు నిష్క్రమతో దృష్ట్వా వానరా జితకాశినః
ప్రణేదు స్సుమహానాదాన్ నాదయంశ్చ దిశో దశ. ౧౭

టీక॥ జితకాశినః= జయముచేఁ బ్రకాశించునట్టి; వానరాః=వానరులు; నిష్క్రమతః=వెడలుచున్న; తాన్=ఆ రాక్షసులను; దృష్ట్వాతు= చూచినంతనే; సుమహానాదాన్=మిక్కిలియుగొప్పధ్వనులను; ప్రణేదుః=చేసిరి. దశ = పదియయిన; దిశః= దిక్కులను; నాదయంశ్చ(అనాదయంశ్చ)= ధ్వనింపఁజేసిరియు.

జయశీలురగునావానరులు, ఆరాక్షసులువచ్చుటఁజూచి, దశదిశలనునిండునట్లు, సింహనాదంబులుగావించిరి. అని, తాత్పర్యము.

తతః ప్రవృత్తం తుములం హరీణాం రాక్షసై స్సహ
ఘోరాణాం భీమరూపాణా మన్యోన్యవధకాంక్షిణామ్. ౧౮

టీక॥ తతః=అంత; ఘోరాణాం= భయంకరులును; భీమరూపాణాం= భయంకరాకారులును; అన్యోన్యవధకాంక్షిణాం=ఒండొరులవధించుటనుగోరుచుండువారలునగు; హరీణాం= వానరులకును; రాక్షసైస్సహ= రాక్షసులతోఁ




గూడ; తుములం=దొమ్మియుద్ధము; ప్రవృత్తం=జరగినది.

అంత, భయంకరాకారులును ఒండొరులవధింపఁదలంపుగొనియుండువారలునగువానరరాక్షసులకు, దొమ్మియుద్ధంబు, జరగినది. అని, తాత్పర్యము.

సంహతాస్తే మహోత్సాహా భిన్నదేహశిరోధరాః
రుధిరోక్షితసర్వాంగా న్యపతన్ జగతీతలే. ౧౯

టీక॥ మహోత్సాహాః= అధికమయిన యుత్సాహముఁగల; తే (అధ్యాహృతము)=ఆవానరులు; సంహతాః= కలిసియు; భిన్నదేహశిరోధరాః= పగిలిన దేహములును మెడలునుగలవారలయి; రుధిరోక్షితసర్వాంగాః= నెత్తురుటందడుపఁబడినసమస్తావయవములుగలవారలయు; జగతీతలే=భూతలమునందు; న్యపతన్=పడిరి.

ఆవానరరాక్షసులు, మహోత్సాహంబుననొండొరులుంగలసిపోరి దేహములందు గాయములుగలిగి, మెడకాయలువిఱిగి, నెత్తురుటందోఁగుచు, నేలంబడిరి. అని, తాత్పర్యము.

కేచి దన్యోన్య మాసాద్య శూరాః పరిఘపాణయః
చిక్షిపు ర్వివిధం శస్త్రం సమరే ష్వనివర్తినః. ౨౦

టీక॥ సమరేషు=యుద్ధములందు; అనివర్తినః=మఱలనట్టి; శూరాః=యుద్ధమునందుభయములేనట్టి; కేచిత్=కొందఱు; పరిఘపాణయః= ఇనుపగుదియలు చేతులంగలవారలయి; అన్యోన్యం=ఒండొరులను; ఆసాద్య=పొంది; వివిధం=నానావిధమయిన; శస్త్రం=ఆయుధమును; చిక్షిపుః=ప్రయోగించుకొనిరి.

యుద్ధంబులందు వెనుదీయక పోరునట్టిశూరులగుకొందఱు వానరరాక్షసులు, ఒండొరులుంగలసి, నానావిధంబులుగాఁబోరిరి. అని, తాత్పర్యము.

ద్రుమాణాంచ శిలానాంచ శస్త్రాణాంచాపి నిస్స్వనః




శ్రూయతే సుమహాం స్తత్ర ఘోరో హృదయభేదనః. ౨౧

టీక॥ తత్ర=అప్పుడు; ద్రుమాణాం చ=వృక్షములయొక్కయు; శిలానాం చ= ఱాళ్లయొక్కయు; శస్త్రాణాం చాపి=ఆయుధములయొక్కయు; సుమహాన్=మిక్కిలియుగొప్పదియు; ఘోరః=భయంకరమును;హృదయభేదనః=హృదయమును భేదించునదియునగు; నిస్స్వనః=ధ్వని;శ్రూయతే= వినఁబడుచుండినది.

అప్పుడు, వృక్షశిలాయుధంబులుప్రయోగించునప్పుడుగలిగినధ్వని, భయంకరముగానువినువారలహృదయంబుభేదించునదిగానువినంబడినది.

అని, తాత్పర్యము.

రథనేమిస్వన స్తత్ర ధనుష శ్చాపి నిస్స్వనః
శంఖభేరీమృదంగానాం బభూవ తుములస్స్వనః. ౨౨

టీక॥ తత్ర=అచ్చట; రథనేమిస్వనః=రథములయొక్కచక్రములయంచులయొక్కధ్వనియు; ధనుషః=వింటియొక్క; నిస్స్వనశ్చాపి=ధ్వనియు; శంఖభేరీమృదంగానాం= శంఖములయొక్కయు భేరులయొక్కయు మృదంగములయొక్కయు;తుములః= దొమ్మియయిన; స్వనః=ధ్వనియు; బభూవ = కలిగెను.

అప్పుడు , రథనేమిధ్వనియుధనుర్ధ్వనియు శంఖభేరీమృదంగాదిధ్వనులును , దుములంబుగావినంబడియెను.

అని, తాత్పర్యము.

కేచి దస్త్రాణి సంసృజ్య బాహుయుద్ధ మకుర్వత

టీక॥కేచిత్=కొందఱు;అస్త్రాణి=ఆయుధములను; సంసృజ్య= ప్రయోగించి; బాహుయుద్ధం=చేతులతోఁజేయుయుద్ధమును ; అకుర్వత=చేసిరి.

ఆయుధంబులనన్నింటిని బ్రయోగించియయినపిదపఁ,గొందఱుబాహుయుద్ధంబుఁగావించిరి.అని, తాత్పర్యము.

తలైశ్చ చరణై శ్చాపి ముష్టిభిశ్చ ద్రుమై రపి. ౨౩

జానుభిశ్చ హతాః కేచి ద్భిన్నదేహాశ్చ రాక్షసాః

టీక॥కేచిత్= కొందఱు ; రాక్షసాః=రాక్షసులు;తలైశ్చ= అఱచేతులచేతను;చరణైశ్చాపి= పాదములచేతను;ముష్టిభిశ్చ=పిడికిళ్లచేతను; ద్రుమైరపి= వృక్షములచేతను ; జానుభిశ్చ= మోఁకాళ్ల చేతను;హతాః= వధింపఁబడినవారలై ;భిన్నదేహాశ్చ= భేదింపఁబడిన దేహము గలవారలు ; అభూవన్(అధ్యాహృతము)=అయిరి.

వానరులు,కొందఱు రాక్షసులను, అఱచేతులంజఱచియుఁబాదంబులం దన్నియుఁ బిడికిళ్లఁబొడిచియువృక్షంబులం బ్రహరించియు మోకాళ్లం గ్రమ్మియువధింప,వారలుభిన్నదేహులయినేలంబడిరి. అని, తాత్పర్యము.

శిలాభి శ్చూర్ణితాః కేచి ద్వానరై ర్యుద్ధదుర్మదైః. ౨౪

టీక॥యుద్ధదుర్మదైః= యుద్ధంబునందధికగర్వముగల;వానరైః=వానరులచేత;కేచిత్=కొందఱు రాక్షసులు; శిలాభిః=ఱాళ్లచేత;చూర్ణితాః= చూర్ణముగాఁజేయఁబడిరి.

యుద్ధోన్మత్తులగువానరులు కొందఱు,కొందఱు రాక్షసులనుశిలలచేఁ జూర్ణముగావించిరి.అని, తాత్పర్యము.

వజ్రదంష్ట్రో భృశం బాణై రణే విత్రాసయ న్హరీన్
చచార లోకసంహారే పాశహస్త ఇవాంతకః. ౨౫

టీక॥వజ్రదంష్ట్రః= వజ్రదంష్ట్రుఁడు; రణే=యుద్ధమునందు; హరీన్ = వానరులను;బాణైః=బాణములచేత ; భృశం=మిక్కిలియు; విత్రాసయన్= భయపెట్టుచు; లోకసంహారే=లోకములయొక్క సంహారకాలమందు; పాశహస్తః=పాశము చేతంగల; అంతక ఇవ=యముఁడువలె; చచార= విహరించెను.

వజ్రదంష్ట్రుండు,యుద్ధంబున, బాణంబులచే,వానరుల నొప్పించుచుఁ,బ్రళయకాలంబునం బాశహస్తుండగుయమునికైవడి,నెంతయు భయంకరాకారుండై, విహరించుచుండెను.

అని,తాత్పర్యము.

బలవంతో ఽస్త్రవిదుషో నానాప్రహరణా రణే
జఘ్నుర్వానరసైన్యాని రాక్షసాః క్రోధమూర్ఛితాః ౨౮

టీక॥ బలవంతః = అధికమయినబలము గలవారలును; అస్త్రవిదుషః = ఆయుధములయందుఁ బండితులును; నానాప్రహరణాః = నానావిధములయిన యాయుధములుగలవారలునగు; రాక్షసాః = రాక్షసులు; క్రోధమూర్ఛితాః = కోపముచేవ్యాపింపఁబడిన వారలయి; వానరసైన్యాని = వానరసైన్యములను; జఘ్నుః = వధించిరి.

బలవంతులు నాయుధవిద్యయందుఁ బండితులునగు రాక్షసులు, యుద్ధంబునం బరమకుపితులయి, నానావిధాయుధంబుల, వానరసైన్యంబుల వధించిరి.

అని, తాత్పర్యము.

నిఘ్నతో రాక్షసాన్ దృష్ట్వా సర్వాన్ వాలిసుతో రణే
క్రోధేన ద్విగుణావిష్టస్సంవర్తక ఇవానలః. ౨౯

టీక॥ వాలిసుతః = వాలికొడుకైన యంగదుండు; రణే = యుద్ధమునందు; నిఘ్నతః = వధించుచున్న; రాక్షసాన్ = రాక్షసులను; సర్వాన్ = అందఱను; దృష్ట్వా = చూచి; సంవర్తకే = ప్రళయకాలమునందు; అనలఇవ = అగ్నిహోత్రుఁడువలె; క్రోధేన = కోపముచేత; ద్విగుణావిష్టః = రెండింతలావేశింపఁబడినవాఁడు.

వాలిపుత్రుఁడగు నంగదుండు, అట్లు యుద్ధంబున నా రాక్షసులందఱు వానరులను వధించుటం జూచి, ప్రళయకాలంబున నగ్నిహోత్రుండుం బోలె, మహాకోపంబు నొందెను.

అని, తాత్పర్యము.

తాన్ రాక్షసగణాన్ సర్వాన్ వృక్షముద్యమ్య వీర్యవాన్
అంగదః క్రోధతామ్రాక్షస్సింహః క్షుద్రమృగానివ. ౩౦

టీక॥ వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగల; అంగదః = అంగదుఁడు; క్రోధతామ్రాక్షః = కోపముచే నెఱ్ఱనైనకన్నులుగలవాఁడై; వృక్షం = వృ

క్షమును; ఉద్యమ్య=పట్టుకొని; తాన్=అ; రాక్షసగణాన్ = రాక్షససమూహమును; సర్వాన్= అందఱను; సింహః=సింహము; క్షుద్రమృగానివ=అల్పమృగములనువలె; నిజఘాన (అధ్యాహృతము)=వధించెను.

మహాపరాక్రమశాలియగునంగదుండు, కోపంబునఁగనుఁగొనలనెఱ్ఱఁదనంబుమెఱయ, వృక్షంబుచే, నారాక్షసులనందఱను, సింహంబుస్వల్పమృగంబులంబోలెఁ, జక్కాడెను.

అని, తాత్పర్యము.

చకార కదనం ఘోరం శక్రతుల్యపరాక్రమః

టీక॥శక్రతుల్యపరాక్రమః=ఇంద్రునితోసమానమయిన పరాక్రమముగల; సః(అధ్యాహృతము) = ఆయంగదుఁడు; ఘోరం=భయంకరమయిన ; కదనం=యుద్ధమును; చకార=చేసెను.

దేవేంద్రునితోసాటియయిన పరాక్రమంబుగలయాయంగదుండప్పుడు,భయంకరంబుగా యుద్ధంబుగావించెను.

అని, తాత్పర్యము.

అంగదాభిముఖా స్తత్ర రాక్షసా భీమవిక్రమాః. ౨౯
విభిన్నశిరసః పేతు ర్విక్ఋత్తా ఇవ పాదపాః

టీక॥తత్ర=అచ్చట; అంగదాభిముఖాః=అంగదునియెదుటనున్న; భీమవిక్రమాః=భయంకరమయిన పరాక్రమముగల; రాక్షసాః=రాక్షసులు; విక్ఋత్తాః=ఛేదింపఁబడిన ;పాదపాఇవ = వృక్షములువలె; విభిన్నశిరసః=పగిలిన తలలుగలవారలై; పేతుః=పడిరి.

అప్పుడంగదుని యెదుటనున్న భయంకరపరాక్రములగు రాక్షసులు,ఒకవేటునం దలలుపగిలి , ఛిన్నమూలంబులగు వృక్షంబులపగిదినేలంగూలిరి.

అని, తాత్పర్యము.

రథై రశ్వై ర్ధ్వజై శ్ఛిత్తై శ్శరీరై ర్హరిరక్షసామ్. ౩౦
రుధిరేణచ సంఛన్నా భూమి ర్భయకరీ తదా

టీక॥ తదా=అప్పుడు; భూమిః = నేల; రథైః=రథములచేతను; అశ్వైః= గుఱ్ఱములచేతను; చిత్రైః= నానావర్ణములగు; ధ్వజైః= టెక్కెములచేతను; హరిరక్షసాం=వానరరాక్షసుల చేతను; రుధిరేణచ=నెత్తురుచేతను; సంఛన్నా=కప్పఁబడినదై; భయంకరీ = భయముగలించునది; ఆసీత్ (అధ్యాహృతము)=అయినది.

అప్పుడు, ఆయుద్ధభూమి, విఱిగిన రథములచేతను ధ్వజంబులచేతను జచ్చిపడినగుఱ్ఱంబులచేతను వానరరాక్షసుల కళేబరములచేతను రక్తప్రవాహముల చేతను నాచ్ఛాదితమయి, భయంకరంబై యుండినది. అని, తాత్పర్యము.

హారకేయూరవస్త్రైశ్చ శస్త్రైశ్చ సమలంకృతా. ౩౧
భూమి ర్భాతి రణే తత్ర శారదీవ యథా నిశా

టీక॥ తత్ర=అప్పుడు; రణే= యుద్ధమునందు; భూమిః=భూమి; హారకేయూరవస్త్రైశ్చ=హారములచేతను బాహుపురులచేతను వస్త్రములచేతను; శస్త్రైశ్చ=ఆయుధములచేతను; సమలంకృతా = చక్కఁగా నలంకరింపఁబడినదై; శారదీ=శరదృతువునందలి; నిశా యథేవ=రాత్రివలె; భాతి = ప్రకాశించుచుండినది.

అప్పుడు, యుద్ధంబున, హారకేయూరాదినానావిధ భూషణంబులచేతను వస్త్రంబులచేతను శస్త్రంబులచేతను అలంకరింపఁబడిన యుద్ధభూమి, నక్షత్రచంద్రాలంకృతంబగు శరద్రాత్రికైవడిఁ బ్రకాశించినది.

అని, తాత్పర్యము.

అంగదస్య చ వేగేన తద్రాక్షసబలం మహత్. ౩౨
ప్రాకంపత తదా తత్ర పవనేనాంబుదో యథా

టీక॥ తదా=అప్పుడు; తత్ర = అచ్చట; అంగదస్య= అంగదునియొక్క; వేగేన=వేగముచేతను; మహత్= గొప్పదగు; తత్=ఆ; రాక్షసబలం = రాక్షససైన్యము; పవనేన = గాలిచేత; అంబుదో యథా = మేఘమువలె; ప్రాకంపత=చలించెను.

అప్పుడచ్చట, ఆరాక్షససేన, అం

గదుని వేగంబునకు సహింపఁజాలక, వాయువేగంబున మేఘముఁబోలెఁ, జలనంబునొందినది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, త్రిపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండత్రిపంచాశసర్గటీక,
ముగిసినది.



౫౪

## చతుఃపంచాశసర్గప్రారంభః.

బలస్యచ నిఘాతేన అంగదస్య జయేనచ
రాక్షసః క్రోధ మావిష్టో వజ్రదంష్ట్రో మహాబలః. ౧

టీక॥ బలస్య= సైన్యముయొక్క; నిఘాతేనచ=వధముచేతను ; అంగదస్య=అంగదునియొక్క ; జయేనచ= గెల్పుచేతను;మహాబలః= అధికమగు నబలముగల; వజ్రదంష్ట్రః = వజ్రదంష్ట్రుఁడు;క్రోధం=కోపమును;ఆవిష్టః=పొందినాఁడు.

అంత దనసైన్యము పరాజయము నొందుటయు నంగదుండుజయించుటయుంజూచి , మహాబలశాలియగువజ్రదంష్ట్రుండు,కోపంబునొందెను.

అని, తాత్పర్యము.

స విస్ఫార్య ధను ర్ఘోరం శక్రాశనిసమస్వనమ్
వానరాణా మనీకాని ప్రాకిర చ్ఛరవృష్టిభిః. ౨

టీక॥ సః=ఆవజ్రదంష్ట్రుఁడు; ఘోరం=భయంకరమును; శక్రాశనిసమస్వనం= ఇంద్రునివజ్రాయుధముతో సమానమయిన ధ్వనిగలదియునగు; ధనుః=వింటిని, విస్ఫార్య=ధ్వనింపఁజేసి; వానరాణాం=వానరులయొక్క; అనీకాని=సేనలను; శరవృష్టిభిః = బాణవర్షములచేత; ప్రాకిరత్=కప్పెను.

ఆవజ్రదంష్ట్రుండుభయంకరంబును వజ్రాయుధ సమానంబునగు ధనుస్సును, మహాధ్వనిగదురసారించుచు, వానరసైన్యంబులపై బాణవర్షంబులుగురిపించెను. అని, తాత్పర్యము.

రాక్షసాశ్చాపి ముఖ్యాస్తే రథేషు సమవస్థితాః
నానాప్రహరణాశ్శూరాః ప్రాయుధ్యంత తదా రణే. ౩

టీక॥ తదా=అప్పుడు; రణే=యుద్ధమునందు; శూరాః=యుద్ధమునందు భయములేనివారలగు; ముఖ్యాః= ముఖ్యులయిన; తే=ఆ; రాక్షసాశ్చాపి=రాక్షసులును; రథేషు= రథములయందు; సమవస్థితాః=ఉన్నవారలయి; నానాప్రహరణాః= నానావిధములయినయాయుధములుగలవారలయి; ప్రాయుధ్యంత=చక్కఁగా యుద్ధముచేసిరి.

అప్పుడు, శూరులగు, నాముఖ్యరాక్షసులురథారూఢులయి, నానావిధాయుధంబులం జక్కఁగా యుద్ధముగావించిరి. అని, తాత్పర్యము.

వానరాణాంతు శూరా యే సర్వే తే ప్లవగర్షభాః
అయుధ్యంత శిలాహస్తా స్సమవేతా స్సమంతతః. ౪

టీక॥ వానరాణాం=వానరులలోపల; శూరాః= యుద్ధంబునందుభయములేనివారలు; యే = ఎవ్వరో; తే=ఆ; ప్లవగర్షభాః=వానరశ్రేష్ఠులు; సర్వే=అందఱును; శిలాహస్తాః= ఱాళ్లుచేతులంగలవారలయి; సమంతతః=అంతటను; సమవేతాః= చేరినవారలయి; అయుధ్యంత=పోరిరి.

వానరులలోశూరులగు వారలందఱును, గొప్పగొప్పశిలలను జేతులం

బూని, నలుప్రక్కలం జేరి, చక్కఁగా యుద్ధము గావించిరి.

అని, తాత్పర్యము.

తత్రా యుధసహస్రాణి తస్మి న్నాయోధనే భృశమ్
రాక్షసాః కపిముఖ్యేషు పాతయాంచక్రిరే తదా. ౫

టీక॥ తత్ర=అచ్చట; తదా= అప్పుడు; తస్మిన్=ఆ; ఆయోధనే= యుద్ధమునందు; రాక్షసాః=రాక్షసులు; కపిముఖ్యేషు = వానరశ్రేష్ఠులందు; ఆయుధసహస్రాణి= ఆయుధముల వేలను; భృశం=మిక్కిలియు; పాతయాంచక్రిరే=పడవేసిరి.

అప్పుడమ్మహాయుద్ధంబునందు, రాక్షసులు, వానరవీరులపైఁ, బెక్కువేల యాయుధంబుల నేసిరి.

అని, తాత్పర్యము.

వానరా శ్చాపి రక్షస్సు గిరీ న్వృక్షాన్ మహాశిలాః
ప్రవీరాః పాతయామాసు ర్మత్తవారణసన్నిభాః. ౬

టీక॥ ప్రవీరాః= మిక్కిలియుఁబరాక్రమశాలులును ; మత్తవారణసన్నిభాః=మదించిన యేనుఁగులతో సమానులునగు; వానరాశ్చాపి = వానరులును; రక్షస్సు=రాక్షసులయందు; గిరీన్= పర్వతములను; వృక్షాన్= చెట్లులను; మహాశిలాః = పెద్దఱాళ్లను; పాతయామాసుః=పడవేసిరి.

మహాపరాక్రమశాలులును మదపుటేనుంగులంబోలినవారలునగు వానరులు, పర్వతంబులను వృక్షంబులను మహాశిలలను, రాక్షసులపైఁ, నేసిరి.

అని, తాత్పర్యము.

శూరాణాం యుధ్యమానానాం సమరే ష్వనివర్తినామ్
తద్రాక్షసగణానాంచ సుయుద్ధం సమవర్తత. ౭

టీక॥ శూరాణాం= యుద్ధమునందు భయములేనివియు; సమరేషు=యుద్ధమునందు; అనివర్తినాం= మఱలనట్టివియునగు ; తద్రాక్షసగణానాం

చ=ఆవానరసమూహములకును రాక్షససమూహములకును; సుయుద్ధం=మంచియుద్ధము; సమవర్తత = కలిగెను.

శూరులును, యుద్ధంబులందు వెనుదీయకపోరువారలునగు నావానరులకును రాక్షసులకును మహాయుద్ధంబుజరిగినది. అని, తాత్పర్యము.

ప్రభిన్నశిరసః కేచి చ్ఛిన్నైః పాదైశ్చ బాహుభిః
శస్త్రై రర్పితదేహాస్తు రుధిరేణ సముక్షితాః. ౮
హరయో రాక్షసాశ్చైవ శేరతేగాం సమాశ్రితాః
కంకగృధ్రబలై ర్ధ్వాంక్షై ర్గోమాయుగణసంకులాః. ౯

టీక॥కేచిత్ = కొందఱు ; హరయః=వానరులును; రాక్షసాశ్చైవ= రాక్షసులును;ప్రభిన్నశిరసః=పగిలినతలలుగలవారలయి ; ఛిన్నైః = నఱుకఁబడిన;పాదైశ్చ= పాదములతోను; బాహుభిః=చేతులతోను ; సహితాః (అధ్యాహృతము)=కూడినవారలయి; శస్త్రైః=ఆయుధములచేత; అర్పితదేహాస్తు=పొందింపఁబడిన దేహములుగలవారలునై; రుధిరేణ=నెత్తురుచేత; సముక్షితాః=తడుపఁబడినవారలయి; కంకగృధ్రవక్త్రైః= రాబందులచేతను గద్దలచేతను కాకులచేతను; ఆధ్మాః= వ్యాపింపఁబడినవారలయి;గోమాయుగణసంకులాః=నక్కల సమూహములచేనిండినవారలయి; గాం= భూమిని; సమాశ్రితాః=పొందినవారలయి; శేరతే=పరుండిరి.

కొందఱు వానరులును రాక్షసులును , దలలుపగిలి చేతులుఁగాళ్లువిఱిగి , దేహములందుఁ గ్రుచ్చుకొనియున్నయాయుధములతోఁ గూడినవారలయి, నెత్తుటఁదోఁగుచుఁ, గంకపక్షులు గద్దలుఁ గాకులును ముసరుకొన , నక్కలుగుంపులుగుంపులు గాఁ జుట్టుకొన,భూమిం బడియుండిరి.

అని, తాత్పర్యము.

కబంధాని సముత్పేతు ర్భీరూణాం భీషణాని వై

టీక॥భీరూణాం = పిఱికివారియొక్క ; భీషణాని=భయంకరము లయి

న("వై" అనునది పాదపూరణార్థము;) కబంధాని = మొండెములు; సముత్పేతుః=ఎగిరినవి.

పిడికివారల శిరస్సులు ఖండింపఁబడి, వారి మొండెములు, ఆకాశంబున కెగసి నేలంబడినవి. అని, తాత్పర్యము.

భుజపాణిశిరశ్ఛిన్నా శ్ఛిన్నకాయాశ్చ భూతలే. ౧౦
వానరా రాక్షసాశ్చాపి నిపేతుస్తత్ర వై రణే

టీక॥ తత్ర= ఆ; ("వై"అనునది పాదపూరణార్థము); రణే= యుద్ధమునందు; వానరాః = వానరులును; రాక్షసాశ్చాపి= రాక్షసులును; భుజపాణిశిరశ్ఛిన్నాః=నఱుకఁబడిన బాహువులును అఱచేతులును తలలునుగలవారలయి; ఛిన్నకాయాశ్చ = నఱుకఁబడిన దేహములుగలవారలయి ; భూతలే=నేలయందు;నిపేతుః=పడిరి.

అప్పుడు యుద్ధంబునందు , వానరులును రాక్షసులును, చేతులును అఱచేతులును తలలును తెగియు దేహము నందం తట గాయములయ్యు, నేలంబడిరి అని, తాత్పర్యము.

తతో వానర సైన్యేన హన్యమానం నిశాచరమ్. ౧౧
ప్రాభజ్యత బలం సర్వం వజ్రదంష్ట్రస్య పశ్యతః

టీక॥ తతః=అంత; నిశాచరం(నైశాచరం)= రాక్షససంబంధియయిన; బలం=సైన్యము; సర్వం=అంతయు ; వానరసైన్యేన=వానరసేనచేత ; హన్యమానం=వధింపఁబడుచున్నదై ; వజ్రదంష్ట్రస్య=వజ్రదంష్ట్రుఁడు; పశ్యతః=చూచుచుండఁగా; ప్రాభజ్యత = భగ్నమయ్యెను.

అంత, నా రాక్షససేనయంతయు, వానరసేనచేనానావిధంబులవధింపఁబడి, వజ్రదంష్ట్రుఁడు చూచుచుండఁగానే, భగ్నమయిపరుగెత్తినవి.
అని, తాత్పర్యము.

రాక్షసాన్ భయవిత్రస్తాన్ హన్యమానాన్ ప్లవంగమైః. ౧౨
దృష్ట్వా సరోషతామ్రాక్షో వజ్రదంష్ట్రః ప్రతాపవాన్
ప్రవివేశ ధనుష్పాణి స్త్రాసయన్ హరివాహినీమ్. ౧౩

టీక॥ ప్రతాపవాన్ = అధికమయినపరాక్రమముగల; సః = ఆ; వజ్రదంష్ట్రః = వజ్రదంష్ట్రుండు; ప్లవంగమైః = వానరులచేత; హన్యమానాన్ = వధింపఁబడుచున్నవారలును; భయవిత్రస్తాన్ = భయకారణములవలనభయపడినవారలునగు; రాక్షసాన్ = రాక్షసులను; దృష్ట్వా = చూచి; క్రోధతామ్రాక్షః = క్రోధముచేనెఱ్ఱనైనకన్నులుగలవాఁడై; ధనుష్పాణిః = విల్లుచేతంగలవాఁడై; హరివాహినీం = వానరసేనను; త్రాసయన్ = భయపెట్టుచు; ప్రవివేశ = ప్రవేశించెను.

మహాపరాక్రమశాలియగు నావజ్రదంష్ట్రుండు, రాక్షసులందఱువానరులచేవధింపఁబడుచు భయపడియుండుటనుజూచి, కోపంబునఁగన్నుఁగొనల నెఱ్ఱదనంబుగదుర, ధనుర్ధరుండై, వానరులందఱుభయపడ, వానరసేనం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

శరైర్విదారయామాస కంకపత్రైరజిహ్మగైః

టీక॥ కంకపత్రైః = కంకపక్షియొక్కఱెక్కలుగలవియు; అజిహ్మగైః = కుటిలముగాఁబోనివియునగు; శరైః = బాణములచేత; విదారయామాస = భేదించెను.

ఆవజ్రదంష్ట్రుండు, కంకపక్షిఱెక్కలుగలవియులక్ష్యంబుదప్పనివియునగుబాణంబులచే, వానరులభేదించెను. అని, తాత్పర్యము.

బిభేద వానరాంస్తత్ర సప్తాష్టౌ నవ పంచచ. ౧౫
వివ్యాధ పరమక్రుద్ధో వజ్రదంష్ట్రః ప్రతాపవాన్

టీక॥ తత్ర = అప్పుడు; ప్రతాపవాన్ = అధికమయినపరాక్రమముగల; వజ్రదంష్ట్రః = వజ్రదంష్ట్రుఁడు; పరమక్రుద్ధః = మిక్కిలియుఁగోపించినవాఁడై; వానరాన్ = వానరులను; సప్త = ఏడుగురను; అష్టౌ = ఎనిమిదిమందిని; నవ = తొమ్మిదింటిని; పంచచ = అయిదుగురను; బిభేద = భేదించెను. ఏవం (అభ్యాహృతము) = ఇట్లు; వివ్యాధ = కొట్టెను.

పరాక్రమవంతుండగు నావజ్రదంష్ట్రుఁడు, అప్పుడొక్కొక్క బాణంబు

న, వానరులనేడ్వురనేఁమిదిమందిని దొమ్మిదిమందిని నైదుగురను గూలనేయుచు, ఇట్లువిచిత్రప్రకారంబున వానరులనొప్పించెను. అని, తాత్పర్యము.

త్రస్తాః సర్వే హరిగణా శ్శరై స్సంకృత్తకంధరాః. ౧౫
అంగదం సంప్రధావంత ప్రజాపతి మివ ప్రజాః

టీక॥ హరిగణాః = వానరసమూహములు; శరైః = బాణములచేత; సంకృత్తకంధరాః = ఛేదింపఁబడిన కంఠములుగలవై; సర్వే = అన్నియు; త్రస్తాః = భయపడినవై; ప్రజాః = ప్రజలు; ప్రజాపతిమివ = బ్రహ్మదేవునిగూర్చివలె; అంగదం = అంగదునిగూర్చి; సంప్రధావంత (సంప్రాధావంత) = పరుగెత్తినవి.

అట్లువానరులు పెక్కండ్రు ఛిన్నకంఠులయి నేలంబడుచు, నంతేదక్కినవానరులందఱు, భయపడి, ప్రజలు ప్రజాపతి నాశ్రయించునట్లు, అంగదు నాశ్రయించిరి. అని, తాత్పర్యము.

తతో హరిగణాన్ భగ్నాన్ దృష్ట్వా వాలిసుత స్తదా. ౧౬
క్రోధేన వజ్రదంష్ట్రం త ముదీక్షంత ముదైక్షత

టీక॥ తతః = అంత; తదా = అప్పుడు; వాలిసుతః = వాలికొడుకైనయంగదుండు; భగ్నాన్ = భంగమునొందిన; హరిగణాన్ = వానరసమూహములను; దృష్ట్వా = చూచి; క్రోధేన = కోపముచేత; ఉదీక్షంతం (ఉదీక్షమాణం) = ఎదురుచూచుచున్న; తం = ఆ; వజ్రదంష్ట్రం = వజ్రదంష్ట్రుని; ఉదైక్షత = ఎదురుచూచెను.

అంత నప్పుడు, వాలికుమారుండగునంగదుండు, వానరసేనలుభయంబునంబొందుటనుజూచి, కోపంబునొంది, తనపైకి వచ్చుచున్నవజ్రదంష్ట్రునెదురొక్కనెను. అని, తాత్పర్యము.

వజ్రదంష్ట్రోఽంగద శ్చోభౌ సంగతౌ హరిరాక్షసౌ. ౧౭
చేరతుః పరమక్రుద్ధౌ హరిమత్తగజా వివ

టీక॥ అంగదః = అంగదుండును; వజ్రదంష్ట్రశ్చ = వజ్రదంష్ట్రుఁడునను; హరి

రాక్షసౌ=వానరుండును రాక్షసుండును; ఉభౌ=ఇద్దఱును; సంగతౌ=కలసినవారలయి; పరమక్రుద్ధౌ=మిక్కిలి యలుఁగుపితులయి; హరిమత్తగజావివ=సింహంబును మదపుటేనుంగునువలె; చేరతుః=సంచరించిరి.

అంగదుండును, వజ్రదంష్ట్రుండును, ఒండొరులంగలసి, పరమక్రుద్ధులయి, సింహంబును మదపుటేనుంగునుం బోలె, యుద్ధంబు సేయుచువిహరించిరి.

అని, తాత్పర్యము.

తత శ్శరసహస్రేణ వాలిపుత్రం మహాబలః. ౧౮
జఘాన మర్మదేశేషు మాతంగ మివ తోమరైః

టీక॥ తతః=అంత; మహాబలః=అధికమయినబలముగలవజ్రదంష్ట్రుఁడు; వాలిపుత్రం=వాలికుమారుండగు నంగదుని; శరసహస్రేణ=బాణంబులవేయింటిచేత; తోమరైః=చిల్లకోలలచేత; మాతంగమివ=ఏనుంగునువలె; మర్మదేశేషు=జీవస్థానములందు; జఘాన=కొట్టెను.

అంత, మహాబలశాలియగువజ్రదంష్ట్రుఁడు, ఏనుంగునజిల్లకోలలతోఁబొడుచునట్లు, వాలికుమారుండగునంగదుని, జీవస్థానంబులందు, వేయి బాణంబుల నొప్పించెను.

అని, తాత్పర్యము.

రుధిరోక్షితసర్వాంగో వాలిసూనుః మహాబలః. ౧౯
చిక్షేప వజ్రదంష్ట్రాయ వృక్షం భీమపరాక్రమః

టీక॥ మహాబలః=అధికమయినబలముగలవాఁడును, భీమపరాక్రమః=భయంకరమయిన పరాక్రమముగలవాఁడునగు; వాలిసూనుః=వాలికుమారుడైనయంగదుఁడు; రుధిరోక్షితసర్వాంగః=నెత్తురుచేఁదడుపఁబడిన సమస్తావయవములుగలవాఁడై; వజ్రదంష్ట్రాయ=వజ్రదంష్ట్రునికొఱకు; వృక్షం=చెట్టును; చిక్షేప=వేసెను.

మహాబలశాలియు భయంకర పరాక్రముఁడునగునంగదుండు, దేహమంతయు నెత్తురుగాఁ, గోపించి, వజ్రదంష్ట్రునిపై, యొకమహావృక్షము నేసెను.

అని, తాత్పర్యము.

దృష్ట్వాఽఽపతంతం తం వృక్ష మసంభ్రాంతశ్చ రాక్షసః. ౨౦
చిచ్ఛేద బహుధా సోఽపి నికృత్తః పతితో భువి

టీక॥ రాక్షసశ్చ=రాక్షసుఁడైన వజ్రదంష్ట్రుండును; ఆపతంతం=వచ్చుచున్న; తం=ఆ; వృక్షం=చెట్టును; దృష్ట్వా=చూచి; అసంభ్రాంతః=తొట్రుపాటునొందనివాఁడై; బహుధా=పెక్కువిధములుగా; చిచ్ఛేద=నఱకెను. సోఽపి=ఆవృక్షమును; నికృత్తః=ఖండింపఁబడినదై; భువి=నేలయందు; పతితః=పడినది.

ఆవజ్రదంష్ట్రుండు, తనపైకివృక్షమువచ్చుటంజూచి, సంభ్రమంబు నొందక, యావృక్షమును, పెక్కువ్రయ్యలుగా బాణంబులచేఖండించెను; అంతనావృక్షము, తునియలయి నేలంబడెను. అని, తాత్పర్యము.

తం దృష్ట్వా వజ్రదంష్ట్రస్య విక్రమం ప్లవగర్షభః. ౨౧
ప్రగృహ్య విపులం శైలం చిక్షేప చ ననాద చ

టీక॥ ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుండగునంగదుండు; వజ్రదంష్ట్రస్య=వజ్రదంష్ట్రునియొక్క; తం=ఆ; విక్రమం=పరాక్రమమును; దృష్ట్వా=చూచి; విపులం=విశాలమగు; శైలం=పర్వతమును; ప్రగృహ్య=గ్రహించి; చిక్షేప చ=వేసెను. ననాద చ=అఱచెను.

వానరశ్రేష్ఠుండగునంగదుండు, వజ్రదంష్ట్రునిపరాక్రమంబుఁ జూచి, యొక్కవిశాలపర్వతంబుఁ గొని, యారాక్షసునిపై వైచి, సింహనాదంబు గావించెను. అని, తాత్పర్యము.

సమాపతంతం తం దృష్ట్వా రథా దాప్లుత్య వీర్యవాన్. ౨౨
గదాపాణి రసంభ్రాంతః పృథివ్యాం సమతిష్ఠత

టీక॥ వీర్యవాన్=అధికమయినపరాక్రమముగలవజ్రదంష్ట్రుఁడు; సమాపతంతం=వచ్చుచున్న; తం=ఆపర్వతమును; దృష్ట్వా=చూచి; రథాత్=రథమునుండి; ఆప్లుత్య=దుమికి; గదాపాణిః=గదచేతంగలవాఁడై; అసంభ్రాంతః=తొట్రుపాటులేనివాఁడై; పృథివ్యాం=భూమియందు; సమతిష్ఠత=నిలిచెను.

మహాపరాక్రమశాలియగు నావజ్రదంష్ట్రుఁడు, పర్వతము వచ్చుటఁ జూచి, గదచేతంగొని, నిర్భయుండుగా, రథంబుననుండి, నేలకులంఘించెను.

అని, తాత్పర్యము.

సాంగదేన గదా క్షిప్తా గత్వా తు రణమూర్ధని. ౨౩

టీక॥ రణమూర్ధని= యుద్ధాగ్రమునందు; అంగదేన= అంగదునిచేత; గత్వాతు=పోయియు; సా = ఆ; గదా=గద; ఆక్షిప్తా = అపహరింపఁబడినది.

అంగదుండు, యుద్ధాగ్రంబున, వజ్రదంష్ట్రుని యెద్దకుఁబోయి యాగదనపహరించెను. అని, తాత్పర్యము.

సచక్రకూబరం సాశ్వం ప్రమమాథ రథం తదా

టీక॥ తదా=అప్పుడు; సః(అధ్యాహృతము)=ఆపర్వతము; సచక్రకూబరం= చక్రములతోను నొగతోను గూడినదియు; సాశ్వం= గుఱ్ఱములతోఁగూడినదియునగు; రథం =రథమును; ప్రమమాథ=చూర్ణముగావించెను.

అంత, నాయంగదుండు ప్రయోగించిన పర్వతము, చక్రములతోను నొగతోను గుఱ్ఱంబులతోనుంగూడ నా వజ్రదంష్ట్రరథము నగ్గుగావించెను.

అని, తాత్పర్యము.

తతోఽన్యం గిరి మాక్షిప్య విపులం ద్రుమభూషితమ్. ౨౪
వజ్రదంష్ట్రస్య శిరసి పాతయామాస సోఽంగదః

టీక॥ తతః=అంత; సః=ఆ; అంగదః=అంగదుఁడు; అన్యం= ఇతరమయిన; విపులం= విశాలమును; ద్రుమభూషితం=వృక్షములచేనలంకరింపఁబడినదియునగు; గిరిం=పర్వతమును; ఆక్షిప్య=ఎత్తి; వజ్రదంష్ట్రస్య=వజ్రదంష్ట్రునియొక్క; శిరసి=తలయందు; పాతయామాస=పడవేసెను.

అంత, నాయంగదుండు, విశాలంబును వృక్షంబులతో నొప్పుచున్నదియునగు మఱియొక పర్వతంబెత్తి, వజ్రదంష్ట్రుతలపైవైచెను.

అని, తాత్పర్యము.



అభవచ్ఛోణితోద్గారీ వజ్రదంష్ట్రస్సమూర్ఛితః. ౨౫
ముహూర్తమభవన్మూఢో గదామాలింగ్య నిశ్శ్వసన్

టీక॥ సః = ఆ ; వజ్రదంష్ట్రః = వజ్రదంష్ట్రుఁడు ; శోణితోద్గారీ = నెత్తురు గ్రక్కుచున్నవాఁడై ; మూర్ఛితః = మూర్ఛపొందినవాఁడై ; గదాం = గదను ; ఆలింగ్య = కౌఁగిలించుకొని ; నిశ్శ్వసన్ = నిట్టూర్పులు పుచ్చుచు ; ముహూర్తం = కొంచెముసేపు ; మూఢః = సంజ్ఞ లేనివాఁడు ; అభవత్ = అయ్యెను.

ఆ వజ్రదంష్ట్రుండు, నెత్తురు గ్రక్కుచు మూర్ఛితుండై, నిట్టూర్పులు పుచ్చుచు గద చేతం గౌఁగిలించుకొని, కొంతసేపు సంజ్ఞ లేక, పడియుండెను.

అని, తాత్పర్యము.

స లబ్ధసంజ్ఞో గదయా వాలిపుత్ర మవస్థితమ్. ౨౬
జఘాన పరమక్రుద్ధో వక్షోదేశే నిశాచరః

టీక॥ సః = ఆ ; నిశాచరః = వజ్రదంష్ట్రుఁడు ; లబ్ధసంజ్ఞః = పొందఁబడిన తెలివిగలవాఁడై ; పరమక్రుద్ధః = మిక్కిలియుఁ గోపించినవాఁడై ; అవస్థితం = నిలిచియున్న ; వాలిపుత్రం = వాలికుమారుఁడగు నంగదుని ; వక్షోదేశే = ఱొమ్మునందు ; జఘాన = కొట్టెను.

ఆ వజ్రదంష్ట్రుఁడు మూర్ఛ దేఱి, పరమకుపితుండై, యచ్చట నిలిచియున్న

వాలికుమారుండగునంగదుని యొమ్ము నగదచే బ్రహరించెను. అని, తాత్పర్యము.

గదాం త్యక్త్వా తత స్తత్ర ముష్టియుద్ధ మవర్తత. ౨౭

టీక॥ తతః=అంత; తత్ర= అచ్చట; గదాం=గదను; త్యక్త్వా=విడిచి; ముష్టియుద్ధం = పిడికిలిపోరు; అవర్తత=జరగినది.

అంతనప్పుడు, వజ్రదంష్ట్రుండుగదపారవైచి, యంగదునితో ముష్టియుద్ధంబుగావించెను. అని, తాత్పర్యము.

అన్యోన్యం జఘ్నతు స్తత్ర తా వుభౌ హరిరాక్షసౌ

టీక॥ తత్ర=అప్పుడు; తౌ=ఆ; హరిరాక్షసౌ = అంగదుండును వజ్రదంష్ట్రుండును; ఉభౌ=ఇద్దఱును; అన్యోన్యం=ఒండొరులను; జఘ్నతుః= కొట్టుకొనిరి.

ఆయంగదవజ్రదంష్ట్రులిద్దఱును, ఒండొరులం జక్కఁగాఁ బ్రహరించుకొనిరి. అని, తాత్పర్యము.

రుధిరోద్గారిణౌ తౌతు ప్రహారై ర్జనితశ్రమౌ. ౨౮
బభూవతు స్సువిక్రాంతా వంగారకబుధా వివ

టీక॥తౌతు= ఆయంగద వజ్రదంష్ట్రులును; రుధిరోద్గారిణౌ = నెత్తురుగ్రక్కుచున్నవారలయి; ప్రహారైః= దెబ్బలచేత; జనితశ్రమౌ = పుట్టినయాయాసముగలవారలయి; అంగారకబుధావివ=అంగారకుండును బుధుండును వలె; సువిక్రాంతౌ=మిక్కిలియుఁబరాక్రమించినవారలుగా; బభూవతుః=ఉండిరి.

ఆయంగదుండును వజ్రదంష్ట్రుండును, ఒకరినొకరుకొట్టుకొనుచు దెబ్బలచే నెత్తురుగారుచుఁ, నాయాసంబునొంది, యంగారకబుధులుంబోలె బద్ధవైరంబునంబోరుచుండిరి.

అని, తాత్పర్యము.

తతః పరమతేజస్వీ అంగదః కపికుంజరః. ౨౯

ఉత్పాట్య వృక్షం స్థితవాన్ బహుపుష్పఫలాంచితమ్

టీక॥ తతః= అంత; పరమతేజస్వీ=అధికమయినపరాక్రమము గలవాఁడును; కపికుంజరః=వానరశ్రేష్ఠుండునగు; అంగదః=అంగదుండు; బహుపుష్పఫలాంచితం= పెక్కుపూలతోను పండ్లతోనుఒప్పుచున్న; వృక్షం=చెట్టును; ఉత్పాట్య=పెఱికి; స్థితవాన్ = నిలిచెను.

అంతఁ, బరమ పరాక్రమశాలియు వానరశ్రేష్ఠుండునగు నంగదుండు, పెక్కుపూలతోను ఫలములతోనుం గూడి నవృక్షమునొకటిఁబెఱికి యుద్ధంబునకు నిలిచెను; అట్లువజ్రదంష్ట్రుండును వృక్షంబుఁబెఱికినిలిచెను.

అని, తాత్పర్యము.

జగ్రాహ చార్షభం చర్మ ఖడ్గంచ విపులం శుభమ్. ౩౦
కింకిణీజాలసంపన్నం చర్మణాచ పరిష్కృతమ్

టీక॥ సః (అధ్యాహృతము)= ఆయంగదుండును; ఆర్షభం= వృషభసంబంధియయిన; చర్మచ = డాలువాయును; విపులం=విశాలంబును ;శుభం= సుందరంబును; కింకిణీజాలసంపన్నం= చిఱుగంటల సమూహముతోఁ గూడినదియు; చర్మణా=బరతో ; పరిష్కృతంచ = అలంకరింపఁబడినదియునగు; ఖడ్గంచ=కత్తిని; జగ్రాహ = గ్రహించెను.

ఆయంగదుఁడంత , వృషభచర్మముగప్పినడాలునువిశాలంబును జిఱుగంటలతో నొప్పుచున్నదియు మంచియొర గలదియునగుఖడ్గంబున గ్రహింప, నావజ్రదంష్ట్రుండును, డాలునువాలునుగ్రహించెను. అని, తాత్పర్యము.

విచిత్రాం శ్చేరతు ర్మార్గాన్ రుషితౌ కపిరాక్షసౌ. ౩౧
జఘ్నతుశ్చ తదాన్యోన్యం నిర్దయం జయకాంక్షిణౌ

టీక॥ కపిరాక్షసౌ=అంగదుండును వజ్రదంష్ట్రుండును; రుషితౌ=కుపితులయి; విచిత్రాన్ = నానావిధములయిన; మార్గాన్=మార్గములను; చేరతుః=సంచరించిరి. తదా=అప్పుడు; జయకాంక్షిణౌ= జయముగోరువారల

యుః; నిర్దయం=దయలేకుండగా; అన్యోన్యం= ఒండొరులను; జఘ్నతుశ్చ= కొట్టుకొనిరియు.

ఆయంగదవజ్రదంష్ట్రులు, పరమకుపితులయి, పరస్పరజయంబుఁగోరి, నానావిధమార్గంబుల యుద్ధంబుగావింపుచు, కఠినంబుగా నొండొరులం బ్రహరించుకొనిరి. అని, తాత్పర్యము.

ప్రణైస్సాస్రై రశోభేతాం పుష్పితా వివ కింశుకౌ. ౩౨

టీక॥ తౌ (అధ్యాహృతము)= ఆయంగదవజ్రదంష్ట్రులు; సాస్రైః = నెత్తురుతోఁగూడిన; వ్రణైః = గాయములచేత; పుష్పితౌ= పూచిన; కింశుకౌ ఇవ= మోదుగుచెట్లువలె; అశోభేతాం=ప్రకాశించిరి.

ఆయంగద వజ్రదంష్ట్రులు, నెత్తురుగారుచుండు గాయంబులతోఁగూడినవారలగుటచేఁ, జక్కఁగాఁబుష్పించిన మోదుగువృక్షంబులుంబోలెఁ, బ్రకాశించుచుండిరి. అని, తాత్పర్యము.

యుధ్యమానౌ పరిశ్రాంతౌ జానుభ్యా మవనీం గతౌ

టీక॥ తౌ (అధ్యాహృతము) = ఆయంగదవజ్రదంష్ట్రులు; యుధ్యమానౌ=పోరుచు; పరిశ్రాంతౌ=అలసినవారలయి; జానుభ్యాం=మోఁకాళ్లచేత; అవనీం=భూమిని; గతౌ= పొందినారు.

ఆయంగదవజ్రదంష్ట్రులు, అట్లు యుద్ధముసేయుచునలసి, మోకాలు వేసికొనికూర్చుండిరి.

అని, తాత్పర్యము.

నిమేషాంతరమాత్రేణ అంగదః కపికుంజరః. ౩౩
ఉదతిష్ఠత దీప్తాక్షో దండాహత ఇవోరగః

టీక॥ కపికుంజరః = వానరశ్రేష్ఠుఁడగు; అంగదః=అంగదుఁడు; నిమేషాంతరమాత్రేణ=అెప్పపాటంత మాత్రముచేత; దీప్తాక్షః=మండుచున్న కన్నులుగలవాఁడై; దండాహతః= కొఱ్ఱతోఁగొట్టఁబడిన; ఉరగ ఇవ= సర్పమువలె; ఉదతిష్ఠత=లేచెను.

వానరశ్రేష్ఠుఁడగునంగదుండు, కో

పంబునంగన్నులువెలుంగ, కొయ్యతో గొట్టఁబడినసర్పమువలె, తెప్పపాటంతలో, లేచెను. అని, తాత్పర్యము.

నిర్మలేన సుధౌతేన ఖడ్గేనాస్య మహచ్ఛిరః. ౩౪
జఘాన వజ్రదంష్ట్రస్య వాలిసూను ర్మహాబలః

టీక॥ మహాబలః=అధికమయినబలముగల; వాలిసూనుః = వాలికుమారుఁడగునంగదుఁడు; నిర్మలేన = స్వచ్ఛమును; సుధౌతేన = సానఁబెట్టఁబడినదియునగు; ఖడ్గేన = కత్తిచేత; అస్య=ఈ; వజ్రదంష్ట్రస్య = వజ్రదంష్ట్రునియొక్క; మహత్ = గొప్పదగు; శిరః=తలను; జఘాన=కొట్టెను.

మహాబలుండగు వాలిపుత్రుఁడంగుండు, చక్కఁగా సానఁబెట్టఁబడినదియుస్వచ్ఛంబునగుఖడ్గంబున, నీవజ్రదంష్ట్రునిశిరస్సునుఖండించెను. అని, తాత్పర్యము.

రుధిరోక్షితగాత్రస్య బభూవ పతితం ద్విధా. ౩౫
సరోషపరివృత్తాక్షం శుభం ఖడ్గహతం శిరః

టీక॥ రుధిరోక్షితగాత్రస్య= నెత్తురుచేఁదడుపఁబడినదేహముగల; తస్య (అధ్యాహృతము)=ఆవజ్రదంష్ట్రునియొక్క; సరోషపరివృత్తాక్షం=కోపముతోఁగూడినవి కావుననే తిరుగుచున్నకన్నులుగలదియు; శుభం= మంగళకరమునగు; శిరః=తల ; ఖడ్గహతం=కత్తిచేఁగొట్టఁబడినదై; ద్విధా= రెండుగా; పతితం=పడినది ; బభూవ= అయినది.

దేహమంతయు నెత్తురుగాఁ బడియున్నయావజ్రదంష్ట్రునిశిరస్సుకోపంబునఁ గన్నులుతిరుగుచుండ, నంగదునిఖడ్గంబుచేఁ ఛిన్నంబై, రెండుగా నేలంబడినది. అని, తాత్పర్యము.

వజ్రదంష్ట్రం హతం దృష్ట్వా రాక్షసా భయమోహితాః, ౩౬
త్రస్తాః ప్రత్యపతన్ లంకాం వధ్యమానాః ప్లవంగమైః
విషణ్ణవదనా దీనా హ్రియా కించి దవాఙ్ముఖాః. ౩౭

టీక॥ హతం=వధింపఁబడిన ; వజ్రదంష్ట్రం=వజ్రదంష్ట్రుని ; దృష్ట్వా=చూచి; రాక్షసాః=రాక్షసులు; భయమోహితాః=భయముచే మోహము నొందింపఁబడినవారలయి ; విషణ్ణవదనాః= దుఃఖితములగుముఖములు గలవారలయి; దీనాః = గర్వంబుడిగినవారలయి; హ్రియా = సిగ్గుచేత; కించిత్=కొంచెము ; అవాఙ్ముఖాః= వంగినముఖముగలవారలయి ; ప్లవంగమైః=వానరులచేత; వధ్యమానాః= వధింపఁబడుచున్నవారలయి ; త్రస్తాః= భయపడినవారలయి ; లంకాంప్రతి= లంకనుగూర్చి; అపతన్ = పరుగెత్తిరి.

అట్లు వజ్రదంష్ట్రుండు హతుండగుటనుజూచి, రాక్షసులు , భయమోహితులయి , దుఃఖితులయిదీనులయి, సిగ్గుచేమొగంబువంచుకొని , వానరులంతకంతకుందఱిమికొట్ట, భయపడి, మఱలలంకకుంబరుగెత్తిరి.

అని, తాత్పర్యము.



నిహత్య తం వజ్రధరప్రభావ
స్స వాలిసూనుః కపిసైన్యమధ్యే
జగామ హర్షం మహితో మహాబల
స్సహస్రనేత్ర స్త్రిదశైరివావృతః. ౩౮

టీక॥ వజ్రధరప్రభావః = ఇంద్రుని ప్రభావమువంటిప్రభావముగల; మహాబలః = అధికమయినబలముగల; సః = ఆ; వాలిసూనుః = వాలికుమారుఁడగునంగదుండు; తం = ఆవజ్రదంష్ట్రుని ; నిహత్య = చంపి; కపిసైన్యమధ్యే = వానరసైన్యము నడుమ; మహితః = పూజితుండై; త్రిదశైః = దేవతలచేత; ఆవృతః = కప్పఁబడిన; సహస్రనేత్రః ఇవ (స్థితః) = దేవేంద్రుఁడువలెనున్నవాఁడై ; హర్షం = సంతోషమును; జగామ = పొందెను.

దేవేంద్రునిప్రభావమువంటి ప్రభావముగలమహాబలుండగునాయంగదుండు, ఆవజ్రదంష్ట్రునివధించి, వానరులచేఁబూజితుండై, వానరసైన్యమధ్యంబున, దేవతలనడుమ దేవేంద్రుండుంబోలెఁ, బరమసంతోషంబునొందియుండెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, చతుఃపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండచతుఃపంచాశసర్గటీక,
ముగిసినది.

---



౫౫

పంచపంచాశస్సర్గ ప్రారంభః.

వజ్రదంష్ట్రం హతం శ్రుత్వా వాలిపుత్రేణ రావణః
బలాధ్యక్ష మువాచేదం కృతాంజలి మవస్థితమ్. ౧

టీక॥ రావణః=రావణుఁడు ; వజ్రదంష్ట్రం=వజ్రదంష్ట్రుని; వాలిపుత్రేణ=వాలికొడుకయినయంగదునిచేత ; హతం = చంపఁబడినవానిఁగా; శ్రుత్వా=విని; కృతాంజలిం= చేయఁబడినచేమోడ్పుగల వాఁడును;అవస్థితం= నిలిచియున్నవాఁడునగు; బలాధ్యక్షం; సేనాధ్యక్షునిగూర్చి; ఇదం=ఈమాటను;ఉవాచ=చెప్పెను.

రావణుండు, అంగదునిచే వజ్రదంష్ట్రుండు వధింపఁబడుటనువిని,తన మ్రోలఁజేతులు మొగుడ్చుకొని నిలిచియున్న సేనాధ్యక్షుంజూచి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

శీఘ్రం నిర్యాంతు దుర్ధర్షా రాక్షసా భీమవిక్రమాః
అకంపనం పురస్కృత్య సర్వశస్త్రప్రకోవిదమ్. ౨

టీక॥ దుర్ధర్షాః=ఎదిరింపఁగూడనివారలును; భీమవిక్రమాః= భయంకరమయిన పరాక్రమముఁగల వారలునగు; రాక్షసాః=రాక్షసులు; సర్వశస్త్రప్రకోవిదం = సమస్తశస్త్రములయందుఁబండితుండగు ; అకంపనం = అకంపనుని ; పురస్కృత్య= మున్నిడుకొని; శీఘ్రం= శీఘ్రముగా; నిర్యాంతు=వెడలుదురుగాక.

ఎదిరింపనలవిగానివారలునుభయంకరపరాక్రమశాలులునగు రాక్షసులు, సమస్తాస్త్రంబులందును బండితుండగు నీయకంపనుని మున్నిడుకొని, శీఘ్రంబుగాయుద్ధంబునకుఁబోవునట్లు గావింపుము.అని, తాత్పర్యము.

ఏష శాస్తాచ గోప్తాచ నేతాచ యుధి సమ్మతః
భూతికామశ్చ మే నిత్యం నిత్యంచ సమరప్రియః. ౩

టీక॥ఏషః=ఈయకంపనుండు;యుధి=యుద్ధమునందు; సమ్మతః = ప్రసిద్ధుఁడైన; శాస్తాచ = శత్రువులశిక్షించువాఁడును. గోప్తాచ = రక్షకుండును. నేతాచ=నడుపువాఁడును. మే=నాకు; నిత్యం=ఎల్లప్పుడును;భూతికామశ్చ=సంపదగోరువాఁడును.నిత్యం = ఎల్లప్పుడును; సమర ప్రియశ్చ = యుద్ధంబునందుఁ ప్రీతిగలవాఁడును.

ఈయకంపనుండు,యుద్ధంబున, శత్రువులవధించువాఁడు ; తనసేననురక్షించువాఁడు ; గట్టిసేనానాయకుండు;మఱియు, నెప్పుడును నా మేలుగోరుచుండును; యుద్ధప్రియుండు.

అని, తాత్పర్యము.

ఏష జేష్యతి కాకుత్స్థౌ సుగ్రీవంచ మహాబలమ్
వానరాంశ్చాపరాన్ ఘోరాన్ హనిష్యతి పరంతపః. ౪

టీక॥పరంతపః= శత్రువులందపింపఁజేయునట్టి;ఏషః = ఈయకంపనుండు; కాకుత్స్థౌ=రామలక్ష్మణులను; మహాబలం=అధికమయినబలముగల; సుగ్రీవంచ=సుగ్రీవుని;జేష్యతి=జయింపఁగలఁడు. అపరాన్ = ఇతరులయిన; ఘోరాన్=భయంకరులగు;వానరాంశ్చ=వానరులనుంగూడ ; హనిష్యతి= చంపఁగలఁడు.

శత్రువులఁదపింపఁజేయునట్టి యీయకంపనుండు, రామలక్ష్మణులనుమహాబలశాలియగుసుగ్రీవునిజయించి, భయంకరాకారులగునితర వానరులనుం గూడవధింపఁగలఁడు. అని, రావణుండు, సేనాధ్యక్షునకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

పరిగృహ్య స తామాజ్ఞాం రావణస్య మహాబలః
బలం స త్వరయామాస తదా లఘుపరాక్రమః. ౫

టీక॥మహాబలః=అధికమయిన బలముగల;సః=ఆసేనాధ్యక్షుఁడు;రావణస్య=రావణునియొక్క; తాం=ఆ ; ఆజ్ఞాం=ఆజ్ఞను;పరిగృహ్య=గ్రహించి; తదా=అప్పుడు;లఘుపరాక్రమః=శీఘ్రమయినపరాక్రమముగల; సః= ఆసేనాధ్యక్షుఁడు;బలం=సేనను; త్వరయామాస= వేగిరపఱచెను.

మహా బలశాలియు శీఘ్రపరాక్రముఁడునగు నా సేనాధ్యక్షుఁడు, రావణునియాజ్ఞను శిరసావహించి, యాత్రకారంబున, సేనను సిద్ధము గావించెను. అని, తాత్పర్యము.

తతో నానాప్రహరణా భీమాక్షా భీమదర్శనాః
నిష్పేతూ రక్షసాం ముఖ్యా బలాధ్యక్షప్రచోదితాః. ౬

టీక॥ తతః=అంత; నానాప్రహరణాః=నానావిధములయిన యాయుధములుగలవారలున; భీమాక్షాః = భయంకరములయినకన్నులు గలవారలును; భీమదర్శనాః=భయంకరమైనచూచుటగలవారలునగు; రక్షసాం= రాక్షసులలో; ముఖ్యాః= శ్రేష్ఠులగువారలు; బలాధ్యక్షప్రచోదితాః=సేనాధ్యక్షునిచేఁ బ్రేరేపింపఁబడిన వారలయి; నిష్పేతుః=వెడలిరి.

అంత, నానావిధాయుధధారులును భయంకరంబులగు కన్నులుగల వారలును జూపరులకు భయంబు గలిగించువారలునగు రాక్షసోత్తములు, సేనాధ్యక్షప్రేరితులయి, యుద్ధంబునకు వెడలిరి. అని, తాత్పర్యము.

రథ మాస్థాయ విపులం తప్తకాంచనకుండలః
మేఘాభో మేఘవర్ణశ్చ మేఘస్వనమహాస్వనః. ౭
రాక్షసై స్సంవృతో భీమై స్తదా నిర్యా త్యకంపనః

టీక॥ తప్తకాంచనకుండలః= కాఁచఁబడినబంగారు పోఁగులుగలవాఁడును; మేఘాభః= మేఘముయొక్క కాంతివంటికాంతిగలవాఁడును, మేఘంబువలెమహాకాయుండు ననుట; మేఘవర్ణశ్చ=మేఘముయొక్కవన్నెవంటివన్నెగలవాఁడును; మేఘస్వనమహాస్వనః= మేఘధ్వనివంటిమహాధ్వనిగలవాఁడునగు; అకంపనః = అకంపనుఁడు; తదా=అప్పుడు; విపులం=విశాలమయిన; రథం=రథమును; ఆస్థాయ=అధిష్ఠించి; భీమైః=భయంకరులగు; రాక్షసైః = రాక్షసులచేత; సంవృతః=చుట్టఁబడినవాఁడై; నిర్యాతి=వెడలెను.

అంత, మంచిబంగారుపోఁగులు ధరించినవాఁడును మేఘాకారుండును మే




ఘనవర్ణుండును మేఘగర్జనమువంటిమహాధ్వనిగలవాఁడునగునకంపనుండు, విశాలంబగు రథంబునారోహించి, భయంకరాకారులగు రాక్షసులచేఁ బరివేష్టింపఁబడినవాఁడై, యుద్ధంబునకు వెడలెను. అని, తాత్పర్యము.

నహి కంపయితుం శక్య స్సురైరపి మహామృధే. ౮
అకంప నస్తత స్తేషా మాదిత్య ఇవ తేజసా

టీక॥ హి=ఏకారణమువలన; మహామృధే=మహాయుద్ధమునందు; సురైరపి=దేవతలచేనైనను; కంపయితుం=కదలించుటకు; నశక్యః — అలవిగాఁడో; తతః=అందువలన; అకంపనః=అకంపనుఁడు. తేషాం = ఆ రాక్షసులలో; ఆదిత్యఇవ= సూర్యుఁడువలె; స్థితః(అధ్యాహృతము)=ఉండెను.

మహాయుద్ధంబున దేవతలకుఁగూడఁగదలింపరానివాఁడు కావున, నకంపనుండనియతనికిఁ బేరువచ్చినది; అతండు, ఆ రాక్షసులనడుమ సూర్యుండువలె వెలుంగుచుండెను. అని, తాత్పర్యము.

తస్య నిర్ధావమానస్య సంరబ్ధస్య యుయుత్సయా. ౯
అకస్మా ద్దైన్య మాగచ్ఛ ద్ధయానాం రథవాహినామ్

టీక॥ యుయుత్సయా= యుద్ధంబుసేయనిచ్ఛచేత; సంరబ్ధస్య=వేగిరపడినవాఁడును; నిర్ధావమానస్య= పరుగెత్తుచున్నవాఁడునగు; తస్య=ఆయకంపనునియొక్క; రథవాహినాం= రథమునీడ్చునట్టి; హయానాం = గుఱ్ఱములకు; అకస్మాత్ =కారణములేకయె; దైన్యం=దుఃఖము; ఆగచ్ఛత్ =వచ్చెను.

అకంపనుండట్లు యుద్ధంబు సేయఁగోరి, వేగంబునంబోవుచుండఁగా, నతని రథంబునకుఁగట్టినగుఱ్ఱంబులకు, ఆకస్మికంబుగా, దైన్యముగలిగినది.

అని, తాత్పర్యము.

వ్యస్ఫుర న్నయనం చాస్య సవ్యం యుద్ధాభినందినః. ౧౦
వివర్ణో ముఖవర్ణశ్చ గద్గదశ్చా భవత్స్వనః




టీక॥ యుద్ధాభినందినః= యుద్ధమునుబాగడునట్టి; అస్య= ఈయకంపనునియొక్క; సవ్యం=ఎడమదైన; నయనంచ=కన్నును; వ్యస్ఫురత్=కదలినది. ముఖవర్ణశ్చ=ముఖముయొక్క రంగును; వివర్ణః= తెల్లఁబాఱినది. స్వనశ్చ= ధ్వనియు; గద్గదః=డగ్గుత్తికగలది; అభవత్=అయినది.

యుద్ధోత్సాహంబుగలయాయకంపనునియెడమకన్నదరినది; ముఖము తెల్లఁబాఱినది; కంఠధ్వనియు డగ్గుత్తికనొందినది. అని, తాత్పర్యము.

అభవత్సుదినే చాపి దుర్దినం రూక్షమారుతమ్. ౧౧

టీక॥ సుదినేచాపి = మంచిపగటియందును; రూక్షమారుతం=క్రూరమయినగాలిగల; దుర్దినం=మబ్బుకమ్మినదినము; అభవత్=అయినది.

అంతకుమున్ను స్వచ్ఛముగానున్న పగలప్పుడు పెద్దగాలిగలిగి మేఘావృతమయినది.

అని, తాత్పర్యము.

ఊచుః ఖగా మృగా స్సర్వే వాచః క్రూరా భయావహాః

టీక॥ సర్వే=సమస్తములయిన; ఖగాః=పక్షులును; మృగాః = మృగములును; క్రూరాః = కఠినములును; భయావహాః= భయముగలిగించునవియు నగు; వాచః=ధ్వనులను; ఊచుః=పలికినవి.

మృగపక్షులన్నియుఁ, గ్రూరముగాను భయంకరంబుగాను గూసినవి.

అని, తాత్పర్యము.

స సింహోపచితస్కంధ శ్శార్దూలసమవిక్రమః. ౧౨
తా నుత్పాతా నచింత్యైవ నిర్జగామ రణాజిరమ్

టీక॥ సింహోపచితస్కంధః = సింహమునకువలె నున్నతము లయిన మూఁపులుగలవాఁడును; శార్దూలసమవిక్రమః= పెద్దపులులతో సమానమయినపరాక్రమముగలవాఁడునగు; సః=ఆయకంపనుఁడు; తాన్=ఆ; ఉత్పాతాన్=దుర్నిమిత్తములను; అచింత్యైవ=తలంపకయె; రణాజిరం =

యుద్ధభూమినిగూర్చి; నిర్జగామ=వెడలెను.

సింహమునకుంబోలె నున్నతములగుమూపులుగల వాఁడును పెద్దపులివంటిపరాక్రమంబుగలవాఁడునగు నాయకంపనుండు, ఆమహోత్పాతంబులసరకుసేయక, యుద్ధభూమికిఁ బోయెను. అని, తాత్పర్యము.

తదా నిర్గచ్ఛత స్తస్య రక్షస స్సహ రాక్షసైః. ౧౩
బభూవ సుమహా న్నాదః క్షోభయన్నివ సాగరమ్

టీక॥ తదా=అప్పుడు; తస్య=ఆ; రక్షసః=అకంపనుండు; రాక్షసైస్సహ=రాక్షసులతోఁగూడ; నిర్గచ్ఛతః=వెడలుచుండఁగా; సుమహాన్=మిక్కిలి యుగొప్పదగు; నాదః=ధ్వని; సాగరం=సముద్రమును; క్షోభయన్నివ=కలంచునదివలె; బభూవ=కలిగినది.

ఆయకంపనుండు రాక్షసులతోఁగూడనట్లు యుద్ధంబునకు వెడలుచుండఁగా, వారలధ్వని, సముద్రంబుఁతయుఁగలంగునట్లు దిక్కులునిండి చెలంగినది. అని, తాత్పర్యము.

తేన శబ్దేన విత్రస్తా వానరాణాం మహాచమూః. ౧౪
ద్రుమశైల ప్రహరణా యోద్ధుం సమవతిష్ఠత

టీక॥ వానరాణాం=వానరులయొక్క; మహాచమూః=గొప్పసేన; తేన=ఆ; శబ్దేన=ధ్వనిచేత; విత్రస్తా=భయపడినదై; ద్రుమశైల ప్రహరణా=వృక్షములును బర్వతములునైనాయుధములు గాఁగలదై; యోద్ధుం=పోరుటకు; సమవతిష్ఠత=నిలిచెను.

వానరసేన, ఆమహాధ్వనికి భయపడి, వృక్షంబులను బర్వతంబులను ఆయుధంబులుగాఁగొని, యుద్ధముసేయ నిలిచియుండినది. అని, తాత్పర్యము.

తేషాం యుద్ధం మహారౌద్రం సంజజ్ఞే హరిరక్షసామ్. ౧౫
రామరావణయో రర్థే సమభిత్యక్తజీవినామ్

టీక॥ రామరావణయోః = రామునియొక్కయు, రావణునియొక్కయు; అర్థే = కార్యమునిమిత్తమయి; సమభిత్యక్తజీవినాం = విడువఁబడిన ప్రాణముగల; తేషాం = ఆ; హరిరక్షసాం = వానరరాక్షసులకు; మహారౌద్రం = మహాభయంకరమయిన; యుద్ధం = యుద్ధము; సంజజ్ఞే = కలిగినది.

రామునినిమిత్తమయి ప్రాణంబుల నైననువిడవనిశ్చయించుకొన్న వానరులకును, రావణునినిమిత్తమయి ప్రాణంబులనైననువిడువనిశ్చయించుకొన్న రాక్షసులకును, మహాభయంకరంబగు యుద్ధముజరిగినది. అని, తాత్పర్యము.

సర్వే హ్యతిబలాః శూరా స్సర్వే పర్వతసన్నిభాః. ౧౬
హరయో రాక్షసాశ్చైవ పరస్పరజిఘాంసవః

టీక॥ సర్వే = అందఱును; అతిబలాః = అధికమయినబలముగలవారలును; సర్వే = అందఱును; పర్వతసన్నిభాః = కొండలతోసమానులయినవారునగు; హరయః = వానరులును; రాక్షసాశ్చ = రాక్షసులును; పరస్పరజిఘాంసవః = ఒండొరులంజంపఁగోరినవా...; అభవన్ (అధ్యాహృతము) హి = అయిరిగదా!

మహాబలశాలులును బవరతారులునగు నా వానరరాక్షసులిరుగెలంకులవారును, ఒండొరులవధింపఁగోరిచకచకరావిరి...

అని, తాత్పర్యము.

తేషాం వినదతాం శబ్ద స్సంయుగే ఽతితరస్వినామ్. ౧౭
శుశ్రువే సుమహాన్ క్రోధా దన్యోన్య మభిగర్జతామ్

టీక॥ సంయుగే = యుద్ధమునందు; వినదతాం = సింహనాదములు సేయుచున్నవారలును; క్రోధాత్ = కోపమువలన; అన్యోన్యం = ఒండొరులనుగూర్చి; అభిగర్జతాం = గర్జించుచున్నవారలునగు; అతితరస్వినాం = మిక్కిలియుబలవంతులగు; తేషాం = ఆవానరరాక్షసులయొక్క; శబ్దః = ధ్వని; సుమహాన్ = మిక్కిలియుగొప్పదిగా; శుశ్రువే = వినఁబడినది.

మహాబలశాలులగునావానరరాక్షసులు యుద్ధంబున సింహనాదంబులు సేయు

చునొండొరులపైఁగోపంబువగఁజిలంచుచుండఁగా, నమ్మహాధ్వని, దిక్కులునిండి చెలంగినది. అని, తాత్పర్యము.

రజశ్చారుణవర్ణాభం సుభీమ మభవ ద్భృశమ్. ౧౮
ఉద్భూతం హరిరక్షోభి స్సంరురోధ దిశో దశ

టీక॥ రజః=పరాగమును; అరుణవర్ణాభం=ఎఱ్ఱనిరంగుగలకాంతి గలదియు; భృశం=మిక్కిలియును; సుభీమం=మిక్కిలియును భయంకరమును; అభవత్=అయినది. హరిరక్షోభిః= వానరరాక్షసులచేత; ఉద్భూతం=లేచినదై; దశ=పదియయిన; దిశః=దిక్కులను; సంరురోధ=అడ్డగించెను.

పరాగముభూస్వభావంబునరక్తవర్ణమయిమహాభయంకరముగాఁ గనుపట్టుచు, నవ్వానరరాక్షసులత్రొక్కుడువలనలేఁగి, దశదిశలనుఁగప్పినది. అని, తాత్పర్యము.

అన్యోన్యం రజసా తేన కౌశేయోద్ధూతపాండునా. ౧౯
సంవృతానిచ భూతాని దదృశు ర్న రణాజిరే

టీక॥ తే(అధ్యాహృతము)=ఆవానరరాక్షసులు; రణాజిరే=యుద్ధభూమియందు; కౌశేయోద్ధూతపాండునా=విదిలింపఁబడిన తెల్లపట్టువలెఁ దెల్లనైన; తేన=ఆ; రజసా=దుమ్ముచేత; సంవృతాని=కప్పఁబడిన; భూతాని=వస్తువులను; అన్యోన్యంచ=ఒండొరులను; న దదృశుః=చూడరైరి.

చక్కగావిదిలింపఁబడిన తెల్లపట్టువలెఁదెల్లనైనపరాగముచేఁ గప్పఁబడియుండుటంజేసి, యా యుద్ధభూమియందు అన్యోన్య పదార్థంబులంగాని యొండొరులంగాని, వానర రాక్షసులు, కనుంగొనఁజాలరైరి. అని, తాత్పర్యము

న ధ్వజా న పతాకా వా వర్మ వా తురగోపి వా. ౨౦
ఆయుధం స్యందనం వాపి దదృశే తేన రేణునా

టీక॥ తేన=ఆ; రేణునా=పరాగముచేత; ధ్వజాః=పట్టెకొక్కెములుగాని;

న(దదృశిరే)= చూడఁబడవయ్యె. పతాకావా= రాజచిహ్నములు వ్రాసిన టెక్కెములు కాని;న(దదృశిరే)=చూడఁబడవయ్యె. వర్మణా=కవచముఁగాని ; తురగోపివా = గుఱ్ఱము గాని;ఆయుధం=ఆయుధముగాని ; స్యందనం వాపి=రథముగాని; (న) దదృశే=చూడఁబడదయ్యె.

ఆయుద్ధంబున, నట్లుదుమ్ము కప్పుటచే, పట్టిధ్వజంబులుగాని చిహ్నంబులు వ్రాసిన ధ్వజంబులుగాని కవచములుగాని గుఱ్ఱములుగాని యాయుధములుగాని రథములుగాని, యెంతమాత్రముగానంబడవయ్యె.అని, తాత్పర్యము.

శబ్దశ్చ సుమహాం స్తేషాం నర్దతా మభిధావతామ్. ౨౧
శ్రూయతే తుములే యుద్ధే న రూపాణి చకాశిరే

టీక॥ తుములే= దొమ్మియయిన; యుద్ధే=యుద్ధమునందు; నర్దతాం=గర్జించుచున్నవారలును ; అభిధావతాం = ఎదురొరు నిపరుగెత్తుచున్నవారలునగు; తేషాం = ఆవానరరాక్షసులయొక్క;శబ్దశ్చ = ధ్వనిమాత్రము; శ్రూయతే = వినఁబడుచుండినది.రూపాణి = దేహములు; నచకాశిరే=ప్రకాశింపవయ్యె.

ఆతుములయుద్ధంబున , సింహనాదంబులు సేయుచు నొండురులపై కడరుచున్న యావానరరాక్షసుల ధ్వనిమాత్రమువినవచ్చుచుండినది; వారిరూపములు మాత్రముగనపడవయ్యె.

అని, తాత్పర్యము.

హరీనేవ సుసంక్రుద్ధా హరయో జఘ్నురాహవే. ౨౨
రాక్షసాశ్చాపి రక్షాంసి నిజఘ్ను స్తిమిరే తదా

టీక॥తదా=అప్పుడు;తిమిరే=చీఁకటియందు;ఆహవే=యుద్ధమునందు; హరయః=వానరులు; సుసంక్రుద్ధాః = మిక్కిలియుఁగోపించినవారలయి; హరీనేవ=వానరులనే; జఘ్నుః=కొట్టిరి. రాక్షసాశ్చాపి=రాక్షసులును; రక్షాంసి=రాక్షసులను; నిజఘ్నుః=కొట్టిరి.

అప్పుడు చీఁకటియందు వానరులు

తమవారల నెదిరివారలం దెలియక, పరమకుపితులయివానరులనే ప్రహరించిరి; అట్లు రాక్షసులు, రాక్షసులనే, కొట్టుకొనిరి. అని, తాత్పర్యము.

పరాంశ్చైవ వినిఘ్నంత స్స్వాంశ్చ వానర రాక్షసాః. ౨౩
రుధిరార్ద్రాం తదా చక్రు ర్మహీం పంకానులేపనామ్

టీక॥ తదా=అప్పుడు; వానరరాక్షసాః = వానరులును రాక్షసులును; పరాంశ్చైవ=ఎదిరివారలను ; స్వాంశ్చ=తమవారలను;వినిఘ్నంతః = కొట్టుచు;మహీం = భూమిని ; రుధిరార్ద్రాం= నెత్తురుచేఁదడిసినదానిఁగాను;పంకానులేపనాం= బురదచేఁబూయఁబడినదానిఁగాను; చక్రుః = చేసిరి.

అప్పుడు,ఆవానరరాక్షసులు, చీఁకటియగుటచే నొకరినొకరుదెలియక, శత్రువులను దమవారినింగూడ వధించుకొనుచు, యుద్ధమునందుభూమినంతయు,నెత్తురుచేబురదగలదానిఁగావించిరి.అని, తాత్పర్యము.

తతస్తు రుధిరౌఘేణ సిక్తం వ్యపగతం రజః. ౨౪

టీక॥ తతస్తు=అంతను; రజః= దుమ్ము; రుధిరౌఘేణ=నెత్తురుప్రవాహముచేత; సిక్తం=తడుపఁబడినదై; వ్యపగతం=పోయినది.

అంత, దుమ్ముంతయు , నెత్తుటం దడియుటచేనణఁగిపోయినది.
అని, తాత్పర్యము.

శరీరశవసంకీర్ణా బభూవచ వసుంధరా

టీక॥ వసుంధరాచ=భూమియు ; శరీరశవసంకీర్ణా= పీనుఁగులయినదేహములచేవ్యాపింపఁబడినది;బభూవ=ఆయెను.

యుద్ధభూమియంతయుఁ బీనుంగులచేనిండినది.అని, తాత్పర్యము.

ద్రుమశక్తిశిలాప్రాసై ర్గదాపరిఘతోమరైః. ౨౫

హరయో రాక్షసాశ్చైవ జఘ్ను రన్యోన్య మోజసా

టీక॥ హరయః=వానరులును; రాక్షసాశ్చైవ=రాక్షసులును; ద్రుమశక్తిశిలాప్రాసైః = వృక్షములచేతను శక్తులచేతను ఱాళ్లచేతను ప్రాసములచేతను; గదాపరిఘతోమరైః=గదలచేతను ఇనుపగుదియలచేతను జిల్లకోలలచేతను; అన్యోన్యం=ఒండొరులను ; ఓజసా=పరాక్రమముచేత; జఘ్నుః = పొందిరి.

వానరులును రాక్షసులును, వృక్షంబులను శక్తులను ఱాళ్లను ప్రాసంబులను గదలను పరిఘంబులను దోమరంబులను బట్టుకొని, పరాక్రమంబున, నొండొరులం గలసి యుద్ధంబు గావించిరి. అని, తాత్పర్యము.

బాహుభిః పరిఘాకారై ర్యుధ్యంతః పర్వతోపమాః. ౨౬
హరయో భీమకర్మాణో రాక్షసాన్ జఘ్నురాహవే

టీక॥ పర్వతోపమాః = కొండలతోఁబోలికగలవారలును; భీమకర్మాణః = భయంకరమయిన కార్యములుగలవారలునగు; హరయః = వానరులు ; ఆహవే = యుద్ధమునందు; పరిఘాకారైః = ఇనుపగుదియలయాకారమువంటి యాకారముగల ; బాహుభిః = భుజములచేత ; యుధ్యంతః=పోరుచు; రాక్షసాన్=రాక్షసులను;జఘ్నుః=వధించిరి.

అమ్మహాయుద్ధంబునఁ , బర్వతాకారులును భయంకర కర్ములునగు వానరులు , పరిఘంబులవంటి బాహువులతో యుద్ధంబుఁ గావించుచు, రాక్షసుల వధించిరి. అని, తాత్పర్యము.

రాక్షసా స్త్వపి సంక్రుద్ధాః ప్రాసతోమరపాణయః. ౨౭
కపీన్నిజఘ్నిరే తత్ర శస్త్రైః పరమదారుణైః

టీక॥ తత్ర = అప్పుడు; రాక్షసాస్త్వపి=రాక్షసులును; సంక్రుద్ధాః=మిక్కిలియుఁగోపించినవారలయి; ప్రాసతోమరపాణయః=ఈటెలును చిల్లకోలలును చేతులంగలవారలయి ; పరమదారుణైః=మిక్కిలియు భయంకరముల

యిన; శస్త్రైః=ఆయుధములచేత; కపీన్=వానరులను ; నిజఘ్నిరే = వధించిరి.

అప్పుడు , రాక్షసులునుబరమకుపితులై , ప్రాసంబులం దోమరంబులం జేకొని, భయంకరంబులగునయ్యాయుధంబులచే, వానరులవధించిరి.

అని, తాత్పర్యము.

అకంపన స్సుసంక్రుద్ధో రాక్షసానాం చమూపతిః. ౨౮
సంహర్షయతి తాన్ సర్వాన్ రాక్షసాన్ భీమవిక్రమాన్

టీక॥ రాక్షసానాం = రాక్షసుల యొక్క; చమూపతిః = సేనానాయకుఁడగు; అకంపనః = అకంపనుండు; సుసంక్రుద్ధః = మిక్కిలియుఁగోపించినవాఁడై; భీమవిక్రమాన్ = భయంకరమయినపరాక్రమముగల ; తాన్= ఆ; రాక్షసాన్ = రాక్షసులను ; సర్వాన్=అందఱను ; సంహర్షయతి=పురికొల్పుచుండెను.

రాక్షససేనానాయకుండగు నకంపనుండు, పరమకుపితుండై , భయంకరపరాక్రమములగునారాక్షసుల నందఱంబురికొలుపుచుండెను.

అని, తాత్పర్యము.

హరయ స్త్వపి రక్షాంసి మహాద్రుమమహాశ్మభిః. ౨౯
విదారయం త్యభిక్రమ్య శస్త్రాణ్యా చ్ఛిద్య వీర్యతః

టీక॥ హరయస్త్వపి = వానరులును; రక్షాంసి = రాక్షసులను ; అభిక్రమ్య=ఎదిరించి; వీర్యతః = పరాక్రమమువలన; శస్త్రాణి = ఆయుధములను; ఆచ్ఛిద్య=అపహరించి; మహాద్రుమమహాశ్మభిః = గొప్ప వృక్షములచేతను గొప్పఱాళ్లచేతను ; విదారయంతి= భేదించుచుండిరి.

వానరులును, రాక్షసులనెదిరించి, పరాక్రమబలంబున , వారలచేతియాయుధంబులనాడిసి పెఱికికొని , గొప్పవృక్షంబులచేతను గొప్పశిలలచేతను , వధించిపుచ్చిరి. అని, తాత్పర్యము.

ఏతస్మి న్నంతరే వీరా హరయః కుముదో నలః. ౩౦

మైందశ్చ ద్వివిదః క్రుద్ధా శ్చక్రు ర్వేగ మనుత్తమమ్

టీక॥ ఏతస్మిన్ అంతరే= ఈమధ్యమునందు; కుముదః=కుముదుండును; నలః=నలుండును; మైందశ్చ=మైందుండును; ద్వివిదః=ద్వివిదుండును;వీరాః=పరాక్రమశాలులగు; ఏతే(అధ్యాహృము)=ఈ; హరయః= వానరులు; క్రుద్ధాః= కోపించినవారలయి; అనుత్తమం=తనకన్న శ్రేష్ఠములేని; వేగం=వేగమును; చక్రుః=చేసిరి.

ఇంతలోఁ, గుముదుండును నలుండును మైందుండును ద్వివిదుండును నను నీవానరవీరులు, కుపితులై, మహావేగంబు గావించిరి. అని, తాత్పర్యము.

తేతు వృక్షై ర్మహావేగా రాక్షసానాం చమూముఖే ౩౧
కదనం సుమహ చ్చక్రు ర్లీలయా హరియూధపాః

టీక॥ మహావేగాః= అధికమయినవేగముగల; తే = ఆ; హరియూధపాః= వానరయూధపులగుకుముద నలమైందద్వివిదులు; రాక్షసానాం = రాక్షసులయొక్క; చమూముఖే= సేనాముఖమునందు; లీలయా=విలాసముచేత; వృక్షైః=చెట్లచేత;సుమహత్ = మిక్కిలియు గొప్పదగు; కదనం= యుద్ధమును; చక్రుః=చేసిరి.

మహావేగులగు నా కుముదనలమైందద్వివిదులు, రాక్షససేనాముఖంబునం జేరి, విలాసంబుమెయి, వృక్షధరులయి మహాయుద్ధంబు గావించిరి. అని, తాత్పర్యము.

మమంథూ రాక్షసాన్ సర్వే వానరా గణశో భృశమ్. ౩౨

టీక॥వానరాః=వానరులు; సర్వే= అందఱును; రాక్షసాన్ = రాక్షసులను;గణశః=గుంపుగుంపుగా; భృశం= మిక్కిలియు; మమంథుః= మథించిరి.

ఆవానరవీరులు నల్వురును, రాక్షసులనుగుంపులుగుంపులుగా వధించిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,

యుద్ధకాండే, పంచపంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండపంచపంచాశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

షట్పంచాశసర్గప్రారంభః.

తద్దృష్ట్వా సుమహత్కర్మ కృతం వానరసత్తమైః
క్రోధ మాహారయామాస యుధి తీవ్ర మకంపనః. ౧

టీక॥ అకంపనః = అకంపనుఁడు; యుధి=యుద్ధమునందు ; వానరసత్తమైః=వానరశ్రేష్ఠులచేత;కృతం = చేయఁబడిన;సుమహత్ = మిక్కిలియుగొప్పదగు;తత్=ఆ;కర్మ = కార్యమును;దృష్ట్వా=చూచి;తీవ్రం = తీక్ష్ణమయిన;క్రోధం = కోపమును;ఆహారయామాస=తెచ్చుకొనెను.

అకంపనుఁడు, వానరోత్తములగు నాకుముదనలమైందద్వివిదులు యుద్ధంబునం దెకుల్గా రాక్షసులవధించుటనుజూచి, మహాకోపంబునొందెను.

అని, తాత్పర్యము,

క్రోధమూర్ఛితరూపస్తు ధూన్వన్ పరమకార్ముకమ్
దృష్ట్వాతు కర్మ శత్రూణాం సారథిం వాక్య మబ్రవీత్. ౨

టీక॥ సః (అధ్యాహృతము)= ఆయకంపనుఁడు;శత్రూణాం = శత్రువులయొక్క;కర్మ = కార్యమును;దృష్ట్వాతు=చూచినంతనె ; క్రోధమూర్ఛితరూపస్తు= కోపముచేవ్యాపింపఁబడినదేహముగలవాఁడై మె ; పరమ

కాముకం = ఉత్తమమయిన ధనుస్సును ; ధూన్వన్ = విదిలించుచు;సారథిం = సారథినిగూర్చి ; వాక్యం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

ఆయకంపనుఁడు , శత్రువులుగావించినకార్యమునుజూచినంతనె , పరమకుపితుండై , ధనువుసారించుచు, సారథింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

తత్రైవ తావ త్త్వరితం రథంప్రాపయ సారథే
యత్రైతే బహవో ఘ్నంతి సుబహూన్ రాక్షసాన్ రణే. ౩

టీక॥సారథే=సారథీ!యత్ర = ఎచ్చట;రణే=యుద్ధమునందు; బహవః=పెక్కండ్రగు;ఏతే=ఈవానరులు;సుబహూన్=మిక్కిలియుఁ బెక్కండ్రగు; రాక్షసాన్=రాక్షసులను;ఘ్నంతి= చంపుచున్నారో;తత్రైవ తావత్=అచ్చటికే;త్వరితం=శీఘ్రముగా;రథం= రథమును;ప్రాపయ=పొందించుము.

సారథీ! పెక్కండ్రు వానరులు చేరి, మన రాక్షసుల ననేకుల రూపు మాపుచున్నారే , ఆస్థలంబునకు , శీఘ్రంబుగా రథము దోలుము అని, తాత్పర్యము

ఏతేత్ర బలవంతో హి భీమకాయాశ్చ వానరాః
ద్రుమశైలప్రహరణా స్తిష్ఠంతి ప్రముఖే మమ. ౪

టీక॥అత్ర=ఇచ్చట; మమ=నాయొక్క;ప్రముఖే=ముందట;బలవంతః=అధికమయినబలముగలవారలును ; భీమకాయాః=భయంకరమయిన దేహముగలవారలునగు;ఏతే=ఈ; వానరాః=వానరులు;ద్రుమశైలప్రహరణాః= వృక్షములునుబర్వతములు నాయుధంబులుగాఁగలవారలయి; తిష్ఠంతిహి = ఉన్నారుగదా!

ఇదిగో నా మొదుట, మహాబలశాలులును, భయంకరాకారులునగు వానరులు వృక్షంబులను బర్వతంబులనుం జేకొని,యుద్ధంబు గావించుచున్నారు గదా! అని, తాత్పర్యము.

ఏతా న్నిహంతు మిచ్ఛామి సమరశ్లాఘినో హ్యహమ్

స ౫౬

ఏతైః ప్రమథితం సర్వం దృశ్యతే రాక్షసం బలమ్. ౫

టీక॥ అహం=నేను; సమరశ్లాఘినః=యుద్ధంబునం బొగడ్తగల; ఏతాన్=ఈ వానరులను; నిహంతుం= వధించుటకు; ఇచ్ఛామిహి = కోరుచున్నానుగదా! రాక్షసం=రాక్షససంబంధియగు; బలం=సైన్యము; సర్వం=అంతయు; ఏతైః=ఈవానరులచేత; ప్రమథితం= మథింపఁబడినదిగా; దృశ్యతే=చూడఁబడుచున్నది.

యుద్ధంబున మహాసమర్థులనిపొగడ్తగాంచినయువ్వానరుల వధింపఁగోరియున్నాను; వారలచేతనెయీ రాక్షససైన్యమంతయుఁ, జీకాకునొందింపఁబడియున్నది. అని, యకంపనుండు, సారథికిం జెప్పెను. అని, తాత్పర్యము.

తతః ప్రజవనాశ్వేన రథేన రథినాం వరః
హరీ నభ్యహనత్ క్రోధాచ్ఛరజాలై రకంపనః. ౬

టీక॥ తతః=అంత; రథినాం=రథికులలో; వరః=శ్రేష్ఠుండగు; అకంపనః= అకంపనుఁడు; ప్రజవనాశ్వేన = వేగవంతంబులగు గుఱ్ఱములుగల; రథేన=రథముచేత; క్రోధాత్=కోపమువలన; శరజాలైః=బాణసమూహములచేత; హరీన్=వానరులను; అభ్యహనత్ = కొట్టెను.

అంత, రథికశ్రేష్ఠుండగునకంపనుండు, కుపితుండై వేగవంతంబులగు గుఱ్ఱంబులుపూన్చినరథంబుఁదోలించి, బాణవర్షములచేవానరులనొప్పించెను. అని, తాత్పర్యము.

న స్థాతుం వానరాశ్శేకుః కింపున ర్యోద్ధు మాహవే
అకంపనశరై ర్భగ్నా స్సర్వ ఏవ విదుద్రువుః ౭

టీక॥ వానరాః=వానరులు; ఆహవే=యుద్ధమునందు; స్థాతుం = నిలుచుటకు; న శేకుః = చాలరైరి. యోద్ధుం=పోరుటకు; కింపునః= చెప్పనేల? సర్వే ఏవ= అందఱు నే; అకంపనశరైః = అకంపనునిబాణములచే; భగ్నాః= భంగమునొందిన వారలయి; విదుద్రువుః= పాఱిరి.

వానరులు, యుద్ధంబున , నాయకంపనుని యెదుటనిలుచుటకే యశక్తులైరి; ఇంకఁబోరఁజాలరైరని చెప్పనేలగు? వానరులు, అతనిబాణములచేభంగమునొంది, యందఱునుంబరుగెత్తిరి.

అని, తాత్పర్యము.

తాన్ మృత్యువశ మాపన్నా నకంపనవశం గతాన్
సమీక్ష్య హనుమాన్ జ్ఞాతీ నుపతస్థే మహాబలః. ౮

టీక॥ మహాబలః= అధికమయినబలముగల ; హనుమాన్ = హనుమంతుండు; మృత్యువశం= మృత్యువుయొక్క-యధీనతను; ఆపన్నాన్=పొందినవారలును; అకంపనవశంగతాన్= అకంపనునియధీనతను బొందినవారలునగు; తాన్=ఆ; జ్ఞాతీన్= బంధువులను; సమీక్ష్య = చూచి; ఉపతస్థే= సమీపించెను.

మహాబలశాలియగు హనుమంతుండు, అట్లకంపనునిచేతంజిక్కి- మృత్యువునోటంబడినట్లున్నయావానరులంజూచి, యకంపనునిమీఁదికడరెను.

అని, తాత్పర్యము.

తం మహా ప్లవగం దృష్ట్వా సర్వే ప్లవగయూథపాః
సమేత్య సమరే వీరా స్సంహృష్టాః పర్యవారయన్. ౯

టీక॥ వీరాః=పరాక్రమశాలులగు; ప్లవగయూథపాః = వానరయూథపులు; సమరే= యుద్ధంబునందు; తం= ఆ;మహాప్లవగం=మహావానరుఁడైనహనుమంతుని; దృష్ట్వా = చూచి; సమేత్య=చేరి; సంహృష్టాః= మిక్కిలియు సంతసించిన వారలయి ; పర్యవారయన్=పరివేష్టించిరి.

పరాక్రమవంతులగునావానరయూథపులందఱును , యుద్ధంబునహనుమంతుండుతమకుఁదోడ్పడుటంజూచి, పరమసంతుష్టులయి, యందఱుంజేరి, యతనిఁబరివేష్టించిరి.అని, తాత్పర్యము.

అవస్థితం హనూమంతం తే దృష్ట్వా హరియూథపాః
బభూవు ర్బలవంతో హి బలవంతం సమాశ్రితాః. ౧౦

టీక॥ బలవంతః= అధికమయినబలముగల; తే=ఆ; హరియూథపాః = వానరయూథపులు; హనూమంతం= హనుమంతుని; అవస్థితం= నిలిచినవానిఁగా; దృష్ట్వా=చూచి; బలవంతం= అధికమయినబలముగలహనుమంతుని ; సమాశ్రితాః=పొందినవారలు; బభూవుహిః = అయిరిగదా!

బలవంతులగు నా వానరవీరులు, హనుమంతుండు వచ్చినిలుచుటఁజూచి, బలవంతుండగు నా హనుమంతుని ప్రాపున, నిలిచిరి.

అని, తాత్పర్యము.

అకంపనస్తు శైలాభం హనూమంత మవస్థితమ్
మహేంద్రఇవ ధారాభి శ్శరై రభివవర్ష హ. ౧౧

టీక। అకంపనస్తు= అకంపనుండును; శైలాభం = పర్వతముయొక్క కాంతివంటికాంతిగలవాఁడును; అవస్థితం= నిలిచినవాఁడునగు; హనూమంతం=హనుమంతునిగూర్చి ; మహేంద్రః=దేవేంద్రుఁడు; ధారాభిరివ= వర్షధారలచేతవలె; శరైః=బాణములచేత; అభివవర్ష=కురిసెను ("హ" అనునది పాదపూరణార్థము.)

అకంపనుండు, పర్వతాకారుండగు హనుమంతునిపై , ఇంద్రుండువర్షంబుగురిపించు నట్లు, బాణంబులఁ గురిపించెను. అని, తాత్పర్యము.

అచింతయిత్వా బాణౌఘాన్ శరీరే పతితాన్ శితాన్
అకంపనవధార్థాయ మనో దధ్రే మహాబలః. ౧౨

టీక॥మహాబలః=అధికమయిన బలముగలహనుమంతుఁడు; శరీరే= దేహమందు;పతితాన్=పడిన ; శితాన్ = [illegible]కులయిన; బాణౌఘాన్= బాణస[illegible]ములను; అచింతయిత్వా= త[illegible] [illegible]కంపనవధార్థాయ=అకంపనునివధించుట యనెడు ప్రయోజనముకొఱకు; మనః=మనస్సును;దధ్రే= ధరించెను.

మహాబలుండగు హనుమంతుండు, తనదేహంబుపైఁబడిన కఱకుబాణంబులసరకుసేయక, యాయకంపనునివధిం

పవలెనని మనంబునందలంచెను.   అని, తాత్పర్యము.

స ప్రసహ్య మహాతేజా హనూమా న్మారుతాత్మజః
అభిదుద్రావ తద్రక్షః కంపయన్నివ మేదినీమ్. ౧౩

టీక॥ మహాతేజాః = అధికమయిన పరాక్రమముగలవాఁడును; మారుతాత్మజః = వాయుదేవుని కుమారుండున గు; సః = ఆ; హనూమాన్ = హనుమంతుండు; ప్రసహ్య = బలాత్కరించి; మేదినీం = భూమిని; కంపయన్నివ = కదలించువాఁడువలె; తత్ = ఆ; రక్షః = అకంపనునిగూర్చి; అభిదుద్రావ = పరుగెత్తెను.

మహాతేజుండును వాయుదేవుని కుమారుండునగు నాహనుమంతుండు, పాదాఘాతంబున భూమి యదర, నాయకంపనునిమీఁది కడరెను.

అని, తాత్పర్యము.

తస్యాభినర్దమానస్య దీప్యమానస్య తేజసా
బభూవ రూపం దుర్ధర్షం దీప్తస్యేవ విభావసోః. ౧౪

టీక॥ అభినర్దమానస్య = గర్జించుచున్నవాఁడును; తేజసా = తేజస్సుచేత; దీప్యమానస్య = ప్రకాశించుచున్నవాఁడునగు; తస్య = ఆహనుమంతుని యొక్క; రూపం = ఆకారము; దీప్తస్య = ప్రకాశించుచున్న; విభావసోః = సూర్యునియొక్క; రూపం (అధ్యాహృతము) ఇవ = ఆకారమువలె; దుర్ధర్షం = ఎదిరింపనలవిగానిది; బభూవ = అయినది.

క్రోధావేశంబున సింహనాదంబు సేయుచుఁ దేజంబున వెలుఁగుచున్న యాహనుమంతుండు పట్టపగటి సూర్యునికైవడి, దుర్ధర్షుండై యుండెను. అని, తాత్పర్యము.

ఆత్మాన మప్రహారణం జ్ఞాత్వా క్రోధసమన్వితః
శైల ముత్పాటయామాస వేగేన హరిపుంగవః. ౧౫

టీక॥ హరిపుంగవః = వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు ; ఆత్మా

స ౫౭

 

న్ను; అప్రహరణం=ఆయుధములేని వానిఁగా; జ్ఞాత్వా=ఎఱింగి; క్రోధసమన్వితః=కోపముతోఁగూడినవాఁడై; వేగేన=వేగముచేత; శైలం=పర్వతమును; ఉత్పాటయామాస = పెల్లగించెను.

వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుండు, తనచేత నాయుధములేకుండుటం దెలిసి, పరమకుపితుండై, వేగంబున, నొకమహాపర్వతంబుం బెకలించెను.

అని, తాత్పర్యము.

తం గృహీత్వా మహాశైలం పాణి నైకేన మారుతిః
స వినద్య మహానాదం భ్రామయామాస వీర్యవాన్. ౧౬

టీక॥వీర్యవాన్= అధికమయిన పరాక్రమముగల; మారుతిః= వాయుదేవునికుమారుఁడగు; సః = ఆహనుమంతుండు; ఏకేన=ఒక్కటైన; పాణినా=చేతిచేత; తం = ఆ; మహాశైలం=మహాపర్వతమును ; గృహీత్వా= పట్టుకొని; మహానాదం= అధికమయినధ్వనికలుగునట్లుగా ; వినద్య=అఱచి; భ్రామయామాస= త్రిప్పెను.

మహాపరాక్రమశాలియగువాయుపుత్రుండునగు నాహనుమంతుండు, అమ్మహాశైలము నొక్కచేతంబట్టుకొని , మహాధ్వనిగదుర సింహనాదంబు సేయుచు, గిఱగిఱం ద్రిప్పెను. అని, తాత్పర్యము

తత స్త మభిదుద్రావ రాక్షసేంద్ర మకంపనమ్
పురా హి నముచిం సంఖ్యే వజ్రేణేవ పురందరః. ౧౭

టీక॥తతః=అంత; సః(అధ్యాహృతము)=ఆహనుమంతుండు ; రాక్షసేంద్రం=రాక్షసశ్రేష్ఠుండగు; తం=ఆ; అకంపనం=అకంపనునిగూర్చి ; పురా=మున్ను; సంఖ్యే=యుద్ధమునందు; పురందర=ఇంద్రుఁడు; వజ్రేణ=వజ్రాయుధముచేత; నముచిమివ= నముచినిగూర్చివలె; అభిదుద్రావహి = పఱతెంచెనుగదా!

అంత, నాహనుమంతుండు, మున్ను దేవేంద్రుండువజ్రధరుండైనముచిమీఁదికిఁబోయినట్లు, అమ్మహా పర్వతంబుచేతంజాల్చి రాక్షసశ్రేష్ఠుఁడగు నాయకంపనుసమీఁదికిఁబోయెను.

అని, తాత్పర్యము.



స ౫౬

అకంపనస్తు తద్దృష్ట్వా గిరిశృంగం సముద్యతమ్
దూరాదేవ మహాబాణై రర్ధచంద్రై ర్వ్యదారయత్. ౧౮

టీక॥ అకంపనస్తు= అకంపనుండును; సముద్యతం=ఎత్తఁబడిన; తత్=ఆ; గిరిశృంగం= పర్వతశిఖరమును; దృష్ట్వా=చూచి; దూరాదేవ= దూరమునను౦డియే; అర్ధచంద్రైః= అర్ధచంద్రాకారములగు; మహాబాణైః= గొప్పబాణములచేత; వ్యదారయత్= భేదించెను.

అకంపనుండు, తనమీఁదికిఁ బర్వతశిఖరముఁ నెత్తుకొనివచ్చుటంజూచి, దూరంబుననుండియె, యర్ధచంద్రాకారబాణంబులచే, దానిం దునియలుగా వించెను. అని, తాత్పర్యము.

తత్పర్వతాగ్ర మాకాశే రక్షోబాణవిదారితమ్
విశీర్ణం పతితం దృష్ట్వా హనుమాన్ క్రోధమూర్ఛితః. ౧౯

టీక॥ హనుమాన్= హనుమంతుండు; ఆకాశే=ఆకాశమునందు; రక్షోబాణవిదారితం= రాక్షసునిబాణములచేభేదింపఁబడినదియు; విశీర్ణం=తునకలయినదియు; పతితం=పడినదియు నగు; తత్=ఆ; పర్వతాగ్రం=పర్వతశిఖరమును; దృష్ట్వా=చూచి; క్రోధమూర్ఛితః=కోపముచేవ్యాపింపఁబడినవాఁడు; అభూత్ (అధ్యాహృతము)= అయ్యెను.

హనుమంతుండు, అప్పర్వతశిఖరంబు, ఆకాశంబుననే, యకంపనునిబాణంబులచేఖండింపఁబడితునియలయి నేలంబడుటను జూచి, పరమకుపితుండయ్యెను. అని, తాత్పర్యము.

సోశ్వకర్ణం సమాసాద్య రోషదర్పాన్వితో హరిః
తూర్ణ ముత్పాటయామాస మహాగిరి మివోచ్ఛ్రితమ్.

టీక॥ సః=ఆ; హరిః= హనుమంతుఁడు; రోషదర్పాన్వితః = కోపముతోను గర్వముతోనుంగూడిన; ఉచ్ఛ్రితం=ఉన్నతమయిన;

పెద్దకొండవలెనున్న; అశ్వకర్ణం= ఇనుమద్దిచెట్టును; సమాదాయ=పట్టుకొని; తూర్ణం=శీఘ్రముగా ; ఉత్పాటయామాస=పెకలించెను.

ఆహనుమంతుండు, కోపగర్వంబులు పెనంగొన, మహాపర్వతమువలెన త్యున్నతమయిన యొకటిమద్దిచెట్టుం జూచి, దానిశీఘ్రంబుగాఁబెకలించెను.

అని, తాత్పర్యము.

తం గృహీత్వా మహాస్కంధం సోశ్వకర్ణం మహాద్యుతిః
ప్రహస్య పరయా ప్రీత్యా భ్రామయామాస సంయుగే. ౨౧

టీక॥ సంయుగే=యుద్ధమునందు; మహాద్యుతిః=అధికమయినకాంతిగల; సః=ఆహనుమంతుండు; మహాస్కంధం=పెద్దబోదెగల; తం=ఆ; అశ్వకర్ణం=ఇనుమద్దిచెట్టును; గృహీత్వా= పట్టుకొని; పరయా= అధికమయిన ; ప్రీత్యా=సంతోషముచేత; ప్రహస్య=నవ్వి; భ్రామయామాస=త్రిప్పెను.

యుద్ధంబున, మహాతేజుండగుహనుమంతుండు , పెద్దబోదెగలయాయశ్వకర్ణవృక్షమునుదీసికొని , పరమసంతోషంబుననవ్వుచు , దానిగిఱగిఱంద్రిప్పెను. అని, తాత్పర్యము.

ప్రధావ న్నూరువేగేన ప్రభంజం స్తరసా ద్రుమాన్
హనుమాన్ పరమక్రుద్ధ శ్చరణై ర్దారయత్ క్షితిమ్. ౨౨

టీక॥హనుమాన్ = హనుమంతుం;పరమక్రుద్ధః=మిక్కిలియుఁ గోపింపాఁడై; తరసా=వేగముచేత; ప్రధావన్=పరుగెత్తుచు; ఊరువేగేన=వేగముచేత; ద్రుమాన్= వృక్షప్రభంజన్=విఱుచుచు; చరణములచేత; క్షితిం=భూమిని; దారయత్(అదారయత్)= పగులఁజేసెను.

హనుమంతుండు,ఊరువేగంబునవృక్షంబులువిఱిగిపడఁ , బరమ కుపితుండై,పాదఘాతంబున భూమిపగుల,వేగంబునంబోయెను. అని, తాత్పర్యము.

గజాంశ్చ సగజారోహాన్ సరథాన్ రథినస్తదా
జఘాన హనుమాన్ ధీమాన్ రాక్షసాంశ్చ పదాతిగాన్. ౨౩

టీక॥ తదా=అప్పుడు ; ధీమాన్=బుద్ధిమంతుండగు; హనుమాన్= హనుమంతుండు; సగజారోహాన్= మావటీలతోఁగూడిన; గజాంశ్చ= ఏనుంగులను; సరథాన్=రథములతోఁగూడిన; రథినః=రథికులను; పదాతిగాన్=కాల్వురయిన; రాక్షసాంశ్చ=రాక్షసులను; జఘాన=కొట్టెను.

అప్పుడు, బుద్ధిమంతుండగు హనుమంతుండు, ఆయాశ్వకర్ణవృక్షంబుచే, నేనుంగులను మావటీలను రథంబులను రథికులను గాలిబంటులను, ఇట్లు పెక్కురాక్షసులఁ జూర్ణముగావించెను.

అని, తాత్పర్యము.

తమంతక మివ క్రుద్ధం సమరే ప్రాణహారిణమ్
హనుమంత మభిప్రేక్ష్య రాక్షసా విప్రదుద్రువుః. ౨౪

టీక॥ సమరే=యుద్ధమునందు; ప్రాణహారిణం= ప్రాణములహరించుచున్నవాఁడును; క్రుద్ధం=కోపించిన ; అంతకమివ (స్థితం) = యమునివలెనున్నవాఁడునగు ; తం = ఆ ; హనుమంతం = హనుమంతుని ; అభిప్రేక్ష్య=చూచి; రాక్షసాః=రాక్షసులు; విప్రదుద్రువుః=పాఱిరి.

క్రుద్ధుండగు యమునికై వడినత్యుగ్రుండై, రాక్షసులప్రాణంబులు హరించుచున్నయా హనుమంతుం జూచి, రాక్షసులు భయంబునం బాఱిరి.

అని, తాత్పర్యము.

త మాపతంతం సంక్రుద్ధం రాక్షసానాం భయావహమ్
దదర్శాకంపనో వీర శ్చుక్రోధచ ననాదచ. ౨౫

టీక॥ వీరః = పరాక్రమశాలియగు; అకంపనః= అకంపనుఁడు; ఆపతంతం=వచ్చుచున్న; సంక్రుద్ధం= మిక్కిలి యుఁ గోపించినవాడును ; నాం=రాక్షసులకు; భయా యముఁగలిగించుచున్నవా

ఆహనుమంతుని; దదర్శ = చూచెను. చుక్రోధచ=కోపించెను. ననాదచ= అఱచెను.

పరాక్రమవంతుండగు నకంపనుండు, హనుమంతుండు కుపితుండై వచ్చుటయు రాక్షసులందఱు భయంబునం బాఱుటయుంజూచి, కోపంబు నొంది,సింహనాదముగావించెను.

అని, తాత్పర్యము.

స చతుర్దశభి ర్బాణైః శ్శితైర్దేహవిదారణైః
నిబిభేద హనూమంతం మహావీర్య మకంపనః. ౨౬

టీక॥ సః=ఆ;అకంపనః = అకంపనుఁడు;మహావీర్యం = అధికమయిన పరాక్రమముగల ; హనూమంతం= హనుమంతుని;శ్శితైః = కఱకులయినవియు;దేహవిదారణైః = దేహముభేదించునవియునగు ; చతుర్దశభిః = పదునాలుగు;బాణైః=బాణముల చేత; నిర్బిభేద=భేదించెను.

ఆయకంపనుండు, తీక్ష్ణంబులును మర్మభేదకంబులునగుపదునాలుగుబాణంబులచేత, మహాపరాక్రమశాలియగుహనుమంతుని,నొప్పించెను.

అని, తాత్పర్యము.

స తదా ప్రతివిద్ధస్తు బహ్వీభి శ్శరవృష్టిభిః
హనుమాన్ దదృశే వీరః ప్రరూఢఇవ సానుమాన్. ౨౭

॥వీరః= పరాక్రమశాలియగు; ౩,హనుమాన్ = హనుమంతుం దా=అప్పుడు;బహ్వీభిః = పె న;శరవృష్టిభిః= బాణవర్ష పతివిద్ధస్తు=కొట్టఁబడినవాఁ పరూఢః=మొలిచి నవృక్ష ానుమానివ= పర్వతము వలె,దదృశే=చూడఁబడెను.

మహాపరాక్రమశాలియగు నాహనుమంతుండు , అప్పుడు పెక్కుమార్లు బాణవర్షములచేనొప్పింపఁబడినవాఁడయ్యువృక్షంబులతోఁగూడిన పర్వతంబుకరణనిశ్చలుండైయుండెను.

అని, తాత్పర్యము.

విరరాజ మహాకాయో మహావీర్యో మహామనాః
పుష్పితాశోకసంకాశో విధూమఇవ పావకః. ౨౮

టీక॥ మహాకాయః= పెద్దమేనుగలవాఁడును; మహావీర్యః= అధికమయినపరాక్రమము గలవాఁడును ; మహామనాః= పూజ్యమయినమనస్సుగలవాఁడునగు; సః(అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు ; పుష్పితాశోకసంకాశః= పూచిన యశోకవృక్షముతో సమానుఁడై; విధూమః=పొగలేని; పావకఇవ= అగ్నిహోత్రమంబలె; విరరాజ= ప్రకాశించెను.

మహాకాయుండును మహాపరాక్రమశాలియు మహాధైర్యుండునగు నాహనుమంతుండు, పుష్పించినయశోకవృక్షమువలెర క్తవర్ణుండై, పొగలేకమండుచుండునగ్నిహోత్రముభంగిఁ, దేజరిల్లుచుండెను. అని, తాత్పర్యము.

తతోన్యం వృక్ష ముత్పాట్య కృత్వా వేగ మనుత్తమం
శిరస్య భిజఘానాశు రాక్షసేంద్ర మకంపనమ్. ౨౯

టీక॥ తతః = అంత; సః(అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు ; అన్యం=ఇతరమయిన; వృక్షం = చెట్టును; ఉత్పాట్య = పెల్లగించి; అనుత్తమం=తనకన్న శ్రేష్ఠములేని; వేగం=వేగమును; కృత్వా=చేసి; ఆశు= శీఘ్రముగా; రాక్షసేంద్రం=రాక్షసశ్రేష్ఠుఁడగు; అకంపనం=అకంపనుని; శిరసి= తలయందు; అభిజఘాన=కొట్టెను.

అంత, నాహనుమంతుండు, మఱియొకవృక్షముఁ బెకలించి , మహావేగముఁబూని, శీఘ్రంబున , రాక్షసోత్తముఁడగు నాయకంపనునిశిరస్సునం గొట్టెను. అని, తాత్పర్యము.

స వృక్షేణ హత స్తేన సక్రోధేన మహాత్మనా
రాక్షసో వానరేంద్రేణ పపాతచ మమారచ. ౩౦

టీక॥ సః=ఆ; రాక్షసః=అకంపనుఁడు; సక్రోధేన=కోపముతోఁగూడిన; మహాత్మనా= అధికమయినపరాక్రమముగల; వానరేంద్రేణ = వానరశ్రేష్ఠుఁడగు; తేన= ఆహనుమంతునిచేత; వృక్షేణ=చెట్టుచేత; హతః=కొ




డై; పపాత చ=పడెను. మమార చ=చచ్చెను.

ఆయకంపనుండు, మహాపరాక్రమశాలియగు నాహనుమంతునిచేఁ బరమకోపంబున, వృక్షంబుచే హతుండై, నేలంబడిమృతినొందెను.

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా నిహతం భూమౌ రాక్షసేంద్ర మకంపనమ్
వ్యథితా రాక్షసా స్సర్వే క్షితికంప ఇవ ద్రుమాః. ౩౧

టీక॥ రాక్షసాః= రాక్షసులు; సర్వే=అందఱును; భూమౌ= నేలయందు; నిహతం=కొట్టఁబడిన ; తం=ఆ; రాక్షసేంద్రం= రాక్షసశ్రేష్ఠుఁడగు; అకంపనం=అకంపనుని; దృష్ట్వా= చూచి; క్షితికంపే=భూకంపమునందు ; ద్రుమాఇవ = వృక్షములువలె; వ్యథితాః=పీడితులయిరి.

రాక్షసులందఱు , అట్లు రాక్షసశ్రేష్ఠుండగునకంపనుండు నిహతుండై నేలంబడుటనుజూచి, భూకంపముగలిగినప్పుడువృక్షములుచలించునట్లు,మిక్కిలియు దుఃఖితులయిరి. అని, తాత్పర్యము.

త్యక్తప్రహరణా స్సర్వే రాక్షసా స్తే పరాజితాః
లంకా మభియయు స్త్రస్తా వానరై స్తై రభిద్రుతాః. ౩౨

టీక॥ తే=ఆ; రాక్షసాః = రాక్షసులు; సర్వే=అందఱును; పరాజితాః=అపజయమునుబొందినవారలయి; త్యక్త ప్రహరణాః= విడువఁబడినయాయుధగారలయి; తైః=ఆ; వానరైః= చేత; అభిద్రుతాః=తఱుమఁబడి; త్రస్తాః=భయపడినవారలయి; లంకాం=లంకనుగూర్చి; అభియయుః=పోయిరి.

ఆ రాక్షసులందఱు, నట్లుపరాజయమునొంది, యావానరులువెంబడించితఱుమఁబరమభీతులయి, యాయుధంబులుపాఱవైచి,లంకకుంబరువెత్తిరి.

అని, తాత్పర్యము.

తే ముక్తకేశా స్సంభ్రాంతా భగ్నమానాః పరాజితాః
స్రవచ్ఛ్రమజలై రంగై శ్శ్వసంతో విప్రదుద్రువుః. ౩౩



టీక॥ తే=ఆరాక్షసులు; ముక్తకేశాః = విడువఁబడిన వెండ్రుకలుగలవారలయి; సంభ్రాంతాః=తొట్రుపాటునొందినవారలయి; భగ్నమానాః=భంగమునొందిన యహంకారముగలవారలయి; పరాజితాః=అపజయమునొందినవారలయి; స్రవచ్ఛ్రమజలైః=కాఱుచున్నచెమటనీళ్లుగల; అంగైః=అవయవములతో; శ్వసంతః=ఊర్పులువుచ్చుచు; విప్రదుద్రువుః=పాఱిరి.

ఆరాక్షసులు, తలవెరియఁబోసికొని, సంభ్రాంతులయి మానంబువిడిచి, పరాజితులయి, దేహమంతయుఁజెమటగాఱ, నూర్పులువుచ్చుచు, నతివేగంబున నంబరుగెత్తిరి. అని, తాత్పర్యము.

అన్యోన్యం ప్రమమంథు స్తే వివిశు ర్నగరం భయాత్
పృష్ఠత స్తే సుసమ్మూఢాః ప్రేక్షమాణా ముహుర్ముహుః. ౩౪

టీక॥ తే=ఆరాక్షసులు; సుసమ్మూఢాః= మిక్కిలియు మోహమునొందినవారలయి; అన్యోన్యం= ఒండొరులను; ప్రమమంథుః=కొట్టుకొనిరి. తే=ఆరాక్షసులు; భయాత్=భయమువలన; పృష్ఠతః = వెనుకను; ముహుర్ముహుః= మాటిమాటికి; ప్రేక్షమాణాః=చూచుచు; నగరం=పట్టణమును; వివిశుః=ప్రవేశించిరి.

ఆరాక్షసులు, పరాజయంబుగలుగుటంజేసి, మూఢులయి, యొండొరులం గొట్టుకొనుచు, భయంబున మాటిమాటికి వెనుకకుఁ దిరిగిచూచుచు, లంకాపురింబ్రవేశించిరి. అని, తాత్పర్యము.

తేషు లంకాం ప్రవిష్టేషు రాక్షసేషు మహాబలాః
సమేత్య హరయ స్సర్వే హనుమంత మపూజయన్. ౩౫

టీక॥ తేషు=ఆ; రాక్షసేషు= రాక్షసులు; లంకాం=లంకాపురిని ; ప్రవిష్టేషు= ప్రవేశించినవారలుకాఁగా ; మహాబలాః=అధికమయినబలముగల ; హరయః=వానరులు; సర్వే=అందఱు; సమేత్య=చేరి; హనుమంతం=హనుమంతుని ; అపూజయన్=పూజించిరి.

ఆరాక్షసులందఱు పిమ్మట, మహాబలశా

దలుంచెరి, హనుమంతునిఁబూజించిరి. అని, తాత్పర్యము.

సోపి ప్రహృష్ట స్తాన్ సర్వాన్ హరీన్ ప్రత్యభిపూజయత్
హనుమాన్ సత్త్వసంపన్నో యథార్హ మనుకూలతః. ౩౬

టీక॥ సత్త్వసంపన్నః = బలముతోఁగూడిన; సః = ఆ; హనుమానపి = హనుమంతుండును; ప్రహృష్టః = సంతోషించినవాఁడై; తాన్ = ఆ; హరీన్ = వానరులను; సర్వాన్ = అందఱను; యథార్హం = యథాయోగ్యముగా; అనుకూలతః = అనుకూలముగా; ప్రత్యభిపూజయత్ = బదులుపూజించెను.

బలసంపన్నుండగు హనుమంతుండు, సంతుష్టుండై, "మీసాహాయ్యంబుననే నాకుజయంబుగలిగినదిగాని వేఱుగాదు" అనుమొదలగుమాటలచే, నావానరుల నందఱను, యథాయోగ్యంబుగా, బదులుపూజించెను.

అని, తాత్పర్యము.

వినేదుశ్చ యథా ప్రాణం హరయో జితకాశినః
చకర్షుశ్చ పున స్తత్ర సప్రాణా నపి రాక్షసాన్. ౩౭

టీక॥ జితకాశినః = జయముచేఁబ్రకాశించునట్టి; హరయః = వానరులు; యథా ప్రాణం = తమబలమునతిక్రమింపక; వినేదుశ్చ = అఱచిరియు. పునః = మఱల; అచ్చటికి; సప్రాణాన్ = బలముకల; రాక్షసానపి = రాక్షసులను; చకర్షుశ్చ = ఈడ్చిరియు.

జయలక్ష్మీవిరాజమానులగువానరులు, హనుమంతుండకంపనుని వధించిన సంగతియెల్లరకుం దేటపడఁ, దమబలంబుకొలఁది, సింహనాదంబులుగావించిరి; ఆసింహనాదములకు, బలవంతులగు రాక్షసు లదరిపడిరి.

అని, తాత్పర్యము.

స వీరశోభా మభజ న్మహాకపి
స్సమేత్య రక్షాంసి నిహత్య మారుతిః
మహాసురం భీమ మమిత్ర నాశనం
జిత్త్వైవ విష్ణు ర్బలినం చమూముఖే. ౩౮

టీక॥ చమూముఖే = సేనాముఖమునందు; సః=ఆ; మారుతిః= వాయుపుత్రుండగు; మహాకపిః = హనుమంతుండు; సమేత్య=చేరి; రక్షాంసి = రాక్షసులను; నిహత్య = వధించి; భీమం= భయంకరుండును; అమిత్రనాశనం= శత్రువులనశింపఁజేయువాఁడును; బలినం=అధికమయిన బలముగలవాఁడునగు; మహాసురం=కైటభాసురుని; నిహత్య (అధ్యాహృతము)= వధించి; విష్ణుర్యథైవ = విష్ణుదేవుండువలె; వీరశోభాం=వీరలక్ష్మిః; అభజత్ = పొందెను.

వాయుదేవుని కుమారుండగు నా హనుమంతుండు, అట్లు రాక్షససంహారంబు గావించి, భయంకరుండును శత్రుసంహారకుండును మహాబలుండునగు కైటభాసురునివధించిన మహావిష్ణువుంబోలె, సేనాముఖంబున, వీరలక్ష్మివిరాజమానుండై యెంతయు వెలుంగుచుండెను. అని, తాత్పర్యము.

అపూజయన్ దేవగణా స్తదా కపిం
స్వయంచ రామోతిబలశ్చ లక్ష్మణః
తథైవ సుగ్రీవముఖాః ప్లవంగమా
విభీషణశ్చైవ మహాబల స్తథా. ౩౯

టీక॥ తదా=అప్పుడు; దేవగణాః= దేవసమూహములు; కపిం=హనుమంతుని; అపూజయన్=పూజించినవి. రామం=రాముండు; స్వయంచ=తానును; అపూజయత్ (అధ్యాహృతము)=పూజించెను. అతిబలః=అధికమయినబలముగల; లక్ష్మణశ్చ=లక్ష్మణుఁడును; అపూజయత్ (అధ్యాహృతము)= పూజించెను. తథైవ=అట్లె; సుగ్రీవముఖాః=సుగ్రీవుఁడు మొదలు గాఁగల; ప్లవంగమాః= వానరులు; అపూజయన్ (అధ్యాహృతము)=పూజించిరి. తథా=అట్లు; మహాబలః=అధికమయినబలముగల; విభీషణశ్చైవ = విభీషణుఁడును; అపూజయత్ (అధ్యాహృతము) = పూజించెను.

అప్పుడు, ఆహనుమంతుని, ఆ ఋనంబన్నియున్న దేవతలందఱు పూజించిరి; అట్లు రాముండును వలియగులక్ష్మణుండును సుగ్రీవుఁడు వానరవీరులును మహాబలుండును, హనుమంత

వించిరి. అని, తాత్పర్యము,

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, షట్పంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండషట్పంచాశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

సప్తపంచాశసర్గప్రారంభః.

అకంపనవధం శ్రుత్వా క్రుద్ధో వై రాక్షసేశ్వరః
కించి ద్దీనముఖ శ్చాపి సచివాం స్తా నుదైక్షత. ౧

టీక॥ రాక్షసేశ్వరః = రాక్షసులకుఁ బ్రభువయినరావణుఁడు; అకంపనవధం = అకంపనునివధమును; శ్రుత్వా = విని; క్రుద్ధః = కోపించినవాఁడై; "వై" అనునది పాదపూరణార్థము); చిత్ = కొంచెము; దీనముఖశ్చాపి = ఁమునొందినముఖముగలవాఁడునై; తాన్ = ఆ; సచివాన్ = మంత్రులను; ఉదైక్షత = చూచెను.

రాక్షసనాథుండగు రావణుండు, అకంపనుండు వధింపఁబడిన సంగతిని విని, కుపితుండై, కొంచెము దైన్యంబునుం బొంది, తనయొద్దనున్న మంత్రులం జూచెను. అని, తాత్పర్యము.

స తు ధ్యాత్వా ముహూర్తం తు మంత్రిభి స్సంవిచార్య చ
తతస్తు రావణః పూర్వదివసే రాక్షసాధిపః. ౨
పురీం పరియయౌ లంకాం సర్వాం గుల్మా నవేక్షితుమ్

అః; రాక్షసాధిపః = రాక్షసరాజుండగు; రావణస్తు = రావణుండు

ను;ముహూర్తకాలంతు= కొంచెముసేపు మాత్రము;ధాత్వా=ధ్యానించి;మంత్రిభిః=మంత్రులతో;సంవిచార్యచ=ఆలోచించియు;తతస్తు=అంతను;పూర్వదివసే = పూర్వాహ్ణమునందు;గుల్మాన్= సేనావ్యూహములను ; అవేక్షితుం= చూచుటకు;లంకాం = లంకయను;పురీం=పట్టణమును;సర్వాం=అంతను; పరియయౌ=సంచరించెను.

రాక్షసరాజుండగు రావణుండు , కొంచెముసేపు విచారమగ్నుండైయుండి,యంతమంత్రులతోనాలోచించి, పిమ్మటఁ బూర్వాహ్ణంబునలేచి, సేనావ్యూహంబులఁజూచుటకై , లంకయంతయుఁదిరిగెను.

అని, తాత్పర్యము.

తాం రాక్షసగణైః గుప్తాం గుల్మైః బహుభి రావృతామ్. ౩
దదర్శ నగరీం లంకాం పతాకాధ్వజమాలినీమ్

టీక॥సః(అధ్యాహృతము)= ఆరావణుఁడు;రాక్షసగణైః= రాక్షసులసమూహములచేత; గుప్తాం=రక్షింపఁబడినదియు; బహుభిః=పెక్కులయిన; గుల్మైః=సేనావ్యూహములచేత; ఆవృతాం = కప్పఁబడినదియు;పతాకాధ్వజమాలినీం=చిహ్నములువ్రాసినటెక్కెములయొక్కయు వట్టిటెక్కెములయొక్కయుఁబఙ్క్తులు గలదియునగు; తాం=ఆ;లంకాం = లంకయను;నగరీం=పట్టణమును;దదర్శ=చూచెను.

ఆరావణుఁడు,రాక్షససమూహంబులచేరక్షింపఁ బడుచున్నదియుఁ జెక్కు సేనా వ్యూహములతోఁ గూడినదియురాజ చిహ్నంబులువ్రాసిన టెక్కెములతోను వట్టిటెక్కెములతో ఒప్పుచున్నదియునగు, లంకాపురినయుంజూచెను. అని,తాత్పర్యము.

రుద్ధాంతు నగరీం దృష్ట్వా రావణో రాక్షసేశ్వరః. ౪
ఉవాచా మర్షితః కాలే ప్రహస్తం యుద్ధకోవిదమ్

టీక॥ రాక్షసేశ్వరః = రాక్షసులకుఁబ్రభువైన; రావణః= రావణుఁడు; రుద్ధాం= ముట్టడింపఁబడిన; నగరీం=లంకాపురిని; దృష్ట్వా=చూచినంతనే; అమర్షితః=కలే=యుక్తకాలమున

దం=యుద్ధంబులందుఁబండితుండగు ; ప్రహస్తం=ప్రహస్తునిగూర్చి; ఉవాచ=చెప్పెను.

రాక్షసరాజుండగు రావణుండు, లంకచుట్టునువానరులుముట్టడించియుండుటనుజూచి, కుపితుండై, సభామంటపమునకువచ్చి,యుద్ధంబునంబండితుండగుప్రహస్తుంజూచి, యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

పురస్యోపనివిష్టస్య సహసా పీడితస్య వా.౫
నాన్యయుద్ధాత్ప్రపశ్యామి మోక్షం యుద్ధవిశారద

టీక॥ యుద్ధవిశారద = యుద్ధమునందుఁ బండితుండవగు ప్రహస్తుఁడా! ఉపనివిష్టస్య=సమీపంబున శత్రుసైన్యనివేశంబుగలదియు;సహసా = తటాలున;పీడితస్యవా= పీడింపఁబడినదియునగు;పురస్య = పట్టణమునకు; మోక్షం=విడుదలను ; అన్యయుద్ధాత్= ఇతరులయుద్ధమువలన; నప్రపశ్యామి=; చూడను.

యుద్ధ పండితుండవగు ప్రహస్తుఁడా! శత్రుసైన్యంబులు తటాలునవచ్చి ముట్టడించిపీడింపుచుండుపట్టణమును విడిపించుటకు, ఇతరులెంత యుద్ధముచేసినను,అగునని,నాకుఁదోఁచదు.

అని, తాత్పర్యము.

అహంవా కుంభకర్ణోవా త్వంవా సేనాపతి ర్మమ. ౬
ఇంద్రజిద్వా నికుంభోవా వహేయు ర్భార మీదృశమ్

టీక॥ అహంవా=నేనుగాని ; కుంవా=కుంభకర్ణుండుగాని; మకర; సేనాపతిః= సేనాడవయిన; త్వంవా= నీవు ద్వా=ఇంద్రజిత్తుగాని ; కుంభుండుగాని ; ఈ రం=బరువును;వహేయుః=మోయుదురు.

ఇట్టికార్యమును, నేనుగాని, కుంభకర్ణుండుగాని, నాసేనానాయకుఁడవగునీవుగాని, యింద్రజిత్తుగానినికుంభుఁడుగాని, సాధింపవలెనుగాని, యితరులచేతఁగాదు.

అని, తాత్పర్యము.

స త్వం బల మత శ్శీఘ్ర మాదాయ పరిగృహ్యచ. ౭
విజయాయాభినిర్యాహి యత్ర సర్వే వనౌకసః

టీక॥ అతః=ఇందువలన; సః=అట్టి; త్వం=నీవు; శీఘ్రం=శీఘ్రముగా; బలం=సేనను; ఆదాయ=తీసికొని; పరిగృహ్య=వెంటఁబెట్టుకొని; యత్ర=ఎచ్చట; వనౌకసః=వానరులు; సర్వే=అందఱును; సంతి(అధ్యాహృతము)=ఉన్నారో; తత్ర(అధ్యాహృతము)=అచ్చటికి; విజయాయ=గెలుచుటకొఱకు; అభినిర్యాహి=వెడలుము.

ఇందువలన, నట్టిమహాబలసంపన్నుఁడవగునీవు, శీఘ్రంబున సేనను వెంటఁబెట్టుకొని, యావానరులుండుస్థలంబునకుఁబోయి, విజయంబునొందుము.

అని, తాత్పర్యము.

నిర్యాణాదేవ తే నూనం చపలా హరివాహినీ. ౮
నదతాం రాక్షసేంద్రాణాం శ్రుత్వా నాదం ద్రవిష్యతి

టీక॥ హరివాహినీ=వానరసేన; తే=నీయొక్క; నిర్యాణాదేవ=వెడలుటవలననె; చపలా=చలించినదై; నదతాం=అఱచుచున్న; రాక్షసేంద్రాణాం=రాక్షసశ్రేష్ఠులయొక్క; నాదం=ధ్వనిని; శ్రుత్వా=విని; ద్రవిష్యతి=పాఱఁగలదు.

నీవు, యుద్ధంబునకు వెడలినంతనె, చపలులగు నావానరులందఱు, రాక్షసోత్తములు గావించు సింహనాదధ్వనులనువిని, భయంబునంబాఱఁగలరు.

అని, తాత్పర్యము.

చపలా హ్యవినీతాశ్చ చలచిత్తాశ్చ వానరాః. ౯
న సహిష్యంతి తే నాదం సింహనాద మివ ద్విపాః

టీక॥ చపలాః=చంచలులును; అవినీతాశ్చ=శిక్షింపఁబడనివారలును; చలచిత్తాశ్చ=చంచలమయినమనస్సుగలవారలునగు; వానరాః=వానరులు; తే=నీయొక్క; నాదం=ధ్వనిని; ద్విపాః=ఏనుఁగులు; సింహనాదమివ=సింహముయొక్కధ్వనినివలె; నసహిష్యంతి=సహింపఁజాలరు.

ఏనుంగులు సింహగర్జనమునువినిస హింపంజాలనట్లు,చంచలులునుయుద్ధశి క్షలనొందనివారలునుజితస్థైర్యములే నివారలునగువానరులు, నీకంఠధ్వనిని,స హింపంజాలరు.

అని, తాత్పర్యము.

విద్రుతే చ బలే తస్మిన్ రామ స్సౌమిత్రిణా సహ. ౧౦

అవశ స్తే నిరాలంబః ప్రహస్త వశ మేష్యతి

టీక॥ ప్రహస్త = ప్రహస్తుఁడా! తస్మిన్=ఆ;బలే= వానరసేన; విద్రుతేచ=పరుగెత్తఁగానే; రామః = రాముఁడు;సౌమిత్రిణాసహ = లక్ష్మణునితోఁగూడ;అవశః = ప్రభుత్వములేనివాఁడై;నిరాలంబః = ఆధారములేనివాఁడై; తే=నీయొక్క; వశం = అధీనతను;ఏష్యతి=పొందఁగలఁడు.

ప్రహస్తుఁడా!అట్లువానరసేనయుం తయుఁబాఱిపోయినపిమ్మట, రాముండునులక్ష్మణుండును, "దమమాటవినువారలెవ్వరునులేమింజేసి, నిరాలంబులయి,నీచేతంజిక్కుదురు.

అని, తాత్పర్యము.

ఆపత్సంశయితా శ్రేయో నతు నిస్సంశయీ కృతా. ౧౧

టీక॥ సంశయితా = సందేహింపఁబడిన;ఆపత్=ఆపద;శ్రేయః = మేలు నిస్సంశయీకృతాతు = నిస్సందేహముగాఁ జేయఁబడిన యాపదమా;న(శ్రేయః)=మేలుగాదు.

...లతే , "యుద్ధముగావించిన ...మృననిశ్చయము లేదె ; మ... గలుగును; కావున , దా... ఁడుటయె మేలు" అని... ప్పుడు;మనమిప్పుడు , యుద్ధముగావింపకున్నను , శత్రువులుమనల వధింపకవిడువరు; కావున, యుద్ధంబుగావింపకున్న మరణంబుగలుగుట నిశ్చితము; యుద్ధంబుగావించినచో , మరణమేగలుగుననినిశ్చయములేదు ; కావున,యుద్ధముచేయకుండుటకన్న యుద్ధముసేయుటమంచిది.

అని, తాత్పర్యము-

...ోమానులోమంవా యద్వా నో మన్యసే హితమ్

టీక॥ ప్రతిలోమానులోమం వా=విరుద్ధమయిన దానిఁగాని యనుకూలమయినదానిఁగాని; యద్వా=దేనిఁగాని; త్వం (అధ్యాహృతము) = నీవు; మన్యసే=తలంతువో; తత్ (అధ్యాహృతము)=అది; నః=మాకు; హితం = ఇష్టము.

నేనిప్పుడు చెప్పినదానికి విరుద్ధముగఁగాని యనుకూలముగఁగాని, నీవేమని యభిప్రాయపడుచున్నావో, అది మాకుసమ్మతము; దానిఁ జెప్పుము. అని, రావణుఁడు, ప్రహస్తునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

రావణేనైవ ముక్తస్తు ప్రహస్తో వాహినీపతిః. ౧౨
రాక్షసేంద్ర మువాచేద మసురేంద్ర మివోశనా

టీక॥ వాహినీపతిః = సేనానాయకుఁడగు; ప్రహస్తః=ప్రహస్తుఁడు; రావణేన=రావణుని చేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనె; రాక్షసేంద్రం= రాక్షసేశ్వరుఁడగు రావణునిగూర్చి; ఉశనా = శుక్రుఁడు; అసురేంద్రమివ=అసురరాజునుగూర్చినవలె; ఇదం=ఈమాటను; ఉవాచ=చెప్పెను.

సేనానాయకుండగు ప్రహస్తుఁడు, రావణుండు చెప్పినమాటనువిని, శుక్రాచార్యుండు అసురరాజుతోఁ జెప్పినట్లు, రాక్షసరాజుండగు రావణునితో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రాజ న్మంత్రితపూర్వం నః కుశలైస్సహ మంత్రిభిః. ౧౩
వివాదశ్చాపి నో వృత్త స్సమవేక్ష్య పరస్పరమ్

టీక॥ రాజన్ = రాక్షసరాజుండవగు రావణుఁడా! ఇదం (అధ్యాహృతము)=ఇది; నః(అస్మాభిః)= మాచేత; కుశలైః=సమర్థులగు; మంత్రిభిస్సహ= మంత్రులతోఁగూడ; మంత్రితపూర్వం= మున్నాలోచింపఁబడినది. పరస్పరం= ఒండొరులను; సమవేక్ష్య=చూచి; నః=మాకు; వివాదశ్చాపి= వృత్తః=కలిగినది.

రాక్షసరాజుండవ
ఈసంగతి, మున్ను స
లతోఁగూడ నాలో

దా! దీనింగురించియె, మాకు, మతభేద ముగలిగి, జగడముగూడనైనది.

అని, తాత్పర్యము.

ప్రదానేనతు సీతాయా శ్శ్రేయో వ్యవసితం మయా. ౧౪
అప్రదానే పున ర్యుద్ధం దృష్ట మేత త్తథైవ నః

టీక॥ మయా = నాచేత; సీతాయాః = సీతయొక్క ; ప్రదానేనతు = ఇచ్చుటచేతమాత్రము; శ్రేయః = మేలు; వ్యవసితం = నిశ్చయింపఁబడినది. అప్రదానేపునః = ఇవ్వకుండుటయందుమాత్రము; యుద్ధం = యుద్ధము; స్యాత్ (అధ్యాహృతము) = కలుగును. ఏతత్ = ఇది; నః (అస్మాభిః) = మాచేత; తథైవ = అట్లె; దృష్టం = చూడఁబడినది.

సీతనిచ్చినచో మేలుగలుగునని నేను నిశ్చయించియేయుంటిని ; సీతనివ్వనిచో , యుద్ధంబుగలుగునను నీసంగతిమున్ను మాకుఁదెలిసినదే.

అని, తాత్పర్యము.

సోహం దానైశ్చ మానైశ్చ సతతం పూజిత స్త్వయా. ౧౫
సాంత్వైశ్చ వివిధైః కాలే కిం నకుర్యాం ప్రియం తవ

టీక॥ త్వయా = నీచేత; దానైశ్చ = ...చ్చుటలచేతను; మానైశ్చ = గౌరవిం... చేతను; వివిధైః = నానావిధ...న; సాంత్వైః = మంచిమాట... సతతం = ఎల్లప్పుడును ; పూ...ింపఁబడిన; సః = అట్టి... ; కాలే = యుక్తకాల...మందు; కిం = ఏమి; ప్రి... నకుర్యాం = చే...యను?

నీచేత, దానంబులను సమ్మాననంబులను సాంత్వవచనంబులను , నానావిధంబుల నెల్లప్పుడును బూజితుండగు నట్టినేను, కాలమువచ్చినప్పుడు , నీకుఁబ్రియంబగు కార్యమును దేనిఁజేయను? ఏదిగాని గావించెదను.

అని, తాత్పర్యము,

జీవితం రక్ష్యం పుత్రదారధనా నివా. ౧౬

త్వం పశ్య మాం జహిష్యంతం త్వదర్థే జీవితం యుధి

టీక॥ మే=నాకు; జీవితం= ప్రాణము; నరక్ష్యం=కాపాడదగినది గాదు. పుత్రదారధనానివా= కొడుకులు గాని భార్యగాని ధనములుగాని; నరక్ష్యాణి (అధ్యాహృతము) = రక్షింపదగినవికావు. త్వం=నీవు; త్వదర్థే= నీకొఱకు; యుధి = యుద్ధమునందు; జీవితం=ప్రాణమును; జహిష్యంతం = విడువగోరుచున్న; మాం= నన్ను; పశ్య=చూడుము.

నాకు, ప్రాణమును కొడుకులను భార్యలను ధనములను రక్షించుకొనవలసినదిలేదు; నీకార్యము గావించుట యొకటియె నాకుఁ గావలసినది; ఇదిగో నీకొఱకు యుద్ధమునందుఁ, ప్రాణమును గూడ విడువఁ గోరెదను జూడుము. అని, ప్రహస్తుఁడు, రావణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు భర్తారం రావణం వాహినీపతిః. ౧౭
ఉవాచేదం బలాధ్యక్షాన్ ప్రహస్తః పురతస్థ్సితాన్

టీక॥ వాహినీపతిః = సేనానాయకుఁడగు; ప్రహస్తః=ప్రహస్తుఁడు; భర్తారం=ప్రభువైన; రావణం= రావణునిగూర్చి; ఏవం= ఇట్లు; ఉక్త్వాతు= చెప్పినంతనె; పురతః= ముందట; స్థితాన్=ఉన్న; బలాధ్యక్షాన్= సేనాధ్యక్షులనుగూర్చి; ఇదం = ఈమాటను; ఉవాచ=చెప్పెను.

సేనానాయకుఁడగు ప్రహస్తుఁడు రాక్షసరాజుఁడగు రావణునితో నీప్రకారంబునం జెప్పి, తనముందటనున్న సేనాధ్యక్షులంజూచి, యీమాటఁ ... ప్పెను. అని, తాత్పర్యము.

సమానయత మే శీఘ్రం రాక్షసానాం మహద్బలమ్.

టీక॥ మే= నాయొక్క; రాక్షసానాం=రాక్షసులయొక్క; మహత్= గొప్పదగు; బలం = సైన్యమును; శీఘ్రం=శీఘ్రముగా; సమానయత = తెండు.

అనంతంబగు నా ... ఘ్రముగాఁ దీసికొ ... అని, తాత్పర ...

మద్బాణాశనివేగేన హతానాం చ రణాజిరే
అద్య తృప్యంతి మాంసాదాః పక్షిణః కాననౌకసామ్. ౧౯

టీక॥ అద్య = ఇప్పుడు; రణాజిరే = యుద్ధభూమియందు; మద్బాణాశనివేగేన = వజ్రాయుధములవంటి నాబాణములవేగముచేత; హతానాం = చంపఁబడినవారలగు; కాననౌకసాం = వానరులను, వానరులచేత ననుట; మాంసాదాః = మాంసమునుభక్షించునట్టి; పక్షిణః = పక్షులు; తృప్యంతి = తృప్తిఁబొందఁగలవు.

ఇప్పుడు, మాంసభక్షకంబులగు పక్షులు, యుద్ధభూమియందు, వజ్రములవంటినాబాణములచేవధింపఁబడినవానరులమాంసములను దనివిదీరదిని, తృప్తిఁబొందఁగలవు. అని, ప్రహస్తుండు సేనాధ్యక్షులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్తాస్తే ప్రహస్తేన బలాధ్యక్షాః కృతత్వరాః
బల ముద్యోజయామాసు స్తస్మిన్ రాక్షసమందిరే. ౨౦

టీక॥ తే = ఆ; బలాధ్యక్షాః = సేనాధ్యక్షులు; ప్రహస్తేన = ప్రహస్తునిచేత; ఇతి = అని; ఉక్తాః = చెప్పఁబడినవారలై; కృతత్వరాః = చేయఁబడినత్వరగలవారై; తస్మిన్ = ఆ; రాక్షసమందిరే = రాక్షసులకుగృహమయిన లంకానగరమునందు; బలం = సైన్యమును; ఉద్యోజయామాసుః = కూర్చిరి.

ఆసేనాధ్యక్షులు, ప్రహస్తుఁడుచెప్పినమాటనువిని, అతిత్వరగా, నాలంకానగరంబున, రాక్షససేనలంగూర్చిరి.

అని, తాత్పర్యము.

సా బభూవ ముహూర్తేన తిగ్మనానావిధాయుధైః
లంకా రాక్షసవీరైస్తైర్గజైరివ సమాకులా. ౨౧

లంకా = లంకాపురి; ముహూర్తేన = స్వల్పకాలముచేత; గజైః = ఏనుగులచేత వలెనున్న; తిగ్మనానావిధాయుధైః = తీక్ష్ణములయిన నానావిధాయుధములుగల; తైః = ఆ; రాక్షసవీరైః = రాక్షసవీరులచేత; స

మాకులా=నిండినది; బభూవ = అయ్యెను.

అంతముహూర్తమాత్రంబున, నాలంకాపురియంతయు, మత్తగజాకారులునుదీక్ష్ణములగు నానావిధాయుధంబులుధరించినవారలునగురాక్షసవీరులచే నిండినదయ్యె. అని, తాత్పర్యము.

హుతాశనం తర్పయతాం బ్రాహ్మణాంశ్చ నమస్యతామ్
ఆజ్యగంధప్రతివహ స్సురభి ర్మారుతో వవౌ. ౨౨

టీక॥ హుతాశనం=అగ్నిహోత్రమును; తర్పయతాం=తృప్తిపొందించువారలయొక్కయు; బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను; నమస్యతాంచ= పూజించువారలయొక్కయు ; ఆజ్యగంధప్రతివహః=నేతివాసననువహించునదియు; సురభిః= సుగంధముగలదియైనను; మారుతః=వాయువు; వవౌ=వీచెను.

అప్పుడు, రాక్షసవీరులు,అగ్నిహోత్రంబున జయావహంబులగు హోమంబులు సేయుటవలనను,బ్రాహ్మణుల గంధపుష్పాక్షతాదులఁబూజించుటవలనను, అచ్చటవాయువు , ఆజ్యగంధముతోను పుష్పాదిగంధముతోనుంగూడిమనోహరంబుగావీచినది.

అని, తాత్పర్యము.

స్రజశ్చ వివిధాకారా జగృహు స్త్వభిమంత్రితాః
సంగ్రామసజ్జా స్సంహృష్టా ధారయన్ రాక్షసా స్తదా

టీక॥ తదా= అప్పుడు; సంగ్రామసజ్జాః = యుద్ధసన్నద్ధులగు; రాక్షసాః=రాక్షసులు;సంహృష్టాస్తు =సంతోషించిన వారలై యె ; అభిమంత్రితాః=అభిమంత్రింపఁబడిన ; వివిధాకారాః= నానావిధములయినయాకారములుగల; స్రజశ్చ= పుష్పమాలికలను ; జగృహుః=తీసికొనిరి.

(అధ్యాహృతము)=ధరిం

అప్పుడు యుద్ధసన్నద్ధులు సంతుష్టులయి బగునటులనభిమంత్రి విధములయినపువ ధరించిరి.అని, తా

సధనుష్కాః కవచినో వేగా దాప్లుత్య రాక్షసాః
రావణం ప్రేక్ష్య రాజానం ప్రహస్తం పర్యవారయన్. ౨౪

టీక॥ సధనుష్కాః = ధనుస్సులతోఁగూడినవారలును; కవచినః = కవచములుగలవారలునగు ; రాక్షసాః = రాక్షసులు; వేగాత్ = వేగమువలన; ఆప్లుత్య = వచ్చి; రాజానం = రాక్షసనాథుఁడగు; రావణం = రావణుని; ప్రేక్ష్య = చూచి; ప్రహస్తం = ప్రహస్తుని; పర్యవారయన్ = పరివేష్టించిరి.

రాక్షసవీరులుధనుస్సులను గవచంబులనుధరియించి, రాక్షసరాజుఁడగు రావణునకభివందనంబుగావించి , ప్రహస్తునిం బరివేష్టించినిలిచిరి.

అని, తాత్పర్యము.

అథామంత్ర్యచ రాజానం భేరీ మాహత్య భైరవామ్
ఆరురోహ రథం దివ్యం ప్రహస్త స్సజ్జకల్పితమ్. ౨౫
హయై ర్మహాజవై ర్యుక్తం సమ్యక్సూతంసుసంయుతమ్
మహాజలద నిర్ఘోషం సాక్షా చ్చంద్రార్క భాస్వరమ్. ౨౬
ఉరగధ్వజదుర్ధర్షం సువరూథం స్వపస్కరమ్
సువర్ణ జాలసంయుక్తం ప్రహసంత మివ శ్రియా. ౨౭

టీక॥ అథ = అంతట; ప్రహస్తః = ప్రహస్తుఁడు; రాజానం = రాక్షసరాజుని రావణుని; ఆమంత్ర్యచ = వీడుకొని; భైరవాం = భయంకరమయిన; ... ఆహత్య = కొట్టించి; ... సజ్జకల్పితం = సి... బడినదియు ; మహాజ... వవేగముగల ; హ... యుక్తం = కూడి... = మంచిసారథి గలదియు; సుసంయుతం = చక్కఁగాఁ గట్టఁబడినదియు ; మహాజలదనిర్ఘోషం = మహామేఘముయొక్క ధ్వనివంటిధ్వనిగలదియు; సాక్షాచ్చంద్రార్కభాస్వరం = సాక్షా చ్చంద్రసూర్యులవలె వెలుంగుచున్నదియు ; ఉరగధ్వజదుర్ధర్షం = సర్పధ్వజముగలదియు నెదిరింప నలవిగానిదియు ; సువరూథం = మంచికప్పుగలదియు; స్వపస్కరం = మంచిచక్రములుగల

దియు; సువర్ణజాలసంయుక్తం= బంగారు కిటికీలతోఁ గూడినదియు; శ్రియా=కాంతిచేత; ప్రహసంతమివ (స్థితం)= పరిహసించుచున్నట్లున్నదియునగు; రథం=రథమును; ఆరురోహ= ఎక్కెను.

అంతఁ, బ్రహస్తుండు, రాక్షసరాజుడగు రావణునిచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై, భయంకరాకారంబగు భేరి నివాయింపఁ జేసి, దివ్యంబును యుద్ధసన్నద్ధంబుగా వింపంబడినదియు మహావేగంబులగు గుఱ్ఱములు పూన్చినదియు సమర్థుండగు సారథిగలదియు సుబద్ధసంధిబంధమునుమహా మేఘగర్జనమువంటి ధ్వని గలదియుఁ జంద్రసూర్యులుంబోలె వెలుంగుచుండునదియు సర్వధ్వజశోభితంబును దుర్ధర్షణంబును మంచికప్పుగలదియుఁ బకర్రని చక్రములుగలదియుఁ బంగారు కిటికీలతోఁ గూడి నదియుఁ గాంతిచే నితరరథాథర్ణంబులం జూచి పరిహసించుచున్నట్లు చూపట్టుచున్నదియు నగుమహారథము నారోహించెను.

అని, తాత్పర్యము.

తతస్తం రథమాస్థాయ రావణార్పితశాసనః
లంకాయా నిర్యయౌ తూర్ణం బలేన మహతా వృతః. ౨౮

టీక॥ తతః=అంత; సః=ఆప్రహస్తుఁడు; రావణార్పితశాసనః=రావణునిచేఁ జేయఁబడిన యాజ్ఞ గలవాఁడై; తం=ఆ; రథం=రథమును; ఆస్థాయ=అధిష్ఠించి; మహతా=గొప్పదగు; బలేన=సైన్యముచేత; వృతః= చుట్టఁబడినవాఁడై; తూర్ణం = శీఘ్రముగా; లంకాయాః=లంకాపురినుండి; నిర్యయౌ=వెడలెను.

అంత, నాప్రహస్తుండు, రావణునిచే నాజ్ఞాపింపఁబడినవాఁడై యా రథ మారోహించి, యనంతంబగు సైన్యముతోఁ గూడి, శీఘ్రంబుగ లంకాపురినుండి వెడలెను. అని, తాత్పర్యము.

తతో దుందుభినిర్ఘోషః పర్జన్యనినదోపమః
వాదిత్రాణాంచ నినదః పూరయన్నివ సాగరం
శుశ్రువే శంఖశబ్దశ్చ ప్రయాతే వాహినీపతౌ




టీక॥ తతః=అంత; వాహినీపతౌ=సేనానాయకుఁడగు ప్రహస్తుఁడు; ప్రయాతే=వెడలఁగా; సాగరం=సముద్రమును; పూరయన్నివ(స్థితః)= నిండించునట్లున్న; పర్జన్యనినదోపమః=మేఘధ్వనితోఁ బోలికగల; దుందుభినిర్ఘోషః=భేరీధ్వనియు; వాదిత్రాణాం=వాద్యముల యొక్క; నినదశ్చ = ధ్వనియు; శంఖశబ్దశ్చ=శంఖధ్వనియు; శుశ్రువే=వినఁబడినది.

అంతఁ, బ్రహస్తుండు వెడలునప్పుడు, మేఘగర్జనంబుఁబోలు భేరీధ్వనియు నానావిధవాద్యంబుల శబ్దమును శంఖధ్వనియు సముద్రంబు నుప్పొంగఁజేయునట్లు దిక్కులు నిండి చెలంగినవి.

అని, తాత్పర్యము.

నినదంత స్స్వరాన్ ఘోరాన్ రాక్షసా జగ్ము రగ్రతః. ౩౦
భీమరూపా మహాకాయాః ప్రహస్తస్య పురస్సరాః

టీక॥ ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క; పురస్సరాః=ముందునడచునట్టి; భీమరూపాః=భయంకరమయిన యాకారము గలవారలును; మహాకాయాః=పెద్దదేహము గలవారలునగు; రాక్షసాః=రాక్షసులు; ఘోరాన్=భయంకరముల ;స్వరాన్=ధ్వనులను; నినదంతః= ను; అగ్రతః=ముందట; జగ్ముః=పోయిరి.

ప్రహస్తపురస్సరులగు భయంకరాకారులును మహాకాయులునైన రాక్షసులు, భయంకరధ్వనిగలుగునట్లు, సింహనాదంబులు సేయుచుఁ, బ్రహస్తుని ముందటంబోయిరి.

అని, తాత్పర్యము.

నరాంతకః కుంభహను మహానాద స్సమున్నతః. ౩౧
పహస్తసచివా హ్యేతే నిర్యయుః పరివార్య తమ్

తకః= నరాంతకుఁడు; కుంభహనుండును; నాదుఁడును; సము ను; ప్రహస్త సచివాః = ప్రహస్తునిమంత్రులయిన; ఏతే=వీరలు; తం=ఆప్రహస్తుని; పరివార్య=పరివేష్టించి; నిర్యయుః=వెడలిరిగదా!



నరాంతకుండును కుంభహనుండును మహానాదుండును సమున్నతుండును ననునీప్రహస్తునిమంత్రులునలువురును, బహస్తునిం బరివేష్టించి, నడచిరి.

అని, తాత్పర్యము.

వ్యూఢేనైవ సుఘోరేణ పూర్వద్వారాత్స నిర్యయౌ. ౩౨
గజయూథనికాశేన బలేన మహతా వృతః

టీక॥ సః=ఆప్రహస్తుఁడు; సుఘోరేణ = మిక్కిలియు భయంకరమును; గజయూథనికాశేన= ఏనుంగులసమూహముతో సమానమయినదియు; వ్యూఢేనైవ = వ్యూహముదీర్పఁబడినదియు; మహతా=గొప్పదియునగు; బలేన=సైన్యముచేత; వృతః=చుట్టఁబడినవాఁడై; నిర్యయౌ= వెడలెను.

ఆప్రహస్తుండు, వ్యూహములుగాఁ దీర్పఁబడినదియు గజసమూహముతో సమానమయినదియు మహాభయంకరము నగుసమ్యక్సేనఁగూడి, యుద్ధంబునకు వెడలెను. అని, తాత్పర్యము.

సాగరప్రతిమౌఘేన వృతస్తేన బలేన సః. ౩౩
ప్రహస్తో నిర్యయౌ తూర్ణం కాలాంతకయమోపమః

టీక॥ కాలాంతకయమోపమః = ప్రళయకాలమునందు సమస్తమును నశింపఁజేయునట్టి యమునితోఁ బోలిక గలఁ; సః=ఆ; ప్రహస్తః = ప్రహస్తుఁడు; సాగరప్రతిమౌఘేన (సాగరౌఘప్రతిమేన)=సముద్రప్రవాహముతోఁ బోలికగల; తేన=ఆ; బలేన= సైన్యముచేత; వృతః= చుట్టఁబడినవాఁడై; తూర్ణం=శీఘ్రముగా; నిర్యయౌ = వెడలెను.

ప్రళయకాలమునందు సర్వప్రపంచమును నశింపఁజేసెడుయమునట్టియాప్రహస్తుండు, సముద్రప్రవాహంబువంటి యమ్మహాసైన్యంబుతో శీఘ్రంబునం బోయెను.

అని, తాత్పర్యము.

తస్య నిర్యాణఘోషేణ రాక్షసానాంచ నర్దతాం
లంకాయాం సర్వభూతాని వినేదుర్వికృతైః

స ౫౭




టీక॥ తస్య= ఆప్రహస్తునియొక్కయు;నదతాం=అఱచుచున్నట్టి; రాక్షసానాంచ= రాక్షసులయొక్కయు; నిర్యాణఘోషేణ = బయలువెడలుటయందలిధ్వనిచేత ; లంకాయాం = లంకయందు;సర్వభూతాని = సమస్తప్రాణులును;వికృతైః = వికారము నొందిన;స్వరైః=ధ్వనులతో;వినేదుః= అఱచినవి.

ఆప్రహస్తుడునుఆరాక్షసులునుప్రయాణకాలంబునంగావించినసింహనాదంబులధ్వనికి, లంకయందలిసమస్తజంతువులును భయపడి , వికృతస్వరంబుగా నఱచినవి.

అని, తాత్పర్యము.

వ్యభ్రమాకాశమావిశ్య మాంసశోణితభోజనాః. ౩౫
మండలాన్యపసవ్యాని ఖగాశ్చక్రూ రథం ప్రతి

టీక ॥ మాంసశోణితభోజనాః = మాంసమును నెత్తురును ఆహారముగాఁ గలు;ఖగాః=పక్షులు;వ్యభ్రం= మేఘములేని;ఆకాశం = ఆకాశమును; ఆవిశ్య=పొంది;రథంప్రతి= రథమునుగూర్చి అపసవ్యాని= ప్రదక్షిణములగు; మండలాని=చుట్టులను;చక్రుః = చేసినవి.

మాంసరక్తాహారంబులగుపక్షులు, మేఘరహితంబగు నాకాశంబునం జేరి, రథంబునకుఁ బ్రదక్షిణంబుగాఁజుట్టినవి.

అని, తాత్పర్యము.

వమంత్యః పావకజ్వాలా శ్శివా ఘోరా వవాశిరే. ౩౬

ఘోరాః = భయంకరము = నక్కలు; పావకజ్వా ...టలను ; వమంత్యః= ...రే= అఱచినవి.

నక్కలు , భయంకరాకారంబులై,నోటనగ్నిజ్వాలలుగ్రక్కుచు, నఱచినవి. అని, తాత్పర్యము.

...త్పపా తోల్కా వాయుశ్చ పరుషో వవౌ

... = ఆకాశంబుననుండి;ఉల్కా=కొఱవి;పపాత= ప

స ౫౭

డెను. వాయుశ్చ = గాలియు; పరుషః = కఠినమయి; వవౌ = వీచెను.

ఆకాశంబుననుండికొఱవికట్టియవం డి తేజస్సుపడెను; వాయువు పరుషముగా వీచెను.

అని, తాత్పర్యము.

అన్యోన్య మభిసంరబ్ధా గ్రహాశ్చ న చ కాశిరే. ౫౭

టీక॥ గ్రహాశ్చ = చంద్రసూర్యాదిగ్రహములును; అన్యోన్యం = ఒండొరులను; అభిసంరబ్ధాః = ఎదురొత్తిసినవై, నచకాశిరే = ప్రకాశింపవయ్యె.

చంద్రసూర్యాది గ్రహములునుబరస్పరము యుద్ధమునేయుచు, నెంతమాత్రము ప్రకాశింపకుండినవి.

అని, తాత్పర్యము.

మేఘాశ్చ ఖరనిర్ఘోషా రథస్యోపరి రక్షసః
వవృషూ రుధిరం చాస్య సిషిచుశ్చ పురస్సరాన్. ౫౮

టీక॥ మేఘాశ్చ = మేఘములును; ఖరనిర్ఘోషాః = కఠినములయినధ్వనిగలవై; రక్షసః = ప్రహస్తునియొక్క, రథస్యోపరి = రథముమీఁద; రుధిరంచ = నెత్తురునుగూడ; వవృషుః = కురిసినవి. అస్య = ఈప్రహస్తునియొక్క; పురస్సరాన్ = ముందునడచువారలను; సిషిచుః = తడిపినవి.

మేఘములు, కఠినముగా గర్జించుచు, వాప్రహస్తునిరథముమీఁద, నతనిముందునడచువారలుతడియునట్లు, నెత్తురువానగురిసినవి.

అని, తాత్పర్యము.

కేతుమూర్ధని గృధ్రోఽస్య నిలీనో దక్షిణాముఖః
తుద న్నుభయతః పార్శ్వం సమగ్రా మహరత్ప్ర

టీక॥ గృధ్రః = గద్ద; అస్య = ఈప్రహస్తునియొక్క; కేతుమూర్ధని = ధ్వజాగ్రమునందు; దక్షిణాముఖః = దక్షిణపుతట్టుముఖముగలదై; ఉభయతః పా ర్శ్వం = రెండుప్రక్కలు చు; నిలీనః = ... సమస్తమయిన ... అహరత్ = ...




గద్దయొక్కటి, ప్రహస్తునిధ్వజాగ్రం బునదక్షిణాభిముఖంబై వ్రాలి, రెడు రెక్కలు నుముడుక్కొనుచునిల చెను; దానింజూచి, ప్రహస్తుండుము ఖకాంతిహీనుండయిపోడి, వివర్ణముఖుం డయ్యె. అని, తాత్పర్యము.

సారథే ర్బహుశ శ్చాస్య సంగ్రామ మవగాహతః
ప్రతోదో న్యపత ద్ధస్తా త్సూతస్య హయసాదినః. ౪౦

టీ॥ అస్య=ఈప్రహస్తునియొక్క; బహుశః = పెక్కుమార్లు; సంగ్రామం=యుద్ధమును; అవగాహతః=ప్రవేశించినవాడును; సూతస్య = సూతకులంబునంబుట్టినవాడును; హయసాదినః=అశ్వగతిచక్కగా దెలిసినవాడునగు; సారథేః = సారథియొక్క; హస్తాత్=చేతినుండి; ప్రతోదః= మునికోల; న్యపతత్=పడెను.

పెక్కుమార్లు యుద్ధంబునందు సారథ్యముగావించి తేఱినవాడును తండ్రితాతలనాటనుండి సారథ్యముసేయుటయె జీవనముగాగలకులంబునం బుట్టుటచే సారథ్యంబున నతిసమర్థుండని చెప్పందగినవాడును అశ్వగతిశిక్షయందుం బండితుండునగునా ప్రహస్తుని సారథి చేతినుండి, మునికోల, పటాలున నేలంబడినది. అని, తాత్పర్యము.

నిర్వాణశ్రీశ్చ యాస్యాసీ ద్భాస్వరా వసుదుర్లభా
సా ననాశ ముహూర్తేన సమేచ స్ఖలితా హయాః. ౪౧

అస్య = ఈప్రహస్తునికి; భాస్వరా = ప్రకాశించున; వసుదుర్లభా = అష్టవసువుల కైనను దుర్లభమయినదగు; నిర్వాణశ్రీః = యుద్ధకాలమునందలి కాంతి; యా = ఏది; ఆసీత్ = కలిగియుండెనదో; సా = ఆ కాంతి; ముహూర్తేన = స్వల్పకాలముచేత; ననాశ = నశించెను; సమేచ= సమమయినప్రదేశమునందె; హయాః= గుఱ్ఱములు; స్ఖలితాః=జాఱిపడినవి.

బయలువెడలునప్పుడు, ప్రహస్తునికి, అష్టవసువులకునుంగూడ దుర్లభంబయి వెలుంగునట్టియే కాంతిగలిగియుండినదో, ఆకాంతి, ముహూర్తమాత్రంబుననశించి, ప్రహస్తుండు వివర్ణుండై నిరుత్సాహుండయ్యె; సమభూమియం

దేయతనిగట్టంబులు, జాఱిపడినవి. అని, తాత్పర్యము.

ప్రహస్తం త్వభినిర్యాంతం ప్రఖ్యాతబలపౌరుషమ్
యుధి నానాప్రహరణా కపిసేనా భ్యవర్తత. ౮౨

టీక॥ ప్రఖ్యాతబలపౌరుషం=ప్రసిద్ధములయిన బలపౌరుషంబులుగలవాఁడగు; అభినిర్యాంతం=యుద్ధంబునకువచ్చుచున్న; ప్రహస్తం=ప్రహస్తుని; దృష్ట్వా (అధ్యాహృతము)తు= చూచినంతనె; యుధి= యుద్ధమునందు; కపిసేనా= వానరసేన; నానాప్రహరణా= నానావిధములయాయుధములుగలదై; అభ్యవర్తత=ఎదురునిలిచెను.

ప్రఖ్యాతంబులగుబలపౌరుషంబులుగలప్రహస్తుఁడువచ్చుటఁజూచి, వానరసైనికులు, నానావిధాయుధంబులు ధరించి, యుద్ధంబునకెదురునిలిచిరి. అని, తాత్పర్యము.

అథ ఘోషస్సుతుములో హరీణాం సమజాయత
వృక్షా నారుజతాం చైవ గుర్వీ రాగృహ్ణతాం శిలాః. ౮౩

టీక॥ అథ=అంత; హరీణాం=వానరులు; వృక్షాన్=చెట్లులను; ఆరుజతాం చైవ= పెకలించుచుండఁగాను; గుర్వీః= పెద్దవైన; శిలాః = ఱాళ్లను; అగృహ్ణతాం=గ్రహించుచుండగాను; సుతుములః=మిక్కిలియుదొమ్మియయిన; ఘోషః=ధ్వని; సమజాయత=కలిగెను.

అంత, వానరులు, ఆయుధార్థమయి, వృక్షంబులం బెకలించుటకును గొప్పపెద్దఱాలఁదీయుటకును బగుమహాధ్వనికలిగినది. అని, తాత్పర్యము.

నదతాం రాక్షసానాంచ వానరాణాంచ గర్జ
ఉభే ప్రముదితే సైన్యే

టీక॥ నదతాం=అఱచుచున్న; రాక్షసానాం=రాక్షసులయొక్కయు; గర్జతాం=గర్జిం చ=వానరుల

ములు; ఉభే=రెండును; ప్రముదితే=సంతసించినవి.

రాక్షసులును వానరులును బరమకోలాహలంబున సింహనాదంబులు సేయుచునట్టిరువాఁగు సైన్యములును, సంతుష్టంబులయియుండినవి.

అని, తాత్పర్యము.

రక్షోగణవనౌకసామ్. ౪౪
వేగితానాం సమర్థానా మన్యోన్యవధకాంక్షిణామ్
పరస్పరం చాహ్వయతాం నినాద శ్శ్రూయతే మహాన్. ౪౫

టీక॥ వేగితానాం=వేగముగలవారలును; సమర్థానాం=గట్టివారును; అన్యోన్యవధకాంక్షిణాం=ఒండొరులనువధింపఁగోరువారలును; పరస్పరం చ=ఒండొరులను; ఆహ్వయతాం చ=పిలుచువారలునగు; రక్షోగణ వనౌకసాం=రాక్షససమూహములయొక్కయు వానరులయొక్కయు; మహాన్=గొప్పదగు; నినాదః=ధ్వని; శ్రూయతే=వినఁబడుచుండినది.

వేగవంతులును సమర్థులును ఒండొరులవధింపఁగోరువారలును ఒండొరులయుద్ధంబునకుఁజీరువారలునగు నానావర రాక్షసులమహాధ్వని, నింగిముట్టి, చెలంగినది. అని, తాత్పర్యము.

తతః ప్రహస్తః కపిరాజవాహినీ
మభిప్రతస్థే విజయాయ దుర్మతిః
వివృద్ధవేగాంచ వివేశ తాం చమూం
యథా ముమూర్షు శ్శలభో విభావసుమ్. ౪౬

...ంత; దుర్మతిః=దుష్ట...ః=ప్రహస్తుఁడు; క...పరరాజుఁడగును...చి; విజయా...పతస్థే=పో...యెను. వివృద్ధవేగాం=వృద్ధిఁబొందినవేగముగల; తాం=ఆ; చమూం=సేనను; ముమూర్షుః=చావఁగోరిన; శలభః=మిడుత; విభావసుం యథా=అగ్నిహోత్రమునువలె; వివేశచ=

ప్రవేశించెను.

అంత, దుష్టబుద్ధియగు ప్రహస్తుండు, విజయంబుపొందుటకై, వానరరాజుండగుసుగ్రీవునిసేనయొద్దకుఁబోయి, శలభం బగ్నిహోత్రమును బ్రవేశించునట్లు, అంతకంతకువృద్ధిఁ బొందుచుండువేగంబుగల యమ్మహాసేనం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, సప్తపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, యుద్ధకాండసప్తపంచాశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

అష్టపంచాశసర్గప్రారంభః.

తతః ప్రహస్తం నిర్యాంతం దృష్ట్వా భీమపరాక్రమమ్
ఉవాచ సస్మితం రామో విభీషణ మరిందమః. ౧

టీక॥ తతః=అంత; అరిందమః=శత్రువులనడంగఁదొక్కునట్టి; రామః=రాముఁడు; నిర్యాంతం=వెడలుచున్న; భీమపరాక్రమం= భయంకరమయినపరాక్రమముగల; ప్రహస్తం=ప్రహస్తుని; దృష్ట్వా=చూచి; సస్మితం=చిఱునగవుతోఁగూడునట్లు; విభీషణం=విభీషణునిగూర్చి; ఉవాచ=చెప్పె

అంత, శత్రువులనడంగనట్టిరాముఁడు, భయంకడగు ప్రహస్తుండువచునగవుమోమునందనరచి, యిట్లని, ...
అని, తాత్పర

క ఏష సుమహాకాయో బలేన మహతా

ఆచక్ష్వ మే మహాబాహో వీర్యవంతం నిశాచరమ్. ౨

టీక॥ మహాబాహో = పెద్దచేతులుగలవిభీషణుఁడా! సుమహాకాయః = మిక్కిలియుఁ బెద్దదేహముగలవాఁడును; మహాత్మా = గొప్పదగు; బలేన = సైన్యముచేత; వృతః = చుట్టఁబడినవాఁడునగు; ఏషః = ఈరాక్షసుఁడు; కః = ఎవ్వఁడు? వీర్యవంతం = అధికమయిన పరాక్రమముగల; నిశాచరం = రాక్షసుని; మే = నాకొఱకు; ఆచక్ష్వ = చెప్పుము.

మహాబాహువుండవగువిభీషణుఁడా! మహాకాయుఁడగునీ రాక్షసుఁడు గొప్ప సేనంగూడివచ్చుచున్నాఁడు ; ఈతం డెవ్వఁడు ? ఇతండుమిక్కిలియుఁబరాక్రమంబుగలవాఁడనితోఁచుచున్నది ; ఇతనిం జెప్పుము. అని, రాముఁడు, విభీషణు నడిగెను. అని, తాత్పర్యము.

రాఘవస్య వచ శ్శ్రుత్వా ప్రత్యువాచ విభీషణః

టీక॥ విభీషణః = విభీషణుఁడు; రాఘవస్య = రామునియొక్క; వచః = మాట శ్రుత్వా = విని; ప్రత్యువాచ = బదులు ...

విభీషణుఁడు, రామునిమాటనువిని, యిట్లని, బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

ఏష సేనాపతి స్తస్య ప్రహస్తో నామ రాక్షసః. ౩

... ఈ; రాక్షసః = రాక్ష ... రావణునియొక్క; సే ... యకుఁడు; ప్రహస్తో ... ప్రసిద్ధుఁడు.

ఈరాక్షసుండు, రావణుని సేనానాయకుండు; ఇతనిపేరు ప్రహస్తుండు. అని, తాత్పర్యము.

రాక్షసేంద్రస్య త్రిభాగబలసంవృతః

... చ్ఛూరః ప్రఖ్యాతశ్చ పరాక్రమే. ౪

టీక॥ఏషః(అధ్యాహృతము)= ఈ ప్రహస్తుఁడు;లంకాయాం= లంకయం దు;రాక్షసేంద్రస్య= రాక్షసేశ్వరుఁడగు రావణునియొక్క;త్రిభాగబలసంవృతః=మూఁడవభాగము సైన్యముచేఁజుట్టఁబడినవాఁడు.వీర్యవాన్=అధికమయినబలముగలవాఁడు.అస్త్రవిత్=అస్త్రములఁదెలిసినవాఁడు.శూరః = యుద్ధమునందుభయములేనివాఁడు. పరాక్రమేచ= పరాక్రమమునందును; ప్రఖ్యాతః= ప్రసిద్ధుఁడు.

లంకయందు , రాక్షసరాజుండగు రావణుని సైన్యంబునందు మూఁడవభాగమీప్రహస్తుని యధీనముగానుండును; ఇతండుబలవంతుండు; అస్త్రంబులందెలిసినవాఁడు;శూరుండు;పరాక్రమంబునను బేరుపొందినవాఁడు. అని,విభీషణుండు రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తతః ప్రహస్తం నిర్యాంతం భీమం భీమపరాక్రమమ్
గర్జంతం సుమహాకాయం రాక్షసై రభిసంవృతమ్. ౫
దదర్శ మహతీ సేనా వానరాణాం బలీయసామ్
అతిసంజాతరోషాణాం ప్రహస్త మభిగర్జతామ్. ౬

టీక॥ తతః=అంత ; నిర్యాంతం= వచ్చుచున్నవాఁడును;భీమం = భయంకరుండును;భీమపరాక్రమం = భయంకరమయిన పరాక్రమముగలవాఁడును; గర్జంతం = అఱచుచున్నవాఁడును; సుమహాకాయం= మిక్కిలియు గొప్పదేహముగలవాఁడును;రాక్షసైః= రాక్షసులచేత; అభిసంవృతం = చుట్టఁబడినవాఁడునగు;ప్రహస్తం = ప్రహస్తుని;బలీయసాం = బలిష్ఠులును; అతిసంజాతరోషాణాం= అధికముగాఁ గలిగినకోపముగలవారలును ; ప్రహస్తం=ప్రహస్తునిగూర్చి ; అభిగర్జతాం=అఱచుచున్నవారలును వానరాణాం=వానరులయొక్క మహతీ=గొప్పదగు;సేనా = సేన; దదర్శ=చూచెను.

అంతట,దమసైన్యము ... రాక్షసుండును ... ముండును సింహ ... న్నవాఁడును ... రాక్షసవీర

స ౫౮




హస్తునింజూచి, బలవంతులగు వానర వీరులు, పరమకుపితులయి, ప్రహస్తుంజేరంగనిసింహనాదంబులు గావించిరి. అని, తాత్పర్యము.

ఖడ్గశక్త్యృష్టిబాణాశ్చ శూలాని ముసలానిచ
గదాశ్చ పరిఘాః ప్రాసావివిధాశ్చ పరశ్వధాః. ౭
ధనూంషిచ విచిత్రాణి రాక్షసానాం జయైషిణామ్
ప్రగృహీతా న్యశోభంత వానరా నభిధావతామ్. ౮

టీక ॥ వానరాన్ = వానరులను గూర్చి; అభిధావతాం = పరుగెత్తుచున్నవారలును; జయైషిణాం = జయముగోరువారలునగు; రాక్షసానాం = (తృతీయార్థమందుషష్ఠి) - రాక్షసులచేత; ప్రగృహీతాని = పట్టుకొనఁబడిన; ఖడ్గశక్త్యృష్టిబాణాశ్చ = కత్తులునుశక్తులునుఅష్టులనునాయుధములును బాణములును; శూలాని = శూలములు ; ముసలానిచ = రోఁకళ్లును ; గదాలును; పరిఘాశ్చ = గుదియ ... ప్రాసాః = ఈఁటెలును; వివిధములయిన ; పరశ్వధాశ్చ = గొడ్డళ్లును; విచిత్రాణి = నానావిధములయిన; ధనూంషిచ = విండ్లును; అశోభంత = ప్రకాశించినవి.

అప్పుడు, వానరులమీఁదికిఁబరుగెత్తుచుజయంబుగోరి యుద్ధంబునకుపక్రమించిన రాక్షసవీరులుధరించిన, ఖడ్గంబులుశక్తులు సష్టులుబాణంబులుశూలంబులుముసలంబులుగదలుఁబరిఘంబులుఁ బ్రాసంబులు నానావిధములయినపరశ్వధంబులు మొదలగు నాయుధంబులు, ఎంతయుంబ్రకాశించుచుండినవి.

అని, తాత్పర్యము.

వృక్షాః పాదపాంశ్చాపి పుష్పితాన్ వానరర్షభాః
... విపులా దీర్ఘాః యోద్ధుకామాః ప్లవంగమాః. ౯

... ః = వానరశ్రేష్ఠులు; యోద్ధుకోరినవారల యి; పుష్పితాన్ - పూచిన; పాదపాంశ్చాపి = వృక్షములను; విపులాః = విశాలములును; దీర్ఘాః = నిడుపులునగు; శిలా



శ్చ=తాళ్లను;జగృహుః=గ్రహించిరి.

వానరోత్తములు, యుద్ధంబుసే ... టకై, పుష్పితంబులగు వృక్షములనువిశాలంబులును దీర్ఘంబులునగు తాళ్లను పట్టుకొనసిలిచిరి. అని, తాత్పర్యము.

తేషా మన్యోన్య మాసాద్య సంగ్రామ స్సుమహా నభూత్
బహూనా మశ్మవృష్టించ శరవృష్టించ వర్షతామ్. ౧౧

టీక॥ అన్యోన్యం=ఒండొరులను; ఆసాద్య=చేరి;అశ్మవృష్టించ= తాళ్లవర్షమును;శరవృష్టించ=బాణవర్షమును;వర్షతాం=కురియుచున్న;బహూనాం=పెక్కండ్రయిన; తేషాం=ఆవానరరాక్షసులకు;సుమహాన్ = మిక్కిలి యుగ్రాప్పదగు;సంగ్రామః=యుద్ధము; అభూత్=అయినది.

అట్లు ఆవానరరాక్షసులు, ఒండొరులంగదిసి, శిలావర్షంబును బాణవర్షంబును గురియుచుం బెనంగనారంభింపుడు, బోరు ఘోరింబయ్యె.

అని, తాత్పర్యము.

బహవో రాక్షసా యుద్ధే బహూన్ వానరయూథపాన్
వానరా రాక్షసాంశ్చాపి నిజఘ్ను ర్బహవో బహూన్. ౧౨

టీక॥ యుద్ధే=యుద్ధమునందు;బహవః=పెక్కండ్రయిన; రాక్షసాః=రాక్షసులు; బహూన్=పెక్కండ్రయిన; వానరయూథపాన్= వానరవీరులను; బహవః=పెక్కండ్రయిన; వానరాః= వానరులను; రాక్షసాంశ్చాపి=రాక్షసులను;నిజఘ్నుః= వధించిరి.

అప్పుడు యుద్ధమునందు, పెక్కండ్రు వానరుల నరి;అట్లువానరు లనేకులు రాక్షసులవధించిరి. అని, తా

శూలైః ప్రమథితాః కేచి త్కేచిచ్చ పరమా
పరిఘై రాహతాః కేచి త్కేచి చ్ఛిన్నాః

టీక ॥ కేచిత్ = కొందఱువానరులు ; శూ

ప్రమథితాః = వధింపఁబడిరి. కేచి చ్ఛ=కొందఱును; పరమాయుద్ధైః=చక్రిములచేత; ప్రమథితాః(అధ్యాహృతము)= చంపఁబడిరి. కేచిత్=కొందఱు;పరిఘైః=ఇనుపగుదియలచేత; ఆహతాః=కొట్టఁబడిరి;కేచిత్ = కొందఱు; పరశ్వధైః = గొడ్డళ్లచేత ; ఛిన్నాః=నఱుకఁబడిరి.

వానరులుకొందఱు , రాక్షసులచే శూలంబులవధింపఁబడిరి ; కొందఱు చక్రములచేఁజంపఁబడిరి; కొందఱు పరిఘుంబులవధింపఁబడిరి; కొందఱు గొడ్డళ్లచే ఛేదింపఁబడిరి.

అని, తాత్పర్యము.

నిరుచ్ఛ్వాసాః కృతాః కేచి త్పతితా ధరణీతలే
విభిన్నహృదయాః కేచి దిషుసంధానసందితాః. ౧౩

టీక॥ కేచిత్=కొందఱు;నిరుచ్ఛ్వసాః = నిట్టూర్పులేనివారలుగా; కృతాః=చేయఁబడినవారలయి ; ధరణీతలే=నేలయందు; పతితాః= పడిరి. కేచిత్=కొందఱు; ఇషుసంధానసందితాః = బాణములనుత్రాళ్లచేఁగట్టఁబడినవారలయి; విభిన్నహృదయాః = పగిలినగుండెలుగలవారలు ;అభూవన్ (అధ్యాహృతము)=అయిరి.

కొందఱు, గతప్రాణులుగాఁ జేయఁబడినేలంబడిరి ; కొందఱు,బాణంబులచేఁగొట్టఁబడిన వారలయి గుండియలుపగిలి, ప్రాణంబులువిడిచిరి.

అని, తాత్పర్యము.

కేచి ద్ద్విధాకృతాః ఖడ్గైస్స్ఫురంతః పతితా భువి
వానరా రాక్షసైశ్శూలైః పార్శ్వతశ్చావదారితాః. ౧౪

=కొందఱు;వానరాః= సైః=రాక్షసులచేత; ద్విధా = రెండు ఁబడినవారలయి; భువి=నేలయం గాలైః=శూలములచేత;పార్శ్వతః=ప్రక్కలయందు;అవదారితాశ్చ=చీల్పబడినారును.

కొందఱువానరులు, రాక్షసులచే, ఖడ్గంబుల రెండుతునియలుగా ఖండింపంబడినవారలయి , మొగురుచు నేలంబడిరి; కొందఱువానరులు,పార్శ్వ

భాగంబుల శూలంబులచే విదారింపఁబడినవారలయి మృతిఁబొందిరి. అని, తాత్పర్యము

వానరై శ్చాపి సంక్రుద్ధై రాక్షసౌఘా స్సమంతతః
పాదపై గిరిశృంగై శ్చ సంపిష్టా వసుధాతలే. ౧౫

టీక॥ రాక్షసౌఘాశ్చాపి= రాక్షససమూహములును ; సమంతతః= అంతటను;సంక్రుద్ధైః=కోపంబునొందిన;వానరైః=వానరులచేత; వసుధాతలే=భూతలమునందు ; పాదపైః= వృక్షములచేతను; గిరిశృంగైశ్చ = పర్వతశిఖరములచేతను ; సంపిష్టాః= చూర్ణముగాఁజేయఁబడినవి.

అప్పుడు,వానరులును , బరమకుపితులయి, రాక్షసులను గుంపుగుంపుగా, వృక్షములచేతను బర్వతశిఖరంబులచేతనుజూర్ణముగావించి రూపుమాపిరి. అని, తాత్పర్యము.

వజ్రస్పర్శ తలై ర్హస్తై ర్ముష్టిభిశ్చ హతా భృశమ్
వేము శ్శోణిత మాస్యేభ్యో విశీర్ణదశ నేక్షణాః. ౧౬

టీక॥ కేచిత్ (అధ్యాహృతము)= కొందఱు రాక్షసులు ; వజ్రస్పర్శ తలైః= వజ్రముయొక్క తాఁకుడువంటితాఁకుడుగలయఱచేతులుగల ; హస్తైః=చేతులచేతను ; ముష్టిభిశ్చ= పిడికిళ్లచేతను;భృశం = మిక్కిలియు; హతాః= కొట్టఁబడినవారలయి ; విశీర్ణదశనేక్షణాః= రాలినపండ్లునుకన్నులునుగలవారలయి;ఆస్యేభ్యః= నోళ్లనుండి;శోణితం=నెత్తురును ; వేముః= క్రక్కిరి.

కొందఱు రాక్షసులు వజ్రస్పర్శంబులగు పిడికిళ్లచే బడి, దంతములును గ్రుడ్లును రాలఁ నోట నెత్తురు గ్రక్కిరి. అని, తాత్పర్యము

ఆర్తస్వనంచ స్వనతాం సింహనాదంచ
బభూవ తుముల శ్శబ్దో హరీణాం రక్ష

టీక॥ యుధి=యుద్ధమునందు; ఆర్తస్వనంచ=దుఃఖితధ్వనిని; స్వనతాం = చేయువారలును; సింహనాదంచ=సింహనాదమును; నదతాం=చేయువారలునగు; హరీణాం=వానరులయొక్కయు; రక్షసాం = రాక్షసులయొక్కయు; శబ్దః=ధ్వని; తుములః = దొడ్డదియైనది; బభూవ=అయ్యెను.

యుద్ధంబున వానరరాక్షసులు, కొందఱు దెబ్బదిన్నప్పుడు రోదనము సేయుచుఁ, గొందఱు జయమునొంది సింహనాదంబు సేయుచునుండిరి; ఆశబ్దంబు తుములంబై నింగిముట్టి చెలంగినది.

అని, తాత్పర్యము.

వానరా రాక్షసాః క్రుద్ధా వీరమార్గ మనువ్రతాః
వివృత్తనయనాః క్రూరా శ్చక్రుః కర్మా ణ్యభీతవత్. ౧౮

టీక॥ వానరాః=వానరులును; రాక్షసాః=రాక్షసులును; క్రుద్ధాః=కోపించినవారలయి; వీరమార్గం= వీరులమార్గమును; అనువ్రతాః = అనుసరించినవారలయి; వివృత్తనయనాః=తిరుగుచున్నకన్నులుగల వారలయి; క్రూరాః=క్రూరులయి; అభీతవత్ = భయములేనివారలయి; కర్మాణి=కార్యములను; చక్రుః=చేసిరి.

వానరులు రాక్షసులునందఱును, క్రుద్ధులయి, వీరమార్గంబుననుసరించి, కన్నులుగిఱగిఱందిరుగ భయంకరాకారులయి, నిర్భయంబుగా యుద్ధంబు గావించిరి. అని, తాత్పర్యము.

నరాంతకః కుంభహను ర్మహానాద స్సమున్నతః
తే ప్రహస్త సచివా స్సర్వే జఘ్ను ర్వనౌకసః. ౧౯

తకః= నరాంతకుఁడు; కుంభహనుండును; నాదుఁడును; సము ను; ప్రహస్త త్రులయిన; ఏ తే=అందఱు; జఘ్నుః= వధించిరి.

నరాంతకుండునుగుంభహనుండును మహానాదుండును సమున్నతుండును, ఈప్రహస్తమంత్రులునల్వురును, చెలరేఁగి, వానరులనానావిధంబులవధించిరి. అని, తాత్పర్యము.

తేషా మాపతతాం శీఘ్రం నిఘ్నతాంచాపి వానరాన్
ద్వివిదో గిరిశృంగేణ జఘానైకం నరాంతకమ్. ౨౦

టీక॥ తేషాం= ఆనరాంతకకుంభహానుమహానాదసమున్నతులు;శీఘ్రం=శీఘ్రముగా; ఆపతతాం=వచ్చుచు;వానరాన్ = వానరులను; నిఘ్నతాంచాపి=వధించుచునుండఁగా; ద్వివిదః=ద్వివిదుండు; గిరిశృంగేణ=పర్వతశిఖరముచేత;ఏకం=ఒకఁడైన ; నరాంతకం=నరాంతకుని; జఘాన=వధించెను.

ఆనరాంతకకుంభహానుమహానాదసమున్నతులట్లు , చెలరేఁగివానరులవధింపుచుండుటంజూచి, ద్వివిదుండు,పర్వతశిఖరముచే, వారలలోనరాంతకునొకనినివధించిపుచ్చెను.

అని, తాత్పర్యము.

దుర్ముఖః పున రుత్థాయ కపి స్స విపులద్రుమమ్
రాక్షసం క్షిప్రహస్తస్తు సమున్నత మపోథయత్. ౨౧

టీక॥ క్షిప్రహస్తః = శీఘ్రమయినహస్తవ్యాపారముగల;సః = ఆ;దుర్ముఖః=దుర్ముఖుఁడను; కపిస్తు=వానరుఁడును;పునః= మఱల; విపులద్రుమం=విశాలవృక్షమును ; ఉత్థాయ= పెఱికి;సమున్నతం = సమున్నతుండను;రాక్షసం= రాక్షసుని; అపోథయత్=చంపెను.

శీఘ్రముగాఁగార్యములు చేయుట్టిదుర్ముఖుండు , పెద్దవృక్షముకటిఁబెకలించి, సమున్నతుంసునివధించెను. అని, తాత్

జాంబవాంస్తు సుసంక్రుద్ధః ప్రగృహ్య మహతీం శి
పాతయామాస తేజస్వీ మహానాదస్య వక్షసి.

టీక॥ తేజస్వీ = అధికమయినపరాక్రమముగల;జాంబవాంస్తు = జాంబవంతుండును;సుసంక్రుద్ధః = మిక్కిలియుఁగోపించినవాఁడై ; మహతీం=గొప్పదగు;శిలాం ప్రగృహ్య=పట్టుకొని;మహానాదునియొక ... నందు ; పా

స ౫౮

సెను.

మహాపరాక్రమశాలియగు జాంబవంతుండుపరమకుపితుండై, పెద్దఱాయినొకటిఁదీసి, మహానాదునిఱొమ్ముపైవైవ, నతండు నేలంగూలెను.

అని, తాత్పర్యము.

అథ కుంభహను స్తత్ర తారేణా సాద్య వీర్యవాన్
వృక్షే ణాభిహతో మూర్ధ్ని ప్రాణాన్ సంత్యాజయ ద్రణే. ౨౩

టీక॥ అథ=అంత ; వీర్యవాన్=అధికమయినపరాక్రమముఁగల; కుంభహనుః=కుంభహనుండు; తత్ర=అప్పుడు; రణే=యుద్ధమునందు; తారేణ=తారునిచే; ఆసాద్య=సమీపించి; వృక్షేణ = చెట్టుచేత; మూర్ధ్ని=తలయందు ; అభిహతః=కొట్టఁబడినవాఁడై ; ప్రాణాన్ = ప్రాణములను ; సంత్యాజయత్(సమత్యజత్)=విడిచెను.

అంతఁ, బరాక్రమవంతుండగుకుంభహనుండు, తారునిచేవృక్షంబున శిరస్సునందుఁబ్రహరింపంబడినవాఁడై, నేలంబడి, ప్రాణంబులువిడిచెను.

అని, తాత్పర్యము.

అమృష్యమాణ స్తత్కర్మ ప్రహస్తో రథ మాస్థితః
చకార కదనం ఘోరం ధనుష్పాణి ర్వనౌకసామ్. ౨౪

' కం=రథమును; ఆస్థితః=అధి ... స్తః = ప్రహస్తుఁడు; ... =కార్యమును; అమృష్య ... ఁడై; ధనుష్పాణిః= ... ఁడై; వనౌకసాం= ... =భయంకరమయి ... ము; చకార = చేసెను.

ప్రహస్తుండునురథంబుననుండి, యిట్లు తనమంత్రులునల్వురును హతులగుటంజూచి, దానినోర్వంజాలక, ధనుర్ధరుండై, వానరులతో, భయంకరంబుగా యుద్ధముగావించెను.

అని, తాత్పర్యము.

సంజజ్ఞే ఉభయో స్సేనయో స్తదా
పమేయస్య సాగరస్యేవ నిస్స్వనః. ౨౫

టీక॥తదా=అప్పుడు;ఆవర్తే ఇవ= ప్రళయకాలమునందువలె; ఉభయోః= రెండైన; సేనయోః=సేనలకును;క్షుభితస్య=కలఁగినదియు; అప్రమేయస్య= కొలఁతపెట్టరానిదియునగు; సాగరస్యేవ=సముద్రమునకువలె;నిస్స్వనః=ధ్వని; సంజజ్ఞే=కలిగినది.

ప్రళయ కాలమునందప్రమేయంబగు సముద్రంబుప్పొంగునప్పుడు, కలుగు మహాధ్వనివలెఁ రెండు సేనలయందును, అయ్యుద్ధంబునంబుట్టిన, మహాధ్వనియు భయంకరంబై యొప్పినది.

అని, తాత్పర్యము.

మహతా హి శరౌఘేణ ప్రహస్తో యుద్ధకోవిదః
అర్దయామాస సంక్రుద్ధో వానరాన్ పరమాహవే. ౨౬

టీక॥యుద్ధకోవిదః = యుద్ధమునందుఁబండితుండగు;ప్రహస్తః = ప్రహస్తుఁడు; పరమాహవే=మహాయుద్ధమునందు;సంక్రుద్ధః= మిక్కిలియుఁగోపించినవాఁడై;మహతా = గొప్పదగు;శరౌఘేణ=బాణసమూహముచేత; వానరాన్ = వానరులను;అర్దయామాస=పీడించెను.

యుద్ధంబునందుఁ బండితుండగుప్రహస్తుండు,పరమకుపితుండై,యమ్మహాయుద్ధంబునందు,అసంఖ్యాంబుగాబాణంబులు ప్రయోగించి వానరులనొప్పిం ను. అని,తాత్పర్యము.

వానరాణాం శరీరైశ్చ రాక్షసానాంచ మేదినీ
బభూవ నిచితా ఘోరా పతితైరివ పర్వతైః

టీక॥ మేదినీ = భూమి; వానరాణాంచ=వానరులయొక్కయు; రాక్షసానాంచ=రాక్షసులయొక్కయు; శరీరైః=దేహములచేత ; పతితైః=పడిన; పర్వతైరివ=పర్వతములచేతవలె; నిచితా=వా ఘోరా=భయంక అయినది.

పర్వ సులశరీ

యుద్ధభూమియంతయు, భయంకరాకారంబయియుండినది.

అని, తాత్పర్యము,

సా మహీ రుధిరౌఘేణ ప్రచ్ఛన్నా సంప్రకాశతే
సంఛన్నా మాధవే మాసి పలాశై రివ పుష్పితైః. ౨౮

టీక॥ సా=ఆ; మహీ=భూమి; రుధిరౌఘేణ=నెత్తురుప్రవాహముచేత; ప్రచ్ఛన్నా=కప్పఁబడినదై; మాధవే=వైశాఖమను; మాసి=మాసమునందు; పుష్పితైః=పూచిన; పలాశైః= మోదుగుచెట్లచేత; సంఛన్నేవ= కప్పఁబడినదివలె; సంప్రకాశతే = ప్రకాశించుచుండినది.

ఆయుద్ధభూమియంతయు నెత్తురుచేనిండియుండుటవలన, నది, వసంతఋతువునందుఁ బుష్పించిన పలాశవృక్షంబులచేనిండినట్లు, ప్రకాశించుచుండినది.

అని, తాత్పర్యము.

హతవీరౌఘవప్రాంతు భగ్నాయుధమహాద్రుమామ్
శోణితౌఘమహాతోయాం యమసాగరగామినీమ్. ౨౯
యకృత్ప్లీహమహాపంకాం వినికీర్ణాంత్రశైవలామ్
భిన్నకాయశిరోమీనా మంగావయవశాద్వలామ్. ౩౦
గృధ్రహంసగణాకీర్ణాం కంకసారససేవితామ్
మేదఃఫేనసమాకీర్ణా మార్తస్తనితనిస్స్వనామ్. ౩౧
కాపురుషదుస్తారాం యుద్ధభూమిమయీం నదీమ్

ప్రాంతు= దం ... ల తె తీరములు ... ధమహాద్రు ... లె పెద్దవృ ... ఘమ

హాతోయాం=నెత్తురుప్రవాహమే యధికజలముగాఁగలదియు; యమసాగరగామినీం = యముఁడను సముద్రమును బొందునదియు; యకృత్ప్లీహమహాపంకాం=హృదయమునకుదక్షిణభాగమం

దును వామభాగమున నుండు మాంసము నెయధికమయిన బురదగాఁ గలదియు; విప్రకీర్ణాంత్రశైవలాం= వెదచల్లఁబడిన ప్రేగులె పాఁచిగాఁ గలదియు; భిన్నకాయశిరోమీనాం= ఛేదింపఁబడిన దేహములును శిరస్సులునె మత్స్యములు గాఁగలదియు; అంగావయవశాద్వలాం = దేహముయొక్క యవయవములె పచ్చిక గాఁగలదియు ; గృధ్రహంసగణాకీర్ణాం=గద్దలనుహంసపక్షులచే వ్యాపింపఁబడినదియు;కంకసారససేవితాం = రాపులుఁగులను సారసపక్షులచే సేవింపఁబడినదియు ; మేదఃఫేనసమాకీర్ణాం = మేదస్సను నురుఁగుచే వ్యాపింపఁబడినదియు ; ఆర్తస్తనితనిస్వనాం= పీడితులయొక్క ధ్వనులె ధ్వని గాఁగలదియు;కాపురుషదుస్తరాం=కుత్సితపురుషులచే దాఁటఁగూడనదియునగు; తాం=అట్టి ; యుద్ధభూమిమయీం= యుద్ధభూమి యను; నదీం= నదిని; తే (అధ్యాహృతము)=ఆవానరరాక్షసులు; ప్రావర్తయన్=ప్రవర్తింపఁజేసిరి.

హతులయిన యిరువాఁగుపీరులసమూహము లెతీరములుగాఁ గలదియు విఱిగినయాయుధములె తీరవృక్షములు గాఁగలదియు నెత్తురెజలము గాఁగలదియు యకృత్ప్లీహములనుమాంసములె యుసుకగాఁగలదియు, ప్రేవులె పాఁచితీఁగెలుగాఁగలదియు, తెగిపడిన దేహఖండములు శిరస్సులునె మత్స్యములుగాఁగలదియు గ్రక్కుమొదలగు నవయవంబులెపచ్చికగాఁ గలదియు గద్దలె హంసలుగాఁగలదియు పులుఁగులెసారసంబులుగాఁగలదియు మేదస్సెనురుఁగుగాఁగలదియు ఆర్తుల యాక్రందనమే ధ్వనిగాఁగలదియు యముండను సముద్రమునంగలయునదియు ; పిఱికిపందలకు దాఁటనలవిగానిదియునగు , యుద్ధభూమియను మహానదిని, అవ్వానరరాక్షసులు ప్రవహింపఁజేసిరి.

అని, తాత్పర్యము.

నదీ మివ ఘనాపాయే హంససారససేవితామ్. ౩౨
రాక్షసాః కపిముఖ్యాశ్చ తేరు స్తాం దుస్తరాం నదీమ్

టీక॥ రాక్షసాః = రాక్షసులును;కపిముఖ్యాశ్చ = వానరశ్రేష్ఠులును;దుస్తరాం=దాఁటఁగూడని;తాం = ఆ;నదీం=ఏటిని; ఘనాపాయే=శరదృతువునందు; హంససారససేవితాం=హంసలచేతనుసారసంబులచేతను సేవింపఁబ

డిన; నదీమివ=ఏటినివలె; తేరుః=దాఁటిరి.

రాక్షసులును వానరవీరులును, శరదృతువునందు హంససారసపక్షులతో నొప్పుచుండునదిని సులభంబుగాదాటునట్లు, దుస్తరంబగు నయ్యుద్ధభూమినదిని, దాఁటిరి. అని, తాత్పర్యము.

యథా పద్మరజోధ్వస్తాం నళినీం గజయూథపాః. ౩౩

టీక॥ తే(అధ్యాహృతము)=ఆరాక్షసవానరులు; పద్మరజోధ్వస్తాం=కమలములపరాగముచేఁజెడిన; నళినీం=తామరకొలనును; గజయూథపాయథా=ఏనుంగులసమూహమును బాలించునట్టి యేనుంగులువలె; తీర్త్వా=(అధ్యాహృతము)=దాఁటి; రక్తతనవః, అభూవన్ (అధ్యాహృతము)= ఎఱ్ఱని దేహముగలవారలయిరి.

మదపుటేనుంగులు, కమలములపరాగముపడియుండుటచే వర్ణాంతరము నొందిన తామరకొలంకుల దాఁటియెఱ్ఱని దేహముగలవగునట్లు, అవ్వానరరాక్షసులు, అయ్యుద్ధభూమిం దిగినట్టి, రక్తవర్ణములయిన దేహములుగలవారలయిరి. అని, తాత్పర్యము.

తత స్సృజంతం బాణౌఘాన్ ప్రహస్తం స్యందనేస్థితమ్
దదర్శ తరసా నీలో వినిఘ్నంతం ప్లవంగమాన్. ౩౪

టీక॥ తతః=అంత; నీలః = నీలుఁడు; స్యందనే= రథమునందు; స్థితం=ఉన్నవాఁడును; బాణౌఘాన్ = బాణసమూహమును; సృజంతం = విడుచుచున్నవాఁడును; తరసా = వేగముచేత; ప్లవంగమాన్=వానరులను ; వినిఘ్నంతం= వధించుచున్నవాఁడునగు; ప్రహస్తం=ప్రహస్తుని; దదర్శ= చూచెను.

అంత, నట్లురథగతుండై బాణంబులనేకంబులు ప్రయోగించుచు వానరులవధించుచున్న ప్రహస్తుని , నీలుండు చూచెను. అని, తాత్పర్యము.

ఉద్ధూత ఇవ వాయుః ఖే మహాదభ్రబలం బలాత్
సమీక్ష్యా భిద్రుతం యుద్ధే ప్రహస్తో వాహినీపతిః. ౩౫

రథే నాదిత్యవర్ణేన నీలమే వాభిదుద్రువే

టీక॥ వాహినీపతిః= సేనానాయకుఁడగు; ప్రహస్తః = ప్రహస్తుఁడు; ఖే=ఆకాశమునందు; ఉద్ధూతః = అధికమయిన; వాయుః = గాలి; మహత్=గొప్పదైన; అభ్రబలమివ = మేఘసమూహమునుగూర్చినవలె; యుద్ధే=యుద్ధమునందు; బలాత్ = బలిమివలన; అభిద్రుతం=ఎదురొర్కొనిన; నీలం=నీలుని; సమీక్ష్య=చూచి; ఆదిత్యవర్ణేన=సూర్యునియొక్క కాంతివంటికాంతిగల; రథేన= రథముచేత; నీలమేవ= నీలునిగూర్చియె; అభిదుద్రువే=పరుగెత్తెను.

సేనానాయకుఁడగు ప్రహస్తుండు, ఆకాశంబునను ద్ధూతంబగువాయువు మేఘసమూహంబుపై కడరునట్లుతనపైకడరిననీలుంజూచి, సూర్యప్రభంబగురథంబుతో, నానీలునిమీఁది కేపోయెను. అని, తాత్పర్యము.

స ధను ర్ధన్వినాం శ్రేష్ఠో వికృష్య పరమాహవే. ౩౮
నీలాయ వ్యసృజ ద్బాణాన్ ప్రహస్తో వాహినీపతిః

ధన్వినాం= విలుకాండ్రలో; [illegible]ముఁడగు; వాహినీపనాయకుఁడగు; సః = ఆ; ప్రహస్తుఁడు; ఆహవే= [illegible]; పరం= శ్రేష్ఠమయిన; [illegible]ని; వికృష్య = ఆకర్షించి; నీలాయ=నీలునికొఱకు; బాణాన్= బాణములను; వ్యసృజత్=విడిచెను.

ధనుర్ధరులలోనుత్తముఁడగు రాక్షససేనానాయకుఁడగు నాప్రహస్తుఁడు, ఉత్తమంబగుధనుస్సు నాకర్ణాంతమునాకర్షించి, నీలునిపైబాణంబులు ప్రయోగించెను. అని, తాత్పర్యము.

తే ప్రాప్య విశిఖా నీలం వినిర్భిద్య సమాహితాః. ౩౯
మహీం జగ్ము ర్మహావేగా రుషితా ఇవ పన్నగాః

టీక॥ మహావేగాః= అధికమయిన వేగముగలవియు; రుషితాః=కోపమునొందిన; పన్నగాఇవ(స్థితాః)= సర్పములువలెనున్నవియునగు; తే=ఆ; విశి

ఖాః=బాణములు ; సమాహితాః=ల క్ష్యముదప్పనివై ; నీలం= నీలుని; ప్రాప్య=పొంది; మహీం=భూమిని ; జగ్ముః=పొందినవి,

మహావేగంబులును కుపితంబులగు సర్పంబులువలె నతితీక్ష్ణంబులగు నాబాణంబులు, లక్ష్యంబుదప్పక , నీలునిదేహంబు, ప్రవేశించి, యావలికిఁబోయి భూమిం బ్రవేశించినవి.

అని, తాత్పర్యము.

నీల శ్శరై రభిహతో నిశితై ర్జ్వలనోపమైః ౩౭
స తం పరమదుర్ధర్ష మాపతంతం మహాకపిః
ప్రహస్తం తాడయామాస వృక్ష ముత్పాట్య వీర్యవాన్. ౩౮

టీక॥ వీర్యవాన్=అధికమయినపరాక్రమముగల; మహాకపిః=పెద్దవానరుఁడైన; సః=ఆ, నీలః=నీలుఁడు; నిశితైః=తీక్ష్ణములును; జ్వలనోపమైః=అగ్నిహోత్రములతోఁ బోలికఁగలవియునగు; శరైః=బాణములచేత; అభిహతః = కొట్టఁబడినవాఁడై; వృక్షం = చెట్టును; ఉత్పాట్య = పెల్లగించి; పరమదుర్ధర్షం = ఎంతమాత్రము ఎదిరింపనలవిగానివాఁడును; ఆపతంతం=వచ్చుచున్నవాఁడునగు; తం=ఆ; ప్రహస్తం=ప్రహస్తుని; తాడయామాస=కొట్టెను.

మహాపరాక్రమశాలియగు నా నీలుండు, అట్లుతీక్ష్ణంబులయిన, నిప్పువంటి బాణంబులం గొట్టఁబడినవాఁడైనొచ్చి, వృక్షమునొకటిఁ బెకలించి, నెదురు వచ్చుచున్న దుర్ధర్షు ప్రహరించెను. అని, తాత్ప

స తే నాభిహతః క్రుద్ధో నదన్ రాక్షసపుంగవః
వవర్ష శరవర్షాణి ప్లవంగానాం చమూపతౌ. ౪౦

టీక॥ రాక్షసపుంగవః=రాక్షసశ్రేష్ఠుండగు; సః=ఆప్రహస్తుఁడు; తేన=ఆ వృక్షముచేత; అభిహతః= కొట్టఁబడినవాఁడై; క్రుద్ధః = కోపించినవాఁడై; నదన్=అఱచుచు; ప్లవంగానాం=వానరులయొక్క; చమూపతౌ=సేనానాయకుఁడగు నీలునియందు; శరవర్షాణి=బాణవర్షములను; వవర్ష

రాక్షసశ్రేష్ఠుండగు నాప్రహస్తుండు, అట్లువృక్షంబునం గొట్టఁబడి కోపించి, సింహనాదంబు సేయుచు, వానరసేనానాయకుఁడగు నీలునిపై బాణవర్షంబులు గురిపించెను.

అని, తాత్పర్యము.

తస్య బాణ గణా న్ఘోరా న్రాక్షసస్య మహాబలః
అపారయ న్వారయితుం ప్రత్యగృహ్ణా న్నిమీలితః. ౪౧

టీక॥ మహాబలః= అధికమయినబలముగలనీలుఁడు; తస్య=ఆ; రాక్షసస్య=ప్రహస్తునియొక్క; ఘోరాన్ = భయంకరములయిన; బాణగణాన్=బాణసమూహములను ; వారయితుం = అడ్డగించుటకు; అపారయన్=చాలనివాఁడై; నిమీలితః=కనులుమూసికొన్నవాఁడై; ప్రత్యగృహ్ణాత్=స్వీకరించెను.

మహాబలశాలియగునీలుండు భయంకరాకారంబులగు నాప్రహస్తుని బాణసమూహంబులనివారింప నశక్తుండై, కన్నులుమూసికొని యన్నిటిని సహించుచుండెను. అని, తాత్పర్యము.

యథైవ గోవృషో వర్షం శారదం శీఘ్రమాగతమ్
ఏవమేవ ప్రహస్తస్య శరవర్షం దురాసదమ్. ౪౨
నిమీలితాక్ష స్సహసా నీల స్సేహే సుదారుణమ్

టీక॥ యథైవ=ఎట్లు ; గోవృషః= [illegible] శీఘ్రం=శీఘ్రముగా ; ఆగ [illegible] శ్రేష్ఠః= ఉత్త [illegible] =శరదృతువునం [illegible] తిః=సేనానా [illegible] తే(అధ్యా [illegible] ప్రహస్తః=ప్ర [illegible] = యుద్ధమునంద [illegible] ధనుః=వింటి [illegible] ప్రహస్తస్య యొక్క ; దురాసదం = చే [illegible] యు; సుదారుణం=మిక్కిలియుభయంకరమునకు; శరవర్షం=బాణములవానను; సహసా=శీఘ్రమునను; సేహే = సహించెను.

ఆఁబోతు , శరదృతువునందలివర్షంబును, ఎంతమాత్రముసరకుసేయ సహించునట్లు, నీలుండు . [illegible] ర్యము.

రోషిత శ్శరవర్షేణ సాలేన మహా [illegible] మహాన్. ౪౩
ప్రజఘాన హయా న్నీలః ప్రహస్తస్య మనోజవాన్




టీక॥ మహాన్ = గొప్పవాఁడగు ; నీలః = నీలుఁడు; శరవర్షేణ = బాణవర్షముచేత; రోషితః = కోపమునొందింపఁబడినవాఁడై; మహతా = గొప్పదగు; సాలేన = వృక్షముచేత ; ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క; మనోజవాన్ = మనస్సుయొక్క వేగమువంటి వేగముగల; హయాన్ = గుఱ్ఱములను; ప్రజఘాన = వధించెను.

మహాబలుండగు నీలుండు, ఆబాణవర్షంబునకుఁగోపించి, యొక్క మహావృక్షంబుగొని, మనోవేగంబులగు ప్రహస్తుని గుఱ్ఱంబులను వధించెను.

అని, తాత్పర్యము.

తత స్తచ్చాప ముద్గృహ్య ప్రహస్తస్య మహాబలః. ౪౪
బభంజ తరసా నీలో ననాద చ పునఃపునః

టీక॥ తతః = అంత ; మహాబలః = అధికమయినబలముగల; నీలః = నీలుఁడు ; ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క; తత్ = ఆ; చాపం = ధనుస్సును; ఉద్గృహ్య = పట్టుకొని; తరసా = వేగమున ; బభంజ = విఱిచెను. పునఃపునః = మాటిమాటికి; ననాద చ = అఱచెను.

అంత, మహాబల [illegible] వేగంబున, నా ప్రహ[illegible] నొడిసిపట్టుకొని, విఱి[illegible] మాటులు సింహనా[illegible]

అని, తాత్పర్యము.

విధనుస్తు కృత స్తేన [illegible]
[illegible] ప్లు[illegible]

[illegible] హానాయ [illegible] ; ప్రహస్తః = ప్రహస్తుఁడు; తేన = ఆనీలునిచేత; విధనుః = ధనుస్సులేనివాఁడు; కృతస్తు = చేయఁబడినవాఁడైనంతనె; ఘోరం = భయంకరమయిన; ముసలం = రోఁకలిని; ప్రగృహ్య = పట్టుకొని; స్యందనాత్ = రథంబుననుండి; అవప్లుప్లువే = డిగ్గె

[illegible] రాక్షససేనానాస్తుఁడు, అట్లునీలునిచే [illegible]ముఁడును విధనుష్కుండునుగావింపఁబడి, భయంకరంబగుముసలంబు చేతంగొని, రథంబుననుండి నేలకుఱికెను.

అని, తాత్పర్యము.




స ౫౮

తావుభౌ వాహినీముఖ్యౌ జాతవైరౌ తరస్వినౌ. ౪౬
స్థితౌ క్షతజదిగ్ధాంగౌ ప్రభిన్నావివ కుంజరౌ

టీక॥ వాహినీముఖ్యౌ=సేనానాయకులును; జాతవైరౌ=పుట్టినవైరముగలవారలును; తరస్వినౌ=బలవంతులును; క్షతజదిగ్ధాంగౌ=నెత్తురుచేఁబూయఁబడిన దేహము గలవారలునగు; తౌ=ఆనీలప్రహస్తులు; ఉభౌ=ఇద్దఱు; ప్రభిన్నౌ=మదించిన; కుంజరావివ=ఏనుంగులుంబోలె; స్థితౌ=నిలిచిరి.

పరస్పరబద్ధవైరులును బలవంతులును నెత్తుటందడిసిన దేహము గలవారలు నగు నా వానరరాక్షససేనానాయకులు నీలప్రహస్తులిద్దఱు, మదపుటేనుంగులుంబోలె నొండొరులం దాఁకి నిలిచిరి. అని, తాత్పర్యము.

ఉల్లిఖంతౌ సుతీక్ష్ణాభిర్దంష్ట్రాభిరితరేతరమ్. ౪౭
సింహశార్దూలసదృశౌ సింహశార్దూలచేష్టితౌ
విక్రాంతవిజయౌ వీరౌ సమరేష్వనివర్తినౌ. ౪౮
కాంక్షమాణౌ యశః ప్రాప్తుం వృత్రవాసవయోస్సమౌ

టీక॥ సింహశార్దూలసదృశౌ=[illegible]బోలిన; [illegible] శౌర్యవంతులును; [illegible] వచ్చిరి; [illegible] శార్దూలచేష్టితౌ=[illegible] దలి; [illegible] సింహశార్దూలములయొక్క చేష్టల [illegible] (వ్యాహృతము)=సహి[illegible]; విక్రాంత ఈప్రకారము [illegible]గ మీరిలితాత్కః= [illegible] పరాక్రమ[illegible] గల్గినవారలు; సమరేషు=యుద్ధములయందు; అని వర్తినౌ=మరలనివారలును; వృత్రవాసవయోః=వృత్రదేవేంద్రులకు; సమౌ=సరియయినవారలునగు; తౌ (అధ్యాహృతము)= ఆప్రహస్తుఁడును నీలుండును; సుతీక్ష్ణాభిః = మిక్కిలియుఁ గఱకులయిన; దంష్ట్రాభిః=కోఱలచేత; ఇతరేతరం=ఒండొరులను; ఉల్లిఖంతౌ=గీఱుకొనుచు; యశః=కీర్తిని; ప్రాప్తుం=పొందుటకు; కాంక్షమాణౌ=కోరుచు; స్థితౌ (అధ్యాహృతము)=నిలిచిరి.

సింహ[illegible]శార్దూలంబులఁ [illegible] జయంబు [illegible]లును వీరులును యుద్ధం[illegible]యనివారలును వృత్రాసుర దేవేంద్రులకు సరియయిన వారలు

నగు నా ప్రహస్తుండును నీలుండును, తీక్ష్ణంబులగు కోఱలచే, గోండుముల దేహంబున గాయంబులు వడఁబొడ్వఁబడ యంబుఁగొరికొంతదనక పుమల్లయుద్ధంబు గావించిరి. అని, తాత్పర్యము.

ఆజఘాన తదా నీలం లలాటే ముసలేన సః । ౪౯
ప్రహస్తః పరమాయత్తః తస్య సుస్రావ శోణితమ్

టీక॥ సః=ఆ; ప్రహస్తః=ప్రహస్తుఁడు; తదా=అప్పుడు; పరమాయత్తః=మిక్కిలియు సిద్ధుఁడై; ముసలేన=రోఁకలిచేత; నీలం=నీలుని; లలాటే=నొసటియందు; ఆజఘాన=కొట్టెను. తస్య=ఆ నీలునియొక్క; శోణితం=నెత్తురు; సుస్రావ=కాఱెను.

అప్పుడు, ప్రహస్తుండు, పరమవేగంబున, ముసలంబుచే నీలుని లలాట ప్రదేశంబున బ్రహరింప, నంతనుండి, రక్తంబు కాఱినది. అని, తాత్పర్యము.

తతశ్శోణితదిగ్ధాంగః ప్రగృహ్య సుమహాతరుమ్ । ౫౦
ప్రహస్తస్యోరసి క్రుద్ధో విససర్జ మహాకపిః

టీక॥ తతః=అంత; మహాకపిః=నీలుఁడు; శోణితదిగ్ధాంగః=నెత్తుటం బూయఁబడిన దేహము కలవాఁడై; క్రుద్ధః=కోపించినవాఁడై; సుమహాతరుం=మిక్కిలియు గొప్పవృక్షమును; ప్రగృహ్య=గ్రహించి; ప్రహస్తస్య=ప్రహస్తుని యొక్క; ఉరసి=ఱొమ్మునందు; విససర్జ=విడిచెను.

అంత, దేహంబంతయు నెత్తుటం దడియు, నీలుండు కోపించి, యొక మహావృక్షంబుగొని, ప్రహస్తునివక్షస్థలంబుపై, వేసెను. అని, తాత్పర్యము.

తమచింత్య ప్రహారం స ప్రగృహ్య ముసలం మహత్ । ౫౧
అభిదుద్రావ బలినం బలాన్నీలం ప్లవంగమమ్

టీక॥ సః=ఆ ప్రహస్తుఁడు; తం=ఆ; ప్రహారం=దెబ్బను; అచింత్య(అచింతయిత్వా)=తలంపక; మహత్=గొప్పదగు; ముసలం=రోఁకలిని; ప్రగృ

స ౫౮

టీక॥ తదా = అప్పుడు ; కపిముఖ్యేన = వానరశ్రేష్ఠుండగు; తేన = ఆనీలునిచేత; విముక్తా = విడువఁబడిన ; ఘోరా = భయంకరమయిన; మహతీ = గొప్పదగు; సా = ఆ, శిలా = ఱాయి; ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క; శిరః = తలను; బహుధా = పెక్కువ్రయ్యలు గా ; బిభేద = భేదించెను,

అప్పుడు, వానరశ్రేష్ఠుండగు నీలుండు వైచినభయంకరాకారంబగు నమ్మహాశిలచేఁ బ్రహస్తునితల , పెక్కువ్రక్కలయి రూపఱిపోయెను.

అని, తాత్పర్యము.

స గతాసుర్గతశ్రీకో గతసత్త్వో గతేంద్రియః. ౫౫
పపాత సహసా భూమౌ ఛిన్నమూల ఇవ ద్రుమః

టీక॥ సః = ఆప్రహస్తుఁడు ; గతాసుః = పోయినప్రాణములు గలవాఁడై; గతశ్రీకః = పోయినకాంతిగలవాఁడై; గతసత్త్వః = పోయినబలముగలవాఁడై; గతేంద్రియః = పోయినయింద్రియములుగలవాఁడై, ఛిన్నమూలః = నఱుకఁబడిన వేళ్లుగల; ద్రుమఇవ = వృక్షము వలె; సహసా = శీఘ్రమున; భూమౌ = నేలయందు; పపాత = పడెను.

ఆప్రహస్తుండు, కాంతియు బలంబు నానింద్రియంబులును నశించి, గతప్రాణుండై, నఱుకఁబడిన వేళ్లుగల వృక్షంబుకైవడి, కూలున నేలఁగూలెను.

అని, తాత్పర్యము.

ప్రభిన్నశిరస స్తస్య బహు సుస్రావ శోణితమ్. ౫౬
శరీరాదపి సుస్రావ గిరేః ప్రస్రవణం యథా

టీక॥ తస్య = ఆప్రహస్తునియొక్క; ప్రభిన్నశిరసః = పగిలినతలనుండియు; శరీరాదపి = దేహమునుండియు ; బహు = అధికమయిన; శోణితం = నెత్తురు; సుస్రావ = కాఱెను; [illegible] నుండి; ప్రస్రవణం యథా = సెలవలె; సుస్రావ = కాఱెను.

ఆప్రహస్తుని భిన్నంబగు శిరస్సుననుండియు దేహంబుననుండియు, పర్వతంబునుండి సెలయేఱు ప్రవహించునట్లు, అధికముగా నెత్తురు కాఱినది.

అని, తాత్పర్యము.

స ౫౮

హతే ప్రహస్తే నీలేన తదకంప్యం మహద్బలమ్. ౫౭
రక్షసా మప్రహృష్టానాం లంకా మభిజగామహ

టీక॥ నీలేన=నీలునిచేత; ప్రహస్తే=ప్రహస్తుఁడు; హతే = వధింపఁబడినవాఁడగుచుండఁగా; అప్రహృష్టానాం= సంతోషమునొందనట్టి, దుఃఖితులగు ననుట; రక్షసాం = రాక్షసులయొక్క; అకంప్యం=కదలింపరాని; బలం = సేన; లంకాం= లంకను ; అభిజగామ= పోయెను "హ"అనునది పాదపూరణార్థకము).

నీలుండు ప్రహస్తుని వధించినపిమ్మట, నంతవఱకు నప్రకంప్యులు గానుండిన నా రాక్షససైనికులందఱు, పరమదుఃఖితులయి, లంకకుఁబోయిరి,

అని, తాత్పర్యము.

న శేకు స్సమరే స్థాతుం నిహతే వాహినీపతౌ. ౫౮
సేతుబంధం సమాసాద్య విశీర్ణం సలిలం యథా

టీక॥ సమరే=యుద్ధమునందు; వాహినీపతౌ=సేనానాయకుఁడు; నిహతే=వధింపఁబడినవాఁడగుచుండఁగా; రాక్షసాః(అధ్యాహృతము) = రాక్షసులు; స్థాతుం=నిలుచుటకు; సేతుబంధం=అనకట్టను; సమాసాద్య=పొంది; విశీర్ణం=భగ్నమయిన; సలిలం యథా= జలమువలె; న శేకుః=చాలరైరి.

యుద్ధమున సేనానాయకుండు నిహతుండైనపిదప, జలంబనకట్టను దాఁకి యావలికిఁ బ్రవహింపఁజాలనట్లు, రాక్షసులు నిలువఁజాలరైరి.

అని, తాత్పర్యము.

హతే తస్మింశ్చమూముఖ్యే రాక్షసా[illegible]ద్యమాః. ౫౯

టీక॥ చమూముఖ్యే=సేనానాయకుఁడగు; తస్మిన్=ఆప్రహస్తుఁడు; హతే= వధింపఁబడినవాఁడగుచుండఁగా; తే=ఆ; రాక్షసాః=రా[illegible] [illegible]ద్యమాః=[illegible]వారలై; అభూవన్(అ[illegible]హృతము)=అయిరి.

రాక్షససేనానాయకుండగు ప్రహ[illegible] రాక్షస

సైనికులు, ఏమియుఁజేయఁజాలక యూరకుండిరి. అని, తాత్పర్యము.

రక్షఃపతిగృహం గత్వా ధ్యానమూకత్వమాస్థితాః
ప్రాప్తాః శోకార్ణవం తీవ్రం నిస్సంజ్ఞా ఇవ తేఽభవన్. ౬౦

టీక॥ తే=ఆరాక్షసులు; రక్షఃపతిగృహం=రావణునియింటికి; గత్వా=పోయి; ధ్యానమూకత్వం=చింతచే మూఁగవారగుటను; ఆస్థితాః=పొందినవారలయి; తీవ్రం=అధికమయిన; శోకార్ణవం=దుఃఖసముద్రమును; ప్రాప్తాః=పొందినవారలయి; నిస్సంజ్ఞాఇవ=తెలివిదప్పినవారలువలె; అభవన్=ఉండిరి.

ఆరాక్షసులు, రావణునియొద్దకుఁబోయి, చింతావశంబున, మూఁగలువలె నేమియు మాటలాడఁజాలక, దుఃఖసముద్రమగ్నులయి, మూర్ఛితులుంబోలె నుండిరి.

అని, తాత్పర్యము.

తతస్తు నీలో విజయీ మహాబలః
ప్రశస్యమానః స్వకృతేన కర్మణా
సమేత్య రామేణ సలక్ష్మణేన చ
ప్రహృష్టరూపస్తు బభూవ యూథపః. ౬౧

టీక॥ తతస్తు=అంతట; యూథపః=సేనాపతియు, విజయీ=జయముగలవాఁడును; మహాబలః=అధికమయినబలముగలవాఁడునగు; నీలస్తు=నీలుఁడును; సలక్ష్మణేన=లక్ష్మణునితోఁగూడిన; రామేణ=రామునితో; సమేత్యచ=చేరియు; స్వకృతేన=తనచేఁజేయఁబడిన; కర్మణా=కార్యముచేత; ప్రశస్యమానః=పొగడఁబడుచున్న— ప్రహృష్టరూపః=మిక్కిలియు సంతోషించినవాఁడు; బభూవ=అయ్యెను.

అంతట, మహాబలుండును జయశాలియునగు వానరవాహినీనాయకుండు నీలుండు, రామలక్ష్మణులం జేరి, తాను గావించినప్రహస్తవధంబునకు, యందఱిచేతను బ్రశంసింపఁబడుచుఁ, బరమసంతోషంబున నుండెను.

తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
యుద్ధకాండే, అష్టపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇతి, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, యుద్ధకాండాష్టపంచాశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

ఏకోనషష్టితమసర్గప్రారంభః.

తస్మిన్ హతే రాక్షససైన్యపాలే
ప్లవంగమానా మృషభేణ యుద్ధే
భీమాయుధం సాగరతుల్యవేగం
విదుద్రువే రాక్షసరాజసైన్యమ్. ౧

టీ॥ యుద్ధే=యుద్ధమునందు; ప్లవంగమానాం = వానరులలో; ఋషభేణ=శ్రేష్ఠుండగు నీలునిచేత; రాక్షససైన్యపాలే=రాక్షససేనను బాలించునట్టి; తస్మిన్=ఆప్రహస్తుండు; హతే=చంపఁబడఁగా; భీమాయుధం= భయంకరములయిన యాయుధములు గలదియు; సాగరతుల్యవేగం= సముద్రముతోసమానమయిన వేగముగలదియునగు; రాక్షసరాజసైన్యం = రాక్షసులకుఁ బ్రభువైన రావణునిసేన; విదుద్రువే=పరుగెత్తినది.

వానరవరిష్ఠుండగు నీలునిచే రాక్షససేనాపాలకుఁడయిన ప్రహస్తుండు నిహతుండయిన పిదప, భయంకరములయిన యాయుధములుగలదియు సముద్రమునకుంబోలె మహావేగంబుగలదియునగు నారాక్షససేన, లంకకుఁబరుగెత్తినది.

అని, తాత్పర్యము.

గత్వాథ రక్షోధిపతే శ్శశంసు

సేనాపతిం పావకసూనుశస్తమ్
తచ్చాపి తేషాం వచనం నిశమ్య
రక్షోధిపః క్రోధవశం జగామ. ౨

టీక॥ అథ=అంత ; తే(అధ్యాహృతము)=ఆ రాక్షసులు; గత్వా=పోయి; రక్షోధిపతేః=రాక్షసరాజుండగు రావణునకు; సేనాపతిం=సేనానాయకుండగు ప్రహస్తుని; పావకసూనుశస్తం=అగ్నికొడుకైన నీలునిచేవధింపఁబడిన వానిఁగా; శశంసుః=చెప్పిరి. రక్షోధిపః=రావణుఁడు; తత్=ఆ; తేషాం=వారలయొక్క; వచనంచాపి=మాటను; నిశమ్య=విని; క్రోధవశం=కోపముయొక్కయధీనతను; జగామ=పొందెను.

అంత, నారాక్షసులుపోయి, రావణునకు, "సేనానాయకుండగు ప్రహస్తుండు, నీలునిచేనిహతుండయ్యె" నని విన్నవింప, నారాక్షసరాజు, వారల మాటనువిని, కోపంబునొందెను.

అని, తాత్పర్యము.

సంఖ్యే ప్రహస్తం నిహతం నిశమ్య
శోకార్దితః క్రోధపరీతచేతాః
ఉవాచ తాన్ నైరృతయోధముఖ్యా
నింద్రో యథా చామరయోధముఖ్యాన్. ౩

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరావణుఁడు; ప్రహస్తం=ప్రహస్తుని; సంఖ్యే=యుద్ధమునందు; నిహతం=వధింపఁబడినవానిఁగా; నిశమ్య= విని; శోకార్దితః=దుఃఖముచేఁ బీడింపఁబడినవాఁడై; క్రోధపరీతచేతాః= కోపంబుచేఁ వ్యాపింపఁబడిన మనస్సుగలవాఁడై ; తాన్=ఆ; నైరృతయోధముఖ్యాన్ =రాక్షసయోధశ్రేష్ఠులనుగూర్చి ; ఇంద్రః=ఇంద్రుఁడు; అమరయోధముఖ్యాన్యథా= దేవయోధశ్రేష్ఠులనుగూర్చి వలె; ఉవాచ=చెప్పెను.

ఆరావణుఁడు, ప్రహస్తుండుయుద్ధంబుననిహతుండగుటనువిని, శోకక్రోధంబులుమనంబునఁబెనఁగొన, సమీపంబుననుండురాక్షసోత్తములంజూచి, దేవోత్తములకింద్రుండుచెప్పునట్లు, ఇట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

నావజ్ఞా రిపవే కార్యా మైరింద్రబలసూదనః
సూదిత స్సైన్యపాలో మే సానుయాత్ర స్సకుంజరః. ౪

టీక॥ మైః=ఎవ్వరిచేత ; ఇంద్రబలసూదనః = దేవేంద్రునిసేననువధించునట్టి; సానుయాత్రః = అనుచరులతోఁగూడినవాఁడును;సకుంజరః = ఏనుంగులతోఁగూడినవాఁడునగు ; మే= నాయొక్క; సైన్యపాలః= సేనానాయకుండగుప్రహస్తుఁడు;సూదితః= వధింపఁబడినాఁడో;స్సై (అథ్యాహృతము)=అట్టి;రిపవే (రిపుభ్యః)= శత్రువులకొఱకు;అవజ్ఞా=అవమానము; న కార్యా=చేయఁదగినదికాదు.

దేవేంద్రునిబలంబునువధించునట్టినా సేనానాయకుని సపరివారంబుగాఁబొంగొన్నట్టిమనశత్రువులు , వానరులను బుద్ధిచే, స్వల్పముగాఁదలంపఁదగినవారలుకారు. అని, తాత్పర్యము.

సోహం రిపువినాశాయ విజయాయాఽవిచారయన్
స్వయమేవ గమిష్యామి రణశీర్షం తదద్భుతమ్. ౫

టీక॥ సః=అట్టి;అహం=నేను; అవిచారయన్= ఆలోచింపనివాఁడనై ; రిపువినాశాయ = శత్రువులనాశము కొఱకును; విజయాయ = గెలుపుకొఱకును;స్వయమేవ=నేనే;తత్ = ఆ; అద్భుతం = ఆశ్చర్యకరమగు; రణశీర్షం=యుద్ధశిరస్సును; గమిష్యామి = పొందెదను.

నేనింకనాలోచింపను ; నేనెశత్రువులనువధించి విజయంబుఁజేకొనుటకై యల్పులచేఁబబలులు వధింపఁబడుటచే నాశ్చర్యకరము గానుండునట్టి యాయుద్ధంబునకుఁబోయెదను.

అని, తాత్పర్యము.

అద్య త ద్వానరానీకం రామంచ సహలక్ష్మణమ్
నిర్దహిష్యామి బాణౌఘై ర్వనం దీప్తై రివాగ్నిభిః. ౬

టీక॥ అద్య=ఇప్పుడు;వనం = అడవిని;దీప్తైః= మండుచున్న;అగ్నిభిరివ=నిప్పులచేతవలె;తత్ = ఆ;వానరానీకం=వానరసేనను;సలక్ష్మణం= లక్ష్మ

ణునితోఁగూడిన; రామంచ= రాముని; బాణౌఘైః = బాణముల సమూహములచేత; నిర్దహిష్యామి= దహించెదను.

ఇప్పుడు, కార్చిచ్చు వనంబును దహించునట్లు, బాణంబులచే, నారామలక్ష్మణులను వానరసేన నంతయు దహించెదను. అని, తాత్పర్యము.

స ఏవ ముక్త్వా జ్వలనప్రకాశం
రథం తురంగోత్తమరాజయుక్తమ్
ప్రకాశమానం వపుషా జ్వలంతమ్
సమారురోహామరరాజశత్రుః ॥ ౨

టీక॥ అమరరాజశత్రుః= దేవేంద్రుని శత్రువయిన; సః= ఆ రావణుండు; ఏవం= ఇట్లు; ఉక్త్వా= చెప్పి; జ్వలనప్రకాశం= అగ్నియొక్క ప్రకాశమువంటి ప్రకాశముగలదియు; తురంగోత్తమరాజయుక్తం= గుఱ్ఱములలో మిక్కిలి యుత్తమములగు వానితోఁగూడినదియు; ప్రకాశమానం= అలంకారములచేఁ బ్రకాశించుచున్నదియును; వపుషా = దేహముచేత; జ్వలంతం= ప్రకాశించుచున్నదియునగు; రథం= రథమును; సమారురోహ= ఎక్కెను.

దేవేంద్రశత్రుండగు రావణుండు, ఈప్రకారమునం జెప్పి, అగ్నింబోలెఁ దేజస్సు గలదియు నుత్తమాశ్వంబులు పూన్చినదియు నలంకారంబులచేతను స్వరూపముచేతను బ్రకాశించుచున్నదియునగు రథము నారోహించెను.

అని, తాత్పర్యము.

స శంఖభేరీపణవప్రణాదై
రాస్ఫోటితక్ష్వేళితసింహనాదైః
పుణ్యైః స్తవైశ్చాప్యభిపూజ్యమాన
స్తదా యయౌ రాక్షసరాజముఖ్యః ॥ ౩

టీక॥ తదా= అప్పుడు; రాక్షసరాజముఖ్యః= రాక్షసరాజులలో శ్రేష్ఠుండగు; సః= ఆ రావణుండు; శంఖభేరీపణవప్రణాదైః= శంఖములయొక్కయు

 

భేరులయొక్కయు నుదుకుల యొక్కయు ధ్వనులచేతను; ఆస్ఫోటితక్ష్వేళిత సింహనాదైః = భుజాస్ఫాలనశబ్దముల చేతను సింహనాదములచేతను; పుణ్యైః = పవిత్రములయిన; స్తవైః = స్తోత్రములచేతను; పూజ్యమానః = పూజింపఁబడుచున్నవాఁడై; యయౌ = పోయెను.

అప్పుడు, రాక్షసరాజోత్తముండగు రావణుండు శంఖభేరీపణవాదివాద్యధ్వనులచేతను భుజాస్ఫాలనసింహనాదధ్వనులచేతను నానావిధస్తోత్రములచేతను గొనియాడఁబడుచు, యుద్ధంబునకుఁబోయెను అని, తాత్పర్యము.

స శైలజీమూతనికాశరూపై
ర్మాంసాదనైః పావకదీప్తనేత్రైః
బభౌ వృతో రాక్షసరాజముఖ్యో
భూతైర్వృతో రుద్ర ఇవామరేశః. ౯

టీక॥ రాక్షసరాజముఖ్యః = రాక్షసరాజులలో శ్రేష్ఠుఁడైన; సః = ఆ; అమరేశః = రావణుఁడు; శైలజీమూతనికాశరూపైః = పర్వతములతోను మేఘములతోను సమానములయిన యాకారములు గలవారలును; పావకదీప్తనేత్రైః = నిప్పువలెమండుచున్నకన్నులు గలవారలునగు; మాంసాదనైః = రాక్షసులచేత; వృతః = చుట్టఁబడినవాఁడై; భూతైః = భూతములచేత; వృతః = చుట్టఁబడిన; రుద్రఇవ = రుద్రుఁడువలె; బభౌ = ప్రకాశించెను.

రాక్షసరాజోత్తముండగు నా రావణుఁడు, పర్వతమేఘంబులతో సమానములయిన యాకారములు గలవారలును నిప్పులవంటికన్నులు గలవారలునగు రాక్షసులచే బరివృతుండై, భూతంబులచేఁ బరివేష్టితుండగు రుద్రునివలెఁ, బ్రకాశించెను. అని, తాత్పర్యము.

తతో నగర్యాస్సహసా మహౌజా
నిష్క్రమ్య తద్వానరసైన్యముగ్రమ్
మహార్ణవాభ్రస్తనితం దదర్శ
సముద్యతం పాదపశైలహస్తమ్. ౧౦






టీక॥ తతః = అంత; మహారాజః = అధికమయినప్రతాపముగల రావణుఁడు; సహసా = శీఘ్రమున; నగర్యాః = పట్టణముననుండి; నిష్క్రమ్య = వెడలి; ఉగ్రం = భయంకరమగు; మహార్ణవాభ్రస్తనితం = మహాసముద్రముయొక్కయు మేఘముయొక్కయు ధ్వనివంటి ధ్వనిగలదియు; పాదపశైలహస్తం = వృక్షములును బర్వతములును జేతులం గలదియు; సముద్యతం = సన్నద్ధమయినదియునగు; తత్ = ఆ; వానరసైన్యం = వానరసేనను; దదర్శ = చూచెను.

అంత, మహాపరాక్రమశాలియగు రావణుండు, శీఘ్రంబునఁ బట్టణంబు వెలువడి, భయంకరంబును మహాసముద్రంబునకును మేఘంబునకునుంబోలెమహాధ్వనిగలదియు వృక్షంబులు శైలంబులు చేతులందాల్చి యుద్ధసన్నద్ధంబై యున్నదియునగు నవ్వానరసైన్యముం జూచెను. అని, తాత్పర్యము.

తద్రాక్షసానీక మతిప్రచండ
మాలోక్య రామో భుజగేంద్రబాహుః
విభీషణం శస్త్రభృతాం వరిష్ఠ
మువాచ సేనానుగతః పృథుశ్రీః. ౧౧

టీక॥ సేనానుగతః = వానరసేనచేఁ బరివృతుండును; పృథుశ్రీః = అధికమయినకాంతిగలవాఁడును; భుజగేంద్రబాహుః = సర్పరాజువంటిభుజములుగలవాఁడునగు; రామః = రాముఁడు; అతిప్రచండం = మిక్కిలియుభయంకరమయిన; తత్ = ఆ; రాక్షసానీకం = రాక్షససేనను; ఆలోక్య = చూచి; శస్త్రభృతాం = ఆయుధంబుధరించినవారలలో; వరిష్ఠం = శ్రేష్ఠుండగు; విభీషణం = విభీషణునిగూర్చి; ఉవాచ = చెప్పెను.

సర్పరాజువంటి బాహువులుగల రాముండు, యుద్ధోత్సాహంబుననిను మండించినకాంతిగలవాఁడై, వానరసేనాపరివృతుండై మహాభయంకరంబై వచ్చుచున్నయీ రాక్షససేనంగని, యాయుధధారులలోను త్తముఁడగు విభీషణుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తా.

నానాపతాకాధ్వజశస్త్రజుష్టం
ప్రాసాసిశూలాయుధశస్త్రజుష్టమ్

సైన్యం గజేంద్రోపమనాగజుష్టం
కస్యేద మక్షోభ్య మభీరుజుష్టమ్. ౧౨

టీక॥ నానాపతాకాధ్వజశస్త్రజుష్టం= నానావిధములయినవట్టి పెకేరములతోను రాజచిహ్నములువ్రాసిన పెకేరములతోను ఆయుధముల తోను గూడినదియు; ప్రాసాసిశూలాయుధశస్త్రజుష్టం=ఈటెలుకత్తులుశూలములుధనుస్సులుననునాయుధములతోఁగూడినదియు; గజేంద్రోపమనాగజుష్టం=ఐరావతముతోఁబోలికగలయేనుంగులతోఁగూడినదియు, అక్షోభ్యం= కలఁతపెట్టరానిదియు; అభీరుజుష్టం=భయములేనివారలతోఁగూడినదియునగు; ఇదం=ఈ; సైన్యం — సేన; కస్య= ఎవ్వనిది?

నానావిధములయిన ధ్వజములతోఁ గూడినదియుఁ బ్రాసములు ఖడ్గములు శూలములుధనుస్సులు మొదలగునాయుధములతోఁగూడినదియునైరావతసమానంబులగు నుత్తమగజంబులతోఁగూడినదియునక్షోభ్యంబునుశూరమయంబునగునీసేన యెవ్వనిది? అని, రాముండు, విభీషణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము,

తతస్తు రామస్య నిశమ్య వాక్యం
విభీషణ శ్శక్రసమానవీర్యః
శశంస రామస్య బలప్రవేగం
మహాత్మనాం రాక్షసపుంగవానామ్. ౧౩

టీక॥తతస్తు=అంతను; శక్రసమానవీర్యః=ఇంద్రునితోసమానమయిన పరాక్రమముగల; విభీషణః = విభీషణుఁడు; రామస్య=రామునియొక్క ; వాక్యం=మాటను; నిశమ్య=విని; రామస్య=రామునకు ; మహాత్మనాం = అధికమయినపరాక్రమముగల; రాక్షసపుంగవానాం=రాక్షసశ్రేష్ఠులయొక్క; బలప్రవేగం=బలాతిశయమును; శశంస= చెప్పెను.

అంత, దేవేంద్రసమానపరాక్రముఁడగువిభీషణుండు, రామునిమాటను విని, రామునకు, మహాపరాక్రమశాలులగు నారాక్షసోత్తముల , బలాతిశయ




ప్రధానః=వరముఖ్యముగాఁగల; ఇంద్రజిన్నామ=ఇంద్రజిత్తనువాఁడు.

ఎవ్వఁడు రథము నారోహించినవాఁడై సింహధ్వజంబలర, ఇంద్రధనుస్తుల్యంబగు ధనుస్సును జ్యాకర్షణంబున ధ్వనింపఁజేయుచు, భయంకరములయిన కోఱలు బయలు వడ నోరు దెఱచుకొనియుండు నేనుంగుకైవడిఁ బ్రకాశించుచున్నాఁడో, అతఁడు, బ్రహ్మదత్తవరుండగు నింద్రజిత్తు. అని, తాత్పర్యము.

యశ్చైష వింధ్యాస్తమహేంద్రకల్పో
ధన్వీ రథస్థోతిరథోతివీరః
విస్ఫారయం శ్చాప మతుల్యమానం
నామ్నాతికాయోతివివృద్ధకాయః. ౧౬

టీక॥ వింధ్యాస్తమహేంద్రకల్పః=వింధ్యపర్వతముతోన స్తగిరితోను మహేంద్రపర్వతముతోను సమానుండును; ధన్వీ=ధనుస్సుగలవాఁడును; అతిరథః=పెక్కురథికులతో యుద్ధము సేయువాఁడును; అతివీరః=మిక్కిలియుఁ బరాక్రమశాలియునగు; యః=ఏ, ఏషచ=ఈతండును; రథస్థః=రథమునొందినవాఁడై; అతుల్యమానం=సరిలేని ప్రమాణముగల; చాపం=ధనుస్సును; విస్ఫారయన్=ధ్వనింపజేయుచు; అభ్యుపైతి (అధ్యాహృతము)=వచ్చుచున్నాఁడో; సః(అధ్యాహృతము)=అతండు; నామ్నా=పేరుచేత; అతికాయః=అతికాయుఁడు. అతివివృద్ధకాయః=మిక్కిలియువృద్ధిఁబొందిన దేహముగలవాఁడు.

వింధ్యాస్తమహేంద్రపర్వతాకారుండును అతిరథుండును అతిపరాక్రమశాలియునగు నొకండు రథగతుండై యతిప్రమాణాకారంబగు ధనుస్సును ధ్వనింపఁజేయుచు, వచ్చుచున్నాఁడే, ఈతండు మహాదేహుండైన యతికాయుండు.

అని, తాత్పర్యము.

యోసౌ నవార్కోదితతామ్రచక్షు
రారుహ్య ఘంటానినదప్రణాదమ్
గజం ఖరం గర్జతి వై మహాత్మా



మహోదరో నామ స ఏష వీరః. ౧౭

టీక॥ మహాత్మా = అధికమయినపరాక్రమముగల; నవార్కోదితతామ్రచక్షుః = నూతనముగా నుదయించిన సూర్యునివలె నెఱ్ఱనైన కన్నులుగల; యః = ఏ; అసౌ = ఈతఁడు; ఘంటానినదప్రమాణం = ఘంటలధ్వనిచేనధికమయినధ్వనిగల; గజం = ఏనుంగును; ఆరుహ్య = ఎక్కి; ఖరం = ఉగ్రముగా; గర్జతి = అఱచుచున్నాఁడో ("వై" అనునది పాదపూరణార్థము); సః = అట్టి; ఏషః = ఈ; వీరః = వీరుఁడు; మహోదరో నామ = మహోదరుఁడని ప్రసిద్ధుండు.

ఏమహాబలుండు, నవోదితంబగుసూర్యబింబంబునకుంబోలెఁ గన్నుల నెఱ్ఱఁదనంబుగదుర, ఘంటాధ్వనిశోభితంబగు నేనుఁగు నెక్కి గర్జించుచు వచ్చుచున్నాఁడో, అతండు మహోదరుండు.

అని, తాత్పర్యము.

యోఽసౌ హయం కాంచనచిత్రభాండ
మారుహ్య సంధ్యాభ్రగిరిప్రకాశమ్
ప్రాసం సముద్యమ్య మరీచినద్ధం
పిశాచ ఏషోఽశనితుల్యవేగః. ౧౮

టీక॥ యః = ఏ; అసౌ = ఈతఁడు; కాంచనచిత్రభాండం = బంగారువికారములయిన నానావిధములగు నాభరణములు గలదియు; సంధ్యాభ్రగిరిప్రకాశం = సాయంకాలమందలి మేఘముతోఁ గూడినపర్వతముయొక్క కాంతివంటి కాంతి గలదియునగు; హయం = గుఱ్ఱమును; ఆరుహ్య = ఎక్కి; మరీచినద్ధం = ... ములతోఁ గూడిన; ప్రాసం = ఈఁటెను; సముద్యమ్య = పట్టుకొని; అభ్యుపైతి (అధ్యాహృతము) = వచ్చుచున్నాఁడో; అశనితుల్యవేగః = పిడుగుతో సమానమయినవేగముగల; ఏషః = ఈతండు; పిశాచః = పిశాచుఁడు.

ఎవ్వఁడు, బంగారుసొమ్ములచే నలంకరింపఁబడిసంధ్యామేఘయుక్తంబగుపర్వతంబు కరణిం బొల్పుచున్న గుఱ్ఱంబు నారోహించి, తళతళాయమా

నంబగు ప్రాసంబు చేఁబూని వచ్చుచున్నాఁడో, యీతండు పిశాచుండు; వీఁడు గువంటివాఁడు. అని, తాత్పర్యము.

యశ్చైష శూలం నిశితం ప్రగృహ్య
విద్యుత్ప్రభం కింకరవజ్రవేగమ్
వృషేంద్ర మాస్థాయ గిరిప్రకాశ
మాయాతి యోఽసౌ త్రిశిరా యశస్వీ. ౧౯

టీక॥ యః=ఏ; ఏషచ= ఈతండును; నిశితం=తీక్ష్ణమును; విద్యుత్ప్రభం= మెఱపుయొక్క కాంతివంటి కాంతిగలదియు; కింకరవజ్రవేగం=బంటువయినవజ్రముయొక్క వేగముగలదియునగు; శూలం=శూలమును; ప్రగృహ్య= పట్టుకొని; గిరిప్రకాశం=పర్వతముయొక్క కాంతివంటికాంతిగల; వృషేంద్రం= వృషభశ్రేష్ఠమును; ఆరుహ్య=ఎక్కి; ఆయాతి=వచ్చుచున్నాఁడో; యః=ప్రసిద్ధుఁడయిన; అసౌ=ఈతఁడు; యశస్వీ=అధికమయినకీర్తిగల; త్రిశిరాః= త్రిశిరుఁడు.

ఎవ్వండు, తీక్ష్ణంబును మెఱపువలె మెఱయుచున్నదియు వజ్రాయుధము కన్ననధికమయిన వేగముగలదియు నగు శూలంబుఁబట్టుకొని, పర్వతాకారం బగువృషభంబు నారోహించివచ్చుచున్నాఁడో, ఈతండు యశశ్శాలియగు త్రిశిరుండు. అని, తాత్పర్యము.

అసౌ చ జీమూతనికాశరూపః
కుంభః పృథువ్యూఢసుజాతవక్షాః
సమాహితః పన్నగరాజకేతు
ర్విస్ఫారయన్ భాతి ధను ర్విధూన్వన్. ౨౦

టీక॥ జీమూతనికాశరూపః= మేఘముతో సమానమయినరూపముగలవాఁడును; పృథువ్యూఢసుజాతవక్షాః= బలిసినదియు విశాలంబును సుందరంబును గు ఱొమ్ము గలవాఁడును; పన్నగరాజకేతుః=సర్పరాజుధ్వజమునందుఁ గలవాఁడునగు; యః(అధ్యాహృతము)= ఎవ్వఁడు; సమాహితః=సన్నద్ధుఁడై

నుః=ధనుస్సును; విస్ఫారయన్ = ధ్వనింపఁజేయుచు; విధూన్వన్=విదిరించుచు; భాతి = ప్రకాశించుచున్నాఁడో; అసౌచ=ఇతఁడును; కుంభః = కుంభుఁడు.

మేఘాకారుండువిశాలంబునుమాంసలంబును సుందరంబునగుఱొమ్ముగలవాఁడునగు నీరాక్షసుండు, సన్నద్ధుండై, పన్నగరాజధ్వజంబుగ్రాల, ధనుర్విస్ఫారణంబు గావింపుచున్నాఁడే; ఈతఁడుకుంభుఁడు.

అని, తాత్పర్యము.

యశ్చైష జాంబూనదవజ్రజుష్టమ్
దీప్తం సధూమం పరిఘం ప్రగృహ్య
ఆయాతి రక్షోబలకేతుభూత
స్త్వసౌ నికుంభోద్భుతఘోరకర్మా. ౨౧

టీక॥ యః=ఏ; ఏషచ= ఈతండును; జాంబూనదవజ్రజుష్టం = బంగారముతోను వజ్రమణులతోను గూడినదియు ; దీప్తం= ప్రకాశించుచున్నదియు ; సధూమం= పొగతోఁగూడినదియునగు; పరిఘం=ఇనుపగుదియను; ప్రగృహ్య= పట్టుకొని; ఆయాతి= వచ్చుచున్నాఁడో; అసౌతు=ఈతఁడుమాత్రము; నికుంభః= నికుంభుఁడు. రక్షోబలకేతుభూతః=రాక్షససైన్యమునకు ధ్వజముగానుండువాఁడు. అద్భుతఘోరకర్మా= ఆశ్చర్యకరములును భయంకరంబులునగు కార్యములుగలవాఁడు.

ఎవ్వఁడు, బంగారముతోను వజ్రమణులతోను నలంకరింపఁబడినదియుఁ బ్రకాశమానంబును ధూమసహితంబునగు పరిఘంబుగొని, వచ్చుచున్నాఁడో, అతండు, నికుంభుండు; ఈతండు, రాక్షససైన్యమునకంతయును ముఖ్యుఁడు ; గొప్పకార్యములు గావించినాఁడు.

అని, తాత్పర్యము.

యశ్చైష చాపాసిశరౌఘజుష్టం
పతాకినం పావకదీప్తరూపమ్
రథం సమాస్థాయ విభాత్యుదగ్రో
నరాంతకో సౌ నగశృంగయోధీ. ౨౨

టీక॥ యః=ఏ; ఏషచ= ఈతండును; చాపాసిశరౌఘజుష్టం = ధనస్సుతోను ఖడ్గముతోను బాణసమూహములతోనుగూడినదియు; పతాకినం= ధ్వజముగలదియు; పావకదీప్తరూపం=అగ్నివలెఁబ్రకాశించుచున్న రూపముగలదియునగు; రథం=రథమును; సమాస్థాయ=అధిష్ఠించి; ఉగ్రః = భయంకరుండై; విభాతి= ప్రకాశించుచున్నాఁడో; అసౌ=ఈతఁడు; నరాంతకః= నరాంతకుఁడు. నగశృంగయోధీ= పర్వతశిఖరములతోఁబోరువాఁడు.

ఎవ్వండు ధనుర్బాణఖడ్గంబులతోఁ గూడినదియు ధ్వజాలంకృతంబును అగ్నిహోత్రంబువలెఁ బ్రకాశించుచున్నదియునగు రథంబునారోహించి, భయంకరాకారుండై ప్రకాశించుచున్నాఁడో, ఈతండు నరాంతకుండు; పర్వతశిఖరంబులచే యుద్ధముసేయువాఁడు.

అని, తాత్పర్యము.

యశ్చైష నానావిధ ఘోరరూపైః
వ్యాఘ్రోష్ట్రనాగేంద్ర మృగాశ్వవక్త్రైః
భూతైర్వృతో భాతి వివృత్తనేత్రైః
సోఽసౌ సురాణామపి దర్పహంతా. ౨౩

టీక॥ యః=ఏ; ఏషః=ఈతఁడును; నానావిధఘోరరూపైః = నానావిధములును భయంకరములునగు రూపములుగలవియు; వ్యాఘ్రోష్ట్రనాగేంద్రమృగాశ్వవక్త్రైః= పెద్దపులులయొక్కయు నొంటెలయొక్కయు గజశ్రేష్ఠములయొక్కయు మృగములయొక్కయు గుఱ్ఱములయొక్కయు ముఖమువంటిముఖముగలవియు; వివృత్తనేత్రైః=తిరుగుచున్నకన్నులుగలవియునగు; భూతైః=భూతములచేత; వృతః= చుట్టఁబడినవాఁడై; భాతి=ప్రకాశించుచున్నాఁడో, సః=అట్టి; అసౌ=ఇతండు; సురాణామపి=దేవతలయొక్కయు; దర్పహంతా= గర్వముహరించువాఁడు.

ఎవ్వండు నానావిధభయంకరాకారంబులును వ్యాఘ్రముఖంబులును ఉష్ట్రముఖంబులు గజముఖంబులును మృగముఖంబులును అశ్వముఖంబులునగు భూతంబులచేఁ బరివేష్టితుండై యొప్పుచున్నాఁడో, అతండె, దేవతలగర్వము నడంచినమహాత్ముండు. అని, తాత్పర్యము.

యత్రై 7ల దిందుప్రతిమం విభాతి
చ్ఛత్రం సితంసూక్ష్మ శలాకమగ్ర్యం
అత్రైష రక్షోధిపతి మహాత్మా
భూతైర్వృతో రుద్ర ఇవా వభాతి. ౨౪

టీక॥ యత్ర = ఏరథమునందు ; ఇందుప్రతిమం = చంద్రునితోఁ బోలికగలదియు; సితం = తెల్లనిదియు; సూక్ష్మశలాకం = సూక్ష్మములయిన శలాకలుగలదియు; అగ్ర్యం = శ్రేష్ఠమయినదియునగు; ఏతత్ = ఈ; ఛత్రం = గొడుగు; అవభాతి = ప్రకాశించుచున్నదో ; అత్ర = ఈరథమునందు; మహాత్మా = అధికమయిన పరాక్రమముగల; ఏషః = ఈ; రక్షోధిపతిః = రాక్షసరాజుఁడగు రావణుఁడు, భూతైః = భూతములచేత; వృతః = చుట్టఁబడిన; రుద్రఇవ = రుద్రుఁడువలె; అవభాతి = ప్రకాశించుచున్నాఁడు.

చంద్రతుల్యంబును సూక్ష్మశలాకంబునును త్తమంబునగు శ్వేతచ్ఛత్రము ప్రకాశించుచున్నదే, ఈరథమునందే , మహాత్ముండగు రాక్షసరాజు, రాక్షసపరివృతుండై, భూతసేవితుండగు రుద్రునికైవడిఁ దేజరిల్లుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

అసౌ కిరీటీ చలకుండలాస్యో
నగేంద్ర వింధ్యోపమ భీమకాయః
మహేంద్ర వైవస్వత దర్పహంతా
రక్షోధిప స్సూర్య ఇవా వభాతి. ౨౫

టీక॥ కిరీటీ = కిరీటముగలవాఁడును; చలకుండలాస్యః = చలించుచున్నపోఁగులుగల ముఖముగలవాఁడును; నగేంద్రవింధ్యోపమభీమకాయః = హిమవత్పర్వతముతోను వింధ్య పర్వతముతోను బోలికగల భయంకరమయిన దేహము వాఁడునగు; అసౌ = ఈతఁడు ; రక్షోధిపః = రాక్షసరాజు. మహేంద్రవైవస్వతదర్పహంతా = దేవేంద్రునియొక్కయు యమునియొక్కయు గర్వమునుహరించువాఁడు. సూర్యఇవ = సూర్యుఁడువలె; అవభాతి = ప్రకాశించుచున్నాఁడు.

కిరీటధరుండును గుండలాలంకృత



మగుముఖముగలవాఁడును హిమవత్పర్వతాకారుండునగునీతఁడు, రాక్షసరాజుండగు రావణుండు; ఇంద్రయములగర్వంబడంచినవాఁడు; సూర్యుండుఁ బోలె వెలుంగుచున్నాఁడు చూడుము. అని విభీషణుండు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ప్రత్యువాచ తతో రామో విభీషణ మరిందమః

టీక॥ తతః=అంత; రామః= రాముఁడు; అరిందమం=శత్రువుల నడంగఁద్రొక్కునట్టి; విభీషణం= విభీషణునిఁగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

అంత, రాముఁడు, శత్రువులనడంగఁద్రొక్కునట్టి విభీషణునిఁజూచి, యిట్లుబదులుచెప్పెను. అని, తాత్పర్యము.

అహో దీప్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః. ౨౬

టీక॥ రాక్షసేశ్వరః= రాక్షసరాజుఁడగు; రావణః= రావణుఁడు; దీప్తః= కాంతిమంతుఁడు; మహాతేజాః= మహాప్రతాపుఁడు. అహో= ఆశ్చర్యము.

రాక్షసరాజుఁడగు రావణుండు, దివ్యతేజంబున వెలుఁగుచున్నాఁడు; మహాప్రతాపుఁడుగా నున్నాఁడు. ఆశ్చర్యము. అని, తాత్పర్యము.

ఆదిత్య ఇవ దుష్ప్రేక్ష్యో రశ్మిభి ర్భాతి రావణః

టీక॥ రావణః= రావణుఁడు; రశ్మిభిః= కాంతులచేత; ఆదిత్యఇవ = సూర్యుఁడువలె; దుష్ప్రేక్ష్యః= చూడఁగూడనివాఁడుగా; భాతి = ప్రకాశించుచున్నాఁడు.

రావణుండు, తేజంబున, సూర్యునిపగిదిఁ, జేఁజూడనలవి గాక, వెలుంగుచున్నాఁడు. అని, తాత్పర్యము.

సువ్యక్తం లక్షయే హ్యస్య రూపం తేజస్సమావృతమ్. ౨౭

టీక॥ అస్య=ఈతనియొక్క; తేజస్సమావృతం=కాంతిచేఁబరివేష్టింపఁబడిన; రూపం=రూపమును; సువ్యక్తం=స్పష్టముగా; లక్షయేహి = చూ



న్నానుగదా! తేజస్సుచే నావృతంబగునీతనిరూపము, స్పష్టముగా నగపడుచున్నది. అని, తాత్పర్యము.

దేవదానవ వీరాణాం వపుర్నైవం విధం భవేత్
యాదృశం రాక్షసేంద్రస్య వపురేతత్ప్రకాశతే. ౨౮

టీక॥ రాక్షసేంద్రస్య=రాక్షసరాజుండగు రావణునియొక్క; ఏతత్=ఈ; వపుః=దేహము; యాదృశం= ఎట్టిదిగా; ప్రకాశతే=ప్రకాశించుచున్నదో; దేవదానవవీరాణాం = దేవదానవవీరులయొక్కయు; వపుః= దేహము; ఏవంవిధం=ఇట్టిది; నభవేత్=కాదు.

రాక్షసరాజుండగు నీ రావణుని దేహంబు తేజస్సు, దేవదానవులలో నెవ్వరికిని లేదు. అని, తాత్పర్యము.

సర్వే పర్వతసంకాశాస్సర్వే పర్వతయోధినః
సర్వే దీప్తాయుధధరా యోధాశ్చాస్య మహౌజసః. ౨౯

టీక॥ అస్య= ఈ రావణునియొక్క; మహౌజసః= అధికమయిన తేజస్సుగల; యోధాశ్చ=భటులును; సర్వే= అందఱును; పర్వతసంకాశాః=కొండలతో సమానులు. సర్వే= అందఱును; పర్వతయోధినః = కొండలచేఁ బోరువారలు. సర్వే = అందఱును; దీప్తాయుధధరాః= ప్రకాశించుచున్న యాయుధములను ధరించినవారలు.

ఈతనిభటులందఱు, మహాతేజులు; పర్వతాకారులు; కొండలచే యుద్ధంబు గావించువారలు; దీప్యమానంబులగు నాయుధంబులం దాల్చియున్నారు. అని, తాత్పర్యము.

ఇతి రాక్షస[శ్ఛిద్ర / గరీం]శో ప్రదీప్తైః భీమవిక్రమైః
ఘోరైః పరివృతస్తీక్ష్ణైః దేహవద్భిరివాంతకః. ౩౦

టీక॥ ఏషః=ఈ; రాక్షసరాజః = రాక్షసులకుఁ బ్రభుఁడైన రావణుఁడు; ప్రదీప్తైః=ప్రకాశించుచున్నవారలును; భీమవిక్రమైః=భయంకర పరాక్రములు నగు రాక్షసుల చేత; పరివృతః= పరివేష్టింపఁబడినవాఁడై; తీక్ష్ణైః= క్రూర

ములను ; దేహవద్భిః = మహాకాయములునగు; భూతైః = భూతములచేత; పరివృతః(అధ్యాహృతము) = చుట్టబడినవాఁడగు;అంతకఇవ= యముఁడువలె ; భాతి = ప్రకాశించుచున్నాఁడు.

రాక్షసరాజుండగునీరావణుండు, దేదీప్యమానులగు భయంకర పరాక్రములచేఁబరివేష్టితుండై, మహాకాయంబులగుభూతములచేఁబరివృతుండగుయముని కైవడిఁదేజరిల్లుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

దిష్ట్యా యమద్య పాపాత్మా మమ దృష్టిపథం గతః

టీక॥దిష్ట్యా=దైవముచేత;అయం= ఈ;పాపాత్మా= పాపబుద్ధియగు రావణుండు; మమ= నాయొక్క ; దృష్టిపథం=చూపుమార్గమును;గతః= పొం దినాఁడు.

దైవవశంబున, నీపాపాత్ముఁడు, నాయెదుటంబడెను.

అని, తాత్పర్యము.

అద్య క్రోధం విమోక్ష్యామి సీతాహరణసంభవమ్. ౩౧

టీక॥అద్య=ఇప్పుడు ; సీతాహరణసంభవం=సీతనపహరించుటవలనఁ గలిగిన;క్రోధం=కోపమును; విమోక్ష్యామి=విడిచెదను.

ఇప్పుడు,సీతాపహారమునం గలిగిన కోపంబుఁదీర్చుకొనెదను. అని, రాముండు,విభీషణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా తతో రామో ధను రాదాయ వీర్యవాన్
లక్ష్మణానుచర స్తస్థౌ సముద్ధృత్య [illegible]యమ్. ౩౨

టీక॥తతః=అంత; వీర్యవాన్=అధికమయినపరాక్రమముగల; రామః= రాముఁడు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; లక్ష్మణానుచరః=లక్ష్మణుఁడు వెంబడించు వాఁడుఁగాఁగలవాఁడై ; ధనుః=[illegible]; ఆదాయ=[illegible]; శరోత్తమం=బాణశ్రేష్ఠమును;సముద్ధృత్య=ఎత్తి; తస్థౌ=నిలిచెను.

అంత , మహాపరాక్రమశాలియగు రాముండు, ఈప్రకారమునంజెప్పి,

త్మ్యణసహితుండై, ధనుర్బాణంబులు ధరియించి, సన్నద్ధుండై, నిలిచియుండెను. అని, తాత్పర్యము.

తత స్స రక్షోధిపతి ర్మహాత్మా
రక్షాంసి తాన్యాహ మహాబలాని
ద్వారేషు చర్యా. గృహగోపురేషు
సునిర్వృతా స్తిష్ఠత నిర్విశంకాః. 33

టీక॥ తతః=అంత;మహాత్మా= అధికమయినపరాక్రమముగల;సః= ఆ; రక్షోధిపతిః= రాక్షసరాజయినరావణుఁడు;మహాబలాని= అధికమయినబలముగల;తాని=ఆ;రక్షాంసి= రాక్షసులనుగూర్చి;యూయం (అధ్యాహృతము)=మీరలు;నిర్విశంకాః = నిర్భయులరై; ద్వారేషు= ద్వారములయందు;చర్యాగృహగోపురేషు= చతుష్పథములయందలిగృహములందును బురద్వారములయందును; సునిర్వృతాః= మిక్కిలియుసుఖితులయి;తిష్ఠత=ఉండుఁడు.ఇతి (అధ్యాహృతము)= అని; ఆహ=చెప్పెను.

అంత, మహాపరాక్రమశాలియగు నారాక్షసరాజురావణుఁడు,బలవంతులగురాక్షసులఁజూచి, "మీరలు,నిర్భయముగాఁ, జతుష్పథగృహములయందునుబురద్వారంబులయందునుసుఖంబుగాఁగాచియుండుఁడు"అని,యాజ్ఞాపించెను. అని,తాత్పర్యము.

ఇహాగతం మాం సహితం భవద్భి
ర్వనౌకస [?] మిదం విదిత్వా
రాన్యాం [?] చుప్ర[?]సహం ప్రమథ్య
ప్రధర్షయేయు స్సహసా సమేతాః. 34

టీక॥ వనౌకసః=వానరులు; భవద్భిః=మీతో;సహితం= కూడినవాఁడు ఇహ=ఇచ్చటికి;ఆగతం = వచ్చినవాఁడునగు;మాం=నన్ను;దృష్ట్వా (అధ్యాహృతము)= చూచి;ఇదం= ఈ; ఛిద్రం=రంధ్రమును;విదిత్వా = తెలి




సికొని; సహసా = శీఘ్రమున; సమేతాః = కూడినవారలై; దుష్ప్రసహాం = సహింపఁగూడనిదియు; శూన్యాం = సైనికులచేశూన్యమునగు; పురీం = పట్టణమును; ప్రమథ్య = చెఱపి; ప్రధర్షయేయుః = తిరస్కరింతురు.

వానరులు, మీరలందఱునాతోఁగూడవచ్చియుండుటంజూచి, పట్టణంబునసెవ్వరును సైనికులు లేరనుభిద్రంబుఁదెలిసికొని, యంతశీఘ్రంబున, గుంపుగూడి, సుఖంబుగాఁ బురంబుఁబ్రవేశించి, నాశంబునొందింతురు. అని రావణుఁడు, రాక్షసవీరులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

విసర్జయిత్వా సహితాం స్తత స్తాన్
గతేషు రక్షస్సు యథా నియోగమ్
వ్యదారయ ద్వానరసాగరౌఘం
మహాఝషః పూర్ణమివార్ణవౌఘమ్. ౩౫

టీక॥ తతః = అంత; సః (అధ్యాహృతము) = ఆరావణుఁడు; సహితాన్ = చేరియున్న; తాన్ = ఆరాక్షసులను; విసర్జయిత్వా (విసర్జ్య) = విడిచి; రక్షస్సు = రాక్షసులు; యథానియోగం = ఆజ్ఞాప్రకారము; గతేషు = పోయినవారలగుచుండఁగా; వానరసాగరౌఘం = వానరసైన్యమనుసముద్రప్రవాహమును; మహాఝషః = పెద్దమత్స్యము; పూర్ణం = నిండిన; మహార్ణవౌఘమివ = మహాసముద్రప్రవాహమునువలె; వ్యదారయత్ = కలఁచెను.

అంత, నారావణుండు, ఆరాక్షసవీరులంబంపి, వారలు రాజాజ్ఞచొప్పనఁబోయినతరువాత, మహామత్స్యము సముద్రజలంబులంగలంచునట్లు, వానరసైన్యంబులంగలంచెను.

అని, తాత్పర్యము.

తమాపతంతం సహసా సమీక్ష్య
దీప్తేషుచాపం యుధి రాక్షసేంద్రమ్
మహత్సముత్పాట్య మహీధరాగ్రం
దుద్రావ రక్షోధిపతిం హరీశః. ౩౬

టీక॥ హరీశః = వానరరాజుండగుసుగ్రీవుండు; దీప్తేషుచాపం = ప్రః






చుచున్నబాణంబును ధనుస్సునుగలవాఁడును; సహసా = శీఘ్రమున; యుధి = యుద్ధమునిమిత్తమయి; ఆపతంతం=వచ్చుచున్నవాఁడునగు;తం= ఆ; రాక్షసేంద్రం= రాక్షసరాజుండగురావణుని;సమీక్ష్య = చూచి;మహత్ = గొప్పదగు;మహీధరాగ్రం = పర్వతశిఖరమును;సముత్పాట్య = పెకలించి;రక్షోధిపతిం= రావణునిగూర్చి; దుద్రావ=పరుగెత్తెను.

వానరరాజుండగుసుగ్రీవుండు, రాక్షసరాజుఁడగురావణుండు, దీప్తంబులగుధనుర్బాణంబులు దాల్చి వేగంబున వానరసేనమీఁదికివచ్చుటంజూచి,గొప్పపర్వతశిఖరమునొకటిఁ పెకలించి, రావణునిమీఁదికడరెను. అని, తా.

త చ్ఛైలశృంగం బహువృక్షసానుం
ప్రగృహ్య చిక్షేప నిశాచరాయ
త మాపతంతం సహసా సమీక్ష్య
బిభేద బాణై స్తపనీయపుంఖైః. ౩౭

టీక॥సః(అధ్యాహృతము) = ఆసుగ్రీవుఁడు;బహువృక్షసానుం = పెక్కువృక్షములుగలనెత్తముగల; తత్ =ఆ; శైలశృంగం=పర్వతశిఖరమును; ప్రగృహ్య= గ్రహించి; నిశాచరాయ=రావణునికొఱకు; చిక్షేప=వేసెను. సః(అధ్యాహృతము)=ఆరావణుఁడు ; ఆపతంతం=వచ్చుచున్న ; తం=ఆపర్వతశిఖరమును; సమీక్ష్య=చూచి ; సహసా=శీఘ్రమున;తపనీయపుంఖైః= బంగారుపింజలుగల; బాణైః= బాణముల చేత; బిభేద=భేదించెను.

ఆసుగ్రీవుఁడు పెక్కువృక్షంబులతోఁ గూడినతటముగలయాపర్వతశిఖరంబును రావణునిపైనేయ, నతండదితనమీఁదికివచ్చుటఁజూచి , శీఘ్రంబున బంగారుపింజలుగలబాణంబులచే దానిందునియలుగావించెను. అని, తాత్పర్యము.

తస్మిన్ ప్రవృద్ధోత్తమసానువృక్షే
శృంగే వికీర్ణే పతితే పృథివ్యామ్
మహాహికల్పం శర మన్తకాభం
సమాదదే రాక్షసలోకనాథః. ౩౮



స ౫౯

శక్రాశనిప్రఖ్యవపు శ్శితాగ్రః
సుగ్రీవ మాసాద్య బిభేద వేగా
ద్గుహేరితా క్రౌంచ మివోగ్రశక్తిః. ౪౦

టీక॥ రావణబాహుముక్తః=రావణునిబాహువుచే విడువఁబడినదియు; శక్రాశనిప్రఖ్యవపుః = దేవేంద్రునివజ్ర ... తో సమానమయిన దేహముగల ... శితాగ్రః = తీక్ష్ణమయిన కొనగలది ... సః = ఆ; సాయకః=బాణము; ... వేగమువలన; సుగ్రీవం=సుగ్రీవు ... = ఇం ... ది; గుహేరితా = ... చేఁ బ్రయోగింపఁబడిన; ఉగ్ర ... కరమయినశక్తిః; క్రౌంచమివ= క్రౌంచపర్వతమునువలె; బిభేద= భేదించెను.

ఇంద్రునివజ్రాయుధమువంబోలె నతికఠినంబును తీక్ష్ణమయిన యగ్రముగలదియునగు నాబాణము, రావణబాహుముక్తంబై వేగంబునఁ, గుమారస్వామిప్రయుక్త ... బగుశక్తి క్రౌంచపర్వతమును భేదిం ... , సుగ్రీవుని భేదించెను.

... ము.

స సాయకార్తో ...
కూజన్ పృథివ్యాం నిప ...
తం ప్రేక్ష్య భూమౌ పతి ...
న్నేదుః ప్రహృష్టా యుధి యా ...

టీక॥ సః=ఆ; వీరః= పరాక్రమశాలియగుసుగ్రీవుఁడు; సాయకార్తః= బాణముచేఁబీడింపఁబడినవాఁడై; విపరీతచేతాః = తెలివిదప్పినమనస్సుగలవాఁడై; కూజన్ = అఱచుచు; పృథివ్యాం=భూమియందు; నిపపాత= పడెను. యుధి=యుద్ధమునందు; భూమౌ=నేలయందు; పతితం= పడినవాఁడును; విసంజ్ఞం= తె ... గు; తం=ఆసుగ్రీవుని; ప్రేక్ష్య= చూచి; యాతుధానాః=రాక్షసులు ; ప్రహృష్టాః=మిక్కిలియుసంతసించిన వాఁరయి; నేదుః=అఱచిరి.

వీరుఁడగు నాసుగ్రీవుండు, బాణపీడితుండై, తెలివిదప్పి, వెలవెలంగూయుచు నేలంబడెను; రాక్షసులందఱు, అ

ట్లు సుగ్రీవుండు యుద్ధంబున మూర్ఛితుం డై నేలం బడుటను జూచి, సంతోషంబున సింహనాదంబులు గావించిరి. అని, తాత్పర్యము.

తతో గవాక్షో గవయ స్సుదంష్ట్ర
స్తథర్షభో జ్యోతిముఖో నభశ్చ
శైలాన్ సముద్యమ్య వివృద్ధకాయాః
ప్రదుద్రువు స్తం ప్రతి రాక్ష[illegible]రమ్. ౪౨

టీ॥ [illegible]:అంత; గవాక్షః= గ[illegible] తుండు; [illegible]ష్ట్రః= మంచికో[illegible] గల; [illegible]యుండును; త[illegible] అట్లు [illegible] ఋషభుండు; [illegible] తివ[illegible]తిముఖః= జ[illegible] ఖు[illegible], నభశ్చ= నభు[illegible] ను[illegible] వృద్ధకాయాః= వృ[illegible] ప[illegible]ుగలవారలయి; [illegible]న్= ప[illegible]ులను; సముద్యమ్య ఎత్తుకొని; [illegible]=ఆ; రాక్షసేంద్రం ప్రతి= రాక్షసరా[illegible]డగు రావణునిగూర్చి; ప్రదుద్రువుః= [illegible]ుగెత్తిరి.

అంత, గవాక్షుండును, గవయుండును ఋషభుండును జ్యోతిముఖుండును నభుండును మేనులు పెంచికొని, పర్వతంబులందీసికొని యా రాక్షసరాజుమీఁదికడరిరి. అని, తాత్పర్యము.

తేషాం ప్రహారాన్ స చకార మోఘాన్
[illegible]ో బాణగణై శ్శితాగ్రైః
తా న్వానరేంద్రానపి బాణజాలై
ర్బిభేద జాంబూనదచిత్రపుంఖైః. ౪౩

టీక॥ సః=ఆ; రక్షోధిపః = రాక్షసరాజుఁడైన రావణుఁడు; శితాగ్రైః= కఱకులయినకొనలుగల; బాణగణైః= బాణముల సమూహములచేత ; తేషాం= ఆవానరులయొక్క ; ప్రహారాన్=దెబ్బలను; మోఘాన్ = వ్యర్థములనుగా; చకార = చేసెను. తాన్=ఆ; వానరేంద్రానపి= వానరోత్తములనుగూడ; జాంబూనదచిత్రపుంఖైః=బంగారువికారములయిన చిత్ర

ములగుపింజలుగల; బాణజాలైః = బాణసమూహములచేత; బిభేద = భేదించెను.

ఆరావణుండు, అవ్వానరవీరులు వేసిన పర్వతములను, తీక్ష్ణబాణంబులచేఁ దునియలుగావించి, యవ్వానరోత్తములను, కాంచనపుంఖములగు బాణంబుల నొప్పించెను.

అని, తాత్పర్యము.

తే వానరేంద్రా స్త్రిదశారిబాణై
ర్భిన్నా నిపే[illegible] భీమకాయాః
తతస్తు త ద్వానర[illegible] [illegible]గ్రం
ప్రచ్ఛాదయామాస [illegible]జాలైః ౮౮

టీక॥ భీమకాయాః = భయంకరములయిన దేహములుగల; తే = ఆ; వానరేంద్రాః = వానరశ్రేష్ఠులు; త్రిదశారిబాణైః = దేవశత్రువగు రావణునిబాణములచేత; భిన్నాః = భేదింపఁబడినవారలై; భువి = నేలయందు; నిపేతుః = పడిరి. తతస్తు = అంతను; సః = ఆరావణుఁడు; బాణజాలైః = బాణసమూహములచేత; ఉగ్రం = భయంకరమ[illegible] [illegible]త్ = ఆ; వాన[illegible] [illegible] సర[illegible] [illegible]చ్ఛాదయామా[illegible] ను.

[illegible] [illegible]రాకారులగు వ[illegible] [illegible]ణునిబాణంబులచే [illegible]దేహ[illegible]ల [illegible]లంబడిరి; అంత [illegible] వణుండు, [illegible]నరసేననంతయు [illegible]క్ష్ణంబులగు [illegible] [illegible]సమూహంబుల ముం[illegible] చెను. అని, త[illegible]ము.

తే వధ్యమానాః పతితాః ప్రవీరా
నానద్యమానా భయశల్యవిద్ధాః
శాఖామృగా రావణసాయకార్తా
జగ్ము శ్శరణ్యం శరణం స్మ రామమ్. ౮౯

టీక॥ ప్రవీరాః = మిక్కిలియుఁబరాక్రమశాలులగు; తే = ఆ; శాఖామృగాః = వానరులు; వధ్యమానాః = కొట్టఁబడినవ[illegible]రలయి; రావణసాయకా

తాః=రావణునిబాణములచేఁ బీడింపఁబడినవారలయి; భయశల్యవిద్ధాః=భయమను బాధచేఁగొట్టఁబడిన వారలయి; నానద్యమానాః = మిక్కిలియు నఱచుచున్నవారలయి; పతితాః = పడినవారలయి; శరణ్యం = శరణుపొందఁదగిన; రామం=రాముని; శరణ్యం=రక్షకునిఁగా; జగ్ముస్స్మ=పొందిరిగదా!

మహాపరాక్రమశాలులగు నవ్వానరవీరులు, రావణునిబాణంబులచేఁ బీడితులయి, పరమభీతులయి, యఱచుచు, నేలంబడి, శరణ్యుండగు రామునిశరణుఁజొచ్చిరి. అని, తాత్పర్యము.

తతో మహాత్మా స ధనుర్ధనుష్మా
నాదాయ రామ స్సహసా జగామ
తం లక్ష్మణః ప్రాంజలి రభ్యుపేత్య
ఉవాచ వాక్యం పరమార్థయుక్తమ్. ౪౬

టీక॥ తతః=అంత; మహాత్మా=అధికఘనపరాక్రమముగలవాఁడును; ధనుష్మాన్=ప్రశస్తమయిన విలుకాఁడునగు; సః=ఆ; రామః=రాముఁడు; ధనుః=విల్లును; ఆదాయ= తీసికొని; సహసా=శీఘ్రమున; జగామ=పోయెను. లక్ష్మణః=లక్ష్మణుఁడు; ప్రాంజలిః=మంచి చేమోడ్పుగలవాఁడై; తం= ఆరాముని; అభ్యుపేత్య=పొంది; పరమార్థయుక్తం=శ్రేష్ఠమయిన యర్థముతోఁగూడిన; వాక్యం=మాటను; ఉవాచ = చెప్పెను.

అంత, మహాత్ముండును మహాధనుర్ధరుండునగు రాముండు, ధనుస్సుఁదీసికొని, శీఘ్రంబున వానరరక్షణార్థంబయి, పోయెను; అప్పుడు, లక్ష్మణుండు, ఆరామునియొద్దకుఁబోయి, చేమోడ్పు గీలించి, పరమార్థయుక్తంబగు నీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

కామ మార్య స్సుపర్యాప్తో వధాయాస్య దురాత్మనః
విధమిష్యా మ్యహం నీచ మనుజానీహి మాం ప్రభో. ౪౭

టీక॥ ఆర్యః= పూజ్యుండవగునీవు; దురాత్మనః= దుష్టుండగు; అస్య = ఈ

రావణునియొక్క; వధాయ = వధించుటకొఱకు; కామం = మిక్కిలియు; సుపర్యాప్తః = చాలుదువు. నీచం = నీచుండగునీతని; అహం = నేను; వధిష్యామి = వధించెదను. ప్రభో = నాయకుండవగు రాముఁడా! మాం = నన్ను; అనుజానీహి = అనుమతింపుము.

పూజ్యుండవగునీవు, ఈదురాత్ముని వధింపనెంతమాత్రము ? అయినను, ఈతండు; నీతోయుద్ధంబు సేయ యోగ్యుండుకాఁడు; కావున , నీతని నేను వధించెదను; నాకనుజ్ఞ యొసంగుము. అని, లక్ష్మణుండు, రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

త మబ్రవీ న్మహాతేజా రామ స్సత్యపరాక్రమః

టీక॥ మహాతేజాః = అధికమయిన కాంతిగలవాఁడును; సత్యపరాక్రమః = ఎట్టికాలమునందును వ్యర్థముకాని పరాక్రమముగలవాఁడునగు ; రామః = రాముఁడు; తం = ఆలక్ష్మణునిగూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

మహాతేజుండును సత్య...డునగు రాముండు, ఆలక్ష్మణుం... యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

గచ్ఛ యత్నపరశ్చాపి భవ లక్ష్మణ సంయుగే. ౪౮

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా ! గచ్ఛ = పొమ్ము. సంయుగే = యుద్ధమునందు; యత్నపరశ్చాపి = ప్రయత్నమునందాసక్తుఁడవును ; భవ = అగుము.

లక్ష్మణుఁడా! పొమ్ము ; యుద్ధంబునజాగ్రత్తతోనుండుము.

అని, తాత్పర్యము.

రావణో హి మహావీర్యో రణే ద్భుతపరాక్రమః

టీక॥ రావణః = రావణుఁడు; మహావీర్యః = అధికమయిన పరాక్రమముగలవాఁడు. రణే = యుద్ధమునందు ; అద్భుతపరాక్రమోహి = ఆశ్చర్యకరమయినపరాక్రమముగలవాఁడుగదా!

రావణుండు మహాపరాక్రమశాలి;

యుద్ధంబునసతనిపరాక్రమంబు, అత్యాశ్చర్యకరంబుగానుండును. అని, తాత్పర్యము.

త్రైలోక్యేనాపి సంక్రుద్ధో దుష్ప్రసహ్యో న సంశయః. ౪౯

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరావణుఁడు; సంక్రుద్ధః=మిక్కిలియుఁగోపించినవాఁడై; త్రైలోక్యేనాపి=ముల్లోకములచేతనైనను; దుష్ప్రసహ్యః=ఎదిరింపనలవిగాఁడు. సంశయః=సందేహము; న=లేదు.

ఈతండు, కుపితుండగునేని, ముల్లోకంబులుంగూడ, నీతనినెదుటనిలువంజాలవు. అని, తాత్పర్యము.

తస్య చ్ఛిద్రాణి మార్గస్వ స్వచ్ఛిద్రాణిచ లక్షయ

టీక॥ తస్య=ఆతనియొక్క; ఛిద్రాణి=రంధ్రములను; మార్గస్వ= వెదకుము. స్వచ్ఛిద్రాణి= నీరంధ్రములను; లక్షయ = చూచుకొనుము.

అతనిఛిద్రంబులనుజూచిప్రహరింపుము; నీఛిద్రంబులనుంగనుంగొనిసవరించుకొనుము. అని, తాత్పర్యము.

చక్షుషా ధనుషా యత్నా ద్రక్షాత్మానం సమాహితః. ౫౦

టీక॥ సమాహితః = ఎచ్చరికగలవాఁడవై; చక్షుషా=కంటిచేతను; ధనుషా=వింటిచేతను; యత్నాత్=ప్రయత్నమువలన; ఆత్మానం=నిన్ను; రక్ష=రక్షించుకొనుము.

అట్లెచ్చరికతోఁబ్రయత్నంబునఁ, జక్కఁగాఁగంటఁజూచుచు, ధనుస్సుచేనిన్నురక్షించుకొనుచుయుద్ధంబుగావింపుము. అని, రాముండు, లక్ష్మణునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

రాఘవస్య వచ శ్శ్రుత్వా పరిష్వజ్యాభిపూజ్యచ
అభివాద్య తతో రామం యయౌ సౌమిత్రి రాహవమ్. ౫౧

టీక॥ సౌమిత్రిః=లక్ష్మణుఁడు; రాఘవస్య=రామునియొక్క; వచః=మా

స ౫౯

టను; శ్రుత్వా=విని; తతః=అంత; రామం=రాముని; పరిష్వజ్య= కవుఁగిలించుకొనియు; అభిపూజ్య చ=పూజించియు; అభివాద్య=నమస్కరించి; ఆహవం=యుద్ధమునుగూర్చి ; యయౌ=పోయెను.

లక్ష్మణుండు , రామునిమాటనువిని, రాముంగవుఁగిలించికొని పూజించినమస్కరించి, యంత , యుద్ధంబునకుఁబోయెను.అని, తాత్పర్యము

స రావణం వారణహస్తబాహు
ర్దదర్శ దీప్తోద్యతభీమచాపమ్
ప్రచ్ఛాదయంతం శరవృష్టిజాలై
స్తాన్వానరాన్ భిన్నవికీర్ణదేహాన్. ౫౨

టీక॥ వారణహస్తబాహుః = ఏనుంగు తొండములవంటి చేతులుగల ; సః=ఆలక్ష్మణుఁడు ; దీప్తోద్యతభీమచాపం=ప్రకాశించుచున్నదియు నెత్తఁబడినదియునగు భయంకరమగు ధనుస్సుగలవాఁడును;భిన్నవికీర్ణదేహాన్=భేదింపఁబడినవియు వెదచల్లఁబడి నవియునగు దేహములుగల; తాన్= ఆ ; వానరాన్=వానరులను; శరవృష్టిజాలైః=బాణవర్షసమూహములచేత;ప్రచ్ఛాదయంతం=కప్పుచున్నవాఁడునగు; రావణం=రావణుని;దదర్శ= చూచెను.

ఏనుఁగుతొండములవంటిబాహువులుగలయాలక్ష్మణుండు, దేదీప్యమానంబగుభయంకరధనుస్సుఁబట్టుకొని , ఖిన్నులయి నేలంబడియుండు వానరులపై బాణవర్షంబులు గురిపించుచున్న రావణుంజూచెను.అని, తాత్పర్యము.

త మాలోక్య మహాతేజా హనుమా న్మారుతాత్మజః
నివార్య శరజాలాని ప్రదుద్రావ స రావణమ్. ౫౩

టీక॥మహాతేజాః=అధికమయిన పరాక్రమముగల; మారుతాత్మజః=వాయుదేవునికొడుకైన;సః=ఆ ; హనుమాన్=హనుమంతుఁడు; తం = ఆలక్ష్మణుని;ఆలోక్య=చూచి ; శరజాలాని=బాణసమూహములను;నివార్య=అడ్డగించి;రావణం= రావణునిగూర్చి; ప్రదుద్రావ=పరుగెత్తెను.

మహాతేజుండును వాయుదేవునికుమారుండునగుహనుమంతుండు, లక్ష్మణుండుయుద్ధంబునకు వచ్చుటఁజూచి; భృత్యుండుతానుండఁగానాయనకేలకిష్టమని బాణసమూహములనుసరకు సేయక, రావణునిపైకడరెను.

అని, తాత్పర్యము.

రథం తస్య సమాసాద్య భుజ ముద్యమ్య దక్షిణమ్
త్రాసయన్ రావణం ధీమాన్ హనుమాన్ వాక్యమబ్రవీత్. ౫౪

టీక॥ ధీమాన్=అధికమయినబుద్ధిగల; హనుమాన్=హనుమంతుండు; తస్య=ఆరావణునియొక్క; రథం=రథమును; సమాసాద్య=పొంది; దక్షిణం=కుడిదగు; భుజం=చేతిని; ఉద్యమ్య=ఎత్తి; రావణం=రావణునిఁ; త్రాసయన్=భయపెట్టుచు; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

బుద్ధిమంతుండగుహనుమంతుండు, రావణునిరథంబుఁజేరి, కుడిభుజంబెత్తి రావణునిభయపెట్టుచు,నిట్లనిచెప్పెను.

అని, తాత్పర్యము.

దేవదానవ గంధర్వా యక్షాశ్చ సహరాక్షసైః
అవశ్యంతు త్వయా భగ్నా వానరేభ్య స్తు తే భయమ్. ౫౫

టీక॥ త్వయా=నీచేత; దేవదానవగంధర్వాః=దేవతలునుదానవులునుగంధర్వులును; రాక్షసైస్సహ=రాక్షసులతోఁగూడ; యక్షాశ్చ=యక్షులును; అవశ్యంతు=తప్పకయె; భగ్నాః=జయింపఁబడిరి. తే=నీకు; వానరేభ్యస్తు=వానరులవలనమాత్రము; భయం=భయము.

నీవు, దేవతలనుదానవులనుగంధర్వులనుయక్షులనురాక్షసులను జయించియున్నావువాస్తవము; నీకువానరులవలనమాత్రముభయముగలదు.

అని, తాత్పర్యము.

ఏష మే దక్షిణో బాహుః పంచశాఖ స్సముద్యతః
విధమిష్యతి తే దేహా ద్భూతాత్మానం చిరోషితమ్. ౫౬

టీక॥ పంచశాఖః= అయిదు వ్రేళ్లు గలదియు; సముద్యతః = ఎత్తఁబడినదియునగు; ఏషః=ఈ; మే= నాయొక్క; దక్షిణః=కుడిదైన; బాహుః = చేయి; తే=నీయొక్క; దేహాత్ = దేహమునుండి; చిరోషితం=బహుకాలముగానున్న; భూతాత్మానం = ప్రాణిరూపుఁడయినయాత్మను; విధమిష్యతి= వెలువరింపఁగలదు.

అయిదువ్రేళ్లుగలదియు సముద్యతంబునయినయీనాదక్షిణబాహువు, ఇప్పుడు, నిన్నువధించినీదేహంబునబహుకాలంబుగానున్నజీవుని, వెలువరింపఁగలదు.అని,హనుమంతుండు, రావణునితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

శ్రుత్వా హనుమతో వాక్యం రావణో భీమవిక్రమః
సంరక్తనయనః క్రోధా దిదం వచన మబ్రవీత్.౫౭

టీక॥భీమవిక్రమః=భయంకరమయినపరాక్రమముగల; రావణః=రావణుఁడు; హనుమతః=హనుమంతునియొక్క; వాక్యం=మాటను; శ్రుత్వా=విని; క్రోధాత్ =కోపమువలన ; సంరక్తనయనః=ఎఱ్ఱనైనకన్నులుగలవాఁడై; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

భయంకర పరాక్రముఁడగు రావణుఁడు,హనుమంతునిమాటనువిని, కోపంబునఁగన్నుల నెఱ్ఱఁదనంబుగదుర , హనుమంతుంజూచి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

క్షిప్రం ప్రహర నిశ్శంకం స్థిరాం కీర్తిమ వాప్నుహి
తతస్త్వాం జ్ఞాతవిక్రాంతం నాశయిష్యామి వానర. ౫౮

టీక॥వానర=హనుమంతుఁడా! క్షిప్రం=శీఘ్రముగా; నిశ్శంకం = నిర్భయముగా; ప్రహర=కొట్టుము; స్థిరాం=నాశములేని; కీర్తిం=కీర్తిని; అవాప్నుహి=పొందుము.తతః=అంత ; జ్ఞాతవిక్రాంతం=తెలియఁబడిన పరాక్రమముగల; త్వాం=నిన్ను; నాశయిష్యామి= నశింపఁజేసెదను.

హనుమంతుఁడా!శీఘ్రంబున నిర్భయంబుగాఁబ్రహరింపుము ; ఒకకోఁతి

రావణునియుద్ధంబునం గొట్టెనని స్థిరమయినకీర్తిఁబొందుము; అంత, నేను, నీపరాక్రమంబుఁదెలిసి, నిన్నువధించిపుచ్చెదను. అని, రావణుఁడుహనుమంతునితోఁజెప్పెను. అ:, తాత్పర్యము.

రావణస్య వచ శ్శ్రుత్వా వాయుసూను ర్వచో బ్రవీత్

టీక॥ వాయుసూనుః= వాయుదేవునికుమారుఁడైన హనుమంతుఁడు; రావణస్య=రావణునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; వచః= మాటను; అబ్రవీత్=చెప్పెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు, రావణునిమాటనువిని, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రహృతంహి మయా పూర్వ మక్షం స్మర సుతం తవ. ౫౯

టీక॥ పూర్వం=మున్ను; మయా=నాచేత; ప్రహృతంహి = కొట్టఁబడినవాఁడేయయిన; తవ= నీయొక్క; అక్షం=అక్షుఁడను, సుతం= కొడుకును; స్మర=తలంపుము.

మున్ను నాచే దెబ్బదిని చచ్చిన నీకొడుకునక్షునిందలఁచుకొనుము. అని, హనుమంతుండు, రావణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః
ఆజఘానానిలసుతం తలే నోరసి వీర్యవాన్. ౬౦

టీక॥ మహాతేజాః= అధికమయిన కాంతిగలవాఁడును; వీర్యవాన్ = అధికమయిన పరాక్రమముగలవాఁడునగు; రాక్షసేశ్వరః= రాక్షసరాజుఁడగు రావణుఁడు; ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; అనిలసుతం=హనుమంతుని; తలేన=అఱచేత; ఉరసి=ఱొమ్మునందు; ఆజఘాన=కొట్టెను.

మహాతేజుండు మహాపరాక్రమశాలియునగు రాక్షసరాజు రావణుండు, హనుమంతునిమాటనువిని ఱొమ్మునన అఱచేతంజఱచెను. అని, తాత్పర్యము.

స తలాభి హతస్తేన చచాలచ ముహుర్ముహుః

టీ॥ సః=ఆహనుమంతుఁడు ; తేన=ఆ రావణునిచేత ; తలాభిహతః=అఱచేతఁగొట్టఁబడినవాఁడై ; ముహుర్ముహుః=పలుమాఱు; చచాలచ=చలించెను.

హనుమంతుఁడు, రావణునియఱచేతిదెబ్బకుమిక్కిలియుఁజలనంబునొందెను. అని, తాత్పర్యము.

స్థిత్వా ముహూర్తం తేజస్వీ స్థైర్యం కృత్వా మహామతిః. ౬౧
ఆజఘానాభి సంక్రుద్ధ స్తలేనైవా మరద్విషమ్

టీక॥ తేజస్వీ = అధికమయినపరాక్రమముగలవాఁడును; మహామతిః=అధికమయినబుద్ధిగలవాఁడునగు హనుమంతుఁడు;ముహూర్తం=కొంచెముసేపు; స్థిత్వా=ఉండి; స్థైర్యం=నిశ్చలతను; కృత్వా=చేసి; అభిసంక్రుద్ధః=మిక్కిలియుఁగోపించినవాఁడై; తలేనైవ=అఱచేతిచేతనె; అమరద్విషం=దేవశత్రువైనరావణుని ; ఆజఘాన =కొట్టెను.

మహాపరాక్రమశాలియుబుద్ధిమంతుండునగుహనుమంతుండు, కొంచెముసేపుండి స్థైర్యంబుదెచ్చుకొని, పరమక్రుద్ధుండై, యారావణునినఱచేతంబ్రహరించెను. అని, తాత్పర్యము.

తత స్తలే నాభిహతో వానరేణ మహాత్మనా. ౬౨
దశగ్రీవ స్సమాధూతో యథా భూమి చలేఽచలః

టీక॥ తతః=అంత; దశగ్రీవః=రావణుఁడు; మహాత్మనా= అధికమయినబలముగల ; వానరేణ=హనుమంతునిచేత; తలేన = అఱచేతిచేత; అభిహతః=కొట్టఁబడినవాఁడై; భూమితలే=భూతలమునందు; అచలోయథా=పర్వతమువలె; సమాధూతః = చలించినాఁడు.

అంత, రావణుండు , మహాబలుండగుహనుమంతుని యఱచేతిదెబ్బకు , భూకంపమునఁ బర్వతముచలించు నట్లు , మిక్కిలియుఁజలించెను. అని, తా.

సంగ్రామే తం తథాదృష్ట్వా రావణం తలతాడితమ్. ౬౩
ఋషయో వానరా స్సిద్ధా నేదు ర్దేవా స్సహాసురైః

టీక॥ తథా=అట్లు; సంగ్రామే = యుద్ధమునందు; తలతాడితం= అఱచేతంగొట్టఁబడిన; తం=ఆ; రావణం = రావణుని;దృష్ట్వా=చూచి;వానరాః= వానరులును; ఋషయః=ఋషులును; సిద్ధాః=సిద్ధులును; దేవాః = దేవతలును; అసురైస్సహ= అసురులతోఁగూడ; నేదుః=అఱచిరి.

అట్లు, రావణుండు, యుద్ధంబున, హనుమంతుని హస్తతలంబునం దాడితుండై చలించుటంజూచి, వానరులును, ఋషులును సిద్ధులును దేవతలు నసురులను బరమసంతోషంబునఁ గోలాహలంబు గావించిరి. అని, తాత్పర్యము.

అథాశ్వాస్య మహాతేజా రావణో వాక్య మబ్రవీత్. ౬౪

టీక॥ అథ=అంత; మహాతేజాః = అధికమయినపరాక్రమముగల ; రావణః=రావణుఁడు; ఆశ్వాస్య= ఊఱడిలి; వాక్యం=మాటను ; అబ్రవీత్ = చెప్పెను.

అంత , మహాతేజుండగు రావణుండు, ఊఱటనొంది , హనుమంతుంజూచి, యిట్లని, చెప్పెను.
అని, తాత్పర్యము.

సాధు వానర వీర్యేణ శ్లాఘనీయో సి మేరిపుః

టీక॥ వానర = హనుమంతుఁడా! సాధు=లెస్స. మే=నాకు; రిపుః=శత్రుఁడవైనను; వీర్యేణ=పరాక్రమముచేత; శ్లాఘనీయః = కొనియాడఁదగినవాఁడవు; అసి=అగుచున్నావు.

హనుమంతుఁడా! లెస్సలెస్సనీవు నాకుశత్రుఁడవైననునీపరాక్రమంబునకు మెచ్చుకొన్నాను. అని,రావణుండు హనుమంతునితోఁజెప్పెను.
అని, తాత్పర్యము.

ధిగస్తు మమ వీర్యేణ మారుతి ర్వాక్య మబ్రవీత్. ౬౫

టీక॥ మారుతిః= వాయుపుత్రుఁడు కైనహనుమంతుఁడు; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను. మమ= నాయొక్క; వీర్యేణ(వీర్యం) = పరాక్రమమునుగూర్చి; ధిక్=దహింపఁబడుట; అస్తు=అగుగాక.

అంత, హనుమంతుండిట్లని చెప్పెను; నాపరాక్రమమేల? దహింపఁబడుఁగాక. అని, తాత్పర్యము.

ధిగస్తు మమ వీర్యేణ యత్త్వం జీవసి రావణ

టీక॥ రావణ=రావణుఁడా! యత్=ఎందువలన, త్వం = నీవు; జీవసి= బ్రతికియున్నావో; తత్ (అధ్యాహృతము)= అందువలన; మమ=నాయొక్క; వీర్యేణ(వీర్యం)= పరాక్రమమునుగూర్చి; ధిక్=దహింపఁబడుట; అస్తు= అగుఁగాక,

రావణుఁడా! నాచేఁగొట్టఁబడినవాఁడవయ్యు నీవుచావక బ్రతికియున్నావే; అట్టినాపరాక్రమము దహింపఁబడుఁగాక. అని, తాత్పర్యము.

సకృత్తు ప్రహరేదానీం దుర్బుద్ధే కిం వికత్థసే. ౬౬

టీక॥ దుర్బుద్ధే= దుష్టబుద్ధిగలరావణుఁడా! ఇదానీం=ఇప్పుడు; సకృత్తు= ఒకమాఱుమాత్రము; ప్రహర = కొట్టుము. కిం=ఎందుకు; వికత్థసే = పొగడుకొనుచున్నావు?

దురాత్ముండవగు రావణుఁడా! ఇంకను ఒకమాఱుమాత్రము ప్రహరింపుము; ఊరకనిన్నునీవేపొగడుకొనెదవేల? అని, తాత్పర్యము.

తతస్త్వాం మామికా ముష్టిర్నయిష్యతి యమక్షయమ్

టీక॥ తతః=అంత; త్వాం= నిన్ను; మామికా=నాదైన; ముష్టిః = పిడికిలి; యమక్షయం=యమునియింటిని; నయిష్యతి(నేష్యతి)=పొందింపఁగలదు.

అంత, నేనొకపిడికిటిపోటుతో నిన్నుయమపురికింబంపెదను. అని, హనుమంతుండు, రావణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తతో మారుతి వాక్యేన క్రోధస్తస్య తథాజ్వలత్. ౬౭

టీక॥ తతః=అంత; మారుతివాక్యేన=హనుమంతునిమాటచేత ; తస్య=ఆరావణునియొక్క; క్రోధః = కోపము;తధా=అట్లు;అజ్వలత్=మండెను.

అంత,హనుమంతునిమాటకు,రావణునకుమహాకోపంబువచ్చినది.
అని, తాత్పర్యము.

సంరక్తనయనో యత్నాన్ముష్టి ముద్యమ్య దక్షిణామ్.
పాతయామాస వేగేన వానరోరసి వీర్యవాన్. ౬౮

టీక॥ వీర్యవాన్= అధికమయినపరాక్రమముగలరావణుఁడు, సంరక్తనయనః=మిక్కిలియెఱ్ఱని కన్నులుగలవాఁడై;యత్నాత్= ప్రయత్నముచేతను;దక్షిణాం=కుడిదైన;ముష్టిం = పిడికిలిని;ఉద్యమ్య=ఎత్తి;వేగేన = వేగముచేత;వానరోరసి= హనుమంతునివక్షస్స్థలమునందు;పాతయామాస = వేసెను.

మహాపరాక్రమశాలియగు రావణుండు,కోపంబునంగన్నుల నెఱ్ఱఁదనంబుదోఁప, దక్షిణహస్తంబున దృఢంబుగాఁబిడికిలిఁ బట్టి, వేగంబున, హనుమంతునివక్షస్స్థలంబునఁబొడిచెను.
అని, తాత్పర్యము.

హనుమాన్ వక్షసి వ్యూఢే సంచచాల హతః పునః

టీక॥ హనుమాన్= హనుమంతుఁడు ; వ్యూఢే=విశాలమయిన;వక్షసి=ఱొమ్మునందు; హతః = కొట్టఁబడినవాఁడై; పునః=మరల; సంచచాల = మిక్కిలియుఁజలించెను.

హనుమంతుండు,అట్లువిశాలంబగువక్షస్స్థలంబునఁగొట్టఁబడినవాఁడై, మఱలఁజలనంబునొందెను.
అని, తాత్పర్యము.

విహ్వలంతు తదా దృష్ట్వా హనుమంతం మహాబలమ్. ౬౯
రథే నాతి రథ శ్శీఘ్రం నీలం ప్రతి సమభ్యగాల




టీక॥ అతిరథః = పెక్కురథికులతోఁబోరునట్టిరావణుఁడు; తదా= అప్పుడు; మహాబలం= అధికమయినబలముగల; హనుమంతం=హనుమంతుని; విహ్వలంతు= అవయవములస్వాధీనతదప్పినవానిఁగా; దృష్ట్వాతు=చూచినంతనె; రథేన=రథముచేత; శీఘ్రం= శీఘ్రముగా; నీలంప్రతి= నీలునిగూర్చి; సమభ్యగాత్=పోయెను.

అతిరథుండగురావణుండు, మహాబలశాలియయినహనుమంతుండు సోలుటంజూచి, యాతఁడు తెప్పిఱిలినఁగష్టమని శీఘ్రంబుననీలునిమీఁదికిఁ బోయెను. అని, తాత్పర్యము.

రాక్షసానా మధిపతి ర్దశగ్రీవః ప్రతాపవాన్. ౭౦
పన్నగ ప్రతిమై ర్భీమైః పరమర్మాతిభేదిభిః
శరై రాదీపయామాస నీలం హరి చమూపతిమ్. ౭౧

టీక॥ప్రతాపవాన్= అధికమయినప్రతాపము గలవాఁడును; రాక్షసానాం= రాక్షసులకు; అధిపతిః= ప్రభువనగు;దశగ్రీవః= రావణుఁడు; పన్నగప్రతిమైః=సర్పములతోఁ బోలికగలవియు;భీమైః=భయంకరములును; పరమమర్మాతిభేదిభిః=శత్రువులజీవస్థానంబులభేదించునవియునగు; శరైః= బాణములచేత;హరిచమూపతిం= వానరసేనానాయకుఁడగు;నీలం=నీలుని; ఆదీపయామాస=వెలిఁగించెను.

మహాపరాక్రమశాలియగు రాక్షసేశ్వరుండు రావణుండు,పన్నగతుల్యంబులును భయంకరంబులునుశత్రువుల మర్మస్థానంబులభేదించునవియునగు బాణంబులు, వానరసేనానాయకుండగు నీలునిపైఁ,బఱపెను.అని, తాత్పర్యము.

స శరౌఘ సమాయస్తో నీలః కపి చమూపతిః
కరే ణైకేన శైలాగ్రం రక్షోధి పతయే సృజయత్. ౭౨

టీక॥ కపిచమూపతిః=వానరసేనానాయకుఁడగు, ;నీలః= నీలుఁడు; శరౌఘసమాయస్తః = బాణసమూహములచేఁబీడింపఁబడినవాఁడై ; ఏకేన=ఒక్కటైన;కరేణ=చేతిచేత;శైలాగ్రం=పర్వతశిఖరమును; రక్షోధిపత




యేఁ=రాక్షసరాజుకొఱకు; అస్పృజత్ = విడిచెను.

వానరసేనానాయకుండగు నీలుండు అట్టిబాణసమూహంబులచేఁ బీడితుండై, ఒకని చేత, నొకపర్వతశిఖరంబుఁ గొని, రాక్షసరాజుపైని వేసెను. అని, తాత్పర్యము.

హనుమానపి తేజస్వీ సమాశ్వస్తో మహామనాః
విప్రేక్షమాణో యుద్ధేప్సు స్సరోష మిద మబ్రవీత్. ౭౩
నీలేన సహ సంయుక్తం రావణం రాక్షసేశ్వరమ్

టీక॥ తేజస్వీ=అధికమయినపరాక్రమముగలవాఁడును; మహామనాః=పూజ్యమయినమనస్సుగలవాఁడునగు; హనుమానపి=హనుమంతుండును; సమాశ్వస్తః = ఊఱడిలినవాఁడై; యుద్ధేప్సుః=యుద్ధంబుఁగోరువాఁడై; విప్రేక్షమాణః=చూచుచున్నవాఁడై; నీలేన సహ=నీలునితోఁగూడ; సంయుక్తం= కూడిన; రాక్షసేశ్వరం = రాక్షసనాథుఁడయిన; రావణం = రావణునిగూర్చి; సరోషం= కోపముతోఁగూడునట్లుగా; ఇదం=ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

మహాపరాక్రమశాలియు మహాత్ముండునగు హనుమంతుండంతఁ దెప్పిఱిలి, యుద్ధకాంక్షచే నలుప్రక్కలం జూచి, నీలునితోయుద్ధంబుఁ గావించుచున్న రావణుంగని, తప్పించుకొని పోయినాఁడనుకోపంబున, నతనితో నిట్లని చెప్పెను, అని, తాత్పర్యము.

అన్యేన యుధ్యమానస్య నయుక్త మభిధావనమ్. ౭౪

టీక॥ అన్యేన=ఇతరునితో; యుధ్యమానస్య= యుద్ధము సేయుచున్నవాని యొక్క; అభిధావనం=తఱుముట; నయుక్తం=సరిగాదు.

మఱియొకనితోడ యుద్ధము సేయుచున్నవానిం దఱుముకొనిపోవుటయుక్తముకాదు; కావున నిన్ను విడిచినాను. అని, హనుమంతుండు, రావణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

రావణోపి మహాతేజా స్తచ్ఛృంగం సప్తభి శ్శరైః

ఆజఘాన సుతీక్ష్ణాగ్రై స్తద్వికీర్ణం పపాత హ. ౭౫

టీక॥ మహాతేజాః= అధికమయిన పరాక్రమముగల; రావణోపి= రావణుండును; తత్=ఆ; శృంగం=పర్వతశిఖరమును; సుతీక్ష్ణాగ్రైః= మిక్కిలియు గఱుకులయినకొనలుగల ; సప్తభిః=ఏడైన; శరైః=బాణములచేత; ఆజఘాన=కొట్టెను. తత్=అది; వికీర్ణం=తునకలై ; పపాత=పడెను. ("హ" అనునది పాదపూరణార్థము).

మహాతేజుండగు రావణుండును, ఆ పర్వతశిఖరంబును, ఏడుతీక్ష్ణబాణంబులచేఖండింప, నదితునియలయి నేలంబడెను. అని, తాత్పర్యము.

తద్వికీర్ణం గిరేశ్శృంగం దృష్ట్వా హరిచమూపతిః
కాలాగ్ని రివ జజ్వాల క్రోధేన పరవీరహా. ౭౬

టీక॥ పరవీరహా=శత్రువీరులవధించునట్టి; హరిచమూపతిః= వానరసేనానాయకుండైననీలుండు; వికీర్ణం=తునియలయిన; తత్=ఆ; గిరేః = పర్వతముయొక్క; శృంగం= శిఖరమును; దృష్ట్వా=చూచి; క్రోధేన=కోపముచేత; కాలాగ్నిరివ = ప్రళయాగ్నివలె; జజ్వాల=మండెను.

శత్రువీరులవధించునట్టివానరసేనానాయకుండగునీలుండు, తానుప్రయోగించినపర్వతశిఖరంబు తునియలగుటం జూచి, కోపంబునం, బ్రళయకాలాగ్నికైవడిమండిపడెను. అని, తాత్పర్యము.

సోశ్వకర్ణాన్ ధవాన్ సాలాంశ్చూతాంశ్చాపి సుపుష్పితాన్
అన్యాంశ్చ వివిధాన్ వృక్షాన్ నీలశ్చిక్షేప సంయుగే. ౭౭

టీక॥ సః=ఆ; నీలః=నీలుండు; సంయుగే=యుద్ధమునందు; అశ్వకర్ణాన్=ఇనుమద్దిచెట్లను; ధవాన్= చంద్రచెట్లను; సాలాన్ = మద్దిచెట్లను; సుపుష్పితాన్ = చక్కఁగాఁబూచిన ; చూతాంశ్చాపి = మామిడి చెట్లను ; అన్యాన్=ఇతరములయిన; వివిధాన్= నానావిధములయిన; వృక్షాంశ్చ = చె

ట్లను; చిక్షేప= వేసెను.

ఆనీలుండప్పుడుయుద్ధంబున, ఇనుమద్దిచెట్లనుచండ్రచెట్లను; చక్కఁగాఁ బూచినమామిడిచెట్లను, మఱియు నితరములయిన నానావిధవృక్షములను రావణునిపై వేసెను.

అని, తాత్పర్యము.

స తాన్ వృక్షాన్ సమాసాద్య ప్రతిచిచ్ఛేద రావణః
అభ్యవర్షత్సుఘోరేణ శరవర్షేణ పావకిమ్. ౭౮

టీక॥ సః=ఆ; రావణః= రావణుఁడు; తాన్=ఆ; వృక్షాన్= వృక్షములను; సమాసాద్య=పొంది; ప్రతిచిచ్ఛేద=నఱకెను. సుఘోరేణ = మిక్కిలి యుభయంకరమయిన; శరవర్షేణ= బాణములవానచేత; పావకిం= అగ్నిపుత్రుఁడగు నీలునిగూర్చి; అభ్యవర్షత్=కురిసెను.

అంత, రావణుండు, ఆవృక్షముల నన్నింటినిగాఁ బాణంబులఖండించి, నీలునిమీఁద, మిక్కిలియుభయంకరంబగు బాణవర్షంబుఁ గురిపించెను.

అని, తాత్పర్యము.

అభివృష్ట శ్శరౌఘేన మేఘేనేవ మహాచలః
హ్రస్వం కృత్వా తదా రూపం ధ్వజాగ్రే నిపపాత హ. ౭౯

టీక॥ సః (అధ్యాహృతము)= ఆనీలుఁడు; మేఘేన=మేఘములచేత; మహాచలఇవ=మహాపర్వతమువలె; శరౌఘేణ=బాణసమూహముచేత; అభివృష్టః=కురిపింపఁబడినవాఁడై; తదా= అప్పుడు; రూపం=ఆకారమును; హ్రస్వం=చిన్నదిగా; కృత్వా=చేసికొని; ధ్వజాగ్రే=టెక్కెముయొక్కకొనను; నిపపాత=వ్రాలెను ("హ" అనునది పాదపూరణార్థము).

ఆనీలుండు, అట్లు మేఘంబుచే మహాపర్వతంబుకరణి, రావణునిచే బాణవర్షంబునన భివృష్టుండై, తనయాకారమును హ్రస్వమును గావించికొని, రావణునిధ్వజాగ్రంబుమీఁదికి వ్రాలెను.

అని, తాత్పర్యము.

పావకాత్మజ మాలోక్య ధ్వజాగ్రే సముపస్థితమ్
జజ్వాల రావణః క్రోధా త్తతో నీలో ననాదచ. ౮౦

టీక॥ రావణః=రావణుఁడు; ధ్వజాగ్రే=టెక్కెముకొనను ; సముపస్థితం=ఉన్న; పావకాత్మజం= నీలుని;ఆలోక్య=చూచి;క్రోధాత్ = కోపమువలన;జజ్వాల=మండెను. తతః= అంత; నీలః=నీలుఁడు; ననాదచ=అఱచెను.

రావణుండట్లు నీలుండు తనధ్వజాగ్రంబుమీఁదికిఁ బ్రాలుటంజూచి , పరమక్రుద్ధుండై మండిపడెను; నీలుండుధ్వజాగ్రంబుననుండి,సింహనాదంబుగావించెను. అని, తాత్పర్యము.

ధ్వజాగ్రే ధనుషశ్చాగ్రే కిరీటాగ్రేచ తంహరిమ్
లక్ష్మణోథ హనూమాంశ్చ దృష్ట్వా రామశ్చ విస్మితాః. ౮౧

టీక॥ అథ=అంత;లక్ష్మణః= లక్ష్మణుండును;హనూమాంశ్చ= హనుమంతుండును;రామశ్చ=రాముఁడును; ధ్వజాగ్రే=టెక్కెముకొనను; ధనుషః=వింటియొక్క;అగ్రేచ = కొనను; కిరీటాగ్రేచ=కిరీటముకొనను;తం = ఆ; హరిం=నీలుని;దృష్ట్వా=చూచి ; విస్మితాః=ఆశ్చర్యపడిరి.

అంత, రావణునికి బాణంబువిడువ గుఱి నిలువకుండునట్లు ధ్వజాగ్రంబునను,ధనురగ్రంబునను , కిరీటాగ్రంబునను సంచరించుచున్న నీలుఁజూచి , లక్ష్మణుండును హనుమంతుండును రాముండును ఆశ్చర్యమునొందిరి.
అని, తాత్పర్యము.

రావణోపి మహాతేజాః కపిలాఘవవిస్మితః
అస్త్ర మాహారయామాస దీప్తమాగ్నేయ మద్భుతమ్. ౮౨

టీక॥మహాతేజాః= అధికమయినతేజస్సుగల;రావణోపి= రావణుఁడును;కపిలాఘవవిస్మితః = నీలునిలాఘవమువ కాశ్చర్యమునొందినవాఁడై; దీప్తం= ప్రకాశించుచున్నదియు; అద్భుతం=ఆశ్చర్యకరంబునగు; ఆగ్నేయం= అగ్ని

స ౫౯

దేవతాకమయిన; అస్త్రం=అస్త్రమును; ఆహారయామాస=గ్రహించెను.

మహాతేజుండగు రావణుండును, నీలుని లాఘవమున కాశ్చర్యమునొంది, దివ్యంబగు నాగ్నేయాస్త్రంబు గ్రహించెను. అని, తాత్పర్యము.

తతస్తే చుక్రుశుః హృష్టా లబ్ధలక్షాః ప్లవంగమాః
నీలలాఘవసంభ్రాంతం దృష్ట్వా రావణ మాహవే. ౮౩

టీక॥ తతః=అంత; తే=ఆ; ప్లవంగమాః=వానరులు; ఆహవే=యుద్ధమునందు; నీలలాఘవసంభ్రాంతం=నీలుని లాఘవముచే భ్రాంతినొందిన; రావణం=రావణుని; దృష్ట్వా=చూచి; లబ్ధలక్షాః=పొందఁబడిన విషయముగలవారలయి; హృష్టాః=సంతోషించినవారలయి; చుక్రుశుః=అఱచిరి.

అంత నావానరులందఱు, రావణుండు యుద్ధంబున నీలుని లాఘవంబుచే సంభ్రాంతుండగుట నెఱింగి, సంతోషంబు నొంది సింహనాదంబులు గావించిరి. అని, తా.

వానరాణాంచ నాదేన సంరబ్ధో రావణ స్తదా
సంభ్రమావిష్టహృదయో న కించి త్ప్రత్యపద్యత. ౮౪

టీక॥ తదా=అప్పుడు; సంరబ్ధః=సంరంభముగలవాఁడును; సంభ్రమావిష్టహృదయః=తొట్రుపాటుచేఁ బొందఁబడిన మనస్సుగలవాఁడునగు; రావణః=రావణుఁడు; వానరాణాం=వానరులయొక్క; నాదేనచ=అఱపుచేతను; కించిత్=కొంచెమేని; న ప్రత్యపద్యత=పొందఁడయ్యె.

అప్పుడు, నీలుని లాఘవంబుచే సంభ్రాంతుండై యాగ్నేయాస్త్రసంధాన సంరంభంబుననున్న రావణుండు, వానరులు చేయు కోలాహలంబుచేఁ, గొంతసేపేమియుఁ దోఁచకుండెను.

అని, తాత్పర్యము.

ఆగ్నేయేనాథ సంయుక్తం గృహీత్వా రావణ శ్శరమ్
ధ్వజశీర్ష స్థితం నీల ముదైక్షత నిశాచరః. ౮౫

టీక॥ అథ=అంత; నిశాచరః=రాక్షసుఁడైన; రావణః=రావణుఁడు; ఆ

గ్నేయేన=ఆగ్నేయాస్త్రముతో ; సంయుక్తం=కూడిన;శరం= బాణమును; గృహీత్వా=గ్రహించి ; ధ్వజశీర్షస్థితం= టెక్కెముయొక్క శిరస్సునందున్న;నీలం=నీలుని ; ఉద్దిశ్య = చూచెను.

అంత, రావణుఁడు , ఆగ్నేయాస్త్రముతోనభిమంత్రింపఁబడిన శరంబుఁ దీసి,ధ్వజాగ్రంబుననున్ననీలుం గాంచెను. అని, తాత్పర్యము.

తతో౽బ్రవీ న్మహాతేజా రావణో రాక్షసేశ్వరః

టీక॥ తతః=అంత; మహాతేజాః= అధికమయిన పరాక్రమముగలవాఁడును; రాక్షసేశ్వరః=రాక్షసనాథుండును; రావణః = రావణుఁడు ; అబ్రవీత్ =చెప్పెను.

అంత, మహాపరాక్రమశాలియగు రాక్షసరాజు రావణుఁడు , నీలునితో నిట్లని, చెప్పెను. అని,తాత్పర్యము.

కపే లాఘవయుక్తో౽సి మాయయా పరయా౽నయా. ౮౬

టీక॥ కపే=నీలుఁడా! అనయా= ఈ; పరయా=అధికమయిన; మాయయా=మాయచేత; లాఘవయుక్తః= లాఘవముతోఁగూడినవాఁడవు; అసి= అగుచున్నావు.

నీలుఁడా! నీవు, చాలమాయలు నేర్చినవాఁడవు ; మహాలాఘవముగలిగి యున్నావు.అని, తాత్పర్యము.

జీవితం ఖలు రక్షస్వ యది శక్తో౽సి వానర

టీక॥ వానర= నీలుఁడా! శక్తో౽సి యది=శక్తుండవగుదువేని ; జీవితంఖలు=ప్రాణమునుమాత్రము ; రక్షస్వ= కాపాడుకొనుము.

నీలుఁడా! ఇప్పుడు,నీకుశక్తిగలచేని నీప్రాణము రక్షించుకొనుము.

అని, తాత్పర్యము.

తాని తాన్యాత్మరూపాణి సృజసి త్వ మనేకశః. ౮౭

టీక॥ త్వం=నీవు; అనేకశః= అనేకముగా; తానితాని = ఆయా ; ఆత్మ




రూపాణి=ఆకారములను ; సృజసి= సృజించుచున్నావు.

నీవు, నానావిధములగున ట్టియ్యేరూపంబులందాల్చెదవు ; దానింజూడనాశ్చర్యమగుచున్నది. అని, తాత్పర్యము.

తథాపి త్వాం మయా యుక్త స్సాయకో స్త్ర ప్రయోజితః
జీవితం పరిరక్షంతం జీవితా ద్భ్రంశయిష్యతి. ౮౮

టీక॥ తథాపి=అట్లయినను ; మయా=నాచేత;యుక్తః = ప్రయోగింపఁబడిన;అస్త్రప్రయోజితః = అస్త్రముతోఁగూర్పఁబడిన;శరః= బాణము; జీవితం=ప్రాణమును ; పరిరక్షంతం=కాపాడుకొనుచున్న; త్వాం = నిన్ను; జీవితాత్=ప్రాణమునుండి ; భ్రంశయిష్యతి=త్రోయఁగలదు.

అట్లు, నీవుప్రాణసంరక్షణార్థము యి మాయచే నానావిధరూపంబులు దాల్చుచున్నను, నేనిప్పుడుప్రయోగింపుచివ్యాస్త్రయుక్తమగుబాణము, నిన్నుమృతుంజేయఁగలదు. అని, రావణుండు నీలునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా మహాబాహూ రావణో రాక్షసేశ్వరః
సంధాయ బాణ మస్త్రేణ చమూపతి మతాడయత్. ౮౯

టీక॥ మహాబాహుః=పెద్దచేతులు గలవాఁడును; రాక్షసేశ్వరః= రాక్షసనాథుఁడునగు; రావణః = రావణుండు;ఏవం=ఇట్లు;ఉక్త్వా= చెప్పి ; బాణం=బాణమును;అస్త్రేణ= ఆగ్నేయాస్త్రముతో;సంధాయ= కూర్చి; చమూపతిం = సేనానాయకుఁడగునీలుని;అతాడయత్=కొట్టెను.

మహాబాహుండగు రాక్షసేశ్వరుండగురావణుండు, ఈప్రకారమునంజెప్పి, యాగ్నేయాస్త్రంబుచే బాణంబునభిమంత్రించి, వానరసేనానాయకుండగునీలుపైవిడిచెను.

అని, తాత్పర్యము.

సో స్త్రయుక్తేన బాణేన నీలో వక్షసి తాడితః
నిర్దహ్యమాన స్సహసా నిపపాత మహీతలే. ౯౦







టీక॥ సః=ఆ; నీలః=నీలుఁడు; అస్త్రయుక్తేన= ఆగ్నేయాస్త్రముతోఁ గూడిన; బాణేన=బాణముచేత ; వక్షసి=ఱొమ్మునందు; తాడితః = కొట్టఁబడినవాఁడై; విదహ్యమానః= దహింపఁబడుచున్నవాఁడై; సహసా= శీఘ్రముగ; మహీతలే=భూతలమునందు ; నిపపాత=పడెను.

ఆనీలుండు, ఆగ్నేయాస్త్రముచేవక్షస్థలంబునం దాడితుండై , యాదివ్యాస్త్రజ్వాలలచే దహింపఁబడుచు, తటాలున, ధ్వజాగ్రంబుననుండి భూమిం బడెను. అని, తాత్పర్యము.

పితృమాహాత్మ్యసంయోగా దాత్మనశ్చాపి తేజసా
జానుభ్యా మపతద్భూమౌ నచ ప్రాణైర్వ్యయుజ్యత. ౯౧

టీక॥ సః (అధ్యాహృతము)= ఆనీలుఁడు; పితృమాహాత్మ్యసంయోగాత్=తండ్రియొక్క ప్రభావము చేరుటవలనను; ఆత్మనః=తనయొక్క; తేజసా చాపి= తేజస్సుచేతను ; జానుభ్యాం= మోఁకాళ్లచే; భూమౌ = నేలయందు; అపతత్=పడెను. ప్రాణైః = ప్రాణములచేత; నవ్యయుజ్యత చ=విడువఁబడఁడయ్యెను.

ఆనీలుఁడు, తండ్రియగునగ్నిహోత్రుని యనుగ్రహమువలనను , తనతేజోమహిమవలనను , అయ్యాగ్నేయాస్త్రంబుచే విసంజ్ఞుండై మోఁకాళ్లానుకొని నేలంబడెనుగాని మృతుండు కాఁడయ్యె. అని, తాత్పర్యము.

విసంజ్ఞం వానరం దృష్ట్వా దశగ్రీవో రణోత్సుకః
రథే నాంబుదనాదేన సౌమిత్రి మభిదుద్రువే. ౯౨

టీక॥ దశగ్రీవః=రావణుండు ; విసంజ్ఞం=తెలివిదప్పిన; వానరం = నీలుని; దృష్ట్వా=చూచి; రణోత్సుకః= యుద్ధోత్సాహముగలవాఁడై ; అంబుదనాదేన= మేఘముయొక్కధ్వనివంటి ధ్వనిగల; రథేన=రథముచేత; సౌమిత్రిం= లక్ష్మణుని; అభిదుద్రువే=తఱిమెను.

రావణుండు, నీలుండుమూర్ఛితుండగుటనుజూచి, యుద్ధోత్సుకుండై, మేఘగర్జనంబువంటిధ్వనిగలరథంబుచే, లక్ష్మణునిమీఁదికడరెను.

అని, తాత్పర్యము.




ఆసాద్య రణమధ్యేతు వారయిత్వా స్థితో జ్వలన్
ధను ర్విస్ఫారయామాస కంపయన్నివ మేదినీమ్ ౯౩

టీక॥ సః(అధ్యాహృతము) = ఆ రావణుఁడు; ఆసాద్య=పొంది ; వారయిత్వా=అడ్డగించి; రణమధ్యే= యుద్ధమునడుమ; జ్వలన్ = ప్రకాశించుచు స్థితః= నిలిచినవాఁడై; మేదినీం=భూమిని; కంపయన్నివ = కదలించువాఁడువలె; ధనుః=వింటిని; విస్ఫారయామాస= ధ్వనింపఁజేసెను.

ఆ రావణుండు, లక్ష్మణుఁబొంది, యడ్డమువచ్చిన సుగ్రీవాదులవారించి, యుద్ధమధ్యంబునఁ దేజరిల్లుచున్నవాఁడై; భూమియదరునట్లు, ధనుస్సును, జ్యాకర్షణంబున, ధ్వనింపఁజేసెను. అని, తాత్పర్యము.

త మాహ సౌమిత్రి రదీనసత్త్వో
విస్ఫారయంతం ధను రప్రమేయమ్

టీక॥ అదీనసత్త్వః= తక్కువగానిబలముగల; సౌమిత్రిః=లక్ష్మణుఁడు; అప్రమేయం = కొలఁతపెట్టరాని; ధనుః=వింటిని; విస్ఫారయంతం=ధ్వనింపఁజేయుచున్న ; తం = ఆ రావణుని గూర్చి; ఆహ = చెప్పుచున్నాఁడు.

మహాబలశాలియగు లక్ష్మణుండు, అట్లుమహాప్రమాణంబగుధనుస్సును ధ్వనింపఁజేయుచున్న రావణుఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అభ్యేహి మామేవ నిశాచరేంద్ర
న వానరాం స్త్వం ప్రతియోద్ధు మర్హః. ౯౪

టీక॥ నిశాచరేంద్ర=రాక్షసరాజుఁడవగు రావణుఁడా! త్వం=నీవు; మామేవ=నన్ను గూర్చియె; అభ్యేహి= రమ్ము. వానరాన్=వానరులనుగూర్చి ; ప్రతియోద్ధుం=యుద్ధముసేయుటకు ; నార్హః= తగినవాఁడవుకావు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఈవానరులతోయుద్ధముసేయుచున్నావేమి? నాయెద్దకురమ్ము. అని, లక్ష్మణుండు, రావణునితోఁజెప్పెను. అని, తా.

స తస్య వాక్యం ప్రతిపూర్ణఘోషం

జ్యాశబ్దముగ్రం చ నిశమ్య రాజా
ఆసాద్య సౌమిత్రి మవస్థితం తం
కోపాన్వితో వాక్య మువాచ రక్షః. ౯౫

టీక॥ రక్షః=రాక్షసుఁడయిన; సః=ఆ; రాజా=రావణుఁడు; తస్య=ఆలక్ష్మణుని యొక్క; ప్రతిపూర్ణఘోషం=నిండినధ్వనిగల; వాక్యం=మాటను; ఉగ్రం=భయంకరమయిన; జ్యాశబ్దం=అల్లెత్రాటిధ్వనిని; నిశమ్య=విని; అవస్థితం=నిలిచియున్న; తం=ఆ; సౌమిత్రిం=లక్ష్మణుని; ఆసాద్య=డగ్గఱి; కోపాన్వితః=కోపముతోఁగూడినవాఁడై; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు, ఆలక్ష్మణుని యతిగంభీరధ్వనిగల మాటను భయంకరంబగు జ్యానాదంబునువిని, క్రుద్ధుండై, లక్ష్మణునిడగ్గఱి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

దిష్ట్యాసి మే రాఘవ దృష్టిమార్గం
ప్రాప్తోంతగామీ విపరీతబుద్ధిః

టీక॥ రాఘవ=లక్ష్మణుఁడా! అంతగామీ=నాశమునుబొందువాఁడవు; విపరీతబుద్ధిః=విపరీతమయినబుద్ధిగలవాఁడవునగు; త్వం (అధ్యాహృతము)=నీవు; దిష్ట్యా=భాగ్యముచేత; మే=నాయొక్క; దృష్టిమార్గం=చూపుయొక్క-మార్గమును; ప్రాప్తః=పొందినవాఁడవు; అసి=అగుచున్నావు.

లక్ష్మణుఁడా! నీకు నాశముసమీపించినదికావున, విపరీతబుద్ధితో, నా భాగ్యవశంబున, నాదృష్టింబడినావు. అని, తాత్పర్యము.

అస్మిన్ క్షణే యాస్యసి మృత్యుదేశం
సంసాద్యమానో మమ బాణజాలైః. ౯౬

టీక॥ అస్మిన్=ఈ; క్షణే=క్షణమందు; మమ=నాయొక్క; బాణజాలైః=బాణసమూహములచేత; సంసాద్యమానః=హింసింపఁబడినవాఁ

డవై; మృత్యుదేశం= మృత్యువుయొక్క ప్రదేశమును; యాస్యసి= పొందఁగలవు.
ఈక్షణంబునందే, నీవు, నా బాణంబులహతుండవయి, యమపురికిం బోఁగలవు. అని, రావణుండు, లక్ష్మణునితోఁ జెప్పెను.
అని, తాత్పర్యము.

తమాహ సౌమిత్రి రవిస్మయానో
గర్జంత ముద్వృత్తసితాగ్రదంష్ట్రమ్

టీక॥ సౌమిత్రిః=లక్ష్మణుఁడు; అవిస్మయానః= ఆశ్చర్యమునొందనివాఁడై; గర్జంతం=అఱచుచున్నవాఁడును; ఉద్వృత్తసితాగ్రదంష్ట్రం=ఉన్నతములును దెల్లనివియునగు కొనలుగల కోఱలుగలవాఁడునగు; తం= ఆరావణునిగూర్చి; ఆహ= చెప్పెను.
లక్ష్మణుఁడు, అట్లుగర్జించుచున్నవాఁడును దెల్లనివియునున్నతంబులునగుదంష్ట్రాగ్రంబులుగలవాఁడునగురావణునిం దృణీకరించి, యిట్లని, చెప్పెను.
అని, తాత్పర్యము.

రాజన్న గర్జంతి మహాప్రభావా
వికత్థసే పాపకృతాం వరిష్ఠ. ౯౭

టీక॥ పాపకృతాం= పాపముసేయువారలలోపల; వరిష్ఠ= శ్రేష్ఠుఁడవగు; రాజన్= రాక్షసరాజుఁడవయిన రావణుఁడా! మహాప్రభావాః=అధికమయినప్రభావముగలవారలు; నగర్జంతి=గర్జింపరు. వికత్థసే=పొగడుకొనుచున్నావు
పాపిష్ఠులలో నుత్తముఁడవయిన రావణుఁడా! మహాప్రభావులగు వారలు నీయట్లుగర్జింపరు; నిన్నునీవేపొగడుకొనుచున్నావు. అని, తాత్పర్యము.

జానామి వీర్యం తవ రాక్షసేంద్ర
బలం ప్రతాపంచ పరాక్రమంచ

టీక॥ రాక్షసేంద్ర=రాక్షసనాథుండవగు రావణుఁడా! తవ=నీ యొక్క

వీర్యం=శక్తిని; బలం= బలమును; ప్రతాపంచ=ప్రతాపమును; పరాక్రమంచ=పరాక్రమమును; జానామి=ఎఱుంగియున్నాను.

రాక్షసనాథుండవగు రావణుండా! నీశక్తియునీబలంబునునీప్రతాపంబునునీ పరాక్రమంబును నాకుఁజక్కఁగాఁదెలియును. అని, తాత్పర్యము.

అవస్థితోహం శరచాపపాణి
రాగచ్ఛ కిం మోఘవికత్థనేన. ౯౮

టీక॥ అహం=నేను; శరచాపపాణిః=బాణంబును ధనస్సును హస్తంబులందుగలవాఁడనై; అవస్థితః= నిలిచినాను. ఆగచ్ఛ= రమ్ము. మోఘవికత్థనేన=వ్యర్థమయినయాత్మస్తుతిచేత; కిం=ఏమిప్రయోజనము.

నేను, ధనుర్బాణంబులు దాల్చి, నిల్చియున్నాను; యుద్ధంబునకురమ్ము; ఇట్లువ్యర్థముగానాత్మస్తుతిచేసికొనుటచే నేమి ప్రయోజనము? అని, లక్ష్మణుండు, రావణునితోఁజెప్పెను.
అని, తాత్పర్యము.

స ఏవ ముక్తః కుపిత స్ససర్జ
రక్షోధిప స్సప్త శరాన్ సుపుంఖాన్

టీక॥ రక్షోధిపః= రాక్షసరాజు; ఏవం=ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; కుపితః = కోపముకొనినవాఁడై; సుపుంఖాన్= మంచిపింజలుగల ; శరాన్=బాణములను; సప్త= ఏడింటిని; ససర్జ=విడిచెను.

రాక్షసేశ్వరుండగు రావణుండు లక్ష్మణునిమాటనువిని, కుపితుండై, లక్ష్మణునిపై ఏడుబాణంబులు ప్రయోగించెను. అని, తాత్పర్యము.

తాన్ లక్ష్మణః కాంచనచిత్రపుంఖై
శ్ఛిచ్ఛేద బాణై ర్నిశితాగ్రధారైః. ౯౯

టీక॥ లక్ష్మణః = లక్ష్మణుఁడు; తాన్= ఆబాణములను ; కాంచనచిత్రపుంఖైః= బంగారముచేఁ జిత్రములయినపింజలుగలవియు; నిశితాగ్రధా

ర్యైః= కఱకులయినకొనలుగల యంచులుగలవియునగు; బాణైః = బాణములచేత; చిచ్ఛేద=నఱకెను.

లక్ష్మణుడు, కాంచనపుంఖంబులును తీక్ష్ణాగ్రంబులునగు బాణంబులచే నా రావణుడు ప్రయోగించిన బాణంబుల నేడింటిని ఖండించెను.

అని, తాత్పర్యము.

తాన్ ప్రేక్షమాణ స్సహసా నికృత్తా
న్నికృత్తభోగానివ పన్నగేంద్రాన్
లంకేశ్వరః క్రోధ వశం జగామ
ససర్జ చాన్యా న్నిశితాన్ పృషత్కాన్. ౧౦౦

టీక॥ లంకేశ్వరః= లంకకుఁబ్రభువయిన రావణుఁడు; సహసా= శీఘ్రంబున; నికృత్తాన్= ఛేదింపఁబడినవియు; నికృత్తభోగాన్= ఛేదింపఁబడినశరీరములుగల; పన్నగేంద్రానివ(స్థితాన్)= సర్పశ్రేష్ఠములువలె నున్నవియునగు; తాన్=ఆబాణములను; ప్రేక్షమాణః=చూచుచు; క్రోధవశం= కోపముయొక్కయధీనతను; జగామ=పొందెను. అన్యాన్=ఇతరములయిన; నిశితాన్= కఱకులయిన; పృషత్కాంశ్చ=బాణములను; ససర్జ=విడిచెను.

లంకారాజుండగు రావణుండు, దాను బ్రయోగించిన బాణంబులు ఛేదింపఁబడి, ఛిన్నశరీరంబులగు మహాసర్పంబులవలెఁ బడి నేలంబడుటం జూచి, కుపితుండై, మఱియుఁ దీక్ష్ణబాణంబులం బ్రయోగించెను. అని, తాత్పర్యము.

స బాణవర్షం తు వవర్ష తీవ్రం
రామానుజః కార్ముక సంప్రయుక్తమ్
క్షురార్ధ చంద్రోత్తమ కర్ణి భల్లై
శ్శరాంశ్చ చిచ్ఛేదన చుక్షుభే చ. ౧౦౧

టీక॥ సః=ఆ; రామానుజః= రామునితమ్ముఁడయినలక్ష్మణుఁడు; కార్ముకసంప్రయుక్తం= ధనుస్సుచేఁబ్రయోగింపఁబడినదియు; తీవ్రం = తీక్ష్ణమునగు; బాణవర్షం= బాణములవానను; వవర్ష= కురిసెను. క్షురార్ధ

చంద్రోత్తమకర్ణిభల్లైః = కత్తివాతియమ్ములచేతను యర్ధచంద్రబాణములచేతను శ్రేష్ఠములగు కర్ణాకార బాణములచేతను రెండుప్రక్కలకఱకుగలయమ్ములచేతను ; శరాన్ = బాణములను; చిచ్ఛేద చ = నఱకెను. న చుక్షుభే చ = కలంతపడలేదు.

ఆలక్ష్మణుండుతనధనుస్సుమండలాకారంబుగావించి రావణునిపై దీవ్రంబగుబాణవర్షంబు గురిపించికత్తివాతియమ్ములచేతను నర్ధచంద్రాకారబాణంబులచేతను గర్ణాకార బాణములచేతనుభల్లంబులచేతను రావణుండేయుబాణంబుల ఖండించుచు నెంతమాత్రముఁగలంతనొందకుండెను.

అని, తాత్పర్యము.

స బాణ జాలా న్యథ తాని తాని
మోఘాని పశ్యం స్త్రిదశారి రాజః
విసిస్మియే లక్ష్మణ లాఘవేన
పునశ్చ బాణా న్నిశితా న్ముమోచ. ౧౦౨

టీక॥ సః = ఆ; త్రిదశారిరాజః = రాక్షసరాజగు రావణుండు; మోఘాని = వ్యర్థములయిన; తానితాని = ఆయా; బాణజాలాని = బాణసమూహములను; పశ్యన్ = చూచుచు; లక్ష్మణలాఘవేన = లక్ష్మణునిలాఘవముచేత; విసిస్మియే = ఆశ్చర్యమునొందెను. పునశ్చ = మఱలను; నిశితాన్ = తీక్ష్ణములయిన; బాణాన్ = బాణములను; ముమోచ = విడిచెను.

రాక్షసరాజుండగు రావణుండు, తానేయుబాణంబులన్నింటినిలక్ష్మణుండుఖండించుచు మఱియుందన్నుబాణంబులనొప్పించుటంజూచి, లక్ష్మణునిశరసంధాన లాఘవంబున కచ్చెరువొందుచు, మఱలఁదీక్ష్ణములగు బాణంబులఁబ్రయోగించెను. అని, తాత్పర్యము.

స లక్ష్మణ శ్చాశు శరా న్శితాగ్రా
న్మహేంద్ర వజ్రాశని తుల్యవేగాన్
సంధాయ చాపే జ్వలన ప్రకాశాన్
ససర్జ రక్షోధిపతే ర్వధాయ. ౧౦౩

టీక॥సః=ఆ;లక్ష్మణశ్చ=లక్ష్మణుండును;రక్షోధిపతేః= రాక్షసనాథుఁడగు రావణుని యొక్క; వధాయ= చంపుటకొఱకు; ఆశు=శీఘ్రముగా; శితాగ్రాన్ = కఱకులయిన కొనలుగలవియు ; మహేంద్రవజ్రాశనితుల్య వేగాన్=దేవేంద్రుని వజ్రాయుధమునకు నుఁబిడుగునకును సమానమయిన వేగముగలవియు; జ్వలనప్రకాశాన్=నిప్పుయొక్క-కాంతివంటి కాంతిగలవియు నగు;శరాన్=బాణములను;చాపే=ధనస్సునందు; సంధాయ = కూర్చి;ససర్జ=విడిచెను.

ఆలక్ష్మణుండు,రావణవధార్థమయి, శీఘ్రంబునఁ , దీక్ష్ణాగ్రంబులును దేవేంద్రునివజ్రాయుధంబునకును బిడుగునకును సమానమయిన వేగముగలవియునగ్నిహోత్రతుల్యంబులునగు బాణంబులువింటంగూర్చి,విడిచెను.

అని, తాత్పర్యము.

స తాన్ ప్రచిచ్ఛేదహి రాక్షసేంద్ర
శ్ఛిత్వాచ తాన్ లక్ష్మణ మాజఘాన
శరేణ కాలాగ్ని సమప్రభేణ
స్వయంభు దత్తేన లలాటదేశే. ౧౦౪

టీక॥ రాక్షసేంద్రః = రాక్షసనాథుండగు;సః=ఆరావణుండు; తాన్= ఆబాణములను;ప్రచిచ్ఛేదహి = నఱకెనుగదా! తాన్=ఆబాణములను ; ఛిత్వాచ=నఱకియు; స్వయంభుదత్తేన= బ్రహ్మచేఁ వ్వఁబడిన ; కాలాగ్నిసమప్రభేణ=ప్రళయకాలాగ్నికి సమానమయినకాంతిగల;శరేణ=బాణముచేత ; లక్ష్మణం=లక్ష్మణుని;లలాటదేశే = నొసటను;జఘాన=కొట్టెను.

రాక్షసనాథుండగు నారావణుండు,లక్ష్మణుండేసిన బాణంబులను ఖండించి, తనకుబ్రహ్మదేవుండొసంగినప్రలయకాలాగ్నితుల్యంబగు దివ్యశరంబు సంధించి,లక్ష్మణునిలలాటంబు నాటనేసెను. అని, తాత్పర్యము.

స లక్ష్మణో రావణ సాయకార్త
శ్చ చాల చాపం శిథిలం ప్రగృహ్య

స ౫౯

పునశ్చ సంజ్ఞాం ప్రతిలభ్య కృచ్ఛ్రా
చ్చిచ్ఛేద చాపం త్రిదశేంద్రశత్రోః. ౧౦౫

టీక॥ సః=ఆ; లక్ష్మణః= లక్ష్మణుఁడు; రావణసాయకార్తః=రావణునిబాణములచేఁబీడింపఁబడినవాఁడై; శిథిలం=శిథిలముగా; చాపం=ధనుస్సును; ప్రగృహ్య=పట్టుకొని; చచాల= చలించెను. పునశ్చ=మఱలను; కృచ్ఛ్రాత్ = కష్టమువలన; సంజ్ఞాం=తెలివిని; ప్రతిలభ్య=పొంది; త్రిదశేంద్రశత్రోః= దేవేంద్రుని శత్రువయిన రావణునియొక్క; చాపం=ధనస్సును; చిచ్ఛేద = ఖండించెను.

ఆలక్ష్మణుండు, రావణబాణపీడితుండై, శిథిలంబుగాధనుస్సుఁబట్టుకొని, చలనంబునొంది, మూర్ఛిల్లెను; అంతఁగొంతదడవునకుమూర్ఛదేఱి రావణునిచేతిధనుస్సునుఖండించెను.

అని, తాత్పర్యము.

నికృత్తచాపం త్రిభి రాజఘాన
బాణైస్తదా దాశరథి శ్శితాగ్రైః
స సాయకార్తో విచచాల రాజా
కృచ్ఛ్రాచ్చ సంజ్ఞాం పున రాససాద. ౧౦౬

టీ॥ తదా=అప్పుడు; దాశరథిః=దశరథపుత్రుఁడగులక్ష్మణుఁడు; నికృత్తచాపం= ఖండింపఁబడినధనుస్సుగలరావణుని; శితాగ్రైః=కఱకులయినకొనలుగల; త్రిభిః=మూఁడైన; బాణైః=బాణములచేత; ఆజఘాన=కొట్టెను. సః=ఆ; రాజా = రావణుఁడు; సాయకార్తః= బాణములచేఁబీడింపఁబడినవాఁడై; విచచాల = మిక్కిలిచలించెను. కృచ్ఛ్రాచ్చ=కష్టమువలనను; పునః=మఱల; సంజ్ఞాం= తెలివిని; ఆససాద = పొందెను.

అప్పుడు, లక్ష్మణుండు, అంతనూరకుండక, తీక్ష్ణాగ్రంబులగు మూఁడుబాణంబులరావణునినొప్పించెను; ఆరావణుండు, లక్ష్మణబాణపీడితుండై, చలనమునొంది, మూర్ఛిల్లి, మెట్టకేలకుమఱలఁదెలివొందెను. అని, తాత్పర్యము.

స కృత్తచాప శ్శర తాడితశ్చ
మేదార్ద్ర గాత్రో రుధిరావసిక్తః
జగ్రాహ శక్తిం సముదగ్ర శక్తి
స్స్వయంభు దత్తాం యుధి దేవ శత్రుః. ౧౦౭

టీక॥ సముదగ్రశక్తిః=మిక్కిలియు నధికమయినశక్తిగలవాఁడును ; దేవశత్రుః=దేవతలకుశత్రువగు; సః=ఆ రావణుండు; కృత్తచాపః= ఖండింపఁబడినధనస్సుగలవాఁడును; శరతాడితశ్చ=బాణములచేఁగొట్టఁబడిన వాఁడునై; మేదార్ద్రగాత్రః (మేదఆర్ద్రగాత్రః)= మేదస్సుచేఁదడిసిన దేహముగలవాఁడై ; రుధిరావసిక్తః=నెత్తురుచేఁదడుపఁబడినవాఁడై; యుధి=యుద్ధమునందు; స్వయంభుదత్తాం=బ్రహ్మదేవునిచేనియ్యఁబడిన; శక్తిం = శక్తియనునాయుధమును ; జగ్రాహ = గ్రహించెను.

మహాసామర్థ్యుఁడును దేవశత్రుండునగు నా రావణుండు, ఛేదింపఁబడిన ధనుస్సుగలవాఁడును బాణపీడితుండును మేదస్సుచేతను నెత్తురుచేతను దడుపఁబడినదేహముగలవాఁడునై , మున్ను బ్రహ్మదేవునిచేఁదనకియ్యఁ బడినశక్తిని గ్రహించెను. అని, తాత్పర్యము.

స తాం విధూమా నల సన్నికాశాం
విత్రాసినీం వానర వాహినీం తామ్
చిక్షేప శక్తిం తరసా జ్వలంతీమ్
సౌమిత్రయే రాక్షస రాష్ట్రనాథః. ౧౦౮

టీక॥ రాక్షసరాష్ట్రనాథః = రాక్షసరాజ్యమునకుఁబ్రభువయిన ; సః= ఆరావణుఁడు ; విధూమానలసన్నికాశాం= పొగలేనియగ్నితో సమానమయినదియు;తాం= ఆ; వానరవాహినీం=వానరసేనను;విత్రాసినీం= భయపఱచుచున్నదియు;జ్వలంతీం = ప్రకాశించుచున్నదియునగు; తాం = ఆ;శక్తిం=శక్తిని;తరసా = శీఘ్రముగా; సౌమిత్రయే=లక్ష్మణునికొఱకు; చిక్షేప=విడిచెను.

రాక్షసలోకనాథుండగు నారావ

ణుండు, పొగలేనియగ్నితో సమానమయినదియు, నవ్వానరసేనకంతయుభయము గలిగించుచున్నదియు, నిప్పులుగ్రక్కుచున్నదియు నగు, నాశక్తిని, శీఘ్రంబున, లక్ష్మణునిపై నేసెను.

అని, తాత్పర్యము.

తమాపతంతీం భరతానుజాగ్ర్యా
జఘాన బాణైశ్చ హుతాగ్నికల్పైః
తథాపి సా తస్య వివేశ శక్తి
ర్బాహ్వంతరం దాశరథేర్విశాలమ్. ౧౦౯

టీక॥ భరతానుజః = భరతునితమ్ముండగులక్ష్మణుండు ; ఆపతంతీం = వచ్చుచున్న; తాం = ఆశక్తిని ; ఉగ్రైః = (సంధియార్షము) = భయంకరములగు; హుతాగ్నికల్పైః = వ్రేల్వంబడినయగ్నితో సమానములయిన ; బాణైః = బాణములచేత; జఘానచ = కొట్టెను. తథాపి = అట్లయినను; సా = ఆ; శక్తిః = శక్తి; తస్య = ఆ ; దాశరథేః = లక్ష్మణునియొక్క; విశాలం = వెడలుపయిన; భుజాంతరం = వక్షస్స్థలమును; వివేశ = ప్రవేశించెను.

లక్ష్మణుండు, ఆశక్తితనపైవచ్చుటంజూచి, దాని , భయంకరాకారంబులును నేతిచేవృద్ధిఁబొందినయగ్నితోసమానంబులునగు బాణంబులంగొట్టెను; అట్లయినను, ఆశక్తి, విశాలంబగులక్ష్మణునివక్షస్స్థలంబుఁజొచ్చినది.

అని, తాత్పర్యము.

స శక్తిమాన్ శక్తిసమాహతస్సన్
ముహుః ప్రజజ్వాల రఘుప్రవీరః
తం విహ్వలంతం సహసాభ్యుపేత్య
జగ్రాహ రాజా తరసా భుజాభ్యామ్. ౧౧౦

టీక॥ శక్తిమాన్ = అధికమయినసామర్థ్యముగల; సః = ఆ; రఘుప్రవీరః = రాముఁడు; శక్తిసమాహతస్సన్ = శక్తిచేఁగొట్టఁబడినవాఁడై; ముహుః = పలుమాఱు; ప్రజజ్వాల = మండెను. రాజా = రాక్షసరాజు; విహ్వలంతం = మూర్ఛ



నొందుచున్న; తం=అలక్ష్మణుని; సహ సా=శీఘ్రముగ; అభ్యుపేత్య=పొంది; తరసా=బలముచేత; భుజాభ్యాం= బాహువులచేత; జగ్రాహ=పట్టుకొనెను

మహాసామర్థ్యుండగు నాలక్ష్మణుండు, ఆశక్తిచేఁబీడితుండై, పలుమారుమండిపడెను; అంత, నాలక్ష్మణుండు, మూర్ఛనొందుటంజూచి, రావణుండు, శీఘ్రముగవచ్చి, బాహువులచేనతనింబట్టుకొనెను.

అని, తాత్పర్యము.

హిమవాన్మందరో మేరు స్త్రైలోక్యం వా సహామరైః
శక్యం భుజాభ్యా ముద్ధర్తుం నసంఖ్యే భరతానుజః. ౧౧౧

టీక॥ హిమవాన్ = హిమవత్పర్వతముగాని; మందరః= మందరపర్వతముగాని; మేరుః=మేరుపర్వతముగాని; అమరైస్సహ=దేవతలతోఁగూడ; త్రైలోక్యంవా= ముల్లోకములుగాని; భుజాభ్యాం=చేతులచే; ఉద్ధర్తుం= ఎత్తుటకు; శక్యం= అలవియగును. సంఖ్యే=యుద్ధమునందు; భరతానుజః = భరతునితమ్ముఁడగులక్ష్మణుఁడు; న (శక్యం)=అలవికాఁడు.

హిమవత్పర్వతమునుగాని మందరపర్వతమునుగాని మేరుపర్వతమునుగాని దేవతలతోఁగూడముల్లోకంబులనుంగాని చేతులతో నెత్తవచ్చునుగాని, యుద్ధంబునలక్ష్మణునిమాత్రము, ఎత్తనలవిగాదు.

అని, తాత్పర్యము.

శక్త్యా బ్రాహ్మ్యాహి సౌమిత్రి స్తాడితస్తు స్తనాంతరే
విష్ణో రచింత్యం స్వంభాగ మాత్మానం ప్రత్యనుస్మరత్. ౧౧౨

టీక॥ సౌమిత్రిః = లక్ష్మణుఁడు; స్తనాంతరే=వక్షస్థలమునందు; బ్రాహ్మ్యా=బ్రహ్మసంబంధినియగు; శక్త్యా= శక్తిచేత; తాడితస్తు= కొట్టఁబడినవాఁడైనంతనె; స్వం=తనదైన; ఆత్మానం= స్వరూపమును; అచింత్యం = ఎన్నరానిదగు; విష్ణోః=విష్ణువుయొక్క; భాగం= అంశమునుగా; ప్రత్యనుస్మరత్= తలంచెనుగదా!

లక్ష్మణుండు, ఆబ్రహ్మదేవునిశక్తి తనవక్షస్థలమునుజొచ్చినంతనె, తన్నువిష్ణుదేవునియచింత్యంబగునంశంబు



ను గాన్న్ఱంచెను.అని, తాత్పర్యము.

తతో దానవ దర్పఘ్నం సౌమిత్రిం దేవకంటకః
తం పీడయిత్వా బాహుభ్యా మప్రభుర్లంఘనేభవత్. ౧౧౩
అథైనం వైష్ణవంభాగం మానుషం దేహమాస్థితమ్

టీక॥ అథ=అంత; దేవకంటకః = దేవశత్రువగు రావణుఁడు; మానుషం= మనుష్యసంబంధియగు; దేహం=దేహమును; ఆస్థితం=పొందిన; వైష్ణవం= విష్ణుసంబంధియగు; భాగం= అంశమయిన; దానవదర్పఘ్నం=రాక్షసులగర్వమునుహరించునట్టి; తం=ఆ; ఏనం= ఈ; సౌమిత్రిం=లక్ష్మణుని; తతః=అందువలన; బాహుభ్యాం=చేతులచేత; పీడయిత్వా=పీడించి ; లంఘనే=ఎత్తుటయందు ; అప్రభుః=అసమర్థుఁడు ; అభవత్=ఆయెను.

లక్ష్మణుండు, మానుషాకారంబునొందినసాక్షాద్విష్ణుదేవునియంశమైనప్పుడు, దేవశత్రువు రావణుండు, లక్ష్మణుని లేవనెత్తుటకు సమర్థుఁడు కాఁడయ్యె.అని, తాత్పర్యము.

అథ వాయుసుతః క్రుద్ధో రావణం సమభిద్రవత్. ౧౧౪

టీక॥అథ=అంత;వాయుసుతః=వాయుపుత్రుఁడగు హనుమంతుండు; క్రుద్ధః=కోపించినవాఁడై;రావణం= రావణునిగూర్చి; సమభిద్రవత్ (సమభ్యద్రవత్)=పరుగెత్తెను.

అంత,వాయుకుమారుండగు హనుమంతుండు, కుపితుండై, రావణునిమీఁది కడరెను.అని, తాత్పర్యము.

ఆజఘానో రసి క్రుద్ధో వజ్రకల్పేన ముష్టినా

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ హనుమంతుండు; క్రుద్ధః = కోపించినవాఁడై;వజ్రకల్పేన= వజ్రముతోసమానమయిన;ముష్టినా=పిడికిలిచేత ; ఉరసి=రొమ్మునందు; ఆజఘాన = కొట్టెను.

ఆహనుమంతుండు, క్రుద్ధుండై, వజ్రంబువంటిపిడికిలిచే, రావణునిఱొమ్మునంబొడిచెను. అని, తాత్పర్యము.

తేన ముష్టిప్రహారేణ రావణో రాక్షసేశ్వరః. ౧౧౫
జానుభ్యా మపత ద్భూమౌ చచాలచ పపాతచ

టీక॥ రాక్షసేశ్వరః = రాక్షసులకుఁబ్రభువైన; రావణః = రావణుఁడు; తేన = ఆ; ముష్టిప్రహారేణ = పిడికిటిపోటుచేత; జానుభ్యాం = మోఁకాళ్లచేత; భూమౌ = నేలయందు; అపతత్ = పడెను. చచాలచ = చలించెను. పపాతచ = పడెను.

రాక్షసనాథుండగురావణుండు, ఆహనుమంతుని పిడికిటిదెబ్బకు, భూమియందు, మోఁకాళ్లానబోరగిలంబడి, మిక్కిలియుఁజలనంబునొందెను. అని, తాత్పర్యము.

ఆస్యైస్సనేత్రశ్రవణైర్వవామ రుధిరం బహు. ౧౧౬

టీక॥ సః = ఆరావణుఁడు; ఆస్యైః = నోళ్లచేతను; నేత్రశ్రవణైః = కన్నులచేతనుజెవులచేతను; బహు = అధికమయిన; రుధిరం = నెత్తురును; వవామ = క్రక్కెను.

ఆరావణుఁడు, నోళ్లనుండియుఁ, గన్నులనుండియుఁజెవులనుండియు నధికముగా నెత్తురుక్రక్కెను. అని, తాత్పర్యము.

విఘూర్ణమానో నిశ్చేష్టో రథోపస్థ ఉపావిశత్

టీక॥ సః (అధ్యాహృతము) = ఆరావణుఁడు; విఘూర్ణమానః = తిరుగుడువడుచున్నవాఁడై; నిశ్చేష్టః = చేష్టలుదక్కినవాఁడై; రథోపస్థే = రథంబునడుమను; ఉపావిశత్ = ఉండెను.

అప్పుడు, రావణుండు, ఇట్టట్టుపొరలాడుచుండి, యంతఁజేష్టలుదక్కి రథమధ్యంబునంబడియుండెను. అని, తాత్పర్యము.

విసంజ్ఞో మూర్ఛితశ్చా సీ న్నచ స్థానం సమాలభత్. ౧౧౭

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ రావణుఁడు; విసంజ్ఞః = తెలివిదప్పిన వాఁడును; మూర్ఛితశ్చ= మూర్ఛనొందినవాఁడును; ఆసీత్= ఆయెను. స్థానంచ=నిలుకడనుగూడ; సమాలభత్= పొందఁడయ్యెను.

అట్లుతండు, సంజ్ఞదప్పియుమూర్ఛితుండునై, నిలుకడనొందక పరితపించుచుండెను. అని, తాత్పర్యము.

విసంజ్ఞం రావణం దృష్ట్వా సమరే భీమవిక్రమమ్
ఋషయో వానరా స్సర్వే నేదుర్దేవా స్సవాసవాః. ౧౧౮

టీక॥ సమరే=యుద్ధమునందు ; భీమవిక్రమం= భయంకరమయిన పరాక్రమముగల; రావణం=రావణుని ; విసంజ్ఞం= తెలివిదప్పినవానిఁగా ; దృష్ట్వా=చూచి; వానరాః = వానరులును; ఋషయః= ఋషులును ; సవాసవాః=ఇంద్రునితోఁగూడిన ; దేవాః= దేవతలును; నేదుః=అఱచిరి.

భయంకర పరాక్రముఁడగు రావణుండు యుద్ధంబున మూర్ఛితుండగుటం జూచి, వానరులును , ఋషులును దేవేంద్రప్రముఖులగు దేవతలును, సంతోషంబునఁగోలాహలంబుఁ గావించిరి. అని, తాత్పర్యము.

హనూమా నపి తేజస్వీ లక్ష్మణం రావణార్దితమ్
అనయ ద్రాఘవాభ్యాశం బాహుభ్యాం పరిగృహ్య తమ్. ౧౧౯

టీక॥ తేజస్వీ=అధికమయినపరాక్రమముగల; హనుమానపి = హనుమంతుఁడును; రావణార్దితం = రావణునిచేఁబీడింపఁబడిన; తం = ఆ; లక్ష్మణం=లక్ష్మణుని ; బాహుభ్యాం= చేతులచేత; పరిగృహ్య = ఎత్తుకొని; రాఘవాభ్యాశం = రామునిసమీపమును; అనయత్ =పొందించెను.

మహా పరాక్రమశాలియగు హనుమంతుండు, రావణప్రహారంబున మూర్ఛితుండయినలక్ష్మణునిఁ , జేతులనెత్తుకొని, రామునిసమీపంబునకుఁ దెచ్చెను. అని, తాత్పర్యము.

వాయుసూనో స్సుహృత్త్వేన భక్త్యా పరమయా చ సః
శత్రూణా మప్రకంప్యోపి లఘుత్వ మగమత్కపేః. ౧౨౦

టీక॥ సః = ఆలక్ష్మణుఁడు; శత్రూణాం = శత్రువులకు; అప్రకంప్యోపి = కదలింపఁగూడనివాఁడైనను ; వాయుసూనోః = హనుమంతుని యొక్క; సుహృత్త్వేన = మిత్రుఁడగుటచేతను; పరమయా = అధికమయిన; భక్త్యాచ = భక్తిచేతను; కపేః = హనుమంతునికి; లఘుత్వం = తేలికయగుటను; అగమత్ = పొందెను.

ఆలక్ష్మణుండు, శత్రువులకుఁగదలింపనుంగూడ నలవిగానివాఁడైనను, హనుమంతుండు, మిత్రుండునుబరమభక్తుండును గావున, వతనికిఁ దేలికయయ్యెను.

అని, తాత్పర్యము.

తం సముత్సృజ్య సా శక్తి స్సౌమిత్రిం యుధి దుర్జయమ్
రావణస్య రథే తస్మిన్ స్థానం పున రుపాగతా. ౧౨౧

టీక॥ సా = ఆ; శక్తిః = శక్తి; యుధి = యుద్ధమందు; దుర్జయం = జయింపనలవిగాని; తం = ఆ; సౌమిత్రిం = లక్ష్మణుని; సముత్సృజ్య = విడిచి; పునః = మఱల; తస్మిన్ = ఆ; రావణస్య = రావణుని యొక్క; రథే = రథమునందు; స్థానం = నిలుకడను; ఉపాగతా = పొందినది.

ఆశక్తి, యంత, యుద్ధంబునదుర్జయుండగులక్ష్మణునివదలి, మఱల, రావణునిరథంబునఁ జేరెను.

అని, తాత్పర్యము.

ఆశ్వస్తశ్చ విశల్యశ్చ లక్ష్మణ శ్శత్రుసూదనః
విష్ణో ర్భాగ మమీమాంస్య మాత్మానం ప్రత్యనుస్మరత్. ౧౨

టీక॥ శత్రుసూదనః = శత్రువులచంపునట్టి; లక్ష్మణః = లక్ష్మణుఁడు ; ఆశ్వస్తశ్చ = ఊఱడిలినవాఁడై ; విశల్యశ్చ = ఆఱినగాయములుగలవాఁడునై; ఆత్మానం = తన్ను; అమీమాంస్యం = అమీమాంస్యమయిన; విష్ణోః = విష్ణువుయొక్క; భాగం = అంశమునుగా; ప్రత్యనుస్మరత్ = తలంచెను.

స ౩౯




శత్రువులవధించునట్టి లక్ష్మణుండు, మూర్ఛ నొందియుండిన గాయములు గలవాఁడై, తన్ను అచింత్యమయిన విష్ణువు యొక్క అంశముగా స్మరించెను. అని, తాత్పర్యము.

రావణోపి మహాతేజాః ప్రాప్య సంజ్ఞాం మహాహవే
ఆదదే నిశితాన్ బాణాన్ జగ్రాహ చ మహద్ధనుః. ౧౨౩

టీక॥ మహాతేజాః = అధికమయిన పరాక్రమముగల; రావణోపి = రావణుండును; మహాహవే = మహాయుద్ధమునందు; సంజ్ఞాం = తెలివిని; ప్రాప్య = పొంది; నిశితాన్ = కఱకులయిన; బాణాన్ = బాణములను; మహత్ = గొప్పదగు; ధనుశ్చ = వింటిని; జగ్రాహ చ = గ్రహించెను.

మహాతేజుండగు రావణుండును, అంత, యుద్ధంబున మూర్ఛ దేఱి, కఱకులగు బాణంబులను గొప్పధనుస్సును గ్రహించెను. అని, తాత్పర్యము.

నిపాతితమహావీరాం ద్రవంతీం వానరీం చమూమ్
రాఘవస్తు రణే దృష్ట్వా రావణం సమభిద్రవత్. ౧౨౪

టీక॥ రాఘవః = రాముండు; రణే = యుద్ధమునందు; నిపాతితమహావీరాం = వధింపఁబడినగొప్పవీరులు గలదియు; ద్రవంతీం = పరుగెత్తుచున్నదియు నగు; వానరీం = వానరసంబంధినియగు; చమూం = సేనను; దృష్ట్వాతు = చూచినంతనే; రావణం = రావణునిగూర్చి; సమభిద్రవత్ (సమభ్యద్రవత్) = పరుగెత్తెను.

రాముండు, యుద్ధంబున గొప్పవీరులు పడిపోవుటఁ జేసి, పరుగెత్తుచున్న వానరసేనఁ జూచి, తాను రావణునిమీఁదికి నడరెను. అని, తాత్పర్యము.

అథైన ముపసంగమ్య హనుమాన్వాక్య మబ్రవీత్

అథ = అంతట; హనుమాన్ = హనుమంతుఁడు; ఏనం = ఈరాముని; ఉపసంగమ్య = సమీపించి; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

స ౫౯



టీక॥ మనుజాధిపః = మనుష్యుల కుఁబ్రభువయిన రాముఁడు ; సంఖ్యే= యుద్ధమునందు;రథస్థం = రథమునను న్న; రావణం= రావణుని; దదర్శ= చూ చెను.

మనుజలోకేంద్రుండగు రాముండు, అట్లు హనుమంతు నారోహించి , ర థగతుండగు రావణుఁ జూచెను.

అని, తాత్పర్యము.

తమాలోక్య మహాతేజాః ప్రదుద్రావ స రాఘవః
వైరోచనమివ క్రుద్ధో విష్ణు రభ్యుద్యతాయుధః. ౧౨౮

టీక॥మహాతేజాః= అధికమయిన తే జస్సుగల;సః= ఆ; రాఘవః = రాముఁ డు,తం= ఆ రావణుని;ఆలోక్య = చూ చి;వైరోచనం=బలిని;ఆలోక్య(అధ్యా హృతము)=చూచి; విష్ణురివ=విష్ణుదేవు డువలె;క్రుద్ధః = కోపమునొందినవాఁ డై;అభ్యుద్యతాయుధః = ఎత్తఁబడిన యాయుధముగలవాఁడై;ప్రదుద్రావ= పరుగెత్తెను.

విష్ణువుబలిని౦జూచి, యతనిమీఁదికిఁ బోవునట్లు, మహాతేజుండగు నా రాముం డు,ఆరావణుంజూచి,క్రుద్ధుండై, ధను ర్ధరుండై,యతనిమీఁదికడరెను.

అని, తాత్పర్యము.

జ్యాశబ్ద మకరోత్ తీవ్రం వజ్రనిష్పేష నిస్వనమ్

టీక॥ సః(అధ్యాహృతము)=ఆ రా ముఁడు;వజ్రనిష్పేషనిస్స్వనం = వజ్ర వంటిధ్వనిగల;తీవ్రం = తీక్ష్ణమగు ; బ్దం = అల్లెత్రాటిధ్వనిని ; అక రోత్=చేసెను.

ఆరాముండు, వజ్రధ్వనివంటిమహా ధ్వనిగలుగునట్లు, జ్యాశబ్దంబుగావించె ను. అని, తాత్పర్యము.

గిరా గంభీరయా రామో రాక్షసేంద్ర మువాచహ. ౧౨౯

మః = రాముఁడు;గంభీర కరమయిన;గిరా = వా కుచేత;రాక్షసేంద్రం = రాక్షసేశ్వ రుఁడగు రావణునిగూర్చి;ఉవాచ= చె



ప్పెను ("హ" అనునది పాదపూరణార్థము).

రాముండు, డంత, రాక్షసేశ్వరుండగు రావణుంజూచి, యిట్లని, చెప్పెను.

అని; తాత్పర్యము.

తిష్ఠతిష్ఠ మమ త్వంహి కృత్వా విప్రియ మీదృశమ్
క్వను రాక్షస శార్దూల గతో మోక్ష మవాప్స్యసి ౧౩౦

టీక॥ రాక్షసశార్దూల= రాక్షసశ్రేష్ఠుఁడవగు రావణుఁడా! తిష్ఠతిష్ఠ= నిలునిలు! త్వం=నీవు; మమ=నాకు; ఈదృశం=ఇట్టి; విప్రియం=అప్రియమును; కృత్వాహి=చేసియు; క్వను=ఎచ్చటికి; గతః=పోయినవాఁడవై; మోక్షం= విడలను; అవాప్స్యసి=పొందఁగలవు?

రాక్షసశ్రేష్ఠుఁడవగు రావణుఁడా! నిలునిలు, నీవు నాకింతటియపకారముగాఁ జేసి, యెచ్చటికిఁబోయి విముక్తుండవు కాఁగలవు? అని, తాత్పర్యము.

యదీంద్రవైవస్వతభాస్కరాన్వా
స్వయంభు వైశ్వానరశంకరాన్వా
గమిష్యసి త్వం దశవా దిశోథవా
తథాపి మే నాద్యగతో విమోక్ష్యసే. ౧౩౧

టీక॥ త్వం=నీవు; ఇంద్రవైవస్వతభాస్కరాన్వా = ఇంద్రునిఁగానియముని గానిసూర్యునిఁగాని; స్వయంభువైశ్వానరశంకరాన్వా=బ్రహ్మదేవునిఁ గానియగ్నిహోత్రునిఁగాని శివునిఁగాని; అథవా=లేక; దశ=పదియయిన; దిశోవా=దిక్కులనుగాని; గమిష్యసియది= పొందుదువేనియు; తథాపి=అట్లయినను; అద్య=ఇప్పుడు; గతః= పొందినవాఁడవై; మే(మత్)=నావలన; మోక్ష్యసే=విడువఁబడవు.

నీవు, దేవేంద్రునియొద్దకుఁగా యమునియొద్దకుఁగాని సూర్యునిఁ గాని బ్రహ్మదేవునొద్దకుఁగా హోత్రునొద్దకుగానిశంకరుఁ గానిపోయినను, దశదిశల నను, ఇప్పుడు నామొదు ఇంకఁదప్పించుకొనఁజా

స ౫౯

యస్యైవ శక్త్యాభిహతస్త్వయాద్య
ఇచ్ఛన్ విషాదం సహసాభ్యుపేతః
స ఏవ రక్షోగణరాజ మృత్యు
స్సపుత్రదారస్య తవాద్య యుద్ధే. ౧౩౨

టీక॥ రక్షోగణరాజ = రాక్షససమూహరాజుఁడవగు రావణుఁడా! యస్యైవ=ఎవ్వఁడును; అద్య = ఇప్పుడు; త్వయా=నీచేత; శక్త్యా= శక్తిచేత, అభిహతః=కొట్టఁబడినాఁడో; సఏవ = ఆతఁడే; తవ(అధ్యాహృతము) = నీయొక్క; విషాదం = దుఃఖమును; ఇచ్ఛన్= కోరుచు; సహసా=శీఘ్రముగా; అభ్యుపేతః=వచ్చినవాఁడై; అద్య=ఇప్పుడు; యుద్ధే=యుద్ధమునందు; సపుత్రదారస్య=కొడుకులతోను భార్యలతోను గూడిన; తవ=నీయొక్క; మృత్యుః=మృత్యువు; భవిష్యతి(అధ్యాహృతము)= కాఁగలఁడు.

రాక్షసరాజుండవగు రావణుఁడా నీవిప్పుడెవ్వని శక్తిచేఁగొట్టినావో, ఆతండె యిప్పుడు వచ్చి నీతో యుద్ధంబుగావించి, నిన్ను నీవారలనందఱను, వధింపఁగలఁడు; ఇంతలోఁ దొందరపడకుము.

అని, తాత్పర్యము.

ఏతేన చాత్యద్భుతదర్శనాని
శరైర్జనస్థానకృతాలయాని
చతుర్దశాన్యాత్తవరాయుధాని
రక్షస్సహస్రాణి నిషూదితాని. ౧౩౩

క॥ ఏతేనచ(మయా) = నాచేత; అత్యద్భుతదర్శనాని= మిక్కిలి ఆశ్చర్యకరమయిన చూచుటగల; ఆత్తవరాయుధాని= పొందఁబడినవి యయిన యాయుధములుగల; జనస్థానకృతాలయాని= జనస్థానమునందు చేయఁబడిన యునికి గలవియునగు; చతుర్దశాని (చతుర్దశ=పదునాలుగయిన; రక్షస్సహస్రాణి= రాక్షసుల వేలు; శరైః = బాణములచేత; నిషూదితాని= చంపఁబడినవి.

ఇప్పుడు నీయెదుటనున్న నేనును, భయంకరాకారులును ఉత్తమాయుధధారులనగు జనస్థానమున నుండు వార

ఒదునాలుగువేలమంది రాక్షసుల, నొకరుండనె, తీక్ష్ణబాణంబులవధించిన వాఁడను. అని, రాముండు, రావణుని తోఁజెప్పెను. అని, తాత్పర్యము.

రాఘవస్య వచ శ్శ్రుత్వా రాక్షసేంద్రో మహాకపిమ్
వాయుపుత్రం మహావీర్యం వహంతం రాఘవం రణే. ౧౩౮
ఆజఘాన శరై స్తీక్ష్ణైః కాలానల శిఖోపమైః

టీక॥ రాక్షసేంద్రః=రాక్షసనాథుండగు రావణుండు; రాఘవస్య=రాముని యొక్క; వచః=మాటను; శ్రుత్వా=వి ; రణే = యుద్ధంబునందు; రాఘవం=రాముని వహంతం=మోయుచున్న; మహావీర్యం = అధికమయినపరాక్రమముగల; వాయుపుత్రం=వాయుదేవుని కుమారుండగు; మహాకపిం = హనుమంతుని; కాలానలశిఖోపమైః=ప్రలయకాలాగ్ని యొక్క జ్వాలలతోఁ బోలిక గల; తీక్ష్ణైః=కఱకులయిన; శరైః = బాణములచేత; ఆజఘాన=కొట్టెను.

రాక్షసరాజుఁడగు రావణుండు, రామునిమాటను విని, యుద్ధంబున రామునకు వాహనమయియున్న మహాపరాక్రమశాలియగు వాయుపుత్రుండైన హనుమంతుని పైఁబ్రళయకాలాగ్ని తుల్యంబులగు తీక్ష్ణబాణంబుల నేసెను.

అని, తాత్పర్యము.

రాక్షసేనాహవే తస్య తాడితస్యాపి సాయకైః. ౧౩౯
స్వభావ తేజోయుక్తస్య భూయ స్తేజోభ్యవర్ధత

టీక॥ ఆహవే=యుద్ధమునందు; రాక్షసేన=రావణునిచేత; సాయకైః=బాణములచేత; తాడితస్యాపి= కొట్టఁబడినవాఁడైనను; స్వభావతేజోయుక్తస్య=స్వభావముచేతఁ దేజస్సుతోఁ గూడిన; తస్య = ఆహనుమంతుని యొక్క; తేజః=తేజస్సు; భూయః = అధికముగా; అభ్యవర్ధత = పెరిగెను.

యుద్ధంబున రావణుని బాణంబులం గొట్టఁబడినను, స్వభావతేజశ్శాలియగు నాహనుమంతుని తేజస్సు మఱియు నధికమయి పెరిగెను. అని, తాత్పర్యము.

తతో రామో మహాతేజా రావణేన కృతవ్రణమ్. ౧౩౬
దృష్ట్వా ప్లవగశార్దూలం కోపస్య వశ మేయివాన్

టీక॥ తతః=అంత; మహాతేజాః=అధికమయిన పరాక్రమముగల; రామః=రాముఁడు; రావణేన=రావణుని చేత; కృతవ్రణం=చేయఁబడినగాయములుగల; ప్లవగశార్దూలం=వానరశ్రేష్ఠుఁడగుహనుమంతుని; దృష్ట్వా=చూచి; కోపస్య=కోపముయొక్క; వశం=అధీనతను; ఏయివాన్ = నాఁడు.

అంత, మహాతేజుఁడగు రాము రావణునిచే గాయములగునట్లుకొ డినవానరోత్తముని హనుమంతుఁ చి, కుపితుండయ్యెను.

అని, తాత్పర్యము.

తస్యాభి చంక్రమ్య రథం సచక్రం
సాశ్వధ్వజచ్ఛత్రమహాపతాకమ్. ౧౩౭
ససారథిం సాశనిశూల ఖడ్గం
రామః ప్రచిచ్ఛేద శరైః స్సుపుంఖైః

టీక॥ రామః=రాముఁడు; సచక్రం= ములతోఁగూడినదియు; సాశ్వధ్వజ మహాపతాకం=గుఱ్ఱములతోను చి ములతోను గొడుగుతోను పె ముతోను గూడినదియు; స సారథితోఁగూడినదియు; సా ం=వజ్రముతోను శూలము తోనుంగూడినదియునగు; నియొక్క; రథం=రథమును; అభిచంక్రమ్య=సమీపిం ఖైః = మంచిపింజలుగల; శరై ములచేత; చిచ్ఛేద=ఖండించెన

అంత, రాముండు, ఆరావ ణుసమీపంబునకుంబోయి, దా లనుగుఱ్ఱంబులనుధ్వజంబును ఛ సారథిని శూలాద్యాయుధంబులను క్ష్ణబాణంబులఖండించెను.

అని, తాత్పర్యము.

సైంద్రశత్రుం తరసా జఘాన
కేన వజ్రాశనిసన్నిభేన. ౧౩౮



